# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

## ఆరవ సంపుటము

పునర్ముద్రణ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పక్షాన
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురణ




ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు,
హైదరాబాదు-4

# తొలి పలుకు

శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు పునర్ముద్రణ చేయవలెనని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము నిశ్చయించి యీ బాధ్యతను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి అప్పగించినది. మొత్తము ఎనిమిది సంపుటాలలో నాల్గు సంపుటాల పునర్ముద్రణ కార్యము 26-1-1979 నాటికి పూర్తియైనది. మిగిలిన నాల్గు సంపుటాలను ఈనాడు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, ఆంధ్రమహాజనులకు అర్పిస్తున్నది.

శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు మొదటి నాలుగు సంపుటాలు స్వర్గీయులైన శ్రీ రావుకుమార వేంకటమహీపతి సూర్యారావు బహద్దరుగారి అండదండలతో, సంపూర్ణ ఆర్థిక సహాకారముతో, స్వర్గీయ జయంతి రామయ్య పంతులు గారి పర్యవేక్షణలో సిద్ధమై 1949 వ సంవత్సరములో కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు పక్షాన ప్రకటితమైనవి. తర్వాత 5, 6, 7 సంపుటాలు 1957 సంవత్సరములో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల సహాయముతో ముద్రితమైనవి. ఏడవ సంపుటము అనుబంధము మాత్రము ముద్రణ కాకుండగా 1965వ సంవత్సరములో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, రూ.5000/- ఆర్థిక సహాయము గావించి దీని ముద్రణకు తోడ్పడినది. ఈ అనుబంధ సంపుటము 1974 సంవత్సరము హైదరాబాదు నగరములో, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వేదికపైన ఆవిష్కృతమైనది. ఆ సందర్భములో అకాడమీ అధ్యక్షులు డా. బెజవాడ గోపాలరెడ్డిగారు, శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు అన్ని సంపుటాలు మరొక పర్యాయము నిర్దుష్టంగా ప్రకటించవలసియున్నదని భావించి ఆ పని నిర్వహించవలసినదని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమును కోరినారు. అప్పటి ముఖ్యమంత్రి శ్రీ జె. వెంగళరావుగారు ఈ కోరికను అంగీకరించి అందుకు కావలసిన ఏర్పాట్లు చేయగలనని వాగ్దానము చేసినారు.

ముఖ్యమంత్రిగారి వాగ్దానాన్ని అనుసరించి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ఈ విషయాన్ని పరిశీలించవలెనని, ప్రభుత్వ పురావస్తుశాఖ డైరెక్టర్ డా. రమేశన్ గారి అధ్యక్షతన,డా.బి.రామరాజు,ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగు శాఖాధ్యక్షులు,శ్రీ దేవులపల్లి రామానుజరావు,అప్పుడు కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, శ్రీ ఎన్. వెంకటస్వామి, డైరెక్టర్ , తెలుగు అకాడమీ, డా. పి.యస్.ఆర్. అప్పారావు, అప్పుడు ఆఫీసర్

అన్ స్పెషల్ డ్యూటీ, గార్లతో కూడిన ఒక సంఘాన్ని నియమించినది. ఈ సంఘము సమావేశమై ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము పక్షాన శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు అచ్చు కావలెననీ, అచ్చు పర్యవేక్షణ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి అప్పగించవలెనని తొలి ముద్రణలోని అచ్చుతప్పులను సవరించవలెననీ, ఇందుకు కావలసిన పూర్తి డబ్బును ప్రభుత్వము యీయవలెనని సిఫారసు చేయగా, ఈ సిఫారసును ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము అంగీకరించినది. తత్ఫలితంగా ఈ సంపుటాల పునర్ముద్రణ కార్యక్రమము ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ చేపట్టినది. ఈ నిఘంటువులలోని అనుబంధాలను గ్రంథభాగములో చేర్చవలెనని కూడ పై సంఘము నిర్ణయించినది. ఈ నిర్ణయానుసారము ఆయా సంపుటాలలోని అచ్చుతప్పులను సవరించి అనుబంధభాగాన్ని గ్రంథములో చేర్చే బాధ్యత మొదటి నాలుగు సంపుటాల మట్టుకు శ్రీయుతులు ఎన్. సి. యస్. పార్థసారథి, బి.వి. శ్రీనివాసాచార్యులు చీమకుర్తి శేషగిరిరావు, ఎన్. యస్. సుందరేశ్వరరావు గార్లకు అప్పగించనైనది. మిగిలిన నాలుగు సంపుటాలు అనగా, 5, 6, 7, 8 సంపుటాలను సవరించే బాధ్యత డా. నిడదవోలు వెంకటరావుగారు, అకాడమీ కోరికపైన నిర్వహించినారు. వీరందరికి అకాడమీ పక్షాన కృతజ్ఞతలు.

ఈ సంపుటము అచ్చుపని నాగలక్ష్మి ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాదు వారికి అప్పగించి ముద్రణ పర్యవేక్షకులుగా శ్రీ చీమకుర్తి శేషగిరిరావు, శ్రీ సి. వి. శేషాచార్యులుగార్లను నియమించనైనది. వీరందరికీ అకాడమీ పక్షాన కృతజ్ఞతలు.

ఈ బాధ్యతను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి అప్పగించి కావలసిన డబ్బును పూర్తిగా మంజూరు చేసి, అకాడమికి అందజేసి సాహిత్య అకాడమీ పట్ల విశ్వాసము ప్రకటించిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమునకు అకాడమీ పక్షాన ధన్యవాదాలు.

హైదరాబాదు
8-1-1982

ఇరివెంటి కృష్ణమూర్తి
కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ



మహారాజా రావు వేంకట కుమార మహీపతి
సూర్యారావు బహద్దరు C.B.E గారు



# సూర్యరాయాంధ్రనిఘంటువు

## ఆఱవసంపుటము

మ — లౌ

పండితసాహాయ్యమున

కాకినాడ
ఆంధ్ర సాహిత్య పరిషత్తు
వారిచేఁ బ్రకటింపఁబడినది.

శంకర్ ప్రింటర్స్ ముద్రాక్షరశాలలో ముద్రితము
మద్రాసు.

1958

# మనవి

శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటు చతుర్థసంపుటము 1944లోఁ బ్రకటితమయినది. మఱి పదునాల్గు సంవత్సరములకుఁ గాని మిగిలిన మూఁడు సంపుటములును బ్రకటితము లు కాలేదు. ఈ యాలస్యమునకుఁ గారణము లనేకములు. 1947 సరికి అయిదవ సంపుటమును 1949 సరికి ఆఱవ సంపుటమును ముద్రణమునకు సిద్ధము అయినను గడపటి సంపుటము కూడ సిద్ధమయినఁ గాని యచ్చుపని ప్రారంభించుటకు సమ్మతింపనని శ్రీ పిఠాపురము మహారాజావారు తెలియఁజేసిరి. తరువాత కొన్ని రాజకీయములచే 1949 గడవగానే నిఘంటు కార్యాలయము నెత్తివేసిరి. పిమ్మట నా మూఁడు సంపుటముల గ్రంథమును మద్రాసునగరమునకుఁ దరలించి ముద్రణము పని డా॥ గిడుగు వేంకటసీతాపతిగారి కప్పగించిరి. శ్రీ సీతాపతిగారు ముద్రణముపని 1952 లోఁ బ్రారంభించి 'ప' యను నక్షరము మొదలుకొని 'మ' యను నక్షరమువఱకును గల గ్రంథ మయిదవ సంపుటముగాను 'మ' యను నక్షరము మొదలుకొని 'వ' యను నక్షరమువఱకును గల గ్రంథ మాఱవ సంపుటముగాను, విభజించి ముద్రణము వేగముగాఁ గావలయునను సంకల్పముతో వేర్వేఱు ముద్రణాలయములలో ముద్రణము సాగించిరి. అయిదవ సంపుటమును ముద్రించుచుండిన గార్డన్ ముద్రణాలయము కొంత గ్రంథము ముద్రించిన తర్వాత నెత్తివేయఁబడినది; మిగిలిన గ్రంథము మఱియొక ముద్రణాలయములో ముద్రింపవలసివచ్చినది. ఆఱవ సంపుటము సక్రమముగా ముద్రితమగుచుండుటవలన 1954 లోఁ గడపటి సంపుటముకూడ మఱియొక ముద్రణాలయములో ముద్రించుట కీయఁబడినది. కాని, తానొకటి దలఁచిన దైవ మింకొకటి దలఁచు నన్నట్లయినది. ప్రభుత్వమువారు జమీందారీవిధానమును రద్దుపఱచి యెస్టేటులను తీసికొనుటవలన శ్రీ మహారాజావారి కార్థికలోపము కలిగి 1954 పూర్తియగుసరికి ముద్రణముపని నిలిచిపోయినది. అయిదవ సంపుటములో 185 ఫారములును ఆఱవ సంపుటములో 112 ఫారములును ఏడవ సంపుటములో 42 ఫారములును ముద్రితములయినవి. మిగిలిన ముద్రణముపని యితరుల సాహాయ్య మర్థింపక తామే పూర్తిచేయుటకు శ్రీ మహారాజావా రుద్దేశించిరి. కాని, యాపని సాగలేదు. అప్పుడు శ్రీ సీతాపతిగారు శ్రీమహారాజావారి యనుజ్ఞాపత్రముఁ బడసి ప్రభుత్వమువారి ధన సాహాయ్యమునకయి 1957 జూన్ మాసములోఁ బ్రయత్నము ప్రారంభించి యధికారుల తోడ్పాటుతోఁ గృతార్థు లయినారు. ఆంధ్రప్రదేశప్రభుత్వమువారు రూ 5000 లును, ఇండియా

ప్రభుత్వమువారు రూ. 8000 లును నొసంగిరి. ఈ యార్థికసాహాయ్యముతోను, ఆంధ్ర సాహిత్యపరిషత్తు తోడ్పాటుతోను శ్రీ సీతాపతిగారు ముద్రణము పని సాగించిరి.

భగవంతుని కృపవలన ఈ నాటి కయిదవ సంపుటమును ఆఱవ సంపుటమును ప్రకటించి యాంధ్రుల కందఁజేయఁగలిగిరి. 1958 జూన్ 12వ తేదీని ఆంధ్రసాహిత్య పరిషద్వార్షిక మహాసభా సమావేశసమయమున మన యుపరాష్ట్రపతి డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ పండితవరేణ్యులు పరిషత్తువారి యాహ్వానమును మన్నించి యీ రెండు సంపుటముల యావిష్కరణము గావించినందులకుఁ బరిషత్తు ధన్యత నందినది. దైవబలముచే ఏడవ సంపుటముకూడఁ గొలఁది కాలములోఁ బ్రకటితమగును.

## 6వ సంపుట నిర్మాణము కావించిన పండితవర్యులు

1. సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు (సంపాదకులు)
2. బ్రహ్మశ్రీ దర్భా సర్వేశ్వరశాస్త్రి ,,
3. ,, ప్రయాగ వేంకటరామశాస్త్రి ,,
4. ,, ఆకుండి వేంకటశాస్త్రి ,,
5. ,, బులుసు వేంకటేశ్వరులు ,,
6. ,, చిలుకూరి పాపయ్యశాస్త్రి ,,
7. ,, దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి ,,
8. ,, చిలుకూరి వీరభద్రశాస్త్రి ,,
9. ,, చెఱుకుపల్లి అప్పారాయశాస్త్రి ,,
10. ,, సామవేదం శ్రీరామమూర్తిశాస్త్రి ,,
11. ,, వన్నాల వెంకటాద్రిభట్టశర్మ ,,
12. ,, ఇంద్రకంటి సూర్యనారాయణశాస్త్రి ,,

పీఠికాపురాధీశుల కోరిక ననుసరించి 1944-48లో నిఘంటు నిర్మాణ పర్యవేక్షణము సాగించి గ్రంథముద్రణాదికము కావించినవారు డాక్టరు గిడుగు వేంకటసీతాపతిగారు.

దంటు భాస్కరరావు.
ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యదర్శి.

| సంకేతములు. | వివరణము. |
|---|---|
| అ. | అకారాంతము—ఇట్లే — ఆ ఇ, ఈ, చ్ జ్. మొదలగువవి తత్తదంతములుగా గ్రహించునది. |
| అ.ఆ,ఈ.అ. | పుంలింగ విశేషణ మయినపుడు అకారాంతము స్త్రీలింగ విశేషణమయినపుడు ఆకారాంతము లేక ఈకారాంతము నపుంసక లింగవిశేషణ మయినపుడు అకారాంతము. స్త్రీలింగములో విశేషము ఉన్నపుడు అవి సూచింపఁబడినవి. చివర యచ్చులనుబట్టి యవి తత్తదంతములుగా గ్రహించునది. ఉదా:— (1) అంతకుఁడు విశ. (అ. ికా అ) ఇట స్త్రీలింగరూపము ఆకారాంతమగు 'అంతికా, (2) అంతర్ధాత, విశ. (ఋ త్రీ. ఋ). ఇట స్త్రీలింగరూపము ఈకారాంతమగు 'అంతర్ధాత్రీ.' (3) అంకి, విశ (న్. నీ. న్) ఇట స్త్రీలింగ రూపము ఈకారాంతమగు 'అంకినీ'. (4) అపటువు. విశ. (ఉ, ఉ. ట్వీ, ఉ,) ఇట ఉకారాంతమగు 'అపటువు'ను, ఈకారాంతమగు 'అపట్వీ'యును స్త్రీ లింగరూపములు. (5) అనామము, విశ (న్. న్. మ్నీ. అన్). ఇట నకారాంతమగు 'అనామ'యును, ఈకారాంతమగు 'అనామ్నీ'యును, ఆకారాంతమగు 'అనామా'యును స్త్రీలింగరూపములుగా నెఱుంగునది. |
| అ క్రి. | అకర్మకక్రియ. |
| ఆనౌ. | ఆనౌపవిభక్తికము. |
| అప. | అపదము. (ఆగమము మొదలగునవి) |
| అలం. | అలంకారశాస్త్రము. |
| అవ్య. | అవ్యయము. |
| ఆమ్రే. | ఆమ్రేడితము. |
| ఉదా. | ఉదాహరణము. |
| ఉప. | ఉపపదము. (చూ. అని— తెలుఁగు) |
| ఉభ. | ఉభయము. (సంస్కృతమును, తెనుఁగును) |
| ఏ. | ఏకవచనాంతము. |
| ఔ. | ఔపవిభక్తికము. |
| క. | కన్నడము. |
| కరాలపా. | కరాలపాటి రంగయ్యగారి భారతపాఠము. |
| కు. | కుయిభాష. |
| క్రి. | క్రియ |
| క్రి. విశ. | క్రియావిశేషణము. |
| క్షేత్రగ. | క్షేత్రగణితము. |
| గణిత. | గణితశాస్త్రము. |
| చూ. | చూడుఁడు. |
| ఛంద. | ఛందశ్శాస్త్రము |
| జ. | జన్యము. |

| సంకేతములు. | వివరణము. |
|---|---|
| జ్యోతి. | జ్యోతిశ్శాస్త్రము. |
| త. | తమిళము. |
| తంత్ర. | తంత్రశాస్త్రము. |
| తర్క. | తర్కశాస్త్రము. |
| తు. | తులుభాష. |
| ద్రు. | ద్రుతాంతము. |
| ద్వి. | ద్వివచనాంతము. (తెనుఁగున బహువచనాంతములో అంతర్భూతము.) |
| ధర్మ. | ధర్మశాస్త్రము. |
| న. | నపుంసకలింగము. |
| నాటక. | నాటకపరిభాష. |
| నాట్య. | నాట్యశాస్త్రము. |
| పా. | పాళీభాష. |
| పీఠి. | పీఠిక. |
| పుం. | పుంలింగము. |
| పుం. న. | పుంనపుంసకలింగము. |
| పుం. స్త్రీ. | పుంస్త్రీలింగము. |
| ప్ర. | ప్రత్యయము. |
| ప్రా. | ప్రాకృతము. |
| బ. | బహువచనాంతము. |
| బీజగ. | బీజగణితము |
| భా.ల.వ్యా. | భారతములక్ష్మీపతిశాస్త్రిగారి ఆంధ్రభారత వ్యాఖ్య. |
| మంత్ర. | మంత్రశాస్త్రము. |
| మ. | మలయాళము. |
| మహా. | మహారాష్ట్రము. |
| మి. | మిశ్రము—సంస్కృతపదము సంస్కృతేతర పదముతోఁగాని, తెలుఁగు కృత్ప్రత్యయముతోఁగాని, తెలుఁగు తద్ధితప్రత్యయముతోఁగాని కలిసిన పదము. |
| మొ. | మొదలైనవి |
| యో. | యోగశాస్త్రము. |
| రూ. | రూపాంతరము. |
| వా. | వాడుక. |
| వి. | విశేష్యము. |
| విశ. | విశేషణము. |
| వీరేశ. పా. | కందుకూరి వీరేశలింగముగారి పాఠము. |

| సంకేతములు. | వివరణము. |
|---|---|
| వేదాంత. | వేదాంతశాస్త్రము. |
| వేదము. పా. | వేదము వేంకటరాయశాస్త్రి గారి పాఠము. |
| వైద్య. | వైద్యశాస్త్రము. |
| వ్యతి. | వ్యతిరేకార్థకపదము. |
| వ్యవ. | వ్యవహారము. |
| వ్యాక. | వ్యాకరణశాస్త్రము. |
| శత్ర. | శత్రంతము (దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు.) |
| శ. సం. | శకసంవత్సరములు. |
| శ్లో. | శ్లోకము. |
| స. | సర్వనామము |
| సం. | సంస్కృతము. |
| సంగీ. | సంగీతశాస్త్రము. |
| స. క్రి. | సకర్మకక్రియ. |
| సా. | సామెత. |
| స్త్రీ. | స్త్రీలింగము. |
| హిం. | హిందూస్థానీభాష. |
| √ | (మూలచిహ్నము) ఇది జనకపదములకు ముందు ప్రయోగింపఁబడును. |
| = | (సామ్యచిహ్నము) ఇది రూపమందుఁ గాని, యర్థమందుఁ గాని సామ్యముగల పదములకడను ప్రయోగింపఁబడును. |
| వృ. వి. | చెట్టు, లత మొదలగువానిగుర్తు. |
| : | ఇది విభిన్నార్థమును దెలుపును. |
| | సమానార్థమును దెలుపును. |

(తక్కినవి స్పష్టము.)

| సంఖ్య. | గ్రంథసంకేతములు | గ్రంథనామములు. | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తల నామములు. |
|---|---|---|---|---|
| 1. | అచలా. | అచలాత్మజాపరిణయము | ఆ 3. | వేంకటాచార్యకవి. |
| 2. | అచ్చ. భా. | అచ్చతెలుఁగుభారవి. | ఆ 5 | శ్రీరామకవి |
| 3 | అచ్చ. రా. | అచ్చ తెనుఁగురామాయణము | | చిమంచితిమ్మకవి. |
| | | బాల. బాలకాండము. | | |
| | | అయో. అయోధ్యాకాండము | | |
| | | అర. అరణ్యకాండము | | |
| | | కిష్కిం. కిష్కింధాకాండము. | కాం. 6. | |
| | | సుం. సుందరకాండము. | | |
| | | యు. యుద్ధకాండము. | | |
| 4. | అధ్యా. | అధ్యాత్మ రామాయణము. (బాలకాండాదులు ఆఱును ఉత్తరకాండమును కలసి ఏడుకాండములు.) | కాం. 7. | కోటమరాజు నాగయామాత్యుఁడు |
| | | ఉ ఉత్తరకాండము. | | |
| 5. | అని. | అనిరుద్ధ చరిత్రము | ఆ. 5. | కనుపర్తి అబ్బయామాత్యుఁడు. |
| 6. | అప్ప. | అప్పకవీయము. (లక్షణగ్రంథము) | ఆ. 5. | కాకునూరి అప్పకవి. |
| 7. | అ. మ. క. | అష్టమహిషీకల్యాణము (ద్విపద) | | తిరువేంగళనాథుఁడు. |
| 8. | అహ. | అహల్యాసంక్రందనము. | ఆ 3. | సముఖము వేంకటకృష్ణప్పనాయకుఁడు. |
| 9. | ఆం. చం. | ఆంధ్రచంద్రాలోకము. | | |
| 10. | ఆం. భా. | ఆంధ్రభాషార్ణవము (నిఘంటువు) | కాం. 3. | అడిదము సూరకవి. నుదురుపాటి వేంకనార్యుఁడు. |
| 11. | ఆం. శే | ఆంధ్రనామశేషము(నిఘంటువు) | | అడిదము సూరకవి. |
| 12. | ఆం. సం. | ఆంధ్రనామసంగ్రహము. (నిఘంటువు) | | పైడిపాటి లక్ష్మణకవి. |
| | | దేవ దేవవర్గు. | | |
| | | మాన. మానవ వర్గు. | | |
| | | స్థా స్థానవర్గు | వర్గులు 5. | |
| | | తి తిర్యగ్వర్గు | | |
| | | నా నానార్థ వర్గు | | |
| 13. | ఆం. పద. | ఆంధ్రపదపారిజాతము | | |
| 14. | ఆము. | ఆముక్తమాల్యద | ఆ 6 | శ్రీకృష్ణదేవరాయలు. |
| 15. | ఇందు. | ఇందుమతీపరిణయము. | ఆ. 6. | కుమారధూర్జటి. |
| 16. | ఇందు. రా. | ఇందుమతీపరిణయము. | ఆ. 4. | తెనాలి రామభద్రకవి. |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| 17 | ఉ. రా. | ఉత్తరరామాయణము | ఆ 8. | కంకంటి పాపరాజు. |
| 18 | ఉ. హరి. | ఉత్తరహరివంశము | ఆ. 5. | నాచన సోమనాథుడు. |
| 19 | ఉ హరిశ్చ. | ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానము | ఆ. 4. | తక్కెళ్లపాటి లింగన. |
| 20 | కకు | కకుత్స్థవిజయము | ఆ. 5. | మల్లె అనంతభూపాలుడు. |
| 21 | కలు శ. | కలువాయిశతకము | | డబ్బీరు వరసకవి. |
| 22 | కవిక. | కవికర్ణరసాయనము. | ఆ 6. | సంకుసాల నృసింహకవి |
| 23 | కవిచౌ శ. | కవిచౌడప్పశతకము. | | కవిచౌడప్ప. |
| 24 | కవిజ. | కవిజనరంజనము | ఆ. 3. | అడిదము సూరకవి. |
| 25 | కవిజనా. | కవిజనాశ్రయము. (లక్షణగ్రంథము<br><br>సంజ్ఞా సంజ్ఞాధికారము, వృత్తా వృత్తాధికారము. జాతి, జాత్యధికారము. దోషా. దోషాధికారము. | అధికారములు. 4. | వేములవాడ భీమకవి. |
| 26 | కవిరా. | కవిరాజమనోరంజనము. | ఆ. 5. | కనుపర్తి అబ్బయామాత్యుడు. |
| 27 | కవిస. | కవిసర్పగారుడము (లక్షణగ్రంథము. | ఆ. 2. | కాచన బసవన్న. |
| 28 | కళా. | కళాపూర్ణోదయము. | ఆ. 8. | పింగళి సూరన్న. |
| 29 | కార్తిక. | కార్తికమాహాత్మ్యము. | | కుందుర్తి వేంకటాచలపతి. |
| 30 | కావ్యా. | కావ్యాలంకారచూడామణి. (లక్షణగ్రంథము.) | ఉల్లాసములు. 9. | విన్నకోట పెద్దన్న. |
| 31 | కాశీ | కాశీఖండము. | ఆ. 7. | శ్రీనాథుడు. |
| 32 | కాళ. | శ్రీకాళహస్తీశ్వరమాహాత్మ్యము | ఆ. 8. | ధూర్జటి. |
| 33 | కాళ శ. | కాళహస్తీశ్వరశతకము. | | ధూర్జటి. |
| 34 | కిరా. | కిరాతార్జునీయము. | ఆ 5. | గోపాలుని సింగయ. |
| 35 | కుచేల | కుచేలోపాఖ్యానము. | ఆ. 3. | ఘట్టుప్రభువు. |
| 36 | కువల. | కువలయాశ్వచరిత్రము. | ఆ. 5. | సవరము చిననారాయణకవి. |
| 37 | కు సం. | కుమారసంభవము | ఆ. 12. | నన్నెచోడుడు. |
| 38 | కృ క | కృష్ణకర్ణామృతము. | ఆ. 3. | వెలగపూడి వెంగన |
| 39 | కృ. శకు. | శకుంతలాపరిణయము. | ఆ 3. | కృష్ణకవి. |
| 40 | కృష్ణ | కృష్ణరాయవిజయము. | ఆ. 4. | కుమార ధూర్జటి. |
| 41 | కృష్ణ. శ. | కృష్ణశతకము | | నృసింహకవి. |
| 42 | కృష్ణా. | కృష్ణార్జునసంవాదము | ఆ. 5. | గోనబోట్ల సూరన్న. |
| 43 | కేయూర. | కేయూరబాహుచరిత్రము. | ఆ 4. | మంచన. |
| 44 | క్రీడా. | క్రీడాభిరామము. | ఆ. 1. | వల్లభరాయకవి. |

| సంఖ్య | గ్రంథసంకేతములు | గ్రంథనామములు | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తల నామములు |
|---|---|---|---|---|
| 45 | గంధ. | గంధవహము. | ఆ 1. | మంచళ్ల వాసుదేవకవి |
| 46 | గాథే. | గాథేయోపాఖ్యానము. | | చిత్రకవి అనంతామాత్యుడు |
| 47 | గోపీ రా. | గోపీనాథరామాయణము. | | గోపీనాథ వెంకటకవి. |
| 48 | ఘటికా. | ఘటికాచలమాహాత్మ్యము. | ఆ. 3. | తెనాలి రామకృష్ణుడు. |
| 49 | చంద్ర. | చంద్రభానుచరిత్రము. | ఆ. 5. | తరిగొప్పుల మల్లన్న. |
| 50 | చంద్ర. వి. | చంద్రరేఖావిలాపము | ఆ 3. | కూచిమంచి జగ్గకవి |
| 51 | చంద్రా. | చంద్రాంగదచరిత్రము. | ఆ. 6. | పైడిమఱ్ఱి వేంకటపతి |
| 52 | చంద్రి. | చంద్రికాపరిణయము. | ఆ 6. | శ్రీసురభిమాధవరాయప్రభువు. |
| 53 | చం. రా. | చంపూరామాయణము. | ఆ. 8. | ఋగ్వేదికవి వేంకటాచలపతి. |
| 54 | చమ. | చమత్కారమంజరి. | ఆ 3. | సింహాద్రి వేంకటాచార్యుడు. |
| 55 | చిత్రభా. | చిత్రభారతము. | ఆ. 8. | చరికొండ ధర్మన్న. |
| 56 | చి. ని. | చిన్నయసూరినిఘంటువు (వ్రాతప్రతి) | | పరవస్తు చిన్నయసూరి. |
| 57 | చెన్న. | చెన్నబసవపురాణము. | ఆ. 5. | అత్తనూరి పాపకవి. |
| 58 | జాహ్నవి. | జాహ్నవీమాహాత్మ్యము | ఆ. 4. | వెనుగు లక్ష్మణకవి. |
| 59 | జై. భా. | జైమినిభారతము. (అశ్వమేధపర్వము) | ఆ. 8. | పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు |
| 60 | తపతీ. | తపతీసంవరణోపాఖ్యానము | ఆ. 5 | అద్దంకి గంగాధరకవి |
| 61 | దశకు. | దశకుమారచరిత్రము. | ఆ. 12. | కేతన |
| 62 | ద. శా. | దక్షిణహిందూస్థానశాసనములు | సంపుటములు 6 | |
| 63 | దశా. | దశావతారచరిత్రము. | ఆ. 10. | ధరణిదేవుల రామయామాత్యుడు |
| 64 | దా. శ. | దాశరథిశతకము | | కంచెర్ల గోపన్న. |
| 65 | దిలీప | దిలీపచరిత్రము | ఆ. 4 | కొటికలపూడి వేంకటకృష్ణకవి |
| 66 | ద్వా. | (సింహాసన) ద్వాత్రింశిక. | ఆ 12. | కొఱవి గోపరాజు |
| 67 | ద్వి. కో. భాగ. | ద్విపదభాగవతము. | స్కం. 12 | కోనేటినాథుడు. |
| 68 | ద్వి. తి. సా. | ద్విపదసారంగధరచరిత్రము | ఆ. 2 | కూచిమంచి తిమ్మకవి. |
| 69 | ద్వి. నల. | ద్విపదనలచరిత్రము. | భా. 5. | చక్రపురి రాఘవాచార్యులు. |
| 70 | ద్వి. పరమ | ద్విపదపరమయోగివిలాసము. | ఆ. 8. | తాళ్లపాక తిరువేంగళనాథుడు. |
| 71 | ద్వి. భార | ద్విపదభారతము. (విరాటపర్వము—వ్రాతప్రతి. | ఆ 5. | తిమ్మన. |
| 72 | ద్వి. శ. సా. | ద్విపదసారంగధరచరిత్రము. | ఆ. 3. | జాజాల శంభుదాసుడు. |
| 73 | ద్వి. భాగ. | ద్విపదభాగవతము. (దశమస్కంధము.) | స్కం. 1. | మడికి సింగన్న. |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| 74 | ద్వి హరిశ్చ. | ద్విపదహరిశ్చంద్రచరితము. | భా. 2. | గౌరన. |
| 75 | ధనా | ధనాభిరామము. (వ్రాతప్రతి) | ఆ 3 | నూతన. |
| 76 | ధర్మ. | ధర్మఖండము. | ఆ 9. | ఈదుఃపల్లి భవానీశంకరుఁడు. |
| 77 | ఆం. ధా. | ఆంధ్రధాతుమాల. | | |
| 78 | నర స. | నరసభూపాలీయము (లక్షణగ్రంథము.) | ఆ. 5. | మూర్తికవి. |
| 79 | నవ (నాథ) | నవనాథచరిత్రము (ద్విపద— వ్రాతప్రతి) | భా F. | గౌరన |
| 80 | నా. పంచ. | పంచతంత్రము. | ఆ. 5. | నారాయణకవి. |
| 81 | నార. | నారసింహపురాణము (ఉత్తర భాగము | ఆ 5. | హరిభట్టు. |
| 82 | నిరం. | నిరంకుశోపాఖ్యానము. | ఆ. 4 | కందుకూరి రుద్రయ. |
| 83 | నిర్వ. | నిర్వచనోత్తరరామాయణము | ఆ. 10 | తిక్కన సోమయాజి. |
| 84 | నీతి. | నీతిసీసపద్యశతకము. | | తాళ్ళపాక తిమ్మయ. |
| 85 | నీలా. | నీలాసుందరీపరిణయము. | ఆ. 3 | కూచిమంచి తిమ్మకవి. |
| 86 | నృసిం. | నృసింహపురాణము. | ఆ 5. | ఎఱ్ఱాప్రగ్గడ. |
| 87 | నైష. | శృంగారనైషధము. | ఆ 8. | శ్రీనాథుఁడు. |
| 88 | పండితా. | పండితారాధ్యచరిత్రము (ద్విపద)<br>దీక్షా దీక్షాప్రకరణము.<br>పురా పురాతనప్రకరణము.<br>వాద వాదప్రకరణము.<br>మహిమ. మహిమప్రకరణము.<br>పర్వ. పర్వతప్రకరణము. | ప్రకరణములు. 5 | పాలకురికి సోమనాథుఁడు. |
| 89 | పద్మ. | పద్మపురాణము (ఉత్తరఖండము) | ఆ. 10. | మడికి సింగన్న. |
| 90 | పరమ | పరమయోగివిలాసము. | ఆ. 5. | తిమ్మనృపాలుఁడు. |
| 91 | పాంచా. | పాంచాలీపరిణయము | ఆ. 5. | కాకమాని మూర్తికవి |
| 92 | పాండు. | పాండురంగమాహాత్మ్యము | ఆ. 5. | తెనాలి రామకృష్ణుఁడు. |
| 93 | పారి | పారిజాతాపహరణము. | ఆ. 5. | నంది తిమ్మన. |
| 94 | పార్వ | పార్వతీపరిణయము. | ఆ 6. | కోట శ్రీరాయరఘునాథ తొండమాన్ మహీపాలుఁడు. |
| 95 | పి శకుం | శకుంతలాపరిణయము. | ఆ. 4. | పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు |
| 96 | పె శకుం | శకుంతలాపరిణయము. | ఆ. 3. | పెద్దాడ నాగరాజు. |
| 97 | ప్రబంధ | ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము. | ఆ. 1. | గణపవరపు వేంకటకవి. |

| సంఖ్య | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తల నామములు |
|---|---|---|---|---|
| 98 | ప్రబోధ. | ప్రబంధచంద్రోదయము. | ఆ 5. | నాదిమల్లయ్య, ఘంటసింగయ |
| 99 | ప్రభా. | ప్రభావతీ ప్రద్యుమ్నము | ఆ. 5 | పింగళి సూరన |
| 100 | ప్రభు. (లిం) | ప్రభులింగలీల (ద్విపద). | ఆ 5. (ఒక్కొక్క ఆశ్వాసమునకు అయిదైదు గతులు గలవు) | పిడుపర్తి సోమయ. |
| 101 | ప్ర. మణి. | ప్రబంధమణిభూషణము. | | |
| 102 | బస. పు. | బసవపురాణము (ద్విపద) | ఆ 7. | పాల్కురికిసోమన. |
| 103 | బహు. | బహుళాశ్వచరిత్రము. | ఆ 5. | దామరల వేంగళనాయకుఁడు. |
| 104 | బిల్హ. | బిల్హణీయము | ఆ. 8 | నంది పెద్ది కృష్ణస్వామి |
| 105 | బ్రహ్మో. | బ్రహ్మోత్తరఖండము | ఆ 5. | శ్రీధరమల్లె వేంకటరామ [కవి. |
| 106 | శ్రౌ. | శ్రౌణ్యనిఘంటువు | | శ్రామదొర. |
| 107 | భర్తృ. | భర్తృహరిసుభాషితము.<br>నీతి. నీతిశతకము.<br>శృం. శృంగారశతకము.<br>వై. వైరాగ్యశతకము. | శతకములు. 3. | ఏనుఁగు లక్ష్మణకవి. |
| 108 | భల్లా. | భల్లాణచరిత్రము | ఆ. 5. | వాలేశ్వరుఁడు. |
| 109 | భాగ. | భాగవతము | స్కం. 12. | బమ్మెర పోతరాజు. |
| 110 | భాను. | భానుమతీపరిణయము. | ఆ. 4. | రె. టూరి రంగరాజు. |
| 111 | భార. | భారతము<br>ఆది. ఆదిపర్వము. ఆ. 8.<br>సభా. సభాపర్వము. ఆ. 2.<br>అర. అరణ్యపర్వము. ఆ. 7.<br>వి విరాటపర్వము ఆ 3.<br>ఉద్యో ఉద్యోగపర్వము ఆ 4<br>భీష్మ. భీష్మపర్వము. ఆ. 5.<br>ద్రో. ద్రోణపర్వము. ఆ. 5.<br>కర్ణ. కర్ణపర్వము. ఆ 3.<br>శల్య. శల్యపర్వము ఆ. 2.<br>సౌ. సౌప్తికపర్వము. ఆ. 2.<br>స్త్రీ. స్త్రీపర్వము ఆ 2.<br>శాం. శాంతిపర్వము. ఆ 6. | పర్వములు. 18 | కవిత్రయము, (నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రెగ్గడ.) |

| సంఖ్య. | గ్రంథసంకేతములు | గ్రంథనామములు. | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తల నామములు |
|---|---|---|---|---|
| | | అను అనుశాసనికపర్వము ఆ 5<br>అశ్వ. అశ్వమేధికపర్వము. ఆ.4<br>ఆశ్ర ఆశ్రమవాసపర్వము ఆ.2<br>మౌ మౌసలపర్వము. ఆ. 1.<br>మహా మహాప్రస్థానికపర్వము. ఆ. 1.<br>స్వ.స్వర్గారోహణపర్వము ఆ. 1 | | |
| 112. | భా. రా. | భాస్కరరామాయణము. (అచ్చు తెనుఁగు రామాయణముకడనున్న ట్లు దీనికి కాండము తెలుపుఁగునది.) | కాం. 6. | భాస్కరుఁడులోనగువారు. |
| 113. | భా. శ. | భాస్కరశతకము | | మారద వెంకయ్య. |
| 114. | భీమ. | భీమేశ్వరపురాణము. | ఆ. 6, | శ్రీనాథుఁడు. |
| 115. | భేష. | భేషజకల్పము, | ఆ. 4, | బహుపాద వేంకటాచార్యుఁడు |
| 116. | భోజరా. | భోజరాజీయము | ఆ 7. | అనంతామాత్యుఁడు. |
| 117. | భోజసు తా. | భోజసుతాపరిణయము. | ఆ. 5, | కోటీశ్వరకవి. |
| 118. | మను చ. | మనుచరిత్రము. | ఆ, 6. | అల్లసాని పెద్దన. |
| 119. | మల్ల. | మల్లభూపాలీయము. భర్తృహరికడమన్నట్లే దీనికి శతకము తెలుపుఁగునది.) | శతకములు 3. | ఎలకూచి బాలసరస్వతి. |
| 120 | మల్లుపు. | మల్లుపురాణము.(దేవమల్లచరిత్రము—వ్రాఁతప్రతి) | ఆ. 4. | నుదురుపాటి వేంకనార్యుఁడు |
| 121. | మల్హణ. | మల్హణచరిత్ర | ఆ. 3. | ఎడపాటి ఎఱ్ఱన్న. |
| 122. | మార్క | మార్కండేయపురాణము. | ఆ 8. | మారన. |
| 123. | ముకుంద. | ముకుందవిలాసము. | ఆ. 3. | కాణాచి పెద్దన. |
| 124. | మృ. వి. | మృత్యుంజయవిలాసము. | ఆ. 3. | గోఁగులపాటి కూర్మనాథుఁడు |
| 125. | మై. | మైరావణచరిత్రము. | ఆ. 3. | మాడయకవి. |
| 126. | మొ రా | మొల్లరామాయణము(అచ్చుతెనుఁగురామాయణముకడనున్నట్లుదీనికి కాండము తెలుపుఁగునది.) | కాం. 6. | మొల్ల. |
| 127. | యయా. | యయాతిచరిత్రము. | ఆ. 5. | పొన్నిగంటి తెలగనార్యుఁడు |
| 128. | రంగా. | రంగారాయచరిత్రము. | ఆ. 3. | దిట్టకవి నారాయణకవి. |
| 129. | రం. రా. | రంగనాథరామాయణము(ద్విపద) (అచ్చు తెనుఁగురామాయణము కడనున్నట్లు దీనికి కాండము తెలుపుఁగునది.) | కాం. 6. | రంగనాథుఁడు. |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తల నామములు |
|---|---|---|---|---|
| 130 | రం. రా, ఉ | రంగనాథరామాయణము. ఉత్తర కాండము. (ద్విపద) | కాం. 1. | కాచభూపతి, విట్టలరాజు. |
| 131 | రఘు. | రఘువంశము. | ఆ. 10. | అవుడూరి కిసయ్య. |
| 132 | రఘునా. | రఘునాథాభ్యుదయము. (ప్రాంత | | విజయరాఘవకవి. |
| 133 | రత్న. | రత్నపరీక్ష. (ప్రతి.) | | భైరవకవి. |
| 134 | రస. | రసమంజరి, (లక్షణగ్రంథము) | గుచ్ఛములు 3. | సురతాని కోదండపతి. |
| 135 | రసా. | రసాభరణము. (లక్షణగ్రంథము) | ఆ. 4. | అనంతామాత్యుఁడు. |
| 136 | రసిక | రసికజనమనోభిరామము. | ఆ. 7. | కూచిమంచి తిమ్మకవి |
| 137 | రాఘవ. | రాఘవపాండవీయము | ఆ. 4. | పింగళి సూరన. |
| 138 | రాజగో. | రాజగోపాలవిలాసము. | ఆ, 5 | కాళయ. |
| 139 | రాజ. చ. | రాజశేఖరచరిత్రము. | ఆ. 3. | మాదయగారి మల్లన్న. |
| 140 | రాజ. వి. | రాజశేఖరవిలాసము. | ఆ. 2. | కూచిమంచి తిమ్మకవి |
| 141 | రాధా. | రాధామాధవము. | | చింతలపూఁడి ఎల్లనార్యుఁడు |
| 142 | రాధికా. | రాధికాసాంత్వనము. | ఆ. 4. | ముద్దుపళని. |
| 143 | రామ | రామరాజీయము. | ఆ. 1. | వెంకయ్య |
| 144 | రామలిం. | రామలింగేశ్వరశతకము. | | అడిదము సూరన |
| 145 | రామా. | రామాభ్యుదయము. | ఆ. 8 | అయ్యలరాజు రామభద్రుఁడు |
| 146 | రామే, | రామేశ్వరమాహాత్మ్యము. | ఆ. 5. | ఏమఁగు లక్ష్మణకవి. |
| 147 | రా. వి. | రాజవాహనవిజయము. | ఆ. 5. | కాకమాని మూర్తికవి. |
| 148 | రుక్మా. | రుక్మాంగదచరిత్రము, | ఆ. 5. | ప్రౌఢకవి మల్లన్న. |
| 149 | రుక్మి. | రుక్మిణీపరిణయము. | ఆ. 5. | కూచిమంచి తిమ్మకవి. |
| 150 | లక్షణ. | లక్షణసారసంగ్రహము. | | చిత్రకవి పెద్దన్న. |
| 151 | ల. వి. | లక్ష్మీవిలాసము. | ఆ. 5. | రాయసము వేంకటపతి. |
| 152 | వన. వి. | వనమాలివిలాసము. | | నారన సూరన. |
| 153 | వరాహ. | వరాహపురాణము. | ఆ. 12. | నందిమల్లయ్య, ఘంట సింగన్న. |
| 154 | వసు. | వసుచరిత్రము. | ఆ. 6. | రామరాజభూషణుఁడు |
| 155 | వా. రా. | వాసిష్ఠరామాయణము. | ఆ. 5. | మడికి సింగన్న. |
| 156 | వాల్మీ. | వాల్మీకిచరిత్రము. | ఆ. 3. | రఘునాథభూపాలుఁడు. |
| 157 | విక్ర. | విక్రమార్కచరిత్రము. | ఆ 8. | జక్కన |
| 158 | విజ. వి. | విజయవిలాసము. | ఆ. 3. | చేమకూర వేంకటకవి. |
| 159 | విజ్ఞా. | విజ్ఞానేశ్వరీయము. | కాం. 3. | కేతన. |
| 160 | వి. న. | విజయనందనవిలాసము | ఆ. 3. | మరింగంటి సింగరాచార్యకవి. |
| 161 | వి. పు. | విష్ణుపురాణము. | ఆ. 3. | వెన్నెలకంటి సూరన. |
| 162 | విష్ణుమా. | విష్ణుమాయానాటకము. | | చింతలపూడి ఎల్లనార్యుఁడు |
| 163 | విప్ర. | విప్రనారాయణచరిత్రము. | ఆ. 5. | చెదలవాడ మల్లయ్య. |

| సంఖ్య | గ్రంథసంకేతములు | గ్రంథనామములు. | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తల నామములు |
|---|---|---|---|---|
| 164 | వీథి. | వీథినాటకము | | శ్రీనాథుఁడు. |
| 165 | వీర. | వీరభద్రవిజయము | ఆ. 4. | బమ్మెరపోతన్న. |
| 166 | వేంక. | వేంకటేశాంధ్రము (నిఘంటువు) | వర్గులు. 5. | గణపవరపు వేంకటకవి. |
| 167 | వేం పంచ | పంచతంత్రము. | ఆ. 5. | వేంకటనాథుఁడు. |
| 168 | వేం. మా | వేంకటాచలమాహాత్మ్యము. | ఆ. 6. | తరిగొండ వెంకమ్మ |
| 169 | వేణు | వేణుగోపాలశతకము | | |
| 170 | వేమన. | వేమనశతకము | భాగ. 3. | వేమనయోగి. |
| 171 | వైజ | వైజయంతీవిలాసము. | ఆ. 4. | సారంగుతమ్మయ్య |
| 172 | శ ర. | శబ్దరత్నాకరము. (నిఘంటువు) | | బహుజనపల్లి సీతారామాచార్యులు. |
| 173 | శశాం. | శశాంకవిజయము. | ఆ 5. | శేషము వేంకటపతి |
| 174 | శా ప. మ. | శాసనపద్యమంజరి. | | |
| 175 | శివధ. | శివధర్మోత్తరము, | ఆ 8. | మల్లారెడ్డికవి. |
| 176 | శివర. | శివరహస్యఖండము. | ఆ. 10. | కోడూరి వేంకటాచలపతి. |
| 177 | శివరా. | శివరాత్రిమాహాత్మ్యము. | ఆ 4. | శ్రీనాథుఁడు. |
| 178 | శివ. సా. | శివతత్త్వసారము | | మల్లికార్జునపండితారాధ్యుఁడు. |
| 179 | శుక. | శుకసప్తతి. | ఆ. 4. | కదిరీపతినాయకుఁడు. |
| 180 | శుక, చ. | శుకచరిత్రము | ఆ. 5. | పరశురామపంతుల రామమూర్తికవి. |
| 181 | శృంగా. | శృంగారరసమంజరి. | | సురతాని కోదండపతి. |
| 182 | శేష. | శేషధర్మము. | ఆ. 5. | తామరపల్లి తిమ్మయ్య. |
| 183 | శ్రీరం | శ్రీరంగమహత్త్వము. | ఆ. 5. | భైరవకవి. |
| 184 | శ్రీరం. మా. | శ్రీరంగమాహాత్మ్యము. | ఆ. 10. | కట్టా వరదరాజేంద్రుఁడు. |
| 185 | ష. చ. | షట్చక్రవర్తిచరిత్రము. | ఆ. 8. | మల్లారెడ్డికవి. |
| 186 | షోడ. | షోడశకుమారచరిత్రము. | ఆ 8. | వెన్నెలకంటి అన్నయ్య. |
| 187 | సకల. స | సకలనీతిసమ్మతము. | | మడికి సింగన్న. |
| 188 | సత్య. సాం. | సత్యభామాసాంత్వనము. | | లింగనమఖి కామేశ్వరకవి. |
| 189 | సమీర. | సమీరకుమారవిజయము | ఆ 7. | పుష్పగిరి తిమ్మన్న. |
| 190 | సర్వ. సా. | సర్వలక్షణసారసంగ్రహము. | | కూచిమంచి తిమ్మకవి. |
| 191 | సస్యా | సస్యానందము. | | దోనయామాత్యుఁడు. |
| 192 | సాంబ. ని. | సాంబనిఘంటువు. | వర్గులు. 5. | కస్తూరి రంగకవి. |
| 193 | సాంబో. | సాంబోపాఖ్యానము. | ఆ. 5. | రంగప్పరాజు. |
| 194 | సానందో. | సానందోపాఖ్యానము. | ఆ. 5. | శివరామకవి. |
| 195 | సారంగ. | సారంగధరచరిత్రము. | ఆ. 3. | చేమకూర వేంకటకవి. [డు. |
| 196 | సిం. నార. | సింహాద్రినారసింహశతకము. | | గోంగులపాటి కూర్మనాథుం |

| సంఖ్య | గ్రంథసంకేతములు | గ్రంథనామములు | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తల నామములు. |
|---|---|---|---|---|
| 197 | సీతారా. | సీతారామాంజనేయసంవాదము | ఆ 3 | పరశురామపంతుల గురు లింగమూర్తి |
| 198 | సీతావి. | సీతావిజయము. శతకంఠరామాయణము. | ఆ 4. | మద్దనకవి. |
| 199 | సీమం. | సీమంతినీకల్యాణము. | ఆ 5 | పెనుమళ్ల సోమమంత్రి. |
| 200 | సుధ. | సుదక్షిణాపరిణయము | ఆ 5. | తెనాలి అన్నయ్య |
| 201 | సుదంతా. | సుదంతాపరిణయము(వ్రాతప్రతి) | ఆ. 4. | అళుమరికవి. |
| 202 | సురా. | సురాభాండేశ్వరము. | ఆ. 2. | ఘట్టు ప్రభువు. |
| 203 | సు. శ | సుమతిశతకము. | | బద్దెనకవి |
| 204 | సేతు. | సేతుఖండము. | ఆ. 6. | వక్కలంక వీరభద్రకవి. |
| 205 | హంస. | హంసవింశతి | ఆ. 5. | అయ్యలరాజు నారాయణామాత్యుడు. |
| 206 | హ న. | హరిశ్చంద్రోపాఖ్యానము. | ఆ. 5. | రామరాజభూషణుడు. |
| 207 | హర. | హరవిలాసము. | ఆ. 7. | శ్రీనాథుడు |
| 208 | హరి. వి. | హరిభక్తివిలాసము. | | |
| 219 | హరి. | హరివంశము. | | ఎఱ్ఱాప్రెగ్గడ. |
| | | పూ = పూర్వభాగము | ఆ. 9. | |
| | | ఉ = ఉత్తరభాగము. | ఆ. 10. | |
| 210 | హరిశ్చ. | హరిశ్చంద్రోపాఖ్యానము. | ఆ. 5. | శంకరకవి. |
| 211 | హ. వరాహ. | వరాహపురాణము | ఆ. 5. | హరిభట్టు. |

(కడమవి స్పష్టము)

| సంఖ్య. | గ్రంథసంకేతములు | గ్రంథనామములు. | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తల నామములు |
|---|---|---|---|---|
| 1 | మురా. | అనర్ఘరాఘవము. | అంకములు 7 | మురారి. |
| 2 | శాకుం. | అభిజ్ఞానశాకుంతలము. | అంకములు 7 | కాళిదాసుఁడు |
| 3 | అమర. | అమరసుధ | | భానుజీ దీక్షితులు |
| 4 | ఆ౦ ని. | ఆప్టువిసంస్కృతాంగ్లనిఘంటువు | | వామనశివరామాప్టుఁడు |
| 5 | ఉ. చ. | ఉత్తరరామచరితము. | అంకములు 7 | భవభూతి. |
| 6 | కల్ప | శబ్దకల్పద్రుమము (నిఘంటువు.) | | సర్ రాజా రాధాకాంతదేవ బహదరు |
| 7 | కాదం. | కాదంబరీకావ్యము. | భాగములు 2. | బాణకవియు, తత్పుత్రుఁడు. |
| 8 | కావ్యాద | కావ్యాదర్శము, | పరిచ్ఛేదములు. 3. | దండికవి. |
| 9 | కే. ని. | నానార్థార్ణవసంక్షేప నిఘంటువు. | కాండములు 6. | కేశవమిశ్రుఁడు. |
| 10 | గీత | భగవద్గీత. | అధ్యాయములు 18. | వ్యాసమహర్షి. |
| 11 | గీతగో. | గీతగోవిందము | సర్గములు. 12 | జయదేవుఁడు |
| 12 | త్రిని. | త్రికాండశేషము. (నిఘంటువు). | కాండములు. 3 | పురుషోత్తముఁడు, |
| 13 | పరా | పరాశరస్మృతి | కాండములు. 2 | పరాశరమహర్షి. |
| 14 | భట్టి. | భట్టికావ్యము | సర్గములు. 22. | భట్టి. |
| 15 | భామినీ. | భామినీవిలాసము | ఉల్లాసములు. 4. | జగన్నాథపండితరాయలు. |
| 16 | మను. | మనుస్మృతి. | అధ్యాయములు 12 | మనువు. |
| 17 | మహా | మహావీరచరిత్రము. | అంకములు. 7. | భవభూతి |
| 18 | మాలతీ. | మాలతీమాధవము. | అంకములు. 10. | భవభూతి, |
| 19 | మాళవి. | మాళవికాగ్నిమిత్త్రము. | అంకములు. 5. | కాళిదాసుఁడు |
| 20 | ముద్రా. | ముద్రారాక్షసము. | అంకములు. 7. | విశాఖదత్తుఁడు. |
| 21 | మృచ్ఛ. | మృచ్ఛకటికము. | అంకములు. 10 | శూద్రకుఁడు. |
| 22 | మే. ని. | మేదినినిఘంటువు. | | మేదినికరుఁడు. |
| 23 | మేఘ. | మేఘదూతము | భాగములు. 2. | కాళిదాసుఁడు |
| 24 | యాజ్ఞ. | యాజ్ఞవల్క్యస్మృతి.<br>ఆచా. ఆచారకాండము.<br>ప్రా. ప్రాయశ్చిత్తకాండము.<br>వ్యవ. వ్యవహారకాండము. | కాండములు. 3 | యాజ్ఞవల్క్యమహర్షి. |
| 25 | రత్నా. | రత్నావళి | అంకములు 4 | శ్రీహర్షదేవుఁడు. |
| 26 | రస. | రసగంగాధరము. | | జగన్నాథపండితరాయలు. |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తల నామములు |
|---|---|---|---|---|
| 27 | రా. ని. | రాజనిఘంటువు. | వర్గములు 21 | నరహరిపండితుడు |
| 28 | వాచ. | వాచస్పత్యనిఘంటువు | | తారానాథ తర్కవాచస్పతి |
| 29 | విక్ర. మో. | విక్రమోర్వశీయము | అంకములు. 5 | కాళిదాసుఁడు |
| 30 | వి. ని | విశ్వనిఘంటువు | | మహేశ్వరసూరి |
| 31 | విల్యమ్సు. | విలియమ్సు సంస్కృతాంగ్ల నిఘంటువు. | | సర్. మోనియర్ విలియమ్సు |
| 32 | వేణీ. | వేణీసంహారము. | అంకములు 6 | భట్టనారాయణుఁడు |
| 33 | వై. వి. | వైజయంతీనిఘంటువు | కాండములు 8 | యాదవప్రకాశుఁడు |
| 34 | శా. ని. | శాశ్వతనిఘంటువు | | శాశ్వతుఁడు |
| 35 | శిశు. | శిశుపాలవధము | సర్గములు 20 | మాఘకవి |
| 36 | సం. కిరా. | కిరాతార్జునీయము. | సర్గములు 18 | భారవి. |
| 37 | సం. కు. సం. | కుమారసంభవము. | సర్గములు 17 | కాళిదాసుఁడు |
| 38 | సం. చం. రా | చంపూరామాయణము. | కాండములు 6 | భోజరాజు లక్ష్మణసూరి |
| 39 | సం. దశకు | దశకుమారచరితము, | | దండికవి |
| 40 | సం. నైష. | నైషధీయచరితము. | సర్గములు 22 | శ్రీహర్షకవి |
| 41 | సం. పంచ. | పంచతంత్రము. | తంత్రములు 6 | విష్ణుశర్మ |
| 42 | సం. ప్రబోధ | ప్రబోధచంద్రోదయము. | అంకములు 6 | కృష్ణమిశ్రకవి |
| 43 | సం. భర్తృ | భర్తృహరిసుభాషితము. | శతకములు 3 | భర్తృహరి |
| 44 | సం. భాగ. | భాగవతము | స్కంధములు 12 | వ్యాసమహర్షి |
| 45 | సం. భార. | భారతము. | పర్వములు 18 | వ్యాసమహర్షి |
| 46 | సం. రఘు | రఘువంశము. | సర్గములు 19 | కాళిదాసుఁడు |
| 47 | సం. రామా. | రామాయణము. | కాండములు 6 | వాల్మీకిమహర్షి |
| 48 | సా. ద. | సాహిత్యదర్పణము. | పరిచ్ఛేదములు 10 | విశ్వనాథకవిరాజు |
| 49 | హలా. ని. | అభిధానరత్నమాలానిఘంటువు | కాండములు 5 | హలాయుధుఁడు |
| 50 | హితో. | హితోపదేశము | భాగములు 4 | నారాయణపండితుఁడు |
| 51 | హేమ. ని. | అనేకార్థసంగ్రహము. (నిఘంటువు) | కాండములు 7 | హేమచంద్రుఁడు |

(కడమవి స్పష్టము.)



# సూర్యరాయాంధ్ర నిఘంటువు

—O:o-o:O—

## మ

మ ఊ॰ ఒకానొక యక్షరము.

మ ప్ర॰ ఆశీర్వార్థకము లగు ఎడు, తవర్ణకములకు అచ్చు పరంబగునపు డాదేశముగాను చిట్టు, బుస్సు, మినుకు మున్నగు అనుకరణ శబ్దములకు 'అను' పరమగునపుడు ఆగమము గాను వచ్చు వర్ణము.

ఉదా: రక్షించెదు మెపుడు. (రక్షించెదు+ఎపుడు) చెచ్చితమనెను. (చచ్చితన్ + అనెను.) చిట్టు మంటివి, బుస్సుమన్నది, మినుకు మినుకు మనుచున్నది మొ.

మ నం. వి. అ పుం. 1. శివుడు. 2. చంద్రుడు. 3. బ్రహ్మ. 4. యముడు, 5. విష్ణువు. 6. సమయము. 7. విషము.

మంకిలము నం. వి. అ. పుం. దావానలము, కార్చిచ్చు.

మంకు విశే. (క. మంకు. త. మంగన్.) 1. అవివేకి, మూర్ఖుడు; మూర్ఖము.

ఆ. ఇంటిలోని ధనము నిది నాది యనుచును, మంటిలోన దాచు మంకుజీవి, కొంచుబోడు వెంట గుల్లకాసును రాతు, విశ్వ ... వేమ. వేమ. 1. 150.

ఉ. ఒప్పని మోముతో నను దురుక్తులఁ బల్కుచు మంకుబుద్ధి యే, తప్పును లేమి నిర్వెడలి తల్లి గృహంబున కేఁగె, ... వేం. పంచ. 4. 479.

మంకు బుద్ధి —మంకుబుద్ధి గలది, మూర్ఖురాలు.

2. మొండి, కూడని పట్టుదల కలది, చెప్పిన మాట విననిది.

కం. మంకులు మాయోపాయలు, బొంకుల పుట్ట లతిపాపపుం జగజంతల్, జంకెనలు సేయు యువతులు, శంకరుఁడుం దగఁడు వారి చర్యలు దెలియన్. హంస. 1. 37.

ద్వి. మంకు బ్రిమ్మరి మటుమాయల బండి.

సీ. .... పరుల బుద్ధులకుఁ జొప్పడని మంకు ... శుక. 3. 18.

3. చెడ్డది, దుష్టము.

ఉ. మంకుగుణంబు మానక సమంజస కీర్తి వహింప లేక మీ, నాంక ధనుర్విముక్త కుసుమాశుగ పఙ్క్తికిఁ దాఁక లేక ... సావందో. 2. 26.

సీ ... కలపుట నేర్పుట కలతలు పోకిళ్లు కలదలు బుద్ధులు కలటి మంకు ... అప్ప. 2. 197.

జ: మంకుఁబోతు, మంకుతనము,

మంకుఁబోతు విశే. (మంకు + పోతు) మిక్కిలి మూర్ఖుడు; మిక్కిలి మూర్ఖురాలు.

ద్వి. కొంకక తమనోరి కొలఁదులఁ బలుకు, మంకుఁ బోతులకు గ్రామ్యంబు సామ్యంబు. అ. మ. క. 1. 9 పా. 3 పం.

మంకుతనము వి. (√మంకు. క. మంకుతన.) మొండితనము, మూర్ఖత్వము.

చం. మదిమది రాజ్యమున్ విడిచి మంకుతనం బునఁ జెందరాని మేల్, పదవులు గోరఁ గల్గునె... ఉ. హరిశ్చ. 4. 153.

(విశ్వామిత్రుఁడు త్రిశంకునితో నన్న మాటలు.)

సీ మాయామృగము వెంట మగఁడు పోవఁగ
దంట మఱఁది నంపిన నాఁటి మంకుతనము...

గీ హావణిఁ దీర్పఁగఁ గ్రమ్మఱ నవతరించి, పైఁడి
కుంగోత్ర మిద్ధాత్రి పాత్రముగను తెలఁగు రామ
క్షమాపాలుఁ జెట్టపట్టె ధీర ధోరణి జానకీదేవి కివి.
కృ. శకుం పీఠి. 1. 50.

**మంకురము** సం. వి. అ పుం. అద్దము

**మంకువు** సం. వి. ఉ పుం. మచ్చ. చెమటకాయ (వై. ని).

**మంకుశుఁడు** సం. వి. అ పుం. సంగీతమును నాట్యమును ఎఱుగునట్టి మాహిష్యజాతివాఁడు (వై. ని)

**మంకెన¹** వి వృక్ష విశేషము. బంధూకము (వృ. వి.) (దీని పువ్వు లెఱ్ఱగా నుండును).

ఉ .. అరుణాధర పల్లవ నిర్గతంబులై, పంక
రుహాయతాక్షి నునుపల్కులు ... మంకెనపూవుఁ
జాపమున మన్మథుఁ డేసిన తూపులో యనన్.
నైష. 4. 13.

ఉ ... మంకెనపూవు కేడె మన మండల మొప్పె
మరీచిమాలికిన్ పి శకుం. 3. 204

కం. పగడము మంకెన విరియును, జిగురాకును
దొండపండుఁ జెందిరమును సొం, పగు తమ్మి
కెంపు గుంపును, ముగుదనిగారంపుఁ దొగరు
మోవికి దొరయే. నీలా 2. 22., అం
భా. 2 52

వి అ ధాన్య విశేషము, ఒక జాతి వడ్లు.

సీ ... మణిసరు ల్మసరులు మంకెన ల్పగడంపు
తీఁగెలు మడిప్రాలు దేవసరులు ...హంస 4. 128.

**మంకెన²** వి. ఎద్దులు మున్నగువాని మీఁదఁ గోని పోవు జలతైలాది పాత్రములు కుదురుగా నుండుటకై క్రింద నమర్పఁబడు బెత్తపుబుట్ట.

సీ. తేనె లడ్డిగ మొత్త మూని యెల్గులకు నెత్తిన
పగడంపు మంకెనల గుములు.
గీ అన్నపాలు, సముఖమునఁ బెట్టి చెంచులుసాఁగి
మ్రొక్కి. చంద్రా. 2 41,

కం పరికరముల మంకెనలును. బరిచారకు లరిది
పనుల పట్టు గుడారుల్, సరి బేరులైన గౌరలు,
దొరయం జన విప్రుఁ డతనితో నిట్లనియెన్.
శుక 1. 100.

జ. మంకెన గిత్త

**మంకెనగిత్త** వి. (మంకెన² + గిత్త) మంకెన మోచెడి యెద్దు.

ఉ వెన్నుడఁ జూపె వెండి రహి నిండిన సందిటి
బొంది భూతితో, వెన్నొన లానఁ బా ల్పెరుఁగు
నెయ్యిని వాడెడు కోడెకాండ్రపై. వెన్నెల సోగ
లీను జెలి వెన్కొను గన్గవఁ గన్నపాయవుం,
గన్నడ కన్నె లెక్కిన చొకారపు మంకెన గిత్త
లత్తరిన్. రా. వి. 2. 61.

ఉ. పైనము లైరి పాండు నరపాల తనూజులు
యజ్ఞసేనభూ, జాని యనుజ్ఞ నశ్వములు సాగె
రథ ప్రకరంబు వెళ్లె మస్తేనుఁగు తండముల్ గదలె
నేఁగె భటచ్ఛటలోన పుట్టికల్, మైనపుఁ జీర
పెట్టియలు మంకెనగిత్తలు గాంచె వెన్నడల్.
పాంచా 5. 47.

**మంక్షణము** సం. వి అ. న. కాలి పిక్కలకుఁ దొడుగుకొను కవచము, జంఘాత్రాణము.

**మంక్షు** సం. అవ్య. 1. వెంటనే, వెంబడి, వేగముగా. (మంక్షూదపాతి — వెంబడిని బడెడు) 2. అత్యధికముగా. 3 యథార్థముగా, నిజముగా (విలియమ్స్.).

**మంఖ** సం. వి. అ. స్త్రీ మాంగల్యము, శుభము (శే. ని.)

**మంఖుఁడు** సం. వి. అ. పుం. 1. బట్టు. స్తోత్ర పాఠకుఁడు

**మంఖుణము** సం. వి అ పుం. జంఘాత్రాణము, పిక్కలకుఁ దొడుగు కవచము.

**మంగ — మ్రంగ** వి. 1. వృక్షవిశేషము, పిండీతకము (వృ. వి.).

ద్వి. చెంగావి మొలదట్టి చెలఁగులవాఁడు, మంగ

వృక్షములార మాసుతుఁ గనరె సారంగ. శ్రీ. 111 పో. 6 పం.

2 మదనము (వృ వి)

గీ. మంగ యనఁగను మదన నామంబు చెలఁగు, ఆం. భా 2. 48.

**మంగము** సం. వి. అ పుం 1. పడవ యొక్క శిరో భాగము (వై. ని).

**మంగల** వి. (క మంగల, త. మంగలి) క్షౌరము చేసి జీవించెడి జాతి.

(ఉదా. మంగలవాఁడు, మంగలది మొ.)

జ మంగల కత్తి, మంగల కత్తి రూపు, మంగల వాఁడు, మంగలి, మంగలి కోలు, మంగలి పని, మంగళ్ల తిప్ప, మంగల పిట్ట.

**మంగల** సం వి అ స్త్రీ. 1 పతివ్రత. 2. సిత దూర్వాతృణము (వృ. వి.). 3. దుర్గాదేవి. 4. పసుపు.

**మంగలకత్తి** వి (√ మంగల) మంగలవాని కత్తి, క్షురము.

సీ మంగలకత్తిపై నంగ ముంచినయట్లు కోడె త్రాఁచును ముద్దులాడినట్లు వేణు. శ 50.

సీ. మంగలకత్తి యనంగ క్షురము తగుఁ ... ఆం. భా 2. 301.

**మంగలకత్తిరూపు** (√మంగలకత్తి) కృత్తికా నక్షత్రము (శ. ర).

**మంగలగ్రహము** సం. వి. అ పుం కుజుఁడు (వై ని.).

**మంగలచ్ఛాయము** సం. వి. అ. పుం. ప్లక్షవృక్షము, జువ్వి (వృ. వి.) (రాజని.).

**మంగల దేవత** సం. వి. అ. స్త్రీ. 1. శుభ దేవత, కుల దేవత, ఇలువేల్పు, 2. లక్ష్మి.

**మంగలధ్వని** సం వి. అ. పుం వివాహ కాలము నందు వాయించు శుభ ధ్వని.

**మంగలపక్కె** వి. మత్స్య విశేషము (శ. ర) ఒక జాతి చేఁప.

**మంగల పత్త్రిము** సం. వి. అ న. తాయెతు (రక్షరేఖ) గా నుపయోగించెడి యాకు (విలియమ్స్.).

**మంగలపాఠకుడు** సం. వి. అ పుం. స్తోత్ర పాఠకుఁడు, మాగధుఁడు.

**మంగలపిట్ట** వి. (మంగల + పిట్ట) పెట్టింత, భరద్వాజ పక్షి (శ ర)

**మంగలప్రదము** సం. విశే. (అ ఆ అ) శుభము నిచ్చునది. సం. వి. ఆ. స్త్రీ. పసుపు హరిద్ర (కల్ప.)

**మంగలప్రస్థము** సం. వి అ పుం. ఒకానొక పర్వతము (విలియమ్స్.)

**మాంగలమాలిక** సం. వి. ఆ. స్త్రీ. వివాహ మందలి శుభ సంగీతము (వై. ని.).

**మంగలము** వి. వేఁపుడు చట్టి, భ్రాష్ట్రిము. అంబరీషము.

గీ. ఉరునిదాఘ వాతాహతిఁ గరుల తలలు, ప్రస్సి లోపలి ముత్యముల్ వరుస విరిసి, మంగలములోని ప్రేలల భంగిఁ దూలి...కు. సం. 6. 795.

సీ .. మంగల మన భ్రాష్ట్రాభిధానంబు పరఁగుచు నుండును. ఆం భా. 2. 248.

ఉ. ఎండెఁ గొలంకు తెల్లను మహీధరముల్ దవ వహ్ని కీలలన్, మండె ధరాతలం బినుప మంగలముం బలె నుండె ... కాశ. 1. 128.

కం మండ జఠరాగ్నిఁ దనయులు, చండత మంగలమువంటి సంసారము నిం, కొందు గతి లేదు దిన దిన, గండం బే రీతి పడపఁగాఁ దగు పవమా. రాజ. చ. 3. 19.

**మంగలము** సం. వి. అ పుం. న. 1. శుభము. 2. క్షేమము, లబ్ధార్థ రక్షము. 3. శుభ సమయము, మంచివేళ. 4. మల్లిపువు వాసన. 5. శుభ ద్రవ్యము. 6. (వివాహాది) శుభకార్యము 7. కరంజము, కానుగు (వృ. వి.).

విశ అ ఆ అ. శుభకరము, క్షేమంకరము.

**మంగలవాఁడు** వి. (మంగల + వాఁడు) క్షౌరికుఁడు అ ఒప్పుఁడు (వా.)

**మంగలవారము** సం వి. అ. పుం. జయవారము, అంగారిక వారము.

**మంగలసూత్రము** సం వి అ. న శుభప్రదమగు తోరము, బొట్టు దారము 2 రతు రేకు (తాయెతు) నకుఁ గట్టెడి దారము (వివాహితలగు స్త్రీలు భర్త బ్రదికియున్నంత కాలము మెడచుట్టు కట్టుకొనెడి (ధరించెడి) మాంగల్య తంతువు)

**మంగలస్నానము** సం వి. అ న శుభ స్నానము, వివాహాది కాలమున స్నానము

**మంగలాష్టకము** సం. వి అ న. వివాహ కాలమున వధూవరుల యభివృద్ధికై పురోహితులు చదివెడి యాశీర్వచన శ్లోకములు ఎనిమిదిమంగలశ్లోకములు (విలియమ్స్.)

**మంగలాహ్నికము** సం వి అ. న 1. శుభమునకై ప్రతిదినము నాచరించెడి వైదిక కర్మము. 2. పూర్ణకుంభము, శుభమునకై నీటితో నింపి ఉంచిన ఘటము

**మంగలి** వి (మంగల + ఇ[3]. త. మంగలి బ మంగలులు, మంగళులు, మంగళ్లు) మంగలజాతికి సంబంధించినవాఁడు క్షౌరికుఁడు, మంగి.

ఉ విన్నప మాదరింపు పృథివీవర మంగలి మాయ లేమియుం, బన్నఁడు కాశి. 1. 55.

16 . పుట్టి 1 ట్టికిచి 3 (శ్రీ)మంగ్గలి పేరు 1 ట్టికిచి 6 పోడు 1 ట్టికిచి 6 పెరలు మిన్నుఅన్నులో పైనవణ్ణు్రినకు ...

19 ... పుట్టి 1 ట్టికిచి 10 కొండ మంగ్గలి పేరు 1 ట్టికిప్రయ్తిచి 6 పేరు 1 ట్టికిచి 10 చాకిపేరు 1 ట్టికిచి 8 గోదావరి పడ్మటి ... దా. శా. 1384., ఆం. భా. 2. 288.

మంగలి సం. వి. ఈ. స్త్రీ — మంగల.

**మంగలికోలు** వి. (మంగలి + క్రోలు. వృత్తిని వర్ణలోపము) బ మంగలి కోళ్లు మంగలి ఊదు గొట్టము సన్నాయి.

కం మంగళ సూత్రముఁ గట్టెఁ గు, రాగాటికి నంత నగరాజేంద్రుఁడు పుణ్యాంగనల పెండ్లి పాటలు, మంగలికోళ్లి మృదుగీతి మధురము నెన యన్. కళా. 7. 75 (క్రొ ప్ర. పా )

**మంగలిపని** వి (√మంగలి.) క్షౌరము

గీ వలయుఁ బ్రాజ్ఞుమ్మఖోదజ్ముఖత్వముల నొకటి, తారకంబులుఁ దిథులును వారములును, జోస్యు లెఱింగించినవి మేలు సువ్రతైక. లోల మంగలి పనికిని దైలమునకు భారం. అను 4. 121

**మంగలీయము** సం. విశ. (అ. ఆ అ.) శుభప్రదము

**మంగలుఁడు** సం. వి. అ పుం 1 అంగారకుఁడు 2 అగ్ని.

**మంగల్య** సం వి. ఆ స్త్రీ 1. శమి, జమ్మి (వృ వి ). 2. సదాప (వృ. వి.). 3 మిసి, జటామాంసి (వృ వి ) 4. వచ, వస (మే ని ). 5 మల్లి గంధము గల కాలాగురువు (కే ని )

**మంగల్యకము** సం వి. అ. పుం. మసూరము, చిఱుసెనగలు.

**మంగల్యము** సం విశ (అ. ఆ. అ.) 1. శివకరము, శుభము చేయునది. 2 సాధువు. 3 పవిత్రమైనది. 4 సుందరము

వి. అ. న 1. దధి, పెరుఁగు 2 చందన భేదము. 3. స్వర్ణము, బంగారువు. 4. సిందూరము. 5. సర్వౌషధి స్నానము (కే ని.).

అ. పుం 1. త్రాయమాణము, కలుగానుగు (వృ వి.) 2 అశ్వత్థము, రావి (వృ. వి.). 3 బిల్వము (వృ వి.). 4. మసూరకము, చిఱు సెనగలు (వృ. వి.). 5. జీలకఱ్ఱ. 6. నారికేళము (వృ వి ). 7. కపిత్థము, వెలఁగ (వృ. వి.).

**మంగళకౌశికి[1]** సం. వి ఈ స్త్రీ వి. ఇరువది నాలుగు స్త్రీ రాగములలో నొకటి. రాగిణీ విశేషము.

గీ ... సారంగ మంగళకౌశికులును, కన్నడయుఁ జాయయును గౌళ కడు నపూర్వ, మైన భల్లాతకి యును నారాయణియును, గ్రమత నిరువది నాల్గు స్త్రీరాగములును. ప్రబంధ. 95.

గీ. కన్నడ యనంగ మంగళకౌశికి యన, వెలయు నారాయణియుఁ జతుర్వింశతి విధ, ములను దన రారు స్త్రీ రాగములను మఱియు ... హంస. 5 123

వ ... సాదనామక్రియ, వరాళి, మంగళకౌశికి, గుండక్రియ, ఘూర్జరి ... మత్స్యపురాణము 5. 54.

**మంగళము** నం. వి. అ న. శుభకరము

**మంగళసూత్రము** నం వి అ. న. వివాహ సమయ మందు వధువు మెడకుఁ గట్టెడు పుస్తెలతో నుండు పసుపు త్రాడు, తాళి.

చం. పనివడి నాథు పంపునఁ బ్రభావతి భామిను లర్థిఁ గొల్వఁ గుం, దనపు మెఱుంగుఁ బళ్లెరము నన్ ఘనసారజ దీపికావళుల్, గొని మును భీముఁ గాంచి యనిలోఁ దన మంగళసూత్ర మూడఁగా, ననువున నిల్పె నేసదయుఁ డాతనికిన్ జయ మంగళం బనెన్. జై భా. 2. 98

**మంగళహారతి** — మంగళారతి వి. (నం మంగళా రాత్రికము) మంగళకరమైన హారతి, నీరాజనము (శ ర.)

**మంగళాగరువు** నం వి ఉ. న. చందన విశేషము, అగురుభేదము (రా ని.)

**మంగళారతి** — మంగళ హారతి. (నం. మంగళారా త్రికము) మి. వి. శుభకరమైన హారతి, నీరాజనము

గీ. రహి వహింపంగ జానకీరాఘవులకు, మంగళా రతు లిచ్చిరి మమత నంత. దేశా. 7 275

ద్వి. మంగళారతు లిచ్చి మహి మ్రొక్కి చనఁగ, నంగళ్ల వీథుల నంతంత నిలిచి పండితా రాధ. 175.

**మంగళ్లతిప్ప** వి. (√మంగలి) హాటకులు గొఱిగి పడవైచిన వెంట్రుకల కుప్ప

సీ. దూళ్లమక్కెక్కి మంగళ్ల తిప్పలు రేఁగు పడు వున గాలి నాడెడు నెఱకలు. ఆము 6. 17

**మంగి** వి మంగలవాఁడు, హాటకుఁడు.

గీ. మంగి యనఁగను మఁగ లెసంగుచుఁడు. ఆం భా 2. 283

**మంగిలి** నం. వి ఈ. స్త్రీ. పడవ, ఓడ (వై.ని).

**మంగు** — మంగుఁడు. వి ముఖసిధ్మము, ముఖము నందలిపొడ, (ముదిమిచే మొగమునం దేర్పడు ముడుత అని బ్రౌ. 'మూఁగు' యొక్క రూపాం తరము, ముఖము నందలి నల్లపొడ అని శ. ర.)

సీ . మంగుఁ డనంగను మంగనంగ, ముఖసిధ్మ నామ మొప్పును ... ఆం భా. 2 129.

**మంగుడు** — మంగు వి. ముఖసిధ్మము.

**మంచకము** నం వి అ న 1. పర్యంకము, మంచము. 2. ఎత్తైన యాసనము. 3 ఎత్తైన కుంపటి (విలియమ్స్)

**మంచకాశ్రియము** నం. వి. అ పుం. మత్కు ణము, వల్లి.

**మంచము** వి. (నం. మంచః, క మంచ.) పర్యం కము, ఖట్వ.

ఉ వీనుల చూపు పెండెముఁ దవిల్చిన మంచము కోడికైదువుం, బూనిన ప్రాంత వేల్పుఁ గని పోకులఁ బోయిన వెన్నుఁ డీ ట్లనున్. ఉ. హరి. 2 172

కం ఒకచోటఁ బువ్వుఁ బందిరి, యొకచోఁ జప్ప ఱము దూగుటుయ్యాల యొకచో, సకినెల గిలిగిలి మంచం, బొకచోఁ గప్పురపుఁ బలుగు టోవరి యొకచోన్. నైష 7. 148.

మ ...మేఁ కెరువుం గుంపటి మంచ మెక్కిరి ప్రభు త్వైకాప్తి రెడ్లజ్జడిన్. ఆము. 4. 134.

గీ కంకటియు మంచమును జెల్లు ఖట్వమునకు.
సాం ని స్థా 64

మంచము పట్టు — వ్యాధిగ్రస్తుఁ డగు

(వ్యవ.) మగఁడు మంచము పట్టినప్పటినుండి యు ఆ యిల్లాలికి నిద్రాహారములు లేవు

మంచము నం వి అ. పుం 1. పర్యంకము మంచము 2. ఉన్నతాసనము, సింహాసనము 3. అరవ, పొలములోఁ గాపువాఁడు కూర్చుండుటకై యెత్తుగాఁ గట్టిన చప్పరము వంటిది 4 ఆసనము, పీఠము. 5. (సంగీ.) ఒకానొక కొలత. 6. మేడమీఁది గది (వై. ని.)

మంచి వి. 1 మేలు, లగ్గు, శుభము.

ఉ మంచిగ మేనయత్తలు సమాదరణం బడరంగఁ బెట్టి పుత్తెంచిన మంచిభక్ష్యములు. హర. 2 102.
2. సామము, కలుపుఁగోలుతనము (చతురుపాయములలో నొకటి).

సీ. చతురుపాయంబుల సంజ్ఞయై మం చీగి వేలు కొట్టన నాల్గు వేలు వేల ... తవరుచుండు ... ఆం. భా. 2. 170.

3. సజ్జనుఁడు.

సీ ... మంచివాఁడు పసువు మంచి సాదు, వవ సజ్జనుం డొప్పు ... ఆం. భా 2. 170.

విశ 1. యోగ్యము.

(కం) మేలైనది, లెస్స.

గీ. గండెయును వల్లదానరి గాఁడు కిరియు, హరి యునై పోవుటయ మంచి దను యుగంబు. ఆము. 5. 41.

(చ) మనోజ్ఞము, ఇంపైనది.

సీ. కందొగ లిప్తత్వ వికాస మొందింపఁగా మంచి పున్నమ చందమామ రామ, దశా. 3. 35

(ట) అనుకూలము, ఫలకారి

సీ హంస జీవి సందోహములకు బలాకికా విసరంబు లకు మంచి వెదలు దొరకె ... ఆము. 4. 123.

కం దేవాధిప మంచియుక్తి దెలిపితి విచటన్, దశా 2 143,

(త) ఇష్టము, ప్రియమైనది

గీ ఆత్మ నూహింపఁగా నుపాయములలోన, నెప్పటికి సామ ముచితంబు నృపవరేణ్య, మౌని చిత్తంబు రంజిల్ల మంచిమాట, లాడి మణిఁ దెత్తు నను బంపు మవధరింపు. వరాహ. 5. 8.

కం అన విని నీవా యెవరో, యని యుంటిని మంచికార్య మా యెను ... దశా 1. 295.

(ప) ప్రశస్తము, శ్రేష్ఠమైనది

కం నాకంబునయందును భూ, లోకంబున యందు ధనములు మణులు దైత్యా, నీకంబు దేర మంచివి, గైకొని యా చంద్రముఖికిఁ గానుక యిచ్చెన్. ఉ. హరి. 1. 83.

గీ .. మంచి పనస పండుల మెసంగు, జాణలకు మావి పండులు చవియ కావె. నీలా. 2. 31.

(గ) ఇతర పదార్థములు కలియనిది, స్వచ్ఛమైనది.

ఉదా. మంచిపాలు, మంచినెయ్యి మొ.

(జ) ఘనము, గొప్పది, అధికము, అత్యంతము, మిక్కిలి

ఆ. మనబలంబు నందు మంచిమగల్ పాలఁ, గలిగి యీ బలంబు గెలువ లేమి, దైవకృతము గాదె తలఁప జోద్యము మున్న, యెఱుఁగఁ జెప్పె, విదురుఁ డిట్టు లగుట. భాం. భీష్మ. 2. 352.

(డ) సందర్భానుసారముగ నిది పెక్కితరార్థముల నిచ్చును

(చూ మంచిగందము, మంచినీళ్లు, మంచిముత్తెము మొ)

2 ఇది 'కనీ', 'కానీ' పదములతోఁ గూడి విశ. హై లెస్సగా, బాగుగా, యథావిధిగా, సప్రేమముగా, జనప్రియముగా, మున్నగు నర్థముల నిచ్చును.

ఉదా. వాఁడు బ్రతికియున్న కాల మంతియు

మంచిగా వెళ్లఁ బుచ్చుకొన్నాఁడు

ఉ. మంచిగ భూరి భూసుర సమాజము నెల్లను భక్తితోడఁ బూ, జించి యభీష్టదానములు నేసి ... భార. సభా. 1. 16.

చం. నీ, మనమున ధర్మమున్ హితము మంచిగఁ జూచి విధించినట్లు చే, సి నెగడువారు గాక నిమఁ జేరిన నాపద లొండ నేర్చునే. భార. ఉద్యో 3. 207.

ఉ. మానస కృత్యములే సుర సమాజ మెఱుంగఁగఁ జాలుఁ గావునన్, మానస మెక్కడేనిఁ జన మంచిగఁ జేసిర యేని యజ్ఞమున్ ... భార అను. 5. 200.

ఉ. మంచిగ మేనయత్తలు సమాదరణం బడరంగఁ బెట్టి పు, త్తెంచిన మంచి భక్ష్యములు ... హర. 2. 105.

సీ. తగునాజ్ఞ నూయాణముగ నొనరించె మంచిగ నేల నాలుగు చెఱఁగులకును. భార. విరా. 5. 320.

మంచి కుక్క — వెఱ్ఱి యెత్తని కుక్క.

(వ్యవ.) వెఱ్ఱి కుక్కలను జంపుదురు గాని మంచి కుక్కలను జంపరు ఇట్లే మంచి నక్క మొ. (బ్రౌ.)

మంచినిద్ర — గాఢ సుషుప్తి (బ్రౌ.).

మంచి నీళ్లు — పానయోగ్య మగు తియ్యని జలము (శ. ర.).

మంచి నూనె — నువ్వుల తైలము (బ్రౌ.). తలంటుకొను తైలము అని (శ ర.)

మంచి పాము — నాగుఁబాము, త్రాఁచు (శ. ర., బ్రౌ.).

మంచి బంగారము — (చేత బంగారము, పూఁత బంగారము, శాకి బంగారము కాని) బంగారము, స్వర్ణము (బ్రౌ.).

మంచి బెల్లము—చెఱకు రసముతోఁ జేసిన బెల్లము.

మంచి ముట్టు — (మంచి + ముట్టు) శుభ ప్రదమైన పెద్దల స్పర్శము, శుభ ప్రదమైన నూలి పోఁగు.

సీ గవల ధూసంబు సంఘటియించువారును మంచి ముట్టెడఁద యోజించువారు. శివరా. 2. 70.

మంచి ముత్తెము — శుక్తి మున్నగు నానిలో సహజముగాఁ బుట్టు ముత్యము (అకృత్రిమమైన మౌక్తికము).

(స. ర.) (ఇట్లే మంచి పగడము మొ )

మంచి వాన — అధిక వర్షము (బ్రౌ ).

జ : మంచి గంధము, మంచితనము, మంచిది, మంచిదె, మంచి నీళ్ళు, మంచి మాట, మంచి ముత్తెము, మంచివాఁడు, మంచి విరులు.

మంచిక సం. వి. అ. స్త్రీ. 1. ఉన్నతాసనము, కుర్చి 2. ద్రోణి.

మంచి కుందెన వి. (మంచి + కుందెన) వృక్ష విశేషము ఒక జాతి చిన్న చెట్టు

సీ. వెలఁగ విషముచారి వెఱ్ఱికుందెన మంచి కుందెన కలబంద గువ్వగుత్తి. హంస. 4. 10.

మంచి గంధము వి. (మంచి + గంధము) శ్రీచందనము (వృ.వి.). సానమీఁద తీసిన చందనము.

సీ మంచితావులు గ్రమ్ము మంచి గంధమ్మున నటకలి యుడియెఁ దొయ్యలి యొకర్తు, యయా. 4. 88.

మంచి గందవొడి—శ్రీచందన చూర్ణము, మంచి గంధపు గుండ.

వ తట్టు పునుంగు నగురుసక్తును మంచి గందవొడి చా దుదయ భాన్కరంబు లోనుగాఁ గల పరిమళ ద్రవ్య సంభార పరంపరలును ... కూఁతునకు నరణంబుగా నిచ్చి ... మనుచ 5 101.

మంచితనము వి. (మంచి+తనము) 1. యోగ్యత, సౌజన్యము

ఉదా అతని మంచి తనమే అతనిని గాచుచున్నది.

2 కలుపుగోలు తనము, సాముము.

గీ మంచితనమున నీతి బోధించు వాఁడ, పోలెఁ దన యుగ్ర తపమును కూలితోడి, చెలిమియును గల్మి బలిమియుఁ దెలుపఁ బంచినాఁడె మీదార నాచెంత నానలేక ఉ. రా. 2. 320.

3 గొప్పతనము.

ఉ ... నేఁడు నా, మంచితనంబునం బిలుకు మాలిన నాథుని మగ్రశత్రులన్, మంచునినుండు వోలెఁ బరిమార్చు మహాబలుఁ జూచి భార అశ్వ. 4 78.

(ఇట. పరాక్రమాతిశయమని భా )

మంచిది — మంచిదె వి. (మంచి + అది) మేలు, క్షేమము, కుశలము, శుభము.

సీ. శౌనకా సుఖమె విశ్వామిత్ర లెస్సలా కణ్వ మంచిదయె భార్గవ శుభంబె ... వాల్మీ 1 43

విశ యోగ్యము, ప్రశస్తము మొ.

ఉదా. ఆమె మిక్కిలి మంచిది, ఈ పండు మంచిది. నీవు చేసికొనిన సంకల్పము మంచిది

అవ్య వల్లె, సరియే. (క.) అంగీకారమును దెల్పును.

కం మంచిది యటువలెఁ జేసెద, నం చానతి యిచ్చె దేని యది వినిపింతున్ దశా 3. 32. (చూ 3 31.)

కం. అని ప్రార్థించిన మంచిది, యని రాజకుమార కునకు సాంగంబుగ న, మ్మునిశేఖరుఁ డుపదేశం, బొనరించె సమస్త విద్య లుద్యత్ప్రీతిన్ కవిరా. 2 229

(చ) బెదిరికను (భయపెట్టుటను) దెల్పును.

సీ. ఎందాఁకఁ గొంచుఁ బోయెదవు మంచిది పొమ్ము నిను ద్రావనిత్తుమే యనెడివారు. దశా. 2. 292.

మంచిదె(దే) — మంచిది. అవ్య (మంచిది + ఎ) వల్లె, సరియె, అంగీకారార్థకము.

ఆ. మంచిదె యన వల్లె యంచనంగను నివి, రెండు సమము లగుచునుండు ... ఆం. భా. 3. 75

సీ మంత్రుల కెఱిఁగింప మంచిదే యనుటగా కెవ్వరుఁ దెల్ప రదేమొ కాని. దశా. 2. 97.

మంచినీళ్లు వి. బ (మంచి + నీళ్లు) పానయోగ్యమగు జలము (శ. ర.).

మంచిమాట వి (మంచి+మాట) 1. సుభాషితము, ప్రియభాషణము.

ఉదా. పెద్దలతో సంభాషించునప్పుడు నోటి నుండి మంచి మాటలను రానియ్య వలెను. గాని చెడ్డమాటలు రానీయఁ గూడదు.

అతనిలో నాలుగు మంచిమాట లాడి వాఁడు తన కార్యము నెఱవేర్చు కొన్నాఁడు

2 స్నేహము, పొత్తు, సంధి

ఆ మోము చందమామతో మంచి మాటకుఁ, దమ్ము లనుప నేకతమున కున్న తాయ బారి తామర లనంగఁ జెవిచెంత, నల్లఁ జేరి కన్ను లమరెఁ జెలికి. కకు 3. 72.

వ్యవ ఏలాగుననో నీవు వానితో మంచి మాట చేసి కొనుము

మంచిమాటచేసికొను — భోజనము చేయు

వ్యవ. మంచిమాట చేసికొని మఱియూరికి వెళ్లు.

మంచిముత్తెము వి. (√మంచి) అకృత్రిమ మౌక్తికము (శ. ర ).

మంచి(చె)య వి. (సం. మంచః. క. మంచికె) జొన్నచేలు మున్నగునవి కాచుట కొఱకుఁ గూర్చుండుటకై యెత్తుగా వేయుచేప్పరము, అరప

సీ. రథముపైఁ గనుపించుం తిదేవి యన జొన్నచేను గాచుటకు మంచియ వసించు ... శుక. 2. 410.

సీ అతను సారథ్య కృద్రతిరేఖ మంచెపై నడిలించు రొదఁ జిల్కపదువు పర్వ ...అము. 4.163.

మంచివాఁడు. విశ. (√మంచి) సజ్జనుఁడు.

సీ ... మంచివాఁడు ననువు మంచిసాదు. వన. సజ్జనుం డొప్పు ... ఆం. భా. 2. 170.

మంచి విరులు వి. బ. (√మంచి) ధాన్యవిశేషము. ఒక జాతి వడ్లు.

వ సుఖభోగులు సన్నసూదులు గోరవంక రాజ నాలు కాటుక రేకులు ముంగురు మొటికలు వసుపుముద్దలు మంచివిరులు రంభచెక్కుల్లు. ప్రబంధ 112

మంచు[1] వి (క మంజు త మంజు) 1. హిమము, తుహినము (దీని భేదములు. గడ్డమంచు, నీటి మంచు, పొగమంచు)

సీ తో యజదళముల తుది మంచు దొరఁగెడు గతిఁ గన్నుఁగవ నశ్రుకణము లురుల ... భార విరా 2 138

సీ మంచుటప్పల మించు మండెంగమడుపులు పొరలి తెట్టువ గట్టునురువు లయ్యె .. నైష 6 124.

2 ఊష్మము, ఆవిరి. లలాటస్రవద్ఘర్మతోయము

దండకము .. దంష్ట్రిస్ఫులింగంబులం జుయ్యి చుయ్యంచు మంచుఁబొగ లుప్పట్టఁగా ... దశా 4. 232

3 శీతకాలము, శిశిరఋతువు

చం చెట్లు వట్టి మనుప్రాంతదళమ్ములతోడఁ దోలె నా, మనిదొర మంచు రాజు మడిమంచగఁ గోయిల గంట మ్రోఁయగన్ మనుచ 6 26.

గీ. తద్రతికిఁ గాఁగఁ బలికాలఁ దన్ని మంచు, పాండురాంగుండు విడిచి పో బ్రదికి మరుఁడు ... ఆము 5 141.

జ. మంచుఁగొండ, మంచుక, మంచుకారు, మంచు గుబ్బలి, మంచుగోను, మంచుకోదు, మంచుతటి, మంచువేల్పు, మంచైపోవు

మంచు[2]— మనుచు మన్చు, స. క్రి. (√మను) మనఁ జేయు. 1. అన్నవస్త్రాదు లిచ్చి పోషించు

ఉ. మంచి తనేకయాగముల మానుగ దక్షిణ లిచ్చి విప్రులన్ ... భార ఆది 2 202.

2 రక్షించు, కాపాడు.

గీ. అంచు నను మంచు వేడుక నాన తిచ్చి ... దశా. 1. 175

3. ప్రోదిచేయు, పెంచు.

చం అలఘుమరందవర్ష మహిమాతిశయమ్మున సప్తలాద్యమం, దలతల మంచుపొన్నగమి దా ర్కొను పందిరిక్రింద వేదికం, దలతల మంచు మించు సుమనవ్యరజంబులఁ దాల్చి తారలం, దలతలమంచు నొప్పెడు కనత్కలికాతతి ముగ్గు వెట్టుచున్. చంద్రి. 4. 80

4. మన్నించు, గౌరవించు

చం. ఇతనికిఁ గూర్తు దేని ధన మిత్తు రభీష్టములైన కార్యముల్, మతి నొనరింతు రిష్టుఁడని మఁతురు గాక మహాత్ములైన భూ, పతుఁయు విప్ర ముఖ్యుల సభన్ . భార సభా 2. 10.

మంచుఁగొండ. వి (మంచు[1] + కొండ) హిమగిరి, హిమవత్పర్వతము.

శా మంచుంగొండ యనుంగుఁ బెండ్లికొడుకున్మ ధ్యాహ్న కాలంబు సేవించున్ ... హర 7 33

కం ..మంచుం గొండసుతం బూజసేయఁ గోర్కులు నిండున్. ... భీమ 6. 73

మ .. ఇమ్మంచుఁగొం, డకు రాఁ జెల్లునె బుద్ధి జాడ్యజనితోన్మాదు ల్గదా శ్రోత్రియుల్ మనుచ. 2 16

ఇట్లే మంచుగట్టు, మంచుగుబ్బలి, మంచుమల మొ.

గీ కనకకశిపుండు ధీరుండు గనుకఁ గడఁగి, తపము సేయంగఁ దొడఁగె నాతపము సేతు, మంచు నెంచక గలదని మంచుగట్టు, దారి తారితకుధర మదారిభీ దుర. దశా. 4. 24

గీ. మంచు గుబ్బలిరాజుకుమారిఁ గూడి, వేలుపుల పెద్ద జముదెస వెండికొండఁ, దన్నుఁ దెలిసినవారికి వన్ని దెసలఁ, దాన యగురీతి బహువేషధారి యగుచు కాశ. 1 101.

మంచుఁగొండచూలి — పార్వతీదేవి.

ఆ. గొడుగు వట్టి వటువు కుఱ్ఱఁడై చనియెను, కూలి మంచుకొండ చూలికడకు ... వీర. 2. 249.

మంచుమలపట్టి—పార్వతి.

సీ. చెలికత్తె యగు మంచుమలపట్టి పోరామి గీలు కొల్పిన రాయగేస్తురాలు ... ప్రబంధ. 2.

మంచేక వి. (మంచు¹+ఉక - స్వార్థమున)

ఉ. మాలి శరంబు లొక్క-మొగి మంచుక గప్పిన మాడ్కిఁ గప్పుడున్, గూలఁగనేసెవాని రథ ఘోట ములన్ హరి ... నిర్వ. 3. 26.

మంచేకారు వి. (మంచు¹ + కారు¹) హేమంత ఋతువు

సీ మంచుకా రవఁగ హేమంతర్తు వగు ... ఆం. భా. 1 86

మంచేగొను అ. క్రి. (మంచు¹ + కొను) మంచు కప్పినది యగు.

చం. వనజము లెల్ల మంచుగొని వాడినచో నొక పువ్వు నిల్చినం ... కు. సం 6, 785.

మంచే(చుం)జోదు వి (మంచు¹ + జోదు) చంద్రుఁడు.

మ. శుకమా పల్కు- కళంకు గన్పడనిమంచుం జోదు నందంబె నె, మ్మొకమా ... ఉ. హరిశ్చ 2. 44.

మంచేతటి వి (మంచు¹+తటి) హేమంత ఋతువు (శ. ర ).

మంచేవేల్పు వి. (మంచు¹+వేల్పు) హిమకరుఁడు, చంద్రుఁడు.

గీ ముంచె మంచుల మించుల మంచువేల్పు, కలిసె విశ్వతాశ్వతులను రాత్రుసచయంబు. శ్రీరం. మా 4. 97.

మంచై (చేయి)పోవు అ. క్రి (మంచు¹ + ఐ + పోవు) మంచువలె విరిసిపోవు, తొలఁగి పోవు.

శా. గాయత్రీజప మాచరింప శుభ సాకల్యంబు సిద్ధించు వా, క్కాయాది ప్రభవోగ్రపాప మడఁగుం గైవల్యమున్ వచ్చు దీ, ర్ఘాయుష్యంబు లభించు రోగములు మంచై పోవు నే మంత్రముల్, గాయత్రీ పరనాయకాంశసమముల్ గా లేవు ధీరోత్తమా. జాహ్నవి. 3. 59.

ద్వి. పండితారాధ్యులఁ బ్రస్తుతించినను, మండెడి దావాగ్ని మంచయిపోవు పండితా దీక్షా 2 పా. 2 పం

మంజరము సం. వి. అ న. 1 పుష్పగుచ్ఛము, పూలగుత్తి. 2. మౌక్తికము, ముత్తెము. 3 తిలక వృక్షము.

మంజరి సం. వి, ఇ ఈ. స్త్రీ. 1. పల్లవాంకురము, లేత చిగురు, వేపరెమ్మ, 2. పూలగుత్తి. 3 మౌక్తికము, ముత్తెము 4. లత, తీఁగె. 5. తులసి (వృ.వి.).6 తిలకలత 7. (ఛంద )ఒకానొక వృత్తము. 8. తెల్లగగ్గెర (వృ.వి )(వై ని.)

మంజరిక సం. వి. అ. స్త్రీ. ఒకజాతి పరిమళించు తులసి (వృ వి )

మంజరీనమ్రము. సం. వి. అ పుం. వేతసము, నీటి ప్రబ్బలి (వృ. వి.)

మంజిలి వి (కం. మాజళ త మంజళ్.) 1. పసుపు, హరిద్ర.

వ. అపరంజి నక్కు-లవలె రంజిల్లు మంజిలికాపు రూపుచెక్కు-లు .. ప్రబం. 78

2 ఎఱ్ఱనిమన్ను, తిరుచూర్ణము

ద్వి అరచందురునికి వింతైన నెన్నొసల, సన్నపు రేఖ మంజలికాపుతోడఁ, దిన్నని తెలిగిరు తిరునామ మమరఁ ... ద్వి. పరమ. 3. 192 పా. 13 పం.

మంజెన — మందస (సం మంజూషా, ప్రా. మంజూసా.) మందసము, పెట్టె

ఆ. సూతుఁ డరుగుదెంచి చూచి రత్న, పుంజభరిత మైన మంజసలో నున్న, కొడుకు దానితోన కొనుచు వచ్చి. భార. ఆది. 5, 31, 30

మంజాడి (టి) వి. (క మంజాడి. త. మంజాటి.) బంగారము రత్నములు మున్నగు వానిని దూఁచుట. కుపయోగించు నెఱ్ఱగింజలు గల గురువెందచెట్టు. వజ్రప్రమాణ విశేషము, వజ్రముల యెత్తు (బ్రౌ.). వజ్రముల తూనిక (శ. ర.).

సీ. పొలుచును వజ్రంబు మూలరా లవ ... మంజాడి నాఁదత్ప్రమాణమొసప్పు... ఆం. భా. 2. 278.

మంజి సం. వి. ఇ. ఈ స్త్రీ. 1, పూలగుత్తి (త్రి ని.) 2. అఁడు మేక (వై.ని.).

మంజిక నం వి ఆ స్త్రీ. వేశ్య, లంజె.

మంజిటి వి మంజిష్ఠ (వ్య. వి) (శ. ర.).

మంజిడి. వి (సం మాంజిష్ఠమ్, బ. మంజిడులు, మంజిళులు, మంజిళ్లు )

1. మాంజిష్ఠవర్ణము, ఎఱుపుమించిన పసుపు వన్నె.

గీ. మడతపసిమిడిగింబెముల్ మంజిడిజిగి, దోమ తెరమంచేములు హసంతులుజవాది, యగలుసిరులు చిన్నెలు గాఁగ నతఁడు గడపెఁ, జలి నెలలు తద్వ ధూకుచశరణుఁ డగుచు. కళా. 7 181.

గీ . . అంబరంబు, తనకు దిక్పద్మనయన లెత్తిన మెఱుంగు, లడరు మంజిడివన్నె యుల్లడ యనంగఁ, దనర నొయ్యనఁ గుండినమునకుఁ జనియె. చంద్ర. 5. 20.

సీ. నడిముక్కు మీఁద సన్నపు నాభినామంబు నడుమ మంజిడి కాలి నిడుదరేక,

గీ పూని నిక్కంపు దాసరిసానివోలె, విప్రనారాయణారామవీథిఁ జొచ్చె. వై జ. 2 54.

2. చిత్రవర్ణవస్త్రము, వివిధవర్ణములు గల బట్ట (ఈశ్వరుని వర్ణనము)

సీ. బలుమంచుఁగంబాల బలిసి రాఁ జుట్టిన క్రొత్త మంజిడిశాగుఁ గొఅఁత నేసి ...

గీ. తొడలఁ బొడలతోలు ... ఉ. హరి. 2. 171.

సీ. మక్కళించిన శావు మంజిళ్ల పెందెర ఉంగరంబులు బట్టి యొత్తువారు. వై ష. 6. 108.

(మంజిళ్లు—చిత్రవస్త్రముల — అని వ్యాఖ్య..)

గీ. జిలుగు వన్నెలు మంజిళ్లు చిలుకచాలు, మొదలు గాఁగను జదివించి రదము వేచి, యనుఁగు లగు నేల ఱేండ్లు యయాతి కపుడు. యయా. 4. 120.

3. ఎఱుపు మించిన పసుపువన్నె గల వస్త్రము, మాంజిష్ఠము.

సీ ... మాంజిష్ఠము మెసఁగును మంజిడి యన ... అం. భా. 2. 154.

4 నీలవర్ణవస్త్రము.

సీ వృష్టిగా శుద్ధాంబువేణి మజ్జన మార్చి శిఖరి మేఘముగ మంజిడి ఘటించి ... పాండు 2 109.

విశే. 1. చిత్రవర్ణము గలది

కం. అచ్చట నచ్చట నిడుపుగ, విచ్చినఁ గును మాత్రు శాత్రు వేదుల మనముల్, మెచ్చించుఁ దెరలమం జిడి, పచ్చడములు చతురశీతి బంధఁబుల తోన్ వై ష. 7 155.

2. ఎఱుపు మించిన పసుపువన్నె గలది

సీ. మంజిడి మొకమాలు మాధావళంబులు ములుక పూవన్నెలు ముత్తెనరులు ధనా. 3 88

మంజి (జీ) ఫల నం. వి ఆ స్త్రీ కదళి, అరఁటి చెట్టు (త్రి. ని.)

మంజిమ నం. వి. న్ పుం. మనోజ్ఞత, అందము.

మంజిష్ఠ నం వి. ఆ. స్త్రీ మంజిడి, వికస (వ్య. వి ).

మంజిష్ఠామేహము నం. వి. అ పుం మూత్రరోగ భేదము.

మంజిష్ఠారాగము నం వి అ పుం 1. మంజిష్ఠాలత నుండి తీయునెఱ్ఱనిరంగు (ఇది మిక్కిలి కాంతి మంతముగ నుండును. ఈ రంగువేసిన బట్టలు వెలిసిపోవు.).

2. మంజిష్ఠావర్ణమువలె స్థిరముగాను స్ఫుటముగాను నుండు పూర్వానురాగభేదము. శ్రవణ దర్శనములవలన నాయికానాయకుల హృదయములలో జనించి కలయికకుఁ బూర్వమందు వారి కనుభూత మగు దశావిశేషము పూర్వానురాగ మనఁబడును. (ఇది నీలీరాగము, కుసుంభరాగము, మంజిష్ఠారాగము. అని త్రివిధము. చూ. కుసుంభ రాగము).

మంజీరము నం. వి. అ. పుం. న. 1 నూపురము, అందె 2. దధిమథనదండబంధస్తంభము, చేల్లరాడు.

మంజుగమన నం. వి. ఆ. స్త్రీ. 1. హంసి, అంచె (రా. ని.).

మంజుఘోష నం. వి ఆ స్త్రీ. శ్రావ్యమైన ధ్వనిగలది. ఒకానొక యప్సరస.

మంజునాళి నం వి. ఈ. స్త్రీ 1. సుందరి యగుస్త్రీ. 2 దుర్గాదేవి. 3. ఇంద్రభార్యయగు శచీదేవి. (విలియమ్స్).

మంజుపాఠకుఁడు నం. విశ. (అ. లిశా. అ.) స్తోత్ర పాఠకుఁడు

వి అ పుం శుకము (రా. ని.).

మంజుప్రాణుఁడు నం. వి. అ పుం బ్రహ్మ.

మంజుభాషి నం. విశ. (న్. జీ. న్) శ్రావ్యముగా మాటాడువాఁడు..

మంజుభాషిణి నం వి. ఈ. స్త్రీ. (ఛంద.) వృత్త భేదము.

మంజుభాషిణి. ఇర వొందుచుండు సజ లిబ్బడింపఁ బల్, మరు గాప్తి ధాత్ర్యయతి మంజుభాషిణుల్ ... అప్ప 220. పొ.

మంజులము నం. విశ. (అ. ఆ అ.) మనోజ్ఞము, అందమైనది, శ్రావ్యమైనది వి అ పుం నీరుకోడి లోని యొకజాతి, దాత్యూహము

అ న. 1. పొదరిల్లు. 2. కూపము, నూయి. 3. చిత్రీకృత మగుట. 4. జలాంచలము (కే. ని.).

మంజువు నం విశ (ఉ.) మనోజ్ఞము. మనోహర మైనది అంద మైనది

మంజూష నం. వి ఆ స్త్రీ. 1 పేటిక, పెట్టె. 2. మంజిష్ఠ, చిరువేరు వంటి చాయ వేరు. 3. శిల, రాయి. 4. పురము (వై . ని.).

మంట వి (√మండు) 1. జ్వాల, వహ్నిశిఖ,

ఉ. మంటయుఁబోని శాత్రవసమాజము నించుక యేని శంక లేకంటఁగఁ దాఁకి ... భార విరా. 3. 228.

చ. .. శార్ఙ్గితోఁ, బెనఁగుట మంటలో మిడుత శీరము నూవుట గాదె దుర్మతీ. ఉ. హరి. 3. 14.

చ. తోడఁబడఁ జాటి పై కుటిరి ధూర్జటి కంటి కడిందిమంటలో, నదపొడ గానరాక తెగటాఱియు ...మనుచ. 3. 46.

2 ఈర్ష్యాదులచే తాపరూపముగా కలుగు చిత్త వికారము, ద్వేషము.

గీ పావకుండును గపటంపు భూవరుండుఁ, దమ్ముఁ గడుఁ జేరి మందెమేలమ్ము తోడ, నున్న వారికిఁ గీడు సేయుదురు వార, కంచిత స్నేహమున మంట లధికమగును వి. పు. 7. 105

పావకపక్షమున 'చేమురుచే జ్వాల లెక్కువగును' అని అర్థము కోపము అని శ ర.

3. కినుక, కోపము

సీ. తీర్థయాత్రా పరాధీనులఁ గనుఁగొన్న మఱి యెన్నఁడును లేనిమంట పుట్టు...నిరం. 2. 25

ద్వి. ఈచేన లిచ్చిన నినకులాధీశ, మాచిత్తమున నున్నమంట చల్లారు. ద్వి. హరిశ్చ. పూ. 1320 పం.

4. కాలుటవలనఁ గలుగు చుఱుక్కుమను నొప్పి, అట్టిబాధ.

(వ్యవ) 1. కుఱుపు మంట యెత్తుచున్నది 2 ఆ పిల్లకు ఒళ్లు కాలి మంట లెత్తుచున్నవి 3. దురాత్ముని జూచిన నా కొళ్లు మంట.

మంటఁగలియు. అ క్రి. (మంటన్ + కలియు) దగ్ధ మగు, చెడు, నశించు

సీ. అగ్రహారములు నామావశిష్టము లయ్యె మాన్యంబు లన్నియు మంటఁగలిసె... రామలిం. 89.

మంటఁ(లఁ)గలుపు న క్రి (√మంట గలియు) దగ్ధముచేయు, నశింపఁజేయు, చెఱుచు.

సీ. మంటలఁగలుపుదు మన్మథుశరములు వేగ వచ్చేటి కేఁగి విభుని దెస్తు కలు. శ 56.

మంటకము నం వి. అ పుం భక్ష్యవిశేషము, మండెగ (శ. ర ).

మంటచేమురు వి. (మంట + చమురు) ఎఱ్ఱగాఁ గాలిన గరిటెలోఁ బోయఁగా మండెడు చేమురు (శ.ర.). ఇప్లే , మంటనేయి మొ.

మంటపము వి (నం. మంటపః క. మండప.) 1. దేవతావిగ్రహము లుంచుటకై చుట్టును బయలుగ నుండునట్లు స్తంభములమీఁదఁ గట్టిన కట్టడము. చవికె

గీ. మంటపం బన మండపాహ్వాయ మగు భవ.
ఆం. భా. 2. 16.

2. వ్రతాదిశుభకర్మలందు క్రొత్తబట్ట పఱచి బియ్యము పోసి నవగ్రహాదిదేవతల నారాధించు పట్టు

(వ్యవ.) ఆతఁడు సత్యవర్తి వ్రతమునకు మంటపములు పోసినారు.

3. చావడి, సభాభవనము.

(కొందఱు కవులు దీనిని సంస్కృతపదముగా వాడియున్నారు.)

సీ. చివురాకుదిండ్లపల్లవ మంట సెసఁగు పల్లవ మంటపమున నిల్వంగ నునిచి . ఛందో 4. 191.

**మంటపి** సం. వి. ఈ. స్త్రీ. క్షుద్రోపోదకి, చిన్నమట్టు బచ్చలి (వాచ.).

**మంటమారి** విశే. (మంట+మారి) 1. జ్వలనశీలుఁడు, మండెడుస్వభావముగలవాఁడు.

మ. రవిఁ దీవ్రద్యుతి యంద్రు పావకుని నేఱామంటమా రంద్రు వా, రివిధంబుల్ పెనువంజు క్రిందిదివియల్ రేరాజనిన్నెన్నుచో. చంద్రా 5 73.
('నౌరా మంటమారంద్రు' వ్రాఁతముద్రిత ప్రతి పా )

2 కోపస్వభావము కలవాఁడు

ఉ. ... ఎన్నిచెప్పినం, జెప్పుము కమ్మక్రొవ్విరుల సెజ్జపయిన్ నినుఁగూడి యుండలే, నప్పుడె మంటమారి కుసుమాస్త్రుఁడు నన్ బ్రదుకంగనిచ్చునే వి పు. 2 229.

గీ అనుచు వనవింటిపెనుదంట జాడరాని, గెంటసము లాడి మఱియు నమ్మంటమారిఁ, గలయ నెక్కించుకొని వచ్చుమలయనగభు, జంగ విషదిగ్ధ పవనుపైఁ జిలము వొడమ. వసు. 4 44

**మంటమారితనము** వి. (√మంటమారి) కాల్చివేయు స్వభావము, కోపము.

ద్వి. ...నీకంటె, మంట నెందఱి మున్న మడియించినావొ. మంటమారితనంబు మౌనికిం దగునె. ప్రభు. 3. 86 పా. 11 పం.

సీ మంటమారితనంబు మౌనికిఁ దగ వౌనె యుర్విలో నీవంటియోగి కలఁడె ప్రభు. 3. 40 పా. 27 పం.

**మంటిగూండ్లు** వి. బ. (మన్ను[1]+గుళ్లు) బాల క్రీడా విశేషము.

సీ. గచ్చకాయలు కిట్టుగానుఁగ త్రిప్పుళ్లు గుజ్జిపెక్కుడు మంటిగూండ్లు ... హంస. 3 146

**మంటితిండి** వి (మన్ను[1]+తిండి) తేలు, వృశ్చికము.

గీ. .. ములుపుర్వు మంటితిండి, తే లనఁగ వృశ్చికంబు వర్తిల్లు. ... సాం. ని నానా. 83.

**మంటినూనె** వి. (మన్ను[1]+నూనె) మృత్తికనుండి తీసెడు ఒక విధమైన చేమురు (శ. ర. మట్టినూనె అని వాడుక.)

**మంతము** సం. వి అ. పుం. వండిన తీయని భక్ష్య విశేషము, పక్వముచేసిన భక్ష్యవిశేషము (రా.ని.).

**మండ** వి 1. విరివిగానుండు కమ్మ, వితతశాఖ.

గీ ... మండ యనంగను వితతశాఖ, పరగును ...
ఆం. భా. 2. 36

...తనకు నసము వెరుగ వెణ్ణిమణ్డతో నఖణ్డతతద్యుతిదీప మమర నిచ్చె విమలకమల నేత్రి.
దా. శా. 1087.

(వెండిమండ — వెండితోఁ జేసిన పెద్దకొమ్మ.) శాఖ అని(శ. ర ).

2. శాఖనుండి బయలుదేఱుశాఖ, ఉపశాఖ.

వ. ... తమతమకట్టిన మోటుకత్తులనొండొండ ఖండితంబు లగు మండగల కంపమండలు ద్రోచి...
మనుచ. 4 37

**మండ[2]** వి. (√మండు) 1. తప్తలోహము.

సీ. మనుఁదప్తలోహాఖ్యమండనంగ ... ఆం భా. 2 275.

2. వేఁపుడుచెట్టు (బ్రౌ.). 3. వేఁపుడుకుమ్ము (శ. ర.).

**మండ[3]** వి. 1. చీలమండ, గుల్ఫము. (శ. ర.) 2. మణిబంధము, మనికట్టు.

(వ్యవ.) 1. వాఁడు మండ మునుగ మజ్జిగ పోసి

కొనును. 2. నా వస్తువులు తాఁకిన మండలు విఱుగఁగొట్టెదను

జ , మండవాయి, మండాటము, మండాడు.

మండ నం వి ఆ. స్త్రీ. 1. సారాయి, సుర, 2. ఆమలకి, ఉసిరికచెట్టు (మే. ని )

మండకంచెము వి. (మండ$^{2}$+కంచము)
అంచుకట్టిన కంచము. (శ. ర , బ్రౌ.). అంచులేని కంచము. ఆకుకంచము. (వా.)

మండకము సం. వి అ. పుం. 1. పిష్టభేదము, ఒకరకపు వేఁచినపిండి, మండిగె.
2. పలుచనిరొట్టె లేక భక్ష్యము. 3. (సంగీ) గీతాంగ విశేషము. 4. మాధవీలత (కల్ప ).

మండనము సం విశే (అ అ. అ ) అలంకరించునది
వి. అ. న. 1 అలంకరించుట 2. అలంకారము

మండపకము నం. వి. అ పుం. 1. చిన్నమండపము, చిన్నశాల. 2. చిన్నగుడారము, చిన్నడేరా

మండపప్పు వి. (మండ$^{2}$+పప్పు.) వేఁపుడు పప్పు. సీ. లడ్డువంబులు చక్కిలాలు మోరుండలు ఖండంబు చలిమిడి మండపప్పు. గీ. లు ... హర 6. 55.

మండపము నం. వి. అ. పుం. న. 1. వివాహాది కార్యములయందుఁ దాత్కాలికోపయోగమునకై వేయఁబడిన గోడలులేని చావడి, చవికె (వివాహమండపము మొ.).
2. గుడారము, డేరా. 3. పొదరిల్లు (లతామండపము.). 4. దేవతా విగ్రహము లుంచుటకై చుట్టును బెఱపిగ నుండునట్లు స్తంభములమీదఁ గట్టిన కట్టడము.

మండపి నం. వి. ఈ. స్త్రీ చిన్నమండపము.
గీ. గర్భమండపిఁ కడిగిన కలఁకజలము ... ఆము. 6. 8.

మండపీఠిక నం. వి అ. స్త్రీ. దిగ్వ్యగ్రము, రెండు దిక్కుల నముదాయము (వై. ని.).

మండ (డా) ము వి. (శ మండా.) చేఁపలను లను బొడుచు చిల్లకోల (శ. ర.).

మండము నం. వి అ. పుం. న 1. ద్రవపదార్థముల పైఁ దేలిన మసటు, నేయి మొదలగుదాని పైఁ దేలిన తెట్టె, 2 గంజి, 3 పెరుగుమీఁది మీఁగడ. 4. పంచమాష పరిమితోర్ధ్వమానము
పుం 1. అలంకారము. భూష. 2. కప్ప (కల్ప.). 3 ఆముదపుఁజెట్టు 4. ఆమలకి, ఉసిరిక (వ్య. వి.) (మే. ని.). 5 రశ్మి. కిరణము (కే. ని ).

మండయంతము నం వి (అ పుం ) అలంకారము, నగ.
2. ఆహారము, భోజనము (కల్ప.). 3 (స్త్రీ.) సమాజము (కల్ప )

మండయంతి నం వి ఈ స్త్రీ. ఆఁడుది. స్త్రీ.

మండయంతుఁడు నం. విశే. (అ. ఈ. అ )
1 నాటక మాడువాఁడు, నటుఁడు 2 విత్తపాలుఁడు, ధనమును రక్షించువాఁడు.
అ పుం. 1 అద్దము. 2 అన్నము.

మండలకము నం వి. అ. న. 1. వలయము. 2. బింబము. 3. జిల్లా, దేశభాగము. 4. సమూహము, గుంపు 5. వలయాకారమగు వ్యూహము, గుండ్రముగా సైనికుల నేర్పఱుచుట. 6. గుండ్రనిమచ్చలు గల తెల్ల కుష్ఠము 7. అద్దము. పుం. కుక్క

మండలపత్త్రిక నం. వి. అ. స్త్రీ రక్తపునర్నవ, ఎఱ్ఱగలిజేరు (వ్య. వి.) (రా. ని.).

మండలపుచ్ఛకము నం. వి. అ పుం కీటవిశేషము

మండలము నం. వి. అ. న 1. పరివేషము 2. దేశము. 3. కుష్ఠము 4 విలుకాఁడు రెండు కాళ్లతో మండలాకారముగా నిల్చుట. 5 పన్నిద్దఱురాజులు. పుం. 1. సమూహము 2. వలయాకారముగా దీర్చిన యొక వ్యూహము. 3. కుక్క. పుం. స్త్రీ న సూర్యచంద్రాదుల బింబము (శ ర.).

మండలాగ్రము నం విశే (అ. ఆ. అ.) గుండ్రని తుదగలది.
వి. అ పుం ఖడ్గము, కత్తి.

మండలి నం విశే (న్ నీ. న్.) 1. వలయాకారముగా నేర్పడినది; చుట్టగాఁ జుట్టఁబడినది. 2. ఒక దేశమును నేలునది.

వి. న్ పుం. 1. సర్పవిశేషము, గోనసము. 2 సర్పము. 3 పిల్లి. 4. మంచము 5. కుక్క. 6. సూర్యుఁడు. 7. మఱ్ఱిచెట్టు, వటవృక్షము. 8. జిల్లాయొక్క లేక దేశభాగముయొక్క పాలకుఁడు, ఏలిక

ఈ స్త్రీ. 1. దూర్వ, గఱిక (వృ. వి). 2 సమూహము. 3. బింబము. 4. సర్పభేదము. 5. ఆవలి వరుస (కే. ని.).

మండలికుఁడు సం. వి అ. పుం. మండలము (దేశములోని కొంతభాగము)నకు అధిపతి (చూ కౌముదీ 5. 2. 115. సూత్రము మత్వర్థీయములో.)

సీ ద్రవిడమండలికు లందఱ దక్క గెలిచి... దశ. కు. 1. 16.

(దక్క నేలె. అని వావిళ్లప్రతి. ఆ ని., విలియమ్సులు "మాండలికః" అను రూపమే గ్రహించినారు ఇట "మాండలికు లందఱ" అన్నను ఛందోభంగము కాదు. ఐనను రెండు ముద్రితప్రతులందును పదము హ్రస్వాదిగానే యున్నది)

మండలితము సం. విశే. (అ ఆ. అ.) వలయాకారముగాఁ జేయఁబడినది. గుండ్రముగా జేయఁబడినది.

మండలేశ్వరుఁడు సం. వి. అ. పుం, అధీశ్వరసార్వభౌములకంటె నితరుఁడైన రాజు (శ. ర.).

మండవాయి వి, (మండ[3]+వాయి.) గుల్ఫవాయువను రోగవిశేషము, చీలమండలయందు గలుగు వాతరోగము.

గీ మండవాయి యన గుల్ఫమారుత మగు.. ఆం. భా. 2. 125

మండహారకుఁడు సం వి. అ. పుం కల్లు అమ్మువాఁడు. శౌండికుఁడు.

మండాటము వి (√మండాడు. త. మణ్ణాట్టం.) బతిమాలుట, దైన్యముతో యాచించుట

వ. అమృతంబుపై నాశ మరలం ద్రిప్పుచు బెబ్బులులరితి రొప్పుచు నొండొరులం దెప్పుచు నింక మండాటంబులు బండాటంబులు వృథా కొండాటంబులు మాని శౌర్యంబులు పూని...ల. వి.2 76.

మండాడు స. క్రి. (మండ[3]+ఆడు. త మణ్ణాడు.) అర్థించు కోరు.

(క) దైన్యముతో యాచించు. బతిమాలు.

క మగనియెడ రోసి తమి నమ్మగువయె నను వలచి వచ్చి మండాడినచోఁ, దగులువడితి. కళాం. 4. 183. (బ్రౌ పా.)

(చ) అతి ప్రార్థనలచేఁ బీడించు

క దండక మను కానకుఁ జని, యుండఁగ రావణుని చెలియ లొగిఁ గలయికకై, దండకు రా లక్ష్మణుఁ డది, మండాడఁగ ముక్కుసెవుల మనుకువ మాన్చెన్. యయా. 3 16

మండి(డీ)వి (స. మండికీ. త. మండి) 1 యుద్ధసమయములయందు యోధులు నిలుచుండు విధములలో నొకటి.

("ఒకకాలు నేల మోఁకరించుట" (శ. ర 'ఆలీఢపాదము' బ్రౌ.)

2. మల్లబంధవిశేషము

వ. మండి దాఁకించియు.. ఉ. హరి. 3. 70.

3. మల్లవిద్యావిశేషము, ఒకవిధమైనసాము.

సీ. కన్నాతలు పుటము ల్గస్తాలు మండీలు దాశాలు డికీలు దంటెములును, లాఁగు లనంగము రాజిల్లుఁ దద్భేద, నామధేయంబు లెన్నంగఁ గొన్ని ... ఆం. భా 2. 207.

జః మండిగాలు, మండివెట్టు

మండి సం. వి. ఈ. స్త్రీ. — మంటిక

మండించు స. క్రి. (√మండు.) 1. మండునట్లుచేయు. ప్రజ్వలింపఁజేయు.

(వ్యవ.) విసనకఱ్ఱతో విసరి నిప్పు చెక్కఁగా మండింపుము.

2 కాల్చు

సీ కడుపు మండించునాఁకటిచిచ్చుసెగ దాఁకి గవర నైయున్న కన్గవలవారు ... నైష. 7 58

3 మాఁడుచు, తపింపజేయు, మిక్కిల బాధించు.

వ. ... అతికఠోర జఠరక్షుధాగ్ని తాపంబునకుఁ దోడుగఁ దపన ప్రచండ కిరణకాండ ప్రకాండంబులు నెత్తి మండింప ... భీమ. 2. 101.

మండిక సం. వి. ఆ స్త్రీ. అన్నమునుండి తీసిన కల్లు. (వై. ని.)

**మండిగంౖడలు** వి. బ. ధాన్యవిశేషము, ఒకవిధ మగు వడ్లు (శ. ర).

**మండిగము** వి. (త మండాంగి) వాకిటౖకింద నడ్డుగా నమర్చినకొయ్య, గడపౖకింది ౖతొక్కుడుకమ్మి, అట్టిశిల (శ. ర).

**మండిగాలు** వి. (√మండి) మండి యేర్పడునట్లుగా నుంచినకాలు

వ. ... గెలుపుగాయంబులఁ బడియుండియు మండిగా లిడుకొని కైదువులు జడిపించుకొనుచు రౌౖదాకారంబున నున్నవారును కువల 2 148

సీ మండిగాలిడి దంతకుంఠాౖగహతిఁ జించి జలధ రాంభముఁ గరుల్ చేల్లులాడ... మనుచ. 5. 44

**మండితము** సం విణ (అ అ అ.) అలంకరింపఁబడినది.

**మండిపడు** అ ౖకి (మండి+పడు, స్వార్థమున)

1. కాలిపోవు, ౖపజ్వలించు

క. కే లెరియ నొడలు దడివినఁ, గోలంబక మూర్పు లేశిఖుల మండిపడున్, చాళుక్య విభునిఁ జూచిన, బాలికవరితాప మెన్నఁ బని లే దింకన్, కావ్యా. 1 113.

('కోలంబము లూర్పులేశిఖుల మండిపడున్' అని ముౖది. పా.)

2. కనలు, మిక్కిలి కోపించు.

మ. మహిషుం డప్పుడు జన్యభూమిఁ దనకుఁ ౖబాపైనబల్విరు యజ్ఞహారుం జంపినఁ జూచి మండి పడి దోస్తంభంబునం ౖదిప్పి దు, స్సహభంగిన్ గద వైవ ... వరాహ 11. 107.

కం. కొసరువగమాట లలుకలుఁ, గుసిగుంపులు తిట్లు మొరంకొట్టులు జారుం, డసమసుఖంబుగఁ గైకొను, బసవె ద్దగుమగఁడు మండిపడుఁ గుసుమాంగీ. శుక. 1. 441.

వ. ... మండిపడి చండి సకలవిద్యావిచక్షణులైన భూసురాధ్యక్షుల నికానమయంబు నందక్షణియించి ...జై. భా. 4. 97.

**మండియ**[1] వి. – మంటె,

**మండియ**[2] వి (క మండి) దుకాణమునకై వేసినపాక

సీ గుళ్లు మండియలును గూడారములును బంది ళ్లును గలయ నెత్తించువారు ... కు సం. 11 600

(మండియ – చావడి. అని వ్యాఖ్య).

**మండిలూటి** వి. పైకి పొటమరింపక లోపల నణఁగి యుండు ౖవణము.

సీ మండిలూటి యనంగ మస్మౖవణం బొప్పు. అం భా 2. 130.

**మండివెట్టు** అ. ౖకి. (√మండి) 1 ఒక కాలు మోఁక టించియుండు. ఆలీఢపాదమున నుండు

వ ఇవ్విధంబున విసరి నేలతో ౖవేసి వీపున మండి వెట్టిన .. భార విరా. 2. 18.

(ఇట మోఁకాలితో నొక్కు అని తాత్పర్యము.)

2. మండిమీఁద నుండు

వ. .. బిఅబిఅ గదాదండంబులు ౖదిప్పుచు మండలౖభమణంబులఁ బరిౖభమించుచు దిట్టతనంబు నెట్టుకొన మండివెట్టుచు బెట్టుగా ౖవేయుౖవేటుల కొగ్గినటువలె నుండి ... ఉ, రా 3. 246

**మండు** అ, ౖకి (త. మండెరి) 1. ౖపజ్వలించు, ౖపకాశించు, వెలుఁగు

క. ఎండినయడవిన్ దరికొని, మండెడు కార్చిచ్చు మాడ్కి మ్మారిమసఁగిన, ట్లొండొండ నేచి హాయవే, దండస్యందన పదాతితతిఁ బొడవడచెన్. భార. భీష్మ 1. 294.

గీ. అరుగుచుండుచోఁ డొకచో దవానలంబు, గ ట్టైదిరికాననం బెల్లముట్టి మండ, సంౖపమోదిత చిత్తుఁ డై చక్కఁ జొచ్చి. భార. శాం. 3. 340.

క. తనపతిఁ జెట్టలు పలికిన, జనకుం గని కోపవహ్ని నలిదేహము భో, రన మండె భానుఁ గని తెం, పున మండెడు సూర్యకాంత పుౖతికవోలెన్. కు. సం 2. 178.

గీ. కడుపు నిండఁగఁ జన్నిచ్చి కొడుకు నిౖద, వోవ దీవియ మండఁగఁ ౖబొద్దు వోవు, నంతదాఁక మేల్కని యుండి. హరి పూ. 5. 156.

చ పిటులుపిటిల్లునం ౖబిదిలి ౖవేలి పడం దొడగెం జతుర్దిశా, తటముల మండుచుం బిడుగుతండము . .హర. 2 21.

ద్వి తోరంపు దివియఁతో మారుమండు, హార మణి శోభితాభరణముల . ద్వి. హరిశ్చ. ఉ. 2291 పం.

2 (అగ్నిస్పర్శమువలె) గాయము మొదలగునవి చుఱుక్కుమని బాధ కలిగించు

కం అని యొడఁబడఁ బల్కుచుఁ దో,డ్కొని వచ్చినఁ బాన్పుఁ జేరి గురకుచ దనపైఁ, గవకవఁ గనలెడు వెలుఁగులఁ, గనికరం మఱి మండుచంద్రుఁ గని కర మలుకన్ మనుచ 3. 35, 4. 37

(వ్యవ ) కుఱువు మండుచున్నది

3 తీక్ష్ణమగు.

(క.) వాఁడియగు

క మండెడు బలునారసమున, గుండియ వగు లంగ నేసి కూల్చితి దీనిన్ . హర. 7 54.

(చ.) (చూ. మండువేసవి ) వేఁడియగు.

4. కోపోద్దీపితుఁడగు మిక్కిలి కోపించు

గీ. రాముఁ డంత్యకాలానలోద్దామలీల, మండి నా యురస్థలి యొక్క మార్గణమున, నేసె. భార. ఉద్యో 4 327

కం ముడి పదాతులఁ గొందఱఁ, జెండాడిన నున్న వారు చెడి పాఱిరి బా, ణుం డున్న యెడకు నొడ ళుల, నిండను నెత్తురులు గ్రమ్మ నిట్టూర్పులతోన్. ఉ. హరి 5. 226

సీ కయ్యాలక్రచ్ఛయై కాలుద్రవ్వుచు సదా మండు వాఁ డతిశాంతిమహితుఁ డయ్యె ... పాండు 4. 210, దశా. 4 91

5. (ఈర్ష్యాదులచే) తపించు, బాధనొందు.

కం శిగ్గాడికాంద్రె యెప్పుడుం, దగ్గని సంపదలఁ బొదలఁ దా మది యకటా, బగ్గున మండెడు . . శుక 3. 280

6. ఉద్రేకించు, విజృంభించు, చెలరేఁగు.

చం .. దంభుఁ డొక్క నిం, గనుఁగొని యాతఁ డెవ్వఁడొకొ గర్వభరంబున మండు కై వడిన్, జెవచి జగంబులెల్ల వడి ద్రిమింగెడులాగున వాక్యలీల భ, ర్త్సన మొనరించు చందమునఁ బ్రాజ్ఞత నొప్పెడి రీతి నొప్పుచున్. ప్రబోధ 2. 4

శ్లో. జ్వలన్ని వాభిమానేన .. సం. ప్రబోధ. 2. 2

జ : మంట, మంటఁగలియు. మంటఁగలపు, మంట చముకు, మంటమారి, మండ², మండకంచము, మండపప్పు, మండించు, మండిపడు, మండుకొను, మండునెల, మండువేసవి.

**మండు(డి)కొను** అ. క్రి. (మండు+కొను — స్వార్థమున) మండు, కోపోద్దీపితుఁడగు, మిక్కిలి కోపించు. ఆ. . . నికుంభుఁ డంతఁ, జండ మైన కాల దం డంబు దాల్చిన, దండధరుఁడపోలె మండికొనుచు. భా. రా యు 1218

(మెండుకొనుచు శ ర పా )

**మండునెల** వి. (మండు + నెల) యువజనులకుఁ దాపము పుట్టించునెల, వసంతఋతువు, ఆమని.

గీ. వలపుఁదూపులు కఁసాన వాఁడిసేసి, మండు నెలతోడఁ దనమేనమామయైన, నిండునెలతోడ వలరాజు నిర్జరేంద్రు, సభకు నేతెంచె భుజబలో త్సాహ మెసఁగ ఉ. హరి. 2. 194.

**మండువా** వి (హిం. మండ్వా ) 1. మూఁడువైపుల గోడలు కలిగి ఒకతట్టు గోడ లేకుండ(గుత్తములపై) ఎత్తుగాఁ గట్టిన కట్టడము, లాయము

మహాస్రగ్ధర ఎకరాలన్ మండువాసాహిణములఁ గలభద్రేభనందోహవాహా, ప్రకరంబుగొంచు ... మనుచ 1. 40

(మండువాసాహిణము — మండువాగాఁ గట్టఁబడిన గుఱ్ఱపుసాల.)

2 దుకాణమునకై కట్టినపాక, పాక.

చం. చదువులుచెప్పి చూచి మఱి సారెకుఁ గూలికి లెక్క వ్రాసి చూ, చదయతఁ గోలుకాఁ డగుచు నన్నిట మండువల న్నటించి చూ, చి ... హంస. 4 30

3 నాలుగిండ్ల బవంతినడుమ ఖాళీగా నుండు ప్రదేశము

(వ్యవ.) వర్షమునకు మా మండువా నిండి పోయినది

**మండువేసవి** వి (√మండు) ఎండలు మిక్కుటముగా నుండు గ్రీష్మర్తుభాగము వడి వేసఁగి.

గీ. మండుువేసవిఁ బంచాగ్ని మధ్యముననుం, గుంభ కర్ణుఁడు గావించె ఘోరతపము ... ఉ రా. 2 161.

చం. అడుగడుగంద వేఁడిసుము లంటిన నుత్ప తదంఘ్రియుగ్మలై, తడఁబడి మండువేసవిఁ బధం బుల నీఁము లేమిమై శ్రమం, బడఁగ మహోగ్ర హారములకై చనుదెంచి గృహస్థవర్యు లిం, పడ రఁగ భోజనంబు లిడ నర్థి నుతింపఁ దొడంగి రధ్వగుల్. ఇందు. 3. 103, ఆము. 2. 62.

మండూకపర్ణము సం. వి. అ. పుం. శ్యోనాకవృక్షము, దుండిగము (వృ వి)

మండూకపర్ణి సం. వి ఈ స్త్రీ మంజిడి. (వృ వి)

మండూకప్లుతి సం వి. ఇ స్త్రీ. కప్పదాఁటు, కప్ప దుముకు

(వ్యాకరణశాస్త్రమునందు ఒక పద మొక సూత్ర మునుండి మధ్యసూత్రములలోని కనువర్తింపక దూరముగా నున్నసూత్రములోని కనువర్తించి నపుడు మండూకప్లుతి యందురు).

మండూకము సం. వి. అ. పుం. 1. కప్ప. 2. పిక భేదము 3. రాజరథులచే పురబహిర్భాగమున నుంపఁబడిన యంత్రభేదము.

వి. అ న (రతియందలి) బంధవిశేషము.

విణ (అ ఆ. అ) గాఢతేజస్కము (వాచ).

మండూకానువృత్తి సం వి. ఇ. స్త్రీ (వ్యాక) కప్ప దాఁటువంటి అనువృత్తి, ఒక పదము ఒకసూత్రము నుండి మధ్యసూత్రముల విడిచి దూరముగా నున్న సూత్రములలోని కనువర్తించుట.

మండూకి సం వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుకప్ప. 2. ఏనుఁగు వెనుకకాలిమీఁది భాగము. (కే. ని.). 3 మండూకపర్ణి (వృ. వి). 4. లాంగలావయవ భేదము (కే. ని.).

మండూరము సం. వి. అ. న లోహమలము, ఇనుము యొక్క కిట్టము.

మండె-మండియ వి. అదిమి పొదువుగా పేర్చి పెట్టిన జొన్నకంకులు, పొగాకు మున్నగు వాని యొక్క ప్రోగు.

గీ. .. మండె యనఁగను రాశిభేద, మలరుచుండు. ... ఆం. భా. 2. 101

మండెఁగ వి. (సం మండకః, క మండగె, మండిగె. త మండిపై) మెత్తని గోధుమ పిండి, నేయి మున్నగువానితోఁ జేసిన యొక విధమగు పిండి వంట, భక్ష్యవిశేషము

(దీనిభేదములు - కండమండెగ, కట్టుమండెఁగ, పప్పుమండెఁగ, బెల్లమండెఁగ, 'పంచేదారవేయని గోదుమపూరీ,' అని శ. ర)

సీ. వరుస మండెఁగలు వడ్డింప జపతిత్తి మడతలో యని విప్పఁ గడఁగువారు ... చమ 3 87.

సీ చింపివల్కమము లేమి చేసెడివఁ గావు నెఱవైన కండమండెఁగలు గాని ... జై భా. 8 204.

చం. పొసఁగిన పప్పుమండెఁగలుఁ బుక్కిటి బంటిగ మెక్కి ... ద్వా. 2 172.

ద్వి. దవ్వులనైన శ్రాద్ధం బని విన్న, నవ్వాడి మున్నునే నచ్చోటికిఁ బోయి, పప్పుమండెఁగలను బాయ సాన్నంబు, లప్పాలుఁ గొసరి తృప్తాత్మగాఁ దిందు. నవ. 3. 154 పొ. 23 పం.

మ. ఇడి రమ్మౌని కుపాయనంబులు మనోభీష్టంబుగా ... బెల్లమండెఁగలు . . రా. మా 2. 115.

మండెము – మాఁడెము వి. (సం. మండలమ్.) 1. మన్నెపుప్రదేశము, దుర్గమస్థలము

గీ మన్నె మన మండె మనఁగను మాఁడె మనఁగ, దుర్గమస్థలనామ మై తోఁచుచుండు ఆం. భా. 2. 7

2. మండలాధిపతుల భూమండలము (శ. ర.).

మండోదకము సం. వి. అ. న. 1. సారాయి మీఁది పొంగు, సురామండము. 2. ఉత్సవసమయము లయందు నేల గోడలు అలంకరించుట 3. చిత్ర వర్ణము.

మంద్ర వి ఒకానొక ముండ్లచెట్టు

గీ.మాడ్పుచిటికొక్కి సీకాయ మంద్రతొట్టి, వెలఁగ వాఁకుడు ... మొదలుగా జగతిఁగల్గు, కంప లన్నియు...హంస. 4 9.

మంద్రగబ్బ వి. నల్లని పెద్దతేలు.

సీ. . మంద్ర, గబ్బనాఁ బృథువృశ్చికాఖ్య యొప్పు . ఆం.భా. 2. 88

**మంద్రాటకాఁడు** విశ (మంద్రాటము+కాఁడు.) పెనఁగులాడువాఁడు, ప్రతిస్పర్థి.

గీ. అమ్మహాత్ముండు సకలలోకైక వినుతుఁ, డార్వ శేయునితోడి మంద్రాటకాఁడు, నిష్ఠతోడుత నాశ్చర్యనియమవృత్తిఁ, దపమునకు నుండె నంబికా ధవునిగూర్చి. పి శకుం 2 110.

**మంద్రాటము** వి (√ మంద్రాడు) 1 పెనఁగులాట, మల్లాట

ద్వి మంద్రాటముగ నిట్టిమాంసంబు మెసవి, గాంద్ర పెట్టెడు పెద్దగండుమెకాలు. ద్వి. శ సా 2 669 పం.

2. శ్రమము, బాధ

శా పంద్రెండేఁడులు నీగతిం జెనఁగ జంభ ద్వేషి ముఖ్యామరుల్, మంద్రాటం బిది యేల చెప్పుదము కామధ్వాంసికి న్నేమముల్ ఉ. హరి. 2. 167

(సంతాపము అని శ. ర)

**మంద్రాడు** అ. క్రి 1. పెనఁగులాడు, మల్లాడు (చూ, మంద్రాటము, మంద్రాటకాఁడు.)

2 శ్రమపడు, బాధనొందు, ('సంతాపించు' అని శ. ర.)

జ. మంద్రాటకాఁడు, మంద్రాటము.

**మంత** నం వి ఋ. పుం 1. ప్రజాపతి.

విశ. (ఋ. త్రీ. ఋ .) 1 ఏష్ట, కోరువాఁడు. 2. జ్ఞాత 3. విద్వాంసుఁడు (కే ని.).

**మంతనము** వి (నం మంత్రణమ్. క. మన్తణ)

1. ఆలోచన, రహస్యాలోచన. (రాజసులు).

సీ మంతనం బుండి యమర్త్యులతోడి పొత్తింతియ చాలు నింకేల యనుచు .. భార. ఆది. 2 21.

(మంతనముండు – మంతనమందుండు.)

సీ తగవు గా దని యె మంతనముండి వృత్రారి యనుచితం బని యె హుతాశనుండు ... కాశీ. 4 215.

గీ. చేని మునులతోడఁగూడి మంతన మొనర్చి, వారుఁ దమరును జని హిమవన్నగేంద్రుఁ గాంచి... జాహ్నవీ. 1. 83.

గీ. ఒకనితో మంతినముఁ గోరు నొకనిఁ జీరు, మోహినీకాంత యసురసమ్మోహనముగ దశా. 2. 303.

2. ఏకాంతము.

(క) రహస్యప్రదేశము

గీ. ఏమి చెప్పుదు మెకిమీఁద యిప్పు డొక్క, కోతి యొందుండి యో రాచేగోఁతి జేరి, మంతనంబున నేమేమొ మాటలాడి అచ్చే రా. సు 96.

కం అంతట నది యప్పుడె చేని, మంతనమున గోడఁ జేరి మందోదరితో, నంతయును దెలిపి క్రమ్మఱి.కాఁతునికడ నుండె గుట్టుకలయఁ వో లెన్ శుక 3 276

వ కంఠగతప్రాణంబు లగుజంతువులకుం గాల కంఠుండు గరుణావశంవదుండై కర్ణోపకంఠంబు జేరి యుపదేశించు తారకబ్రహ్మమంత్రరాజంబు మంతనంబున విని యెఱుంగుటం జేసి మధుమదో ల్లాసంబున నది వెల్లి విరి సేయుచున్న వి యో యన నిందిందిరంబులు మంద్రస్వనఝుంకారంబు సేయు ... కాశీ, 2 44.

(చ) రహస్యవిషయము

కం దంతిపురనాథ వినుమొక, మంతన మెఱిఁగింతు శమదమంబులు సంహో, వంతు శుభవంతుఁ జేయవు, కంతునిగురుభక్తి ముక్తిఁ గలిగించుగతిన్. భాగ. 6. 54.

గీ. లీలఁ జేసన్న బరణిబాగాలు గులికి, యుద్దఅకుఁ బెట్టి చుట్టి యా కిచ్చి యిచ్చి, మగనిదిక్కు మొగంబుగా మంతనంబు, మాటగా నిట్టు లని యె సమ్మాయజోటి. విక్ర 8. 98.

(ట) రహస్యసంభాషణము.

ఉ. కొందఱు మంతనంబులను గొందఱు జంకెన వాఁడిచూపులన్, గొందఱుఁ జేతిసన్నలఁ దగుల్పడఁ జేయుచు ... పారి. 1. 108.

చం. ... వల్లభుఁడు నోసతి యాయితపాటు లెస్సయం, చు దయితతోఁ గపోలములు సోకఁగ మంతన మాడె నవ్వుచున్. కళా. 7. 155, కాశీ. 7. 185.

**మంతరము** – **మంత్రము** వి. (నం. మంత్రః)

1 ప్రసవోపాయము.

(చూ. మంతరసాని.)

2 ఇంద్రజాలము, కనికట్టువిద్య (శ. ర).
జ : మంతరసాని

**మంతరసాని** – మంత్రసాని (క. మంతరసాని మంతరము+సాని వృత్తిని వర్ణలోపము.) సుఖముగా ప్రసవింప నుపాయము చేసెడు చికిత్సకురాలు, సావిక.

సీ. ఉబుము మంతరసానియునుబోలెఁ గనుపించెఁ దోరంపు మణుల విదూరభూమి. పాండు. 4 21

ఉ ... మైలసంతలో, గంతులు సాగ వంతయును గానఁగ నయ్యెడు లెస్సఁగోసెఁగా, మంతరసాని బోడ్డు క్షణమాత్రములో మిము గెల్వకుండినన్. ప్రబంధ. 776

సీ ప్రసవమంత్రజ్ఞ దాఁ బరఁగు మంతరసాని నా .. ఆం. భా 2. 110.

**మంతవ్యము** నం. విశ. (అ. ఆ అ.) 1. తలఁపఁదగినది, ఆలోచింపఁదగినది 2. ఊహ్యము 3 పోషింపఁదగినది,పోష్యము. 4. అంగీకరింపఁదగినది, సమ్మతింపదగినది.

**మంతి** వి. ప్రసంగము. ప్రస్తావము.

ఉ పంతతి లేనిదుఃఖమున సామజరాజ్య ఘటాంత వైభవం, బెంతయుఁ గల్గియున్ సరసిజేక్షణ చిన్నఁగఁ బోయియుండు నే, మంతిని బోటికత్తెలకు మానసవృత్తి యెఱుంగఁ జెప్ప కే, కాంతమ కేళశయ్యనయిఁ గాంత గుణించు మనోరథార్థముల్ శివరా 2. 19

(వ్యవ ) వారికి వీరికి నాలుగునెలలనుండి మాట మంతి లేదు.

మాట మంతిలేకుండ అలాగున కూర్చుంటివేమి?

**మంతిరి** వి. (నం మంత్రి) ప్రధానుఁడు, సచివుఁడు.

సీ తరుణి మహాప్రసాదం బని నీ మాట మంతురుల్ శిరసా వహి తు రెప్పడు ... సారంగ. 2. 2. (రావణుఁడు.)

మ. .... మహే, శ్వరపూజానియమంబు మానక శంభ్వానంబునన్ జెంతమం, తురులన్ బిల్చి ప్రవాహకారణము దోడ్తో నారయన్ బంచినన్. ఉ. రా 8. 220.

కం. .. సా, ల్వునిమంతిరి ద్యుమనామఁడు, సునిశితగద చే నమర్చి సుమహితశక్తిన్. భాగ. 10 ఉ. 871.

**మంతిరించే** అ. క్రి (నం. మంత్ర్. న్.) మంత్రించు, మంత్రమువేయు, మంత్రోచ్చారణముచేయు

(వ్యవ.) అతఁడు మంతిరించి తేలువిషమును దింపినాఁడు

(న క్రి.) 1. మంత్రముచే శక్తికలదానినిగాఁ జేయు.

(వ్యవ ) విభూతి మంతిరించి చల్లఁగానే ఆమెను పట్టినదయ్యము పాఱిపోయినది

2 మంత్రమువలె రహస్యముగా బోధించు.

'ఎన్నిమందు లిడితివో యేమి మంతిరించితివో.' క్షేత్రయ (శ. ర.)

**మంతు** వి. (నం మ త్రీ. క. మంతు) 1 అమాత్యుఁడు, ప్రెగ్గడ, మంత్రి.

కం. మంతుల బాంధవభటసా, మంతుల నాశ్రితుల నిలిపి ... మనుచ. 5 54.

కం. చింతించి తనదుకోరిక, మంతుల కెఱిఁగించి గురుసమాననయశ్రీ, మంతులగు నాగరకధీ, మంతులఁ బిలిపించి పలికె మధురతరోక్తిన్ ... చం రా. 4. 4., అచ్చ రా, కిష్కిం 6.

2. ద్యూతమంత్రి, రాజునకు జూదమున వినోదము చేయువాఁడు.

సీ . మంతు నాఁగను ద్యూతమంత్రి యొసఁగుఁ బ్రెగడ ప్రెగ్గడయనఁదగుఁ బ్రధానుండు ... ఆం. భా. 2 183

3. చదరంగమందలికాయలలో మంత్రి యను కాయ(శ ర.).

4 మంత్రము.

చం మలగొను చిన్నికెంజడలు మంతుల పొత్తము నాగబెత్తమున్, ... చెలు వలరంగ నొప్పు నొక సిద్ధుఁడు .. కళా. 2 48.

(శ ర పా. మందులపొత్తము ముద్రి పా.)

5. ఇది యీ క్రింది యర్థములయం దొక్క 'రాధికాసాంత్వనము' నందక్క మిగిలిన తావులందెల్ల 'ఎక్కు' అనుక్రియతోఁ గలసియే కానవచ్చుచున్నది.

ఉదా. మంతు కెక్కు, మంతున కెక్కు.

(క.) ప్రసిద్ధి: ఘనత, గొప్పతనము.

సీ. గబ్బిసిబ్బెపుటుబ్బు గుబ్బగుబ్బల వెంతొ మంతుగ న్వింతకుంభములు గాఁగ ... రాధికా. 1. 67

ద్వి. సంత జవసత్వ సంపద ల్మెఱసి, మంతుకెక్కిన హనుమంతుండుఁ దాము. చెదరక రవిజుండు చెప్పిన యట్ల, మొదల వింధ్యాచలంబున కేఁగు దెంచి .. రం. రా. కిష్కిం. 228పా 10పం

గీ. దండధర చండతర శౌర్యచండశత్రు. కాండ చతురంగ ఖండనోద్దండవిక్ర, మక్రమాఖండఅలుం డన మంతు కెక్కు, నారసింహప్పరాయ భూనాథ మణికి ఇందు. 1. 125,

మ. భవతేజంబునఁ బుట్టి రామభజనాపారీణుఁ డై పద్మసం, భవసామ్రాజ్య రమాధురంధరతకై భాసి ల్లియు న్నిత్యస, త్య విశేషస్థితి నద్విరోధి విషయ ధ్వాంతార్క బింబాకృతిన్, భువిలో మంతున కెక్కినట్టి హనుమంతుం గొల్తు నిష్టాప్తికిన్. దశా 1. 8. (చ.) ప్రశస్తి, పొగడ్త.

వ. ఆ లోకనాయకుని కిచ్చుటకన్న నెన్న భాగ్య మున్నదే యని యా ధీమంతులగు మంత్రులు మంతు కెక్కఁ బలికిన నానందతరంగి తాంతరంగుండై ... ప్రబంధ. 561.

కం. అంతటఁ గాంత లనంతుని, వింతగఁ గైసేసి తెచ్చి వెల గల మగరా, సంతవల మ తుకెక్కిన, దంతపుపని చేవికెలోన దయ దనివారన్. రాధికా. 1. 86.

**మంతువు** నం. వి. ఉ. పుం 1. అపరాధము, తప్పు. 2. శోకము. 3. ప్రజాపతి. విణ (ఉ) 1. విజ్ఞుఁడు.

2 ప్రియవంతుడు (శే. ని).

**మంత్రకాఁడు** విణ (√మంత్రము) ఇంద్రజాలవిద్య నెఱిఁగినవాఁడు

కం. తెగుతలలు మొలచుతలలుం, దిగువం బడు తలలు మొగులు తెరువునకు వడి, న్నెగయు తల లప్పు డబ్బుర, మగుచున్ జగమంత్రగాని యాటయ పోలెన్. అచ్చ. రా. యు 549.

**మంత్రకృత్తు** నం. విణ (త్) – మంత్రదర్శి.

**మంత్రజిహ్వుఁడు** నం. వి అ పుం అగ్ని హోత్రుఁడు.

**మంత్రజ్ఞుఁడు** నం వి. అ. పుం. గూఢచారుఁడు, వేగులవాఁడు (వై. ని).

**మంత్రణ** నం. వి. ఆ. స్త్రీ. వలహాచెప్పుట, ఆలోచన చెప్పుట.

**మంత్రణము** నం. వి అ న. ఆలోచన.

**మంత్రదర్శి** నం. విణ. (న్ నీ న్.) మంత్రములఁ గనిపెట్టినవాఁడు లేక చూచినవాఁడు.

**మంత్రదాత** నం. వి. ఋ. పుం. మంత్రమిచ్చిన గురువు, మంత్రోపదేశము చేసిన గురువు.

**మంత్రదృక్కు** నం. విణ. (శ్) ఇట్లే : మంత్ర దృశుఁడు, – మంత్రదర్శి.

**మంత్రము** – **మంతరము** వి. (నం. మంత్రః – 'మంతరము'లోని తకారోత్తరవర్తియైన అకారము లోపింపఁగా 'ఉంగరము' 'ఉంగ్రము' వలె 'మంత్రము' అనురూపము సిద్ధించును.)

1. ప్రసవోపాయము.

(చూ మంత్రసాని.)

2 ఇంద్రజాలము. కనుకట్టు విద్య

(చూ మంత్రకాఁడు.)

జః మంత్రకాఁడు, మంత్రసాని.

**మంత్రము** నం. వి. అ. పుం. 1. వేదము. (ఇది ఋక్కు, యజుస్సు, సామము, అధర్వము, అను నాలుగువిధములు గలది). 2 వేదభాగము, (బ్రాహ్మణేతర వేదభాగము.)

3. (తంత్ర.) కొందఱదేవతల అనుగ్రహమును సంపాదించుటకై జపింపఁదగిన మంత్రము.

4. గూఢభాషణము (శే. ని).

5. ఆలోచన

**మంత్రవిదుఁడు** నం. విణ. (దే.) – మంత్రదర్శి

**మంత్రసాని** – **మంతరసాని** వి. (√మంత్రము) ధాత్రిక.

గీ. అవని నపుడు నవోదితుం డైనయట్టి, మరు నకుం గుసుమర్తు వన్మంత్రసాని, బొడ్డుఁ గోసిన కొడవలివోలె విరహి, దారకం బయ్యెఁ గింశుక కోరకంబు. ఆ. ము, 5 112

గీ. అమరు నవ్వీట నన్నపూర్ణాభిధాన, మదన మాయామహాస్థాని మంత్రసాని, దానితో మాట లాడి చూతము విచార, మేల యని వేళ గని దాని యింటికడకు. శుక. 1. 428,

**మంత్రాంగము** నం వి అ న మంత్రిత్వము, తంత్రము (శ రి.)

**మంత్రి** నం. విశ (న్. జీ. న్) 1 బుద్ధిమంతుఁడు, తెలివిగలవాఁడు 2. వేదములు బాగుగాఁ దెలిసిన వాఁడు.

వి. న్. పుం 1 సచివుఁడు, ప్రెగడ, 2 మాంత్రి కుఁడు, గారడివాఁడు.

**మంత్రించే** నం అ. క్రి. మంతిరించు, మంత్రోచ్చార ణము సేయు.

సీ. మూలమంత్రాక్షరంబుల భూతి మంత్రించి పుండ్రకములు ఫాలమున ధరించె... కాశీ 1. 39

కం. మంత్రపరీక్షార్థం బభి, మంత్రించితిఁ గాని దేవ మదనక్రీడా, తంత్రంబుఁ గోరి చీరను మంత్రించిన తప్పు సైఁచి మరలు దినేశా. భాగ. 9 718.

**మంత్రితము** నం. విశ. (అ. ఆ. అ.) 1 ఆలోచింపఁ బడినది. 2 సలహాచెప్పఁబడినది. 3. చెప్పఁబడినది, పలుకఁబడినది. 4. మంత్రింపఁబడినది. మంత్రము లచేఁ బవిత్రము చేయఁబడినది. 5. నిశ్చయింప బడినది.

వి. అ. న. సలహా.

**మంథగిరి** నం. వి. అ. పుం. మందరపర్వతము, కవ్వ పుఁ గొండ.

**మంథగుణము** నం. వి. అ. పుం. మంథరజ్జువు, కవ్వపుఁద్రాడు.

**మంథజము** నం వి. అ. న. నవనీతము, వెన్న.

**మంథదండ(క)ము** నం. వి. అ పుం, కవ్వము

**మంథనఘటి** నం. వి. ఈ. స్త్రీ. మజ్జిగ చిలికెడి కుండ.

**మంథనపర్వతము** నం. వి. అ పుం. కవ్వముగా నుప యోగింపఁబడిన మందరపర్వతము.

**మంథనము** నం. వి. అ. పుం. కవ్వము. న 1. మథిం చుట, తరుచుట, చిలుకుట, 2. రాపిడిచేత నగ్నిని రాఁజవేయుట.

**మంథని** నం. వి ఈ. స్త్రీ. మజ్జిగ చిలికెడికుండ.

**మంథము** నం వి. అ. పుం. 1. మథించుట, తరుచుట, క్షోభపఱుచుట. 2. చంపుట, నశింపఁజేయుట. 3 పానకద్రవ్యవిశేషము. 4. కవ్వము, మంథదండము. 5 ఆతపము, ఎండ. 6. కిరణము 7 నేత్రమలము, కంటిపుసి 8. రాపిడివలన నగ్నిఁ బుట్టించెడు సాధనము 9 ఒకదినుసు జింక.

**మంథర** నం వి ఆ స్త్రీ. కైకేయియొక్క దాసి

**మంథరము** నం. విశ. (అ. ఆ. అ.) 1. మంద మైనది. 2 బుద్ధిలేనిది, జ్ఞానశూన్యము, జడము. 3 పెద్దది, విశాలమైనది. 4. వంగినది, వక్రమైనది.

వి అ. పుం 1. ధననిధి, ధనాగారము. 2 బలము. 3 క్రోధము. కోపము. 4 అప్పుడు చిలికిన వెన్న 5. కవ్వము 6. బాధము 7. ఫలము. న కుసుం భము, కుంకుమపువ్వు

**మంథరుఁడు** నం విశ. (అ. ఆ అ.) సూచకుఁడు

**మంథరువు** నం వి ఉ. పుం. చామరము వీచుటవలనఁ గలిగినగాలి.

**మంథవిష్కంభము** నం. వి. అ. పుం. తరికంబము, చల్లరాడు (వై ని.).

**మంథానకము** నం. వి. అ. పుం. తృణవిశేషము.

**మంథానము** నం. వి అ. పుం. 1. కవ్వము. 2. ఆర గ్వధము, రేల. (వ్య. వి). 3. మందర పర్వతము (కల్ప).

**మంథి** నం. వి. న్ పుం. 1, సూర్యుఁడు. 2. చంద్రుఁడు. 3 రాహువు. 4. ఒకానొక సోమ పాత్రము (కే. ని.).

**మంథిని** నం. వి. ఈ. స్త్రీ. మజ్జిగ చిలికెడి కుండ.

**మంథోదధి** నం. వి అ. పుం. క్షీరసముద్రము, పాల వెల్లి.

మంద వి. (క. మందె. త. మందై) 1 ఆవులు మున్నగు పశువుల సమూహము, కిలారము

ద్వి. నీవు నీచేముష్టి నిజశక్తి మెఱసి, యొందాఁక వేసితి వీలోనిపసుల, మంద నీకె య టన్న మది సంతసిల్లి. రం. రా. అయో. 108 పొ. 2 పం.

గీ. మందగతి గుబ్బె వృషభముల్ మందపిఱుఁద. ఆము 4. 169.

చం గొఱియలమంద యాఁబసులగుంపు కృషిక్రియ దుక్కి టెద్దదొడ్డి... వేం. పంచ. 1 586

ఉ. గొల్లలనాయఁడై వరగు కుంభకుమంద నదేమి వింతయో... నీలా. 2. 54.

2. ఆవులు మున్నగు పశువులసమూహ ముఁడు గోష్ఠము.

ఆ తనియ మేసి నీరు ద్రావి మందకు వచ్చి, సౌఖ్య మెసఁగఁ బసులు శయన మొంది, యుండ... భార. అను. 3 5., 3. 8

ఆ. అలమందనుండి యది మఱునాఁడు ప్రత్యూష వేళఁ దాఁ గరిప పూర్ణ, వేణుపాత్ర మీఁద వెల యఁ బం డిడుకొని, యాత్మ గేహమునకు నరుగు నపుడు... విక్ర. 3. 18.

3. గొల్ల పల్లె, వ్రేపల్లె, ఘోషము.

సీ. కంసుపంపున బాలఘాతిని పూతన పల్లెల మందలఁ బట్టణముల...భాగ. 10 పూ. 212. 145.

౦ మందకట్టు. మందకాఁడు, మందగుది, మంద గొను. మందపట్టు, మందపిచ్చుక, మంద ప్రోయాలు, మందవాఁడు.

మందకట్టు అ. క్రి. (మంద+కట్టు) పేఁడ మున్నగు వానిచే సత్తువ కలిగించుటకై ఆవులు, మేఁకలు మొదలగు వాని మందలను రాత్రులందు పొలము లలో నిలుపు.

(వ్యవ.) మందకట్టినందున ఆపొల మీయేఁడు బాగుగా పండినది.

వి. (త. మందైకట్టు.) గొల్లపల్లెలవారు చేసికొను కట్టడ, నియమము, ఏర్పాటు (శ. ర).

మందకాఁడు విశే. (√మంద) పశువుల మందను గాచువాఁడు

ద్వి ... సిద్ధ. రామునిబంటొ చేరమమందకాఁడొ. పండితా పురా 156. పొ.

మందగరద వి వన్యమృగవిశేషము (ఇది పిల్లింబోలి పిల్లికంటె కొంత యెుక్కుయియుండు శునకశతం బులకఅవుల మిసిమింతముగాక మలఁగి మలఁగి వానిం గఱచుచుఁ బాఱుఁ గాని నేలం బడదు. వేఁటకాండ్రు కడు ప్రయాసమున బడియల నడిచి కూల్తురు) వి. ని

మందగామి సం. విశే. న్. నీ. న్ మెల్లగా నడచువాఁడు, నడకలో మందత్వము గలవాఁడు.

మందగించు-మందగిల్లు అ. క్రి. (సం. మందః, ఇది 'కోపగించు' వంటిది.) మందమగు, తగ్గు.

ఉ. ... యానముల్, వేమఱు మందగించెఁ గడు వృద్ధి భజించెను గొను ... హంస 2 93.

(వ్యవ.) ఆఁకలి మందగించినది. ఈ సంవత్సరము ధాన్యపుధర మందగించినది.

మందగిల్లు(లు)-మందగించు అ. క్రి (సం. మందః) మంద మగు తగ్గు.

(వ్యవ.) ఆయాసముచే ఎద్దునడక మందగిల్లినది. సరకులధర లన్నియు నిప్పుడు మందగిల్లుచున్నవి.

మందగుఁడు సం. వి. అ. పుం. శని.

మందగుది వి. (√మంద) పశువులు కాలీడ్చుకొనుచు నడచు నొకవిధమైన కుంటినడక.

(ఇది పశువుల దుర్లక్షణములలో నొకటి.)

గి మందగుది రెప్పగొరిసెలు మక్కరొండ్లు, బర తుమురుకొమ్ములును మోటుబర్లు తడక, వాటు తెరడొక్క మిడితోఁక వేటుగాళ్లు, నేరుఛాసిన యెుక బీదయెద్దుఁ జేరె. హంస 5. 31. ముద్రి పా.

(పుప్పిగొరిసెలు. శ. ర. పా.)

మంద(లు)గొను అ. క్రి. (√మంద) మందగాఁ గూడు, గుంపుగూడు.

కం ఇచ్చోఁ బచ్చిక మేసిన, విచ్చోఁ ద్రావినవి తోయ మేఁగిన విచ్చో, నిచ్చోట మందగొన్నవి, యిచ్చోఁ బాసినవి జాడ యిదె యిదె యనుచున్· భాగ 10. పూ 504

కం. అందలములు గుజ్జంబులు, స్యందనములు భటులు భద్రసామజములు బల్, మందగొని తొలఁగఁ ద్రోయుచు, సం దెందును లేక దొడ్డ సందడి యయ్యెన్, కుచేల. 3. 7.

చం నలిఁ గమలాననల్ మృదునినాదములన్ వెడ దొక్కుఁ బల్కులన్, సొలవక చిల్కలన్ వెడలఁ జోఁపునెలుంగులుఁ దమ్ముఁడాయ రాఁ, బిలుచుట గాఁగ నాచిలుక పిం డనికంబును జేలలోన మం, దలుగొని పాయకుండు మదిఁ దద్వచన శ్రవణాభి లాషులై, కు. సం. 7. 928., శుక 2. 342.

**మందట** వి. 1. వ్యవహారము.

సీ. మందట యనఁగను మందిలిం పనఁగను, వ్యవ హారసంజ్ఞ యై పరఁగుచుండుఁ. ఆం భా 1. 118.

(క.) తగవు, వివాదము.

ఉ. ... మా, మందట మాన్పి యి ట్లనిరి మానుగఁ బా రనుకూలశత్రు లై. దశకు 5. 45.

చం. మనముల నమ్మతించి తమమందట నానభవారు తీర్చి చె, ప్పినగతిఁ జేసిరి .. నా పంచ. 1. 551.

(సమీపము అని శ. ర మఱుమాటన కానభవారు ముద్రి. పా.) భార. అను. 2. 423

(చ.) కలహము, జగడము.

సీ. మనకు వేల్పులకును మందట లేకుండఁ బంచి పెట్టెద నని పడఁతి పూనె ... భాగ 8. 320

2 ఉడుకువ, ఉఱుట, నిర్వ్యాపారత్వము. (అడఁకువ అని శ ర.)

మ. విను కుంభాండ యనేకకాలము మహావీరా హవప్రౌఢి పెం, పునఁ గ్రీడింపఁగ లేక నాదగు భుజంబుల్ మందటం బొందినన్ హరి. 7. 32

(శ. ర పా. భుజంబుల్ ముచ్చటం బొందినన్. ప్రాఁత ముద్రి. పా. భుజంబుల్ మూదటం బొంది నన్. నూతన ముద్రి పా.)

జ మందటిల్లు.

**మందటము** సం వి అ పుం. పారిభద్రము (వృ వి.) (వాచ, కల్ప.).

**మందటిల్లు(లు)** అ. క్రి (√మందట.) 1. ఉడుగు, నిలిచిపోవు, క్షీణించు, తగ్గు

(కల్లుత్రాగిన స్త్రీలవర్ణనము )

సీ అసితోత్పలములపై .. కలహంస పదువులు గాళ్లందుఁ దొడరెనా మట్టంపు నడపులు మంద టిల్లె కు. సం. 9. 332.

చం చెలియలియిల్లు మందటిలఁ జేసినదోషమునద్వ సూత్కరం, బులు గిలుబాడ నైన యఘమున్ బహుచక్ర విమర్దనంబునం. గలిగిన దుష్కృతంబుఁ దొలఁగన్ భృగుపాత మొనర్చెనో యవన్ గలువల ఱేఁడు వ్రాలెఁ దుదిగట్టుననుండి కళావిహీనతన్ చంద్ర. 4. 140.

కం గందపుమ్రాఁకుల కురుఁజుల, సందులనుం బూల చేలువ చేప్పం ములుగాఁ, బొందింపఁ గ్రమ్మఁ చీకటి, మందటిలెన్ మేలుకట్టు మానికములచేన్. యయా. 4 81.

2 మిన్నకుండు, ఊరకుండు.

కం చేనుచో వాకిటి పెద్దలు, గని దిగ్గున లేచి రాజు గా రిట వేరే, యని కొడుకుచు నశ లేకుం, డిశ నే మా యె నని మందటిలఁ బల్కి తగన్. సారంగ 2 34

3. మెండుకొను, అతిశయించు

సీ. మే లుప్పరంబు తుమ్మెదమందరొద మందటిలు పొదల్ దూఱుచోఁ గలువకంటి ... చంద్ర. 3 148.

**మందడి** వి. (సం మందురా బ మందడులు, మంద కులు, మందళ్లు, చూ. మందడీఁడు )

1 అశ్వశాల, లాయము.

ద్వి. ఈ రేయి మందడి యెల్ల మై మఱచి, తారు నిద్రించు నత్తఱిఁ జిచ్చు వెట్టు, మీ వాజిశాలల

సీ. ఆపొలఁతియు దాఁచి యాపండు తనతోడ,
నూని కూడెడు మందడీని కిచ్చె ...
ద్వా. 1. 88.

**మందనము** నం. వి అ న. 1 స్తుతి. 2 మోదము 3 గతి 4 మదము 5. స్వప్నము. (శే. ని.)

**మందపట్టు** వి (మంద + పట్టు) గోష్ఠము, పశువు లుండెడుచోటు.

ద్వి. మడి తోఁట కళ్లంబు మందపట్టనెడి, యడి యానఁ బోకార్చ యంతటఁ బోక
ద్వి. హరిశ్చ. పూ 519

**మందపఱుచు.** క్రి. స క్రి మందపడఁజేయు, క్షీణింపఁజేయు

గీ. మానుషాకారరుచికోటి మందపఱిచి, యనఘ యే మన నేర్తుఁ గృష్ణాభిధాన, లోకబాంధవుఁ డుత్తమ శ్లోకమూర్తి, మించుతేజంబుతో నస్తమించె నయ్య
భాగ. 3 83.

**మందపిచ్చుక.** వి (మంద + పిచ్చుక) మందతోఁ గలిసి యుండుపిచ్చుక, చటకవిశేషము

(ఖంజరీటము శ. ర. నల్లని తలయును తెల్లని రొమ్మును గల యొకవిధ మైన చిన్న పక్షి. (బ్రౌ)

**మందప్రోయాలు** వి. (మంద + ప్రోయాలు) గొల్లపల్లెలో నుండు స్త్రీ, గోపిక

గీ. మంద ప్రోయాండ్ర గూరిమి మ్రానిపండు...
పాండు. 2. 14.

**మందభాగి** నం. విశే (న్ నీ న్.) మందమైన యదృష్టము గలవాఁడు, అదృష్టహీనుఁడు, దురదృష్టవంతుడు.

**మందభాగ్యుఁడు** నం. విశే (అ. ఆ అ.) అదృష్టహీనుఁడు, దురదృష్టవంతుఁడు.

**మందము** వి. పరిపుష్టి, బలుపు

చం ... గొరిసెలయందముం గుబుచేకొమ్ముల చేందము వెన్నుమందమున్, ... హరువగు కామధేనువు .. దశా. 2 224.

విశే 1. స్థూలము, లావైనది

ద్వి. నడుము మందం బాయె నాభి గన్పడియె.
ద్వి. నల. 3 22.

2. దళసరి యైనది

(వ్యవ.) ఆ బల్ల మందమైనది. ఈ బల్ల పలుచనైనది

**మందము** నం వి. అ. పుం. 1. ఒకానొక హస్తిజాతి (మే ని). 2. ప్రలయము 3. తోడు పెట్టఁగాఁ గలుగు నొకవిధమగు వికారము గల దధివిశేషము (వై. ని.)

**మందరమణి** నం వి. ఇ. పుం. ఈశ్వరుఁడు. (వై ని).

**మందరము** నం విశే (అ. ఆ అ) 1 మందమైనది, మెల్లగాఁ బోవునది 2. పెద్దది, స్థూలమైనది.

వి అ పుం. 1. మందర పర్వతము, కవ్వపుఁ గొండ, అమృతమునకై క్షీరసముద్రము మథింప దేవదానవులచేఁ గవ్వముగాఁ నుపయోగింపబడిన కొండ.

2 ఎనిమిది పేఁటలుగల ముత్యాలహారభేదము (వై ని.).

3 స్వర్గము. 4. అద్దము. 5 ఇంద్రుని యుద్యానమందలి మందార వృక్షము

**మందల¹** వి (మను¹ + తల³ దీని మూలరూపము 'మనుదల') మనుగడ, జీవనము; ప్రాణము.

(ఇది విడుచు ధాతువుతోఁ గూడియే ప్రయోగములలోఁ గానవచ్చుచున్నది. చూ. మందల విడుచు)

**మందల²** వి (మను + తల³.) 1. మేర, హద్దు

కం. అందల మందల లేకిపు,డందల మందలయియున్న వయ్యె మెకంబుల్ • చెందామర కొలనివలెన్, దెందేప లవేమి సెప్ప దేవుఁ డెఱుంగున్.

సారంగ. 1. 67.

2. సమీపము

చం. చలిమిరి గాడ్పుచే నెగసి సన్నపు సుళ్ల గుఁ జాకసంపు మం,దల వికసిల్లెఁ బుప్పొడులు దట్టముగా ... యయా. 4. 10.

3. తెరువు, మార్గము, తెఱఁగు, విధము.

వ పెద్ద ప్రొద్దు దద్దయుం దలపోసి కర్జంబు మందల యెఱుంగక కొందలం పడుచు ... భాగ. 10 పూ. 582 ...

వ. వసుదేవుఁడును బ్రదుకు మందలఁ గంటి ననుచు సుందరియుం దానును మందిరంబునకుం బోయి డెందంబున నానందంబు నొంది యుండె. భాగ 10 పూ. 43

**మందలవిడుచు** స. క్రి. (మందల + విడుచు) జీవముతో వదలు, (ప్రాణములతో విడిచి పెట్టు.)

సీ... నాగాయుతప్రాణు వనిల నందనుని జూడు, దలఁబట్టి సహదేవుఁ జులుకన మర్దించి మందల విడువఁడే మాయలాని ...

భార. కర్ణ. 1. 42.

చం. పలుకులువేయు నేఁటికిఁ గృపాపరశాస్త్రతి దక్క వీని మం,దలవిడు నాకుఁ గాన్నృపతిధర్మ విచక్షణ పుణ్యవీక్షణా ...'

నిర్వ. 7. 68.

గీ ... అమరవిభుని, కరుణ మందల విడిచి విక్రమము మెఱసి. నృసిం. 2. 116.

కం శ్రీపతి యానతి యి,చ్చిన మందల విడిచె నతని సిద్ధవిభుఁడు వాఁ,డును గులగులలై లావగ, లిన మై విదిలించు కొనుచు లేచెఁ గిదుకుచున్. పాండు. 4. 297

**మందలించు** స క్రి. (√మందల²) 1. చెప్పు; నిర్ధారణ చేసి చెప్పు.

గీ ఇంత యలుకకుఁ గారణం బిది యటంచు. మందలింపుము నాయాన మందయాన ...

రాధికా. 4. 48.

(శ. ర. పా 'మదిఁ దలంపుము' ముద్రి. పా)

కం. ఏ మంద మేమి సేయుద. మేమం దని మందలింత మే మందమె యిం, దేమందయాన నడుగుద, మే మందఱ మనుచుఁ దరళ హృదయాంబుజలై. వసు 3 181.

3. ఆజ్ఞాపించు

గీ. మంద గొందల మంద నమందవృష్టిఁ, గ్రందుకొనుఁ డంచు నింద్రుండు మందలింపఁ... జలధరములు భాగ. 2. 184.

ద్వి. మనసులోఁ దరయంగ మందలించినను, చోను నెట్లు వట్టె మంచోము మీఁద నుండ.

పండితా. పురా 110 పా

3. చీవాట్లు పెట్టు, తర్జించి బోధించు

(వ్యవ.) నీ కొడుకును నీవు మందలించినఁ గాని వాఁడు పెంకెచేష్టలు మానఁడు.

4 హెచ్చరించు

ద్వి. నీవును దేవమునిశ్రేణిఁ గలసి, వే వచ్చి నను జేరి వేఁడుచున్నపుడు, మందలించెదఁ గాక ... విష్ణు. పూ. 3 (శ. ర.)

5. మనవిచేయు, విన్నవించు.

గీ ఎన్ని యుపచారములు చేసి రిందు వదవ లన్నియును జూడ మునుపటికన్న మిగుల, బాధకము లయ్యె దయలేని ప్రభువుతోడ, మందలించిన మనవుల చందమునను.

అని 3 25.

6. పృచ్ఛించు, అడుగు

వ నేఁడు పండువకు మీయక్కల బావలఁదోడి తెచ్చితివే యని మందలింత మని యందఱు గుమిగూడి వారి యింటి కరుగుదెంచి,

చెన్నబ 3. 183.

7. తలఁచు, పాటించు

సీ. ముక్తకంచుక ముక్తముక్తా ఫలంబుల మంద లింతురు గురివెంద లట్లు. కాళ. 3. 4.

**మందలింపు** వి. (√మందలించు) మందలించుట వా.) .

2. వ్యవహారము.

సీ· మందట యనఁగను మందలిం పనఁగను
వ్యవహార సంజ్ఞయై పరగుచుండు ...

అం. భా. 1. 113.

**మందవాఁడు** వి. (√మంద.) గొల్లవాఁడు, గోపాలకుఁడు.

సీ వడిఁగూడి పాలకావళ్లు దేరఁగ మంద
వాండ్రను బోరిగొని వచ్చె నేఁడు ...

హరి. పూ. 6. 9.

**మందవిసర్పి** సం. వి. న్. పుం. మెల్లఁగా ప్రాకుఁ నది – యూక, పేను (కే. ని.).

**మందస(ము) — మంజూస** వి. (సం. మంజూషా. ప్రా· మంజూసా.) పెద్ద పెట్టె; పెట్టె.

మ ... మదీయపుత్రిఁ బ్రమదం బేపార నే
నిచ్చెద, నస్మద్గుణాఢ్యానన మున్నమందస దగ
న్వేతెందు మీ రేఁగి యిక్కడకు ...

భా. రా. బాల. 675.

ద్వి. తటుకున నరిగి మందసఁ బట్టుఁ డనుచు.

నవ. 3. 147 పా. 9 పం.

ద్వి. క్రతుశాల దున్న నాఁగటి చాలులోన,
వతులితంబుగఁ బ్లాలువం దొప్పు మిగిలి, మంద
సంబును రాఁగ మది నుబ్బి చూచి, మంద
సంబును నేను మమతఁ దీయంగ ... రం. రా.
బాల. 63 పా. 7 పం., 65 పా. 19 పం.

గీ. పదిలముగ మందసమువందు బరణిలోన,
నునిచి దాఁచిన దాన మీ యుంగరంబు ...

కాశీ. 4. 105.

కం. వ్రాయించి మందసమ్ములు, రాయల్ ధరి
యించు నాభరణ వస్త్రతతుల్ దీయుత్తినుంచి
పంపె ను,భాయ త్తత భటులఁ గూర్చి యప్పా
త్రులకున్ ...

కృష్ణ. 3. 105·

చం.... కన్యకామణిన్, వవధివరీత యై పొదలు
వాహినిలో నొక మందసంబునందునిచి రయం
బునన్ వెడల నొత్తుట నీతి యటంచుఁ దెల్పి
నన్ ...

శుక. 1. 371.

సీ ... మంజూష తవరారు మఁదస మన ...

అం. భా. 2. 297., నీలా. 3. 66.

**మందసతి** మి. వి. మందప్రోయాలు, గోపిక.

గీ మరులు గొలిపితె గోవింద మందసతుల ...

ఆము. 5. 67.

**మందసానము** సం. వి. అ. పుం. 1. అగ్ని. 2. ప్రాణము, 3. నిద్ర, 4. సూర్యుఁడు, 5. చంద్రుఁడు, 6. హంస, 7. జీవము (కే. ని)

**మందసానువు** సం. వి. ఉ. పుం. 1. స్వప్నము, 2. జీవుఁడు.

**మందహాసము** సం. వి. అ. పుం. చిఱునవ్వు (శ. ర.).

**మందాకము** సం. వి. అ. పుం. 1. ప్రవాహము, 2. స్తోత్రము.

**మందాకిని** సం. వి. ఈ. స్త్రీ. 1. గంగానది. 2. ఒకానొక నది. 3. (ఛంద.) ఒకానొక వృత్తము.

శ్లో. ననరరఘటితా తు మందాకినీ. (కల్ప.)
4. అఱువదేండ్ల యాఁడుది.

(శ. ర. మాత్రము.)

**మందాకు** వి. (మందు + ఆకు) మందునకై యుపయోగించు ఆకు; ఓషధి.

గీ. బ్రహ్మ పిడిచిన మందాకు పస రవంగ ...

ఆము. 2. 8

**మందాక్రాంత** సం. వి. ఆ. స్త్రీ. (ఛంద.) వృత్తభేదము.

మందాక్రాంత. మందాక్రాంత న్గిరిశవిరతుల్
మభ్నతాగగాణంబుల్.

అప్ప. 4. 226 పా.

**మందాక్షము** సం. వి. అ. న. లజ్జ, సిగ్గు.

**మందాగ** సం. వి. ఆ. స్త్రీ. శ్రవిష్ఠ, ధనిష్ఠర్క్షము, ధనిష్ఠా నక్షత్రము (వై. ని.).

మందాగ్ని సం. వి. ఇ పుం జఠరాగ్ని మందమగుట, అజీర్తి.

విశ. (ఇ.) అజీర్తి గలవాఁడు.

మందారము వి. మోడము, మేఘావరణము.

గీ ... మోడ, మనఁగ మందార మనఁగ మేఘావృత్తి దగు ... ఆం. భా. 1 71.

మందారము సం. వి. అ. పుం. 1 ఇంద్రుని నందనోద్యానమందలి యైదు వృక్షములలో నొకటి. భూలోకమందలి యొకానొక వృక్షము. 2. అర్కవృక్షము, జిల్లేడు, 3. దత్తూర వృక్షము, ఉమ్మెత్త

న. అరవిందము. (శే. ని)

మందారువు సం వి. అ పుం. కల్పవృక్షవిశేషము (విల్యమ్సు).

ఉ. మేరువు గాంచె ... నిత్య సేవవరసవ్యసన భ్రమదజ్ఞబంధుమం, దారువు దివ్యధామ యుత దారువు సారభవర్ణమేరువున్.

హరి. పూ 5 11.

మంది వి. (క మంది) 1. జనము, జనసమూహము

ఉదా వేయిమంది, కొంతమంది, అంతమంది మొ

ఉ అంతటఁ గొంతఁ బెంచెరువుగం దరుదెంచు పిఱిందిమంది ... ఆము. 6 84.

సీ తెఱగంటి చెలిమంది నెఱచిత్తరులఁ జెంది శరింఁజెందు మణి మందిరములయందు ...

ఉ. రా. 6. 173.

చ్వి సందడింపుచున్న జనుల వీక్షించి, మందస్మిత ముఖారవిందుఁడై యంత, నందంద తాహాస్తనయన సంజ్ఞలను, మందియు ల్వణఁచి సమాధానపఱచి.

పండితా. మహిమ. 252 పొ.

గీ ఇరులు గవియుచు నేరాళ మెట్ట యెదుర, వల్లివల్లన నేతెంచె వల్లమంది, గరిమ నానా కపతుల కాకాళవీధి, గదిలి యెదురుగ వచ్చెనో కాక యనఁగ.

నైష, 7. 39.

సీ .. మంది యం చన నగు మనుజవితతి ...

ఆం. భా 2 108.

సా మంది యెక్కువైన మజ్జిగ పలచేన

2. పరివారము, బలగము.

ఉ. తప్పుగణించి కా దొరలు దండన సేయుదు రొద్దివారి వా,తప్పున కల్గిమంది గల దాన వటం చును మారుతూపులం, గుప్పితి పీవు నీచెలులఁ గూడి. ఉ. రా. 6. 105

సీ అంత కంతకు మంది నధికంబుగాఁ గూరు కొని తెరువులు గొట్టుచును ...

పరమ. 4 196

ఉ ... సిరిఁ గన్నతండ్రి దా, మన్ననఁ జేసి పంపి తనమందిఁ గనుంగొని రాముఁ డిట్లనున్.

యయా. 3. 32.

3. కాలుబలము, పదాతిసేన, సేన.

(శ. ర, బ్రౌ.)

ఉ. మంది గుఱాలు నేనుఁగులు మావతులున్ దొర లెన్నఁ బెక్కురై, క్రందుగఁ గూర్మితో నెదురుగాఁ జని పౌజులు దీర్ప ....

యయా. 4. 155.

గీ ఎచేటఁ జూచిన బల్లెంబు లీఁటెగములు, గలుగు రాయలదళ మెల్లఁ గలయ నెంచి, యుదయగిరిచెంత నుదయించె నొక్క వింత, యనుచు దుర్గములో మంది యళుకుఁ జెంది

కృష్ణ. 3. 55.

మందిగంద్రలు వి. బ ధాన్య విశేషము.

సీ. మందిగంద్రలు నాగమల్లెలు తీఁగెమల్లెలు కృష్ణనీలాలు వెలువడాలు.

గీ. ఆది యగు పేర్లు గలుగు వడ్ల తని యింట నుండు శతకోటి బారువు లొక్కదినుసు ...

హంస 4. 128.

మంద్రిమ సం. వి. న్. పుం 1. మాంద్యము. మెల్లఁదనము, 2. అవివేకము, తెలివితక్కువ.

**మందిరపశువు** సం. వి ఈ. పుం. మార్జాలము, పిల్లి. (కల్పి., విల్యమ్సు.)

**మందిరము** సం. వి. అ. న. 1. గృహము, ఇల్లు, 2. దేహము, శరీరము. 3. పట్టణము, పుం 1. సముద్రము 2. తొడ. 3. జాను పశ్చాద్భాగము.

**మందీభవించే** సం. అ. క్రి. మందగించు, తగ్గు

వ. అని యదృశ్యరూపం బైన భూతంబు రతిదేవి మరణవ్యవసాయబుద్ధి మందీభవింపం జేసె ... హర. 3. 97.

**మందు** వి. (క. మద్దు. త. మరుందు) 1 ఔషధము, వ్యాధినివారణ సాధనము సూర్యోదయ వర్ణనము.

సీ. చక్రవాకములకుఁ జల్లఁగా మందుఁ ద్రాగించిన చేంద్రంపు గిన్నె యనఁగ . ఉ. హరి. 3 86.

గీ వేల్పులకు మ్రొక్కి వెజ్జులవెంటఁ దిరిగి, మంత్రవాదుల రప్పించి మందు లరసి, కొడుకు వేఁడు కెమిటఁ దీర్పఁ గూడకున్నఁ. బుడుకు వేఁదులు గొన్నాఁడు పుడమిఱేఁడు. విక్ర. 3. 107., 1.138.

1. వశ్యౌషధము, వలపుమందు, వశీకరణ సాధనము.

చం మన కనురక్తి హెచ్చనిదె మందని కంఠముఁ గౌఁగిలించి నిక్కిన ఫణిరాజవల్లి యొటిఁగింపఁగనో యన ...అము. 1. 70.

మ. ... నేఁడు చింత్రాంగి మందులు నీకుం దల కెక్కె నొఁ బరవశాత్మల్ గారె కామాతురుల్ ... సారంగ. 3. 63. శుక 4. 40.

3. విషము, విషపదార్థము.

(వ్యవ.) మందులవాంద్రు మందు పెట్టి కాకులను జంపుదురు.

(వ్యవ.) ఆమె మందు పెట్టి సవతిబిడ్డను జంపినది.

4 దీనిషష్ఠ్యేకవచనమైన 'మందునకున్' అనునది కొన్నిపట్ల 'లేశ మైనను' 'ఎంత మాత్రము' ను అను నర్థమిచ్చును. ఈ యర్థమున దీనికి వ్యతిరేకార్థక క్రియ తోడనే ప్రయోగములు కానవచ్చు చున్నవి.

చే.... ఉ. మ్మలికయు నుబ్బు నాదుమది మందు నకైనను లేదు వాసవా భార. శాం. 4. 395

గీ. అతఁడు దిరుగని యూరును నతనిచేత, నడుగఁబడని మానవుడును నతఁడు చొరని, తోఁటయును జూడ లేదు మందునకునైన, నగవు గాదిది నిక్క మానట్టునందు, భోజరా. 2. 5.

మ ... పంకేరుహా, నవఁ గీర్తింపని లేమ మందు నకునైనం గావ మూహింపఁగన్. కాళ. 1. 32, కేయూర 3 161.

5 ఉపాయము, వెరవు

చం .. అవిమొన దేవదానవుల కైనను గెల్వ నశక్య మిమ్మహాత్ముని నొకమందు సెప్పెద సుతున్ హతుఁడయ్యె ననంగ విన్నయం, తన యితఁ డాయుధంబు దిగఁద్రావి యచేష్టతఁ బొందు నప్పు డీతనిఁ బరిమార్చవచ్చు. భార. ద్రో. 5. 305.

దండకము... నీమౌళిమీఁదన్ సంధాబిందువుల్ బిందునానందకందంబు నీక్షించి సాక్షాత్పరిజ్ఞానముంగా విచారింపలేమిం జుమీకొంద ఆప్రాజ్ఞతం బందురుండందు రామందులందెల్ప నేమందులున్ లేవు ... వరాహ. 6. 91., భార. కర్ణ. 3. 140.

6. ప్రతిక్రియ, ప్రతీకారము.

ఉ మాయలు గల్గు దుష్టులకు మాయపుభంగులె మందు గాక నిర్మాయత మల్లసిల్లెడు పరాక్రమ లీలలు గొల్పు నెట్లు ... భార. శల్య. 2 52.

కం. వినుము పురాతనజన్మంబునఁ జేసినయట్టి కర్మములఫలములు ప్రాజ్ఞుని నైనఁ బొందు వానికి. మనుజేశ్వర మందు ధైర్యమహిమయ చుమ్మీ ... భార. శాం. 4 14.

7. నిదర్శనము, తార్కాణము.

కం. ఇది నిక్కంబగు నేనియుఁ, దుది నీవుం బాండవులును దురితరహితులై, ముదమందఁ జూడఁ గనియెద, నది దీనికి మందు సువ్వె యంబుజనాభా. భార. ఉద్యో. 3. 194.

శ్లో. తేన సత్యేన కృష్ణతాం,పాతామిత్రంశ్రియా వృతం, అస్మాద్విముక్తం సంగ్రామా, త్పశ్యేయం పాండవైస్సహ. సం. భార. ఉద్యో. 90 61.

8 సురేకారము గంధకము మున్నగువానితోఁ జేసి తుపాకులు బాణసంచు మొదలగువాని కుప యోగించు నొకవిధమైన చూర్ణము. ఆగ్నేయ చూర్ణము.

వ్యవ. మందు సరిగాఁ జేయక పోవుటచేత మతాబు బాగుగా కాలలేదు

విశ. దుర్లభము, అరిది.

సీ .... కూడు దానఁ గలిగె, నేని కూరగుట మందు ... ఆము. 4. 127.

నల్లమందు — నల్లగానుండు ఒక విధమైన మాదక ద్రవ్యము, అహిఫేనము

వ్యవ. చీనా దేశస్థులు నల్లమందెక్కువ వాడు దురఁట.

నీలిమందు — నీలి మొక్కలనుండి తీయు నీలి రంగు గల యొకానొక ద్రవ్యము

వ్యవ. చాకలి బట్టలకు నీలిమందు వాడును.

మందుతోఁగూడిన కొన్ని లోకోక్తులు :

సా. పెరటిచెట్టు మందునకు రాదు. (అతి ప చితములగు వస్తువులయెడ ఆదర ముండ దనుట).

సా మం దన్న మాయ మగును (ఎట్టి సులభ పదార్థమైనను గావలసినప్పుడు దొరక దనుట.)

సా. మనోవ్యాధికి మందు లేదు.

సా. మానినది మందు, బ్రతికినది యూరు.

సా. మం దన్న బ్రమా నెల్లఁ దెచ్చుట. (మందు నకై వేరో, ఆకో, పువ్వో కొంచెము తేక చె ట్టంతయుఁ బెఱికి తెచ్చుట; కొంచెము గావలసియుండఁగా వంతయుఁ గొనివచ్చుట.)

మ... మది నీర్ష్యాక్రోధముల్ సందడిం, ప విరం బోక ద్రుమంబు కైకొని పతి న్మందన్న మా నెల్లఁ దే, నవధిం బెట్టిన సత్య వీ వహహా! కావా? భామినీ నావుడున్.ఆము. 5, 74

సా. మంచివానికి మాటాడమియే మందు (యోగ్యునకు మాటలాడకుండుటయే పెద్దశిక్ష.).

మందులగట్టు — మందుచెట్లుండు పర్వతము, ద్రోణపర్వతము

గీ. అప్పు డెలుఁగులరాయని యానతి గొని, గాడ్పుకొమరుఁడు మందులగట్టు దెచ్చి, కోఁతి మూఁకల మనిపె... అచ్చ. రా. యు. 272.

ఇట్లే మందులకొండ, మందులమల మొ.

సీ. లంకఁ గాల్చినవానికింక మెంతు రదేమొ పెచ్చుమందుల కొండఁ దెచ్చు టరుదె శుక. 3. 23.

ఆ ఆకసమున వచ్చువవ్వు డమ్మందుల, మఱ వెలుంగు ప్రొద్దువెలుఁ గటంచు, మదరి చూచి తాముఁ డొఱలుచు సింగిణిఁ, దూపు గూర్చి యేయఁ దొడరుటయును. అచ్చ. రా. యు. 430.

జ మందాకు, మందుపట్టడ, మందునుల, మందులమారి, మందులవాండ్రు, మందులాఁడి

మందుఁడు, సం విశ. (అ. అ. అ. (1. మూఢుఁడు. 2. అల్పుఁడు. 3. అపటువు, అసమర్థుఁడు, 4. నిర్భాగ్యుఁడు. 5 స్వైరుఁడు. 6. రోగి. 7. మృదువు, అతీక్ష్ణుఁడు 8, అలసుఁడు (వి. ని.). 9. కనిష్ఠుఁడు వి. అ పుం 1. శని 2. యముడు (త్రి ని.).

మందుపట్టడ, వి, (√మందు) బాణశాల, బాణసంచు చేసెడిశాల.

గీ. మందుపట్టడ పేరు చెన్నొందు బాణ, శాల యనఁగను... ఆం. భా. 2, 25.

మందుపిచ్చిక. వి, మిథుని యనుపక్షి (చి. ని.).

**మందుమల.** వి. ( మందు + మల ) మందు చెట్లుండు పర్వతము. ద్రోణపర్వతము.

గీ. ద్రోణపర్వత మొప్పు మందుమల యనఁగ. ఆం భా 2, 28

**మందుర.** సం. వి. ఆ. స్త్రీ. 1. గుఱ్ఱపుసాల. 2. పఱుపుమంచము మొదలగు పండుకొనఁ దగినవస్తువు (మే. ని.).

**మందురకుఁడు.** సం. వి. అ. పుం. గుఱ్ఱపువాఁడు. మందడీఁడు (శ. ర.).

**మందులమారి.** విశే. ( మందులు + మారి. )

1 మరులుమందు పెట్టువాఁడు, పెట్టునది వశ్యక్రియావేది, వశ్యక్రియావేదిని

ద్వి పాపజాతులు విసపరులు వెడ్డరులు, మాట లమంచులు మందులమార్లు, పండితా పురా 116

సీ. వశ్యక్రియావేది వఱలు మందులమారి యన ఆం భా 3. 14.

**మందులవాండ్రు** వి. బ. (మందులు + వాండ్రు) మందులమ్ముకొని జీవించు నొక యాటవిక జాతివారు.

వ్యవ. ఊరివెలుపల మందులవాండ్రు గుడిసెలు వేసికొన్నారు.

**మందులాఁడి** విశే. (మందులు + ఆఁడి) మర్లు మందులు పెట్టునది.

ఆ. మందులాఁడి చెడుగుమానిసి బూతంబు, పిసిడి బిచ్చెగాండ్ల వెన్నుగుదియ .. చెన్న. 2. 24

**మందెమేలము** వి ( క. మంది (దె) వాళ. )

1. చేనవు, అతిపరిచయము, జంకుగొంకులు కుండుట.

కం. తనయింటిదీప మనుచును, విను ముద్దిడు కొనఁగఁ దలఁచువీఁడి గలఁడే, నను మార్కొ నఁగఁ దలంచెదు, మును పెంచిన మందెమేల మున చాలమునన్. విక్ర. 6. 86.

ద్వి. చిన్న ప్రాయమునుండి చెలిమితోఁ గూడి, మన్నించుటం జేసి మందెమేలమున, బుద్ధి చెప్పెద నంచు భూమిలో లేని సుద్దులు చెప్పెడు చోద్యంబుగాను...ద్వి శ. సా 1, 18 పా 7 పం

కం. అని చెనకుచు నది తను డా, సిన ముని గోపించి యోసిచెడుగ వెలపు మా, లి నను గదియంగ వచ్చెదు, మునుకొని యీ మందె మేలమున కోర్వఁ జమీ. భోజ. 4. 157.

గీ. ఇందు రమ్మనన్న వేగ టొ మ్మెక్కు మందె, మేలమున లోకమాతవు మేలటంచు, జొగడు లోకుల కిచ్చు మెప్పుగ ధనంబు, నెల్లఁ జపలత విహరించు నింట నిలదు. ఉ. హరిశ్చ 2. 69., ద్వి. హరిశ్చ. ఉ 894. పం

2. స్నేహము, చెలిమి.

గీ. పావకుండును గపటంపు భూవరుండుఁ, దమ్ముఁ గడుఁ జేరి మందె మేలమ్ముతోడ, నున్న వారికిఁ గీడు చేయుదురు వారి, కంచిత స్నేహమున మంట అధిక మగును. విపు 7. 105.

మ. తనకుం గూర్చువధూమణుల్ చేనవుచేత నృందె మేలంబువం, కను. వేసారియు నవ్వు లాటలకుఁ బల్కం బల్కువాక్యంబు లె, ల్లను నిక్కంబులుగాఁ దలంచి తగ దల్గ న్నిర్నిమి త్తంబు ము, క్కునసే యుండుఁ గదా మునీశ్వ రులకుం గోపంబు సాటోపమై. విప్ర. 4. 71.

3. ఉపేక్ష, ఒప్పరికము.

సీ. మేనత్త యని మందెమేళంబు సేయక దేవకి మాటలోఁ దిరుగవమ్మ... ముకుంద. 3. 309.

వ సితచ్ఛత్ర చామరశంఖ కిరీటచిత్ర శయ్యా సౌధ సింహాసనంబులు గైకొనుట మనమందె మేలంబునం గాదె...భాగ. 10. ఉ. 578.

శ్లో. వృష్ణయ స్తుల్యతాం నీతా అస్మద్దత్తనృపాసనాః, చామరవ్యజనే శంఖమాతపత్రం చ పాండరం, కిరీటమాసనం శయ్యాం భుంజం త్యస్మదుపేక్షయా. సం. భాగ. 10. 68.

అధ్యా. 23 శ్లో.

4 గర్వము, అహంకారము.

ద్వి. మఱునటాట లిచ్చితో మందెమేలమున, వెఱపు సెడితో మాట వినవో మార్పడితో. పండితా. పురా. 154 పొ.

ద్వి. మనమార విను పిల్చి మగఁడు నెయ్యమున, ననయంబుఁ జేరరమ్మని చేన వొసఁగి, మేల మిచ్చిన మందెమేలంబు మాని, తాలిమితోడ నాతనిచిత్త మెఱిఁగి, సవతుగా నీతోడి సవతులు చూచి, యవునౌనె యని కొనియాడ నెల్లపుడుఁ, గనలక భూదేవిగతి నుండు మమ్మ.. ద్వి. పరమ. 5. 439. పొ. పండితా. వాద. 233. పొ.

5. గేలి, పరిహాసము.

గీ. క్రేణి యనఁ దచ్చన యనంగఁ గేరడ మన, గేలి యన మేల మన మందెమేల మనఁగ, నాట యనఁ దన్తరి యనఁగ హాళి యనఁగ, బొలుచుఁ బరిహాసములు మాత్ర భూతలింగ. ఆం. భా 1. 149.

మందోదరి సం. వి. ఈ. స్త్రీ. రావణాసురునిపత్నీ. (అహల్యాది పంచకన్యలలోఁ జేరినది. అహల్య, ద్రౌపది, సీత, తార, మందోదరి, వీరైదుగురు పంచకన్యలు.)

మందోష్ణము సం. విశ. (అ. ఆ అ) నులి వెచ్చనిది, కొంచెము వేడి యైనది.

వి. అ. న. కొంచెము వేడి, నులివెచ్చన.

మంద్రభద్రము సం వి. అ. పుం. మంద్రజాతి యేనుఁగు యొక్కయు భద్రజాతి యేనుఁగు యొక్కయు లక్షణములు గల యేనుఁగు. (వై. ని)

మంద్రము సం విశ. (అ. ఆ. అ) గంభీరమైనది (ధ్వని.)

వి. అ పుం. 1. వాద్యభేదము 2. గజభేదము. (వై. ని.)

మంపిల్లు(లు) అ క్రి (√మంపు.) 1. మత్తిల్లు, మదించు. క్రొవ్వు.

సీ క్రోల్పులుల్ మంపిల్లి గొటగొటమని రొప్పి బలుసింగముల నైనఁ బట్టఁజూచు. సారంగ. 1 68.

2 చొక్కు, పరవశత్వము నొందు.

ఉ. ముక్కున ముక్కుఁ గూర్చి రవముల్ నిగుడింపుచుఁ దోన పాయుచున్, ముక్కు వడాయుచున్ గలసి మంపిలు నౌర చకోర దంపతుల్. ప్రబంధ 114.

3 నిద్ర మబ్బుతో నుండు, తూగిపడుచుండు. (బ్రౌ.)

మంపు వి (త మప్పు) 1 మత్తు

(క) నిద్రచేఁ గలుగు మై మఱపు, పారవశ్యము. గీ కమ్మ కస్తురి గుళికలు తమి నృలేమ, నిదుర మంపునఁ బక్కిట నించి మేలు, కాంచి వేకువ నుమిసెనాఁ గమలముకుళ, కోటరంబుల నెఱఁదేటికొవమ లెగసె. పారి. 2. 63.

సీ తెలిగన్ను దమ్ములఁ దేఱు నిద్దుర మంపు నవరు నెమ్మది భయం బావరింప ...ఘటికా. 2 214.

సీ. వాడిన తీఁగె కైవడి నున్న మేనితోఁ గెంపు కన్నుల నిద్రమంపుతోడ .... మృ. వి. 3. 91. యయా. 5 26.

(చ) కల్లు మున్నగు మాదక ద్రవ్యములు సేవించుటచేతను, సౌందర్య విలోకనాదులచేతను గల్గు మైకము.

గీ వానుఁగన్నుల కెంపుపై వ్రాలుమంపు ... దశా 9. 33.

ఉ. పేశలబంధ కైశికయు భీతి ముశక్రునిపాత ముఖ్య చే,ష్టాశబలత్వ సక్తతను శంపయునై కను మంపు దాల్చుచున్ ...పాండు. 5. 154.

ఉ మం పెసఁగ న్నటాక్ష లవమాత్రము చేతనె ముజ్జగంబు మో,హింపంగఁ జేయుభారమిఁక నీవు వహించితి గాన ...విజ. వి. 1. 81.

(ట) రూపయౌవన విత్తాదులచేఁ గల్గు మదము.

మత్తు.

సీ. ఎలజవ్వనపు మంపు గలిగి పెంపున మించు చిలుకలఁ బాన్పుపైఁ జేర్చి చేర్చి .. యయా. 4. 25.

2. ఉద్ధతి, మిడిసిపాటు.

గీ. జలధు లంతంతకును మంపు జాల నింకె, ధరణి చక్రంబుకై వడిఁ దిరుగఁ జొచ్చెఁ, గౌర వేంద్రు ప్రయాణ భేరీరవమున .... చిత్ర. భా 7. 3.

3 ప్రకాశము.

గీ మంపు దులకించు ముత్తిగ మానికముల, మొలకనిద్దాక దాని సొమ్ముల మెఱుంగు, లుమ్మడిగఁ గ్రమ్మి నెమ్మేన సొలపు చూప, రాజవరుఁ గాంచె లేచి యా రాజవదన రసిక. 3. 47

విఱ మత్తు గలిగించునది.

గీ. మంపు సాంబ్రాణి ధూపంబు పెంపు పెంపు, వంపు మరువంపు టిందీవరంపు లంపు, గుప్పు మృగమద వాసనల్ గుప్పురవఁగ,సాటి లేకొప్పు నీయింతి జాలుకొప్పు. శశాం 3. 49

జ. మంపిల్లు, మంపుగొను, మంపుగొలుపు.

**మంపుగొను** అ. క్రి. (మంపు+కొను) మత్తిల్లు, మదించు, క్రొవ్వు.

గీ. నల్ల సేనపు గుండులు వడచినట్లు, మంపుగొని మే యెఱుంగక మలసి మలసి నెనరువారికి నుబుకంగ నెగసి మున్నుఁ, బోతు లెడచొచ్చె దాశోఁడు పొదలు వోలె. ఉ. హరి. 4. 26.

**మంపుగొలుపు** స. క్రి. (√మంపుగొను) మైకము కలిగించు, మత్తిల్లఁజేయు. (శ. ర.)

**మంబరము** వి. దహనము, కాల్చుట. (చూ మంబరము చేయు.)

జ. మంబరము చేయు.

**మంబరముచే(సే)యు** స. క్రి. (మంబరము + చేయు) దహించు, కాల్చు.

ఉ ఆ పురుషోత్తమాయుధము నంతకు మున్గను గొన్న భీతిఁగా, శిపతిఁ జేరి యుప్పతిలఁ జేసిన సిద్ధుఁడ నంచుఁ గౌఁగిటం, జేపడఁబట్టి మంబర ముచేసె దిగంబరవేష కృత్య .. ఉ హరి. 3. 153.

(శ. ర. వీరేశ.చి, ని. పా. మంబరము చేయు. వావిళ్ల పా.)

**మకమక** వి. (క. మంకు) 1. తేజోహీనత, కాంతి హీనత.

కం. అనఁ జెలునప్పు మొగంబునఁ, దనరఁ జకచ్చకితకర్ణ తాటంకరుచుల్, దనుకన్ మకమక చినుకన్, గనకాంగి హొయల్చెలంగఁగా నిట్లనియెన్. శశాం, 3 59

2. తేజోహీనతను దెలుపు అనుకరణము. (వ్యవ) దీపము మకమకలాడుచున్నది, కొంచె మెగసన ద్రోయుము

**మకరందము** సం. వి అ పుం 1. పూఁదేనె, పుష్పరసము. 2. కుందము, మొల్ల. (వ్య.వి.). వి అ న. కింజల్కము, కేసరము.

**మకరందవతి** సం. వి. ఈ. స్త్రీ. పాటలలత

**మకరకంఠి** సం. వి. ఈ. స్త్రీ. వడుమ మొసలి ముఖ మేర్పఱచిన కంఠ భూషా విశేషము. (శ. ర.)

**మకరకుండలము** సం. వి అ. న. మకరము వలె నుండు చెవులపోఁగులు. మకరమువలె నుండు కర్ణభూషణము.

**మకరకేతనుఁడు** సం. వి. అ పుం మన్మథుఁడు, మరుఁడు.

**మకరకేతువు** సం. వి. ఉ. పుం. మొసలి టెక్కెము వాఁడు, మన్మథుఁడు.

**మకరతము** సం. వి. అ. న గారుత్మకమణి.

(ఈ రూపమునకు ప్రమాణము లేదు. కాని ఈ క్రింది పద్యమున ప్రాసస్థానమందున్నది.)

చం. నకి యకలంక తోయకణ సంగత పద్మపలాశ మధ్యమా, ల్లకరుచు లొప్పెడిన్ గొలఁకులచ్చి నిమన్గని చెల్మి హెచ్చేగా, మకరతపాత్రలో

విమలహౌ_క్తికముల్ జతగూర్చి రత్నదీ, పకలన నిచ్చునారతుల భావమునన్ గనుఁగొంచెు ఉచ్చటన్. ఉ శా 6. 76.

మకరతోరణము సం వి. అ. పు న. మొసలి రూప మేర్పడఁ జేసిన తోరణము (శ ర.)

మకరధ్వజుఁడు సం వి. అ పుం (మొసలి టెక్కెమువాఁడు.) మన్మథుఁడు.

మకరబిబ్బి — మకరబ్బి మి. వి మకరతోరణము. దేవతలను గురువులను రాజులను ఊరేఁగించు నప్పుడును జయోత్సవములందును ముందు గొని పోవు గౌరవచిహ్నము

మ. జతనన్ దత్పురి జంభభిన్నగరిమున్ సాధిం పఁగాఁ గోరి యీా, స్మితముల్ చేకుఱ నెత్తునా మకరబిబ్బిలో యనన్ మించునం, చిత శక్రోపల సౌధజాలములు ... చంద్రా 2. 16.

మకరబ్బి — మకరబిబ్బి మి. వి. మకరతోరణము.

మ. ... గొజ్జంగియున్, మకరబ్బి గురుజాపరుంజు వెలయన్ మూరుండు ధే యంచనన్, శుకఘోటిం గుదెఁ దట్టి మీఁజెు వడిగా సుత్రాము మోసాల కున్. పార్వ 2 114

మకరము సం. వి అ. పుం. 1. మొసలి. 2, (జ్యోతి.) మకరలగ్నము. 3 మకరాకారముగా సేనలను పన్నుట, మకరవ్యూహము. 4. మొసలివలె నుండు చెవులిపోఁగు, కర్ణభూషా విశేషము. 5 మకరముద్ర (మొసలివలె ముడిచిన చేతులు) 6. కుబేరుని నవనిధులలో నొకటి.

మకరవాహనుఁడు సం వి. అ పుం. వరుణుఁడు

మకరాంకుఁడు సం వి అ పుం 1. మన్మథుఁడు 2 సముద్రుఁడు.

మకరాకరము సం. — మకరాలయము

మకరాలయము సం వి. అ. పుం. 1 సముద్రము. 2. నాలుగు సంఖ్య.

మకరిక సం వి అ. స్త్రీ మకరికాపత్త్రము (శ ర.)

మకరికాపత్త్రము సం. వి. అ. న స్త్రీలకు చెక్కిళ్లు లోనగుతావులయందు లత్తుకతో వ్రాసెడు మకర రూప మగు రేఖ (శ. ర ).

మకరివల వి మృగములను బట్టెడు ఒక విధమైన వల.

వ . తెరచీరకట్టలు ప్రోగుచుట్టలు దొడ్డివల లేటివల కుందేటివల పందివల నవదండ వల మకరి వల యెలికవల మొదలుగా వలయు వలలను . . కాశ. 3 46

గీ .. దొడ్డి, వలలుఁ బందిటివలలును బలుపు మకరి, వలలు మొదలుగఁ గలిగిన వలలు మఱియు. యయా. 1. 38.

మకిల వి (సం. మలినమ్ ) 1 మురికి, మాలిన్యము.

(వ్యవ ) అద్దము మకిలపట్టినది

2. నలుపు (శ. ర ).

విశ మలినము, మురికి యైనది (ప్రౌ.).

జ మకిలక్రోవి

మకిలక్రోవి (మకిల + క్రోవి.) నల్లనిక్రోవి. ఒక విధమైన సుషిరవాద్యము, ఊదెడు నొకానొక వాద్యము

సీ. .. బూరగొమ్ములు కంచువీరణములు, మకిలక్రోవులు వీరమద్దెలల్ ... మొ. రా యు 3.26.

మకుఁడు సం వి అ. పుం మాలూకియందు వైశ్యుని వలన పుట్టిన సంకరజాతివాఁడు (వై . ని.).

మకుటము సం. వి అ న కిరీటము.

మకుతి సం. వి. ఇ స్త్రీ. శూద్రశాసనము (త్రి, ని.).

మకుర(ల)ము సం. వి అ. పుం. 1. అద్దము 2 వకుళవృక్షము, పొగడచెట్టు, 3. మొగ్గ, కళిక. 4 కులాలదండము, కుమ్మరిసారెఁ ద్రిప్పెడి కఱ్ఱ,

మకురు విశ (త. మక్కు-) మూర్ఖుఁడు, మొండి వాఁడు. ( చూ మకురుతనము. )

జ. మకురుతనము

మకురుతనము వి, ( √మకురు ) మూర్ఖత్వము, మొండితనము. (శ. ర.)

మకుష్ట(క)ము సం. వి. అ. పుం. వనముద్గము,

అడవి పెసలు.(వృ. వి).

**మకుష్ఠము** సం విశే. ( అ. అ ఆ ) మంథరము, మందమైనది. వి. అ. పుం అడవి పెసలు (వృ వి) (త్రి ని.)

**మకూలకము** సం. వి. అ. పుం. 1. ముకుళము, మొగ్గ, 2. దంతివృక్షము, నాగదంతి చెట్టు.

**మక్క — మక్కనగాయ** ( సం. మక్కలః. క. మక్క. ) బిడ్డలను గన్నస్త్రీకిఁ బొత్తి కడుపునఁ బుట్టెడి యపాయకరమైన నెత్తురు గడ్డ (శ ర ) జ. మక్కనగాయ

**మక్కనగాయ — మక్క** వి. (మక్క + కాయ. వృత్తిని వర్ణాగమము) (శ. ర )

**మక్కరాయి.** వి. (సం, మకరతమ్ ) మరకతశిల. వ. ... ఎక్కువవెల పెక్కువ గల మక్కరాల మిక్కుటంపుఁ దిన్నియల వన్నియలు. ఇందు 1 17.

**మక్కల్లము** సం. వి. అ పుం. మక్కనగాయ, ప్రసవించినస్త్రీకి ప్రసవరక్తావరోధమున గర్భమునఁ బుట్టెడి యపాయకర మగు నెత్తురుగడ్డ, ప్రసవ రక్తావరోధమున కలుగు శూల.

**మక్కళించు** స. క్రి. 1. పరిచేయు, సమానము చేయు.

గీ. తొడలు ననఁటికంబంబులు మెడలుఁ బోఁక, బోదెలు నెలుంగులును బరపుష్టరుతులు, మాటలును గీరభాషలు మక్కళించి, చిగురుఁబోఁడులు వనకేళి చేయఁజేయ... ఉ. హరి. 5 50

2 ఉలికించు, ఉబ్బునట్లుచేయు.

సీ. ఐణేయ మైన యొడ్డాణంబులవణిచే నక్కళించినపొట్ట మక్కళించి ... మనుచ 1. 59.

3. కూర్చు, అమర్చు.

సీ నేసకొప్పునఁ జుట్టు శిఖిపింఛరింఛోళి మక్కళించిన జిల్గు మడుఁగుపాగ ... కాశీ 3. 118

సీ. మారేడుబుఱ్ఱలో మక్కళించుక సందిఁగట్టిన చంద్రశేఖరుఁడు వెలయ ... హంస 1 182.

(సరిపఱచు అని శ. ర )

4. పెంపొందించు, వృద్ధిపొందించు.

సీ. కరికరశీకరకణములు విక్రాంతమకుటముక్తారుచి మక్కళింప ...

గీ వరుణుఁ డరుదెంచె విక్రమోద్ధురత మెఱయ. ఉ హరి. 6. 252

( ఇట అ. క్రి. సరిపోలు అని. శ. ర )

అ క్రి. 1 జ్వరాదిరోగము తిరుగఁ బెట్టు,మాని మరల వచ్చు.

(వానికి జ్వరము మక్కళించుకొన్నది. శ. ర.)

2. మిశ్రిత మగు, కలియు.

సీ శరధనినాద విస్రస్తంబులై గమనించు కంఠీరవ నిక్వణంబుఁ, గంఠీరవవారవ స్థగితంబులై చను భీత వన్యకరీంద్ర బృంహితంబు, గీ. మక్కళింప ...

(మక్కడింప, ముద్రి. పా ) పి శకుం 2 5.

3. వ్యాపించు, ప్రసారితమగు.

సీ మక్కళించిన కావుమంజిర్ల పెందెర లుంగరంబులఁబట్టి యొత్తువారు .. నైష. 6. 108. (సరిపడు అని శ. ర )

**మక్కా** వి (సం. మఘః మ్లేచ్ఛ, దేశభేదే అని వాచ క మక్కా.)

అరేబియా దేశములోని యొక పెద్దపట్టణము, యవనకాశి, మహమ్మదు జన్మస్థానము. చూ. మక్కాచెంబు

జ : మక్కాచెంబు.

**మక్కాచెంబు** వి. (మక్కా + చెంబు.) మక్కావట్టణమున చేయు నొకవిధమైన పాత్రము, కూజా

శా. మక్కాచెంబులఁ జల్లఁ జేయ వడగండ్లంబోలు సౌరభ్యస, మ్యక్కద్వీపవతీ జలంబు జనమాహా యంచుఁ ద్రావెం దమిన్... పాంచా 4. 51

**మక్కి**[1] విశే (√మక్కు[1]) నిర్మాంసము, కుష్కించినది.

ద్వి. మిట్టమదురు మక్కి మెడయును ప్రాఁకు, పట్టిన యరమిడిపండ్లు ... అమర ... శివుఁడు...

అంత్యజభావంబు దాల్చి. పండితా దీక్షా. 40 పొ

గీ. మందగుది రెప్పగొరిసెలు మక్కిరొండ్లు, బరతుమురుకొమ్మలును మోటుబర్లు ... యె లీద యెద్దుఁజేరి. హంస 5. 31

మక్కి2 వి (సం. మక్షికా. హిం. మఖి క. మక్కి — ప్రతి ) ఈఁగ.

ఇది మక్కికి మక్కిగాన్' అను వ్యవహారము వందే కనఁబడుచున్నది.) మక్కికి మక్కిగా — యథాస్వరూపమున, ఉన్నది యున్నట్లుగా, సరిగా.

(వ్యవ ) వాఁడు దానిని మక్కికి మక్కిగా వ్రాసి తెచ్చినాఁడు (ఇది లేఖకుని బుద్ధి మాంద్యమును సూచించును)

మక్కించే — ప్రమక్కించే స క్రి (√మక్కు )
1. చంపు, వధించు.

కం. ఆక్కాంతఁ బుష్పకముపై, నెక్కించుకొని చేని చూపి యిదె రాఘవులన్, మక్కించె మేఘ నాదుం,డొక్కఁడ యని యతవి యాస యుడుపుఁ దటంచున్. రా. మా. 8. 28.

కం. నిక్కమగు పాపములచేఁ, జిక్కితివి నిశాత శూల శిఖరాగ్రమునన్,మక్కించి నీదు మాంసము, నక్కలుఁ గుక్కలును జేరి నమల నొనర్తున్ (శ. ర. పా ప్రమక్కించి ముద్రి. పా.) భాగ. 6 394.

2. వశింపఁ జేయు, చెఱుచు

ద్వి. ఒక్కొక్క జనుఁ డుర్వి నొదవు పాపముల మక్కించు వేణుగుల్మము నగ్నివోలె ద్వి భాగ 6 స్కం (శ. ర.)

3. నిర్జించు, జయించు, గెలుచు

కం. దిక్కుల రాజుల నెల్లను, మక్కించి ధనంబు గొనుట మయకృతసభ ము,న్నెక్కుట జన్నము సేయుట, నిక్కము వారి మనకు దండ నిలిచినఁ గాదే' (శ.ర.పా. ప్రమక్కించి. ముద్రి. పా.) భాగ. 1. 361.

మక్కిలు(ల్లు) — మక్కు1 అ. క్రి. (√మక్కు1) వశించు

కం. లక్క కషాయమ్మును జా,ల్చక్కెరయును నశ్వగంధి సతతము నియ్యన్, మొక్కలపు టస్థి గతములు, మిక్కిలి పెనుత్రోవఁ జనును మండ లమునకున్ (చి. కి , చి ని.)

మక్కు1 — ప్రమక్కు అ. క్రి (త. మక్కు )
1 కాంతి విహీన మగు.

సీ వెలవెలనై నభోవీథిఁ దారలు మక్క ... కన్యకా 8. 315. (శ ర, ప్రా.)

2 నవయు, కృశించు, చిక్కు.

ఉ ..విధాత నిర్దయుం,డక్కట నీరునుం దృణము నాని మహోగ్ర వనాంతరంబులన్, మక్కెడు నీకు నిట్టి యవమానము మానము దప్పఁ జేసెనే (శ ర పా ప్రమక్కెడు ముద్రి.) నా. పంచ 2 179.

3. (రోగముచే) విరూప మగు, రూపుచెడు

కం. ప్రుక్కిన యంగుళములు దల, మెక్కిన దేహమును గాంతి యెడలిన మొగమున్, మక్కిన చెవులును ముడిఁగిన, ముక్కునునై వచ్చి మహుఁడు ముద్దియఁ గనియెన్. భోజరా. 1. 101

4 మగ్గు, ఉక్కచే నుడుకు.

వ ... మఱియు నొక్కయెడ నెడ మీని మానిసి యుక్కలఁ జిక్కి యుబ్బపాఁతరలను మక్కిన క్రియ నూర్పుగాడ్పుల కవకాశంబు లేకునికి తమలోఁ దారొకరి కొకరు పదిరిగొని...ప్రబంధ 78.

5. చేచ్చు. మృతినొందు

వ అక్కలుంగవప్రక్కం జిక్కి మక్కిన మర్కటులు రక్కసులు పెక్కండ్రు గలరు. రామా, 8. 154.

వ. ఇట్లు పెక్కువరుసలు రక్కసుల యుక్కివంబున మక్కినం బ్రతికింప నుండి వెండియు నొక్కనాఁడు ... యయా. 3. 121.

వి. (త. మక్కు — మాంద్యము.) 1. మాలిన్యము, మురికి.

సీ. దూళ్లమక్కెక్కి మంగళ్ల తిప్పలు రేఁగు వడు వుచ గాలి నాడెడు నెఱకలు.. ఆము. 6. 17.

విశ. మాసినది, మలిన మైనది,

సీ మక్కు మాసినవి నా మలినంబు విలసిల్లు. అం ఖా 3. 15.

జ. మక్కి[1], మక్కించు, మక్కిలు, మక్కుడు.

**మక్కు[2]** వి. నితంబైకదేశము, తుంటి.

సీ .. పల్లు, మక్కు నాఁ జను నితంబైక దేశము. అం ఖా 2 136.

గీ. కదిసి కురువీరు లభిమన్యుఁ గక్కసింప, నిక్కు జిగి నొక్కమొగిఁ బెక్కు కుక్క లెక్కి, పిక్క ప్రక్కయు డొక్క పేరుక్కు బెక్కు, మక్కు చిక్కించుకొన ప్రుక్కె నక్కటియును. రా. వి 3 67

**మక్కు[3]** వి (త మక్కు) బల్లలు మొదలగు వాని యతుకులును సందులును కనఁబడకుండ రాచుట కుపయోగించు నొకవిధమైన జిగురు పదార్థము, లప్పము

(వ్యవ.) వడ్రంగి పెట్టెలకు మక్కు పెట్టినాఁడు.

**మక్కుడు[1]** వి (√మక్కు[1]) ముఱికి, మాలిన్యము.

గీ. ప్రెంచి గురివెంద పేరు ప్రొమ్మించు వడిన, మేఘ మనఁ దోఁచునొక కట్టిమేని యొబుకు, ప్రాతఁ నెత్తుట మక్కుడువట్టియున్న, యంపగమి ముందటం బెట్టి యడ్డుపడియె. కకు 4 49.

**మక్కుడు[2]** విశ. గుప్తము, దాఁచఁబడినది. (చూ. మక్కుడువేయు) జ. మక్కుడువేయు.

**మక్కుడువేయు** ·. క్రి (√మక్కుడు[2]) (సొమ్ము) ఇతరులకుఁ దెలియకుండ దాఁచు

(వ్యవ.) వాఁడు తన యన్నదమ్ములకుఁ దెలియ కుండఁ జాలసొమ్ము మక్కుడు వేసినాఁడు

**మక్కులము** నం వి. ఌ పుం శిలాజతువు.

**మక్కువ** వి. 1 ప్రేమ, కూరిమి.

సీ నెయ్యము నెయ్యమి నెమ్మి నేస్తము నెన రెలమి మే ల్కూరిమి చెలిమి యరిమి.

గీ శాశి ప్రేముడి మచ్చిక మక్కువ యనఁ, క్షేమ దోఁచును ... అం. ఖా 1. 136.

(క) వాత్సల్యము, పుత్రాదులయం దుండు ప్రేమ

కం అనిన నతఁ డేను సూర్యుఁడ, మనమున నీయందు గలుగు మక్కువఁ గర్ణం, బొనరఁగ నుపదేశింపం, జనుదెంచితి ... భార అర. 7 267.

ఉ. మక్కువ రేఁగి నెయ్యపుఁగుమారునిఁ ఱంపుట కంతరాయమై, యక్కటికంబు పుట్టుటకు నల్లన వచ్చి భవాని ... హర 2. 94

చం. ... నన్, మమతను జేరఁగాఁ బిలిచి మక్కువచే నను నొక్కకేల మే, నిమురుచు నీకు నొక్కమగనిన్ ఘటియించితి నంచుఁ బల్కుచున్. ప్రభా 1. 125.

(చ) స్త్రీ పురుషుల పరస్పరానురాగము, వలపు.

ఉ. ఒక్కొకవేళఁ బద్మముఖు లొల్లమి నేయుదు రొక్కవేళఁ బె, న్మక్కువ నాదరింతురు. మనుచ. 3 69.

గీ. ఆ నితంబిని మక్కువ తవఁగి పెనఁగి, యింపు బొంపిరివోవ వన్నెలికొనఁగ, దలఁచి పొందిన నది జన్మఫలము గాదె భార. విరా. 2. 86.

ఉ. ... శిరస్థలంబుఁ జ, న్నుల నెదురొత్తి మక్కువ ననుం బిగిశౌఁగిట జేర్ప వేఁటికే. పారి. 1. 117

(ట) స్నేహము, మైత్రి

ఉ రక్కసులార మీ ం సుర ల్సమయత్న బల ప్రయాసులై, యిక, కలిన్ మథించ జనియించిన యీసుధ మీరు వాఁ బె, న్మక్కువతో భుజింప నయమార్గము ... దశా. 2. 343.

ఉ. ఓ నృపపుత్ర మద్గురునియోగమునం జని యేము నిత్యమున్, గావనభూములన్ వలయు కాయలు పండ్లును దర్భ లిధ్మముల్, మానుగఁ గోసి తెత్తుము క్రమంబున నీవును మమ్ముఁగూడి ర, మ్మా నిఖిలంబు చూపెదము మక్కువతోడుత వాని యిక్కువల్. హరిశ్చ. 5. 80.

2. కుతూహలము, వేడుక.

కం. రాచసిరి యుండియును మది, యాచవికిం జొరదు నాకు హరికి నిచటిజా, ల్యాచరణముపై మక్కువ, యేచందంబులను మఱవ నెన్నఁడు రామిన్, హరి. ఉ. 2 79.

ఉ. అక్కట తండ్రి యేల మరువయ్యెకుఁ బెండ్లి యొనర్తు నంచుఁ బె, న్మక్కువ నుండుచోఁ దెలుఁగు మాలిన టక్కరి యాలపోతు లి, ల్లెక్కడ నుండి కల్గె ... నీలా. 2. 72.

జ మక్కువకాఁడు

మక్కువకాఁడు విశ. ( మక్కువ + కాఁడు ) ప్రేమగలవాఁడు, ప్రియుఁడు

వ పెక్కువిధంబులం జొక్కించి చిక్కక చక్కం బోవు మక్కువకానికై పొక్కి తమిం జిక్కి. ప్రద్యుమ్నచరిత్ర. 3. 75

మక్కె వి అస్థి, ఎముక

(వ్యవ ) ఇంకొకమాటు తిట్టినచో మక్కె విఱుగును జాగ్రత్త. (నిత్యబహువచన మని శ, ర., బ్రౌ.)

మక్కోలము సం. వి. అ. పుం. ఖటిక, సుద్ద.

మక్వణము సం వి అ. పుం. యుక్తకాలము నందు దంతములు రాని పొట్టియేనుఁగు (వై. ని ).

మక్షము సం వి అ. పుం. 1. కేసము 2. సమూహము, గుంపు.

మక్షవీర్యము సం. వి. అ పుం. ప్రియాలము, మోరటి (వృ వి ).

మక్షిక సం. వి ఆ స్త్రీ. ఈఁగ.

మక్షికామలము సం. వి. అ. న. పుం. మయినము.

మక్షీక సం, వి. మక్షిక.

మక్షికాషులము సం. వి. — మక్షికామలము.

మక్షుణము సం. వి. అ. పుం. ఏడుమాసముల కోలఁది (వై. ని ).

మఖద్విషుఁడు సం. వి, ష్ పుం. రాక్షసుఁడు, పిశాచము.

మఖము సం వి అ. పుం యజ్ఞము

మగ ప్రాతిపాదికము. దీనికి మహద్విపక్షయందు మగఁడు మగలు అనియు నమహద్విపక్షయందు మగది మగవి అనియు రూపము లగును విశ (క. మగ త మగల్ ) పురుషజాతిది.

సీ మగమీల నగఁ జాలుతెగఁ గీలుకొను వాలు కనుఁగవ కొకవింతకాంతి యొదవె .. పారి 1. 56

కం తొలుప్రాయపు మగకొదమ౯, తలఁపుల తమకములు మిగులఁ దను నెదురుకొనన్, జలజాక్షి జవ్వనముగడు, వెలసెఁ బ్రతిక్షణము వింతవింతగ వంతన్ కళా 1 28

చం కలువలయమ్ములం బ్రసవకార్ముకమున్. విక్ర. 1 84

కం. ఏనుఁగు గుఱ్ఱముఁ బచ్చని, మ్రానును మేడయును మెట్టు మగపసరంబున్, బూని కలలోన నెక్కువ, మానవునకు సుఖము రాజ్యమహిమయుఁ గలుగున్ ద్వా. 9 69

(మగపసరము — వృషభము.)

2, శూరుఁడు

కం. నీ వొకత వేల యిటఁ బది, వేవుర నే వలచి పట్ట వెదకిన నడ్డంబై వచ్చి వలదు నా నిం, దేవాఁడు మగండు దీని నెఱుఁగవకంటే భార. విరా. 2 256

గీ. మెఱసి మూఁడులోకంబుల మేటిమగలు, రాయ నేర్తురె యాదవరాముతోడ.. ఉ హరి. 1. 8,

సీ. అతిదుర్జయుండైన ప్రతివీరు నిట్లు రూపణఁచి యుబ్బలుమగం డన్నకడకుఁ జని ... రాఘవ. 4 228

వి 1 పురుషుఁడు.

కం. మగ లడఁకువ నుండక తమ, తగులమ పాటింతు రెట్టితగులంబైనన్, మగువల యెడలన యడఁగుం, దగవు విడిచి యడిచిపడరు ధైర్యము పేర్మిన్. భార. విరా. 2. 231., అం. భా. 2. 103.

సీ. మగ లాడువారికి మరిగి ముచ్చిలి బలిదివట్టి
కన్నంబులు వెట్టి తెరువు, దెక్కొని చని ...కష్ట
ముల్ వడి రాక గలదు గాక, అ. మగలఁ గోరి
తొల్లి మగువలు తపములు సేసి వవసి రనినచెట్ట
లెందుఁగలవె . కు సం 7. 867.

కం ముమ్ము వివాహము సేయని, కన్నియ
యొరుఁగలిసె నేని క్షతయగు మగపొం,దెన్నఁడు
లేక విధవ యగు, కన్నియ యక్షతసమాఖ్య గలిగి
చరించున్ విజ్ఞా 1 118.

గీ మంజువాణిమనోవ్యథ మగకఅవునఁ బడిన గతి
మాడఁదత్పుర ప్రాంతసీమ . శుక. 3 547.
చంద్రా. 6 123

2. భర్త, పెనిమిటి

ఆ. మగఁడు లేనిమగువమాడ్కి గాకున్నె నా,
సేన భీష్ముఁలేమిఁ జెసి నేఁడు భార. భీష్మ 1.
62.

కం. ఈ వచ్చురథంబులవా, రేవురు నీమగలె
యంబుజేక్షణ .. భార అర. 6. 203

సీ . . పద్మనాభుఁ గానంగఁ జనుదెంచి కిటుఁ
బ్రీతి నిట్లను ననఘ యే మీకు మేనత్త మగఁడ
గీ. వినుము దమఘోషుఁడను వాఁడ .. హరి.
ఉ 1 139 , అం. భా. 2. 115

3. రాజు, ప్రభువు.

ద్వి మన్నెరాజుల కెల్ల మగఁడనై యుండు.
వన్నెనఁ దలఁపక నాముద్దుఁగూన, తిప్పకాయపు
వలెఁ దిరిగి యిల్వరునఁ దప్పఁగ వడుతవా.
ప్రభులిం 8 56 పా. 4 వం.

4. ఇది కర్మధారయ సమాసమునం దుత్తర పద
ముగ నుండునపుడు శ్రేష్ఠవాచకము.

మ అపుడాపక్షి మగండు రక్కసుల జియ్యంబాఁకి
యభ్రంగి నుగ్రపుఁగయ్యం బొనరించి మూర్ఛిల
బలాత్కారంబువన్ వాఁడు లోకపవిత్రన్ జనక
క్షితీశతనయన్ గాకుత్స్థ వీరాంఘ్రిప, ద్మపటు
ధ్యానవరాయణన్, రథము మీద న్నిల్పి కొంచుం
జనెన్ రామా. 5. 204.

మగపంద — పిరికిమానిసి

మ. అదె నాబిడ్డలఁ బట్టి దొంగలు మహాహంకా
రులై కొంచు ను, న్నదు లై పోయెన ఁడ్డుపాటు
నకు సామర్థ్యంబునన్ హీనుఁ డై, కదలం డీమగ
పంద కూరుకుగతిన్ గన్నూసి . భాగ. 9.
405.

మగలంజె (జియ) — విటుఁడు.

ద్వి. మలయుచు మురియుచు వగలంజవోలె,
మానాతి వలపించి యే నేఁడు నీవు, గానక తల
క్రిందుగా నడచెదవు పండితా. పురా 123

చం లలనలఁ దేర్పఁ జూచు మగ లంజియలం గని
వారిపొంతఁబోవలవదు రొక్క మీఁగలుగువాఁడె,
మనోజుఁడు గూలియాలికిన్. కు సం 8 143.

మగపిచము — మగపురుగు, పురుషవేషము.

కం. వినుము ధృతరాష్ట్రవంశం, బున మగ
పించంబు నెల్లఁ బొలియించితిఁ గృ, ష్ణుని కారు
ణ్యము జిష్ణుని, పెనుబ్రాపును గలుగ నేను విగత
భయుఁ డనై.. భార. సౌ 2. 91

మగత్రాడు — మగతాటిచెట్టు.

కం. మగత్రాడునందు నుద్భవ, మగుమో పొక
టొకటి గాల్చి యజదుగ్ధములన్, దగఁ బ్రదినం
బులు త్రావఁగ, మగువకు బుతువుదయమగును
మాన్యులు మెచ్చన్. (చి. శి., చి. ని.).

మగపాలు. పురుషునిభాగము. భర్తృభాగము.

సీ. ఈనీరజాతాక్షి మేనిలో సగపాలు గణుతింప
మగపాలు గాఁగ నున్నది ... హర. 3. 25.

మగలమగఁడు — శూరాగ్రేసరుడు.

కం. మగువ మగవారిముందఱ, మగతనములు
సూప రణము మానుట నీకున్, మగతనము
గాదు దనుజులు, మగువల దెసఁ జనరు మగలమగ
లగుట హరి భాగ. 10 ఉ 190.

చం. గగనము మ్రోసె వీచె సుడిగాలి సముద్రము
లింకె మేరువున్ దిగఁబడె భూమి చక్రముగతిం
దిరిగెన్ రవి త్రోవఁ దప్పె న, మ్మగలమగండు
వీఁక దశమం బగు మస్తక ముత్తరించి వే, ల్వఁ
గడఁగి హోమవహ్ని కటులంబుగఁ బ్రజ్వరిలంగఁ

జేసినన్. ఉ రా. 2. 178

లయవిభాతి. ... నయన యుగళి వెలిదామరల మగలమగ లై డా, లెగయ . . గగనచరుఁ డయ్యెన్. మనుచ. 4 117.

(ఇట ఔపమ్య ద్యోతకము.)

ఇక్లే మగలరాజు.

గీ పరశురామునిశాపంబు బాణశక్తి, గ్రావఁ బ్రాహ్మణశాపంబు రథము సిక్కు, వఱుప గాండీ వధరుచేతి మెఱుఁగుటయు, మన్నె గొనియెనె యోకర్ణ మగలరాజ భార. స్త్రీ 2 90.

గీ మాట లేఁటికి వేయు నోమగలరాజ, విశ్వ మున నీవు లేకున్న వెలితిపడియె ... హార. 3. 89.

షా మగఁ డొల్లని నతిని మారి యొల్లదు,

కం. ఇల్లీల నుండ నింటం, బల్లియు నను జౌక నేయుఁబలుకులు వినరే, యెల్లెడ లోకములో మగఁ, డొల్లని యా నతిని మారి యొల్ల దనం గన్. శుక. 2 116.

జ మగఁటిమి, మగచెయ్వు, మగతనము, మగ నాలు, మగనిల్వు, మగపంతము, మగపాడి, మగపోడిమి, మగపోల్కికూటమి, మగమాట, మగమానికము, మగరా, మగలాగు, మగ వాఁడు.

మగఁటిమి వి (త మగసైన్మ √మగ.)

1 శౌర్యము, పౌరుషము, పరాక్రమము.

ఉ. ... చూచి ర, వ్వాఁడిమగంటిమిన్ వెలయు వాని వృకోదరు నెల్లవారలున్ భార. ఆది 6. 306

ఉ పాండవ సైన్యముల్ గలఁగి పాఱెడు సిగ్గటి వీరిలోన నొక్కండును భీష్ము మార్కొని మగం టిమి సూపఁగలేఁడ ... భార. భీష్మ. 2. 147.

2 మగతనము, పుంస్త్వము.

చం ... అరాతిభయంకరు హేమవర్మ నాగడ మున గాసిచేసితి మగంటిమి నీ దెసనైనఁ జూపుమా. భార. ఉద్యో. 4. 376.

గీ. ... పౌరుషంబు మగతనము, మగఁటిమి యనంగఁ దిర్యక్పుమర్థమందు, నౌపచారికమైన గండనెడివల్కి, భావకర్మంబులను గూడఁబరఁగు నభవ. అం. భా. 2 103.

3. పురుషా...తము, ఉపరతి

గీ హెచ్చి మగఁటిమిఁ జూపుచో నొచ్చెనేమొ, యొత్తుదునె యంచు నంఘ్రిఁ గేలుంచునెనరు .. ఉ రా. 6. 168.

మగచెయ్వు వి (√మగ) సంభోగము, రతి

సీ మగలతో నిదురించు మగువల మఱపించి మగ చెయ్వు లొనరింప మదిఁదలంచు ... నీలా. 1. 76

(నిత్యబహువచన మని శ. ర.)

మగతనము వి. (√మగ) 1 పరాక్రమము, మగ టిమి. పౌరుషము.

కం. ప్రేలకు జీలుగు వెరిఁగిన, మాలెకుఁ గంబంబు గాదు మాటలు మిగులన్, నాలుగు గఱచినయంతనె, చాలునొ మగతనము జూప సాత్యకి యెదురన్ ఉ హరి. 3 50.

గీ. ... పౌరుషంబు మగతనము, మగఁటిమి యనంగ ... భావకర్మంబులనుగూడఁ బరగు నభవ. అం. భా. 2. 103.

గీ. అరయఁ దీవంచ వార్వంపుటగ్గిపట్ల, వడుమ నడరొందు నాడెంపుఁ బుడమిఱేఁడు, లెల్లఁ గద లింప లేని యువ్విల్లు దునిమె, నిప్పు డీతని మగ తనం బెన్నఁ దరమె అచ్చ. రా బాల 184

2. పురుషత్వము, పుంస్త్వము.

చం ... ఒదవుఁగాక భవత్కృత దుష్టచేష్టితం, బుఁకు ఫలంబునేఁ డొకటి పూర్ణముగా నుప భోగ్యమై కడున్, జలమున నెందు నీ మగతనంబు కడంకల రూపుమాలుటల్. (భారతార్థమున.) రాఘవ. 3. 75.

3. రతి, సంభోగము.

గీ. కువల, మధులహరి నద్దిపైఁ జెంది మగతన ముల, నొక్కెడలఁ గూడుచు స్రవంతు లుబ్బు

పెనఁచె. ఆము 4 183

(ఉపంతి అని వ్యాఖ్య)

**మగధ** సం వి ఆ స్త్రీ పిప్పలి

**మగధపురి** సం వి ఈ స్త్రీ. మగధ దేశస్థుల పట్టణము

**మగధము** సం వి అ. పుం 1. మగధ దేశము. (బీహారునకు దక్షిణ భాగమున నుండు దేశము.) 2 మద్దుక మను వాద్యభేదము. 3 ఫలకము మొ వాని పిడి (శే. ని.).

**మగధుఁడు** సం వి. అ. పుం. 1. మగధదేశ రాజు. 2 బట్టు, వంశావళి చేదువువాఁడు, స్తోత్రపాఠకుఁడు (కల్ప).

**మగధోద్భవ** సం వి. ఆ స్త్రీ పిప్పలి (వ్య వి.).

**మగనా(నియా)లు** వి బొ (మగని + ఆలు) మగఁడుగల యాఁడుది, భర్తృమతి, కులస్త్రీ

సీ ఒర్పుమై నుప్పిండి నుపవా ముండనీ మగనాలి సరివోల్పఁదగదు విధవ . కాశీ 2 83

గీ తగవుఁ జెప్పంగ నిన్నుఁ బ్రార్థన యొనర్చి, యెవ్వ రిచటికిఁ దెచ్చిరో చివ్వలాఁడి, నీవు చెప్పక యుండిన నే మెఱుఁగమె, పుడమి వర్తించు మగనాలి నడత లెల్ల హరిశ్చ 4. 177.

సీ పతివత్ని యనిపల్కఁబడు మగనాలు నానైదువరాలన నైదున యన ... ఆం. భా. 2. 107

గీ హాస్యకథలందు గీతవాద్యములయందుఁ, బ్రీతి నెఱపుట మగనాలి రీతి గాదు .. పి శకుం. 4. 75.

కం. కాఁగాని మాట లాడెదు, రాఁ గూడదునేఁ దపశ్చరణమై నుండం, గాఁ గోమలి యిటు నిల్వక యేఁగుము మగనాలి కేల యీ దుర్గుణముల్. భోజరా. 4 148

కం అభిమానవతులు ముగ్ధలు, సఖిజాతలునైన మగని యాంధ్రుర కారే, వ్యభిచారమునన తనయుల, బుభునిభులం గనిరి మున్న నేకుల నతివా. హరి. పూ 9. 76

**మగనిల్వు** వి. (√మగ) చేయిపై కెత్తి నిలుచున్న పురుషుని యెత్తు.

ద్వి ఇదె నూఱుమగనిల్వు లోయున్న బిలము. పండితా పర్వ. 386 | పా.

**మగపంతము** వి (√మగ) 1. మగఁటిమి, పౌరుషము, శౌర్యము.

మ. మగపంతంబున మానపౌరుఁ దనిలో మాకల్గి సై నెత్తినన్ . . దశకు 2. 31

ఉ నిందకునోర్చి యాజిమొనవ నిల్వఁగ నోపక వీఁగి పాఱు నీ, పందలవెంటఁ బడ్డ మగప తమె .. భాగ 8. 623 , భా. రా యు 2089

2 కూటమి, సురతము.

మ. మగువల్ సిక్కరె తొల్లి వల్లభులకున్ మన్నించి తద్వల్లభుల్, మగపంతంబు దలంపరే తగులముల్ మాపాలనే పుట్టెనే భాగ 10 పూ. 993.

**మగపాడి — మగలాగు** వి (√మగ.) 1. పురుషధర్మము, మగవాని మర్యాద.

ద్వి ... రఘువీరుఁ డెంతయును, ఇంతివోయిన జాడ నెఱిఁగిన పిదప, నంతరంగంబున వడలుచునునికి, మగపాడిగా దని మది నిశ్చయించి... రం. రా. కిష్కిం. 203 పా 10. పం.

చం పురుషులు లేరె లోకమునఁ బుట్టరు గాక భవత్సమాను లో,చిరతరపుణ్య నిన్ దగిలెఁ జిత్తము మిన్నక పోవఁడింక శం,బరరిపుఁ డేమి సేతు మగపాడి దలంపవు భామ లేడ ని,ష్ఠురవచనంబు లేద దయఱాఁడగదే యిదె నీకు మ్రొక్కెదన్. భోజరా. 4. 159

2 శూరధర్మము, మగఁటిమి, శౌర్యము

కం. అయ్యెడ మానము వదలక, డయ్యక మగపాడితో దృఢంబుగఁ బోరన్ ... భాగ. 10 ఉ. 870.

సీ మాన్యులఁ జెంపుల మగపాడి గాదు భిక్షాశనం బైన నత్యంత సుఖము ... భార. భీష్మ 1. ..., శైర 1 157

3 ఉపరతి, పురుషాయితము

గీ. వలపుఁ దెలుపుచు నరయఁగఁ బలికి పలికి, యలపు నొలపున నిలువక నిలిచి నిలిచి, మొనసి ప్రియుఁ గూడె మగపాడి ముద్దులాఁడి. శశాం 3 111.

**మగపోఁడిమి** వి. (√మగ). పురుషునివిధము, పురుషరూపము

చం కటకట కాశికాపురి నొకానొకనిద్దురఁగన్న మోడ్పి యప్పటఁ గనువిచ్చునప్డు కుడిభాగముఁ గన్గొని చోద్యమందు దా, పటిదెసఁజూచి యచ్చెరువుపాటు వహించు మనస్సరోజనం, పుటమున నాఁడులాగు మగపోఁడిమియుం గల జంతుసంతతుల్ కాశీ. 3 99.

మ ఘనతన్ నీ మగపోఁడుముల్ పలుమఱుం గన్నారఁగన్నారము .. చూడ మెన్నఁడును నీయాఁడుచేందంబు ... భాగ. 8. 383.

శ్లో అవతారా మయా దృష్టా రమమాణస్య తే గుణైః, సోఽహం తద్ద్రష్టు మిచ్ఛామి యత్తే యోషిద్వపు ర్ధృతమ్ సం. భాగ 8. 12. 12.

2 మగతనము, పుంస్త్వము

సీ పోలిరెడ్డికి మగపోఁడిమి లేదుగా గాది కేలాగుసఁ గడుపునిక్కె. శుక 2. 422

3. సురతము, సంభోగము (బ. అని శ ం.) ద్వి ధనధాన్యవస్తువుల్ దిగవిత్తు నటుచు, మును కొని మగపోఁడుములఁ జేయఁబూను అ మ. క. 1. 34 పు. 21 పం

**మగపోల్కికూటమి** వి. (√మగ) ఉపరతి, పురుషాయితము

సీ ఉపరిసురతసంజ్ఞ యొప్పును మగపోల్కికూటమి యనఁగ .... ఆం. భా 2 180.

**మగమ(మా)** వి. (త. మఖమై) వణిజులుగాని సేద్యగాండ్రు గాని దేవాలయాదులకిచ్చు విరాళము, రుసుము.

వ ... అంగరంగభోగాలకిచ్చిన మగమక్రమం జెల్లన్నను .. మగమమీంద మరిన్ని రాగభోగాలకు ... దశా 4 935.

వ. ... రుద్రయ పెద్దింగారు ... సిద్ధేశ్వరమహాదేవరదీపంబునకు ఆశేఖాలం గలమగమాను సుంకమాను తలారికమును మఽని ఒండేమి ఆయ ... పేరను అడుగలేదు సర్వమాన్యము ధారాపూర్వము సేసి ఆచంద్రార్కముగా నిచ్చె దశా 4 1213

వ ... నెయిపూరిలోని మగమాను వెళ్లంబోయీ మగమాను వంకేశ్వర దేవరఁ కాచంద్రార్కన్ స్థాయిగా మారమరాజు ఇచ్చె ఈస్థలము మగను ఎవ్వరు గుత్తగొన్నాం జెల్లించి ఈ పుణ్యానం బొందువారు దశా 4 1180 గు జి

**మగమాట** వి (√మగ) పౌరుషవాక్యము, శూరవచనము

మ మగమాటల్ మనకేల నాఁడల హనూమంతుండు లంకాపురం, బెగువం గాల్పఁగ నెందుఁబోయితిమి ... భా రా యు 1౽3.

**మగమానికము:** వి. (√మగ) వజ్రము

సీ తగువేల్పు దొరరాణి మగమానికపు సొమ్ము సెగతేనిచాన గొజ్జఁగులబంతి . యయా 1. 52.

సీ మగమానికముల క్రొన్నిగనిగల్ దులకింప నీలా 2. 48

విశ. పురుషరత్నము, పురుషశ్రేష్ఠుఁడు, పురుషోత్తముఁడు.

ఉ అమ్మగమానికంబు దిట మారఁగ నొక్కల కోఁ జెడ్డరే, ద్రిమ్మరికొమ్మ నుక్కడఁచి తేటగ జన్నము గాచి చట్టుచం, దమ్మున నున్న పెంద పసి తామరకంటిని బ్రోచి ... అచ్చె రా. బాల. 183

మగమానికపువాఁడు — వజ్రాయుధము నీలా 3. 8.

మగమానికపువాలు దాల్పు — వజ్రాయుధము ధరించినవాఁడు, ఇంద్రుఁడు

గీ. తనర మగమానికపువాలు దాల్పు బోదు.

వేడుకలుమీఁఱ నాడు మేల్మేడమీఁద, గొనబు మీఱెడు నపరంజికుండ యనఁగఁ, దూర్పుగుబ్బలిఁపైఁ దోఁచెఁ దొగలఱేఁడు నీలా 3. 8.

**మగరా (జా) (యి)** — మగమాలికము. వి జౌ. (√మగ) వజ్రము, నవరత్నములలో నొకటి

ఉ. నాయకమైన కెంపుగమి నాఁటిన చోటులు సాంధ్యరాగమున్, జేయఁగ నింద్రనీలముల చెక్కడపుంబని చక్కి యంధకా, రాయితమై వెలుంగ మగరాలమరించినపట్లు వెన్నెలల్, గాయఁగ ముత్యపుంగులకుఁ గందువయో యన మించె నంచులన్. సాంగ 2 72

చం తెలిమగజాతికంబములఁ దీఱిన బంగరు కీలుబొమ్మ గుంపులకు ఉ రా 1 317.

సీ మగరాలబిళ్లల నిగనిగఁ దగినట్టి వాలు కీల్జడ మొలనూలుఁ జొనిపి పాంచా. 5 188.

మ నెలజా చొక్కపుమేడలోన మగజానిద్దంపుఁ గీల్బొంగుటు, య్యెలలో ... నలరుంబోఁడులు జోలఁ బాడుదు రమందానందసంధానవై ... చంద్రా 2 7.

సీ పొలుచును వజ్రంబు మూలరా లన మగరా లనంగను గురుజా లనంగ... ఆం భా 2. 278.

మగజా(రా)తివాలు — వజ్రాయుధము.

సీ ... మగజాతివాలు సత్తి గుదియ బల్లెము త్రాడు పెక్కెము కత్తి దండివిల్లు ... అచ్చ. రా యు 581

**మగలాగు** — **మగపాడి** వి. (√మగ) ఉపరతి (శ. ర.)

**మగవాఁడు** వి (√మగ ) 1.పురుషుఁడు, పుంవ్యక్తి.

కం. తగవే కులకన్యలకును, మగవారలతోడ రూపమహానీయులతోఁ, మిగులంగఁ దడవు లోపలి, వగఋలలో మాట లాడ ... నైష. 4 61.

కం. అనవుడు శారిక కీరముఁ గనుఁగొని మగవారు పాపకర్ములు నమ్మం, బన దనినఁ బాపజాతులు, వనితలుగా కనుచుఁ జిలుక వాదము చేసెన్. విక్ర. 7. 86., మనుచ 3. 82.

2 మగఁడు, భర్త, ప్రియుఁడు

మ. పరగన్ మా మగవార లందఱును మున్ బాణప్రయోగోపసం. హరణాద్యాయుధ విద్య లన్నియును ద్రోణాచార్యుచే నభ్యసించిరి ... భాగ. 1. 160

ఉ ప్రేమ గనంబడం బలుకరించినవాఁడవు పోదువా యయో, నామగవాఁడ తెప్ప నిను నమ్మితి రమ్మని పిల్చి . . శుక 3. 565.

విశ. పౌరుషవంతుఁడు

(వి శూరుఁడు అని శ. ర )

ఉ. ... లీలమై, వచ్చిన రుద్రుచేఁ దమున వ్రాలుదు వీ వనిలోన నోర్వఁగా, వచ్చునె నిన్ను నెట్టిమగవారికి నీకృప నాశ్రయింపఁగా, వచ్చితిమి. భార భీష్మ 3. 300

మ. అలరుందూపుల మన్నెవాని మగవాఁ డన్పించుఁ దత్కాంత ... శుక. 4. 15 భార. ఉద్యో. 1. 247.

**మగిడి** వి. (త మగిడి) పాములవాఁ డూఁదెడివాద్య విశేషము నాగసరము (శ. ర.).

**మగి(గు)డించే** స. క్రి. (√మగుడు.)

1. మరలించు, త్రిప్పు

గీ అడుగఁ బూనినమాటయే యెడకు నెక్క, వంతనుండియ మగిడింపు మమరరాజ ... నైష. 3. 21.

ఉ. వామనదిగ్గజంబు మదవాసనకుం జన కోహటించుచు, ద్దామగతిన్ నభోమణిరథంబు హయంబు లనూరుఁ డుద్ధతుం, డై మగుడింపఁగా మగుడ కడ్డము దాఁకె ననంగ నుత్తరా, శాముఖ వీథి నేఁగె దివసంబులు దీర్ఘత పల్లవింపగన్. పి. శకుం. 2. 122.

సీ మొగము పార్శ్వములకు మగుడింపకుండ వాకట్టుమూలికవాగెఁ బట్టి పట్టి ... కళా 3. 79.

2. నివారించు, ఆఁపు

కం. వగవఁగ నేఁటికిఁ బార్థుఁడు, దెగువకుఁ

జొరకున్న భీష్ముఁ దెగఁ జూచి వెసం, బగ యడఁ గించెద నన్నున్, మగిడింపక చూచుచుండు మను జాధీశా. భార. భీష్మ 3. 283

వ. .... కుంఠితప్రబోధుం డగునాకుంఠునిం గెంటి వలికియు నలుక మగిడించి యుదంచిత ప్రయోజన ఘటవాపారవశ్యంబున సామర సర్వంబు మీఱ నిట్లనియె ... పాండు. 3. 37

**మగుచే — మగుడుచే** వ. క్రి (√మగుడు. క. మగుచు) మరలుచు, త్రిప్పు.

ద్వి జోడనఁ గొని పించె సొగసుగాఁ జుట్టి, వేడెంబు వడి వడ్డవేడెంబుఁ ద్రోలి, నిగుడంగఁ గుఱుచల నిడువల నూకి, మగిచి వైచుచుఁ గేల మ స్తరించుచును ... అ మ. క. 5. 242 పొ. 14 పం.

**మగుడఁబడు** అ. క్రి. (మగుడన్ + పడు. స్వార్థ మున) 1 మరలు, నివృత్త మగు.

కం. అనురులదెస నీతేజము, ప్రసారితముఁ జేసి మగుడఁబడు టొప్పునె యిం. క. సమాన శౌర్య క్రమ్మఱ, మసఁగుము రక్షింపు మమర మండలిఁ గరుణన్. హరి. ఉ. 10, 161.

2. తిరుగఁబడు.

వ ... పగవాఁడు బలవంతుం డింతన తెగిపోయెడివాఁడు గాఁ డిలోనవ మగుడంబడి యెద్దియేనియుం గిల్బిష మాపాదించు నిది నాకుఁ దోచిన తెఱఁగు ... హరి. ఉ 1. 140.

3 తిరుగు, తారుమా రగు.

కం. అనిన నలరుగ్గం డిట్లను, జనవర మును నామనఁబుచందము నీచె, ప్పినయట్ల యిపుడు శాఁతిం, దనరెడు మగుడఁబడి వినుము తత్కార ణమున్ మార్క. 3. 369.

**మగుడు** అ క్రి (క. మగుచు, మగచు.)

1 మరలు.

(క) వెనుకకు మరలు.

గీ అనఘ యింద్రియముల విషయములమీఁద నిగుడనీక మనంబుతో మగుడఁ దిగిచి, యాత్మఁ గూర్చుట సాంఖ్యుల యనువు ... భార. శాం. 5. 97.

ద్వి మగిడి భూవిభుఁ జొక్క మరము పొంతకును, దగఁ జేరి యున్న య త్తఱి నిప్పులురుల. ద్వి. హరిశ్చ ఉ 148. పం., దశా. 1. 178.

(చ.) తిరిగివచ్చు

కం కనుకనిఁ బఱచిన నాతని, వెనుకొనుటయు వాఁడు శరణు వేఁడినమాత్రం, గినుక యుడిగి తొయ్యలి మదిఁ, గనికరము జనింప మగిడెఁ గాంతుని కడకున్. విక్ర 6. 93.

ద్వి. మనల నయోధ్యకు మగుడఁ బ్రార్థింపఁ, జనుదెంచుచున్నాఁడు సందేహ ముడుగు. రం రా అయో. 136 పొ 28 పం., ఆము 1. 76.

(ట) అభిముఖ మగు.

కం. నీ వే మంటివి రమ్మం, చావలివానికిని మగిడి యట్లనె వానిం, గావించి ... ఆము 3 7.

వ ...దశారంబునకు మగిడి పోదము లెమ్మని .. భీమ. 3.38.

2. (త. మక్కడు) క్రమ్మఱు, తిరుగు.

(మరలు ధాతువునకువలె దీనికిని క్త్వార్థక మగు 'మగిడి' అను రూపమును, తుమున్నంతమగు 'మగుడన్' అను రూపమును పునరర్థకావ్య యము లై వెండి, మరలన్, అనునర్థము నిచ్చును. కొన్నిపట్ల ప్రత్యుత్తరముగా, మాఱుగా, అను నర్థమును నిచ్చును )

గీ. చెలువ యింక నొక్కించుక సేపు నీ వ,నాద రంబున నెప్పటియట్ల యున్న. మన్మథుఁడు సమ యించిన మగుడ నన్నుఁ, బడయ వచ్చునె యెన్ని యుపాయములను. భార విరా. 2 47

గీ. అప్పు డాశ్చర్య మంది వైశ్యప్రభుండు, మగిడి లోనికిఁ జనుదెంచి మంత్రఫణితి హర. 2. 39

కం. ధరియించిన మొద లొకవ, త్సరమాత్రము

తావకీన ధమ్మిల్లములో, నిరవుకొని మగుడ నివ్విరి, తరుణీ యల పారిజాత తరువున కరుగున్. పారి. 1. 67.

గీ. మగుడఁ గ్రమ్మఱఁ గ్రమ్మఱి మరల సారె, వెండి మాటికి దిరుగ నా వెలయును బున,రర్థముగ...ఆం. భా. 3. 69.

3. పోవు, తొలఁగు

ద్వి బడలినమేనును బగిలిన మోము, మగిడిన చనుఁగవ్వు మాసినచీర. ద్వి. హరిశ్చ. ఉ. 2085 పం.

కం. తగుమాట లాడి కోడలి, వగ పుడుపుము నీవు ధైర్యవతి వి ట్లడరం, దగుసె నిను జూచి కాదే,మగుడుం జిత్తముల వగలు మా కందఱకున్. భార. ద్రో. 2. 328.

4 బాగుపడు, చక్కనగు.

కం వగచినఁ బోయిన కార్యము, మగుడునె వగవంగ లోకమాన్యుం డగునే ... భార. స్త్రీ. 1. 20.

వి. తిరుగుట, నివృత్తి.

కం గతికై ఫణి వసుధాయని, మతిఁ దలఁచిన నగణ మయ్యె మారుత మధిపై, వతమంత్రుడు నగణముఖమగు, కృతి పగఱకు మగుడులేని కీడొనరించున్. కావ్యా. 7. 14

జ. మగిడించు, మగుచు, మగుడఁబడు, మగుడుచు.

మగుడుచే(డ్చు)—మగుచే స.క్రి. (√మగుడు. త. మక్కుడసెయ్.) మరలించు, త్రిప్పు.

చం ... పద్మగర్భుకడకుం జనె నమ్మహితుండు మన్మథున్, గొడుకుగఁ బంచి వే తమ మగుడ్పగ వచ్చె. భార. అను 4 408.

ఆ. కడుఁ బ్రయాణవిఘ్నకరు లగుభరతము, ఖ్యులఁ బ్రయత్నమున మగుడ్చి వెసను. రాఘవ. 3. 27.

మ. గునిసెయెన్ గొప్పు సరుల్ నటింపఁ గుచేముల్ గుప్పింప ఘర్మాంబువుల్, మొనసన్ గౌను చలింప రత్నవలయంబుల్ సందడింప న్మగు,డ్చిన

నెమ్మోమ్ము మఱగింటఁ జొక్కుఁ గన ... ఓర్తు తలయం పెన్. చంద్రా. 6. 5., కళా. 3. 19.

మగులు — మదురు వి. 1. కుడ్యపాలిక, గోడ మీఁది కప్పు.

సీ ... మదురు మగు లన గుడ్య, పాలికయై చెప్పు .. ఆం. భా. 2 13.

2. చుట్టుగోడ, ప్రాకారము.

సీ. అలగుంపులు గొటియలదొడ్లు ... ఉలగరంబులు వాఱుపొలము వాకిటఁ బది కట్టుబండ్లింటికిఁ జుట్టుమగులు ... గీ ... గలిగి, కాఁపురము సేయు నవ్వీటఁ గాఁపుకొడుకు. వేం. పంచ. 4. 416.

సీ బలుకంచు గుబ్బబోర్తలుపులు తీనెలవాకిలి నడవ చావడియు, మగులు. హంస 2. 137.

జ. మగులుగోడ.

మగులుగోడ వి. (మగులు + గోడ) చుట్టు గోడ, ప్రాకారము.

ఆ మగులుగోడమీఁద క్రోమ్రాఁకులు చిగురుజొంపములు వానిమీఁద బ్రచురదోహ, దముల ధూపములును దనకు మాటుగ గూఢ,గతిని గాంతఁ గొనుచు నతఁడు ననియె. కళా. 3. 66.

(ముద్రి పా మదురుగోడ. శ. ర. పా.)

సీ. గొడియ బీగము లావుగొలును లోపలియడ్డ మ్రాను బో ర్తలుపులు మగులుగోడ ... హంస 2 226.

మగువ వి (క. మగువు. త. మగవు — బిడ్డ. మగువు + అ. ?) 1. స్త్రీ ఆఁడుది.

సీ. నవలా మగువ నాతి నాతుక యాఁడుది లేమ గోల యువిద చామ చాన.

గీ. ముద్దుగుమ్మ యన స్త్రీస,మాఖ్య లం చవఁ గాను జెన్నలరుచుండు ... ఆం. భా 2. 104.

కం. మగ లడఁకువ నుండక తమ, తగులమ పాటింతు రెట్టి తగులం బైనన్, మగువల యెడ లన యడఁగుం. దగవు విడిచి యడిచి పడరు ధైర్యము పేర్మిన్. భార. విరా. 2. 261.

గీ. మదనరేఖకు సరియైన మగువ గలదె ‥ విక్ర 1. 119

2. ప్రియురాలు, భార్య.

గీ. మగని మగువను ప్రాయించి మదిఁ దలంచు, నిషధరాజును దన్నుఁగా నీరజాక్షి. నైష. 1. 74.

'ప్రియం ప్రియాంచ'. సం॰ నైష 1. 38

సీ. మగలతో నిదురించు మగువల మఱపించి ‥ నీలా 1. 78, పారి 1. 50.

జ. మగువతనము.

**మగువతనము** వి. (√మగువ) స్త్రీత్వము. ఆఁడుతనము

కం. జగదాత్మకుఁ డగు శంభుడు, మగిడెను హరి నెఱిఁగి తనదు మాహాత్మ్యమునన్, విగతత్రపుఁడై నిలిచెను మగువతనం బుడిగి హరియు మగవాఁ డయ్యెన్. భాగ 8. 404.

**మగ్గ** — **మొగ్గ** వి. (క. మగ్గు) ముకుళము.

ఉ. వెగ్గల మైనవాసనలు విశ్వజగంబును గమ్మవల్వఁ గాఁగుగ్గులు ధూపధూమముఁలగోచరలీల వజాండగోళముం, దగ్గఱఁ జాతె వాని మిళనంబునఁ గాదె వళంబు గల్వపూ, మగ్గయుఁ బోలె నిప్పుడు సమంచిత నీలిమ మయ్యె జూడ్కికిన్. కాశీ 7. 221.

**మగ్గపుగుంత** వి (√మగ్గము) సాలెవాఁడు నేయుటకుఁ గూర్చుండునపుడు కాలు చోఁచుకొనెడి పల్లము.

సీ. కుంచె మగ్గపుగుంత గూటంబు పగ్గంబు పరఁచె ద్రొక్కుడుపట్టె పలక దోనె ...

గీ. వఱల నాకుభభద్రు నివాసభూమి, యప్పురంబున సంతతం బొప్పుచుండు ··· హంస 2 11

**మగ్గము** వి. (క మగ్గ, మక్క.) 1 వయన యంత్రము, సాలెవాఁడు బట్టలు నేయు యంత్రము.

సీ. ... నేఁత యంత్రము మగ్గమనఁగను దనరుచుండు ... అం భా. 2. 296

2 సాలెపురుగల్లు వల.

సీ. కలయ వంగమున మర్కట కీటకృతమైన మగ్గంబు నేత్ర సంపద వహింప .. ఆము. 1. 93.

సీ మైనిండుసాలీని మగ్గంపుఁజకచకల్ జూచి· పూఁతకు రెట్టి పుట్ట నేయ .. చంద్రా. 3. 89.

జ మగ్గపుగుంత, మగ్గరి.

**మగ్గరి** వి (మగ్గము + అరి[3]) తంతువాయుఁడు. సాలెవాఁడు.

సీ. తంతువాయాభిధ దనరు మగ్గరి యన నేఁత కాఁడనఁగను నేతరి యన ... అం. భా· 2. 283.

**మగ్గించే** — **మ్రగ్గించే** న క్రి. (√మగ్గు) చంపు.

సీ బెగ్గురుకడుపుల బెగ్గిల మగ్గించి కొంగల పొంగెల్ల గ్రుంగఁ ద్రొక్కి ... ద్వా. 1 219.

**మగ్గు** — **మాఁగు** అ క్రి 1 మిగులమగ్గు, కమియఁబండు

(వ్యవ) పనసపండ్లు మగ్గువఱ కుందినచో రుచ్యముగా నుండవు.

2 ఉక్కచేఁ జెమ్మగిల్లి చెడు (శ. ర.)

3. ఆవిరిమీఁద చక్కఁగ నుడుకు.

(వ్యవ) కూర బాగుగ మగ్గనిమ్ము

4 మ్రగ్గు (క మగ్గు) చచ్చు. (చూ. మగ్గించు)

జ మగ్గించు, మగ్గుడు, మగ్గుడుపాటు

**మగ్గుడు** వి. (√మగ్గు) మిగుల మగ్గుట, కమియఁ బండుట (మగ్గుట. శ. ర).

**మగ్గుడుపాటు** అ. క్రి· (√మగ్గుడు) మాఁగిపోవు. (మగ్గు శ. ర).

(వ్యవ.) అరటిపండ్లు మగ్గుడుపాటివవి.

**మగ్నము** సం విణ (అ ఆ అ.) మునిఁగినది.

**మఘ** సం. వి. ఆ. స్త్రీ అశ్విన్యాదులయందు పదియవ నక్షత్రము (నిత్యబహువచనాంతమని వై. ని.).

శ్లో ఆషాఢాకృత్తికాశ్లేషా మఘా భూమ్ని స్త్రియశ్చ తాః. (వై. ని.)

**మఘము** సం వి. అ. పుం. 1. ఒకానొక ద్వీపము.

2 ఒకానొకదేశము, 3. యజ్ఞము, న
1 పుష్పభేదము. ఒకజాతిపువ్వు. 2 ధనము (కే. ని.).

మఘవంతుఁడు సం. వి. త్. పుం. ఇంద్రుఁడు.

మఘవానుఁడు సం. వి న్. పుం. (రూ. మఘవ)
1. ఇంద్రుఁడు. 2. వ్యాసుఁడు
విణ. (న్ నీ, న్) దాత.

మఘవుఁడు సం. వి. న్ పుం. ఇంద్రుఁడు (శ. ర.).

మఘాత్రయోదశి సం. వి. ఈ స్త్రీ మఘానక్షత్రముతోఁ గూడిన త్రయోదశి, భాద్రపద కృష్ణ త్రయోదశి.

మఘాభవుఁడు సం. వి. అ పుం శుక్రుఁడు

మఘాభువు సం. వి. ఊ. పుం. శుక్రుఁడు.

మఘి సం. వి. ఈ స్త్రీ. ధాన్యవిశేషము. (మే. ని , కల్ప , వాచ. భేషజ మని. వి. ని.)

మఘోని సం. వి. ఈ స్త్రీ. ఇంద్రుని భార్య. శచీదేవి.

మచర్చిక సం. విణ. అ. స్త్రీ. ప్రశస్తము, శ్రేష్ఠము (ఇది ఉద్ధమువంటిది.).

మచ్చే-మచ్చేము వి. (క. మచ్చ. త. మచ్చె ) 1. పుట్టుమచ్చ, పుట్టినప్పుడే దేహమునం దుండెడి నల్లనిగుర్తు.

చం. అని కొనియాడి దేవి రుచిరాకృతియం దొక మచ్చ పెందొడం, గనుఁగొన నొప్పు నీల మణి కాంతిబెడం గయి. విక్ర. 3. 56.

సీ. .... సిరి పొల్చుమచ్చ పేరురమువాని ... ఆము. 3. 85 , ఆం. భా. 2. 124.

2 చిహ్నము, గుఱుతు, కళంకము, మాలిన్యము, మఱక.

సీ. ... గుటి మచ్చ మచ్చము గుఱుతు చిన్నె, లక్కనం బాది కళం కానవా లడియాలము బచ్చెన యనఁగఁ జిహ్న, గీ. మలరు ఆం భా 1. 80.

గీ. ఉడుగణాధీశ బింబంబునడిమిమచ్చ .. భీమ 2 45

ద్వి. మచ్చలమచ్చల మట్టికాసెయును, ఒలువైనకేలి యంబటికుండ తనకు, నలవడ నడగొండ యన నొప్పుచున్న. ద్వి. పరమ. 7 531 పా.

3. కుఱుపు గాయము మొ. మానినపిదప దేహమున నిలిచి యుండెడి యానవాలు.

(వ్యవ ) అతని మొగమునిండ స్ఫోటకపుమచ్చలింకను గన్పించుచున్నవి

మచ్చనాలుకవాఁడు – రహస్యము దాఁపలేనివాఁడు.

గీ ప్రాణసఖుఁడవు నీకుఁ జెప్పక మదీయ, వృత్త గోపన మెట్లు గావింప నేర్తు, మచ్చనాలుక వాఁడవు మంతనంబుఁ, బొడమ నీకని రసనకు బుద్ధి చెప్పు. పి. శకుం. 2. 172

జ. మచ్చమాపు, మచ్చమాయు.

మచ్చేమాపు స క్రి (√మచ్చమాయు) నశింపఁ జేయు, సంహరించు.

(వ్యవ.) వాఁడు త న్నెదిరించినవానిని మచ్చమాపక మానఁడు.

మచ్చేమాయు అ క్రి (మచ్చ + మాయు) జాడ లేకుండపోవు, నశించు.

(వ్యవ.) పాప మాకుటుంబ మంతయు మచ్చ మాసి పోయినది.

నీమచ్చమాయ – ఇది యొక తిట్టుగా వాడఁబడును.

మచ్చేము-మచ్చే వి.(త. మచ్చమ్ ) 1. చిహ్నము, గుఱుతు, జాడ, ఆచూకి.

సీ ... గుటి మచ్చమచ్చము గుఱుతు చిన్నె, లక్కనం బాదికళం కానవా లడియాలము బచ్చెన యనఁగఁ జిహ్న, గీ. మలరు ... ఆం. భా. 1. 80

సీ. అంగీకృతాంగ చైత్రాదిదేవత లాత్మసమ చోరుమచ్చంబు చూపుకరణి ... వసు 6. 73.

2. నిదర్శనము, దృష్టాంతము.

ద్వి. మొదలితలారి సమ్ముఖమునఁ బెట్టి, తోడ
మచ్చంబుగాఁ దొడవులమూట, నూడిద పెట్టి
తా నురిగె నాచోరుఁ, డు...
ద్వి. హరిశ్చ ఉ. 2329. పం

ద్వి ...నాకల్ల నీమీఁద, విపరీతముగఁ జెప్పి విరస
మెక్కించి, తోడ మచ్చంబు నా దుష్టుటఁ
జూపి, వీడెల్లఁ గనుగొన విఱిచి కట్టించి నవ.
1. 70 పా 16 పం., హరిశ్చ. 5. 138.

3 నిదర్శన మైన దొంగిలించిన సొత్తు.

వ... అయ్యారెకులు చని పురంబు సర్వంబును
శోధించి విపణివీథిం దదీయాభరణమ్ము లమ్మ
నమ్మహీసురు మచ్చంబు తోడం బట్టి తెచ్చి..
విక్ర. 5. 145.

**మచ్చరము** వి (సం మత్సరః. ప్రా మచ్ఛర, క, మచ్చర.) 1. ఈర్ష్య, ఓర్వలేమి

గీ. బోధ మల్పంబు గర్వ మభ్యున్నతంబు, శాంతి
నిప్పచ్చరంబు మచ్చరము ఘనము.
భీమ. 1 13

ఉ అకుసుమంబుఁ దాల్చిన మహామహిమంబునఁ
దోడికామినీ, లోకము మచ్చరంబు మది లోనఁ
దొరంగి భజించుచుండ...
పారి 1 70., 1 50., కళా. పీఠి. 50

2. స్పర్ధ, పోటీ.

సీ పచ్చరానిగ్గుతో మచ్చరానకు పచ్చుమచ్చ
యమ్యెదచక్కిఁ జెచ్చుమీఱ. సుద. 5 60,

3. ద్వేషము, వైరము, పగ

కం. హరిదిక్కున మునుగలమ, చ్చర మించుక
యాత్మ వదలి సంప్రీతిపుర, స్సరముగ నీ నొడఁ
బడియెను, హరిపౌత్రున శాత్మ పౌత్రి నన్నర
పతియున్ హరి. ఉ. 3. 223.

కం పిచ్చుకపయి బ్రహ్మాస్త్రము, విచ్చలవిడి నిగుడఁ
జేయువిధ మింతెకదా మచ్చరము మనుజత తి
పయిఁ, దెచ్చుక పొలియింప నీవు దిరుగుట
లెల్లన్. ఉ. రా 3. 302.

4. పట్టుదల, చలము.

గీ మచ్చరంబున నిద్దఱు మానవతులు, పెడ మరలి
చల్లులాడంగ...వరాహ. 3. 101

జ. మచ్చరి, మచ్చరించు, మచ్చరికము, మచ్చరికించు. మచ్చరీఁడు

**మచ్చరి** విశే. (మచ్చరము+ఇ³.) 1. పట్టిన పట్టు విడువనివాఁడు, చలపాది.

చం. మదమున దేవదానవులు మచ్చరు లై గడుఁ
బిచ్చలించి సం, పదలమ గోరి పోరు నెడ...
భాగ. 6. 273.

(శ. ర. పా. 'మచ్చరముల్ గడుఁ బిచ్చలింప ముద్రి పా.)

2. ద్వేషి, విరోధి

సీ చలులార లేటి మచ్చరులార కానరే మా
కుమారునిఁ బోలు మా కుమారు....సారంగ
3. 237

(లేటి మచ్చరులు – మృగద్వేషులు, సింగులు.)

**మచ్చరించు** అ క్రి. (√మచ్చరము.) 1. పోటీచేయు, స్పర్ధగొను

వ.. మఱియు సూతపుత్రుండైన రాధేయు డును
ధనుర్విద్యా కౌశలంబున నరునితోడ మచ్చ
రించుచు దుర్యోధన పక్షపాతి యై యుండె...
భార. ఆది. 5. 225.

2 ద్వేషించు, పగగొను

క అంతం గుంతీనందన, కాంతా చింతా మహాంధ
కారముతోన, తత్కాంతంబు మచ్చరించెనో, సంత
మసం బనఁ బ్రభాత సమయం బయ్యెన్. భార.
విరా. 3. 34.

గీ. సహజ మాత్సర్యమున దేవ సమితితోడ,
మనము దొడరిన హరి యేల మచ్చరించు..
ఉ రా. 2. 21.

సీ. లంకాపురంబున శాంకరీదేవతా మకుటేందు
రేఖతో మచ్చరించి... కాశీ 1 130.

(ఇట ఔపమ్యద్యోతకము.)

3. చలపట్టు, పట్టినపట్టు విడువకుండు.

చం. ఇటువలె మచ్చరించు హృదయేశయుఁడైన

లతాంతధన్వికో, క్కటఁ గడు వెక్కసం బడర. చంద్రా 5 12

మచ్చరికము వి (√మచ్చరము. ఇక, స్వార్థమున )

1 చలము, పట్టుదల

ఉ. తెచ్చెద మెల్లి నేఁడు మముఁ దెం డని పంచిన యప్పు డాకినుల్, మచ్చరికంబునం జవు లమర్చుట కై డిభకుండు నీవునుం, జొచ్చినచోటు సొచ్చి గణకూరుఁడు శౌరి కరాసిధారచేఁ బచ్చడిచేయఁగా జముని బానసముం బురుడించు చోటకిన్ ఉ హరి. 4 196.

ఉ ఏఁటికి నోవసిష్ఠ తగ దిక్రియ సారెకు పట్టి వాదముల్, మాటిమాటికిం బెనఁచి మచ్చరకంబున నాడ నీకు.. హరిశ్చ 1. 151, పి శకుం 2 125

2 స్పర్ధ, పోటి

కం. చీనాంబర మణిభూషణ, నానాగంధానులేప నవమాల్యములన్, మానినులును వైదర్భియు, మానుగఁ గై సేసికొనిరి మచ్చేరికములన్ విక్ర 5 62.

3. ద్వేషము (శ ర )

మచ్చేరికించు అ, క్రి (√మచ్చేరికము.) 1 చలపట్టు, పట్టుపట్టు.

ఉ .. వసుధామర ముఖ్యులు పితృహోత్రునా, మంత్రణసేయలే రయిరి మచ్చరికించియుఁ గాశికాపురిన్ కాశీ 5 304,

2. స్పర్ధవహించు, పోటిచేయు.

చం .. ఇద్దఱు ముద్దియా లొత్తి రవ్విభు, వ్వద గజరాజ కుంభముల మచ్చరికించు కుచద్వయంబులన్. నైష. 3 86 (ఇట ఔపమ్య ద్యోతకము )

సీ అలకాధిపతితోడ నైన మచ్చరికించి కొననమ్మఁ గల మేటికోమటులును ... భోజరా. 2. 47.

ఉ. ఇచ్చిన మ్రొక్కి పుచ్చుకొని యింపును సొంపును బల్లవింపఁగా, నచ్చపలాయతేక్షణ శివార్పణ మంచు సుధారసంబుతో, మచ్చరికింపఁ జాలు రుచిమత్ఫల మాదట నారగించి ... రాజ. చ. 1 83., భీమ, 1. 91.

3 ద్వేషించు, కలహించు, పోరాడు

చం. వరములఁ దొట్రుపాటొదవఁ బ్రాణసఖీ జన భాషణంబులన్, మదిఁ దమకంబు లజ్జయును మచ్చరికింప వణంకుమేనితో, మదవతి మంద మందగతి మార్దవ మొప్పఁగ వచ్చె . విక్ర. 216

మచ్చేరీఁడు. విశే. (మచ్చరము + ఈ డు మచ్చరి + ఈఁడు స్వార్థమున అని శ. ర.) 1 మచ్చరము కలవాఁడు, ఈసు ఊనువాఁడు

ఆ. చిచ్చు లేక చిముడు మచ్చేరీఁ డీషుద్ధి, వజ్రనాభుఁ డోర్చువాఁడె యకట. ప్రభా. 1. 134.

2. వైరి, పగతుఁడు.

వ ... పచ్చవిల్కాని మచ్చేరీఁ డానతిచ్చినఁ దదీయ సన్నిధాన విశేష సుజ్ఞానోదయంబున .. సౌనందో 5. 173.

మచ్చిక – మచ్చిగ. వి. (క. మచ్చికె ) 1 వలపు. మోహము

చం. విడువని కౌఁగిలింత పురివిచ్చని మచ్చికతన్ను తేనినం, దడి నొకవింత చూపు ... కువల. 5 31.

గీ. మైత్రియును నానుకూల్యంబు మచ్చికయును, గలిగి యక్కాంతని న్నెప్డు గలసియుండ ... మార్క. 5 200.

ద్వి అచ్చర తనదృష్టు లామిత్తు మీఁద, మచ్చిక నాటించి మనసుపొం దెఱిఁగి రం, రా. ఉ. 128 పు. 18 పం

2 ప్రేమ

కం. అని వారికి వారందఱు, మనమునఁ దోఁచినటు లాడు మచ్చికమాటల్, విని సిగ్గున నయ్యెల జ, వ్వని .... విజ. వి. 3 33.

ఉ క్రచ్చఱఁ బారిజాతలతికావనదేవత జంభవైరిపై, మచ్చికఁ గూర్పఁగా నవసుమ ప్రకరంబుల వేల్పు పేటిలో, విచ్చిన పైఁడిశామరల వెంబడి వచ్చిన కమ్మగాడ్పులున్. మెచ్చులరీతిఁ

గోకిల సమీరణ దీవనలిచ్చె నొప్పుగన్. హర 6. 10.

దండకము. . . వేలుపుంబెద్దవై తద్దయు స్నేర్పుతో నిజ్జగంబెల్లఁ బుట్టించి వెన్నుండవై నిచ్చలు న్మచ్చికం బ్రోచి. . నీలా 2 41

సీ. ... నెయ్యము ... నేస్తము ...

గీ. బాళి ప్రేముడి మచ్చిక మక్కువ యనఁ, బ్రేమ దోఁచును .. ఆం. భా. 1 136.

3. ఆసక్తి.

ఉ. మైత్రియుఁ బ్రేమయు న్మనసు మచ్చికయు న్మెఱయ న్వరాటరా, ట్పుత్రిక వల్కినన్ ... సైష 4 84.

వ ... మచ్చికతో నెదుట వచ్చి నిలుచున్న పుడ మికన్నె చిన్నారి నగుముద్దు మొగంపు టద్దంబుం గనుంగొనుచు ... ఉ రా. 1 138

4. భ్రమ, భ్రాంతి

వ. ... పెచ్చు పెరుఁగు నచ్చపుఁ బచ్చలచాయలు మెచ్చులు సేయఁ బచ్చికల మచ్చికల విచ్చలవిడిఁ గ్రచ్చుకొని మెసవ నుంకించు నంకంపురాజింక జంకించి ... వసు. 2. 11

5. చేనపు.

కం. ఎచ్చట శ్రోత్రియుఁడును ధన, మిచ్చునతఁడు నీరుగలుగు నేఱును వెజ్జు, న్మచ్చికయును లేకుండును, నచ్చట వసియింపవలవ దఖినుత చరితా. మార్క. 3. 248.

జ. మచ్చికపడు.

మచ్చికపడు అ క్రి. (√మచ్చిక) మరులుకొను స క్రి మరగు. (శ ర)

మచ్చిగ– మచ్చిక. వి. ప్రీతి, ఆసక్తి.

మ. తగునే మాధవ యిట్టివాఁడిపలుకుల్ ధర్మంబులే మా యెడన్, మగలుం బిడ్డలు సోదరుల్ జనకులున్ మమ్ము న్నివారింప మ. చ్చిగ నీయంఘ్రులు సేరినారము ... భాగ. 10 పూ. 832.

చం తగిన వరేంద్రసూనుఁ డని తన్నుఁ బ్రియం బునఁ బిల్చి తెచ్చి మ, చ్చిగ సుత నిచ్చి మిత్రి తిముఁ జేసిన సింహళరాజసూనుఁ డా, తగవు మదిం దలంపక . విక్ర. 6 76.

(దయ.)

కం. ముచ్చిరి యన్నది లోకము, నిచ్చలు గంసాది ఖలులు నిర్దయు లేఁచన్, మచ్చిగఁ గావఁగ వలయును, విచ్చేయుము తల్లికడుపు వెడలి ముకుందా. భాగ 10 పూ. 101.

మచ్చే¹. వి (క. త మచ్చు) 1 మీఁదికట్టడము, మిద్దె.

కం మ చ్చెక్కింపుడు వానిని,నిచ్చెనయిడి తొలఁగఁ బుచ్చి నెమ్మదితో నే, మ్రుచ్చిలి ... కేయూర. 2 60.

కం అపు డిచ్ఛావతి యచ్చో, నుపవల్లభు నిలువఁ బనిచి యోడక యిలు సొ, చ్చి పొడవు గల మచ్చుపయిం, గపటవ్యాపార మమరఁగాఁ గూర్చుండెన్. వేం పంచ 4 505.

2. మీఁదికట్టడము లేని మిద్దెటిల్లు, డాబా

ఉ ... అగేంద్రకన్య రాఁ, జూడఁ దలంచి నిల్చిరి వసుక్షితిపాలపురి పురంధ్రికల్, మాడువులన్ హజారముల మచ్చుల సజ్జల గోపురంబులన్, మేడల నాట్యశాలికల మేరువులన్ భువనేశ్వరం బులన్. వసు 6. 64

3 అల్పహర్మ్యము

సీ .. అట్టిక యన మచ్చు నా నల్పహర్మ్యంబు వెలయు ఆం భా. 2 17.

ఉ మేరుశిరులా కురుఁజుమీఁదులఁ జెక్కిన టెక్కియంబులా, గారుడరత్నతోరణ ధగద్ధగలా తెలిగచ్చుమచ్చులా పాంచా 4 5

గీ. మేలిగొజ్జంగిపూనీట మెకపుటాము గలిపి బలు రాచతెరువులఁ గ్రంతలందుఁ, జిలికి మచ్చుల మేడల నెలవు లెల్లఁ, గ్రొత్త సింగారములఁ దళుకొత్తఁ జేసి .... అచ్చ. రా. అయో 10.

మచ్చే², అ క్రి. ఆకర్షించు.

ద్వి నచ్చినవాఁడవో నావారిలోన, మచ్చిన వాఁడవో మనసుకి లెటిఁగి. పండితా పురా.

115 పొ

వి 1. చొక్కమందు, మీఁదఁ జల్లినచోఁ బర వశము చేయు భస్మవిశేషము.

సీ. కనిచూపులనుమన్మథుని మోహనాస్త్రంబు లందుఁ గాటుకమచ్చు నందడింప .... వి. పు. 2. 196

ద్వి. వచ్చెఁబో యే నేల వనజాక్షి చూపు, మచ్చు వేసిన నిట్లు మరు లేలకొంటి

ద్వి పరిమ. 2 63 పొ.

వ . గచ్చుకేడెంబులునుమచ్చుపిడెంబులును నిలుపు మందుల కరాటంబులును .. ప్రబంధ 78

2 మృగాదులు వలలోఁ దగులుకొనుటకై వలకు సమీపమున నుంచెడు నాహారము, ప్రలోభనము.

మ. గగనారణ్య చరాంధకారగజముం గాలా హ్వాయవ్యాధుఁడ, చుఁగ బట్టన్ గమకించి మచ్చిడుటకై చూతాంకురశ్రేణిచే, నొగిఁ గల్పించినకందుకం బనఁగ సూర్యుం డంత వీక్షింపఁగా. భాగ. 10 పూ. 1287.

కం మచ్చు లిడి యురులు బోనులు, నచ్చట వెన నొగ్గి చనిన నది యెఱుఁగక యా, మచ్చుచ్చురులను బడి వగ, నిచ్చను దురపిల్లుచున్న యెడ నచ్చటికిన్. విక్ర 5 212.

మచ్చు³. వి 1. నికషోపలము, ఒరగల్లు బంగారు వన్నె పరీక్షింమట కుపయోగించు గీటురాయి.

సీ. సంచితాదభ్రఘు సమిత్సమితికిఁ గాఱిచ్చు హరి వైభవస్వర్ణ మొఱయవచ్చు ...

ఘటికా 1. 140.

2. మచ్చుముక్క, బంగారు లోనగువానివన్నె పరీక్షించుటకై అగసాలి మున్నగువారి యొద్ద నుంచుకొన్నకమ్మి.

ఉ. మైనపుటంటు పల్వగలమచ్చులచా లొరగల్లు కల్లెలున్ ... శుక 1 420.

3 వన్నె సరిగా మన్న దని చూచుకొనుటకై యగసాలివాఁ డిచ్చెడు వెండిబంగారములకమ్మి

ద్వి. మగుడ నిన్ గాంచఁగ మదిఁ దలఁపోసి, వచ్చితి నే నవిన వసుధాధిపతికి, నచ్చుగా నతి వియోగాగ్నికీలలకు, మచ్చిది యన నొప్పుమాణిక్య మిచ్చె. రం రా. సుం 276 పొ. 14 పం.

4 బంగారము, (చూ. మచ్చుగుబ్బలి)

5. విధము, రీతి

వ ఇచ్చెలువునన్ దనయిచ్చకు వచ్చిన మచ్చున నచ్చటచ్చట నచ్చపలుండు నిచ్చలు మెలంగుచు నొక్కనాఁడు ... ఉ రా. 3 102.

జ మచ్చుగుబ్బలి.

మచ్చు⁴ వి (క. త. మచ్చు) పొదలు మొ వానిని నఱకెడు ఒకవిధ మగు మోటుకత్తి.

సీ. సాధుసమాగమజ్ఞానవిద్యకు నచ్చు వివిధ జన్మార్ద ముల్ వెరఁజుమచ్చు ... ఘటికా 1, 140.

మచ్చు⁵ వి మాలిన్యము, ముఱికి.

గీ సిగ్గుకతమున సవయలచేర్పు వాసి, చనును బరికించుఁ తొడవులయునికిమట్టు, మచ్చుమరలేక యుండ నేమఱక యోము, మిగుల మేగరకరిక నా మెఱుఁగుబోఁడి కళా. 7 100.

మచ్చుగుబ్బలి. వి. (మచ్చు³ + గుబ్బలి) బంగారు కొండ, మేరుపర్వతము.

సీ సిరిగట్టు నాకును పిరిగట్టు నేల వప్ప మచ్చు గుబ్బలి నాకు మచ్చు జియ్య ...

చంద్రా. 2 45.

మచ్చెకంటి వి (మచ్చెము + కన్ను) మీననేత్ర, చేఁపలవంటి కన్నులు గలస్త్రీ.

గీ. మెచ్చు గావించె మామది మచ్చెకంటి ...

హరి పూ. 2 5.

గీ అత్తఱంగునఁ గొనిపోవునపుడు గన్ను. విచ్చి కడలెల్లఁ జూచి యమ్మచ్చెకంటి, యురక పలవింపఁ దొడఁగె. అచ్చ. రా. అర. 6.3.

ఉ. ... అ, య్యచ్చర మచ్చెకంటుల యొయారమయూరె నుతింప శక్యమే.

దశా. 2. 240, ఉ. రా. 4 214.

మచ్చెము వి. (సం మత్స్యః, త. మచ్చకు )
1. మత్స్యము, చేప.
కం. మచ్చె మయి సోమకుఁడు మును, ముచ్చిలి వేదములు గొనుచు. భా రా. యు 615.
సీ. .. మీను మచ్చెము చేపఁ యనఁగ మత్స్యము తనరు౽. ఆం. భా. 1. 159.
2. మత్స్యాకార మగు కురణి.
ద్వి కాటుకమచ్చెం బగరుక రాటంబు ...
ద్వి తి. సా 1. 11 పా. 14 పం
సీ. కాటుకమచ్చెము ల్కస్తూరివీణెలు గపురంపుఁ గ్రోవులు గందవొళ్లు ... కవిజ. 3. 51.
జ: మచ్చెకంటి

మచ్ఛము నం వి అ పుం చేప

మజ - మజా, మాజా, మజ్జే, మజ్జా, అవ్య ప్రశం సార్థకము (దీనికి 'బాపు' 'బాపురే' 'బళి' మొద లగునవి తఱచుగా ననుప్రయుక్తము లయియే కన్ప డుచున్నవి )
ద్వి అడిగెడువారు లే కయ్యె నీ వింత, బడగ వైతివి మజ బాపురే యనుచు.
బస పు. 4. 285 పం.
ద్వి నల్లవో పండిత నతపండితౌఘ, నల్లవో పండిత నందితకీర్తి, మజ బాపు పండిత మఙ్కులాచార్య, మజ బాపు పండిత మల్లికార్జునుఁడ
పండితా దీక్షా. 70 పా.
కం. .. మజ బాపురె వీనిఁ బోల మగలుం గలరే. ఉ. హరి. 5. 270.
కం ఆపకుపాల నృపాలభు, జాపాటవమును సమీక జయము మజ బళీ, బా పని తివర్ణ పురుషుం, డాపోవక పొగడె సవినయాలాపములన్.
వరాహ. 9. 15.

మజా — మజ అవ్య ప్రశంసార్థకము.
మ అరరే బాపురె బాగురే బళిరె మే లాహా మజా యంచు నం, బరమార్గంబునఁ జేరువన్ నిలిచి సప్తర్షుల్ ... వరాహ. 10. 63.
చ చెలఁగి కటారిబిత్తరము చిమ్ము విశారపు నవ్వు నవ్వు మీ, సలు వడివెట్టు నూరక మజాయను .. విక్ర. 8. 19.

మజాలీసు. వి (హిం. మజాలీస్) సభ, దర్బారు.
ద్వి. వీర, తరులచేఁ గవులచేఁ దనరి పూవింటి, దొరమజాలీసుతో దొర యైనతోఁట ...
మృ. వి 2. 5.

మజ్జే – మజా (శ.ర.)

మజ్జ. నం. వి. అ. స్త్రీ 1. ఎముకల యొక్కయు మాంసము యొక్కయు సారము. 2 వృక్షసారము, చెట్టుచేవ.

మజ్జనము. వి. (సం. మజ్జనమ్) స్నానము
సీ. స్నానంబు తనరును దానంబు మునుక మజ్జన మన ... ఆం. భా 2. 160

మజ్జనము నం. వి అ. న. 1 మునుగుట, అవగాహ నము. 2 మజ్జ, అస్థిసారము

మజ్జకృత్తు నం. వి. త్. పుం. అస్థి, ఎముక

మజ్జము. నం. వి. న్. పుం. — మజ్జ.

మజ్జరి. వి. నైచికి, ఉత్తమ మైన యావు
గీ చెలఁగు మజ్జరి యనఁగ నైచికి సమాఖ్య ...
ఆం. భా 2. 263.

మజ్జనముద్భవము. నం వి. అ. న. పురుషుల వీర్యము, శుక్రము.

మజ్జా — మజ్జారె అవ్య. ప్రశంసాద్యర్థకము.
సీ. మజ్జా కృపీటసంభవ మహాదిక్పాల హేలా విహార వాహ్యాళివాహ క్రీడా 232.
కం. అతటి వెన్నెల దగె మ, జ్జా తా జాబిల్లి వెజ్జ జగమున కెల్లన్, రాతిరి సోఁకిన చీకటిబూతము విడువంగఁ జల్లుబూతియుఁ బోలెన్.
యయా. 2. 81.

మజ్జాతరము నం. వి. అ న. ఎముక, అస్థి.

మజ్జాజము నం. వి అ న. 1. రేతస్సు, శుక్రము 2 భూమిజగుగ్గులువు, గుగ్గులు భేదము (వ్ృ. వి ),

మజ్జారసము. సం. వి. అ. పుం. పురుషుల వీర్యము, శుక్రము.

మజ్జారె– మజ్జా. అవ్య.

(ఆశ్చర్యార్థకము.)

మ. చనుదేరం గని మింటిమానికము నిచ్చల్ పోవు మజ్జారె యా, విను్రదోవన్ నడయాడ కేల యిటకున్ విచ్చేసెనో యబ్బురం బన ...
యయా 4 65.

(ప్రశంసార్థకము.)

ఉ. ... అగ్రజునితావునఁ దమ్ముని దెచ్చి పూన్చు వాఁ, డై రహి వాలి మున్ను కొని యంతటఁ బోఁ కిటు వచ్చెనేమొ మ, జ్జారె కకుత్థ్సవంశ సదృశం బౌకో యిాగృశధర్మ మక్కటా.
చం. రా. 8. 141.

మ బళిరే మైసిరితీరు నిల్కడలు సేబా సయ్యరే పేరణీ, కలనం బౌర పదాశికాభినయ వైఖర్యంబు మజ్జారె కో, పులవైచిత్రి యహో విని ర్మలకరాంభోజాతవిన్యాస మం, చలివేణుల్ వినుతింప సల్పె నటనం బాకొమ్మ తత్సన్నిధిన్
చంద్రి 2. 97.

మజ్జాసారము.సం. వి. అ. పుం. జాతీఫలము, జాజికాయ.

మజ్జిగ. వి. (సం. మార్జికా. ప్రా. మజ్జిన్ క మజ్జిగె. త. మజ్జిగై.) దండాహతము, చల్ల

గీ మిఠి యొఱుంగక తుంపరుల్ మీఁదఁ బడఁగ, జొన్నకూడును మజ్జిగ జుట్టి లేచి ...
శుక. 2. 411

గీ. అత్తయానతి మజ్జిగ లమ్మవేళ. దాని దారున సీఱించె నేని యింక ... శుక. 2 556

గీ వెలయ వేగురుచుక్కను వెన్నముద్ద, చెంతఁ బాపట్టు శానుమజ్జిగ యనంగ ... తూర్పునఁ దెలుపు దోఁచె, శళాం. 4. 125.

గీ. అడరు దండాహతము చల్ల యనఁగ మజ్జిగ యన ... ఆం భా. 2.259.

మజ్ఝా –మజ్జారె అవ్య. ప్రశంసార్థకము

శా గాఢార్థ ప్రతిపాదనక్రమ కళాకౌశల్యముల్లేక వా, చాథకాక్కర్ఫటితోడఁ దామ తము మజ్జా యంచుఁ గై వారముల్, ప్రౌఢిం జేయుచు ...
సుద. 3.164.

గీ, సంభ్రమోద్ధితనృపజూటచటుల ఘర్ష, సాదు లౌ రౌర బళిర మజ్ఝా యనంగ . .
సుద, 3 164.

సీ .. అద్దిర యయ్యారె యౌర మేల్ సెగ్రీబాసు మజ్ఝా బలారె సేబాసు నాఁగఁ నలరుచుండుఁ ప్రశంసార్థములుగ ... ఆం. భా. 3. 66.

మజ్ఝారె – మజ్ఝా. అవ్య ప్రశంసార్థకము.

మ. అపురా వాకెలతేట ఖూబు పిఱు, దొయ్యారంబు మజ్ఝారెచ. న్గవతళుక్కల్ భళి దంతకాంతు లగెరే కన్నెళుక్క లప్పప్ప కో, ప్పు విలాసంబు.
ప్రబంధ. 484.

మటచి సం. వి. ఇ. ఈ. స్త్రీ. రాళ్లవాన

మటపల్లి. వి (త మటప్పళ్లి.) దేవాలయము నందలి వంటిల్లు.

సీ మటపల్లిచక్కిఁ దా నటు పరామరిసించి యందు లందుల సందుగొందు లరసి ... విప్ర. 5.6.

మటమట – మలమల వి. మాడుట, మఱుఁగుటల యందగుధ్వని, ఆధ్వని కనుకరణము.

కం. అఁకట మటమట మాడుఁచు . .
భాగ. 9. 241.

(శ ర. పా. మలమల మాడుచు ముద్రి. పా.)

జ. మటమటలాడు.

మటమటలాడు అ. క్రి. (మటమటలు + అడు.) మండు, జ్వలించు (శ. ర.)

మటస్పటి సం. వి. ఇ. స్త్రీ. గర్వాంగము.

మటిక – మట్టక (వ్య. వి.). (శ.ర.)

మటుమాయ(ము.) విశ. (మాయము+మాయము.)

1. మాయావి, మిక్కిలిటక్కరి

ద్వి. ఇటువలెఁ జెలరేఁగి యెవ్వరి నిట్టు, మటు

మాయ విధి పట్టి మలకలఁ బెట్టు.
ద్వి. హరిశ్చ. పూ. 1709 పం.

చం. మఱఁది యటంచు బావ యని మామ యటం
చును నల్లుఁ డంచు నం, దఱకును వన్నెవాపు
లిడి తచ్చనల న్మటుమాయ సుద్దులన్, మురిపె
ముల న్విలాసముల మోహము లెంచి నిశాట
చిత్తము, ల్గరఁచె లతాంగి యంగనలు గారె
మనోధనపశ్యతోహరుల్. దశా. 2 366.

ఉ. ఎన్నఁడు నేర్చినాడవుర యీ మటుమాయవు
మాట లీవు నా, కిన్ని దలంప నేమిటికి నిప్పుడు
దోసము పెద్ద చేసి యా, దున్నవయాళికానిఁ
గడుదొడ్డఁగఁ జెప్పి భయంబు నూపి చ, క్క
న్నను దద్దువెట్టి యుఱుకంగఁ దలంచెదు మాను
మీవగల్. సారంగ. 2. 114.

2. నికృష్టము, అధమము.

కం. మటుమాయయాఁడుతన మొ, క్కటియు
నడఁచుపని య దెంత గల దతని కతం, డెటు
వలె వలసిన వటువలె, ఘటియింపన్ గలఁ
డటంచుఁ గర్దముఁ డనినన్.
ఉ. రా. 7. 497.

3. అదృశ్యము, కానరానిది.

సీ. హరుని చే మటుమాయ మై మే నెఱుంగని చిత్త
జాతునకు సంజీవకరణి ... చిత్రభా. 2. 95.

వి. మిక్కిలిమాయ, మోసము.

ఉ. మక్కువఁ దెల్పి యొక్క మటుమాయల
రాకొమరుండు వచ్చి తా, నెక్కువచుట్ట మంచు
వచియించి నభిమణిఁ బెండ్లియాడినన్.
ఉ. హరిశ్చ. 2. 97.

కం. నటలు దటవటలు నటనలు, మటుమాయలు
జాటువగలమాటల వింతల్, గుటిలతయుఁ
దెలిసి పాఱుఁడు విటవిద్యకు బిరుదు వేసి వికవిక
నగుచున్. ప్రబంధ. 614.

కం. వినమే తొల్లిటితపసుల, వనితలకున్ లోను
గానివారలు గలరే, మన మనఁగ నెంత గరఁగక,
మన మనఁగా నెంత కలికి మటుమాయ లకున్.
సారంగ. 2. 13, చంద్ర. వి. 1. 52.

**మటుమాయతనము.** వి. (మటుమాయ + తనము)
మిక్కిలిమాయ.

ద్వి కుటిల కుత్సితములు కూచిమారములు, మటు
మాయతనములు మందు ప్రేఁకులును, నట
మటంబులును మున్నైన చెయ్దములు.
ప్రభు. 2. 50 పా. 9 పం.

**మటుమాయలబండి.** విశే. — మటుమాయలాఁడి.

ద్వి. మంకు దిమ్మరి మటుమాయలబండి ...
ద్వి. పరమ. 4. 298 పా.

**మటుమాయలాఁడి.** విశే. (మటుమాయలు + ఆఁడి)
మిక్కిలి మాయలుగలది.

వ. ... జటివరుండు నమ్మటుమాయలాఁడి పలు
కులు నిక్కువంబులుగా నగచి ...
విప్ర. 3. 20.

ద్వి నాథ! యనాథను నను గావు మనుచు, మాటి
మాటికిఁ బల్కు మటుమాయలాడి, మాటలు
నిజ మని మది విచారించి.
ద్వి. పరమ. 4, 285 పా.

చ. ఆది మటుమాయలాడి యని యంటివిగా ...
సారంగ. 3. 70, దశా. 2. 375.

**మటుమాయలాఁడు.** విశే. (√ మటుమాయ.)
మాయావి, టక్కరి.

సీ మటుమాయలాఁ డన మాయదారి యనంగ
మాయలాఁ డనఁగను మతకరి యన ...
గీ. ... మాయావిపాంక మగును ...
అం. భా. 2. 286.

(మటుమాయకాఁడు. క్రొత్తవ్రాఁత ప్రతుల పా.)

ద్వి. నటలు చూపకుము తచ్చనమాట లేల, మటు
మాయలాఁడ మున్మాటి కీవు.
ద్వి. పరమ. 4. 309. పా

ద్వి. ... మటుమాయలాఁడు, హరి మీర లాతని
యాఁడురూపంబు, చవ్వ సేయక కన్న జగము
లలోన, న వ్వగు విష్ణు. ఉ. 4. (శ. ర.)

**మట్టి** వి. (క. మట్టె.) 1. ఆవులు మున్నగువాని
తోఁక.

వ ... ఒండొండ మట్ట లెత్తుకొని నేలమట్టవి యుచు నద్రువం బసులు వెసం దిరిగి ...
భార. విరా. 4 265.

శ్లో. ఊర్ధ్వపుచ్ఛా న్విధున్వానా ధావమానా స్సమం తతః. సం. భార. విరా. 55. 36

వ. ... మండుతద్వేదనకుం గాక మట్ట లెత్తుకొని యెుత్తు గలపొదరు టడవులు చొరంబాఱు సిడికడితికడుపు ... మనుచ. 4 87.

2. పత్త్రివృంతము, ఆకుతొడిమ

గీ. పత్త్రివృంతంబు మట్ట నా వఱలు .
ఆం భా 2. 77

3 (త. మడల్) కొబ్బెరచెట్టు తాటిచెట్టు మొ వానికమ్మ.

చం ... పూగముల్ భరం, బునఁ బడుమట్టచే
ఆము 1. 70

గీ. నారికేళంపు మట్టనెన్నడిమిచాయ, దళము లందునుల్లోలె నంతతముఁ బాఱు, వేణికా సార ణులయందు విస్మయముగ, జగతి నెక్కుడి వేలేటి సాటి నదులు. భీమ. 2 58

4 తాడి మొదలగు చెట్టు, చిన్నచెట్టు.

సీ మట్ట గీసెడుకత్తిఁ బట్టుబెబ్బులిచేత బిసుకఁ జేసెర దీనిబిగువుగుబ్బ, లు. సురా 59

(వ్యవ.) ఈతాటిమట్టలు ఇంక పదిసంవత్సరము లకుఁ గాని చెట్లు కావు.

జ మట్టగించు, మట్టగింపు.

**మట్టకము** సం. వి. అ. న. నడికుప్ప.

**మట్టగించే** సం. క్రి. (√ మట్ట.) 1 వెకిలించు

ద్వి. సంచితం బగువస్తునమితియుఁ జిల్లపెంచాదిగా మట్టగించి తెప్పించి ..
బస. పు 3. 499 సం. 74 పా.

2 తొలగించు.

గీ. సందెఁ దల యంటుకొనుట వస్త్రంబు లేక, మజ్జనము చేత విరి యాకు మట్టగించి, తాల్చు టయు నిరుగేలను దల పుణుకుట, భర్త గల భామినుల కశుభప్రదములు.
వి. శకుం 4. 79.

సీ చెలి యేల తనకేలఁ జివురుఁ దీవియ వంచె వాని సోయగ మేల గానుపించె, నది యేల ధృతిఁబ్రీల మది జాలి పుట్టించె మరుఁ డేల తాలిమి మట్ట గించె చంద్రా. 4 148.

**మట్టగింపు** వి (√ మట్టగించే) మట్టగించుట, వెకిలించుట.

ఉ. . జలజంబులకుం దలవంపు కోకనం, సాఁము మట్టగింపు నెలబాలునిరాకకు మోమునోంపు శ్శ్రం, గారరసంబు ముంపు కనఁగాఁదగెఁ జీకటి గుంపు పెంపుగాన్. ల. వి. 4. 41.

(ఇందు రెండవపాదమున యతిభంగము)

**మట్టగిడుసు** వి. మత్స్య విశేషము, ఒకజాతి చేప. (శ ర మట్టగుడిసె బ్రౌ. మట్టగిడస అని వా.)

**మట్టపలక** వి (మట్టము+పలక) మట్టము చూచె డిపలక. (శ. ర)

**మట్టమధ్యాహ్నము** మి వి. (మధ్యాహ్నము + మధ్యాహ్నము) కొంచె మైనను హెచ్చుతగ్గులు లేని పగటి నడిమిభాగము.

గీ మట్టమధ్యాహ్న మిది సుధామధురవాణి. యర్ఘ్య మిచ్చోఁ బధ్రశమం బపనయింప.
పాండు 1. 136

**మట్టము** వి.అ. (సం మరమ్, క. మట్ట, త మ. మట్టమ్) 1. సమానము.

గీ మిట్టుఁ బల్లంబు గట్టును మెట్టు నొక్క, మట్ట మై యది నునుపారు
భార. అను. 1 220.

సీ. కలహంసపదువులు గాళ్లందుఁ దొడరె నా మట్టంపునడపులు మందటిల్లె ..
కు సం. 9. 332

2. వామనము, పొట్టిది.

సీ. కుఱుచ కొట్రు కుఱుఁజు కొటిక కుసుని మట్టు

మట్టసి మట్టము మట్టసము గొ, నను గొనప గొనిసె గునిసె గిటిక రింగణా యనఁగను వామ నాఖ్య దవరు. ఆం. భా. 2. 123.

ద్వి మట్టంపుఁ జిగురుకెమ్మలు తొంగలించి, దట్టంపు నన లొత్తి తళతళ మించు.

నవ. 1. 9 పా. 7 పం.

ఉ. . . . చూ, పట్టునిరల్ప కంకణవిభల్ వయనో త్సవ మాచరింపఁగా, మట్టపుటూర్ముల నెమ్మెఱయ మంజుసరోరుహరాగపూగముల్, పట్టపురాణి రీతిఁ గనుపట్టుసరోరమఁ జూచి యుబ్బుచున్

వేం పంచ. 4 134

(రాణిపక్షమున సమానము.)

3. అల్పము, తక్కువైనది.

కం. ఇవ్విధమున రుక్మిణిమదిఁ, బువ్వుం బరిమళ ముఁబోలెఁ బొలుపుగ నెత్తం, బువ్వాయి గలిగె శౌరికి, మవ్వము దిగఁ దొడఁగె గెలుపు మట్టం బయ్యెన్ ఉ. హరి. 3. 125.

ద్వి. మట్టంపుఁ బొడవున మానైనమట్టి, చెట్టు క్రిందటిపుట్ట చేకొనియుండె

ద్వి. హరిశ్చ. ఉ 1775 పం

వి. 1. శిల్పసాధనము.

(నీటిమట్టము, మూలమట్టము మొ.)

2. కొలఁది. మితి

ఉదా: సముద్రపుమట్టము, భూమిమట్టము మొ.

జ. మట్టపలక, మట్టముసేయు.

**మట్టముసేయు.** స క్రి (మట్టము+చేయు) నశింపఁ జేయు

కం. ... స, ద్వ్రితుఁడైనవాఁడు నిర్మల, మతిచే నఘరాశినెల్ల మట్టము సేయున్ ...

భాగ. 6. 49.

**మట్టసము** వి. 1. వామనము, పొట్టిది

సీ కుఱుచ కొట్రా కురుఁజు కొటిక కుసుని మట్టు మట్టసి మట్టము మట్టసము గొ, నను గొనప గొనిసె గునిసె గిటిక రింగణా యనఁ గను వామ నాఖ్య దనరు ... ఆం. భా. 2. 123.

2 పరిమితము.

చం. పెనిమిటి దండుదాడి చని పెంపున గ్రమ్మఱు దాఁక వీడియం, బును సరిగందమున్ విరులు ముట్టక యుండఁ దగున్ బొలంతి తే, జునఁ గడు నొప్పు మట్టసపు సొమ్ములతోఁ గుఱుమాపుచీరతోఁ, దనకలి కొప్పుతో మిగులఁ దార్కొను ముత్తెపుసేస బొట్టుతోన్.

యయా. 4 134

**మట్టసి** వి. వామనము. పొట్టిది, వామనుఁడు, పొట్టివాఁడు

సీ. పొట్టి మొట్టి గిటక పొదిటి పొదదు గున్న .. కుఱుచ కొట్ర కురుఁజు కొటిక కుసుని మట్టు మట్టసి మట్టము మట్టసము రింగణా యనఁగను వామనాఖ్య దవరు ఆం. భా. 2. 123.

**మట్టాడు** – మట్టు న క్రి (మట్టు+అడు, స్వార్థమున) 1 త్రొక్కు

ద్వి మొగిఁ బులుల్ భల్లూకములు గజంబులును, గట్టెండతాఁకునఁ గదుపులై సొచ్చి, మట్టాకి కలఁచిన మడువులు గలిగి

రం. రా. ఉ. 42 పా. 13 పం.

ద్వి మలయానిలము వెంట నలి వచ్చి వచ్చి, యళిపిండు మసలి మట్టాడునో యనుచు.

పండితా పురా 89 పా.

సీ బలిమి నెంతటియనిఁ బరసైన్యతతుల మట్టాడుట తుంగలో నాడునట్లు ... కవిక. 1. 13.

సీ. ఖురముల సప్తసాగరముల రొంపిగా నుంకించి మట్టాడు నొక్కమాటు ... భాగ. 3. 415.

2. మధించు, పీడించు.

మ. మలయాద్రిన్ నెలవై మెలంగెడు మరున్మత్తేభ ముత్తుంగతన్, వలరామాపుతుఁ డెచ్చరింపఁ బథికవ్రాతంబు లేదేఁటిశ్శ్రం, బుల మట్టాడుచు శైత్యమాంద్య భరసౌగంధ్యంబుల న్దానధా, రలతోఁ జేరెడు మన్మనోజలజ వప్రక్రీడ కున్ లక్ష్మణా చం. రా. 6. 11.

శ్లో . మథిత పథికవర్గః
సం. చం రా కిష్కిం. 5

అ క్రి. వ్యాపించు

ద్వి మహనీయతర మైన మణికుండలముల,మహిమ
దిక్కుల నెల్ల మట్టాడుచుండ .
రం. రా యు. 387 పౌ. 5 వం

మట్టి వి (సం మృత్, ప్రా మట్టి, క మట్టి) మన్ను, మృత్తిక.

సీ అర్ధచంద్రునితేట నవఘళించు లలాటపట్టిఁ
దీర్చిన గంగమట్టితోడ ...
మనుచ 3. 71.

సీ మృత్తికాప్వాయము లౌ మిత్తిక యంచవ మట్టి
యం చనఁగను మ న్ననంగ .
ఆం. భా 2 5

చం .. మట్టికాసెలన్, బిడియము లంటదోఁపి
పృథుభీషణ బాహువుల సాళువఁబులన్, దడవి
కెరల్చుచున్ జనిరి నాథునిమ్రోల నృపాలనంద
నుల్ మనుచ. 4 30.

(మట్టికాసె — మట్టిరంగు గలదట్టి )

సీ చిప్పకూఁకటి తోడిశిరసునం దిడినట్టి జిగి మట్టి
కుళ్ళాయ సొగను మీఱ .
చం రా. 2. 61

సీ, గడిదంబు మట్టిచల్లడముపై బంగారు సాటి
చెంగు లొకింత జాఱఁగట్టి ...
ఉ హరిశ్చ. 2. 52.

సీ తనుమేరు గిరిమీఁది తరుణాతపంబునాఁ బలుచని
మట్టిదుప్పటి యొసంగ . శుక 2 358.

జ· మట్టితైలము.

మట్టించే స క్రి. (√ మట్టు) త్రొక్కించు

సీ. .. పృథులహస్త, తలములఁ జఱిచియు దంతా
వళంబులఁ గోలిపి మట్టించియు ఘోటకముల,
మేను ద్రొక్కించియు
భా రా యు 891.

సీ మట్టించెఁ గలవ సామ్రాణి తేజీలచే మత్తారి
రాజన్య మస్తకముల . చిత్రభా 1. 34.

కం ఇట్టికుమారులఁ గని చే, పట్టె జయేంద్రిర
నృసింహ పార్థివుఁ డాజి, న్మట్టించె వైరి శిర
ములు, ఘోట్టాణ కఠోర ఘో· ఖుర పుటపటు
లిన్ రామా 1. 105.

2 నడపించు

వ ... ఘోణారంధ్ర నిశ్వాస గంధవాహ ప్రవా
హంబు వెడలు వాహఁబు దిగ మట్టువడ నిట్టట్టు
మట్టించుచు మనుచ 4 115.

మట్టిక[1] – మటిక వి. గోరుచిక్కుడు (వృ వి )
(శ ర )

మట్టిక[2] వి. (√ మట్టు) పాదపీఠము

ఉ కట్టికవారు సారె సముఖా యన వామపదంబు
కెంపురా, మట్టిక నిల్పి గద్దెపయి మార్పడ
వేతొకజాను పూఁది ... చంద్ర 2 79

మట్టితైలము మి. వి. (మట్టి+తైలము) మట్టి
నుండి తీసెడు ధృతి

(వ్యవ ) మట్టితైలము మందుగా నుపయోగించును

మట్టిమల్లాడు స క్రి (మట్టు+మల్లాడు) పాడు
చేయు, ధ్వంసముచేయు

ద్వి మదపుటేనుఁగుఛంగి మట్టిమల్లాడి, నదులు
గోరాడుచు నవి రేఁగి మఱియు.
రం రా ఉ 29 పౌ 29 వం.

వ . . మహావక్రంబు సముద్ర క్రోడంబునుంబోలె
విక్రమాభిక్రమంబున నుక్కు మిగిలి యాశక్రారి
సేనాన క్రాకరంబుఁ జొచ్చి శోధించి కలంచి
కలగుండుసేసి మట్టిమల్లాడి వెరఁజి వెంపరులు
వెట్టి వచ్చి పోయినతెరు వెఱుఁగరాక ....
పి శకుం. 3 126.

సీ మట్టి మల్లాడిరి మదసామజంబులఁ బురజన పద
ములు తురకబలము ... సిం. నార. 5·

మట్టియ[1] – మట్టె వి 1 స్త్రీలు కాలి రెండవ
వ్రేలికి ధరించు ఆభరణ విశేషము

సీ. లలితంబు లగు మట్టియలచప్పు డింపార వంచకై
వడి వడ నల్లవచ్చి . . భార. విరా. 2 64.

సీ. వయకలవ్రేళ్ల మట్టియలుఁ బిల్లాం డ్లిడి పాయ

వట్టముఁ బెట్టె బై నొకర్తు ...
ఆము. 6. 128

2 మగవాడు కాలిరెండవ వ్రేలికి ధరించు భూషణ విశేషము

సీ మట్టియ లొండొంటి బిట్టు దాఁకఁగ నేల నందంద మునిగాళ్ల నప్పళించు ..
భార విరా. 2. 250

**మట్టియ²** వి (సం. మృత్తికా. ప్రా. మట్టి ఆ) మృత్తు, మట్టి.

సీ కల్పింప నేర్చిరి గంగమట్టియమీఁదఁ గస్తూరికా పుండ్రకములు నొసల .
కాశీ. 1. 37., భీమ. 1. 40.

**మట్టు** స. క్రి. 1 త్రొక్కు.

చం కొడుకులపాటు సూచి కడుఁగోప మెలర్పఁగఁ దల్లు లొక్కయు, మ్మడి వనజాయతేక్షణుని మట్టఁ దలంచి మహోగ్రహుంకృతుల్, వడిగొనఁ గొమ్ము లొడ్డుకొని వాతులు విచ్చి ఖురాగ్రపాతనం, బుడమిఁ బగుల్చుచున్ ..
హరి. పూ. 6 87.

చం తనవెంటనె ద్వారపాలురన్, నెఱిచెడ మట్టికొంచుఁ జొర నిర్భర గర్వము నుబ్బు బింకమున్, మెఱయఁగవచ్చి యా యసుర మించె మదగ్ర మహాసనస్థితిన్ ప్రభా. 1. 81

గీ వెట్టదినముల మడుగుల మట్టి కలఁప, బుడబుడధ్వని వెడలు బుద్బుదములందుఁ, జిలుప చిలుపనినేతులు జిడ్డుదేలు
మనుచ 4. 17.

2 అణగద్రొక్కు.

మ. నను నాకశ్యప కామినీమణులలోనన్ ధన్యగాఁ జేయుమ, త్తనయవ్యాజము దాల్చి వామనుని చందాన న్బలి న్మట్టవే .. పారి. 3. 33

3. అధఃకరించు.

కం నెల మట్టు నెమ్మొగము వె, న్నెలమట్టు నడల్చునగవు నెత్తమ్ములకున్, దలకట్టులైన యడుగులు, దలచుట్టుఁ గనుంగవయు నితంబిని కొప్పున్ రా వి. 3. 87.

4. బాధించు

చం. కనుకనిఁ దోలి దాఁపిదెసఁ గన్నులఁ జూచిన వాని నేయు నా, మనసిజుఁ డంచుఁ గోయిలలు మట్టును ... కు సం. 8 153

5 చుట్టుముట్టు, ఆవరించు

చం . త్రిదశవల్లభ సేవితు నాశ్రయింతు నా, మనమున ఘోరదుర్దశలు మట్టిన సంపద మిన్నుముట్టివన్ ఉ. హరి 2 60.

6. పడవేయు

ఉ ముట్టియ నింద్రనీలతట మూఁ మహిప్రభవంబులై నపె న్పుట్టలు గ్రుచ్చివైచుచును భూరుహషండముఁ జాఁపకట్టుగా, మట్టుచు .
హర 7. 44.

7 ప్రవేశించు.

వ. ఇవ్విధంబున వసుదేవనందనుండును నేమును ... మ వల్లకంబు మట్టి, మ్లేచ్ఛంబు మెట్టి
ఉ. హరి. 2. 37.

8. క్రి ప్రసరించు

ఉ ఇచ్చకు వచ్చినట్లు చరియించుట దైన్యము లేని తిండియున్. నిచ్చలు సాధుసంగమును నిర్మల శాంతియు శాస్త్రబోధముల్, మచ్చికలోనఁ బూని వెలి మట్టనిచిత్తము నాఁగ నింతయు, న్వచ్చుట యేమహోన్నత తపంబు ఫలంబొ యెఱుంగ నేర్తుమే భర్తృ. 3. 82.

వి. 1. ప్రదేశము, చోటు.

ఉ .. పెలుచం జనించి యొకమట్టున నిల్వక యాక్రమించెఁ గాఁ, కంబరితాప మూన నవఁ గాలె మొగిల్వరియొండ లత్తఱిన్.
అము. 4. 160.

చం. ఒఱపరఁ గన్న గూడఁ జను నూరక సన్నలు వాఱ నాడు పల్మఱుఁ బొరుగిండ్ల కేఁగు నొక మట్టున నిల్వదు చంటిమీఁదముఁ, జెఱఁ గొడలించు ... జారధారుణిన్ వై భా. 3 28.

గీ సిగ్గుకతమున సికియలచేరు, వాసి, చనును బరికించుఁ దొడవుల యునికిమట్టు, మచ్చుమర లేక యుండ నేమఱక యోము, మిగుల మేగర గరిక నా మెఱుఁగుఁబోఁడి. కళా 7 100.

(ఉనికిమట్టు – నివాసస్థానము.)

2 అందము

సీ వాల్గంటి కిల్గంటు వైచి వచ్చిన చెల్వుజడ యల్లుకొనునాఁటి సవురు జౌరు, నొయ్యారి మెఱుఁగుసొమ్మూని వచ్చిన సీటు, మణిభూష లిడునాఁటిమట్టు దిట్ట. విజ వి. 3. 13.

3. విధము

వ. కొండ్రముచ్చులబాగుగ గాడ్పుచేఁ బోవు చొక్కాకులరేక బట్టివాయి వెడలువులుఁ గుల మట్టున చట్టంబుల నెగయు నాకాశబాణంబుల దురుసున ప్రబంధ. 788

4 అమరిక, కుదిరిక.

సీ మగువ నీవ్రేలికి మట్టౌనొనా యని కడవ్రేలు బట్టి యుంగరముఁ బెట్టు ... దశా 9 223.

5. కుదురు, మూలము.

చం. అనిశము గోసహస్రవిధి నందులకోమటులిచ్చు ధేనువుల్. గొని చను భూసురోత్తముల గోవుల పాదహతి న్మహీతలం, బవయము గ్రుంగి మట్టువిసి .. కు. సం 7. 955.

6. (క త మట్టు) మితి, మేర.

ఉ. పట్టఁగరాని మోహమునఁ బైకొని తోఁచిన వెల్లఁ బల్కితే, మట్టునఁ గట్టిపెట్టు మిదిమాన సమందె ధరిత్రిలోపలఁ, బుట్టని యట్టి బిడ్డలకుఁ బూసలు గట్టుదురు .. అహ. 3 55.

కం. తనయుం దయ్యును గనుఁగొన, మనమున శంకించి కొంతమట్టుకు ధైర్యం, బును దెచ్చుక, కను విచ్చుక చూచి ప్రేమ కలితుం డగుచున్.
మల్లుపు. 2 78.

కం మట్టొకటి కలదె నీకుం, దొట్టినమదమునఁ దపోధనుఁ బరాశరునిన్, నట్టేటఁ బుట్టి ముం పవె, కట్టా కందర్ప కుసుమకాండములవడిన్.
కకు. 3. 114.

7 పరిమాణము, కొలఁది.

కం. పట్టపుదేవి న్ధీమణిగిరి, షట్టి న్నాయమ్ముఁ జూచి పదరినకతనన్, నెట్టవిసెనొ నే మందల, మట్టెఱుఁగనొ కంటకిం బ్రమాదం బొదవెన్.
కాం. 3 112.

సీ. మట్టెఱుఁగక యాకు మడుపు లొసఁగుట యొద్దఁ బవళింపఁ బక్కకు దివియకుంట.
దశా 7 70.

8. మర్యాద, కట్టుబాటు.

సీ గుట్టుతో సంసారిమట్టునఁ జట్టాలఁ దనియిం-తు వని హారదత్తుతోడ .. శుక 1. 39.

ద్వి. అనక్తి యావరాజ్యాభిషిక్తునిగ, జేసెద నని తండ్రి చెలఁగి యయోధ్యఁ, బట్టంబు గట్ట భూపతి సమకట్ట, మట్టు మీఱిన యట్టి మందర యపుడు ర౦ రా. బాల 5 పా 26 పం.

9. ఆధారము.

సీ చరమాంగపీఠికా స్థాపితశేషుండు కితవ కచ్ఛపరాజు క్రిందిమట్టు. హరి 6. 40.

10. పాఁతు.

కం. నెల మట్టు నెమ్మొగము వె, న్నెలమట్టు నడల్పు వగవు నెత్తమ్మొకుం దలకట్టు లైవయడుగులుఁ, దలచుట్టుఁ గనుంగవయు నితఁడిని కొప్పున్.
రా. వి. 3 87.

11. త్రొక్కుడు.

గీ. బలనికాయము కాలిమట్టుల నడంచుఁ, గట కమును నింక ననుచు నుత్కలమహీశుఁ, డను దినమ్మును వెఱచు పారి. పీఠి 23.

సీ. తనకాలిమట్లచే జనులకుఁ జొరరానికాంతార ములు చాఁపకట్టు వడఁగ .. రా. వి 3. 49.

విశే. 1. వామనము, పొట్టిది, తక్కువది, అల్పము.

సీ పొట్టి మొట్టి గిటక .. కుసుని మట్టు మట్టసి మట్టము మట్టసము .. ఠింగణా యనఁగను వామనాఖ్య దనరు ...
అం. భా. 2. 123.

ద్వి. మట్టుపాదంబులు మసలింపుమేను ..
పండితా దీక్షా. 40 పా.

సీ. కళపెంపు మట్టు గాఁగల దిక్కనయొ ముఖా
బ్జంబు వెల వెల్లనై యుంగె ..
కవిరా. 2. 178.

2 సుందరము

కం మట్టయిన యట్టి రతులు, పట్టనము నడి
ణంబు పార్శ్వపుగవనిన్. భీమ 1 101.

సీ .. జట్టి మీఱినపట్టుఁ బుట్టము శ్రుట్టుగాఁ
గట్ట వేమి నీలా. 2. 88.

3. స్థిరము

కం. కట్టువడి వివిధయోనులఁ, బుట్టుచు, గిట్టుచును
వెతలఁ బొం దితిమహాత్మ, పుట్టుపు చావును
మాన్పుము, మట్టుగ రామేశలింగ మతితా
నగా రామే 4. 112.

**మట్టుకాఁకర** వి (మట్టు+కాఁకర) ఒక దినుసు
కాఁకర, కర్కోటము. (వ్య వి) (శ ర.)

**మట్టుకొను** అ క్రి (√మట్టు) కుదురుకొను, నెలకొను

గీ. చిత్తజాతుండు కనుమాయ చేసినాఁడొ, మన
మనంబుల విశ్రాంతి మట్టుకొనెను ..
విక్ర. 1. 139

వ ప్రదక్షిణ భ్రమణంబులఁ బరిభ్రమించి మగుడ
నెట్టకేలకు మట్టుకొను వవియును.
మనుచ. 4 27.

**మట్టుకొలుపు(ల్పు)** స. క్రి. (√మట్టుకొను) మట్టు
కొనఁజేయు

సీ సలలితసత్కీర్తిచంద్రికఁ బగతు మనముల
తాపంబు మట్టుకొల్పి విక్ర. 2 73.

**మట్టుచేయు** స. క్రి. (మట్టు+చేయు.) చక్కఁ
జేయు సమాప్తముచేయు

ద్వి అంచితంబుగ దట్టి యపుడు చేజిక్కె, మంచిది
నీపని మట్టుచేయింతు, నని కడలేని కామాంధ
కాంతమున, సొమ్ములు దీసి ముల్లెగాఁ గట్టి
ద్వి. శ. సా. 1 718 పం.

(పని – జీవితము.)

**మట్టుపడు** అ క్రి (√మట్టు త. మట్టుప్పడు.)

1 అడఁగు, నశించు

వ . అమ్మువ్వురును మూఁడగ్నుల తెఱంగున
మహాతేజంబు సూపి మహాసేనుతేజంబు మట్టు
పడం జేసినం గోపించి కుమారుండు.
హరి ఉ 8. 157.

ఆ చదువు చట్టుపడియె శాస్త్రంబు మన్నయ్యె,
బుద్ధి పురువుమేనెఁ బుణ్య మడఁగె, నీతి మట్టు
వడియె నిర్మలజ్ఞానంబు, ముట్టముడిఁగె బోధ
మూరిఁబోయె భాగ 6. 13౦.

2. చచ్చు.

గీ మఱియు దనుజుండు శాంబరీ మంత్ర మహిమఁ,
బర్వతారణ్య జీమూత పటల భయద, మృగ
సరీసృపవితతి నిర్మింప నరుఁడు, మట్టుపడ నేసె
నాయాయి మార్గణముల
జై భా. 5 145.

గీ. వాతవిధ్వంస నరసాఖ్య వఱలు నౌష, ధంబు
నాగేంద్ర మనుమంత్రితంబుఁ జేసి, వలయు
నీపైఁ బ్రయోగింప మలయపవన, మందు
మంత్రంబులను గాని మట్టుపడవు
కవిరా 3. 139.

3 కుదురుపడు, స్థిరపడు

సీ. తల్లి వేదాంతశాస్త్ర సరస్వతీదేవి మనను నా
కేమిట మట్టుపడక. ప్రబోధ. 5 32.

వ .. ఘోణారంధ్ర నిశ్వాస గంధవాహ ప్రవా
హంబు వెడలు వాహంబు దగ మట్టువడ
నిట్టట్టు మట్టించుచు ...
మనుచ. 4. 115

**మట్టుపఱుచు** స క్రి. (√మట్టుపడు) కుదురుపఱుచు,
బాగుచేయు

గీ గుండె నీఱుగ నలిపి కాకుత్స్థవర్యుఁ, డెట్ట
కేలకు ధైర్యంబు మట్టుపఱిచి ...
జై. భా 6. 30

సీ. తమతండ్రి చేసిన తరుతటాకాది ధర్మము

దృఢంబుగఁ జేసి మట్టుపఱిచె
జాహ్నవీ. 1. 116

సీ చిట్టాడుసిగ్గుతోఁ జేపట్టఁ బెనఁగుడెందము మట్టుపఱిచె నాననము వంచి ...
సారంగ 3. 149.

౨. తగ్గించు, చాలించు, విరమించు.

ద్వి. అవిరళగతి నాకు లల్లాడకుండఁ, బవన సంచార మేర్పడ మట్టుపఱిచి ..
ద్వి హారిశ్చ. పూ. 1655 పం

గీ వెలయఁ గమలోద్భవునినారివేఁడి నీల, కంఠ సతివేఁడియు వసూనగానలాస్య, మాధురీ విభ్రమంబులు మట్టుపఱుప, నౌనరి రతివలి తాత్మజాత్యుచ్ఛ్రియమున
హ. న 2. 62

(నలపక్షమున )

కం, .. బోయలు వేఁటల్ మట్టుపఱిచి యా చెంతల, పొట్టెము లగుపొదలఁ జేరి పొద లెడు వేడ్కన్.
చంద్ర 2. 49.

౩. అలంకరించు, ధరింపఁజేయు

సీ ... మణులసొమ్ములు మేన మట్టుపఱిచి
మనుచ. 6 5.

సీ. అంగుళీయకముల వటఁగొన్ని ఘటియించి మౌక్తికహారముల్ మట్టుపఱిచి ...
దశా. 2, 183

**మట్టుపె(వె)ట్టు** స. క్రి. (మట్టు + పెట్టు)

1. అణఁచు

చం ... నిన్ను వంటికులభామలఁ గానవొ వారి కాత్మనాథులవయి జాళి లేదొ తమి దొట్టిన పట్టున మట్టుపెట్టరో.
కువల. 3. 43

ఉ గట్టుల మట్టుపెట్టుజలుకై దువుఁ బట్టిన యట్టి ట్టఁడున్, దిట్టతనంబు వాసి పొలదిండికి లోఁబడి గాని చెందఁగా, నెట్టు సహింపవచ్చు...
ఉ రా 5 11.

2 చంపు వధించు

వ ... మాతండ్రివలని పూర్వవైరంబుఁ దలంచి, మట్టుపెట్టున్‌గాని నన్నేల పట్టంబు గట్టును ...
భా. రా. కిష్కిం, 677.

వ ... తోఁబుట్టువుల మమ్ము మొదట మట్టు పెట్టి మీఁదట మాతృశిరంబు గొట్టి.
దశా. 6. 85

సీ. ప్రళయాబ్ధి మోఁకాలిబంటిగాఁ జరియించు మధుకైటభులఁ బట్టి మట్టువెట్టె ...
ఉ, రా 2. 12.

3 తెగఁగొట్టు.

వ .. వడఁకుమెట్టకడఁ దోఁక వెట్టుకొని గట్టు చట్టుపల మట్టుపెట్టుదిట్ట దెస మొగంబుగాఁ జాఁగి ...
చం రా. 3 25

4 సమాధానపఱుచు.

గీ. జగతి నావిప్రవరుఁ డయాచకుఁడు గాన, నింటి లోపల ధాన్యంబు లెపుడులేవు కోమలికిఁ బూటపూఁటకుఁ గుడువఁ గూటి, బిడ్డలను నేగ తిని మట్టు పెట్టవచ్చు ...
కుచేల. 1. 35

5 కుదురుపఱుచు

ఆ ఇదియ పర మటంచు నితరచింతలు వీడి మనసుఁ జెదరనీక మట్టుబెట్టి, కొదువ లేక నిలువఁ గోర్కెలు ఫలియించు, మనసులోన నుండుమహిమ వేమ.
వేమ 3. 279.

**మట్టుబచ్చెలి** వి (√మట్టు) దుంపబచ్చలి, ఉపోదక (వృ వి ) (శ. ర.)

**మట్టుబీఱ** వి (√మట్టు) ఒకనుసుబీఱ (వృ వి.) (శ, ర )

**మట్టుమిగులు** అ క్రి (మట్టు + మిగులు) అతిక్రమించు (శ ర )

**మట్టుమీఱు,** అ. క్రి (మట్టు + మీఱు) మితి మీఱు, అతిశయించు,

సీ చెలువంబు నెగడఁ దీర్చిన క్రొత్తకస్తూరి పట్టెల మేల్తావి మట్టుమీఱ ...
చంద్రి 1. 107.

గీ. మారుతమ్ములవాఁడికి మలయకూట, మారు
తమ్ములవేఁడికి మట్టుమీఱు, చంద్రకిరణమ్ములకు
శుకశారికాళి, చంద్రకిరణమ్ము లకుఁ జాల జల
దరించు. విజ. వి. 3. 8.

వ. నెట్టన నాగట్టుదొరపట్టి యెట్టకేలకు మట్టు
మీఱి గుట్టునం బట్టరానితమకంబునం దట్టువడి,.
వసు. 2. 140.

మట్టె1 – మట్టియ1 వి. స్త్రీలు కాలి రెండవ వ్రేసికి
ధరించి ఆభరణ విశేషము.

శా. మట్టె లొఖ్రియఁగ గబ్బిచన్నుగవ కంపం
బంద ... మనుచ. 4. 68.

సీ. మట్టెలు పిల్లాండ్లు మఱి వీరమ ద్దియ తెలమిని
దొడిగెఁ దొయ్యలి యొకర్తు ....
యయా. 4. 89., అం. భా. 2. 151.

మట్టె²–మట్టియ² వి. (సం. మృత్తికా. ప్రా.
మట్టి. ఆ.) మట్టి. చూ. (మట్టెవన్నె.)

జ. మట్టెవన్నె.

ఉ. ... ఆనెగకంటివేల్పురా, పట్టపుదేవి తద్ధరణి
పాలకు ముంగలఁ దోఁప వేడుక ల్మట్టెగయ
న్మహీశ్వరులు మంచతలంబుల నిల్చి భ క్తిఁ జే,
పట్టి లలాటవీథిఁ గరపంకరుహాంజలు లుంచి
రందఱున్. చంద్రి. 5. 33.

మట్టుదొరంగు – అతిశయించు.

ఉ. చిట్టుము లంకురించె జిగిచెక్కులఁ దెల్పు
వటించెఁ గోరికల్, మట్టుదొరంగె నెన్నడల
మాంద్యవిధంబు చెలంగె ...
ఇందు. 2. 185.

జ. మట్టాడు, మట్టించు, మట్టిక, మట్టిమల్లాడు,
మట్టుకాఁకర, మట్టుకొను, మట్టుకొలుపు,
మట్టుచేయు, మట్టుపడు, మట్టువఱుచు, మట్టు
పెట్టు, మట్టుబచ్చలి, మట్టుబీర, మట్టు మిగులు,
మట్టుమీఱు.

మట్టెవన్నె. వి. (√మట్టె) మట్టిరంగు.

చం. తెఱవకు వల్లభుండు పరదేశము వోయినవన్నె
మాని తో, నఱితికి నల్లబూసలును నచ్చుత
బొట్టును మట్టెవన్నెగాఁ, గుఱుమఱుఁ గైవ
పుట్టమును ... వి. శకుం. 4. 81.

మఠము సం. వి. అ. పుం. న. 1. ఎడ్లబండి.
2. విద్యార్థులు మొ. వారి నివాసము.

మఠరము సం. వి. అ. పుం. 1. కార్కశ్యము,
కఠినత్వము (వై. ని). 2. ద్రవీభూతదధి.
3. ఒకానొక పురుగుజాతి. (కే. ని.)

మఠరుఁడు సం. విశ. (అ. ఆ. అ.) 1. మత్తుఁడు,
మత్తెక్కినవాఁడు. 2. కర్కశుఁడు. (వై. ని)
3. కంఠగతప్రాణుఁడు (కే. ని.).

మఠ్యము సం. వి. అ. పుం. తాళభేదము, పది
యక్షరములకాలము (శ. ర.).

మడ వి. (క. త. మడ.) ప్రవాహమార్గము.

ద్వి. మునుముగా మేపుచు ముందట మెకము, చని
నఱా డెఱఁగి క్రచ్చర నడ్డపెట్టి, మరలఁ గొల్పు
చు వాఁగుమడలఁ బల్లముల.
నవ. 1. 9 పొ. 14 పం.

ద్వి. కొలఁకులకెలఁకులఁ గొమరార నాను, తల
ముల (చలమల) చలువలఁ దలకొల్పు మడల,
యొడలను మెఱుగారు నిండు కాంతంపు, టరుఁ
గుల చెఱఁగుల నలరారు గుహల, తెరువుల
నొఱపుగాఁ దిరిగి క్రీడించి.
నవ. 1. 12 పొ. 4 పం.

కం. వడకట్ట లిసుకతిప్పలు, మడలు దరులు వాఁక
లును గ్రమంబున నొకఁదున్, గడవఁ బడ-
కుండఁ గృష్ణుఁడు, వడతులకును యమున-
యాటపట్టుగఁ జేసెన్.
హరి. పూ. 8. 37.

జ. మడవ, మడవచేప.

మడ² వి. ఒకజాతి చెట్టు.

(వ్యవ.) మడకట్టలు వంటచెఱకుగా నుపయోగిం
తురు.

మడఁక¹ వి. (√ మడఁగు, క. మడకె.) మడుపు-
చలువబట్ట.

గీ కుబ్జవంశులు దీరిచి కోర్కెలొసఁగి, యబ్జనాభుండు కంసునియంబరములు, మడఁకలుగఁ జేసి కొనివచ్చు చెడుగురజకు, నడిగె మా కిమ్ము చేలంబు లనుచుఁ బ్రీతి ..

ధర్మ 6 160.

ద్వి. రమణకట్నంబు గిట్నము మాడ మడఁక గమియంగ నిచ్చితో కళవాళించెదవు ...

పండితా. పురా 115 ప్ర

మడఁక² వి. (క. మడకె) దున్నుటకై యెడ్లను గట్టి సిద్ధము చేసిననాగలి, అరక. (శ ర)

మడఁగు–మణఁగు అ క్రి. (క త మడంగు)

1. క్షీణించు, తగ్గు.

వ. ... కండలు వ్రాలియు గుండెలు గూలియు, రూపు లడంగియు నేపులు మడంగియు .

మార్క 6 206.

2 అడఁగు, లొంగు. (మరలు అని శ ర)

సీ. మ్రాను పేరేటిచే మడఁగునో మడఁగదో మడఁగుపేరేటిచేమ్రాను మడఁచె ...

ఉ. హరి. 2 176.

3. చెడు, నశించు.

గీ చూడు మటు నరవరజయస్ఫూర్తి నార్చె, వైరిసేన భూరిశ్రవోదారుణరణ, మహిమ దను జ బలశ్రీలు మడఁగ నింత, టను రిపుఁగరంబు దెగవ్రేయకునికి గీడు

రాఘవ. 4 168

సీ భూరిదోషాగమస్ఫూర్తి వాటిల్లంగ నుదిత ధర్మక్రియ లుడిగి మడఁగ భాగ. 3. 83

4. వంగు.

(వ్యవ) కంచరి ఇనుపరేకు మడఁగఁ గొట్టెను

జ. మడఁచు, మడఁత, మడఁపు, మడఁబెట్టు, మడ త్రొక్కు

మడఁచు–మడఁపు న. క్రి. (√మడఁగు క మడుగు.)

1 మడఁగఁజేయు, మడఁతపెట్టు.

సీ. .. మడఁచి కట్టిన మేలినడిమికట్టు .

హర 2. 93

చం. పొలుపుగ నీరుకావిపటముం గటిఁ బింజెమ డంచి కట్టి.

విప్ర 2 28

సీ అడపంబు తొయ్యలి మడఁచి యిచ్చిన తెల నాకుఁ జీలిక చేతియంద యుండ ..

కళా. 1. 17

2 అడఁచు, నశింపఁజేయు

సీ అజవంజవమున కనుచారి యై పర్వు నంతఃకరణ తతియలవు మడఁచి ..

కు సం 12 999

3 మడఁగునట్లు చేయు, వంచు

గీ . వేలు, మడఁచి యెణిఁగింపుఁ డెఱిఁగిన మౌనివర్య.

దశా. 1. 253.

4. అణఁచు, ఇముడ్చుకొను.

ఆ మనసు మనసునందె మడఁచి యాత్మని నాత్మ, యందె కాంచునట్టి యతఁడు సర్వ, విదుఁడు...

భార. అశ్వ. 2. 153

సీ. మ్రాను పేరేటిచే మడఁగునో మడఁగదో మడగు పేరేటిచే మ్రాను మడఁచె ...

ఉ. హరి. 2. 176.

మడఁతి–మడఁది వి. (క మడది త మడంద్తై. మ. మడంద) 1 స్త్రీ, ఆఁడుది.

ద్వి మడఁతి యీతండె యిమ్మనుజేశుచేత, గడ చన్న మన్ననఁ బడసిన యతఁడు ..

బసవు. 2. 91.• పం. ఆం. భా. 2. 104

రగడ పడఁతి వెనుకకొమ్ము చించెఁ బట్టిపట్టి. మన్న చేల, మడఁతి పొగడ పొన్నతో సమా నమా నగంగ నేల. వరాహ, 3. 92.

కం. బాలా వేలాగుల బతి, మాలిన విన తిగ్గయాళి మడఁతుల వెంటన్, బేల వయిచనెదు ..

రసిక 3 91.

జ. మడఁతితనము, మడఁతుక.

మడఁతితనము వి (మడఁతి+ తనము) స్త్రీత్వము. ఆఁడుఁదనము.

కం కడు నరుదుగ నీయెడ నీ, యడుగుంగొన యంత నోఁచినంతనె చెడుగుఁ, గోడిమెలు విడి

చని క్రమ్మఱ, మడఁతితనం బొదవె నాకు మానిసిమిన్నా.

అచ్చ. రా. బాల 149

**మడఁతుక.** వి. (మడఁతి + ఉక, స్వార్థమున) స్త్రీ. ఆఁడుది.

కం. మానుగ జగములయావడి, మానుపఁగాఁ గోరి పుడమి మడఁతుకయై వి, న్నానికపు వంగడంబున, రానెల యై పొడమి, నట్టి రాముని బంటన్. అచ్చ రా. సుం. 138.

ద్వి అడలి యా రత్నాంగి హాపుత్ర యనుచు, మడఁతుక మూర్ఛిల్లి మహిమీఁద వ్రాలె ద్వి. శ సా. 2. 246 పం

**మడఁది – మడఁతి** వి. 1. స్త్రీ. ఆఁడుది. (ఈరూపము శైవవాఙ్మయమునందే అనిర్ధారిత స్థలమందే గన్పట్టుచున్నది.)

కం. కొడుకని చేకొని నిన్నున్, మడఁది యతి ప్రీతి బెజ్జమహాదేవి మహిన్, గడుఁ గొనియాడిన భక్తికి, నొడఁబడి యాయమకు ముక్తి యొసఁగవె రుద్రా. శివ. సా. 436.

తరువోజ. కడుఁ దోరమై ... వేగ, నడవంగ నేరక వయమున వంచనడలకు నందమై వడ తెంచుచున్న, మడఁదిఁ జూచిన విటమండలి.

కు సం 8 67.

ద్వి. మడఁదియు దాను సమ్మదలీల నుండ ...

బస. పు. 6. 140 పం

2 భార్య.

కం మడఁది గొడు కర్థ మిది యని, యెడసేయరు భక్తి నిత్తురేలిన పతికిన్. బడయుదురు మగుడవానిన, మృడుభక్తులు వలచి రేని మెచ్చించి శివున్, శివ. సా. 185

**మడకము.** సం. వి. అ పుం. సస్యవిశేషము (కల్ప.)

**మడత.** వి. (√మడఁగు. క. మడకె.) 1. (వస్త్రము మొ.) మడుపు.

గీ. మడత పసిమిడిగిం జెముల్ మంజిడిజిగి, దోమ తెరమంచములు హంసతులు బవాదిం, యగలు సిరులు చిన్నెలు గాఁగ నతఁడు గడపెఁ, జలి నెలలు తద్వధూకుచ శరణుఁ డగుచు

కళా. 7. 188.

ద్వి మడత విప్పక నడుమను గట్టుచాయ, జడిసిన తోఁపు పచ్చడ మింతజాల ...

ద్వి కరమ 3 225.

2. కడుపుమీది మడుపు (శ. ర.).

వ్యవ. వానికి కడుపు మడతలు పడినది.

3 ధౌతవస్త్రము

గీ .. ధౌతవస్త్రంబు బరగు మడుఁగు, మడత మడి చలువ .. ఆం. భా. 2 153.

4 భక్ష్యవిశేషము.

వ. .. నీరువత్తిగెలు మడతలు పప్పుబూరెలు... పూరిలు గూళ్ళాపిడ లాదిగాఁ గలభక్ష్యంబులు గూడల నించి జాతిసాతానులు గావళ్లం బూని వెంట నంటిరానప్పుడు. హంస 1. 105.

**మడత్రొక్కు.** స. క్రి. (మడఁగన్ + త్రొక్కు, వృత్తిని వర్ణలోపము.) తాటాకులు మొ. విడదీసి దొంతిగా అణఁగఁద్రొక్కు (శ ర)

(వ్యవ) ఇల్లు నేయించుటకై తాటాకులు కొట్టించి మడత్రొక్కితిని.

**మడపు – మడఁచు** స క్రి. (√మడఁగు) పోఁగొట్టు.

సీ. బలిబంధవేళ నంధిలునరంతా చంక్రమణ భూరి విశ్రాంతి మడపుకరణి . . చంద్ర, 1 2

(రెట్టించు. ద్విగుణీకరించు.)

గీ. ఛందమున నొక్కటను వృత్తసంఖ్య మడపి, రెండు దివియ నుక్తాదిజవృత్తసంఖ్య, యటుల నుత్కృతి వృత్తసంఖ్యయును జేయ, సర్వసమ వృత్తసంఖ్య భుజంగళయన. అప్ప. 4. 139.

విణ. మడతపెట్టఁబడినది.

ద్వి. ఘనుఁడు సోమేశుఁ డాదినము తొల్నాడు, మడపులేఖయు నందిపడగయుఁ గొనుచు.

బస. పు. 6. 646 పం.

**మడపెట్టు.** స. క్రి (మడత + పెట్టు. వృత్తిని వర్ణలోపము) మడతపెట్టు, చుట్టపెట్టు.

ద్వి పెడమూట లన్నియుఁ బెనుమోపుగాఁగ,

మడపెట్టి యాచంద్రమతినెత్తి కెత్తి
ద్వి హరిశ్చ ఉ 903 పం

**మడమ(దక్కి)** వి (క మడ మ మడంబు )
1 పార్ష్ణి, చీలమండ క్రిందిభాగము
గీ మడమ లంటఁగ నిడుపాటి జడలు గట్టె
హర. 4 10
కం సిందూరపిండములో మరు, కందుకములో సత్ప్రవాళకఫలంబులో నా, నందములై రాగ లతా, కందము లన మడమ లచలకన్యక కొప్పెన్ కు సం 3.289
సీ మడమ యం చనఁగను మనుఁ బార్ష్ణి . .
ఆం భా 2 136
సీ కదలిరి కొండలు ఘనతరస్కంధ భాగముల...
గీ చల్లడంబులు నొడదోల్లుఁ జలిదికూళ్ల, చిక్కములు మడ్మబిల్లల చెప్పుజోళ్లు, నెలసువిఁడ్లును మొదలుగాఁ గలవి దాల్చి, నల్లచాయల మేను లభిల్లవరులు వరాహ 4 72.
2 వెదురుసోల మొ వాని యడుగు భాగము
(వ్యవ ) 1. సోలమడమతో వారు కూలిని పంచుకొనుచున్నారు 2. వాఁడు గునపముమడమతో పాము నెత్తిపైని కొట్టినాఁడు
జ మడమలుద్రొక్కు

**మడమలుద్రొక్కు** న క్రి (మడమలు+త్రొక్కు) అడుగులో నడుగు పెట్టి తలుము
చం . వడిఁ దనరారె వంగజననాథుగుణక్వణ వంబు దానిఁ దా, మడమలు ద్రొక్కుచు న్విశిఖమండలి వెన్కొనియెన్
కళా 8. 119.

**మడవ** వి (మడ¹+వా) మళ్లకు పాదులకు నీళ్లు పాఱెడు కాలువముఖము
సీ బడలినవార లిందమకఁ బాదులు ద్రవ్వియుఁ గారె మెత్తియున్, మడవలు దీర్చియున్ బిదప మార్చియుఁ గాలువ లేర్పఱంచియున్ ...
విప్ర. 3. 84.
ద్వి. తడయక వచ్చి గుద్దలిఁ గొని తొంటి, మడవ మార్చుచు మాఱుమడవఁ దీర్చుచును
ద్వి పరమ 4 281 , కళా 4. 96.

**మడవచేఁప** వి. (√మడవ? ) మత్స్యవిశేషము. (శ ర , బ్రౌ )

**మడవు – మడఁగు** అ క్రి 1 నిష్ఫలమగు.
కం. చెడఁగఱపువార చెలులుం, గడుకొని నీయట్టివారికర్జంబులు నె, ప్పెడువారుఁ గాక నీకున్, మడవక మాయట్టివారి మాటలు కొలఁదియే
భార సభా 2 190.
2 విముఖమగు.
కం కడవసములుఁ గోలలుఁ గ, ట్విడములు వీరల ధనంబు పరికింపఁగ నె, క్కుడుదేశికులని పగవక, మడవక తనుమధ్య నిండుమనమున నుండెన్
భార ఆది. 7 225.
3 మరలు, వెనుదీయు, జంకు, కొంకు
చం మడవక భీమసేనుఁడును మాగధముఖ్యుఁ గడంగి బెబ్బులుల్, విడివడులీల .
భాగ 10 ఉ 736.
కం కడగాలు పట్టి వానిని, మడవక పవనజుఁడు నూఱుమాఱులు వీచెన్ ..
భార ఆది 6 24.
చం. .. ఏమి పంచినన్, మడవక చేయు మీ పని సమర్పణసేసెఁ బ్రభుత్వ మేర్పడన్.
భార ఆది. 2. 42.

**మడి¹** వి. (క మడి.) వరి మొ సస్యములకు నీరు నిలుచుటకు నలుదిక్కుల గట్లు వేసి ఏర్పఱచిన పొలము, కేదారము, నదీప్రాన్తము, (బ మడులు, మళ్లు.)
సీ. మడి యనఁ గయ్య నా నడరుఁ గేదారంబు ...
ఆం. భా. 2. 230.
సీ. అడుసుడుక్కికై యామడి కరుగు దెంచె, హాలికుఁ డొకండు దన్నగరాశ్రయుండు, చేత నుగ్గంపుఁ గుండతోఁ జేర్లకోల, తోడ నాగంటికోలేరు దోలుకొనుచు.
పరమ. 5 28.
ఉ. ఝుమ్మన మ్రోయుతుమ్మెదల కొంపము మళ్లకు నీళ్లుగట్టుచోఁ, బమ్మిన వేడ్కఁ బాడు వ నపాలక బాలకదంబకంబు చం, దమ్మున నొప్పు

నప్పుడము నాలుగువంకల( బువ్వుతో(టలన్
వరాహ 9 148.

గీ. .మడి యన(గా నదీప్రాంత వ భవ ..
ఆం. భా 2. 6.

జ. మడికట్టు, మడిపెరలు.

**మడి²**. వి (క. మడి.) మడు(గు, ధౌతవస్త్రము, పవిత్రవస్త్రము

గీ. .. ధౌతవస్త్రంబు బరిగు మడు(గు, మకత మడి చలువ యన(గ ...
అం భా 2 158.

(వ్యవ) నేను మడి గట్టుకొంటిని, నన్ను ముట్టకుము

విణ పరిశుద్ధము

కం పొన్చెంబు లేని కులమున, నచ్చపుమడిచీర మైలయంటినరీతిన్, జొచ్చె నపకీర్తి ...
ఉ. హరిశ్చ 2 98.

సీ. మద్యపానము చేయ మడివస్త్ర మేటికి మొదలు( బో(గ వడ్డి ముట్టు పెట్టు ...
రామలిం. 60.

మడికూడు – ప్రసాదము, భగవన్నివేదితాన్నము.

ద్వి ... మా ప్రాణంబు లైన, విడుకుము గాక మామడిగూటివృత్తి, విడుకుమే యిది యేమి విపరీతవృత్తి.
బస పు 7. 569.

పెద్దమడి – దిగంబరత్వము

(వ్యవ) నీవు పెద్దమడి గట్టకుము.

జ. మడివాలు. మడినంచి, మడినంది

**మడి³** వి. (క త. మడి వృత్తియం దుత్తరపద మైన మడు(గు శబ్దమున కాదేశముగా వచ్చిన రూపము.) గుణము, రెట్టి

ఉదా. ఇనుమడి, మున్మడి, నలుమడి మొ

**మడికట్టు**. వి (√మడి¹?) మాగిలిపొలము ?
పల్లపుచేను (చి ని.).

**మడికాను**. వి. (√మడి²?) వెండి, రజతము. (ఈశ్వరు(డు)

సీ. ఒంటిగా మడికాను గుంటిపై( గూమ్చుండి నంజ కెంజాయ పెన్ జడలు దాల్చి. నరిన 2 128.

ఉ దట్టపువన్నెగుడ్డ కటదట్టిపొరన్ సవరించి పట్టెపై( గట్టి కటారిజల్లి మడికానుల కట్టుల యెక్కువి(డ్లు పె, న్నెట్టెపు(గట్ట నెట్టుకొను నిర్దవువీ(పుదొనల్ నటింప మైపుట్టున నల్లబెబ్బులులె పో యన బోయిగ బోయబల్లిదుల్
రా వి. 2 55.

సీ. . రజతాఖ్య యొప్పు వెండి, మడికానన(గను ...
ఆం. భా 2 279.

జ. మడికానుగట్టు, మడికానుమల.

**మడికానుగట్టు** – మడికానుమల వి (√మడికాను) వెండికొండ.

గీ తనరు మడికానుగట్టనంగను శివాద్రి
ఆం. భా. 2 28

**మడికానుమల** – మడికానుగట్టు వి (మడికాను+మల) వెండికొండ, కైలాసము

సీ మడికానుమల నొంటియడుగునిక్కున నిల్చి బెడిదమౌ కెంజాయజడలు దాల్చి ...
ప్రబంధ. 388

మడికానులఱే(డు – కైలాసాధీశు(డు, శివు(డు

గీ, ... మడికానుమలఱేనిపాలె మిదిగో, మన చటికి వచ్చి దిగె నని మందలింప . .
పార్వ. 2 70.

సీ సాంధ్యనర్తనకేళి సవరించు మడికాను మలఱేని కుతుకతకుకు లన(గ .
వి నం 2 111

**మడిచేరు(ఋ)** వి (త మడిచాలు మడిచిన+చేరు ఈ ర.) మడికచ్చ, ముందునుండి వెనుకకు దో(పుకొనుకొంగు

కం కొడు మెత్తుకొలకు గుడికిన్, నడుచున్ వెల పడుచు నాభినామమునం గ్రొ, మ్మడి సొరున్ మడిచేయున్, వడి జాఱున్ బైటట వింతవగ గనుపింపన్.
శుక. 3. 17

సీ కామంబు బంధించుగతి( దో(ప మడిచేరుతో నెఱ్ఱచేలంబు మేన మెఱయ
భార్గవ. పు. 5 55.

ద్వి మడిచేరు చెఱవి యామై నేర్పుతోడ, బిగి
చన్నుఁగవమీఁదఁ బెరయఁ బయ్యదయు, దిగిచి
వెన్నడుమున దిఁడుగా జుట్టి
ద్వి ప. మ 4 284

**మడిపెసలు** వి బ (√మడి[1]) మడియందు పెరుఁగు నల్లపెసలు (శ ర.).

**మడిప్రాలు** వి బ ధాన్యవిశేషము

సీ మణిసరుల్ మసరులు మంకెనల్ పగడంపు
కీఁగెలు మడిప్రాలు దేవసరులు ...
హంస 4 128

**మడిమంచే(ము)** విఱ బలహీనుఁడు, సార హీనుడు.

చం . చెట్లుపట్టి మను ప్రాంతదః ముల్మంతోడఁ
దోలె నా, మనిదొర మంచురాజు మడిమంచగఁ
గోయిలగుంత ప్రమోయఁగన్.
మనుచ 6 26

ద్వి బలదేవుఁ డుద్ధతిఁ బరిఘంబుఁ బూని, మఱియు.
రుక్మిని మడిసంచంబుఁ జేసె
ద్వి. భాగ. 10 (శ ర ).

**మడియ(ఁడు)** విఱ 1 మోటువాఁడు, మోటుది

ఉ .. రెడ్డిమడియల్ ములుగోలలఁ బూని
యెడ్లకో, చేరులు వైచి దున్నుటకు నేఁగిరి
కొంద్రకుఁ జాలు వచ్చినన్.
వేం. పంచ. 1. 687,

కం. కడియం బీనో పుత్తడి, కడియం బడిగినను
దేనొ కంఠెయుఁ గొననో, మడియవగతొత్తు
వాకిట, గడియ బిగించెన్ ఫలించెఁ గదయను
వేఁన్. బహు. 5. 213.

2, మూఢుఁడు, జడుఁడు

గీ, బడియ దుర్బీజమును భ్రష్టు మడియ చేట,
పెయ్య కల్మచ్చు చెడుగు సాపెనలమారి.
హంస. 5. 118.

సీ పుక్కిటవిడె మీయఁ బోయి తిలోత్తమా వనజ
లోచన ముచ్చెవాట్లు పడియెఁ, బొలయల్కఁ
జుఱుకుఁ జూపులఁ జూచి యూర్వశీబిబ్బోకవతి
చౌకువేట్లు వడియెఁ

గీ. దిమ్మనరిపాలుచికిలిదోదుమ్మిదాకె, ఒకిమిఁ దెగ
టార సురపురప్రాంగణమున. వఁ లెడు కటారి
రాహుత్తివరుఁచేతఁ, గిడు సేయదె మడియల
తోడి చెలిమి. కవం 1 39.

గీ త్రిమ్మరి గదా సదాగతి తెలిసిచూడ, మెటి
యఁడు గదా యనంగుఁ డేతటి మఱి మడి,
యఁడు గదా యల్లజైవాత్రృకుఁడు దలంప.
నిట్టిచెడుగులచే బాధ కెట్టిలోర్తు
సాంగ 2 137.

**మడియఁబెట్టు** స క్రి (మడియన్ + పెట్టు) బాధించు.

ఉ కిసిసి తన్నుచు వెన్ను చటలు వంచు గీ,
పెట్టఁగ వచ్చుచున్ మడియఁ బెట్టుచు నెట్టుచు
మూటకట్టుగాఁ, గట్టుచుఁ జేము కెత్తుకొని
గట్టిగ మోదుదు రొక్కట్టు తట్టునన్
సాన.దో 2 16

**మడియించు** స క్రి (√మడియు) చంపు, కడతేర్చు, తునుఁగజేయు

కం. సామజము వడిన నశ్వ, త్థామ వడియె
ననఁడె ధర్మతనయుఁడు గురునిం, దా మడి
యించుటకై భార. కర్ణ 1. 40.

సీ మడియించె వజ్రాఖ్యు మాహిష్మతీనాథు
వరకాసురుని జంపె ఉ హరి 2. 64.

ఆ తొడరి వీని నిపుడు తునుముదునో కాక, మన్ను
కాన్పుఁ జూచి మాటలాడి, మరలి పోవునవుడు
మడియింతునో యంచుఁ, దత్తిమున మదిని
దలఁచుచుండె అచ్చ. రా. సుం. 64

కం. ... తోమరము శక్తియు బె, ట్టిదముగ నతఁ
డదరించిన, మదమున నయోధ్యాధవరుఁడు
మడియించె నెడన్.
భార ద్రో. 4. 118.

**మడియిల్లు**. అ క్రి. (మడియు) మడియు, నశించు.

కం. మడియిల్లుతత్త్వములవెను, బడక నిజాజ్ఞా
ప్రశస్తి భావింపఁగఁ జొప్పడుసాత్త్విక గుణ

సంగతి, మృడుఁ డనునామంబు నీకు మేలిల్లు
శివా శివ. సా 82

**మడియు** అ క్రి (క. త మడి) చచ్చు నశించు, చెడు

వ ఇట్లభిమన్యుండు మడిసెనకాఁ దలంచి దుర్యోధ నుండు సంతోషింప ...
భార ద్రో. 2 84

వ .. కోలాహలమయంబు లగుచోట్లును జెడి తూలి యడఁగి మడఁగి గ్రగ్గి మడిసి యులివు లడఁగి పాడువాఱు ప్రదేశంబులును ...
హరి ఉ. 10 90

చం తడయక కుంభకర్ణుఁడు మొదల్గ ల నాడెవు జోదు లందఱున్, మడియుటఁ జేసి రావణుఁడు మార్కొని యింక దురం బొనర్పఁగా వెడ లఁడు . . అచ్చ. రా యు. 274.

గీ. విషముచేతన విషమును విఱిగినట్లు, శత్రు చేతన శత్రుండు సమయుపోల్కి, మనను చేతన మనసును మడియుచుండు ...
వా రా 3. 61 .

కం సహజఖలుం డుదయింపుచు, మహిఁ గుల మును జెఱచి తాను మడియుఁ జుమీ ...
ప్రబోధ. 1 62,

2 తునుఁగు, ఖండితమగు.

చం. ... వర్మబంధముల్, మురియఁగఁ జాపముల్ దునియ ముద్గరతోమరశక్తులాదిగా, వరుస నసే కముల్ మడియ వావిరిఁ బోరి చలంబు పెంపునన్
హరి. ఉ. 2. 57.

కం. మడియుతల లొఱగుతనువులు, పొడి యగు తొడవులును మధురిపునిదెసఁ గలిగెన్ ...
భాగ. 10 పూ. 1556

సీ కలిగొట్టు చిన్న రెమ్మలఁ ... జెట్టెనో మడిసి యేకొమ్మలు బడలువడెనో .
విప్ర. 3 67.

ఇ మడియఁ బెట్టు, మడియించు, మడియిల్లు

**మడివాలు** వి (√మడి²)(క మడివాళ, త. మణ్ణాన్) చాకలి

ద్వి మడివాలు మడివాలు మాచిదేవయ్య కడ మలనంబి చొప్పడ దివ్వెటీఁడు ...
బస పు 2 496 పం.

కం మడివా లొసఁయనివస్త్రము, తడఁబఱిచిన నమ్మికొనినఁ దారోయిడినన్, బడిదియ వెట్టినఁ గట్టిన, నడరఁ బణత్రయము దండు వరువఁగ వలయున్ విజ్ఞా 2 61

ద్వి వరజంగమము మడివాలుమాచయ్య, హర గణంబుల కెల్ల నడియఁడ నన్ను ...
ప్రభులిం. 118 పా

కం ఏమి మడివాల యే మీ, భూమీశ్వరు నర్థిఁ గానఁబోయెదము సఖా, భూమికిఁ జనియెడు వారికి, శ్రీ మేటిల్లంగ మంచి చీరలు వల యున్ హరి పూ. 9. 13.

(మెడవాలు అపముద్రి.)

**మడిస** వి. మత్స్యవిశేషము.

సీ వాలువ ముకుదొమ్మ వల్లె గండెయు నల్లె గుజ్జు బేడిస జాతికొఱకు మడిస ...
వే. పంచ 1. 294.

**మడిసంచి** వి (√మడి²) మడుఁగువస్త్రము నుంచుకొను సంచి.

సీ మడిసంచి దోవతి మడతవ్రేల్గొండెంబు ధమని కుండంబు బృదావనంబు.

గీ కుశనమిత్పత్త్రములు పెట్టు గొప్పయటుక, యమరఁ గాఁపుర ముండు నయ్యగ్రజుండు ..
హంస 2. 138.

**మడినంది.** వి (√మడి²²) చంక, కక్షము.

సీ . మడినంది నునిచినతలుగులఁ ద్రాళ్లను దొలఁగ వైచి . . హరి. పూ 7 13.

వ. ... అపురాణదంపతులకుఁ బ్రణామంబు లాచ రించి మడినందులం జేతులిడి ...
భీమ 2. 151.

ఉ. రావణ యిప్పుడైన రఘురామునిముందఱ

నన్నుఁ బెట్టి వా, చావినయంబె చాలు మడి సందులఁ గేలిడి నిల్వఁ గాచుని, న్నావను ధేళమౌళికి దయారస శీతలముల్ కటాక్ష ముల్. రామా. 6 164.

(చి. ని. శ. ర పా మణిసంధులు. ముద్రి పా )

మడుఁగు[1]–మణుఁగు[1], మడుపు1. అ. క్రి

1. అడఁగు.

చం కని కమలాక్షుఁ గాఁ దలఁచి కై కొన కేపునఁ గాలఁ దన్ని చా, పునకుఁ దొలంగ నిట్టివెంపుం దలపోసి మడింగి యున్నఁ బో, పునె వెస లెమ్ము మ్రై యాదవ యవున్ భవదీయబలంబుఁ గంటి నే, నని ప్రకటాట్టహాస కరినాక్ర్రతితోడ నదల్చి నిల్చినన్. హరి. ఉ. 2. 137.

(అడఁగు. ముద్రి పా.)

సీ తేజోమయం బైనరూపంబు మత్ప్రకృతి యందుఁ జరాచరంబు దోఁచు, మడుఁగు . ఉ హరి. 2 58.

చం ఉడిగి మడింగి మై మఱచి యున్నతఱిన్. ఉ. హరి 6 103.

2 నమ్రతనొందు.

సీ. అడుగు లొత్తుచు నిష్ఠ మడుఁగుచు నీచత నను సరించుచు ధర్మమున .. భార. అను. 3. 291

3 వంగు.

కం. మిడికెడిఁ బెదవులు వ్రేళులు, మడిఁగెడుఁ గనుదోయి మొగిడె మాయెదురఁ గడున్ వెడవీఁక యొడలు చేసెదు, కడపల జపమునకు నేఁడు గలదో లేదో ఉ హరి 4. 44

వి. ఆకుమడుపు.

చం సురటి యొకర్తు వీవ నొకసుందరి యాకు మడుంగు లియ్య బం, భరనిభవేణి యొర్తు నునుఁబయ్యెదఁ జక్కఁగ దిద్ద రుక్మి 5. 57

(శ. ర. పా. ముద్రి. మణుంగు )

జ. మడుఁచు, మడుపు.

మడుఁగు[2] – మణుఁగు[2]. విశే (క మడు) పరిశుద్ధము, ధౌతము, తెల్లనిది

గీ. పలుదెఱంగుల మడుఁగుఁజీరలు పొలుపుగ, మడిఁచి మూటఁగఁ గట్టి ... హరి పూ. 9 12.

సీ. గడితంపునీర్కావి మడుఁగుదోవతి కటీర స్ఫురత్పీతాంబరంబు గాఁగ . . వరాహ 9 46

సీ నిర్ధమైనమడుంగు నీర్కావిదోవతి కనక మేఖల తోడఁ గటి ఘటించి .. కాశీ. 1 39.

సీ కద్రూమహాదేవిగారాపుసంతతి మధుకైటభారాతి మడుఁగుఁజాన్సు ... క్రీడా 1 221

ఉ ఒత్తుగ మాంసమున్ మడుఁగుటోగిరమున్ ఘృతశర్కరాదులున్, కుత్తుకబంటిగా మెసఁగి క్రొవ్వి వధూరతితంత్రకేలలన్, మత్తిలి దేహముల్ మఱచి మాటికి బొంకు నృపాల కోటికిన్, నత్తు దలంప నెక్కడిది సంయమి నీకిటుఁ బల్కఁ జాడియే హరిశ్చ. 1 1

వి 1 పరిశుద్ధవస్త్రము.

గీ మజ్జనం బార్చి చెంగావిమడుఁగు లిచ్చి. వైజ. 4. 60.

ద్వి. మహితభక్తాళికి మడుఁగులు సేఁత, మహి నిప్పు మడివాలుమాచయ్య యనఁగ .... బస. పు 4. 74 పం.

కం. ... మడుఁగులు గట్టుచుఁ గడంగి మగువలు ప్రీతిన్ దశకు. 10. 7.

2. తెల్లని వస్త్రము, వస్త్రము

సీ వెన్నెలనిగ్గులు వెదచల్లెడుమడుంగు లందిచ్చె నొక్క పూర్ణేందువదన ... పారి. 2. 12.

గీ. ధౌతవస్త్రంబు పరగు మడుఁగు, మడత మడి చలువ యనఁగ ... ఆం. భా 2. 153.

సీ మడుఁగు మాసినసైన మగువపిఱుందు సోయగము జూపఱచిత్త మాఁక గొలుపు ఉ. హరి 1 57.

సీ యామినిప్రాణనాయకు రాక విని వాని యడు
గుల కిడినట్టి మడుఁ గనంగ .
ఉ రా 4 160

3. పరిశుభ్రత

చం .. కదళీ వ్రజంబు మడుఁగుల్ మడుఁగుల్
హిమవాలుకాప్తి వ, రిత్తె
అచలా 2 10

**మడుఁగు³ – మడువు²** వి (క. త మడు)

1. కొలను, సరస్సు.

గీ. వెట్టదినముల మడుఁగుల మట్టి గలఁప, బుడ
బుడధ్వని వెడలు బుద్బుదములందుఁ, జిలుప
చిలుపని నేతులు జిడ్డుదేఱు, నేమిచెప్పుదుఁ
గ్రొవ్విన యేకలములు .
మనుచ 4 17.

2. నదిమధ్యము నందలి యగాధతలము, హ్రదము

చం. . రఘుప్రవీరు చెవులారఁగ నింతయుఁ
దెల్పు నాదుమే, నున్నది చెంత గంగమడుఁ
గున్నది యైనటు లయ్యెడున్ దుదిన్.
ఉ రా 6 282.

గీ. అడరును హ్రదసంజ్ఞ మడుఁ గనంగ ...
అం. భా 1 162.

జ. మడుఁగులువాఱు

**మడుఁగు⁴ – మణుఁగు³** వి 1. గుణము, రెట్టి

కం. నలిరేఁగి కలఁగి తద్బల, ములు విశ్వామిత్రు
సైన్యముల కేనుమడుం, గులు పెరిఁగి ...
భార ఆది 7 107

చం. కొడుకులకంటె నయ్యనుఁగుఁ గోడలికెక్కుడు
గూర్తుఁ గోడలుం, గొడుకులు సేయుభక్తి కట
కోటిమడుంగులు భక్తి నాకు నె, ప్పుడుఁ దగఁ
జేయుచుండు .. భార. ఉద్యో 3. 187.

కం .. ఆ, దరణ మొనర్చిన జనులకు, నరయఁగ
నది కోటిమడుఁగు లై ఫల మొనఁగున్.
బ్రహ్మో 4. 5.

2. మణుఁగు, ఎనిమిదివీసెల కొలఁది

కం. పెరుమాళ్లకు నాగిన్నియ, యిరుమడుఁగుల
పసిఁడి గాన్కయిడి తన కిదియే, తిరు వారా
ధనగాఁ గొని. సిరివరు రంగేశ్వరుని భజించుచు
నుండెన్. వైజ. 4. 187.

**మడుఁగులువాఱు** అ. క్రి. (మడుఁగులుక్ + పాఱు.)
మడుఁగుగట్టు, మడుఁగులుగా నేర్పడు.

చం అడరు నవాంబుధారలు ... ముత్తెరంగులన్
మడుఁగులువాఱి నాభికెడ మానక చొచ్చె
ననుక్రమంబునన్ కు సం 6. 767.

**మడుఁచే(డ్చు)** స క్రి (√మడుఁగు¹)

1 (తమలపాకులు మొ) మడఁతఁబెట్టు, చుట్ట
చుట్టు

గీ తరుణి యొఱుఁగవె వీటికాదానవేళ, గురుజన
ప్రాంతమునయందు గూఢవృత్తి, నాగవల్లీ
దళంబు నెన్నడుమఁ జీఱి, మడఁచి యందిచ్చి
నపుడు గోరిడుదుఁ గేల వైష. 8. 84.

కం నోగ లగు వెండితేకుల, లాగునఁ దెలనాకు
మడిఁచి లలన యొసంగన్, భాగాలుచేసి
కొని . సారంగ. 2. 194.

గీ. పలుదెఱంగుల మడుఁగుఁజీరలు పొలుపుగ,
మడఁచి మూటఁగఁ గట్టి యుం పడరఁ
గొనుచు, నరిగి .. హరి పూ 9 12.

ద్వి. జడలు వీడఁగఁ గళాసములు విదల్చి, మడిఁచి
చంకల నిడి మరలి చూచుచును
ద్వి. హరిశ్చ పూ 420 పం

సీ. ఒకట వేనలి మడ్చి యొక్క కేల ఘృతాది
గాజుకెక్కలతల్పు గడియ పుచ్చె ...
హార 7 157.

గీ. వస్త్రములు మడ్చి సూర్యమావాహయామి,
యనుచుఁ గలశంబు ధూపగంధాక్షతోప, హార
ములఁ గొల్చి . . శ్రీరం. మా. 8. 112.

2. అణఁచు, నొక్కు

కం. . అఖూదరి, నోరు మడఁచి తద్జ్ఞజనవిమతి
చెలంగంగన్ దశకు. 5 69.

3. మణుఁచు, వంచు.

చం. మడవక ముష్టియోగ్య మగు మధ్యముతో

నెలవంక యైనయ, ప్పుడతుక భ్రూలతా ధనువు
పట్టి మనోభవుఁడు ... నైష 5 12

**మడు(ఋ)పు** న క్రి (√మడుఁగు¹) 1. మడఁగఁ జేయు, చంపు.

గీ . . బ్రాహ్మణకపులిరుదు, లొక్కమొగి వాండ్రఁ బోనీక చిక్కఁబట్టి, పొడిచి యడిచియు .. మడిపి రపుడు ... అచ్చ. రా యు 180

సీ .. మడిపెఁ దునిమె ...

గీ. అడఁచెఁ జెండె ననంగఁ బోం దగు వధించె, ననుటకు సమాఖ్యలై .. ఆం భా. ? 123

విణ 1 చలువచేసి మడఁతఁ బెట్టినది

సీ. మితి లేనికూలి చాకిత కిచ్చి కై కొను గడియ కొక్కటి గాఁగ మడువుఁ జీర..
శుక 2 434

2. చుట్ట, చుట్టినది.

సీ కొఱకిన మడుపుటాకులు మోవి కందిచ్చి యధ రాధరము పంట వంటనొక్కి ...
శుక 1. 214

వి. మడఁచిన తమలపాకు చుట్ట.

సీ. కడువేగ మడుపులు గై కొనియుడిగంపు రాజీవ ముఖి హజారమున నిల్పి . .
కువల. 3. 70

సీ. మొనపంట మడుపు వేఁడిన నీళ్ల యొసఁగ నందుచుఁ జుఱుకైన మోవి నొక్కువాని
ఉ రా 1 319

వ .. కెమ్మోవుల పచ్చిగంటు మాటులకు హవణించిన రవికనరవి మఱుఁచుమడుపులు సగము ముని పంటఁ గొఱికి నొక్కు చెక్కులను ..
ప్రబంధ. 78

.2 మడత.

సీ. మంచులప్పల మించు మంజెంగ మడుపులు పొరలి తెట్టువ గట్టునురువు లయ్యె ..'
నైష. 6 124,

శె. ధౌతవస్త్రము, మడత.

కం. ..., వలిపెపు, మడుఁగులు గట్టంగ నిచ్చె మఱి యొక్కతె అని 5 81

ఆ. చాకివాఁడు కోక చీకాకు పడఁజేసి, మయిలఁ బుచ్చి మంచిమడుపుఁ జేయు, బుద్ధి చెప్పువాఁడు గుద్దిన నే మయా, విశ్వ
వేమన 2 72

**మడువ** వి పుట్ట

సీ. మడువ నాఁ బుట్టిన వల్మీక మొప్పు చుండు ఆం భా 2 8

**మడువు¹ – మడుఁగు¹** అ. క్రి అడఁగు.

ద్వి పడియున్న పునుకలు పానపాత్రములు, మడువని రుధిరంబు మధురాసవంబు, శరవహ్ని మఱుఁగు మాంసంబు కూరలును
ద్వి. భార. విరా. 4 78 ప్రా

వి ఉపశాంతి

ఆ ఆవులించు, తలయు నడరెడు నట్టయుఁ, జూచి ప్రీతుఁ డగుచు సురవిరోధి, యచటి డింభతతికి నాఁకలి మడువుగా, నిచ్చి యాగ్రహమున నిట్టు లనియె. నిర్వ. 4. 40.

**మడువు² – మడుఁగు³** హ్రదము, ఏటినడుమ లోఁతు గలచోటు, కొలను.

కం అపవవజు నతిఘనలతి, కాపాశావలుల వంటఁ గట్టించి మహా, కోపమున గంగ మడువునఁ, ద్రోపించె సుయోధనుండు దురితకరుం డై.
భాఁర. ఆది. 5 171.

వ నేను గంగకుఁ జని యొక్క మడువున నీరాడుచున్నంత .. మార్క 8 179.

చం. కొడుకులుఁ దమ్ములుం గలన ఘోరంపుఁ జావులు సావఁ జూచి యొ, ట్లొడఁబడె నీదు బుద్ధి యొడ లోముటకై నిను రాజరాజ యి, మ్మడువున కీడ్చి తెచ్చె విధి . .
భార శల్య 2 57

కం అని చెప్పి యేళ్లరాయఁడు, మునుపటిరూపూని యుండె మురియుచు దొరయున్. దవములికి దృశ్యగుల్మం, బనుమడువుపయి న్నిగుడ్చి యట నింకించెన్. అచ్చ రా. యు. 80.

సీ. . మండువేసవి నిఁడుమడువుబోలె
కాశీ 5. 49.

జ. మడువుకొను, మడువులు గట్టు.

**మడువుకొను** అ. క్రి. (మడువు[2] + కొను) మడుఁగుగా నేర్పడు, మడుఁగగు.

సీ. ఆసారవర్షంబులై స్వేదములు గ్రమ్మ మణి కుట్టిమస్థలి మడువుకొనియె
కవిక 2. 126

**మడువులుగట్టు** అ క్రి (√మడువు[2]) మడువులుగా నేర్పడు, కొలఁకులుగా నేర్పడు.

వ. .. తొట్టితొట్టి యెడనెడ మడువులు గట్టిన సజ్జకపు గొజ్జంగ నీరునందుఁ బ్రతిబింబించు నప్సరఃకాంతల వదనారవిందంబులలోపలం బడి , ,
భీమ. 5 120.

చం. ... నెత్తురుల్, మడువులుగట్టఁ జేసి బలు మచ్చర మెచ్చఁగ నుచ్చరింపఁగన్.
ఉ. రా. 4. 349.

**మడ్డి** వి. (క., కే. మట్టి ) 1. ఏదేని పదార్థము మఱిఁగింపఁగా నిలుచు చిక్కని సారము.

వ. . . మోలుగు మడ్డిం దోఁచి మూర కొక్కుందును జేన కొక్కుందునుగాఁ గుట్టిన దొల్లుటుల్లారు ఉల్ల సిల్లం బల్లించిన పల్లంబులపైఁ జిల్లతైలంబును వాసవకొడుపులం బూసిన మణుంగుఁ జంద్రిక చేలలె రవణంబులు గా నెదురుగా వేడుకం జూడ వచ్చివ .
ఆము. 4 35.

2. నూనె మొదలగువానిలోఁ దేరఁగా నడుగున నిలుచు పదార్థము

ఉదా నూనెమడ్డి, ఆముదపుమడ్డి మొ

విశే. 1. మూఢుఁడు (శ ర ).

ఉదా : వాఁడు వట్టి మడ్డి మనుష్యుఁడు

2. మొద్దు (బ్రౌ.)

జ· మడ్డితనము.

**మడ్డితనము** వి. (√మడ్డి) మూర్ఖత, మొఱకుతనము (బ్రౌ.)

**మడ్డు** వి 1. ఒకవిధ మగు ఇనుపగుండు

కం ఇనుమున నేఁబది పలముల, నెనిమిదివ్రే ళ్లాయతముగ నేర్పడ గుండై, నునుపై యుండఁగఁ జేసిన, మనమున నిది మడ్డునకుఁ బ్రమాణం బయ్యెన్.
విజ్ఞా 3 118

2 ఇనుపగుండు, ఎఱ్ఱగా కాఁగిన యినుప గుండు

ఉ ఏఁ గలలోన నొం డెఱుఁగ నీవె విభుండవు సందియంబు నా, పైఁ గలదేని చూడు మని ప్రాగ్గిళ గౌతమచారజారునిన్, దాఁ గడు నమ్మఁ జేయుటకుఁ దక్కక యెత్తెడునట్టి యెఱ్ఱగాఁ, గాఁగిన మడ్డుచంద మెసఁగం గను పట్టె నినుండు నుష్ణతన్
ప్రభా 5 60

(శ. ర పా 'బ్రాగఁగ నెత్తెడు' ముద్రి పా )

వ అగ్ని స్తంభనంబు వట్టుకొని మడ్డు దివిచిన ట్లయ్యె . .
భోజరా 6 181,

ద్వి తమ్ముౘ రే యెడసిన తమకంబుతోడ, నమ్ము ని పతులకు నమ్మికల్ పుట్ట, వనదేవతలు మెచ్చ వనములఁ గ్రుంకి, కనలి మడ్డులు నాలి కల నెత్తె ననఁగఁ, దుండాంతరములఁ జెందొ వల బిట్టగల ఖండించు వరచక్ర కాంతులదాని.
అ. మ. క. 2 73 పా.

కం. తనయుదయమె మదిఁ గోరెడు, నను విడచె నినుండు కల్ల నాయెడ లేకుం, డ నెఱుఁగఁ డని పూర్వాశాం, గన జగమున మడ్డునట్టుగతి శశి మెఱసెన్.
ద్వా. 4. 103

3 కాఁక, అత్యుష్ణము (చి. ని., బ్రౌ.)

జ. మడ్డుకత్తి.

**మడ్డుకత్తి** వి. (మడ్డు) మోటకత్తి, మచ్చుకత్తి (శ. ర., బ్రౌ.)

**మడ్డువు** నం. వి ఉ పుం. వాద్యభేదము

**మణఁగు – మడఁగు** అ. క్రి. వంగు నమ్రమగు

సీ. అడుగున కొకగుణం బన హెచ్చుతగ్గులై వతి నొప్పు పృథ్వి యేనాఁటి సాధ్వి.

గీ. యనుచు ననిచిన కూరిమి నణఁగిమణఁగి, కలిమి లేమిని భర్తతోఁ గలసిమెలసి, హెచ్చు తగ్గుల నొకరీతి నెసక మెసఁగ, వెలసె విలసిత

కీర్తుల వెంగమాంబ.

కృ శకు 1 78.

(వ్యవ : నాచేయి మణఁగినది రేకు మణఁగ గొట్టినాఁడు.

జ మణత

**మణత** వి. (√మణఁగు) భక్ష్యవిశేషము

వ చంద్రకాంతంబులు మణతలు సారె సత్తులు చలువమజ్జిగ వెళనీరు శాంతికషాయంబు మొదలుగాఁ గల నిఖిలభక్ష్య భోజ్య లేహ్యచూష్య పానీయాదులు ...

ప్రబంధ. 112

**మణి** నం వి. ఇ పుం ఇ ఈ. స్త్రీ. 1. రత్నము 2 సామాన్యభూషణము, నగ 3 రత్నము, తత్తజ్జాతియందు శ్రేష్ఠమగు వస్తువు 4 ప్రకోష్ఠము, ముంజేయి 5 నీటి కుండ, జల కుంభము 6, మృన్మయపాత్రము 7 లింగాగ్రము 8. యోన్యగ్రము 9 అజాగళస్తనము, మేఁకలకంఠమున వ్రేలాడెడి చన్ను 10 మౌక్తికము మొదలగునది 11 కాష్ఠలోహాది నిష్పాద్యగులిక. 12 ఘంట (శే ని.)

**మణికంఠము** నం. వి అ పుం చిత్రవాజము, పాలపిట్ట (వై. ని.)

**మణికట్టు** – మణికట్లు మి వి. (మణి + కట్టు) క త మణికట్టు) మణిబంధము,

ద్వి పట్టఁ జూచిన మణికట్టు ఖండించి ..

బస పు. 4. 544. పం.

**మణికము** నం వి అ. పుం. అలింజరము, మృన్మయ పాత్ర కుండ మొ. (అమరసింహుఁడు)

**మణికర్ణి** నం వి. ఈ స్త్రీ. కాశిలో నున్న తీర్థ విశేషము

**మణికాననము** నం వి. అ న. కంఠము

**మణికారుఁడు** నం విజ (అ ఈ అ) మణుల పని చేయువాఁడు.

వి. అ పుం, 1. తత్త్వచింతామణికర్త యగు గంగేశోపాధ్యాయుఁడు (వాచ. కల్ప)

2 వైశ్యకుండుఁడు, భర్త జీవించియుండఁగా వైశ్య స్త్రీయందు జారునివలనఁ బుట్టిన సంకర జాతి వాఁడు. (వై ని.)

**మణిగము** - మణివము (శ ర.)

**మణిగాననము** వి. (త మణియానవమ్) సన్న నున్నపుపూఁత.

సీ ... మణిగాననములు ప్రేమ నొనర్చి గోడలఁ జెలువారఁ గృష్టశిలలు లిఖించి

గీ పురము రాజ్యంబు శృంగారముగ నొనర్చి, యవనినాథుండు నదిఁ దీర్థమాడి వచ్చె.

రుక్మాం. 1 118.

**మణితము** నం, వి అ న. రతికాలమందు స్త్రీ చేయు నవ్యక్త ధ్వనిభేదము, రతికూజితము

**మణితారకము** నం వి అ. పుం. సారసపక్షి, బెగ్గురుపక్షి.

**మణిదర్పణము** నం వి అ పుం మణులతోఁ గట్టఁబడిన యద్దము, మణులు తాపడము చేసిన యద్దము

**మణిదీపము** నం వి అ. పుం. దీపముగ నుపయోగపడు మణి.

**మణిద్వీపము** నం వి. అ. పుం. అమృత సముద్రము నందలి ద్వీపవిశేషము.

**మణిపతి** నం వి. ఇ పుం బభ్రువాహనుఁడు.

**మణిపుష్పకము** నం. వి. అ. పుం సహదేవుని శంఖము.

**మణిపూరము** నం. వి. అ. పుం. (యోగ,) నాభి స్థానమం దుండు నొకనొక చక్రము.

**మణిప్రవాళము** నం. వి అ. పుం న. రెండు భాషలు కలిసిన కవిత్వము (శ ర)

**మణిబంధము** నం. వి. అ. పుం. 1 ప్రకోష్ఠము, ముంజేయి 2. మణులు కూర్చుట, తాపటము చేయుట 3. సైంధవ లవణము పుట్టు నొకానొక పర్వతము (వాచ)

**మణిబీజము** నం వి అ. పుం. దాడిమచెట్టు.

**మణిభూమి** నం. వి. ఇ. ఈ స్త్రీ 1. రత్నములగని.

2. రత్నములతోఁ గట్టిన నేల.

**మణిమంథము** సం. వి. అ. పుం. సైంధవలవణము పుట్టు ఒకానొక పర్వతము, మణిబంధము. (ఈ రూపము కొందఱ మతమునఁ గలదు.)

**మణిమాల** సం. వి. అ. స్త్రీ. 1 రత్నహారము, మణులసరము, 2, ప్రకాశము, వెలుఁగు, 3. (రతియందలి) దంతక్షతభేదము, 4 లక్ష్మీదేవి. 5 జగతీ ఛందస్సునందలి వృత్తవిశేషము.

మణిమాల .. స్వామీ తయకారద్వలద్వమ్మెపొసంగున్, వేమాఱు మహిభృద్విక్రాంతులతోడన్, భూమండలిఁ గూర్పన్ బోల్చు న్మణిమాలల్ ... అప్ప. 4 219 పొ.,

6. ప్రకృతి ఛందస్సు నందలి వృత్తవిశేషము

**మణిమాల** అజహ్నాత యోదధిఘృతంబు లమ్మెచు మురారిఁ జాడి రెలమిన్.

వ. ... మణిమాలయందుఁ బొసఁగ, న్సజముత్రి వారము సముం బినాకివిరమంబు పొందు దనరన్. అప్ప. 4. 232. పొ,

**మణియకాఁడు** (మణియము + కాఁడు, క. మణియగార, త. మణియకారన్) గ్రామాధికారి.

గీ. మరిగి తీరుగునకాదికి మణియ కాండ్ర. కవని బడికావు నా వింత వలరునంత ...
హంస. 2 48.

**మణియము – మణివము** వి. (త. మణియం క. మణియ) గ్రామాధికారము: అధికారము.

సీ త్యాగ మించుక యున్నఁ దను దాఁ బొగడఁ జూచు మణియ మచ్చిన నూరు మాపఁ జూచు
రామలిం 25.

సీ. కొలుచువారలనోరు గొట్టి లెక్కలు వ్రాసి హారువు మీఱఁగ మణియములు చేసి ...
శుక 3 372

కం. పాపాత్ముౖ లైనపురుషుల, కేపున మణియంబు లిచ్చునీకష్టుఁడు దు, ర్వ్యాపారం బున మది సం, తాపింపఁ దొడంగు సంతతము వీఁడనఘా .. సానందో. 4. 432.

జ మణియకాఁడు.

**మణియారవెల్లలు** వి. బ. వస్త్రవిశేషములు

వ. జప్పడింపట్లు పచ్చపట్లు 2 చంద్వాలు 2. పట్టగొడుగులు 2 మణియారంవెల్లలు 6 వెన్నెచీరలు 12 బృందావ ద, శా 4 975.

**మణిరంజనము** సం. వి. అ. న. వర్ణపురేకు (శ. క)

**మణిరాగము** సం. వి. అ. పుం. రత్నముల కాంతి. న ఇంగిలికము. (రా ని.)

**మణిరాజము** సం. వి. అ. పుం. వజ్రము.

**మణివకాఁడు** వి. (√మణివము.) అధికారి (శ ర)

**మణివము – మణియము** వి. ఉద్యోగము, అధికారము, పూనిక, ఉద్యమము

సీ మఱి ధనాఢ్యులకును మణివంబు లీఁదగు హితులవాకిలి గావ నిడఁగఁ దగును ..
నీతి. 55.

సీ మాగాని రాజ్య బు మణివముద్యోగంబు చిట్టలు చిత్రముల్ చిలకు శరము .
అం. కే. 56.

కం ఏఁగె మణివంబు మాని మ, హాగహనంబునకు ధర్ముఁ డవమానముతో, వేగమ ధర్మస్యత్వరి, తాగతి యనువచన మివ్విధం బయ్యెననన్. నరాహ. 7. 29.

(మణిహాము, ముద్రి)

జ. మణివకాఁడు

**మణిశిల** సం. వి. ఆ. స్త్రీ రత్న ఫలకము రత్నశిల.

**మణిసరులు** వి. బ. ధాన్యవిశేషము.

సీ. మణిసరుల్ మసరులు మంకెన ల్పగడంపుఁ దీఁగెలు మడిప్రాలు దేవసరులు ..
హంస. 4. 128.

**మణిసానువు** సం. వి. ఉ. పుం. మేరుపర్వతము
(వై. వి)

**మణిసిల** మి. వి. (మణి + సిల) పర్వతధాతు విశేషము (శ. ర.)

**మణిసోపానము** సం. వి. అ. న. బంగారు పూసలు గ్రుచ్చినహారము, చాటుకారము. (వై ని)

**మణిహాము** వి. వాణిజ్యస్థానము, అపణము, బజారు.

చం. వెలిచవిఁ గోరుదుండగవు వేడుకకత్తెల
నోమునోఁత గూ, బల మణిహాంబు జారులకుఁ
బఁడువు చీఁటి పర్వె నుర్వరన్.
కవిక. 4 86.

**మణింద్రము** సం. వి అ పుం. వజ్రము.

**మణిచకము** సం వి అ పుం మత్స్యరంగ పక్షి, వ, చంద్రకాంతమణి (త్రి వి)

**మణిచము** సం వి అ న. 1 ముంజేయి, 2 పూవు 3 మౌక్తికము. (కే ని)

**మణివకము** సం వి అ న పుష్పము, పూవు.

**మణుఁగు¹ — మడుఁగు¹**, అ. క్రి. అడఁగు.
జ: మణుఁగుఁబువ్వులు

**మణుఁగు2 — మడుఁగు²** వి. 1 పరిశుద్ధ వస్త్రము

కం తను వగుతడి యొత్తుమణుం, గుర నొయ్యన
మేనితడి యిగుర్పఁగ నొత్తున్.
నైష 6. 42.

సీ ఒఁటి యొత్తినమణుఁ, గొందర మేన నిగ్గులు
దేఱఁ బసుపాడి జలక మాడ ఆము 1 60.

ద్వి మరమున కేతెంచి మణుఁగు లన్నియును,
గరి నము ల్గాకుండ గట్టించి మడువ ..
బస పు. 4 18 పం

సీ, మణుఁ గనఁగాను బ్రమాణభేదంబును ధౌత
వస్త్రంబును దనరుచుండు
అం. ఖా. 3. 58

2 పరిశుద్ధి.

కం. మమకారమారునకు మి, త్రములుఁ గళత్ర
ములు నన్నదమ్ములు ననుబం, ధముల పరి
ష్వంగము ధ, ర్మమె మైకొన మణుఁగు సగము
మైలయు సగమే. పాండు. 5. 220

విణ పరిశుద్ధము

చం. మట్టెవన్నెగాఁ, గురుమణుఁ గైన పుట్ట
మును గూడఁగ దువ్వని మైల కొప్పునై,
మణుఁగిడి యింటిలోఁ బతి సమాగమమున్
మతియింపు టొప్పగున్. పి శకుం. 4 81.

వ. .... పల్లవంబులపైఁ జిల్లతైలంబును వాసన
కొడుపులం బూసిన మణుంగుఁ జంద్రికచే లతె
దవణంబుగా ... ఆము 4 35.

సీ చెలువ మెచ్చఁగ నిందుచలువమణుంగు మేల్
వలువ యాచెలి కొక్క చెలువ యొసఁగె
ఇందు 6 23.

**మణుఁగు3 — మడుఁగు4** వి రెట్ట

ఉ ... రాజుకుం, గొంచక దీని కేడుమణుఁ గుల్
గొని వచ్చితి మంచు నిచ్చెనన్ ..
జై ఖా. 8. 67

గీ. నీవు జగదేకదాన దీక్షావిధాన గరుఁడ వటు
గాక వేదోక్త సరణి కంకెుఁ, బది మణుఁగులు
దక్షిణ లొదవ నిచ్చి, మేదనీ నాధ దాశాశ్వ
మేధి వగుము విక్ర 5 120.

సీ. పాతకంబులఁ బంచ బంగారముగఁ జేయుఁ
గనుగొన్నమాత్ర మోక్షంబు నొసఁగుము
మ్మణ్ణు పుష్కరంబునకు నల్మణ్ణు పంకు సిరి
యనఁ దగుఁ బ్రకట మహిమ ...
పాండు. 3. 137. (మడ్గు శ ద పా)

2. (త. మణుంగు) ఎనిమిది వీసెల కొలఁది.

సీ మణుఁ గనఁగాను బ్రమాణ భేదంబును ధౌత
వస్త్రంబును దనరుచుండు. అం. ఖా 3. 56.

**మణుఁగుఁబువ్వ (బూ)లు** వి. (√మణుఁగు త. మణుగుప్పు.) భక్ష్యవిశేషము.

వ. మోరుండలు మనోహరంబులు గారెలు
బూరెలు మండెఁగ లంగరొల్లెలు మణుఁగుఁ
బువ్వులు పేణీ లొబ్బట్టు కడియపు టట్లు.
ప్రబంధ. 112.

గీ. గారె లటిసెలు బొబ్బట్లు గరిజెకాయ, లట్లు
బూరెలు జంతికెచుట్లు మణుఁగుఁ, బూలు
వెన్నప్పములు. చెన్న. 4 358.

సీ .. మణుఁగుఁ, బూవు నాఁ గుబేర మూలము
తవరును. అం. ఖా. 2. 256.

**మణ్ణాస.** వి. (మణ్ణు + ఆస. త. మణ్ణాసై.) భూరూపమైన ఆస్తిపై ఆశ.

కం. ఉణ్ణామల జగదంబిక, పణ్ణామల విశ్వనాథు
నారాధించెన్, మణ్ణాసయుఁ బొన్నా సయుఁ,

జెణ్ణాసయు లేనివారి పెన్నిధు లగుటన్ ...
కాళ 3 185.

మణ్ణు వి. (క. మణ్. త మణ్, మణ్ణు) మన్ను, భూమి (చూ మణ్ణాస )

జ. మణ్ణాస.

**మతంగజము** సం వి అ. పుం. ఏనుఁగు

**మతంగము** సం. వి. అ పుం. మేఘము (కల్వ.)

**మతంగుఁడు** సం వి అ. పుం 1, ఒకానొక ముని. 2. ఒకానొక రాక్షసుఁడు.

**మతకము**[1] విశ 1. కపటము, కుత్సితము.

సీ పంతకానాన్యాయప్రచార మాచారంబు మతకంపు మాయలమనువు తనువు .. వై జ. 2. 75.

2. మాయకలది,

చం కుతుకలు కోయు దొంగలకు ఘోరవికార తురుష్క జాతికిన్, మతకపులంజ తొత్తులకు ... ఇత్తురు చత్తు రంతె పో మెతుకుదొరంల్ ...
(చాటు. ప్రౌ.)

1 వి. కపటము.

ద్వి మునిప్రముచ్చువలె నోరు మూసుకయున్నఁ దనవారలకుఁ బ్రమాదము వచ్చు ననుచు, నున నులోపల నొక్కమతకంబుఁ దలఁచి, వనితల తోడ నవ్వనిత యి ట్లనియె.
ప్రభు లిం. 2 27. పొ., 3 పం.

కం అఁణభోజుని మతకము, లారుక్మిణినటన లాము రాంతకు చెయ్యిల్, చేరి కనుంగొనుచో నె, వ్యారికిఁ గోపంబు రాదు వారిజనేత్రా.
పారి. 1.81.

2 మాయ

సీ మంథర గత వేది మతకంబు లూహించి కైక కుఁ జెడుబుద్ధి గఱపె నకట ...
భా. రా అయో. 114.

చం మతకము లేల చాలు నిఁక మాటికొనంగ నలుండ నే మహో, వ్నతి నిను వేఁడెదన్ ...
హ. న. 2. 100. భార. అను. 2. 178.

(మతకము – తమకము, అని. భా ల. ద్యా.

3. మర్మము, గుట్టు

ద్వి అరసి మీరే నాకు నానతిం డనిన, మనమున నామాయమతక మంతయును, కనుఁగొన్న ధన్యుండు గాన నిట్లనియె.
ప్రభు లిం. 2. 24. 6 పం.

జ మతకరి1

**మతకము**2 వి. సద్బుద్ధి. (చూ మతకరి2 )

జ. మతకరి2.

**మతకరి**[1] విశ (మతకము + అరి2) మాయకల వాఁడు మాయకలది, మాయలాఁడి

చం అ, మతకరి వేలుపుందపసి మమ్ముఁ దలంపఁగ నేల యచ్చటన్. పారి 1 48.

ద్వి. మతకరి శ్రీత్రాఁగి మచ్చరంబుననుసుతువిపైఁ గపటంపుసుద్ది గల్పింప
ద్వి. శ. సా 63 పొ. 8. పం.

చం సతతము బ్రహ్మశర్వ సురసంయమ ముఖ్యుల నాత్మమాయ మో, హితులుగఁ జేయుసామి వెలయింతిని మోహితఁ జేయ లేక ప్రా. కృతజనునట్లు తాను దనగిన్నె నొసంగెను బంటుకోసమై మతకరి వేశ్యమాత వెడమాయ లజయ్యలు విష్ణుమాయకున్.
వై జ 4 5 అం భా 2 286.

**మతకరి**2 విశ (మతకము + అరి2 ) మంచిబుద్ధి కలవాఁడు.

కం. మదిమున నామాట నమ్మి మతకరి వగుచున్.

శా. జనకకన్య న్వేగ చె.ప్పించి లోకైక త్రాణుని రామునిం గనుము ...
భా. రా. సుం 447 448.

**మతము** సం విశ. (అ ఆ అ.)

1 తలఁపబడినది, విశ్వసింపఁబడినది 2 అభిప్రేతము వి. అ న 1 అకూతము, ఆశయము 2. ఇచ్ఛ. 3. జ్ఞానము. (కే. ని,) 4 (తెనుఁగున నీక్రింది యర్థములఁ బ్రయోగములు గానవచ్చు చున్నవి. వృత్తాంతము, సమాచారము.

సేసియును దక్షిణ లిమ్ముగ నిచ్చి యజ్ఞముల్,
నెగడఁగఁ జేసియుం బడయ నేర రపుత్రకు
లైన దుర్మతుల్ భార ఆది 2 149.

గీ ... అమరులింద్రు ననిశమును నుపజీవించునట్లు
బంధుజనులు నిన్ను నుపజీవింప మనుము పేర్మి
భార సభా. 2 89

శా మా పెద్దల్ హరసంశ్రయంబునన మున్
మన్నారు . హరి ఉ 5 46

శా . నీ, రాజత్వంబునఁ బ్రక్రముల్ మని యెనో
ఁ జిల్లి సత్సంతతుల్, తేజం బందెనొ డిందెనో
యహిభయోద్రేకంబు శాఁ జెల్లరె .
వసు 4 27

ఉ. కాలునిదన్న నంది నయి గంటలు దున్నక
మంటి నా మహా, కాలునినంది దున్న నయి
కర్దమ మగ్నత లేక మంటి నా, హాలికు
లెన్నఁడు దెగని యారుల చేలును జొకుమల్లు
నుం, గా లలి నేరు సాఁగి రిలఁ గల్గుపసి గొని
పేద మున్నుగన్ . ఆము 4. 124.

2 వృద్ధినొందు, పెరుఁగు

చం. . . హాలాం, కపదోత్థితంబు లై మనునుడవోని
గంభకలమంబులు గావె లతాంగి జంఘికల్ .
వసు 2 74.

సీ హిత బహుశ్రుత ధర్మరత శూరశాస్త్ర పూర్వ
తల మన్ద్విజుల దుర్గముల నిలిపి ...
ఆము 4. 261.

3 వర్తిల్లు, నడుచుకొను

కం విను తొల్లి కృతయుగమున, మనుజులయెడ
దండనీతిమంతుం డై రా, జన నొకఁడు గలిగి
యఁయుట, మనుజేశ్వర లేదు ధర్మమతి
మంద్రుతగన్ .. భార. శాం. 2. 199.

చం. ముని మనుజాసురాహిసుర ముఖ్యులు మున్ను
గ సర్వజీవులం, దనవశ మర్థిఁ జేసి మనుదర్పకు
నోర్చిన వీతరాగి ... కు. సం. 1 10.

కం జనకుఁడు తాతయు భ్రాతయుఁ, దనకుల
జుఁడు తల్లియును యథాక్రమమున నీఁ,జనవరు
ఁగుదురు కన్యకు, మనమున దోషంబు లేక
మనువారైనన్ .. విజ్ఞా 1 102.

4 వర్తించు, ఉండు

కం తనధన మిది యని యూఅడి, మనఁ బరిణయ
మాదియైన మహితోత్సవముల్, గొనియాడ
నెవ్వరికి వ, చ్చునె జనపాలుఁడు లేనిచో నిష్ఠ
యతన్ .. భాం. శాం 2 267.

సీ కలిమితొయ్యలి దాల్పు బలునామి పొక్కిలు
మనుతమిగ్గె యెవేల్పుఁ గనిన తల్లి
చంద్రి 2. 34.

సీ పన్నగతల్ప సీభక్తులతోఁ బొత్తుమని కాని
దుఃఖంబు మఱవ రాదు పరాహ 7 68.

(పొత్తుమని – పొత్తుననుండి అని భావము)

5 పుట్టు, జనించు

గీ. మనువులును మనుపుత్రులును మనఁగ వారి
సొంగు కొన్నేండ్లు కొన్నేండ్లు సుతులసుతుల,
తరతరంబును దామరతంపరైనఁ, జూచి సంసా
రసుఖములఁ జొక్కె నతఁడు ..
వి. పు. 5 187

6. ఒప్పు, శోభిల్లు

సీ. భీమశాణాసనస్థేమ వార్తాప్రవర్తన మనుభవ్య
సుధన్వి .. రాఘవ 2. 29.

(భారతార్థమున)

సీ. కొండొకసవతియు గురుతర ధర్మరక్షణ శీలత
నమ్మనుగుణవిధేయ రాఘవ. 1. 74.

(రామాయణార్థమున.)

7. కృతకృత్యుఁడగు, ధన్యుఁడగు

గీ. మీరు వినుచుండఁ జెప్పెదు మేటిపదము, గంటి
మంటి మీ దయ పెంపుకతన ...
భార. స్వర్గా 83.

గీ. అలరువిల్కానితల్లికిఁ బ్రార్థితార్థ, కల్పవల్లికి
మ్రొక్కంగఁ గంటి మంటి ..
కాశీ. 3. 41.

ద్వి. కంటిని శ్రీపాదకమలంబు లేను, మంటి నిం
కేటికి మగుడుదు ననిన ...

ద్వి భాగ 10 3 2220.

జ మందలు, మాదలిడుచు, మనుకువ, మనుగడ, మనుగడుపు. మనువు, మనువుప్పు, మన్ని, మన్నిగొలిపించు, మన్నిగొను

**మను² – మన్ను¹** వి (త మణీ) 1 మృత్తిక, మట్టి
(హల్లు పరమగునపుడు వైకల్పికముగా నుత్వలోపము)

క. తనమనములోన నెంతట, ననుమానము తీఱి శుద్ధియగు నందాకన్, మనుశౌచము చేయుట దగు, నెసకయు. గోరుఁదియును వెదక రెన్నఁడుఁ బెద్దల్.

విజ్ఞా. 1 40

శా అకర్ణిప్రపుము మత్స్యమాగమనకార్యా బష్ట దిక్పాలకీ, లోకంబుల్ విదళించి వచ్చితివి గళ్లుం బాళ్లు చిక్కంగ నా, లోకంబుల్ మను బోసె నుండ మది నాలోకించి ...

వరాహ 3. 67.

మ అసిధారాపథితాత్మ బంధుభుజమధ్య స్వైర నిర్వ్యవసన్, మన మై పుట్టినయమ్మహా దురితమున్ మ న్నెట్టియున్ వాజిమే, ధనమిద్ధావల భూతిచే నుసమియున్ దప్పింపలేనైతి ...

పాండు 5. 41.

(మన్నెట్టి భూదానముచేసి యని యర్థము)
2. భూమి, నేల

సీ అదనుతోఁ జేఁపి చన్నవిసి యోషధుల మన్నొ దివు కొండల కెల్ల బిదుక నెఱిఁగె.

మనుచ 2. 11.

సముద్రవర్ణనము)

సీ మనుముద్దరాలికి మగజాలమొలనూలు కల వాలి చెలికాని కలరుఁదోఁట ...

చం. రా. 3 2.

జ మందల, మాదలించు, ముదలింపు, మనుఁబెల్ల, మనుదింగ

**మను³ – మన్ను²** వి (వృత్తియందు హల్లు పరమగునపుడు ఉత్వలోపము వైకల్పికము. ఋష్యమృగము, ఒక జాతి జింక

ఉదా మనుఁబోతు, మను బెంటి, మనుఁబిపి మొ.
జ మనుఁబిడి, మనుఁబెంటి, మనుఁబోతు మనుగొఱ్ఱె

**మనుఁగు – మనువు** అ (క్రి చచ్చు, మడియు.

చం నేఁడు పై, కొని యెంతఘూర్తము వతని ఘోరశరాళి ననేక రాక్షసుల్, మనిఁగి వాని మూర్ధ్నాను మఖ్యులు లేరు జగత్త్రయంబునన్.

అధ్యా యు 16 పా (శ ర పా)

**మనుఁబి(న్ప)డి** వి (మను³ - బిడి²) స్త్రీ ఋశ్య మృగము. ఒక జాతి ఆడుజింక (బ మనుఁబిడులు మనుఁబిళ్లు)

ద్వి. ఒఱగు జింకలును బిట్టొఱలు మన్బిళ్లు

ద్వి హరిశ్చ పూ 606.

మ. .. సింగముల్, కడగొట్టైన్ మనుఁబిళ్లు గంతు గొనె జింకల్ బిద్దె

సారంగ 1. 107.

సీ కనుమములం గొనగూర్చు మనుఁబిళ్లకై దిద్దునెడ బండపులికూన యిది నృపాల ..

చంద్రా 3 42.

సీ. .. మనుఁబోతు మనుఁబిళ్లు మన్నసంగ ఋశ్యము దగు ఆం భా 2 85.
(మనుఁబిళ్లు అనునది నిత్యబహువచనాంత మని ఆం భా. మతము స్త్రీ పురుషవాచకములగు మనుఁబిళ్లు, మనుఁబోతు అనువానిని ఋశ్యశబ్ద సామాన్య మనుగతముగా నుండుటంబట్టియు, పిడిపోతు శబ్దము స్త్రీపుం వాచకములగుట ప్రసిద్ధం బగుటంబట్టియు, ఆం భా కారుఁడు అట్టి భేదమును వివక్షింపక పర్యాయములుగఁ జెప్పెనని తోఁచుచున్నది)

**మనుఁబెంటి** వి. (మను³ + పెంటి) స్త్రీ. ఋశ్య మృగము, ఒక జాతి ఆఁడుజింక. (శ ర., బ్రౌ.)

**మనుఁబెల్ల** వి. (మను² + పెల్ల) మట్టిబెత్తిక. కదళీ గర్భవర్ణనము.

సీ వల పాని వ్రాలిన యెలుఁదేటి వాచవి కందిన మనుఁబెల్లయంద మొంద ..
కకు . 62

**మనుఁబో(న్పో)తు** వి (మను³ + పోతు) పురుష ఋశ్యమృగము, ఒకజాతి మగ జింక
సీ. . మనుఁబోతు మనుఁబిల్లు మన్ననంగ ఋశ్య మునగు ఉం భా 2 5
మ పులులున్ సింగములున్ . శశ, బులు మన్పోతులు భల్లుకంబులును దుప్పుల్ ..
ఇందు 2 57
సీ. కారుపుల్ దిని యాము గదిసి మన్పోతులు, కారుపోతులనైనఁ గదుమఁ జూచు ..
సాంగ 1 68

**మనుకంద** వి. (√మను, త మన్నుపై )
1 జీవము, ప్రాణము.
చం . సింగరా, యనికడ కేగి మాఱలనెయాయ వఁదేఱిచి తెచ్చి మల్కకున్, మనుకువనంటు చేసి యొరిమం గడు మెచ్చులు గొన్నమేటి నే, మని పొగడంగ వచ్చు .. యయా. 1. 51.
మనుకువనంటు — ప్రాణస్నేహితుఁడు
(వాసస్థానము అని శ ర )
2 ఉనికి, సత్త, ఉండుట.
కం దండక మనుకానకుఁ జని, యుండఁగ రావ ణుని చెలియ లొగిఁ గలయికకై, దఁటకు రా లక్ష్మణుఁ డది, మండాడఁగ ముక్కుచెవుల మన కువ మాన్చెన్ . యయా 2. 16

**మనగ(న్గ)డ** వి (√మను) 1. బ్రదుకు. జీవనము
చం. మనుగడ దప్పు నొక్కొ మునిమాటలు గైకొ న నైతి ... భార. శాం 5 394
కం. అరుగుఁడు పొడువుఁడు పట్టుఁడు, పొరిగొనుఁ డాదుర్వినీతుఁ బోనీకుడు మ, త్పరిభవకారికి నజరా, మరదేహునకైనఁ గలదె మనుగడ యెట్లున్ .. హరి. ఉ 7 187
సీ. .... పాఁతఁబడినఁ ద న్నెగయకుఁడ, గప్పి ఠని మానవుఁడు గలఁ గనియెనేని, యదియ తువ వాలి మనుగడ కగు నరేంద్ర
మార్క 5 254.
2 జీవనము
కం వినుము విశేషించి జనన, జనితోన్నతి విప్రుఁ డతని జనపతి వినయం, బున నడపవలెయు దానను, మనుగడ యిరువురికుఁ బ్రజకు మహ నీయ మగున్ భాగ. శా. 2. 617
చం ఆచ్చెనఁటి నక్కఁ గూటాలునఁ డక్కుఁ బెట్టి యే, మఱక వనశ్వరం బయిన మన్గడఁ గాంచెద నీరు నొచ్చెదన్
వేం పంచ 4 542
కం ఉడుపులకై యద్రులకై, యడుగడుగున వలఁతి వాడమ నడలుచుఁ జని రీ, పడఁతుకలు ఐతు లు మనుగడ, నడరఁగఁ గఁ వాలశైవాచ్చలు సేయన్ .. కావ్యా. 1. 64
3 జీవనోపాయము, జీవిక, జీతము మొ
కం ఎనుల యెడమేలు గాంచిన, మనుగడ యగ్గ ఱము సేసి మన్నింపుము రా, జనయజ్ఞ భృత్య కోటిన్. భార. ఆశ్ర. 1. 64.
కం .. మనుగడ దొరకును గ్రమక్రమంబున మన కున్ . . దశకు. 91 6

**మనుగుడుపు** వి (మనువు¹ + కుడుపు (వృత్తిని వర్ణలోపము) పెండ్లియైనపిమ్మట అల్లునకు తొలిసారి అత్తవారింటఁ జేసెడి విందు
ఆల్లెము (శ ర).
వ్యవ వారు మనుగుడుపునకు అల్లుని తీసికొని రాలేదు
సా లంఘనాలలో మనుగుడుపు - అసమయములో కార్యమునకై కడంగుటను దెల్పును.
సా. మనుగుడుపులలో లంఘనాలు — తా నొకటి తలఁచిన దైవమొకటి తలఁచె ననుటను దెల్పును.

**మనుగొ(న్గొ)ట్టె** వి (మను³ + గొఱ్ఱె) ఒక జాతి గొఱ్ఱె, కొండగొఱ్ఱె, రోహిషము
మ. పెసరుంగాయకు మెత్తగన్పులకు నై పేటాడు

మగ్గొత్తెలన్, నుసలం జూచుచు .

రా వి. 2. 65

**మనుచు(న్చు) – మంచే²** స క్రి. (√మను¹.)

1 బ్రతికించు, జీవింపఁజేయు

ఆ మేలియాశ్రితు లిట్లు, మనుతు రధిపుఁ గురు కుమారవర్య భార. అను 1 158.

సీ మనుప లేఁడాయెనే మనుజాశనుని జెరిం యనఘ నిష్ఠాయుక్తు నాత్మభక్తు .

వసు 4 43

గీ లక్ష్మణుని మన్చి యనము దెల్లముగఁ గనుము . అచ్చ రా యు 403

2. అన్న వస్త్రాదు లిచ్చి కాపాడు, పోషించు

కం. మును పదివేవురఁ జంపుదు, నని యిచ్చిన బాస వచ్చె నవనీశ్వర నీ, మనిచినఋణంబు తీర్చితి, విను లా విటమీఁదఁ దఱుగువిధమై తోఁచెన్

భార భీష్మ 3. 430

సీ. అనిఁ బ్రాణ మిచ్చిన యట్టివారలవారి కెల్ల గేజంబులు నిచ్చి మనుతె విక్ర. 4 7

3. రక్షించు, ప్రోచు

గీ అనుచుఁ బలికిన జనపతి మనుచువేడ్క.

దశా. 1. 136

చం. .. అచ్యుతుం, డనఘుఁ డపేతదోషుఁ డన పాస్తగుణుం డతివాఙ్మనఃప్రవర్తనుఁడు నిత్యాం తభక్తికలితస్థితిఁ దన్భజియించు పుణ్యులన్, మనుచు సమస్తసంపద సమానులఁ గాఁ బరి కించు సత్కృపన్. హరి ఉ 4 249.

గీ శరణువొందిన రక్షింపఁ జాలి యుండి, మనుప కుండినకంటెఁ గల్మషమ. గలదె

విక్ర 6 93

4 పెంచే, అభివృద్ధినొందించు.

మ. ... ఆమేనక డించి పోయె నడవిన్ గణ్వుఁడు న న్నింత గా, మనిచెన్ సర్వము నామునీంద్రుఁ డెఱుగున్ మద్భాగధేయంబునన్, నినుఁ గం టిన్ భాగ 9 617.

గీ బ్రహ్మ పుట్టించు మనుచు నారాయణుండు, పరుఁడు హరియించు భువనంబు లవసర మున కాశీ 3 44.

మ వంశంబు మ, న్చునుపాయం బొక చేగణిం తువిను మంచున్ గూర్మితో ని ట్లనున్ ...

ఉ రా 2 117

5 వర్తిలఁజేయు, ఉంచు, నిలుపు.

ఎ. చెలుఅం జట్టంఁ బ్రోచి యర్థిజనులన్ శ్రీమం తులన్ జేసి విప్రుల భవ్యస్థితి మన్చి యాగములు పేరుం బెంపు శోభిల్ల ని, ట్టలవుందాగము దానమున్ నడపి నిష్ఠం బెక్కు సెల్లించి . .

భాం. కల్య 2 390

మ ప్ర. . ఈ దృ, గ్గలవన్మాల్యాంగరాగాభర ణవసన సౌభాగ్యలక్ష్మీక లై కాం, తలగత్సం సేవలందుం దలఁపు మనుచు నుత్కంఠ ప్రాపించి రందున్ ...

రాఘవ 2. 63

**మనుజ** సం వి అ. స్త్రీ మనుష్య స్త్రీ.

**మనుజాతుఁడు** సం వి. అ. పుం మనుష్యుఁడు.

**మనుజాశనుఁడు** సం. వి అ పుం. రాక్షసుఁడు మానిసిదిండి.

**మనుజుఁడు** సం వి అ పుం మనుష్యుఁడు. మానిసి.

**మనుజ్యేష్ఠము** సం. వి అ. పుం ఖడ్గము పట్టాకత్తి (వై ని ).

**మనుది(న్ది)ండి** వి. (మను²+తిండి) ఒకజాతి పాము, మాలుధానము, (ఉమ్మెత్తలో నుండు ముల్లుఁ బాము.) (శ. ర.) దుండుభము, ఇరుదల పాము, అని ఆం భా

సీ ... మను. దిండి యం చనఁగను దుండుభం బగు ... ఆం. భా. 1. 147.

సీ ఎట్టరోఁకటిబండ జెట్టి మన్దిండి మున్నగు సరీసృ పములం దంతకంటె ...

అము. 3. 80

**మనుపరి** (విశ ) (మనుపు + అరి³) (త. మన్చి ప్పోన్.) కాపరి, రక్షకుఁడు (శ. ర.).

**మనుపాల** వి (త. మణ్చాలై) జీవంతిక, పాలకూర (వృ వి)

సీ. ... పరగు మనుపాల యనఁ జిన్నపాల యంచ, టన్న జీవంతిక ...

ఆం భా 2 68.

**మనుపీనుఁగు** వి (√మను) జీవచ్ఛవము, బ్రతికి యుండియుఁ బ్రయోజనములేని మనుజుఁడు.

కం తన యొడలం గల నెత్తురు, ధనహీనుని విడిచి పోవు దారాదసుహృ, జ్జనములు విడుచుట యరుదే మనుపీనుఁగు నిర్ధనుండు మఱిఁ బరికింపన్.

విక్ర 2 172

**మనుపు(న్పు)** – మనుచే స క్రి (√మను1) (త మన్నిప్పు.) 1. బ్రతికించు, జీవింపఁ జేయు.

గీ. అప్పు డెలుఁగులరాయనియానతిఁ గొని, గడ్డు కొమరుఁడు మందుఁ గట్టు దెచ్చి, కోఁతిమూఁకల మనిపె రాకొదమసింగ, ములును తేజాముగా సొమ్మ దెలిసి రంత.

అచ్చ రా యు. 272

ద్వి నీవు వన్నిప్పుడు దీవించుమాత్ర, మావంత యును నాయు వది యెుక్క వగునె, మనని వారిల నీవు మనిపెదవయ్య ..

పండితా. పురా 147 పొ.

2 పోషించు, అన్నవస్త్రాదు లిచ్చి కాపాడు.

గీ ప్రకృతిభిన్నగుణంబులఁ బ్రభువుఁ బోలి, మమ్ము దౌవారికులఁ జేసి మనుపుచోట

దశా. 3 133

3 జరుపు, సాఁగించు, ప్రవర్తిలఁజేయు

గీ. నిండు వేడుకఁ గాంచు నీనీలవేణి, కొమ్మ లేనుంగుమొగ మైనకొడుకుఁగుఱ్ఱ, నత్త యును మామయును లేనిరిత్తయింట, మనువు మనిపెడు నీయింతి మగనితోఁడ.

హం 3 25

మ. అనినం గృష్ణుని మోముఁ జూచి దరహాసాంచన్మఖాంభోజుఁడై, మునినాథాగ్రణి పల్కె సర్వమునకు న్మూలంబ వై సాక్షివై, పెనుపన్ మన్పఁగ గర్తవై పరుఁడ వై పెంపొందియున్.

అని. 4. 17

వి రక్షణము, పోషణము శ ర).

**మనుష్యుఁడు** సం వి పుం. మనుష్యుఁడు, మనుష్యజాతి.

**మనుమ(న్మ)** – మనుమఁడు

ద్వి. . పరమారాధ్యదేవు, మనుమశిష్యుండ శ్రీమహారులింగ, ఘనకరుణావాహస్తగర్భ సంభవుఁడ,

పండితా. దీక్షా. 14 పొ. (కొత్తప్రతి పా.).

సీ. దంతిదానవుమన్మసంతాన మకాన్యనవంబున మెలఁగు దంతావళములు .

ఉదయనోదయము. 3. 53

జ మనుమరాలు.

**మనుమ(న్మ)ఁడు** – మనుమ వి 1 పౌత్రుఁడు, కొడుకుకొడుకు

చం మనుమల నెల్లఁ జూపి మతిమంతుఁడు శాంతనవుండు.

భార ఆది 5. 222.

ఆ సుభద్రగా, రాజుపట్టి మగలరాజు మాన, ధనుఁడు దివిజరాజు మనుమఁడు నా చెలి, కాఁడు ముద్దులాఁడు లేఁడు నేఁడు.

భార. ద్రో 2 239.

గీ .. మనుమఁ డనఁగన ప్త చెలంగును ...

ఆం. భా 2. 111.

మ మతి లోకోత్తరుఁ డైన యంగిరసు మన్మం డాశ్రితుండు .

భార. ఆది 3, 118

చం విరథత్వము నొందియు నీదుమన్మఁడు, ధ్వరగతి శక్తి వైవ ..

భార భీష్మ. 2. 321.

మ . నీ, తనయుల్ మన్మలు లోను గా వరుస సంతానం బవిచ్ఛిన్న మై, ధనవంతం బగు

హరి పూ. 9, 24.

2. దౌహిత్రుఁడు, కూఁతుకొడుకు

గీ. ఆ మహేంద్రకుమారు మాతామహుండు, మనుమఁ డలయుటఁ గని తనమాయవలవ, నెత్తి

మన్గొత్తెలన్, నుపలం జూచుచు .
రా వి. 2 65

**మనుచు(న్చు) – మంచే²** స. క్రి (√మను¹)

1 బ్రతికించు, జీవింపఁజేయు

ఆ. మేలియాశ్రితు లిట్లు, మనుతు రధిపుఁ గురు కుమారివర్యు భార. అను 1 158.

సీ మనుప లేఁడాయెనే మనుజాశనుని జీరి యనఘ నిష్ఠాయుక్తు నాత్మభక్తు ..
వసు 4. 43.

గీ లక్ష్మణుని మన్చి యనము దెల్లముగఁ గనుము . అచ్చ రా యు 403

2. అన్నవస్త్రాదు లిచ్చి కాపాడు, పోషించు

కం. మును పదివేవురఁ బంపుదు, నని యిచ్చిన బాస వచ్చె నవనీశ్వర నీ, మనిచినఋణంబు తీర్చితి, విను లా విటమీఁదఁ దఱుగువిధమై తోఁచెన్
భార భీష్మ 3 320.

సీ. అనిఁ బ్రాణ మిచ్చిన యట్టివారలవారి కెల్ల గేజంబులు నిచ్చి మనుతె. విక్ర 4 7

3. రక్షించు, బ్రోచు

గీ. అనుచుఁ బలికిన జనపతి మనుచువేడ్క.
దశా. 1. 186

చం ... అచ్యుతుం, డనఘుఁ డపేతదోషుఁ డన పాస్తగుణుం డతివాఙ్మనఃప్రవర్తనుఁడు నిత్యాం తభక్తికలితస్థితిఁ దన్ భజియించు పుణ్యులన్, మనుచు సమస్తసంపద సమానులఁ గాఁ బరికించు సత్కృపన్. హరి ఉ 4. 249.

గీ. శరణువొందిన రక్షింపఁ జాలి యుండి, మనుప కుండివకంబెఁ గల్మషము. గలదె.
విక్ర. 8 93

4. పెంచే, అభివృద్ధినొందించు.

మ ... ఆమేనక ఓంచి పోయె నడవిన్ గణ్వుండు నన్నింత గా, మనిచెన్ సర్వము నామునీంద్రుఁ డెఱుగున్ మద్భాగధేయంబునన్, నినుఁ గంటిన్. భాగ. 9. 617.

గీ. బ్రహ్మ పుట్టించు మనుచు నారాయణుండు, హరుఁడు హరియించు భువనంబు లవసరమున కాశీ 3. 44.

మ వంశంబు మ, న్చునుపాయం బొక చేగణింతువిను మంచున్ గూర్మితో ని ట్లనున్ ...
ఉ రా 2 117

5 వర్తిలఁజేయు, ఉంచు, నిలుపు.

మ చెలువం బుట్టఁ బ్రోచి యర్థిజనులన్ శ్రీమంతులన్ జేసి విప్రుల భవ్యస్థితి మన్చి యాగములు పేరుం బెంపు శోభిల్ల ని, ట్టలపుంద్యాగము దానమున్ నడపి నిష్ఠం బెక్కు సెల్లించి . .
భాం. కల్యా 2 390

మ ప్ర. .. ఈ ద్భ, గ్భలవన్మాల్యాంగరాగాభరణవసన సౌభాగ్యలక్ష్మీక లై కాం, తలగత్సం సేపలందుం దలఁపు మనుచు నుత్కంఠ ప్రాపించి రందున్ ...
రాఘవ 2. 63

**మనుజ** సం వి ఆ స్త్రీ. మనుష్య స్త్రీ.

**మనుజాతుఁడు** సం వి అ. పుం మనుష్యుఁడు

**మనుజాశనుఁడు** సం. వి. అ. పుం రాక్షసుఁడు మానిసిదిండి.

**మనుజుఁడు** సం వి. అ పుం మనుష్యుఁడు. మానిసి.

**మనుజ్యేష్ఠము** సం. వి అ. పుం. ఖడ్గము. పట్టాకత్తి (వై ని).

**మనుది(న్ది)ండి** వి. (మను²+తిండి) ఒకజాతి పాము, మాలుధానము, (ఉమ్మెత్తలో నుండు ముఱ్ఱుఁబాము.) (శ. ర.) డుండుభము, ఇరుదల పాము, అని ఆం భా

సీ. ... మను. దిండి యం చనఁగను డుండుభం బగు ... ఆం. భా. 1 147.

సీ ఎఱ్ఱరోఁకటిబండ జెఱ్ఱి మన్దిండి మున్నగు సరిసృపములం దంతకంబె ...
ఆము. 3. 80.

**మనుపరి** (విణ) (మనుపు + అరి³) (త. మన్చిప్పోన్.) కాపరి, రక్షకుఁడు (శ. ర.).

**మనుపాల** వి (త మఙ్చాలై) జీవంతిగ, పాఁకూః (వృ వి)

సీ. ... పరగు మనుపాల యనఁ బిన్నపాల యంచ, టన్న జీవంతిక ..

అం భా 2 63

**మనుపీనుఁగు** వి. (√మను) జీవచ్ఛవము, బ్రతికియుండియుఁ బ్రయోజనములేని మనుజుఁడు.

కం తనయొడలం గలనెత్తురు, ధనహీనుని విడిచి పోవు దారాదినుహృ, జ్జనములు విడుచుట యరుదే. మనుపీనుఁగు నిర్ధనుండు మఱిఁ బరికింపన్ విక్ర 2 172

**మనుపు(న్పు) – మనుచు** స. క్రి. (√మను) (త మన్నిప్పు) 1. బ్రతికించు, జీవింపఁ జేయు.

గీ. అప్పు డెలుఁగులరాయనియానతిఁ గొని, గాడ్పు కొమరుఁడు మందుఁ గట్టు దెచ్చి, కోఁతిమూఁకల మనిపె రాకొదమసింగ, ములును జేజాముగా సొమ్మ దెలిసి రంత.

అచ్చ రా యు 273

ద్వి. నీవు న న్నిప్పుడు దీవించుమాత్ర, మావంతయును నాయు వది యెక్క వగునె, మనని వాగల నీవు మనిపెదవయ్య

పండితా. పురా 147 పు

2 పోషించు, అన్నవస్త్రాదు లిచ్చి కాపాడు.

గీ ప్రకృతిభిన్నగుణంబులఁ బ్రభువుఁ బోలి, మమ్ము దౌవారికులఁ జేసి మనుపుచోట

దశా 3 133

3 జరుపు, సాఁగించు, ప్రవర్తిలఁ జేయు

గీ. నిండు వేడుకఁ గాంచు నీనీలవేణి, కొమ్మ శేనుంగుమొగ మైనకొడుకుఁగుఱ్ఱ, నత్తయును మామయును లేనిరిత్తయింట, మనువు మనిపెడు నీయింతి మగనితోఁడ ..

హం 3 25

మ. అనిశం గృష్ణుని మోముఁ జూచి దరహాసాంచన్మఖాంభోజుఁడై, మునినాథాగ్రణి పల్కె సర్వమునకు న్మూలంబ వై సాక్షివై, పెనుపన్ మన్పగ గర్తవై పరుఁడ వై పెంపొందియున్.

అని. 4. 17

వి రక్షణము, పోషణము శ ర ).

**మనుష్యుఁడు** సం వి ఈ. పుం మనుష్యుఁడు, మనుష్యజాతి.

**మనుమ(న్మ) – మనుమఁడు**

ద్వి . పరమారాధ్యదేవు, మనుమశిష్యుండ శ్రీమసురులింగ, ఘనకరుణావాహస్తగర్భ సంభవుఁడ, పండితా. దీక్షా. 14 పు (క్రొత్తప్రతి పా.).

సీ దంతిదానవుమన్మసంతాన మకాననవంబున మెలఁగు దంతావళములు

ఉదయనోదయము. 3. 53.

ఱ మనుమరాలు.

**మనుమ(న్మ)ఁడు – మనుమ** వి 1 పౌత్రుఁడు, కొడుకుకొడుకు

చం మనుమల నెల్లఁ జూపి మతిమంతుఁడు శాంతనవుండు. భార. ఆది 5. 222.

ఆ సుభద్రగా, రాబుపట్టి మగలరాజు మాన, ధనుఁడు దివిజరాజు మనుమఁడు నా చెలి, కాఁడు ముద్దులాఁడు లేఁడు నేఁడు.

భార. ద్రో. 2 239

గీ . మనుమఁ డనఁగన త్త చెలంగును ...

అం భా. 2 111.

మ మతి లోకోత్తరుఁ డైన యంగిరసు మన్మం డాశ్రితుండు . భార. ఆది 3, 118.

చం విరథత్వము నొందియు నీదుమన్మఁ డు, ధ్ధురగతి శక్తి వైవ ...

భార భీష్మ. 2. 321.

మ ... నీ, తనయుల్ మన్మలు లోను గా వరుస సంతానం బవిచ్ఛిన్న మై, ధనవంతం బగు

హరి. పూ. 9, 24.

2. దౌహిత్రుడు, కూఁతుకొడుకు

గీ. ఆ మహేంద్రకుమారు మాతామహుండు, మనుమఁ డలయుటఁ గని తనమాయవలన, నెత్తి

కొనిపోయె జలరాశి కెవ్వఁ డతనిపోక తెలియక యద్భుతాంబుధి మునుఁగ ...

ఉ రా 4 213

2. పుత్త్రసంతతిలోనివాఁడు, ముని మనుమఁడు, ఇను మనమఁడు మొదలగువాఁడు.

కం అని తనుఁ బొగడిన మనుమని, వినయమునకు మెచ్చి నలువ వేఁడుము వత్సా, నిను మెచ్చితి నేమిచ్చెద, నని వచ్చితి ననఁ బుత్త్రపౌత్త్ర జుఁ డనియెన్ ఉ రా 1. 424

గీ సుకవిసంస్తుత్యు శంభుదాసుని నుతింప, నేర్తురే యైన నేను వర్ణింతు నతని, చిన్ని మనుమఁడఁ గావునఁ జేయుతవాక్ర, కొడుకు పలుకులు ముద్దుసేయు దురు గాదె.

విప్ర. 1 12., బస. పు 4 182 పం

**మనుమ(న్మ)రాలు** వి. (మనుమ + ఆలు.) (బ మనుమరాండ్రు.) 1. దౌహిత్త్రి, కూఁతు కూఁతురు

కం. అని చని యాయమ జననీ, జనకులకుం దెలుప సంతసంబున వారల్, విని మనుమరాలు గావున, వనువారము దాని జారయని పిలుచు టయున్ .. శుక. 2 151

2. పుత్త్రుని పుత్త్రిక, పౌత్త్రి.

ద్వి. బలిమనన్మరాలైన పద్మాయతాక్షి, యలరు విహ్వాజ్వాల యనుదానిఁ దెచ్చి, వర్ణింపఁదగిన వివాహంబు కుంభ, కర్ణున కొనరించెఁ గడు సమ్మదమున .

రం. రా ఉ. 26 పా 3 పం

గీ. మనుమరాలు, నాఁగఁ దనరారు వస్త్రి .

ఆం. భా. 2 111.

**మనువు**[1] వి (√మను1) 1 బ్రతుకు, జీవనము, మనుగడ.

గీ. ఇం పొసంగు సీయర్మిలి యెల్ల పమ్ము, గాఁగఁ దుదిపోయి నిన్నిట్లు గానపాలు, సేసి యాఁబ డిఁ బుచ్చితిఁ జెప్పఁ జిట్ట, లయ్యె నామను వే మన నంబజాక్షి .. నిర్వ. 9. 88

వ .. అప్సరపోత్తముండు నవ్వుచు మన మను వులు సాలు నని పలికి సర్వాభరణంబులు నూడ్చి .. భాగ మహా 18

గీ. కలు వోరిన మనవచ్చునయ్యె దుఃఖమునకొ సుఖమునకొ నరుల మనువు చెవుమ

మార్క. 5 199.

2. జీవనోపాయము, వృత్తి

ద్వి తిరుపంబె మనువు గాఁ దిరియు చోడులను .

పండితా దీక్షా 40 పా

3 ప్రవర్తన, నడత.

శా సం, సారానుక్రమ మూర్ణనాభి పగిదిన్ సాఁగించె దోక్కప్పుడుం, ఛారం బెన్నఁడు లేదు సమనువు దుష్ప్రాపంబు వాణీశ్వరా . .

భాగ. 2 74.

సీ .. సంతతాన్యాయ ప్రచార మాచారంబు మతకింపు మాయల మనువు తనువు . .

గీ వేశ్యజన్మంబు జన్మమే విప్రవర్య ...

వై జ. 2. 75

4 కాపురము

సీ . . అనురక్తి నినుఁ గూడి మనఁ గంటి మంటి

నే ననుఁ తి మనువు మాయంబు గాఁగ ..

కు సం. 5. 55ప.

గీ. అత్తయును మామయును లేని రిత్తయింట, మనువు మనిపెడు నీయింతి మగనితోడ.

హర. 3. 25.

కం ఓ మధురవాణి నీమను, వేమిటనుం గడమగాక యోతయు నొప్పెం, దామనుఁ దగు వాగ్వ నితా, కాముం డొక కొంతకొదవ గల్పించెఁ గదా ... శుక. 1. 41.

సా మంటలోఁ బడియైన మనువు దక్కించు కొన వలెను.

5 వివాహసంబంధము, పెండ్లి.

చం. . ఈ, మను విది యేల లక్ష్మణ కుమారు వినిర్జితమారుఁ బొందు వే చను సుఖమందు.

భా. రా. అర. 1 143.

ఉ వచ్చెదఁ జూడ సారెకును వత వహింపకు మమ్ముఁ జెందితా, నొచ్చెము లేని మేన్మనువు నుర్వి నిదే ఉ హరిశ్చ 3 156.

(మగని వరించుట యని శ ర)

(వ్యవ) ఆతని కూఁతునకుఁ దగిన మనువు దొరకినది.

6. పెండ్లియైన పిమ్మటఁ దొలిసారి అల్లునికి అత్తవారింటఁ జేసెడివిందు

గీ మంచుగుబ్బలియింట సమ్మద మమరఁ, మనువుఁ గుడువంగ నున్నప్డు మదనవైరి.

హర ౬ 5

7 మగఁడు (శ ర)

**మనువు² — మనుఁగు** అ క్రి మడియు, చచ్చు (శ ర.).

**మనుష** సం వి ఉ పుం 1. ఒకానొక ప్రజాపతి 2 స్వాయంభువాదు లగు పదునలువురిలో నొకఁడు

శ్లో స్వాయంభువో మను స్తాత మను స్స్వారోచిష స్తథా, ఉత్తమ స్తామస శ్చైవ రైవత శ్చాక్షుష స్తథా, వైవస్వతశ్చ కౌంవ్య సాంప్రతో మను రుచ్యతే, సావర్ణిశ్చ మనుస్తాత భౌత్యో రౌచ్య స్తథైవ చ, తథైవ మేరుసావర్ణా శ్చత్వారో మనవ స్స్మృతాః, హరివంశము 1. 7 4

(మేరుసావర్ణాశ్చత్వారో మనవః — బ్రహ్మ సావర్ణిః, రుద్రసావర్ణిః, మేరుసావర్ణిః, దక్ష సావర్ణిశ్చ, ఏతే మేరౌ తపః కృత్వా సిద్ధిం ప్రాప్తాః ఇతి సర్వేపి మేరుసావర్ణా ఇత్యుచ్యంతే. అనిటీక.).

3. మంత్రము 4. మనుష్యుఁడు. 5. ఒకానొక జినుడు 6 (గణిత.) పదునాలు గనుసంఖ్య. స్త్రీ

1. పృక్క. (వృ. వి) 2 మనుభార్య.

**మనువుమను** అ క్రి (√మనువు.) కాపురము చేయు

ఆ పరమకోపుఁ డైనభార్గవుఁ బతిఁ జేరి, మిగులఁ బనుఁ దొఁడల మెచ్చఁ దిరిగి, యతని వర్ణశాల నాసుకన్యక యను, మగువ గొన్నియేండ్లు మనువుమనియె ..

భాగ 9 ౬6.

**మనుష్యధర్మ** సం వి న్ పుం కుబేరుడు (రూ. మనుష్యధర్ముఁడు.)

**మనుష్యయజ్ఞము** సం వి. అ పుం ఆతిథ్యము, అతిథిసత్కారము (గృహస్థులకు నిత్యకృత్యములగు పంచయజ్ఞములలో నొకటి).

**మనుష్యుఁడు** సం వి అ పుం 1. మానిసి, మనుజుఁడు.

**మనుసంహిత** సం వి అ స్త్రీ మొదటి మనువు రచించినస్మృతి మనుధర్మశాస్త్రము

**మనేదారు** వి (హిం మనేదార్) సామంతరాజు

సీ హెచ్చుమాటల కేమి యింక నొక్కటి మనేదారులు దానిఁ దారసిలినఁ, బంపు చేతనె పాఱఁ బట్టించినపుడుగదా స్వామివారి చిత్తంబు వచ్చు ... రా వి 5 42.

**మనోగుప్త** సం వి. అ స్త్రీ మనశ్శిల, మణిసిల.

**మనోజన్మ** సం వి న్ పుం. మన్మథుఁడు

**మనోజవ** సం వి అ. స్త్రీ. 1. అగ్నిదేవుని సప్తజిహ్వలలో నొకటి (వై. ని) 2 దుర్గాశక్తి భేదము,

శ్లో మనోజవా కంటకినీ ప్రఘసా పూతనా తథా.

సం భార భీష్మ 46 16. కల్ప.

**మనోజవసుఁడు** సం విశ (అ అ అ.) తండ్రిని బోలినవాఁడు.

**మనోజవుఁడు** సం విశ (అ. ఆ. అ.) 1. మనస్సువలె మిక్కిలి వేగముగలవాఁడు. 2 తండ్రినిబోలినవాఁడు

**మనోజుఁడు** సం. వి. అ పుం. మనమునఁ బుట్టినవాఁడు, మన్మథుఁడు, మనోభవుఁడు.

**మనోజ్ఞ** సం. వి అ స్త్రీ. 1. మణిసిల. మనశ్శిల. 2 మద్యము, మత్తుగలిగించు త్రాగుడు పదార్థము. 3 రాచకొమార్తె, రాజపుత్రిక. 4. వంధ్యాకర్కోటకి, గొడ్డు అఁగాకర (వృ.వి) 5. జ్యోతిష్మతి, మెఱుఁగుడు (వృ వి.) 6. పెద్ద జీలకఱ్ఱ.

7 జాతి, జాజి (వృ వి)

**మనోజ్ఞము** సం విణ (అ ఆ అ) మనోహరమై నది ఇంపైనది, అందమైనది

**మనోజ్ఞల** సం వి ఆ స్త్రీ. మల్లె (వృ వి) (వై ని)

**మనోభవము** సం విణ (అ ఆ. అ) మనమునఁ బుట్టినది తలంపులచే సృజింపఁబడినది వి అ. పుం కామము, వలపు.

**మనోభవుఁడు** సం. వి. అ. పుం 1 మనోజుఁడు, మన్మథుఁడు. తలఁపుచూలి.

**మనోభిద** సం వి ఆ. స్త్రీ మణిసిల (వై ని).

**మనోభువు** సం వి ఉ పుం 1 మనోజుఁడు, మన్మథుఁడు 2 కామము. వలపు.

**మనోమయకోశము** సం వి. అ పుం. అన్నమయాది పంచకోశములలో మూఁడవది (1. అన్నమయము 2 ప్రాణమయము, 3 మనోమయము 4 విజ్ఞానమయము, 5 ఆనందమయము అని కోశములైదు ఇవి జీవాత్మకు వస్త్ర ప్రాయములుగా నూహింపఁబడినవి)

**మనోయోని** సం వి. ఇ పుం మన్మథుఁడు, తలఁపుచూలి.

**మనోరథదాయకము** సం విణ (అ. ఆ అ) కోరికల నిచ్చునది వి అ. పుం కల్పవృక్షము.

**మనోరథము** సం. వి. అ పుం 1. కోరిక, ఇచ్ఛ.

**మనోరమ** సం వి ఆ స్త్రీ గోరోచనము.

**మనోరమము** సం. విణ (అ ఆ. అ) మనోహరమైనది. అందమైనది.

**మనోరాజ్యము** సం వి అ న. మనస్సంకల్పములను బెంచుకొనుట, వ్యర్థసంకల్పములను గల్పించుట

**మనోలయము** సం. వి. అ. పుం మనోనాశము చైతన్యము తప్పుట

**మనో(ను)వర్తి** మి. వి. 1. ఇంటివారి భోజనాదులకై యగువెచ్చము.

గీ ఊడిగంబులకును వినియోగములకు వర్తనలకు నగరమనోవర్తులకును, జిల్లరల ముద్రకర్తల జీతములకు, వివిధమైనట్టి వ్యయములు నివియటంచు. .. ఉ హరిశ్చ 1 68.

2. భర్త చనిపోయిన స్త్రీలకు జీవనార్థమిచ్చు ధనాదికము, భరణము, (జీవనమునకై యిచ్చు సొమ్ము అని శ ర)

(వ్యవ) ఆమె మనోవర్తికై మఱఁదిపై వ్యాజ్యము వేసినది

**మనోహతము** సం విణ (అ ఆ అ) ఆశాభంగము నొందినది

**మనోహతుఁడు** సం విణ (అ ఆ అ) మనస్సు చెడినవాఁడు (శ. ర).

**మనోహర** సం వి ఆ స్త్రీ 1 జాతి, జాజి (వృ వి). 2 స్వర్ణయూథిక, నంద్యావర్తము (వృ వి)

**మనోహరము** సం. విణ (అ ఆ అ) ఇంపైనది, అందమైనది వి. అ పుం ఒక జాతి మల్లె (వృ వి) న. బంగారము.

**మనోహరములు** సం వి అ న బ భక్ష్య విశేషము, ఒకవిధమగు పిండివంట

గీ. గారె లరిసెలు బొబ్బట్లు గరిజెకాయ, లట్లు బూరెలు జంతికెచుట్లు మణుగు, బూలు వెన్నప్పములు చిటిబూరె లిడ్డె, నలు మనోహరములు వంటచలిమిడియును. చెన్నబ 4 358.

వ .. తిమ్మనంబులు పాలకాయలు చక్కిలంబులు మోరుండలు మనోహరంబులు గారెలు బూరెలు ముండెంగలు .. ప్రబంధ. 112

**మనోహరి** సం వి. ఈ స్త్రీ. పిప్పలి (వృ వి) (వై ని)

**మనోహారి** సం విణ. (న్ జ. న్.) మనస్సునాకర్షించునది, ఇంపైనది.

**మనోహ్వ** సం వి ఆ స్త్రీ మణిసిల

**మన్న(న్నా)** వి (క మన్నా హిం. మనా) అడ్డగింపు, నిరోధము శ ర).

(వ్యవ.) పాపము ! అతనికి దేవిడీమన్నా అయినది

**మన్నంగొటుడు** వి. (మన్నన + కొటుడు) గౌరవములేనివాఁడు.

కం తలుసంటి తమ్ము నెదిరిని, నెఱుఁగఁడు తన కోలఁదిపుడుః లేరఁడు మొండీఁ, డఱ జాతి ప్రముక్కు మన్నఁ, గొఱఁ డెక్కడ నిట్టిప్రేలు గొండులు గలరే కు సం. 2 880

మన్నన వి (సం మాననమ్. క మన్నణి)

1 గౌరవము సమ్మానము

కం. మన్నన కుబ్జక యవమతి, ద న్నొందిన సుక్కఁబడక ధరణీశుకడన్, ము న్నున్న యట్ల మెలఁగిన, యన్నరునకు శుభము లొడవు నాపద లడఁగున్ .

భారం విరా 1. 133

శ్లో మానం ప్రాప్తో న హృష్యేత న వ్యథేచ్చ విమానతః . సం భార 5 86.

చం నను భవదీయదాసుని మనంబున నెయ్యఁపుఁ గిన్కఁ బూని తాఁ, చినయది నాకు మన్ననయ . పారి. 1 128

గీ తా నవంబుగ దొరఁ జేయువాని మంత్ర, మునకు వేగమె లోఁ జేయఁజనదు వాఁడు, క్రొత్త మన్నవరహి నసుఁగులకుఁ జెప్ప, నయిననవి చెడు మఱి వాఁడు నడఁగుఁ గాన .

ఆము 4. 260.

కం నగుమొగమున ననుఁ గనుఁగొని, జగతీ సుర వంశమణివి సత్కవి వగుటన్, దగుదువు మామన్ననకుఁ బో, సఁగంగ నందుఁ గులసూరసచివుని వెంగా ... రామ 91.

2. ఆదరము.

కం. భూకాంతుమన్ననలు గడుఁ, జేకులునా ముదిత బుధరచితనుతి భరతుం, గైకమహా వీరత్వా, స్తోకుని నర్జునసమాఖ్యు సుతుఁ గని యలరెన్.

రాఘవ. 1. 73.

ఉ. చెన్నగునన్న దీపులినసీమల దాఁగిలిమూఁత లాడుమన్, వెన్నెలరేలఁ గప్పురపు విప్పుటనం టులనీడ నీఁగురా, కన్నెలరోయు నన్నలకుఁ గన్నులుమూయుఁ దదీయ వాసనల్, మన్ననఁ గాంచి కప్రవపుదుమాఁటము రేఁచుసమీరడింభ ములో .. వసు 1 111.

కం రమణుని మన్ననవలనన్ రమణీమణి రమణ మొందు . దశా 3. 50.

3. దయ, అనుగ్రహము.

మ. . సంతోషముఁ జేయు పూర్వచరతింబల్ సృష్టిలో మీరు చూ, చిన వైనన్ మఱి విన్న వైన జలరాశిప్రాశనా చెప్పుమ, న్నన నన్నన్ మునిరాజశేఖరుఁడు నానావైఖరీ మౌఖలన్...

వరాహ 9 94.

చం. కొల్వున కేఁగుదెంచి మ, న్నన గ్రజ విన్న పంబులు వినంగదపయ్య నృపాల వేఁడెదన్ ..

విక్ర 3 44.

మ. జనవంశోత్తమ వింటె పంక్తిపనుండీ లాగు కైలాసవా, సునిచే మన్ననఁ గాంచి బొంగుచు . ఉ రా 3. 98

మన్ననమానిసి — గౌరవముఁగల మనుష్యుఁడు, గౌరవింపఁదగిన జనుఁడు.

కం. మున్ను గలగోపవర్గము, నిన్నుం గని కొలిచి భక్తి నీపని సేయన్, మన్ననమానిసి వైనీ, వున్నం గడుమేల కాక యొప్పుమి గలదే ...

భార. విరా 1. 128.

జ మన్నం గొఱఁడు, మన్ననచేయు.

మన్ననచే (సే)యు. స క్రి. (√ మన్నన) ఆదరించు

మత్తకోకిలము. .. మా, యన్న యీతఁడు నేఁడు చేసెమహాపరాధము నీయెడన్, నన్ను మన్నన చేసి కావు మనాథ నాథదయానిధీ.

భాగ 10 పూ. 1766.

కం. విన లే నిట్టివి మానుఁడు, నను మన్ననచేసి యనుచు నాతుఁక మ్రొక్కెన్ .

కళా. 1. 61.

ఉ ... సిరిఁ గన్నతండ్రిఁ దా, మన్ననచేసి పంపి తనముందిఁ గనుంగొని రాముఁ డిట్లనున్ ...

యయా. 3. 32.

ఉ. ... సాధుఁడు నిచ్చలు నింగితజ్ఞుఁడై మన్నన సేయునే ... దశా. 6. 37.

మన్ననాకు. వి పాండ్యమండలమున విల్లుపుత్తూరిలో వేంచేసియుండు దేవుఁడు మన్నారు

గీ. విల్లిపుత్తూరిలో నల్లవిష్ణుచిత్తుఁ డతులతులప్ సుగంధమాల్యమును మూల, మంత్రమున వక్కు సేర్చుచో మన్ననారు, దారిమధురోక్తి నిట్లని యానతిచెు.

ఆము 2 87.

మన్నాస వి (మన్ను + ఆస) భూమిపై నాస, భూమిపై నుండవలయునని యాశ

గీ . దివిజుల చెలులు వేగ, విడుపు మొుదేరి మన్నాస విడువు మొుండె ...

కు. సం. 10. 507

(జీవితాశ యని తాత్పర్యము)

మన్ని[1] వి (మను[1]. త. మన్నుదల్) జీవము, ప్రాణము

సీ కడిదిమృత్యువు పుష్పగంధియై చనుదెంచి నీమన్నిగొని యొనే నృపతనూజ ...

భోజరా. 6 109.

ద్వి. రాముని నని గెల్వ రా దని యంటి, నామాట వినవైతి నామన్ని గొంటి ... రం రా. కిష్కిం. 215 పొ. 11 పం.

గీ మనఁగ నాబుద్ధి వినక నామన్ని గొంటి, వింక నీశోకవారాశి నెట్లు గడతు ..

భా రా. కిష్కిం. 339.

మన్ని[2] (సం మన్యా ప్రా. మన్నా) పెడ తలయందుండు నరము. గ్రీవాపశ్చాద్భాగమందలి సిర.

గీ మన్ని యనఁగను విలసిల్లు మద్య ..

అం భా 2 132.

మన్నించే. స క్రి. (√మన్నన) (సం. మాన్ క. మన్నిస్తు.) సన్మానించు, బహూకరించు.

మ. ... తన్ మన్నించినన్ గీడు సే, సివ హర్షంబు సమస్తమున్ హృదయముం జెందింప కక్షోభ్యుఁడై . భార శాం 5. 121.

గీ. ద్రోణుల సదావరై కథుకీణుఁ డగుమఁ క్రౌధి మన్నించె మేదినీపతి . రాఘవ 2. 29.

ఉ. కాంచినఁ బొంగి వా రొసఁగుకానుక లర్థి బరిగ్రహించి మ, న్నించి పురప్రయాణరతి నిక్క నరేంద్రుఁడు మనుచ. 5. 42.

2 గౌరవించు

కం. అన్న ! యిద ధర్మ వని మీ, యన్నను నన్నును నతిప్రియంబున నెదలో, మన్నించి యేమి వనిచినఁ, గ్రన్నన మావనువు సేయఁ గడఁగుము బుద్ధిన్ . భార అది 6 222.

గి మించుమందస్మితమున మన్నించె శక్రు, హరుఁడు . భీమ 5 38.

ద్వి. సమ్మదంబునఁ గరిజలజముల్ మొగిచి, యున్న నారాజేంద్రు నుచితసత్కృతుల, మన్నించి మునిశిఖామణి యిట్లు లనియె

ద్వి హరిశ్చ. పూ 6. 50.

3. ఆదరించు

గీ. ప్రణయకోప ప్రశాంతికై పాదపతితు, నిన్ను నేపువుఁబోఁడి మన్నింపదయ్యె హర 3. 46.

సీ. వర మేలుఁ డిబింబఫలపాటలాధర నను మీఱ మన్నించినాఁడు మేలె .

కాశీ. 4. 148., శివరా. 4. 70.

4 (నేరము) క్షమించు, ఓర్చు, సహించు

కం. వినుము బృహస్పతి యుఁకనై, నను భక్తిని నన్నుఁ గొలిచినను మన్నింతున్, దననేరము...

దశా. 2 110.

5 ఇచ్చు, ఒసఁగు

మ నినుఁ బోల్పం దగు సత్కుమారకుల మన్నింపంగదే నావుడున్ . ఉ రా. 2 133.

కం అనలినాతికి వేనలి, చే నలిరుచి గెలువఁజాలు చెలువకు వలువల్, చే నిచ్చి వెనుక వచ్చిన, మానిని కుడుగరలు కొన్ని మన్నించి తగజ...

రా. వి 2. 15.

6. రక్షించు, కాపాడు.

సీ. బ్రహ్మాదులార నాపల్కులు మఱికొన్ని యాలకింపుఁడు వేంకటాద్రియందు, ధరణీసురుల

కన్నదానంబు చేసిన నేఁ దృప్తిబొంది మన్నింతు
వారి . . వేం. మా. 2 158

7. కరుణించు, అనుగ్రహించు

గీ. అనతిమున్ మహాదేవ యభవ నీదు, కంఠ
మూలంబు నలుపైన కారణంబు, నన్ను
మన్నించి యీకారణంబు నాకు, నానతీఁదగు
నీకు లోకాభివంద్య. హర 6 6.

జ. మన్నింపు, మన్నిక

మన్నింపు వి 1. (√మన్నించు) మన్నించుట

సీ మన్నన మన్నిక మన్నిం పనంగను బహుమాన
సంజ్ఞ లై పరగుచుండు ...
ఆం భా. 1 184

2 అపరాధక్షమ (శ ర.).

మన్నిక[1] వి (√మన్నించు) మన్నన, సన్మానము

సీ. మన్నన మన్నిక మన్నిం పనంగను బహుమాన
సంజ్ఞ లై పరగుచుండు .
ఆం భా 1. 184

మన్నిక[2] వి. (√మన్ను[1].) ఎక్కువకాల ముండుట.
(వ్యవ.) బొమ్మ నేఁతబట్టకు మన్నిక తక్కువ

మన్నిగొనిపించు స. క్రి. (√మన్నిగొను) చంపించు.
(విశ్వామిత్రుఁడు.)

సీ అలుక శక్త్యాదిపుత్త్రుల మన్నిగొనిపించెఁ
బళు వగు ద్విజపుత్త్రి బ్రతుకఁ జేసె .
దశా 7. 25

మన్నిగొను స. క్రి. (మన్ని + కొను)

1 చంపు. వధించు

గీ. ... గాండీవధరుచేతి మెఱుఁగుటమ్ము, మన్ని
గొనియెనె యోకర్ణ మగలరాజ ...
భార స్త్రీ 2 90

(ఇట నిన్నున్ అనుకర్మపద మధ్యాహార్యము)

కం. కన్నుండఁ గంటిపావం, గొన్నట్లు మొఱంగి
బాలుఁ గొనిపోవుటకై, యన్నిచు బంధుయు
తముగ మన్ని గొనకయున్న నేఁటి మాటలు
మనకున్. ఉ. హరి. 5. 288.

చం. మఱి యొకయుక్తి రక్కసుల మన్ని గొనం
గను వారిలోన నొం,డొరులకుఁ గచ్చె పుట్టుఁటకు
నొక్కని చెడియ నొక్కఁ డొంద న, క్కటా
జనియించఁజేయవలె పార్వ 2 128.

2 (ప్రాణములుతీయు) మిక్కిలి బాదపెట్టు

ఉ . నా, యావులఁ గ్రేపులఁ గలపి యాం
వెలార్చినఁ బోయి ఘోరదు, ర్భావళి నొచ్చె
నింట మగఁ డాత్మజు లెవ్వరు లేరు ప్రల్లదుం,
డీవిధి మమ్ము మన్ని గొనియెన్ భవదీయ
సతుఁడు గోపికా ... హరి పూ 5. 225

మ పుణ్యాత్మ మమ్మీవ యెడన్, మరణోపాయ
భయంబు మన్ని గొనియెన్ మాతప్పు నై రిం
పవే . మార్క 1 84.

కం ... స్వభావమున దుర్జనుఁ డై. యొనయఁ
బ్రజాపాలనమున. కును శాల్వాది ప్రజల మన్ని
గొనఁ జొచ్చెంగదే ... భాగ. 4 418

మన్నియ(ఁడు) – మన్నె వి (స. మాననీయః, క
మన్నెయ) ప్రభువు

ఉ నొన్నపు సన్నచేలఁ గటిఁ జుట్టి కిరీటము మౌళిఁ
దాల్చి రే, మన్నియతోడఁబుట్టు వెనుమానిక
ముక్కునఁ జేర్చి వచ్చి ... విజ. వి. 2. 84.

సీ. రక్కనుల్ గెంటింపరాకుండ మన్నియ పౌజు
కాపరికొల్చుబలిమి యబ్బె ...
అచ్చ భా. 1. 4 పొ.

ఉ తన్నిన నాతఁ డల్లి బెడిదమ్మగ ముమ్మొ
నవాలు వానిపైఁ, గ్రన్నన నేయ నప్పులుఁగు
రాయఁడు ముక్కునఁ జక్కఁ జేసి యా. మన్ని
యతేరి యక్కజంపు మావులఁ గూల్చి కడంగు
చున్నచోఁ, గ న్నెఱ్ఱఁ జేసి చాలుపు మొగంబుల
రక్కనుఁ డుక్కు మీఱఁగన్ ..
అచ్చ. రా. అర. 78

వి. శ్రేష్ఠుఁడు

కం. బవరిమున కీవు రమ్మని, తవిలిన మీవంటి పుడ
మిదయ్యంబులతోఁ, దివిరి యెదుర్కొనఁగా
దగ, వపునే నెఱరాచమన్నియల కెంతైనన్...
అచ్చ. రా బాల. 204.

మన్నియమ్రుచ్చు వి (మన్నియము + మ్రుచ్చు) కొండలయందుండు దొంగ, పర్వత ప్రాంతమున వసించుచోరుఁడు

వ ... పసులకొమ్ములతాఁకుల వడవిక్రంప యేట్ల మన్నియమ్రుచ్చులపోట్లం బెరసిన గంట్లం గల కెక్కిన యవయవంబులును.

హరి పూ. 5 142

మన్నిల్లు వి. బొ (మన్ను + ఇల్లు) భూమిలోపల నిర్మింపఁబడినయిల్లు, నేలమాలె, భూగృహము.

కం. పన్నగకాంతల కెన యగు, నిన్నారులు గొలువ నున్నయిది యెవ్వ తె యీా, మన్నింట నేమికత మున, నున్నది యెటిఁగింపు మింతయును దెలి యంగన్ .. దశకు. 8. 83 (చూ॰ 8. 79.)

మన్నీఁడు వి (మన్ను + ఈఁడు) భూస్వామి, సామంతరాజు, మండలాధిపతి, ప్రభువు, దొర

మ. ... కృచ్ఛల, బ్రమనాగ్విత్త మదానిలాప్తి భోమ లుత్కంపించు మన్నీలఁ గొ, ల్వ ముదం బేమి జనాళికిన్ .. మల్ల భూ. 3 25.

సీ. .. నల్ దిక్కుల మన్నీలుఁ దక్కుఁ గలుగు, నరనాయకులును జచ్చిరి ...

భార. శల్య 1. 9.

కం. మన్నీలబలిమి గల దని, యున్న మహీపాలు కడిమి యుండదు రాజ్యా, భ్యున్నతికి మూలబల మూ, సన్నం బై యుండవలయు సమధిక మగుచున్ ... రుక్మా. 3. 46

గీ నగరు వెలువడి వేఁటసన్నాహమునకు, హితులు మన్నీలు దుర్గాధిపతులు దొరలు, వేత్రహస్తులు రౌతులు వీరభటులు, బలసి యిరువంకలను జేరి కొలిచి రాఁగ ...

సారంగ 1 80.

శా. లోలత్వంబున మత్తకాశినుల కిల్లుం బొల్లునుం జెల్లఁగా, నేలా వెచ్చముసేయ నెవ్వలన మన్నీలాధ్యులుం జాలరే .. పాండు 3. 42

గీ. నింగి నొరయు రాకాసిమన్నీనిమేని, నీడఁ జీకటిఁ గొనె నవనీతలంబు ...

మనుచ 4 97

కం వేఁటాడ దొరలసన్నిధి, మాటాడ మదించు చెఁచుమన్నీలఁ గరం, బూటాడఁ జేయు నన్నిట, జూటాడనె యుండు నతఁడు చూచెద రెకదా..

రా. వి 3 52.

విశ శ్రేష్ఠము, శ్రేష్ఠుఁడు.

ద్వి. వాటంపుమీపేరు వానిపే రొకటి, తేఁటి మన్నీలార తేరె మాసుతుని .

ద్వి శ సా 3. 111 పు. 20 పం

మన్ను[1] – మను[2] వి. బొ అనొ (సం మృత్స్నా, క. మణ్ణు త మణ్.)

1 మృత్తిక, మట్టి.

గీ వినయమున ద్రోణురూపు మన్నున నమర్చి.

భార. ఆది. 5. 232.

గీ ధూళి యడఁగిన మఱి మింటఁ దోఁచె శంప, జలధరద్రోణి మన్ను పర్జన్యుఁ డెత్తి, ఖనదిఁ దచ్ఛ్రివిభూషేచ్ఛఁ గడుగ మెఱయు, మృదు మహీగత వసురజో రేఖ యనఁగ ..

అము. 4 110.

2 భూమి, నేల.

సీ అగని మింటికి మంటి కైక్యసందేహంబుఁ బరిహరింపంగఁ జాల్పడ్డ యవధి ..

గీ అరుణుఁ డుదయించెఁ బ్రాగ్దిశాభ్యంతరమున . కాశీ 1. 121.

చం. మంటికై, పొఁల ఁధీశుఁ డీ కమలబుద్ధి, ఖటూరకఁ దక్క. అము. 2. 34.

గీ. పంకమున గొరిజ దిగఁబడఁ బఱవ లేవు, మన్ను లివ్వేళ రేగటిమన్నులందు ...

మనుచ. 4. 20

మంటిపాలు సేయు – నేలఁగలుపు, నాశము చేయు

సీ బహుకాలసాధ్యతపస్స్వ మేఁటికి మంటిపాలు సేసెద వని పలికె నత్రి .. చంద్ర. ౨. 19

మన్నుమిన్ను గానకుండుట – క్రిందుమీఁదు తెలియఁ గకుండుట, మిక్కిలి గర్వితుఁడై యుండుట.

శా. చేతోవీథి భవన్మహామహిమముల్ చింతింపఁగా

లేక యీ, రీతి నన్మన్నును మిన్నుఁ గానక
మదోద్రేకంబువం ద్రుళ్లితిన్

చంద్ర 2 88

జ: మంటిగూండ్లు, మంటితిండి, మంటినూనె
మశ్నాన, మన్నిక², మన్నిల్లు, మన్నీఁడు,
మన్నుచూలి, మన్నుతాల్పు, మన్నుఱేఁడు

**మన్ను² - మను³** ఒకజాతిజింక,ఋశ్యమృగము

సీ. కొఱప్రాణములఁ జేసి కూల్చె దుప్పులఁ గొన్ని
చెండె మన్నులఁ గొన్ని గుండె లవియ .

పి శకుం 2. 15

ద్వి. కన్నుల మసరులు గప్పి యాఁబోతు, ఉన్న
చందంబున నున్నమన్నులును ..

నవనాథ 1. 34 పొ 31 పం

సీ .. మ న్ననంగ ఋశ్యము తగు ...

ఆం. భా. 2. 85

జ మన్నుఁబిడి. మన్నుఁబెంటి, మన్నుఁబోతు

**మన్ను³** వి. యుద్ధసాధనవిశేషము.

వ ... కొంకి మన్ను దగరు మొదలుగాఁ గలసాధ
నంబులచేఁ జీకాకుపఱిచియు.

ఉ. హరి. 3. 36.

(శ ర. పా కొంకిత్రుమ్ముడు దగరు వావిళ్ల.
వీరేశ. పా.)

**మన్ను⁴ – మను¹** అ క్రి ఉండు, ఎక్కువ కాల
ముండు.

వృషభగతి రగడ. మదిర మది దహిఁ బూని వకు
ళము మన్న మన్నవ మధుపకోటికి.

వసు. 3. 146.

(వ్యవ.) చేనేఁతబట్ట మన్నినట్లు బొమ్మనేఁత బట్ట
మన్నదు.

**మన్నుఁబిడి – మనుపిఁడి** వి. (మన్ను + పిడి) ఆఁడు
ఋశ్యమృగము. ఒకజాతియాఁడుజింక.

మ. పులికూనల్ నవరాలు కస్తురిమెకంబుల్ లేళ్లు
కుంచేళ్లు పం, దులు కార్పోతు లెలుంగు లేదు
లును మన్నుంబిళ్లు సివ్వంగి పి, ల్లులమొత్తంబు.

యయా. 1 104

**మన్నుఁబెంటి** వి. (మన్ను2 + పెంటి) ఆఁడు ఋశ్య
మృగము

సీ ఒకచేతఁ బో తొంట నొకమన్నుఁబెంటి గా
నొకప్డఁ హార్చినయాట లొప్పి చెల్లె

కకు. 4 93.

**మన్నుఁబోతు** వి (మన్ను² + పోతు) పురుష ఋశ్య
మృగము., ఒకజాతి మగజింక.

గీ. నల్ల సేనపుగుండులు నడచినట్లు, మఁపు గొని
మే యెఱుంగక మలసిమలసి, నెనడు వాతికి
నుఱుకంగ నెగసి మన్నుఁ,బోతు వెడచొచ్చె
దాఁ బెడు పొదలువోలె . . ఉ హరి 4. 26

ద్వి మఱచి మల్లడిగొను మన్నుఁబోతులును

నవనాథ. 2 102 పొ 8 పం

**మన్నుచూలి** వి (√మన్ను1) భూపుత్రి, సీతాదేవి

ఉ. ఏఁగుదెంచి సొగసు లేర్పడ నమన్ను, చూలి
మ్రోల నిలిచి సొరిదిఁ బలికె ...

అచ్చ. రా. సుం. 36.

(ఇక్లే మన్నుకానుపు మొ.)

గీ అని తలంచుచు నున్నచో నంతలోనె, మన్ను
కానుపుసొగ సెల్ల మదిని నిలిపి ...

అచ్చ. రా. సుం. 33.

**మన్నుతాలు(ల్పు)పు** వి. (మన్ను¹) భూధరము.
పర్వతము.

గీ తెరువుబడలిక లన్నియుఁ దీర్చి వారిఁ, దనిపె
నెద నెన్న నమ్మన్నుతాల్పు మిన్న ...

అచ్చ. రా. అయో 104.

**మన్నుఱేఁడు** వి. (√మన్ను¹ ) భూపతి, రాజు.

ఉ. కైటభదైత్యవైరి యధికం బగునేర్పున మన్ను
ఱేని కు, చ్చాటన మాచరించి తనబంటు ఖగేం
ద్రునిఁ బంచెఁ గ్రమ్మఱన్ కాశీ. 6. 141.

గీ. మున్నరకతోడఁ గొందఱు మన్నుఱేండ్లు, గోరి
సింగాణి గొనయంబుఁ గూర్పఁబూని, పొదివి
చేతులఁ బొరలించి పుడమి పైని, నెగయ
నెత్తఁగ నింతయు నేరరైరి.

అచ్చ రా బాల 175.

**మన్నె(ఁడు) – మన్నియ** వి. రాజు, సామంతరాజు

సీ సకలాప్తబాంధవసంబంధు లోకవంక నుదుటు
మన్నె కొమారు లోక్కవంక ,,
వి పు. పీఠి 17

సీ. జన్న మన్నము గాఁగ మన్నమన్నెలవాఁక
వెన్నంటి రాఁ జన్న విభుతవంబు
అచలా 3 41

సీ మేరుమందిరముల మించఁ గల్గిన మన్నె
యుద్దండనాథు లోకొక్క వంశ
తపతీ. 1. 14

జ. మన్నెఱికము

**మన్నెకాఁడు** వి (మన్నెము + కాఁడు) ప్రభువు

సీ శిరస్సుపై జాబిల్లి చెండు దండలరీతి మణిజాల
ముల నించుమన్నె కాఁడు ... తపతీ. 1 4

**మన్నెదొర** వి. (మన్నెము + దొర) అధిపతి,
ప్రభువు

చం ముదిపాలదిండి చేటు తమమూఁకల కొండల
పాటు వేల్పుమ, న్నెదొరల గెల్చునీటుఁగని ...
ఉ. రా. 4 306.

ఉ. మావుల నేలుమన్నెదొర మందసమీరుని సంగ
డంబు నె, త్తావులతావు తామరల తంపర జాజి
తోలంగుఁజావ లేఁ, దీవమిటారి జవ్వనపుదీము
పికాళుల మెట్టపంట క్రొం, బూవిలుకాని
సాహిణపుఁ బ్రోపరి యామని వచ్చె నత్తఱిన్...
కృ శకుం 1. 70 , శుక. 1. 271.

**మన్నె(న్నియ)ము** వి. (సం. మాన్యమ్ – కొన్ని
యెడల వృత్తిని ముపర్ణలోపము.
ఉదా. మన్నెదొర, మన్నెముల్లు మొ.)

1. సన్మానించి యిచ్చిన భూభాగము.

ద్వి. అనయంబు రజతాద్రి యట్టిదుర్గంబు, మనకుఁ
గల్గఁగ వేఱె మన్నెముల్ చేసి, కొనియుండ,
నేల యీ వనదుర్గమందు ...
బస. పు 3. 548 వం.

2. పర్వతప్రాంతప్రదేశము

చ తమఁ గురుమన్నెపుం గహనచారిజనంబెడ
దోషదృష్టి కు, డ్యము గడుగంగఁ బూన్కి ...
ఆము 4 257

(చూ మన్నియమ్రుచ్చు)

3 దుర్గమప్రదేశము

గీ మన్నె మన మండె మనఁగను మాడె మనఁగ
దుర్గమస్థలనామ మై తోఁచుచుండు ..
ఆ భా 2 7.

4 నివాసస్థానము.

కం మున్నింటిక టికిచీకటి, మన్నెమునకు వీడుకోలు
మందిని యనఁగా, నున్నని చెక్కుల ధవళిమ
చెన్నొందెం గప్పురంబు చిలికిన జాడన్ ...
సుద 2 92.

మన్నెముదన్ను – నివాస మేర్పఱచుకొను,

ఉ ఈసునఁ బుష్పసాయకుని యేటునకుం గడు
దూఁకమైన దు, ర్వాసుని నెమ్మనంబునఁ దిరం
బుగ మన్నెముదన్ని రాజ్యసింహాసన మెక్క
కుండఁ దను నాఁగిన క్రోధముఁ జూచి భీతిమై,
వాసవుఁ డొయ్యనొయ్య నఱవ్రాలిచె జెప్పలు
వేయుఁ గన్నులన్ నైష 7. 48

జ. మన్నియ మ్రుచ్చు, మన్నెకాఁడు, మన్నెదొర,
మన్నెముల్లు, మన్నెరాజు, మన్నెవాఁడు

**మన్నెముల్లు** వి. (√మన్నెము.) మేఁకల కాలిగిట్టల
లోనిముల్లు తీసెడు పెద్దసూది.

గీ. పాలబుడిగెలు నొడిసెల ప్రాంత మెట్లు, మలప
మందుల పొడి బుట్టి మన్నెముల్లు, తోలుకు
ళ్లాయి తొడుపును దొడ్డికంప, చుట్టు చవిరెయుఁ
గొమరొప్ప పాలయు నతఁడు ...
హంస 2 75.

**మన్నెరాజు** వి. (√మన్నెము.) మండలాధిపతి,
సామంతరాజు.

వ. ... సమీపంబువం గూర్చున్నమన్నెరాజుల
భూషణరత్నకిరణరాజులచే విరాజితం బగు
కొలువుకూటంబు చొచ్చి ...
ప్రబోధ. 1. 25.

మన్నెరి వి ఒకానొక జాతిమనుష్యుఁడు.

ఏ. మైలార మన్నెరి తలారి తురుక పింజారి విప్ర వినోదులును హంస 4 29

మన్నెఱికము వి (మన్నె + ఱికము) ప్రభుత్వము, అధికారము

ఉ కన్నెఱవింటివాఁడ తిగకన్నుల దేవరతోడఁ బోరము, నృన్నము నొంది మే దొఱఁగుపట్టున నెక్కడ డాఁగిపోయె నీ, మన్నెఱికంబు ..
నీలా 3 19.

కం క్రొన్ననవిల్తుఁడు నాకను, సన్నల వ ర్తిల్లు సురత సామ్రాజ్యగతిన్, గన్నెఱికంబుల వలపుల. మన్నెఱికం బెఱిగి విటులు మహి నేఁ గొఁదున్
వై ఒ 2 70,, కువల 5 94 , అం ళా, 2.182

మన్నెవాఁడు వి (మన్నెము + వాఁడు) రాజు, సామంత రాజు.

సీ తెలగాణభూములఁ గల మన్నెవారిచే బలవం తమునను గప్పములు గొనియె .
వి. పు 1 41,

ఆ. పదరి కృష్ణ దాటిపదపడ మనివచ్చి, యెక్క మన్నెవాని కోర్వ లేక, తిరిగినట్టు లయ్యెఁ దెలి యంగ రాయల, యెదుటఁ బడినరిపులు బ్రదు కఁ గలరె ...
కృష్ణ 3 44

గీ మనవినవుల కేతెంచి మన్నెవారు, వేఱయొప్పు డౌనౌనో యని వేఁడుచుండ .
సారంగ 1 62.

మన్మథ నం వి అ పుం అఱువది సంవత్సరములలో నొకటి.

మన్మథబాణాలు నం వి. అ. పుం బ ధాన్యవిశే షము, ఒకదినుసు వడ్లు

సీ మన్మథబాణాలు మరువంపు మొలకలు సన్న మణింగెలు జున్నుఁబ్రాలు ...
హంస 4. 128

మన్మథము నం. వి అ పుం. 1. కామచింత (శే ని ) 2 కపిత్థము, వెలఁగ (వృ. వి.)

మన్మథయుద్ధము నం వి అ న రతి, సురతము

మన్మథలేఖము నం వి అ పుం వలపుకమ్మ, నాయికానాయకులు పరస్పరము వ్రాసికొనెడి యుత్తరము

మన్మథానందము నం వి అ పుం 1 ఒక దినుసు మామిడి (వృ వి ). 2. సురతసౌఖ్యము

మన్మథాలయము నం వి అ పుం 1 మామిడిచెట్టు. 2 యోని భగము

మన్మథుఁడు నం వి అ పుం కామదేవుఁడు, మారుఁడు

మన్మనము 1. రహస్యమైన గుసగుసలు, రహస్య ముగా గుసగుసలాడుట 2. గద్గదధ్వని (త్రి ని ).

మన్య నం వి. ఆ స్త్రీ 1. మెడయెముక, కంఠము నకు వెనుకయెముక. 2. తెలివి, జ్ఞానము

మన్యుఁడు నం విశ (అ అ అ) (ఇది సమాసాంత మునందే యుండును ) 1 తన్ను గుఱించి యను కొనువాఁడు, పండితం మన్యుఁడు, తన్ను పండితుని గాఁ దలఁచి కొనువాఁడు (ఇట్లె ధన్యం మన్యుఁడు, మొ.) 2. అట్లు కనిపించెడివాఁడు.

మన్యుమంతుఁడు నం. విశ (త్ మత్ త్.) 1 కోపి, కోపము గలవాఁడు 2. విచారవంతుఁడు, దుఃఖి. 3 ప్రచండమైనవాఁడు, ఉగ్రుఁడు

మన్యువు నం వి ఉ పుం 1. కృప, దయ 2. కోప ము, క్రోధము 3. దైన్యము 4 దుఃఖము. 5. యజ్ఞము విశ (ఉ) మేధావి (కే. ని.).

మన్వంతరము నం వి అ న డెబ్బదియొక్క దివ్య యుగములకాలము

మపుష్టకము నం. — మకుష్టకము. వనముద్గ. అడవి పెసర (వృ వి.)

మప్పితము విశ. (√మప్పు) మితము, పరిమితము (శ. ర.)

(వ్యవ.) అతఁ డెల్లప్పుడును మప్పితముఁగా సొమ్ము వెచ్చించును.

మప్పు — మరపు న క్రి నేర్పు, అభ్యసింపఁజేయు (శ ర)

(వ్యవ) తండ్రి కొడుకునకు మ చిబుద్ధులు మస్పి నాఁడు.

ఇ మప్పితము.

మబ్బు వి (క మబ్బు త మప్పు) 1. మేఘము, మొయిలు.

చం పెళ పెళ మబ్బు బిట్టుఱుము ఖితి విదూర శిలాంకురచ్ఛటో, త్పులకిని యై .
అము. 4 101.

సీ మలతాల్పు మెయి ఛాయమబ్బులు గ్రమ్మక యొరకాఁక పెన్నెండ వదలఁ గలదె ..
నీలా 1. 103.

2. చీఁకటి, అంధకారము

కం అల్లదె కంచే పొనపొన, దెల్లనిగట్టఱుత మబ్బు దేఱెడుపొలమం, దెల్లెడఁ జూచిన ధరణీవల్లభ శ్రీరాము సేవ వాలు మెకంబుల్
మనుచ. 4. 16

కం. కట్టి తనమాఱు గా న, ద్దిట్ట గృహస్తంభ మునఁ బ్రతిష్ఠించి వరుల్, మిట్టాడనియా బెడిదపు నట్టక నడురేయి మబ్బునం జెలి చనియెన్.
వేం. పంచ. 1 259.

చం. దినమునిదాఘు మేఁగ జగతిన్ నిశనాఁగ ఘనాగమంబు దార్కొన సాంధ్య రాగపు మెఱుంగు మెఱుంగు గ మబ్బు మబ్బుగాఁ, దనరఁ దదంబు దాంతరగత స్ఫుటమౌక్తికముల్ గ్రహించి య, య్యనిమిషరాశి రాశి నిడిరా దివినాఁ దనరారెఁ దారకల్ ... ముకుంద 3 48.

3 మత్తు, మాంద్యము, మగత.

ద్వి అఱ్ఱుంభకర్ణుండు నమ్మందిరమునఁ, బెక్కువేలేడ్లను బెనుమబ్బు గవిసి, నిదుర వోవఁగ లంక నిచ్చలు పంక్తి, వదనుండు వెలువడి వసుధఁ గ్రమ్మరుచు ...
రం. రా. ఉ 29 పొ. 24 పంక్తి.

సీ మదిరాసనముగబ్బు మాటలతబ్బిబ్బు కొదమ గుబ్బలయుబ్బు నిదురమబ్బు ...
దశా. 9. 33.

గీ. .. మదసంజ్ఞ యుల్లసిల్లు, మబ్బు లాహిరి యనఁగను మాతృభూత . ఆం భా 2 303

4 అజ్ఞానము

మ అని ప్రార్థించి మనంబులోఁ దెలిసి యాహా తెల్వి లేదయ్యె మబ్బునకున్ లోనయినాఁడ .
చంద్రా. 4 26.

మబ్బుత్రోవరి – వాయువు

సీ మబ్బుత్రోవరికూన గొబ్బున వానిసింగాణి ముత్తునియలు గా నడంప.. అచ్చ రా సుం. 119

(మబ్బుమేసరి శ ర పా)
మబ్బురవు (రౌ)తు — మేఘవాహనుఁడు, ఇంద్రుఁడు

కం . తూరుపుదొర మబ్బురవుతు వేగంటి యనన్, సురనాథునిపేళ్లు చెల్లు...ఆం భా 1. 46

మబ్బు తత్తడిరౌతు — మేఘవాహనుఁడు, ఇంద్రుఁడు.

సీ తఱిపేరిమబ్బు తత్తడిరౌతు తామసావళి నొంప నెత్తినవజ్ర మనఁగ. చంద్రా. 5 54

మబ్బు నీరానుపిట్ట – వానకోయిల.

గీ వానకోయిల మబ్బునీరానుపిట్ట, యనఁగ, సాం ని తిర్య 82

మబ్బులపగదాయ – గాలి సాం. ని. దేవ 13

జ : మబ్బుకొను. మబ్బుచేయు, మబ్బుత్రోవ, మబ్బుపూ, మబ్బుపూనిసువు, మబ్బుపూపుట్టువు, మబ్బుపూవిడుపు, మబ్బురాయుంట, మబ్బుఱా, మబ్బువొడుచు.

మబ్బుకొను అ క్రి (√మబ్బు) మత్తిల్లు.

ఉ గబ్బిపిసాళివాలుఁ దెలికన్నుల తేటమిటారిచూపులన్, మబ్బుకొనంగఁ జేసి విటమానసముల్ దమివెల్లి ముంపుచున్. రాజ చ 1 48

వ.. మబ్బుకొనువయసుగుబ్బల నిబ్బరంబుగ నివుడు తివుటలన్ . పారి 2. 62

మబ్బుచేయు స. క్రి. (√మబ్బు) తగ్గించు, అఱు

(దీనము మొ.)

(వ్యవ) చాకలి కాగడా మబ్బుచేసినాడు.

**మబ్బుత్రోవ** వి (√మబ్బు) ఆకాశము

అ చదలు నింగి యాకసము మబ్బుత్రోవ,యు స్స్రాము అన నభం బై తగు. ఆం భా 1.69

**మబ్బుపూ(వు)** వి (√మబ్బు) నీరు, జలము (చూ మబ్బుపూపుట్టువు)

మబ్బుపూవుల వెల్లి — సముద్రము సాం ని దేవ 17

**మబ్బుపూనిసువు** (మబ్బుపూవు+నిసువు) అగ్ని.

కం . మబ్బుపూనిసు వనగాఁ, దగు నగ్నిదేవ తాఖ్యలు . ఆం భా 1 47

**మబ్బుపూపుట్టువు** వి. (√మబ్బుపూ) తామరపూవు.

సీ మబ్బుపూపుట్టువుమాళిగలోనుండు గుబ్బెత చెదఁ జేర్చి యుబ్బజేజె ప్రబంధ 158.

**మబ్బుపూవిడువు** (√మబ్బు) జలముచము, మేఘము

వ మబ్బుపూవిడువు నిద్దాకప్పు కప్పు నెమ్మేని వాఁడ . . ప్రబంధ. 216.

**మబ్బురాయుంట** వి మబ్బు+రాయి + ఉంట) మత్తువస్తువులుకలిపి చేసినమందు

వ. . మచ్చువగలుచేయు మబ్బురాయుంటల మేపులును ప్రబంధ 78.

సీ లాహిరివస్తువు ల్కలయఁ జేర్చినమందు మబ్బు రాయుంటన మనుచునుండు . . ఆం. భా 2. 304.

**మబ్బుఱా** వి (√మబ్బు) వడగల్లు, వర్షోపలము.

సీ గుడుగువాల్ మబ్బుఱాపిడుగు వానకుగట్టు గొడుగు వాటము దాల్చువడుగువాఁడు. ప్రబంధ. 217. (3)

**మబ్బువొడుచు** స క్రి (√మబ్బు) మగతఁ గొలుపు. చేష్టారహితముగఁజేయు. చంపు.

సీ మదమబ్బుబలుగబ్బ మయిబెబ్బులిని మబ్బువడి గొబ్బునను మబ్బువొడిచె నొకఁడు. రా వి. 3. 64.

**మభ్యపెట్టు** స క్రి మోసముచేయు, ఉపాయముగా దాఁటువేయు (శ. ర )

**మమకారము** సం వి అ పుం నాది యను నభిమానము

**మమత** సం వి అ స్త్రీ 1. తనదియనుకొనుట, నాది యనుకొనుట 2 గర్వము, స్వాభిమానము. శ అహంకారము

**మమత్వము** సం వి అ న. — మమత

**మమాపతాలము** సం వి. అ పుం. విషయము, ఇంద్రియార్థము.

**మమ్మ (మ్మా)** అవ్య ప్రశంసార్థకము

మ .ఆం. పురె యాలాపము స్థాయి యారగమకంబుల్ మమ్మ గీతంబుల ద్దిర సమీర. 6 201

ద్వి మమ్మ నీ కెనయైనమగువ లే దెందు, మమ్మర నేయక మక్కువఁ జూడు . ద్వి తి సా 23 పా 6 సం.

శా ఓహోచమ, త్కారం బద్ది జాతి వార్తలు పురే ధారానమారూఢి మ, మ్మా రారాజదలం క్రియల్ కవులలో మాన్య ప్రపీ పన్నిటన్.. ప్రబంధ 39

సీ భళిర నితంబబింబంబు సౌందర్యంబు మమ్మా కృశావలగ్నమ్మ చెలువు . శ్రీరంగ. 4 962.

**మమ్మటుఁడు** సం వి అ పుం కావ్యప్రకాశిక యను గ్రంథమును రచించిన యొక యాలంకారికుఁడు.

**మమ్మరే — మమ్మారె** అవ్య ప్రశంసార్థకము

గీ అలయశోదాకిశోరకం బా సుభద్ర, కలికి సైదోడు నాపాలఁ గలిగె నేఁడు, మమ్మరే యని పులకించి ముందయాన, తుందిలానంద కందళీ కంద మయ్యె రా. వి 1 82.

**మమ్మాయి** వి. ఒకవిధమగు లేహము (శ. ర ).

**మమ్మారె (రే)** — మమ్మరే అవ్య. ప్రశంసార్థకము.

శా. మాయాసింహము కై వడిం గడువడి న్మమ్మారె చించెన్ నిజ, ఛాయాగ్రాహిణియైన సింహికఁ జకాసన్మూర్తి నత్యుగ్రుఁడై . చం. రా. 7.14.

ద్వి. ఉల్లాఘముగఁ బట్టి యూరుల నొక్కి,
మల్లు డు మెచ్చి మమ్మారె యటంచు.
అ మ క 2. 151 పా 18 వం

**మమ్ము** వి. సముద్రముమీఁద ఓడలకు విఘాతముగా వీచెడు సుడిగాలి విశేషము (శ ర.).

**మయకము** సం వి. అ పుం తృణకుటీరము, గడ్డి యిల్లు (విశ్వమ్సు.).

**మయము** ప్ర. వికారప్రాచుర్యాద్యర్థముల యందు సంస్కృతపదములపై వచ్చు తద్ధిత ప్రత్యయము
1 వికారార్థకము
ఉదా కనకమయము.)
2 రూపము, తదాత్మకము అను నర్థమును దెలుపును.
(ఉదా కాష్ఠమయము )
3 బాహుళ్యార్థకము.
(ఉదా. తేజోమయము, జలమయము మొ )
(కొందఱు మహాకవులు తెలుఁగుశబ్దములపై సయితము ప్రాచుర్యార్థమున ఈ ప్రత్యయమును వాడిరి.)

ఆ కేలిసలిపెఁజకోరచ, యంబు సదలు దమము యంబుగాఁగ నిర్వ. 6 48.

గీ పడినదివిజకాయంబులఁ బ్రథనభూమి, మెదడు ప్రోవులమయమయ్యె మిక్కుటముగ హరి. ఉ 10. 55.

ఉ . పెల్లై నిఖిలంబునుం దనమయంబుగ సంతమసంబు వచ్చినన్ .. దశకు 5 71., హరి ఉ. 6 165.

వి అ పుం 1 ఉష్ట్రము, ఒంటె. 2. వేసడము కంచరగాడిద 3. హింసనము. 4. ప్రక్షేపణము (కే ని.)

**మయము** వి మధ్యము, నడిమిభాగము.
(వ్యవ.) ఆ చెఱువుమయమున స్తంభము కలదు.

**మయుష్టకము** సం. వి అ పుం. వనముద్గము, అడవి పెసర (వృ వి.) (వై. ని.).

**మయష్టము** సం వి -మయుష్టకము (రా. ని ).

**మయి**[1]-**మెయి**[1].
1 శరీరము
గీ మేను నెమ్మేను మై మయి మే మెయి యొడలన శరీరంబు దగు ఆం భా 2 124.
కం పపుణ్యంబులు చేసితి మాపదముల కెంగినంత మయితో నేఁగన్. బ్రాపించు నొక్కొ స్వర్గము, పాపాత్ము నృపాల వెట్టిపోకలివేలా .. ఉ హరిశ్చ. 4 152.
మ వడగాలి న్మయి గందఁ బ్రుక్కఁబడు రేవన్ సాలమూలంబులన్, ముడుఁగంబాఱినసీడలన్ ధరణి సంభూతోష్మచేతన్ బడిన్, బడిఁ గన్పట్టిన యగ్గిబొబ్బలగతిన్ భాసిల్లి పొంగ యొండ ల్పొలుపారె చంద్రా 2 30
2 మార్గము.
కం. నీతివ యిఁ దనకు భూమిజ, నాతత పరివారభర నిరాతంకాత్ము-, డై తిరుగ విడువకాజికిఁ, గౌతూహలి యగు విపతుగర్వము విని యెన్... రాఘవ. 4. 82.
జ మయికోను, మయికోలు, మయిచాయ, మయిజాఱు, మయిజాఱుచీర, మయితాలుపు, మయితెంచు, మయిపూఁత, మయిమఱచు, మయిమఱపు, మయిమఱువు, మయివడి.

**మయి**[2]-**మై**[2]

**మయికము**-**మైకము** వి మదము, మత్తు (చి ని.)

**మయికొను**-**మైకొను** స క్రి సమ్మతించు. (చూ. మయికోలు )

**మయికోలు**-**మైకోలు** వి. సమ్మతి (శ ర ).

**మయిచాయ**-**మైచాయ** వి. (మయి[1] + చాయ) దేహకాంతి

**మయిజాఱు**-**మైజాఱు** వి. (√మయి[1]) కొంత యొడ మెడముగా నడ్డకమ్ములు వాటించిన స్త్రీల చీంకొంగు (శ. ర.).

**మయిజాఱుచీర**-**మైజాఱుచీర** వి (మయిజాఱు + చీర) మయిజాఱుగలచీర

**మయితాలుపు**-**మైతాలుపు** వి (√మయి[1]) ప్రాణి.

శరీరి, జంతువు (శ ర.).

**మయితెంచే-మైతెంచే** న క్రి సమ్మతి చు.

**మయిద¹-మైద¹** వి. (సం మాంద్యమ్) మత్తత, మైకము (శ ర.).

**మయిద²-మైద²** వి గోరంట (వ్య. వి శ. ర.)

**మయిదు-మైదు**

వి మాయ.

సీ మయిదులకుప్ప నేమములు నిల్వగ నీక యిరునాల్గుమేనుల పెరువ యొడలు. . శివలీలా

జ. మయిదుపడు

**మయిదుపడు-మైదుపడు** అ క్రి. (భ్రమపడు.)

**మయినము-మైనము** వి సిక్థకము, తేనెపట్టులోని తేనె తీసివేయఁగా మిగులు మెత్తని పదార్థము

ఉ (శ్రీ)పతిమీఁదిగీతముల ప్రేమ విపంచిక నట్టుఁ బాఁడిసం, తాపము సోఁకి మెట్ల మయినంబు గరంగిన. ఆము. 5 152

**మయిపూఁత-మైపూఁత** వి (మయి¹+పూఁత) అంగరాగము, మేనికిఁ బూసికొను చందనాదిద్రవ్యము, కలపము

చం. కర మనురక్తి భూవిభుఁడు కంజదళాయత చారునేత్రపైఁ, బోరిఁబోరిఁ జల్లునీట మయిపూఁత గరంగిన ... విక్ర. 5. 55.

**మయిమయి-మైమై**

**మయిమఱచే-మైమఱచే** అ క్రి (మయి¹+మఱచు) పారవశ్యము నందు, ఒడలెఱుఁగకుండు.

**మయిమఱపు-మైమఱపు** వి. (మయి¹+మఱపు) ఒడలెఱుఁగమి, పారవశ్యము.

**మయిముఱువు-మైముఱువు** వి (మయి¹+ముఱువు) కవచము.

**మయిల-మైల** వి (సం మలినమ్) ధూళి

ద్వి మయిల వచ్చది యొ దురాత్మసదోషంబొ, అయిరయొ వెండియు నతిదోషంబొ ..బస. పు. 5. 790 పం

జ. మయిలపడు.

**మయిలక్రోలు-మైలక్రోలు** వి. ముశి. (బ మయిలక్రోళ్లు)

గి మధురగానవినాదముల్ మయిలక్రోళ్లు, వెలయఁ బూరించు నాదముల్ గలయఁ బడఁగ దిమాగధజనసూత బృంద వివిధ, ఘోషణంబులు నిరుగెలంకులఁ జెలఁగ .. భా. రా బాల. 627

**మయిలపడు-మైలపడు** అ. క్రి మలినమగు, ధూళి కలదియగు.

**మయిలారి-మైలారి** వి. ఒకానొక క్షుద్ర దేవతను పూజించువాఁడు

**మయిలారు-మైలారు** వి ఒకానొక క్షుద్ర దేవత.

**మయిలుతుత్తము-మైలుతుత్తము**

**మయివడి-మైవడి**

**మయిసరి-మైసరి** వి నాట్యభేదము

**మయుఁడు** సం. వి అ పుం. అసురశిల్పి (ఇతఁడు ధర్మరాజునకు సభ నిర్మించి యిచ్చెను).

**మయువు** సం వి ఉ పుం. 1. కిన్నరుఁడు. దేవతాగాయకుఁడు 2 దుప్పి, జింక 3 ప్రక్షేపము (శే ని).

**మయూకము** సం. వి. అ. పుం. నెమిలి, మయూరము (వై ని)

**మయూఖము** సం. వి. అ. పుం. 1 కిరణము 2 అందము 3. మంట, జ్వాలము. 4. కీల, చీల, 5 కాంతి, వెలుఁగు

**మయూరకము** సం. వి. అ. పుం. 1. నెమిలి 2. నెమిలి జుటు (వ్య వి). 3 ఉత్తరేను (వ్య వి) న మయిలుతుత్తము

**మయూరకేతువు** సం వి ఉ పుం. కార్తికేయుఁడు, కుమారస్వామి.

**మయూరగ్రీవకము** సం వి. అ పుం. మయిలుతుత్తము (రా ని.).

**మయూరచూడ** సం. వి ఆ. స్త్రీ. మయూరశిఖ, తుపభేదము (వ్య వి).

**మయూరతుత్థము** సం వి అ న. మయిలుతుత్తము (రా ని).

**మయూరము** సం. వి. అ. పుం. 1 నెమిలి 2. నెమిలి జుట్టు (వృ వి.). 3. కాలపరిమితిని తెలిసికొనుట కుపయోగించు సాధన విశేషము (విల్యమ్సు) 4. ఉత్తరేను (వృ. వి.) 5 ఓమము 6. మైల తుత్తము. 7. కోడి (వై ని.). 8 ఒకజాతి చర్మాసనము. 9. తులసీభేదము (వృ వి.)

**మయూరవిదళ** సం వి అ స్త్రీ నల్ల తెగడ (వృ వి) (శ. ర.).

**మయూరవ్యంసకము** సం. వి అ పుం ధూర్త మయూరము, పెంకి నెమిలి (కౌముది)

**మయూరారి** సం వి అ పుం ఊసరవెల్లి

**మయూరి** సం వి ఈ స్త్రీ ఆఁడునెమిలి

**మయ్యెర** వి. (సం. శ్మశ్రు) ముఖరోమము, మీఁసపు వెంట్రుక, రోమము, వెంట్రుక

ఉ. తియ్యనివింటిజోదు రతిదేవిచనుంగవ నొత్తిగిల్లియొ, య్యెయ్యన వంక చక్కఁబడ నొత్తెడుఁ జూచితె పుష్పబాణముల్, మయ్యెరవ్రాసెఁ జిత్తరువు మాఁగిలి మాఁగిలి చిత్రకారుఁ డా, దయ్యము గాక నీలిపసదానము టిట్టిభ వీని కేఁ దగున్... క్రీడా. 192
(చిత్తరువు కడుసున్నితముగా నున్న దనుట.)

**మర** వి. 1. తిరుగుడుచీల.
2. కీలు.
(చూ మరగాలు మొ.)
3 తిరుగుడు నొక్కు (శ. ర.).
జ. మరకాఁడు, మరకాలు, మరగొమ్మ, మరచుట్టు, మరమేకు, మరసాన.

**మరందకము** సం. వి. అ. పుం. మరందము

**మరందము** సం వి. అ పుం. పుష్పరసము, పూఁదేనె

**మరకటము** వి (సం మర్కటః) మర్కటము, కోఁతి.

గీ. కలికి నినువంటితెలిగంటిఁ గరుణ లేక, మరకటపు గూట మేలీల దొరయఁ జేసెఁ, దగిన మగువకుఁ దగ వైనమగని గూర్ప, కజుఁడు దవనేర్పు నడి నేల నడరఁ జేసె. సమీర 2 6.

**మరకతపత్త్రి** సం. వి ఈ స్త్రీ. పాఁచి, ఒకానొక ఓషధి (వృ వి.)

**మరకతము** సం. వి. అ న. పచ్చ, నవరత్నములలో నొకటి.

**మరకము** సం. వి అ. పుం. మారి. అంటు రోగము

**మరకాఁడు** వి. (√మర) కర్ణధారుఁడు, ఓడ చుక్కాని పట్టువాఁడు.

సీ మైరావణుం డను మరకాఁడు చనుదెంచి యొఱపైన మాయలయోడ నెక్కి..
మై. 2 51.

2 మందరము

సీ సురరాజునకుఁ బాండుకరిఁ జేర్చుమరకాఁడు..
మనుచ 5 47

**మరకా(గా)లు** వి. (√మర) కృత్రిమ పాదము

సీ. శౌరిగేహమునకుఁ జనఁగఁ జాలనికాలు కాలుగా దది మరకాలు గాని
ఘటికా. 1. 144

ద్వి. మరగాల నడచుచు మట్టగాలగుచు, నొరుగాళ నడచుచు ధర గంతుగొనుచు.
పండితా. పర్వ. 372 పొ.

ఆ అలు మగనిమాట కడ్డంబు వచ్చినా, యాలుగా దది మరగాలు గాని, యట్టి యాలు విడిచి యడవి నుండుట మేలు... వేమన. 2. 15

**మర(రి)గించు** స. క్రి. (√మరగు) 1. మరగఁ జేయు, మప్పు, అలవఱచు, పరిచితము గావించు

కం. సురలు గొనిరి కాంచనవి, స్ఫురదజపాత్రమున బలరిపుని వత్సముగా, మరగించి సవిత దోగ్ధగ, నరు దగు తేజంబు దుగ్ధమై సిద్ధింపన్...
హరి పూ. 1. 134

గీ. వీటఁ గలకోడెకాండ్రెల్ల వింతరతులఁ, జవుల మరిగించి భయము లజ్జయును దీర్చి,
శుక. 2 101.

రగడ. మనమునకును మీచినమ్మయరూపము, మరగింపక యణిమాదులు డాయవు...
కాశ. 2. 152.

గీ. యోగి యొయ్యెయ్య మరిగించియుం
వలయుఁ గుళిగోళంబులో గాలి కుంజకమున,
బలిమి నిలిపిన రోమకూపముల వెడలి, యది
ప్రకల్పించుఁ గుష్ఠాదు లయిన రుజల .
కాశీ. 5 225.

2. ఆసఁగొలుపు, అభిలషింపఁజేయు

ద్వి మదగంధములఁ జెక్కు మరగించుకరులు
వదలక చరియించువనవీధు లొప్ప
రం రా ఉ. 42 పా 4 పం

వ అంత మాతల్లి జాణ లగు విప్రపుత్రుల వైశ్య
కుమారులం దోడ్కొని తెచ్చి నన్ను మరగించి
వలపుఁ బొరయకుండ నల్లనఁ బడయం బురి
కొలిపె. జాహ్నవీ. 4 35

గీ. పలలమును జూపి డేగను బట్టురీతి, నమృత
సమనాదబిందుకళానుభూతి సుఖము నొందించి
మరగించి చొక్కఁజేసి, యింద్రియమనంబు లవి
నిగ్రహింప వచ్చు సీతారా. 1 116.

3 అనువర్తింపఁజేయు.

ద్వి చెనఁటి యై నిన్నింత చేసినగాధి, తనయుని
మత్కోపదావాగ్నిశిఖల, నురనుర నెరియించి
సుక్కించి నిన్ను, మరగించి నీపంపుమానిసిఁ
జేసి.. ద్వి హరిశ్చ. పూ 1884 పం

మర(రు)గు అ. క్రి 1. పరిచితమగు, మచ్చిక పడు
కం మరగినసింహము మృగములఁ, బొరిగొనుచును
నరులఁ గాచుపోలిక నంతః, పరిచిత పవనుఁడు
నఘములఁ, బొరిగొనుచును నరులదేహములు
రక్షించున్ ... మార్క 8 319.

చం. మరగిన కామధేనువులమందలు సిద్ధరస ప్రవా
హముల్, దొరకిన కల్పవృక్షముల తోఁటలు
ప్రబోధ 1 15

2. ఆసఁగొను, ఆసక్తమగు.

గీ మరగి నీమూర్తిపైఁ గన్ను మనముఁ దగిలి
భార. విరా. 2 202

సీ. మగ లాఁడువారికి మరిగి ప్రముచ్చిలి బంది వట్టి
కన్నంబులు వెట్టి తెరువు. ద్రెక్కొని.

కు. సం. 7. 267

గీ ఏను భక్తితో మనసున నెంతయేని, మరిగి వెద
కంగఁ దోఁచినమాడ్కి రూపు, వెలపలను
దోఁచె నీతనివెనుక నింకఁ, దగిలి విడువక బంట
నై నెగడువాఁడ .. హరి ఉ 5. 220.

చం. ... అంతకు నెక్కుడైనచో, మరిగి వసించుఁ
గాని మఱి మానుషభావముఁ బొందఁ డెన్నఁ
డున్ .. వి. పు 6 137.

3. అలవాటుపడు

కం నెచ్చెలులతోడ నెంతయు, మచ్చికఁ దనయిచ్చ
నాడ మరగినయది యై, విచ్చలవిడి నింతకు
ము, న్నిచ్చేడియ మెలఁగు శిశు యెఱుఁగదు
సుమ్మీ ... భార విరా 1. 250.

కం. మానిని కరపాశంబుల, చే నీగతిఁ గట్టి వైచి
జిగిదొలఁకెడు పూఁ, బానుపునఁ బెట్ట వలదా,
మానధనం బపహరింప మరగినదొంగన్ ...
విక్ర. 8. 108.

గీ. వ్రజనివాసుల నెల్లను వరుసతోడ, వీడుకొని
తన్ను వందఱు వేడ్క ననుప, మధుర కేతెంచె
వ్రజములో మరిగి తాల్చి, యున్న వేషంబ
యెంతయు నొప్పు నొసఁగ.
హరి. ఉ. 2. 93.

4 వశపడు, స్వాధీనమగు.

కం దేవర గౌరవమహిమన, మావలసినకవిత మరిగి
మాకు నధీశా ... కళా. 6. 171.

ద్వి, మరగినగతిఁ జేరి మలయు నంతంత ...
ద్వి హరిశ్చ పూ 704 పం

స క్రి 1. మోహించు, వలచు.

చం .. అన్యునిన్, మరగినకాంత కాంతులకు
మానుగఁ బళ్ళిమగణ్యయేకదా ...
భా. రా యు. 2685.

కం. గురుపత్నిఁ జంద్రుఁ డమ్ముని, వరపత్నిఁ ద్రివిష్ట
పైకవల్లభుఁడు పరా, శరుఁ డోడ రేవుపడఁ
తినిఁ మరుగుటఁ గనువేఁదు ఇతర మర్త్యుల
వశమే ... భోజరా. 4. 230.

2. అలవాటు చేసికొను, నేర్చుకొను, అభ్యసించు

కం. అనఘా పీవాక్యంబుల, మనంబు తెలివొందె
శాంతి మఱగెడి నింకన్ .
భార శాం 5. 254

గీ. కోరి రాజన్యలోకంబు గొల్చురాజ, మౌళిమణి
నేఁడు ముని సేవ మరగినాఁడు .
భా రా అయో 256

సీ. ... క్రౌర్యంబునఁ బుడమిజనులఁ, బీడించి
ధర్మంబుఁ బెడవాయఁగాఁ ద్రోచి వేద విరుద్ధ
దుఃప్రవృత్తి మఱగి .. హరి పూ. 1 98

గీ కన్యలావణ్యరసనుధాగానమున, విభు వినయ
నము లస్వప్నవృత్తిఁ జెంద, మనసు తదురోజ
హేమాద్రి మనికి మఱగి, మహిత సుఱతాను
భూతికై మఱయుచుండు .
వసు 3 96

3 గ్రహించు.

(కం.) చవిగొను, రుచిచూచు.

సీ. వారణాసీ పురావాససౌఖ్యంబున మఱగి
వాక్పతి మమ్ము మరచెనొక్కొ ...
కాశీ. 6. 55.

గీ తిరుగు హరిపురి సురతరుసురల మరఁగి .
యవన స్ఫుతన . అము 1 41.

(చ ) అనుభవించు.

సీ. అతనికి నతఁడిట్టు లను మాంసము చవి మఱ
గినవానికి మానవశమె ...
భాఁ. అను 4 204.

ద్వి పరమసౌఖ్యంబైన భామలపొందు, మరుగని
వానిజన్మంబు జన్మంబె ..
ద్వి పరమ. 2 62 పా.

కం. మధురసగుంభనములు గల, మధుర పదార్థముల
చవుల మఱగి రసన త, న్మధురిమ సారెకుఁ
బొగడఁగ, వధిపతి సుఖలీల నలరె. నళనము
వేళన్. ఉ. రా. 6. 128.

4. ఆశించు, అపేక్షించు

కం. కేవలతాయకరంబును; భావలతావాటి మలయ
పవనాగము మౌ, కేవలతాలీలావతి, కేవల తా
కాళి మఱగు కృతమతి మనసా
భీమ 4. 8

రగడ. మెఱమెఱనికొలనిదరి మీ లంచు లకు ముకు
లు, మరగె నీకనుదోయి వూయింపు చక
చకలు.
మనుచ. 2 84 , నైష 7 172

5 ఆశ్రయించు

గీ ద్వారకాపురి మరగి యెంతయును గాల,
మిట్టు లుండఁగ నొకతఱి నెసఁగు పేర్మి, నచ్యు
తుఁడు దీక్షితుఁడయ్యె నధ్వరార్థ, మనుష
మద్విజముఖ్యసాహాయ్య మమర.
హరి ఉ 5 51

గీ జీవతతి రచియించునీచిత్త మిపుడు, మత్పదాంబు
జయుగంబు మరగి యున్న, కతన రాజసగు
ణమునఁ గలుగ దఘము . .
భాగ 3. 320

౬. మఱగించు, మఱపు.

మరగొమ్ము వి. (√మఱ) గుఱ్ఱముమీఁదిజీనునకు ముందు వెనుకలయందు అనుకొనుటకై యెత్తుగా నేర్పఱిచిన భాగము.

గీ పఱలు నేనికదిండి వార్వమ్ముఁ దొలుతఁ. గాఁ
గఁ దా నెక్కి నన్ను దాఁకకయ దీని, కటిపి
భాగఁబు నెక్కి రాఁగలవెయబల, వెనుకమఱ
గొమ్ము నూఁతగాఁ గొనుచు ననియె
కళా. 3. 63., 3 81..

మరచేట్టు వి (√మఱ) తిరుగుడుచీల, మఱచీల.

చం కుదిసిన క్రిందిపుప్పొడులఁ గొంచు వగంబుల
మీఁదికై పిశం, గరుచులఁ గొన్ని పెల్లెగసె
గాడ్పులసుళ్ పతి మాధవుండు రా, నెఱపుగఁ
బూవుసొమ్మిడి వనేందిర భూమికి వెండి మెట్ట
దా, మరపఱంబు తాఁ గొన భ్రమద్గతు
తామఱచుట్టలో యనన్ ...
అము. 5. 124.

(శ. ర. పా 'ములుచుట్టు' ముద్రి, వ్రాఁత

ప్రతిహా )

**మరణము** సం. వి. అ. న. 1. చావు, ప్రాణోత్క్రమణము. 2 వత్సనాభము ఒకజాతి విషము

**మరణాలసము** సం. వి. అ. న. (యోగ) ఒకానొక ఆసనము

శ్లో పహిత్రకస్య స్వంయుజ్య జంఘాయుగ్మ ప్రసారంగాత్, ఏష పాదప్రసారో ఽపి స్యా ద్యథో మరణాలసమ్ (వై. ని.)

**మరణించు** సం. అ. క్రి. చచ్చు, మృతినొందు (శ. ర.)

**మరతకము** సం.—మరకతము (శ. ర.)

**మరతము** సం. వి. అ. పుం. 1 చావు, మృత్యువు (వాచ) 2 అగ్ని 3 జంతువు (కే. ని.)

**మర(రు)పు** స. క్రి. (√మఱగు) 1 మరంగఁజేయు, మఱపు, అలవఱుచు

కం విమలాత్మ యహింసయు దా, నము సత్యముఁ గ్రోధవర్జనంబును పిను ము, త్తమ ధర్మరాశి యిది ధ, ర్మమునవారమసీమ దీని మరుపుము మదికిన్ భార. అను 5. 421.

కం . కూఁతుఁ బడపు మరపంగ వలయున్ దశకు 5. 16.

గీ దండి లోభాదిగుణములఁ దరపినాఁడు, మంచి గుణములు తనయందు మరపినాఁడు భాగ 6 89

ద్వి తెరలఁ దియ్యనిపండ్లతీపులు మరపి, చరణ సేవలు సేపి చ లు మెఱసి.. ద్వి. పారిశ్చ. ఉ. 615 పం.

2 ఆసఁగొలుపు, అభిలషింపఁజేయు.

కం సిరిఁ జూపి నన్ను లోఁబడ, మరపెద నని చూచె దేల మనుజేశునిపైఁ, దిర మగు నామది వాయదు భా. రా. సుం 194

ద్వి హృదయంబు గరుగంగ నిరుచన్నుఁగవలు, గదియించి బిగియారఁ గౌఁగిళ్ల మరపి రం. రా. బాల. 13 పా. 15 పం.

3. పళపఱుచు.

గీ. కాళి యెక్కు కరాళసింగంబు నైన మరపుకోఁ గల మొకయింత మందు పెట్టి, మాట లింక వేయు నేఁటికి మమ్ముఁ జూడు, మనుమఁ బంటంబులాడి కాంచడవిఁ జొచ్చి. పరా. 4 75.

గీ. తన కసాధ్య మైనతరుణి సాధించు, దొంకె నేనిఁ దన్నుఁ మరపికొనుట. కళాశాస్త్రము 1 9.

**మరమేకు** వి (√మర) తిరుగుడుచీల (శ. ర., బ్రౌ).

**మరల** అవ్య. (దు (√మఱలు) పునర్వ్యాసము,

కం. నరపతుల నెల్లభీష్ముని, కెరగా నొప్పి పఁ జాల నే నడవులకున్, మరలం బో యెద నచటం, దిరిగెదఁ గూరాకు గోసి తిని యెడ ననఘా. భార భీష్మ 2 8.

ఆ మరల నొక్కసాల మిరుగేలఁ బెటికియు, దీనఁ దెగితి వంచుఁ దిగిచి పైవ, నలిగి రేడుభల్లములఁ దుంచి వేవేగ, మంగకముల వేయు నంట సేసె . భా రా అ. 1 240.

సీ మరలఁ బుట్టెడుచందమామ యో యది గాదు మొలకనవ్వులముద్దుమోము గాని దశా 3. 444.

మ .. కేళివితతుల్ గప్పారె వృద్ధాలికిన్, మరలం బ్రాయము వచ్చెఁ దత్తరుచల న్మందానిలా సంగతిన్ . పారి 5 46.

గీ మగుడ క్రమ్మఱ క్రమ్మటి మరల సారె,... తిరుగ నా వెలయును బున, రర్థముగ... ఆం. భా 3.69.

**మరలఁబడు** అ. క్రి. (మరలన్+పడు, స్వార్థమున)

1. నివర్తిల్లు, వెనుకకు దిరుగు, విముఖుఁడగు

కం వననిధి పురంబు ముంపఁగ, మనుజేశ్వర యెల్ల జనులు మరలఁబడి కనుఁ, గొనిరి ... భార. మౌ 178.

ఆ జిహ్వ మరలఁ బడఁగఁ జిలుకఱ వగ్ని శ. పించె... భార. అను 147.

సీ. తనయ నొక్కని కిచ్చి మనను మరలఁబడిఁ

యన్యున కిచ్చిన యట్టివాఁడు. కృమియగు...
భార అను. 4. 268.

సీ దండపారుష్యంబు కొండెంబున నతర్క మరి
సంధి కెడ యీక మరలఁబడుట...
ఆము 4 252.

2 మాఱుపడు

సీ రాయంచవడపులరాయడిఁ దాల్మితామర
తూఁడు దుమురుగా మరలఁబడునో...
కాశ 2 10.

**మరలఁబాటు** వి (√మరలఁబడు) మరలఁబడుట, తిరుగఁబాటు (చూ. మరలఁబాటుతనము.)

**మరలఁబాటుతనము** వి (√మరలఁబాటు) ప్రతిఘటన

సీ సరకారుపట్టున దురహంకృతి వహించి మరలఁ
బాటుతనాన మసవినామొ... రంగా. 2. 171.

**మరలించు** స. క్రి. (√మరలు) మరలునట్లు చేయు, వెనుకకు రావించు

గీ. ధనువుఁ దెగ నేసి యొక్కపాతకుఁడు సుతునిఁ,
బట్టుకొని పోయెనఁట చేటుపాటు దెలియ,
రాక పొగిలెద నీవు శాత్రవు జయించి, యనుజు
మఱలించి నా దుఃఖ మార్పు మనిన....
జై భా. 1 182.

**మరలు** అ క్రి. 1. నివర్తిల్లు

(క) వెనుకకుఁబోవు, పోవు.

చం. పను లటు పోవఁగా మరలఁ బాడియె నీకు
నరేంద్రనందనా.. భార విరా. 4. 57.

చం విని మిము నాజిలోఁ దొడరి విక్రమ శౌండత
మావు టొక్కఁడున్, బనియుగ నేను వచ్చితిని
బద్ధనముద్యము లై కడంగుఁ డిం, క నిహత
శత్రుఁ డై మరలుఁ గాక జరాసుతుఁ దూర
కేఁగునే... హరి. ఉ. 1. 29.

(చ) తిరిగివచ్చు, తిరుగు.

కం సురపురి మధురకు వెక్కుడె, సురకాంతలు
మాకు దొరయె సురభంజన నీ, వరుగుట
యొప్పనిపని వే, మరలుము మామాట వినుము
మము గావఁదగున్ .. హరి. పూ 9 159.

గీ. ప్రాణబాంధవుఁ డై నయస్సృతి రాజు, నశ్రమార్గ
మునం దొయ్య ననుచరింప, నశ్రుధారాప్రవా
హంబ యవధి గాఁగ, దైన్య మందుచు మరతె
వైదర్భిచూడ్కి నైష. 2 100.

గీ దెంద మంతయుఁ గఱివేల్పునందుఁ దగిలి,
మరలఁగా నేర దిఁక .. నీలా. 2. 96.

వ. వేల్పులు పలాయనపరాయణు లై వెనుక మర
లియుం జూడక పోవం దొడంగిన...
హర 6. 65.

(ట.) వెనుకకుఁ దిరుగు.

గీ గిలుకు టందెలు ఘల్లనఁ గీరవాణి, మరలి సుర
పంక్తి కరుగుచోఁ బిరుదు చక్కఁ, దనము నెఱి
వేణి చెలువుఁ గన్గొని బలీంద్రుఁ, డాదికన్నను
మిగుల మోహంబుఁ గాంచె... దశా. 2 355.

సీ బాణాదిహేతిసంపాతజాతము లగుమంట
లర్కాంశు మరలఁ ద్రోవ ..
భార ద్రో 1 139 , ఆం భా 8. 114.

(త.) చల్లారు, శాంతి చు

చం వెరవులు దక్కు మీయబల వేగమ పెండిలి
సేయు మంతతో, మరలు మత్ప్రియ కోపశిఖ
మానదు వేటొకవేయుఁ జేసినన్
భార. ఉద్యో. 4. 307.

(ప.) విముఖమగు.

వ .. "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత"
యనుమాటలఁ దెలుపంబడు మత్తమధర్మంబు
నకు మరలి తమతమజన్మాంతరకృత కర్మంబు
లాధారంబులుగాఁ బర్ణకీటంబులం బోలెఁ
దనువులెత్తుదురు ... కుచేల. 1. 58.

2 తిరుగు, సుడివడు

గీ. అరసి పెదవులు దడుపుచు వరిగి యరిగి,
దొరఁగు నశ్రులు కన్నుఁ దామరల మరలఁ,
గుసుమబాణుని నగఁ జాలుకొమరు కొమరు,
విభుఁడు మదిలోనఁ బాయనివెతకు వెతకు
సారంగ 8. 282.

జ: మరల, మరలఁబడు మరలఁబాటు, మరలఁబాటుతనము, మరలించు, మరలుచు

**మరలుచే(ల్చు)** స క్రి (√మరలు.) 1 మరలఁజేయు, నివర్తింపఁజేయు

కం గురుఁ డెన్నిశరము లేసిన, వెరవున నన్నింటి నన్ని విశిఖంబులఁ దా, మరలిచి బ్రహ్మాస్త్రపరిస్ఫురణము సూపినఁ దదస్త్రమునన యడంచెన్ .. భార ద్రో. 4 113

2 విముఖము గావించు

కం అనవుడు నయ్యంగన యితఁ, డనంగశర దళిత హృదయుఁ డయ్యె నకట యీ, తనిచిత్తవృత్తి మరలుప, ననురూపం బగు నుపాయ మది యెయ్యదియో .. భార. విరా 2 41

కం శాపభయంబున నెఱయఁగ, నీపైకోరికి మరల్చి నిధిపతిసుతు నే, పాపపువేళను జూచితి, నో పరుసొబగేను మఱి కనుంగొన గుఱిగాన్ .... కళా. 4 21

చం అలుకఁ బ్రలంబదానవుని ప్రాణముఁ గొంటి కళిందనందనా, సలిల భరప్రవాహ రభసంబు మరల్చితి. పారి 3 66., నీలా 1. 43

**మరవ** వి ఒకజాతి మనుష్యుఁడు.

సీ. ఆంధ్రులు నావికు లాభీరకులుఁ గిరాతులుఁ బుల్కసులుఁ బుళిందులు నరవలు, మరవలు మొదలైనమనుజులు కర్మశేషముల జనించి దుష్కర్మములను. శేష. 3 87.

**మరవలి** వి మనుఁగుడుపు (శ. ర).

**మరపాన** వి. జాల్లపనివాని సాధనవిశేషము. (శ. ర.)

**మరాకాలి** సం వి ఈ స్త్రీ. తేలుమణి చెట్టు

**మరాటము** వి. వృక్షవిశేషము, లాంగలి, ఒకానొక చెట్టు (శ ర.)

**మరాటి** వి. (సం. మహారాష్ట్రః) మహారాష్ట్ర దేశస్థుఁడు. (శ. ర , బ్రౌ ).

**మరాటిమొగ్గ** వి. ఒకానొక యంగడిదినుసు. (శ. ర). వీర్యవృద్ధికర మగునొకయోషధి (బ్రౌ.).

**మరాయము** సం వి అ పుం 1 ఏకాహక్రతుభేదము. 2 మూత్రము. 3 కసూఁము (కే ని.)

**మరారము** సం వి. అ పుం ధాన్యపుకొట్టు. (విల్యమ్సు.).

**మరాలకము** సం వి అ పుం. హంస విశేషము, మగపెద్దబాతు

**మరాలము** సం విణ (అ ఆ అ.) 1 నున్నగా నున్నది 2 అల్పపీతరక్తము (కే ని , వి . అ. పుం. 1. హంస. 2 ఎఱ్ఱగన్నేరు (వ్యా. ని ) 3.గుఱ్ఱము. 4 మేఘము. 5 కాటుక, అంజనము 6. దాడింబవనము, దానిమతోఁట, 7 కొంచెము పసుపు ఎఱుపును గలిసిన రంగు (కే. ని ).

**మరి** వి 1 తడవ, పర్యాయము (ఇది యీ యర్థమున ఒక, ఒక్కొక్క ఈశబ్దములు పూర్వమందు కలిగియే ప్రయోగములఁ గనఁబడుచున్నది

ఉదా · ఒకమరి, ఒక్కొకమరి, ఈమరి మొ )

కం. ... జగద్ధితవా, క్యరులై రొక్కొడ వా రొక, మరి గోష్ఠినిరతినుండి మనుజాధీశా భాగ. అను. 2 38.

చం. ఒకమఱి బుద్ధగింప విలయోదకముల్ వయి కుబ్బి చిప్పవ్రచ్చుకొని మహాభ్రవీథిఁ జన ... ఆము. 4. 21.

సీ ఒక్కొక్కమరి నొప్పి నొందకున్న ... నైష. 3. 182.

(ఒక్కొక్క పరి వేదం పా.).

సీ. ఒకమరి గెల్పొందు మరుళీలఁ దనరుచుఁ గొమలతో నోమనగుంట లాడు ... ఇందు. 2. 143.

కం. ఆతనితో నొక్కొకమరి, కౌతూహల వృత్తిఁ దగందొడఁగి మ్మదు, ద్యూతంబునఁ గ్రీడింతుం, జేతోముద మొదవ నక్షశిల్పప్రౌఢిన్ ... భార. విరా. 1 71.

ద్వి. మఱిఁ దేర్చి యొక్కొక్కమరి బసవనికి, నుతభక్తిరసము కన్నుల కెక్క నొక్క.

పండితా దీక్షా 83 పా.

కం ఇమ్మెయి నలంగి యొకవ్వ, ఉమ్మున క్రీనీడ నిలిచి చను దెంచుట నా, కిమ్మరి దడయ వలసె నని .. భార అను 3. 258

ఉ ఈమరి యుక నొక్కమరి యింకొక మా టిక నొక్క మాటు నా, నోముల పంటగా యనుచు . క్రీడా 89.

2 వాక్యాలంకారము

క. కప్పకు నొరగా లైనను, సప్పమునకు రోగ మైన సతి తులు వైనన్, ముప్పున దరిద్రుఁ డై నను, దప్పెదు మరి దుఃఖమగుట తథ్యము సుమతీ ... సు, శ 27.

అవ్య యుగపదర్థకము ఏకకాలమున

కం. తమబంధులుఁ దారును నొ, క్క మరియు తెగ టాఱువారు కరుణారహిత, త్వమునఁ దొలు మేన .. భాఁ. అను 5 109.

చం. ఒకటి పరోపఘాతకర మొక్కటి పంకజ కాంతి తస్కరం, బొకమరి యేల కట్టువడకుండు మహీపతియాజ్ఞ గల్గినన్ ...

నైష 6. 89.

**మరించే** నం మరణించే. (శ. ర.).

**మరిగొమ్ము** వి చెఱువు లోనగువానిలోని నీరు బైటికిఁ బోపుటకై ఱాలతోఁ గట్టిన మార్గము (శ. ర. బ్రౌ)

**మరిచపత్త్రిము** నం వి. అ పుం. సరస వృక్షము. (రా ని)

**మరిచము** నం. వి అ. పుం మిరియపు పొద (వృ వి.) న మిరియము

**మరిడి** వి ఒకానొక దేవత .

**మరిడిమహాలక్ష్మి** వి ఒకదేవత (శ. ర).

**మరిడివ్యాధి** వి కలరాజాడ్యము, వాంతిభేది రోగము (శ ర)

**మరిమ** నం. వి. న్. పుం. చావు, మృత్యువు. (విశ్వము)

**మరియాద** వి. (సం. మర్యాదా.) మేర, హరమేద్దు, మర్యాద, కట్టుబాటు, న్యాయబుద్ధి

కం నరనాథుఁ గొలిచి యలవడఁ, దిరిగితి నాకేమి యనుచుఁ దేఁకువ లేమిన్, మరియాద దప్పి మెలఁగినఁ, బురుషార్థంబునకు హాని పుట్టక యున్నె .. భార విరా. 1 122.

ద్వి రావణుండైన గర్వము దక్కి వచ్చి, శర ణన్నఁ గాతు నేచందంబునైన, మరియాద లిట్టివి మాకులంబునకు ..

రం రా యు 201 పా 12 పం.

కం జడుఁ డైన రోగి యైనను, విడుచుట మరియాద గాదు విభు నంగనకున్

భాగ 10 పూ 979.

కం ఒతరుణి నేను నెత్తము, నీతో నాడునెడ రుక్మిణి గనుంగొను ని, న్నాతిమరియాద నీవుం, జూతు ... ఉ హరి. 3 110.

**మరిష్టకము** నం వి. అ పుం రాజముద్గము. (వృ వి) (వై. ని).

**మరిష్ణువు** నం విణ (ఉ.) చచ్చెడుస్వభావము కల వాఁడు, మర్త్యుఁ డైనవాఁడు.

**మరీచము** నం వి. అ పుం. 1 మిరియపు పొద, (వృ వి). 2. కక్కోలకము, చలువమిరియము (రా ని) న. మిరియము

**మరీచి** నం. వి ఇ పుం. స్త్రీ 1 కిరణము 2 వెలుఁగ, కాంతి. 3 మృగతృష్ణిక, ఎండమావులు (కే ని). ఇ పుం 1 ప్రజాపతి (ఇతఁడు మొదటి మనువుచేత సృజింపఁబడిన పదిమంది మూలపురుషులలో నొకఁడు.) 2. ఒక ధర్మశాస్త్ర కర్త పేరు. 3 లోభి, కృపణుఁడు 4 సప్తర్షులలో నొకఁడు, బ్రహ్మ మానస పుత్రులలో నొకఁడు న్ పుం. సూర్యుఁడు

**మరీచిక** నం. వి ఆ స్త్రీ 1. మృగతృష్ణ, ఎండమావులు. 2 ఎనిమిది త్రసరేణువులు. (వై. ని).

**మరీచిమాలి** నం. విణ (న్. నీ న్) కిరణముల మాలగలవాఁడు

వి న్ పుం సూర్యుఁడు

మరుండ నం. వి. ఆ స్త్రీ. ఎత్తైనలలాటము గల స్త్రీ (విల్యమ్సు.).

మరుంధనము నం వి అ పుం తెల్లచంద్ర (వృ వి)

మరుఁడు వి (సం. స్మరః) మన్మథుఁడు

మ. మరువాలారుశరంబులం దొరఁగు కమ్మం దేనెతోఁ గూడి . . నైష 2 99

గీ కవఱ లుంకించి వ్రేయఁ గొ ప్పవియ నవలి, కరమున నమర్పఁ బైఁటలో మరునిబటువు, బిల్లక్రియఁ బట్టు, గంచెల బిగువుఁ జన్ను, నిక్కఁ దిన్నెలఁ బాత్రాళి నెత్త మాడు ఆము 1 59

చం తొగచెలి తున్కలో మరునితూపులో నీలా. 1 10

మరు మేపుకన్దొర - మన్మథు నాహారముగాఁ గొన్న కన్ను గలప్రభువు

మత్తకోకిల. నీటిపుట్టుగుపట్టి యెన్నఁడు నెమ్మిఁ గానఁగలేనియ, మ్మేటివేలుపు రాయఁ డామరు మేపుకన్దొరమామ గా, నేటినీటుతపంబు చేసెనొ యీవడంకుమ లంచుఁ దా, మాటికిన్ గొని యాడుచుం జని మన్నుఁ జేఁ డట ముందటన్ .. యయా 2 41

జ మరుగొంగ, మరుతల్లి, మరుతేజి, మరుదేవేరి, మరునయ్య, మరునిల్లు, మరుపని, మరుపిచ్చి, మరుపోరు, మరుమామ, మరుమావు.

మరుకము నం. వి. అ పుం 1. నెమిలి. 2 లేడి, జింక (విల్యమ్సు.).

మరుగొంగ వి (√మరుఁడు) శివుఁడు

సీ. ... పెనునీటఁ దేలాడు పిన్నపావ, మరుగొంగ తలపుఁ దామరమీఁది యొఱఁదేటి కలిమి యొయ్యారి నోముల ఫలంబు .. ఉ. రా 1. 80

మరుజ నం. వి ఆ. స్త్రీ 1 మృగకర్కోటి, వెట్టి పుచ్చ (వృ.వి ),(వాచ.), 2 ఒకానొక మృగము

శ్లో. యథోక్తం మరుజా తూచ్చమృదుపాండరరోమికా, రోమరాజిమతీ మధ్యే ద్వాదశాంగుల సమిశ్రితా (కే. ని.)

మరుజము నం. వి. అ. పుం. పరిమళద్రవ్య విశేషము.

మరుతల్లి వి (మరుఁడు + తల్లి) మన్మథునితల్లి, లక్ష్మి.

సీ. పెనిమిటి యెదనుండు నవబోడి మరుతల్లి సెల చెలియలు

గీ యనఁగ లక్ష్మి సమాఖ్య తా . పాం ని. దేవ 5

మరుతేజి వి (మరుఁడు) చిలుక, మన్మథ వాహనము (శ ర)

మరుత్కరము నం వి అ పుం రాజమాషము, అల సందెలు

మరుత్కర్మ నం. వి న్ న. వాయురోగము, కడుపుబ్బు (విల్యమ్సు ).

మరుత్కోణము నం. వి. అ పుం. వాయవ్య దిక్కు, పశ్చిమోత్తర దిక్కుల మధ్య దిక్కు.

మరుత్తకము నం వి అ. పుం. మరువక వృక్షము.

మరుత్తనయుఁడు నం. వి అ. పుం. 1. హనుమంతుఁడు. 2. భీముఁడు.

ఇట్లే, మరుత్సుతుఁడు, మరుత్పుత్రుఁడు, మొ.

మరుత్తు నం. వి. త్. పుం. 1. వాయువు, గాలి. 2 పర్వత శిఖరము. 3 రూపము (కే. ని ) 4 దేవత, వేలుపు, దేవవిశేషము 5. మరువకము, మరువము, వృక్షవిశేషము. న. 1. గ్రంధిపర్ణమనువృక్షవిశేషము 2 పృక్క, శాకభేదము (వృ వి ). 3. బంగారు

మరుత్పటము నం వి అ పుం. తెరచాఁప. (విల్యమ్సు.)

మరుత్పతి నం. వి అ. పుం. ఇంద్రుఁడు, వేల్పుఱేఁడు

మరుత్పథము నం. వి. అ. పుం. వాయుమార్గము, ఆకాశము,

మరుత్పాలుఁడు నం. వి. అ పుం — మరుత్పతి

మరుత్ప్లవము నం. వి. అ. పుం. సింహము (త్రి ని )

మరుత్ఫలము నం. వి. అ. న. శిలావృష్టి. వడగండ్ల

వాన (విల్యమ్సు)

మరుత్వంతుఁడు సం. వి. త్. పుం. 1 ఇంద్రుఁడు 2. హనుమంతుఁడు 3. మేఘుఁడు.

మరుద్దాందోలము సం. వి. అ. పుం. వ్యసనవిశేషము ఒకమాదిరి విసనకఱ్ఱ

మరుద్విష్టము సం. వి. అ. న. గుగ్గులువు, గుగ్గిలము. (వాచ.).

మరుదేవేరి వి. (√మరుఁడు) రతిదేవి.

కం. కారుమెఱుంగు గన మరుదే, వేరియుఁ దా ననఁగఁ బైఁడిబిరిదం డన బం, గారపు బొ మ్మనఁగా సిం, గారంబున దేవయాని కడుఁ జెలు వొందెన్ ... యయా. 4 92

మరుద్భవ సం. వి. అ. స్త్రీ. తామ్రమూలీ తుపము (వృ. వి.)

మరుద్రథము సం. వి. అ. పుం. గుఱ్ఱము (త్రి. ని.)

మరుద్రుమము సం. వి. అ. పుం. విటఖదిరము ఒకానొక చంద్ర (వృ. వి.)

మరుద్వాహము సం. వి. అ. పుం. 1. ధూమము, పొగ (త్రి. ని.) 2. అగ్ని 3 చిత్రకము చిత్రమూలము (వృ. వి.)

మరుద్విపము సం. వి. అ. పుం. ఉష్ట్రము, ఒంటె (త్రి. ని.)

మరునయ్య వి. (మరుఁడు + అయ్య) విష్ణువు.

ఉ అక్కట తండ్రి యేల మరునయ్యకుఁ బెండ్లి యొనర్తు నంచుఁ బె, న్మక్కువ నుండుచో నీలా. 2. 72.

చం. అరుదుగ వేల్పుఱేఁడు మరునయ్యయు నల్వయుఁ గొల్వఁ జల్వడాల్, దొర రతనంపుటుప్పరిగలో వలిగుబ్బలి రాచకూఁతుఁ దా, నిరువుగఁ గూడి ముజ్జగము లేలెడు లేనెలదాల్పుఁ గొల్చెదన్ .. అచ్చ. రా. బాల. 1.

మరునిల్లు వి. ఔ. (√మరుఁడు.) ఆఁడుగుఱి, మదనగృహము

ఉ మంచెలమీఁద నెక్కి కటిమండలిఁ జుట్టినపాటుటాకు లించించుక చంచలించి మరునిల్లు బయల్పడఁ జేయఁ బిట్టలన్, జెంచెత లార్చి త్రేయుదురు చిత్రముగా నొడిసెల్ల ... కాళ 3 10.

గీ కూటి కియ్యని విటకానిపోటు మెండు, మాచకమ్మకు మరునింట నాచు మెండు వేణు. 17, రసిక. 1. 90

మరున్మాల సం. వి. ఆ. స్త్రీ. వృక్క, శాకభేదము. (వృ. వి.)

మరుపని వి. (మరుఁడు + పని) సురతము.

గీ మంటిమిద్దెలవారికి మరుపనులకు, నెలఁతఁ బాసినవారికి నిదుర చెడియె . . ఆము. 4. 123.

రగడ. పనసలపైఁ బూఁబనసల్ గనుగొను, పనుపడ్డవి మరుపనులకు నవి మును . యయా 4. 26

మరుపిచ్చి వి. (√మరుఁడు) మన్మథావేశము, కామోద్రేకము.

ఉ నిక్కము రెడ్డిబిడ్డ వని నిన్ మది నమ్మి గృహంబుఁ జేరి యీ, దిక్కున నున్న శూద్రనుదతిన్ మరుపిచ్చి రమించినాఁడ వి, త్తైక్కలిబంకు నాకుఁ గలదే యని ముందలఁ బట్టి యీడ్చి యీ, రక్కసిదన్నె .. వేం పంచ 4 510.

మరుపృష్ఠము సం. వి. అ. న. ఎడారి, నిర్జల ప్రదేశము.

మరుపోరు వి ఔ. (మరుఁడు + పోరు) సురతము.

గీ. చెలువ మరుపోరువెనుక సొమ్ములు నలర్చి, చెలు వమరురక్తి నెన్నఁడో కలిసి యుండు, టనుచుఁ దలపోయుచుండుఁ దా నాత్త చంద్రి, కాఖిలాపాను గుంఫితస్వాంతుఁ డగుచు ... చంద్రి. 4. 3.

మరుప్రియము సం. వి. అ. పుం ఉష్ట్రము, ఒంటె (విల్యమ్సు.).

మరుభూరుహము సం. వి. అ. పుం కరివీరము. (వృ. వి.).

మరుమామ వి (మరుఁడు + మామ) చంద్రుఁడు

సీ . . జాబిల్లి మరుమామ చందమామ

గీ. ... అమరుచుండుఁ, గుముదమిత్రుని నామ ధేయములు సాంబ సాం. ని. దేవ. 10

మరుమావు వి. (√మరుఁడు) చిలుక

రగడ. మావులు దగు మరు మావుల కిరవులు యయా 4 25

మరులము నం వి. అ పుం. 1 హంస విశేషము 2. ఉదకము (విఙ్యమ్సు) 3 వ్యాఘ్రాదిఘాతుకజంతువు (వై. ని.)

మరులు – మర్లు² వి. 1 మోహము, వలపు, ప్రేమ, అత్యధిక ప్రేమ.

కం. పరమపతివ్రత లై సుర, పురములు సాధింప నున్న పుణ్యస్త్రీ లె, వ్వరు గలరు చూపు చూతాం, కురళరహతిఁ దిరులు మరులు గొలి పెద వారిన్ . కు. సం 4. 398.

చం. . భువనత్రయ భీకర రాక్షసత్రయిన్, మరులున ముంప నంపెనో యనన్ దగు నజ్జవరాంగ్ర ముర్వురన్, బరిణయ మై యమర్త్యులక్రమం బున వారు సుఖంచి రెంతయున్ ఉ. రా. 1. 285

మ. మరు లెచ్చం గడు నొచ్చు నెచ్చెలియ నీమా పెల్లఁ బ్రోవన్. చంద్రా. 5. 111. (చంద్రమతి లోహితాస్యునిఁగూర్చి విలపించుట)

ద్వి. మది నీకు నామీఁద మరు లెందుఁ బోయె. ద్వి. హారిశ్చ. ఉ. 2006 పం

గీ తీరని ప్రేమ యైన, మరు లనఁగఁ జెల్లు అం. భా 1. 136

2. అజ్ఞానము.

సీ మఘవుండు నీకంటె మరు లయ్యె క్రతుతతి వర్తించి దేవేంద్రుఁ డై వెలింగె . కు. సం. 2. 164

కం. మరియుదు రెవ్వనిబిడ్డలు, మరు లింతియె కాక సుతులు మఱి యతిహితులే, పెరిమెను బుట్టిన పుత్రులు, పెరుగఁగ శత్రులునుత్రుతులు పెక్కులు వినవే . కుచేల. 1. 69.

3 (త మరుళ్) పిశాచము, దయ్యము.

గీ. నీవు నీపోవుదెసఁ బొమ్ము నీకు మాకు, మాట లేఁటికి ననుచు నమ్మరులుతేఁడు, నచటఁ బ్రేపు లా దర్భలు నాసనంబు, చేసి తనమాననంబునఁ జేర్చెఁ గృష్ణు . ఉ హరి. 2 141.

గీ అదియుఁ గా కిరుసంజల నాఁడుమరులు, గొర గఁ గలువుఁ గా కాతనిఁ గోరి తపము సేసె దఁట గౌరి నీ కెంత చెట్లపురలో. కు. సం. 7 869.

4. పిచ్చి, ఉన్మాదము

ఉ మరు లెత్తి తనూజుఁడు పాఱుచున్నవాఁ, డక్కట వానిఁ బట్టుకొనుఁ డన్న కృపాపరు లార మ్రొక్కెదన్ ... దశకు. 6. 159

ఉ. ఎక్కడినుండి వచ్చెనొకొ యీ ముదిజంగము వాని మాయలోఁ, జిక్కి తరాల నుండి యొక చీమకుఁ బోవఁగనీక డాచునా, చక్కని పిండి న న్నదిమి సర్వము జెట్టఁగఁ బంచె నింక నే, నెక్కరణిన్ వసింతు మరు లెత్తి వ్యయం బొనరించు వీనితోన్ .. చెన్న. 2. 51.

జ: మరులుఁ దీఁగ, మరులుకొను, మరులు కొలుపు, మరులుబడ, మరులుమాతంగి, మరులుమ్మెత, మరులుతేఁడు, మరులొ్కను, మరులొ్కలుపు.

మరులుఁదీఁగ వి. (మరులు + తీఁగ) త్రొక్కిన తోడనె అజ్ఞానము పుట్టించు నొకానొక యోషధి, భూతకేశము.

ఆ మరులుఁదీఁగ మెట్టి యిరు లన్న నో యని, యెడుతమిత్రఁ గాడుపడి పొలంబు, లెల్లఁ దిరిగి తూర్పు తెల్ల నౌతఱి నొక్క, శూన్య గహనవాటిఁ జొచ్చి చనుచు .. ఆము. 6. 12.

మరులుకొ(గొ)ను – మరులొ్కను. అ. క్రి (√మరులు.) 1. వలపుచెందు, మోహము నొందు.

గీ సొలపు వలపును దలకించుచూడ్కిఁ జూచు, నాటుఁజూపున మరులుకొనంగఁ జూచుఁ, దారి తారామనోహరు దశవిధావ, లోకనంబుల మోహవిలోల యగుచు ... కవిరా 2 15

కం అది యెఱిఁగి లాలికల ని, ల్పద మని పఱ తెంచి నెచ్చెలులు రత్నవతీ, కదళికలు విన్న విఁచిర, మృదులోక్తుల మరులుగొన్న మెలఁతలతోడన్. వరాహ 3 128

గీ అసరోజాక్షి లీలావిలాసములకు, మరులు కొని దానవేంద్రుండు మనసిజాత, మత్త వేదండదో దూయమానమాన, సౌఖ్యుఁ డై దశా 2 318

2. అపడు, ఆసక్తుఁడగు

సీ. బహుళదూర్వాశంకఁ బ్రణతి దేవ కిరీటమరక తద్యుతులకై మరులుకొన్న. కాశీ 3 12

వగడ. మరులుకొని చేయఁ దథిమానమును మానమును, మఱచియును మానఁ దతి మానమును జ్ఞానమును ... సీతారా, 3 111.

3. ఉన్మత్తుఁడగు, పిచ్చివాఁడగు.

గీ అద్భుతం శౌర కేళీవనాంతరమున, మదనతాపాగ్ని వేదన మరులుకొనుచు, జనవరకుమార మౌళి యాతనవిరాళి, యే మని వచింప ఁతివ తిరయే యెఱుంగు. ఇందు. 2 219

మరులుకొ(గొ)లుపు(ల్పు) స. క్రి. (√మరులు కొను) మోహింపఁజేయు, మోహపెట్టు, వలపింపఁజేయు.

గీ. మరులుకొలిపితె గోవింద మందసుతుల ఆము, 5 67.

గీ జరులు గెలిచిన యంతఃపురేందుముఖుల, కురులు మరుఁ డనువేఁటకాఁ డురులు నేసి, మరులుగొలుపంగ లేఁ డయ్యె మనుజవిభుని, సరులు లేనిదృక్కుంజనశాబకములు నైష. 3. 90

కం తారు గనుఁగొన్న రాచకు, మారుని సౌందర్య రేఖ మరులుగొలుపఁగా, మార శరపీడితాత్మక, లై రాయిడిఁ బడుచు నాలతాంగులు మదిలోన్ ... వరాహ 4 15.

గీ విరుల్ నామ్చుకరణిఁ జల్లు, వరసపుజలంబె జాణల మరులుకొల్పు. ఆము 2 21.

కం గోపయి న్వాలారుం, గోలలఁ బరగించి మరులుగొల్పుచు మిగులన్ నీలా. 3. 41.

మరులు(ర్లు)జడ వి. (మరులు – జడ) 1 మరులు దీఁగ, భూతకేశము (వృ వి) (శ ర)

2 ఉన్మాదమును పుట్టించు (జోగులు మున్నగు వారి) జడ

సీ కావిగోణంబు లాకాశవన్యాసి కంబళిక పాదికునకు మర్లుజడలు

గీ అనెడు సందేహచింతనం బావహిల్ల అకసమునఁ బ్రాఁకెఁ దూర్పున నరుణరుచులు పి. శకుం 3 201

మరులు(ర్లు)మాతంగి వి (√మరులు) మర్లుఁ దీఁగ, మదనము (వృ వి.)

సీ జాజికాయయుఁ గురసానియోమము వసచెంగల్వ మర్లుమాతంగి పచ్చ, యెన్నులు. ప్రబంధ. 640, ఆం. భా, 2. 53.

మరులుమ్మెత వి మదనము (వృ వి)

గీ మర్లుమాతంగి నాఁగను మరు, లుమ్మెత యనంగ మదనాఖ్య యొనరు ... ఆం. భా. 2 59

మరులుతేఁడు వి. (√మరులు) పిశాచవల్లభుఁడు

గీ. నీవు నీపోవుదెసఁ బొమ్ము నీకు మాకు, మాట లేఁటికి ననుచు నమ్మరులుతేఁడు. ఉ. హరి. 2 141

మరులొల్కొను – మరులుకొను అ క్రి. (√మరులు) మోహపడు, వలపు జెందు.

సీ. .. ఆద్విజరాజు గురువధూటికి మరులొల్కొనియె ననఁగ ... విప్ర 2. 72.

చం. కలకల నవ్వుమోవి పలుగంటుల దీఁటుఁ గుచంబు లోరగా, వెలువడఁ బైఁట వేయు నెఱవింతగఁ గేరు మరులొల్కొనంగ బె, ళ్కులు

గ న జూచు లేనిపగలుంగొని మాటికిఁ గుల్కు గోటిచి, ముగ్గులు నొనరించు నవ్వెలఁది మోహపుఁబ్రాయమువానిఁ జూచినన్.
హంస 1 217.

**మరల్కొ (గొ) లుపు (ల్పు)** – మరులు కొలుపు (వలపించు, ఆసక్తి నొందించు.)

చం కరువలి వారిమేనులను గౌనులఁ గీల్జడలం దొడల్, నడల్, తళులుఁ గురుల్ మరుల్ కొలుపఁ దా నిపు డెక్కడ నంతరించెనో, శర శశ మైదుకైదువలజంత య టంచు విరాళి గొ గి చం రా 2. 99.

సీ పొగడను దగువిధంబుఁనను బెకుళులు గల్లనల రించి నిను మరుల్కొలుపఁ గలను
విప్ర 8 19

సీ ఇంద్రనీలపుడాలు నేలువన్నమువాని సిరి మరుల్గొలుపుమై రెలువువాని కళా 2 142

మ అ, యమరుల్ నీ కెదురే జయింపఁ గద వయ్యా యన్న లేనప్పుడా, య మరుల్కొల్పుచు వారి వీడ్కొలిపి ..
ఉ రా 1. 78.

**మరువంపు మొలకలు** వి. బ ధాన్యవిశేషము

సీ మన్మథబాణాలు మరువంపు మొలకలు సన్న మణిం గెలు జున్నుబ్రాలు హ. స. 4 128.

**మరువకము** నం. విశ. (అ ఆ. అ.) భయంకరమైనది

వి. అ పుం 1. మదనము, వృక్షవిశేషము 2 మరువము (వృ వి.) (అమరకోశము) 3 పెద్దపులి 4. బకవిశేషము, ఓదెకొంగ.

**మరువకుఁడు** నం. వి అ. పుం రాహువు

**మరువము** వి. (నం మరువకః) సువాసనగల యొక జాతిమొక్క.

కం మరువము మొలవఁగఁ దోడనె, పరిమళ ముద యించినట్లు .. విక్ర 1. 191

రగడ మరువము చెలి నా మరువము లోయను..
యయా. 4 25

ద్వి కలయంగ మరువంబుకల పేర్పరించి, యలవి మీఁజినమల్లియల కంటు లొత్తి
ద్వి పరమ 5 -70 పా.

**మరువము** నం వి అ పుం వృక్షవిశేషము, వాసనగల చిన్న చెట్టు.

**మరువలు** వి వశురోగవిశేషము

ద్వి మరువలు దిగకుఁడ మందం వాడి, నెఁయు చఁణములు నించినతిత్తి .
నవ 1 27 పా 16 పం.

**మరువు** నం వి. ఉ పుం 1 ఎడారి, నిర్జన ప్రదేశము. నీరులేనిచోటు. 2 పర్వతము. 3 కురువకము, ఎఱ్ఱగోరంట (వృ వి) 4 ఒకానొక దేశము (వై ని.)

**మరుసంభవ** నం వి ఆ స్త్రీ 1 మహేంద్రవారుణి, పెద్దచేఁదుపుచ్చ (వృ వి (విల్యమ్సు). 2. ఒకవిధమగు తీఁటకసింద (వృ వి. (వాచ).

**మరుసంభవము** నం. వి అ పుం ఒకవిధమగు మునగ చెట్టు (విల్యమ్సు.).

**మరూకము** నం వి అ పుం. 1. నెమిలి 2. లేడి. 3. కప్ప (వై ని.).

**మరూద్భవ** నం. వి. ఆ. స్త్రీ 1. ప్రత్తి చెట్టు. 2. ఒకవిధమగుచంద్ర (వృ వి). 3 తీఁటకసింద (వృ వి.). 4 దోన (వృ. వి.) (ఆ. ని).

**మరూద్భవము** నం. వి అ. పుం. చంద్ర (వృ. వి.) (వై ని).

**మరోలి** నం. వి ఇ పుం. మకరము, మొసలి. (త్రి. ని).

**మర్కటకము** నం వి. అ పుం 1 వానరము, కోఁతి. 2. సాలెపురుగు 3. మత్స్యభేదము, ఒకవిధమగుచేఁప 4 ధాన్యభేదము (విల్యమ్సు).

**మర్కటతిందుకము** నం. వి అ. పుం కాకేందువు, కాకితుమికి (వృ. వి).

**మర్కటపిప్పలి** నం. వి ఈ. స్త్రీ అపామార్గము, ఉత్తరేను (వృ వి.).

**మర్కటము** నం. వి. అ పుం 1. కోఁతి, వానరము. (ఈయర్థమునఁ గొన్నిపట్ల మహద్వివక్షయును

గలదు )
సీ ఫలమూలములు దిని బ్రతుకు మర్కటులకు
మేలోగిరంబులు మెక్కఁ గలిగె ...
ఉ. రా 5 273

2 సాలెపురుగు 3. ఓడెకొంగ, బకవిశేషము 4 రతియందలి బంధవిశేషము. 5. విషవిశేషము. 6. ముద్గభేదము (వృ వి.) 7. తురుష్క మనుగంధద్రవ్యము. న. కవాటబంధనార్థ సూచీవిష్కంభ య త్రకము (కే ని.)

మర్కటవాసస్సు సం వి న్ న. లూతా సూత్రము, సాలెపురుగుపట్టు (వాచ.)

మర్కటశీర్షము నం. వి అ న హింగులము, ఇంగిలీకము.

మర్కటాస్యము సం విణ. (అ ఆ అ.) కోఁతిముఖమువంటి ముఖముగలది. వి అ న తామ్రము, రాగి.

మర్కటి సం. వి ఈ. స్త్రీ 1. అపామార్గము, ఉత్తరేను (వృ. వి ) 2. అజమోద, ఓమము (వృ వి ). 3 కరంజము, కానుగు (వృ. వి.).

మర్కటీజాలము సం వి అ న. (ఛంద ) లఘు గురువులస్థానమును దెలిసికొనుట కుపయోగించు చక్రము (వాచ ).

మర్కటేందువు సం వి ఉ. పుం. పెద్ద తుమికి (వృ. వి.) (విల్యమ్సు)

మర్కము సం. వి అ. పుం. 1. గాలి. 2 మనస్సు. 3 గుదము (వై. ని ) 4. దేవదారువు (వృ వి. . 5 అభ్రకము. 6. సర్పము, పాము

మర్కర సం వి. ఆ. స్త్రీ. 1. భాండము, కుండ. 2 సురఁగ, సొరంగము, గుహ. 3. వంధ్యయగు స్త్రీ, గొడ్రాలు. 4. భృంగరాజము, గుంటకలగర (వృ. వి.).

మర్కసము సం. వి. అ. పుం. జగలమునుండి మద్యము తీయఁగా మిగిలిన నిస్సారపు ముద్ద (వై. ని.)

మర్కుడు సం. వి. అ. పుం. 1. బ్రహ్మ. 2. చంద్రుఁడు. 3. సూర్యుఁడు.

విణ (అ ఆ అ ) విఘ్నకర్త (కే ని )

మర్కోటపిపీలిక సం వి ఆ స్త్రీ. నల్లని చిన్న చీమ (వై ని.).

మర్గదము వి మలవిసర్జనము
ద్వి మనసిజహరుఁడు లేఁ డని పల్కు నధము,
మనుజులనోళ్లు మా మర్గదంబులకు ..
బస. పు 6 894 పం.
(తావులు అధ్యాహారము )

మర్గించె – మ్రగ్గించె స క్రి నశింపఁ జేయు (ఇట వర్ణవ్యత్యయము )
శా. భర్గుం డంతకవాహినుల్ శరహతిన్ భంజించు న క్లైమ్మెయిన్, దర్గంగా రథపత్త్రిముల్ విఱుగ వేదండాంకురానీకముల్, మర్గాడన్ భటకోరకంబు లడఁ న్ మాత్సాశ్వపుష్పౌఘముల్, మర్గించున్ బరసైన్య పద్మవనమున్ మద్బాణవర్షంబునన్
కు. సం. 11 604

మర్గు – మరుగు అ. క్రి. ఆసక్తమగు, అనగొను
ఉ. మక్కువతోఁ గుమారులకు మర్గుచుఁ దల్లులు ప్రేముడింపగాఁ,జిక్కఁగఁ జేసి క్రేపులకుఁ జేరిన యావులు దట్టుముట్టఁగన్ ...
పద్మ. 9 157

మర్చు – మఱచు స క్రి. విస్మరించు, మఱచిపోవు.
ఉ నాపయిఁ బ్రేమ యుంచు సురనాయక మర్చకు నన్నొకప్పుడున్ ... దశా. 7 158.

మర్జువు సం వి ఉ పుం 1. చాకలివాఁడు, రజకుఁడు. 2 పీరమర్దుఁడు
ఊ స్త్రీ. 1. తుడుచుట, శుద్ధిచేయుట. 2 పవిత్రము చేయుట. 3. చీపురు, సంమార్జని. 4. నదీతీరము 5. శిల, ఱాయి (కే. ని )

మర్తము సం వి అ పుం మర్త్యలోకము, భూమి (కే, ని )

మర్తుఁడు సం. వి. అ పుం మర్త్యుఁడు, నరుఁడు.

మర్త్యము సం. విణ (అ ఆ. అ.) మరణ చు స్వభావముగలది, మరణశీలము.

వి అ పుం మనుష్యలోకము, భూలోకము. న. శరీరము, ఒడలు (విల్యమ్సు).

మర్త్యముఖుఁడు సం వి అ. పుం. కిన్నరుఁడు

మర్త్యలోకము సం వి. అ పుం భూలోకము, మనుష్య లోకము (వై ని).

మర్త్యుఁడు సం వి అ పుం మనుష్యుఁడు

మర్దనము సం విణ (అ ఈ అ) 1. నలఁగఁ గొట్టునది 2 పీడించునది, రాచునది
వి. అ న 1 నలఁగఁగొట్టుట, పిండిగాఁ జేయుట. 2 రాచుట, ఒడలుపట్టుట, అంగమర్దనము చేయుట

మర్దని సం వి. ఈ స్త్రీ పాదములను రక్షించు కవచము (వై. ని).

మర్దము సం విణ (అ ఆ అ) నలఁగఁగొట్టునది, గుండచేయునది, వి అ పుం 1 పిండిగాఁజేయుట, గుండచేయుట 2 కఠిన మైనదెబ్బ, గట్టిదెబ్బ 3. వైరాగ్యము (వై. ని.

మర్దలము సం వి అ పుం వాద్యవిశేషము, మద్దెల

మర్దించే సం స 1కి మర్దనముచేయు, నూఱు.
మ మతికాలుష్య మడంచి యింద్రియములన్ మర్దించి కామారిశ, త్రుతతిం ద్రుంచి...
మార్క 3 147.
(ఇట జయించు అని భావము)

మర్దితము సం. విణ. (అ ఆ అ) 1. నలఁగఁ గొట్టఁబడినది, గుండగాఁ జేయఁబడినది, 2. రాచఁబడినది రుద్దఁబడినది 3. చేర్చికట్టఁబడినది, గ్రుచ్చఁబడినది.

మర్నాఁడు—మఱునాఁడు వి (√మఱు[2]) పరదినము, మఱుసటిదినము
ద్వి. అమ్మని పూజింప నారాత్రి యందు నెమ్మి దీపింపఁగ నిల్పి మర్నాఁడు, ఘన నిష్ఠ సంధ్యాది కర్మముల్ దీర్చి..
రం. రా అయో 120 పొ 20 పం.

మర్మకీలుఁడు సం. వి. అ పుం. భర్త (విల్యమ్సు.).

మర్మత్రము సం వి. అ. న కవచము

మర్మభేదనము సం వి అ పుం బాణము, అమ్ము (వై. ని).

మర్మభేది సం వి న్. పుం. బాణము అమ్ము

మర్మము సం వి న్. న 1 జీవస్థానము. ఆయువుపట్టు, మెత్తనిచోటు 2 అవయవములసంధి. 3 గూఢార్థము, తాత్పర్యము 4 రహస్యము

మర్మర సం వి అ. స్త్రీ భక్ష్యభేదము (వై ని).

మర్మరము సం విణ (అ ఆ అ) ధ్వని చేయునది
వి అ పుం ఆకులు బట్టలు మొ వానిధ్వని

మర్మరి సం వి. ఈ స్త్రీ 1. ఒక జాతి దేవదారు వృక్షము 2. పసుపు

మర్మరీకము సం వి. అ పుం. 1 అగ్ని. 2. దేగ (కే. ని.

మర్మరీకుఁడు సం వి. అ. పుం 1. నిస్స్వుఁడు, దరిద్రుఁడు. 2 దుర్మార్గుఁడు, దుష్టజనుఁడు. (విల్యమ్సు, 3 శూరుఁడు (కే. ని)

మర్మస్పృక్కు సం–మర్మస్పృశము.

మర్మస్పృశము సం విణ. (శ్) మర్మము తాఁకునది, హింసించునది (మాట మొ)

మర్మావరణము సం. వి. అ. న. శరీరమును రక్షించునది. కవచము (విల్యమ్సు)

మర్మావిధము సం. విణ. (ధ్) హృదయ మర్మములఁ బొడుచునది (బాణము మొ).

మర్య సం. వి. ఆ స్త్రీ మర్యాద, హద్దు. (కల్ప).

మర్యాద సం వి ఆ స్త్రీ 1. పొలిమేర, సీమ. 2. సముద్రతీరము, ఒడ్డు. 3. హద్దుగుఱ్ఱుతురాయి. సరిహద్దురాయి 4 నీతియొక్క కట్టుపాటు, నీతిపద్ధతి 5 పద్ధతి, న్యాయ మార్గమం దుండుట 6. ఒప్పుదల, ఒడంబడిక 7. ఆత్మయందు మనస్సును స్థిరముగా నుంచుట. 8 సన్మానము, గౌరవము.
శా. ఆదిన్ శ్రీసతికొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయంబుపైఁ, బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ బాలిండ్లపై నూత్నమ, ర్యాదన్ జెందుకరంబు గ్రిం దగుట మీఁదై నాకరంబుంట మేల్, గాదే రాజ్యము గీల్యమున్ సత

తమే కాయంబు నాపాయమే.
భాగ. 8 592.

2 విధము, పోలిక.

మ. ఘను లాత్మీయతమోనివృత్తికొఱకై గారిళు
మర్యాద నె, వ్వనిపాదాంబుజతోయమందు
మునుఁగన్ వాంఛింతురు...
భాగ 10 పూ. 1708.

సీ పచ్చకప్పుఁ పుఁగుప్పలు నింగియంగడి నించు
మర్యాద రాయంచ లెల్ల, గుంపు గూడిన గతి
గొప్పగంద పులప్పలు లిప్పుగా నుంచు పగిది..
ఘటికా 2 145

సీ వెఱయ హరిశ్చంద్రువిధమున నలునిపోఁకను
బురుకుత్సు చేడ్పునఁ బురూరు, వుని లీల సగరు
లాగునఁ గార్తవీర్యుమర్యాదను గయు క్రియ
నంబరీషు, మతమున...
హంస 1 42.

**మర్యాధాగిరి** సం. వి. ఇ. పుం. సరిహద్దు కొండ, కుల పర్వతములలో నొకటి.

**మర్యాదాచలము** సం. వి. అ. పుం. –మర్యాదాగిరి

**మర్లు[1]–మరలు** అ. క్రి. మళ్లు, వెనుకఁ దిరుగు.

సీ అవల మాటాడువా రదిరిపాటువ మర్లి
యొఱపు వీక్షించి నివ్వెఱబడంగ
కువల 2. 29.

మ కొలు వౌ డిగ్గున గద్దె డిగ్గ వని కేఁగు న్మర్లు
గేహ బులోఁ, దలిరుంబాన్పున మర్లునంబొరలు
దశా. 7.71.

ఇ, మర్లుఁబాము.

**మర్లు[2]–మరలు** వి వలపు, మోహము

మ గేహంబులోఁ, దలిరుం బాన్పున మర్లునం
బొరలు .. దశా. 7. 71.

జః మర్లుకొను

**మర్లు[3]** వి. వైపు, ప్రక్క.

చం. చిలుకలు గోయిలల్ చెవులు చిందర వందర
సేయ నూరెలన్, మలయసమీరమున్ వెనుక
మర్లున మల్కిపడం బయింబడన్, గళవళ మంది
చుట్టుకొనెఁ గంతునిమంతి యటంచు నాత్మ
లోన్. సారంగ 2 155.

**మర్లుఁబాము** వి (మర్లు[1]+పాము) మనుదిండి, ఒక విధమగు పాము (శ గ)

**మర్లుకొను–మరలుకొను** స క్రి (√మర్లు[2]) వలచు, మోహించు

సీ కోఁడెకాంద్రను మర్లుకొని విభుఁ గికురించి
తిరిగెడుబోంట్ల నేమంక కూడు
ఉ హరిశ్చ 4 18.

**మర్వు – మఱువు** వి చాటు, ఓము

ఉ. కీశులు భీతిబొంది తమకించుచు రాఘవు మర్వు
సొచ్చినన్ .. భా. రా యు 1440

చం వినుతనంపు వంగడపు వెన్నెలరాయని మర్వు
సేరనన్ ... అచ్చ రా యు. 233.

మ . దివిజుల్ భంగించినన్ దైత్యులా, తురు
లై మున్ భృగుపత్నిమర్వు సొరనెంతో కూర్మి
నక్కాంతయున్. ఉ. రా. 6. 334.

**మర్శనము** సం. వి. అ. న 1 రాచుట, రుద్దుట. 2. పరీక్షించుట, పరిశీలించుట 3 ఆలోచన. 4. సలహా, ఉపదేశము. 5 తొలఁగించుట, తుడిచి వేయుట 6 వివరించుట, విప్పి చెప్పుట

**మర్శము** సం వి అ పుం 1. ఆలోచన, యోచన 2. సలహా, ఉపదేశము, ఆలోచన చెప్పుట 3 తుమ్ములు గలిగించు మందు (విక్ర్యమ్స.)

**మర్షణము** సం వి. అ న. సహనము, ఓర్పు

**మర్షము** సం. వి. అ పుం. సహనము, ఓర్పు.

**మర్షి** సం విణ (న్.జీ.న్.) సహనము గలవాఁడు ఓర్పు గలవాఁడు, సహించువాఁడు.

**మర్షితము** సం. విణ. (అ. ఆ అ.) 1 ఓర్చుకొనఁబడినది సహింపబడినది. 2. క్షమింపఁ బడినది, మన్నింపఁబడినది
వి అ న సహనము, ఓర్పు

**మఱ** వి 1 మర్మము, గుట్టు

కం ఏమగువ పట్టుకొనెనో, యేమిటికిఁ దెచ్చెనో
యి దెక్కడిపాటో, యేమో యెఱుఁగఁడు

మది మఱ, తామసి యనువిద్య తొలుతఁ దనుఁ బొందుటయున్ ... ఉ. హరి. 5. 195.
(ప్రాఁతప్రతి పా. వావిళ్ల పా. 'మఱిమఱి' వీరేశ పా.)

2. అఱమఱ, భేదము.

మ. మఱ లేకర్థుల దానులన్ సుజనులన్ మన్నింపుదే పైదలీ ... భాగ. 8. 467.

3. దైన్యము, దుఃఖము. (చూ. మఱగొను.)

జ. మఱగొను.

మఱఁదలు వి. బొ. (మఱఁది + అలు, వి. మఱఁదండ్రు) 1. తమ్ముని భార్య.

గీ. మఱఁదలికి నాపడి లోలమతిఁ జరించి ... దశకు. 11. 134

వ. మఱియు నత్యంతశోకార్ణవంబున మునింగిన తల్లిని మఱదండ్రను నాశ్వాసించి .. భార. ఆది. 4. 217.

ఉ లెమ్ము సురేంద్ర నీవలన లే దొకతప్పును నీమఱంద లీ, కొమ్మ వదాన్యభూరుహము గోరినఁ దెచ్చితిఁ గాని ... పారి. 5. 39.

2. భార్య చెలియలు.

3. మగని చెలియలు.

సీ. ... జాయాపతులకు ... మఱఁద లంచనఁగను మంద్రుత దనుజులు ... ఆం. భా. 2. 114.
(రెండు, మూఁడర్థములకు నిదియే యుదాహరణము.).

4. తనకంటె చిన్న దగు మేనత్త కూఁతురు; తనకంటె చిన్నదగు మేనమామ కూఁతురు (శ. ర.).

మఱఁది వి. చెల్లెలి మగఁడు.

కం. చెలియలు మఱందియుమని, మ్ముల నింద్రప్రస్థనగరమున వభిమతబం, ధుల యొద్ద నున్నవా రని ... భార. ఆది. 8. 214.

గీ. తనదు సామ్రాజ్యమహిమకుఁ దగినయట్ల, మఱిమఱి సకలవస్తు సంపదలు వెలయ, మఱఁదికి విశేషగతిని సన్మానగరిమఁ, జాల నొనరించె నప్పు డా జనవరుండు ... ఇందు. 6. 73.

2. భార్య తమ్ముఁడు, స్యాలకుఁడు.

కం. అని పలికి వాలుటమ్ములు, తనువున నినుచుటయుఁ గలఁగి ధైర్యము మానం, బును వీటిం బోవఁ బాఱెను, జననాయక నీమఱంది సరివారు నగన్. భార. ద్రో. 1. 363.

కం. వాలిక మెఱుఁగుఁదూపులు, నాశీకోదరుని మఱఁది నవి దైత్యులమైఁ, గీలించె ... హర. 7. 160, ఆము. 1. 13.

3. మగని తమ్ముఁడు.

సీ మధుకైటభారాతి మఱఁది దమ్ముని పిల్చి పనిగొంట నీకుఁ బ్రాభవము గాదె ... నైష. 3. 126.

ఉ. అంబుజగంధి యయ్యెడ మహర్షుల పత్నులఁ గంచు కొన్ని పే, మాంబర రత్నభూషణ చయంబులు గైకొని యమ్మఱందియున్, వెంబడి నెక్కఁగా రథము వేడుక నెక్కె చిరత్న రత్నపీ, ఠంబుల నుండె ... ఉ. రా. 6. 232.

4. మేనత్త కొడుకు.

చం. ...శరతాడన పీడితులై రి నీమఱం, దులు వమరాపగా తనయుతోడి రణంబునకున్ దిశాధినా, ధులు నఱుమంగఁ జాలరు ... భార, భీష్మ. 2. 6., భార. ద్రో. 4. 141.

5 మేనమామ కొడుకు.

సీ శ్రీమన్మహా గుణస్తోమాభిరాముఁ డై తేజరిల్లెడు ధర్మరాజునకును, దమ మఱంది గిరీంద్ర ధరుఁడు దండంబు గావించి చేయం గల విన్నపములు ... భాను. 4. 10.

6. పరియాచకపువావి, పరసోక్తు లాడుటకై కల్పిత మైన వరుస.

చం. మరఁది యటంచు బావ యని మామ యటంచును వల్లుఁ డంచు నం, దఱకును వన్నివావులిడి ... దశా. 2. 366.

జ మఱఁదలు.

**మఱక¹** వి పాలు విడిచిన యాఁడు మేకపిల్ల

చ. కఱవరుదెంచినన్ ఘటము గర్భమునం గల సత్త్వవంతయున్, దఱుఁగక యమ్మి మేకఁ గొన దానికిఁ బిల్లలు రెండు గల్గున, మ్మఱకలు రెంటికిం గలుగు మానుగ దూడలు నాల్గు వానికి, ట్లటిమిటి నెన్న నెన్మిదిఁ బదాఱును ముప్పది రెండుఁ బుట్టఁగన్ ...
నా. పంచ 5 11.

**మఱక²** వి. డాగు, కఱ.

సీ. దొడ్డపుట్టంబుఁ దొత్తుకుఁ గట్టఁబెట్టినదవి పేఁడ మఱకల కగ్గపఱుచు ..., రామలిం. 34

**మఱకువ** వి. (√మఱచు) అజ్ఞానము, తెలివిలేమి.

కం ఎఱుకని యెఱుఁగక నిన్నున్, మఱకువ నెదిరి తిని దీని మఱవుము నన్నుం, గఱకంఠా క్షమియింపుము .. భార అం. 1. 327.

చం. మఱకువఁ గత్తిరించి మదమానములం జుఱుపుచ్చి మెచ్చు జాఁ, గఱగొని
ఉ. హరి. 4. 87.

2 విస్మృతి, పరాకు

సీ. .. మరపు, మఱకువ యనంగ విస్మృతి పరగుచుండు ... ఆం భా. 1. 137.

**మఱగొను** అ. క్రి (మఱ + కొను) దైన్యమునందు

చం. ఇది దగదంచు నడ్డుపడు నింతకు నేరక సఖ్యులందఱున్, మది మఱగొన్న యట్టి యెడ మానినికిన్ దనుఁ దాన కాచికో, లోదవిన
భార. ఉద్యో 1 348.

శ్లో. కార్పణ్యాదేవ సహితా స్తత్ర భూపానాశక్నువన్ప్రతివక్తుమ్ సభాయామ్
సం. భార. ఉద్యో. 29. 40.

**మఱచు** స. క్రి. 1. విస్మరించు, తలంపకుండు

కం. ఎఱుఁగమి చీకటి నీ పె, ద్దఱికంబు దలంప నేమితప్పు గలిగినన్, మఱచి దయఁ జూడు మిట్లుం, దఱు నీకుం బనులు సేయఁ దగుదురు వీరల్ .. భార విరా. 5. 357.

కం. రాచసిరి యుండియును మది, యాచవికిం జౌరదు నాకు హరికి నిచటిజా, ల్యాచరణము పై మక్కువ, యే చందంబునను మఱవ నెన్నఁడు రామిన్ .. హరి ఉ. 2 78.

గీ తపసిరూపుఁ గ్రోల్లకుఁ దవిలి రాఁగ మాకుఁ బొసఁగదు పొమ్ము మఱాకరమ్మ ..
అచ్చ. రా కిష్కిం 54.

(మఱాక - మఱవక.)

ఉ నీ, బాంధవ మెల్లఁ బ్రొద్దుఁ దలఁపందగు నాత్మ మఱాకు మింకఁ గి, ష్కింధకుఁ బొమ్ము భానుసుత ...
భా. రా. యు. 1770.

(మఱాకుము - మఱవకుము.)

2 మాను, విడుచు

గీ మధుమదోన్మత్తలై యల్క మఱచి సఖులు, సూరెలకుఁ దాఁటి బతులపై సోలునట్టి, చేడియల మన్మథుఁడు వెట్టి చెఱకువింట, నేసెను మొత్తవిరులచే నేసరేఁగి ..
కవిక 4 166

గీ. మగువ కనుదమ్ము లరమోడ్పు మఱవ వయ్యె.
వసు 3 110

అ క్రి ప్రమాదము నొందు, పొరపడు.

కం. గుఱుకొని కార్యాకార్యము, లెఱుఁగక దుశ్చరితుఁడై యహితుఁడగు నేనిన్, మఱపక గురు నైనను జను, లెఱుఁగఁగ శాసించునది మహీశుఁడు బుద్ధిన్ ..
భార ఆది 6. 102.

కం. మానుషశక్తి జయింపఁగ, రాని మహావీరులైన రణశూరు లపై, దీనిఁ బ్రయోగింపుము బల, హీనులపై మఱచియైన నేయకు మధిపా ..
విక్ర. 2. 38.

జ. మఱకువ, మఱపించు, మఱవు.

**మఱపించు** స క్రి. (√మఱచు.) 1. మఱచునట్లు చేయు, విస్మరింపఁజేయు

ఉ అంతట నద్భుతంబు గరుడాగమనంబు నిరాక్ష్య

తాహితా, త్వదంతసమార్జితోర్జిత జయామృ
దయం బయి భీష్మపాతనం, క్రాంత ఘనవ్యథన్
నెఱయఁగా మఱపింపఁ బునర్మహాజిని, క్రాంతి
కుపక్రమించు విభుఁ గాంచి దినేశ సుతాదు
లుబ్బుచున్ . రాఘవ 4 137

సీ పట్టి చెప్పుడు రతిప్రాణేశమంత్రముల్ మఱ
పింతు మఱి యన్యమంత్రకలన .
చంద్రా 2 82

సీ కందర్పు మఱపించి యిందుని నిందించి నలకూ
బరు హసించి నలుని మించి ...
కళా 1 66.

(ఇట అతిశయించి అని భావము )

2. భ్రాంతి నొందించు, భ్రమింపఁజేయు.

సీ మగలతో నిద్రించు మగువల మఱపించి మగ
చెయ్వి లోనరింప మదిఁ దలంచు
నీలా 1 76

మఱపు వి. (√మఱచు ) 1. విస్మృతి

కం. పతిఁ జూచి రతి నిజాంత, ర్గతభేదం బెఱిమి
మఱపుగా నిడి కాలో, చితవచనాంతరముల
నుర, పతి గడువెస నిన్ను నేమిపని రాఁ బని
చెన్ ... కు. సం 4. 418

గీ. తమకమును సిగ్గుఁ దమలోనఁ దడఁబడఁగ,
మఱపుఁ జెయ్వులుఁ దమలోన మాఱు
మలయ ... విక్ర 1 122.

సీ. పిటికితనంబును గుఱి దప్పి చనుటయు వెఱ
పును మఱపును గొఱకొఱయును ...

గీ ... ఎఱ్ఱ్యొడ నెఱుఁగఁ డతఁడు ..
అచ్చ. రా. బాల. 45., ఆం భా 1. 127

2. పారవశ్యము, ఒడలెఱుంగమి, మత్తత

సీ మఱపు మున్నీటిలో మానంబు లూటాడ బిగి
యారు కౌఁగిట బెరయువారు ..
ఉ హరి 5 78.

సీ. తనపదంబునఁ జేర దనుచు వెల్వెలఁ బోవుఁ
జెలఁగు ముట్ట దనుచుఁ జెందు మఱపు . .
చంద్రి 1. 65.

శా భీతుం డై తమతండ్రి మాజనకునిన్ భిక్షించి
నన్ దన్ను నం, రక్షింపం దుచివింతయై మఱ
పుతో రాజప్రసూనాక్షుని, వ్రతులో రాజతనూ
జతో సుగుణతో నాతో సమం బాడెడిన్.
భాగ. 9. 521.

3. మూర్ఛ

ద్వి మనుజేంద్రతనయుఁ డా మఱపటు దెలిసి,
మునివరుల్ దీవింప మొగి దవ్వు లలఁ, తన
దంగ విలుగుణధ్వని చేసి నిలిచి ...
రం రా ఉ 146 పా. 18 పం.

ద్వి అమేఘనాదుండు నతనిమర్మముల, నమ్ములఁ
గీలించి యతని సూతుండు, మాతలినొగలపై
మఱపుతో నొరఁగ, నాతేరు విఱుగంగ నలు
కతో నేసె
రం రా. ఉ. 79 పా. 5 పం

4. ప్రమాదము, పొరపాటు

సీ. .. తేరు విఱిగెనో సూతుండు వడిఁ యెనో
యేమఱి యలసత నెదిరి సరకు, సేయమి మఱ
పాతన్మెఁ జెందెనో హీనాత్ముఁ డై న ధృష్టద్యు
మ్నుఁ డతనిఁ జంపె ... భార. ద్రో 1 80

శ్లో రథః పర్యపత ద్వాస్య ధను ర్వా శీర్య తాస్య
తం, ప్రమత్తో వా భవద్ద్రోణో యథా మృత్యు
ముపేయివాన్ . .
సం. భార. ద్రో 9. 2.

5 అజ్ఞానము

ఉ . నీ, ప్రేమకు వచ్చు దానులకుఁ గ్రించు
తనంబున నెగ్గు నేసితిన్, నామఱపున్ సహింపు
మట నారకుఁ డై న మనంబులో భవ, న్నామ
ము చింత నేసిన ననంతసుఖస్థితి నొందకుండునే
భాగ 9. 116.

గీ. సగము గొఱికినయాకును సఖులు పిలువ, సగ
మొసఁగు నుత్తరముఁ దెల్వి సగము మఱపు,
సగము నయి చింతచే సగ మగుచు నరిగె ...
మనుచ. 3 66.

న క్రి. ప్రమాదపఱుచు పొరపెట్టు.

కం. నను మఱపి యొందుఁ బోయితి, గనుఁగొంటిని బట్టువడితి కైతవ మిటు నే, సినఁ బోనిత్తు మె యనుచును, దవమదిఁ బలుకు గతిఁ గొంతతడ వీక్షించెన్ . హరి. ఉ 7 129.

**మఱలు** స. క్రి 1 వెనుకకుఁ దిరుగు, వెనుక మొగ మగు

ద్వి మఱలు కెంజడలును మణికుండలములుఁ, జిఱుగజ్జె మొలనూలు సింగినాదంబు ... ద్వి హరిశ్చ ఉ 129 పం

గీ మొఱలు పెట్టుచు శరనిధి మఱలి మఱలి, కాంచుచో దశా 1 180.

2. నివర్తిలు, వెనుకకువచ్చు

శా... విక్రమకళా సంలబ్ధతత్ప్రియసీసంధా సిద్ధిఁ గృతార్థుఁడై మఱలె నిచ్చన్ వేశ్యలు ప్రాం గఁగన్. పారి 5 41

**మఱి**[1] అవ్య 1 పిమ్మట, అనంతరము.

గీ. ఇప్పురంబున బ్రాహ్మణుం డింధనార్థ, మేఁగి మున్న యావృక్షంబు నెక్కి దాని, తోన దగ్ధుఁడై మఱి దానితోన లబ్ధ, జీవుఁడై వచ్చి జను లకుఁ జెప్పె దీని ... భార. ఆది. ౭ 193.

సీ. ఎవ్వరో యెఱుఁగ నిన్నెఱిఁగించి మఱి వర మి మ్మంటి దానికి నెలమి నగుచు. భార అను 1. 351.

సీ. మఱి కొండవీ డెక్కి మార్కొని నలిరైనయల కసవాపాత్రు నంటి రాఁజె . మనుచ 1. 37.

2 పునరర్థకము, వెండియు, ఇంకను.

(కొన్ని యెడల సముచ్చయార్థకముతోఁ గూడి యుండును, దీని ద్విరుక్తరూపములు మఱిమఱి మఱిన్మఱి )

చం. ... ఓ దివిజశంభళి యిం కిటఁ బట్టి నీకు మీ, యనిమిషరాజుపాదముల యానసుమీ మఱి యేమివల్కినన్. నైష. 8. 144.

కం. విడువక మీగానము సొగ, సిడుటయు మఱి పాడుఁ డనుట యెగ్గే ... ఆము. 5. 58

శా. ధేనుగ్రాసము మాన్ప దోస మని సందేహించి నన్ సత్య మెం, తే నష్టం బగు నైన నేమి మఱియున్ విత్తంగ యామంబులో, నౌ నన్న న్ మును తెల్ల మిక్కిలియు నేఁ డాఁకొందురు. వరాహ. 10. 39

మ ధన మార్జింపుదు నార్జితం బయినతద్ద్రవ్యంబు బేంబుచేఁ, గొనసాగింపుదు వడ్డి వాసివలవన్ గూర్తున్ మఱిం గొంత . ప్రబోధ 4 33.

వ ఈ దేవరకు మఱియు నొక్క దీపంబున కిచ్చిన గొఱియలు 55 వీనిం జేకొని . ద. శా. 4 677..

(ఈ క్రిందిప్రయోగమున లఘురేఫయుక్తమై కన్పడుచున్నది )

ఆ మరియు నొక్కసాల మిరుగేలఁ బెఱికియు, దీనఁ దెగిఱి వంచుఁ దిగిచి వైవ, నలిగి యేడు భల్లములఁ ద్రుంచి .. భా రా అర 1. 240.

(శ ర పా. మఁల ముద్రి. పా.)

3. నిశ్చయముగా.

కం. నాకు మఱి నీవు పతివి గు, ణాకర యిజ్జన్మమున మహాస్నేహమునన్ .. భార. ఆది. 6. 193.

సీ. అతివయానముఁ గాంచి యప్రియస్థితి నున్న యది గాదె మఱి రాజహంసకులము .. కవిరా 3 93

4. ఇదిగాక.

చం. జననుత సర్వధర్మవులు సర్వజగత్పరివర్తన క్రమం, బును మఱి సర్వవంశములుఁ బుట్టిన మార్గము నీవ నిక్కువం, బనఘ యెఱుంగు దున్నతగుణాఢ్యుఁడవున్ భరతాన్వయాపలం బనుఁడవు నీవ .. భార. ఆది. 4 219.

గీ. తాను గర్భభరాలసత్వంబుకతనఁ, జేయఁ జాలదు మఱి వేఱ చెప్ప నేల ... కాశీ. 4. 212. కళా 3. 53.

5 తడవ, పర్యాయము

(ఈ యర్థమున నేకార్థకశబ్దపూర్వముగానే ప్రయోగములు గనఁబడుచున్నది).

కం. ఆగన యొక్కొక్కమఱి యు, త్తుంగమణిస్తంభయష్టితో నొత్తగిలున్
కాశీ 4 209.

ఉ. సర్గమెనర్తు బ్రహ్మ యన సత్కృపఁ జేతు జనార్దనుండనా, భర్గుఁ డనంగఁ గ్రమ్మఱంగఁ బాపిణ సేయుదు విజ్జగంబులై, సర్గికలీల నొక్కమఱి సౌఖ్యము నొందుదు కేవలంబు దో, సర్గవిభూషణీ కృతరథాంగ నినుం గొనియాడ నేర్తునే పార 1 26 అ మ క 5. 263 పొ 4, పం

6 అట్లుకానిచో, ఉపాంతమున

ఉ దానవులైన నేమి మఱి దైత్యవరూథములైన నేమి భాగ 10 ఉ 155

7 పూర్వోత్తరవాక్యార్థములకుఁ గల భేదమును దెల్పును

కం. మఱచినఁ దలపింపఁగ నగు, నెఱుఁగనినాఁ డెల్లపాటు నెఱిఁగింప నగున్, మఱి యెఱిఁగి యెఱుఁగ నొల్లని, కఱటిం దెలుపఁగఁ గమలగర్భుని వశమే. భార ఆది 4 71

కం. వర్గత్రయపరత ముహుః,స్వర్గత్వామధ్య మాధ్వ జంఘాలకతా, దుర్గతియు నొల్ల మఱి యప, వర్గదుఁ దేవే ల్పెఱిఁగి వాని భజింతున్. అము 2 82.

8 మరలమరల, పలుమాఱు.

కం. స్నేహార్ద్రహృదయ యై యతి, సాహస కృత్యములు మాన్ప సమకొల్పుటకై, యూహాపోహవిచారన, మోహితగతిఁ దల్లి సుతుని మఱి బోధించున్ .. కాశీ. 4. 89.

9 అన్యము, వేఱు

ఉ మామిడిమంత్రిఁ బోల మఱి మంత్రులు లేరు వసుంధరాస్థలిన్ ... నైష 1 24.

వ ద్రోణుం డొక్కబాణం బభిమంత్రించి దృష్టిముష్టి సౌష్ఠవంబు లొప్ప నొక్కదండకంబు నాటనేసి దానిపుంఖంబు మఱియొకబాణంబున నేసి. భాగ ఆది 5 211

కం మీవంటి భాగవతులం, బావనులుగఁ జేయరేని మఱి గతి యేది, మావంటివారికి కిఁక అము 6 56.

10 అట్లు, ఆవిధమున

కం అతనువుల వేరు గదా, నాతులు వ ... కలిగి వన్ ... దిర్యక్, జాతికి నిజాతికిఁ గల, యీతి వ్రత గలదె యెఱుఁగ కిట్టేలంటెన్ అము 5 42.

11 కొన్నియెడల నర్థవిశేషము లేని యే వాక్యాలంకారముగాఁ బ్రయోగింపఁబడును

చం నుతజలపూరితంబు లగ నూతుల నూటికి నొకటి నూన్పఁగా, ప్రతియెన బావి మేలు మఱి బావులు నూటికంటె నొక్క ..., క్రతువు పదిమేలు . భా. ఆది 4 93.

సీ మఱి జరాసుతునిపై మగుడ దండెత్తఁ జేసి వరవర్గదుర్గముల్ బలిమిఁ గొనఁగ పార 1 17 భాగ ఆది. 3 159.

మఱి² — మఱ్ఱి వి వటవృక్షము, మఱ్ఱిచెట్టు

కం తాతయుఁ దండ్రియు నగఁ, భ్రాతయనుం దాను భువనభాసురకృతిని, ర్మాతలు పిల్లల మఱిపై, ఖ్యాతుని బినవీరుఁ బోలఁ గలరే సుకవుల్ కై భా 1 21.

మఱిగ వి (క. మంగె.) ఊచిప్ప, పులుసు మున్నగునవి వండుట కుపయోగించు జాతితోఁ జేసిన పాత్రము.

(జోడ్డు పెలవలె బలపపజాతితోఁ జేసిన పాత్రము. శ ర)

మఱిన్మఱి — మఱిమఱి అవ్య. అత్యంతము, మిక్కిలి.

ఉ. రాజకుమారశేఖరుఁడు ... ప్రత్యహము న్గరియింపుచుండె నీ, రేజదళాక్షి నెంతయు మఱిన్మఱి నెమ్మదిలోన నెమ్మిచున్ ... ఇందు 2 213.

కం సరియె కద పిఱుదుబరువునఁ, దరుణివడక

మంద మగుట తరువాత మఱిన్, మఱి విట్టి
వీఁగుకుచకచ, భరమునఁ జెలి దాళి యుంట
ప్రౌఢిమ మె కదా ... ముకుంద. 2. 74

**మఱిమఱి – మఱిన్మఱి** అవ్య. 1. మఱియు మఱి
యు పౌనఃపున్యముగ (శ. ర )
2. అత్యంతము

కం. .... ప్రాణముకన్నను. మానం బధికం బటంచు
మఱి మఱి నిఖ్య, ల్యూనాథ పల్క వివవే
భల్లా. 5. ఆ. (శ ర )

**మఱు**[1] విశ (వృత్తియందుఁ బూర్వపద మగు మాఱు
శబ్దమునకు వికల్పముగా ఆదేశమై వచ్చు
రూపము ) 1 అన్యము, వేఱొకటి
గీ గంధవస్తువులు గొన్నట్టివాఁడు, వినుము
మఱుపుట్టువునఁ జుంచుతనము నొందు .
భార. అను 4. 267.

గీ. అతని మఱుమేన నైన నీప్రతిన దప్పు, కుండ
వరియింపవచ్చు నీ కుచితవిధిని ...
కళా 6. 56.

2 ప్రతి, బదులు

కం. అని పలుకుచున్న నృపవరు, దనునకు మఱు
మాట యీక. భార. ఆది 7 76.

సీ . . ర మ్మనుచును గడఁకఁ బిల్వ, మఱుమాట
లాడదో మఱి చూడకుండునో చనుఁగవఁ గప్పు
నో చాలు ననుచు ... భాగ. 8 320.

వి (వృత్తియం దుత్తరపద మగుమాఱుశబ్దమునకు
వికల్పముగా ఆదేశమై వచ్చు రూపము ) తడవ,
పర్యాయము
(చూ. పలుమఱు, వేమఱు.)
జ మఱుగుజ్జు, మఱుమాట, మఱుమ్రోఁత.

**మఱు**[2] విశ (వృత్తియందు పూర్వపద మైన మరున
శబ్దమునకు వికల్పముగా ఆదేశమై వచ్చురూపము.)
అనంతరము, పిమ్మటిది. (చూ. మఱునాఁడు.)
జ, మఱునాఁడు, మఱుమేను.

**మఱు**[3] వి. వృత్తియందు పూర్వపద మైన మఱుగు శబ్ద
మునకు వికల్పముగా ఆదేశ మగురూపము (చూ.
మఱువడు).

**మఱుఁగిడు** స. క్రి. (మఱుఁగు+ఇడు) దాఁచు,
గోపనముచేయు.

కం కొంత మఱుఁగిడక కలిగిన, యంతయు నిక్క
ముగఁ జెప్పఁ డనుటయు వాఁడల్
కళా 6 160.

**మఱుఁగు–మఱువు** అ క్రి (త మత్రె) చాటగు,
తిరోహితమగు, దాఁగు (శ. ర )
ద్వి. ఒఱుఁగుజింకలును బి ట్టొలుమన్నిళ్లు, మఱుఁ
గు గవయములు మఱియు నేఁదులును.
ద్వి. హరిశ్చ పూ 606 పం.

మధురగతి రగడ. వరువపువనకా సరు వని దిరుగుచుఁ
గురివెందలపొద గురు వని మఱుఁగుచు...
ప్రబంధ 253.

2 (శ మఱుగు) నీళ్లు, మొ. సలసలకాఁగు.
(వ్యవ ) నూనె మఱిగినది
3. సంతాపించు, మిక్కలి దుఃఖించు.

సీ. ఇమ్మేని కక్కట యిట్టిది సేసెనే మాయ దైవం
బని మఱుఁగువారు. భార. విరా 2 146.

ద్వి. అతిముతిఁ గోపించి యాధఁన్మశీల, మఱుఁ
గుచు శపియించె మఱచితే తొల్లి...
రం. రా. యు. 322 పా. 23 పం.

కం అఱువదివే లబ్దంబులు, నెఱయఁగ మని సుతులఁ
గనని నెవ్వగచేతన్, మఱుఁగుచు జర మేనం గ్రు
క్కఁటియఁగఁ దఱి దప్పి సుతుల నిల్లేఁ గంటిన్.
బా. రా. బాల. 185, కు సం 5. 580.

వి. 1. బాటు, వ్యవధానము

చం అవికయుఁ బట్టుపుట్టముచెఱంగు మఱుంగయి
యున్కిఁ జేసి, నైష. 6. 131.

కం. జడనిధి యను తెరమఱుఁ గటు, వెడలి నిలిచి
నట్టి యాటవెలఁదియపొలెన్. ..
ప్రభా 1. 57.

ద్వి· ఇరికిళ్ల గుమ్మలయెడలను దలువు, మఱుఁగున
బన్నార్లమాటువ....
పండితా. దీక్షా. 44 పా., అం. భా. 1. 76.

2 దాఁపఱికము

ఉ వట్టిమఱుంగు వెట్టి నుడువం బని లేదు.
ప్రభా 3. 72.

ఉ. . ఓ, హేమలతాంగి యింక మఱుఁ గేఁటికి నమ్మొక మాట పల్కెదన్, గాముఁడు సాక్షి గాఁగఁ గలకాలము కూడి సుఖింత మింపుగన్.
కవిరా 5. 150

3 చాటుకవులు తఱచుగాఁ బ్రయోగింపని మాట మూలమాట, అప్రతీతము.

(కవిత్వదోషములలో నొకటి)

సీ. .. ఈచ, లును ప్రాలుమాలికలును సందియము వేమఱపులు మఱుఁగులు వ్యర్థపదములును...
ప్రబంధ 16

4 మిష, నెపము, సాకు

మ. తమలోన న్మధురాపురాంగనలు చోద్యం బంది శ్రీకాళహ, స్తిమహాదేవుఁడు జంగమాకృతివి భూతిన్ భృత్యులం గూడి వచ్చి మదియవ్యర్థఁ దీర్చి యాత్మనగరీసీమోపకంఠంబు జే, ర్చి మఱుం గొక్కటి పెట్టి పోయె నిఁక నేరీతిం గనుం గొందుమో...
కాళ. 4. 109

జః మఱుఁగిడు, మఱుఁగుఁజొచ్చు, మఱుఁగుడు, మఱుఁగుదొడ్డి, మఱుఁగుపడు, మఱుఁగు పెట్టు, మఱుఁగుపెరడు, మఱుఁగువెట్టు, మఱుకువ, మఱుపడు, మఱుపెట్టు, మఱువ

**మఱుఁగుడు** వి. (√మఱుఁగు) తాపము

గీ. . కాఁక మఱుఁగు, దుడుకు సెగ తెర్ల నాఁగఁ జెన్నొందుఁ దాఁ, మునకు నామంబులై . .
ఆం భా. 1. 46.

**మఱుఁగుఁజొచ్చు** స క్రి (మఱుఁగు+చొచ్చు) శరణముపొందు

సీ. సెగ కుల్కు మఱుఁగుజొచ్చినజహ్నురవిజల సరణి మల్లెలతోడి జడలు మెఱయ.
ఆము. 2 58.

ద్వి మఱుఁగుఁజొచ్చినవాని మదిలోనఁ గరుణ, నెఱయఁ బ్రోచుట నాకు నియమవ్రతంబు.
ద్వి హరిశ్చ ఉ. 2461.

**మఱుఁగుదొడ్డి** వి (మఱుఁగు+దొడ్డి) మలవిసర్జన స్థానము (శ. ర.).

**మఱుఁగుపడు** అ. క్రి (√మఱుగు) దాఁగు, చాటగు, తిరోహితమగు

వ. ...అయాటవికుండు పెట్టెఁ దెఱచి యస్థిశకలంబులు చూచి తనవృద్ధావస్థకుఁ జిన్నఁ బోయి యవి యచ్చోటన పారం జల్లి తన పల్లెకుం బోయి మఱుఁగుపడి యుండె.. కాశీ 5 70.

సీ ఒరుదలగా వచ్చి యొఁగి మఱుఁగుపడఁగఁ జెవి నిల్లు గట్టుక చెప్పిరేని...
విప్ర 5. 40.

వ . . ఒ డొంటికిన్ బేరెంబులు వాఱి కుప్పించి తప్పించుకొనుదుప్పులు ఖురజ రజశ్ఛటల వెనక మెసంగు మసమసకల మఱుఁగువడియుండు గండోపలంబులును
మనుచ 4 86.

**మఱుఁగు (వె) పెట్టు – మఱువెట్టు** స క్రి (√మఱుఁగు) దాఁచు, గోపనము చేయు, కప్పిపుచ్చు

ఉ. ... పరికి నెట్లు దోఁచిన సహించుటగాని నిజంబు చెప్పకే, నేం మఱుంగు పెట్టి ధరణీవర...
కళా 7. 196.

ద్వి. మఱుఁగు పెట్టక చెప్పుమా నీకు నిట్టి, నెగులింతయును నేమి నెపమున వచ్చె.
ద్వి హరిశ్చ ఉ. 2108 పం.

సీ. మఱుఁగువెట్టక డెంద మెఱిఁగించుకై వడి గొబ్బునఁ బయ్యెదకొంగు సడల...
విక్ర. 1. 122.

**మఱుఁగుపెరడు** వి (√మఱుఁగు) మఱుఁగు దొడ్డి. (శ. ర)

**మఱుకువ** వి. (√మఱుఁగు) సంతాపము.

తరువోజ. మానితబలుఁ డభిమన్యుండు పోర, మడిసినప్పుడు నిట్టి మఱుకువ నాత్మ, యూనదు...
భార. స్త్రీ 2. 182.

గీ. అనిన ధర్మజుఁ డిట్లను నద్దురాత్ముఁ, బొలియఁ జేయుట దగదు దుస్సలఁ దలంచి, వాని నొక

తప్పునకు సైఁపవలదె యాంబి, కేయమహీషికి మఱుకున నేయఁ జనునె. .
భార అర 6 142

కం మండఁగ మండఁగ నార్చిన, ఖండితవిదలములుఁ గ్రుటితకౌపీనములున్, దండములు తుండములు నుగ, మండలశకలములుఁ జూచి మఱుకువ దోఁపన్ .. ఉ హరి 4. 75.

**మఱుగుజ్జు** విశే (మాఱు-ప్రతి+గుజ్జు) గూనివాఁడు, గూనిది

సి జాహ్నవీస్నానఫలము లీఁజాలుపరమపావనుం డొకమఱుగుజ్జుబ్రాహ్మణుండు
వరాహ 9 43.

చం. .. మఱుగుజ్జు ప్రేష్యకై, ధృతి సెడి యుగ్ర సేనునకుఁ బ్రేష్యత నొందియు దిద్ది యేలఁడే .
ఆము 5 53.

సీ. మఱుగుజ్జు నాఁగ నమరుఁ గుబ్జనామంబు
అం భా. 2 128.

**మఱుతు(త్రు)రు** వి భూపరిమాణవిశేషము, ఒకవిధ మగుభూమికొలత

వ .. రుద్రేశ్వర శ్రీమహాదేవరం బ్రతిష్ఠ సేసి నివేద్యానకు పెట్టినది నీరునేల మఱుతురు. 1 వెవిసేను... ద శా 4. 988.

వ క్రా(ంజ) కల్యాణకేశవదేవర అచ్చ (వల) మదుపడలకు సెత ఎట్టంజెఱువువెనక నీరునేల మఱుతురులు 4... ద. శా. 4.704.

వ. . శ్రీ మన్మహా మండలేశ్వరమండెరాజు శ్రీకేశవదేవరకు (నై) వేద్యార్థముగా నా(ం) దిఁడ్లవాయవ్యమునం దన కట్టించిన మల్లసము ద్రము వెనక నిచ్చిన నీరినేల మర్తురు ఒక్కటి...
ద శా. 4. 685.

వ. .. ఓంపిచెర్ల శ్రీ అనంతగోపినాథ దేవరకు అమావాస్యకొలువులకు ఓంపిచెర్ల అంనగద చెఱువు వెనకను నీర్నేల మఱ్తురు, 1. గు. జి. ఓంపిచెర్ల శాసనము 1242.

**మఱునాఁడు** వి ఔ. (మఱుస+నాఁడు) మఱుసటి దినము, పరదినము

మ మఱునాఁ డంధక వృష్ణిభోజయదుసామంతాగ్రణీసేన గం, దెఱగా సాత్యకి రాముఁ డుద్ధవుఁడు హార్దిక్యుఁడు లోనైన కొం, ద అమాత్యుల్ చను జుట్టిరా
ఉ హరి 2. 84.

గీ అనిన విని యెల్లవారును నధికహర్ష, మెసఁగ నున్నంత మఱునాఁడ యేఁగుదెంచె, భార్గవుం డమ్మునీంద్రులు పరమభక్తి, నర్ఘ్య మిచ్చిరి వహోత్రవాహనుఁడు గనియె
భార ఉద్యో 4 298.
రం రా. అర. 192 పా 12. పం.

**మఱుప(వ)డు** అ. క్రి (మఱుఁగు+పడు) చాటగు. తిరోహితమగు. దాఁగు

కం. తఱిమి హాలి హాలము విసరుచు, నెఱిఁ గదిసిన బెగడి విమతనికరము వెడవై, వెఱఁగుపడు నొదుఁగు నడఁగును, మఱుపడుఁ జెడు మఱియుఁ బోరలు మరలుం దెఃలున్
భాగ 10 పూ. 1534.

కం మిడిగడువుప్రేఁకమున నొక, యడుగే నిడ లేక యున్నయర్థాధిపతిం, బుడమిఁ బడఁద్రోచి పై మఱు, పడ శవములతిట్ట పేర్చి పరజన మరగెన్.
కవిక 2 121.

కం. సోమాన్వయప్రదీపకు, డీమెయిఁ దేజో విశేష మెసకం బెసఁగఁ, గా మెఱయుట గనుఁగొని సి, గ్గై మఱుపడుమాడ్కిఁ గ్రుంకె నర్కుం డంతన్ భార. భీష్మ 1 299

ద్వి ఇల మఱువడ్డ నిర్మలశివభక్తి, తల యెత్తువడు వునఁ దాఁ దల యెత్తు
బస. పు. 1. 416 , పం. భార. ఉద్యో. 4.672.

**మఱుపె(వె)ట్టు** స క్రి. (మఱుఁగు + పెట్టు)

1. దాఁచు, మఱుఁగుపఱుచు

వ. ...మరుం డొనర్పఁ గలకోత్తలకుం దివురుతమ కపు ముంగలిపొఁజులు నిగిడించు క్రొవ్వాఁడి తూపుల రూపున నొండొరువుల మఱుపెట్టి

చూచు నెలగోలు చూపుల పారి. 2. 51

సీ. వాదింప నొల్లరు వశమైనపనికైన మఱుపెట్ట నొల్లరు మన్ననైన కవిక. 6. 103.

వ ... గోపాలాదిశుద్రజనంబులకు న్మఱువెట్టం దలంచి వారల కభిముఖులై పాండునందను లిట్లనిరి భార. విరా. 1. 177

చం అనయము రాగ మొప్ప సహజానన చంద్ర కటాక్షపంక్తి ప. ర్వివనఘుళంకఁ గన్న మనుశ్రీ మఱువెట్టు ఆము 5. 15.

2 వంచించు, మోసపుచ్చు, మిష పెట్టు

సీ అరగంటి చూపున నలసరీతిని జూచు మఱుపెట్టు చూపున మరలి చూచు. కవిరా 2 13

సీ. మఱువెట్టి చనుదోయి మదనాంకములు సూచుఁ దను నవ్వువిభుఁ జూపులన యదల్చు నైష 7 191

చం తలఁపున నాథునిం గలసి తా నది నిక్కముగాఁ దలంచి మిం, చులఁ దులకించు మోవిపయి నోఁకిన కెంపులు గప్పిపుచ్చె నె, చ్చెలి మఱువెట్ట గాఁ దలఁచి... రాజ చ 3. 100

కం. తుమ్మెదవలె నున్నది యిటు, రిమ్మనని నెఱి కొప్పు నివిరి భ్రమసితిఁ దరుణీ, కమ్మనివిరి నల్ల గలు వని, క్రమ్మఱ మఱువెట్టు గట్టు కన రాకుండన్ విజ. 2. 143

మఱుమాట వి. (మాఱు+మాట) ప్రతివచనము

సీ. మాఱుమా టనఁగను మఱుమాట ననఁ గను బదులు మాటనఁ బ్రతివాక్య మొప్పు. ఆం భా 1. 114.

మఱుమేను వి. (మఱుస+మేను) పరజన్మము, ఉత్తరజన్మము.

చం పనివడి సేవ సేసి పరిపాకము వొంద కయ్యోఁ దేనిఁ జ, చ్చిన మఱుమేన నైన నది సిద్ధి వహించు. భాగ. 1. 100.

మఱుమ్రోఁత వి. (మాఱు+మ్రోఁత) ప్రతి ధ్వని.

గీ. ... ప్రతిధ్వని మఱుమ్రోఁత యన దగు భవ

ఆం భా 1. 122.

మఱువ వి (మఱుఁగు+వా) కుండ. (చూ. మఱువ కందు

విశ. మూఁగ.

గీ. కెరలి ...కిలించె షణ్ముఖు మఱువమావు, ... మఱు చూచెఁ గరి శుష్కపల్వలంబు. పాండు. 4 21

జ. మఱువకందు.

మఱువకందు వి (మఱువ+కందు; అగస్త్యుఁడు

ఆ మఱువకందుజోగి తెలువాయి మెకమున్న, చెంత కఁగి యతనిచేత విండ్లుఁ, గత్తులములు దూఁగ ములును దద్దయుఁ, గొంచు నతఁ డనిరి పంచ వటికి అచ్చ రా. అర. 7

మఱువు-మఱుఁగు అ క్రి. చాటగు, తిరోహితమగు.

చం వెలవు లలంతికంపమును వీడని వ్రీడయు మాఱు సేయఁగా, నెఱుఁగమి యేపులేమి పరియొత్తెడు చొక్కులకోలు ముందుగా, మఱువు మొగంబు నోఁటయును మాటుగ జిప్పలఁ గప్పుచూ డ్కియుం, దెలువ నవాగ్రసంగతి బ్రతిక్రియలై యలరించె భూవిభున్ కవిక. 3. 221.

వి. 1 చాటు, ఓలము, అడ్డు

గీ. అంధకారంబునందును వణఁగిపోదు, దీప తేజంబు నందును దిరిగిరాదు, ఎట్టిమఱుఁ లైనఁ గన్పించు నెదురు లేక, చారుతర మైనయట్టి విచారదృష్టి. వాసిష్ఠ 1 170.

కం. వెలిచి వెలిచి యడిగెద మే, మెఱిఁగింపఁగ వలయు నొకటి యీ వెవ్వఁడ వీ, కొలమాలి నగొల్లతనము, మఱువున విహరించె దిట్లు మహి నాత్మేచ్ఛన్. హరి పూ. 7 284

కం విఱిగి నిశాటులు రావణు, మఱువున కేతెరఁ జూచి మనమునఁ గోపం, బెఱుకపడ సుపా ర్శ్వుఁడు వడిఁ, బఱపెన్ వానరులమీఁదఁ బటువిశిఖంబుల్. భా రా యు. 1509.

వ. ... మొదలం గదన-బునకుం దెచ్చుకొన్న మహా

చలశ్ళంగాదులు బలువిడిం బడుజాణ జాలంబు లకు మఱువుగా నొడ్డువారును..

భా. రా యు 554.

2 కవచము.

గీ మానుసులువోలె మున్నార లేను లేని, తటి మహాగుణశాలి నాతనయుఁ గాచి, కొనఁ గడం గర సింగారమునకుఁ గాక, మఱువులను గైదువులు మీకు మానమునకె

భార. ద్రో 2 268

ఆ అతనిహారులఁ గొంద అఱదంబుఁ గొందఱుఁ మఱువుఁగొంద ఱేచి నఱకి రపుడు.

మార్క 8. 107.

చం. మఱువులు సించుచుం బెలుచ మస్రిము లూడ్చుచు నోలిఁ గైదువు, ల్విఱుచుచుఁ గేలు దోయి విదళించుచు. భా. రా. అర. 2 197.

జ: మఱుపుకొను, మఱువునొచ్చు, మఱువెట్టు.

**మఱుపుకొను** అ. క్రి. (మఱువు+కొను స్వార్థమున) దాఁగుకొను, మఱుఁగుపడు

కం త్రినయన పుత్రుఁ డట వెను, కొన సురపతి వఱచె మఱుపుకొన నజుని హరిం, గని యెందు శరణు గానక, చనియె మహాదేవ నీవ శరణ ఁను భాతిన్... కు. సం 10. 438.

**మఱువునొచ్చు-మఱుఁగుఁజొచ్చు** స క్రి శరణు పొందు

ఆ. అనుజఁ జూచి కష్టమనుజులఁ గూడి నా, పనువు సేయకుండఁ జనునె నీకు, ననుచు నుదరి పలుక విని హిడింబయుఁ గడు, వెఱచి భీమ సేనుమఱువు నొచ్చె... భార. ఆది. 6. 201.

కం. ఆరథనివహంబులు న, వ్వారణములుఁ దెరలి మరలి వడిఁ బఱచుటయుం, గౌరవ బల మెల్లను రణ, కూరుడు గాంగేయు మఱువు నొచ్చె వికలమై. భార. భీష్మ 2. 294

**మఱువెట్టు-మఱుఁగుపెట్టు**

గీ. .. మఱువెట్టె ననఁ దగు, మఱుఁగుపెట్టె ననుట.. అం. భా. 3 135.

**మఱుస** విశ. వె. అనొ. అనంతరము, తరువాతిది.

కం. విను ప్రద్యుమ్నుని దక్కన్, మనమున నే నొరు వరించుమాట విడువు మా, ఘనుఁ డొల్ల కున్నఁ జెందుదు, మనసిజశిఖిఁ దనువు వేల్చి మఱుసటిమేనన్... ప్రభా 3. 102

కం ఆకొకిఁ గడకవిభుఁ డొక. కోటర గర్భమున నణఁగికొని యుండుట నా, చే టొదవ దయ్యె వానికి, నాఁటికి నది పోయె మఱుసనాఁ డుద యమునన్ వేం పంచ 3. 9.

కం ఈరీతిఁ బడకయింటికిఁ, జేరంజని మఱుసనాఁడు చీకటి జేజే, రారాకళ రారాఁగల, యారజనీ వేళ విరహ మగ్గల మయ్యెన్.

హంస. 5. 198.

జ మఱునాఁడు, మఱుసంజ

**మఱుసంజె** వి (మఱుస+సంజ) సాయంసంధ్య

సీ ఒకదివిఁ దొలుసంజ యున్మేషమునఁ బొందు నుదయించు మఱుసంజ యొందుదివి.

కాశీ. 1. 129.

(మఱుసంజ. శ. ర పా.).

**మఱ్ఱి-మఱి** వి. వటవృక్షము

సీ. అభ్రంకషాభోగ మగుమఱ్ఱికొమ్మను గట్టిన ప్రేలెడినుట్టి యెక్కి.. విక్ర. 2. 44

వ. మఱ్ఱిపండులవడువు గలమడమల బెడంగుపడి... ఆము. 6. 98., అం. భా. 2. 44

**మత్తిత** వి. (క. మత్తు-పిచ్చి, బుద్ధిహీనత) మూర్ఖురాలు, అవివేకిని.

ఉ. మత్తితవోలె మాపడుచు మాంసపలన్ జళికింపఁ బూని నీ, వెఱ్ఱితనాలు మాన వని వేడ్క ని టాడఁగ నింటనుండి తాఁ, జిట్టునఁ గోపగించు కొని చెప్పఁడు చేయఁడు లేచిపోయె మీ, వెఱ్ఱి యగారు మంచిగురువే దొరికెన్ జదు వెట్లు చెప్పునో.. వై జ. 4. 12.

**మల** వి (క. మలె. త. మలై.) పర్వతము, కొండ.

సీ తూఁగాడుపయ్యెద దోఱూయమాన మై మల వైజయంతికామహిమఁ బడయ...

కేఁగి నిర్వ. 5 80.

కం. అసితఫణిభీషణం బగు, వసి చేకొని యాయత మగునంసమున నమ, ర్చి సముద్ధతి నరదముడిగి, మసరు కవిసి కదిసె మారి మసఁగిన భంగిన్ . హరి ఉ 10. 97.

గీ ... బలోదారుఁడైన, మహిషుఁ డెవ్వుడు మద మున మసరు కవిసి, కలఁచుచున్నాఁడు త్రిభువన కమలవనము మార్క. 6. 67. భాగ 10. పూ. 765.

జ. మసరిడు , మసరుకొను.

మసరిడు అ క్రి. (√మసరు) పొగరెక్కు. గ్రొవ్వు.

చం. అసమసుగంధబంధురములై చెలువొందెడు షడ్రసాన్నముల్ , బసవనియింట నిత్యము నపా రముగా భుజియింపుచుండు నీ, కుసుమ శరారి భక్తులను గూరిచి పెట్టఁదలంచి నాఁడవో, మస రిడి మత్స్యమాంస మనుమానము లేక భవద్గృహంబునన్. చెన్న. 4. 343.

మసరుకొను అ క్రి. (మసరు + కొను స్వార్థమున) మదించు, పొగరెక్కు.

వ. ... చటులవాల ఘాతంబుల నుద్ధూతంబులై మసరుకొని విసవిస విసరుగాడ్పులఁదూలి (మసరుకొని – తీవ్రమయి అని భావము ) శ్రీరం 1. 132.

మసరులు వి. బ. ధాన్యవిశేషము, ఒక జాతివడ్లు

సీ. మణిసరుల్ మసరులు మంకెనల్ పగడంపుతీఁగెలు మడిప్రాలు దేవసరులు. హంస 4. 128

మసలు అ. క్రి. (క మసలు) 1. ఆలస్యముచేయు, జాగుచేయు.

సీ. ఉత్సవ సందర్శనోత్సుకులై పోయి కదుఁ బెద్దప్రొద్దయ్యె, గొడుకు లేల, మసలిరో కౌరవుల్ విసువక వైరంబు గావించు పాపస్వభావు లెఱిఁగి ... భార. ఆది. 7 207.

ఆ ఎలమిఁ దేరిమీఁద నిలుచుండి పడమర, దిక్కు చూచుచున్న యుద్ధురాత్ముఁ, మస్తకంబు దునుము మసలక యని యర్జు, నునకుఁ జూపె సైంధవుని మురారి. భార. ద్రో 4. 318.

కం పతి పరదేశాంతరపరి, గతుఁడై క్రమ్మఱక యచటఁ గడు మసలుటయున్ , మతి దుందుడుకుం జెందెడు, సతిఁ ప్రోషితభర్తృకయనఁ జనునంద్రు బుధుల్. కావ్యా 8. 62 , అం భా. 3 97.

2 తప్పు, (చూ నెలమసలు )

3 వర్తించు, ఉండు

కం విసవిస నెప్పుడు నుడుగక, విసరెడి వలిచేత వడఁకు నిడువక మనముం, బస చెడి మార్గము గానక, మసలితి మఁతటను నంకుమంతుఁడు. వాడిచెన్ భాగ 10 ఉ. 1001.

ఆ మదనుఁ గన్నతల్లి మాధవు నిల్లాలు, బ్రదుకు లెల్లఁ దానె పట్టిచూడ, ముఖ్యమైన లక్ష్మి ముమ్మయ్య కాంతాత్మ, మందిరంబునందు మసలుఁగాఁత శివరా 1 5

4 కలుగు

ద్వి. మగుదయేరాలికి మసలె గర్భంబు ... పండితా మహిమ. 287 పూ.

5. విహరించు

కం క్రేళ్లుటికి మసలె లేఁగలు మల్లడిగొని అంకె లిడియె మద వృషభంబుల్ . భాగ. 10 పూ 178.

రగడ. తగ మసలు భసల సంతానముల గానముల ... రాఘవ. 2 6.

కం. తనుఁ దాఁ గానని మనుజుని, మనము నిరోధింపఁ బడక మసలుచుఁ దిరుగున్ ... సీతారా. 3. 56.

6. మసలు, వెనుదిరుగు.

సీ. వసులాభ సంపత్తి మసలెనే జాహ్నవిఁ జేకొన్న శంతను క్షితిపమణికి ... వసు. 2 137.

గీ. పెలగ జముకీలు గిల్కొన్న పృథివి మూరు, కొని మసలి పోక యొకభంగిఁ జనియెఁ గరులు .... రా, వి. 2. 50.

సీ. అమ్మ యెవ్వరిఁ బెండ్లియాడెదవే యన్న ముసి ముసి నగవుతో మసలుటయును ..
దశా. 8 82

7. పరాజితమగు, ఓడు.

సీ. అదితి యింటఁ బయోవ్రత మాచరించి, భర్తృ సంగతి సౌఖ్యసంపదలఁ బొదల, నెలమసలె వెల్లజిగి గల్లముల నెదుర్చ, నెల మసలె నెల్లు తొమ్మిది నిండె నంత. దశా 5 58

8 కడఁగు, యత్నించు.

ద్వి అందును మధ్యదేశానీక మర్త్య, సందోహ మట్టుల సహజభాషలను మసలి యొఁడొరు లతో మాటలాడుచును.
పండితా. పర్వ. 356 పొ.

9. మలమల గ్రాఁగు, మఱఁగు

వ్యవ. నీళ్లు మసలుచున్నవి.

10. నీళ్లు మొ. గ్రాఁగునపుడు కళకళమను

చం. కనుమలు గుట్టలు నగ్నసలఁ గ్రాఁగిన సైకత ముక్కు గుబ్బముల్, గనగనలాడు కుంప టులు . సానందో. 2. 6.

మసలిక, మసలుకొను

**మసలాఁడి** వి. (మసలు + ఆఁడి) విలాసవతి, శృంగారచేష్టలుకల యాఁడుది.

ద్వి మసలాఁడి యిది చెప్పుమాటలు విన్న, వసు ధేశ్వరుం డెంతవాఁ డనువారు .
ద్వి. శ సా 3 183 పం.

**మసలిక** వి. (√మసలు) మాంద్యము, మెల్లన.

చం. బిసబిసఁ బోక యొయ్య నడపింపుఁ డరుంగు మెఱుంగు మెట్టికల్, మసలిక నెక్కుఁ డెచ్చరిక మచ్చిక నిల్పుఁడు భద్రపీఠికన్ .
పాంచా. 4 21.

**మసలుకొను** అ క్రి. (మసలు+కొను) వెనుదీయు.

సీ. సిగమీఁది విరవాది చేర్చుకక్కవసఁ గాంచి మఱి వసంతుఁడు కొంత మసలుకొనఁగ ..
పాంచా 4. 15

**మసారము** సం వి అ పుం. ఇంద్రనీలమణి

**మసాలా** వి (హిం. మసాలా) మిరియము, జీలకఱ్ఱ, మెంతులు మున్నగు తాలింపు సామాను, ఁం కారము

వ్యవ. మసాలా గారెలు చాల రుచిగా నుండును.

**మసి** వి. (సం మషీ. ప్రా మసీ) 1 నల్లని చూర్ణము, నల్లనిగుండ.

సీ. రమణి డెందంబువేఁడిమి మాఁడి మసియైన పుప్పొడి మెయినిండఁ బూసికొనుచు . .
వి శకుం. 3. 20?.

సీ తలఁ బడ్డగుదియ దెబ్బలఁ జాఁతమసి యిడి యంబలి గం జండ్ల నడుగువారు ...
ఆము. 6 85.

సీ భస్మవిశేషఁబు పరగను గఱు కన మసి యన...
ఆం భా 2. 242.

2. భస్మము, బూడిద.

గీ మాడుగులు వేల్చె నొడ్డాది మసి యొనర్చె .
ఆము. 1. 36

వ. . పెనుమంట మండి మసులై పడిన యట్టాలక చిత్రయంత్ర ప్రాతంబులును . .
భా. రా. సుం. 488 , మనుచ 1. 27.

3. నలుపు, మాలిన్యము.

ఆ. మడుఁగుఁ జీరయందు మసి తాకిఁనట్లు మీ, సత్కులమునఁ గల్మషంబు కొర, వేంద్రు కతనఁ బొందె . . భార. ఉద్యో 1. 295.

4 సిరా, వ్రాయుట కుపయోగించు నల్లని ద్రవము (గ్రా.).

విశ. నల్లనైనది. మురికియైనది.

సీ మసిబూడి దయ్యె నిర్మలకేలిదీప్తి కాకమలి నీకష్మోరకైరవములు ... భీమ 4. 143.

సీ. మసిమంగలముచాయ మైమొగంబు బెడంగు నినుప కడెంబులు . .
ఉ. హరిశ్చ. 4. 157.

కం... త త్తనుసాం, గత్యము మసిపాఁత మానికంబై యొదుఁగన్ .. ఆము. 6 5.

ద్వి. పలుచని మొగిలులోపలఁ దోఁచుచంద్ర, కళ

భంగి మూఁగుడు గవిసి మానికపు, బొమ్మను మసిపాతఁ బొదిగిన మాడ్కి, నెమ్మేని క్రొమ్మించు నిగుడక మాసి
ద్వి పారిశ్ర ఉ. 2089

సా. మసిపూసి మారేడుకాయ చేయుట – వంచించుట, మోసగించుట

వ్యవ వాఁడు నన్ను మసిపూసి మారేడుకాయ చేసినాఁడు

జ మసికట్టు, మసికోఁతి, మసిబుడ్డి, మసిముట్టు, మసిమోచు

మసి నం. వి ఇ పుం. స్త్రీ 1 సిరా 2 దీపపుమసి, కాటుక. 3 నీలశేఫాలిక (వ్య. వి) 4. శస్త్రి 5 కృపణతృష్ణ (కే. ని.)

మసిక నం. వి. అ. స్త్రీ నీలశేఫాలిక (వ్య. వి).

మసికట్టు వి. (మసి + కట్టు, బ మసికట్లు.) కమసాలి దుకాణమందలి కుంపటి బూడిదకుప్ప (బంగారు లోనగువాని చిలుము అని శ ర., బ్రౌ.)

గీ. కాన భవదీయవిరహయోగమున నాకుఁ, గల హరిత్తులు మసికట్లుగాఁ దనర్చుఁ, గాంచి నమ్రుడ నైనసత్కవిని నన్ను రాగ మిటనూని ప్రోవవే రాజపుత్రి . విల్హ. 2. 148.

మసికము నం. వి. అ. పుం. పాముకన్నము, సర్ప బిలము (విల్స్యమ్సు.)

మసికోఁతి వి. (మసి + కోఁతి) నల్లని మొగము గలకోఁతి, కొండముచ్చు (శ. ర.)

మసి(సీ)జలము నం వి. అ న సిరా (త్రి ని.).

మసిధానము నం. వి. అ న. మసిబుడ్డి, సిరాబుడ్డి.

మసిధాని నం వి. ఈ స్త్రీ. – మసిధానము.

మసిపణ్యుఁడు నం వి. అ. పుం. లేఖకుఁడు, వ్రాయసకాఁడు (త్రి. ని)

మసిప్రసువు నం. వి ఉ. స్త్రీ. 1 లేఖని, కలము. 2. మసిబుడ్డి, సిరాబుడ్డి

మసిబుడ్డి వి. (మసి + బుడ్డి) సిరా పోసికొను బుడ్డి (శ ర.).

మసిమణి నం. వి. ఇ. పుం. మసిధానము (త్రి.ని.).

మసిముట్టు అ. క్రి. (మసి + ముట్టు) వ్యర్థమగు.

కం. ఇంతింత పౌరుషము లో, కృంతయు మసిముట్టకుండ నిటు సేయఁగ దై, త్యాంతక త్రిపురాంతకుఁ డొకఁ, డంతియ నీయంత వార లన్యులు గలరే .. హరి పూ. 8. 117.

మసిమోచే అ. క్రి (మసి + మోచే) మాయు, ధూళి లోనగునవి పడి వివర్ణత కలుగు

చం ముగురును నాకుఁ జూడఁగఁ ద్రిమూర్తులు తప్పదు లేక వాహమున్, బొగరున నొక్కఁ డెత్తుక నభోగతి నేఁగుట యెట్లు లెక్కకున్, మిగిలిన సేన నొక్క డహమించి వధించుట యెట్లు వారిలో, మొగఁ దగువాని కింత మసి మోవక త్రుంగుట యెట్లు సైన్యముల్
జై. భా. 2 43.

మసిపర్ధనము నం వి అ. న. రసగంధము,గంధకము.

మసీదు వి. (హిం మసీద్) తురుష్కుల దేవాలయము.

సీ అదె పాండవులగుడి యట దక్షిణంబునఁ గర్తారుఁ డుండుతురుష్కుల మసీదు .
క్రీడా 149.

మసీన నం. వి అ స్త్రీ. తెల్లయవిసి (వ్య. వి.).

మసుర నం. వి అ. స్త్రీ 1. కాయధాన్యము, కలాయము (బటాని). 2. వేశ్య (శ ర, ఆ. ని).

మసురము నం వి అ పుం 1 ఒకజాతికాయధాన్యము 2. చర్మముతోఁ జేసిన యాసనము

మసురి నం వి. ఈ. స్త్రీ. వేశ్య, లంజె (కే ని).

మసూర నం వి అ. స్త్రీ. 1. వేశ్య (శ. ర). పుం, స్త్రీ చిఱుసెనగలు (శ. ర.).

మసూరము నం. వి అ పుం. 1. ఒకజాతి కాయధాన్యము. తలగడ, దిండు. (మే ని.)

మసూరకము నం. వి. అ. పుం. 1. తలగడ, దిండు. 2 కాయధాన్యము, చిఱుసెనగ

మసూరవిదళ నం. వి. అ. స్త్రీ. 1. నల్లతెగడ.. వ్య. వి.). 2. శ్యామలత.

మసూరి నం వి ఈ. స్త్రీ 1 స్ఫోటము, అమ్మవారిజబ్బు 2 ఎఱ్ఱతెగడ (వృ వి) 3 వేశ్య, భోగముది (కే ని).

మసూరిక నం వి. అ స్త్రీ 1 వసంతరోగము, స్ఫోటకము 2 దోమతెర 3. కుంటెనకత్తె, కుట్టెని 4 కాయధాన్యము, చిఱుసెనగలు.

మసృణము నం విశ (అ ఆ అ.) 1 స్నిగ్ధము. చిక్కనిది 2 మృదువైనది, మెత్తనిది 3 మనోహరమైనది, ఇంపైనది, శ్రావ్యమైనది వి. అ పుం మసృణత్వము (వై. ని)

మసృణి నం వి. ఈ స్త్రీ అతిసి, నల్లగిసె (వృ వి.) (వై. ని).

మసృణితము నం విశ (అ ఆ అ) మృదువుగాఁ జేయఁబడినది, మెత్తనిదిగాఁ జేయబడినది.

మసెల వి అటుక (శ ర)

మస్కరము నం వి. అ. పుం. 1 వెదురు (వృ వి). 2 గతి, గమనము, నడచుట 3 జ్ఞానము

మస్కరి నం. వి న్ పుం 1 పరివ్రాజకుఁడు, సన్యాసి 2. చంద్రుఁడు (వాచ).

మస్టు – మసటు వి (క మసటు, త మష్టు) మాలిన్యము, ముఱికి (మష్టు శ ర.)

సీ మలవాచకం బగు మసటు నింపిరి మష్టు .
ఆం భా 2. 134

ఉ కాలసమాఖ్యచే నలరుకంచరవాఁడొక తామ్రపాత్రము, ద్వేంసుధారుచిం దవరు వెన్నెల పీసము జేతు నంచుఁ బ్రా, ల్మాలక తోముఁగా వెడలుమ స్టన సర్వదిశాంతరంబులన్, మూల తమస్సమూహములు ముంచుకొనె న్మఱియున్నమగ్రతన్ సానందో. 5 133.

ద్వి గలకఁ దొలంగిన కమలినివోలె, బలుమస్టు గడిగిన బంగారువోలె .
రం రా. బాల 51 పా. 5 పం.

మస్తకము నం. వి అ. పుం. న. శిరస్సు

మస్తకస్నేహము నం. వి. అ. పుం. మెదడు, మేదస్సు

మస్తదారువు నం. వి అ. పుం దేవదారు వృక్షము.

మస్తము నం వి. అ న. శిరస్సు, తల విశ. (అ ఆ. అ) ఎత్తైనది.

మస్త(క)మూలకము నం వి అ న కంధరము, మెడ

మస్తరించు స క్రి. (√మస్తర.) 1 కళపఱచుకొను

ఉ ఎంతయు ఘోరమైన విపినేశము మెల్లన మస్తరించి మా, వంతుఁడు గంధసింధురగు దెవైచి సుఖంబున నెక్కునట్టులు కాశీ 5 226

గీ మనసు గరగించి భ్రమయించి మస్తరించి, మిగులఁ జొక్కించి యెంతయుఁ దగులు వఱచి, పాసి యెడఁబాసి తమబటు చేసికొనరె, వామలోచన లెంతటివారి నైన
ప్రబోధ 1 75, రా వి 2. 50.

2. ఆస్ఫాలనముచేయు, తట్టు, చేతు లప్పళించు

చం కనఁదగు తెల్లమానికపుఁ గప్పుల నొప్పెడు చప్పరాలలోఁ, దనపొడవైన నీడఁ గని తాళిక యేనుఁ గటంచుఁ గొమ్ములన్, జెనకఁగ వచ్చి కోటపయిఁ జేసిన ముత్తెపు సింగపుంగమిన్, గనుగొని పాఱువేల్పుదొర గొంతఁ డొదల మస్తరింపగన్ యయా. 1. 5.

గీ హస్తమున హస్తి మస్తంబు మస్తరించి, వెలయు శ్రీహరి శుభము గావించు మాకు . .
వాల్మీకి 1 106.
అ. మ క. 5. 242 పా 145.

మస్తరించె ననంగను మనును జేతు, లప్పళించెనటంచు ... ఆం. భా 3. 106.

3. ప్రవేశింపఁజేయు.

పీ మునుమున్న చనిదైన తన ప్రజ్ఞయంతయు మతివిశేషమునందు మస్తరించి ..
పాండు. 1. 9.

4. హెచ్చరించు, ప్రోత్సాహపఱచు.

గీ. ఫణిహరం తురంగసుతుఁడు పాహెణులు సారె,

ధీరె యని మస్తరింపఁగఁ దేజినెక్కె ...
చంద్ర. 2. 17.

మస్తరు వి. లోఁబడుట, అధీనమగుట (చూ. మస్తరించు)
జ మస్తరించు.

మస్తకము సం వి అ. పుం తల, శిరస్సు (వై. ని).

మస్తిష్కము సం. వి. అ. న తలలో నుండు మజ్జ. మెదస్సు, మెదడు

మస్తీ వి మదించిన యేనుఁగు
మ తెలిపూగద్దియ గాడుపుం గొడమ మస్తీనెక్కి. లేఁదేఁటి గం, టల సందిల్లు రొదాళము ల్బరవ మింట న్వెంటఁ జంద్రాముల, గ్గలికన్ ముంగల శారుదీర నడువంగాలార్చుచు న్నూకి కెం, దలిరుం బెద్ద హజారపు న్నడిమిచెంతిస్ డిగ్గి తా వచ్చటన్.
చంద్రా 3. 51.

మస్తు వి (క. మస్తు త. మస్తు) 1. మదము, మత్తు
గీ మస్తు మీఱిన సురహస్తి మస్తకంబు, కుస్త రించిన మామక హస్తములకు, హాయిగా నీని తంబంబు లంట నీవె, కంట నామీఁద నేల వాల్గంటి నీకు. అహల్యా 3 94.
సీ మదము రాజులు మస్తు మత్తు మత్తా యన
ఆం భా 2 195.
సీ కొమ్ముకత్తుల మెఱుంగుల వెల్లపావటల్ గొను నది మస్తేనుఁగులచయంబు ...
కువల. 2. 127.
2 సమృద్ధి (శ ర)
విణ సమృద్ధము, అధికము (బ్రౌ.).
జ. మస్తునాఁడు

మస్తువాఁడు విణ (√మస్తు) మత్తుఁడు, మదించిన వాఁడు
సీ ... మస్తువాఁ డన మత్తుఁడు పరగుచుండు.
ఆం. భా. 3. 7.

మస్తులుం(గ)కము సం. వి. అ. పుం. న. 1. మెద స్స, మెదడు (వై ని.). న. వస్తువు రధి మండము (కే. ని)

మస్తువు సం. వి ఉ. న తోడు పెట్టఁబడిన పాలలోఁ బెరుఁగు కాఁగా నిలిచిన నీరు పుం స్త్రీ ముష్టి. పిడికిలి (కే ని.)

మహ సం వి. అ. స్త్రీ గోవు, ఆవు

మహాక్షము సం వి అ పుం. అంతటను వ్యాపించు పరమళము, సుగ ధము (కల్ప)

మహతి సం. వి ఈ స్త్రీ 1. వీణాభేదము, ఒక రకము వీణ 2 నారదునివీణ 3 వార్తాకి, వంగ చెట్టు 4 బృహతి, వాఁకుడు (వృ వి). 5 శ్యామ, నల్లతెగడ (వృ వి) 6 (ఆంధ్ర వ్యాక.) తి వ్యర్జదేతర స్త్రీవాచకశబ్దము.

మహత్తరుఁడు సం. వి. అ పుం 1. ప్రధాన పురుషుఁడు, ముఖ్యమనుష్యుఁడు 2 రాజపురుషుఁడు, ఆస్థానోద్యోగి. రాజసేవకుఁడు 3. ఊరిపెద్ద, పల్లెపెద్ద. 4. శూద్రుఁడు విణ (అ ఆ అ.) గొప్పవాఁడు మొ

(దీనికి వృత్తిని సమాసాధికరణము పరముకాఁగా ఆకారం మంతాదేశముగా వచ్చును)

మహత్తు సం. విణ (త్. తీ. త్) 1 గొప్పది, పెద్దది. 2. సమృద్ధమైనది, అధికమైనది 3. పొడవైనది, వ్యాపించినది 4. పవిత్రమైనది, పూజ్యమైనది
వి త్ పుం 1 ఒంటె, లొట్టియ 2 మహత్తత్త్వము (సాంఖ్యవేదాంతమున సాంఖ్యులచే న గీకరింపఁబడిన పంచవింశతి తత్త్వములలో రెండవది యగు తత్త్వము) 3 మహర్లోకము. 4 బుద్ధి (కే ని.)
త్. న 1. రాజ్యము. 2. సమూహము (కే.ని), 3 ఉదకము (వై ని.) 4 (ఆంధ్రవ్యాక.) స్త్రీ తిర్యగ్జడభిన్నంబును, వాని విశేషణంబును. ఉదా. రాముఁడు గుణవంతుఁడు, రాముఁడు మొ.

మహత్త్వము సం. వి. అ న. 1. గొప్పతనము, పెద్దతనము (తిరుప్ప.) 2. పెద్దపరిమాణము. 3. సామర్థ్యము, బలము. 4 ఉన్నతస్థితి, ఔన్న

త్వము 5 తీవ్రత, మిక్కుటమగుట (విల్యమ్సు)

మహనీయుఁడు సం విణ (అ ఆ అ.) ఘనుఁడు, గొప్పవాఁడు

మహము సం వి. అ పుం ఉత్సవము (అమర కోశము)

మహముదులు వి బ వస్త్రవిశేషములు
ఒగడ బుడుతకాసేలు మహముదుల విరాసీలు
హంస 5 356.

మహర్ సం అవ్య ర్ భూలోకాదు లగునేడు లోకములలోను నాల్గవది యగులోకము (సువర్లోక జనోలోకముల మధ్యమున నుండు లోకము. దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు ఉదా మహర్లోకము)

మహలు వి (హిం మహల్) మేడ హర్మ్యము.
గీ మహలు మేడ యనఁగ హార్మ్యమగు ..
సాం. ని స్థా 67.

మహల్లకము సం వి అ. పుం మహాభవనము, రాజమందిరము (ఆ. ని.).

మహర్లి(ల్ల)కుఁడు సం విణ (అ ఆ అ) 1. బలము లేనివాఁడు, దుర్బలుఁడు, ముసలి వాఁడు వి అ పుం. కంచుకి, రాణివాసపుఁ గావలివాఁడు.

మహల్లుఁడు సం వి అ పుం కంచుకి, రాణివాసపుఁ గావలివాఁడు (అ ని ).

మహస్వంతము సం. విణ. (త్ స్వతీ త్) ప్రకాశమానమైనది జ్యోతిస్సుగలది.

మహస్వి సం విణ. (న్. ఈ న్) ప్రకాశమానమైనది, జ్యోతిస్సు గలది.

మహస్సు సం. వి న్ న 1. ఉత్సవము, ఉత్సవకార్యము. 2. యజ్ఞము 3. జ్యోతిస్సు, కాంతి 4. మహిమము 5. సంతోషము. ఆనందము. 6. శక్తి, మహత్త్వము 7. సమృద్ధి, విస్తారము. 8. జలము, నీరు (కే ని )

మహాంగము సం వి. (అ ఆ ఈ. అ) స్థూలమైనది, లావైనది
వి అ పుం. 1 ఉష్ట్రము, ఒంటె. 2 మూషికా విశేషము. ఒకజాతి యెలుక, పందికొక్కు. 3 ఆవుగోరిజ 4 రక్తచిత్రకము, ఎఱ్ఱ చిత్రమూలము (వై ని ).

మహాంబుజము సం వి అ. న ఒకానొక పెద్ద సంఖ్య. లక్షపద్మములు (వై ని )

మహాకంటకిని సం వి ఈ స్త్రీ వికంకతము. వికర వృక్షము,

మహాకందము సం వి అ పుం 1 వెల్లుల్లి (వృ ని ) 2 మూలకము, ముల్లంగి (వృ ని.), 3 విశ్వభేషజము. సొంటి (వై ని )

మహాకచ్ఛము సం వి. అ పుం 1 సముద్రము (మే ని ) 2 పర్వతము. కల్ప )

మహాకచ్ఛుడు సం వి అ పుం వరుణుఁడు (మే ని )

మహాకపర్దము సం వి అ పుం శంఖము. (విల్యమ్సు )

మహాకపిత్థము సం. వి అ పుం 1 బిల్వవృక్షము, మారేడు చెట్టు 2 నీరుల్లి, రక్తలశునము (వృ. ని ). 3 చాణాఖ్య మూలకము, చిన్న ముల్లంగి (వృ. ని ).

మహాకరంజము సం వి అ పుం. ఒకానొక వృక్షము, కరంజభేదము (వృ. ని ).

మహాకర్ణికారము సం. వి అ పుం. ఆరగ్వధము, రేల (వృ ని.).

మహాకాయము సం. వి అ పుం 1. ఏనుఁగు. (వై ని.)

మహాకాయుఁడు సం విణ (అ ఆ అ.) పెద్ద శరీరము గలవాఁడు, స్థూలకాయుఁడు. వి అ. పుం. శివపరిచారకుఁ డగు నంది.

మహాకాలము సం వి. అ. పుం. 1. కాకిదొండ, కింపాకము (వృ. ని ). (హాలాని.) 2. ఉజ్జయినీ పురమం దున్న మహాకాలేశ్వరుని యాలయము.

మహాకాళి సం. వి. ఈ. స్త్రీ. దుర్గాదేవి.

మహాకాలుఁడు సం. వి. అ. పుం. 1 శివుని గణములలో నొకఁడు (వై. ని.) ప్రమథులలో నొకఁడు ఉజ్జయినీ పురమందలి దేవుఁడు (మే. ని.) విణ. (అ. ఆ. అ.) మూర్ఖుఁడు.

మహాకావ్యము సం. వి. అ. న. గొప్పకావ్యము (అష్టాదశవర్ణనలు కలిగినది.).

మహాకీర్తనము సం. వి. అ. న. గృహము (వై. ని.).

మహాకుంభి సం. వి. ఈ. స్త్రీ. కట్ఫలము, లేఁకు (వృ. వి.)

మహాకోశఫల సం. వి. ఆ. స్త్రీ. దేవదాళి, డావర దంగి (వృ. వి.)

మహాకోశాతకి సం. వి. ఈ. స్త్రీ. హస్తిఘోష, పెనుఁగుబీర (వృ. వి.).

మహాక్షీరము సం. వి. అ. న. చెఱకు (వృ. వి.) (విల్యమ్సు.)

మహాఖర్వము సం. వి. అ. పుం. న. గొప్ప సంఖ్య, పదిలక్షలకోట్లు

మహాగంధ సం. వి. ఆ. స్త్రీ. 1 చాముండ, దుర్గ 2 నాగబల, బీర (వృ. వి.) 3 కవిక మొగలి (వృ. వి.)

మహాగంధము సం. విణ. (అ. ఆ. అ.) మిగుల సువాసనగలది. వి. అ. న. 1. హరిచందనము. 2 బోళము, బాలెంతబోళము

పుం. 1. జలవేతసము, నీటిప్రబ్బలి (వృ. వి.) 2 కుటజము, కొండమల్లె (వృ. వి.).

మహాగణము సం. వి. అ. పుం. ఒకానొక పెద్ద సంఖ్య (100,00,00,00,00,00,00.)

మహాగణులు సం. వి. అ. పుం. బ. జంగాల గురువుల బిరుదు.

మహాగవము సం. వి. అ. పుం. గవయమృగము. (కల్ప.)

మహాగురువు సం. వి. ఉ. పుం. 1. చాలగౌరవింప దగిన పురుషుడు (పిత్రాది.). శ్లో. మాతా పితా తథాచార్యో మహాగురురితి స్మృతః 2. భర్త (వాచ.)

మహాగుల్మ సం. వి. ఆ. స్త్రీ. సోమవల్లి (వృ. వి.) (రా. ని.).

మహాగుహ సం. వి. ఆ. స్త్రీ. పృశ్నిపర్ణి. కోలపొన్న (వృ. వి.)

మహాగ్రీవము సం. వి. అ. పుం. ఉష్ట్రము, ఒంటె

మహాగ్రీవి సం. వి. న్. పుం. — మహాగ్రీవము.

మహాగ్రీవుఁడు సం. వి. అ. పుం. ప్రమథగణములలో నొకఁడు (విల్యమ్సు.)

మహాఘూర్ణ సం. వి. ఆ. స్త్రీ. మద్యము, సారాయి. (కల్ప.)

మహాఘోంటు సం. వి. ఆ. స్త్రీ. హస్తికోల పెద్దరేఁగు (వృ. వి.)

మహాఘోష సం. వి. ఆ. స్త్రీ. 1 కర్కటశృంగి (వృ. వి.) 2 కుందురికి, అందుగు

మహాఘోషము సం. విణ. (అ. ఆ. అ.) పెద్దధ్వని చేయునది. వి. అ. న. అంగడివీథి, బజారు (మే. ని.)

మహాచండి సం. వి. ఆ. స్త్రీ. దుర్గాపరిచారిక (వై. ని.)

మహాచారి సం. వి. న్. పుం. నాంది నడపువాఁడు (వై. ని.)

మహాచ్ఛదము సం. వి. అ. పుం. దేవతాళము (వృ. వి.).

మహాచ్ఛాయము సం. వి. అ. పుం. వటము, మఱ్ఱి చెట్టు (రా. ని.).

మహాచ్ఛిద్ర సం. వి. ఆ. స్త్రీ. మహామేద (వృ. వి.).

మహాజంబువు సం. వి. ఊ. ఈ. స్త్రీ. రాజజంబువు. పెద్దనేరేడు (వృ. వి.).

మహాజట సం. వి. ఆ. స్త్రీ. 1. పెద్దజడ, మహావేణి 2 రుద్రజట, రుద్రజడ (వృ. వి.).

మహాజనుఁడు సం. వి. అ. పుం. గొప్పవాఁడు, ప్రఖ్యాతిగల మనుష్యుఁడు

మహాజాలి సం. వి. అ. న్. పుం. 1. పచ్చపూవుల

యావడ (వృ. వి) 2 రాజకోశాతకి, పెనుగుం
బీర (వృ వి).

మహాజ్యోతిష్మతి సం వి ఈ స్త్రీ. పెద్దమానేరు, ఒకానొక తీఁగ.

మహాఢ్యము సం. విణ (అ ఆ. అ.) మిగుల భాగ్యవంతమైనది
వి. అ. పుం. కదంబవృక్షము, కడిమిచెట్టు (వృ వి.)

మహాతరువు సం, వి ఉ పుం. స్నుహి, జెముడు (వృ వి.)

మహాతలము సం వి అ. న. సప్తపాతాళములలో నైదవ లోకము.

మహాతిక్త సం. వి. ఆ. స్త్రీ 1. యవతిక్త, నాగదొండ (వృ వి) 2 పార, చిలుబొద్దు (వృ వి)

మహాతిక్తము సం. వి. అ పుం. నింబవృక్షము, వేఁపచెట్టు

మహాతీక్ష్ణ సం. వి ఆ. స్త్రీ. నల్ల జీడిచెట్టు.

మహాతేజస్సు సం వి. స్. పుం. 1. పాదరసము. 2. అగ్ని. 3 ఛత్రకము, చిత్రమూలము (వృ. వి.). 4. సుబ్రహ్మణ్యేశ్వరుఁడు (వై వి.)

మహాత్ముఁడు సం. విణ. (న్ ఆ న్ న్.) (మహాత్మురాలు స్త్రీ) రూ.
1 ఘనుఁడైన జీవాత్మ గలవాఁడు, ఉదారస్వభావము గలవాఁడు 2. కీర్తిగలవాఁడు, ఘనత చెందినవాఁడు. 3 సుకృతి, పుణ్యము కలవాఁడు

మహాదంష్ట్రము సం. వి. అ పుం ఒకజాతి పులి (కే ని.).

మహాదానము సం. వి. అ పుం కామ్యదానము, ప్రవారణము (హలా ని.)

మహాదారువు సం. వి. ఉ. పుం దేవదారు వృక్షము (వృ వి)

మహాదేవి సం. వి. ఈ. స్త్రీ. 1. పార్వతి. 2 పట్టపురాణి, మహిషి (వై. ని).

మహాదేవుఁడు సం. వి అ పుం శివుఁడు

మహాద్రుమము సం వి. అ పుం. అశ్వత్థవృక్షము. రావి

మహాధనము సం. విణ (అ. ఆ అ.) 1 చాల ధనముగలది, ధనవంతము 2 ఎక్కువ వెలగలది, పెద్ద ఖరీదుగలది.
వి అ న 1. బంగారము 2. ధూపద్రవ్యము 3. విలువగల వస్త్రాదికము (వై. ని.) 4 కృషివ్యవసాయము 5. గొప్ప మూల్యము 6 యుద్ధము (కే ని)

మహాధన్వుఁడు సం విణ (న్ పుం) గొప్ప విలుకాఁడు

మహాధాతువు సం వి. ఉ పుం. 1 బంగారము. 2 శివుఁడు 3. మేదస్సు, వస (విల్యమ్స్.).

మహానంద సం వి ఆ. స్త్రీ 1 సుర, మద్యము. 2 ఒకానొక నది. 3 మాఘ శుక్ల నవమి

మహానందము సం వి అ. పుం. 1. మహా సంతోషము, గొప్ప సంతసము 2 మోక్షము (హలా. ని)

మహానటుఁడు సం. వి అ. పుం. శివుఁడు.

మహానదము సం వి. అ. పుం. గొప్పనదము.

మహానది సం వి ఈ. స్త్రీ 1. గొప్పనది (గంగ, గోదావరి మొ.) 2 నదివిశేషము, ఒకానొకనది (ఇది యోఢ్రదేశమునఁ గలదు) (వాచ.).

మహానర్ముఁడు సం. వి. న్. పుం. వైద్యము నెఱిఁగిన అంబష్ఠుఁడు (వై. ని.).

మహానలము సం. వి. ఉ. పుం 1. దేవనలము, ఒకజాతి రెల్లుగడ్డి (వృ వి.) 2. పెద్ద యగ్ని (కల్ప.).

మహానవమి సం వి. ఈ స్త్రీ ఆశ్వీన శుక్ల నవమి.

మహానసము సం. వి. అ న వంటయిల్లు.

మహానాటకము సం. వి. అ. న. 1. దృశ్యకావ్యభేదము

శ్లో. ఏత దేవ యదా సర్వైః పతాకాస్థానకై ర్యుతమ్,
అంకైశ్చ దశభి ర్ధీరా మహానాటక మూచిరే.
(సా. ద).

2 హనుమన్నాటకము.

మహానాదము సం. వి. అ. పుం. 1. పెద్ద ధ్వని. కోలాహలధ్వని 2. పెద్ద వాద్యము గొప్పధ్వని గలది 3. ఉఱుముచున్న మేఘము 4 శంఖము (విల్యమ్సు.). 5 ఏనుఁగు 6 సింహము (కే. ని.) 7. శ్రవణము, చెవి.

మహానింబము సం. వి. అ. పుం. పెద్దమ్రాను, పెద్ద వేము (వృ. వి.) (వాచ.)

మహానిద్ర సం. వి. ఆ. స్త్రీ. పెద్దనిద్ర, మరణము, చావు

మహానిరయము సం. వి. అ. పుం. ఇరువది యొక్క నరకములలో నొక నరకము (విల్యమ్సు).

మహానిశ సం. వి. ఆ. స్త్రీ. అర్ధరాత్రము

మహానీచుఁడు సం. వి. అ. పుం. చాకలివాఁడు. (కల్ప)

మహానీలము సం. వి. అ. పుం. 1. ఒక దినుసు ఇంద్రనీలమణి 2 భృంగరాజము, గుంటకలగర (వృ. వి.) 3 ఒకానొక సర్పము. 4. మహాజంబువు, పెద్దనేరేడు (వృ. వి.) 5. నీలాపరాజిత, నల్లదింటెన (వృ. వి.).

మహానుభావుఁడు సం. విశే. (అ ఆ అ.) 1. గొప్పబుద్ధి గలవాఁడు, ఔదార్యము గలవాఁడు. 2. గొప్పసామర్థ్యము కలవాఁడు.

మహానేమి సం. వి. ఇ. పుం. వాయసము, కాకి (వై. ని.).

మహాపంచమూలము సం. వి. అ. న. అయిదు గొప్ప మూలికలు కలది.

(1. బిల్వము. 2. అగ్నిమంథము. 3. శ్యోనాకము. 4. కాశ్మరి. 5. పాటల.)

శ్లో. బిల్వోఽగ్నిమంథ శ్శ్యోనాకః కాశ్మర్యః పాటలా తథా, సర్వైస్తు మిళితై రేతైః స్యాన్మహా పంచమూలకమ్ (వాచ.).

మహాపంచవిషము సం. వి. అ. న. అయిదు గొప్ప విషములు కలది.

శ్లో. శృంగీ చ కాలకూటశ్చ ముస్తకో వత్సనాభకః, శంఖకర్ణీ తు యోగోఽయం మహాపంచ విషాభిధః (వాచ.).

మహాపక్షము సం. వి. అ. పుం. 1. కారండవము, కన్నెలేడిపిట్ట (కే. ని) 2. గరుడపక్షి 3. ఉటాకము, గుడ్లగూబ (విల్యమ్సు).

మహాపక్షి సం. వి. ఈ. స్త్రీ. ఉటాకము, గుడ్లగూబ (వై. ని.).

మహాపత్ర సం. వి. ఆ. స్త్రీ. మహాజంబువు, పెద్దనేరెడు (వృ. వి.).

మహాపత్త్రము సం. వి. అ. పుం. తాడిచెట్టు

మహాపథము సం. వి. అ. పుం. 1. రాజమార్గము, పెద్ద శాల 2 మరణము, చావు 3. స్వర్గమార్గము. 4 సుషుమ్నానాడి (కల్ప)

మహాపద్మము సం. వి. అ. పుం. 1 ఒకానొక పెద్దసంఖ్య 2. కుబేరుని నవనిధులలో నొకటి. 3. ప్రపంచభారమును వహించెడి మహాసర్పములలో నొకటి 4 నాగకంద (వై. ని.). అ. న. ఎఱ్ఱతామరపూవు (కే. ని.).

మహాపాతకము సం. వి. అ. పుం. 1. గొప్ప పాపము (ఇది అయిదు భేదములు కలది బ్రహ్మహత్య, స్వర్ణస్తేయము, సురాపానము, గురుపత్నీగమనము, ఇవి చేయువారితోడి సహవాసము)

గీ. కల్లు ద్రావుట గురుపత్నిఁ గవయుటయును, విప్రుఁ జంపుట బ్రహ్మస్వవిషయమైన, ద్రుచ్చిలుటయును నివి గల క్రూరజనులఁ, బ్రీతిఁ బొందుటయును మహాపాతకములు.

భార. శాం 1. 168.

(మతాంతరమున తొమ్మిది విధములు. స్త్రీగోవృషలవైశ్యక్షత్రియఘాతము, సోమవిక్రయము, శూద్రునితోడసహభోజనము, కన్యాదూషణము, గృహదాహిత్వము, వృషలీపతిత్వము, అగ్న్యుత్సాదిత్వము.)

2. మహాపరాధము. పెద్దతప్పు

మహాపిండీతకము సం. వి. అ. పుం. ఒకానొక జాతిమంగ (వృ. వి.).

మహాపిలువు సం. వి. ఉ. పుం. బృహత్పీలువు, పెద్ద

గొలుగు (వృ. వి).

**మహాపురాణము** సం. వి అ న. పురాణభేదము
శ్లో. సృష్టిశ్చాపి విసృష్టిశ్చ స్థితి స్తేషాం చ పాలనం, కర్మణాం వాసనా వార్తా మనూనాం చ క్రమేణ చ, వర్ణనం ప్రలయానాం చ మోక్షస్య చ నిరూపణం, ఉత్కీర్తనం హరేరేవ దేవానాం చ పృథక్‌పృథక్, మహాపురాణం విజ్ఞేయ మేకాదశ లక్షణమ్ (వాచ.).

**మహాపురుషుఁడు** సం. వి. అ పుం. 1 గొప్ప పురుషుఁడు, ప్రసిద్ధుఁ డైన మనుజుఁడు. 2 విష్ణుఁడు

**మహాపుష్ప** సం. వి. ఆ. స్త్రీ. అపరాజిత

**మహాపుష్పము** సం. వి అ పుం, క్రిమివిశేషము (విల్యమ్సు)

**మహాపృష్ఠము** సం వి. అ. పుం ఉష్ట్రము, ఒంటె (రా. ని).

**మహాప్రళయము** సం వి. అ. పుం. బ్రహ్మప్రలయము, కల్పాంతము. (బ్రహ్మకుఁ దన మానము చేత నూఱుసంవత్సరములు గడచినతర్వాత బ్రహ్మయు సమస్తదేవతలు ఋషులు లోకములు నశించును. అట్టి సర్వనాశకాలము.)

**మహాప్రసాదము** సం. వి. అ పుం. 1. మహాప్రసన్నత, గొప్పదయ. 2. దేవ నైవేద్యాదికము, దేవతలకు నివేదింపఁబడిన యన్నము మొదలగునది
శ్లో. పాదోదకం చ నిర్మాల్యం నైవేద్యం చ విశేషతః, మహాప్రసాద ఇత్యుక్త్వా గ్రాహ్యం విష్ణోః ప్రయత్నతః (వాచ.).

**మహాప్రస్థానము** సం. వి. అ న మరణము, చావు, లోకాంతర యాత్ర (విల్యమ్సు.).

**మహాప్రాణము** సం. వి అ, పుం. 1. పెద్దశ్వాసము. 2. వర్ణోచ్చారణయందు మహాప్రాణ ప్రయత్నము గలవర్ణము (ఖ, ఘ, ఛ, ఝ, ఠ, ఢ, థ, ధ, ఫ, భ, శ, ష, స, హ,) 3 ద్రోణకాకము, మాలకాకి (రా. ని.).

**మహాఫల** సం. వి. ఆ. స్త్రీ. 1. ఇంద్రవారుణి, పెద్దపాఁవర (వృ వి.) 2. రాజజంబువు, పెద్దనేరేడు (వృ వి.). 3 మహాకోశాతకి, పెనుఁగుబీర (వృ వి). (కల). 4 పెద్దరేఁగు (వృ. వి.) (వై ని. 5. కూశ్మాండము (వృ. వి)(కే. ని)

**మహాఫలము** సం. వి. అ న. 1. గొప్పఫలము. 2 బిల్వము, మారేడు (వృ వి.).
విశ (అ ఆ. అ.) అధికఫలము గలది

**మహాబల** సం వి ఆ. స్త్రీ ముత్తవపులగము (వృ వి).

**మహాబలము** సం వి. అ. పుం. టంకణము, వెలిగారము (వై. ని)

**మహాబలుఁడు** సం. వి. అ పుం 1. బుద్ధుఁడు 2 వాయువు. విశ. (అ ఆ అ) చాలబలము గలవాఁడు.

**మహాబిలము** సం వి అ న 1 ఆకాశము. 2. గుహ.

**మహాబుసము** సం. వి అ. పుం. 1 ఒక సంవత్సరము నకుఁ బండు ధాన్యము. 2 యవలు (వై ని.).

**మహాబోధి** సం. వి. ఇ పుం. బుద్ధుఁడు (త్రి ని.).

**మహాబ్రహ్మము** సం. వి న్. న. పరబ్రహ్మము.

**మహాభాగవతము** సం వి. అ న. ఒకానొక పురాణగ్రంథము.

**మహాభాగీ** సం విశ. (న్ నీ న్.) మిక్కిలి యదృష్టము గలవాఁడు, మిగుల శుభాతిశయము గలవాఁడు.

**మహాభాగుఁడు** సం. విశ (అ. ఆ అ.) 1. మిక్కిలి యదృష్టముగలవాఁడు చాలభాగ్యము గలవాఁడు 2 మిక్కిలి ప్రసిద్ధుఁడు, కీర్తిమంతుఁడు. 3. లత్యంత పవిత్ర మైనవాఁడు.

**మహాభాగ్యము** సం. వి. అ. న. 1 గొప్పయదృష్టము, గొప్పభాగ్యము 2. మిక్కిలి ప్రాశస్త్యము. అత్యంత శ్రేష్ఠత.

**మహాభారతము** సం. వి అ. న ప్రసిద్ధమగు నొకానొక యితిహాసము, భారతము.
(వ్యాసప్రోక్త మైనట్టియు పదునెనిమిది పర్వములు కలిగి కౌరవపాండవుల యుద్ధాదికము వర్ణింపఁ

ఒడినట్టి సంస్కృత భాషయందలి గొప్పగ్రంథము.)

**మహాభాష్యము** సం. వి. అ. న. పతంజలి మహర్షి రచించిన వ్యాకరణభాష్యము.
(ఈ భాష్యము మూలము అగు సూత్రవార్తికములకంటెను ప్రమాణతమము గావున మహాభాష్యమని చెప్పఁబడును. శంకరభాష్యాదులు మూలాధీన ప్రామాణ్యకములు గాన భాష్యములే గాని మహాభాష్యములు కావు.)

**మహాభీత** సం. వి. ఆ. స్త్రీ. సోఁకుడుముణుఁగు చెట్టు. అత్తపత్తిచెట్టు (వృ. వి.)

**మహాభీముఁడు** సం. వి. అ. పుం. శంతనువు.

**మహాభీరువు** సం. వి. పుం. ఉ. ఒకజాతి పురుగు.

**మహామణి** సం. వి. ఇ. పుం. 1. విలువగల (అమూల్యమైన) రత్నము. 2. శివుఁడు (విల్యమ్సు).

**మహామతి** సం. విశే. (ఇ) 1. ఉదారమనస్సు కలవాఁడు. 2. బుద్ధిమంతుఁడు. వి. ఇ. పుం. బృహస్పతి (విల్యమ్సు).

**మహామత్స్యము** సం. వి. అ. పు. 1. పెద్దచేఁప. 2. మొసలి (ఆ. ని.)

**మహామదము** సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి మత్తెక్కినది. వి. అ. పుం. మదపుటేనుఁగు (విల్యమ్సు).

**మహామనస్కము** సం. వి. అ. పుం. శరభమృగము. (విల్యమ్సు).

**మహామనస్సు** సం. వి. స్. పుం. శరభమృగము.

**మహామాత్రుఁడు** సం. వి. అ. పుం. 1. ప్రధానమంత్రి, ముఖ్యమంత్రి. 2. మావటివారిలో ప్రధానుఁడు. 3. సంపన్నుఁడు. (వై. ని.).

**మహామారి** సం. వి. ఈ. స్త్రీ. 1. విశూచి, వమన విరేచనములను గలిగించు అంటురోగము. 2. దుర్గ.

**మహాముఖము** సం. వి. అ. పుం. మకరము, మొసలి (కే. ని.).

**మహాముని** సం. వి. ఇ. పుం. 1. మహర్షి, గొప్పముని. 2. కుస్తుంబరి, కొత్తిమిరి (వృ. వి.)

**మహామూలము** సం. వి. అ. పుం. ఒకజాతి పెద్ద నీరుల్లి (వృ. వి.).

**మహామృగము** సం. వి. అ. పుం. (పెద్ద జంతువు) 1. గజము, ఏనుగు. 2. శరభమృగము.

**మహామ్లము** సం. వి. అ. న. చింతపండు.

**మహాయవము** సం. వి. అ. పుం. ఒకజాతి పెద్ద యవము (వృ. వి.). (వై. ని.).

**మహాయుగము** సం. వి. అ. న. మనుష్యమానమున కృతత్రేతాద్వాపరకలు అను నాలుగు యుగములు గలకాలము. దీని ప్రమాణము 4,320,000 సంవత్సరములు.

**మహాయోగి** సం. వి. న్. పుం. కోడిపుంజు (విల్యమ్సు).

**మహారంభ** సం. వి. ఆ. స్త్రీ. పచ్చయరఁటి (వృ. వి.). శర.)

**మహారజము** సం. వి. అ. న. గడలవణము, లవణభేదము.

**మహారజతము** సం. వి. అ. న. 1. బంగారము. 2. ఉమ్మెత్తచెట్టు (వృ. వి.)

**మహారజనము** సం. వి. అ. న. 1. కుసుంభపుష్పము, కుసుంభపువ్వు. 2. బంగారము.

**మహారథుఁడు** సం. వి. అ. పుం. పదివేలమంది విలుకాండ్రతో నసహాయుఁడై పోరెడు మహాయోధుఁడు.
శ్లో. ఏకో దశసహస్రాణి యోధయేద్యస్తు ధన్వినాం, శస్త్రశాస్త్ర ప్రవీణశ్చ విజ్ఞేయస్స మహారథః (వాచ.).

**మహారస** సం. వి. ఆ. స్త్రీ. విష్ణుక్రాంత (వృ. వి.). 2. నీలి (వృ. వి.). (వై. ని.) 3. ద్రోణపుష్పి, ఏనుఁగుతుమ్మి (వృ. వి.). (కే. ని.).

**మహారసము** సం. వి. అ. పుం. 1. ఒకజాతి చెఱకు. 2. పాదరసము. 3. ఖర్జూరము (వృ. వి.). పులిగంజి. కాంజకము.

**మహారాజము** సం. వి. అ. పుం. వ్రేలిగోరు (వై. ని.).

**మహారాజకుఁడు** సం. వి. అ. పుం. విష్ణువు. 2. దేవయోనులలో నొకజాతివారు.
(వీరిసంఖ్య 220 లేక 236 అని చెప్పబడినది)

**మహారాత్రి** సం వి ఇ ఈ స్త్రీ 1 మహాప్రళయము. 2. నిశీథము, అర్ధరాత్రి.

శ్లో॥ అర్ధరాత్రాత్పరం యచ్చ ముహూర్తద్వయ ముచ్యతే, సా మహారాత్రి రుదితా తద్దత్తం హ్యక్షయం భవేత్ (కల్ప).

3 పార్వతి (వై ని)

**మహారాష్ట్రి** సం వి అ పుం జలపిప్పలి, నీరుపిప్పలి (వృ వి)

**మహారాష్ట్రము** సం వి అ పుం (హిందూదేశమున భరతఖండమున పశ్చిమదేశభాగము, మహారాష్ట్రదేశము

**మహారాష్ట్రి** సం వి ఈ స్త్రీ. మహారాష్ట్రభాష (ప్రాకృతభాషలలో ప్రధానమైనది)

**మహారిష్టము** సం వి అ పుం. కొండలపై బయలుదేఱు వేపచెట్టు (వృ. వి)

**మహారోగము** సం వి అ పుం అపాయకరమగు తెగులు, మహావ్యాధి

(ఉన్మాదము, రాజయక్ష్మము, శ్వాసము, చర్మదోషము, మధుమేహము, అశ్మరి, ఉదరరోగము, భగందర రోగము. ఇవి మహా రోగములు.)

**మహారౌరవము** సం. వి. అ. పుం ఇరువదియొక్క నరకములలో నొకటి.

**మహార్ఘము** సం. విశే. (అ ఆ అ.) చాల వెలగలది. హెచ్చుమూల్యము కలది.

వి అ పుం. లావకము, లావుకపిట్ట

**మహార్బుదము** సం వి. అ. న. శతకోటి (కల్ప.)

**మహార్హము** సం. వి అ న, తెల్లచందనము, మంచిగంధపుచెట్టు (వృ వి.)

**మహాలక్ష్మి** సం వి ఈ స్త్రీ విష్ణుపత్ని, పరదేవత, నారాయణశక్తి.

**మహాలయము** సం వి. అ పుం 1. గొప్ప నివాసస్థానము, పెద్దయిల్లు 2 తీర్థము, పుణ్యక్షేత్రము. 3. పరబ్రహ్మము, పరమాత్మ

**మహాలోధ్రము** సం. వి. అ. పుం. తెల్లలొద్దుగు (వృ వి) (వై ని.)

**మహాలోలము** సం వి అ. పుం వాయసము, కాకి.

**మహాలోహము** సం. వి. అ న. అయస్కాంతము, సూదంటురాయి

**మహావర** సం వి ఆ స్త్రీ దూర్వము (వృ వి)

**మహావరోహము** సం వి అ పుం ప్లక్షము, జువ్వి. (వృ. వి) (రా ని)

**మహావల్లి** సం. వి. ఈ. స్త్రీ మాధవీలత

**మహావనము** సం వి అ పుం శిశుపు, బలూపి యనుచేప

**మహావాక్యము** సం వి అ న 1. పెద్దవాక్యము 2 కృతి, గ్రంథము. 3. తత్త్వమసి మొదలగు ఉపనిషద్వాక్యము

**మహావిదేహ** సం వి ఆ స్త్రీ (యోగ) ఒకానొక మానసికవృత్తి, మనోవ్యాపారము

**మహావిషము** సం. వి అ పుం రెండుముఖములు గలపాము, రెండుతలలు గలపాము

**మహావిషువసంక్రాంతి** సం వి ఇ స్త్రీ. సూర్యుడు మేషరాశియందు ప్రవేశించుట, మేషసంక్రమణము

**మహావీచి** సం. వి. ఇ పుం. నరక విశేషము.

**మహావీరచరితము** సం వి. అ న. భవభూతి రచించిన ప్రసిద్ధ నాటకము.

**మహావీరము** సం. వి. అ. పుం 1 సింహము. 2 ఇంద్రుని వజ్రాయుధము. 3 గరుత్మంతుడు. 4 పికము, కోకిల. 5. తెల్లగుఱ్ఱము, శ్వేతాశ్వము 6 అగ్ని. 7 యజ్ఞపాత్ర. 8. ఒకజాతి డేగ. 9 క్షీరకాకోలి (వృ వి.). 10 ఏకవీరము, గన్నేరు (వృ. వి.).

**మహావీరుడు** సం వి అ. పుం. 1. గొప్పశూరుడు. 2. కొడుకు, తనయుడు 3. విష్ణువు (వై ని.). 4. మహాదేవుడు, శివుడు (కే ని).

**మహావీర్య** సం వి. ఆ స్త్రీ 1 అడవి ప్రత్తిచెట్టు (వృ. వి). 2. సూర్యునిభార్య, సంజ్ఞ 3. మహాశతవరి (వృ. వి).

మహావేగము సం వి అ పుం క్రోతి, వానరము వై ని

మహావృషము సం. వి అ పుం పెద్దయెద్దు, ఆంబోతు

మహావ్యాధి సం వి అ పుం 1 పెద్దరోగము, మహారోగము 2 మిక్కిలి పాడుజాతికుష్ఠము (నల్లకుష్ఠము).

మహావ్యాహృతి సం వి ఇ స్త్రీ. "భూర్భువస్సువః" అను వైదిక మంత్రము

మహావ్రతము సం విశే (అ. ఆ అ.) పెద్ద నియమముగలది, కఠినమైన నియమములతో నాచరింపబడినది

వి అ న 1 దీక్ష, నియమము 2. గొప్పపని, ప్రధానమైన కృత్యము

మహావ్రతుఁడు సం వి అ పుం. ఈశ్వరుఁడు (వై ని)

మహాశంఖము సం. వి అ. న. 1 సంఖ్యా విశేషము 2. నొసలు. 3. మనుష్యుని యెముక (శ ర).

మహాశరము సం వి అ పుం రాజదుత్తూరము, ఒకజాతి యుమ్మెత్త చెట్టు

విశే (అ ఆ అ) అవధూర్తము

మహాశనుఁడు సం విశే (అ ఆ అ) తిండిపోతు, తిండికాఁడు

మహాశయుఁడు సం. వి అ. పుం సముద్రుఁడు

విశే (అ ఆ అ) గొప్ప అభిప్రాయము కలవాఁడు (శ ర.).

మహాశల్క సం. వి ఆ. స్త్రీ దేవిక, ఒకజాతి మాదీఫలము (కే. ని)

మహాశల్కము సం వి అ పుం. ఒకజాతి రొయ్య చేప.

మహాశాలి సం వి ఇ పుం. పెద్ద వరివియ్యము, స్థూలశాలి.

మహాశిరస్సు సం వి. స్ పుం. సర్పవిశేషము

మహాశిల సం. వి ఆ స్త్రీ. అనుపకంటకములతోఁ గూడిన శతఘ్ని (వై ని)

మహాశుక్తి సం వి ఇ స్త్రీ ముత్యపుచిప్ప

మహాశుక్ల సం వి ఆ స్త్రీ సరస్వతి

మహాశుభ్రము సం. వి. అ న వెండి, రజతము

మహాశూద్ర సం వి ఆ స్త్రీ గొప్పస్థితిలో నున్న శూద్రస్త్రీ

మహాశూద్రి సం వి ఆ స్త్రీ. 1. ఆభీరజాతి స్త్రీ. 2 ఆభీరుని భార్య

మహాశూద్రుఁడు సం వి అ పుం. ఆభీరుఁడు.

మహాశ్మము సం వి అ పుం. మాణిక్యము, కెంపు

మహాశ్మశానము సం వి అ న వారణాసీపురము, కాశి.

మహాశ్రమణుఁడు సం వి అ పుం బుద్ధుఁడు.

మహాశ్రావణిక సం వి ఆ. స్త్రీ. వృద్ధియను గంధద్రవ్యము (వృ వి)

మహాశ్వాసము సం వి అ పుం ఒకజాతి యుబ్బసపు రోగము

మహాశ్వేత సం. వి. ఆ. స్త్రీ 1 సరస్వతి (త్రి. ని) 2. దుర్గాదేవి. 3. శ్వేతశర్కర, తెల్లపంచదార. 4. కృష్ణభూమకూశ్మాండము, నల్ల నేలగుమ్మడు (వృ. వి)

మహాసంధ సం వి ఆ. స్త్రీ. వాఁకుడు

మహాసన్నుఁడు సం వి అ పుం కుబేరుఁడు

మహాసర్జము సం వి అ. పుం 1 పనసచెట్టు. అసనము, వేఁగిస (వృ వి).

మహాసహ సం వి ఆ స్త్రీ. 1 కాఱుమినుము 2. పెద్దగోరంట (వృ. వి)

మహాసాంతపనము సం వి అ. పుం కఠినమైన వ్రతవిశేషము.

శ్లో పృథక్సాంతపనైర్ద్రవ్యైః షడహం సోపవాసః
సప్తాహేనైవ కృచ్ఛ్రోఽయం మహాసాంతపనః స్మృతః.

మహాసారథి సం వి. ఇ పుం అరుణుఁడు

మహాసారము సం వి. అ పుం. ఖదిరవృక్షము, చండ్రచెట్టు

**మహాసాహసికుఁడు** సం వి. అ. పుం బందిపోటు దొంగ, దోఁపుడు దొంగ, సాహసముగల దొంగ

**మహాసింహము** సం వి. అ పుం. శరభమృగము.

**మహాసిద్ధి** సం వి ఇ స్త్రీ మంత్రశాస్త్ర సంబంధమైన సిద్ధివిశేషము

**మహాసుఖము** సం వి అ న 1. పెద్ద సంతోషము, మహానందము. 2. సురతము, రతి (త్రి ని)

**మహాసుఖుఁడు** సం వి అ పుం బుద్ధుఁడు

**మహాసుగంధి** సం వి ఇ పుం విషము పోఁగొట్టెడి ఓషధి విశేషము

**మహాసుప్తి** సం వి ఇ స్త్రీ బ్రహ్మదేవుని నిద్ర

**మహాసూక్ష్మ** సం వి ఆ స్త్రీ సికత, ఇసుక

**మహాసేనుఁడు** సం. వి అ పుం కార్తికేయుఁడు, కుమారస్వామి

**మహాస్కంధ** సం. వి. ఆ స్త్రీ జంబూవృక్షము, నేరేడు (వృ వి)

**మహాస్థలి** సం వి. ఈ. స్త్రీ. భూమి

**మహాస్నాయువు** సం వి ఉ. స్త్రీ. కంధర, కంఠము (వై ని)

**మహాస్వనము** సం. వి. అ. పుం. వాద్యభేదము (త్రి ని)

**మహాహవిస్సు** సం వి స్. న. గోఘృతము, ఆవు నెయ్యి.

**మహి** సం విశే. (ఇ) గొప్పది వి. ఇ. ఈ స్త్రీ. భూమి. ఈ. స్త్రీ.

1. మాలవదేశమందలి యొకానొక నది.
2. వాక్కు. 3. గోవు (కే.ని.). ద్వి. ద్యావాపృథివులు, భూమ్యాకాశములు (కే. ని.).

**మహిక** సం వి. ఆ. స్త్రీ హిమము, మంచు

**మహితము** సం. విశే (అ. ఆ. అ.) గౌరవింపఁబడినది, పూజింపఁబడినది.

వి అ. పుం. కైలాస పర్వతము.

**మహినము** సం. వి. అ.న 1. రాజ్యము. 2. శయ్య, సెజ్జ.

**మహిపతి** — మహీపతి

**మహిమ(ము)** సం వి న్ పుం 1 గొప్పతనము 2 అష్టసిద్ధులలో నొకటి 3 విధము 4 మావాచకము

వ మాసంబులందు మార్గశీర్షంబు వహిమ యుగంబులందుఁ గృతయుగంబు నోజ .

భాగ 12. 49.

**మహిమత్తు** సం వి త్ పుం వివాహార్హ (వై ని.).

**మహిల** సం వి ఆ స్త్రీ 1. స్త్రీ 2 మత్తురాలగు స్త్రీ 3 ప్రియంగు వృక్షము, ప్రేంకణము (వృ వి) 4 రేణుక యను సుగంధద్రవ్యము (వృ వి.)

**మహిలాహ్వయ** సం వి ఆ స్త్రీ. స్త్రీపర్యాయములు గలది ప్రేంకణపు చెట్టు, ప్రియంగుపు (వృ వి)

**మహిషఘ్ని** సం వి ఈ స్త్రీ. మహిషాసురునిఁ జంపినది, దుర్గాదేవి

**మహిషధ్వజుఁడు** సం వి అ పుం యముఁడు.

**మహిషము** సం వి అ పుం 1. ఎనుఁబోతు, దున్న

**మహిషవాహనుఁడు** సం వి. అ. పుం. యముఁడు, పోతురౌతు.

**మహిషాక్షకము** సం. వి అ. పుం. ఒకజాతి గుగ్గిలము, మైసాక్షి యను మందుదినుసు తీసెడి చెట్టు (వృ వి.).

**మహిషాక్షము** సం — మహిషాక్షకము

**మహిషాసురమర్దని** సం. వి. ఈ స్త్రీ మహిషాసురునిఁ జంపినది, దుర్గాదేవి.

**మహిషి** సం. వి. ఈ. స్త్రీ 1. పట్టపుదేవి 2 ఎనుము, బఱ్ఱె. 3 ఆఁడుపక్షి 4 సైరంధ్రి 5. నీతిబాహ్యస్త్రీలు, నీతిలేని యాఁడుది. పౌషపూర్ణిమ.

**మహిషుఁడు** సం. వి అ. పుం. 1. దుర్గచేఁజంపఁబడిన ఒకానొక రాక్షసుఁడు. 2 తీవరియందు క్షత్రియునివలనఁ బుట్టిన సంకరజాతివాఁడు.

మహిష్ఠము సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి గొప్పది, చాలఁ బెద్దది.

మహిసాక్షి వి. ధూపద్రవ్యవిశేషము, ధూపము వేయు [illegible] సువాసనద్రవ్యము.

[illegible] మహి [illegible] యైయున్న మహిసాక్షి గూడ. [illegible] కునకు [illegible] యు ధూపమిచ్చి. [illegible]. పురా. 127 పొ.

మహీక్షితుఁడు సం. వి. త్. పుం. రాజు, చక్రవర్తి.

మహీజ సం. వి. అ. స్త్రీ. భూపుత్రి, సీత.

మహీజము సం. వి. అ. పుం. వృక్షము, చెట్టు. అ. న. అల్లము.

మహీజుఁడు సం. వి. అ. పుం. 1. అంగారకుఁడు. 2. నరకాసురుఁడు.

మహీతలము సం. వి. అ. న. భూప్రదేశము.

మహీధరము సం. వి. అ. పుం. పర్వతము, కొండ.

మహీధ్రము సం. వి. అ. పుం. 1. పుడమితాలుపు, కొండ 2. ఏడవసంఖ్యకు సంకేతపదము.

మహీధ్రుఁడు సం. వి. అ. పుం. రాజు.

మహీపతి సం. వి. ఇ. పుం. 1. నేలఱేఁడు, రాజు 2. ఒకజాతి నిమ్మ (వృ. వి.).

మహీప్రాచీరకము సం. వి. అ. న. సముద్రము. (త్రి. ని.).

మహీభృతము సం. వి. త్. పుం. పర్వతము, కొండ.

మహీభృతుడు సం. వి. త్. పుం. రాజు, భూపాలుఁడు.

మహీమహేంద్రుఁడు సం. వి. అ. పుం. భూదేవేంద్రుఁడు, రాజు.

మహీయసము సం. విశే. (స్. యసీ. స్.) ఒకదాని కంటె గొప్పది, అధికతరము.

మహీరుట్టు సం. వి. హ్. పుం. వృక్షము, చెట్టు.

మహీరుహము సం. వి. అ. పుం. చెట్టు.

మహీలత సం. వి. ఆ. స్త్రీ. ఎఱ్ఱ, వానపాము.

మహీశ్వరుఁడు సం. వి. అ. పుం. రాజు.

మహీసుత సం. వి. ఆ. స్త్రీ. పుడమికూఁతురు, సీత.

మహీసుతుఁడు సం. వి. అ. పుం. 1. అంగారకుఁడు, కుజుఁడు. 2. నరకాసురుఁడు.

మహీసురుఁడు సం. వి. అ. పుం. పుడమివేలుపు, బ్రాహ్మణుఁడు.

మహేంద్రజిత్తు సం. వి. త్. పుం. గరుడుఁడు (వై. ని.).

మహేంద్రము సం. వి. అ. పుం. ఒకానొక పర్వతము.

మహేంద్రి సం. వి. ఈ. స్త్రీ. బొంతరఁటి (వృ. వి.). (శ. ర.).

మహేంద్రుఁడు సం. వి. అ. పుం. 1. ఇంద్రుఁడు 2. నాయకుఁడు, నేత.

మహేచ్ఛుఁడు సం. విశే. (అ. ఆ. అ.) ఉదారబుద్ధి గలవాఁడు, ఘనమైన యాలోచన గలవాఁడు.

మహేరణ సం. వి. ఆ. స్త్రీ. అందుగు, సల్లకి (శ. ర.).

మహేల సం. వి. ఆ. స్త్రీ. ఆఁడుది, స్త్రీ.

మహేళబంధువు సం. వి. ఉ. పుం. బిల్వవృక్షము, మారేడుచెట్టు.

మహేశానుఁడు సం. వి. అ. పుం. శివుఁడు.

మహేశుఁడు సం. వి. అ. పుం. శివుఁడు.

మహేశ్వరి సం. వి. ఈ. స్త్రీ. 1. దుర్గాదేవి. 2. ఒక దినుసు ఇత్తడి, బ్రహ్మరీతి (కే. ని.).

మహేశ్వరుఁడు సం. వి. అ. పుం. 1. గొప్ప ప్రభువు; చక్రవర్తి 2. శివుఁడు 3. గుగ్గులువు (వృ. వి.).

మహేష్వాసుఁడు సం. వి. అ. పుం. గొప్పవిలుకాఁడు, మహాధన్వి.

మహోక్షము సం. వి. అ. పుం. బలసిన యెద్దు, పెద్ద యెద్దు.

మహోగ్ర సం. వి. ఆ. స్త్రీ. త్రయోదశీతిథి (కే. ని.).

మహోత్పలము సం. వి. అ. న. పద్మము. పుం. సారసపక్షి.

మహోత్సాహుఁడు సం. విశే. (అ. ఆ. అ.) అభినివేశము కలవాఁడు, పట్టుదల గలవాఁడు.

మహోదధి స. వి. ఇ. పుం. 1. మహాసముద్రము, గొప్ప సాగరము 2. దక్షిణసముద్రము 3. ఇంద్రుఁడు,

మహోదయ సం వి ఆ స్త్రీ. కించిత్ప్రౌఢయగు కన్య (వై ని.).

మహోదయము సం. వి అ పుం 1. గొప్ప యభివృద్ధి, చాల శ్రేయస్సు 2. మోక్షము. 3 కాన్యకుబ్జదేశమున నొకపట్టణము. 5 (ధర్మశాస్త్ర) యోగభేదము

(కించిన్న్యూనమైన అర్ధోదయము మహోదయ మనఁబడును.)

మహోదయుఁడు సం విణ. (అ ఆ అ గొప్ప యభివృద్ధి గలవాఁడు

మహోదరము సం. విణ (అ ఆ అ) పెద్ద కడుపు గలది. వి అ. న. 1. పెద్దకడుపు 2 రోగ విశేషము

మహోదరి సం. వి. ఈ స్త్రీ. శతమూలి, పిల్లి పీఁచర (వృ. వి ).

మహోద్యముఁడు సం. విణ (అ. ఆ అ) మహోత్సాహుఁడు, పెద్దయుద్యమము గలవాఁడు

మహోద్రేకము సం వి. అ. పుం. నాలుగు ప్రస్థములు (వై ని ).

మహోన్నతము సం విణ. (అ ఆ అ.). మిక్కిలి యున్నతమైనది, చాల ఎత్తైనది వి అ పుం. తాడు (వృ. వి.).

మహోరగము సం. వి అ. పుం. 1 గొప్పపాము, పెద్దపాము. 2. తగరువృక్షము యొక్క వేరు

మహౌజస్సు సం. వి. స్ పుం సుబ్రహ్మణ్యస్వామి.

మహౌషధము సం. వి అ న 1 గొప్ప మందు. 2. అల్లము 3. వెల్లుల్లి. 4 వత్సనాభ మను విషము 5 వారాహీకందము. 6. శుంఠి, సొంటి. 7 అతివస (వృ వి ).

పుం. 1. పిప్పలి (వృ.వి.). 2. యూధిక, మొల్ల (వృ. వి.)

మహౌషధి సం.వి.ఇ.ఈ.స్త్రీ. మంచి (గుణము చేసెడి) ఓషధి, శ్రేష్ఠమైన మందుచెట్టు. 2.దూర్వాతృణము, గటిక(వృ.వి.). 3.అత్తపత్తి(వృ.వి.) 4 స్నానీయ ద్రవ్యభేదము, సంజీవిని లత. 5. శ్వేతకంటకారి (వృ. వి. 6. కటుకరోహిణి వృ వి) 7. అతివస (వృ వి.) 8. హిలమోచిక (వృ. వి ).

మహౌషధీగణము స వి అ. పుం గొప్ప మందుచెట్ల సమూహము

శ్లో॥ పృశ్నిపర్ణీ శ్యామలతా భృంగరాజ శ్శతావరీ, గుడూచీ సహదేవీ చ మహౌషధిగణః స్మృతః (వాచ )

# మా

మా¹ – అమ్మ అవ్య. (త. క. మా , ప్రశంసావర్థ ములను దెల్పును.

గీ వీఁడు మాహేశ్వరాచార్యపారగునకుఁ, దనకు శశిమౌళి యిచ్చిన కనకరథము, కామగమనంబు నైషధక్ష్మావరునకు, మామ యిచ్చెను మా యని మహి నుతింప. నైష. 6. 95.

చం మతుకులరా జనిం గెడపె మాపడ వెన్నుని రూపుతూపునన్ ... కుకు. 5 167

మా² అవ్య (సం. మహా) మిక్కిలి. మాబాగాయె. క్షేత్రయ (శ ర.).

మా సం. వి. ఆ. స్త్రీ. లక్ష్మి, శ్రీదేవి.

కం. శుకమా ముఖరుచి జితకిం, శుకమా సుకుమార దేహ శోభిత దూర్వాం, శుక మారకమేల రతీ, శు(క?)కు మా యిచ్చిన హాయమ వనూయ గనకుమా. అ వి. 4. 77.

(టీ. దూర్వాంశుక – దూర్వల కాంతివంటి కాంతి గలదానా, మారకము – మారకత్వము భావ ప్రధాన నిర్దేశము. యద్వా మారః డిజంతాద్భావే ఘఞ్ తత స్స్వార్థే కః రతీశుకు + అంతీశుక నగాగ మాభావము చింత్యము. అకారము పాదపూరకము. సూ. ని. మా – లక్ష్మి. హాయమవు – గుఱ్ఱమవు. ఈ పద్యము లక్ష్మి విరహావర్ణనము లోనిది )

2. జనని, తల్లి. 3 పరిమాణము, కొలత

అవ్య నిషేధార్థకము, వలదు అను వర్థము నిచ్చును.

(దీని యామ్రేడితరూపము మామా )

కం. మామా వలువలు ముట్టకు, మామా కొని

పోకు పోకు మన్నించు తగన్, మామావ మేల కొనియెదు, మామానహాణ మేల మానుము కృష్ణా భాగ 10 పూ. 820

కం. మామా నాపైఁ గోపము, మామా నీపుత్రి యందు మానవు నాకుం, గామోపభోగ వాం ఛలు, క్షేమ క్రమియించి ముదిమి పిదపం దార్తున్ భాగ 9 547

**మాంగలికము** సం విశ (అ ఆ అ) శుభప్రదము, శుభసూచకము.

**మాంగల్యము** సం విశ (అ ఆ అ) శుభప్రదము, శుభసూచకము

వి. అ న 1. శుభము, అభివృద్ధి 2. క్షేమకర మగువస్తువు. తాయెత్తు 3 తాళిబొట్టు (శ ర)

**మాంజిష్ఠము** సం. విశ (అ ఆ అ) 1 మంజిష్ఠము. (చిరువేరువంటి చాయవేరు)తో రంగు వేయఁ బడినది.

వి అ. న ఎఱుపురంగు.

**మాండలికుఁడు** సం వి. అ. పుం. మండలము నేలు వాఁడు, మండలాధికారి.

విశ. మండలసంబంధమైనవాఁడు.

**మాంత్రికుఁడు** సం. వి అ పుం 1.మంత్రములు తెలిసినవాఁడు 2 గారడివాఁడు

**మాందాళి** వి 1 పచ్చ పట్టుచీర

సీ జిలుగుఁ బావడమీఁదఁ జికురధిక్కృత మిళిందాళి యొక్కతివ మాందాళి గట్టె ... వేం. పంచ. 4. 242.

2, కృత్రిమ మరకతభేదము, కృత్రిమ పగుపేరోజము.

సీ. పచ్చ యనఁగను బరుగు మరకతంబు గారుత్మతం బొప్పు గరుడపచ్చ, యనఁ దద్విశేషాఖ్య యగును బేరోదనం బన వది కృత్రిమం బయిన వెలయు, మాందాళి యఁచన .. అం భా. 2. 276.

**మాంద్యము** సం. వి. అ న. 1. మెల్లన, సోమరితనము 2 తెలివితక్కువ, బుద్ధిహీనత. 3. దౌర్బల్యము 4. ఔదాసీన్యము, ఉదాసీనుఁడుగా నుండుట. 5 అనారోగ్యము, తెగులు, జబ్బు

**మాంధాత(తృఁడు)** సం వి. ఋ. పుం సూర్యవంశపురాజు (ఇతఁడు యువనాశ్వుని కొడుకు, షోడశ మహారాజులలో నొకఁడు )

గీ విష్ణుతినిరతుండు యువనాశ్వ విభుసుతుండు, మనుఁడు మాంధాత నృపుఁ డైనకాలము నను .. కవిక. 2 58.

గీ తరమె వనుఁ గెల్వ నీ కని దశముఖాసు, రాగ్రగణ్యుని మాంధాత యప్పుడు పొదివి .. ఉ. రా 4 66, 4 64.

కం. అని వసుహోముఁడు సెప్పిన, విని మాంధాతృ డు దండ విభవజ్ఞుండై ... భార. శాం. 3 121

ఉ ... శయనమొంది, యుండ నచట నియతి నుండి మాంధాతృఁడు, పరమభక్తి నమర గురునిఁ దలఁచి .... భార. అను 2. 5.

కం. ఇది యమున యను మహానదిత్రిదశనదీనిభము దీని తీరమున జగ, ద్విదితుఁడు మాంధాతృఁడు సం, పదఁ గ్రతువులఁ జేసెఁ గొల్లి బహువత్సరముల్. భార. అర 3. 198.

విశ. (మాంధాత వంటివాఁడు) గొప్పవాఁడు

శా మాహాత్మ్యంబులు తేజముల్ విభవసంపత్తుల్ విమర్శింపఁగా, నోహో భేదములేదు నిండుసభలో నొక్కింతమాత్రంబు హే, మాహే మీలు ఘటాఘటీ లతిరథుల్ మాంధాత లీసాము లే,లా హీనాధిక భావముం దడవ రాదంచున్ విశోకుండనై. వరాహ 10. 8.

**మాందీర్ణము** సం వి. అ పుం ఒకజాతి గబ్బిలము. (వై ని)

**మాంధీలవము** సం. వి అ. పుం పెద్దజాతి గబ్బిలము (వై. ని.).

**మాంసకరము** సం. వి. అ. న. రక్తము (వై.ని).

**మాంసకారి** సం. వి. న్. పుం రక్తము (మాంసము చేయునది)

మాంసకీల సం వి. ఆ పుం. అర్బుదము, రోగభేదము (వై ని)

మాంసగంధి సం వి. ఇ. పుం. కెంపులో దోష భేదము

సీ మండితశశిమాంసఖండంబుగతి నున్న మంద తేజం బగు మాంసగంధి .. రత్న 11.

మాంసజము సం. వి అ. న క్రొవ్వు, మదము.

మాంసతానము సం వి అ. పుం కొండ నాలుక (విలియమ్సు.).

మాంసద్రావి సం వి న్. పుం. పుల్లప్రబ్బలి (వృ వి.) (రా ని)

మాంసనిష్క్వాథము సం వి అ. పుం మాంసము వేసి కాఁచిన చేరు (వై. ని.)

మాంసపిత్తము సం వి అ.న. ఎముక (విలియమ్సు).

మాంసపేశి సం వి ఈ. స్త్రీ. గర్భము కలిగిన తరువాత ఎనిమిదవదినము మొదలు పదునాల్గవ దినము వఱకు గర్భమునందలి పిండమునకు పేరు (కల్ప).

మాంసఫల సం వి. ఆ స్త్రీ. ఒకజాతివార్తాకము, ఒకజాతివంగ (వృ. వి.).

మాంసమాస సం. వి. ఆ స్త్రీ మాంసపర్ణి, కారు మినుము (వృ వి).

మాంసము సం. వి అ. న. నంజుడు, పలలము. పుం 1 పురుగు, క్రిమి. 2. మాంస మమ్మెడిజాతి. 3. కాలము (కల్ప).

మాంసరోహిణి సం. వి ఈ. స్త్రీ చర్మకష, సంబరేను (వృ. వి).

మాంసలము సం విశ. (అ అ అ) 1 బలము గలది 2. లావైనది

మాంసస్నేహము సం వి. అ. పుం. మదము, క్రొవ్వు, ఒడలిచమురు.

మాంసహాస సం. వి. ఆ స్త్రీ చర్మము

మాంసాది సం. విశ. (న్. న్. న్) మాంసము తినునది.

మాంసాష్టక సం. వి. ఆ స్త్రీ మాఘబహుళాష్టమీ తిథి (ఈ దినమున అష్టకాశ్రాద్ధము చేయుదురు)

మాంసి సం వి ఆ. స్త్రీ 1. జటామాంసి. 2 కక్కోలము 3 మాంసచ్ఛద, సంబరేను (వృ వి.).

ఇ. పుం శుక్రగంధము, ఒకవిధమగు దుర్వాసన. విశ. (ఇ) శుక్రగంధము కలది (వై. ని)

మాంసికుఁడు సం. విశ (అ ఆ అ) కటికివాఁడు, కసాయివాఁడు, మాంస మమ్మువాఁడు

మాంసిని సం. వి ఈ స్త్రీ. జటామాంసి (వృ వి.). (రా. ని)

మాంసేష్ట సం వి. ఆ స్త్రీ పక్షివిశేషము, పల్గులియసెడుపక్షి (రా ని.)

మాఁకు — మ్రాఁకు, మాను వి - వృక్షము, చెట్టు

ఏగడ తలఁప బలుమాఁకుగేదఁగికి రాగిల్లకుము ఉ. రా 6 61

ఏగడ. మాకు లేదు సమాకులత ఏ మ్మాకు కుఱుచ విరమాఁకు డాయఁగ ...
చంద్రా. 4. 283, వేణు శ. 73.

2. దిమ్మెన

ద్వి ఇనుము జల్లియ వైచి యొనయఁ గట్టించి,వసి జారి మాఁకున వడిఁ గూరుకొనుచు, జప్పట గావించి ... ద్వి పరమ. 7 516 పొ.

మాఁగఁబాఱు అ. క్రి (√మాఁగు) మాఁగుటకు ప్రారంభమగు (చూ. పాఱు.).

ఎ. ... గొంతుక్రొన్నెత్తురులె క్రోలి విడిచి చవ మాన్మెడలువడి మళకవనదంళమ్ములు మూఁగ మాఁగంబాఱిన కొండగోఁటియ ముఱుగుడు బొందులకు .. మనుచ 4 37.

మాఁగాయ వి (మావి + కాయ) ఇది మామిడికాయలతో నొకవిధముగా తయారుచేసిన ఊరుగాయ.

(వ్యవ) మాఁగాయ ఆవకాయ-తి అపభ్రంశము కాదు.

2 మామిడికాయ (శ ర.).

మాఁగిలి వి. పొలము. (నిరనుస్వార మనియు మాగాణి అర్థ మనియును. శ. ర.).

కం మాఁగిలిమాఁగిలివృక్షము, పూఁగొమ్మనమండె

పటలము ప్రకాశింపన్, లేఁగొందమ నెమిలి పల్కెడు. క్రీడా. 51.

**మాఁగిలు** అ క్రి. అఁచు.

ఉ తియ్యనివింటితోడి ఁతిదేవిచమంగవ నొత్తిగిల్లి యొ, యెయ్యయ్యన వంక చక్కఁబడ నొత్తెడుఁ జూచితె పుష్పబాణముల్, మఱ్ఱొర వ్రాసెఁ జిత్తరువు మాఁగిలి మాఁగిలి చిత్రకారుఁడా, దయ్యము గాక నీవిపనదానము టెట్టిథ వీని కేఁ డగున్ .. క్రీడా. 192.

(మాఁగిలిమాఁగిలి – సావధానముగా)

**మాఁగు** అ క్రి (క. మాగిసు, త. మంగు) మిగులఁ బండు, కమయు

(వ్యవ ఈ మామిడిపండ్లు మాఁగినవి.

చం. ఈవనలక్ష్మి వేఁడియూ, ర్పులు వెడలించెఁ జంపకపుఁబువ్వుల మాఁగినగాడ్పుచాలునన్ చంద్రి. 2 15.

(ఇట తడవుండు అని భావము.)

ద్వి. వాఁగువంతల నోర్చి వఱలునీరంబు, కేఁగున్ దులఁ బట్ట నెడనెడ వెదకి, మాఁగు దుప్పులఁ బట్టి మార్కొన లేక, తూఁగు కాకుల మెడఁ దునుమ నొండొండ, మూఁగు నులూకసమూహ భారమున. నన. 2. 74 పా. 12 పం.

(క్రమచెందు అని భావము)

వి. 1 మాలిన్యము, వలువు.

అ. ... తొడవుల విలసిల్లు, మణులభృణుల దెసఁ మాఁగు విడియ .. భా రా. యు 650.

2 శరీరమందలి నల్లపొడ.

మ. కఱయు న్మాఁగును లేక పుట్టిన శుభాంగం బద్భుతాపాదియై, చెఱయన్ .. హరి. పూ. 5. 119.

జ. మాఁగఁబాఱు, మాఁగుడు, మాఁగుడువడు, మాఁగుడువాఱు మాఁగుపాఱు, మాఁగువడు.

**మాఁగుడు** వి (√మాఁగు) మాలిన్యము.

కం. మెండుకొన భయము ధరణీ, మండల మదిత ల్లడిల్లె మాఁగుడు దిశలన్, నిండుకొనె నిర్జరేంద్రుఁడు, గుండియ జల్లనఁగఁ జేతి కులిశము పైచెన్ సీతావి 1. 94.

ద్వి కలుచని మొగిలులోపలఁ దోఁచుచంద్ర, కళ జంగి మాఁగుడు గవిసి ... ద్వి. హరిశ్చ. ఉ 2088 పం.

2 కమియుట, మిగుల నలఁగుట

మత్తకోకిల. . రథదంతి వాజిభటావళిన్, బుండు మాఁగుడు గాఁగ నేసిరి భూరి వీరధనుర్ధరుల్. కు సం 11. 716.

**మాఁగుడువడు – మాఁగువడు** అ క్రి (మాఁగుడు + పడు) మాఁగువాఱు, మలినమగు

సీ తన కౌఁద్యదీప్తిచే నినబింబ మనయంబుఁ బగలెల్ల మాఁగుడు వడఁగఁ జేసె ... మొ. రా కాల 19.

సీ చిఱుతకూఁకటి నున్న చిగురు చెంద్రుకలతో మెఱసి మాఁగుడువడి మిళ్లువ్రేల, ముచ్చుట్టు ముడిచిన ముంజితోఁగట్టిన చెలువంపు గోచి ముం జెఱఁగు దూఁగ ... హరి. ఉ. 10 233

ద్వి. మగ్నత సడలక మాఁగుడువడక, భగ్నంబు గాక చెప్పలు మాఱుపడక ... పండితా దీక్షా. 61 పా

(క్రమఁ జెందు అని భావము.)

**మాఁగుడువాఱు** అ. క్రి. (మాఁగుడు + పాఱు మాయు, మలినమగు.

వ .. విక్రమవిహారంబు ముగియించి గవుసెన బోదివిన కుసుమకోదండు వెండిజలపోఁత దళ కుటరగ తెఱంగున మెఱుం గడంగి యుడురామండలంబు మాఁగుడువాఱి కానిపించె ప్రభా 5. 57

**మాఁగుపా(వా)టు** వి. క్రి (మాఁగు + పాటు మాఁగుపడు, మాయు, మలినమగు.

సీ. మాఁగుపాటిన చంద్రమండలంబునుబోలె వనారవిందంబు వన్నె దఱుఁగ ... ఉ. హరి. 1. 17

సీ. దనుజతేజము గని దైన్య మొందినమాడి

మ ర్తాండుఁ డెంతయు మాఁగువాఱె ..
నృసిం. 2 107

**మాఁగువడు — మాఁగుడువడు** అ క్రి. (మాఁగు + పడు త మంగపడు), మాఁగుడువాఱు, మలిన మగు

సీ సురుచిర కిరణ విస్ఫురణ బు డింది యెంతయు మాఁగువడిన మార్తాండు పగిది ..
మార్క 1 168.

**మాఁటినంగ** వి (మాఁటిన + నంగ త మూడు వర్గ) 1 కాముకి

గీ భోగదాన ప్రతంబులు పూని యెప్డు, మకర కేతను నర్చించు మాఁటినంగ .
కాశీ ౬. 171

2 ముగ్ధ, అవిదగ్ధ

సీ. మాటాడ నేరని మాఁటినంగవు నీవు సకల కాలంబు నో సరసిజాక్షి ..  కాశీ 3. 62.

**మాఁటు** అ క్రి (త మాడు.) తగులముగొను

ఉ కూఁతురు నీవు వట్టి చెడుఁగూఁతలు గీఁతలు నేర్చి కష్టులన్ మూఁతులు నాకఁ గాని ధన మూల విటాళినిఁ జేరవై తి వీ, రోఁతకు నిన్ను నెల్లరును రోయఁగ నీసరివారు నవ్వ నీ, కోఁతి విటుండు నల్పువెడకోడిగముల్ గని మాఁటి పత్తురే  భల్లా 5. (శ. ర).

వి 1 తగులము (శ. ర.)

2 మాఁటు, చదరంగపు ఆటయందు బంటుతోఁ గాక తక్కినవానితో రాజును గట్టుట (శ ర.).

**మాడించే— మాడ్చు** స క్రి (√మాఁడు) మాఁడఁ జేయు, దగ్ధముచేయు.

కం మూఁడువినంబులు తద్దయు, వాఁడి యగు రణంబు నేసి వరశాఖాగ్నిన్, మాఁడించితి వయ్యధమునిఁ, బోఁడిమి చెడి తద్భుకాఘములు వెస విచ్చెన్.  హరి. పూ 2. 180.

ద్వి .. ఆఁ వియు వీక్షించి, శాలుండు గావునఁ బలితెంచెఁ గాని, పోల నీతఁడు దుష్టబుద్ధిఁ రా డనుచు, నార విచారించి యంశుజాలముల మారుతసుతుమేను మాడఁ డ దెచ్చె.
రం రా ఉ 9 పా 2 పం.

ద్వి ఎఱిఁగెద గాకేమి యొదఁ బోయెదవు, మూఁడులోకంబులు ముట్టిగ్రామున, మాఁ డించు నిన్ను నమ్మినజనాగ్రదుడు, తుద మెడిన్

రం రా యు 344 పా. 2 పం.

**మాఁడు¹** అ క్రి (త మాట్టు) 1 దగ్ధమగు.

ఆ కాననంబు లెల్లఁ గాలిన నవిమిషేం, ద్రాస్త్ర వహ్ని నెఱఁకు లంతపట్టు. మాఁడ మోడు వడినమాడ్కి రూపఱెను గో, మంతి పర్వతంబు మనుజనాథ  హరి ఉ 191.

ఉ నేఁడు బలంబు లెల్లఁ గొని నీవు మహోర్ముల జేర్చి చిచ్చుచే, మాఁడిన కాననంబగతి మర్కట సైన్యము సొంపు దూల ...
భా రా యు 733., భా రా సుం. 509.

2. (ఆఁకలి మొదలగువానిచే) బాధపడు

గీ. మఁలముల మాఁడుచు మానసం బెరియంగఁ, బట్టె డోరెము మాకుఁ బెట్టు మనుచు ..
భాగ. 10 ఉ. 966.

3 శుష్కించు, ఎండు.

సీ. పొలముల కాటి ప్రేగులు మాఁడి యున్న ప్రేతవ్రాతముల బీదతనము వాసె ...
ఉ. రా. 8 178.

సీ. సస్యముల్ మాఁడె శీర్షములఁ గాకము లాడెఁ గండలు గురిసెఁ జీకటులు బెరసె ...
చెన్న. 5 27.

4 పాడగు, చెడు.

ఉ. నేఁడు ప్రసూతికాలమున నీవు గదాధర మద్గృహంబునన్, వాఁడిమితోడ నుండి ఖమువాకిలి గట్టి మదీయసంతతిం, బోఁడిమితోడగాచి వనుఁ బుణ్యునిఁ జేసినఁ గాక యింతలో, మాఁడిన నేమి చేసెదవు మంత్రవునీరులు చల్లి వచ్చినే.
ఉ. హరి. 219.

కం. జడనిధిచందంబున ని, మ్మడు వొప్పఁగ నిప్పు దేమి మాఁడెనె.  భార శాం. 3. 189.

వి అడుగ టిన యన్నము, దగ్ధిక.

గీ వేఁడి యగుడాక నోరువ మాఁడు గలిగెఁ,
బలిసినది గఙ్గె నన్నఁబు పోఁకయంత,
యొఁగి కుత్తుక వెసఁ జల్ది మెసవ నైన,
పాప ముపేంచుకొందుఁ దవ-బు-లిమి

పాండు. 4 153

గీ అలరు మాఁ డనఁగ దగ్ధి, కావ్యాయము.

ఆం భా. 2. 257.

జ మాఁడేచు, మాఁడుచు

**మాఁడు²** వి ఇంటి యొక్క భాగపుకప్పు (శ. ర)

**మాఁడుచే(డ్చు)** స క్రి (√మాఁడు¹) మాడించు, దగ్ధముచేయు

కం. పిఁడా వెఱపక యుండెడు, వాఁ డిక్కడ
రాముఁ డున్నవాఁ డని వినియున్, నే డీ
దిక్కునుపోఁడిమి, మాఁడుదు నని యాడుగఱచి
మచ్చరి మెచ్చన్ ..

రామా 7 246. (శ. ర. పా)

సీ లోనగ గ్లిల్ల బెల్లుగ నగ్గి కెర చేసి నెఱిమించు
నరకు లన్నియును మాఁడ్చి ...

అచ్చ. రా. సుం. 172.

గీ. వారివెనువెంట శౌర్యపుర్వారుఁ డగుచు,
నపుడు నృపబాణవితతి ప్రత్యస్తహతుఁ, గూల్చి
మాఁడ్చుచు వచ్చెఁబో గూర్మెరుఁడు, వెలికి
లోనికి నెవఁ బాకుకలయు దాను

కళు. 2114.

**మాఁతు** వి చదరంగపు ఆటయందు బంటుతోఁ గాక తక్కినవానితో రాజును గట్టుట (శ. ర.).

**మాకందము** నం. వి. అ పుం. ఆమ్రవృక్షము, మామిడిచెట్టు.

**మాకంది** నం వి. ఈ. స్త్రీ. 1. ఉసిరిక, ఆమలకి (వృ వి) 2. పీతగంధము, పచ్చగంధము. 3. గంగాతీరమం దుండెడి పట్టణభేదము.

**మాక్షికజము** నం వి. అ. న. మయినము (రా.ని.).

**మాక్షికఫలము** నం వి. అ పుం నారికేళవిశేషము, ఒకజాతి కొబ్బరిచెట్టు (రా. ని.).

**మాక్షికము** నం విణ (అ ఈ. అ) తేనెటీఁగ నుండి వచ్చినది, తేక పుట్టినది

వి అ న 1 తేనె 2. ధాతువిశేషము, తేనెవలె నుండెడి యొకానొక జాతిగనిలోఁ బుట్టెడి ధాతువు.

(ఇవి స్వర్ణమాక్షికము అని ద్వివిధము రా ని).

**మాక్షికశర్కర** నం వి ఆ స్త్రీ పాకము పట్టిన పంచదార (రా ని)

**మాక్షికాశ్రయము** నం. వి అ పుం 1. మయినము (రా ని).

**మాగధ** నం. వి ఆ స్త్రీ పిప్పలి (వృ వి)

**మాగధము** నం వి (అ ఈ అ) మగధదేశసంబంధమైనది, మగధదేశమున నివసించునది, మగధదేశపు ప్రజలసంబంధమైనది

వి. అ పుం. 1 సంకీర్ణజాతిభేదము, వైశ్యపురుషునకు క్షత్రియ స్త్రీయందు జన్మించినవార జాతి ఈ జాతివారికి స్తోత్రపారము చేయుట వృత్తిగా నేర్పడినది,) 2. జీలకఱ్ఱ (వై. ని).

**మాగధి** నం వి ఈ. స్త్రీ 1. మగధదేశపు రాజు కూఁతురు. 2. మగధదేశపువారిభాష (ఇది ప్రధాన ప్రాకృత భాషలు నాలుగింటిలో నొకటి) 3 పిప్పలి (వృ వి) 4. తెల్లజీలకఱ్ఱ 5. శర్కర, పంచదార 6 మల్లివిశేషము (వృ వి). 7 ఏలాభేదము, ఒకజాతియేలకులచెట్టు

**మాగధిక** నం వి ఆ. స్త్రీ పిప్పలి (వృ. వి.)

**మాగధుఁడు** నం వి అ. పుం. 1 మగధదేశపురాజు. 2 స్తోత్రపారకుఁడు బ మగధదేశపు ప్రజలు

**మాగవి** నం వి. ఈ స్త్రీ. పీతకంగువు, పచ్చకొఱ్ఱ (వృ.వి.). (వై ని)

**మాగాణి** వి వరిపంట పెట్టెడుభూమి, పల్లపుభూమి (శ ర.).

**మాగాని** వి. దేశము, విలాతి (శ ర.).

**మాఘము** నం. వి అ పుం. 1. (చాంద్రమానమున) ఒకనెల. 2 మాఘకవి రచించిన శిశుపాలవధ కావ్యము.

**మాఘవనము** సం విజ (అ ఈ అ) ఇంద్రసంబంధ మైనది

**మాఘి** సం వి ఈ స్త్రీ మాఘశుక్లపౌర్ణమాసి

**మాఘుఁడు** సం వి అ పుం శిశుపాలవధకావ్యము రచించిన మహాకవి

**మాఘ్యము** సం వి. అ న కుందము, మొల్ల (వృ వి).

**మాచేకమ్మ** వి (సం. అమాసకర్మ మాచ + అక + కమ్మ శ.ర., బ్రౌ) స్త్రీసాజాత్యముగల నపుంసక ప్రకృతి, పోట, మగరొమ్మును మీసములు గలిగిన ఆఁడుది శ ర

సీ యతి మాచకమ్మ గొడ్రాలు దీక్షాశక్తి మగనిఁ బాసినయింతి మరునిపాలు, తీర్థవాను లను మాంత్రికులు దాయాదులుఁ దర్కవాదులను గ్రోధంబుపాలు సైష 7 158

సీ, మాచకమ్మకు నేల మౌక్తికహారంబు క్రూర చిత్తునకు సద్గోష్ఠియేల రామలిం 33.

సీ మాచకమ్మ యనంగ మనుఁ బోట ...

అం భా. 2 109

**మాచము** సం వి అ పుం మార్గము, 'రాజమార్గము, బాట

**మాచలము** సం వి అ పుం 1. మకరము, మొసలి 2 రోగము (మే ని..

**మాచలుఁడు** సం వి అ పుం 1. దొంగ, చోరుఁడు, దోపుడుచేయువాఁడు. 2 వంది

**మాచి – మాచిపత్రి**

గీ దళములందును మారేడు తొళసి జమ్మి, మాచి నేరేడు వావిలి మంచివెలఁగ, దవనమును జేల పత్రి చూతంబు నారె, శస్త్రములు సుమ్మ పత్రికి జనవరేణ్య భల్లా. 3. (శ ర).

**మాచిక** సం వి. ఆ. స్త్రీ. మక్షిక (త్రి. ని.)

**మాచిప(త్తిరి)త్రి** వి. (సం. మాచీపత్త్రీమ్. క. మాచిపత్రి, త మాసిప్పత్తిరి) ఒకానొకచెట్టు, దానియాకు.

గీ. మాచిపత్రియుఁ గురువేరు మరువకంబు, దవనమును దర్భరయు బిల్వపత్రము లాది, యైన పూజాపత్రవస్తువు లపుడు దెచ్చి, చ తులకుఁ గొండపాడవుగా వైచుచుటయను .

ఉ ఉ రా. 5 201.

**మాచీపత్త్రము** సం వి అ న మాచిపత్రి (వృ. వి).

(సాహెబునిఘంటులోను విఘ్నేశ్వరవ్రతకల్పము లోను ఈ పదము కలదు పూర్వ నిఘంటువు లందు ఈ పదము కన్పడదు ఆకరసు విశ్వాద్యము శ ర లో మాచిపత్రి – గ్రాహ్యేయము (వృ వి) అని కలదు గ్రాహ్యేయశబ్దమునకు యర్థము కిన్పడదు కాని వెంకటాద్రి యమునదు కలదు)

**మాచెనపక్కె** వి మత్స్యవిశేషము (శ ర, బ్రౌ).

**మాజలము** సం వి అ పుం వి పక్షివిశేషము

**మాజుము** వి (హిం మాజూన్) బెల్లము మొదలగువానితోఁ జేసిన మత్తుపదార్థము

కం ముసను నల్లమందు మాజుము, తిని యున్నదిగాన మేను తిమ్మిరి గొని ...

చంద్ర వి 3 136.

**మాటంకము** సం వి అ పుం. లవణాపణము, ఉప్పు దుకాణము (వై ని).

**మాట** వి (త. మాట్టమ్. మాతు తు మాత్తం,) 1. వాక్యము

కం. పడమటియది సాగర మనియెడు తజ్జులమాటఁ దక్క నేతత్పురి నల్గడలందుఁ బరిఖ లెవ్వియొ, జడనిధి యెయ్యదియొ తెలియశక్యమె ప్రజకున్ ప్రభా. 1 65.

కం. ధరఁ దమరు సత్కవుల మని, పరులు కుకవుల నుచుఁ గృతులఁ బరహాస మొనర్తురు గర్వమతు లయోగ్యః పురుషో నాస్తి యనుమాట బుద్ధిఁ దెలిసియున్. అప్ప. 1, 154.

సీ. . మా టన వాక్య మై యొసఁగు ...

ఆం. భా. 1 111.

చం. పలుకులపొందు లేక రసభంగము సేయుచుఁ బ్రాతవడ్డమా, టలఁ దమ నేర్పు చూపి యొకటన్ హృదయం బలరింప లేక స్వే, పాటమును గానియట్టిక్రమముం దమ మెచ్చుగలోక మెల్ల న, వ్వెలఁ బొరయం జరించు కుకవుల్గిరి దుర్విటులట్ల చూడఁగాన్ ... నిర్వ. 1 6.

గీ చులుకఁగా గ్రామ్యజనములు పలుకునట్టి, తెనుఁగుమాటలు గ్రామ్యంబు లనఁగఁబడియె, వర్ణలోపంబు నొంది కావ్యములఁ బొడవుపరులఁ దెగడెడుచో నొప్పుఁ బాటదొంగ అప్ప 1. 225,

సీ. మధురాక్షరము లైన మామాటలు వినంగ నమృతాశనులు యోగ్యు లనుచు వాంగి నైష. 2. 49.

గీ. విజితకాముల మనుమాట విడువుఁ డనుచుఁ, బల్కుగతిఁ బల్కెఁ దోఁటలఁ జిల్కగములు విక్ర. 5. 11.

3. సందేశము, వార్త

గీ. ... కృష్ణుఁ జూచి నన్నుమహావిభుఁడు, పనిచె నీకొక్క మాట చెప్పంగ ననియె ... ప్రభా. 2. 16.

4, విషయము, సంగతి.

వ. ... ఏ నాప్తుఁడఁ గావున నొక్కమాట యడిగిన బ్రాహ్మణజాతి స్వభావసులభం బైన చాపలంబుఁ జూచి హెచ్చుగుంచాడం బనిలేదు రహస్యంబు కాకు డెనేనిం జెప్పుము ... హర 4. 22.

గీ. కినిసి వాకిటివా రడ్డగి చుకతన, నేను విచ్చిన మాట దేవేంద్రుతోడఁ, దెలుపు మని యొతవేఁడినఁ దెలుపరైరి ... కువల. 4. 61, కళా, 3. 38.

5. హితోక్తి

ఉ ఓట యొకి తయేనియు సుబోధనువిత్తము నందు లేమ నీ, మాటలఁ బోవునే దుంఖమానము యెక్కుడు పూనుఁ గాక...
భా. ఉద్యో. 3. 104.

కం. ఈ మెయి వెచ్చము సేసిన, నామేరుమహాద్రియంత యర్థం బైనన్, వే మొదలికి మోసం బగు, మామాటలు విని తదుద్యమం బుడుగు మనన్ .. విక్ర. 2. 167.

వ. అని యనేక ప్రకారంబుల బోధించిన తల్లి మాటలు చెవులు సోఁకనీక . కాశీ. 4. 98.

6 చరిత్ర, కథ

కం జీమూతవాహనుం డొక, పాముసకై విహగపతికిఁ బ్రాణము లీఁడే, యా మాట సూర్య చంద్రులు, భూమియుఁ గలకాల మెల్ల బుధులు వొగడఁగన్, చిత్రభా 5. 204.

సీ. చాటక పోఁజమీ చాలఁ బ్రోవక యున్న నాఁటి బ్రేపల్లెలో బోటిమాట సిం నార 49

గీ అవని మర్యాద దప్పని యతనిపత్ని, యనక మతి మోహ మెనఁగంగ నభ్రగంగ, వెడలనీక మహాజటావిపినమునను, మాట లేదొ ధరిత్రి నీ మాట లేదొ శశాం. 5. 100.

7 నింద, నిందావాక్యము.

ఉ .... ఆ నృపతిపాలికిఁ బో యొదవేమొ పొమ్ము నీ, యిచ్చకు వచ్చినట్లు రమియింపు మొకానొకమాట పుట్టినన్, నెచ్చెలి లేదు బంతియను నేర్పున దిద్దుకొనంగఁ జాలినన్ శుక 2. 97.

ఉ ఇంత ప్రయోజనంబు తమ నేలిన యేలిక చోళధారుణీ, కాంతునకున్ సవిస్తరముగా వినిపింపక నే నహంక్రియా, వంతుఁడ నై గణించి తగువైపువఁ దీర్ప నతండు విన్న నా, కెంతయు మాట వచ్చు నని యెన్నిక నయ్యధికారి గ్రక్కునన్. విప్ర 5. 48.

గీ చిన్నవాఁడును బ్రియు నొక చిన్నమంతమాట యాడిన విని తాపమగ్న పగుచు .. కళా. 4. 128.

8. వాగ్దండము, తిట్టు

ఉ. .. ఆతఁ డర్జుని డిమె సుభద్ర వీరఁ బో, నిచ్చినమాట వచ్చు బల కృష్ణులచేత నటంచుఁ దారు తా, రెవ్వరికై పృథుశ్రవసుఁ డేలిక గాఁ గల ప్రోలికావరుల్. విజ. వి 140

ఆ మాట బడఁగ వలదు మౌనివ్రతంబున, నునికి దక్క నీతియొండులేదు ...

దశకు. 11 105.

చం అల ధరణీసురేశ్వరుఁడు నవ్విట కంటకితేఁ బెక్కుఁ భంగుల నిట-మాటలం బడి దిగుల్తుదిఁ దోఁపఁగ ... విప్ర 4 62

9. వివాదము

రగడ. మనము మనమునఁ గోరి చెలులకు మాట మాటలు వచ్చు గోఁగున ... వసు. 149,

సీ కలికికోయిల గళగ్రహము సేయకమున్న రా చిల్క మాటకు రాకమున్న ...

వసు 4 25

రగడ మాటకు మూరక మాటకు వత్తురె . .

యయా. 4 25

10. లోకోక్తి.

గీ. మొనసి హిత మాచరించిన ముండముక్కు, కోఁత పడె ననుమాటయె గోచరించె.

కాశీ 6 225

కం. మానవతీ మగవాఁడో, మానో యను మాట నేఁటి మాటయె చెపుమా హార. 3. 100

11. సూక్తి, ఆరోక్తి.

చం .... అయ్యవస్థ యుచితమేకదా విపది ధైర్య మనం బనుమాట యింతకున్.. ఆము. 5 99.

12. శాస్త్రయుక్తి

ఆ మనసు చల్లఁబడక మాట పెన్నాడిన, ముక్తి గాదు వాదశక్తి గాని, మనసె కారణంబు మఱి బంధమునకు మో, తమున కనుచుఁ దెలుపుఁ జదువు వినుము. కవిరా 1. 157,

13. ఆజ్ఞ.

చి. చెలువ చిలుకలు నీమాట సేయుఁగాక . .

కవిక 3 164.

14. ప్రతిజ్ఞ; ప్రతిజ్ఞావచనము

కం మఱుతురె యాడినమాటలు, పిఱుఁదని పోఁడగు నె మీకు బెదరక యెదురై, తలుముఁడు భీష్ముని గీష్మని, సెలుఁగరె మున్నేను గలుగ నేలా వెఱవన్. భార భీష్మ. 2. 170

గీ. అనుచుఁ దా నన్నమాటఁ జేకొని తడయక, ఘనభుజుఁడు సుమిత్రనందనుఁడు జిష్ణుఁ, డరిఁ గరము గు టువడ సేయన్

రాఘవ 4. 169

15 ప్రార్థన.

గీ . ఉన్నంపుఁగూటి దొంగల, మాటకయి మేను పూనినమేటి వేల్పు ... సీలా. 8. 51

మాటమాత్ర 1 నిమేషము, రెప్పపాటు కాలము

చం. సురల జయించి దేవపురి చూఱలు పట్టి సమస్త లోకముల్, పారిఁబోరి నెర్పు నయ్యసుర పుంగవకోటుల మాటమాత్రలో, శరముల పాలుచేసి దివిషద్వరు లెల్ల నుతింపఁ బొల్చునా, హారికిని మీకు హస్తిమకరాంతర మారసి చూడ నెమ్మెయిన్ చిత్రభా 6 63.

2 అనాయాసము,

గీ. తోయజాక్షుండు బాహాచతుష్టయమున, మాట మాత్రనె మోయఁడే మందరాద్రి ...

హార 6 48.

మాటయిచ్చు — వాగ్దానముచేయు.

మ. కనుఁగొన్నంతనె యాదరించి తను లంకా రాజ్యపట్టాభిషిక్తునిఁ గావింపఁగ మాట యిచ్చి కృపఁ గాకుత్స్థుండు మన్నింపఁగా .

రామా 7 201

మాటలమంచి — మాటలయందు మాత్రమే మంచితనము గలది, పనులందు చెడ్డది.

ద్వి. పాపజాతులు విసపరులు వెడ్డరులు. మాటల మంచులు మంరులమార్లు ... వన్నెకత్తెలు వార వనితలు ... పండితా. పురా 116 పా.

మాటలో — రెప్పపాటు కాలములో, నిమిషములో.

గీ ... తొవలుసూడు, తత్తడుల కని మాటలో దచ్చికడలఁ, బఱచి క్రమ్మఱెలు నచటి బాహా తుటుములు ... నీలా 1 34.

**మాటలోనివాఁడు** – చెప్పినట్లు చేయువాఁడు

గీ ఇంక నేణాంకవదన, మంజువాణియు నేను
నీమాటలోని, వారి మైత్రిమి మాకు నేదారి నడు
వవలెయునో యట్లు నడిపింపు పలుకు తేల
కువల. 4. 46

(వ్యవహారములోని ప్రయోగ విశేషములు)

1 వాఁడు మాటలో వచ్చెను
2 బ్రహ్మవిద్య తెలిసికొనుట మాటలా
3 ఎంతమాట
4 చాలకాలమునుండి వారిద్దఱకును మాటలు లేవు
5 మన యిద్దఱకును నొకబండి మాటాడుము
6 వాఁడు నవ్వడ్డమైన మాట లాడెను
7 ఈ యూరిలో వానిమాట కెదురు లేదు.
8. ఈ పద్యమున కర్థము చెప్పితివా నీవు పండితుఁడ వన్నమాటే.
9. అదే మన్నమాట?
10 నీకు పెండ్లి కూఁతును మాటాడెదను.
11. నేను మాటవరుస కట్లంటిని.
12. అనవసరముగ మాటలు మిగులకుము
13. అబ్బాయీ! మాట.
14. ఇంక నాలస్యము చేసితివా మాట దక్కదు
15. మాట జారిన తరువాత ఏ మనుకొనిన ఏమి లాభము!
16. నిన్నటిసభలో వారిద్దఱకును మాట మాట వచ్చినది.
17. నే నిప్పుడే వానికి మాటయిచ్చితిని.
18. మాటలు ముదరనీయకుము.

ఇ మాటకాఁడు, మాటకారి, మాటపట్టు, మాటపడు, మాటమోచు, మాటమోపరి, మాటలబోటి, మాటలమారి, మాటలమిటారి, మాటలాట, మాటవాసి, మాటవెట్టు, మాటాడు.

**మాటకాఁడు** విశే. (మాట + కాఁడు. త. మాట్టు క్కారన్, క. మాతుగార) సభయందు భయము లేక మాటలాడువాఁడు. వక్త (శ. ర.)

**మాటకారి** విశే. (మాట + కారి, క. మాతాళి) వాగ్మి, చక్కఁగా మాటలాడువాఁడు.

ప .. ఘటపుటనైనకూలంకషచాటువుల మాట కారితనంబు మెఱసి. మనుచ. 5. 101.

చ: నిగమం మాటకారి నయధన్య పదార్థముపట్ల మిక్కిలి, నైగుపరి కంతుకేళి గడిదేఱినజాణ
నిరం. 2 34

**మాటపట్టు** వి. (మాట+పట్టు) 1 మాటలయందు పట్టుదల, వాక్కునం దభినివేశము.

కం బలహానికిఁ జిత్తమునం, గలఁగంబడి మాటపట్టు గలరా జయ్యుం, దల వంచి యుండెఁ గేసరి కలల కసాధ్యములు లేవుగద లోకమునన్
వేం. పంచ. 1 528.

2 వాగవలంబనము, మాట ఆసరా

మ అవనీనాయక వీని దుష్టమృగచోరాద్యాపద ల్పొందనీక విమర్శింపుచు నెల్లప్రొద్దుదయతోఁ గాపాడుచుండన్ వివ, బ్రువికార స్థితి లేక నాకడ వసించన్ మాటప ట్టిచ్చె దేని వినోదం బుల జోడు వాయ కవుడు న్నితోడఁ గ్రీడించె దన్. కవిరా. 5. 154.

3, ఒట్టు. శపథము

ఆ. బిగియఁ బట్టి యొందు బెణఁకినీ కడిగె నే, యర్థ మిందుఁ గలదొ యనుతలఁపున, జడియఁ కదియుఁ జత్తు నరిపోదు మాటప ట్టిక చెప్ప ననుచు వీక నుండె ...
ప్రభా. 4. 9., ప్రభా 4. 31.

**మాటపడు** అ క్రి (మాట+పడు) నిందపొందు.

కం. నీమాట నమ్మి పోయిన, నామోసముఁ జెప్ప నేల నక్కిరునిచే, నే మాటవడ్డదుఃఖము, నామ వ్యథ కొలఁదిగాదు సద్భక్తనిధీ ..
కాళ. 3. 163.

**మాటమోచే** అ క్రి (మాట+ మోచు) నిందపాలగు.

సీ. వాణియే మితసూక్తి వదలదు తలవాకిలి నిజేశు మాట మోచె ననఁ జేసె ... వసు. 1. 36.

సీ. అప్పుపా లైనకుబ్జాబ్జంబురుచి యెంత మాట

మోచినహంసతేట యొంత. నరస 1. 67

**మాటమోపరి** విజ. (√మాట.) 1. అపవాదములు పుట్టించువాఁడు వార్తాహారుఁడు

సీ మాటమోపరు లౌట మది నెన్నఁగా నైతి నిల విజాతుల రౌట నెఱుఁగ నైతి, మందవర్తను లౌట మది గనుఁగొననైతి మానసోన్నతు లౌటఁ గాన నైతి . చంద్రా 4 53.

(రెండర్థముల కిదియే యుదాహరణము )

**మాటలబోటి** వి (√మాట) సరస్వతి

ఉ .. మాటలబోటికి నవ్విరించికిన్ బొందికలం దెడాటములు బుట్టిన మాన్తును వారు మెచ్చ గన్ .... అహ 3 7

**మాటలమారి** విజ (√మాట) వాచాటుఁడు, వద రుఁబోతు

గీ వెలయు మాటలమారి వాఁ డ్రేలువాఁడు, వాఁగ నాచాటుఁ డై యొప్పు నాగభూష.

ఆం భా 3 11.

**మాటలమిటారి** వి (√మాట) సరస్వతి

గీ. మాటలమిటారి గారాపుమనుమరాలు, చిన్ని పాయానఁ జెన్నొందు చున్నవేళ ...

సమీం. 1 190

**మాటలాట** వి (√మాటలాడు) ముచ్చటింపు, ప్రసంగము

ఆ నేలఁ గూలి మ్రానువోలె ని ట్టున్నయి, ప్నాప కర్ముగుఱిచి పాడిఱెఁగు, తేటపడఁగ మాట లాట దా నేల మీ, రెక్కుఁ డరదముల మహే శులార భార. శల్య 2 323.

**మాటవాసి** వి. (√మాట) కీర్త్యాధిక్యము ?

సీ. నెఱిజీవనము లేక నింగిపై భ్రమయించు మత్స్యంబు దునుముచే మాటవాసి ..

నరస 5 172.

మ. రతికి న్నారతికి న్వినోదకథలం బ్రాగల్భ్యముస్ జూపి త, త్పతులం గూరిచి మాటవాసి గనుబెద్ద ల్గారె మీవారలు ... విజ. వి 2. 184

**మాటపెట్టు** స. క్రి (మాట+పెట్టు) సంభాషించు, మాటాడు

సీ ఉష్ట్రఖరగోహయంబులయందులో నొక్కటి చందమోంది

గీ . యడఁగి యున్నాడు వధియించు టను చితంబు వాని నని పల్కె నటు సేయువాఁడ గాను, మాటపెట్టుడుఁ గన్నచో మాననీయ, వాక్య యని వీడుకొనియె నవ్వాగ్వుండు

భా. శాం. 4. 257.

**మా(టలా)టాడు** స క్రి. మాట + ఆడు త మట్లమాడు, క. మాతాదు. పలుకు, పచించు.)

(వ్యవ ) చూడు ' వాఁ డెన్నిమాటలు మాటా డెనొ '

సీ. కర్ణికారముఁ బోడగన్న మాటాడదు పిందు వారముమీఁదు జేర్ప దూర్పు .

విక్ర 1. 123

సీ. కొసరి వావిలిఁ గొండగోఁగును ననిపించె మూర్కొని మాటాడి ముదిత యోర్తు ..

యయా. 4 19.

గీ మదవతీమణి రాలతో మాటలాడుఁ, గదవె నివ్వెఱ్ఱువ మెఱుంగు గబ్బికులుకు, టిలుకు సిబ్బెపు గుబ్బపాలిండ్లు దెలియ, నీవు మాటాడ కుండెడి దేమి చెపుమ సారంగ 2. 209.

(ఇట రాలతో మాటలాడు అనునది జాడమ్య ద్యోతకము )

గీ అమరు నవ్వీట నవ్నపూర్ణాభిధాన, మదన మాయా మహాస్థాన మంత్రసాని, దానితో మాటలాడి చూతము విచార, మేల యని.

శుక. 1 429.

2 ప్రసంగించు

శా. .... విశి, ష్టాద్వైతంబును దేటగాఁ దెలుప మాటాడెన్ బ్రమాణంబులన్ ...

ఆము. 3 9.

3 నిష్ఠురములాడు.

గీ. వెనుక నిటువలె నటువలె ననుచు నన్ను, మాట లాడిన విసను ముమ్మాటి కిదిగో, యొఱుఁగఁ జెప్పితి ... దశా. 2 344.

4 (కార్యములను) ఆలోచనము చేయు

గీ. జిష్ణుతో మాటలాడి పేజీబు వనుతు, రౌం తిప్పనృపాల శాహాసి నిహతు, తైవ యల హిందుఖాన సేనాధిపతులు, సింగి సురపట్టణము చేత దండువిడిసి . . కుషల. 1. ౬3

5 వ్యతిరేకముగాఁ జెప్పు.

(ఈ యర్థమందు తఱచు వ్యతిరేకరూపములే కన్ప ట్టుచున్నవి.)

వ .. తగవు దప్పక చెప్పెదేని గొన్నిమాటలడి గెదము. మాటలాడక విచారించి యుత్తరం బిమ్ము నైష 8. 55

(వ్యవ.) పెద్దలు చెప్పినదానికి నీవు మాటాడకు. దీనిని వారు కా దన్న నేను మాటాడెదను

**మాటికి** అవ్య. (దీని యామ్రేడితరూపము మాటిమాటికి, మాటికిమాటికి) మువుఁవర్ధకము, అడుగడుగునకు.

కం వీటి పటుఘోటకనిరా, ఘూటత్వం కోడివూరి గఱచు హారిణముల్, మాటికినిఁ దదారోహకుఁ డౌడం బవమానుఁ డోడు టబ్బురమగునే ..
కవిజ 1 8.

చం బడలిక నూడు నచ్చిలువ ప్రగ్గముల గ్రవి యాజ్ఞ,మాటికిన్ ముడియిడఁ బిచ్చుకుంటు రథము న్నిలువన్ ... ఆము. 2. 49.

గీ వెఁడి మాటిఁకి దిరుగ నా వెలయును బున. రర్థముగ ... ఆం. కా ౭. 69.

ఉ. .. పాఁవజందెములమేటికి బత్తిని మాటి మాటికిన్ .. నీలా. 1. 7.

సీ. మాటిమాటికిఁ గూర్మి మాటుసేసెద నన్నఁ బై కొన్న వలవంత బయలువఱచు ..
విక్ర 1. 129.

ఉ. .. ఘూరహేమండము జాజకట్టుగా, మట్టుచు ఘుర్ఘరధ్వనుల మాటికిమాటికి దిక్కుటంబులన్, ఘట్టన చేయుచున్ వెడదకన్నుల నిప్పులు వెళ్లఁ గ్రాయుచున్ ...
హం. 7. 44., నీలా 1. 28.

**మాటు¹** వి జౌ. తూరి, తడవ.

ఉదా ఒకమాటికి, ముమ్మాటికి, మాటికి, (దీనికి కొన్ని విభక్తులయందే ప్రయోగము కన్పడు చున్నది)

కం ఘనతరనైశతమం బొకొ, యనఁగ ఘనాఘన తమిస్ర మవిరళమై క,ప్పిన జనులకు వస్తువిభా,. సన మొక్కొకమాటు కలిగె వైద్యుతరుచులన్.
భార అర. 4. 136

ఉ మాటలు పెక్కు లాడి యనుమానము లేక సభం గడంగి ప,ల్మాటుఁ బరాభవించితిఁ జలం బునఁ బాండవకోటి నెప్పుడుం,జేటుదలంచి ...
భార భీష్మ 3 449.

గీ మందరాద్రులు రెండొకమాటు పడిన, కొలఁది కగ్గఁముగ బిట్టు గలఁగు జలధి, పోల్కి రామ కృష్ణాపాతఘూరివేగ, సంక్షుభిత మయ్యెఁ బార్థి వసైన్య మెల్ల. హరి. ఉ. 1 96

(ఒకమాటు — ఒకసమయమున అని భావము)

కం ప,ల్మాటును చెడమరి చూచుచు . .
వశకు. 3. 120.

దండకము. ... సత్యంబు సత్యంబు సత్యంబు. ముమ్మాటికిన్ ... కాశీ. 7 202.

మ . నీళ్ల న్మ్రింఁచివం బాల ముం, చిన నీవేమతి యొం డెఱుంగ నిదియే సిద్ధంబు ముమ్మాటి కిన్ ... దశా. 2 340.

**మాటు²** స క్రి. (త. మాట్టు) మఱుఁగుపఱుచు.

శా. ఆ లీలావతిమానసం బెఱిఁగి యాహారిద్ర వర్ణంబు స,వ్యాలోకంబున మాటు శంకరుఁడు కావ్యస్వామినిం బ్రోవుతన్ ...
ఘటికా. 1 3.

గీ. రూపకాతిశయోక్తి పేర్పునుపమాన, మాత్ర ము వచించి వర్ణ్యంబు మాటి రేని, నల్లదొడ కవఁ గ్రొవ్వాఁడి నారసములు, వెలువడు నవంగ లత్య మౌనలికనేత్ర ...
చంద్రాలోకము 33

సీ పతి చన్నదిక్కు తప్పక చూచి యఱచుఁ గాం

తుని మాటి తేలని దూలుకరణి

హ. న. 4 7, నీలా 1 60.

2. అణఁగఁద్రొక్కు

చం జలనిధిలోన దూఁటి ... రక్కసునియంగము
గీటి బలీంద్రునిన్ ... తలమున మాటి పార్థి
వకదంబముఁ గూల్చినమేటి రామ నా, తలఁ
పున మాఁటి రాఁగదవె దా. శ. 33

3. అంటించు

చం. జలనిధిలోన దూఁటి కులశైలము మీటి ధరిత్రిఁ
గొమ్మున నం, దలవడ మాటి ..

దా. శ 33

4 (కన్నములు) లేకుండ బాగుచేయు

(వ్యవ) ఈ పనివాఁడు చెంబులు గిన్నెలు చక్కఁగ
మాటును

5 పొడుచేయు

సీ మకరందముల నేల మాటెదరే సదాళి నిరా
కరణప్రవృత్తిఁ బెనుపరాదు

బిల్హ 2 17

6. కలిగించు.

ఉ పచ్చ వసంతకాలము రువారంపుఁ దేనె పసిఁడి
నీరునన్, బచ్చెన మాటి తేఁటి నిసుపోజులఁ
దీరుగ వ్రాసి యున్నయా, పచ్చని విల్లు వంచి
సుమబాణుఁడు. సుద 2 45.

అ. క్రి మఱుఁగుపడు
(చూ మాటుకొను అ క్రి)

వి. 1. మఱుఁగు, చాటు.

సీ. గుప్తనివాస మొంటె, మాడువుమీఁ దొంటె
మాటు లేని యరణ్యాల మొంటె మంత్ర విధా
నమునకు, నర్హ ముల్.

భార. ఆశ్ర 1. 58.

ఉ మానుష భావ మిట్లొకఁడు మాటిడి లోక
హితం బొనర్పఁగా, బూనిన నీమహామహిమ
బుద్ధిఁ దలంపక .. హరి. పూ. 7 44.

(మాటిడు — మఱుఁగుపఱచు)

సీ. మాటుగా వైచిన మాంజిష్ఠతెర యెత్తి పంజు
మంచము డిగ్గె మంజుఘోష ..

హరి. 7. 137., విక్ర. 2 135.

2 వేటకాఁడు దాగకొనుటకు ఏర్పఱచిన పల్లము,
తెర మొ.

ద్వి ఉరుశక్తి మాటున నుండి వేయుదురు, పరికింప
దీనఁ బాపము లేదు నాకు ..

రం రా కిష్కి 21 - పా 6 పం

వ. .. ఎదురుమాటులు గాకుండ నుండి చెవరి
పొరిదెసవులం బఱవకుండ .

మనుచ 4 ..

3 ఛత్రము.

గీ నవకములు దేసు తొలిజవ్వనంబు మాట, కమ
లనాళంబు జోగరి గండజిందు, వెఱయ
నెవ్వాఁడు విలసిల్లు విశ్వైకనుత, శౌర్య డగు
నట్టి మదనుని సన్నుతింతు. గంధ 1.6

4 అతుకు

(వ్యవ) వ్రాఁతచెంబులకు మాటు వేసి క్రొత్త
పని యమ్ముచున్నారు

గీ. కడఁగి కోదండధరుఁ డేయఁ గదనభూమిఁ, గరి
హయానీక భటకోటి దరతరంబ, నెఱయ సాయ
కములు దాఁకి గఱులు దోఁచె, మద్దికాయలు
మాటిడ్డమాడ్కి వోలె. కు సం 11. 728.

5. రక్షణస్థానము

సీ. దాతలకును జోటు ధర్మాత్ములకుఁ జాటు దళు
కొత్తు వారకాంతలకు మాటు ..

గీ. .. బిక్కనవోలు పట్టణవరంబు ..

శివధ 1, 16.

విశే. 1. రక్షకము, రక్షకుఁడు

ఉ. ఎప్పుడు నెయ్యెడం బొదివి యుందఱకుం దగ
కంటికిన్, ఱెప్పయుఁ బోలె మాటయి
నెఱిం బను లాఁకసి యొజ్జ చాడ్పునం, జెప్పు
చు .. భార. ఉద్యో. 114.

2. అడ్డగించునది, నిరోధకము.

ద్వి పస మించు సన్నపుఁ బట్టెనామములు,
మఱయు నూరుపులకు మాటుగా నమలఁ, జెలు
వారఁ జుట్టిన జిలుఁగు పాగయును ...

ద్వి పరమ. 4. 317.

జ. మాటుకొను, మాటుచేయు, మాటుపడు, మాటుపఱుచు, మాటుమడఁగు, మాటువెట్టు.

**మాటుకొను** స. క్రి. (√మాటు²) మఱుఁగు వెట్టుకొను, తిరోహితము గావించు.

వ ... కొందఱు కరిముఖ్యుల వాతెఱలు మాటుకొని తగ్గి .. ప్రబంధ. 605.

మ. . . కెద్దిమ్ములన్, ఘనపక్షో రుహపాళి మాటుకొనుచున్ గాసారమున్ జొచ్చినన్ . . ఉ రా. 6 78.

సీ అలరారుసిరిఁ దవయదుగునఁ గూర్చి గట్టిగ నీరి చేయి మాటి కొనఁడేని ... వసు. 1. 34.

(ఇట ముడు చుకొను అని భావము)

ఉ. .. రాచసొ, మ్మెచ్చటనైన నిత్యశుచి వృత్తులు మాటికొనంగ నేర్తురే ... వసు 6. 76.

అ క్రి అణఁగియుండు.

సీ శైల వక్షోజముల్ ఝరిఘర్మమునఁ దోఁగి మబ్బువన్నియపైటఁ మాటుకొనఁగ ... దశా 3. 204.

**మాటు(సే)చేయు** స క్రి (మాటు² + చేయు) మఱుఁగుపఱుచు.

గీ మఱి కులాచారవర్తన మాటుచేసి, పరగు పిత్రర్థములు దాని పాలుచేసి, సాధులక్షణ గుణవృత్తిఁ జాలు చేసి, లోల లోచనపసఁ జెంది లోలుఁ డయ్యె భాగ. 6 105.

సీ మాటిమాటికిఁ గూర్మి మ టుసేసెద నన్నఁ బైకొన్న వలవంత బయలుపఱుచు .. విక్ర. 1 129.

**మాడుప(వ)డు** అ. క్రి (మాటు² + పడు. త. మాఱ్జపృడు.) మఱుగుఁపడు.

గీ. గాదమున మాటుపడి యున్న కాయవోలె ... విక్ర. 4. 60.

**మాటుపఱుచే** స క్రి. (√మాటుపడు) మఱుఁగు పఱుచు.

వ. ... గంధకారులు ... పిష్టాతకంబు నభోమండలికిఁ జంద్రాతకంబై చండకిరణంబుల మాటుపఱుప ... ఆము. 4. 55.

**మాటుమడ(ఁ)గు** అ. క్రి (√మాటు². త. మాఱ్జమడంగు) మాటునమడఁగు, గృహాదులలో నణఁగియుండు.

కం చిటు కనక మాటుమడఁగిన పుటభేదనవీథివరసిఁ బొలఁతుక తలవా, కిటికడ నోవిటకంటకి, విటకంటకి తలపు తీయవే యని పలుకన్ .. విప్ర. 4. 57.

(జనసంచారము లేకుండు అని భావము)

గీ అంతటను గేళవుం దూరియలబలంబు, బట్టబడఁ జూచుకొని మాటుమణిగె ననుచుఁ, గటిక చీకటి నెఱనేస్తకాఁడు దాను, ధృతి యొసంగఁగ దాని మందిరముఁ జేరె. శుక. 2 189

**మాటువెట్టు** స. క్రి (మాట² + పెట్టు) దాఁచు, మఱుఁగుపఱుచు.

గీ కోతయును మాటువెట్టక కోమలాంగి మునికి విన్నప మొనరించె మునికి మునికి ... పి. శకుం. 4 15.

**మాఠరుఁడు** సం. వి అ పుం 1. వ్యాసుఁడు. 2. బ్రాహ్మణుఁడు. 3 శౌండికుఁడు, కల్లమ్ము వాఁడు. 4. సూర్యునిపరివారగణములో నొకఁడు.

**మాఠి** సం. వి. ఈ. స్త్రీ కవచము (హాలా. ని, వై ని.).

**మాడ** వి. (త. మాడై) 1 అరవరా, అర్థదీనారము.

కం జనపతి గిరాతులకు నిం, డని పనిచెను వేయు మాడ లాత్మసచివులన్ ... భార. అను 2. 268.

సీ. అర్ధదీనారాఖ్య యడరు మాడ యనన్వరా యన దీనార మై యొసంగు .. ఆం. భా. 2. 273.

గీ పసిఁడిమాడలు పదివేలు పణము గాఁగ, నొడ్డి నొడ్డిన నాడి యత్యుద్ధతుండు, గెలిచె వైదర్భుఁ డతని నయ్యాలముచిత్తుఁ, డోడె నంతపసిండియ యొడ్డె మఱియు . . హరి. ఉ. 8. 231.

గీ. కోడలా యింక బంగరుగోడ లేల, మేడ లేటికి

రతనంపులాడ లేల, మాడ లేటికి బలు రాచజాడ
లేల, వాడలో నీవు బ్రిమ్మర నోడి చనిన
అచ్చరా. అయో 97.

(ఈ క్రింది ప్రయోగములందు దీని బహువచన రూపము "మాళ్లు" గాఁ గానవచ్చుచున్నది )

కం. విలసితబహువైభవముల, వలరుచు నాగవలిఁ జేసి యఖిలార్థజనంబులకు వరహాలు మాళ్ళు, చ్చలవిడిఁ బచ్చడము లిచ్చె జనవరుఁ డంతన్
కృష్ణ 4 127.

కం. కనుఁగొంటి నిదె నిధానము, గనుఁగొన నొక మాళ్లబిందె గలిగెఁ గదా యే, మనవచ్చు దైవ యత్నం, బని తలఁచుచు మోహవశత నవ్యాగ్ర మతిన్ ... శుక. 1 406

2 పణదశకము, పదిరూకలు

గీ. పణము రూక, యనఁగఁ జెన్నొందుఁ బణ దశకాఖ్య చెల్లు, మాడ యనినట్టి పేరుచే ...
ఆం భా 2 272.

కం. మాడెత్తుమాట యెవ్వరి, నాడఁడు సత్యంబు వీడనాడఁడు ... సారంగ. 1. 56

(మాడెత్తు – కొంచెము.)

**మాడపట్టు** వి. బ్రహ్మరంధ్రము, నోదు (శ ర ).
(వ్యవ ) వానికి మాడపట్టున పెద్దదెబ్బ తగిలినది

**మాడము** సం వి అ. పుం ఒకజాతిచెట్టు.

**మాడి**[1] వి కారుకొల్లి, కలిగొట్టు (వృ.వి ).
(బ మాడులు, మాళులు, మాళ్లు )

వ .. తాళ్ల మాళ్లఁ జంద్రల నుంద్రల వెలఁగల ముకగల . పి. శకుం. 2. 14

**మాడి**[2] వి వనకుళుత్థము, అడవిఉలవ (వృ.వి )

గీ. ... తప్పెట కారుకొల్లి, మాడి యనఁగ వనకుళుత్థ మగు .. ఆం భా 2 58.

సీ తలుపుదూలము కొట్టములు సోగరాగాఁడి మచ్చు ముంగిట రెండు రచ్చమ్రాఁకు, లీను గొడిగె వేగు రింటిబిడ్డలు మాళ్లతార్పులు నూబ పాఁతఅలఁ గొలుచు ..
వేం. పంచ. 4. 416

**మాడి**[3] వి. (క. మాడి, బ. మాడులు, మాళులు, మాళ్లు) వాహనము.

ఉ ఉంగరముల్ దుకూలములు నొత్తెలుఁ జీరలు మాళ్లు జాలవా, పొంగళు లెచ్చు చౌకటుల పోగులు కుండలముల్ మురుఁగులున్, ఒంగరు ప్రాంతపట్టికలఁ జాటిలురా మొలకట్టుదాయె తుల్, సంగడివిప్రకోటులకు నమ్మనివాటుల కిచ్చె నచ్చటన్ ... శ్రీరం మా 9 6.

**మాడికి** – మాడ్కి.
(ఇది దేనితోనైనఁ జేరి ప్రయోగింపఁబడును గాని వేఱుగాఁ బ్రయోగింపఁబడదు శ ర )

**మాడుపు(డుప్పు)** వి. వృక్షవిశేషము
(పంగలకట్టవంటి దీనియాకులతో ... కట్టుదురు.

గీ. మాడ్పు చిటికొక్కి సీకాయ మద్ర తొఱ్ఱ, వెలఁగ వాఁకుడు పల్లేరు ములక వేము ..
హంస 4 9.

**మాడువిల్లు** వి (మాడువు + విల్లు) మేడ, డాబా.
కం. అమాడువిండ్లతుదిఁ గల, కామలమణు లర్థ మాగ్న మడరి ... కు సం 7. 945.

**మాడు(గు)వు** వి. (త. మాళిగై )

1 హర్మ్యము

గీ కడురయంబునఁ జనునొకకాంతఁ గాంచి, తన్వి యెటఁ బోయె దెవ్వరిదాన వనిన, మగువ యూరక చని యొక్కమాడు వెక్కె టయును.. మార్క. 2. 298.

చం. ... వియచ్చరాంగనల్, మగుడుట చూచి నవ్వుదురు మాడువులందు రమించు దంపతుల్.
కు. సం. 7. 948.

2. సౌధభేదము, ఒకవిధమగుమేడ, డాబా.

సీ. ... గుప్తనివాస మొండె, మాడువుమీఁ దొండె మాటు లేనియరణ్యస్థలమొండె మంత్రవిధాన మునకు, నర్హముల్ ...
భార. ఆశ్వ. 1. 58.

సీ. మాడుగు మాడువు మాలె యం చనఁగను బ్రాసాదభేద మై పరగుచుండు ...
ఆం. భా. 2. 19.

మత్తకోకిల. వేడుకన్ దగఁ గన్యకల్ దమ వీథు లం బోవ నైనయా, మేడమాడువు లెక్కి చూచుచు .. పాడుచున్ దవలోన నిట్లని ఁల్కి యప్పుడు ప్రీతితోన్, పీర. ౬ 156.

ద్వి. మాడువుల్ పరికించి మణిమయం బైన, మేడ లవాడల మిగులఁ జెన్నైన, మంత్రుల యిండ్లు సామంతుల యిండ్లు ..

రం రా సుం. 242 పా. 17 పం

2 సౌధము, మేడ.

గీ. కల్లుపొల్లున నొకపర్యమల్లుఁ గాని, తవిలి కృతి చెప్పఁ గలఁడె కాకవి తృణాంకు, రములు నైకొని యొకకులాయము ఘటించుఁ, గాని గిజిగాఁడు మాడువు గట్టఁ గలదె.

వి. న 1. 13.

మ. త్రిదశోద్యానము దాయ మాడువులపైఁ గ్రీడించుపూఁబోండ్లకున్ . ఉ రా. 1. 62.

చం. ... అలవై జయంతముఁ జలంబున గెల్వఁగ దలఁచితంబులై, నిలిచినయట్లు మాడువు లనేకము లుల్లసిలుం బురంబునన్ ...

ఆము. 1 52.

**మాడెము** వి 1. (ఇప్పుడు మాడుగు అని వ్యవహరింపఁబడు) సంస్థానవిశేషము.

సీ. అవల నాపాట్నూర రవులుకొనియె.

గీ. మాడెములు పేర్చె నొడ్డాదిమని యొనర్చెఁ, గటకుపురిఁ గాల్చె ...

ఆము. 1 56., మనుచ 1. 37.

2. దుర్గమస్థలము, మన్నెము.

గీ. మన్నె మన మండె మనఁగను మాడె మనఁగ, దుర్గమస్థలనామ మై తోఁచుచుండు ...

ఆం. భా 2. 7.

(మండలాధిపతుల భూమండలము అని శ. ర.)

**మాడ్కి — మాడికి** వి. 1. రీతి, విధము, ఉపమావాచకము.

(ఇది సమాసోత్తరపదముగానే యుండును.)

గీ. మాలకర పుష్పములు గోయుమాడ్కిఁ దేఁటి, పువ్వుఁదేనియఁ గొనియెడుపోల్కి నెదురు, గండకుండఁగ గొనునది కార్యఫలము

భార ఉద్యో 1. 57.

చం. ... ని, ర్మలపరిమాణు యుగమ్మకమునుమాడ్కిని దైవ మనోనుకూలతన్ నైష 2. 65.

చం. మలఁచి పయోధికోశముఁమాడ్కి నొనర్చిన.

ఆము. 1 52.

సీ. మాదిరి పోలికి మాడ్కి పురుడు . . పోలికి యనఁగఁ బో ల్పొందు నుపమ పేరు.

ఆం భా. 2 302.

2 కారణము

ఆ వాల్మృగముఁ ఘోరవన మని వగవక, మఱచి యుండి రేమి మాడ్కి యొక్కో ...

భార ఆది. 6 178.

**మాఢి** సం. వి. ఈ స్త్రీ 1. విడనియాకు, మొవ్వు. ముదుత వీడని లేఁతయాఁకు, మొలక. 2. విచారము. ఖిన్నత. 3. జంటపల్లు

**మాణకము** సం. వి అ పుం 1. ఒకానొక దుంప చెట్టు. 2. స్థలపద్మము.

**మాణవకము** సం వి అ పుం. ఇరువదిపేటల మణిహారము.

**మాణవకుఁడు** సం వి. అ పుం. 1. బాలకుఁడు. 2 కుపురుషుఁడు (మే. ని)

**మాణవము** సం. వి అ పుం. పదియాఱు (లేక ఇరువది) పేటల ముత్యముఁహారము

**మాణవిక** సం. వి ఆ స్త్రీ పడుచు, బాలిక

**మాణవీనము** సం. విఱ (అ ఆ అ) బాల్య సంబంధ మైనది, పసితనముచేత వచ్చినది.

**మాణవుఁడు** సం. వి అ. పుం. 1. బాలకుఁడు, పిన్నవాఁడు.

**మాణవ్యము** సం. వి. అ న బిడ్డలసంఘము, పిల్లలసమూహము.

**మాణిక** సం. వి. ఆ స్త్రీ. ఎనిమిదిపలములకు సరియగు తూనిక (కల్ప.).

**మాణిక్య** సం. వి. ఆ. స్త్రీ. ఇంటిబల్లి (వై. ని).

**మాణిక్యము** సం. వి. అ. న. కెంపు

**మాణిబంధము** సం. వి. అ. న. సైంధవలవణము

**మాణిమంథము** సం. వి. అ. న. సైంధవలవణము (వై. ని.)

**మాత** సం. వి. ఋ. స్త్రీ. 1. జనని తల్లి. 2 గోవు, ఆవు. 3 భూమి 4. విభూతి 5. లక్ష్మి. 6 సన్నికల్లు (వై. ని.). 7. రేవతి 8. ఆఖుకర్ణి, ఎలుకచెవిచెట్టు. 9. ఇంద్రవారుణి, పెద్దపాపర (వృ. ని.). 10. జటామాంసి (వృ. ని.)
బ. శివపరిచారికలు.
పుం. 1. ఆకాశము 2. జీవుఁడు
విశే. (ఋ. త ఋ.) 1. పరిమాణకర్త. 2. ప్రమాత, తత్త్వజ్ఞుఁడు.

**మాతంగము** సం. వి. అ. పుం. ఏనుఁగు.

**మాతంగి** సం. వి. ఈ. స్త్రీ. 1 పార్వతి (వై. ని.) 2. వసిష్ఠునిభార్య (శ. ర.)

**మాతంగుఁడు** సం. వి. అ. పుం. చండాలుఁడు, హీనజాతివాఁడు (వై. ని.).

**మాతగొరక** వి. మత్స్యవిశేషము (శ. ర., బ్రౌ.).

**మాతరపితలు** సం. వి. ఋ. పుం. బ. తలిదండ్రులు.

**మాతరిపురుషుఁడు** సం. వి. అ. పుం. తల్లియొద్దనే పౌరుషము చూపువాఁడు, పౌరుషహీనుఁడు, పిఱికివాఁడు

**మాతరిశ్వుఁడు** సం. వి. న్. పుం. వాయువు, గాలి (వై. ని.).

**మాతలి** సం. వి. ఇ. పుం. ఇంద్రసారథి (వై. ని.).

**మాతాపితలు** సం. వి. ఋ. పుం. బ. తలిదండ్రులు.
గీ. మాతృపితృహీన యైనను భ్రాతృరహిత, భావ మొందిన ... భార. అను 2 227.
(మాతృపితృహీన – తలిదండ్రులు లేనిది. ఇది మాతాపితృహీన అని యుండఁదగును)

**మాతాపుత్త్రులు** సం. వి. అ. పుం. బ. తల్లియును పిల్లయును.

**మాతాళి** వి. (హిం మాహ్తాబీ. మాతాభి. మి బ్రౌ.) జలతారు (శ. ర.).

**మాతామహి** సం. వి. ఈ. స్త్రీ. తల్లితల్లి, అమ్మమ్మ.

**మాతామహుఁడు** సం. వి. అ. పుం. తల్లితండ్రి, తాత

**మాతామహులు** సం. వి. అ. పుం. బ. తాతయు, అమ్మమ్మయును

**మాతులకము** సం. వి. అ. పుం. ఉమ్మెత్తకాయ, ఉమ్మెత్తపండు

**మాతులపుత్త్రికము** సం. వి. అ. పుం. ఉమ్మెత్తపండు.

**మాతులపుత్త్రికుఁడు** సం. వి. అ. పుం. మేనమామ కొడుకు

**మాతులము** సం. వి. అ. పుం. 1 దుత్తూరవృక్షము, ఉమ్మెత్తచెట్టు. 2. ఒకదినుసు బియ్యము. 3. ఒక జాతిపాము, మాలుధానము (వై. ని.)

**మాతులాని** సం. వి. ఈ. స్త్రీ. 1. మేనమామ భార్య 2 జనుము (వృ. ని.).

**మాతులాహి** సం. వి. అ. పుం. సర్పవిశేషము (వై. ని.).

**మాతులి** సం. వి. ఈ. స్త్రీ. మేనమామ భార్య.

**మాతులింగము** సం. వి. అ. పుం. మాదిఫలపుచెట్టు.

**మాతులుంగము** సం. వి. అ. పుం. మాదిఫలపుచెట్టు.

**మాతులుంగి** సం. వి. ఈ. స్త్రీ. అత్యమ్ల, ఒకజాతి దబ్బ (వృ. ని.). (వై. ని.).

**మాతులుఁడు** సం. వి. అ. పుం. మేనమామ.

**మాతుస్స్వసృ** సం. వి. ఋ. స్త్రీ. తల్లితోఁబుట్టినది. 1 పినతల్లి. 2. పెద్దతల్లి.

**మాతృక** సం. వి. అ. స్త్రీ. 1 జనని, తల్లి. 2. అమ్మమ్మ. 3. దాది. 4. మూలము, మొదలు; నిదానము, ఆదికారణము. 5. దేవమాత. 6 మంత్రశక్తిగల దని యెంచఁబడిన బీజాక్షరములతో వ్రాయఁబడిన చిత్రవిశేషము. 7. వర్ణమాల. 8. పురంధ్రి, పతి పుత్త్రులుగల స్త్రీ (వై. ని.).

**మాతృకేశటుఁడు** సం. వి. అ. పుం. మేనమామ (త్రి. ని.).

**మాతృగంధిని** సం. వి. ఈ. స్త్రీ. పెంపుడు తల్లి,

పెంచినతల్లి

**మాతృగణము** సం. వి. అ. పుం. దేవతామాతల సమూహము

**మాతృనందనుఁడు** సం. వి. అ. పుం. కార్తికేయుఁడు, కుమారస్వామి

**మాతృభోగీణము** సం. విణ. (అ. ఆ. అ.) తల్లి చేత ననుభవింపఁ దగినది. తల్లికి భుక్తపడఁదగినది

**మాతృమాత** సం. వి. ఆ. స్త్రీ. రేవతి

**మాతృముఖుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) అవివేకి, తెలివిలేనివాఁడు, చేల, వెఱ్ఱివాఁడు.

**మాతృవత్సలుఁడు** సం. వి. అ. పుం. కార్తికేయుఁడు కుమారస్వామి (త్రి. ని.).

**మాతృశిష్టుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) అవివేకి, అజ్ఞుఁడు

**మాతృష్వస** సం. వి. ఋ. స్త్రీ. తల్లితోఁ బుట్టినది 1. పినతల్లి. 2. పెదతల్లి.

**మాతృష్వసేయి** సం. వి. ఈ. స్త్రీ. తల్లితోడఁ బుట్టినదాని కూఁతురు.

**మాతృష్వసేయుఁడు** సం. వి. అ. పుం. తల్లితోడఁ బుట్టినదాని కొడుకు.

**మాతృష్వస్రీయ** సం. వి. ఆ. స్త్రీ. తల్లితోడఁ బుట్టినదాని కూఁతురు.

**మాతృష్వస్రీయుఁడు** సం. వి. అ. పుం. తల్లి తల్లి తోడఁ బుట్టినదాని కొడుకు

**మాత్ర — మాత్రసంచి** వి. అసిమి. గోనెవలెఁ గోఁగాఁ గుట్టినసంచి, బాటసారుల సామానుసంచి.

గీ. బ్రహ్మచారి భుజంబుమాత్రకు నడింపుఁ, బ్రాలు వాకిలి మేలుచీరలు గొనియెదు, సంభ్రమం బును... ఆము 6. 71.

**మాత్ర** సం. వి. ఆ. స్త్రీ. 1. పరిమాణార్థకము. (క.) కాలపరిమాణము.

చం. ... నేఁటిమాత్ర నిలువుఁ డెల్లి పైకొని యరాతుల గెల్తుము లావు వచ్చినన్ ...

భార. శల్య. 2. 32.

(నేఁటి మాత్ర — ఏతద్దివస పరిమాణకాలము.)

ఉ. ముందటియట్లు యింకఁ బదుమూఁడు దినంబుల మాత్రకున్ భవ, న్మందిరవాస మియ్యకొని నం గడతేఱు మదీయవాంఛ ...

భార. విరా. 3. 62.

(ఖ) దేశ పరిమాణము.

చ. మును పొడ నైనయమ్ముద్రిత ముద్దుగ వల్లభు నంత మాత్రయై, తవరె. దశా 8 99.

2 అల్పార్థమును బోధించును.

(ఉదా:— శాకమాత్ర.)

శ్లో మాత్రాశీ నైవ రోగభాక్.

గీ ఏను గంధర్వకిన్నరదానవాది, దివ్య భూతఁ బులకును భీతిల్ల ననివఁ, బాండుపుత్త్రుల మాత్రకు భయము నాకు, నెక్కడిది బ్రేల్మిడిన వారి యుక్కుమడఁతు . .

భార ఉద్యో అ 216.

(పాండుపుత్త్రులమాత్రకు — అల్పులగు పాండు పుత్త్రులకు)

మత్తకోకిల. ... వేడ్కతోఁ జని సోమకున్, వేఁడి నన్ ధన మోపఁ డేనియు దీనిమాత్రకు నాలు గేన్, పాఁడి కుఱ్ఱుల నీఁడెవనికి ...

భార. అది. 5. 218.

(దీనిమాత్రకు — దీనిమట్టుకు)

3 అవధారణమును బోధించును, ఏవకారార్థము.

చం. ...వసుంధరా, తలమునఁ బ్రేల్లె సారథియుఁ దత్క్షణమాత్రన ముక్తజీవుఁ డై.

భార. అది. 5. 177

గీ ఎత్తగా భిత యెవ్వార లెట్టు లేమి, యుడివఁ గైకొని నాలుగే నెడలమాత్రఁ, గన్న దానఁ దృప్తుండ నై యున్న మేలు ...

భార. శాం. 1. 58.

గీ. ఇతఁడు రా జగు రా జనునింతమాత్ర, గాదు మూర్ధాభిషిక్త వర్గంబుఁ దవదు, చరణ యుగ్మంబు గొలిపింపఁ జాలు ...

భార. విరా. 1. 186.

4. క్షణము.

చం. ... మదిర సుదేష్ణపాలి కొకమాత్రన పుచ్చెద

నొల్లచేత ... భార విరా 2. 121.
శా ... సంపద లోగిం బుట్టుం జెడు స్వాత్రలోన్ ... దశకు 2. 54
5. పరివారము (హస్త్యశ్వాది)
6 కర్ణభూష 7. విత్తము, ధనము. 8 అక్షరావయవము 9. హ్రస్వోచ్చారణకాలము
10. ఇంద్రియవృత్తి, 11. తత్తత్కాలమున సేవింపఁదగిన యౌషధపు గులిక.
శ్లో. అల్పా చ మాత్రా బహులో గుణః.

మాత్రము సం. వి. అ. న. — మాత్ర
1. కార్త్స్న్యము 2. అవధారణము
చం .. కొమ్మమాత్రమా, యలరెడు ముద్దుగుమ్మ నడయాడెడు బంగరు బొమ్మగాక ..
దశా 2 205
(కొమ్మమాత్రమా — సామాన్యస్త్రీయే?)
3. అవ్యర్థకము, పని.
చం. ... ఇతర భోగ్యవస్తువులు సూడ సహింపదు మాటమాత్ర మాఁడను మది పుట్టదు ...
దశా. 2. 185.
ప్ర. ప్రమాణ సామాన్యమును దెలుపు ప్రత్యయము.
ఉదా:— ఊరు మాత్రము.
శా. .. మాద్రి పిన్నకొడు కేతనాత్రుఁడే చూడఁగన్ .. భార. విరా. 2. 209.
(ఏతనాత్రుఁడే? — సామాన్యుఁడా?)

మాత్రసంచి — మాత్ర వి. అసిమి.
గీ. మాత్రసంచి తలాడగా మార్గవేది, ... పరున్న వేళ .. ఆము 2. 74
సీ. సరకు లుంచిన మాత్రసంచిలో నంటఁ గట్టిన యట్టినేతి లడ్డిగ దవర్ప .
శుక. 3. 453

మాత్రాచ్ఛందస్సు(ము) సం. వి. స్ న. ఆర్యాది వృత్తము, మాత్రల సంఖ్యచే నేర్పఱుపఁబడిన వృత్తము.

మాత్రాచ్యుతకము సం. వి. అ. న. చిత్రకవిత్వ విశేషము.
(శ్లోకమున నొకమాత్ర తీసివేయుటచేత భిన్నార్థము కలుగును)

మాత్సర్యము సం వి. అ న 1 అసూయ, ఓర్వలేనితనము 2 అనిష్టము, కోపము.

మాత్స్యికుఁడు సం. విశే. (అ. ఈ. అ.) చేపలవాఁడు

మాథము సం వి అ పుం. 1 మంథనము, తఱచుట, చిలుకుట. 2. చంపుట, హింసించుట, నశింపఁజేయుట. 3 మార్గము, బాట (త్రి. ని.). 4 రోగము (వై. ని).

మాథికము సం వి. అ. పుం. నింబము, వేము (వృ వి)

మాద వి. (త. మాందం, క మాద) ఒకజాతి రోగము, వ్రణములు కలిగించు రోగ విశేషము.
ద్వి. నొవ్వి యాపఁ గప్పెనో మాదతెవులో .
బస పు 3. 789 పం.
ఆ. మాద గుంటపుండు మానక యుండెడి, పుండు లెన్ని యైనఁ బోలిసిపోవు, సందియంబు లేదు చల్ల నై యుండు గాఁ,నింతయైన కరక రెవయ దెపుడు. (చికి., చిని)
ద్వి. మ్రందకన్నును బెక్కు మాదలకన్ను ...
పండితా. మహిమ. 273 పా.

మాదకము సం. విశే. (అ దికా. అ) మత్తు గలిగించినది, పిచ్చి యెత్తించునది.
వి. అ. పుం. నీరుకోడి.

మాదనము సం. విశే. (అ. ఈ. అ.) మత్తు గలిగించునది
వి అ. పుం. దుత్తూరవృక్షము, ఉమ్మెత్తచెట్టు.
న 1. మత్తత, మత్తు. 2. లవంగము.

మాదము సం. వి. అ పుం 1. మత్తత, మత్తెక్కుట. 2. సంతోషము, ఆనందము. 3. గర్వము.

మాదళము — మాదావళము (క. మాదళము.)
1. కపిలవర్ణము.
సీ. ఎలమాదళపుమేలి జిలుగుపావడ చూచి వలదని చలువపావడ ధరించి ... ఉ. రా 4. 176.
2. కపిలవర్ణము గలవస్త్రము; వస్త్రవిశేషము

వ. ... చందురు కావులు గంధకావులు మానికం బులు తో, పులు మేఘవర్ణంబులు పచ్చపట్టులు చీనీలు .. ప్రబంధ 505

గీ మావళంబులు దళ్లు బొమ్మించు లడుత, చాలు వేమఁగడుగు లన మీలు విట్లు, చిత్ర పద్రువిశే షము లిత్స్వరూప .. ఆం భా 2 154.

**మాధవళము – మాదావళము** చి ని,, శ ర. (ౖబౌ.)

**మాదావళి** వి – మాదావళము

ద్వి మిన్న దేరెడుదొడ్డమెడనూలు మిగుల, వన్ని యగలమాదవళిపచ్చడంబు ...

ద్వి. పరమ 6. 475 సా

**మాదావళము** – మావళము, మాదవళము, మాదవళి, మాదావళి

వి. 1 కపిలవర్ణము.

లయవిభాతి జలక మపుడాకె యొకచెలువ నునుఁ గావి జిగివలువ వెసఁ గట్టుకొని జిలుఁగుదివ మాదా, వళపుఁదడి యొత్తు కచములఁ బెనఁచి చుట్టుకొని ... కళా. 8 141.

2. కపిలవర్ణము గలచీర.

సీ. మంజిడి మొకనూలు మాదావళంబులు, ములు కపూవన్నెలు ముత్తెసరులు ...

ధనా. 3. 58

సీ. మీఁగాళ్ల మీఁద గ్రమ్మినపింజ మాదావళము సేయు నఖలాక్ష దమిఁ గదల్చి ..

రా. వి. 2. 104

**మాదావళి – మాదావళము** వి 1 కపిలవర్ణము.

ఉ. పూవులవిల్లు నమ్ములును బొల్పగు బంగరు వ్రాఁత నిండుమా,దావళిదట్టి గట్టి యొఁడాఁకినకెంజిగురాకుబాకు శో,భావృతిగా నమర్చి వలివంబులఁ బైవలెవాటు వైచి ల,క్ష్మీవనితా కుమారకుఁడు మేనిమెఱుంగు జగంబు నిండ గన్. చిత్రభా. 2 61.

2 కపిలవర్ణముగల చీర

రగడ. దెలిపట్టులు మంజిడులును దోఁపులు వెల్లులుఁ జెంగావులు నకలాతులు, వలిపంబులు దుప్పట్లును మాదావళులును జీబులు జిలిబిలి జాతులు. కవిక. 3. 195.

**మాదిఁగ – మాదిఁగి** వి (సం. మాతంగః, క మాదిఁగ.) చండాలుఁడు

ఆ. మాదిగచెయివుల మనసులోఁ బెట్టుక, మాదిఁగ లను డెగడు మాదిఁ గెవుడు, మంచి గుణము లేక మఱి ద్విజుఁ డెట్టగు ..

వేమ 3 164.

సీ గోసంగి మాఁదిగ గూబరి యన, మాతంగుఁ డగు . ఆం. భా. 2 289

**మాదిఁగి – మాదిఁగ** వి. చండాలుఁడు, అంత్యజుఁడు

ద్వి లింగసన్నిహితులయంగణంబులును, లింగులె గాక మాదింగు లున్నారె ...

పండితా. దీక్షా. 44 పొ.

**మాదిఫలము** వి. మాతులుంగము (వ్య.వి.)

తోటకము మావులు జిన్నలు మాదిఫలంబుల్, క్రోవులుఁ బొన్నలు గోఁగులు నిమ్మల్, మోవులు రోవులు మోదుగు లొద్దుల్, రావులు నిప్పలు రాణ దలిర్పన్. యయా. 2 48.

రగడ మావి మును చేరితిమి మగువ మాదిఫలంబు, కావలెనెనేని గొను కాన్కమాదిఫలంబు.

ఉ. రా 6. 61

సీ. .. మాదిఫలం బన మాతులుంగ, మొప్పను ఆం. భా 2 53

(శ. ర మాదిఫలము అనుపాతమును గ్రహించి, మి వి అని చెప్పి ఉ. రా. 6. 61 ఉదాహరించెను. కాని ఆం భా. యయా లయం దిట్టి మిశ్రపదములు ప్రయుక్తములు కాకుండుటచే మాదిఫలము అనురూపమే గ్రహించుటయైనది.)

**మాదిరి – మాౖద్రి** విశే. (త. క. మాదిరి) సదృశము, సాటి.

కం. సుడిపడి కలఁగుచు స్రుక్కెడు, మడుఁగులు చెలినాభి పోల్ప మాదిరి యగునే ....

రసిక. 2. 97.

కం పేదటికముడుపునకలా, గాదిలిసైదోడుతోడఁ గనుఁగొన నెపుడున్, మాదిరి యగుని నెమ్మోగ, మీదెన సొం పెడలి యుంట కెటు లోర్వ నగున్. అచ్చ రా యు 395.

గీ పరిమళము లేక యుంట బంగరుసలాక, కలికి నెమ్మోనితో నుద్ది గాకపోయెఁ, జంపకంబు శిరీష ప్రసవమృదుత్వ, గౌరవము లేమి మాదిరి గాక పోయె కవిజ 1 69

వి 1. పద్ధతి

సీ పగటిగాసంబు తప్పక యుండ దినరోజు మాదిరి నొంటరిజోడుమూఁక

గీ. మొదలు గాఁగలజారులు మొనకు నిల్చి ...
రా. వి. 5 13

2. ఔపమ్యము, సాదృశ్యము, పోలిక

సీ కయిదడి కైవశి కైవడి కాడువు మాదిరి పోలిక మాడ్కి పురుడు. .. పోలిక యనఁగఁ బోల్పొందు నుపమపేరు ...
ఆం. భా 2. 302.

మాదిరిసేయు – పోల్చు, ఉపమించు

ఉ. అదరిహాసచంద్రికల యందము నాప్తుల మీఁదఁ జిల్కఁ న, త్యాదరం శీతవీక్షణ సుధారసధార యుఁ జూడఁజూడ నా, హ్లాదముఁ గొల్పఁ గాఁ గలకలాదు మహిమంబుఁ దలంచి చూచినన్, మాదిరిసేయ వచ్చు జననాథు మొగంబును జంద్రబింబమున్. విజ వి. 1 68

మాదృక్కు(క్కుఁ)డు నం విశే. (శ) నావంటి వాఁడు, నన్నుఁ బోలినవాఁడు

మాదృక్షుఁడు నం విశే. (అ. ఆ అ) మాదృశుఁడు.

మాద్రి – మాదిరి విశే. (క. మాద్రి) సమానము.

సీ ద్విజరాజ ఫణిరాజ దిగిభరాజులతోడ విశద కీర్తులమాద్రి వేంకటాద్రి ..
కృ శతకం. పీఠి. 1. 17

కం. ఘటికాద్రి కరుగుఁడచ్చట, ఘటికామాత్రమున మీఁకు గాంక్షిత మెల్లన్, ఘటియిల్లు నెంచఁద గదా, ఘటికాద్రిః మాద్రి యద్రి గలదే జగతిన్ ఘటికా మా. 155.

వి సాదృశ్యము, పోలిక

ఉ మాద్రికి పీఠు నంచ వెలిమావుపయిన్ మురువైనజోడుచే, భద్రమయాత్మచే ప్రసనపాన ఖేలనుచే సరస్వతీ, ముద్రిత వక్త్రశోభ నలు మోములవేలుపుచే విరూరిచే, దాద్రిచమూవిభు డుగను నాయువు శ్రీయు నిరంతరాయముల్
పాండు 1 3.

మాద్రి నం వి ఈ స్త్రీ పాండురాజు రెండవ భార్య

మాద్రీనందనుఁడు నం వి అ. పుం 1 నకులుఁడు. సహదేవుఁడు

మాద్రీపతి నం వి ఇ పుం పాండురాజు, మాద్రి మగడు

మాద్రేయుఁడు నం వి అ పుం 1 నకులుఁడు. సహదేవుఁడు.

మాధవకము నం వి అ. పుం ఇప్పపూవుకల్లు. మధూకమధువు (శ. ర)

మాధవము నం విశే (అ. ఈ అ) 1 వసంత ఋతు సంబంధమైనది 2. మధుసంతతి వారికి సంబంధించినది. వి అ పుం. 1 వైశాఖమాసము. 2. నల్లపెసర (వృ. వి). పుం. న. మధ్యాసము. ఒక దినుసు మద్యము (వై ని)

మాధవి నం న. ఈ స్త్రీ 1 పాకముపట్టిన శర్కర. 2 తేనెతోఁ జేసిన యొకజాతి మద్యము, తేనెతోఁ జేసిన యొకజాతి త్రాగుడు పదార్థము 3. బండిగురివెంద (వృ వి.) 4. తులసి (వృ వి.). 5 కుంకెనకత్తె 6. లక్ష్మి. 7 యదుజ్యేష్ఠ పుత్రుం డగు మధువుయొక్క గోత్రాపత్య. స్త్రీ కుంతి

సీ. దేవతామూర్తి యిద్దేవి మాధవి యేల శా నెఱుంగక యనృతంబు పలుకు ...
భార ఆది. 7. 254.

మాధవుఁడు నం వి. అ పుం 1. కృష్ణుఁడు.

2 వసంతుఁడు, మన్మథమిత్త్రుఁడు 3. ప్రఖ్యాతిగల యొకానొక గ్రంథకర్త (మాధవాచార్యుఁడని యుఁ పేరు గలదు ఇతఁడు మాయనునిపుత్త్రుఁడు, సాయన భోగనాథులకు సోదరుఁడు).

**మాధవోచితము** నం వి అ పుం గంధద్రవ్యవిశేషము కక్కోలము.

**మాధుకరము** నం విశ. (అ ఈ అ.) మధుకర సంబంధమైనది, తేనెటీఁగనుబోలినది

**మాధురము** నం. వి. అ. పుం 1 మాధుర్య లవణ తిక్తరసముల మిశ్రణమువలనఁ గలిగిన రసవిశేషము. 2 పదునేడుఅఁగుళ్లు ప్రమాణము గల యూపస్తంభము యొక్క మొదటినుండి పదునాఅవ యఁగుళ్ళి భాగము (వై. ని)
విశ. (అ ఆ అ.) మాధుర్యరసము గలది

**మాధురి** నం వి ఈ స్త్రీ 1 తీఁపు, మాధుర్యము. 2 మద్యము, కల్లు.

**మాధుర్యము** నం. వి. అ న 1. తీఁపు, మాధుర్యము. 2 ఆకర్షకమైనయందము. శ్రేష్ఠమైనసౌందర్యము. 3 (అలం.)కావ్యగుణములలో నొకటి, మాధుర్యగుణము. 4. దయ. 5 సుశీలము, మంచితనము.

**మాధ్యందినము** నం. విశ (అ ఈ. అ) 1. మధ్యాహ్నసంబంధమైనది, దినమధ్యభాగమునందున్నది 2 నడిమిది, నడుమ నున్నది
వి. అ పుం. 1. వాజసనేయులలో నొకశాఖ, 2 శుక్లయజుర్వేదము యొక్క ఒకశాఖ

**మాధ్యస్థ్యము** నం వి. అ న 1. నిష్పక్షపాతము, పక్షపాతములేమి 2. తాటస్థ్యము, సంబంధము లేకపోవుట 3 మధ్యవర్తిత్వము, నడుమ నడ్డుపడుట

**మాధ్యాహ్నికము** నం విశ (అ ఈ. అ ) మధ్యాహ్నమందైనది

**మాధ్వి** నం వి. ఈ. స్త్రీ మద్యవిశేషము (తేనెతోఁ జేయఁబడినది)
వి వేడి కలిగించు మాఱు సూర్యకిరణములు (వై. ని.)

**మాధ్వీకఫలము** నం వి అ న 1 ఒకజాతి కొబ్బెర, నారికేళవిశేషము (వృ వి.). 2 ఇప్ప పూవుఁబల్లు (శ. ర )

**మాధ్వుఁడు** నం వి. అ పుం. మధ్వాచార్యుని మతము ననుసరించువాఁడు, మధ్వమతస్థుఁడు, ద్వైతి.

**మాన — మానిక** వి (సం మానమ్) రెండు తవ్వల పరిమాణము, ఆ పరిమాణము గల పాత్రము

వ .. నెఱియమువసమును బెట్టినవడ్లు 50 నిత్యపడి ఓయంగల త్రిభువనాంకుశమునసే మాన .
1 ద శా 4. 1009.

వ .. మానుణ్డునెయును నిత్యపడిగాన చంద్రక్కఁతము నడపంగలవడ్లు నేతిమాన ..
1. ద. శా 4. 1050.

చం. కరమునఁ బట్టి భిక్షగొను కప్పెర గొప్పది గాదు మానెఁడో, ఒరుదది చెన్న 5 289.

సీ కుడపాభిధానమై యడరు నవని, మాన నామంత నా మానిక యనఁగను .
ఆం. భా. 2 270.

**మానగ్రంథి** నం వి. ఇ స్త్రీ అపరాధము.

**మానద** నం వి. ఆ. స్త్రీ చంద్రుని రెండవకళ.

**మానధానిక** నం. వి ఆ స్త్రీ కర్కటి, దోస (వృ వి.).

**మానన** నం వి. ఆ స్త్రీ. 1. మన్నన, గౌరవము.

కం మానార్హు లగుట వారికి, మానన లేకున్న నలుఁగు మనుజాధీశా
భార. అను. 2. 140.

2 చంపుట.

**మాననీయము** నం విశ. (అ ఆ. అ ) మన్నింపదగినది, గౌరవింపఁదగినది.

**మాననీయుఁడు** నం విశ (అ ఆ అ ) గౌరవమున కర్హుఁడు, మన్నింపఁ దగినవాఁడు

**మానమంద(ది)రుఁడు** నం. వి. అ. పుం రావణాసురుడు (వై. ని ).

**మానము** నం. వి. అ. పుం. 1. సమ్మానము, గౌరవము 2. ఆత్మాభిమానము 3 పౌరుషము, రోషము. 4 (అలం.) స్త్రీలకు ననూయచేఁ బురుషుని యెడ గలిగిన కోపము.

న. 1. కొలుచుట. 2 త్రాసు, మూల, తూము మొదలయినవి 3. లెక్కించుట, గణించుట. 4 కొలకఱ్ఱ, కొలపాత్రము 5 ప్రమాణము.

(ఈ క్రింది యర్థములకు తెలుగుననే వాడుక గన్పడుచున్నది)

6 పద్ధతి, ప్రకారము.

ఉ. భానుఁడు కాఁడు చూడు నరపాలక మండల కొండదీప్తులీ, మానము దోఁచెఁ గాని యను మానము లేదు వినుండు ..

మొ రా. యు 2 90.

7 సమయము

కం అని యిట్లు పెక్కువిధముల, మనమునఁ దల పోసి వేగుమానం బయ్యెన్, జనకజకావలి రాత్రి స, వనితలు మేల్కొన్నకతన వసుధాసుతతోన్.

గీ. వెలసి భాషింప నిప్పుడు వేళ గాదు ..

భా. రా సుం. 163.

8 సమానము ?

ద్వి. శుక్రశాపంబున స్రుక్కి యయాతి, వక్రుఁడై మా రల్గ వార్ధక్యువ్వఁ డయ్యెఁ, గాన నైరణ యందుఁ గలరె యయాతి, మానమై రాజులు మనుజేంద్రతనయ.

రం. రా ఉ. 133 పొ. 9 పం.

విశ శక్యము ?

ఉ ఒక్క శరాసనంబు దగ నున్నది యెక్కుడు లావు చూడ్కికిన్, వెక్కస మైనరూపమును వ్రేఁకదనంబును గల్గి చేవమై, నెక్కడ దివ్య నెవ్వరికి నేగతి మానము గాక లీల నీ, వక్కరి నొగ్రకార్ముకము నక్కడఁ జూఁడగరమ్ము రాఘవా.

భార. రా. బాల. 300.

మ. యదువంశైకవివర్ధనుం డలఘుసత్త్వాశక్యుఁడీ కృష్ణుఁ డ, ఖ్యుదయోదగ్రుఁ డొనర్చినట్టి పను లీభూతప్రపంచంబులో, మది నెవ్వారికిఁ జేయఁ జూడఁ దలపన్ మానంబులే ...

హరి. ఉ. 8. 287.

**మానముగొను** మి. స క్రి. (మానము + కొను) అవమానపఱుచు

కం నిను మానముగొనుహీనుని, ననుమానము వానిని సూనుఁ డనుమోహముచేతను మానవ తును మాడుదు ..

సారంగ 2 2. 6.

**మానయిత** సం విశ (ఋ. త్రి. ఋ, గౌరవించు వాఁడు.

**మానరంధ్ర** సం. వి ఆ స్త్రీ. ఒకరకము నీటి కుండగడియారము

[ఒక కుండకు నడుగునఁ జిన్నబొక్క పొడిచి నీటిలో నుంచిన నది క్రమక్రమముగా నిండు చుండును. దానినిబట్టి కాలపరిమాణము తెలిసి కొన బడును (త్రి. ని)

**మానవంతము** సం విశ (త్ తి త్.) మానము గలయపత్యము, పౌరుషము గలసంతానము

**మానవంతుఁడు** సం విశ. (త్. తి త్) మానము గలవాఁడు, ఎక్కువ గర్వించినవాఁడు.

**మానవతి** సం వి ఈ స్త్రీ. మానిని, అసూయచేఁ గలిగిన కోపము గలయాఁడుది

**మానవదేవుఁడు** సం. వి. అ. పుం 1 మనుష్యాధి పతి, చక్రవర్తి.

**మానవము** సం. విశ (అ. ఈ. అ.) 1, మనువు సంబంధమైనది. 2 మనుష్యసంబంధమైనది.

**మానవి** సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుది, స్త్రీ. 2 పచ్చపువ్వులయడవి మొల్ల (వ్యా.వి.) (వై.ని.).

**మానవుఁడు** సం. వి. అ. పుం 1. మనుష్యుఁడు, మానిసి 2. శిశువు, పిల్లవాఁడు.

**మానసజన్మము** సం. వి. న్. పుం. హంసము, అంచ

**మానసజన్ముఁడు** సం. వి. న్. పుం. మన్మథుఁడు. మనోభవుఁడు.

**మానసము** సం. విశ. (అ. ఈ. అ.) 1 మనస్సునకు సంబంధించినది, మానసికము. 2. లోపల నున్నది, గూఢముగా నున్నది, భావగర్భితమైనది. 3. మానససరస్సులో నివసించునది.

వి. అ. పుం. విష్ణుని యాకారము.

న. 1. మది, మనస్సు. 2. కైలాసశిఖరమున నున్న సరస్సు, మానససరస్సు

(ఇందు హంసలు నివసించును)

3 ఒకదినుసు లవణము, ఉప్పు.

**మానసాలయము** సం. వి. అ. పుం. హంసము, అంచ

**మానసించు** సం. స. క్రి. 1 తలంచు, ధ్యానించు

అ. తనము పండె ననుచుఁ దత్పదాంభోజముల్, మానసించుకొనుచు మందకడకు.

భాగ. 10 పూ. 848.

2. కోరు, ఇష్టపడు

(హేమ తద్వర్ణనము).

సీ. ముద్దుగుమ్మల మొగంబులఁ జూడనే కాని మానసింపరు చందమామఁ జూడ ...

ఉ. రా. 5. 281.

**మానసికము** సం. విశే. (అ. ఈ. అ.) మనస్సంబంధమైనది

**మానసూత్రము** సం. వి. అ. న. 1 కొలత త్రాడు, కొలత్రాడు. 2. బంగారపు మొలగొలుసు, బంగరు మొలత్రాడు

**మానసౌకము** సం. వి. న్. పుం. హంసము అంచ.

**మాని** సం. వి. న్. పుం. సింహము (ఆ. ని).

**మానించు** స. క్రి. (√మాను) 1 ఆఁపు, అడ్డుకొను

మ. శిఖుండై యభిమన్యుతేరిపయికిన్ వేగంబ వా చాలఘా, వ: నూనుం డరుగం దదీయ బల మొప్పం జాల కొక్కుమ్మడిన్, మరలం జాతె నతండు వాయుసుతుఁడున్ మానింప మానింప న, ప్లు ర థానీకముతోడ భీముఁ బొదివెన్ భూమీశ్వరుం డుద్ధతిన్.

భార. భీష్మ. 2. 384.

కం. దీన నమఁ జిక్కువడియెడు, వానిం గాఁదలఁచె నిపుడు వానవునట్లు, జ్ఞాని యొరుఁ డెవ్వఁ డింతయు మానింపఁగ నేరనేని మఱివగనిమ్మా.

హరి. పూ. 7 173.

మ. మనుజుం డెంతటివాఁడు దైవకృతముల్ మానింపఁగాలేఁడు దశకు 6 106

2 పోఁజేయు. నశింపఁజేయు

కం. ఐనను నిప్పటిదుఃఖము, మానింపఁగ మనకు నొండుమం దెయ్యది.

భార. కర్ణ. 3 140.

కం. ధ్యానం బింద్రియవృత్తుల, మానించుట హింస గురుసమ్మానవిధి ని, త్యానుష్ఠానము దపమును, వీనఁ బరమ సేవ్య మెద్ది వినఁగా వలతున్

భార. అను. 4 277.

**మానించు** సం. స. క్రి. రక్షించు, కాపాడు

మ. తుది నే నిన్ను వివాహ మయ్యెద మదాంధుం గ్రూరకర్మోన్ముఖుం, బ్రిదులం బోవఁగ నీక చంపుటయ తా వీరంబు ధర్మంబు ని, ట్టిద కార్యస్థితి నిత్తఱంగునన నీడెందంబునుం గన్న న, మ్మదపాత్రం బగు నంబుజాక్షి యనియే మానంబు మానించితిన్. దశకు 3. 75.

**మానిక** — మాన వి. (సం. మానకమ్. క. మానికై, మానిక. సం. వి. ఆ. స్త్రీ. అని శ. ర.). నాలుగు సోలల కొలఁది, ఆ కొలఁది కలపాత్ర.

సీ ... కుడపాభిధానమై యడరు నవని, మాన నా ముంత నా మానిక యనఁగను ...

ఆం. భా. 2. 270.

చం ... కలవుకాల మెఱుంగక పూసబొట్టులం, బలి కలిసీళ్లఁ జందనపు మానికఁగొల్చిన మాళ్లు గల్గి ...

శుక. 2. 406.

**మానిక** సం. వి. ఆ. స్త్రీ 1 ఒకవిధమైన సారాయి సంబంధమైన ద్రవము, మద్య విశేషము

2, తూనికలోని భేదము. 3 పరిమాణ విశేషము, సేరు

**మానికదారి** వి (మానికము + దారి సం. మాణిక్యధారిణి) భోగముది,

గీ. ధనము లార్జించు మానికదారులిండ్లఁ, జేరు నరులకు నిడుములు చెప్పఁ దరమె (శ. ర.)

**మానికము** వి. (సం. మాణిక్యమ్ క. మాణిక.)

1. కెంపు, పద్మరాగము

సీ. బహుదివ్య ఫలపరిపాక సౌభాగ్యంబు చెరవు కమ్మోవి మానికముతోడ. వసు. 2

2 రత్నము, మణి.

గీ మానికము రతన మనంగ మణి చెలంగు ఆం. భా. 2 275

గీ కొండవీ డేలువేలుపుఁ గూడి పాం, కలి నడు చక్కి బలు మానికములదీవిఁ, బుడుకు ప్రాఁ కులు మా రేళ్లు వొదలి పొదలు, కడిమి పూఁ దోఁటలో నాడుగరితఁ దలఁతు. అచ్చ. రా. బాల 2

చం. మకర ముఖాంతరస్థ మగుమానికమున్ పెక లింప వచ్చు ... భర్తృ 1 4

విణ. శ్రేష్ఠము

గీ మానికంబవు గద కూచిమంచికొలము,నందు.. నీలా 1. 15.

వేలుపు మానికము — చింతామణి

కం. దానసమగ్రత వేలుపు, మానికముఁ బోలు ననుచు మహనీయమణిం, గానుక యిచ్చి .. విక్ర 2 257

జ. మానికడారి.

మానితము సం. విణ. (అ. ఆ .అ.) గౌరవింపఁ బడినది, మన్నింపఁబడినది.

మానిని సం. ఈ స్త్రీ. 1. ఆత్మాభిమానము గల స్త్రీ, స్వగౌరవము గలస్త్రీ, దృఢసంకల్పము గలస్త్రీ. 2. ఈర్ష్యా జనితకోపము గలస్త్రీ, భర్త పైఁ గోపించిన స్త్రీ. 3. పరిమళము గలచెట్టు

మానిపుక్కిటిగాఁడు వి పక్షి విశేషము.

సీ మానిపుక్కిటిగాఁడు జీనువ యెల్లికి డాబ తీతువు వెన్నడాయి ... పాండ్య. 6. 77.

మానిసి వి. (సం. మానుషః, క. మానిసి)

1. మనుష్యుఁడు.

కం. నానాదేశంబులబలు, మానుసులం గూర్చి నీవు మగధేశ్వర యే, పూనిక నిట వచ్చితి చెపు, మా నిక్కము నిర్వహింతు మప్పనియేమున్. హరి. ఉ. 1 28.

కం ఏనుఁగులాగు పంకికి,మానిసిచందంబు నీరుమానిసికి నగుఁ, గాని గుణంబులు గలగవు ఉ హరి 3 16, ఆం భా. 2. 106

(ఈక్రింది ప్రయోగమందు "మాన్సి" అను రూపము కానవచ్చుచున్నది)

సీ ఇనుమంత మాన్సివంగనము బాలల కిన్నెరల మ్రోఁతలకు మారు పలుఁకు గవులు ... ప్రబంధ 155.

2 సం మానుషీ, మనుష్య స్త్రీ, స్త్రీ

కం. మనయింట నిచ్చ టచ్చో, టన కెచ్చటనైన నీభృహన్నల మెలఁగం, జనియెడు మానిసి, భార. విరా 1 254

కం సగవాఁడటె దేవేంద్రుఁడు, మగువా నీ పతిని కొలువు మానిసి వంట చిన్, దగవుచెం పిలువఁ బనుచుట, మగతనమే యిట్టి లంజమాటలు గలవే. ఉ హరి 1 70.

ఉ. ఈతఁడు నాకు ప్రాణవిభుఁ డీతనికిం బ్రియురాల నన్ను ము, న్నీతఁడు చూచె నీతనికి నిల్లడమానిసి నేను నాకుఁ గా, నీతఁడు వచ్చెఁ దండ్రి నను నీతని కిచ్చె నటంచు నొక్కమై, నాతరుణీమణుల్ జగడ మాడిరి మారవికార చిత్తలై. వి. పు. 5. 151.

3. సేవకుఁడు

కం ము న్నాపని మానుసులం, గ్రన్నన పతి సంఘటింపఁగాఁ బనిచిన నం, పన్నంబుగ వొడగూర్చిన ... భార. ద్రో. 5. 143.

ఉ. ... టసావిభుఁడుం బరకాలుఁ బిల్వఁ డా, మానిసిఁ బంచె . పాండు. 5. 62

4. యోధుఁడు.

కం. నీయందు వారియందుం, జేయం గలమానుసుల విశేషంబుల జీ, త్తాయత్తంబుగఁ జెప్పుము... భార. ఉద్యో 4. 208.

గీ. మానుసులువోలె నున్నార లేను లేని, తటి మహాగుణశాలి నాతనయుఁ గాచి, కొనఁ గడం

గర సింగాఁడమునకుఁ గాక, మఱుపులును గైరు
పులు మీకు మానమునకె
భార. ద్రో 2. 264

విశ. శూరుఁడు, పౌరుషవంతుఁడు.

కం నిను నమ్మి యెుండువలనికిఁ, జనక జయద్ర
థుఁడు నిలిచె సైన్యములో నా,తనిఁజంపెడు
దేనియవూ,సినక త్తివి గాక మానిసివె యూహిం
పన్ భార ద్రో 3 108

జ. మానిసికోఁతి, మానిసితనము, మానిసిదిండి, మానిసిదిండికాఁడు, మానిసిబూతము, మానిసిరౌతు, మానిసితేఁడు, మానిసిసింగము.

**మానిసికో(క్రో)ఁతి** వి. (మానిసి + కోఁతి, మర్కట విశేషము, మనుష్యాకారము గల కోఁతి

గీ గసగసలు వీఁకవిండ్లు పోఁగచిలుకలును, సింగములు పులిపిల్లలు జింక లేదు, గములు మానిసి కోఁతులు కాఱుపోఁతు, లేడికదుపులు పులిజున్ను పాఁడిపసులు. ప్రబంధ. 135.

గీ. కొచ్చివేఁపులు మానిసిక్రోఁతు లాదియైన వన్నియు ... శుక. 1. 108.

**మానిసితనము** వి (√మానిసి) 1. పౌరుషము.

వ. గాంధారరాజు లగువృషకుండును నచలుండును పమరథులు మానిసితనంబును మానుసులుం గలవారు ... భార. ఉద్యో. 4. 233.

2. మనుష్యత్వము.

గీ. అకట జాతికిఁ బాసిన యనుఁగుఁ జెలికి, నెపఁగె మఱి వేళవేళ మానిసితనంబు ..
వేం. పంచ. 4. 161.

(ఇది రెండర్థములకు నుదాహరణము).

**మానిసిదిండి** వి. (మానిసి+తిండి) రాక్షసుఁడు. నరభోజి.

చం. మద మఱి పాఱి రాన్నృపులు మానిసిదిండికిఁ గాక భీతితోన్ .. ఉ. హరి. 4. 263.

గీ. పెండ్లికొడుకవు మాకు నీవిసరుహాక్షి, గూర్మి నందన యెుకమానిఘోరశాప. వికృతి మానిసి దిండినై యకట దీని, ప్రాణముల కల్గిఁ దలఁచితి పాపబుద్ధి. మనుచ. 5. 4.

కం కొండలయందురున్ జేరుక, పండులు గాయలును నమలి బ్రతికెదు మీకున్, దండులు గూడుక మానిసి, దిండులపై నడువ నెట్టితెం పొదవె నొకో. అచ్చ రా. సుం. 153

**మానిసిదిండికాఁడు** వి (√మానిసిదిండి) రాక్షసుఁడు, నరభోజి.

గీ తివిరి జేజేలు మానిసి దిండికాండ్ర, దండులును గూడి ప్రాయేలు ద్రచ్యుతటిని, మేటికామేటిమే రుత్తి మెట్టుక్రింద, నిలిచియుండిన ప్రోడవు నీవె కావె అచ్చ. రా బాల. 152

**మానిసిబూతము** వి. (√మానిసి) మనుష్య రూపము గల పిశాచము

గీ. మందులాఁడి చెడుగు మానిసి బూతంబు, పిసిఁడి బిచ్చగాండ్ల వెన్నుగుదియ ..
చెన్న. 2. 24.

**మానిసిరౌతు** వి. (√మానిసి) కుబేరుఁడు నరవాహనుఁడు (శ. ర.).

**మానిసితేఁడు** వి. (మానిసి + తేఁడు) రాజు, నరపాలుఁడు.

గీ పెనుతపసితేఁడ నీ వడిగినతెఱఁగున, దనరు మానిసితేనిచందంబు నీకుఁ, దెలియ నెఱిఁగింతు నిఁకఁ జెఱతలఁపు మాని, వినుము.
అచ్చ రా. బాల. 29.

**మానిసిసింగము** వి. (మానిసి + సింగము) నరసింహమూర్తి.

సీ. మానిసిసింగమై పూని బత్తునివెతల్ తలఁగఁ ద్రోచినవాఁ డితండె కాఁడె ..
అచ్చ. రా. యు. 465.

**మాను**[1] స. క్రి (త మాన్. క. మాణు.)

1. వదలు, విడుచు.

సీ. అనవుడు వతనితో నతఁడు సున్నిగ్ధంబు లైన యాహారముల్ మానువాఁడు ...
భార. శాం. 5. 571.

చం. చలమున సింగిణీశరకసంబులఁ గట్టక మానరు.
అము. 2. 27.

మ. ... నీభావంబు చిత్తంబు వ, చ్చినచో

మానుదు గాని నిన్నిపుడు కస్తిం బెట్ట నా
కేఁటికిన్ ... కాశీ. . 72.

2 విరమించు, చాలించు

శం. నాకొడుకుపోటుమాటలు, నీ కేఁటికిఁ బొసఁగ
నాడనేరవు మౌర్ఖ్యో, ద్రేకమునఁ ఒలుకుచుం
డుట, మాకు సహింపంగరాదు మానుము
విప్రా .. భార. విరా 5. 255

సీ చూచి వల దన్న మానక సురటి విసరు
దశా 2 129

అ క్రి. 1. క్షీణించు, తగ్గు.

ఆ. అక్కుమారు లరిగి రావల మానని, గాఢ
ధృతిని మౌని కథలు వినుచు .
రాఘవ 2. 15

ఉ అంబుజమిత్రుఁ డంత నపరాంబుధి జేరఁగఁ
బోయె నాత్మ బింబం బపు డంతకంతకుఁ గ్రమ
ప్రభవన్నికటత్వతారత,మ్యంబున సంక్రమించు
తదుదంచిత విద్రుమరాగ వీచికై, త్యంబులఁ
బోలె రక్తిమము తద్దయుఁ బూనఁగ వేఁడి
మానఁగన్. కళా 8 7

2. పోవు, వశించు

శం. మితభోజియై వివిక్త, శుచి సావిత్రీజపంబు సేయు
నది యహ, స్థితియు నిశాసీనత్వము మతి
నేమఱ కట్టులైన మానునఘంబుల్ .
భార. శాం. 1 317

ఉ ... ఇప్పుడు దీనికి బ్రత్యుపాయముం, జాలఁగ
నెంచి చేయఁ దగునంశయ మంతయు మాను
నట్లుగన్ ... కళా 2 169

సీ ప్రాణుల భుజించునాకుఁ గ్రౌర్యంబు మాని,
ప్రియము గదిరెడు నీరూపురేఖ చూడ ..
జాహ్నవీ 4. 24.

3. ఆగు. నిలిచిపోవు.

కం ఏను వల దన్న జూదము, మానదె ...
భార. అర 4. 239.

మ. సనెకల్ దాఁచినఁ బెండ్లి మానునొకొ దుశ్చా
రిత్రమున్ గంటిరే ... కాశీ. 5. 311.

శా. వేనుం డీగతిఁ బాపకర్మములు గావింపంగ నాకీ
డునన్, వానల్ గల్గక మానె నారబము లెండం
బొచ్చె ...
వి. పు. 2 107., ఆము. 5. 101

4 కలుగకుండు, పుట్టకుండు.

కం. . అక్కడ రో, గారిష్ట పర్వమాయిక, మారీ
దుర్భిక్షభయము మాను నరేంద్రా
భాగ 10 ఉ. 52

5 సమాప్తమగు, ముగియు.

ఉ తనభార మంతయున్, మాని సుఖించు
నివ్వసుధ మానుఁ దృతీయయుగంబు
నంతటన్ హరి. పూ 5. 48

మానిపోవు — అణగిపోవు, దాఁగిపోవు.

ఆ పాకశాసనుండు నాకంబు విడచి యెం, దేని
మానిపోయె మానవేంద్రు, తనయు లమరవు
రము దామ కైకొనియజ్ఞ, భాగములు నిలిం
పపతుల కీక. వి. పు. 6. 162.

జ మానించు, మానుచు, మానుపు, మాన్పించు

మాను² విశే. 1 మనోహరము.

శా. .. జనుల కర్థాంశుప్రకాశాంబుతో, మానై
సాత్యవతేయ ధీవనధి జన్మశ్రీ మహాభారతా,
ఖ్యానాఖ్యామృతసూతి యొప్పు నిఖిలాఘ
ధ్వాంత విధ్వంసి యై ...
భార. ఆది. 3. 21

ద్వి మాయావి కడిమిమై మడసిన మెచ్చి పూనిన
వేడ్కతోఁ బురుహూతుఁ డిచ్చె, మానైన
యీహేమమాలికఁ దొల్లి యిది నీవు ధరియింపు
మీకపిరాజ్య, పదమున కిది నీకుఁ బరఁగు
చిహ్నంబు.
రం. రా. కిష్కిం. 216 పొ. 21 పం.

మ మము రక్షింపుము దేవి నీకరమునన్ మానై
వెలుంగుదు చ, క్రమునన్ ...
మార్క. 6. 128.

సీ నాణెమైన దన విన్నాణెమైనది యన మానైన
దనఁగ లెస్సైన దనఁగ ...

గీ. మంజులంబైన దమటకు మదనదమన ...

ఆ॰ సం మా న. 54

2. యుక్తము

ఉ. మంచి తనేకయాగముల మానుగ దక్షిణ లిచ్చి విప్రులన్ భార. ఆది. 2. 202

ద్వి మనుజేశ దనుజుల మర్దజ్ఞుఁ డితఁడు, మనదెం నుండుట మా నైనరీతి...

రం రా యు. 101 పా 2 పం

(కొన్ని యెడల విశేషార్థము లేకయే వాక్యాలంకారముగా ప్రయోగింపఁబడును)

కం అవవుడు ధృతరాష్ట్రుఁడు దన, మనమున సంతోష మంది మానుగ వీనుల్, గనినఫలమునకు నిప్పుడు, వినఁ గంటిని వాండుసుతుల విద్యాశక్తుల్. భార ఆది 62౩

కం. మానుగఁ గించిచ్ఛేషము, లైనమహీరుహము లందు నతులితకరుణా, మానమతితోడ నాసిత, భానుఁడు చమదెంచి వృతపతి దానగుటన్.

వి. పు. 2. 194.

కం. మానుగ బుతుపర్ణుఁడు ధీ, మానుజ్ఞాతుఁ డయి చొచ్చె నాప్రోలు ... భార. అర. 2 181

వి ఒప్పిదము, మనోజ్ఞత.

కం. ఏనున్ మనుమఁడు దీక్షితు, లైనారము యజ్ఞమిప్పు డఖిమంత్రిత మై, మా నొం దెడు నేమిచటను బూనిక నెఱపంగవలయుఁ బుత్రులు మీరల్. భా రా. బాల 401.

సీ. మా నటి పగ లెల్ల మాయు దీవని పండు వెన్నెల నగునట్లు వెలఁది నవ్వు ...

కు సం. ౭. 6

మాను³ – బ్రాను వి. ఔ. వృక్షము, చెట్టు.

మ. హరి శౌర్యం డగు రామభూవిభునితీవ్రాబో పవద్వ్యాహితీ, శరవేగంబున నాత్మమూల బలముల్ జాలుం దకాడంబరం, బరుగన్ గొమ్మలు వోవ లా వటి నిజామాదుల్ వజీరుల్ ఖజీం, తురు వమ్రమత్వము,గానలో మునలిమానుల్ గాని తర్కింపఁగన్ వసు 1. 44.

సా, మగవాఁడో, మానో. (కరినాత్మ్మఁ డనుట )

వి॰ నిశ్చలము, కదలనిది.

ద్వి. లగ్నమై భక్తికాయుక్త మై నిమగ్నమై లీన మై మా నౌటఁజేసి ...

పండితా. దీక్షా. 63 పా.

మానుచు(న్చు) – మానించు, మాన్పు

స క్రి (√మాను¹) 1 మానునట్లు చేయు, పోఁగొట్టు.

కం .. భవ, త్సానునిమతి యతిలోభము, మా నిచి పాండవులఁ దెమ్ము మనుజాధీశా.

భార. ఉద్యో 3, 283

చం వినుము రజస్తమంబు లన విశ్రుతమైన గుణద్వయంబు మా, తనువులు గాన విశ్వవిదితం బగు పేర్మి దనర్తు మేము ధ, ర్మనిరతులం దమూన రుచి మానుతు మర్థముఁ గామమున్ సుఖం, బును నింతంబు భూతతతిఁ బొందుట లెల్లను మావికారముల్. హరి. ఉ. 9. 132.

ఉ. అన్నలు సేయురాయిడి భయాతురులై పరువెత్తుమానులన్, గన్నులఁ జూచె నేనిఁ దనుకంపము మానిచి నానిమిత్త మా, పన్నుల వీరిఁ బ్రోవుఁడని ప్రార్థన సేయునతండు వారలన్, బిన్నతనానమండియు విభీషణుఁ డెంత పరోపకారియో. ఉ. రా. 2. 150.

మ. .. ఈవచ్చును, వమ్రదవీరావళికిన్, భుజావిభవవిన్యాసంబు గాన్పించి మా, న్పెద గర్వంబు...

భార. విరా. 4. 263.

ద్వి. ఇనకులాధిపు శోక మేత్రోవ మాంతు.

రం. రా. అర. 186 పా. 8 ప.

కాశీ. 4. 89.

2. విరమింపఁజేయు

కం. ... అ, ఘనుఁ జూచి యధమకులుఁ డను, మనమున శిష్యతతిచదువు మానిచె నంతన్.

పరమ. 2 111.

సీ. అచటినాలవజాతి హాలముఖాత్తవిభూతి నాదికృతువుకై ఛ మైన మాన్చు... మనుచ. 1. 50.

ఉ నా విని శ్యామ వదనంబున లేవగ వంకు రాప నే. మే వచియింపం బూను హృదయేశ్వ ఉని గ సంజ్ఞ మాని ..

పార. 4 57, కళా 4. 43.

తీసివేయు, తగ్గించు

చ వినుము నరేంద్ర విప్రుం డలిగెన్ జమదగ్ని సుతుండు శాప మిచ్చె నమరభర్త వంచనము నేసె వరం బసి కోరి కుంతి మాన్చె వలుక భీష్ముం డర్ధరథుం జేసి యడంచెం గలంచె మద్రరా. ఒనువిత మాడి శౌరి విధియయ్యె నరుం డనిం జంపెం గర్ణునిన్

భార. శాం 1 55

గీ. అర్ధచంద్రబాణంబున యాదవేంద్రు, నేసి తోడన బలుదూపు లేడు వఱపి, యతని వేగంబు మాన్చె

ఉ హరి 8 59

బ్రతుకుమాన్చు — చంపు

ఆ అధిపుం డల్ల నవ్వి యద్దాయరక్కసి బ్రతుకు మాన్చె దివ్యబాణ మేసి కకు 2. 117

మానుపు(న్పు) — మానుచే — మానించే స. క్రి. (√మాను[1]) 1 పోఁగొట్టు, నశింపఁజేయు.

కం ఈవదు లన్నియు నా గంగానదిసరి పూర్వ జన్మకలుషములెల్లన్, మానుపు నంట సంస్మరణస్నానతటస్థానదర్శనస్పర్శములన్ ..

వరాహ 10. 155.

2 నివారించు, అడంచు.

మ జగతీనాథవతంస మానత శిరస్సమ్మేళవన్ నెయ్యపున్, జగడంబుల్ ప్రియ మొప్ప మాన్పె డుతటిన్ ...

మనుచ 5 92.

మ . . అస్వేదతావృత్తి మాన్చె నవస్వేద సమృద్ధి బోధకళ మాన్పెన్ మోహవిభ్రాంతి తోఁ...నె గీర్వాణవధూటికిన్ ..

మనుచ 2 33

మానుషము సం విణ (అ. ఈ. అ.) 1 మనుష్య సంబంధ మైనది.

వి అ పుం. (రాశిచక్రమున) 1 మిథునరాశి. 2 తులారాశి 3 కన్యారాశి

(ఈ త్రితయ మిథునాదులయందు దెలుఁగున చే ప్యవహారము కనఁబడుచున్నది)

4. అభిమానము

కం .. సాధ్వసమును సిగ్గును మానుష ము మువిడి గొనఁగన్ .

నిరం 2 68.

5 గౌరవము

రగడ నూనగ..డి వెదకు తావిఁ జొక్కుఁ జొక్కు మైనదిక్కు, మావవతి గయాళిపొత్తు మాను షంబె దక్కు..

వరాహ 1 92

సీ జనులు గాంచిన మానుషము దూలుఁ దన మను పుయిలోటమున మోము వ్రల్లగిలఁగ,

భార విరా. 2, 70.

6 పరాక్రమము

సీ ప్రాభవంబులు మాలి శౌర్యశక్తులు దూలి పాఱువారును విధి దూఱువారు, మానుషంబులు గ్రాఁగి మత్సరంబులు వేఁగి వెచ్చు వాడును మూఁక విచ్చువారు ...

వరాహ 8 47.

కం ఇరువురసయు మానుషములుగలరాజులయిండ్ల గన్నెకలు పుట్టునెడన్, దెలిసిన వరించి.

శుక 3. 525.

మానుషాదుఁడు(త్తు) సం. వి. త్ పుం. రాక్షసుఁడు

సీ .. పరుషకేశజాలంబు గాడ్పునఁ దూలంగఁ గాలోపమానుఁ డై చనుదెంచి మానుషాదుఁడు.

భార. ఆది 6. 201.

మానుషి సం. వి. ఈ. స్త్రీ మనుష్యస్త్రీ, మానిసి.

మానుష్యుఁడు సం. వి అ పుం. మనుష్యుఁడు.

మానుష్యకము సం. వి అ. న మనుష్యుల సమూహము.

మానే(నె)రు వి. జ్యోతిష్మతి, ఎక్కుడుతీఁగ. (శ. ర)

మానోజ్ఞకము సం వి. అ. న మనోహరత, ఇంపు, అందము.

మాన్పించు స. క్రి. (√మానుపు – ఇంచు స్వార్థమున) పోఁగొట్టు.

శా .. వే యేల ధృష్టద్యుమ్నుం డొకరుండ విద్విషదవష్టంభంబు మాన్పింపదే ...
భా॰ భీష్మ 2 12

మాన్మథము సం విశ. (అ ఈ అ.) మన్మథ సంబంధమైనది.

మాన్యము సం వి. అ న (శ్రీమ-తులు పన్ను లేక గౌరవార్థము పూజ్యులకు నిచ్చిన భూమి

సీ మాన్యంబు లీయ సమర్థు డొక్కఁడు లేడు మాన్యముల్ చెఱుప సామంతు లంద, ఱు ...
రామలిం. 4.

శా సాలగ్రామము మున్నుగాఁ గొనఁడు మాన్యక్షేత్రముల్ పెక్కుచం, దాలం బండు నొకప్పుడుం దఱుగ దింటం జాడియున్ బంటయున్.
మనుచ. 1. 55.

గీ. అగ్రహారాళి వఋఐమాన్యంబు లొసఁగి ...
భీమ. 1. 41.

మాన్యుఁడు సం. విశ. (అ. ఆ అ.) 1. గౌరవింపఁబడవలసినవాఁడు. 2. గౌరవార్హుఁడు, గౌరవింపదగినవాఁడు

మాపటించు ?

ఉ అగ్నిహోత్రసమయమందు భోజనవేళ, మధ్యదివసమందు మాపటించి, సదనమునకు నర్థి చనుదేరఁ దద్వాచి, శార్థ మీయవలయు నతిముదమున.
భాగ. 6 (చి.ని).

మాపతి సం. వి అ. పుం. శ్రీపతి, విష్ణువు

మా నము సం వి అ. న. కొలుచుట

వి అ పుం త్రాసు, తక్కెడ.

మాపు స క్రి. (√మాయు త మాయుపు)
1. నశింపఁజేయు, లేకుండఁజేయు.

కం ఓపి యతనిరణభారము, వా పెదఁ గౌరవ్యసేన బడలువడిచి సా,టోపతఁ గర్ణునిఁ దునిమెద, నా పెదఁ గురురాజుదురభిమానము బలమున్.
భార. కర్ణ. 3. 95.

వ ఇట్లు మధుసూదనుం డేయుసాయకంబులు ... చమత్కారంబులు మాపియు ...
ఉ. హరి 1. 148.

2 బాదించు, పీడించు.

సీ. మత్యతిలను బ్రజన్ మాపంగ వచ్చును వర్షంబు గురిపింప వశము గాదు ... రామలిం. 5.

3 మాయఁ జేయు, మలినము గావించు.

ఉ. ... నిజతేజము పెంపున నన్యతేజముల్, మాపుచుఁ గౌస్తుభాంశమున మాఘపువన్నెను తారన్ .
వరమ. 3. 5

వి బౌ. 1. సాయంకాలము

ఉ మా-పటివేళ నీవు వనమధ్యము వెంవ్వడి వచ్చి గోప్పద, ప్రాపితధూళిధూసరితభాసురకుంతలమై సరోరుహా, ద్దీపితమైన నీ మొగము ధీరజనోత్తమ మాకు వేడ్కతోఁ, జూపి మనంబులన్ మరునిఁ జూపుదు గాదె ...
భాగ. 10 పూ 47.

మ తరుణీ రేపును మాపు హవ్యములచేతం దృప్తుఁ డౌవహ్ని .. మనుచ. 2. 65.

సీ. సాయంసమాఖ్యయై చనుచుండు మాపునా.
అం. భా. 1. 94.

కం. ఏను జటాయువు నెంతయు, మానసమున మదము లొదవ మత్సరముతో, భానుని మనలో నెవ్వ డు, మానుగ మును గదియ నోపు మాపటిలోనన్ భా రా కిష్కిం. 788.

కం మదిఁ దహతహ విడిచి యిఁకన్, ముదమున సతులారం కొంగు ముడివేసికొనుం,డిదె నేఁటిమాపటికిఁ గూ, ర్చెద వాలాయముగ నేను బ్రియులను మిమ్మున్ ప్రభా 5 85.

2. రేయి, రాత్రి.

ఉ. ... భూమిభృ,న్మౌళికిఁ గేలు మోడ్చి చని మాపటికొల్వున నావిలాసినుల్ . .
వైజ. 1 121.

కం. ఈమా పేయింతిని నా, కామాతురి తెల్లఁదీఱ .
చంద్ర. వి. 1. 82

గీ ఎసఁగుకట్టావిక్రియ నావి రెగయఁ బగటి, యొందయుడు కాఁబకుఁడు భూమండలమునఁ, బొలిచె మాపటఁ బండువెన్నెల చకోర, పోత వితతికి జాఁపట్టు వోసినట్టు అము. 2 60.

3 మాలిన్యము, మురికి.

(వ్యవ) రంగుబట్ట మాపున కాఁగును

(ఈ యర్థమున అనౌ. గా వ్యవహారము దుఁ గన్పట్టు చున్నది.)

4 లేకుండఁ జేయు (చూ మాపుచేయు)

విశ మలినము, మురికియైనది.

సీ కురుమాపుదడిమంపుఁగోకలోఁ దొలఁకెడు కంప మానవితంబకాంతిసొంపు ..

కళా 4 105

సీ. కట్టినచెఱుమాపుగడితంపు పుట్టంబు సెన్ను మీఱెడునారచీర గాఁగ ..

అచ్చ రా. సుం 28

**మాపుచేయు** స. క్రి. (√మాపు) పోఁగొట్టు, నశింపఁజేయు.

ఆ. తెలుపు మాపుచేసి దిట్టతనంబునఁ, దెలుపు భస్మ ముగను దేటపఱచు, విధముకన్నఁ బరున వేదియు లేదురా ... వేమ. 3. 148.

**మాపుడు** విశ. (√మాయు) మాసినది, మలిన మైనది.

గీ. .... ఒరులు, గట్టి విడిచినవస్త్రంబు గట్టఁగాదు, మడత మార్చు టొప్పదు కడుమాపుడైన ..

భార. అను 4 107.

**మాభీదము** సం. వి. అ. పుం. ఏకముఖరుద్రాక్షము (వై ని.).

**మామ** వి. (సం. మామకః, త. మామన్, క. మావ) 1. తల్లికిఁ దోడఁబుట్టినవాఁడు, మేన మామ, మాతులుఁడు.

గీ. అనఘ మా మామ శకుని నాకై కడంగి, జూద మాడెడి నాతోడఁ గాదు నాక, యీతఁ డొడ్డిన ధనరాసు లెవ్వియైనఁ, గోఁడిగా నీకు నీ గల వాఁడ నేను. భార. సభా. 2. 174.

ఉ శ్రీరుచిరత్వ భూతిమతిజిత్వర శాశ్వతి శక్తి కాంతులన్, దీటిత సాంభోగముల ధీనిధి యీశ్వరనారసింహుఁ డా, వారిజనాభశంకరుల వారికుమారుల వారితమ్ముఁలన్, వారి యనుం గమామలను వారివిరోధులఁ బోలు నిమ్మహిన్.

మనుచ 1. 29.

2 శ్వశురుఁడు

(క) భర్తతండ్రి

కం. అమెటాత నేయునవినయ, సామకథల మృదుగ భీరిసంభావనలన్, మామయు నత్తయు నటతో, షామృతమునఁ దేలి రంతరంగముదుఁ దగన్

భా. ఆ 7 197.

ఉ ... నీదుపట్టి న న్నెంతయు ప్రేమఁ బట్టి రమియించినయప్పుడె మామ వైతి సీ, కింతటి నుండి కోడలఁ జుమీ నను ముట్టకు రాజశేఖరా.

సారంగ 2 202.

(చ.) భార్యతండ్రి.

ఉ పారణ చేసె రాజు మధుపర్కపుఁదేనియమామ భీమధాత్రీరమణుండు మంత్రసముదీరణపూర్వ ము గాఁగ నీయగన్ ... నైష. 6 88.

సీ. విను సామి నీతండ్రిపనుపున నీమామ యగు కుంభకుని యింటి కరుగుదెంచి ...

నీలా. 2. 12.

చం. .. మామగా, రనుటయె కాని మమ్ముఁ గని నయ్యకు మీకును భేద మున్నదే ..

ఉ. రా. 5. 252.

వ. .. శ్రీమన్మహామండలేశ్వర కులోత్తుంగ్గ చోడ గొంక్క రాజులమామ దణ్డనా (య) కపణ్డి నాయకుని గొఙ్క చోడపనాయకు.

ద. శా. 4. 1066.

3 మామక సంజ్ఞకుఁడు, మామవావివాఁడు.

చం. మఱఁది యటంచు బావ యని మామ యటం చును నల్లుఁ డంచు నంద, దఱకును నన్నివావు లిడి ... దశా. 2. 366.

జ. మామతనము, మామమామ.

**మామకము** సం. విణ (అ. చికా. అ) నాసంబంధమైనది

**మామకీనము** సం. విణ. అ. అ అ) నాసంబంధమైనది, మదీయము.

**మామకుఁడు** సం. విణ అ మికా అ. 1. నాసంబంధమైనవాఁడు
2 స్వార్థపరుఁడు, లోభి, అత్యాశగలవాఁడు
వి అ పుం మాతులుఁడు, మేనమామ (మే.సి).

**మామతనము** వి. మామ+తనము) శ్వశురత్వము, మామయగుట

ఉ భూమితలేంద్ర నీ కిపుడు పుత్త్రిక యైతనరారు కన్య నీ,శామహికాంశజాత యఖిల ప్రహసయ గుణప్రపంచములన్, మామక పాణిపీడనసమాచరణంబున కర్హ, గాన శ్రీమామతనంబు మిక్కిలిగ మామది కి పగు చున్న దిత్తఱిన్
పరమ 3. 93.

**మామమామ** వి (మామ + మామ. త. మామ మామ) విష్ణువు (సరస్వతి)

సీ హారోగిరపునిరాజారి, కూరిమిపట్టి మామమామ యనుంగు మామగారు, అచ్చ రా శాల 6.

గీ మామమా మన వారి యొప్పు శ్రీమహేశ. ఆం ౦ దేవ. 7

**మామము** నం విణ (అ ఈ అ) నాసంబంధమైనది, మామకము

**మామిడి – మావిడి** వి. (త మామడం) చూతము, మావి (వ్య వి)

చం అల్లయది కెంపులమేడలతోడి విస్ఫుర, న్మరకతకుట్టిమస్థలియొ మవ్వపు లేఁజిగురాకు కెంపుము, మ్మఱిమునఁ దేజరిల్లునెఱమామిడి మాకులతోడి తోఁటయో ప్రభా. 1. 62.

సీ చాన మామిడి వంటి సంపెంగకును మోము చక్కఁ జూపవదేమి తక్కువయ్యె ...
ఉ రా 6. 38.

సీ. ... మామిడి మామి యనంగ నామ్రమునకు.
ఆం. భా 145.

**మామిడిక్రింది సోమరి** మామిడిచెట్టుక్రింద అపండు రాలి తననోట పడు నని ఆశించి వేచుకొని యుండునట్టి సోమరి.

ద్వి ఒక విచారము నాకు నొదవె నీరాజు, సుకవాసి, పనిపంద చూపుగుజ్జంబు, మామిడి క్రింద సోమరి మేదకుడు.
ద్వి వాశిష్ఠ ఉ. 1497 పం.

ఆ అహిరణ్యకశిపునందు సిపామిడి, క్రిందిసోమరెట్టు బొంది యెత్తెఁ,బులికి మేఁకమఱక పుట్టిన యట్లయ్యె
నా. 2 59.

**త్రొక్కుఁడు** మామిడికాయ – మామిడికాయలు త్రొక్కి చేసిన యొకవిధ మగుపచ్చడి

కం .. త్రొక్కుడు మా,మిడికాయయు నూరుఁబిడు మెచ్చిరలంతుల్
పాంచ 4. 55.

జ మామిడిగుత్తులు

**మామిడిగుత్తులు** వి బ. (√మామిడి) ధాన్య విశేషము.

మ. సొరిదిం జేర్చినతిఁగమల్లియలు ఖర్జూరంబులుం బుప్పమం,జరులు న్మామిడిగుత్తులున్ గుసుముల్ సంపెంగలున్ బచ్చగ,న్నెరుపూఁజాలు గల్గి రాజనపుఁగాంతిందారు ము ల్వ్యాపి చే, లరుదార న్నగుఁ బూవుఁదోఁటల బలాకానీక దంభంబునన్
అము 1 66.

**మామెన** వి 1. ఉత్పలశారిబ, నల్లసుగంధిపాల (వ్య వి).

సీ మామెనయును నేమామెన యటకమామిడి దూలగోవెల .
హంస 4 10.

గీ .. మామెన యన నుత్పలశారిబాహ్వయ మగు భవ.
ఆం. భా 57

2. మామెనకాయలతో పెట్టిన యూరుఁగాయ

కం. వడపిందెయు మామెన మా,రెడుగాయయు నల్లమున్ మిరియపూగ్గాయల్, కడనుండఁగఁ ద్రొక్కుడు మా, మిడికాయయు నూరుఁబిండ్లు మెచ్చి రలంతుల్.
పాంచా. 4

ఉ ఆరికకూడు పుచ్చువరు గావులవెన్నయు దోసి
గింజనం, శాఁకపుటాంబురంబు తనిమజ్జిగ సూమె
వగుంపుతోడఁ దం,తారఁగఁ బట్టి రెక్కిమీఁదయ
ల్మూలుగోలఁ బూని యెడ్లకో, చేరులు పైచి
దున్నుటకు నేఁగి కొండ్రకు పాలు పటి నన్
వేం పం.చ. 637

(వ్రాఁత ప్రతిపా. మాకొనకంపు ముద్రి పా.)

**మాయ** సం వి ఈ స్త్రీ. 1 దంభము

2. వంచన, మోసము
3. గారడివిద్య, మంత్రవిద్య, ఇంద్రజాలము మొ వలనఁ గలిగిన భ్రాంతి
4. యథార్థము కానిరూపము, అసత్యము (సమాసముయొక్క మొదటిపదముగా నుండునపుడు అసత్యము, కల్పితరూపము గలది, యథార్థము గానిది అనునర్థముల మ ప్రయోగింపఁబడును)
   (ఉదా.- మాయావచనము — అసత్యవచనము మాయామృగము మొ)
5. కపటోపాయము, రాజకీయతంత్రము
6. (వేదాంత.) అవిద్య
   (అవిద్యవలనఁ గలిగిన భ్రాంతిచేత నసత్య మగు జగత్తును సత్యముగాను బ్రహ్మముకంటె భిన్నమైనదిగాను జనులు గ్రహింతురు)
7. (సాంఖ్య.) ప్రధానము, ప్రకృతి
8. బుద్ధునితల్లి యగు మాయాదేవి
9. (శైవమతమున) జీవుని బంధించెడి నాలుగు పాశములలో నొకటి.
10. ఒకానొక పట్టణము, గయ.
11. లక్ష్మి
12. కృప.
13. ఒకానొక విష్ణుశక్తి
14. తెగడ (వ్యా. వి.). (వై. ని).

**మాయరవి** — దయలేని సూర్యుఁడు

కం. మాయరవి యేల క్రుంకఁడొ, కో యను నిట్టేల
తడసెనో ... భార. విరా 2. 313.

**మాయఁజేయు** స. క్రి. (మాయు) నశింపఁజేయు

1 చంద్రసూర్యుల ప్రకాశము మాయఁజేయని
కటికి చీఁకటిమీఁద మెటిక పిలుచు ..
శుక 2 504.

ఉ. కా నొకమాయఁ జేసి యమృతంబు సురాళికిఁ
బంచిపెట్టఁగా, నే నిఁక మాయఁ జేసి త్రిది
వేశుల నందఱ మాయఁ జేసెదన్ ..
దశా. 2. 285.

**మాయఁబాఱు** అ. క్రి 'మాయు' కాంతి హీనమగుట కున్ముఖ మగు, మాయుట కున్ముఖమగు.

కం తెలతెల నయ్యెను దిక్కులు, పలపల మడు
గణము మాయబాఱెను బతుల్, కలకలనఁ
గూయఁజొచ్చెన్, దులదులఁ దమ్మెదలు దమ్మి
తుటుముల వెడలెన్ హంస. 1 155

**మాయకాఁడు** వి విశ. (మాయ + కాఁడు) మాయావి

సీ. నీవు.

గీ. మానుషంబులు నడపంగ మాయకానిఁ, గానఁ
గెలువు గాంచుట వగ కలిమి పేర్మి, దాని వెలి
పుచ్చు నోపమి వీన నొకటఁ, గార్ష్ణి పాండు
రత్వంబులు గలుగు ననఘ
భార అను. 4. 385.

**మాయదారి** వి. విశ. (మాయ + దారి) (సం. మాయాధారీ. మాయావి) మాయకాఁడు; మాయావిని, మాయలాఁడి.

ఉ వచ్చుటయున్ ఫలందనుఁడు వారిజనాభుఁడె
మాయదారి యై, యిచ్చటి కేఁగుదెంచె నని
యిచ్చఁ దలంచి నమస్కరింప ...
వరాహ. 9. 44.

గీ నిలిచె జిలిబిలిజడదారి చెలువఁ జేరి, మచ్చ
కప్పెడుదార నమ్మాయదారి ...
కువల. 2 29.

చం హరిహయ కంటకాన్వయుల యావహా వైబరి
కెల్ల యైనకల్లరి మదిరిత మేను కుటిలమ్ముగఁ
ద్రిమ్మరు మాయదారి మందర యనుజంత ...
చం. రా. 4. 18.
ఆం భా. 2 266.

**మాయపోతు** వి. విశ. (మాయ + పోతు – మాయము + పోతు శ. ర.). మాయఁజారి (శ. ర.).

**మాయము** విశ. (సం. మాయా, క మాయవు

1. అదృశ్యము, కావరానిది.

ఆ. మడుగుసొచ్చి మునిఁగి మాయ మై పోయిన, నద్భుతాత్ముఁ డగుచు వవనివిభుఁడు ..
భార అ 4 330

శా ... ఇతఁ డెవ్వాఁడొక్కొ నేత్రోత్సవ . బై డాయం జనుదెంచె నంతటను మాయం బయ్యె . నైష 6 52

కం. ఉఱికిన నడుమనె తల దెగ, నఱికినఁ బులి మాయమైన నభమున సుర లత్తఱి మెచ్చి పుష్పవర్షము, తఱచుగఁ గురియించి రభయ దాయకు మీఁదన్. ద్వా 10 57

2 మోసపుచ్చునది, వంచకము

కం మాయపుఁజీకటి విరియుఁడుఁ, దోయజ మిత్త్రిండు మగుడఁ దోఁచెఁ బ్రజకుఁ గో, పాయత్తు లై బలంబులఁ, జేయంగలవారు గడఁగి శితబాణములన్.
భాం. ద్రో. 4. 624

కం. మాయఁ బ్రకటించుచును వెడ, మాయపు మంత్రములు రిత్త మంత్రించుచు భూ, నాయకనందన గనుఁగొను, మా యామదిరాక్షి నీమదా లస యగునే. మార్క 2. 91

3. కృత్త్రిమము, తెచ్చి పెట్టుకొన్నది

చం. మదవతి ... చెంబుతో, నుదకముఁ గొంచు ధూర్తమణి యుండెడిచోటికి నేఁగి మాయపు, న్నిదుర వహించి యున్నయతనిం గరసంజ్ఞల లేపి యి ట్లనున్. శుక. 2 526.

4 చెడిపోవునది, నశించునది

కం. కానియటు లుండి నెఱిఁబడు, నైన తెఱఁగు దోఁచి మాయ మగు నిబ్బంగిన్, మానసమున కుబ్బు వగయుఁ, దే నోపుం బనులు బుధుఁడు దేలఁడు రెంటన్. భార. శాం 2. 28.

సీ. అనురక్తి నినుఁ గూడి మనఁ గంటి మంటి నే ననురతిమనువు మాయంబుగాఁగ ..
కు. సం. 5. 552.

గీ. అస్త్రశిక్షయు నేర్పంగి వఱిగిపోయె, మాయ యున్నియు నెచ్చోట మాయ మయ్యె ..
భా రా. యు 1390.

చం అడరెడుబిచ్చుఁ బొచ్చుతఱి నాదట నూరక పూచునాఁటని,ల్కడయును గానఁ ద్రోచి చిర కాలము దాశిన బెట్టిదంబు నా,యెడఁ గని వంతలన్ విసివి యీతని కెక్కడి మోహ మంచు, ని,ప్పుడమి నడంగి మాయమయి పోయితి వే మె పతివ్రతామణీ ఉ రా 8 99

5 వంచనాసాధనము, మాయోపాయము

కం ఈవెడమాయము లేఁటికి,దేవీ యొనరించెదిట్టు దీనికి నెడగా, నీ వొకటి యొడ్డి చూపినఁ, బోవఁగనిత్తునె విరోధిఁ బోరిగొన కెట్లున్.
హరి. ఉ. 8. 201.

గీ. మాయములు పన్ని యీలీల మహిపుల్రమోల, బాల నిడి హేల నరిగిరి ప్రాణసఖులు ...
కృ. శకుం. 3. 33.

**మాయపుఁబురువు** – ఘాతుకక్రిమి, నశింపఁజేయు క్రిమి.

కం నాయిష్టవనిత మ్రింగిన, మాయపుఁబురువు లివి వీని మడియింతు మునీంద్రా యరుగుము నీ వనుటయు, నాయన యత్యంతదుఃఖితాత్ముం డగుచున్. భార అర 4. 334.

సా. కుంచెన్న కూడఁబెట్టిన మంచెన్న మాయంబు చేయును (పెద్దల కష్టార్జితమగుసొమ్మును వమ్ము చేయునప్పు డీ లోకోక్తిని వాడుదురు).

కం. ఇంచుకయు నే వ్యయింపక, నంచితముగ ధనము విభుఁడు సాముల కొసఁగెన్, "గుంచెన్న కూడఁ బెట్టఁగ, మంచెన మాయంబు చేసె మర్త్యా దలరన్. రుక్మాం 4. 104.

జః మటుమాయ, మటుమాయతనము, మటుమాయలబండి, మటుమాయలాఁడి,మటుమాయలాఁడు.

**మాయల చెంచురాయఁడు** మి. వి (√మాయ) ఈశ్వరుఁడు, శివుఁడు

కం ఒకతలమానిసి లేఁ డిం, టికి మాయచెంచు రాయనికి నని వెనక,య్యకు నాతనివెనకయ్య కుఁ, దుకతుకఁ బుట్టించి నవ్వుదురు మన చెంచుల్. చంద్రా 2. 56.

**మాయలబెల్లి** మి విఱ. (√మాయ) మాయలు గలది.

సీ. తచ్చనగొండి పోతరకత్తె కల్లరి పల్లింత మాయలబెల్లి కటికి .. చెన్న 2 84

**మాయలమారి** మి. విఱ. (√మాయ త. మాయ మాఱి) మాయలు గలవాఁడు మాయావి, మాయా విని, మాయలాఁడి.

ఉ ... సుఖో, పాయత నున్నవాఁడు శ్రుతిపారము సేయుచుఁ దోఁటలోననే, మాయయగా రటంచు నల మాయలమారి చనెం దటాలునన్.

వైజ 4. 16.

**మాయలమెకము** మి వి.(మాయలు + మెకము) మాయామృగము.

కం. మాయలమెకంబు నేసిన, మాయన నన్నెఱుఁగ వలయు నటకాదె నరుం, డేయకమును గిటిఁ బొరిగొను నాయకుఁ డావెన్క మీరె న న్నెఱుఁగుటకున్. రా వి 3. 47.

**మాయలాఁడి** మి విఱ (మాయలు + ఆఁడి, త మాయెయాడి క. మాయలాడి) మాయలు గల ఆఁడుది

దండకము. ... గుణం బేఁటికే మాయలాఁడీ విభుండైనఁ బోఁడే నిమగ్నుండు గాఁడే ..

భోగినీదండకము 9 పా

**మాయలాఁడు** మి విఱ. (√మాయ త మాయై యాడి) మాయావంతుఁడు మాయలమారి.

సీ, ... సహదేవుఁ జులుకన మర్దించి మందల విడు వఁడే మాయలాని ...

గీ మేటిమగనిఘటోత్కచుఁ గీటడపఁడె

భార. కర్ణ. 1 43

సీ . మాయలాఁడని తిట్టె మంజుఘోష.

మమచ 1. 42

కం. అనుడు దరహాసరసమునఁ. దనవదనజ దీర్ఘుండు తారుణ్యము గై, కొన మందాందోళన మేళనమున శిర మమర మాయలాఁ డిట్లని యెన్ . పాండు 5. 209.

భా రా. యు. 1718., ఆం. భా. 2. 256.

**మాయసాగు** మి వ క్రి. (మాయ + సాగు) మాయచేయు

గీ సీనియోగులు సీమలో లేనిసుద్దులం గదిసి మాయసాగి రనంగ వలదు, మా టొకటి సేఁ తొకటి గా ద దేఁటి కిఁక, నాఁటినాఁటికిఁ దెలి యుఁగా నసతలోన. రా వి 5. 41.

**మాయాకారుఁడు** సం. వి. అ పుం. గారడివాఁడు.

**మాయాచణుఁడు** సం విఱ (అ ఆ అ.) 1. గారడి చేయుటకుఁ బ్రసిద్ధుఁడు. 2 మోసపుచ్చువాఁడు, దగాచేయువాఁడు

**మాయాజీవి** సం వి న్ పుం గారడివాఁడు.

**మాయాదము** సం. వి. అ. పుం మొసలి, మకరము (త్రి. ని.).

**మాయాదేవి** సం. వి. ఈ. స్త్రీ. బుద్ధునితల్లి.

**మాయాధరుఁడు** సం. విఱ (అ ఆ. అ.) మోస గాఁడు, మోసము చేయువాఁడు.

**మాయాఫలము** సం. వి అ న. మాచికాయ.

**మాయాయంత్రము** సం. వి. అ న మంత్రశాస్త్ర ప్రకారము వేసిన యంత్రము.

**మాయావంతుఁడు** సం. విఱ. (త్. వతీ. త్) 1 మోసము చేయువాఁడు, వంచకుఁడు. 2 ఇంద్రజాలవిద్యయందు నేర్పరి, ఇంద్రజాలవిద్య నుపయోగించువాఁడు

వి త్ పుం కంసుఁడు.

**మాయావతి** సం. వి. ఈ. స్త్రీ. ప్రద్యుమ్నుని భార్య.

**మాయావి** సం. విఱ. (న్. నీ. న్.) మోసము చేయువాఁడు, మోసపుచ్చువాఁడు, యుక్తి వన్నువాఁడు.

వి. న్. పుం. 1. ఇంద్రజాలికుఁడు, గారడివాఁడు 2. పిల్లి (శా. ని. .) నమారికాయ.

**మాయావిదుఁడు** సం. విణ. (ద్) – మాయ నెఱిఁగినవాఁడు

1 మోసము చేయుటయందు నేర్పరి. 2 ఇంద్రజాలవిద్యయందు నేర్పరి

**మాయి** సం. వి. న్. పుం. 1 గారడివాఁడు 2 బ్రహ్మ 3. కాముఁడు, మన్మథుఁడు. 4 అగ్ని 5 శివుఁడు

విణ (న్ నీ న్) మాయావి

**మాయించు** స. క్రి. (√మాయు) 1. చంపు, సంహరించు

కం. ఆయుధము విడిచి యుండఁగ, సాయకగుణ మీరు నూడఁ జంపినకట్టో, పాయుసి దృష్టద్యుమ్నుని, మాయించియ కాని తొడిన మఱు నేనూడ్పన్. భార. కర్ణ. 2 150

సీ ఈతేరఁ గాదె మాయించె సుత్రాముఁడు పాకదైత్యయు నిర్భరసహాయు ...

హర. 7 154

కం మాయావి వీఁడు దుర్మతి, మాయఁడు సంగరములం దమర్త్యుల గెలుచున్, మాయికరణమున వీనిన్, మాయింపుము మోహనాది మాయలచేతన్. భాగ. 10 ఉ 14.

2. నశింపఁజేయు. అడఁచు.

ఉ. ...మౌర్వి మ్రోయించుట గర్జచందముగ నేచి విరోధవవానలంబు మాయించు శితాస్త్రవర్షమున నిట్టిది భీష్మమహాభ్రము ..

భార. భీష్మ. 1 52.

శా ఆరాజన్యు డుదగ్రుడై పొదివి సింహవ్యాఘ్ర భల్లూక ఘూ, దాంతాదికదుష్టసత్వ నతతోత్థానంబు చాపస్ఫురన్నారాచ ప్రముఖాంబకంబుల జడిన్ మాయించుచున్ గ్రక్కునన్, ఘోరారణ్య పదాశ్రమంబులఁ బరిశోభంబు మాన్పెన్ గృపన్. కృ. శకుం 1. 62.

క. పంచినయును మాయయయు మా, యించి పరాక్రాంతి నయ్యమేశాస్త్రమునం, గ్రంచజ నంతకుష్ఠం కేఁ, గించితిఁ బౌలోమకాలకేయాసురులన్. భార. అర. 4. 86

ఉ. చెయిచుఁ దెవులపండువు, మాయించు నఘాళినిట్టిమిత మఱి గలఁదే .. భాగ. 1. 134.

3. పోఁడు, కాంతిహీనము చేయు

శా . అరి, త్యాగదానస్థిర కీర్తితారకములన్ మాయించు చేతప్రోతా, పొడత్యుండు వెలుఁగు ... నైష. 5. 133.

సీ చిఱునవ్వు వెలయించి చెలు వయనవెన్నెలల్ మాయించు మిప్పుడు మచ్చకంటి . .

విల్హ. 2. 137

సీ నీలధారాదిఁ నిర్మలకాంతుల గడియలో మాయించుఁ గలికివేణి హంస 5. 210.

**మాయికుఁడు** సం వి. అ పుం. ఇంద్రజాలికుఁడు .(వై. ని.)

**మాయు** అ క్రి. (త మాయ్.) 1 కాంతి హీనమగు, తిరోహితమగు.

కం. మాసె నభోమణి నక్కలు, గూసెం గలయంగ దెసలకుం బలుసాయల్. నేసెం బలుమొయిళులడర ... భార. విరా. 4 86.

గీ కరము భానుబింబము మాయఁ గప్పె నభము, నంబకములరాగమునఁ బెం, పారుచూడ్కిఁ బ్రతిభటుఁడు నూచి నరుఁ డింక గ్రమ్మ గెట్టుఁ, బూన్కి విడఁ డని సంరంభమును వహింప.

రాఘవ. 4 176.

2. మలిన మగు, మాఁగుడువాఱు

కం మాసినచందముఁ దనుఁ గని రోసినదెందంబుఁ గలతరుణి సెఱుఁగఁడ బి, ట్టేసినమదనునిచే ధృతి వాసినబెగ డొందు సింహబలుఁ డట్టెయెడన్. భార. విరా. 2. 82.

ఉ మాసినదీర్ఘవేణి కుఱుమాసినచేలచెఱం · గలంక్రియా, వాసముగానిమేను వసివాఁడినముద్దుమొగంబు గాంచి ... శుక. 1. 125.

కం. తల మాసిన నోలు మాసిన, వలువలు మాసినను
బ్రాణవల్లభుసైనన్, గులకాంతలైన రోయరె,
తిలకింపఁగ భూమిలోన దిఃముగ సుమతీ
సు. శ 56

సీ. మానటి పగలెల్ల మాయు దీపని పండు
వెన్నెల నగునట్లు వెలఁది నవ్వు ...
కు సం 8. 6.

గీ. భ్రమరగీతిః మాయ విపంచి మీటఁదాన శ్రుతిఁ
గూడి మిగులఁ దద్రక్తి పెచ్చు, వే నివారించి
తేచి దైవికము నెదుట, యుక్తులు ఫలింప
వనుచు బిట్టూర్పు నవ్వు అము. 5. 147

చం. చీకటులు గొబ్బున మాసె మరుండు తుంట
విల్, బలువడి నెక్కుఁ దీసె ..
నీలా 2 44

3. చచ్చు

కం మాయావి వీఁడు దుర్మతి, మాయఁడు సంగర
ములం దమర్త్యుల గెలుచున్ ...
భాగ 10 ఉ. 14

కం మాయారణమున దివిజుల, మాయఁగఁ జేయు
టకు నైకమత్యము మెంయన్ .
శశాం 5. 41.

4 క్షీణించు, తగ్గు

సీ. జపములు గాయత్రిసహితంబుగా మానె
వేదంబుపేరును వినఁగలేద ..
హరి పూ 1. 100

సీ. మనసుఁ గామక్రోధమదలోభముల కిచ్చి సడ
లింతు రన్వయాచారసరణి, నన్వయాచారంబు
లట్లు మాసి చనంగ వర్తింతు రన్యాయవర్తన
మున. భీమ 5. 173.

(మాసిచను — చెడిపోవు )

ఉ . అశ్వమే, ధీయహయంబు మారుతగతిన్
బహుదేశములం దరించుచున్, మాయనివేడుకన్
యుపతిమండలమున్ గదిసెన్ సమున్నతిన్
జై . భా 5. 105.

5. మఱువఁబడు, విస్మృతమగు

సీ రాజ్యాలయమునకు రాకపోకలు సేయు, మాసి
న చదువులు మఱలఁ జదువు
పాండు 3 43.

6. నశించు

సీ. మాసె నఘస్ఫూర్తి మరుభూముల దను రెల
మూఁడువానలు నిండఁ గురసె
మను చ 1 34.

సి కను మాయఁ జని సీతఁ జెనకు కాకాసురుని
మాయఁగాఁ బాటు కొనినచోటు ...
సా. ... 9.

7 దరిద్రుఁడగు, దనహీనుఁడగు

(వ్యవ.) పాపము అతఁడు వ్యాపారము సేసి మాసి
పోయెను.

జ మాపు, మాపుచేయు, మాపుడు, మాయఁజేయు,
మాయఁజాలు, మాయించు, మాసి, మాసిక,

మాయుకము నం వి అ పుం గజవిశేషము.
(వల్లనిశరీరము వల్లనినాలుకయు కుఱుచదేహ
మును అల్పములైన గర్జాలమేహవములను దీర్ఘ
మగుతొండమును కృశ మగుగ్రీవయును దుర్గంధ
మును గలది. ఇది సేనాపతికిని రాష్ట్రమునకును
నాశము గలుగఁ జేయును.) (శ ర )

మాయురె — మాయురే అవ్య 1. ప్రశంసార్థకము.

కం మాయురె హరిహరివరద య, మేయగుణా
యనుచు నాత్మ మెచ్చి ..
భాగ. 10 ఉ 680.

2. సంతాపార్థకము

ఉ. మాయలు మాయ మైనఁ గని మాయురె యం
చను శోషకాఖ్య మౌ, వాయువు నంపఁగా ...
దశా 4. 214.

మాయురే — మాయురె మాయొరె, అవ్య. 1. ఆశ్చ
ర్యార్థకము.

చం. పురుపమహీజ మయ్యెగురుఁబోఁడి పయంట
చెఱంగు వట్టఁ త, ద్గురుకుచముల్ బయల్
పడఁగఁ ద్రోఁచె వచేతవ మయ్యె మాయురే.
కవిరా. 4. 76.

గీ మాయురే భూరిమహనీయమణి కాయ, హాటక విశంకటవివాటపాటవంబు, అని మనంబున వెఱఁగంది హర్ష మంది, రఘునృపకుమార వరు హజారమునఁ జేరి ఇందు. 2 118

2 ప్రశంసార్థకము

ద్వి వేయ భంగుల సావేశంబు దాల్చి, మాయురే యని కలమాఱను మెచ్చి ...

ద్వి. హరిశ్చ. పూ 976 పం.

గీ మాయురే స్వామి చాగు భళా యటంచు, మాగధులు చేరి సముఖంబు వేగ విప్ప, నలువు మీఱంగ నిజవాహనంబు డిగ్గి ...

ప్రబంధ. 79.

3. సంతాపార్థకము

ద్వి. మాయురే కౌశికుమాయఁ గాఁబోలు,... పనిగొని బహుమహోత్పాతంబు లొదవె...

ద్వి. హరిశ్చ. పూ. 1122 పం

ద్వి. హా యని యెలుఁగెత్తి యఱచి హానాథ, మాయజూదం బింతమట్టుకుఁ దెచ్చి, మాయత్రో వలఁ జూపె మాయురే నాథ ...

ద్వి నల 4 153 పం.

**మాయువు** సం. వి ఉ. పుం. పిత్తము.

**మాయూరము** సం. విశ. (అ. ఈ. అ) మయూర సంబంధమైనది, నెమిలిసంబంధమైనది.

వి అ న మయూరముల సమూహము

**మాయూరి** సం వి. ఈ. స్త్రీ. 1. అజమోద, ఒకజాతి యోమము (వృ వి.). 2 మృదంగాది వాద నమునందు స్త్రీచే యొక్క ఒకవిధ మగు వ్యాపారము (వై. ని.)

**మాయొరె – మాయురే** అవ్య ప్రశంసార్థకము

మ. అరెరే దాంతి బళారె శాంతి గుణ మయ్యారే ప్రసాదంబు మా, యొరె దాక్షిణ్యము జాపురే తెలివి మే లెంతేతవం బౌర యా,దర మాహా మహిమం బహో కలితమేధాశక్తి మజ్ఝారె సత్కరుణాలోకన మంచు నాత్మ మునిరాట్కంఠీరవున్ మెచ్చుచున్.

చంద్రా. 3. 125.

**మాయశ్రీము** సం వి అ న త్రాసు, మూర, తూము లోనగు మానము (శ ర)

**మారకము** సం వి అ పుం. అంటుకొనెడి పెద్ద వ్యాధి 2 దేగ, శ్యేనము

**మారకమ్మ** వి. ఒకానొక దేవత.

ఆ. వారకాంత లెల్ల వలచి యేతెంతురా, బొందుఁ జేసి ధనము పుచ్చుకొనుటకు, మారకమ్మ చొచ్చి మఱి యిల్లు వెళ్లురా .

వేమ. 2. 176.

గీ మారకమ్మపులి యచట మఱయుమన్న, పెద్ద మేకములు పెంచినపిల్ల యొక్కొ, యనఁగ వాలు మృగంబుల కదియ యెపుడు, నాటపట్ట గుజాడలు తేటపడఁగ. ద్వా 8 15.

**మారకుఁడు** సం విశ (అ ఈ అ.). చంపెడి వాఁడు, నశింపఁజేయువాఁడు

వి అ పుం. మన్మథుఁడు, మరుఁడు.

**మారజిత్తు** సం. వి. త్. పుం (మన్మథుని జయించినవాఁడు)

1. శివుఁడు 2. బుద్ధుఁడు.

**మారణము** సం. వి. అ న. 1 చంపుట, నశింపఁజేయుట. 2. శత్రువును నశింపజేయుటకై చేయఁబడిన మంత్రశాస్త్రకర్మ, అభిచారిక కర్మ. 3. ఒక దినుసు విషము.

**మారము** సం. వి అ. పుం 1. చంపుట, నశింపఁజేయుట 2. విఘాతము, విఘ్నము. 3 కామ వికారము, మన్మథ వికారము 4 ఉమ్మెత్తచెట్టు. 5. మృత్యువు, చావు.

**మారరిపువు** సం. వి. ఉ. పుం శివుఁడు.

**మారవము** సం. విశ (అ.ఈ.అ.) మరుదేశసంబంధమైనది.

**మారాటము – మాఱాటము** (శ. ర.).

**మారాము** వి. పెంకెపట్టు.

(వ్యవ.) ఆ పిల్లవాఁడు చాల మారాము చేయుచున్నాఁడు

మారాముళ్లు వి. బ. మర్మములు, తంటాలు, చిక్కులు

క. ఓ రామచిలుక మా కీ, మారాము ల్లెట్లు తెలియు మగవారెమె నీ, దారిం బలుపోకలంగడి, దేఱన్ శుక. 2 60

(ముద్రి పా "మారాములు తెలియుటకును" శ. పా) మారాముడ్లు (బ్రౌ పా)

మారి[1] వి (సం మారీ) మృత్యుదేవత.

వ మారి మసంగిన తెఱంగునం జారిసమరి యెక్కడం దానయై యెుక్కొక్క మెఱుం గుటమ్మునం బెక్కండ్ర నుక్కడించి ... అచ్చ రా. యు 364.

సీ మనకీచకుల కెల్ల మారి యై పుట్టినసుదతి వో యెడు నని చూచువారు . . భార విరా 3. 66

గీ ఊరు పాడైనం గెలవుల యూళ్ల కుఱికి, మెసవ దొరకొంటిం బ్రజ మారి మసంగినట్లు, తిఱెం గతిపయ దినముల దేశ మెల్ల, మల్లెవట్టినచేని క్రమంబు గాంగ మనుచ. 5. 26, భార. ద్రో. 1. 141.

ఇ. మారి మసంగు.

మారి[2] అవ. తాచ్ఛీల్యార్థమున వచ్చు నొకానొక ప్రత్యయము

ఉ ... నీ కొడుకు మూఢత మానుప వేల వాండు రో, తొత్తులమారి యై గృహము ద్రొక్కక యెుక్కొకదాని పూనికన్, గుత్తకు నంచు నుంచుకొని కోకలు రూకలు కోకనీయంగన్. నిరం. 2. 48.

గీ. అతండు దాని నెగాదిగ వరసి చూచి, దుడ్డె గట్టిద పని లేక తొత్తుం దానె, పిలిచె నిది పాట్ల మారి గావలె నటంచుం, జేరి తనపేరు పురిపేరు చెప్పి నిలిచె. హంస 5. 69.

మారి సం. వి. ఈ. స్త్రీ. 1. అంటుకొనెడి ఒకానొక చెడ్డవ్యాధి, మసూరికా రోగము. 2. చంపుట. 3 దుర్గాశక్తి భేదము.

మారిచము సం విణ. (అ ఈ అ) మిరియము లతో జేయంబడినది.

మారితము సం విణ (అ ఆ అ) వశింపం జేయంబడినది

మారిమసంగు అ క్రి. (మారి + మసంగు) మిక్కిలి విజృంభించు, మిగులం జెలరేంగు.

గీ. కాలపక్వంబు లైన లోకములు జముండు, జారి సమరెడు చాడ్పున మారిమసంగి, యుగ్రరూపుం డై శౌర్య సమగ్రజూహ, సంపద ద్దాముం డగు క్రీడి నంపె రిపుల భార విరా 5 59.

కం ఈరీతి నెదుర లేక కు,మారిక లుగ్రాహవమున మారిమసంగుచో, శీరంబు విడిచిపాఱె సు, రారాతిబలంబు లెల్ల హాహా యనుచున్. వరాహ. 11 102.

గీ దుర్ముఖు నిశితాస్త్రంబున ద్రుంచె నిట్లు, మారి మసంగి దైతేయుల జారిసమరె . . మార్కం 6. 103.

స. క్రి సంహరించు, చంపు

కం వల్లియలు ద్రెంచుకొని బల, మెల్లను బెల్లగిలం జొచ్చి యెంతయు వలుకన్, గెల్లువడి సురభి హుంకృతి, మల్లడిగొనం బ్రజల మారిమసంగం దొడంగెన్. పద్మ. 7. 238.

గీ ఉత్తమోజు యుధామన్యు నుర్విం గూల్చి, మఱియుం దక్కనకూరుల మారిమసంగి ... చిత్రభా. 8. 81.

మారిషము సం వి. అ. పుం. తోంటకూర (వ్య.వి.).

మారిషుండు సం. వి. అ. పుం. గౌరవము గల మనుష్యుండు.

(నాటోక్తియందు సూత్రధారుండు ప్రధాన నటునిం బిలుచునపుడు గౌరవపద్ధతిని సంబోధింప నుపయుక్త మగుపదము.)

మారీచము సం. విణ. (అ. ఈ అ.) మిరియముల సంబంధమైనది.

వి. అ. పుం. 1. పెద్ద యేనుంగు, గజరాజము. కక్కోలకము (వ్య. వి.) (మే. ని.).

మారీచి సం. వి. ఈ. స్త్రీ. కాశ్యపముని యొక్క తల్లి (త్రి. ని.)

మారీచుఁడు సం. వి. అ. పుం. 1. బంగరులేడి రూపమున రాముని మోసపుచ్చిన రావణ భృత్యుఁడైన రాక్షసుఁడు, తాటకాసునందులు తనయుఁడు. 2 కశ్యపుఁడను ఋషి. 3 ఋత్విక్కు, యజ్ఞ పురోహితుఁడు.

మారు[1] స. క్రి. (హిం. మార్) కొట్టు. ప్రహరించు.

చ. విరహుల మారుమారు ఘనవీరబలం బని పొందగుఁదన్, ... మాకుమారు నడిదాలని రాగవియోగజాతకా, తరగుణదాత్ర మన్మథ పతాక నని తేఁట్ల నదల్చి కమ్మరా, మరలఁ గదల్చి వారిచరమండలిసొంపు వదల్చి ... నల్. వేం. పంచ. 4. 150.

గీ. మా... నిను శంకరుఁడు పలుమారు మారఁ, బలసి క్రమ్మరఁ బ్రతికించఁ దలఁచె నకట, యట్టి యవివేకమునఁ జామీ గట్టు బట్టి, చెట్టు జట గట్టి భైక్షంబు బట్టఁ గడఁగె కృష్ణ. 4. 90.

సీ. కొనె మారెఁ జదివె నా...గను గొట్టె నవి తోఁచు ... ఆం. భా. 3. 132., వైజ. 4. 65.

మారు[2] వి. (క. త. మోర్) మజ్జిగ, తక్రము (బ్రౌ.).

సా. మఱచిపోయి మజ్జిగలో మారుబొట్టు వేసినారు

మారుంగము సం. వి. అ. పుం. మసృణత్వము (వై. ని.).

మారుండము సం. వి. అ. పుం. 1. పాంపుగ్రుడ్డు 2 ఆవుపేడ, గోమయము. 3. బాట, మార్గము 4 గోమయముతో నిండినచోటు

మారుఁడు సం. వి. అ. పుం. కామదేవుఁడు, మన్మథుఁడు

మారు(ఱు)గాళ్లు వి. కృత్రిమ పాదములు. చెన్న. 2. 20.

మారుతము సం. విశే. (అ. ఈ. అ.) 1. మరుత్తుల సంబంధమైనది 2 గాలిసంబంధమైనది, వాయు సంబంధమైనది.

వి. అ. పుం. 1. గాలి, వాయువు 2 శరీరము యొక్క ప్రధానరసము లగు వాతపైత్య శ్లేష్మములలో నొకటి యగువాతము. 3. స్వాతి నక్షత్రము

మారుతవ్రతము సం. వి. అ. న. వాయువువలె నంతటను జొచ్చుట వాయు వంతటను బ్రవేశించు నటుల రాజు చారులమూలమున నంతటను జొచ్చుట యనెడి రాజధర్మము

మారుతసుతుఁడు సం. వి. అ. పుం. 1. హనుమంతుఁడు. 2 భీముఁడు

మారుతాశనము సం. వి. అ. పుం. గాలిమేపరి, పాము.

మారుతి సం. వి. ఇ. పుం. 1. హనుమంతుఁడు 2. భీముఁడు.

మారువు వి. మత్స్యవిశేషము, ఒకజాతి చేప.

సీ. కొఱ్ఱమీలను దండ్రికొలువు లెంకల కిచ్చె వాలుగలను సంగడీల కిచ్చెఁ, బాఁపరలను బిన్నవడ వాళ్లకును నిచ్చె మారువులను ఒన్వు వారి కిచ్చె ద్వా. 1. 240.

మారువము వి. మత్స్యవిశేషము, ఒకజాతిచేప.

ఉ. వల్లికతట్ట మారువము వాలుగ బేడిస కొఱ్ఱమీను పెన్, జెల్లయు పక్కి పారయును నీమను ముచ్చుఁగి బొమ్మిడాయముల్,... రొయ్య పరకా రగఁ జేపలఁ బట్టి బెట్టుగన్. ప్రబంధ. 195.

మారువా వి. రాగవిశేషము, ఒకానొకరాగము.

భైరవి నాట తోడి సిరిపాళి దిశాదిశి దేశి మారువా. గౌర బిలావురి లలితకన్నడ గౌళ ముఖారి దేవగాం, ధారి వరాళి కన్నడ ధనాసిరి ఘూర్జరి పూరి బేగడా, యారభి రామఖల్లి

మొదలై తగురాగము లింపు మీఱఁగన్.
చెన్న 2 256

**మారువాడి** వి. ఒకానొకజాతి, మార్వాడ్ దేశీయుఁడు

సీ. ఆఁడుబిడ్డనుకాకి యల్లుఁడు పింజారి మఱఁదలు కోడలు మారువాడి ... వేణు. 69

**మారువెల్లి** వి. తృణవిశేషము, ఒకజాతిగడ్డి మొక్క

గీ వేరు తొణ్ణంగి తొండును మారువెల్లి, తొప్పరం(టింత యెద్దుకొ ముత్తెపుగడ్డి
హంస 5 47

చం పాని కెడ పేరి తోఁణఁగియుఁ బొత్తర మల్లవ మారువెల్లియున్ .. ప్రబంధ 200

**మారె(రే)డు** వి వా. అనా. బిల్వవృక్షము

కం మారెడు మోదుగు విప్రుఁడు, భూరమణుఁడు వటము ఖదిరమును వైశ్యుఁడు పెం, పారఁగ రావియు మేడియు గౌరవమున దండములుగఁ గైకొనవలయున్. ఏజ్ఞా. 1. 21.

సీ. ... ఇన్నూఱు యోజనములనిడుపు యోజన శతంబు, వెడలుపు గలుగుమారెడుతోఁట విల సిల్లు శ్రవనం బనఁగఁ బ్రసిద్ధ మగుచు ...
వరాహ 10. 125.

రగడ. మారేటికిఁ బలుమా ఱేఁటికిఁ జన, గోరంట ల కొనగో రంటవె వన ...
యయా. 4 66.

రగడ మారేడువంటికై మగువ కడుగో రేల, చేర రాఁగదె యుప్పచెంత వదిగో రేల
ఉ. రా. 6 61

సీ .... బిల్వసంజ్ఞ గీ. వరగు మారే డనంగను
ఆం భా 2 44.

**మారెడుగాయ** బిల్వశలాటువు, దీనితోఁ జేయఁబడు ఒకవిధ మైన ఊరుఁగాయ.

కం. వడపిందెయు మామెన మా, రెడుగాయయు నల్లమున్ మిరియపూర్గాయల్, కడ నుండఁగఁ దొఱుకుడు మా,మిడికాయయు నూరుఁబిండ్లు మెచ్చి రలంతుల్. పా చా 4 66

**మార్కండేయపురాణము** నం వి అ న ఒకానొక పురాణము.

అది పదునెనిమిది పురాణములలో నొకటి.

**మార్కండేయుఁడు** నం వి. అ పుం ఒకానొక ఋషి (శివుని వరమున మృత్యువులేనివాఁడు)

**మార్కవము** నం వి అ. పుం భృంగరాజము, గుంటగలగ (వ్య వి)

**మా(ఱుకొ)ర్కొను** స. క్రి, అ క్రి. (మాఱు+కొను ప్రతిఘటించు, ఎదుర్కొను

ఉ. విక్రమ్నుఁడున్ యుధా, మన్యుఁడు నేపి యొఁదొరుల మార్కొని రౌద్రరసం బలోకసా, మాన్యము గాఁగ నస్ఖలితమత్సరముల్ మెఱయఁగఁ బోరిరి
జార పద్మ 1 261.

కం . కశిమి వలిప్ప వతని మార్కొని కినుక, న్నిడుద మొన వాఁడికొమ్ములఁ, బుడమిం బడ వైచి పొడిచి పొరిపొరి మట్టెన్ ..
నీలా. 3. 65

కం. కొం,చక యేమీ మనము సమానముదారక్రి, డకు నొండొరు మార్కొనుట దొ,రకునని వచ్చితి ... రాఘు. 2. 81.

కం. సకలక్షత్రభయంకరు,నకు బ్రాహ్మద్రథికి వని మొనన్ మార్కొన నో,పక వలియంబాఱఁడె యూ, ముకుందుఁడు. భార. పథా 2 46.

కం వీనికి మార్కొనఁ జాలెడు, వానికిఁ దగువాని ధర్మతనయునిపురిలో, నానానియుద్ధలంపటు, నే నొక్కనిఁ గంటి భారం. విరా 2 9.

చం. ఇల నెలదోఁటలందుఁ జరియింపఁగ సౌధము లెక్కఁ జిత్రపం, క్తుల మృగరాజిఁ జూడ సమకొల్పుదు రోఁ దమకూర్పు నెయ్యపుం, జెలులకు సాళ్వమాశనృపశేఖరు తిమ్మనృపాల చంద్రుతోఁ, గలవను మార్కొనఁ గడఁగు గబ్బి విరోధు ల దేమి చిత్రమో.
విప్ర 1 51., కు సం. 11. 660.

**మా(ఱుకో)ర్కొలు** (√మార్కొను) మార్కొనుట, ఎదిరించుట.

మ. మునుపే యాతఁడు కృష్ణుపే ర్నుడివినన్ మోసంబునుం జెంద కే, మనదుం దర్పిపుతో రిణాంగణమున న్మార్కొలుఁ గల్పించె నే, మనుదున్ దైవము మాకు నెల్లఁదనువున్ బ్రాణంబులున్ రక్షకుం,డును నెయ్యుండును దేశికుండు నలకృష్ణుండె కదా చూచినన్ .

చిత్రభా. 5. 198

మార్గ సం. వి. ఆ. స్త్రీ సంస్కృతభాష

కం మార్గి కుమార్గము దేశి య,మార్గము వదలంగఁ దమకు మది వదలక దు, ర్మార్గిపదవర్తులనఁ దగు, మార్గివులం దలఁప నలఁతి మహి సుక వులకున్ ... కు సం 1 28.

మార్గకవిత సం వి. ఆ. స్త్రీ సంస్కృతకవిత్వము

కం. మును మార్గికవిత లోకం, బున వెలయఁగ దేశి కవితఁ బుట్టించి తెలుం,గున నిలిపిరి ..

కు. సం. 1. 23.

మార్గణ సం. వి. ఆ. స్త్రీ. 1. యాచన, యాచించుట, ప్రార్థించుట. 2. వెదకుట, కనుపట్టుట

మార్గణము సం. వి. అ. న. 1. యాచించుట, ప్రార్థించుట 2 వెదకుట 3. బాణము, అమ్ము 4. అయిదుసంఖ్యకు సంకేతము 5 ఒకవిధమగు ధనుస్సు (వై.ని).

మార్గణుఁడు సం విశే. (అ. ఈ. అ.) 1. వెదకువాఁడు. 2 అడుగువాఁడు, యాచించువాఁడు. వి. అ. పుం యాచకుఁడు, వేఁడెడివాఁడు

మార్గతి మి వి (మాఱు+గతి) వేఱుమార్గము.

సీ. తటి వేచి చనఁబోయి తడఁబడి మార్గతి వడి చూపు లాదట బయలువఱుప ...

భార. విరా. 5. 402.

మార్గతోరణము సం వి. అ న రాజమార్గమునఁ గట్టిన విజయసూచక మగుతోరణము

మార్గద్రంగము సం. వి. అ పుం రాజమార్గములో నున్నపట్టణము.

మార్గధేనుకము సం వి. అ. న. నాలుగుకోసుల దూరము (త్రి. ని).

మార్గధేనువు సం వి ఉ. పుం నాలుగుకోసుల దూరము

మార్గబంధనము సం వి అ. న కాట్రగడ, కంప కోట

మార్గము సం. వి. అ. పుం. 1. త్రోవ, పద్య. 2 పరిశోధనము, పరిశీలన 3. సాధనము, ఉపాయము 4 కార్యము నడుపురీతి. 5. పద్ధతి. విధము. 6 (కవిత్వ) శైలి. 7. వెదకుట. 8. నృత్త గీత నాట్యముల యొక్క యున్నతశైలి. 9. (నాట్య) తటస్థింపబోవుదానిని సూచించుట. 10 గుదస్థానము (త్రి ని.) 11. కస్తూరి 12 మృగశీర్ష నక్షత్రము 13. మార్గశీర్షమాసము. 14 సంగీతమునందు ఒకానొక భేదము, బ్రహ్మాదులచే మహేశ్వరునుండి తేఁబడి భరతాదులఁచే బ్రయోగింపఁబడు సంగీతవిశేషము (వ్యతి. దేశి )

ద్వి. లాలితశుద్ధసాళగములుఁ బెరయఁ, గ్రాలుచు దేశిమార్గంబుల వెలయ ...

బస పు. 71 పొ. 6 పం.

15. మృగసంబంధ మైనది.

ద్వి మంగళధ్వను లొప్ప మార్గరావముల, సంగత శ్రుతికూడి సరివీణ లొప్ప, వీనుల కింపుగా వినుపింప నపుడు ...

రం. రా. ఉ. 149 పొ. 6 పం

మార్గరుఁడు సం వి. అ. పుం. నావికుఁడు, పడవ నడిపి జీవించువాఁడు

మార్గపతి సం వి. ఈ. స్త్రీ. మార్గస్థుల రక్షించెడి దేవత (విఞ్యమ్ను.).

మార్గశిరము సం వి. అ. పుం. మార్గశీర్షమాసము.

మార్గశిరి సం. వి. ఈ. స్త్రీ. మార్గశీర్షశుక్లపూర్ణిమ.

మార్గశీర్షము సం వి. అ. పుం. మార్గశీర్షమాసము.

మార్గశీర్షి సం వి. ఈ స్త్రీ. మార్గశీర్షశుక్ల పూర్ణిమ

మార్గస్థుఁడు సం విశే (అ. ఆ. అ.) దారి ప్రయాణము చేయువాఁడు, బాటసారి.

**మార్గాయణి** సం. వి. ఈ. స్త్రీ. మార్గశీర్ష మాసము (వై. ని.)

**మార్గికుఁడు** సం. విణ. (అ ఈ. అ) 1 వేఁట గాఁడు 2. బాటసారి

**మార్గితము** సం విణ. (అ ఆ. అ.) 1. వెదకఁ బడినది, పరిశోధింపఁబడినది 2 ప్రార్థింపఁబడినది, వేఁడికొనఁ బడినది

**మార్గ్యము** సం విణ. (అ ఆ అ.) 1 వెదకఁ దగినది. 2 తుడువఁదగినది (శ ర)

**మార్చు**[1] స. క్రి. (√మారు[1]) నశింపఁజేయు

ఉ తూ ర్పరుణంబు గాఁదొడఁగె దుష్టనిశాచర వేళ యయ్యెడున్. మార్పుము కాలయాపన మొన ర్పక య ప్పిశితాశిఁ బట్టి పా, లార్పఁగనేల...
భార ఆది. 6 219

**మార్చు**[2] – **మాఱుచు** స క్రి (√మాఱు),

1 వినిమయము చేయు, ఒకవస్తువు నిచ్చి మఱి యొకవస్తువును పుచ్చుకొను

చం. ఇతరులదాన మేనిఁ దమయాగియయేనిని నన్ను మార్తు రే, మతి వరశాధివాసగతి మాన్పఁ దలంచుట గగ్గినన్ సమం, చితముగ భక్తి నిచ్చుట కుశీలత మార్చుట నాకు హర్షభా,సితయుఁ బరాభవవ్యథయుఁ జేఁతసుఁడీ యిదె చాటి చెప్పెదన్
భార అను. 2. 359.

మ ....నెలంతల్ వణిగాకృతిన్ సరకుమార్పన్. .
ఆము 2 12.

2. పరివర్తనము నొందించు

సీ. ... వగచినఁ దాపంబు వొందుట దక్క నొండు, గలుగునే సుఖము దుఃఖంబును దోడివ యవి మార్చి వచ్చును నరుగుచుండు ...
భార. అను. 5 230.

సీ సాలములతొంటిదళములు జర వహింప, మధుఁడు క్రొత్తదళంబుల మార్పనేమొ, పైకమలరెడి తవకల్మి ప్రబల నాటి, కొమ్మలఁ బ్రవాళతతులు గీల్కొల్పె నపుడు.
ఇందు 2 87.

గీ వేణువుపై వ్రేళ్లు మార్చి మార్చి, మరులుగొలిపితె గోవింద మందసతుల ..
ఆము. 5. 67.

3. మాఱుపఱచు, రూపాంతరము నొందించు.

సీ. కమలషండము నున్నగాఁ జేసి యిరుసుగాఁ గావించి కెందమ్మికంట్లు మార్చి ...
వీర. 2. 94

మ ఇమఁ డస్త్రాదికిఁ బోవఁ గొల్లగొని నేఁ డేతేఁ తద్దీప్తి సం,జనసంబంధజశాంభవంబున దశిత్రాంశాఁగనానేత్రకో,ణనికాయంబుల డాఁచి బిద్ద పశిమన్ దాఁ బూనెనో చొప్పుమా,ర్పవవన్ వెల్వెలఁబాఱె దీపకళికా వ్రాతంబు శాతోదరీ.
మనుచ. 3 58.

4 వడ్డించు.

ద్వి అడ్డిసేయక యిట్టు లమరులబంతి, వడ్డించుచును వచ్చి వచ్చి యచ్చెలువ, తనముఖాకీర్తి ప్రతాప సంపదల, యనువున వెలుఁగుచు నక్కడ బంతిఁ, గూర్చున్న శశధరార్కుల కమృతంబు, మార్చి..
విష్ణు. ఉ. 4. (శ. ర).

**మార్జ** సం. వి ఆ స్త్రీ. త్రిస్నేహము, మూఁడు చమురుల కలయిక

**మార్జకము** సం విణ. (అ ర్జికా. అ) శుభ్రము చేయునది, పవిత్రము చేయునది.

**మార్జన** సం వి ఆ. స్త్రీ 1. శుభ్రము చేయుట, పవిత్రము చేయుట 2 వాద్యవిశేషము యొక్క ధ్వని, మురజధ్వని.

**మార్జనము** సం విణ (అ ఈ అ) పరిశుభ్రము చెయునది, బాగు చేయునది: పవిత్రము చేయునది (సాధనము)

వి అ న. 1 శుభ్రము చేయుట, పవిత్రము చేయుట 2 చేతితోఁ గాని కుశతోఁ గాని మనుష్యునిపై నీరు చల్లుట

పుం 1. లోధ్రము, లొద్దుగు (వృ ని). 2 స్నేహము, చమురు (వై ని)

**మార్జని** సం వి ఈ స్త్రీ. సమ్మార్జని, చీపురుకట్ట.

**మార్జారకంఠము** నం. వి. అ. పుం. మయూరము, నెమలి.

**మార్జారకము** నం. వి. అ. పుం. 1. పిల్లి 2. మయూరము, నెమలి (వాచ.)

**మార్జారకర్ణిక** నం. వి. ఆ. స్త్రీ. పార్వతీపరిచారిక

**మార్జార(ల)ము** నం. వి. అ. పుం. 1. పిల్లి 2. ఇంగుదవృక్షము, గారచెట్టు 3. అగస్త్య వృక్షము, అగిసిచెట్టు

**మార్జారి** నం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుపిల్లి 2. పునుఁగుపిల్లి, ఒక్కొముము 3. కస్తూరి 4. చమరీమృగ మును బోలిన ఒకానొకమృగము వై. ని.

**మార్జారిక** నం. వి. ఆ. స్త్రీ. పునుఁగుపిల్లి (వై. ని.)

**మార్జారీయము** నం. వి. అ. పుం. పిల్లి (వాచ.) (వి. వ్యమ్ము.)

**మార్జారీయుఁడు** నం. వి. అ. పుం. 1. శూద్రుఁడు 2. కాయశోధన చేయువాఁడు, శరీరశుద్ధి చేయు వాఁడు

**మార్జాలకంఠము** నం. వి. అ. పుం. మయూరము, మగనెమలి

**మార్జాలకరణము** నం. వి. అ. న. రతియందలి బంధవిశేషము.

శ్లో. ప్రసారితే పాణిపాదే శయ్యాన్స్పృశి ముఖోరసి, ఉన్నతాయాః స్త్రియాః కట్యాం మార్జాల కరణం విదుః.

**మార్జాలకర్ణి** నం. వి. ఈ. స్త్రీ. చాముండ, దేవతలలో నొకతె

**మార్జాలీయము** నం. వి. అ. పుం. 1. పిల్లి. 2. యజ్ఞపాత్రలను పరిశుద్ధి చేసెడి వేదిసమీప స్థలము 3. అంగశోధనము, అవయవములను శుద్ధి పఱచుట (వై. ని.)

**మార్జిత** నం. వి. ఆ. స్త్రీ. పంచదారయుఁ గొన్ని సంబారువస్తువులును వేసిన పెరుఁగు, రసాల.

**మార్జితము** నం. విశే. (అ. ఆ. అ.) 1. శుభ్రము చేయఁబడినది, తుడువఁబడినది. 2. రాపుడుచేయఁ బడినది.

**మార్ష్టుఁడు** నం. వి. అ. పుం. చాకలివాఁడు, రజకుఁడు

**మార్తండము** నం. వి. అ. పుం. 1. జిల్లేడుచెట్టు. 2. సూకరము, పంది (మే. ని.). 3. పన్నెండు సంఖ్యకు సంకేతపదము.

**మార్తండుఁడు** నం. వి. అ. పుం. సూర్యుఁడు

**మార్తికము** నం. విశే. (అ. ఈ. అ.) మృణ్మ యము, మట్టితోఁ జేయఁబడినది వి. అ. పుం. కుండమూఁత, మూకుడు, శరావము.

**మా(ఱు)ర్తుఁడు** వి. (√మాఱు వి. మార్తురు) వై. వ్య. శత్రువు, పగతుఁడు

గీ. మెఱసి బ్రహ్మాండ మెల్లను మ్రింగ నట్టు,వారి మొనపంచి వక్త్రగహ్వరముఁ దెఱచెఁ, దెఱవ నుఱుకడి నర్కుండు తెరువు దప్పి, మార్తుఁ డనఁ బోక మేఘునిమఱువుఁ జొచ్చె.

సీతావి. 1 20.

చం. పఱచి దవాగ్నిఁ బడ్డశలభంబులకై వడిఁ బార్థుఁ దాఁకి రూపవతి సుతులున్ సహోదరులు నాల మువం దెగటారఁ జూచి నీ, మఱఁది భయంబు నన్ గలఁగి మార్తునకున్ శరణంబు చొచ్చె నే, తెఱఁగునసైన నానెగులు తీర్పఁగ నెవ్వరు నీవు దక్కఁగన్. జై. భా. 4. 64.

మ. ... కర్ణాది దుర్జనసంఘంబుల మార్తురం దును ముదున్ సంగ్రామరంగంబునన్ ...

భార. సభా. 2. 296.

కం. తనుఁ దావఁ దొలుత గెలువన్, మనుజపతికి పలయుఁ బిదప మార్తుర గెలువన్, మనమునఁ దలంచువది మును, దను గెలువనిపతికి గెలువఁ దఱమే పగఱన్. భార. శాం. 2. 276

కం. కీర్తిదనుఁ డైనయాతని, మార్తుర కని కరుగఁ నరిది మగువ ... నైష. 5 125.

గీ. అపుడు సరమమగం డెద నలుక నిగుడ, గట్ల మాఱుతుపగతుని గాంచి పలికె . .

అచ్చ. రా. యు. 40.

**మార్దంగము** నం. వి. అ. న. పట్టణము.

**మార్దంగికుఁడు** నం. విశే. (అ. ఈ. అ.) మద్దెల వాయించువాఁడు.

**మార్దవము** సం. వి. అ. న. 1 మృదుత్వము, మెత్తతనము, బలములేమి 2 సాధుత్వము, నెమ్మది

**మార్ద్వీకము** సం. విశే. అ. ఈ. అ., ద్రాక్ష పండ్లతో చేయఁబడినది వి. అ. న. ద్రాక్ష సారాయి

**మార్పడు** అ. క్రి. (మాఱు + పడు) 1 ప్రతిఘటించు

శా. నన్నుం గార్యము లేక మేలకనుపన్ నక్తంచరేంద్రుండు ము, న్నెన్నఁడుం బనుపఁడు మార్పడఁగ నయ్యె ద్రాడు లుదగ్రవృత్తిమై, నున్నారో

భా. రా. యు. 865

సీ. బలహీనమానవ్ర మార్పడ లేదయమ్మ మగఁడని తలంచెద వేరి భాగ. 3. 71

ద్వి. ప్రవిమలాత్మదర్పణ తోరణముల, దవిదీప్తులకురు మార్పడ సమకొంచి ..

ద్వి. హరిశ్చ. ఉ. 2868 పం

2 భేదపడు, వ్యతిరేకముగా వర్తించు

కం. చచ్చిన సాందీపునిసుతుఁ, దెచ్చె జముని నోడించి యడచు దితిజధ్వంసున్, మెచ్చుట యాటది యీతని, యిచ్చకు మార్పడఁగ వశమె యే వేల్పులకున్ హరి. ఉ. 244

ద్వి. మాఱుమాట లిచ్చితో మందెమేలమున, వెఱపు సెడితో మాట వినవొ మార్పడితో

పండితా. పురా. 154.పా.

కాళ. 3. 22.

3 వ్యత్యస్తమగు, తాఱుమాఱగు.

సీ. త్రిజగంబు మార్పడ, ద్రిప్పి మున్నటియట్ల యలవడఁ జేయంగ నతఁడె చాలు .

భా. రా. అర. 1. 248

గీ. వాని గలలోనఁ గానని వనజముఖియు, వాని మార్పడఁ బెరొకని మానవతియు.

నైష. 1. 62.

శ్లో. న కా నిశి స్వప్నగతం దదర్శ తం, జగాద గోత్రస్ఖలితే చ కా న తమ్ .

సం. నైష. 1. 30.

వ. మనసు సనంబున సమపదంబు లగు నగ బల నగడపుటంబులు మార్పడ వైచు కొని .. ..

4 పర్యాయము నొందు, వరుసమారు, మాఱుపు నొందు.

చం. మనుసుఁడు రెండుచేతులను మార్పడఁ జేయఁగఁ జూపు రైదును., ఒది యయి.

నైష. 90.

**మార్పలుకు** అ. క్రి. (మాఱు + పలుకు) 1. ప్రతిఘటించి మాటాడు, ఎదిరించి పలుకు

చం. పలికిన నేమి యన్నియును బల్కు నగున్ మఱి రాజనొద్ద మార్పలికెడువార లేరు ..

భా. ఉద్యో. 4. 415.

2 మాఱాడు, బదులుచెప్పు

కం. అని దగ్గఱ మాటాడిన, విని మార్పలుకంగలేక విఘటితకార్యుం, డును విగతోపాయుఁడు నై, చనియె నతఁడు సతుల గెలువ శక్యమె యొందున్. బోజరా. 5. 853.

వి. ప్రతివచనము, జవాబు.

మ. తెలివిన్ విశ్రవసుం దలంచుకొని యాతిథ్యంబుఁ గావించి మార్పలుకుల్ వల్కిన నింత యున్ గలిగె నోర్వన్ గూడునే యింకిటన్

ఉ. రా. 3. 124.

**మార్పు** వి. (√మాఱు) అ. వికృతి, రూపాంతరమును గాని అవస్థాంతరమును గాని పొందుట

చం. .. వాతెఱ మార్పులో ప్రక్కమార్పులో రసికత లేకగేస్తురతి రామకు నేమి సుఖంబు దెల్పుమా . అహ. 3. 19.

2. వినిమయము, ఒకవస్తువు నిచ్చి మఱియొకటి పుచ్చుకొనుట (శ. ర.).

**మార్పెట్టు** — **మాఱుపెట్టు** స. క్రి. (మాఱు + పెట్టు) ఎదుర్కొను, తిరుగుఁబాటు సేయు.

కం. అట్టన నేల మహాబలు, పట్టికి సురఖచరదనుజ పన్నగులును మార్పెట్ట రనినఁ గర్ణాదుల-

కెట్టు సిలు చచ్చు వాని యెదురం దిరమై
భార ద్రో 4. 205.

మ మదనాగ బలు సేతు లెత్తి పఱవన్ మార్బొ
కాపన్నులై, యెదురం గాల్కొని నిల్వకు
కృడగి . .

కు. స 1' 60, కు సం. 10 628

**మార్బలము** వి. (మాఱు + బలము) ఎదిరి సైన్యము, శత్రుబలము

సీ మార్బలంబులు సొచ్చి మాతంగములఁ గూల్చి,
రథరాజి గలంచి తురంగములఁ ద్రుంచి

భార. ద్రో 2 186.

కం ని బ్బంధము దుర్మానము,దుర్బుద్ధికిఁ గాక తగునె
దుర్యోధన నీ,మార్బలమె పాండవేయులు,
దౌర్బల్యము వాయు శుభము దఱకొను
సంధిన్. భార. ఉద్యో 3 628
(భా. అ వ్యా. పా)

**మార్బలయు** అ క్రి (మాఱు+బలయు) ప్రతిఘటించు, ఎదుర్కొను

శా . . నారికేళబృందారక,స్తోమం బెన్నఁడుఁ
దొల్లి మార్మలసి రెచోఁ దొల్లి పో టొగ్గి సం,
గ్రామోద్యోగము సేసిరి

కు సం. 10. 503.

**మార్మగఁడు** వి. (మాఱు + మగఁడు) ఉపపతి, ఱంకుమగఁడు

అ . డుగుఁ జేయువేళఁ ఒటము లల్లెడువేళఁ,
గూడు దినెడువేళఁ గూర్కువేళ, మగనిఁ
గన్మొఱఁగి మార్మగలను గూడు, నింటి పొరుగు
సఖులయిండ్లలోన హంస 2. 24.

చం. .. అసమాస్త్రకేళిలోఁ,బలుమొన లాని మార్మ
గలపగ్గెలు ఉగ్గులు చేసి ప్రోలువన్ గలసి
చరంతు రవ్విలువకత్తెలు మాడని కత్తులో
యనన్ ప్రబంధ. 17.

**మార్మలఁగు** అ. క్రి (మాఱు + మలఁగు) వెనుకకు మఱలు.

సీ ముగుద ఱ మ్మని చాయ మగఁడు పిలువయప్డు
కదియక మార్మలంగెదవు సుమ్మ .

సిలా. 5 94

**మార్మలయు** అ క్రి మార్కొను (మాఱు + మలయు), ప్రతిఘటించు

కం. . . వారు వారిదిరి వృషభం,బులక్రియ నొం
డొరులకు మార్మలయుచుఁ దాకుచు నుదాత్త
రథసోజ్జ్వలులై , భార ద్రో. 4 191.

సీ పులికైనఁ జెలఁగి మార్మలయఁ జాలెడుమేటి
యాఁబోతుఁ గిట్టి యుక్కడఁచె నేఁడు.

హరి పూ 6 9, శుక 1 213

**మార్మసలు** అ. క్రి. (మాఱు+మసలు) అపమార్గమున వర్తించు, తప్పదిరుగు

ఉ మత్తవనోలె నూపడుచు మార్మసలన్ జతికింపఁ
బూని నీ,వెట్టితనాలు మాన వవి వేడ్కని
టాడఁగ నింటనుండి దాఁ, జిట్టునఁ గోపగించు
కొని చెప్పఁడు చేయఁడు లేచిపోయె మీ,వెట్టి
యగారు మంచిగురువే దొరకెం ఇదు వెట్లు
చెప్పనో. వైజ. 4. 12.

**మా(ఱుమా)ర్మాట** వి (మాఱు+మాట) ప్రతివచనము, జవాబు.

కం. తమనిగమంబులు గ్రమ్మరఁ, దమకుం దయ
సేయుటకును దగ వేడుకొనం, గమలాక్షు పద
ధ్యానవ, శమున నార్మార్మాట లాడ నైఁపక
యునికిన్ వరమ 2 118

**మా(ఱుమె)ర్మెడ** వి (మాఱు+మెడ) వెడఁబడినమెడ, ప్రక్కకు తిరిగినమెడ.

ఉ బెబ్బులి గొంతుక్రో ల్గఱచి పెల్లున మార్మెడ
ద్రెళ్ల దాఁటుచున్ .. ఆము. 3. 20

వ. . . అవి గొంతు క్రొన్నెత్తురుతె క్రోలి విడిచి
చన మార్మెడలు వడి మళకవన దంశమ్ములె
మూఁగ .. మనుచ. 4 37

**మార్మొగమిడు** అ. క్రి. (మార్మొగము+ఇడు విముఖత్వము నొందు.

చం గిరివర ఘోరకందరలఁ గేవల వన్యగజైక వృత్తిచేఁ, దాలక యున్న సత్కృతము తప్పునె యప్పుడెఁ గేసరుల్ నృకేసరు లయి పూర్ణ పౌరుషవిశాలత మించె మహానృకేసరిం, బరు నకు మాఱ్మొగంబిడమి బక్కుని( బ్రోవ నటల్ ఘటింపమిన్. వసు 5 45.

**మాఱ్మొగము** వి (మాఱు + మొగము) పరాఙ్ముఖము, పెడమొగము

గీ. ఆ ప్రభావతి కొంతసే పవ్విధమున, మాన దుఃఖనిర్వేష్టిత యైనవెనుక, నుస్సు రనుచును వేడి నిట్టూర్పు నిగుడ, వగలఁ బొగులుచుఁ బోటి మాఱ్మొగము గాఁగ

ప్రభా 5 112.

చం. అనుటయు రామరామ యని యాయన కర్ణ యుగంబు మూసికొం చు నకట యెంతపాతకపు సుద్దులు వింటి మటంచుఁ జాలుఁ జాలు నుమిము నాపుత్తులంచు మదిలోఁ గడు నమ్మిట నింత వాటిలెం, జను మని మాఱ్మొగం బిడిన సాధ్వస మందుచు వారలందఱున్ పదమ 3.66

సీ అటకి మాఱ్మొగము గానట్టి పూరుషసింహు లన యంబు మూల నుండని మహేశులు ...

బిల్హ. 1 30.

**మాఱ్మొగముపెట్టు** అ క్రి. (మాఱ్మొగము + పెట్టు) పెడమొగము పెట్టు

చం పుడమి హిరణ్య శూన్యదశఁ బొందఁగఁ జేయక విక్రమంబుఁ జూఁ, పెడు సమయాన మాఱ్మొగము పెట్టక పట్టక దేవతార్థ మె, య్యెడ దయ మాలి పుణ్యజనహింసకుఁ బోవక సంచరించినం, గడిమి నృసింహమూర్తి సరిగాఁ దగు నీశ్వ నారసింహుతోన్.

వరాహ. 1. 42.

**మాఱ్మొన** వి. (మాఱు + మొన) ప్రాతికూల్యము, వ్యతిరేకభావము.

చం అలుగఁగ నేల మీరు వసుధాధిపు లెన్న స్వతంత్రులై మమున్, వల దనవచ్చు మీ మనసు వచ్చిన చోటికి నేగుఁ డేఁగినన్, నెల కొని నీ ప్రియాంగనకు నీకును మాఱ్మొనలేక యుండ న, క్కొలి సుఖంబు గాఁగ నొన చెం. నం. 5 170.

**మా(ఱుమొ)ఱ్మొరయు** అ క్రి (మాఱు + మొరయు) మాఱు మ్రోఁగు, ప్రతిధ్వని చెయు

కం చను మెంచి హితపీరుల, నను నాగుహ లాక్రమించి నరించు మొఱయో, య య్యెడ నిమిషు లకు మొఱచే, సినగతి మాఱ్మొర నద్రి సేనా ధ్వనికిన్ కవిక 91

ద్వి ఘు మ్మని ఘనగిరిగుహలు మాఱ్మ్రోయ, వాలు మ్మని మ్రోయుచు నుర్వికుఁ జూచి

ద్వి హరిశ్చ. పూ 20 7 ప.

ఉ రా 8 78.

**మా(ఱు మ్రో)ఱ్మ్రోయు** అ క్రి (మాఱు + మ్రోయు) ప్రతిధ్వని చేయు, మాఱుమ్రోఁగు

మ అవనీభాగము కంప మొందఁగఁ ననేకాతూహిణుల్ గోల్లఁగా, జవనాశ్వ దిరదాద ఘోషముల దిక్చక్రంబు మాఱ్మ్రోయ భూ, ధవులెల్లన్ జని రాత్మభూములకు ...

ఉ రా. 5. 265.

**మాఱు(పె)ఱ్పెట్టు** స. క్రి. (మాఱు + పెట్టు) ప్రతిఘటించు, ఎదుర్కొను.

మ అతులోత్సాహముతోడ దానవబలం బార్వంగ దోర్వీర్యదర్పితుఁడై ఘోరన వచ్చి తాఁకె నమరుల్ భేదిల్లి భీతిన్ హాహా, హాతి మాఱ్పెట్టకి పాఱఁ దారకుఁడు గోపాసక్తి వీరాసురా, న్వితుఁడై యొక్కడె దంచు రోయుచు మహావీరుం గుమారు న్వడిన్

కు సం. 12. 910.

**మార్ష్టి** సం. వి ఇ స్త్రీ. శుభ్రము చేయుట, పవిత్రము చేయుట (రూ. మార్ష్టి శ ర.).

**మాఱకము** వి. (√మాఱు) 1. క్రివినిమయము, ఒకవస్తువు నిచ్చి వేఱొక వస్తువును పుచ్చుకొనుట.

సీ. మాఱక మనఁగను మాఱుగడ యనంగ వినిమయనాభిధ వెలయుచుండు ...

ఆం. భా. 2 267.

మ. .. భూరిస,మమ్రదలీల న్వెలసిల్లి .. ప్రతి జగ
న్మాన్య ప్రభావంబునన్, మదనాగంబులకు
బోలెం గ్రాలవలదా మా ఱెందు లే కున్నతిన్
కు. ౩. ౬. ౪౬

సీ. ఒప్పులే యేటి మాఱు లేకుండ బ్రహ్మ, యంగ
కంబులు చేసె ... విక్ర. 6. 46

౩. మారాటము, మార(ఱు)గాళ్లు, మారొడ్డును, మారొడ్డులు, మార్పు², మార్తుడు, మార్పడు, మార్పలుకు, మార్పు, మార్పెట్టు, మార్పడము, మార్పలయు, మార్మగడు, మార్మలంగ, మార్మలయు, మార్మసలు, మార్మాట, మార్మెడ, మారొమ్మగమిడు, మారొమ్మగము, మారొమ్మగముపెట్టు, మారొమ్మన, మారొమ్మరయు, మారొమ్మ్రయు, మార్వెట్టు, మాఱకము, మాఱట, మాఱటనోరిది, మాఱమ్మ, మాఱాకు, మాఱాకెత్తు, మాఱాట, మాఱాటము, మాఱాడు, మాఱుంగాలు, మాఱుందల్లి, మాఱుకొను, మాఱుగడ, మాఱుచు, మాఱుదల, మాఱునీళ్లు, మాఱుపడు, మాఱుపలుచు, మాఱుపలుకు, మాఱుపాట, మాఱుపు, మాఱుపెట్టు, మాఱుబేరగాండు, మాఱుబేరము, మాఱుమగండు, మాఱుమనువు, మాఱుమనువుది, మాఱుమలయు, మాఱుమసలు, మాఱుమాట, మాఱుమూల, మాఱుమొగమిడు, మాఱుమొగముపెట్టు, మాఱుమొగమువడు, మాఱుమొగము సేయు, మాఱుమ్రోత, మాఱుమ్రోయు, మాఱురూపు, మాఱురూపువడు, మాఱువీడు, మాఱుసేత, మాఱుసేయు, మాఱొడ్డనము, మాఱొడ్డాడు, మాఱొడ్డు.

**మాఱుంగాలు** వి. (మాఱు + కాలు) కృత్రిమ పాదము, కాలికి ప్రతియగు సువర్ణాది నిర్మిత పాదము.

గీ. కాంత యొక్కర్తు మూంపునం గండ లిచ్చె, మాఱుంగా లిచ్చె నొకసుధామధువాణి, లలన యొక్కర్తు నోరతాంబుల లిచ్చె, శక్తజాతర సద్భక్తి శక్తు లెసంగ పాండు. ౩. 77.

**మాఱుందల్లి** వి. (మాఱు + తల్లి) సవతితల్లి.

సీ. పట్టలుదొరపట్టి పట్టపురాణి యే, మానినీమణు లకు మాఱుందల్లి .. చంద్రా. ౩. 101.

గీ. ముప్పునను గేరడము సేయు నవ్విదంబు, నైంప లేక యొకప్పుడు శమనుం ..లిగి, చ .. మమ్మాఱుంబిల్లిపై జూచెం దన్న .. హరి. పూ. 1. 177.

గీ. మాలకరి దాసి సైరంధ్రి మాఱుందల్లి, మగండు విడిచిన సతి దూతి మంత్రసాని, జోగురాలుం కుటమ్మెడిజోటి విప్రవంగని ప్రద్రిచు నవిజార గా నెఱుంగు. జై. భా. ౩. ౩౦, హరి. పూ. 2. 170.

**మాఱుకొను – మాఱొడ్డును** అ. క్రి., స. క్రి. ఎదురొడ్డను.

ఆ. నాదు బాహుబలమునకు మాఱుకొనం జాలు, భుజబలంబు గలిగి పోక చిక్కం, బెనంగి .. భార. విరా. 2. 283.

ఉ. ఊఱటం జెయ్యలం దివుట లూటంగ దర్పము లొండొకంటికిన్, మాఱుకొనంగ ముగ్గనివ మంజులసౌఖ్యరసంబు నిక్కలం, దాఱుచు. హరి. ఉ. 7. 182.

కం. దురమున నీకా రాచూ, లురతోడ న్మాఱు కొని గెలువరాదు సుమీ ... అచ్చ. రా. యు. 463

కం. అరదంబురవము సెలంగగ, శరములు వాయు జనిమీంద సాంద్రముగ వెసం, గురియుచు నడ రెడు భీష్ముని, సరభసముగ మాఱుకొని యె సాత్యకి గడిమిన్ భార. భీష్మ. 2. 224.

గీ. పాండవులసైన్యమును సముద్దండలీల, మాఱు కొనె .. భార. శల్య. 1. 385.

గీ. మలసి యంకెలు వైచుచు మాఱుకొనిన, వృష భములభంగి నక్కురువృషభు లిట్లు, సమదగతిం జేరునెడం జూచి రమరులు ... భార. విరా. 5. 165.

గీ. మాఱుకొన్న ప్రకర్షకుఁ బాఱవోలె ..
విక్ర. 4. 112., హైమ. 3. 15

**మాఱుగడ** వి. (√మాఱు) మాఱకము, వినిమయము.

సీ. మాఱక మనఁగను మాఱుగ యనఁగ, విని మయ శాశ్వత వెలయుచుండు ...
ఆ. భా. 2. 167.

**మాఱుచే – మార్చు** స. క్రి. (√మాఱు) వినిమయము చేయు

**మాఱుదల** వి. √మాఱు మాఱుట, మాఱుపాటు (శ. ర.)

**మాఱునీళ్లు** వి. బ. (మాఱు + నీళ్లు) స్త్రీలు ఋతుస్నాన మైనమఱునాఁడు చేయుస్నానము (శ. ర., వా.).

**మాఱుపడు** అ. క్రి. (మాఱు + పడు స్వార్థమున.) 1. ఎదిరించు, మాఱుకొను.

ఉ. మాఱుపడంగలేనియసమర్థుల సుప్తుల నస్త్ర విద్యలఁ, దేఱనిపిన్నపాపల వధించె నిశీథము నందుఁ గ్రూరుఁడై ... భాగ. 1. 154.

ద్వి. మగఁడు వాలును వభిమానంబు విడిచి, మొగములు వగులంగ మొత్తులాడుదు రె, పతితోడ సతి మాఱుపడెనేని పుణ్య, గతి కేఁగ కది నరకంబునఁ గూలు.
ద్వి. హరిశ్చ. ఉ. 1140 పం.

2. తాఱుమాఱగు. వ్యత్యస్తమగు.

గీ ఆఁడుబిడ్డ సహోదరుఁ డఖిలగుణస, మగ్రుఁడుగఁ గోరుఁ గావునమదిఁ దలంచి, మనము చరువులు రెండును మాఱుపడఁగ. నారగింతము మంచిది యట్టులైన ... వి. పు. 6129.

3. భేదపడు. వ్యతిరేకభావము కలిగియుండు.

కం. ఓకేఁడ నీకు మది వే, మాఱును గుందంగవేల మానసికినుకన్, దేటి కనుంగొనుచో మఱి. మాఱుపడం గలరెయొట్టిమన్నీ లైనన్.
అచ్చ. రా. అర. 107.

4. ప్రమాదపడు. పొరపడు

గీ. ... ఏఁదపు నీవ కావె మహాత్మ నేఁడు, మాఱుపడి యొగ్గు నేసితి మఱవ వలయు ...
భాగ. 10 ఉ. 68.

**మాఱుపఱుచే** స. క్రి. (√మాఱుపడు) తాఱుమాఱు చేయు

ద్వి. ఓకేఁడకుండ మాఱుపఱుచుపాలిండ్లు ....
అ. మ. క. 5. 247 పొ. 3 పం.

(ఇం. ... ... చు అని భావము.)

**మాఱుప(వ)లుకు** అ. క్రి. (మాఱు + పలుకు) ఎదురుచెప్పు, ప్రతికూలముగా మాటలాడు.

సీ. ... పతికి నెప్పుడు మాఱుపలుక వీవు.
కాశీ. 2. 72.

**మాఱుపాటు** వి. (మాఱు + పాటు) మాఱుపడుట. వ్యత్యాసము (శ. ర.).

**మాఱుపు – మార్పు** వి. (√మాఱు) 1. వర్తనము. మాఱుట.

చ. ... విలాసముల్. మనసు వకున్ సుఖాస్పదము మాఱుపు లందినమేను లందు రజ్జనునకుఁ గామ భోగముల జన్మఫలంబునఁ బోల్తు రంగనల్ ..
కు. సం. 7. 959.

2. వినిమయము. ఒకవస్తువు నిచ్చి మఱియొకటి పుచ్చుకొనుట (శ. ర.).

**మాఱుపెట్టు – మార్పెట్టు** అ. క్రి. (మాఱు + పెట్టు) ప్రతిఘటించు, ఎదిరించు (శ. ర.).

**మాఱుబేరగాఁడు** వి. (మాఱుబేరము + కాఁడు) మాఱుబేరము చేయువాఁడు.

(వ్యవ.) నే నీయావును మాఱుబేరగానియొద్ద నాలుగురూపాయలు లాభ మిచ్చి కొంటిని,

**మాఱుబేరము** వి. (మాఱు + బేరము) ఒకవస్తువును గొని దానిని దిరిగి లాభమునకై విక్రయించుట.

సీ. గుట్టెఱుంగు ది దేల గురులతో గుటగుటల్, బిగియక చనఁగదే బిసరుహాక్షి. కుసిగింపులిడ కేఁగు కొన్నయంగడిలోన, మాఱుబేరము లేల మంజువాణి చంద్రా. 6. 185

కథ, చెన్నుగ వినిపొమ్ము కడువిచిత్రము
కొమ్మా  హంస 2. 177.

విశే. 1. మనోజ్ఞము, ఒప్పిదమైనది

ఉ. కమ్మనివింటిజోదు నెఱకైదువులైన మిటారి
తమ్ములే కమ్మలై నెట్లు వోలు
వసు. 5. 101

2. విలాసము గలది.

ఉ జాఱెడు పైఁటతోఁ గులుకుఁ జక్కవ
గుబ్బలతో మిటారిన, వ్వారెడు మోముతో
గిలుకు బంగెలతో .  దశా. 2. 350

ఉ. గొల్లమిటారి గుబ్బెతల కోర్కులపంట తదీయ
మానముల్, గొల్లలు బెట్టుదంట మరుగూరిమి
గాంచినమేటి . .
ముకుంద. 1. 51 పొ 3 పం

చం. ... అనంగుని మామవెలుంగుసోనఁ దీఱిన
కలువాఁడితూపుఁ గికురించిన యోరమిటారి
చూపునన్ ...  సారంగ. 2. 118

3. శ్రేష్ఠురాలు, శ్రేష్ఠము.

ద్వి. చెలులలోన మిటారి చికిలికటారి ..
ద్వి. నల. 1 573

గీ. ఒరపులకు నెల్ల నొజ్జయై యుండె నపుడు,
భుజగగజగామిని మిటారి పొలుపు మీఱి ...
విజ. వి. 1. 76

4 వాఁడి గలది.

గీ. వారిలో వారిలోలకహారకమల, వనరట
ద్భృంగగంగఁ జేకొనిరి సురలు, మారుని
మిటారిచికటారి గౌరి యనెడు,హొంతకారి
వరించె నయ్యంతకారి.  చం. రా. 3 4.

ఉ. ... మరుఁడు . . గడిదేఱినదారి మిటారి
కల్వపూ,నేజను వైచె నద్దనుజనేతలచిత్తము
లుచ్చి పారఁగన్ ...  దశా. 2. 300.

5. ఉన్నతి గలది, నిక్కు గలది.

చం. కులుకుమిటారి గుబ్బలును గ్రొమ్ముడులున్
బిగికొనులుం బిఱుం,దులు గదలంగ ...
నీలా. 1. 39.

ఉ కోడెమిటారిగుబ్బగవ గుబ్బెత గ్రుమ్మినచ
మున్ను చల్లువో, రాడినక్రాంతి దీటఁ బుల
కాంకురముల్ చెలువారఁ గుంజరి, క్రీడల
ముఖ్యహస్తిపతికిన్ బ్రతియై జలకేళిఁ దేలి
యున్ .  ఉ. రా. 6. 106

మిటారించు అ. క్రి (√మిటారము.)

1 నిక్కు, పైకుబుకు.

ఉ . మించునొయారమున్ గులుకు నెన్నడ
యున్ విటఁబాయుకొప్పునొ, క్కించుక జాఱు
పయ్యెదయు నిట్టట్టు దూలెడు హారముల్
మిటా,రించు కుచంబులున్ జలదరించు
వలగ్నముఁ బొల్పు మీఱఁగన్  కళా 3. 17.

మ. .. జిల్గుపయ్యెంటలోన్, గులుకున్నిబ్బెపుగబ్బి
నిబ్బరపుఁ జన్నుల్ బల్మిటారింపగా .
దశా 2. 351.

2 వ్యాపించు, ప్రసరించు

మ. పొడువుందిప్పు తటాలునం డిగినయంభో
జాప్తబింబంబు నం, గడ మై రత్నమరీచి వీచి
కలు దిగ్వాటిన్ మిటారింపగా .
సుద 5. 27.

3 అతిశయించు.

మ కనుగొన్నంతనె కన్యకామణికి లేఁగౌ నింత
గాన్పించెఁ జ, న్నొమ్మవలన్ నీలిమ యావరించె
ముఖపాండుశ్రీ మిటారించె ...
ఉ రా. 1. 181.

మ . . చెక్కుటద్దముల వర్ణస్వర్ణతాటంకదీ, ప్తి
మిటారింపగ నవ్వువెన్నెలలు గల్పింపన్ బురి
న్నాట్యస, ద్మములం జేరు ...
సావందో. 3. 60.

శా .. కోలుకోఁబన్నకో, లాలాపంబుల దండలాస్య
ముల నాట్యంబుల్ మిటారింపగన్.
శ్రీ. రం. మా. 6. 108.

4. విజృంభించు, చెలరేగు.

కం. బలు వైనవేసడంబులు, జలకట్టెలు నోరణ
ములు సాళ్వంబులు గి, డ్డులు మొదలుగఁ

గలవిడివేఁ, టఁపులుగులు పదముతో మిటారిం
పఁగన్. యయా. 1. 112.

5. ప్రకాశించు, ఒప్పు

మ. స్తనశృంగారరసంబు చూచుకసముద్యన్నీలి
మన్ గానిపిం, చి నవీనం బగుపూఁతకస్తురిరు
చిన్ జెల్వొంది పై నిండి జా, ఱినతద్ధార యొ
నాఁ గఁ దారొక్కని మిటారించెన్ శివద్రోమ
రా. జి. ఉ రా. 6 182

వ. క్రి అతిక్రమించు, మించు.

కం సోగమెఱుంగు కనుంగవ, రాగలవంబుఁకుఁ
బెంపు రాగఁసొంపున్, జాగుగల మోవిబంగరు,
తీఁగె మిటారించుమేను తెఱవకుఁ బొల్చున్
ముకుంద. 2 90

**మిటారింపు** వి (√మిటారించే) మిటారము,
విలాసము.

సీ. నిక్కుమిటారింపు నీటు మిటారము ..
వహోయ లనఁగ విలాస మొప్పుచుండు
ఆం భా. 1 139.

**మిటారికత్తియ(త్తె)** వి. (మిటారి + కత్తియ–
స్వార్థమున) యౌవనగర్వము గలఁయాడుది,
విలాసము గలయాఁడుది

గీ. మించు క్రొమ్మిఱ్ఱుచుగమికి వర్షించుఘనము,
కులుకు సిబ్బెంపు గబ్బిగుబ్బల మిటారి, కత్తి
యల చూపుతేంట్లకుఁ గమలవనము, జవ్వనము
సెందె వసుమతీజాని సుతుని.

చంద్రా 2. 10

ఉ. మేరులతీరులా కురుఁజుమీఁదులఁ జెక్కిన
చెక్కియుంబులా, గారుడ రత్నతోరణ ధగ
ద్ధగలా తెలిగచ్చుమచ్చులా, జేరిమిటారికత్తి
యలు పెట్టిన ముత్తెపుమ్రుగ్గునిగ్గులా. యారతి
నాతి ప్రాఁతపను లంగడిముంగిలు లాపురం
బునన్. పాంచా. 4 5.

ఉ. పెట్టెడుసొమ్ముచే సొగసు పెట్టెడు నిట్టి
మిటారికత్తెతో, వట్టడవిం జరించెదరు నాయ

పదానము లాలకింపరో .
చం రా 5 5.

చం పిలిచిన నేమి పల్కదఁట పేర్చి తటాన మిటారి
కత్తియల్, సిలిచినఁ గూర్కెఁ జిల్కదు
ముకుంద 2 128.

**మిటారికాఁడు** వి. (మిటారి + కాఁడు – స్వార్థ
మున) విలాసవంతుఁడు.

చం మినుకులు పుట్టినిల్లు మిడిమేలపుఁదావపుఁ
గన్నతండ్రిచక్కనిపన పిల్లతోడు మడికాఁపు
జోటిమిటారికాఁడు .. తపతి 1 3.

**మిటిమిటిపడు – మిట్టిమిట్టిపడు** అ క్రి (√మిట్టి
పడు) ఎగిరిపడు

ద్వి. పలుమఱు మునివేళ్లఁ బవస లెన్నుచును,
మెలిగొన్నశిఖ లింత మిటిమిటిపడఁగ, నిడు
సాఁగిలఁగ మెడల్ నిక్కించి బిగువు, సడలి ..
వల నొప్ప సారెకు వల్లించు కొనుచు.
ద్వి. పంమ 2. 126 పొ.

**మిటుకు** వి. యౌవనగర్వముచే గలుగుత్రుళ్లు.
(చూ మిటుకులాఁడి)

**మిటుకులాఁడి** వి. (మిటుకులు + ఆఁడి) యౌవన
గర్వముచే నైనత్రుళ్లు గలయాఁడుది.

వ జోడులకోలాటంబులు వేయుకైలాటపు మిటు
కులాండ్ర జాలుజడలవల్లినమల్లెపూసరుల వలఱు
గమగమవలపుల విటులకుఁ దలదిమ్ము పుట్టించు
నట్టి వెట్టదినంబులయ్యెను. ప్రబంధ. 5. 2.

**మిట్ట** వి. 1 ఉన్నతభూమి.

గీ. గట్టిపుప్పొడి మిట్టలు మెట్టిమెట్టి, యలసి
చెమటలు వాయ నోలాడఁదలఁచి, యందఱును
గూడి కొంతద వ్వరిగి యచట ...
యయా. 3. 53.

ఉ మీఁటిన విచ్చుగుబ్బచనుమిట్టల నక్రులు చిందు
వందగన్ .. మనుచ. 2. 70.

కం. కట్టుము రతిసౌఖ్యములకుఁ, బట్టము గాకున్న
ననిచివేయుము నన్నున్, మిట్టకు చెట్టుకుఁ

గాదను, నట్టివిధము సేయవలవ దవనీనాథా.
రుక్మాం 5 108, ద్వా 10 45.

2. రచ్చసావడి.

ఉ. ... వాఁడు రేఁగి మఱి పెటుదుఁ బెట్ట నన.గ మిట్టఁ గూర్చొని నిట్టు పోరఁ గనిపెటుచు నొక్కరుఁ డుండి వెడియున్
ఆము. 6. 70.

3. తీక్ష్ణమగుబాణము

ద్వి వెడవెడ తూణంబు వెడలినయట్టి, వెడవిల్తు మిట్టలవింత లై యొప్ప
ద్వి పరమ. 4. 266 పొ.

విశ. 1 ఎత్తైనది, ఉన్నత మైనది

గీ మిట్టయూ మున నిడుయోగసత్తై మెఱయ.
మనుచ. 1. 59

మ నిడుమోముం గుఱుగేలుఁ గుండగడుపు స్నీలత్వము స్మిట్టలు, న్నడుదీర్ఘంబులు నైన దంతములు ... మార్క. 1. 224.

ద్వి మట్టుపాదంబులు మలినంపుమేను, మిట్టనుదురు మక్కిమెడయును ...
పండితా దీక్షా 40 పొ.
చిత్రభా 3. 128.

2. తీక్ష్ణమైనది, వాఁడియైనది

ద్వి సరసుఁ డై గురుకృపాచార్యశిష్యులకుఁ, బరగ నమస్కారబాణంబు లేసి, యొకమిట్ట కోల నయ్యర్గకేతనుని, మహితరత్నాంకపు మహి డొల్ల నేసె.
ద్వి. భార. విరా. 4. 81

ఉ సందియ మింత లేదు పెలుచ న్నును మొగ్గల మిట్టకోలలన్, గందనకాయ నేసె సుమకార్ముకుఁ డే మని చెప్పవాఁడ ...
రాఘ. చ. 3. 147.

జ మిట్టపండ్లవాఁడు, మిట్టపండ్లు

మిట్టపండ్లవాఁడు – మిసిపండ్లవాఁడు విశ. (మి + పండు + వాఁడు) ఎత్తైనపండ్లు గలవాఁడు, దంతురుఁడు.

గీ. ... దంతురాఖ్య మిట్ట, పండ్లవాఁ డనఁ దగు ... ఆం. భా 2 121.

మిట్టపండ్లు – మిసిపండ్లు వి బ (మిట్ట + పండు) ఎత్తైనపండ్లు, పెకుబికినపండ్లు

(చూ. మిట్టపండ్లవాఁడు)

మిట్టమిట్టు వి (మిట్టు + మిట్టు) మిక్కిలి మెఱకతావు, అత్యున్నత ప్రదేశము.

ద్వి. మేటికాల్వల మిట్టమిట్టుగాఁ ద్రవ్వి ..
ద్వి హరిశ్చ పూ. 495 పం.

విశ అత్యున్నతము, మిక్కిలి యెత్తైనది.
(శ ర)

మిట్టాడు అ క్రి. (√మిట్టు) సంచరించు, తిరుగు.

సీ. అంగళ్లయందు మిట్టాడ మానిసి లేక గుడియుఁ బాడును జిక్కఁ డిడియె ...
కాశీ. 5 267.

శా మిట్టాడంగ నరుండు లేనియడవిన్ మీనాక్షి దీనాకృతిన్ ... మనుచ. 4. 68.

కం. కట్టి తనమాఱుగా న, ట్టిట్ట గృహస్తంభమునఁ బ్రతిష్ఠించి నరుల్, మిట్టాడనియా బెడిదపు, నట్టక నడురేయి మబ్బునం జెలిచని యెన్.
వేం. పంచ. 1 259.

మిట్టించే అ క్రి (మిట్టు + ఇంచు, స్వార్థమున) మీఁది కెగయు, పై కెగురు

సీ. ఎడనెడ మిట్టించి పడుమీలబెళుకుల కులికిపాటొదవఁగ నోసరిలుచు ...
కళా 6 228.

వ ఒక్కచక్కి శుక్తికబరోదరంబులు నయనోత్పలపణంబులం బొట్ట వెంచుచు నిట్టలంబుగ మిట్టించు కీలానిలసమూద్ధూత నూతనశీకర నికరంబువలన వలినభభాండంబునకుఁ గర్పూర కరండభావంబు నుత్పాదించుచు ...
పాండు. 3 150.

2 ఉబుకు, నిగడు.

కం. దట్టపుఁదుఱుమును మీఁదికి, మిట్టించిన చన్నుఁ

గవయు మిఱుమిఱుచూడ్కుల్ ...

భాగ. 9 608.

2. అతిశయించు, అధికమగు.

ద్వి మిట్టించి వేడిమి మీఱ కాటఁ గాయఁ, గట్టెండ తాఁకునఁ గమలె దేహంబు ...

ద్వి హరిశ్చ పూ 693 పం

**మిట్టిపడు** అ క్రి. (మిట్టు + పడు. ఇది కొన్ని యెడల పదాంతరవ్యవధానముతోఁ గానవచ్చుచున్నది.)

1 ఎగిరిపడు

కం. కరిగొంతంబులఁ గొని వడిఁ, బొడిచిరి కుంతధరు లుగ్రఘోరిబలంబఁ జేర్పడ హయగ జభటతతి వ్రాల్పడి పడి బ్రుగ్గఁ బడి మిట్టిపడ రథసమువన్ కు వం. 11. 718

చం. .. నిజాంతరోదకముల వేఁడిమి దెరలి పద్దయు మిట్టిపడంగ మీనముల్ .

చంద్రా. 2 24

సీ. పనిలేనిపని మిట్టిపడు మనోజపతాక ప్రల్లదంబునఁ దన్ను వెల్లిఁ బోవ ..

వరాహ. 4. 21.

సీ అర్జునుండను నేనె యని తెల్పినంతనే మిట్టి మీనై పడె మెలఁతచూపు ...

విజ వి 3. 12.

2. అదరిపడు ఉలికిపడు, — భయాదులచే చలించు

కం. ఉట్టిపడునట్టివర మీఁకట్టిఁడి న న్నెట్టువేఁడెఁ గటకట యనుచున్, మిట్టిపడి యతఁడు మదిలోఁ, బుట్టినతల్లడముతోడఁ బొక్కుచు నుండెన్. భాగ. 6. 516.

గీ. అనుచు నక్కునఁ జేర్చు బట్టలఁత నూర్చుఁ, గన్నుగవ నద్దుకొని కుందు గాసినొందుఁ, గలవరించును దల వంచుఁ బలవరించు, మిట్టిపడు నుత్తరీయంబు ముట్టి పలుకు.

రామా. 5. 281.

ఉ వెక్కిగ మందమారుతము వీవఁగఁ దోడనె రాలెఁ జై విరుల్, మిట్టిపడగ వీఁడె దపిలెం ఒధికుండడకొత్తలోనిపోఁకట్టుఁ నడచు ..

సారంగ 2 169.

3 గర్వముచే త్రుళ్లు, ఎగసిపడు

ఆ. జయము లపజయములు సంపద లాపద, లనిలచలిత వీచికాంచలములు, చంద్రకళలు మేఘచయములు దరఁగలు, మెఱుఁగు లదుః వచ్చి మిట్టిపడకు. భాగ. 8 163

సీ, తల కులుపా చాల దని మిట్టిపడఁగ ననామధేయపుదైత్యునకు నడఁగి ..

ప్రభా. 1. 79.

కం. మిట్టిపడి లేచి వన మొగి, బిట్టుబయలుగాఁగఁ జెఱుకుపవనతనూజున్, గట్టలుకఁ జూచి దిక్కులు వెట్టట్టగఁ జాఁటి సిత కిట్లనిరి ...

భా. రా సుం 336.

గీ. అనుము నాకేలు పట్టినయప్పు డధిప, యేమి చెప్పుదు నానెగు లీశ్వరుండ, యెఱుఁగు నాసిగ్గుఁ గాఁచువా రెవరు లేక, మిట్టి మీనై పడుచెనంటి నిట్టులంటి.

సారంగ. 2. 227.

గీ. మెల్లనె కళావతీసతి మేలుకాంచి, ప్రక్క వేఱొక్కమగఁడున్న జాగుఁ దెలసి, యక్కయిది యేమిచోద్యమో యనుచు మిట్టిపడి కాలిక యై యొండుకడకుఁ జేరి.

శుక. 1. 223.

సీ. మిట్టిపడుచె కాని మీనము ల్పమములా కువలయంబుము ఱుంగుఁ గోరియున్న ...

బహు. 5. 53.

(ఇది మొదటి యర్థమునకుఁ గూడ నుదాహరణము.)

**మిట్టిపాటు** వి. (√మిట్టిపడు) మిట్టిపడుట.

ద్వి. నీమిట్టిపాటును నీరాజసంబు, నీమదంబును నుబ్బు నేలతోఁ గలయ ...

ద్వి. హరిశ్చ. పూ. 1280 పం.

సీ మత్స్యవల్లభుఁ బట్టి మాన్పించె మిట్టిపాటం గేశుఁ దనుబలాధ్యతుఁ జేసి ...
రా. వి. 275.

వ. ... తద్విలాసదిదృక్షాగరిమంబు వశీకరించి యతుడ్రస్యదంబున నెగసి తద్విభవంబునకు వెఱచి మరలం బాఱుతీరున నుద్వర్తనాపవర్తనంబులం బరఁగుచేడిసమీలమిట్టిపాటు లతికౌతుకంబు వుట్టింప ... చంద్రి. 4. 68.

మిట్టిమిట్టిపడు – మిటిమిటిపడు అ.క్రి. (√మిట్టిపడు) ఎగిరెగిరిపడు.

వ. ... తెగిపడియు నంకుశంబులు విడువక మిట్టిమిట్టిపడుబాహువులు ...
భార. ద్రో. 1. 377.

చం ... జాలరిచేవలఁ జాసి ధాత్రిపై, నటునిటు మిట్టిమిట్టిపడు నంబుచరంబులువోలె వత్తఱిన్.
మనుచ. 5. 81.

మిట్టు అ క్రి. ఎగురు, ఉత్పతితమగు.

చం. ఇరువురునీలనీరజనిభేక్షణ లించినవేడ్కతోఁ బరస్పర మెగిరించి కాంచనవుబంతులఁ దచ్చన వాటు లాడఁగా, ధరణిపుఁ డడ్డ మై చనుడుఁ దద్భుజదండముఁ దాఁకి మిట్టి బిట్టురవడిఁ జెందు క్రమ్మఱిన నుబ్బర పోయిరి కామినీ జనుల్. నైష. 3 95.

కం ... వేఁటొక్కఁడు మిట్టితటాలున, నొక్కని కనుకోయి మూయు నొక్కఁడు నగఁగన్ ...
భాగ. 10 457.

వి (బ మిట్టులు,మిట్లు) 1. ఉత్పతనము, ఎగిరి పడుట. చూ (మిడిమిట్లు)

2. చలనము. (చూ. మిఱుమిట్లు)

జ. మిటిమిట్టిపడు, మిట్టాడు, మిట్టించు, మిట్టిపడు, మిట్టిపాటు, మిట్టిమిట్టిపడు, మిడిమిట్లు, మిఱుమిట్లు, మిఱుమిట్లుగొను, మిఱుమిట్లుగొలుపు, మిఱుమిట్లుపోవు.

మిఠాయి వి. (సంగీత.) ఒకస్వరస్థాయి.

ద్వి భజవణి తవణియు భరణి మిఠాయి ... ఆదిగానొగయు తాయములు, దళుకొత్త ...
బస. పు 3. 938 పం.

మిడమిడ వి కోపముతో చూచుటయందలి యను కరణము.

ద్వి మిడమిడ మిడికెదు మేలువో కడవఁ, గుడిచి నార మె పండుగలఁ బ్రబ్బములను ..
పండితా. పురా. 115 పా.

ద్వి. మిడమిడ మిడుకుచు మిఱుమిండఁ డనిరొ...
బస. పు. 4. 729 పం.

మిడి[1] వి. (క. మిడి) 1. గర్వము, మిడిసిపాటు.

సీ. పరివారకూన్యత వాటిల్లుటను బంధుమిత్ర సహాయులు మిడి యడంగఁ, జచ్చుట ...
భార. శల్య. 2. 64.

గి. మఱియుఁ గొందఱు నీచేత మడిసి రందు, మిడి యడఁగఁ జొచ్చి తమసూడు దడవ లేరు ...
ఉ హరి. 5. 295.

2. కాంతి, జిగి.

చం. మిడిగలవజ్రపున్ రవలమిన్కులకమ్మలు జాతి కెంపుజూ, కడియములున్ ... సొగ సొనసఁ దాల్చి నృపాలు కేశికిన్, నడచె వధూలలాను ...
హంస. 3. 4, హంస. 4. 79.

విణ. గర్వితుఁడు. మిడిసిపాటుగలవాఁడు.

కం. ఒప్పర మిడి సతికిం గల, యొ ప్పెఱుఁగఁడు...
దశకు. 7. 71.

2 ఉన్నతము, ఎత్తైనది, గొప్పది, పెద్దది.

ఉ ... గందపుఁగొండగాడ్పుచే, నల్లికబిల్లికన్ దనరునామిడి మామిడిక్రింద ఘూమిభృత్తల్లజుఁ డల్లజాలరివిధంబునఁ బొంచి హరించె డెందమున్ . . కృ శకుం. 2 220.

చం ....పోఁగులు మిడిపిండ్లు బండగులుఁ గొమ్ములుఁ బాదులు వల్లెత్రాళ్లు ... చంద్రి 2. 21.

సీ. భావజుమిడివింటఁ బాఱునీలపుగుండ్లభంగిఁ జలించు పుష్పంధయములు ...
ప్రభా 3. 35.

సీ. ... నల్లమెఱుఁగు, వన్నెలు పింగాణి కన్నులు తిరిబోమల్ మిడిదేగచాలు మిద్దె జుట్లు ... ప్రబంధ 132

3. పై కుబికినది.

ద్వి. నిడుదకోఱలు మేఘనీలదేహంబు, మిడుగు ఱుల్ రాలెడిమిడి కన్నుఁగవయు ...
రం. రా. ఉ. 20 పా. 21 పం

ద్వి మిడిపండ్లు చెక్కిటిమీఁదిపుల్పిరియు, ఒడి ద్రేలుచన్నులు బడఁబాకినోరు ... గలిగి . .
ద్వి. హరిశ్చ. ఉ. 1085 పం.

4. తీక్ష్ణమైనది, వేడియైనది.

సీ మిడియెండవలె నుండువడినింద మైఁ జెందు నుడుకువెన్నెలకాఁక లోర్వరాడు ..
ఇందు 2. 12.

జ. మిడికాఁడు, మిడిగ్రుడ్లవాఁడు, మిడిగ్రుడ్లు, మిడిదల, మిడినాగు, మిడిపండ్లవాఁడు, మిడి పండ్లు, మిడిమిడిమేలకు.

మిడి² వి వేఁటసాధనము.

ఆ. ఉరులు జిగురుఁగండె దెరలును బోనులు, వాఱువాఱెనలును వసులు గనులు, మిళ్లు వలలు పేట్లు గోళ్లు దిమంబులు, నాదిగాఁగఁ దెచ్చి రాటవికులు.
వి. శకుం. 1. 116

జ. మిడిబద్ద, మిడిబోను.

మిడికాఁడు విశే (మిడి²+కాఁడు, స్వార్థమున) గర్వితుఁడు, మిడిసిపాటుగలవాఁడు.

సీ విప్పగుబొమ్మతో వెడవిల్లుబూనిన మిడి కాఁడు ముక్కంటి మిగుల వెలిఁగె
అచ్చ. భా. 4 71 పా

మిడికించే స. క్రి. (√మిడుకు) 1. త్రిప్పు, చలింపఁజేయు.

సీ గ్రుడ్డులు మిడికించుకొని దప్పి కిమ్మను దమ వారి నొక్క బేతాళమాళి ....

గీ. నొసలు ముక్కించు నావుర్న నోరు దెఱచు, గ్రుడ్లు మిడికించు రాగంబు గుమ్మడి(రి?)ంచు. పొడుగతులకుఁ దనుదాటె పరగి యాడు, నల్లయాతండె వో తూర్పు నాఁటిగడిఁడు
క్రీడా. 226., శుక. 2 30.

2 మండించు, కాలుచు

సీ మేన వెంటులు చుట్టి పై నగ్ని తగిలించి మిడి కింపఁ దగు నని మిడుకువారు ...
ద్వా 3 58.

మిడికిపడు అ. క్రి. (మిడుకు+పడు, స్వార్థమున) పరితపించు, పరితాపము నొందు.

అ. వివిధమహిమ ననుభవించుచునుండియు, మండు జఠరవహ్ని మాన్ప కాని, దప్పితోడఁ గూడి నొప్పింపఁ గన్నులు, మేను దిమ్ముఁ దిరిగి మిడికి పడుచు వరాహ. 12 64.

మిడిగ్రుడ్లవాఁడు విశే. (మిడిగ్రుడ్లు + వాఁడు) ఉన్నేత్రుఁడు, మిట్టగ్రుడ్లవాఁడు.

సీ. మిడిగ్రుడ్లవాఁ డన మీఱు నున్నేత్రుఁడు ...
ఆం. భా. 2 121.

మిడిగ్రుడ్లు వి. బ. (మిడి¹+గ్రుడ్లు) మిట్టగ్రుడ్లు, పైకుబికిన కంటిగ్రుడ్లు.

సీ కుఱుచచేతులు మిడిగ్రుడ్లును గడుకొన్నతఱ టులు మటి చెంచుదలలు నమరఁ, దడలిండ్లు నేసట్టి దడయక యెఱుకులై యార్చుచు ...
భార. అర. 1. 300.

సీ. పండులు గోఱుకుచుఁ బదరి వాలు మ్మని మిడి గ్రుడ్లుల నిప్పులు గ్రుమ్మరిలఁగ ...
హరి. పూ. 5. 149.

సీ పిల్లికన్నులఁ బోలు పింగళాక్షములందుఁ గ్రూరంబులగు మిడిగ్రుడ్లతోడ ...
కాశీ 5. 110.

మిడిదల వి. (మిడి¹+తల) పెద్దతల, శిరస్సు, తల.

కం. ఈ మెఱుగుగండకత్తెర,చే మిడిదల యిచ్చు సాహసికుఁడు శిరం బ,ల్లే మగుడఁగ నుతుకు కొనం, గా మని చంపుఁ దనుఁ జంపఁ గడఁ గినవానిన్. కళా. 6. 48.

కం. గుడి సొచ్చి నాకు సాఁగిలఁ, బడి మ్రొక్కుచుఁ బలికె నెన్నిభంగుల నైనన్, బడఁతుక యిది నా కబ్బిన. మిడిదల యొప్పించి నిన్ను మెప్పింతుఁ జుమీ. ద్వా 4. 51.

**మిడినాగు – మిణ్ణాగు** వి (మిడి¹ + నాగు) ఎగిరి యెగిరి పడు సర్పవిశేషము

మ అకటా తమ్ముఁడ! గాలివేగమున ద్రాయస్లేని పక్షీంద్రుకార్యాకిక లోనై మిడినాఁగుకూనలకు జాలి న్బొందుగాలి న్గకా,పికలై విచ్చుమనోజ ఖల్లములకు న్భీతిల్లుచుత్తంబు సా,టకి రాఁ గేఁదె హేషపేఁ ఖరఘోటిఘోటకవ్రాతముల్. చంద్రా. 1 29

**మిడిపండ్లవాఁడు – మిట్టపండ్లవాఁడు** (మిడి¹ + వాఁడు) (శ ర.)

**మిడిపండ్లు – మిట్టపండ్లు** వి. బ. (మిడి¹+పండ్లు) ఎత్తైనపండ్లు

సీ బొక్కిరొమ్మును నూఁదబొడ్డును మిడిపండ్లుఁ దెబ్బనోరును వాఁచి దేబమొగము ...
భల్లా. 4 (శ. ర)

**మిడిబద్ద** వి. (మిడి²) వేఁట కుపయోగించుసాధన విశేషము.

తరళము. వలలు బోనులు చిక్కముల్ పెను వాతి కత్తులు బల్లెముల్, బలుతుపాకులు వాగురుల్ మిడిబద్ద లీఁటెలు దీములం,బుల పొదుల్ ..
రామేశ్వరమాహాత్మ్యము. 5 79.

**మిడిబోను** వి. (మిడి¹ + బోను) మృగములు లోనగువానిం బట్టెడు కపటయంత్రము.

కం. మిడిబోనులఁ గాలుచ్చులఁ, బడఁదోలియుఁ బోగు లోనుపఱచియు తేర్లన్, వడిగలజింకల నెల్లన్, బొడిచిరి కడుఁజెంచు లాబువులఁ బద లదరన్ యయా. 2 19.

**మిడిమిట్లు** వి. బ. (మిట్లు + మిట్లు) మిక్కిలి మిట్టుటలు.

గీ. పసుపుతేగురుకొంటకచ్చుమిసిమి దేబు, మిట్ట కనుగ్రుడ్లు మిడిమిట్లు మిడిసిపడఁగ ..
వేం. పంచ 3 134.

**మిడిమిడి** వి (మిడి¹) పరితపించుటయం దనుకరణము

కం కడుపునకుఁ గూడు గానక, పడి మిడిమిడి మిడుకునట్టిబరుగున కీ య్యా,బడి యమరత్వం బేఁటికిఁ, గడు పిటు గాలంగఁ గంటఁ గాటుక యేలా. ద్వా. 1 86

విశ 1 మిక్కిలితీక్ష్ణము

చం మిడిమిడి యొండకొట్టునను మేనులు పెట్లుచు నుండ .. వాల్మీ 2. 90.

2 మిక్కిలి అల్పము.

(వ్యవ.) వానికి సాహిత్యమున మిడిమిడిజ్ఞానమే గాని పాండిత్యము లేదు.

**మిడిమేలము** వి. (మిడి¹+మేలము) 1. గర్వము, మిడిసిపాటు

సీ మిడిమేల మేమి మామిడి నెక్కఁ గలవకే ...
ఉ. హరిశ్చ. 3 31.

2 ఉపద్రవము, కీడు.

కం ఈలీల నుండి మన మిటు, మేలము లాడంగ నేమి మిడిమేల మె యం, చాలో సత్య సుభద్రహి,తాళుల కిసుమంత యారహస్యము c దెల్పెన్ విజ. వి. 3. 36.

విశ 1. మిడిసిపాటుగలది, గర్వితము.

కం.. మిడిమేలపుదొరను గొల్చి మిడుకుటకంటెన్, వడి గల యెద్దులఁ గట్టుక, మడి దున్నుక బ్రతుక వచ్చు .. సుమతి 4.

గీ. వీటిలో మిడిమేలపువిటునివిధము, సాఁగరఁ గొన్నాళ్లు నిజపితృసంచితంబు, బొల్లుఁగాఁ జల్లి యది యెల్ల సళ్లుటయును, దల్లడిల్లుచు దుర్మార్గతల్లజుండు. ప్రబంధ. 675.

2. ఉపద్రవకరము, బాధకము.

ఉ. గామిడిదైన మీవితముగా మిడిమేలపు సేఁత నిర్దయన్, సీమలు గానిసీమలకుఁ జెల్వుఁడ యేఁగఁగఁ దెచ్చె నక్కటా ...
శశాం. 2. 133.

గీ మితి లేనియీమిడిమేలంపు మెకములు పకియల
ఒలగమే జనని నీకు ...
ఉ. రా. 6 273.

వి. మిడిసిపాటు (శ. ర).

**మిడియ** వి వేదవాక్యము.

కం. తలఁచి యపు డందొ కింతయుఁ, దొలుతటి
తరవాతిమిడియఁ దోఁచక మఱి యెవ్వల
వంసిన శ్రుతిశబ్దము, పలుకుపకున్ రాక వెకడు
పఱఁచినఁ గలఁకన్ ... పరమ. 2 112

(శ ర. పా తరువాయి మఱియు ముద్రిపా

**మిడియు** అ క్రి 1 తీక్ష్ణమగు

గీ మిడియనెండ గాయ జడివాన గురియఁగ, సీతు
గదుర వృక్ష జాతు లలర, నగ్నిలోన బయల
వప్పుల నప్సరో గణముల్రమోలఁ జేసెఁ గడంది
తపము. కకు. 1 104

2. పై కుబుకు

సీ పఱిచుంచుఁదలలును బరదులు దబ్బర మిడిసిన
గ్రుడ్లులుఁ బడఁకు చెవులు ...
కు. సం. 6 694

కం . వడి నెగసి హస్తతలమునఁ, బిడుగుగతిన్ జరువ
నెత్రు పెల్లై గ్రుడ్డుల్, మిడిసి తల పగిలి తుర
గము, వడునాలుక గఱచికొని రణస్థలిఁ
బడియెన్. భా. శా. యు. 989.

3 భయాదులచే నెగసిపడు, అదరిపడు.

చం. . భూతముల్ మిడిసె భైరవుఁ డుల్కె
విధాత వెగ్గిలెన్, బనివడిఁ దేవ్పఁ దేవ్ప నల
భర్గుని కౌఁగిట దుర్గ మూర్ఛిలెన్ ...
కకు. 2. 133

4. మిట్టు, పై కెగయు

కం. ఆ పిసినిసక్క చాపము, కోఁ పంగిట నిరికి
నరముఁ గొరికిన రభసం, బేపార మిడిసి మక్కని,
రూపణ మొనరింప నక్క రోఁజుచుఁ గూలెన్.
వేం. పంచ. 2. 109.

సీ. చూపి వేసినవేగ చోపి తేసినపుల్లు మీఁదుగా
మీఁదనే మిడిసి పడఁగ .. కకు. 4. 68.

వ కేళికురాఁకుఁబున రేణుకళిపంయుఁ గఱు
కుక్కనం దెగనఱికినఁ పల మిడిసి యల్లంతటం
బడియె ... దశా. 6. 85

6 తూలు.

క: అవి యాతనిపై తోలును, నవియించగ లేక
మిడిసి యల్లబు వడఁ జూఁచి వనేచరు లేచిన
వెఱ. దవిలినమతి నద్ది రయ్యాదయ్యాం ఒనుచున్.
మనుచ 4. 102.

జ. మిడిపోవు, మిడిసిపడు, మిడిసిపాటు

**మిడిపోవు** అ క్రి (√మిడియు) తప్పు, తప్పి
పోవు, శేషించు

సీ అదుష్టవర్తనుఁ డప్పటితుడకు విజాపఁ పుత్ర
మిత్త్రాదు లొకఁడు, మిడిపోక కలిలో మతి
యుట యూహించి వగచుచు ...
రాఘవ. 4 287.

గీ. వనము గాచెడిరాక్షసవర్గములను, దండి నొకనిని
మిడిపోవకుండఁ బట్టి, మేటిభుజ శక్తి నందఱుగీ
టడంచి, వాలి యన్నాఁడు సాహసవంతుఁ
డగుచు. మొ. రా. సుం. 128.

2. క్షీణించు, తగ్గు.

ద్వి మిగుల మెచ్చియు వాఁడు మిడిపోని కడిమి,
బెగడొందఁ బెడచేతఁ బెనుజూల రువ్వె ...
ద్వి. హరిశ్చ. పూ 2120 వం

**మిడిసిపడు** అ క్రి. (√మిడియు) 1. మీఁది
కెగయు, ఉత్పతితమగు

కం బెడిదపు మదనజ్వరమున, మిడిసిపడున్ హార
లతలు మృగలోచనకున్ ... నరస. 3. 60.

వ ... మిడిసిపడుమీనుకరణి నీట ముంచి విడిచిన
సొరకాయ యెగసిన నిక్కున ...
ప్రబంధ. 788.

2 (కోపము గర్వము మొ. చే) త్రుళ్లు, మిట్టిపడు.

సీ పదము లొత్తెద నంచుఁ బతిజంఘికలు దన
తొడలపై ద్రేసికో మిడిసిపడుమ ...
హంస. 3. 201.

అదనుచు నహం, కారంబున మిడిసి పడితి గ్రమ్మరనే జని బం, గారముం బోలెడు కొడుకున, కేరూపున నైనం బాపు మీసంకట మున్. హరి పూ 5 245

మిడిసిపాటు వి. (√మిడిసిపడు) మిట్టిపాటు, గర్వాదులచేఁ గలుగుత్రుళ్లు.

(వ్యవ) ఈచిగిరింత యైశ్వర్యమునకే యింత మిడిసిపాటా.

— మిణుఁగు వి దుఁగుబు.

మ .. కృష్ణుఁడు .. ఉద్ధతశక్తి న్వడి ద్రిప్పి మింట మిడుఁగు ద్దిట్టంబుగాఁ బర్వను, న్నతచం చద్గద వైచి త్రుంచె ..
భాగ. 10 ఉ. 909. (చి ని. పా.)

జ. మిడుఁగుఱు, మిడుఁగుఱుఁబురువు.

మిడుఁగుఱు — మిణుఁగుఱు వి (√మిడుఁగు)
1. విస్ఫులింగము, అగ్నికణము.

కం. మిడుఁగు అని తలఁచు బాలుఁడు, మిడుఁగుఱుఁ బుర్వుఁ గని ... వృసిం 4. 159.

చం. మెఱయుచు నుశ్నవజ్రహతి మేరుతటంబున రాలువమ్మిడుం, గుఱు లన విస్ఫులింగములు కుంభునిముష్టి విఘట్టనంబులన్, వఱలుచు వాన రోత్తముని వక్షమునన్ వెడలె న్సముద్ధతిన్, మెఱయు ప్రతాపపావకవినిస్సుకహేతికణం బులో యనన్. భా. రా యు 1216.

చం. .. అం. దఱను గడంగి పట్టుకొనఁ దద్దయు డాసిన జూడ్కులన్ మిఱుం, గుఱు లెన'గంగ వక్త్రమున' గోపము చండిక దాల్చె .
మార్క. 6. 162.

2. (క. మిణుకు. త. మిన్మిని) ఖద్యోతము, మిణుఁగుఱుఁబురుగు.

గీ మిన్నమిడుఁగుఱు లై రెండు మెఱచుచున్న, మెఱుఁగు లౌకపుట్టలో నున్న నెఱుఁగ కేను, బుట్టఁ గ్రొప్పించి యారెంటిపాడవు గాన, కుడిగి వచ్చితి విస్మయపడి మనమున.
భార. అర 3. 179.

మిడుఁగుఱుఁబురువు — మిణుఁగుఱుఁబురువు వి. (మిడుఁగుఱు + పురువు) చీకటివేళ తళతళ మెఱయుచు నెగురు ఒకజాతిపురుగు, ఖద్యోతము

ఉ. ...వజ్రపంక్తిఁ బో,ల్చారు మిడుంగుఱుంబురువు. లంచు వెసం గొనిపోయి పొంతకృం, గారవన ద్రుమాళి గిజిగాఁడులు గూడులఁ జేర్చు దీపికల్ గా . మనుచ. 1. 36.

మిడుకు అ క్రి (క. మిడుకు త. ముడుక్కు.) త్రుళ్లు, ఎగిరిపడు, గర్వముచే మిడిసిపడు.

గీ అదియుఁ గాక విశేషించి యరయ బుద్ధి, గలుగునట్టి సాధవములు గారె మీరు, మృత్యువున కట్లు గావున మెలఁగ మిడుక, నీక పొరగొన వలయు మి మ్మెల్లభంగి.
భార. అను. 1 19.

చం. మిడికెడు వాసుదేవుఁ డన మీఁదు దలంపక యాదవుం డొకం, డుడుగఁడు ..
ఉ. హరి. 3 47.

2. కదలు, చలించు

కం. మిడికెడిఁ బెదవులు వ్రేళులు, మడఁగెడుఁ గనుదోయి మొగిడె మా యెదురఁ గడున్, వెడవీఁక యొడలు చేసెదు, కడపల జపమునకు నేఁడు గలదో లేదో. ఉ హరి 4. 44.

ఆ. అమ్మహీరుహంబు నదరంటఁ దాకిన, నొచ్చి, పంక్తిరథ తనూభవుండు, మూర్ఛవచ్చి యంగములు శిథిలంబు లై మిడుకలేక పుడమిమీఁదఁ బడియె నిర్వ. 10, 28.

3 సంచరించు.

గీ పొలుచుసౌవర్ణపురి గని భూపసుతుఁడు, మెచ్చి వర్ణించుచును దానిఁ జొచ్చి యందు, మిడుక మానిసిఁ గానఁ డప్పుడు మనంబు, గరము విస్మయ మందంగఁ దిరిగి తిరిగి.
మార్కం. 2. 261.

శా ఏ నేదిక్కునఁ బూతునో యనుచు నెంతేభీతి వారాసిలో, మీనం బై మిడుకంగఁ జొచ్చితివయో మేలే హరీ ... దశా. 1. 297.

4 పైకుబుకు

కం విడు నాథ మని హరిం గవ్వడిన్ వడిజంక నిలికి వాయుతనూజుం, బిడికిటం బొడిచిన గ్రుద్దుల, మిడుకం గొడసి కాలు చెయ్యి మెదలం కున్నన్ జై. భా. 5. 26.

5 ఎంతపించు

కం. కడు పెట్టిదుండు కాలుండు, మిడుకు మిడుక నపహరించు మీ రీయాసల్, విడువుండు బాలునికి సుగతిం, ఒడయుండు దానాదులైన ఒహు ధర్మములన్ భార. శాం 5. 370.

కం తడ వాయె నేమి సేయుదు, నెడవాయని సఖులతోడ నెందున్నాండో, కొడుకు కాంకలి గొనె వంచున్, మిడుకు దయోపేత మాత మృదువాగ్జాతన్. విరం 2. 80.

కం. విడనాడం జూచి మును పిడు, గడిచినతనిం గొలువిం జూండి నట్లగుటయు న,క్కడ నుండ కేంగె మదిలో, మిడుకుచు భాగీరథీసమీపంబు నకున్ జై భా 4. 70.

6. మండు

ఆ అచట భూమిపాలుం డాక్రియ నిచ్చుట, మిడుకు నగ్నిలోనం బడకమున్న, యతని యొండు లెప్పు దర్భంబులను నిండి, యుండునట్లు వరము లిందు చాలు ద్వా. 7. 105.

7 ఎండు, శుష్కించు

ద్వి మునినాథ నేం బోయి ముద మొప్పజలము, గొని వచ్చునీలోనం గత్తుక మిడికి, మునికుమారుండు దాహమునం జచ్చె నేని, యనఘాత్మ మఱి బ్రహ్మహత్య సిద్ధించు. ద్వి. హరిశ్చ. పూ 1810 పం.

8. కోపముతోం జూచు.

ద్వి మిడమిడ మిడికెదు మేలువో కడవం, గుడిచి నారమె పండుగులం బ్రబ్బములను ... పండితా. పురా 115 పా.

ద్వి. మిడమిడ మిడుకుచు మిరుమిండం డనియె ... బస. పు. 4. 729 పం.

9. బ్రదుకు, జీవించు

→ మంమ పిగిలి కేతుమంతుండు గాంతేయు, పైకిం గవిసి యతనిబాణశిఖల, బ్రమసిపోయెం గసంగి మంటలో నుఱికిన మిడుతవోలె మెంగ మిడుక లేక భా. భీష్మ 2 62.

వ. .. అట్లు హాలాహలదహనంబు జగంబులం గోలాహలంబు సేయుచున్న సమయంబున మెలకు సెగల మిడుకంబాలక నీ తైన దేవతలును భాగ. 8 216.

10. తూలు.

ద్వి కాలానిలావర్తగతి కానంబడంగం, గాల చక్రాకృతి గలచక్ర మెత్తి, పెడచేతివాటునం బ్రభుమ స్తకము, మిడుకుచుం బడ వానిమెడ ద్రుంచివైచె.

రం. రా ఉ. 16 పా 2 పం.

వి 1. జీవము. (చూ. మిడుకుమాలు).

2. మిడిసిపాటు, మిట్టిపడుట.

వ. ... కడలిరాముద్దుకొడుకు మేనల్లుని దుడుకు నడకల మిడుకలకు వెగులుపడి ... శుందు. 4. 37.

జ. మిడికించు, మిడికిపడు, మిడుకుమాలు, మిడుమిడుకను, మిడుమిడుకు.

మిడుకుమాలు అ క్రి. (మిడుకు + మాలు) చచ్చు.

సీ .. నూతు, నొరువదేనమ్ములం దురగచతుష్కంబు మిడుకుమాలంగ నేసి మిన్ను ముట్ట నార్చిన ... ఉ. హరి. 3. 53.

మిడుగు వి చీలమండ, గుల్ఫము.

ద్వి. ... శ్రీరంగనిలయార్చకుండు, మిడుగుల నొరయుచు మించుపింజియల, బెడంగుల వెలులు గాన్పించుదోవతియు, నుత్తరీయంబుగా నొక కొంత వైచి. ద్వి. పరమ. 4. 317 పా.

ద్వి. గన్నేరుపూచాయ గలసిరుకావి, వన్నియ పుట్టంబు వదులుగాం గట్టి, మిడుగుల నొరయ నామీంద జింజియల, మడిచేరు చెఱివి. ది . పరమ. 4. 284 పా.

జ. మిడుగుకాయి.

మిడుగుకాయి వి. (మిడుగు + కాయి) కరినశిల.
సీ. మిడుగుకా యన సూదికాయి యనఁగను గరినశిలాఖ్యయా ... ఆం. భా. 2 20

మిడుచే స క్రి. 1. (వ్రేళ్లు) విఱుచు, (నెటిక) విఱుచు

ఉ చూచుచుఁ జేరి వ్రేళ్లు మిడుచుచుం దల యూచి తత్తరమైన యాచపలాక్షి ముక్కు పయి నంగుళము ద దియించి .
భా. విరా 2 856

కం కడుభక్తి నంబి పిలిచిన, నొడఁబడి యోయనినభంగి నోంకారవిభులన్, నొడువులు సెప్పిన వ్రేటులు, మిడిచిన శివుఁ డట్టివారి మెచ్చునె చెపుఁడా. శివ సా. 484.

కం చట్టలు చరుచుచుఁ బలుమఱు, జెట్లు మిడుచుచు దివంబు చేతుల విరియఁ, దట్టుచుఁ గాటుక కన్నులఁ, జుట్టివ్రజ నెల్ల నతఁడు సూచెన్ గలయన్. దశకు 4. 48.

2. ద్రవద్రవ్యమును బొట్టుబొట్టుగా నిచ్చు, కొంచెముకొంచెముగాఁ బెట్టు.

గీ పెరువుపా లింట నేడ్చినబిడ్డ కైన, మిడువ లే దెల్ల దానను జెడితిమి ...
హరి పూ 5. 219.

మిడుత వి (క మిడత, మిడిత) శలభము, ఒక విధమగు ఎగిరెడు పురుగు

గీ ... మిడు తన శలభంబు చను ..
ఆం. భా. 2. 95.

ఆ. ... మంటలో నుఱికి, మిడుతవోలె మెలఁగ తుడుక లేక .. భార భీష్మ. 2. 62

చం. మిడుతలపిండువోలెఁ గడు నిక్కిలిగాఁ బలుమూఁకఁ గూర్చె యె, ట్లడరితి నీవు దావదహనాకృతి హరి ఉ 2 127.

చం శార్ఙ్గితోఁ, బెనఁగుట మంటలో మిడుత బీరము సూపుటగాదె దుర్మతీ ... ఉ హరి. 8. 14.

మిడు(కు)మిడుక(కుమ)ను అ క్రి (మిడుకు + మిడుకు + అను) తేజోహీన మగు, (దీపము చిన్న దగుటచే) కొంచెముకొంచెముగా కన్పడు

కం పాతేటిరాచకన్నియ, మేలారెడు చూపు లేక మిడుమిడుకంచున్, జాలిం బురపురఁ బొక్కుచుఁ, దూలిరి రక్కసులు కీడుదోఁచిన నధిపా
భాగ 8. 290.

(పరితపించు అని శ ర)

(వ్యవ) దీపము మిడుకుమిడుకు మనుచున్నది.

మిడు(కు)మిడుకు వి. (మిడుకు + మిడుకు) కాంతి సన్నగిలుటయం దగుననుకరణము (చూ. మిడుమిడుకను)

మిణకరము వి వనిమియుఁ దోఁచక భ్రమించుట (శ ర.)

జ మిణకరించు

మిణకరించే అ క్రి. (√మిణకరము) వమియుఁ దోఁచ ! భ్రమించు (శ. ర).

మిణుఁగు – మిడుఁగు (శ. ర.).

జ మిణుఁగులు, మిణుఁగులుఁ బురువు.

మిణుఁగు(ఙు)లు–మిడుగులు వి (√మిణుఁగు) స్ఫులింగము, అగ్నికణము.

గీ. శతముఖుం డను రాతపవక్రవర్తి, నెట్టు సాధింతు నని విచారింప నేల, తూలికాపర్వతంబును ధూళిచేయ, మిణుఁగు రుం తైనఁ జాఁడే మేదినీశ. సీతావి. 1. 96

వ . గిరికటకతటపాషాణసంఘట్టనంబున నెగయు మిణుంగులులుబోలె నంతరశ్రేణి శిలాకాశ కలంబులు మీఁదికెగయ నంభోనిధానంబు మధ్యమానం బయ్యె మఱియును
హర 6 59

చం. . మిణ్గులుల్, చదలునఁ బర్వ నాతని భుజద్వయమధ్యము గాఁడి దుస్సి
భోజసుతా. 4. 110.

చం. ఎద్రిచిన కాలపాకమున నీగతి నీమదిఁ గ్రోధవల్లికం, బద్రిచినవారు మన్నిశిత బాణపరం

పఱలై మిఱుంగురుల్, విద్రుమరుఁగఁ దత్పలం బులచవిం బరితార్థులు గా శరీరపుం, జిద్రుపలు చేరుఁ దత్నతులచేతులఁ బగా ల.బ వాతులన్.

ఉ. హరి. 4. 109.

మిఱుఁగుఱుఁబుర్వు — మిడుఁగుఱుఁబుర్వు వి. (మిణుగుఱు) చీకటిలోఁ దళతళ మెఱయుచు నెగురు నొకజాతి కీటకము, ఖద్యోతము.

చం. పడువడగండ్ల పెల్లు గనుపట్టు మిఱుంగుఱుఁ బుర్వులంచు సం,డడిగొను నింద్రగోపములు ...

విప్ర. 3. 62.

గీ. మిఱుఁగుఱు,పు ర్వనంగను ఖద్యోత మొనరు...

ఆం. భా. 2. 95.

మితంగమము సం. విణ. (అ. ఆ. అ.) మెల్లఁగా నడచునది, మందగామి.

మితంపచము సం. విణ. (అ. ఆ. అ.) కొంచెము వండునది.

మితద్రువు సం. వి. ఉ. పుం. సముద్రము.

మితము సం. విణ. (అ. ఆ. అ.) 1. పరిమితి గలది. 2. ఖడితము. 3. త్రోసివేయఁబడినది.

మితాక్షర సం. వి. అ. స్త్రీ. యాజ్ఞవల్క్య స్మృతిపై విజ్ఞానేశ్వరుఁడు రచించిన ప్రసిద్ధ వ్యాఖ్యానము.

మితి సం. వి. ఇ. స్త్రీ. 1. గడువు, కాలపరిమితి.

చం. జనకుఁడు నేసినట్టిమితిఁ జక్కఁగఁ దీర్చి కడంక నేను వ,చ్చినగుఱిదాఁక భూతలముఁ జేకొని రాజ్యము చేయు ...

మొ. రా. అయో. 41.

ద్వి. కొంకు గాకుండ నాపూనిన మితికి, నింకఁ గాళికుబుణ మేమిటఁ దీర్తు ...

ద్వి. హరిశ్చ. ఉ. 1309 పం.

2. పరిమాణము, కొలత, తూనిక. 3. సరియైన తెలివి, తత్వజ్ఞానము. 4. నిశ్చయము. 5 విశేషము.

మిత్తి[1] వి. (సం. మృత్యుః, ప్రా. మిచ్చూ, క. మిత్తు.) 1. మృత్యుదేవత, మరణాధిదేవత.

ఉ. ఇత్తఱిఁ బన్ని పోయి పయి నెత్తి రణంబొన రించి వారలన్, మిత్తికి నంపి ధాత్రి నిర మిత్రముఁ జేయుదము ....

భార. అర. 1. 74.

ఆ. మత్తగిల్లు సత్తుగిత్తత త్తడి నెక్కి, మిత్తి మొత్తి సత్తి నత్తి బత్తిఁ, బత్తి రిడిన ...

నీలా. 1. 118.

సీ. జముదాడి గెల్చునాజముదాడి యల్పమే సిగ పుమిత్తి నాచేతిక త్తి ..   రామా. 2. 24.

2. మరణము.

కం. రత్తయుపచారముల నే, నుత్తముఁ డగుధర్మ తనయు నుడికించితి దు,ర్వృత్తు లగుమత్సుతుల కును, మిత్తియగుం బోరి వగలు మిగులక. యున్నే.   భార. ఉద్యో 2. 82.

సీ. మిత్తి పెన్నిదుర నా మీఱును మరణంబు ...

ఆం. భా. 2. 225.

ఉ. నిన్నిటు పాఱవైచి తగ నిద్దుర వోయెదుఁ బాపఁ డంచు నే, మిన్నక నీక్లనాట యను మిత్తికి నేఁటికిఁ బోయితిన్ ...

హరి. పూ. 5. 175.

జ. మిత్తికూడు, మిత్తికూళ్లదొంగ, మిత్తిగొంగ, మిత్తిచూలు.

మిత్తి[2] వి. లతావిశేషము, ఒకజాతితీఁగ.

సీ. శంఖపుష్పిక పేరు చను మిత్తి యంచన ...

ఆం. భా. 2. 67.

మిత్తిక. వి. (సం. మృత్తికా) మన్ను.

సీ. మృత్తికాహ్వయము లౌ మిత్తిక యంచన మట్టియం చనఁగను మన్ననంగ ...

ఆం. భా. 2. 5.

మిత్తికూడు. వి. ($\sqrt{}$మిత్తి[1]) ప్రేతల నుద్దేశించి యిచ్చునాహారము; చచ్చినవారి నుద్దేశించి పెట్టెడి యన్నము. (చూ. మిత్తికూళ్లదొంగ.)

మిత్తికూళ్లదొంగ. వి. (మిత్తి[1] + కూళ్లు + దొంగ) ప్రేతల నుద్దేశించి యిచ్చిన యన్నమును అపహరించువాఁడు.

ఆ. తొత్తు తొత్తె గాని దొరసాని గాఁబోదు,
హత్త దేవుఁడు దాని కైనగుణము, మిత్తి
కూళ్లదొంగ మే లెగ్గ నేర్చునా . .
వేమ. 3. 249.

మిత్తిగొంగ. వి. (మిత్తి¹ + గొంగ) మృత్యుంజయుఁడు, శివుఁడు.

సీ. ముక్కంటి యరపవి మోములవేలుపు మినుసిగ
దయ్యంబు మిత్తిగొంగ ...
ఆం సం. దేవ. 9.

ఇట్లే మిత్తివేఁటకాఁడు = శివుఁడు.

ఆ దండుతోడఁ గూడి తరలి గొబ్బునఁ దమ,
నేల కరిగి మొదలిప్రోలు సొరక, మిత్తివేఁట
కానితత్తఁడియూర నిం, పెసఁగ నిలిచి
ప్రజల నేలుచుండె ....
అచ్చ. రా అయో 115.

మిత్తుచూలు. వి. (మిత్తి¹ + చూలు) కేతుగ్రహము. (శ. ర.)

మిత్తు. విణ. మిక్కుటము, అధికము.

ఉ. కుత్తుక లెత్తి బిట్టులికి క్రుంకురవిం గని
దీనవృత్తితో నొత్తినభావిదుర్భరవియోగ
భరంబున నొం డొకంటిమో, మత్తమిలం
గను గొనుఁ ఖాంగయుగంబుల దృష్టిఁ గప్పుఁ
బో,మిత్తుగఁ గప్పనీ రొదవి మించిన చీకటి
కఁటె మున్నుగన్, కవిక. 4 72.

మిత్తురుఁడు వి (సం. మిత్రం. ప్రా. మిత్త) స్నేహితుఁడు, చెలికాఁడు.

కం. అత్తెఱఁగున సైదోడని నత్తమిలినఁ జూచి
రాముఁ డులుకి నిగుడఁగా, నత్తొలి వేలుపుఁ
గలవల, మిత్తురుఁ డాకొని కడంక
మీఱఁగ బలికెన్.
అచ్చ రా. యు. 219.

(మిత్తుఁడాకొని. శ. ర పా.)

మిత్రఘ్నుఁడు. సం. విణ. (అ అ అ) మిత్రద్రోహి.

మిత్రత సం. వి. ఆ. స్త్రీ. మైత్రి, స్నేహము

మిత్రత్వము. సం వి అ. న స్నేహము మైత్రి

మిత్రభేదము సం. వి అ పుం స్నేహము చెడగొట్టుట.

మిత్రము. సం. వి. అ న. 1. స్నేహితుఁడు.

మిత్రయువు సం విణ (ఉ.) 1 స్నేహము గల మనస్సుగలవాఁడు. 2. స్నేహితు వశము చేసికొనువాఁడు.

వి ఉ పుం. 1. మిత్రుఁడు, స్నేహితుఁడు.
2. లోకయాత్రికుఁడు.

మిత్రలాభము. సం. వి అ. పుం స్నేహితులను సంపాదించుట, మైత్రి కూర్చుట.

మిత్రవిందుఁడు సం వి. అ పుం, అగ్ని

మిత్రసప్తమి సం. వి ఈ. స్త్రీ. రథసప్తమి, మాఘశుద్ధ సప్తమి

మిత్రావరుణులు. సం. వి అ పుం ద్వి మిత్త్రుఁడును వరుణుఁడును.

మిత్త్రుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు న. స్నేహితుఁడు.

ఉ. నీవు జమిత్రుఁడేల ధరణీగతుఁ డయ్యెడు
నొక్కొ ... భార 1 22.

చం . ఏ, జనుఁడు విపత్తిసౌఖ్య సదృశక్రియుఁ
డాతఁడు మిత్రుఁడు ..
వేం. పం, నీ. ఆ. 60.

మిథము సం. అవ్య. స. (ఇది సమాసపూర్వపదముగా నుపయుక్తమగును).

ఉదా : మిథస్సమము మిథోనురాగము

1. పరస్పరము. అన్యోన్యము 2. రహస్యముగా.

మిథిల. సం. వి. అ స్త్రీ విదేహదేశపు రాజధానియగు మిథిలానగరము

మిథిలుఁడు సం వి అ పుం ఒకానొక రాజు. విదేహాధిపతి. బ. విదేహదేశపుజనులు

మిథునము సం. వి అ న ఆలుమగలజత, దాంపత్యము. 2. కవలు, యమళులు. 3 మిథునరాశి.

మిథ్య సం. అవ్య. 1. అసత్యమైనది, మోస మైనది; తప్పుడిది.

వ. ... లోకంబులం గృత్యాకృత్యంబులు గల వనుట మిథ్య ..
ప్రబోధ. 2 ఆ, వ 95.

గీ. ... వారి మూటిని బద, మద్యయా అని చెప్పె నమ్మట మిథ్య ...
అప్ప 2 185.

శా. అంతా మిథ్య తలంచి చూచిన నగుం డప్లా వెటింగిన్ సదా, కాంత ల్పుత్రులు నర్థమున్ దనువు నిక్కం బంచు మోహార్ణవ, భ్రాంతిం జెంది చరించు ... కాశ శ. 3.

మిథ్యాచారము, సం. వి. అ. పుం (వైద్యమున) తప్పుగా మందిచ్చుట, తప్పువైద్యము చేయుట. 2. చెడునడవడి, అయోగ్య మైన నడత.

మిథ్యాచారుఁడు. సం. విశే. (అ. అ. అ.) 1. తప్పుగా నడచువాఁడు. 2. మోసగాఁడు, వంచనచేయువాఁడు.

మిథ్యాదృష్టి. సం వి. ఇ. స్త్రీ నాస్తికత్వము

మిథ్యానిరసనము. సం. వి. అ. నం. శపథము.

మిథ్యాభియోగము. సం. వి. అ పుం. అసత్యాభియోగము.

మిథ్యాభిశంసనము. సం. వి అ న. లేనినింద, అసత్యాపవాదము.

మిథ్యామతి. సం వి. ఇ స్త్రీ. భ్రాంతి, పొరపాటు.

మిథ్యావచనము. సం. వి. అ. న అసత్యవాక్యము, కల్లమాట.

మిథ్యాసాక్షి సం. వి. న్, పుం. అసత్యపు సాక్ష్యమిచ్చువాఁడు,

మిథ్యోత్తరము. సం వి అ. న అసత్యపు సమాధానము, నిజము చెప్పక తప్పించుకొనుటకు యేదియో తోఁచినది చెప్పుట.

మిథ్యోపచారము సం వి. అ పుం అసత్యదయ, మనసున లేకుండగఁ పైకిఁ దెచ్చిపెట్టుకొనినదయ.

మిదిల. వి (సం మిథిలా. ప్రా. మిహిలా) జనకుని రాజధాని, విదేహనగరి.

జ చూ. మిదిలదొర

మిదిలదొర. వి. (మిదిల + దొర) జనకమహారాజు.

కం పదిమోములరక్కసు నిఁక, పదమడ మొనరించి కొఱలుసంతసమున న, మ్మిదిలదొర బోడఁ జేకొని, యెద వెదలో దిటము విడకు మింతయుఁ దండ్రీ
అచ్చ. రా కిష్కిం. 51.

మిద్దియ(ద్దె)వి (త మెత్తై) 1. ౘాధము, మేడ హర్మ్యము.

చం దళముఽచాలు మిద్దియలతండము మేలువిచిత్ర పత్త్రముల్, చెలఁగెడఠీఁగ నీఁటములు చెందినసౌరును గాక రాజు శాఖల విలసిల్లు నంచుఁ బురకంజము చేరె రమావధూటి తజ్జలజగృహంబులం దళిమిషంబున అక్కను ముద్రవెట్టుచున్.
కువల. 1. 71.

సీ. హర్మ్యాఖ్య మిద్దె నా నలరు నట్టిక యన.
ఆం. భా. 2. 17.

సీ. డాబా, దద్దళము.

(మాడువుమీఁద చదునుగాపలకలుగప్పి గచ్చుపూసిన కప్పు, అని శ, ర.)

గీ మట్టిమిద్దెలవారికి మరుపమేకు, నెలఁతఁ జాసిన వారికి నిదురు చెకిరెు ..
అము. 4. 127

సీ. గద్దియ లుయ్యెల ల్మిద్దియల్ మేడలు చప్పరంబులు మొగసాల లిండ్లు ...
అచ్చ. రా. యు. 280. సుం 9.

8 తామరపువ్వు లోనగువానిలోని దుద్దు దిమ్మె.

గీ. తమిమ్మెపూమిద్దెగద్దెపైఁ గమ్మవిల్తు, నిమ్ముగా నిల్పి యెమ్మెను గొమ్మ లెల్లఁ, గ్రమ్ముకొని పెక్కులాగుల దొమ్మిగూడి, పూజలొనరించి

యిట్లని పొగడ దపుడు.
నీలా 3 37.

4. ఉంగరము.

(ఉంగరముమీఁద పమ్మెవలె చెక్కఁబడెడి తదవయవవిశేషము అని శ. ర.)

కం. పూసి వసి దిగిచి యష్టమహాభాగమ్ము లను మిద్దియలుగా బ్రవ్వెల్లన్, మానుగఁ గొందఱు దాల్తురు, వానిఫణామణులరుచులు పట్టుగఁ బ్రమథుల్. శివ. సా 333.

జ. మిద్దెజుట్టు.

మిద్దెజుట్టు. వి (మిద్దె + జుట్టు) తామరపువ్వులోని దుద్దువలె ముడుజుట్టు.

సీ. వన్నెలు పింగాణికన్నులు తిలిబొమల్ మిడి దేగచాఁలు మిద్దెజుట్లు ... ప్రబంధ 182

మినమిన వి. 1. తళతళకాంతి.

సీ. మృదుభుజాయుగళంపు మినమినల్ రాయంచ తెగలకు రిత్తవంతుగ రచింప ...
చంద్రా. 3 53.

చం. మినమిన లీనుమేను వెలమించుల కొంచెపు టంచుఁగమ్మలున్. శుక. 3. 105.

2. మిక్కిలి మెఱయుటయం దగు ననుకరణము.
ద్వి. మినమిన మెఱచుచు మును వెండిపూస, యును బోలె నుండె నయ్యూరిచినచోన ..
పండితా. పురా 162 పొ.

3. చూచుటయం దగు ననుకరణము

చం అనవుడు నల్ల నవ్వి విభుఁ డానకదుందుభిఁ జూచి దివ్యమై. తనరివరూపు మాన్పి విదితంబుగ నప్పుడు చిన్నిబాలుఁడై, మినమినఁ జూచుకన్నులును మెల్లనియేడ్పును ముద్దుమోముసొంపును మఱి దీర్ఘబాహుయుగమున్ గొమరారఁగఁ దంద్రిముందటన్.
పద్మ. 9. 88.

జ. మినమినవాఁడు, మినమినమను, మినమినలాఁడు.

మినమినవాఁడు విశ (మినమిన + వాఁడు) చక్కనైనవాఁడు, మేదురుఁడు.

గీ మేదురసమాఖ్య యా మినమినవాఁడు ...
అం ఖా 3. 10.

మినమినమను అ క్రి (మినమిన + అను తళతళప్రకాశించు

ద్వి అని యెత్తుకొని చంక నలమి ముద్దాడి, మినమినమనుచెక్కు మీఁది యాబొట్టి ...
అ మ. శ 1. 40 పొ. 19 పం.

కం. మినమినమనుపావలు గని, కనలున నిట వింత పాదుకలు రా నేలా ...
సారంగ 3. 157.

కం అని యా పేరును గడుపున, మినమినమన మించి రాచ మెచ్చులపేరుం, గవఁ దగు వావులఁ జేర్కొని, మునివనసౌభాగ్యమహిమమును గని మఱియున్, శకు. 3 60.

మినమినలాడు. అ క్రి. (మినమినలు + ఆడు) మినమినమని మెఱయు (శ ర.).

మిను — మిన్ను. వి. ఆకాశము (హల్లు పరమగునపుడు దీని తుదియుకారము వికల్పముగ లోపించును.)

కం మిను కళ్లము తారలు చి, క్కినగింజలు పూర్ణతుహినకిరణుఁడు తూర్పె, త్తిన కొలుచురాసిగా లాం, ఛనము మహింపచిత ముద్రచందము దాల్చెన్
వరాహ. 4 143.

మ ... మిన్నన్ని వే, ఘననీలాంగుఁడు గాంచెఁ జాదపతితాఘుంబున్ మరుత్సృష్టమున్ ...
ఆము. 4. 105.

కం మినుకొలఁకునఁ బూచినచ, క్కనిచెందొవ యనఁగఁ దనరెఁ గలువలదొర ...
నీలా. 3 9.

సా మిను విఱిగి పైఁబడుట = గొప్పయాపద సంభవించుట

చం. భ్రమ గొనినట్లు మి న్విఱిగి పైఁబడినట్లు
గ్రహంబు సోకినట్లు ... శశాం 4 47

జ. మినుచూలు, మినుసిసువు, మినుజావి, మిను
రతనము, మినువాఁక, మినుసికదయ్యము,
మినుసిగదేవర

మినుకు(న్కు). అ క్రి. 1 మినమిన ప్రకాశించు,
తళతళ ప్రకాశించు,

సీ ... మొన్నవి నొక్క జంకించి యుంచిర మీఁట
గొనగోరు సోఁకిన మినుకువెక్కు ...
దశా. 3 145.

2 గొణుఁగుకొను.

ద్వి పనిచిన నే మైనఁ బని సేయు ... తో, మిని
కితో పిలిచినఁ బని యేమి యనవా .
పండితా. పురా. 154 పు.

వి. 1, (క. మినుగు) తళతళకాంతి, కాంతి.

కం. కని వలిగనిదొరల దొరల, నునుపమగతి
మదనుఁ డనుప నాలోనాలోఁ, జన నున్న
వారిం గనుఁగొని, మిను కెనయన్ లొగరు
మేన మేనక పలికెన్. చంద్రా 3. 60.

చం. జాళువా, మినుకుపసిండిమేలిపని ...
ఉ. రా 1. 61. సుద 5. 29.

సీ ఉడివోనిమిన్కు లీనెడుపేరు లిరుదెస నిరు
దెసఁ గమల బంధురకరంబు ...
వసు 1. 6.

(ఇది మూఁడవ యర్థమునకును నుదాహరణము.)

2. కిరణము

వ. ఇత్తెఱంగున మధ్యాహ్నకాలంబుగా నచ్చటుకు
మినుకుజేని కొడుకుకడకుం జని నయభయ
రసంబు లొలుకఁ బలుకు రామా. 6 42

సి మినుకు తళుకు నిగ్గు మించు కళు కనంగఁ
గిరణనామంబు లై కెరలుచుండు ...
ఆం. భా. 1 82

చం మిడిగల వజ్రపున్ రవల మిన్కుల కమ్మలు
జాతి కెంపుటుంగా, కడియములున్ ...
హంస. 3 4.

3 వాక్కు, పలుకు, వేదవాక్కు.

సీ ననవిల్తుశాస్త్రంపు మినుకు లావర్తించుపని
వెన్నతోడఁ బెట్టినది మాకు ...
మనుచ. 2 48.

సీ, మినుకు వాగను సూక్తి దనరును . .
ఆం. భా 1. 111.

సీ మినుకుబల్ జెట్టి సాధనశక్తి నెవ్వానిశ్రాళిత
దనవిలాసఖురళి ... విప్ర 1 40.

సీ మొనలు కైదువవాఁడు మినుకుకై వాఁడిముల్
మెచ్చువాఁడని బీర మెచ్చువాఁడు

అచ్చ. రా బాల 1 3
ద్వి హరిశ్చ పూ 752 పం.

చం . . బంగరుపీఁటయు మిన్కుటుందెలున్ ...
నీలా 1. 6.

4. పుస్తె, తాళిబొట్టు.

కం గురుజను లెఱుఁగక యుండను, వెఱవిఁడి యై
మినుకు గట్టి వెళ్లి చనవునన్, వరియింపఁ
దగినపురుషుఁడు, పరిణయ మగునేని నదియ
పై కాచ మగున్ .. విజ్ఞా. ఆచా. 101.

ద్వి కాటిపావని కేల కరుణ నీమీఁద, లేకున్న
నా కిచ్చు లెక్కటకుఁ జెల్లు, గైకొందు నిమ్ము
నీకట్టినమినుకు ..
ద్వి హరిశ్చ. ఉ. 2126 పం.

గీ. మెలత మంగళసూత్రంబు మినుకు దక్క
భాగ 9. 42

5 ఒకవిధమగు బంగారునాణెము.

సీ మిను కొక్క టిచ్చి పొ మ్మనినఁ బోవునొ
పోవఁ డధ్వప్రయాస విహ్వలుఁ డితండు ..
పాండు. 4. 166

శా. .... ఏ, నాఁటన్ మిన్కులు గల్గువారి కగు
జన్మస్థానసౌఖ్యోన్నతుల్ .

గీ. వచ్చుతెరవరు లంచలు వంటపనికి, నన్ను
మెత్తు రటంచు నందములు సూపి, జాలి
పుట్టించుదాని కప్పథికు లెల్ల, నొడబడిక

మీఁదనే మిన్కు లొసఁగి రవుడు.
శుక. 4. 7.

విశ. 1. మినమినకాంతి గలది.

మ. అని వర్ణింపఁగ నంత జానకి వయస్యల్ దల్పుపున్ సొమ్ములున్, మినుకుంబంగరుడబ్లు ప్రాంతపనుఁకన్ మే లైనవల్వల్ సడల్చి ...
ఉ. రా. 6. 78.

చం. మినుకు టొయాకిపాదుకలు మెట్టి నివాళి మిటాయి లెత్త లో, ఘనపువితర్ది నెంది మఖ పర్కము నంది వసించు నయ్యెడన్ ...
చం. రా. 3. 123.

సీ. కంటి కిం పగు రేఖ గల్గియుండుటఁ జేసి మినుకుఁగాటుక కొంత దినుసువచ్చు ....
విజ. వి. 1. 35.

మినుకుఁగొమ్మ – సరస్వతి.

సీ. తారలసౌరులఁ గేరుఁ దరుణిపాదనఖాళి మినుకుకొమ్మను మీఱు మెలతభుజము ...
అచలా. 2. 41.

(మినుకుకొమ్మ = తళతళకాంతి గలవృక్షశాఖ యని యర్థాంతరము.)

మినుకుఁజేడియ = సరస్వతి.

సీ. శశిరేఖఁ గై కొన్న సౌవర్ణగిరిపోలె మినుకుఁ జేడియఁ గూడి మెఱయువాని ...

గీ. సచ్చిదానంద కందమై హెచ్చువాని, వలువఁ జులుకితపాథోధి తెలచె నుతుల ....
పాండు. 5. 174.

మినుకుటూర్పులవాఁడు = వేదము నిశ్వాసముగా గలవాఁడు, విష్ణువు.

సీ. మినుకుటూర్పులవాని మిసిమిమేఁతల వాని మెఱుఁగుఁజామనిచాయ మేనివాని ...
పాండు. 1. 213

ఇ. మినుకుమినుకను, మినుకుమినుకుమను, మినుకుల మినుక్కు, మినుకురను, మినుకురు, మినుకుల బరణి, మినుకులయిక్క, మినుమినుకను, మినుమినుకుమను, మినుమినుకు, మినుకుమను, మినుమినుక్కు.

మినుకుమినుకను–మినుకుమినుకుమను.

అ. క్రి. (మినుకు + మినుకు + అను) మినుక్కు మినుక్కని మెఱయు.

కం. మినుకుమినుకనెడిమింటన్, బొనవాన నలతెల్ల మబ్బువాంటిన దిగువా, టున నదె కలదో లేదో, యనుమాత్రము గాఁగఁ గంటివా నృపతనయా.
సారంగ. 1. 124.

మినుకుమినుకుమను = మినుకుమినుకను.

అ. క్రి. (మినుకు + మినుకు + అను) మినుక్కు మినుక్కుమని మెఱయు.

వ. ... దినాంతంబున మినుకుమినుకుమని మెఱయు ఖద్యోతంబులును ...
భాగ. 10 పూ. 756.

మినుకుమినుక్కు. వి. (√మినుకు) మినమినమను కాంతి.

వ. ... అఖండవిరహచండిమపాండుతరగండంబుల గం డమరి నిండుకొనిన కన్నీటిచినుకులు మినుకుమినుక్కున బెళుకుబేడిసలు సుధాకర కాంత ఫలకంబులఁ గ్రక్కిన చొక్కఁపు ముక్తాఫలంబులపైఁ జలంబులు నూప ....
రా. వి. 4. 26.

మినుకు(క్కు)రను. అ. వి. (మినుక్కురు + అను) తళతళ ప్రకాశించు.

మ. అమృతాంశుండు నిశాపతిం గదిసి శీర్యచ్చంద్రికాగంధశిల్పముతోఁ బుష్కరశయ్యఁ బాసి చన వేళాదూతి తత్కాలసంభ్రమ సంశీర్ణత రోడుహారమణివారం బేరి తా నొక్కచో, గుమిగాఁ బోసెనొ నా మినుక్కురను వేగుంజుక్కఁ గంటే చెలీ.
వసు. 4. 128.

మినుకు(క్కు)రు. వి (√మినుకు) మెఱయుటయందగుననుకరణము, (చూ. మినుక్కురను.)

మినుకులబరణి. వి. (మినుకులు + బరణి) సూర్యుఁడు.

కం. మినుకుమినుకు మినుమని యెన్, జెనుమినుకు
లఱరణి ధరణి బిట్టూటాడెన్, వననిధులు
విరిసెఁ గురిసెన్ గనగనగనమనుచు నిప్పుకలు
గుప్పలుగన్, పాండు 5 188

**మినుకులయిక్క.** వి. (మినుకులు + ఇక్క) సూర్యుఁడు.

చ. ... అమ్మినుకులయిక్క కుఱ్ఱఁ డెకిమీనిఁ
గనుంగొని పక్కె వెండియున్ ..
అచ్చ రా కిష్కిం. 61

**మినుచూలు.** వి. (మిను + చూలు) నభస్వంతుఁడు, వాయువు (శ. ర.)

**మినునిసు(గు)వు** వి. (మిను + నిసువు) నభస్వంతుఁడు. వాయువు

చం. మినునిసువుల్ వడిం దెగడి మీఱెడిమావులు
లొజ్జ గానిబల్డొనలును దొడ్డసింగిణులు
దూకొని వెన్కకు రానిబింముల్, కొనరఁగ
వేల్పుగొంగ తొలుబొట్టియ యింద్రజితుండు
అంపిలున్. అచ్చ. రా యు 70

**మినుపపోఁక.** వి. (మినుము + పోఁక) భక్ష్యవిశేషము, ఒకవిధమగు పిండివంట.

వ. ... మినుపపోఁకలు మనోహరంబులు గారెలు
బూరెలు . . . ఆదిగాఁ గలభక్ష్యంబులు ...
హంస 1, 105.

**మినుబావి** (మిను + బావి) ఆకాశగంగ, సురదీర్ఘిక.

ద్వి. కటిశైల కందరగరిమఁ జెన్నొందెఁ, గుటిల
కుంతలనాభి కుచసురాలయము, నందుండి
పొక్కిలి యనుమినుబావి, యందు గ్రీడకు
వచ్చునలనాకభామ, ఖచరమార్గం బనఁ గొను
రాజిల్లె. మృ వి 1 11

**మినుమినుక(క్క)ను** అ. క్రి. (మినుమినుకు + అను) మినుకుమినుకుమను

కం వెల్లి యగువగల త్రొక్కున, నిల్లిగ్గులు గావ
వచ్చుహృదయములోనన్, మల్లామడి యగు
మదనుఁడు, మెల్లనఁ గూర్చుండెఁ దాల్మి
మినుమినుకనఁగన్ ఉ. హరి 5 166.

కం. చనుఁగవబంగరువన్నెటుల మినుకొనవెలెఁ గళ
రుచులు మినుమినుకనఁగన్ ..
సుగ, 6 39

సీ. కను దృష్టి సెయ్యది మినుమినుక్కనుచుండు
ఘనత ప్రేక్షించినది గానంబనఁగ ..
పి. శకు. 1 118.

చం. కలకల నవ్వువక్త్రువమొగంబు దరా లను
చేరెఁ దేసిక, న్నులు పిడికింటిలో మినుమిను
క్కను కౌనును ముద్దుగారు పలుం లుఁ జెలి
కమ్మరేఁ దళుకళుక్కనుచెక్కులు వట్టెఁ దేసి
గుబ్బలుఁ గనుచోవుమేఁకు గుభాలను
తావులు దీనికే తగున్ కువల 3 62.

**మినుమినుకుమను** = మినుకుమినుకుమను

అ. క్రి (మినుకుమినుకు + అను) నక్షత్రములు మున్నగునవి స్వల్పకాంతితో మెఱయు.

కం చక్కనిప్రకోష్ఠపీడన, మిక్కిలికనువేఁకి నుఱిచె
మినుమినుకుమనన్ ... హర. 7. 84.

**మినుమినుకుమినుకుమను.** అ. క్రి (√మినుకు. ఇట ననుకరణము ద్విరుక్తము) నక్షత్రములు లోనగునవి స్వల్పకాంతితోఁ బ్రకాశించు.

క మినుమినుకుమినుకుమని యెన్, జెనుమినుకుల
బరిణి ధరణి బిట్టూటాడెన్, వననిధులు విరిసెఁ
గురిసెన్, గనగనగనమనుచు నిప్పుకలు
గుప్పలుగాన్. పాండు. 5. 188.

**మినుమినుక్కు.** వి. (√మినుకు) మెఱయుట యందగు ననుకరణము.

సీ. మినుమినుక్కను సీతమేనికాంతిఁ గడాని
వలువత శొక్కలయు వల్కలమువాని ...
చం. రా. 4 104.

**మినుము(న్ము)** వి మాషసస్యము, ఒకవిధమగు పైరు.

(సమాసమున దీనియంతిమాక్షరమునకు పవర్ణాదేశము, ఉదా : మినుపచేను, మినుపపిండి మొ.).

వ. .. కందియుందంబును పెసరసిరియును మినుము నలువును ... భీమ. 6. 57.

సీ .. మిను మనఁగ మాషము దనర్చు ..
అం. భా. 2. 235.

ని ధాన్యవిశేషము, మాషములు, ఉద్దులు.

కం. అనములు గోధూమంబులు, మినుములు సెనగలును బండుమేదిని భూదేవునకిచ్చు నెవ్వఁడతనికి,ననపాయస్వర్గసౌఖ్య మబ్బు మహేంద్రా.
భీమ. 5. 67

వ .. పెసలు మినుము లనుము లోనైన ఎంద్రునకు బుట్టి. 1. ణ్ణికి చి. 6 ...
ద. శా. 4. 1584.

సీ చమురు పట్టించి యంగములు మర్దనచేయు మేదించు మేనిపై మినుపపిండి ..
వైజ. 2. 51

జ. మినుపపోక.

మినురతనము వి (మిను+రతనము) నభోమణి, సూర్యుఁడు.

గీ. తమ్మిచుట్టము మినురతనమ్ము ప్రొద్దు, వేవెలుంగన సూర్యుఁడౌ ... అం. భా. 1. 81.

మినువాక వి (మిను+వాఁక) ఆకాశగంగ.

సీ మినువాఁక వలగొన్నగొనబులిన్గొప్పుపై గలికి క్రొన్నెలవంక వెలయువాఁడు ...
పె శకుం. 1 13.

మినుసికదయ్యము వి (మిను+సిక+దయ్యము) వ్యోమకేశుఁడు, ఈశ్వరుఁడు.

గీ. తడయఁ బని లేదు మినుసికదయ్య మింక, నెట్టు గావింప నున్నాఁడొ యెవ్వఁ డెఱుఁగు ...
నీలా. 2 69.

సీ. ... మినుసికదయ్యంబు మిత్తిగొంగ, ... ముమ్మొనవాలుఁబాల్పు వాఁగ భవదాఖ్యలొప్పు నంధకవిపక్ష ... అం. సు దేవ 6.

ఇల్లే : మినుసికదేవర. మొ.

వ . అయ్యా యెన్నఁడు లేని దిట్లు చిన్నబోయినయున్కికేమి హేతువు నాతో సెలవీయవలయు ననిన మినుసికదేవర యిట్లనియె
మృ. వి 2. 32.

మినుసికగలాఁడు = శివుఁడు

గీ మినుసికగలాఁడు ముక్కంటి యనంగ నిట్లు, యౌగికంబులు భవదాఖ్య లలరుచుండు .
అం భా 1. 97.

మినుసికవాఁడు = శివుఁడు

కం నీతెఱఁ గరయఁగ దెమ్మొగ, మేతరివందడపు ఱేఁడు మినుసికవాఁడున్, దాతయు సాతని నాతియు, నేతురె యొక్కించుకైన నిక్కువ మొగవన్. అచ్చ. రా. యు. 527.

మినుసికవలంతి = శివుఁడు

సీ. జక్కులకొలములోఁ జిక్కి రొక్కపుదొర బికిరముల్ గొను మినుసికవలంతి ...
అచ్చ రా. బాల. 68.

మినుసిగదేవర వి. (మిను+సిగ+దేవర) వ్యోమకేశుఁడు, శివుఁడు.

సీ. మెలఁగితి మెకిమీఁద మినుసిగదేవర మామ గుబ్బలిసల్లసీమ లెల్ల ... ఇందు. 2. 50.

ఇల్లే మినుసిగవేల్పు. (శ. ర )

మిన్కుఁగొన వి. (మిన్కు+కొన) వేదాంతము, ఉపనిషత్తు.

సీ. పెనుమిన్కుఁ గొనత్రోవలను మెఱుంగెడు ఱేఁడు .. నీలా. 1 77.

మిన్న = మిన్నా. 1 మణి, రత్నము

ఇది సమాసోత్తరపద మగునపుడు చంద్రసింహాది శబ్దములవలె శ్రేష్ఠవాచక మగును

ఉదా : అన్ను మిన్న మొ

సీ. కడలిరాయఁడు మిన్న గల మిన్నగమి డాఁప ఘటియించు బంగారుకణఁజ మనఁగ ...
ఉ. రా. 1. 316.

సీ. తళుకు బంగరు చెఱంగుల యొఱతలపాగ

తలఁకుచొ పంచమిన్నల తురాయి ...
దశా 10. 112.

2 (త మిన్నాల్) కంటి.

కం. పిన్నలకుం దెలిజాళిక్, మిన్నలకుం దలఁకుఁ జిలువ మేలిమిపలుకుల్, విన్న నగున్ విన్న నగున్ గ్రొన్నన కుంభులకు బిగులుకొని మదిఁ బొంగులున్ కువ. 3. 83

మ. నరలం గూర్చిన కొప్పుతోఁ బసుపుమిన్నల్ దోఁటునెమ్మోముతోఁ, గరిమన్ నాగమసాని ప్రోలు దిరుగంగా జంతులై తూర్యముల్, మొరయంగా గడు నొప్పె నాకబలి.
వేం. పంచ 4. 370.

గీ వలిపె చెంగావిపావడ కలసి మెఱయఁ, గొమరు చివురాకు టెంగదట్టములు పెట్టి, చిఱు దొడల మిన్న లెంతేని చికిలిసేయఁ, దెంవ లెనసిరి విరులయోవరుల వరుల ...
భోజసుతా 6 37.

3. (త మిన్నాల్) ధనము, నాణెము

ఉ అట్టి మహావిహీనభవ మయ్యును నీలువుమాట వానియుం, బుట్టరికంబుఁ బుణ్యమును సున్నగ మిన్నలఁ గూడఁబెట్టుచో, గుట్టుదొఱంగుచుం బడుపుఁగూటికి నోచినవారి జాతినిం, బుట్టి క్రమక్రమంబునఁ దపోధన యావన మావ హిల్లఁగన్. విప్ర. 3. 18

ద్వి. ఎన్న నేఁటికి లంజ కిలలోనఁ గ్రొత్త, మిన్న లిచ్చినవాఁడె మీనకేతనుఁడు ...
ద్వి. పరమ. 4. 298. పం

4. పాంచాలిక, (దంతములు మున్నగువానితో నిర్మించిన) బొమ్మ.

కం. కన్నె రతనంపుమిన్నా, మిన్నా నడు మనఁటి యాకు మేకొను వెన్నా, వెన్నా పలుకులు ...
కళా. 7. 1. 214.

5. భూషణము, నగ.

సీ అడరు భూషణాఖ్యతొడుగు తొడవు మిన్న ...
అం భా. 2. 147.

గీ. మిన్న వడ్డించు మందుమె యన్నమిన్న ...
హం. 6 119.

సీ నవసమాగమమునఁ జవులు వక్కాణించి మించఁ జాలవెలందిమిన్నగముల ...
వసు 6. 72.

విశ. 1. శ్రేష్ఠము, ప్రశస్తము

గీ. మిన్న మిడుఁగురులు లై రెండు మెఱయుచున్న, మెఱుఁగు లోకపుట్టలో నున్న నెఱుగ కెను, పుట్ట గ్రొప్పించి యారెంటిపొడుపు గాంచ, కుడిగి వచ్చితి విస్మయపడి మనమున
భా ఆర 8. 179.

సీ. నునువెడఁదయురంబునను జీనిపరిపెణల్ మిన్న జిగ్నిదముతో మేలుగొనఁగ ... దశా. 1. 27.

కం. మిన్నానడు మఱికలువఁ, మిన్నా నెజిచూపు మేలిమి న్నల వెన్నన్, వె న్నా పలుకులు చకిల్నిమిన్నవె న్నాయవటాకుకళిమి వెలఁదికి గనఁ గన్ ప్రబంధ 900.

2 అధికము

సీ. చిఱునవ్వు నవ్వెనా నెఱచందమామవెన్నెల కిన్న మిన్నవన్నెలు చెలంగు ...
అహల్యా. 1. 34.

ఉ వింధ్యకు మేల్తరంబు ఘనవేదికనుంబొమదోయి బంగరుఁ, గిండ్లకు మేటిసాటి తులకించుచనుంగవ లేఁతతమ్మిపూ, దూండ్లకు మిన్న యన్న జిగి దొల్కెడుచేతులు లోకమందుఁ బూ, బోండ్ల నుఁ గాన మో వినమొ పోలరు తత్సతి కాలిగోరునన్.
హంస. 1. 61.

మిన్నందు అ. క్రి. (మిన్ను + అందు) 1. ఆకస మునంటు, అతిశయించు.

గీ. నేను నీబంట నై యుండ నెఱుఁగనేర, కకట యెవ్వాఁడు నీకు నెగ్గాచరించె, మిగిలి మిన్నంది పెనఁగొనుమేఁటి కైన, నాయువును శ్రీయు నెవ్వాని కవశమయ్యె. హరి. ఉ 8. 41.

కం. న న్నిం తలయించినఖలు, నిమ్నన్ బుజువిధి వధింతునే యని యార్పుల్, మిన్నందఁగ బున

కొట్టుచు, నన్నీచుఁడు వాగరు వెడలు నవ్యక్తోక్తిన్. ఆము. 6 26

2 సంతోషముచే నుప్పొంగు.

కం మిన్నంది వేగఁ గైకొని కన్నుల నొత్తుకొని మ్రొక్కి గారవ మెసఁగన్, వెన్నుఁడు రుక్మిణి కొసఁగెను ... పారి. 1. 77.

ఉ నందసుః డుద్భవించె నని నవ్విని యొంతయు సంతసించి మిన్నందుచు సూతికాగృహము నందుల కేఁగి తనూజువక్త్రి మానంద మెలర్పఁ జూచి . రుక్మాం. 1 144.

మిన్నందికొండఁదాఁకు = మిక్కిలి యానందించు

గీ. కలదు లేదన నసియాడుకౌనుతీరుఁ, దళుకు మొగమున కెగయు గుబ్బలబెడంగుఁ, జూచి యాతని నిడువాలుచూపు లపుడు, నిండువేడుక మిన్నందికొండఁదాకెఁ.

విజ వి 2. 20.

మిన్నక అవ్య. (యత్నము, కారణము, ప్రయోజనము, ప్రతిక్రియ మున్నగువాని యభావమును దెలుపును.)

1. అప్రయత్నముగ, ప్రయత్నము లేక.

కం శత్రుజనులు చెఱుచుటయును, మిత్త్రిలు బ్రతికి చుటయును, మిన్నక యాప, త్పాత్రతయును సంపదయు వి, ధాత్రుఁడు సంధించుఁజూ వెతరితోఁ బురుషున్. భార శాం. 4. 374.

2 కారణములేక, నిష్కారణముగ.

ఉ. పిన్నటనాఁటనుండి నను బెద్దగఁ జూచిన వంశవృద్ధులన్, మిన్నక చంపి చేకొనిన మేదిని నాకిదియేల. జై. భా. 1. 59.

3 నిష్ప్రయోజనముగా. వ్యర్థముగా.

కం మున్నెన్నఁడు నివ్విధ మేఁ, గన్నది గాదమ్మెవెడలె గాండీవములాఁపు న్నీభుజము ః శక్తియు, మిన్నక పోఁ జిత్రమిది యమిత్త్రిధ్వంసీ.

భార ద్రో. 3. 197.

ఉ. ... దినికిన్, మిత్త్రినిధి యొడంబడుము మిన్నక సంశయ మంద నేఁటికిన్ ...

భార. సభా. 2. 133.

ఉ మీరును నేవిచారములు మిన్నక చేయక పెంపు మీఱ నా చేరువ నుండు ...

హరి. ఉ. 10 123, కాశీ. 4. 50.

4 ఏమియు చేయక, ప్రతిక్రియ లేక.

శా ... సురేంద్ర బాధపడి మీ రిబ్బంగి దుఃఖంపఁగాఁ, గట్టాపో యిటు మిన్న కుండుదురె ..

భీమ 6 61.

కం. ... ఇంతకు మిన్నక యుండుట, పంతముగా దనుచు వీరవర్మనితోడన్, గాంతామణి సంతాపముఁ, గఁతుప్రతాపంబు లువియఁగాఁ జెప్పుట యున్. విక్ర 1 140.

5. అనాయాసముగా, సులభముగా.

గీ. ఆలు మగఁడును నొకకుత్తుకైనఁ గాక, యుట్టి ధర్మంబు మిన్నక యేల కలుగు ...

హర. 2. 60.

గీ పూర్వసఖుఁ డైనయాదవ పుంగవుండు, మిమ్ముఁ బొడఁగన్న సిరు లెల్ల మిన్న కొసఁగు ... కుచేల. 1. 46.

6 మాటాడక, ప్రతివచనమీయక.

ఉ. మిన్నక చేర వచ్చి యొకమేలపు మైవడి పువ్వుఁబోఁడి గ్రక్కన్నులు మూసెఁ బాణి కమలంబుల భూపతి ... నైష 8. 39.

కం అన్నవలామిన్నయు నతఁ, డున్న తెఱఁగు దుశ్శకునము లుడుగక కన నొచున్న తెఱంగును గనియును, మిన్నక చనె దైవగతిఁ గ్రమింపఁగఁ దరమే ... ఉ రా. 6 242

ఉ విన్నున నేఁగుచామరల విందుకిలాతపునీడ లెప్పుడున్, వెన్నెలరాచబాలఁ గని వెళ్ళక నీళ్ళ మునింగి యున్న వీ, మన్ను లటంచుఁ జెంచెతలు మాటికి నమ్ముల నేసి నాటమిన్, మిన్నక సిగ్గునం గదలి మెల్లనఁ బోవుదు రిండ్ల పట్లకున్. యయా. 2. 39

వ. అనిన విని యక్కన్నియ మిన్న కుండె ..

నైష 3. 128.

కం. నీయిచ్చుదయె మిన్నక ప్రో,వోయి మునిప్రవర.
అము. 2. 98.

మిన్నతి వి. 1. గౌరవము.

చం. ... ఘని గూడి యో, మెలంతుక మార్తురేఁ దగినమిన్నతి గొంట గదమ్మ నేరుపుల్ ...
యయా. 5. 148.

2 ని ప్రగల్భవచనములు, డంబములు.

ఆ పండువంటివయసు బలుకాఁపురము సేయ, జప తపంబులకు జాల వేఁడు, మీఁదిదినములనుచు మిన్నతుల్ పలికెడి, భ్రాంతజనుఁ దగదు పాటిసేయ.
కుచేల. 3. 57

మిన్నము. సం విణ. (అ. ఆ. అ.) 1. క్రొవ్వినది. 2. జిడ్డైనది, స్నిగ్ధము. 3. ఇష్టముగలది, స్నేహముగలది, స్నిగ్ధము.

మిన్నా = మిన్న. వి. రత్నము.

సీ. మేలైన హురుమంజి మిన్నాల కుళ్లాయి చాక చక్యంబుల సందడింప ... భాను. 4. 38

విణ. శ్రేష్ఠము.

శా. ... ఉద్యోగసం, ప్రీతిం జేయుచుమండు నాశ్రమమునన్ మిన్నాతపం బేర్పడన్ ...
అచలా. 3. 81

శా. ... కెం, పున్నాడెంపుఁదురాయి శ్రేవఁ బవ డంపున్ వాగెయున్ బన్నుచున్, మిన్నా తేజిని దెచ్చినన్ విభుఁడు నెమ్మిన్ గాంచి యెక్కెన్ వెసన్ ..
ఉ హరిశ్చ. 4 20.

మిన్నీరు. వి (మిన్ను + నీరు) ఆకాశగంగ.

గీ శింసు మిన్నీటఁ దడియఁగ శింశుమార, చక్ర గతుఁ డైన ధృవుపెంపు సన్నుతింపు ...
కకు. 3 5.

మిన్ను — మిను. వి. దా. అనౌ. ఆకాశము.

(ఇది ఉవర్ణకాంత మయ్యును ఏకవచనార్థమునఁ బెక్కుప్రయోగములందుఁ గానవచ్చు చున్నది.)

గీ ఆమరు లమృతాంబునిధిలోని యమృతరసము, వెండిచేరులఁ బటికంపుఁగుండ కట్టి, చేఁదు కొని యెదరో నాఁగ శీతరోచి, మెఱుఁగు మెయి తోన యల్లన మిన్ను ప్రాఁకె ...
పారి. 2. 69

కం. వే మింటిదాఁకఁ జెకెఁగిన, డీమసమున వతల మునకు డిగఁబడి చనివన్, భూమి గలయఁత దిరిగినఁ, దా మును పెట్టనిదికి ద్రదవకే లబ్బున్.
పిక్క. 2. 182

శా. దానత్యాగపత త్రి మై తొలుపత త్రిం బుఙు ధార న్సదా, నానన్, దత్త్వితకీ ర్తిహంసి చను మింటన్ ...
ఆము. 2. 42.

కం మిన్నున కూరక యెగయదు, తన్న సమర్థుండు గాఁడు తల్పగతుం డీ, చిన్నికుమారుఁడు దే రేవిన్న నువుగ నెగసె దీనివిధ మెట్టిదియో.
భాగ. 10 పూ. 255.

ఉ. మేడ్పడి రాజ్యగర్వమున మీఁదు తలంపవు గాక చిప్పులుం, గాడ్పులుఁ గూడినట్టు మురధుస్మరు చేతుల శంఖశార్ఙ్గముల్, వీడ్వడి మ్రోయ డాయఁ బదివేపురుతోదుల సింహనాద ముల్, వోడ్పడవే రసాతలము దూఱియు మిన్నులమీఁదఁ బాఱియున్ ..
ఉ. హరి. 4. 198

సీ మిన్నులపైఁ బాఱుచున్నయే ఱిలఁ దెచ్చి వారాశి నించె భగీరథుండు ...
కు సం. 1. 52.

ద్వి. చెన్ను మించిన మంచిచెఱకుతోఁటలును మిన్నులతో రాయుమేటికోటలును ...
ద్వి. హరిశ్చ. పూ. 106 పం.

సా. మింటికి నేలకు సూత్రపట్టు = మిక్కిలి దుష్కరమగు పనులు జేయు.

సీ. కొలిచి మింటికి నేలకును సూత్రపట్టంగ నే నేర్తు మఱియును నేనె నేర్తు ..
విప్ర. 4. 28

మిన్నుదన్ను = సంతోషముచే నుప్పొంగు.

చం. నరులకు గుండెగూడు దిగె నాగకులంబులు నిద్రవోయె ని, ర్జరులును మిన్నుదన్నిరి ధరామరకోటియుఁ దృప్తిఁ బొందె. ...
కాశ. 2. 61.

మిన్నుదాఁకు = సంతోషముచే నుప్పొంగు

కం చనుదెంచి వేఁడుము వరం, బని పలికిన మిన్ను దాఁకి సాష్టాంగముగా, వినతి యొనరించి .
హరి వూ ॥ ౨౦.
హరి ఉ 10 12.

జ. మింటిముక్కంటపు మింటికాఁపరులు, మింటి కాఁపురంబులవారు, మింటితెరువరి, మింటి మానికము, మింటిమ్రాను, మింటిసికవేల్పు, మిన్నందు, మిన్నీరు, మిన్నుకొలఁకు, మిన్ను మానికము, మిన్నుముట్టు, మిన్నులువడ్డచోటు, మిన్నువాఁక. మిన్నువాఁకతాలుపు, మిన్ను వ్రేయు, మిన్నెక్కు, మిన్నేఱు, మిన్వాఁక.

**మిన్నుకొల(ను)ఁకు.** వి. (మిన్ను + కొలఁకు) సుఁదీర్ఘిక, ఆకాశగంగ.

ఉ వెన్నునిమించుఁ గాలిబోటవ్రేలికిఁ గూతురు వేల్పుటాటకున్, మిన్నుకొలంకు వంటచెలి నిద్దపుఁబయ్యెద పాలవెల్లికిన్, మన్ననయన్ను నైతపసి మంతనపుందెర యైనతొయ్యలిన్.
రామా. 5. 19.

**మిన్నుమానికము** వి (మిన్ను + మానికము) నభోమణి, సూర్యుఁడు.

చం. ... మిన్నుమానికపు వంగడపుందొరెల్లఁ దేనిఁ జాఋలయెడ వల్గ బోదురె యొఱుంగమి నైన బెడంగుడాల్గనీ ..
అచ్చ రా బాల. 205

**మిన్ను(లు)ముట్టు** అ క్రి. (మిన్ను + ముట్టు)

1. అతిశయించు.

2 ఆకాశమునంటు, సంతోషముతో నుప్పొంగు.

మ అసక్ర తేజము మిన్నుముట్టి రిపుభార్యానేత్ర నీలోత్పల, ప్రసవంబుల్ వలఁగించి యాశ్రిత ముఖాబ్జశ్రేణికిన్ సంతసం, బెసఁగం జేసి విరోధి గర్వతమసం బింకించి దీపించుఁ బో, బసవక్ష్మా విభుతమ్మయ ప్రభు ప్రతాప ద్వాదశాత్మ ప్రభల్
వి. పు. 1. 70

(ఇది రెండర్థములకు నుదాహరణము.)

చ . ఓనభాగధేయ మహిమంబునమిన్నులుముట్టి పొమ్ము ధ, న్యుని నతనిన్ భజించి నదియున్ వినయంబున నోర యై చనన్ ...
వసు. 2. 109.

**మిన్నులవడ్డచోటు** వి (మిన్నులు + పడ్డచోటు) ఆకాశము వాలినచోటు, భూమియు నాకాశము గలిసినట్లు కనుపడుచోటు, అతిదూరప్రదేశము

చం కరినిభయానతో నిదె పాకాలెద మిన్నులు పడ్డచోటికిన్ ..
కాశీ. 2. 156.

గీ. ... దైవంబ కినుక నిట్లు, పాఱవైచితె మిన్నులు వడ్డచోట ...
మనుచ. 2 17.

**మిన్నువాఁక — మిన్వాఁక,** వి. (మిన్ను + వాఁక) ఆకాశగంగ, స్వర్ణది.

ఆ వెన్నునడుగుపాప మిన్నువాఁక ...
ఆం. సం. దేవ. 33.

**మిన్నువాఁకతాలుపు** వి (మిన్నువాఁక + తాలుపు) గంగాధరుఁడు, ఈశ్వరుఁడు

సీ వలిమలల్లుడు మిన్నువాఁక తాలుపు కొండ పిటిజంగము గుజ్జువేల్పుతండ్రి ...
ఆం సం. దేవ. 6

**మిన్నువ్రేయు** అ క్రి. (మిన్ను + వ్రేయు) బయలుప్పళించు

చం. కరముఁ బ్రియంబునన్ దనయుఁ గౌఁగిటఁ జేర్చి త్రిలోకరాజ్యవి, స్ఫురణము నాకుఁ దక్కెనని పొంగి దశాస్యుఁడు మిన్ను వ్రేయుచున్
నిర్వ. 6 145.

**మిన్నెక్కు.** అ. క్రి. (మిన్ను + ఎక్కు) ఆకాశము నంటు

కం. ఇక్కరణి జోదు లేర్పడి పెక్కేడలం బోరఁ బెరుఁగు పెనుచివ్వలు మి, న్నెక్కి కలహాశి కన్నులఁ దెక్కొట్టిన విడక కఱవుదీర నెక్కెన్.
రామా. 8. 3.

**మిన్నేఱు.** వి. జా. (మిన్ను + ఏఱు) ఆకాశగంగ.

సీ ఈ నగాగ్రంబున నీవ గాఁడినయంత శిలనైన

మిన్నేఁలు సెలవకున్నె ... ఉ హరి 2. 161.

ఉ కైటభదైత్యవైరి పదకంజమునం దుదయంబు నొందె మి, న్నేటికి భూతధాత్రికిని నెంతయు వచ్చినతోడఁబుట్టువై ... భీమ 1. 30.

సీ. మిన్నేటిజలము సుమ్మీ తొలంకెడు నని డాసేత మణికమండలు నొసంగి ... పాం. 5. 86.

**మిన్వాఁక** = మిన్నువాఁక (మిను + వాఁక) ఆకాశగంగ

సీ దట్టంపుమిన్వాఁక తరఁగచాల్పునఁ దేలు తెలి పుల్గు బురదగోతులకుఁ జనునె ...

నీలా 2. 96.

**మిమ్మటము.** విశే. మిక్కుటము, ముమ్మరము.

ఉ మిమ్మట మైనవాఁడిఁ బవిమిత్రము లై వెలుఁ గొందుసీనఖా, గ్రమ్ములకున్ మృదుప్రకృతి గల్గుట ఫ్రొత్త ... పాండు. 5. 278.

కం ..భావజునిప్రోపు మిమ్మట మయ్యెన్ .

దశకు 3 95.

ఉదయనోదయము. 1 112c

**మిరాశి** వి (హిం. మీరాస్. క. మిరాసి. త. మిరాసు) 1. పారంపర్యముగా వచ్చు సొత్తు, హక్కు (శ. ర. బ్రౌ.).

2. వంశపారంపర్యముగా వచ్చు గ్రామోద్యోగము.

(వ్యవ ) మాయూరిమిరాసి కలుగొట్లవారిది

జ మిరాసిదారు.

**మిరాసిదారు** విశే. (√మిరాసి) వంశపారంపర్యముగా వచ్చు గ్రామోద్యోగము గలవాఁడు.

సీ. కాసరపూడి మిరాసిదారుల వెళ్ల గొట్టి. కొంపలఁ బసుల్ గట్టినావు ...

చంద్ర. వి 1 32.

**మిరి(రె)యము..** వి. (సం. మరీచమ్. ప్రా. మిరిఅం త. మిరియం.)

1 మరీచము, ఒకవిధ మగు సంబారువస్తువు.

కం. అంతెదవు గాక నమఁ జెం, తం జేరఁగనీక యెంత తఱిగిన మిరియా,లుం బొన్నల సరి పోవే, లంతెతనములఁదుఁ గొమిరెలన్ గెలువ వశే.

ఉ హరి. 1. 75.

సీ మిరియంబుతోఁ గూడ మేళవించినతేనెఁ దోఁచి ఫలహార్యాలు దోఁచి తోఁచి ..

గీ వలచి భుజియించి రొగిఁ బిండివంటకములు.

నైష. 6. 120

మ. పుసుఁగుం దావినవోదనంబు మిరియంపుం బొళ్లతో ... ఆహారం బిడున్ సీతునన్.

ఆము. 1. 82.

ఆ మిరెపుగింజ చూడ మీఁద నల్లగ నుండుఁ, గొఱికి చూడ లోనఁ జుఱుకుమనును, సజ్జను లగువారిసార మిట్టుల నుండు ..

వేమ. 1. 152

2 మరిచలత, మిరియపుఁదీఁగె.

ప. ... మిరియపుఁబొదలతుదలన్ బొనంగు లనంగలతాకుడుంగములతో ...

ఉ. రా. 6. 24.

జ. మిరియాలపేరు, మిరెపకాంద్ర, మిరెపకాయ.

**మిరియాలపేరు.** వి. (మిరియాలు + పేరు) మిరియములవంటి బంగరుగుండ్లతో నేర్పఱచిన హారము, ఆభరణవిశేషము.

(వ్యవ.) ఆమె కంటె చెఱిపించి మిరియాలపేరు చేయించికొనినది.

**మిరెపకాంద్ర.** వి. (మిరెము + కాంద్ర) కంటక వృక్షవిశేషము. ఒకవిధమగు ముండ్లచెట్టు (శ. ర ).

(వ్యవ.) ఎఱ్ఱ మిరపకాయకంటె పచ్చ మిరెప కాయకుఁ గారమెక్కువ.

**మిఱిమిడి.** వి దురవలోకప్రభ, చూడ శక్యము గాని వెలుఁగు

సీ తగు దురవలోకప్రభ మిఱిమిడి యన ...

అం. భా. 1. 82.

**మిఱు[1]** = మిట్టు. వి. ఉన్నతభూమి, మెట్ట.

కం పాటిగ మిఱుఁ బల్లిం జేర్వా వేమియు
లేక కానఁబడి నీలశిలా. పేటిక నిండంగా నిడు,
కాటుకయుం బోలె నై జగంబులఁ దమమున్
పి. శకుం. 3 150.

**మిఱు²** విశే చలించునది.

(మిఱుమిట్లు కలది యని శ ర దీనియా మ్రేడిత రూపము మిఱుమిఱు.)

కం ఘుఱుగఱులు వలుదమీసలు, చిఱుదోఁ
కయుఁ బసిఁడి యొడలు సిరిగలవాడలున్, నెఱి
మొగము నొక్కకొమ్మును, మిఱిచూపులుఁ
గలిగి విభుఁడు మీనంబయ్యెన్
భాగ 8. 717

ఇ. మిఱుమిఱు

**మిఱుమి(ర్మి)ట్లు (ట్టులు)** వి. బ (మిట్లు + మిట్లు) 1. కన్నులు మిక్కిలి చలించుటలు.

సీ ఉఱుముచుఁ దళతళ మెఱచుచందంబున
గర్జతో మిఱుమిట్లు కడలఁ దోఁప ..
భోజరా 4 287.

2 మెఱపు మున్నగువానిం జూచుటచేఁ గలుగు దృష్టిచలనము. (చూ మిఱుమిట్లుగొను)

**మిఱుమి(ర్మి)ట్లుగొను.** అ క్రి. (మిఱుమిట్లు+కొను) మెఱుపు మున్నగునధిక తేజస్సును జూచుటచే దృష్టి మిక్కిలి చెదరు, కన్నులు చీకట్లు క్రమ్ము.

కం మెఱసి యుదయించుగ్రహముల, తఱచు
ప్రభలఁ గ్రేణి సేసి దశదిశలం గ్రిక్కిఱిసి
వెడల నావిండ్లన్, మెఱుఁగులు నృపతనయు
దృష్టు మిఱుమిట్లుగొనన్.
భార. విరా. 4. 114

గీ మిక్కుటంబుగ దృష్టి మిర్మిట్లుగొనఁగఁ, జెదల
వెలుఁగొందు దివ్యతేజంబు చూచి ...
భాగ. 10. ఉ 1308

ఉ. చంచలనేత్ర పోవునెడ సన్నపుఁ బయ్యెద
కొంగు జాఱఁ గాంతుంచుచె గాని చన్నుఁ
గవ కేవలఁ బ్రోవులు గట్టియున్న క్రొమ్మిం
చుం నాదుచూడ్కి మిఱుమిట్లుగొనం గన రాక
పోయె రాజ. చ. 3 38.

వ ... అపు డవ్వీరభద్ర తేజోవిశేషంబును గనుఁ
గొనఁ గన్నులు మిఱుమిట్లుగొన వెఱచఱచి
యెలుంగు డించి తొలంగితి ... భీమ 6. 60

గీ. కనులు చెదరంగఁ జీకట్లు గ్రమ్మె ననుట, కలరు
మిఱుమిట్లు గొనె నన నద్రినిలయ ...
అం భా 3. 109.

**మిఱుమి (ర్మి) ట్లు (ట్టులు) గొలుపు (ల్పు)** స. క్రి (√మిఱుమిట్లుగొను) దృష్టిని చెదరఁజేయు.

సీ. మెఱుఁగులు చూడ్కుల మిఱుమిట్లుగొలుపంగఁ
లేకతారుల బయల్ చిమ్మువారు ...
కళా. 8 41

సీ కమ్మి దీసినలీలఁ గనుపట్టునెమ్మేని మిసమిసల్
గడు మిఱుమిట్లుగొలుప ...
సారంగ. 2. 42.

ఉ మిక్కిలి తేఱిచూడ మిఱుమిట్టులుగొల్పుఁ
జరించునప్పు డమ్మెక్క దళుక్కునన్ మెఱసిన
ట్లగు . . విజ. వి 3. 14.

సీ. మించి దృష్టికి మిఱుమిట్లుగొల్పెడి నిది తెలియఁ
గారు మెఱుంగుఁ దీఁగె యేమొ ...
ఉ. రా 4. 189.

చం. .... చన్నులజిగి రేఁగి చూపఱకనుంగవకున్
మిఱుమిట్లుగొల్పఁగన్ ...
దశా. 2. 317

సీ. జెరసి మొగిళ్లు నెత్తురువాన గురిసెను మెఱుఁ
గులు దెసల మిర్మిట్లుగొలిపె ...
భాగ 3. 604.

గీ. కఱకుటడిదంపు బెడిదంపు మెఱుఁగుగములు,
మిగులఁ జూపఱచూడ్కి మిర్మిట్లుగొలుపఁ,
బొసఁగఁ బదినూర్ల తత్తడుల్ పూనినట్టి,
పసిఁడితేరెక్కి పోరికి బయలువెడలె.
అచ్చ. రా. యు 184.

**మిఱుమిట్లువోవు** అ క్రి (మిఱుమిట్లు + పోవు) మిఱుమిట్లుగొను.

సీ మెఱుఁగులఁ గన్నులు మిరుమిట్లువోవఁగ .
కు స 1.

ద్వి మిఱుమిట్లువోవఁ మీఱుక సందు, వెదక
కందని యరువగనీక .
పండితా ద్వి. 6. ప్రా

**మిఱుమిఱు** విశే (√మిఱు²) మిక్కిలి చంచ-
లమైనది, మిగుల చలించునది. (మిక్కిలి మిఱుమిట్లు
గలది అని శ ర)

కం దట్టపుదురుమును మీఁదికి, బిట్టించిన చన్నుఁ
గవయు మిఱుమిఱుచూడ్కుల్, నట్టాడు
నడుముఁ దేనియ, లుట్టెడు మోవియును
మనము నూరింపంగన్ భాగ 9 608.

**మిఱ్ఱు** = మిఱు¹ వి దే అనా మిట్ట, ఉన్నత
భూమి

కం పెనుమిట్టిది పల్లం బిది, యనకుండఁగ నోల
మును బయలు నొక్కటిగఁ గనువిచ్చుటయును
మోడ్పుట, యును సరిగాఁ దమము పర్వె
నుర్వం దోడ్తోన్ భార విరా 2 321

ఉ పల్లము మిఱ్ఱు వేఱుపఱుపన్ వెఱ వేదెడు
నట్లుగాఁ దమం, బెల్లెడ నిండఁ బర్వెటయు ...
దశకు. 9. 3

సీ. ... అన్న రాథముండు

గీ వేగ వట్టోడి యెల్లను వెడలి మిఱుత, నొక
వనస్పతి కొంప మై యున్న దానిఁ, జెంది ...
భార శాం. 3. 307.

కం ముసివసి నవ్వులు నవ్వుచు, మిసిమింతుఁడు
గాక యొక్క మిఱుత నిలిచి య, క్కుసుమ
శరవైరుఁడు తపసులు, కనమసఁ దనుఁ బట్టు
కొనఁగఁ గడఁగినఁ బెలుచన్. హరి 5. 57

కం. గుట్టముఁగొనిపో బుద్ధుల, కుట్టఁడ మీఁతాత
యెఁద్దకున్, నీతంబ్రడుల్, వెబ్రఱులు నీకైరదె
యీ, మిఱ్ఱున గంగాజలంబు మెలఁగ శుభ
మగున్ భాగ 9 215.

గీ. మెట్ట యన మిఱ్ఱు నాఁగఁ దోఁచు నుత్తాన
నామంబు .. ఆం భా. 1 158.

జ మిట్టమిఱ్ఱు

**మింసము** న వి అ న 1. కలియుం, సమా
వేశముగట

**మిఱమిఱ** వి. 1 మృదువస్తువులు మెదలట,
మెఱఁగుట, మె. వాసియుఁ నగుపోవి ను
కరణము

సీ. తిఱతెఁడుచులో మిఱమిఱ మెదలెడు కర
పడిఁబుల నవఱపములను . .
భాః డ్రి. 556.

వ. పుట్టపట్టలు గొట్టి గడ్డుచీమఱలు జాముల
మిఱమిఱ మెదలుచెడల . ప్ర ఖ 156

వ .. చాపకట్టువడిన ఘోట కంబుల క్రింద
మిఱమిఱ మెఁగెడు రావుతులను ..
ఉ హరి 8 27.

2. తళతళ మెఱయుటయం దగుననుకరణము
చం. మిఱమిఱమంచు మించు చకిమించుల ముద్దుల
చందమామకాఁ, తులఁ దులఁదూఁగు .
శ్రీ . 254.

3 తళతళ కాంతి.
(దీనికి కర్మధారయమునందు నిగాగమము)

సీ మిసిమి గుల్కు మెఱుంగు మిలమిలల్
చెక్కులఁ గాశ్మీరపత్త్రభంగముల మనిచి ...
చంద్రా. 6 124.

వ ... మీమొగంబుల మిఱమిలలు గిలుబాడ
వచ్చెఁ జమీవెన్నెల బచ్చుముచ్చు .
వసు 4 23

వ మిఱమిఱని జిలుఁగు వలిపెంపు వలువలతెరల
యొడల వెలువడి ... భీమ 1 117.

కం. మిలమిలని ప్రొద్దుపొడుపున, ధళధళమను
మెఱుఁగు దిగ్వితానము నిండెన్ ...
భాగ 10 ఉ. 1002. హరిం, 4 221.

జ మిఱమిలన, మిఱమిలమను, మిలమిలలాడు.

**మిలమిలన.** వి. (√మిఱమిల) మిలమిలమను కాంతి
విశేషము

కం. తలతలమను మల్లికలం, గలకల నిడి తమ్మి పూలఁ గలకల నగుచున్, మిలమిల నై తల తల నై, కలగలమాన్నమ్ము నిడిరి కలగలలల నల్. బహు. 4. 19.

మిలమిలమను అ క్రి. (మిలమిల+అను) మిల మిలలాడు, మిలమిలప్రకాశించు

వ ... హరివాణంబుల మిలమిలమను ధవళకల మాన్నంబులు గిన్నియల నించి ...
వరాహ. 4 165

మిలమిలలాడు అ క్రి. (మిలమిలలు+ఆడు) తళ తళ ప్రకాశించు.

చం మిలమిలలాడుచుం డవిలి మింట వెలింగెడు రిక్కలన్నియున్, జలజల రాలఁ దన్నుదునో ... అప్ప. రా సుం 22.

మిలిందము. సం. వి అ పుం. తుమ్మెద, భ్రమరము

మిళితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. కలిసినది, కూడినది.

మిల్లి. వి. (క మిల్లి) అల్పకంబి, చిన్నగరిటె.

గీ. మిల్లి యన నల్పకంబి, యా మిహిరభూష ...
అ శా 2 243

మిళిగె వి. (క. మిళి) కొరడా, చేఁబుకోల, కళద్వి కల్లగుఱ్ఱమునకుఁ గంకటిం బట్టి, ముల్లును మిళిగెయు మోపుట గాక, యుత్తమాశ్వములు వాగె త్తిన రౌతు. చిత్తానఁ గలయట్లు చెలరేఁగి దాఁటు. ప్రభు. 3 92. పా. 20 పం.

మిఫులు — మిగులు. (దీనితుమున్నాద్యర్థక రూపము క్రి విశే. గా ప్రయోగింపఁబడి యెక్కువగా, అత్యంతము అనునర్థములనిచ్చును.)

చం తివిరి త్రియామకు న్నొసగు దిద్దుకొనంగఁ బురోదశాళి దా, గవిసెన వ్వైరించుమణి కల్పితదర్పణమో యనంగఁ నై, రవకుల బంధుమండలము రాజిలె నోలిని నూలియమూన మై, మిపులఁ గళంకలక్ష్యతఁ దమిప్రతిబింబము నంత నేర్పడన్. ప్రభా. 4. 122

ఆ. మొగిలుద్రిప్పు నూటిముద్దులపట్టి దా, నరిగి నేలకాన్పు నరసి వచ్చు, తెలిమిఁ దెలిపి యా పెతఁమానికము రాగ, పుల కొసంగుటయు మిపులఁ జెలఁగి. అప్ప. రా. సుం 178.

మిశి. సం. వి ఈ. స్త్రీ. 1. పెద్దసదాప (వృ.వి.) 2 జటామాంసి (వృ వి).

మిశ్రకము సం. విశే (అ ఆ అ) 1 కలసినది సంకరమైనది

వి అ. న 1 ఉప్పునేల (ఊసరక్షేత్రము) మొ. నుండి తీయఁబడినయుప్పు 2 ఇంద్రోద్యానము, నందనవనము

మిశ్రజము. సం వి అ పుం కంచరగాడిద.

మిశ్రణము సం వి అ న. 1. కలుపుట. 2. (గణిత) మొత్తము చేయుట. కూడిక

మిశ్రము సం. విశే. (అ. ఆ అ) కలిసినది.

వి అ పుం 1 ఒకజాతి యేనుఁగు.

2. కృత్తికావిశాఖా నక్షత్రములగుంపు.

న 1. మూలకభేదము, ఒకజాతి ముల్లంగి. 2. ఊసరలవణము.

మిశ్రవర్ణము. సం. విశే. (అ. ఆ. అ) మిశ్రమైనరంగుగలది.

వి. అ. న కృష్ణాగురువు.

మిశ్రశబ్దము. సం. వి. అ. పుం. కంచరగాడిద.

మిశ్రితము సం. విశే. (అ. ఆ. అ.) 1. కలుపఁబడినది 2 చేర్పఁబడినది. 3. గౌరవార్హమైనది, పూజ్యమైనది.

మిశ్రుఁడు. సం వి. అ. పుం. 1. గౌరవార్హుఁడు, పూజ్యుఁడు.

(ఇది గొప్పవారల యొక్కయుఁ బండితుల యొక్కయుఁ బేరుతర్వాతఁ జేర్పఁబడును.)

ఉదా : వసిష్ఠమిశ్రుఁడు, మండనమిశ్రుఁడు, మొ

మిశ్రేయ సం వి ఆ స్త్రీ సదాప (వృవి.)

మిషము సం. వి అ పుం స్పర్ధ, విరోధము, ఛలము

వ వ్యాజము, సాకు, నెపము నైష. 1. 56.

మిష్టము సం విణ (అ ఆ అ.) 1. మధురము.
2 తడిసినది, చెమ్మగిల్లినది

వి అ ఘం మాధుర్యము

మిష్టాన్నము సం వి అ న తియ్యనియన్నము' రుచిగలపదార్థము

మిస వి. కాంతివిశేషము, ఒకవిధ మగుకాంతి (దీని యామ్రేడిత రూపము మిసమిస)

కం చన్నులపస యటుమీఁదట, గన్నులపస ముద్దు గుఱ్ఱఁగేముఖమున మేల్, క్రొన్నెల మిస జిగిబిగివగ, చిన్నెలమఱచూచి వలచుఁ జిత్తజుఁ డయినన్ హంస 2. 98

ఇ మిసమిస, మిసమిసమను.

మిసమిస. వి (మిస + మిస) 1. అధికకాంతి, విశేషకాంతి

సీ కమ్మఁదీసినలీలఁ గనుపట్టునెమ్మేనిమిసమిసల్ గడు మిరుమిట్లు గొలుప ... సాంగ 2. 42.

సీ. వినుమానికముచాలు గొనఁ జాలుతనడాలు వలుదెస మిసమిసల్ గలయ వెలయ ...
సమీం 3 98

సీ. ధగధగత్ప్రజ్వలత్పటుతటిల్లతికాళి మిసమిసన్ మెఱసి యాకసము నిండ ... శుక. 1 187.

2 మెఱయుట యందలి యనుకరణము

కం. .. కోమలతనువుల్, మిసమిస మెఱవఁగ వేశ్యావిసరము ... భాగ 10. ఉ. 686.

వ . మిసమిస మెఱయుచున్నయంబు లాస్యంబులం జర్వించి గర్వించి ఉంకెలు వేయుచుంకలును. ...
చిత్ర. భా. 3. 135

(కర్మధారయమునందు నిగాగమము.)

లయవిభాతి మిసమిసనిచన్నుగవపసకు నెస మాఁద్మసలవసమకళికల్ చిదుమ నెనఁగుతటి శాఖా, విసరములుగ్రమ్మఁ గరబిసనటనఁ ద్రోచి ... రా. వి 8 107.

వ ... విలసితగ్రైవేయక ముక్తాఫల హారనిచయంబుల కిమ్ముల చూపక మిసమిసనిపసఁ గల మెఱుంగులు గిలికొన ...
భాగ 10 ఉ 831.

మిసమిసమను. అ క్రి (మిసమిస + అను) మిసమిస ప్రకాశించు

సీ గిలికొన్న పల్లజుంజులు వెక్రుకలవాఁడు మిసమిసమను మిట్టనొసలివాఁడు ....
వరాహ 2. 45.

కం మిసమిసమనుసిరు లెసఁగెడి, కిసలయవిసరము హసించు కేలన్ సకియ, యస్యసమశరుఁ గన్న గన్నసామికి, గుసుమములనిమ్ముగ లఱుతఁ గూరిచి యంతన్. ముకుం. 3 244.

ద్వి మిసమిసమను వీకిమెఱుఁగుఁ జెందొకలు గనిమసంగెడు వైరికటి తుండములె
ద్వి హరిశ్చ పూ. 1108. పం

మిసి[1] వి కాంతివిశేషము.

(దీని యామ్రేడితరూపము మిసిమిసి)

గీ. ఇట్టిపస మిసిజిగి బిగి యీవిధంబు, ప్రణుతి సేయంగఁ దరమె యాబ్రహ్మకైన ...
హంస. 1. 85.

ఇ మిసిమి, మిసిమిసి.

మిసి[2] వి మత్స్యవిశేషము.

సీ. మిసి కల్లరుజు తేలుమీను ... హంస 4. 187.

మిసి సం. వి ఆ. స్త్రీ 1. సదాప (వృ. వి.)
2. జటామాంసి (వృ. వి.).

మిసిమి. వి. (మిసి[1]) 1. కాంతివిశేషము, లావణ్యము

మ. నవలావణ్యరసంబు పళ్లెరములోనం బోసి యగ్రంబునన్, భవదీయాస్య మొనర్చి యార్చి పిదపం బ్రాలేయరుఙ్మండలంబు వినిర్మించె విరించి యచ్చిలుము వోఁ బూఁబోఁడి యాచిహ్నమం, బుపులం దాతఁడు చేఁదొలంచుమిసిమిన్ బుట్టెన్ సరోజాతముల్.
నైష. 8. 198.

గీ పసిఁడిగట్టున కొకవింతమిసిమి నించి, నెఱసెఁ గసపావి మరుపలి తెలుపయొండ ..
పారి. 4 43.

సీ మెఱసి నిల్కడచూపు మెఱపులో యొఱపు బిత్తరుపు లోతరము నిర్వాపనిండి, పసిమిలో మిసిమి రిబ్బనపు సంపఁగిపూ తావిలో తావి ...
ఘటికా. 2 87

2 నవనీతము, వెన్న.

సీ పాలమున్నీటి లో పలిమీఁది మీఁగడ మిసిమి జిడ్డునఁ జేసి మేను వడసి. భాగ. 8 266.

సీ మినుకు టాకుపులవాని మిసిమిమేఁతలవాని మెఱుఁగుజామనిచాయమేనివాని ...
పాండు 1. 213.

గీ మిసిమి గలపుల్ల పెరుఁగుతో మిళిత మైన యావ పచ్చళ్లు చవిచూచి రాదటమున ...
నైష. 6. 130.

3 భాగ్యము, సంపద.

సీ గుట్టు పోనిచ్చినఁ గిట్టుఁ బెద్దఱికంబు దుర్వ్యక్తి యపరుఁడైనఁ దొలఁగు మిసిమి ...
రామలిం. 48.

4 (హిం పుస్త) పండ్లకప్పు.

(అంధకార వర్ణనము)

సీ బ్రహ్మయై యుదయించి భానుఁడు లయ మొంద నెరసినచతురబ్ధినీర మనఁగ, సమయంపు యమునఁడు జాలిల్లి కువహార మొసఁగఁ దెచ్చిన చెక్కమిసిమి యనఁగ చంద్రా. 5 49.

(వ్రాఁత ప్రతిపా. మిసిరి. ముద్రిపా.

విశ. 1 లావణ్యముగలది, తళతళలాడునది

సీ ఒసపరి మిసిమి నెన్నొసలిగసల్ గాంచ మొలక క్రొన్నెల జనుల్ మ్రొక్క నయ్యె
దశా. 8. 151.

కం ఉ గముల మణిహారంబులు, కటములఁ గట కాంగుళీయకప్రముఖములున్, శిరమున మిసిమికుళాయుల, ధరియించి చెలంగి రఖిలతరుచ ముఖ్యుల్
ఉరా 5 270

కం. తనుఁ దునుమఁ దలఁచుతత్కృ, మినిరన్నను మున్నె యతఁడు మిసిమికటాన్, దునిమి ఒలి యొసఁగె సాహస మెనయం దల మొత్తి బాసి యిచ్చెన నమమున్ శుక 3 77.

2. స్నిగ్ధము, నున్నని

గీ. దండజము కాణమునఁ జేర్పుదఁడెయును బ, సిండిబురుసా మిసిమిగవిసెన సలుచు, నిద్ద పువిపంచియును నిల్వుటద్ద మమరఁ, బడ కయిలు సొచ్చె నప్పు డప్పుడమిఁ జేము.
రా. వి. 5. 86

గీ. చిక్కన మిసిమి మిహి జిడ్డు జిగుసు జిగట, ... అన, స్నిగ్ధనామంబు చెలఁగును . .
ఆం భా. 2. 252.

**మిసిమింతుఁడు.** విశ. శ్రమనొందినవాడు, అల సినవాఁడు.

గీ. ... శిఖండి పటుమార్గణాబులఁ గడఁగి యేయ, నతఁడు మిసిమింతుఁడును గామి కల్ల నవ్వి, పఱపెఁ దనయమ్ము లతనిపై ఫల్గునుఁడు .. భార భీష్మ 3 398.

కం. అంతఁ దెలిసి యసురద్విషుఁ, డెంతయు రథ సమున శత్రు నెదిరి కదిసి దు, ర్దాంతగతి వ్రేయఁగా మిసి, మింతుఁడు గా కాతఁ డొక్క గమిద్దపు శక్తిన్. పారి. ఉ 1 180.

సీ మిసిమింతుఁడును గాక పసియించుఁ గుత్తుక బంటినీరము బుందువ టి చలిని....
పాండు 3 39, శ్రీను 1 110.

**మిసిమింతురాలు** విశ. శ్రమనొందినది, అలసినది.

ఉ చక్కనివారిలోన నెఱజాణలలో విటరాజ కోటిలోఁ, జిక్కనివారిలోఁ గడుఁ బ్రసిద్ధి వహించిన నీవు ప్రాణముం, దక్క నచోట నీ మనసు ధైర్యమున న్మిసిమింతురాలు గా, నక్కట పుష్పసాయక మహాకరినాత్మలువో మృగేక్షణల్. హర. 3. 85

గీ లోలోచన మిసిమింతురాలు గాక, వహ్ని

కీలలో నిట్లు వన్నె చెడక, యున్న దిది చాల
చిత్ర మోహాం తలంప, వినియుఁ గనియు
నెఱుంగ మివ్విధము నెచట.

హరివం 5 140.

**మిసిమిసి[1].** వి. (మిసి[1] + మిసి[1]) అధిక కాంతి
ద్వి బిట్టుదాఁటుచు జిగిబిగి నేసరించు, పుట్టచెం
డ్లారితిఁ బొదలుదుప్పులును, మిసిమిసిలంపులు
మేసి తాఁ గ్రొవ్వి, దుముకులు వాఱి గంతులు
గొనులేళ్లు. నవ 146 పా. 26 పం.

**మిసిమిసి[2]** వి. మేఁక చేయుధ్వని కనుకరణము.

వ. .. అయ్యజవల్లభుండు సురతసంతంత్రుఁడై
మిసిమిసి యనుశబ్దంబు సేయుచుఁ దచ్ఛాగి
వెంటం జని .. భాగ 6. 516

**మిసుకు(గు).** అ. క్రి. (క. మిసుకు) 1 కదలు, చలించు.

గీ అకట యే మందు దల్లియిల్లాలి కైన, నెవ
గలదు గాని వానిలో నడచుదాని, కుబుసు
పోకకు నేని వేఱొక్క దారి, మిసుకఁ గూడదు
మేరకు మేరగాదు. కువల 4 163.

గీ ఎన్ని విధముల మాటాడ కున్న యట్టి, గట్టి
పూనిక నీయందుఁ గలిగెనేని దాని కొక
యుక్తి మునుమున్నె తలఁచినాఁడ, మిసుగ
వచ్చునె విట శిఖామణి మెసుట.

నిరం. 3.17

2 వడఁకుఁ, భయపడు.

గీ .. ఒకరి కొకటి, యొసఁగఁ బోసఁగునో
మిసుక రాదో పరులకుఁ, బుట్టినిల్లలె నత్తయి
ల్లెట్టు లగును .. పాంచాలి 5. 52.

**మిహి.** విశ. 1. ప్రశస్తము, చొక్కము

సీ. మిహిపసిండిపరుంజు మొహదా కెలంకులరావు
గుజ్జరినేఁతకేవడంబు ... మనుచ. 4 28.

కం. నునుగఱులు తళుకుమీసలు, మినుమినుకను
కన్నుదోయి మిహికుందనపుం, దనువుం గల
యొకమీనము .... దశా 1. 131.

ఉ ఈ మధురాధరంబుజిగి యీవిగిపోరపుఁ జన్ను
దోయితీ. రీమురిపంపుఠేనగవు లీమిహి బంగరు
రోయితీ రీమురిపంపు లేనగవు లీమిహి బంగరు
రంగెంగుమేను ... మీర. 2. 48

2. స్నిగ్ధము, నున్ననిది

గీ చక్కనవమీమి మిహి జడ్డు జిగురు జిగట
.. అన, స్నిగ్ధనామము లెలఁగను ..
ఆ. భా. 2. 252.

3 క్రొత్త, నూతనము.

గీ క్రొత్తమిహి పౌస యనఁగ మీఱును
నవంబు ... ఆం. భా. 2. 29.

**మిహిమల** = మేరుపర్వతము.

క. తుహినాంశుని గెల్చెద నని, మిహిరోర్వి లోక
ములు క్రమించి యమునన్, ఒహుయోజన
ముల పొడ వగు, మిహిమలతుదఁ జేరి విక్ర
మించిన యంతన్ ఉ. రా 4. 46

**మిహిక** సం వి. అ. స్త్రీ. మంచు, హిమము.

**మిహిరము.** సం. వి. అ. పుం. జిల్లేడుచెట్టు, అర్క వృక్షము

న జలము, నీరు (కే ని.)

**మిహిరాణుఁడు.** సం. వి. అ పుం. శివుఁడు. (త్రి ని.).

**మిహిరుఁడు** సం వి. అ. పుం. 1. సూర్యుఁడు
2. చంద్రుఁడు. 3 వాయువు. 4. వృద్ధుఁడు.
5. మేఘుఁడు

# మీ

**మీ[1].** స. నీ శబ్దబహువచన రూపము. (చూ. నీ)
కం మాయందు లేనిగుణములు, మీయనురాగ
మునఁ జేసి మిగిలివెలింగెన్ భార. అర. 1.3.

**మీ[2].** విశ. (త. మీ. క. మే.) వృత్తియందు
మీఁదిశబ్దమునఁ దొలియచ్చుమీఁదివర్ణములు
లోపింపఁగా మిగిలినరూపము.

(దీనికిఁ బరుపవర్ణము పరమగునపుడు నుగాగమం బగు.)

ఉదా : మీఁగడ, మీఁగాలు, మీఁజేయి మొ.

మీఁగండ్ల మెకము. వి. (మీఁదు + కన్నులు + మెకము) శరభము, ఊర్ధ్వలోచనము. (శ. ర.)

మీఁగడ = మీఁపడ. వి. (మీఁదు + కడ. త. మీక్కడై, మింగడ) కాఁగిన పాలమీఁదిశెట్టు. మండము ; పెరుఁగుమీఁదిశెట్టు, మస్తువు.

సీ. తొలఁకి మింటికిఁ బొంగుమగ్ధపాథోరాశికర డులమీఁది మీఁగడల మెఱుఁగు ... మనుచ. 5. 38.

సీ. కనరు వోకుండఁ గాఁచినయానవాలతోఁ గడి నేయ వచ్చుమీఁగడలతోడ ... పి. శకుం. 1. 135.

సీ. మీఁగడ యంచన మీఱు మండాభిధ ... ఆం. భా. 2. 256.

చం. ... పేరినమీఁగడతో మనంబులన్, పసిఁగొనఁ జేయువాహరిపుబప్పయణీపథిపిండ ఖండముల్, -మెసవిరి కంఠదఘ్నముగ ... నై ష. 6. 129.

సీ. నేరంబు లోమెడునియతికానికి గట్టిమీఁగడ కానుక గాఁగ నిచ్చు ... శుక. 2. 557.

మీఁగడతెర. వి. (మీఁగడ + తెర) భక్ష్య విశేషము.

వ. ... పొంగలి పుళియోగిరము దధ్యోదనంబు తిరువీసంబు పరమాన్నం బావవాలు జున్నులు మీఁగడతెరలు నవనీతంపుముటికలు .. ప్రబంధ. 112.

మీఁగాలు. వి. బౌ. (మీఁదు + కాలు) పాదో పరిభాగము.

మ. ... ఆ, హరి(శ్రీ)పాదతలంబుఁ దూఱుకొని యయ్యస్త్రంబు మీఁగాలని ,ష్ఠురవేగంబుననుచ్చి పోయె ... భార. మౌ. 83.

మ. ... అం, దము లై మీఱెడు తెల్లచాలు గమి లోనన్ గొమ్మమీఁగాళ్లు చూ,చి మదిన్ జూడఁగ వీనిపాట గలదే చెప్పంగ నెచో,ఁ గవన్ ... యయా. 4. 50

గీ. కచ్ఛపంబులఁ బోలి మీఁగాళ్లు దనరు ... ప్ర. భా. 2. 86. ఆం. భా. 2. 185.

మీఁ-కే(చె)యి. వి. (మీఁదు + చేయి) చేతి పై భాగము.

సీ. మీఁకేయి నాఁగను మీఱుఁ గరోపరి భాగంబు ... ఆం. భా. 2. 189.

మీఁటగు. అ. క్రి. (మీఁటు + అగు) ఒప్పు.

చం. ధర యనుకొల్నిలో,మొలచుతామరపూవనఁ గోట మీఁటగున్ ... పాండు. 1. 106.

కం. ఈలీలఁ బురములోపల, మేలౌ ప్రాయంపురూపు మీఁటగువారిం, జాలి భయలజ్జలన్నియుఁ దూలి చనన్ వెన్నుఁ బఱచి తొలఁగక కలయున్. హంస. 1. 221.

మీఁటు. స. క్రి. (క. మీంటు, త. మిట్టు) ఇది సానుస్వార మని చి. ని. నిరనుస్వార మని శ. ర. నిరనుస్వార మనుటకు మనుచ 2. 70. ఆము. 2. 54. బహు. 8. 68. వసు. 2. 156. నిర్ధారకములున్నను. భార. ఉద్యో. 4. 407. ను బట్టియు. కన్నడమునుబట్టియు సానుస్వారముగా గ్రహింపఁ బడినది.)

1. వీణె మొ. వాయించు, ప్రయోగించు.

ఉ. ... సురాంగన లాడఁ గిన్నరుల్, కిన్నరమీఁటి పాడఁ దిలకించుచు నిద్యోడ కేలరాఁ డొకో... వసు. 5. 58.

చం. విపంచి మీఁటగతి ప్రయోగి యళుల్ వెడలెం గొలంకులన్ .... మనుచ. 3. 60.

చం. నఖరాంకురమ్ముల నయమ్మునఁ దంత్రులు మీఁటి గాన మిం, పొనరఁగఁ జేయువాణి ప్రతిభోన్నతుఁ జేయుతఁ గృష్ణరాయనిన్ ... పారి. 1. 5

2. ఎగజిమ్ము.

ఉ. ఆతతలీలఁ గోమలనవాంశుకపాళి మహాంధకారసం, ఘాతము మీఁటు నద్భుతముగా శశలాంఛనుఁదక్షవీథికిన్ ... భీమ. 2. 59.

రగడ. తెఱవ యెచటనుండి పాలుతెంచి తెంచితే సరాలు, మెఱుఁగుబోఁడి చెక్కు చెమటచే టు మీఁటుమిగులఁ జాలు ... వరాహ. 3. 92.

ఉ. పోటన బంతి మీఁటుగతి భూవరుఁ డంప్రమిన ఖాంచలంబులన్, మీఁటిన గట్టు బి ట్టెగసి మేదిని వ్రాలు ఘనస్వనంబువన్, హాటక శైల కూటకటకాళిఁ బ్రతిధ్వని బర్వె ...
వసు 2. 166, మనుచ 3 28

3. త్రోయు, తట్టు, వ్రేలితోఁగొట్టు

కం. వీటు వడి ధర్మ మనుబరి, దాఁటిననామనను లోని దర్పము వెడలన్, మీఁటి కరాంజలి మణిమయ, కోటీరాగ్రమునఁ బెట్టికొని యుట్లంటిన్.
వరాహ 7. 86.

మత్తకోకిల. మేటివెల్లు దగన్ త్రికూటము మీఁదఁ జూడుము దృశ్యమున్, దాఁటి మాయను మాటిమాటికిఁ దాల్మిచే నటు మీఁటుచున్.
సీతారా. 1. 156.

సీ. చల్ల నమ్మఁగఁ బోవుసతులకొంగులు వట్టి మెఱుఁగుచెక్కిళ్లను మీఁటిమీఁటి ..
భాగ. 10. 692.

సీ. పడకటింటికిఁ జెలుల్ ప్రార్థించి యనుపుచోఁ దలుపు మీఁటితిఁ జూమీ తతనితంబ ....
శుక. 3 500.

ద్వి. శిశువులు వాపోవఁ జెక్కిలి మీఁటి, విశదాత్మ పాలు ద్రావించుచందమున ...
ద్వి హరిశ్చ. ఉ. 196 పం.

ఉ .. అ, ప్పాటలగంధి వేదననెపం బిడి యెడ్చెఁ గలస్వనంబుతో, మీఁటిన విచ్చుగుబ్బచనుగుబ్బల నశ్రులు చిందువందగన్ ... మనుచ 3. 70.

4. పోఁగొట్టు, తేలికగాఁ బోఁగొట్టు

సీ. ... తులువలబలుత్రొవ్వ దొలఁగ మీఁటె.
సీతా. 1. 12.

సీ. మిత్రాధికారంబు మీఁటి వేయఁగ వచ్చు మహితోపకారంబు మఱవ వచ్చు ...
రామలిం 7.

5 వేయు, (బాణాదులను) ప్రయోగించు.

ఉ. ... మరుఁడును జిల్కతత్తళా, మీఁదఁ జివుక్కనం బడి తమిన్ మగతుమ్మెదనారి నింగిడిం, బాదుకొనంగఁ జేసి యొకపారియ మీఁటెను బువ్వుఁదూపులన్. మధుసేనము 1 145.

2. పెఱుకు, ఊడదీయు.

ఉ ఎవ్వఁ డొకో లయాంతకుని నేనని మార్కొని కోఁఱ మీఁటె వాఁ, డెవ్వఁడొకో పురాంతకుని యెక్కుడుకన్నరకాఁడదన్నె.
భా రా అర 1 158.

7 (తేలు) కుట్టు

కం. దరఁ దేలు మీఁట కున్నను, గర మపుడగ తెక్కిఁ గొనరు గదరా ... సుమతి. 31.

కం తేలనుచు బిగియఁ బట్టిన, మే లెఱుఁగునె మీఁటుగాక ..(శ. ర.)

8 తీసివేయు, పోఁగొట్టు.

సీ. కర్ణాభరణహల్లకము వోవ మీఁటెదుతెఱఁగున గొబ్బున దీపమార్పి ... విక్ర. 8 96

మ పొలయుం గాడ్పు లుదఙ్మహోలయవదంభో జాతవతుస్తుల,స్థలఘుప్రసఙ్మకరందబిందువుల ... తాపత్రయి మీఁటి ... ఆము. 1. 78.

9 విడుచు, త్యజించు.

గీ. వీని వెడలఁగ ద్రోయుఁడీ వీటికోట, దాఁటునంచాక ననుమాట నోట నుండ, నీటు వో మీఁటి గరువంబు మాటి యిటకుఁ, బెద్దపర్వున వచ్చితి బెదరు పుట్టి కువల. 4. 71

విశ. (వీణ. మొ వానిని) మీఁటుట

శా ఔరా రాగము బాపురే యెదుకు తాయంబుల్ బళి స్థాయిపం, చారిప్రాపులు లెస్స కంపితము మైచా గోపహా మే లమ్మయ, య్యారే మీఁటు... వాల్మీ. 3. 129.

సీ. మేటియై మజ్జారె మీఁటు వహించె నింపయ్యో· నయ్యారె కంపితంబు ... సమీ. 6. 219

శా ఔరా మీఁటు బళిరె కంపిత మహో యాందో

శితస్ఫూర్తి . చంద్ర. 1 127.

2 ఎదురుపాటు. (ఉద్రేకము అని శ. ర.

కం మీఁటు గలరాజ భికుల, నాఁటికి వేవురు వచింతు నరుశరములు నో, నాఁటి పరవై చునంతకు.
భా. ఉద్యో 4. 407.

3 సొగసు

సీ మీఁటేరుపకి మంచిలోళేరు వెట్టినముకువు చూపట్టెడు ముక్కుచెక్కు .
వాల్మీ 3 119

చం చూ, చెద విపు డన్నియున్ నృపతిచెంతఁ జెలి యనుమాట మీఁటుగన్ ... కకు. 3. 143

సీ మేటిగ్రైమై మజ్జారె మీఁటు మీఁటు వహించె నిం పద్యో నయ్యారె కంపితంబు . .
సమీర 6 213

సీ. కోలగోడల నైన మీఁటుగా నెగఁ బ్రాఁకి దాట నేరనిదేటి తలిరుఁబోఁడి .

హంస. 1. 102. (ఇట వాక్యాలంకారము.)
హంస. 1. 193.

4 మల్లవిద్యావిశేషము.

క. ఇది మెన యిది వలు కిది పో, టిది మి టిది చూ టిది దుము కిదె యిదె యని తా, రుదిరి పడి పండ్లు గీఁటుచు, సదమదముగఁ గాలుఁ గేలు జంటఁ బెనంగన్. ప్రబంధ 786

విశే. 1 శ్రేష్ఠము.

శా. వీట స్త్రీఁ లగుణోటు లేటివందన్ వేమాఱు గ్రీడింప . . వసు. 1 111.

ఉ. పాటలగంధి నీపెదవి పైకొనునాపలు మోపఁ గాఁజుమీ, మీఁటమృతంబుకంటె . .

బహు. 3. 68 ద్వి పరమ. 7. 531 పం

2, పెద్దది, గొప్పది.

ఉ. మీఁ టగుమీల నెల్ల మును మ్రింగి క్రమంబున నానె నెండ పై, స్ఫటికవెంటఁదోఁచు .
బొమ్మ డాయ డా, తూ్కటకులంపులెలెన బకోట కులం బజల హ్రదంబులన్ ఆము 2. 54

3 అందమైనది, ఒప్పైనది

చ సిజసంభవుండు పురసారసగేహినికిన్ రచించున, చ్చెరు వగుసీలవుంగుకువు జెక్కిన వేలిసి డి ముద్దుటుం, గరమన మింటితో నాఁ యికన్ గనుపట్టెడు గోవురస్ఫురద్గురుతర నాతకుచరుచి గుంభితసాలము వీట మీఁటు గన్ చంద్రా 1 8.

4 (తత్కాలమునకు) ఉచితము, తగినది.

వ . రెండుతెలుఁగులవారును బోరాడు వేడుకం మీఁ టగుమాటల సందడించుచున్న సమయంబున . . . భాగ 8 331.

జ మీఁటగు, మీఁటుకొను, మీఁటుమిగులు

మీఁటుకొను స. క్రి. (√మీఁటు) చిమ్ము, విజే పించు

సీ కొనగోళ్ల నుదుట గ్రమ్మిన పెంజెమట మాటిమాటికిఁ దిగిచి పో మీఁటికొనుచు . . .
వైజ 1. 131.

మీఁటుమిగులు అ. క్రి (మీఁటు + మిగులు) మిక్కుటమగు, అధికమగు, అతిశయించు

గీ తురంగమేధమఖస, హస్రములఁ గల్గు కమ్మనిహవ్యతతులు, మీఁటుమిగులంగ మెసఁ గిననోటనుండి . . . వరాహ 12. 61.

గీ అరదృశం బగు తనగతి నొసలఁ గన్ను, గలుగు నంతటిబలు వేఁటకానిసార, మేయముల కైనఁ బట్టిక మీఁటుమిగిలి, చనదె యూహోంభూదార మనఁగ నపుడు. వరాహ. 12 31.

మీఁదఁజూచు = గర్వించు, ఔద్ధత్యమునొందు.

కం సిరి పెంపునఁ గడు నొప్పెదు, సురనాయక యిపుడు మీఁదఁ జూచెదు . . .
భార. శాం. 4. 435.

మీఁదమీఁద = ఉత్తరోత్తరమున, ఒకదాని వెంట నొకటిగా.

ఆ. మీఁదమీఁద సుఖనిమిత్తంబు లొదవుచో, నడుమఁ జెందు నిజజనంబుపీడ . .
కళా. 5. 32.

మీఁదవచ్చు = దండెత్తు, యుద్ధమునకు వచ్చు

సీ తనమీఁద వచ్చినఘను లగుదొరలను నూటికై
నొక్కని గీటడంచి , రంగా. 1. 112

జ. మీఁగండ్ల మెకము, మీఁగడ, మీఁగడతెర
మీఁగాలు, మీఁజేయి, మీఁదిమిక్కిలి, మీఁదిసాకిరి
మీఁదుమిగులు

మీఁదికిమీఁద = వెంటనే, శీఘ్రముగ

ఉ ఆయవనీసురచయం బురుసత్త్వుల నుగ్రులన్
మహాకాయులఁ దగ్గణాధిపులఁ గాంచుచు
మీఁదికిమీఁద జీవముల్, వోయిరి . . .
కు సం 2 201

మీఁదిసాకిరి వి (మీఁదు + సాకిరి) ఉత్తరసాక్షి. (శ ర)

మీఁది(దు)మిక్కిలి విశే (√మీఁదు) పయి పెచ్చు అధికము.

కం. వను విడిచినఁ గొంపోయినఁ బనికొదవలు లేమి
సరియె పత్త్రిక చేఁ జిక్కినయది నీ వికఁ
సీడగి, లిన నొచ్చుట మీఁదిమిక్కిలి వివేకింపవ్.
ప్రభా 3 145.

కం అలుఁగులపోకడలను మైయలయికలును
మీఁదుమిక్కిలై కడు లోనై, బలములు తమ
తమశాఖా, బలములు నటఁ బనికి రాక భయ
విహ్వలులై. విజ. వి 3 156.

మీఁదు. వి శౌ (త. మీదు) 1. ఉపరిభాగము, పై.

కం. మోఁద మెడ ద్రొక్కి నెక్కును, మీఁదికి
నెగయించు వంచు మెయి సారించున్ ..
ఉ హరి 6 103.

ఉ మేరుమహామహీధరము మీఁదికి నందఁ
బోయి యేక్రియన్ . భార. ఆది. 2 9.

చం . . కలమము లుండు . . . దృష్టి లోఁ,
దలకొన వంగి మున్ జలము ద్రావెడు క్రిందటి
వేళ్ల మీఁదటన్, నిలిపి మరంద మానుకరణిన్
నికటోపవనానిలాహతిన్. ఆము 1. 67.

2. అంతస్తు, మేడపైభాగము, నిలువు.

ఉ మేడమీఁదు లెక్కి యంటమేనకఁ గ్రేశి
యొనర్చు ప్రాయపుం, జేడియ లబ్బురంబయిన
చెంగలువల్ తగఁ జల్లి రందఱున్
యయా. 4 153.

3 ఉత్తరకాలము

సీ పైతృకం బగుటకు . ధర్మజుఁ డిప్పుడు
దాల్చిన నాతనితనయుండు మఱి దాలఁ
దాల్చు మీఁద . భార ఆది 6 127.

చం. . . . ఏటికిఁ దత్తరపాటు మీఁది చే,
తెలుఁగవు నీవివేక మిపు డెక్కడఁ
బోయె . సారంగ 2. 14.

చం. తలకొని యున్నతొంటిసుకృతంబుకతంబున
వచ్చి మీఁదటన్, గలిగెడు శోకనంబు లకుఁ
గారణమై . . . విక్ర 4. 5.

మ అనుచున్ జెప్పలు తేలవైచుచు విశుష్య
త్కంఠయై రుక్మిణీతనయా మీఁదట నైన
నీవ పతివై తద్ధర్మ మీడేర్పుమీ . . .
ప్రభా. 5. 6.

(ఇట నుత్తరజన్మ మని భావము)

4 ఉత్తరకాలఫలము, ఉదర్కము.

గీ కురుకుమారులు దమయంతఁ గుడిచి క్రొవ్వి,
మీఁదెఱుంగరు మా కేమి మేలు కాక, నాలు
కలు గోయు నర్జునావలము దఱిసి, యొర గొనం
గని సంతృప్తి యొసఁగ మెసఁగు
భార. ఉద్యో. 4 12.

కం పోఁ దడవు లేదొ క్రమ్మఱి, రాఁ దడవది
లేదొ యీసురభి యడకింతెన్, మీఁ దెఱుఁగ
నైతి వటమట, నీఁదించి యథేచ్ఛఁ జని యొ
నిం కేమందున్. భోజ రా 6. 57.

5. దేవతాదులకై నియమించిన ముడుపు.

కి. కాటికేనికి మీఁదుగాఁ గట్టియున్న, గట్టి వర
హాని వరహాని గాఁగఁ జూడ, కాడఁబోఁ గూడ
కొక్క మాటాడకుండ, గుండనికి రంగుబంగారు
గోరుసేసె. శుక. 3. 50.

6. తృతీయార్థక ప్రత్యయము, కరణార్థకము

గీ. తడవులకుఁ గళ్లె మనుజయూధప్రచండ, పలల పారణత్రద్రక్తపానకేళి, లాలానామోద మీసు మాళంబుమీఁద, వరుస నందఱు గతులు వైవుఁడింక. కువల 2 102.

ఉ. లేవడిమీఁద పాపిపలు లేనికతంబున నూరకుండి నన్, బోవమి నప్పునప్పులకుఁ బోవుట వేఱుగఁ దోఁచె నేమొకో. శుక 2 375.

7. పంచమ్యర్థకప్రత్యయము, కంటె

ద్వి కావున నేనును గౌరికుమీఁద, దైవంబు లేఁడని తల యిచ్చి వడయు, దు . . .
పండితా. వాద 241.

8 ప్రస్తవ్యర్థకము, ఎడల.

గీ బాలుఁ డితండు మీమీఁద భక్తి గలఁడెఁ, చెయునా వీఁడు సులభుఁడై చెప్పినట్లు . .
కాశీ. 4. 16.

సీ . విహితసదాచార విధులమీఁది, శ్రద్ధమతి యనంగఁ బ్రస్తుతి కెక్కును . . .
కళా. 5. 146.

గీ. తపసిడెందంబు వెన్నచందమునఁ గరఁగెఁ, గల యికలమీఁదితిమురునఁ దొలఁగుచుండఁ, జిత్తజుని నేన లెంగోలు చేసినట్లు, కులుకుఁ బలుకులఁ జిలుకలకొలికి పలికె. విప్ర. 3. 87.

9 పశము, ఆధీనత.

కం కాపురుషులమీఁద నిడకు కావ్యభరంబుల్ . . .
ఆము 4. 214.

10 పయి, పైకి,

ద్వి ఇచ్చలో భరతేశుఁ డిట రాముమీఁద, వచ్చు చున్నాఁ డని వడి నిశ్చయించి . . .
రం రా అయో. 119 పా. 16 పం.

విశ 1. పైది, మీఁద నున్నది.

శా. . . . పాలిండ్ల పై నూత్నమ, ర్యాదన్ జెందు కరంబు క్రిం దగుటమీఁ దై నాఁటం బుంట వేల్, గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే కాయంబు నాపాయమే. భాగ. 8 592

సీ. విరించి మెప్పించి సప్తమునులకంటె మీ దై యొప్పు ననుపమానసుస్థిరజ్యోతిరాత్మకస్ఫురిత పదవి, వడసె . . హరి. పూ 1. 57.

2 అధికుఁడు, గొప్పవాఁడు

ఉ ఒప్పిద మైనసీకరుణ నున్నతుఁ డై మతి మీఁదుగాఁ జగఁ, బిప్పిళితాళి యేఁచు . . .
ఉ. రా 2. 176.

వ. అని మనసిజుండు మీఁదు లేక పలికిన విని రతి పరమేశ్వరుమాహాత్మ్యంబుఁ దలంచి వెఱచియు ని ట్లనియె . . . కు. సం 4 427.

మీఁదుగట్టు — దేవతాదులకు సమర్పించుటకై సిద్ధ పఱచి యుంచు

ఆ తపకు మీఁదుగట్టి తగ నియ్యఁ బాపినాఁ, డనుమ సీపాణి యాపనేసె . 6 341.

మీఁదుగా — గుండా, ద్వారమున.

వ. అం దుండి ప్రభాసతీర్థంబుమీఁదుగాఁ జని
కాశీ. 3. 111.

మీఁదుపోవు — దేవతాదులకై కట్టియుండు ముడుపు సాగు

గీ. వేళ గాకున్నఁ గడపనివేలుపులకుఁ, మీఁదుపో కున్నఁ గడపని మిన్న కెట్లు, గడపె నింటింట నీకాశికాపురమునఁ, బుణ్యగేహిని యిది మహా ద్భుతము గాదె కాశీ. 7 129.

మీఁదులుచూచు = సిగ్గు మొ వానిచే ఆకసమువై చూచు.

గీ. తిరిగి చూచినయంత నాద్రిమ్మరీఁడు, సిద్ధ మొక్కటి యేనియుఁ జిక్క నీక, క్రిమ్మరి మీఁదలు నూచుచు మృదులభణితిఁ, బిలిచి యి ట్లను శరదిందుబింబముఖని. పాండు 4 171.

మీఁ(దులె)దెత్తు = దేవతాదులకు సమర్పించుటకై నియమించి యుంచు.

సీ. తొలుచూలుకా న్పొట దురుసౌనె ప్రసవార్తి యిలువేల్పులకును మీఁ దెత్తి రారె .
ఇందు 3.

సీ శుద్ధవేళ సుఖప్రసూతి గావలెనంచు నిలువేలు లకు మీఁదు లెత్తరమ్మ . కువల 2 26.

సీ కొడుకుగుజ్జుఁడు చన్నుఁ గుడవక ట్లుంట విచారించి మేదరిసానియపుడు,.. ఇలువేలుపులకు మీ దెత్తియునుం గవ్వములు గట్టియును భక్తి పూర్వకముగ పం.మ. 1 129

వాడుకలోని ప్రయోగ విశేషములు

1 వాడు జీవనమునకై దేశము మీఁద పడెను
2 ఆ తప్పు నామీఁద పడెను
3 ఈ కవి రాజుమీఁద రెండు పద్యములు చెప్పెను.
4 నేను నా పనిమీఁదనే యున్నాను
5 ఈ మందు నెమ్మదిమీఁద పనిచేయును.
6 ఈ సంవత్సరము పొగాకుమీఁద హెచ్చు పన్ను వేసిరి
7 మాటమీఁద మాటవచ్చి యీవిషయము చెప్పివేసితిని.
8 నీ మీఁద నాకు కోపమా ?
9 వానిపని గడియలమీఁద నున్నది.
10 పిల్లమీఁద పిల్ల నిత్తురా ?

మీఁదుమిగులు, అ. క్రి (మీఁదు + మిగులు)
1 పై పెచ్చగు
గీ నీపరిగ్రహములును మున్నిపుడు మీఁద, మేలు చేయంగఁ గొఱగావు మీఁదుమిగుల, నధిక దుఃఖంబు పుట్టించు .. ప్రబోధ. 5. 21.
2 మించియుండు, మట్టుమీఱు
సీ మఱి సాటి లేని నైర్మల్యంపుమేడలు మిన్నుల కేవిట మీఁదుమిగులు .. ప్రబోధ. 1. 39.
3 విజృంభించు, చెలరేఁగు.
కం. యాదవవిరహిత యగుఁ బో, మేదిని నాచేత నేఁడు మీఁదుమిగిలి సం, పాదితబలులై హరిరు,ద్రాదులు నింద్రాదు లెవ్వ రడ్డంబైనన్ భాగ. 10 పూ. 1525

మీటు. వి. పతప్రమాను క్రింపటి మీఁదికి నాడుట కాదాని మగుచీల
సీ మీటనా బిసయన మీ ఉత్కటనకేము ... ఆం భా. 2. 293.
(పతప్రమాని క్రింది యంత్రభాగము. అని శ. ర.)
మీఢము సం విణ. (అ. అ. ఆ. 1 నీటితోఁ దడుపఁబడినది 2. మూత్రితము
మీనకేతనుఁడు. సం వి. అ. పుం. మన్మథుడు.
మీనఘాతి సం. విణ (న్. ని. న్) చేపలఁ బట్టువాఁడు. వి. న్. పుం. కొంగ.
మీనము. సం వి అ. పుం 1. మత్స్యము, చేప, 2 మీనరాశి
మీనమేషములు లెక్కించు — సోమరితనమున వృథాకాలక్షేపము చేయు.
గీ పరబలం బిదె నీప్రజ్ఞపనికి రాదు, లెమ్మిఁకను మీనమేషము లెక్కించుడక ... సిం. నార. 23.
మీనరంకుఁడు సం వి. అ. పుం. చేపలు తిను నొకానొకపక్షి (త్రి. ని.)
మీనరము. సం. వి అ. పుం. మకరము, మొసలి.
మీనవల్లఁకి. వి (సం. మీనవల్లికా) మీల ముచ్చు, పక్షివిశేషము (శ. ర).
మీనవల్లికా సం వి ఆ. స్త్రీ. వర్తిక, పక్షివిశేషము (శ. ర)
మీనాండి. సం. వి. ఈ. స్త్రీ శర్కర, పంచదార. (రా. ని.).
మీనాఘ్రిణము. సం. వి. అ న. 1. చేపలపులుసు, 2. కాటుకపిట్ట
మీనాలయము సం వి. అ పుం. సముద్రము.
మీను. వి. (సం. మీనః క. మీను. త మీన్. బ. మీలు. దీనికిహల్లు పరమైనపు డుత్వలోపము. ఉదా. మీన్పొల మొ)
1. మత్స్యము, చేప.
గీ. నమ్మి యిల్లడ పెట్టినసొమ్ము గొనిన, మీను

లోనగు నీచపుయోనులందుఁ, బుట్టు ...
భార. అను 4. 267.

తరళము. తనువు మీనొప్పల సల్పుజాలరి
దానను ... భార. ఆది. 3. 40.

గీ. మీనుపిల్లలజన్మంబు మే లనంగఁ, బడునె ...
దశా. 1 138

కం. జాలరులు వలల నచ్చటి, మీలఁ దిగుచుచుండి
యయ్యామేయోగ్రతపస్విలునిఁ గూడఁగఁ
దిగిచి ... భార. అను 2. 259.
ఆం భా. 1. 159

2 జలజంతువు (ఈయర్థమున నిత్యబహు
వచనము )

కం. జలరాశిఁ దిమితిమింగిల, ములు నాఁ దగు మీల
సత్త్వములు వినలేదే ... దశా. 1. 153.

జ స్టమీనుటెక్కెముపాఁడు, మీనురూపురిక్క

మీనుటెక్కెముపాఁడు. వి. (√ మీను) మీనకేత
నుఁడు, మన్మథుఁడు.

ఆ. మేలుబలముపాఁడు మీనుటెక్కెముపాఁడు,
నిఖిల మెల్లఁ గలఁచు నేర్పుపాఁడు, పచ్చవింటి
వాఁడు పరగ బల్పువుటమ్ము, గలుగువాఁడు
ప్రౌఢగతులవాఁడు. వీర 2. 91.

మీనురూపురిక్క. వి. (√మీను) రేవతీనక్ష
త్రము (శ. ర.).

మీమాంస. సం. వి ఆ స్త్రీ 1. లోతుగాఁ దెలిసి
కొనుట, పరిశీలన, పరిశోధనము.

2. షడ్దర్శనములలో నొకానొక దర్శనము.

(ఇది పూర్వమీమాంస, యుత్తరమీమాంస యని
ద్వివిధము )

మీమాంసకుఁడు. సం. వి. అ. పుం. 1. విమ
ర్శించువాఁడు, పరిశోధించువాఁడు.

2 మీమాంసాదర్శనము ననుసరించువాఁడు,
మీమాంసా మతస్థుఁడు.

మీమాంసనము. సం. వి. అ. న. పరిశోధనము;
విమర్శనము

మీమాంసనుఁడు సం. వి అ పుం. మీమాంస
కుఁడు, పరిశోధించువాఁడు

మీరము. సం. వి అ పుం 1. సముద్రము.
2 హద్దు, సీమ. 3 పానకము, పానయోగ్య
పదార్థము, 4. పర్వతభాగము

మీరు = ఈరు. (చూ ఈవు.)
దీనికి హల్లు పరంబగునపు డుత్వలోపంబగు.)

ఉ. నామదిలోన నెంతయు ఘనం బగుచున్నది
యద్భుతంబు మీ, రేమహిమన్ యథార్థముగ
నిట్టిది సత్త్వము గంటిరి .. కళా. 2. 58.

మ. బలియుం డాభృతరాష్ట్రసూనుఁడు మహా
బాహుండు దుర్యోధనుం, డలఘుం డీకమలా
కరంబునకుఁ గ్రీడార్థంబు కౌతూహలం, బెల
యంగాఁ బ్రియకామినీసహితుఁడై యే తెంచు
చున్నాఁడు మీ, రిల దిం దుండఁ దొలంగి పొం
డనవుడున్ వా రుద్ధత క్రోధులై.
భార అర 6 383.

ఉ. పాణెడుత్రోవ మీకు నలవాటుగఁ జేసిన వీరుఁ
డెవ్వఁడో, మీటి యనేకయుద్ధముల మీరు
జయించుట లెల్ల నింతతోఁ, దీఱె నను్ం గనుం
గొనుఁడు .. ఉ. హరి 5. 229.

మీరలు = ఈరలు

గీ మీర లమృతాంశు లమృతంబు మిమ్ముఁజూడ ..
నైష. 3. 59.

కం. మీరలు నా పితృదేవత, లారాధ్యులరు...
భార. ఆది. 2. 146.

మీర్జాకుళాయి వి (మీర్జా + కుళాయి) రాజ
కుమారులు ధరించుటోపి

సీ లత్తుకరంగు చల్లడము మిటారింపు చౌకట్లు
తగటు మీర్జాకుళాయి ... వేణు. 58.

మీఱు న. క్రి. (క. త మీఱు ) 1, ఉల్లంఘించు
దాఁటు.

సీ కొలఁది మీఱిన బాణకోటులు కై నేయుపై

నేసి పడమై చెఁ బడఁగ .... ఉ హరి ౭ 57.

సీ జాగరై మేఱ మీఱ దొకప్పుడును ఘనశ్రీలఁ

బొంగియును సీసింధుకన్య ... వసు. 6 56.

గీ. అమ్మ నీమాట మీఱ రా దనుచు నదిగో, నిలిపి వచ్చితి నొకనిండు నీటుకాని ... శుక. ౨. 201

2. నిరసించు

మ తనసౌందర్యము చెప్పఁగాఁ గరఁగి పద్మాకాంత రప్పించి మోహాన కంజంబున వైచి తియ్యబ్బ మిడునెయ్యం బొప్పఁ బైకొన్న మీఱి నృశంసత్వమునం దొఱంగి చని వెట్టింజేసెఁ గాకుత్థ్సుఁడై, న నిలింపారి విదారి చందములు డెందాన న్విచారింపుఁడా. ఆము. 5 48.

సీ వారిపూరంబు వెల్వడి వచ్చి రుద్రుండు యజ్ఞకోలాహలం బాలకించి, నను మీఱి యీ భువనంబు లెవ్వండు రా సృజియించి మఖము చేయించువాఁడు ... వరాహ. 7 39.

3 అతిక్రమించు, మించు

చం ... వా, పనుపున మీరు చే సఱచి పాఱుఁడు మీఱిన యట్టివాఁడ యీ, ధనమున కెల్లఁ గర్త యగు ... విక్ర 2. 11.

ఉ. ఆఱురసంబులం బవులయందుల క్రొత్తలు పుట్ట నిచ్చెలున్, వేఱొకభంగిఁ బాకములు విన్నను వొప్పఁగఁ జేసిచేసి న, న్నీఱఁగ బానసీని నొకనిం బురిఁగాననీ యట్లుగాఁగఁ మేన్, గాఱియ వెట్టైన నొడికంబుగ వండుదు నెల్ల గూరలున్ భార. విరా 1 77.

సీ పరమేశుఁ డీ బింబఫలపాటలాధరం ననుమీఱ మన్నించినాఁడు మేలె ... కాశీ 4 148

గీ. మీఱె ననఁ గడచె ననఁగ మించె ననుఁ, పొలిచి యుండును ... ఆం. భా 2 128.

అ. క్రి. 1. అతిశయించు.

గీ. అసుధాధామ విభవ మహాంబురాశి, కుబ్బు మీఱంగ వందనుం డుదయమయ్యె .

మనుచ 1. 19.

కం. ... అడవికిఁ గాపురము వచ్చి రలజడి మీఱన్

గీ. మీఱె హెచ్చరిలెను ... పెరిఁగె ననఁగ వృద్ధిఁ

జెందె ననుట క్కొల్లలు . ఆం భా. ౭ 69.

2 ఒప్పు.

ఉ శ్రీలకుఁ దానకం బగుచుఁ జెన్నలరారెడు వెండికొండపై, మేలికదానిదాల్ హాయలు మీఱెడు జాబిలి జాలమేడలో .. సీలా 1. .

3. జనించు, కలుగు.

సీ ఎఱుమ్మెదల దిమ్ము వెలిఁ జిమ్ము చెలువమ్ము గఱవేణి కొకవింతనలువు మీఱె .

హరి 1. 56

శా క్రతువులు హాహాకారముల్ మీఱఁగా, నబ్రహ్మణ్యము వెట్టినన్ . దశా. 1 224

4 విజృంభించు, చెలరేఁగు

ఉ వేఱొకచాప మెత్తి యమవీరుఁడు డెబ్బది రెండు బాణముల్, మీఱిన పౌండ్రభూవిభుని మేను కలంతట నాఁటె ..

ఉ హరి. ౭ 58, 5. 228

5 గతించు, కడచిపోవు.

కం. ఏమైన నయ్యోనిక నేలా మీఱినపనికి నిట్టి యంతిపుంములో, నోముద్దరాల యేగతి నీ మహిమ గడించుకొంటి విది వెఱఁగు కడున్.

ప్రభా. 5. 72.

6 కొనసాగు, సఫలమగు.

మ కలలోఁ గన్న నృపాలశేఖరుని వేడ్కంజూచు చెన్నుండొకో, యిలజేఁ దన్నుఁ నాదవర్యునకు న న్నీయంగఁ బెండ్లాడి నా, తలఁపుల్ మీఱఁగ సూనసాయకుని బందాగా విత్కరించుమన్, చెలువుం డెన్నఁడు గాఁగలిఁ మకొ నుఖశ్రీ గాంచు చెన్నుండొకో ఇందు. 3. 14.

మీఱఁబెట్టు = గర్వింపఁజేయు

గీ మీసుతుని మట్టువెట్టక మీఱఁబెట్టి, యెవరి బెదరింప వచ్చినా రెవ్వరిండ్లు, బుచ్చుకో నెంచినారు... సానందో. 5. 16.

మీలబ్రముచ్చు. వి. (మీలు + ప్రముచ్చు) మీలదొంగ, మీనవల్లంకి, నీటికుటికి చేఁపలంబట్టు పక్షివిశేషము, వర్తిక.

సీ ... మీలఁబ్రముమ్మలు బ్రముచ్చు లేల విడుచు
దశా 1 137.

సీ. పట్టు జీనుపు కొంగ పాశేరు పిచ్చుక పోలుగ పిక్కిలి మీలఁబ్రముచ్చు. హంస. ౩ 12.

సీ మీలవల్లఁకి యన మీఁబ్రముచ్చు, నాఁగ సక్రి చెఁగు ఆం. భా 2 97.

మీలవల్లఁకి వి మీలఁబ్రముచ్చు
ఆం. భా 2. 96.

మీలితము సం విజ. (అ. ఆ అ) 1. మూయఁ బడినది.

వి. అ న (కావ్యాలంకారవిశేషము) మీల నాలంకారము

మీవ. సం వి. అ స్త్రీ. 1. ఉదరకృమి.
2. గాలి

మీవడ = మీఁగడ

ఉ. వేవిన నిద్ర మేలుకని వేఱొకచానకు నేర్పు తోడఁ బై, మీవడఁ బుచ్చి కవ్వ మిడిమిట్ట చనుంగవ రాయిడింప. - వేం. పంచ 1 590.

మీవరము. సం. విజ. (అ. అ అ) హింస్రము, ఘాతుకము.

మీవరుఁడు. సం వి అ. పుం సేనానాయకుఁడు.

మీస = మీఁసము వి (సం శ్మశ్రుః, క. మీసె, త మీసై) పై పెదవిపైఁ బుట్టువెండ్రుకల వరుస

కం కఱకంఠుభక్తి వెలిగాఁ, గొఱగా వెవ్వియును నవియుఁ గొన్నిఁటి వాళ్లుల్, మఱి పిండ కూడు వెట్టిన, మెఱియలక్రియ మెఱచు మీస మెదుకుల మెఱుపుల్. శివ. సా 197

ఉ. ... బొడులు దీడికొంచు నే, మీసరు తిట్లు గ్రొవ్విఁ పులిమీసల నుయ్యాలలూ గఁజూచిరే.
భా రా. యు 867

మ. వలచే వజ్రము ఱొమ్ముతో బిగువు గర్వంబుం బ్రమోదంబు మీ, నలలో నవ్వు నొయారమున్ తెలఁగ ... దశా. 4 43.

సీ. శ్మశ్రుసమాఖ్య రాజిలు మీస మీసము నాఁగ ఆం. భా 2. 146.

జ మీసకట్టు.

మీసకట్టు. వి (మీస + కట్టు) మీసము యొక్క యేర్పాటు.

గీ మఱియు నాసాగ్రమున నొప్పు మౌక్తికమునః కిరుకెలంకులఁ గాంతుల నెనసి సొగసు, దన ఱగా మీసకట్టు నందంబు చూఁప, జెక్కు టద్దము లోఁ అవు రంజిల్లుచుండ.
వేం. మా. 1. 185.

చం అలనలినారి పాల్చె నిజయౌవనవేళ స్వకీయ బింబలీలలు దవ నెమ్మొగంబునఁ గళంక రుచుల్ మనుమీసకట్టునన్, ... పూనెను నాఁగ మనోహరాంగుఁడై శశాం 2 60

మీసము = మీస వి. (బ మీసములు, మీసాలు) పై పెదవి మీఁది వెంట్రుకల వరుస

కం. ఇయ్యఁగ నిప్పింపంగల, యయ్యల కేశాక మీస మందఱ కేలా .. కవి చౌ. ౪. 18

మ. .. చెప్పకు మిట్టితుచ్ఛసుఖముల్ మీసాలపై తేనియల్ .. మను౨ 2 65.

గీ. కటము లద్రువంగ మీసాలు గత్తరిల్ల ... నేతెంచెఁ గ్రోధంబు గగనవీధి ...
నైష. 7 46, ఆం. భా. 2. 146.

మీసరము విజ శ్రేష్ఠము.

వ .. మొకంబులు వంచి రెండిమ్ముల ధకాధకిఁ దాకి సెలఁగ భంగంబు లైనయుత్తుంగ శృంగంబుల. మీసరంబు లగుకానరంబులును ...
ప్రబంధ. 186.

సీ సిబ్బెంపు గబ్బిబల్గుబ్బ చన్గవను మీసరము లౌ నీ లంపు సరము లమర ... శశాం 4 119.

ఉ. (శ్రీ) సొబగొందు నిండుసరసీ సరసీరుహకేసర ద్యుతిన్, పిసరవోక మీసరపు నిగ్గులజగ్గుల దుప్పటిన్ దటి, ద్భాసిత నీలమేఘమన భాసిలు రంగనివాసు .... అ. హ. 1. 1.

సీ మేల్బంతి కన్నాకు మీసరంబు, తలకట్టు నాఁగ

భాసిలు శ్రేష్ఠనామంబులు ..
సాం. ని మాన 48.

# ము

ము[1]. అవ. 1. ప్రార్థనాశీరాద్యర్థములందు వచ్చు మధ్యమ పురుషైకవచన ప్రత్యయము.

ఉదా వినుము, చేయుము. ఇది హలవసానంబులు పరంబు లగునపుడు వికల్పముగ లోపించును.)

చం. వినుము నరేంద్ర పాండవులు విక్రమదుర్దముఁ డైనపార్థునం, దనునకుఁ దోడ్పడం గడఁగి
భార. ద్రో 2 ఆ 69 పం.

గీ. . . కృతి వినిర్మింపు మింక మాకుఁ బ్రియము గాఁగ ..
ఆము. 1 13

చం. నిలునిలు కర్ణ యోకృపుఁడ
భార ద్రో 2. 59

కం వినిపించెద ముగివిధము విను తెలియంగన్
భార. ఆశ్వ. 4. 275 .

2. ఉత్తమపురుష బహువచన ప్రత్యయము. (ఇకారము మీఁది దీనియుకార మికారమగును )

ఉదా చేయుచున్నాము, చేయుదుము.

ఉ చేయుదు మేము కయ్య మొకచీరియు సంపదఁ బంచి యిత్తుమే ... భార. ఉద్యో 4. 201.

కం అడవులఁ బెద్దయుఁగాలం, బిడుములఁ గుడిచి తిమి మాకు నిది తఱి యని యిప్పుడ వచ్చి తిమి ... భా. విరా 5 123

3 అదంతము లైన యమహాన్నపుంసకములకును, బల్లిదాదులకును వచ్చు ప్రథమైక వచన ప్రత్యయము.

(ఉదా వృక్షము, ధనము.)

ఉ. ఖాండవ మేర్చునప్పుడు ...
భార. విరా. 4. 37.

4. ప్రథమైకవచనేతరవిభక్తి ప్రత్యయము పర మగునపుడు అదంతము లయిన యమహాన్న పుంసకములకును బల్లిదాదులకును వచ్చెడి యాగమము

ఉదా వనములు, వనములను, వృక్షమును

కం హయములఁ బూన్పుము రథమున ..
భార విరా 4. 42.

5 కొన్ని తెనుఁగు సర్వనామములకు వచ్చు ప్రథమా బహువచన ప్రత్యయము

ఉదా మేము, మనము మొ.

6. ప్రథమాంత మగు నస్మచ్ఛబ్ద విశేషణంబులకు బహుత్వమున తఱుచుగ వచ్చు నాగమము.

ఉదా మేము వృద్ధులము, పేదలము

గీ ... అజ్ఞాతవాస, వత్సరంబు ఘనదక్షవాస గుప్తి, వఱలఁ గడిపితిమి .. ఏము నిశ్చయు లమై విందులట్ల . భార విరా. 5. 244

ము[2] న. మూఁడు[2] శబ్దమునకు వృత్తియందు ఆదేశముగా వచ్చురూపము.

ఉదా. ముజ్జగము, ముచ్చిచ్చు మొ

ము[3] విశ ముందుశబ్దమునకు వృత్తిని మీఁది వర్ణము లోపింపఁగా మిగిలిన రూపము.

ఉదా ముంగురులు, ముంజేయి మొ.

ముంగ[1] వి. ఎన్నులమోపు.

సీ కణిశైకదేశంబు కనుపట్టు రెల్ల నాఁ గణిశభారమ్మ ముంగ యనఁదనరు
ఆం. భా 2. 287.

ముంగ[2] = మూఁగ[1] విశ. (సం మూక)

మూఁగవాఁడు, మూకుఁడు, వాగ్వ్యాపారము లేని వాఁడు (శ. ర )

జ. ముంగతనము.

ముంగడ. వి. (ముందు + కడ ముగడ, త మున్గడై.) 1 ముంగల, ముందుచోటు.

చం. ... చిల్వకుఁ బాలు పోసి ముంగడ వసియింపఁ జేసి చిరకాలము పెంచిన మే లెఱుంగునే, కఱగి ఒడల్పడన్ గఱచుఁగాక .
వేం. పంచ. 1 765.

2 ముందు. (శ. ర.)

**ముంగతనము** వి. (ముంగ² + తనము) మూంగతనము, ఒండతనము.

ద్వి. ఈవేగ, మునఁబోదు ముట్టకు ముట్టకు కాలు, మును ముట్ట నవి యేల ముంగతనంబు ..
పండితా. పురా. 124 పొ.

**ముంగమురము** = ముంగమురాము, ముంగమురారి, ముంగయిమురారి, ముంగామురము, ముంగై మురారి, ముంగైమురుగు. వి. (ముందు + కయి + మురము శ. ర.) మురుగు, హస్తకంకణము.

ఉ. బంగరురావిరేక పటుఫాలముమీఁద నటింపఁ బచ్చరా, ముంగమురంబు లింపలర ముందర నాడుచు నుండు ముద్దుప,ట్టంగని తల్లిదండ్రులు.
భాను. 1. 36

(శ. ర. పా. ముద్రి. పా.)

పచ్చరాముంగర తొంగలింప.

**ముంగమురాము** = ముంగమురము (శ. ర.).

**ముంగమురారి** = ముంగమురము. (శ. ర.)

**ముంగయి**=**ముంగై** వి. (ముందు + కయి) ముంజేయి.

ఉ. బంగరుపట్టుగోఁచి మనుపచ్చని ముంజియు నొంటిజందెమున్, ముంగయికంకణంబు జిగి మోహనహారము ..
సమీర 3. 22

**ముంగయిమురారి** = ముంగమురము. (శ. ర.)

**ముంగ(ఱ)** = **ముక్కర**. వి. (ముక్కు + రాయి) అడ్డకాస, నాసికాభూషణవిశేషము.

గీ. చేరుచుక్కయు ముంగఱ చెవులపువులు, బవిరెలును గొప్పవలయును బడఁతి యొర్తు,దిద్దె ..
యయా 4 89

మ. కళుకుమ్ముంగర ముత్తియంపురుచి సింగారంపుఁ గెమ్మోవిపై, దులకింపన్ .. దశా. 2. 264

సీ. ... నాసి, కావిభూషణము ముక్కరం ముంగర యనంగఁ జనుచుండు. .
ఆం. భా. 2 148, ఆము 4 21.

**ముంగల** = **ముంగడ** వి. (ముందు + కలను.) పురోభాగము, ముందుకాలము, తొల్లి.

కం. లలితకమనీయ మహిమల, నెలనాఁగయు సఖులు గలసి యేతేరఁగ ముం, గల నడచి కంచుకులునుం, దలతల మనఁ బలియఁ జతురంతరముగ నడచెన్ ... నిర్వ. 8.68.

ద్వి. . నవరత్నకాంతుల మించు, తొంగలించెడి జాలు తొడవులమూట, ముంగల నిడిన ...
ద్వి. హరిశ్చ. ఉ 2342 పం.

సీ. మున్ మున్ను మును ముందు మొగి ముంగల యనంగఁ దగును బురఃపురార్థములుగాను
ఆం. భా. 3. 73, విజ. వి. 1. 42

**ముంగలి.** విశే. (√ముంగల) ముందున్నవాఁడు; ముందున్నది.

కం. కెలఁకులఁ బిఱింది దెసయుం, గలయం బరికించి తనయఖండిత బాహా,బలగర్వమ యచ్చట ముం,గలిగా మదమత్త భద్రగజ సదృశగతిన్.
భార. విరా 2 326, 331

కం. . దివ్యవాహనలీలో, త్కృష్టగతిన్ ముంగలి య్యై, ధృష్టద్యుమ్నుండు వొలిచెఁ దేజో మహిమన్ ... భా. ఉద్యో 4. 129.

చం. ఎలమిఁ గుమారుముంగలి సురేంద్రుఁడు రా
కు, సం. 11. 587, హరి. ఉ. 8 42.

**ముంగాము.** వి. 1. పొట్లముగా మడిచినతాటాకుమట్ట (మంగము అని వాడుక)

2. బెల్లము మొ. వాని నించినబరువులో సగము (శ. ర.)

**ముంగాముచీర.** వి. (√ముంగాము) ఆఁడువారు కట్టుకొనెడి యొకవిధమగు నారకోక (శ. ర.).

**ముంగామురము** = ముంగమురము. వి. హస్తకంకణము.

సీ. ... తళుకు ముంగామురంబులు చలింప, గంటలమొలకట్టు ఘణఘణ ధ్వనిచేయ ..
దశా. 8 185.

గీ మేలి మొత్తాల ముంగాముఠాలతోడ, నిరుగుపొరుగుల చిన్నవాండ్రిటకు వచ్చి ముంగుఁగాఁ జూచి తనకు నీముద్దుబాలుఁ డడుగ నీనులు చూఁడిన ట్లయ్యె నాకు
శేష. 1 (శ ర)

ద్వి ముత్తెపుఁ జేసలు ముంగాముఠములు, నొత్తులు గాజులు నొడ్డాణపనులు, గవదసరాలు బంగారుకడెములు
ప్రభులిం 4 143 పొ 15 పం
ధనా 3 37

ముంగాముఠారి = ముంగముఠము (శ ర).

ముంగాముడుగు(వు)—ముంగముఠము.

గీ కడెము కడియము బొద్దొత్తు గాజు సూడి,గంటు చేఁట్టు గోఁడు ముంగాముఠ వన, హస్తభూషా విశేషంబు లమరుచుండు అం. భా 2. 149

ముంగాలు వి జౌ. (ముందు + కాలు. క. ముంగాలు త ముకగాల్) పాదాగ్రము, ప్రపాదము

సీ. మును ననల్ దమిఁ బట్టి ముంగాళ్ల ముక్కుఁ జోడనలఁ బిలిచి పసర్కొనిన విడిచి .
అము 5 117 , 6 28

కం. చేఁ పొడిచి అంకె లిడుచును, పలుమఱు ముంగాళ్లఁ ద్రవ్వి బలువిడిఁ బసికాఁపులఁ గ్రుమ్మి విడుచు . . నీలా 2. 56.

వ. వాగెఁ గుదియింప ముంగాళ్లు గగనంబున రా మగిడించి ... మనుచ. 4. 115.

ముంగి – ముంగిస. వి. (క. ముంగి, త. ముంగా)
1 ముంగిస, నకులము.

కం. వినిపించెద ముంగివిధము విను తెలియంగన్ . . భార. అశ్వ. 4. 275

సీ. ముంగైముఠారి నాముంగైని నిడు మన్నముం గై పలుకవే కురంగనయన ... బహు 2. 65.

గీ కేరు నకులము ముంగి ముంగిస యనంగ ...
అం భా. 2. 86.

2. నకులాకారము గల భూషణ విశేషము పుంజాల వండలు పూదెలకడియాలు మురుగులు రాకట్లు లుంగరములు . . ధనా. 3 37.

ముంగిలి వి జౌ (ముంగల + ఇల్లు త మున్‌గట్టు)
1 మునివాకిలి, గృహద్వారమున కెదురుగా నుండుప్రదేశము, అంగణము, ఎదుటిభాగము.

సీ. వింగడం బైనట్టిముంగిట నెంకొన్న బృందావనికి ముగ్గు పెట్టుదాన ... అము 4 53

చం. బలవదసహ్యసింహశరభప్రముఖోగ్ర వనాంతభూమిని,ముమ్మల నిను డించి పోయెదమె ముంగిలెఱుంగనిముద్దరాల పాండు 7. 108.

కం. ... అంగణ, మెఱుఁగం దగు ముంగిలి యన నిందుపతంసా ... అం. భా 3. 19.

కం. ముంగిటను సప్తసింధువు, చెంగటఁ గ్రతువులసిపడుము శ్రీభీమమహాలింగము దక్షారామము ... భీమ. 3 126

శ్లో పురోభాగే సప్తసింధుః పార్శ్వే యజ్ఞసరో మహాన్. సం భీమ.

ఉ. అంగన నాకుఁ గొంగుముడి యై తగునీ విపుడిచ్చు నీవి త,న్వంగి భవన్మనోజ్ఞమధురాధర కాంచన కాంచికాస్థలుల్, తంగెటిజున్ను ముంగిటనిధానము నౌ, నటుగానఁ జాయలే, నంగజునాన నాదుహృదయం బెఱుఁగున్ వల వంబుజాననా! రామా. 4. 162.

ముంగిటనిధానము – కావలసినవుడు దొరకునది )

2. బయలు.

వ ... నంగనాచు లగుపంగనలయంగంబులపస ముంగిటం బడ ... మనుచ 3 28.

ముంగిటిముత్యము = ఎదుట మన్నముత్యము వంటిది.

అ. ఎల్లబంధువులకు నల్లారుజెల్ల మై,యరిది గారవంబు నతిశయిలఁగ, దల్లిప్రేమఁగరము దన రారె ముంగిటి, ముత్య మగుచుఁ గ్రొత్త క్రొత్తసిసువు. కళా. 6 197.

ముంగిస—ముంగి. వి (క. ముంగిసి, త. ముంగా) ముంగి, నకులము.

సీ ఎఱమి ముంగిసపిల్ల లెండఁ దాఁకక యుండఁ బడగ లడ్డము పట్టుపాఁపగములు ... యయా. 2 49.

వ. . కొనసాఁగి సోగ ముంగిస మోరలుం బోని మోరలు సారెసారెకు నెత్తి బయలు పసి పట్టుచు ... మనుచ. 4. 27.

గీ. కేసు నకులము ముంగి ముంగిస యనంగ ... ఆం భా. 2 86, కాళ. 3. 46.

ఈ ముంగిసమ్రాను.

**ముంగిసమ్రాను.** వి జౌ (ముంగిస + మ్రాను) ముంగిసరూపు కలమునసచివర

గీ ఎఱమి మఱికొన్నిచెట్టుల కెత్తియెత్తి,యిలసి ముంగిసమ్రానితో నాని యుండఁ,గుండ నిండా రఁగా ముంచి కూడు దినఁగ,నింటి కేఁగెను బడ లిక లంటి పెనఁగ. హంస 1 187.

**ముంగురుమొటికలు** వి. బ (ముంగురులు + మొటికలు) ధాన్యభేదము.

వ. ... చౌటవరులు తీఁగెమల్లెలు సుఖభోగులు సన్నసూదులు గౌరవంకరాజనాలు కాటుక రేకులు ముంగురుమొటికలు పసుపుముద్దలు .. ప్రబంధ 112.

**ముంగురులు.** వి బ. (ముందు + కురులు క ముంగురుకు.) అలకలు, నొసటపై నాడెడు ఉంగ రపువె ట్రుకలు

ఉ అంగము జాళువాపసిఁడియంగము క్రొన్నెల వంక నెన్నొసల్, ముంగురు లింద్రనీలముల ముంగురు లంగజుడాలు వాలుఁజూ, పుంగవ యేమి చెప్ప నృపపుంగవ ... విజ. 1. 40.

సీ నగుముద్దుమోమున మృగనాభితిలకంబు కులుకు వాల్సిరులు ముంగురుల నొయ్య ..
దశా 1. 71.

సీ. అలకలు కురులన నలరును బహుతవే వఱలు ముంగురులన భ్రమరకములు ... ఆం భా. 2. 144, నీలా. 1. 85.

**ముంగేలు** వి. జౌ అనా. (ముందు + కేలు. త ముక్కైహాళ్, ము కేయి ప్రకోష్ఠము.

సీ ముంగేల వంచినమొగ మెగయించుచో మెయి కొను నేత్రనిమీలనంబు .. కవిక 3 212.

సీ కొసరి వాతెఱ నొక్కి కనుఁగందెనో యంచు, నిలుతుఁ డై ముంగేల నిమిరి నిమిరి .
కృ శకు. 3 50

**ముంగై** = ముంగయి వి (ముందు + కై త మున్కై) హస్తాగ్రము

సీ. ముంగై మురారి నాము గైని నిడు మన్నముం గై వలుక వే కుడఁగనయ .
బహు. 2 67.

కం అంగాంగసంగతిని దన,ము గై చెమరింపఁ గంఠరమున సకికిన్ రా, జాంగజుఁడు కట్టె మణి మయ, ముంగఁసూత్రంబు జాయమానోత్సు కుఁడై కువల. 5. 68

**ముంగై మురారి** వి. ముంగమురము.

గీ కొలుతుఁ దాన్యగ్భవద్బాహుకులిశయష్టి, నెద్ది గిరివోలెఁ గడుపులో వృద్ధిఁ బొంద, బగిలి రాకాసిదేహంబు మొగపుముత్య, మయ్యె ముంగైమురారిరంగై మురారి
మనుచ. 6 115.

వ అవ్విరించిజనకునకు వరణంబుగా మించులు. గండపెండెరంబులు రాకట్టుమొలకట్టు లుంగ రంబులు ముంగైమురారు లంగదంబులు ..
ప్రబంధ. 605, బహు. 2 67

**ముంగైమురుగు** (వు) – ముంగమురము

వి (ముందు + కై + మురువు) ముంజేతిమురుగు.

ద్వి ముంగైమురువుల కిమ్ముల గంకణముల, చెంగట ముత్యాలపుఁజేకట్లు పూని ...
ద్వి పరమ 4 274 పొ.

**ముంగొంగు** – మునికొంగు వి. (ముందు + కొంగు) చెఱఁగుకొన, మునికొంగు

సీ ముంగొంగును వ్రేలుముత్యాలకుచ్చుల నల

రెడు చెంగావిపలివెములును .
యయా 4 120.

దండకము చెంగావిమంజీర ముంగొంగున
స్వర్ణ క్రొత్తగా ఒంటిముత్తెంబు నూర్పు
చెల్వొనకంబు ల్విలోకించువారల్ ...
దశా 4 252., రా ఐ 2. 44.

**ముంగొంగుపసిండి** – తనచేలాంచలమున ముడియిడిన బంగారువలె సులభ మగుపదార్థము

గీ భక్తజనులకు ముంగొంగు పసిడి గాదె, దేవతారత్న మీవాసుదేవుఁ డనఘ ..
జై భా. 1. 116

కం ముంగొంగుపసిడి చెంగటి, తింగెటిజున్నుంక సహితధనరాశి నివా, సాంగణకల్పమహీరుహ, మంగనకధినాయకుడ సుమా చపలాంగీ.
పె శకుం 3 132.

**ముంగొన** వి (ముందు + కొన త మున్గొనై) ముందటికొన

మ అరవిందావన లెల్ల .. ఒక సందోహంబుగా వచ్చి క్రొమ్మొక్కరి పయ్యెంటచెఱంగు ముంగొనలతోఁ గెంగేలుదో యెత్తుచున్ ...
రామా. 2 80.

**ముంగోపము** – **ముక్కోపము** వి వి. (ముందు + కోపము క ముంగోపవు త. మున్ + గోపం) ఓర్పులేక తటాలున వచ్చు కోపము

అ. మొగముఁ బోడువ లేనిముంగోప మింక నెప్పు, డలఁక చొచ్చెనేని జులక వగుదు, మటులు చేయనీయ కాఁగి ఖండన మాచరింపుఁడనుచు వారిఁ బంపుటయును.
ఉ రా 3. 7.

**ముంగోపి** – **ముక్కోపి** వి. విశ. (ముందు + కోపి, క. ముంగోపు. త. మున్గోపి) ఓర్పులేక తటాలునఁ గోపముపడువాడు.

శా. ముల్లోకంబులుఁ దల్లడిల్లు నిపు డీముంగోపి కేనుంగుతోఁ, జెల్లాడం జనుబాలుబీల నితనిం జేష్టించినం గీడు వాటిల్లున్ ..
చ రా. 8 142.

సీ దుష్టనాపశిఁ గన్న శిక్షించుముంగోపి, గుణగౌరవంబులు గూర్చుపెద్ద
చంద్రా 5. 150 , పా చా 2 53

**ముంగోరు** వి బొ (ముందు + గోరు) నఖాగ్రము, కొనగోరు

దండకము .. వైతేయు ముంగోరులన్ జేరు రమ్మన్ పడిం జీరి గారించి ప్రహ్లాదు పాహోదుఁ గావింపవా .
కృ శకుం. 6 157

**ముంగోలు**, వి (ముందు + కోలు, మునివలు.
సీ. సింగంబు పఱతెంచె ముంగోలుఁ దెమల్చి నములి కార్పోతుల నుమిసికొనును ...
కకు 4 155.

**ముంగోలు** విశ. (ముందు + కోలు. క. ముంగోల్, త. మున్గోళ్) మొదటిది

కం ముంగోలు మొలకవెన్నెల, లుంగలఁగంబడు తమంబులుం గల గగనోత్సంగము గంగాయమునా, సంగమముం దలఁపువేసె సజలాకృతియై . .
కవిక 4 128.

**ముంచు** – **మునుచు**[1] స. క్రి (√ మునుఁగు)

1. మునుఁగఁజేయు, నీరు నేయి మున్నగు వానిలో తూర్చు

సీ క్రొంచఆనీరిలో ముంచుచు నెత్తుచుఁ గారించి తిరంబు వేరఁ బెట్టు ... భార. ఆది 5 166.

సీ అందంద దొరఁగుడు వస్త్రుజలంబుల పెంపున మోములు ముంపఁబడఁగ ...
భార స్త్రీ 1 98.

ఉ. మంచిగ మేనయత్తలు సమాదరణం బడరంగఁ బెట్టి, పుత్తెంచిన మంచిభక్ష్యములు తేనియ నేతను ముంచి ముంచి ...
హర. 2 105.

కం. ఏసిన వరుణుఁడు దనుజుశ, రాసారములోన ముంచె ...
ఉ. హరి 1. 29.

2. కప్పివేయు. ఆచ్ఛాదించు.

సీ ... హరికేశుఁ డతఁడు శ్రీయానందకాన
నాభ్యంతరమునఁ, దప మాచరింప నాతని శరీ
రము ముంచి పుట్టె వల్మీకంబు పొదలు పొదలె.
కాశి 5 127.

కం. ఈ కరణి దానవుం డతి. భీకరముగ రణము
సేయఁ బిలువిడియక ద్రై, భాకర సేనలు శస్త్రా,
నీకంబుల ముంచి తానిశరీరంబున్ ..
జై భా. 2 34

కం కలయ జగమెల్ల ముంచిన, బలు వగు నమ్మెం
చలోన భావింపఁబడున్, వెలుఁగులఱేఁడు
కవిక. 6. 27.

3. వశింపఁజేయు,

చం కడుఁ దొడు సైనయుద్ధరితకర్మము నిన్గొని
ముంచుఁగాక యొక్కడఁ జననిచ్చుఁ బుట్ట
పురుగా కొలగా కెవు డస్వతంత్రతన్, మడుగు
భజించి భేకముల మస్తమునన్ భరియించి
కొల్చి ... వేం పంచ. 3. 355.

అ. క్రి. 1. క్రమ్ము, వ్యాపించు.

రగడ. ఓమి యోమితమధ్య నీపద ముంచు ముంచు
నశోకతానన ... వసు. 3. 349.

ఉ. మ్రొగ్గెడుపాపముల్ మునుల ముంచిన ఖేదము
తెందసోఁకుడున్, వెగ్గల మైనయార్పులును
విన్నని మోములు గానిపింపఁగన్ ...
విప్ర. 2 53.

2 అతిశయించు.

సీ ముంచి చీకటులు కల్పించునీడలు పోవఁ బద్మా
కరంబులపాఁచి విలుగ ...
కువల. 7. 10, సారంగ 3 34.

3. పుట్టు, కలుగు.

ద్వి. ... నిజదేహభాసురప్రభలు, ముంచి దిక్కులఁ
బర్వ మురియుచు నేగి ...
ద్వి. హరిశ్చ. పూ 684. పం.

మ జర ప్రాప్తింపకమున్నె యతిబల ముత్స
న్నంబు దాఁ గాకమున్నె రుజల్ ముంపక
మున్నె యాత్మహిత మన్వేషి ప క్షుండు ...
మల్లభా. 3 75.

గీ తిండి మే దొలఁగినఁ దేవులు ముంచు ..
రామలిం 50.

4 పూను. యత్నించు.

ఉ. పాకము మీఁలు పెద్దపెదపాకము లై బలి
తఁపుఁగాఁగులన్, మూలుగుచున్న ప్రాఁబసిఁడి
ముంచి ధనార్థుల కిమ్ము .. పాండు 4. 211

సీ శశిబింబమణి హేమ సాదామనీ చయోత్కర
కాంతులన్నియు నరసి తెచ్చి, కర్పూర చందన
కాశ్మీరమృగమదామోదంబులన్నియు ముంచి
తెచ్చు ... కు. సం. 3. 321.

5. విజృంభించు.

గీ. మొనలు దెరలినఁగర్ణుఁడు ముంచి తాఁక ..
భార. విరా. 5. 292.

కం. దంచున్ జరణాంచలముల, గించుదనం బంచు
మునలకించున్ ముంచున్, నొంచున్ విద
శనచుంచూ, దంచచ్చంచూపుటస్ఫుటాఘాత
ములన్ .. రామా. 5. 198.

6. నెఱవేలు.

కం. అని యొల్లఁబోవఁ దాపము, కనుకనిఁ
బోఁదేర్చి పాపకర్మపుటొడయా, నమఁ బంచిన
మన కిచ్చిన, పని ముంచదె యంచు నతనిఁ
బలుకుఁ బ్రతాపిన్. కకు. 5 118.

**ముంచే²**—**ముణుఁచే.** స. క్రి ముడుఁచు,
ముణుఁగఁజేయు.

ద్వి. కొనులు వంచి యొగము లెల్ల ముంచి, నాన
వాటించి లేవగవులతోడ ...
అ. మ క 2 24 పా 22 పం.

**ముంచే³**— **మించే¹** స క్రి. అతిక్రమించు,
దాఁటిపోవు.

సీ ముంచి పోవువిమానములు కూడఁ గోరితఁ
గేలెత్తి ధేయని తోలకున్న ... కకు. 2. 42

**ముంచేకొను** స. క్రి. (ముంచు¹ + కొను

స్వార్థమున.) 1 మునుఁగఁజేయు

కం. వే. గమ్మున ముంచుకొనియె నగ, నమ్ము పయోరాశి భరతరాజవరేణ్యా ' ...
[శార. మా 177

సీ. దుర్దమకర్దమ స్తోమసంఛన్న భూములు సోన వానలు ముంచుకొనిన ... పాండు. 4. 28.

2 (నిద్ర) ఆవేశించు, ఆవరించు, ఆక్రమించు.

అ కన్యకాకరోరకరవాలధారలు, కంఠమూలము లఱుఁగత్తరింప, రణధరిత్రిఁ ద్రెళ్లి హాకాసితల లావరించె దీర్ఘనిద్ర ముంచుకొనఁగ
వరాహ 11 99

కం. జిచ్చుపడి వెల్లవాఱుచు. ముచ్చుముడిఁగి మూర్ఛ తన్ను ముంచికొనంగా, వచ్చిన ధైర్యం బూఁతగ నచ్చేడియ నిల్చి ఱప్పు డద్భుత మయ్యెన్. కెయూర. 4 199

వ ఇట్లు చెట్లు వెడలి తైవిండ్లు వంచుకొని ముంచుకొను వన్నెల్ల ప్రజం జూచి ... అము. 6. 76.

కం వల విచ్చినట్లు జగముల, కల విప్పను గలయ నొక్కకవిఁ జని కోలా, హలముగ సురాసురోరగ, కులముల నాగణము ముంచికొని వచ్చి వడిన్ కు పం. 2. 210.

అ క్రి 1. గుంపుగూడు.

వ. అచ్చటికిం జేరి ముంచుకొను కొంచెపుఁగాండ్రు పెడమోము పెట్టిన ... కువల 4. 209

2 అతిశయించు.

సీ. ఇరుగడఁ బొడి విచ్చి విరియువేసవితోడ మోహాంధతమసంబు ముంచునొనఁగ ...
కు. సం 5. 549.

వ. నిజకులస్థానపౌరుషంబులు దలంచుకొని ముంచుకొను నభిమానంబుతోఁ గ్రమ్మఱన్ దొడరవచ్చు వియచ్చరులు గ్రమ్మందిన ... ఉ. రా. 4. 291.

స. క్రి., అ. క్రి. వ్యాపించు.

సీ. మణి విభూషణ దేదీప్యమాన ఘృణులు, దశదిశల్ ముంచుకొనగ రెత్తమ్మియడుగు, ఉత్తుకనపంబు భూమిపైఁ గ్రొత్త యైన, మెట్టతామరైయె జిగిమించి తనర. ఇందు. 5. 101

ఉ .. శాండ్రబూడిముతావి ఘుగు్గ నని ముంచుకొనం జెవిదండఁ బల్కినన్. కళా. 4 109

**ముంజకేశుఁడు** సం. వి అ పుం 1. శివుఁడు 2. విష్ణువు.

**ముంజము** సం. వి. అ. పుం. తృణవిశేషము ద్వాదశవిధదర్భలలోనిది.

**ముంజరము** సం. వి. అ. న ..ఉప మొదలగువానిదుంప, శాలూకము.

**ముంజాతము.** సం వి. అ పుం పుష్పశాక భేదము, ఒక జాతి చెట్టు.

**ముంజి** వి. (సం. మౌంజీ, క ముంజ,) బ్రహ్మచారి ధరించెడి యొకవిధ మగుదర్భల మొలత్రాడు

సీ ముంజిపైఁ గనుపట్ట ముద్దుగాఁ గట్టిన యంగవస్త్రపు గుడ్డ చెంగు లలర ...

గీ. చనియె గడిదేటి యాబ్రహ్మచారి మీటి ..
హంస. 1. 157.

గీ పసిఁడిముంజియు హొంబట్టుపంచె హేమ, కంకణంబులు వరుణముఖంబు దీర్ఘ, వాలమును గల్గు నొకమహా వానరుండు, వచ్చి పొడగన్న రఘువంశవర్యుఁ డలరి. ఉ. రా. 1. 99.

జ ముంజికాఁడు.

**ముంజికాఁడు** వి. (ముంజి + కాఁడు క. ముంజిగను.) బ్రహ్మచారి.

ద్వి తులువ నీమది నింతదురభిమానంబు, గలవాఁడ వీ ముంజిగానిచే నిట్లు, దొనఁగులఁబడి ఉక్కిరొంగచందమున, వెస కట్టువడి నీచప్పత్తి రానేల. ద్వి. హరిశ్చ ఉ. 1438 పం

**ముంజు.** వి మెదుక, పిరక.

ద్వి. కేలు కేలున బిగ్గఁ గీలించి పట్టి, సోలికి నిలుచుండె సోలియాడుచును, ముంజుగబ్బుల తుట్టముదుక వెంద్రుకలు, జుంజురింపఁగ విదుర్చుచుఁ జుట్టుమనుచు
అ మ. క. 2 89 పా. 17 పం.

**ముంజూఁడు.** సం వి. అ పుం భోజమహారాజు నకుఁ బినతండ్రి యగు ధారానగరి రాజు.

**ముంజూరు** వి (ముందు+చూరు) చూరు ముందటి భాగము, వాచూరు.

తే. ఏమటిన వేళఁ గాఁ జూచి యెలుక యొకటి, దిగదిగన వచ్చి ప్రమిదలో దీపకలిక, కఱచి కొని పోయి ముంజూరు కాలఁ బెట్టి, నట్లయైనది యైన నే మయ్యె నోరి. రామా 3 102.

గీ. ఇంటి ముంజూరు పెండెలో నిడుచె కాని, పువ్వు లిచ్చిన ముదువ దప్పొగరు మగువ. వేం. పంచ. 3 183.

**ముంజె(జియ).** వి తేఁత తాటికాయలోని గిజురు.
ద్వి నంజు డించినయట్టి నంజుడుల్ తాటి ముంజెల మిసిమి బల్ ముద్దల పైఁడి... రం. రా. సుం (చి. ని)

కం. లంజెయును బీరకాయయు, ముంజెయు బాల్య మునఁ జాల మోహమ్ముగొలుపున్. చంద్ర వి 2 32.

ద్వి. బ్రదు కెల్ల మురిమిచేఁ బడకుండ నాఁడె ముడిసినఁ గొఱ యానె ముంజె లంజెయును. ద్వి. పరమ. 4. 299 ఖా

**ముంజెయి-ముంజేయి** వి. (ముందు+చేయి) మణి కట్టువఱకుఁగల మోచేతి క్రింది భాగము, ప్రకోష్ఠము
సీ తగుఁ బ్రకోష్ఠంబు ముంజెయి యన ... ఆం. భా 2 188

**ముంజెఱఁగు.** వి. (ముందు + చెఱఁగు) ముని చెఱఁగు, వస్త్రము యొక్క ముందటి చెఱుఁగు.
సీ ముచ్చుట్టు ముడిచిన ముంజితోఁ గట్టిన చెలు వంపుగోచి ముంజెఱఁగు దూఁగ ...

**ముంజెర(ఱ)ము.** వి. (ముక్కు+చెరము) ముకుఁ జెఱము, నాసాపుటము.
సీ. ... ముంచెరమ జెరమ యన నాసాపుటము చెలంగు ... ఆం భా 2. 142.

**ముంజే-ముంజేయి** వి. (ముందు+చే) ప్రకోష్ఠము
ఉ శ్రీరఘువీరశేఖరుఁడు చిత్తము రంజిలఁ బల్కు చొక్క ముంజే గ్రహియింప సీతఁ గని .. ఉ. రా. 6. 50.

ఉ పూవిలుకాఁడు కిరహాయమున్ మునివంటఁగఁ జోలి నిల్పి తాఁ, బావడ లూఁది త్రొక్కి పసి పాటిగ ముందఱ సాఁగి నిక్కి ముంజే వడిఁ జూపి యాఘనుని చిత్తము లక్ష్యము చేసి వైచె చంద్ర 2 159., విజ వి. 2. 182.
(చూ ముంజేయి)

**ముంజేకోక.** వి. (ముంజే+కోక) వేఁటకాఁడు డేగ మొ॥ వానినపుడు దెబ్బ తగులకుండఁగ ముంజేతియందు గట్టిన వస్త్రము
వ . మెలివెట్టి చుట్టిన ముంజేకోకలును ... ప్రబంధ. 88

**ముంజేయి-ముంజెయి ముంజే** వి. ఔ (ముందు+చేయి) మణికట్టు వఱకును గల మోచేతి క్రింది భాగము. ప్రకోష్ఠము.
కం నాకొలఁది విచారింపక, నీ కిట్లనఁ దగునె మిన్ను నేలయు నిమ్మెఁ, గాక తిరుగంగఁ బడినం, బోకే ముంజేతు లొడ్డి పోవఁగఁ ద్రోతున్. భార. ఉద్యోగ. 3 60.

సీ ప్రేలివలంబున ప్రేలెడు మెడనూళ్లు జాఱువాముంజేతిజతుల త్రాళ్లు.

తే. భారతీదేవి ముంజేతి పలుకుఁ జిలుక, సమదగ జయాన స్త్రబ్రహ్మచారి మాకు నైష 2 49

సా. 1. ముంజే యాడిన మోచే యాడును.

కం రంజిలి తామును మున్నుగ, నంజలిపడ కిచ్చెనేని నయముగ వారున్, గొంజక యిత్తురు క్రమ్మఱ ముంజేయియు నాడె నేని మోఁచేయాడున్. కుచేల. 1. 108.

2. ముంజేతి కంకణంబున కద్దమేటికి ?

గీ. కమలలోచన ముంజేతి కంకణమున, కద్దమేటికి నీ సొమ్ము లరయరాదె... ఉ. హరి. 4. 100.

ఇప్లే, ముండే కంకణమున కద్ద మేల ?

కం. ఆవినం గామవికారము, నను బలిమిం గౌఁగి లించి నఖముల వ్రచ్చెన్, జనుఁగన ముండే కంకణ, మున కద్దం బేల చూడుము మహీపాలా. సారంగ 2. 228.

**ముండ.** వి. (క. ముండె. త ముండై.) 1. విధవ, విశ్వస్త.

సీ సిరి గల ఘనసువాసినికొప్పునకుఁ గాక, బోఁడు మల్లెలు బోడిముండ కేల ? వేణు. 64

2. దాసి

గీ. మొనసి హిత మాచరించిన ముండముక్కు కోతఁపడె ననుమాటయే గోచరించె . కాశీ. 9 225.

3. ఉంపుడుకత్తె

సీ ముండకై వలపున రెం డెఱుఁగక మోవి యానఁగానే బొల్లు తేనె గాదు. వేణు. 5.

కం. తలిదండ్రులు గడియించిన, ములుగుఁలో విత్త మెల్ల ముండల కొఱకై, వలపునను సరసి పెట్టుచు, నెలమి మెయిన్ మఁగె నొక్క యీడిగదానిన్. శల్హా. 1 (శ. ర)

4. వంచకురాలు, ధూర్తురాలు.

సీ ఏజంత బోధించెనే నిన్ను వాదల్లికాన పాషండ సంగతుల మెలఁగ, ఏబోఁడి గావించెనే యింత విరిపోటు తల్లి నీ కుపనిషత్తరుణితోడ, నేముండ యెడఁబాపె నే నిన్నుఁదల్లి మామీఁద హత్తిన కూరిమియును గృపయు, నేరండ భ్రమయించె నే నిన్నుఁదల్లి ధర్మంబు మోక్ష బబద్ధంబు లనుచు. ప్రబోధ 3 3.

సీ పెట్ట నేరనిరండ పెక్కు నీతులఁ బెద్ద గొడ్డ్రాలి ముండకు గొంతు పెద్ద ... వేణు 20.

(ఇట నిందాద్యోతకము.)

విశే. 1. పనికి మాలినవాఁడు, పనికిమాలినది.

మ. .. ఈ, ముగురం గూర్చిన ముండదైవమున కున్ మోమోట లేదోనుమీ ! ... భీమ. 3. 6.

2 వంచకము, మోసపుచ్చునది.

గీ అతని వాకఁ దలంపక యధికభీతిఁ, బోవుటయు బిచ్చపడి ముండపులుఁగు లకట, మోసపుచ్చెర నన్నని వాని బోయ, యలిగి మతిమంతు మెడ బిగ్గ నులిమి చంపె. కేయూర. 2 74

చే. ఇది యుత్తర పదముగా నుండి నిందార్థమును బోధించును.

సీ తన తల్లి శిశువుల తలఁ ద్రుంచి వైచినఁ జెడు ముండ యనుచు వచింప రాదె .. వేణు 67

గీ అవని నింక మీఁద నైన . లంజెముండకాఁ బుట్ట వలయు వేణు 102.

జ ముండమోపి, ముండమోయు, ముండరి, ముండల మారి

**ముండ.** సం వి. ఆ స్త్రీ 1 ముండీరిక యను వృక్ష విశేషము, బోడతరము (వృ వి.) 2. కొన్ని నియమములు గల భిక్షుకురాలు

**ముండకుఁడు.** సం. వి. అ. పుం. మంగలివాడు.

**ముండకోపనిషత్తు** సం. వి. ద్. స్త్రీ. ఆథర్వవేద సంబంధ మైన యుపనిషత్తు.

**ముండచణకము.** సం వి. అ. పుం. కాయధాన్య విశేషము

**ముండజము** సం వి అ. న. ఇనుము, లోహము

**ముండనము** సం. వి అ. న వపనము, గొఱుగుట

**ముండఫలము.** సం. వి. అ. న. కొబ్బరికాయ

**ముండము** సం. విశే (అ ఆ అ) 1. గొఱుగఁ బడినది.

2 నీచమైనది, తక్కువది

వి అ పుం పైయాకులు గొట్టివేయఁగా మిగిలిన చెట్టు మొదలు.

న. 1. గోపరసము, బాలెంతబోలము 2. ముండ కోపనిషత్తు, పుం. న తల. శిరస్సు (మే ని.).

**ముండమోపి.** వి. (√ముండ, క. ముండమోపి.

త ముండై మోప్పి) విధవ, ముండమోసినది
ద్వి. వాపోవుదురె ముండమోవుటపగిది ...
పండితా దీజా 82 పొ

**ముండమోయు** అ. క్రి. (√ముండ క ముండ మోసు) 1 వైధవ్యము నొందు
2. వ్యర్థమగు శ. ర.).

**ముండరి.** విశ (ముండ + అరి³) ముండమారి. విటుడు.

గీ. శాటకుండు వృద్ధు పగవాడు చుట్టంబు, బూతు నూనగాడు పాతకుండు, దొంగులాడు ముచ్చు ముండరి కొండీడు, కల్లు ద్రాగు వాడు గాడు సాక్షి విజ్ఞా వ్యవ. 104

**ముండలమారి.** విశ (ముండలు + మారి.) జారుడు, వైశికుడు (శ. ర.)

**ముండశాలి** సం. వి. అ. పుం. నిర్భూక శాలి, వ్రీహి భేదము (వ్యా. వి)

**ముండాయసము.** సం. వి. అ. న. ఇనుము. (రా. ని.)

**ముండి.** సం విశ.(న్. నీ న్.) 1 గొరుగబడిన వాడు. 2 కొమ్ములు లేనిది.

వి. న్ పుం. 1. మంగలవాడు. 2. బోడతలము (వ్యా. వి) (శ. ర.).

**ముండితము** సం విశ (అ ఆ. అ) గొరుగ బడినది, కొమ్ములు నరుకబడినది

**ముండుడు.** సం. వి అ. పుం 1. తురకుడు, మంగలి, 2 రాహువు,

**ముండ్రము** వి. ఒకానొక రత్నదోషము.

ఆ. ...కోణములును ధారలు లేకున్న, ముండ్ర మండ్రదు దాని ముట్ట రాదు ... రత్న. 25.

**ముండ్లకంచె(చియ)** వి (ముండ్లు + కంచె) ముండ్లకంప వెలుగు, ఆవేష్టకము.

**ముండ్లపంది.** వి. (ముండ్లుపంది. త. ముళ్ళంపన్ఱి) ఏదుపంది. శల్యము (శ. ర.).

**ముండ్లములుచింత.** వి (√ముల్లు) ఒకానొక కూరాకుచెట్టు.

ద్వి. అలరి మిక్కిలి ప్రియం బయినది ముండ్ల ములుచింతకూర నామోదించి యతడు .. ద్వి పరమ 8 ఏకి పొ (చి. ని పా)

**ముంత** వి. (త. మొంతై.) దార్వాదికలశము మానిక, కలశము

సీ. దార్వాది కలశముల్ దనరుముంతయనగ .. ఆం భా. 2 245.

గీ. చక్రి పొడమంగ జార్తివస్థాన మయ్యె, నోరి మీవంశమందు దా కోర్వ జాలు, వారి జూపుము కుమ్మరావమున రాగి, ముంత లేటింగ గలవె నీ కింత యేల ? ఉ హరి 8. 48.

కం. చెప్పెద ముంతెడుముత్యము, లిప్పింపుము నాకు ననుచు నెఱుకత తనతో, జెప్పగ నానృపసతి విని, యప్పుడ ముత్యములొసంగె నానంద మునన్. వేం. మా. 5. 22

సీ. కుడుపాభిధానమై యడరు నవని, మాన నా ముంతనా మానిక యనగను ... ఆం. భా. 2 270

సా. చల్లకు వచ్చి ముంత దాచు – కార్యము నిమిత్తము వచ్చి యాకార్యమును మఱుగు పెట్టియుంచు అనునర్థమున నుపయోగించు సామెత.

ఆ. నిన్ను నొరసి చూడ నున్నదే పదియాఱు, వన్నె పసిడికొదువలెన్నగలదె, మాయభీష్టమైన మాట చల్లకు వచ్చి, ముంతదాచ నేల యింతి వినుము. వై జ. 3. 7.

చం జలజదళాక్షి యేమిటికి జల్లకు వచ్చియు ముంత దాచగన్ .. విక్ర. 7. 38.

జ. ముంతపొగ, ముంతమామిడి, ముంతవాటు

**ముంతపొగ.** వి (ముంత + పొగ) పిశాచిబాధ తొలగుటకై ముంతలో వేసిన మిరెపకాయలపొగ. (క్రమముగా నిది యొక శిక్షగా నేర్పడినది.)

సీ పతిపత్ని నని మేనఁ బసుపు పూసికొనంగ బొగ
సులా యని ముంతపోగ ఘటించు . .
శుక 2 115

ముంతమామిడి వి. (ముంత + మామిడి, త ముం
దిర ) అగ్రశీఘ్రము, జీడిమామిడి (వ్య వి )
సీ మొన్న నాఁటిది మొక్క ముంతమామిడి
మొక్కఁదోయ మెత్తిన నఱచుఁ దొలఁగె
నోర్తు .. కృ శకుం 3 83

ముంతపాటు వి (ముంత + పాటు) ముంతలో
వైచి దాఁచుట
సీ మోసపోయితి దీని ముంతపాటునకైనఁ జేకూ
ర్పలే నైతి రూకరుత్రు ... నిరం 2. 123.

ముందటపది వి ముందు + పది) ఆది
వరాహము
చం .. బ గరున్, మెఱుఁగుల కొమ్ము చేఁ బుడమి
మీఁటిన ముందటిపందిపోఁడికన్ ..
అచ్చ భా 3 45 పు.

ముందటేఁడు వి (ముందు + ఏఁడు,) కడచిన
సంవత్సరమునకుఁ బూర్వసంవత్సరము, పరారి.
ఆ కన్నులందు మదము గప్పి కానరు గాని,
నిరుడు ముందటేఁడు నిన్న మొన్న, దగ్ధులైన
వారు దమకంటెఁ దక్కువా ...
వేమన 1. 169.

ముందర (రు)—ముందఱ. వి ఔ ముందు.
(అదంత మని శ. ర.) వ్యవ. ప్రయోగములందు
ఔపవిభక్తికముగాఁ గావవచ్చుటచేతను, ఉ.
సం లో నుకారాంతముగా నుండుటచేతను, పై
రెండురూపములు గ్రహింపఁబడినవి. నిర్ధారక
ప్రయోగములు లేవు )
క. ముందుభాగము, పురోభాగము.
సీ. శ్రీనాయకుండు రక్షించు నీముందర వేధ
రక్షించు నీవెనుకదిక్కు ..
హరి. పూ. 5. 160.
సీ. దండధరుండు ముందర బరాబరి సేయఁ జరుఁడై
చరింప నిశాచరుండు ... దశా. 2 128.

సీ వెనుక ముందఱ లేరు సెవకైన చుట్టాలు ...
సైష. 1 107.
(చ) వెనుక
చం ... వేద్యులవెల్లిఁ జెల్లి—, మనుగుచు నేల
వేల్పుతల ముందఱిపల్లియ కే గ .
సీతా 1 100.
(ట.) మొదటికాలము
కం దరణి గడుఁ జేసివారును, బరిటికి వృత
శైలధాన్యములఁ జెచ్చెర ముందర సంగ్ర
హింతురు ... భార అ. 3 241
మ .. అహా యిట్టినివార్త ముందరగానే విని
ఘోరమై చనియెఁ బాతాళంబువన్ డాగఁ
గాన్ .. దశా 3 171.
(త.) భవిష్యత్కాలము, ఆగామికాలము
చం మొలచు వచఃప్రసంగములు ముందరఁగాఁ గల
కార్యరేఖ పెం,పెలయ ... రాఘవ 3. 64
చం . పిరితో, మొఱక పెనఁగ మాకుఁ జలమో
ఫలమో తగ నీవు తిట్టు లి, మొఱకుదనంబు
దక్కు మిటముందర నీగుర మంతభంగమున్....
భా. రా యు. 718.
(ప) ఉదర్కము, ఉత్తరకాలఫలము
చం వెఱవనివారలుం గలరె పీరలు ముంద
ఱెఱుంగ రక్కటా ! భార. ఆది. 6 174.

ముందఱ(ఱు)—ముందర వి ఔ
(ముందుకాలము, పూర్వకాలము.)
చం. చిఱుతఁదనంబునం దగవు చిత్తమునం దల
పోయ లేక ముంద,ఱ వటు పోవనిచ్చితి ...
భార. ఉద్యో. 3. 36 1
చం. పరముకపర్దసంగమునఁ బావన మైన సురా
పగాంబువుల్, శిరమునఁ దాల్చి ముందఱు
ప్రసిద్ధియుఁ సిద్ధియుఁ గన్నకంటె నీ,పరమ తపః
ప్రభావమునఁ బర్వతవల్లభుఁ డిప్పు
డెంతయున్. కు. సం. 7. 844.
కం ఎన్నితెఱఁగుల ముందఱ, విన్నను మురవైరి
మహిమ విన నింపగు .. ఉ హరి. 2. 67.

(మొదటికాలము)

ఉ. ... ఎల్లవారలుం దనవారిఁ దోకొని కడున్
ఉత్సవ బునఁ గూడి వార్తకున్, ముందఱఁ
బోయి గోధనము ముట్టుకొనన్ వలయున్
మహోగ్రతన్ ... భా. విరా. 2. 126.

కం ముందఱ వచ్చితిఁ దావక, సందర్శన మర్థి
గోర సకలంబును గ్రాలిందిని విడియుంచితి వా,
రందులకుం గదలి వత్తు రెల్లిటి కనినన్.
జై. భా 3 85.

(ఆగామికాలము)

వ అట్లగుట నింక ముందటి భవంబునకు నిట్టి
యైశ్వర్యం బొకం డేల ధర్మార్థ కామ
మోక్షంబులం దేది గోరిన నట్టి చతుర్విధ ఫలం
బులకు భగవత్సేవాకరణం బొకండు సాధనంబు.
కవిక . 5. 27.

సీ కడివోడు నా కిమ్ము పడఁతి యీ గేహంగి నవఁ
గనవోమి ముందటికిఁ జూడు ...
ఆము. 2. 19.

(ఎదుటి ప్రదేశము)

చం. నడు మన దింతిచన్నులతనర్పున ముందఱు
గానరాదు .. కు. సం. 8. 16.

సీ. కనుఁగవ మెఱుఁగులు గదిరిన ముందఱఁ
బుష్పోపహారంబుపోలుపు దాల్చ ...
భార. విరా 1 108.

గీ తలవరులు కొంద ఱొలని ముందఱఁ జనంగ
ఆము 2. 75.

జ ముందటి మ్రాను.

**ముందటిమ్రాను** వి (ముందఱ + మ్రాను) అరిణ నిలువుటకై యడ్డముగాఁగట్టఁబడినమ్రాను. (శ. ర)

**ముందల** వి. (ముందు + తల త మున్దలై.) కం ముందలె.

1 శిరఃపురోభాగము, తల ముందరిభాగము

శం మొగిచినచేతులు ముందల, నిగిడించి నితాంత
వినయనియతిం జారుల్, దగ విన్నవించి రి
ట్లని, జగతీశ్వరునకు నిజప్రచారం బెల్లన్.
భార. విరా. 3. 79.

సీ జొడల ముందల యన శిరోగ్రము కి ...
అం భా 2 145.

2. తలముందటి జుట్టు.

ఉ. అట్టుల దుస్ససేనుఁ డదయాకృతి ముందల పట్టి
యీడ్వఁగా నెట్టు సహించెనొమామ సతియేడ్చు
చెలుంగున కెట్టు లోర్చె ...
భార. ఉద్యో. 1 347.

ఉ ముందల వట్టినట్టు తన ముఖ్యతరాస్త్రము
గొన్న దేవకి, నందనుఁ జూచి సాధ్వసము
నానయుఁ గ్రమ్మఁ గరీంద్రు డగ్గి సంక్రందన
నుఁడు ... పారి. 5. 18.

**ముందలకట్టులు**—తలముం దున్న జుట్టు.

చం మునిమనుజాసురాహిసురముఖ్యుల వీఁపుల
తోళు లెత్తఁగా, మును గుడి గట్టి మోఁది
యును ముందలకట్టులు గట్టి కొట్టియున్ ...
కు. సం. 2. 211.

**ముందలపట్టు**—తలముం దున్న జుట్టులు పట్టు కొని చేయుపోరు.

భా. ... ఇంటికడ నేరికిన్ విజృంభింతువే, నా కీ
విచ్చుట నంచు నిద్దఱుసతుల్ వాక్యోపవాక్యం
బులన్, గాకే ముందలపట్లకుం దొడఁగి రా
కల్యాణ వేదిస్థలిన్ పాంచా. 4 24.

**ముందలచీర.** వి (ముందల + చీర) తలపాగా, ఉష్ణీషము.

ఉ మోహనబాణపాతమున ముందలచీర లెఱుంగ
కున్నయా, బాహుబలంబుతోఁ గడఁగి పార్థునిఁ
దాఁకెడుబుద్ధి గ్రమ్మఱన్, సాహసవృత్తిఁ
జేసి యవిచారతఁ బోయితిమేని వాఁడు
పూర్ణాహుతి సేయఁడే మనలనందఱ నొక్కట
మార్గణాగ్నికిన్. భార. విరా. 5 278.

**ముందు** వి జొ. (శ త. ముందు) 1. పూర్వ కాలము

ఉ ముందటియట్ల యింకఁ బదుమూఁడు దినం
బుల మాత్రకున్ భవ, న్మందిరవాస మియ్య
కొనినం గద తీఱు మదీయవాంఛ ...
భార విరా. 3, 62.

కం. ము౦, దెన్నండు లేని యోటమి ముం యుచు నుండెన్ .. నీలా. 3. 54 2 84.

2 ఆగామి కాలము, భవిష్యత్కాలము

వ అతి తేజం గ్రిందట బదితిరంబుల వారను ముందట బదితిరంబుల వారును ...
భాగ. 10 ఉ 481.

ఉ ఇన్నియు నీకుఁ దేటపడ నే నెఱిఁగించితి నింక ముందటన్, జేన్నము సేయఁగా వలయు శౌరి వెసం బిలిపించు నీకు నభ్యున్నతి హేతు వయ్యదుకులోత్తముఁ డన్న మహావిభుండు నిర్భిన్న విరోధిసైన్యుఁ డగు భీమునిఁ జేరఁగఁ బిల్చి యిట్లనున్ జై. భా. 3. 45.

3. ఉదర్కము, ఉత్తరకాలఫలము.

సీ. ముదిమి యెవ్వరికైన ముందు దోఁపఁగనీదు జాడ్య ముద్దండతఁ బ్రబలఁజేయు ... నీతి. 43.

4 పురోభాగము.

కం. ఎటవోవ వచ్చు నిను ముందట నిడుకొని పోర నున్నతిగు రాజుల నెక్కటిఁ దోలెడి సాత్యకి నీ, వటఁ దరుముదుగాక యెదుగ వగునే నీకున్. భా౦. ద్రో. 4. 94.

కం అలవకనుదోయి ముందట, వలవడ నలినంబు మలిన మయ్యెను ... శై ష. 2. 12.

ఉ. మువ్వలు గంటలున్ మొరయ ముందటి కూఁకటి రావిరేకలో, నవ్వనజాతుఁ డాడు ... హరి. పూ. ౬. 191.

౬. ముంగల, సమ్ముఖము

చం. విరటుఁడు నిన్ను నెప్డు పనివేవురముందటఁ జెప్పు బావుని, స్ఫురితుఁడు శౌర్యశాలి కుల భూతివిశేషవిధాయకుండు భూభరణవిశార దుండు జనభవ్యతపఃఫలసంభవుండు గా, తర పరిరక్షకుం డనుచు దానికి నీడుగఁ జేయు మిత్ర జన్. భార. విరా. 4. 7.

ఇ. ముంగడ, ముంగమురము, ముంగమురాము, ముంగమురారి, ముంగయి, ముంగయిమురారి, ముంగల, ముంగలి, ముంగామురము, ముంగా మురారి, ముంగాముసుగు, ముంగాలు, ముంగిలి, ముంగురుమొటికలు, ముంగురులు, ముంగేలు, ముంగై, ముంగైమురారి, ముంగై మురుపు, ముంగొంగు, ముంగొన, ముంగో పము, ముంగోపి, ముంగోర, ముంగోలు, ముంగోలు, ముంజూపు, ముంజెయి, ముంజె అఁగు, ముంజే, ముంజేకోల, ముంజెయి, ముందటిపంది, ముందరేఁడు, ముందల ముందలకట్టులు, ముందటచీర, ముందుకొను, ముందుపడు, ముక్కొమ్ముమెకము, ముగ్గొయ్య, ముచ్చిక, ముచ్చికకొడి, మునిముంగల.

ముందుకొను అ. క్రి. (√ముందు) వ్యాపించు.

గీ, మురజపణవాది ఘోషముల్ ముందుకొనియె ఉదా. 8. 165.

ముందుపడు. అ. క్రి. (√ముందు) మునుకొను, ముందగు.

(వ్యవ.) పనికిని వాఁడు ముందుపడును(శ. ర.).

ముంపించు. స. క్రి. (√ ముంచు) మునుఁగఁ జేయించు.

ద్వి. ... వారి నందఱ నాపుట్టిమీఁద, ఘనమైన యొకమూఁక గాఁగ నెక్కించి, తామున్న యవలికి డాఁటి కాసీల, నాముహ సింధుమధ్యము మున ముంపించి. ద్వి. పరమ, 7. 541 పొ.

ముంపిరి. విశే. (√ముంపు) ప్రవృద్ధమైనది

ఉ ముంపిరి రాజ్యగర్వమున ముందర గానవు గాక ధాత్రిఁ బాలింపరొ తొంటిరాజులు దిలీప ముఖుల్ మునికోటికూఁత లాలింపరొ నొంపరొ మదవిలీధక తోఁనికాటఘాటమున్, నింపరొ దిక్కటాహముల నిర్మల కీర్తి సుధాంశు చంద్రికల్. రాజ. చ. 2. 17

ముంపు. వి. (ముంచు) 1. ముంచుట.

చం. .. తచ్చరణ బు నిస్తరో, దకముల ముంపు నన్ దడియ ... రామా. 6. 86.

2. వృద్ధి, పెంపు.

సీ వివిధసింహకిశోరవిహృతివిభ్రమలీలఁ బై కొను
బహువీరభటుల ముంపు ... కవిక. 2 67
(కావేరీవర్ణనము)

వ ... నయసంపన్నుసంపదయుంబోలె ముంపు
దప్పక వసంతసమయతరుసంతతియుంబోలె
బలుమోసులెత్తుచు ... శ్రీరం. 1. 132.

3. వెల్లువ, ప్రవాహము.

ఉ మారునిమాయవంపు దినమానముమేల్ నడ
లింపు జారిణీ, జారులకు స్తరింపు జలజంబులకుం
దలవంపు కోకసం, సారము మట్ట
గింపు నెలజాలునిరాకము మోమునొంపు
శృంగార రసంబుముంపు కనంగాఁ దగెఁ జీకటి
గుంపు పెంపుగాన్. ల. వి. 4. 41.

4 గుంపు.

కం. జలదములముంపు దప్పినఁ, గలితప్రభఁ బొల్చె
దిశలు గర్దమ మింకెన్, జలి యింతకుఁ గడు
మించెన్, గొలఁదితటగ్నినదము లెల్లఁ గొంచెము
లయ్యెన్ చిత్రభా 2. 26.

వ, దట్టం బగునెయ్యంబున వెదురు బియ్యంబు
లొండొంటి కొసంగఁ గరివంక రేణువులు వంప
ముంపు చెడి యిట్టట్టు వడి తిట్ట లగు జిట్టల సంక
టంబు లగుశొంకల వీక్షించి. మనుచ. 4. 37

5 అతిశయము

మ వేసటఁ ముంపున్ మాటపైఁ గంటగిం,
పున వర్ణ్యక్షితిపాలపాళిపయి నింపున్ నింపమిం
దెల్పినన్ .. భోజరా. 4. 260,

6, ఆధ్యము గుఱి.
(కావేరీ వర్ణనము)

వ. ... అతిరథ పటిష్ఠనిష్ఠుర బాణశ్రేణియుంబోలె
ముంపు దప్పక యొడ్ల భేదించుచు ...
శ్రీరం. 132.

విశ ప్రియమైనది, ఇష్టము.
(ఈ యర్థమునకుఁ బ్రయోగాంతరము లేమి. ఇంకను విచార్యము.)

చం. అనునెడఁ గ్రమ్మఱం గినిసి హంసుఁడు నాడి
భకుఁడు డోడిదు, ర్మనుజులఁ గూడి దండము
కమండలువుం బిరఁబుఁ జిక్కమున్, ముకుకొన్ని
వెండియున్ యతులముంపగు సొమ్ములఁ గాల్చి
కాల్చి క్రొవ్వునఁ గఱకుట్టు లయ్యెడఁ
జీవుల్గొని పోయిరి వేడ్కనూరికిన్.
ఉ. హరి. 4. 71.

**ముంపుగొను.** అ. క్రి. (ముంపు+కొను) 1. గుంపు గూడు.

కం. ముంపుగొని విసుఁ వానల, జొంపంబులుగురియ సుంఱలు సుమనోమధువుల్, తుంపర సెగయఁ బరాగపు,రొంపుల భూభాగ మతినిరూషిత మయ్యెన్. భాగ. 3. 510.

2. నిండు, పూర్ణమగు

వ. (వెన్నెలలు) రథాంగ కంఠగుహాకుహరంబుల ముంపుకొని మెఱయుచు... పారి. 2. 52.

**ముకాము.** వి. (హిం. ముకామ్) నివాసము, మకాము.

కం. కుండినపురిని ముకామిగ, నుండునమాత్యుండు ప్రకటితోత్సవవార్తా, మండితరేఖ యొసంగ న,ఖండితమతి రయము మెఱయఁగాఁ బని వింటిన్. భోజసుతా. 1. 109.

**ముకు—ముక్కు**[1]. వి. (క. ముక్. త. మూక్కు) నాసిక.

కం. పఱచునొకకడితిఁ బతి ముకుఁ, జెఱమలకై యేయఁ జిప్ప చినుఁగఁగ నది యుక్కఱఁ గాఁడి డుస్సి పాఱిన, నఱిముఱిఁ జోపిరువు వాఱి యల్లటు పడియెన్.. మనుచ 4 45.

గీ కోప మిటు తానొ కాదొ యోఘాపవంక్తి, యది యపుడు వచ్చి నామీఁద నావహించి, కటము లదరించె మొగ మెఱ్ఱఁగా నొనర్చె, బొమలు ముడివెట్టె ముకుపుటంబులు గదల్చె. కువల. 2. 33.

**ముకుచాయన్** — ముక్కునకుఁ దిన్నఁగా

మ. ... మూఁడవయామంబున వొక్క నాఁడు ముకుచాయన్ దివ్వెటీ ల్గొల్చిరా, నవ ధానం

బున నింటిత్రోవఁ గలహంసానూనయానం
బునన్ ... వేం. పంచ 1 115.

చ. సరసిజబాంధవుండు ముకుచాయ ననూడఁడు
తేరు గోల సుస్థిరతర తన్మిలద్ధపంజిహ్వాగ
పాశము లోలి వ్రేల నప్పుడికరు లజ్జనాళములె
పో యని తుండము లెత్త దడిసో, స్థములు
నేఁగు భీతిమెయిఁ దత్ప్రహితేక్షణుఁ డై యం
బునన్ కృష్ణ. 1 99

జ. ముంజెరమ, ముకుఁగ్రోలు, ముకుఁజెఱమ,
ముకుఁద్రాడు, ముకుదూలము, ముకుబొమ్మ,
ముకుబంతి, ముకు మందు, ముకుమచ్చ

ముకుందకము నం. వి. అ. పుం. 1. ధాన్య
విశేషము, షష్టికలు 2 ఉల్లి (వ్య వి).

ముకుందము నం. వి. అ. పుం. 1 పాదరసము
2 మణివిశేషము, ఒకజాతిమాణిక్యము. 3 కుబే
రుని నవనిధులలో నొకటి

ముకుందుఁడు నం. వి. అ. పు. విష్ణువు

ముకుందుబల్లెము. మి. వి. (ముకుందుఁడు +
బల్లెము) ఒకవిధమైనబల్లెము.

చం వలలును బోటుకోలలు సివంగులబండ్లు
ముకుందుబల్లెముల్, .. చిలుకులు చిల్ల
కోలలు విచిత్రగదాధనురాదిసాధనం, బులు
దనరఁగ వెంబడిని బోఁగి చెలఁగుచు నేఁగి
రొండొరుల్ ... ఇందు. 2. 58.

పంచచామరము ముకుంద సత్కృపాకటాక్షము
న్విరాజిలన్ నృపా, ముకుందుబల్లెముం గరంబు
పూని ... కృష్ణ 3. 87.

(ముకుందబల్లెము. ముద్రి పా.)

ముకుఁగ్రోలు—ముక్కుగ్రోలు, వి. (ముక్కు +
క్రోలు) ముక్కురంధ్రము
(బ. ముకుఁగ్రోలులు)

సీ శ్వాసమారుతవేగవశమున ముకుఁగ్రోళ్ల, వెలికి
లోనికి జంతువితతి వాఱ ...
భా. రా. యు. 857.

ఉ. పంచెమె దీనివాలది సుధాంశువిభాకరకంబె
దీనియా, కుందపాదుఁగు దీనిముకుఁగ్రోళులు
భూమిబిలాంతరంబులే .. పాండు. 5. 244

క. వైవస్వతుండు తుమ్మిన, నావిభుముకుఁగ్రోళ్లఁ
బుట్టైనతులై శక్తి, శ్రీవిభుఁడు సామజననే,
నావిభుఁ డిక్ష్వాకుఁ డిక్ష్వాకువంశపతియుండై .
వి పు. 5. 65.

ముకుఁజెఱమ. వి. (ముకు + చెఱమ) నాసా
పుటము
చూ. ముకు.

ముకుఁద్రాడు. వి. దే. (ముకు + త్రాడు)
నాథము, ఎద్దుకు ముక్కున గుచ్చెడుదారము.

సీ త్రుమ్మఁగిట్టిలఁ బట్టి ముకుఁద్రాళ్లు గుట్టించి,
గంతగోనెకు వాని సంతపటిచి ...
నా పంచ 5. 19.

అ వేగపడుట మేలె వినుము కార్యము దీఱుఁ,
దీఱకుండు దానితెఱఁగు వగిన, యప్పు డాడి
రాదె యిప్పుడు ముకుఁద్రాటఁ, గాలు గ్రువ్వ
నేల కమలనాథ ... భార ఉద్యో. 3 220

ద్వి తెలిమించు ముకుఁద్రాడు తిన్నని మోము,
గలిగి తేజీకూనగతి నొప్పు మీఱి ... వెలిగిబ్బ
నెక్కి యవ్విభుఖండమౌళి ...
ద్వి. పరమ. 2. 76 పొ.

ముకుటము నం. వి. అ. న. 1. కిరీటము.
2. తురాయి. 3. పర్వతశిఖరము, కొండకొన
(వాచ.)

ముకుటీ. నం. వి. ఈ. స్త్రీ. వ్రేళ్లు విఱుచుట,
మెటికలు విఱుచుట, అంగుళీమోటనము.

ముకుదూలము, వి. (ముకు + దూలము.) ముక్కు
నడిమియెముక (శ. ర.).

ముకుబొమ్మ. వి. (ముకు + బొమ్మ) మత్స్య
విశేషము.

సీ వాలుగ ముకుబొమ్మ వల్లికతట్ట పుత్తడికాసు
పూమేను కడిసెలంబు .... హంస 4. 187.

సీ వాలుప ముకుదొమ్మ పల్లిక గండె .
వేం. పంచ 1. 28 4

**ముకుబంతి.** వి (ముకు + బంతి) పశువులకు శైత్యముచే నాసారంధ్రములయందుఁ గలిగెడు కేశావృతపిండరూపవ్యాధివిశేషము.
(దీనిని సేకరించి యుంచుకొని, మఱియొకదాని కావ్యాధి కలిగినప్పుడు తన్నివారణార్థము దీనిఁ గొని బడిసివేయుదురు )

వ. ... చూఁడుఁగోడుపులను వాదోళ్లు ముకు బంతులు మొదలుగాఁ గలసాధనంబులు గొని వచ్చి కెవులంగొంటులఁ జికిత్సించు వారును ..
హరి. పూ. ౬. 143.

ద్వి మొలవిడి సెలకెవుల్ ముకుబంతి కపట, ... ... ... ఆదిగా నెన్నఁ, గలపసరాలరోగములకు నెల్ల .
నవనాథ. 1. 41 పొ ౯ పం.

క० ముకుబంతి తలకు నెక్కిన, నొకకాలము నందుఁ బసర ముడుగక దగ్గున్, ఒకపిల్లిగడ్డ యాసురభికి నస్యము సేయ దగ్గు పేర్కొని మామన్ ...
గో. 1. (చి ని.)

**ముకుమందు** వి (ముకు + మందు) నాసారోగముఁ బోఁగొట్టు నస్యవిశేషము.

మ ... ముకుమందై యేర్పునావం జిగుర్కొను పచ్చళ్లను ...
ఆము. 1. 82.

**ముకుమచ్చ.** వి. (ముకు + మచ్చ) నాసికా చిహ్నము, ముక్కువందలిమచ్చ.

సీ. మూపుఁరంపుగజికిమేఘరి ముకుమచ్చతత్తడి పడి దుముదారు చూప ... ఉ హరిశ్చ 3. 121

(ముకుమచ్చతత్తడి—ముక్కువందు వలుపు గల వాహనము, వృషభవాహనము).

**ముకురము** సం. వి. అ పుం 1. అద్దము. 2. ముకులము, అరవిరిమొగ్గ 3. కులాలదండము, కుమ్మరిసారె త్రిప్పెడికఱ్ఱ. 4. వకులవృక్షము, పొగడచెట్టు. 5. మల్లికాలత.

**ముకులము,** సం. వి. అ. పుం. న. 1. అరవిరి మొగ్గ. 2. శరీరము.

**ముకులితము.** సం విశ (అ ఆ అ) 1. ముకుళములు (మొగ్గలు) గలది. వికసించుచున్నది. 2 సగము మూసికొనఁబడినది. 3 మూయఁ బడినది

**ముకుళించు.** సం అ క్రి. మోడ్చు.

వ .. నవ్వువెన్నెలల ముకుళించినకెందమ్మి మొగ్గలన .
ఉ రా. 1. 138.

**ముకుళీభవించు** సం. అ. క్రి ముకుళించు మోడ్చు

చ .. నయనంబులు మూయుచు నిద్రఁ జెందెనో, యన ముకుళీభవించె దివసాంతమునందుఁ బయోజషండముల్ ...
అని. 3 5.

**ముకుదు.** సం. వి. ఉ. పుం 1. విముక్తి, విడుదల 2 ముక్తి, మోక్షము

**ముకూలకము.** సం వి. అ. పుం. దంతిచెట్టు. (శ ర)

**ముక్క**—ముక్క వి. 1. ఖండము, తునుక.

ఆ తోఁచు శకలసంజ్ఞ తునుక తుండెము తుండె... తునియ ముక్క ...
ఆం. భా. 1. 79.

చం. ... కాదని తప్పు వట్టినన్, మొక మటు క్రిందుగాఁ దిగిచి ముక్కలు వోనియునుంప కత్తితో, సిక మొద లంటఁ గోతు ..
(చాటువు)

2 చిన్నమాట

సీ సంధ్యముక్క పఠింపఁ జాలనియతఁ డెట్లు క్రతువుష్ఠానసంగతికి నోపు ... రామలిం. 57

**ముక్కంటి.** వి. (మూఁడు + కన్ను. క. ముక్కణ్ణ, త. ముక్కణ్ణన్) త్రిలోచనుఁడు, శివుఁడు

శా. ఘంటాకర్ణుఁడ నేను నాయనుజుఁ డీకాలాంతకుం డేము ముక్కంటిం గొల్తుము ...
ఉ. హరి 2. 140.

సీ. ముక్కంటితలపువ్వు మున్నీటిలేఁబట్టి కైట భారాతి డాకన్నుదమ్మి ... నైష. 8. 201.

**ముక్కంటిచుక్క** వి (ముక్కంటి + చుక్క) ఆర్ద్రానక్షత్రము.

(ఉత్తరఫాల్గుణప్రధానక్షత్రము అని శ. ర.)

**ముక్కంటిచెలి** వి (ముక్కంటి + చెలి) కుబేరుఁడు, త్ర్యంబకసఖుఁడు.

**ముక్కంటిపండు.** వి (√ముక్కంటి) కొబ్బరికాయ (ప్రా., శ. ర.)

సీ దం బెమ్ముతపసికమ్మం జావపేకుజ్యనందలి కుందేటికందు నొకటి, చాయజక్క వచంటి సాహెబుపాపని తుటికిమానిక మగుడుంత యొకటి, ముక్కంటిపండుల ముక్కలీదేర్పు నాయంకుని తంద్రిచేజంక యొకటి, జాళువాపరపయ్యఁ జంపి యాపట్టికి మేలిచ్చు సామేని మెకము నొకటి.

గీ. నీటియెకిమీని మొలనూలు బోటిమిన్న, యొంటిపంటను గలిటి యొకటి దక్క, కలను నెమకిన మెకముల పాలవుఁ గాన, మేము జేజేలఁ గాచినసామిసంద. ప్రబంధ 128.

**ముక్కంటిమల.** వి. (ముక్కంటి + మల) కైలాసము.

ఉ. వింటి నపూర్వ ముర్వి నొకవింటినరుండె జయించువాఁడు ముక్కంటిమలం బెముల్చిన మగంటిమితో దిదుతాడెము ...
చం రా. 5. 56

ఇట్లే, ముక్కంటికొండ, మొ.

**ముక్కంటివాల్గంటి** = పార్వతి, భవాని

వ. అని రహస్యంబుగా నవ్విద్య నాకు నుపదేశించి, ముక్కంటివాల్గంటి మింటిచొప్పునం జనియె...
మనువ. 6. 58.

**ముక్కాఁడి** వి (మూఁగు + కాఁడి) 1. దుక్కి చాలించి యాహారమునకై పోవునపుడు అరకలన్నిటి నొక్కచో ప్రోగుచేసి యొక్కటిగాఁ జేర్చి నిలిపినట్టి యాయరకల కాండ్ల మొత్తము (శ. ర.). 2. అనేకులకు ఏకకాలమున తగిలెడివ్యాధి (శ.ర.)

చం. విరహులఁ జంపసాగితివివేయన నేమిటికూరు ముక్కాఁడిన్, ఒంగినఁ బోఁడుఁబోతులరటం బనుమాటనిజంబె పోళికి.

**ముక్కటము** వి. (√మూఁడు) అముడము, అవునేయి, నువ్వులనూనె చేర్చి శిశువులకుఁ బెట్టెడి యాహారము.

వ్యవ మూఁడునెలలు వచ్చువఱకు శిశువులకు ముక్కటము పెట్టుట యాదేశమున నాచారము.

**ముక్కటించు** అ. క్రి. (ముక్కు[1] ముక్కు. శ్వాసము బిగఁబట్టు

ద్వి కూఁకటి గిలువుచుఁ గొక్కరించును, మూఁతులు నుఱుపుచు ముక్కటించును .
పండితా ప్ర. 271 పా.

**ముక్కద్దము.** వి (ముక్కు + అద్దము) సులోచనము.

**ముక్కనుసామి.** వి. (మూఁడు + కను + సామి) ముక్కంటి, శివుఁడు.

తరు. తివిరి ముక్కనుసామిఁ గొల్చినఁ దెల్వి పొందరె వేలుపుల్ ...
అచ్చ. భా. 4. 59 పా.

**ముక్కన్ను.** వి. (√మూఁడు) మూఁడవకన్ను మూఁడుకన్నులు.

ద్వి. గ్రక్కునఁ దనముహోగ్రత తేటపడఁగ, ముక్కన్నుఁ దెఱచి కామునిఁ జూచుమాత్ర. భస్మీకృతుండయి పడియుండె మారుఁడు.
మ్యా. వి. 2. 22.

సీ ఎప్డు విజృంభించి యెఱమంట లెగయంగ, ముక్కన్ను తెఱచెనో మునుకతపసి ...
వీర. 2. 128.

ద్వి. ముకురంబు నెక్కొల్పి ముక్కన్నుఁ జూపి.
పండితా దీక్షా. 73 పా.

ద్వి. పొంచారఁ దత్స్వయంభువు లింగమూర్తి, యందు ముక్కన్ను నొప్పగు చతుర్భుజము.
పండితా. వాద. 201 పా.

**ముక్కపడు.** అ. క్రి. భంగపడు. (చూ. ముక్కపఱచు)

జ. ముక్కపఱచు.

**ముక్కపఱ(ఱు)చు.** స క్రి. (√ముక్కపడు) భంగపఱచు.

కం. ఇక్కడ గాదే మనలన్, ముక్కపఱచె నొక్కబోయ ముని మునుకొని వాఁ, డెక్కడఁ బోయెనో యిపు డనఁ, గ్రక్కున నాకాశవాణి గంభీరముగన్
వాల్మీ. 5. 143

**ముక్కపురుగు.** వి. (ముక్కు+పురుగు) తవుడు ముక్కినయపుడు దానియందుఁ బుట్టుపురుగు, తవుటిపురుగు. (శ ర., బ్రౌ.)

**ముక్కర(ఱ) = ముంగర** వి. (ముక్కు + రాయి) నాసికాభూషావిశేషము.

సీ. నెలఁత ముక్కరియందు నీలంబు గాదుసూ, తెలిదళుకొత్తు ముత్తియము గాని...
ప్రభా. 3. 87.

ద్వి. చెక్కుల మకరికల్ చిత్రించి గొప్ప, ముక్కరల్ నాసాగ్రములఁ గీలుకొల్పి...
రం రా. బాల. 75 పొ. 5 పం.

సీ. .. నాసి, కావిభూషణము ముక్కఱ ముంగర యనంగ ... ఆం భా. 2. 148.

కం. దక్కినదింబలె మాయవు, మక్కువ శూర్పణఖ మించు మచ్చికలకు రా, నక్కఱకు జంత రక్కసి, ముక్కరకున్ నోఁచకుండ ముక్కఱఁ జేసెన్ రామా. 5 138.

**ముక్కరమాను.** వి. పుల్లిరిసు తిరుగుచట్టము. (శ. ర, బ్రౌ.)

**ముక్కరము.** వి. (ముక్కు+కారెము సంధిని వర్ణవికారము.) నాసారంధ్రము, ముకుఁగ్రోళ్లు (శ. ర.)

**ముక్కాలి = ముక్కాలిపీఁట.** వి. (√మూఁడు)

కం. అక్కడఁ దగఁ గుందనపుం, జెక్కడములఁ జాల మల్లసిల్లుచు మిగులం, జొక్క మగుచున్న రత్నపు, ముక్కాలిపై మౌనిచంద్రముని మంచి తగన్. విప్ర. 4. 82.

**ముక్కాలిపీఁట = ముక్కాలి, ముక్కాలిపీఁట.** వి (మూఁడు + కాళ్లు + పీఁట. త. ముక్కాలి.) మూఁడుకాళ్లమర్చిన యెత్తుబల్ల, త్రిపాతి.

సీ. పచ్చఁపని నొప్పుపైఁడిముక్కాలిపీఁటనిడి యొ వేడుకతోడ నింతి యొకతె...
యయా 4. 93

ఉ. ముద్దులగుల్కు కుందనపు ముక్కాలిపీఁట వసించె దమ్మిపూ, ముద్దియగద్దియంబోలుచు ముద్దియ యుద్దియనన్ శుభోన్నతిన్...
విజ. వి. 3. 72., నీలా. 1. 61.

**ముక్కాఁక.** వి. (మూఁడు + కాఁకలు) గొప్ప తాపము

ద్వి. బావికడను బిడ్డఁ బట్టినయట్లు, నూనె మీకును గతి చూపక యున్న, నను మౌనులఁ జూచి యల్లమ పలికె, మునులార మీ కింత ముక్కాఁక యేల, సులభంబునను ముక్తి చొప్పడువిధము, తెలిపెద...
ప్రభు. 4. 185 పొ 13 పం

**ముక్కాఁకలఁదేఱు** — మిక్కిలి సమర్థుఁడగు

ఉ. నీఁకకు మెచ్చి నవ్వి రఘువీరుఁడు తమ్ముని జూచి వత్స వే, దాఁకు దశాస్యు సేనలకు, తచ్ఛదమార్గము లస్త్రసంపదం, దేఁకువఁ బెద్ద హైయ యతఁడు దేవగణాదులతోడఁ బోరి ముక్కాఁకలఁ దేటినాఁడు బలుగయ్యములం దని పల్కి వెండియున్.
భా రా యు. 817

కం ధీరుఁడు తనముక్కాకలఁ, దేటినదఃవాయి యొకఁ డతిస్థిరబలుఁడై ....
శుక. 1. 257.

**ముక్కాకలఁనాఁటితేఱు** — మిక్కిలి సమర్థుఁడగు ఆత్యంతప్రవీణుఁడగు.

మ. బలియుం దుర్గుఁడు యౌవనాశ్వధరణీపాలుండు తత్సైన్యు లాజుల ముక్కాఁకల నాఁటితేటిన మహాశూరుల్...
జై. భా. 1. 87.

ముక్కాని. వి మూఁడు + కానులు; మూడు కానులు.

సీ కాని యనఁగను గాకణి వీసిల్లు .. ముక్కాని యనఁగను బొల్పుఁ దత్త్రయ సంజ్ఞ... ఆం భా 2. 272

ముక్కారు. వి. మూఁడు + కారులు[1] మూడు కాలములు. (చూ. కారు.)

శా ముక్కారుం బండును రాజనంబుఁ జెఱకుం గప్పారుపూఁదేనియల్ .. విక్ర 1 90

శా ద్రాక్షారామామణిహారవల్లు ... ... లేపార ముక్కారుం బండుఁ బ్రకర్ష ... ములు దశా 1 88, కాశీ 7. 16.

ముక్కాలిపీఁట—ముక్కాలిపీఁట వి మూడు + కాలులు + పీఁట.)

సీ. గొడుగుఁబావలు గంధపొడి పెట్టె నునుసాన గడియారం మంచ ముక్కాలిపీఁట వైజ 3 74.

సీ. చిఱుత ముక్కాలిపీఁట రాచిలుకపంజ, రములు చిత్రంపు దివ్వెగంబములు గలిగి, జాను దులకించు కొల్వుహాజారమునకు. . రసిక 1, 61.

సీ. ముక్కాలిపీఁ టనఁ బోలుఁ ద్రిపాత్పీఠి... ఆం భా. 2. 166

ముక్కాలు వి. (మూఁడు + కాలులు) ముప్పాతిక.

వ. రావులవు ముక్కాలు గ్రాసంబుగా మెక్కినం జిక్కినరిక్క దొరప్రక్కందొరఁగు సుధాధారలం గేరడం బాడ . . రా వి 3. 65.

ముక్కిఁడి. విశే. (ముక్కు + ఇఁడి. క. ముక్కడి త. మూక్కిలి ) ముక్కు లేనివాఁడు, ముక్కు లేనిది.

ఉ ... ఈ, ముక్కిఁడి జంతకుం దగినమోండి విటుండు నిశాటజాతియం, డొక్కఁడు లేక తక్కఁడు ... చం. రా 5. 41.

సీ. ముక్కిఁడితొత్తుకు ముత్యంపు సరాల యద్ద మేఁటికిని జాత్య ఘనకును రామలిం ...

సీ ముక్కిడి యన విగ్రహుండు . ఆం భా 2. 12

ముక్కిడి వి ఒకచెట్టు (శ బ.)

ముక్కు[1] వి (క. ముక్ త మూక్కు.,

1 నాసిక, చంచువు.

సీ ముక్కన నాసిక పొల్చు . ఆం భా 2. 142

సీ పతుండు పొట్టేలితల ధరించినయప్డు, ఖాతిని ముక్కు గోల్పడిన యపుడు . భీమ 6 44

కం. కరితాడన గళరవములఁ, ఒరిసి ఖణమంజన ములఁ బైఁబడి పెనఁగన్, ధరణీసురకవ భూతము, కరిగమనం ఒట్టి ముక్కుఁ గఱచె మొదలికిన్ విక్ర. 7 157.

మ . ఇ, కక్కులు ముక్కుల్ తుది నప్పళించు నరసిన్ గాన్పించు నాశ్మాంగమే, తిలకించున్ బతి యంచుఁ గోకి యొక బెంతేఁ గంతు సంతప్తయై ఉ రా. 4. 158.

గీ ... తొగరు, ముక్కుబల్పక్కి జక్కిపై నెక్కి ... నీలా. 3 38.

2 అగ్రభాగము.

క. నెలమసలె నిందువదనకు, జలజాతికి నల్ల నయ్యెఁ జన్నులముక్కుల్ . కాశీ 4. 3

(ఇటఁ జూచుకము అనిభావము ,

ఐ మిక్కిలి చిన్ననూకలు. (శ, ర., బ్రౌ., వా

అ క్రి. ముక్కటించు, శ్వాసమును బిగఁబట్టు.

సీ ధిక్కరింపఁకుఁ డంచు బ్రుక్కి పుట్టల డుక్కి ముక్కువారికి భీతి మొక్కువారు ... చంద్రా 6 84.

ముక్కుననుండు.గోపము = శీఘ్రముగాఁ గోపము వచ్చు ననుట

ద్వి చొరకు మెన్నఁడు గాధిసుతుతపోవనము జడలు గట్టుట వృథా శాంతి యాతనికి.

నుడుగక ముక్కున నుండుఁ గోపంబు
ద్వి హరిశ్చ పూ. 6 94.

గీ ...ముక్కునవె యుండుఁ గోపంబు మూర్ఖ
మునికి .. దశా. 2. 47, విప్ర. 4 71.

**ముక్కు మొగమేడ** = మంచిచెడ్డల విచారణ యనావశ్యకము

ద్వి. ముండగోష్ఠికి ముక్కు మొగమేడఁ దనకు ...
ద్వి హరిశ్చ ఉ 1061 పం.

**ముక్కున వ్రేలిడు** = ఆశ్చర్యపడు

చం. పదురుకుమారులుం బదురుబ్రహ్మలరూపులు దాల్చి యెల్లెడన్, విదితముగాఁగ సృష్టులను వేఱ యొనర్చి సుఖించుచుండఁగా, మొదలిటి బ్రహ్మ వారిఁ గని ముక్కున వ్రేలిడి యాత్మ నద్భుతం, బొదవ శిరంబు లూఁచి వెఱ పొందె ఁ ఘూర్ణమ యేమి సెప్పుదున్.
వాసిష్ఠ. 2. 162.

ఇక్లే ముక్కుపై వ్రేలు నిలుపు మొ

గీ. వనికి దిగ్గున లేచి పూపాన్పుమీఁద వ్రాలి కూర్చుండి ముక్కుపై వ్రేలు నిలిపి, యొక్క చెలికత్తె యూరార్పఁ బెక్కుతలఁపు లున్న కొన నున్న యొక వన్నెలాడిఁ గాంచి ...
కువల. 3. 27.

ఉ. ఆచపలాక్షి ముక్కుపయి నంగుళముం గదియించి దీనికై కీచక యింత సేసితి సుఖత్వముఁ బొందదుగాక ... భార. విరా 2. 356

**ముక్కుననూర్పుగల్గు** = బ్రదికియుండు.

ఉ. ఒక్కన మూఁడులోకములు నొక్కటఁ దాఁ కెనయేనిఁ బోర మీ, రొక్కఁ డొకండ గెల్చుటకు నోపుదు రక్రమవృత్తి నిట్టిమీ, ముక్కున నూర్పు గల్గి మన మోహర మీదు ఁ వస్థ బొందునే. భార. భీష్మ. 2 116
విరా. 2. 226.

**ముక్కు పట్టుకొని కూర్చుండు** = జపము చేసికొనుచుండు.

మ. అతఁడుం బోయి నికుంభిలాటవి నిశాటానీకి నీఁతుఁడై, హుతభుక్సన్నిధి ముక్కు పట్టుకొని కూర్చున్నట్టియయ్యింద్రజి, ద్దితిజుం బోరికిఁ జీరి చంపి మఱలెన్ ... రామా 8 182.

**ముక్కు మొగము చూడక** — 1. మొగమోటము లేక

ఉ ముక్కు మొగంబు చూడ కొకమోసము మ టకు విశ్వనాయకుం, డెక్కడికైనఁ బొమ్మనుచు నెట్టని చూపులఁ జూచి యల్కతో...
భీమ. 3 8.

ఉ. అక్కటఁ జూడ వేటి కలయచ్చకబుచ్చిక సేయునంచలం, జెక్కిలి గొట్టె దేమిటికిఁ జేరఁగ వచ్చిన ముద్దుఁజిల్కఁ గాన్, ముక్కు మొగంబుఁ జూడ కటు ముట్టను బొమ్మనె దేల బోఁట్ల నో, చక్కెంబొమ్మ నీ వెగటు జాడలఁ జూచిన వింత లయ్యెడున్ విజ వి 3 30.

2 మంచిచెడ్డ లాలోచింపక

సీ అలయమాత్యులు నిల్చి టరసి పాటుజను గంచుకి ముక్కుమొకము చూడక యెతఱుమ ... కువల. 4. 164.

**ముక్కున నీరెత్తు** = శిక్షార్థము ముక్కులో నీరు పోయు.

కం. ఓరీ కోమటి ముక్కున, నీ రెత్తుదు మేము కినియ నేరక యున్నన్, నోరికి వచ్చిన యట్టులు, వారణ యొక్కింత లేక వదరు లఱచెడిన్
కేయూర 3 201.

ఇ. ముక్కటించు, ముక్కుద్దము, ముక్కర, ముక్కరము, ముక్కిడి. ముక్కుఁగమ్మి, ముక్కుఁగ్రోలు, ముక్కుఁజెరము, ముక్కు దాడిమ, ముక్కునబంటి, ముక్కుపూరెడు, ముక్కుపోఁగు, ముక్కుముంగర, ముక్కుముల్లు ముక్కువిఱుచు, ముక్కోపము.

**ముక్కు²**. అ క్రి (తడిచేత) చెడు.

కం. చక్కెర గలుపక తింటే, ముక్కినతపుడైన తెన్న మోహము గలచో, వెక్కురుజానిన హైనన్. ముక్కువతో దివ్యభామ మహిలో

వేమా ' వేమన 2. 35

ఉ. ముక్కుపుడుగు, ముక్కుఁగొయ్య

**ముక్కు³** వి. భక్ష్యవిశేషము

ప .. మోదకంబులు, గడోదకంబులు ముక్కులు కాశీ. 7. 185

**ముక్కుఁగమిత్త** వి. (ముక్కు¹ + కమిత్త) నాసా భరణవిశేషము

చం. గవాక్షపు ... సిరిగందవుబొట్టును ముకుఁగమిత్రము, త్రెము మెడగందమున్ ...
చమ 1 53.

**ముక్కుఁగొయ్య** విణ. (ముక్కు² + కొయ్య) నాశకుడు, నాశకము.

సీ. కడిఁదివాల్మగఁడ బ గరుడివిరాయఁడ, టక్కరి యొకిమీంద్రడ ముక్కుఁగొయ్య
అచ్చ. రా. యు. 264.

ద్వి. పాలు పొందు నిజభోగముల వీడుకోలు, నగుఁబాటుగని జవ్వనపు ముక్కుఁగొయ్య, యగునట్టిముదిమి వాయఁగఁ జేసి నన్ను ..
ద్వి. పరిమ. 2 101 పా

**ముక్కుఁగ్రోలు** = ముకుఁగ్రోలు. వి. (ముక్కు¹ + క్రోలు) నాసాపుటము, ముక్కుఁ జెరమ

శా. కుండాలంబు కరంబు సాఁప దిరాజున్ మెచ్చి నాపూజ భర్గుం డీవేళ ననుగ్రహించె నని ముక్కుంగ్రోళ్ళలో నెక్కి యుద్దండ క్రీడఁ దదీయకుంభకువాఁస్థానంబునం ... ఁస్మరన్, గొండల్గూలఁగ నెత్తిమొత్తుకొని దిక్కులుద్రట్ట గిఁపెట్టుచున్. కాశీ 2 146

**ముక్కుఁజెర (ఱ) మ** = ముకుఁజెఱమ

వి. (ముక్కు¹ + చెరమ) నాసాపుటము.

వ. క్రక్కున ముక్కుంజెరమ లదర నదరి వడిం జనుదేర నేపున మూఁపు లెక్కింపరాని తెగువం దిగిచి .. రాజ. చ 2. 74

**ముక్కుటము** వి. స్వారమడి, హోమము. (శ. ర. 'దఃడిపట్టు, (బ్రౌ)

**ముక్కుటమూపుఁ.** స. ఉ. (మూపు — మూపురు) పేరుగా ముగ్గుపు

ఉ. ముక్కుటమూపు ... మొక్కలు లై యచెరిచి ... యాదవ ...
ఉ హం 6 67

**ముక్కుదాడిమ.** వి. (√ముక్కు, ఒకచెట్టు

సీ. ... కోల ముక్కుదాడిమ బీజ ..
హంస. 4. 11.

**ముక్కునబంటి.** విణ. (ముక్కు¹ + బంటి. వృత్తిని వర్ణాగమము) ముక్కువఱకు నుండు వాఁడు, సమానుఁడు

ఉ. ...ఏ.నాఁడు దశాస్యు డీతనిన నచ్చి నుపోద్ధత వృత్తి నుండు నెవ్వాఁడును నింత చెల్లుబడి వాఁడు నరేశ్వర లంకలోపలన్, లేఁ డితఁ డెక్కుడున్ సమరశీలి ముక్కున బంటి వజ్రికిన్.
భా రా యు. 746.

చం. ముఁహారవద్మజాదులకు ముక్కునబంటిగఁ గేరులోకభీకరు నజితప్రతాపు సుఁకంటకు నేఁ డొకజాలుఁ డట్టె సంగరమున నోర్చె' ...
కు. సం. 12. 877.

**ముక్కుపూరెడు** వి. (ముక్కు¹ + పూరెడు) ఒక జాతి పూరేడుపిట్ట.

(శ. ర. ముక్కుపుపిడి. బ్రౌ )

**ముక్కుపోఁగు** వి. (ముక్కు¹ + పోఁగు.) ముక్కుఁ గమ్మి, నత్తు (శ. ర.)

**ముక్కుముంగర.** వి. (√ముక్కు¹) ఒకానొక యడవిచెట్టు. (శ. ర )

**ముక్కుముల్లు.** విణ. (ముక్కు¹ + ముల్లు) ముక్కు నందు గ్రుచ్చుకొన్నముల్లు, బాధకుఁడు; బాధక మైనది.

ద్వి. ఎక్కుడుమదమున నెల్లలోకులకు, ముక్కుము లై యున్నమూర్ఖు రావణునిఁ, దృణలీలఁ

జంపిలి దివ్యాస్త్రమహిమ . .

రం. రా. ఉ. 1-8 పా 13 ప.

**ముక్కువిఱుచు.** స. క్రి (ముక్కు[1]+విఱుచు) నిరసించు

వ స్వభృత్యు లవమానింపం బరిజను లుపహసింప బాంధవులు ముక్కువిఱువం బుత్త్రులు వేసరం గళత్రం బోకిలింప నివి మొదలుగా వార్ధక దుఃఖంబు లనేకంబు లనుభవించి

కవిక. 5 110.

**ముక్కున.** వి (మూఁడు+కుంచములు) మూఁడు కుంచములు

గీ చనును ముక్కున నాఁగఁ బ్రస్థత్రయంబు ...

అం భా 2. 270

ద్వి. నిత్యనేమం బిది నేఁటిముగ్గునకు, ముత్యాల పొడి మాకు ముక్కున వలయు . .

బస పు. 2. 488 పం

**ముక్కూరు.** అ క్రి అజ్ఞానమును బొందు

వ. ఈ యొక్కువతక్కువలు విచారింపక వలవని వెఱపు గట్టికొని ముక్కూరి వగచుచున్న వాఁడవు .. భార ఉద్యో. 2. 222

(ఇది యీ యొక్కచోటనే యున్నది అని శ. ర. కొన్నిప్రతులందు లేదు. ఇంకను విచార్యము )

**ముక్కొంకులు.** వి. బ. (మూఁడు+కొంకులు.) మూఁడువంకరలు

ద్వి. ముక్కొంకులును బోయి మోచిన మోవ, కొక్కు పాదం బట్టు లున్నది శివునకు...

బస. పు 3. 564 పం.

**ముక్కొటిక** వి. (మూఁడు+కొటికలు) త్రిపురములు. (శ ర.)

**ముక్కొటిక గెలుపరి.** వి. (మూఁడు+కొటికలు+గెలుపరి.) త్రిపురారి, శివుఁడు.

వ మూఁడవకన్ను దోఁపని ముక్కొటికగెలుపరి నెరవునం జూచిరి ... అచ్చ. భా. 4 81. పా

**ముక్కొమ్ము మెకము.** వి (ముందు+కొమ్ము+మెకము) మనుబోతు. ఋశ్యమృగము (శ. ర.)

**ముక్కొయ్యలు** వి బ. (మూఁడు+కొయ్యలు) మూఁడుతునుకలు

సీ. ఎంక నుర్నుకుసేయునేనికఁ గాని ముక్కొయ్యలు పడఁద్రెయుగ కొటుగాని ..

కు. సం. 11 610.

**ముక్కోటి** వి (మూఁడు+కోటులు) వైకుంఠైకాదశి, ధనుర్మాసశుక్లైకాదశి

గీ చక్రికుధరోత్తమము నడుచక్కి కెక్కి, చక్కముక్కోటి కరుదెంచు సౌరసతులు ...

రా. వి 1. 85.

**ముక్కోణము.** మి. వి. (మూఁడు+కోణములు.) క. ముక్కోణపు త. ముక్కోణమ్) త్రికోణము. (శ. ర, త్రి)

విశ. మూఁడుకోణములు గలది

ఉదా ముక్కోణపుబద్ద.

**ముక్కోపము** = ముంగోపము మి వి. (ముక్కు[1] + కోపము) శీఘ్రముగా వచ్చుకోపము. (శ. ర.)

**ముక్కోల** వి (మూఁడు + కోలలు. త. ముక్కోల్) త్రిదండము

సీ కావిగోఁచియుఁ గుశగ్రంథులుఁ బెనచిన ముక్కోల వలపలముష్టి నమర ...

భా. రా. అర. 2 82.

**ముక్త.** సం. వి ఆ స్త్రీ. 1 ముత్తెము 2. రాస్న యనుమొక్క

**ముక్తకంచుకము** సం. వి అ పుం కుబుసము విడిచినపాము, నిర్ముక్తము.

**ముక్తకంఠుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) విడిచిన కంఠము గలవాఁడు, పైకి గట్టిగా నేడ్చువాఁడు.

ముక్తకంఠముగా = బిగ్గరగ, గట్టిగా.

**ముక్తకచ్ఛుఁడు.** సం. వి. అ. పుం. బౌద్ధుఁడు.

**ముక్తకము** సం. వి. అ. న. 1. అస్త్రము.

ఆయుధవిశేషము 2 వృత్తగంధి, గద్యము. 3 ఏకశ్లోకరూపమగు చిన్నకావ్యము.

ముక్తకంఠుడు సం విణ (అ అ అ) దాత్రృ ... గలవాడు

ఇక్కే ముక్తిపస్తుడు మొ.

**ముక్తకేశుడు.** సం విణ (అ ఆ. ఈ. అ) విరియ బోసికొనినజుట్టు గలవాడు. తల విరియఁ బోసికొన్నవాఁడు

**ముక్తచక్షుస్సు.** సం వి స్ పుం. సింహము

**ముక్తము** సం విణ. (అ ఆ అ.) 1. విడిచి వేయఁబడినది, త్యక్తము 2. ముక్తిపొందింపఁబడినది. 3 అనదితము 4 ఈయఁబడినది, దత్తము

**ముక్తముక్తము.** సం వి అ పుం అందుగు చెట్టుబంక

**ముక్తవసనుఁడు.** సం వి. అ. పుం ముక్తాంబరుఁడు, దిగంబరశాఖలోఁ జేరిన జైనసన్యాసి, ఇట్లే ముక్తాంబరుఁడు మొ

**ముక్తసంగుఁడు** సం. వి. అ పుం. సంసారసంబంధము విడిచినవాఁడు పరివ్రాజకుఁడు, సన్యాసి

**ముక్తాగారము** సం వి. అ పుం ముత్తెపుఁజిప్ప, శుక్తి

**ముక్తాపుష్పము** సం వి అ న మొల్ల, కుందము.

**ముక్తాఫలము.** సం వి. అ న. 1. ముత్తెము. 2 లవలీఫలము 3 కర్పూరము.

**ముక్తామణి** సం. వి. ఇ. పుం. ముత్తెము

**ముక్తాయము.** వి (క. ముక్తాయ) (సంగీత) ముక్తాయింపు

మ .. గీతంబు లద్దిర ముక్తాయము చాగుఁ రే
యని మరుద్దేవాత్మజన్ముఁడు తుంబుర
దేవర్షుల మెచ్చ గానరస మింపున్ సొంపు
గావింపఁగన్.... సమీర. 6. 201

'ముక్తాయింపు' అనుపదము దేశ్య మగుటవలన నీపదముకూడ దేశ్య మైన దేశ్యమే యని తోఁచుచున్నది

చూ. ముక్తాయింపు

**ముక్తాయింపు** వి 'ముక్తాయము' ముగింపు. (శ. ర.)

**ముక్తాలత.** సం వి. ఆ స్త్రీ ముత్తెములహారము.

**ముక్తావళి** సం. వి. ఇ ఈ స్త్రీ ముత్యాలహారము

**ముక్తాశుక్తి** సం. వి ఇ. స్త్రీ ముత్తెపుఁజిప్ప.

**ముక్తాస్ఫోటము.** సం వి అ పుం ముత్తెపుఁజిప్ప, శుక్తి

**ముక్తి** సం వి. ఇ స్త్రీ 1 విడుపు, విడుదల. 2 మోక్షము.

**ముక్తిక్షేత్రము.** సం వి అ న. కాశి, వారణాసి.

**ముఖగంధకము** సం వి అ పుం పలాండువు, ఉల్లి (వ్య. వి)

**ముఖచపల** సం వి. ఆ. స్త్రీ. ఆర్యావృత్తభేదము.

**ముఖచాళిక** వి వి. మల్లబంధవిశేషము

వ .. వాసుదేవుఁడు ... పరిచాళిక చేసిన, శైనేయుండు తైజసికి నాన చేయక ముఖచాళిక చేసి .. ఉ హరి 3 64

**ముఖచీరి.** సం. వి. ఇ. స్త్రీ. నాలుక, జిహ్వ

**ముఖచూర్ణము** సం. వి అ. న. ముఖముపైఁ బూసికొను సువాసన గలచూర్ణము

**ముఖజాహము** సం వి అ న ముఖమూలము.

**ముఖజుఁడు** సం వి. అ పుం. బ్రాహ్మణుఁడు.

**ముఖదూషణము.** సం. వి. అ. పుం పలాండువు, ఉల్లి.

**ముఖదూషిత.** సం. వి. ఆ. స్త్రీ. ముఖాకారముఁ జెఱిపెడబొబ్బ, అట్టిపొక్కు.

**ముఖనిరీక్షకుఁడు.** సం. విణ. (అ. ఇకా అ)

అఁసుఁడు. సోమరి

ముఖనివాసిని నం. వి. ఈ. స్త్రీ. సరస్వతి.

ముఖప్రియము. నం.వి. అ పుం. నారింజ. (వ్య. వి.) న. లవంగము

ముఖబంధనము. నం. వి. అ న. 1. ఉపోద్ఘాతము, భూమిక, మూఁత, కప్పు.

ముఖభూషణము. నం వి. అ. న తాంబూలము

ముఖమండనకము నం. వి అ పుం తిలకవృక్షము

ముఖము నం వి. అ. న. 1. నోరు, మూతి, 2. మోము, ముఖాకృతి. 3. పురోభాగము. ముందుచోటు 4 బాణము మొదలగువాని కొన. 5 తొట్టియొక్క పైకిఁ గనఁబడురంధ్రము, తొట్టిలోఁ బ్రవేశించెడిదారి, తొట్టినుండి పైకి వచ్చెడి త్రోవ

6. గృహద్వారము, ఇంటిగుమ్మము 7. ప్రారంభము, మొదలు. 8. ముఖ్యమైనది, ప్రధానము, మొదటిది. 9. ఉపాయము, సాధనము. 10. ఒకనాటకసంధి. 11. లకుచము, గజనిమ్మ (వ్య వి.)

నాముఖమున = నామీఁదుగా

గీ. మీరు సెప్పినబుద్ధులు గారవమునఁ, జేయఁ గాంచినపుణ్యంబు సేయనెట్లు, నాముఖంబునఁ గార్యంబు నడవ దేమి, సేయువాఁడ నొం డెద్దియుఁ జెప్పలేను

భార. ఉద్యో 3 326 (నావలన నని భావము)

ముఖయంత్రణము. నం. వి. అ. న ఖలీనము గుఱ్ఱపుఁగళ్లెము.

ముఖరము. నం. విశే. (అ. ఆ. అ.) ధ్వనిచేయునది, ఎడతెగనిచప్పుడుచేయునది, ఘల్లుఘల్లు మని మ్రోగునది. (అందె మొ.).

వి. అ. పుం. 1 కాకి 2 శంఖము

ముఖరితము. నం. విశే. (అ ఆ అ) ధ్వని గలదిగాఁ జేయఁబడినది, మాఱుమ్రోగునట్లు చేయఁబడినది.

ముఖరుఁడు. నం. విశే (అ. ఆ. అ) 1 వదరుఁబోతు, అధికముగా మాటలాడువాఁడు, వాచాటుఁడు, 2. దూషణము లాడువాఁడు.

వి. అ పుం వాయకుఁడు, ముఖ్యపురుషుఁడు

ముఖలాంగలము. నం. వి. అ పుం. లాంగలము వలె భూమిని జీల్చెడి ముఖము గలది సూకరము, పంది

ముఖపల్లవము. నం వి. అ. పు దాడిమచెట్టు.

ముఖవాద్యము నం. వి. అ న. నోటితో వాయించు వాద్యము,

(మురలి. పిల్లనగ్రోవి మొ)

ముఖవాసన నం. వి. ఆ స్త్రీ కర్పూరాదివాసన. అ పుం న కర్పూరాదివాసన (శ. ర.)

ముఖవిలుంఠిక నం. వి. ఆ స్త్రీ. అజ, అఁడుమేఁక

ముఖవీణె(ణియ) మి వి వాద్యవిశేషము, వీణాభేదము

వ మీఁటుసురటానులు కామాతులు ముఖవీణెలు పిల్లఁగ్రోవులు దండెలు ఢక్కీలు చంద్రవలయంబులు ... ప్రబంధ. 605.

కం. సంగీతపుమేళపుజత, సంగతితాళములు నాగసరములు ఢక్కీల్, చెంగులు ముఖవీణియలును, పాంగము తప్పెటలు గజ్జె లందుక చేరన్

ప్రబంధ 83.

ముఖశుద్ధి. నం వి. ఇ స్త్రీ. ముఖము కడుగుట, ముఖము పవిత్రముచేయుట.

ముఖశేషుఁడు. నం. వి. అ. పుం. రాహువు.

ముఖశోధనము. నం. విశే (అ. ఆ. అ)

1. ముఖము శుభ్రముచేయునది. 2. తీక్ష్ణమైనది, కారమైనది.

వి. అ పుం కారము, తీక్ష్ణత.

న. 1. ముఖము శుభ్రపఱుచుట 2 లవంగ పట్ట, దాల్చినచెక్క

ముఖశోధి నం. వి. న్. పుం. జంబీరము, నిమ్మ

చెట్టు. (వాచ)

**ముఖసంభవుఁడు.** సం. వి. అ. పుం. బ్రాహ్మణుఁడు.

**ముఖసుఖము.** సం. వి. అ. న. ఉచ్చారణసౌకర్యము, పలుకుబడిలో సౌకర్యము

**ముఖస్రావము.** సం. వి. అ. పుం. లాలాజలము. చొంగ

**ముఖాగ్ని.** సం. వి. ఇ. పుం. 1 కార్చిచ్చు, దావాగ్ని.

2 అగ్ని ముఖమందుఁ గల దయ్యము, కొఱవి దయ్యము

3. శవమును దహనము చేయునప్పుడు ముఖమందుంచినయగ్ని.

**ముఖాము.** వి. (హిం. ముఖాదిమ్) ముసద్దీ, లేఖకుఁడు

ఉ గౌరవ మొప్ప నచ్చటిముఖాములు వ్రాయఁ దొణంగి రెంతయున్ .. కృష్ణ. 2 113

ఉ. జిబ్బు మెఱుంగుఁజల్వలు విచిత్రగతిం దొడిపె నుమ్రెఖా మహో, జిబ్బిలువేళఁ గాంచి హరిసేవకు రా సమయం బఁటంచుఁ బై, పబ్బటు చీట్లు వ్రాసి నిజభర్తలపాలికిఁ బంచి రంతలో, నబ్బిలి బంధనుండును భవాబ్జభవాదులఁ బిల్వఁబంచినన్. ల వి 5 5.

చం వలసినబేరముల్ దెలియ వచ్చినవారలు వాదుగల్గువారలు తెగ గుత్తగొల్లలును రత్నపరీక్షల వారు కార్యముల్, గలిగిన యింగిలీషులముఖాములు చెంగట నుల్లసిల్లఁగాఁ, గొలు వొసఁగు న్మహీశుగతిఁ గోమటి యాత్మగృహాంగణంబునన్. శుక ౯. 10.

**ముఖాముఖి.** సం. అవ్య సమ్ముఖమున, సమక్షమున.

ఉ చేకుతె నొంటిపా టిచటఁ జేసినపుణ్యము చేత నింక నన్, గాఁకలఁ బెట్టకే వినుము ముఖాముఖిఁ బల్కెద దాఁచ నేఁటికిన్ ... శశాం. 3. 61.

**ముఖారి.** సం. వి. ఇ పుం. ముప్పదిరెండు నపుంసక రాగములలో నొకటి.

సీ. ... మధ్య, మావతియు ముఖారి మలహారి సామంత వంతువరాళియు ...
హం. 5. 154.

ఉ బైరవి నాట తోడి . .. ముఖారి దేవగాంధారి .. మొదలై తగురాగము లింపు మీఱఁగన్ ... చెన్న. 2 236.

సీ సామంతమలహారులును చెంచు మలహరియు ముఖారి మాళవియును ...
ప్రబంధ. 96.

**ముఖాసా.** వి (హిం మొఖాసా. మి గ్రా.) తీరువ లేనిభూమి, మాన్యము.

కం గడి దుర్గంబులకోటల, నిడుఠాణపు దొరల కెల్ల నెప్పుడుఁ జెల్లే, పుడమియు మన్నెవటీర్లకు, నడుచుముఖాసాలు గాక నగరి ధరిత్రిన్.
ఉ. హరిశ్చ. 1 66.

**ముఖాగ్రము** సం. వి అ పుం కర్కటకము, ఎంట్రకాయ, పీత.

**ముఖాస్రావము.** సం. వి. అ. పుం. లాలాజలము, చొంగ.

**ముఖోల్క.** సం. వి. ఆ. స్త్రీ. దావాగ్ని, కార్చిచ్చు)

**ముఖ్యయ** సం విశ (అ. ఆ అ.) 1. ముఖసంబంధమైనది.

2. ప్రధానమైనది, మొట్టమొదటిది

3 శక్యము, అభిధాజన్యము (అర్థము.)

వి, అ పుం ప్రథమకల్పము.

**ముగింపు.** వి (√ముగించు) సమాప్తి. (శ. ర

**ముగితి.** వి. (సం. ముక్తి.) ముక్తి, మోక్షము,

సీ. ... సగరు లేఁగిననాఁటి ముగితిత్రోవ
యయా. 2 44.

**ముగియించు.** స క్రి. (√ముగియు) 1. సమాప్తము గావించు

కం. కా చి యనుష్ఠానము ముగి,యి చి యకుగు నట్టివేళ నెదుట నిలిచి యా, చంచలలోచన లతవికిఁ, గిందిద్దూసమునఁ జేమొగిచి మ్రొక్కుటయున్. నై జ 2 7

2 త్యజించు, విడుచు

సీ. ... నీ వజ్ఞాతవాస ముచిత, మగునీతి ముగియించి యాశికి నటిమెన వాళీంరణతేజుఁ డాతఁడు .. రాఘవ. 4 58

(ఇది పై రెండర్థముల కుదాహరణము)

3 ఖండించు, నఱకు

సీ ఒంమాటు గరళను నూరుతలంబులు ముగియించి మృగసంఘములకు నిచ్చు .. వీర 4. 182. ఆం భా. 3 123.

**ముగియిక.** వి. (√ముగించు) ముగింపు, సమాప్తి. (శ. ర).

**ముగియు.** అ. క్రి. (క. ముగిను. త. ముగి.) 1. పూర్తియగు

గీ మూఁడులక్షలపదివేలు ముగిసి పోవఁ, దాఁ బ్రవర్తిల్లు లక్షగ్రంథములతోడ, సమధికస్ఫూర్తి నేపురాణములు సాటి, గరిమ కందంబునకు మహాస్కాందమునకు కాశీ. 1. 71.

2. చచ్చు. మరణించు.

సీ మడిసె బ్రుంగె సమసెఁ గెడసె ముగిసె నీల్గె. ...మ్రగ్గె, నరఁ జచ్చె ననుమాట కాఖ్యలయ్యె. ఆం. భా. 3. 87.

సీ నొంఁబడ్డ ముంగిన యురివడ్డగరిమికి, ముకుపుగా గొల్లున ముగిసి పోవ.. కకు 4. 88.

జ. ముగింపు, ముగియించు, ముగియక, ముగిసి వచ్చు

**ముగిసివచ్చు** అ. క్రి. (√ముగియవచ్చు. స్వార్థమున) ముగియు, సమాప్తము గు.

తే తత్సహోదర సంప్రవర్తనము జరిగె. నవ్వు లములోన గూఢమై యంత నేఁడు, ముగిసివచ్చె దానవరాజు మోదకాల, మనుచు సంతస మందె వాకాత్మజుండు రాఘవ 3 42.

**ముగుద** వి (సం ముగ్ధా) ముద్దరాలు. ముగ్ధ. ఆఁడుది

సీ ముద్దరా ల్మద్దియ ముగుద యనఁగ ముగ్ధ యొప్పును .. ఆం. భా 2. 106

గీ తెగడు తెలుఁగన యిది యొంతముగుద యనుచు... చంద్రా. 3. 87.

కం ముగుద యొఱుంగక పంచినఁ, దగునే యిల్లేగుదేరఁ దమ్ముడ . రాఘవ. 3 96.

రగడ .. ముగుద! పోద ఏశోకములు వెలయుతావులకు .. ఉ. రా. 6 61

కం. . నాం. పగుతమ్మి కెంపుగుంపును, ముగుదనిగారంపుఁ దొగరుమోవికి దొఁయే . నీలా. 2 22

జ. ముగుదతనము.

**ముగుదతనము** వి (ముగుద + తనము) మౌగ్ధ్యము, గోలతనము

వ. మానికంపుఁ గంబంబులదండ నుండునికిలి దంతపుంబొమ్మ లూడిగంపుఁ జక్కెరబొమ్మ లని యొసరిలు ద్వీపాంతరజనంబుల ముగుద తనంబునకు నగు. దశా 1 14.

**ముగూహము** నం. వి అ పుం. దాత్యూహపక్షి

**ముగ్గు**[1] = **ర్రుగ్గు.** వి. (క. ముగ్గు. త. మొగ్గు) రంగవల్లి.

సీ. పలువన్నె లలరఁ గప్రపుముగ్గులను బెట్టి... నీలా. 3. 38.

**ముగ్గు**[2]. అ. క్రి (క. ముగ్గు) మాగు. పండు.

(వ్యవ.) ఈ మామిడిపండ్లు చక్కఁగా ముగ్గినవి

**ముగ్గు(గు)రు = ముప్వురు.** న ఐ (√మూడు. క. మూవరు. త మూవర్.) మూడుునకు మహన్మహత్యర్థక రూపము

కం. ముగ్గురువేల్పుల ముంచిన, ప్రెగ్గడ యగు మరుని దనుకరింపం దరమే? తత తీ 4. 72.

ఉ అక్కట చొక్కటింపు టిగుంమ్ముల బొమ్ములు నజ్జునజ్జుగాఁ, జెక్కెద వచ్చుఁగా చకితచిత్తత ముగ్గురువేల్పు లక్కునం, బుక్కిట నొక్కటొక్క నొకపూంట వధూటుల డించఁ బొడు రా వి. 4 65

ముగ్గురువేల్పులు = త్రిమూర్తులు )

గీ ఉడికొనుచున్నవా రార్తినున్న ముగురుఁ, గాలయాపన సేయఁగాఁ గాదు నీకు
నైష. 4 64

సీ ముగురుగూతులు జగన్మోహనాకార, లనంగ శాస్త్రవిదగ్ధ లతివినీల

గీ కుటిలకుంతల ల్మదకుంభి కుంభయుగళ, గురుకుచలు వారిఁ దగినట్టి వరుల కొసఁగి, వరుస మూఁడూళ్లు నిలిపె నావిసుమతీశుఁడంత..
విక్ర 8 5

ముగ్గొయ్య వి (ముందు + కొయ్య) అగ్రదండము

విశ అసాధ్యము (శ ర ).

ముగ్ధ నం వి ఆ స్త్రీ ఒకానొక శృంగార నాయిక.

శ్లో. ఉదయద్యౌవనా ముగ్ధా లజ్జావిజితమన్మథా

ముగ్ధము నం విశ. (అ. ఆ. అ.) 1. మూర్ఛ పడినది. సొమ్మసిల్లినది 2. వివేకము లేనిది, మూఢము 3 పొంపడినది 4 చక్కనిది, సుందరమైనది

ముచకము నం వి. అ పుం లాఁక, లక్కుక.

ముచ(చు)కుందము. నం వి అ పుం ఒక పువ్వులచెట్టు.

ముచిరము నం వి అ పుం 1. ధర్మము 2 గాలి.

ముచిరుఁడు నం విశ (అ. ఆ అ ) దాతృత్వము గలవాఁడు, ఔదార్యము గలవాఁడు.

వి అ పుం దేవత

ముచుండ. నం.వి.ఆ.స్త్రీ. ఎఱ్ఱమల్లె (వృ.వి.) (శ.ర.)

ముచు(చ)కుందుఁడు నం వి అ. పుం. మాంధాతకొడుకగు రాజు

ముచుటి నం వి ఈ. స్త్రీ 1 వ్రేళ్ల విఱుచు (కోపమున, 2. పిడికిలి 3 పట్టుకాయలజత.

ముచ్చె న త్రికము, తిగ

సీ తిగ ముచ్చె యనఁగను త్రికముపేరగు ..
ఆం భా 2 203.

వి 1 నితంబపార్శ్వము.

సీ .. అటకటన ముచ్చె యనఁగ నితంబపార్శ్వభిధ దగు... ఆం భా. 2 1 3.

(చి ని ముద్రి పా ముచ్చె శ ర. (ము-జె.) త్రి మ-జె వ్రాఁతప్రాఁతప్రతుల. పా. ఆంధ్రశబ్దాకరంమున మంజి యనికలదు.)

2 తి ము, ముడ్డిపూస

గీ . త్రికాభిధాన, మలరుఁ దిక మన ముచ్చె నా నళికనయన .. ఆం. భా 2. 136.

ముచ్చెంగి వి మత్స్యవిశేషము.

సీ. కొంద దాసరికొయ్య కొఱ్ఱమీనులన ముచ్చెంగి బేడిస జెల్ల చాఱమీను.. అది యగుమీలఁ బట్టువతఁడు... హంస. 4. 187.

ఉ .. పెన్, జెల్లయుఁ బక్కెపారయును నీచును ముచ్చెంగి బొమ్మడాయముల్ ... పరికాదిగఁ జేపలఁ బట్టి జెట్టుగన్ ...
ప్రబంధ. 165.

సీ కొరదయుఁ గడిసె పావర ముల్లు ముచ్చెంగి కుంటముక్కును లొంపిఁ గ్రుచ్చుకొనియె ..
వేం. పంచ. 1 294.

ముచ్చేటి. వి (శ. ముచ్చట త. ముచ్చటై.)
1. సల్లాపము

ఉ .... మగనిన్ జగనీలి పిసాళి జంత య, మ్మొద్దియ సేవ సేయ దొకముచ్చట యాడదు మూఁగఁబోలె ... పాండు. 3. 71.

సీ ... ముసిగెస గునగున ముచ్చట యన,

సల్లాపసంజ్ఞ యై యుల్లసిల్లుచునుండు ...
అం. భా. 1 117

ఉ. అవ్వలికిక్కు మోమయి ప్రియంబున నొందు లతోడ ముచ్చటల్, ద్రవ్వుచు నొక్క కోమలి పరాకున నుండఁగ ...
నైష 6. 113, ఉ. రా. 4. 48.

2. కోరిక

ఉ. గ్రుచ్చి కవుంగిలించికొనెఁ గూర్మియు భక్తియుఁ బొత్తుసేయఁగా, ముచ్చట వాయఁ గాఁతపడి మూర్ధము మూర్కొని లోచనంబులం, బిచ్చిలి రాలు బాష్పజలబిందులు మౌళి నలంకరింపఁగన్ జై. భా 1 111

సీ కీలాలనదులలోఁ గేళిసల్పఁ దలంచు శాకినీ సమితిముచ్చటలు దీఱ ...
ఉదా 8 178.

గీ. ముచ్చటలు దెల్పు రతికేళి కెచ్చరించు, సన్న దెలిసి విలాసప్రసన్నవదన, యగుచు వర్తించు
శుక 1. 301.

3. ప్రేమము.

చం మొగము మొగంబు గూర్చి బలుముచ్చటఁ బతుపుటాంతరంబులన్, బిగియఁ గవుంగిలించి...
వసు 4. 9.

4 వృత్తాంతము.

కం వచ్చిన మునిపతితోఁ దన, ముచ్చట దనుజుండు దెల్పె . దశా. 1. 249.

మ. కినుకం బుట్టినయట్టి మౌనిహృదయక్లేశంబు శాంతంబుగా, మునిశిష్యప్రకరంబుతోడ గమనౌన్ముఖ్య బునన్ ముచ్చటల్, తనియం జెప్పుచు వేల్పుచేటి నికటస్థానంబునం దుండఁగా, వనజాతాప్తునిమండలంబు దిగియె న్వాశాశిదిక్సీమకున్. భీమ. 2 23.

ఇ. ముచ్చటకాఁడు, ముచ్చటకాపు, ముచ్చట పడు, ముచ్చటలాడు, ముచ్చటించు

**ముచ్చటకాఁడు.** విశ. (ముచ్చట+కాఁడు) కోరిక కలవాఁడు వేం. పంచ 4. ఆ. (శ. ర)

**ముచ్చటకాపు** విశ (ముచ్చట + కాపు) సల్లాపము లాడువాఁడు, ఇష్టగోష్ఠి సలుపువాఁడు.

ఉ అచ్చపలాతు లిద్దఱును నర్మిలిఁ బెంచియుఁ బల్కనేర్పియున్, ముచ్చటకాపుగాఁ దమ వినోదపునెచ్చెలిగా ననుం గడున్, మచ్చికఁ జూతురు ... ప్రభా. 4. 19

**ముచ్చటపడు.** అ క్రి. (ముచ్చట + పడు) మిక్కిలి అభిలషించు, కుతూహలపడు.

కం. విచ్చేయు మదితిగర్భము, చెచ్చెర వెలువడి మహాత్మ చిరకాలంబున్, విచ్చలవిడి దేవతలు, ముచ్చటపడి యున్నవారు ముదమందింపన్. భాగ. 8. 504.

ద్వి. ఇచ్చట నే నున్న నెల్లవారలును, ముచ్చటపడి దినంబును వత్తు రనియు ...
రం. రా. అర. 145. పా. 3. పం.

**ముచ్చటా(టలా)డు.** అ. క్రి. (ముచ్చట+ఆడు) ముచ్చటించు, సల్లాపముచేయు.

ఉ. ...త, త్ప్రాంతలతాగృహంబున వయస్యయుఁ దానును ముచ్చటాడఁగన్ ... ప్రభా. 2. 62.

సీ నెఱిగొప్పు విరిదండ మెఱుఁగుపున్నాగంపు ముత్తెలకుచ్చుతో ముచ్చటాడ ...
ఇందు. 5. 173.

(ఇట మిళిత మగు అనిభావము.)

సీ సఖి గోగుతోడ ముచ్చటలాడి సురపొన్న నవ్వితి విదియే గుణంబు దప్పె .
ఉ. రా 6. 38

సీ. మునుకుచు వెలుగుతో ముచ్చటలాడుచు.
దశకు. 6. 157

**ముచ్చటించు.** అ. క్రి. (√ముచ్చట.) ముచ్చటలాడు.

ఉ. ... ఈ, యెబ్బెరికం బెటింగి జను లివల నావల ముచ్చటింపఁగన్ ..
భల్లా 2. (శ గ)

**ముచ్చోట్లు(టులు).** వి. బ. (మూఁడు+ చోట్లు) మూఁడు ప్రదేశములు.

గీ. చరణములు కేలు గడిగి ముచ్చట్లు చఱచి, పీఠమునను౦డి కాళ్లు దాఁ బృథివి మోపి, యర్థి నాపోశనమును బ్రాహ్మణాహుతులున, గొని గృహస్థుఁడు మౌని యై కుడువవలయు.
విజ్ఞా. ఆచా 67.

ముచ్చేముడుఁగు = ముచ్చముణుఁగు.

అ క్రి. (ముడుఁగు + ముడుఁగు) 1 మిక్కిలి ముడుఁగు

గీ. ఇంక నేమి సేతు సేగతిఁ బోదు నా, కీడురంత దురంత మెట్టు వాయు, ననుచు గంగ నీట నవగాహనము చేసి, వెడలి వచ్చి ముచ్చముడిఁగి యుండె. భోజరా. 4 165.

సీ. పులకలు మైదీఁగఁ బొలయు నొక్కొకమాటు, ముచ్చిర యప్పుడ ముచ్చముడుగు .
కు. సం 5 589

ఉ. హెచ్చిన బొమ్మరిండ్లఁ గదియించిన చూపుల కోరకోరలన్, ముచ్చముడుఁగ నేయుచుఁ జనుంగవదుర్గముక్రి ది సీమలన్.
చంద్రా 1. 63.

2. మిక్కిలి చేష్టలు తప్పియుండు

గీ. వెస నురంబు గాఁడి వీఁపున వెడలె న,య్యా శుగంబు నెత్తు రంగమెల్లఁ, దొప్పఁదోఁగ మూర్ఛ దొడరి రథంబుపై, ముచ్చముడిఁగి పడియె మునివరుండు. హరి. ఉ. 8. 81.

గీ బిట్టువెసఁ దాఁకు చిచ్చుఅపిడుగువోలె, నడలు రతిఁ దాఁకుమెయి ముచ్చముడిఁగి పడఁగ...
కు. సం. 5 549

ముచ్చే ముణుఁగు = ముచ్చ ముడుఁగు. అ. క్రి. (మణుఁగు + ముణుఁగు) మిక్కిలి ముడుఁగు

సీ మోహవశమువారి మొగములపగిది వంభో రుహవ్రాతంబు ముచ్చముణిఁగె ...
ప్రబోధ. 4. 49

కం. శీతోపచారముల నా,శాతోదరి ముచ్చముణిఁగి సంతాపముదే, వాతతమిహికావర్ష, ప్రాతః కాలికవిపన్నపద్మిని బోలెన్ ...
తపతి. 3 109.

ఉ. ఇక్కట నుండఁ గూడ దిఁక నేగుము సీవన సాహిణూరి మీ, యిచ్చకొలంది చేకుఱకు హీనపువస్తువు లేల యన్న న,న్నచ్చికఁ గాఁచి ర మ్మనెడుమాత్రనె పైఁబడి మొత్తి త్రోచినన్, ముచ్చముణిఁగి వచ్చి తినముద్దియ కంతయుఁ జెప్పెఁ జెప్పినన్
చెన్న 4 644, వాడు. 4 28.

ముచ్చేవలము వి. (మూఁడు + చవలములు) మూఁడు చవలములు (శ ర.).

ముచ్చోటులు = ముచ్చోట్లు. వి బ (మూఁడు + చోటులు) మూఁడు ప్రదేశములు, పాదములు హస్తములు ముఖములు.

కం కూటిముడి మోమునాతఁడు, పాటింపక చేసె నేని ప్రస్థానం బా,కూటిముడియు డించక ము,చ్చోటులు చఱచఁగ వలయు సద్ధర్మ గతిన్ . విజ్ఞా 79.

ముచ్చోయలు. వి బ (మూఁడు + చోయలు) మూఁడురంగులు, త్రివర్ణములు

సీ వరదానములకునై వచ్చువాక్ప్రియకారి ముచ్చాయ లెఱిగించు మొగము దెల్ప ...
కువల. 2. 42.

(కోరికెలకు సూచకము అగు రంగు లని భావము.)

ముచ్చి వి (హిం. మోచి) రంగులు వేయు వాఁడు, చిత్రకారుఁడు.

సీ. కౌసల్య మొదలైన గరితలు ముచ్చిపన్నుందంపుఁ బల్లకీ ల్మెందు నడువ ... దశా. 7 227.

ముచ్చిక వి. (ముందు + సిక. వృత్తియందు వర్ణవికారము) లేంకాయ, తాటికాయ మున్న గువాని తొడిమిక్రిందిబిళ్ల. (శ. ర., వా. ముచిక.)

ముచ్చికకొడి. వి. (√ముచ్చిక) కార్యనిర్వహణ కాలము.

వ్యవ.) ఆ వివాహసంబంధము ముచ్చికకొడికి వచ్చి చెడిపోయినది.

ముచ్చిచ్చు. వి. (మూఁడు + చిచ్చులు) 1. గార్హపత్యము, ఆహవనీయము, దక్షిణాగ్నియను

యజ్ఞమందలి యగ్నిత్రయము.

ఉ . అతఁడుం, జిచ్చున నేయి వోసిన విశేషము దోఁపఁగ భీము నొంచి, ముచ్చిచ్చును నేర్చు నట్టులుగఁ జేసె .. భార భీష్మ 2 277.

గీ. తపసియిల్లాండ్రచెలువంబు దలఁచి తలఁచి, మున్ను ముచ్చిచ్చును విరాళి గొన్నచోటు ... మనుచ 2 9.

2 ముక్కాఁక.

కం పచ్చవిలుకానియమ్ముల, ముచ్చిచ్చున వెచ్చి పొందె మోహాతురయై ... భాగ. 9. 47.

**ముచ్చిరి** = ప్రముచ్చిరి. విశే (√ముచ్చిరు) దుఃఖితురాలు, దుఃఖితుఁడు

ఉగడ. మోఁదు మోదుగుపువ్వు రెచ్చెను మున్న ము న్నలకైక ముచ్చిరి, లేదులే దుండగము దీనికి లేమ లేమఱుపాట వచ్చిరి ... వాల్మీ. 3. 114.

**ముచ్చిరితనము.** వి (√ముచ్చిరి.) దుఃఖము. ద్వి ... "ముచ్చిరితనము." ద్వి. భాగ 10. (శ. ర )

**ముచ్చిరు**=ప్రముచ్చిరు. అ. క్రి. (త ముచ్చెటి). 1. దుఃఖించు.

చం మునిజన మెల్ల దుర్దశల ముచ్చిరి యుండుటఁ జూచి యప్సరో, వనితలయార్తిఁ జూచి క్రతు వర్గము దైన్యముఁ జూచి నామనం, బనయముఁ దల్లడిల్లెడు . నిర్వ 4 29

సీ. పులకలు మైఁదీఁగఁ బొలయు నొక్కొక మాటు, ముచ్చిరి యప్పుడ ముచ్చముడుఁగు. కు. సం. 5. 589

కఁ. ముచ్చిరి యున్నది లోకము, నిచ్చలుఁ గంసానుకూలులు నిర్దయు లేఁచన్, మచ్చిగఁ గావఁగ వలయును. విచ్చేయుము తల్లికడుపు వెడలి ముకుందా! భాగ 10 పూ. 101.

2 పరితపించు, ఉడుకు.

చం మును మనచేత భంగపడి ముచ్చిరి యుండుటఁ జేసి పాండునం. దనులును నెత్తివత్తురు ... భార ఉద్యో 4. 135.

చం. అవికయుఁ బట్టుపుట్టము చెఱంగు మఱుంగయి యున్కిఁ జేసి గా,రవపరిమాణముం దెలియ రామికి ముచ్చిరుచున్న యొక్క పల్లవునకుఁ జూపె నొక్కతె విలాసములోఁ దనతోరపుం జనుం, గవపొడ వింత పొమ్మనినకై వడిఁ బానక హేమకుంభముల్ నైష 6. 131.

3 అసహనపడు.

గీ పాటిగాఁ గొన కాపదమ్మైభవునినైన, నీరసము సేయువాఁడు వినీతుఁ డయ్యె, నొరుల లచ్చిక ప్రముచ్చిరి యుడుకువాఁడు,సర్వసముఁ డయ్యె విష్ణుప్రసాదమహిమ పాండు. 4 210.

జ ముచ్చిరి, ముచ్చిరితనము

**ముచ్చిలి** వి. పెడతలయందలి గుంత అవటువు. (శ ర.)

**ముచ్చిలించు.** స. క్రి. (√ముచ్చిలు) దొంగిలించు. (శ ర.)

**ముచ్చిలిగుంట** వి. ముచ్చిలి (శ. ర.).

**ముచ్చిలిక.** వి. (హిం. ముచల్కా ) 1. వాది ప్రతివాదులు మధ్యస్థులకు మీరు తీర్పు చేసిన ప్రకార మొప్పుకొనియెద మని వ్రాసి యిచ్చెడి యొడంబడిక.

2. సేద్యము చేయువారు భూస్వాములకు వ్రాసి యిచ్చెడి యొడంబడిక ... (శ. ర., మి. బ్రౌ )

**ముచ్చిలిపాటు.** వి. కునికిపాటు (శ. ర ).

**ముచ్చిలు.** స. క్రి. ముచ్చిలించు, దొంగిలించు (శ ర )

జ ముచ్చిలించు

**ముచ్చివుక.** వి. (మూఁడు + చివుకలు) ముద్దు గులము. (శ. ర ముచ్చివక. బ్రౌ.)

**ముచ్చేట్టు** వి (మూఁడు + చుట్టులు) మూఁడు చుట్టులు.

గీ. వచ్చి కోటచుట్టు ముచ్చట్టు వాఱంగ
దశకు. 6 192

సీ. ముచ్చట్టు ముడిచిన ముంజితోఁ గట్టిన, చెలువంపు గోచిముం జెఱఁగు దూఁగ ...
హరి. ఉ 10 293

సీ. గ్రుచ్చి చేతుల మేను ముచ్చట్టు రాఁ జుట్టి, దొమ్మిగ యూర్పులతావి గుమ్మరించి ..
కవిక. 4 166, విక్ర 8 106.

ముచ్చు = ముచ్చు. అ. క్రి. (క. ముచ్చు) పోవు. నష్టమగు.

ఉ. వచ్చిన నేమి మూర్ఛ .. నేమి ప్రహార వేదనన్, నొచ్చిన నేమి వ డ్డు చెవి నోరు కరాంగుళి నేత్రగోళముల్, ముచ్చిన నేమి పట్టపతి మొక్కలి బంధనశాల లోనికిన్, వచ్చిన నేమి భృత్యునకు వచ్చినయేలిక యాజ్ఞపట్టునన్. శివరా. 4. 68.

స. క్రి. ముడుచుకొను, సంకోచపడుచు.

కం. అని పలుక జళుకు మదిఁ బెనఁ, గొనఁగా మే నెల్ల ముచ్చికొనుచుం బలి మెల్లనె యవలికిఁ జని వెనఁ జెం,గున నచ్చటిలతలు ద్రెంచుకొనుచుం జనియెన్. శుక. 2. 261.

వి. దొంగ, చోరుఁడు.

చం. పనిచినఁ గాలకింకరులభంగి రయంబున నేఁగి ముచ్చుఁ బట్టినక్రియఁ జుట్టుముట్టి చెనఁటి! చెడుకాలము వచ్చె నీకు ర, మ్మని వెసఁ బట్టి తెచ్చిన, నరాధిపుఁ డాతనిఁ జూచి చెల్లురా, కనికర మేది యీ ప్రభువు కాళులఁ జేతులు నిట్లు సేయుదే. భోజరా. 5 311.

ద్వి. అనవు డయ్యధికారి ..., అనియె వారికి నిశ్చయంబుగా మీర, లచ్చులైనది ముచ్చులైనది తెలిసి, చెచ్చెర నన్నియుఁ జెప్పెద ... ద్వి. పరమ. 4. 822 పా. అం. భా. 2. 291.

విజ. ఘాతుకము.

సీ. ... మీలముచ్చులు-ముచ్చు లేల విడుచు.
దశా 1. 137.

జ ముచ్చుపొద్దు

ముచ్చెప్రొద్దు. వి (ముచ్చు+ప్రొద్దు, దొంగలు తిరుగువేళ, నిశీథసమయము.

చం .. చేర్పన నేఁగితి ముచ్చుప్రొద్దువన్ ...
దశకు. 5. 72.

ముచ్చె వి. (సం మోచకా హిం మోజా) మీఁగాలు గుదిగాలు సైతము కప్పుకొని యుండెడు పాపోసు, పాష్ణిత్రము

సీ పక్షకృతవియఝ్జాటవాలుకాలిఁగసమితి ము చ్చెలకాల్లఁ జమరి చమరి.. ఆము 1 41.

చం . మణిముద్రికల్ వలవు గుల్తెడువిద్యము చంకపట్ట మం,ఘ్రిలతుద ముచ్చెలున్ వెలయ గుప్తగుణుం డనుమై దుల్లఁ దొవ్పగన్ ..
హంస 1. 222.

సీ ఇచ్చిన దీవెన లియ్యక యశ్యాళతో నేఁగు యాచకుం డైనవాని.

గీ గట్టముచ్చెలతోఁ బట్టికొట్టి విఱుగఁ, గట్టి పంపించ వలయును గాలుపురికి ...
వేణు. 89, అం. భా. 2 293

జ ముచ్చెవాఁడు, ముచ్చెవాటు.

ముచ్చెబంగారు. వి. కాకిబంగారు. (శ. ర. ముచ్చెబంగారము = ఇత్తడిలోని భేదము అని బ్రౌ.)

ముచ్చెవాఁడు వి (√ముచ్చె) చర్మకారుఁడు, మాదిగవాఁడు

సీ . చర్మకారాఖ్య పరగు గోదరి ముచ్చెవాఁ డనంగ ...
అం భా 2. 288.

ముచ్చెవాటు. వి. (ముచ్చె+వాటు) చెప్పుదెబ్బ.

సీ. పుక్కిటివిడె మీయఁ బోయి తిలోత్తమా వనజలోచన ముచ్చెవాట్లు పడియె ..
కువల. 1. 89.

ముచ్చోకము. న. మూఁడు + చోకములు) పంద్రెండు.

కం ముచ్చోకపుయాపులుపూ, న్వెచ్చని జేజేయ ను గునినుగుం గని లో,లొ చ్చోకయింతయు

నొదవని, మచ్చిక నవ్వాసిరాచమానికి పలికెన్.
అచ్చ. రా. కిష్కి. 28

**ముజుందారు.** వి. (హిం ముజుమ్‌దార్) లెక్కలు సరిచూచువాఁడు.

(ముజుముదార. అని శ. ర.)

సీ. మునిషీ యొకఁడు చెప్పు మొదని బఖీ చెప్పుఁ, దరువాత నాముజుందారుచెప్పు.. వేణు 16.

**ముజ్జగము(లు).** మి వి. (మూఁడు + జగములు) మూఁడులోకములు,

గీ. సాయకంబులు మూఁట ముజ్జగము గెలువ ...
నైష 3. 161.

మ. ... ప్రత్యక్షంబు గాకుండితే,ని శిఖజ్వాలలఁ గ్రాఁగు ముజ్జగములున్ నిక్కంబు వాణీశ్వరా! ... ఉ. రా 2 175.

ఉ. అక్కట కల్ల గాదు నిజ మౌ జనవాక్యము ముజ్జగంబులన్ .. దశా. 2. 332

**ముటము = మూటము.** వి. 1. ముద్దపిడుక (శ. ర.) (వ్యవ) ఔపాసనాగ్నిలో ముటాలు దాఁపవల యును.

2. జ. ఎంటచెఱకు, కట్టెలు (శ. ర.)

**ముట్టఁబడు** అ. క్రి. ముట్టన్ + పడు) ఉద్రేకించు

వ.. ముట్టంబడినరోగంబునుంబోలెఁ కౌరవ యాక ..... కవిక. 4 113.

2. డయ్యు, బలహీనమగు.

కం. భుజవాక్సం స్తంభంబునఁ, బ్రజనితభయుఁ డగుచు ముట్టఁబడి మదిఁ దలఁచెన్, గజరాజవరదుఁ గరుడధ్వజుఁ డప్పుడ యేఁగుదెంచె వ్యాసుని కడకున్ ... కాశీ. 7 108.

సీ. పాఱఁ జాలక ముట్టఁబడి జాడ దప్పంగ దొలఁగి పెన్గొందులఁ దూఱఁబడియు ...
నిర్వ. 4 76.

3. సమీపించు

గీ. ముట్టఁబడి మేనఁ గంపంబు పుట్ట నొదిగి, యుండువారుఁ గరంబున నుదర మప్పళించి యమ్మరో రక్కెన యంచు నుల్ల, ములుకు

వారు నై పురజనంబులు దలంకి.
భార. విరా. 3 36.

**ముట్టడము = ముట్టణము.** వి (√ముట్టు. త ముట్టడై) ముట్టడి, ఆవరణము, నిర్బంధము

ఉ. ఏనును నన్నయుం దడయ కిప్పురి వెల్వడి పోయి యాజరా, సూనుఁడు దత్సహాయులను జూడఁగ దక్షిణదిక్కుఁ బోవఁగాఁ, బూనెద మేము లేకునికి పొల్పుగఁ గాంచి యతండు సేనయుం, దానును గోటముట్టడముఁ దక్కి వెసం జనుదెంచు మాఁబడిన్. హరి ఉ. 24

ముట్టడువు. (ప్రాఁతప్రతిపా.)

(అగ్ని దేవుఁడు)

గీ. మొదలఁ గాశీపురమునకు ముట్టడముగ, సకల గృహములఁ దనమూర్తి సంగ్రహించె ...
కాశీ. 5. 301.

**ముట్టడి** వి. (√ముట్టు త. ముట్టడి) ముట్టడించుట, కోట మొదలగువానిని జనులు, పదార్థములు బయటికిఁ బోకయుండ, బయటివి లోనికి రాకయుండ నిర్బంధించుట.

కం ముట్టడి మాన్పి విదర్భకుఁ, బట్టము గట్టితి విదర్భపతిని ... విక్ర. 4 164.

సీ. పట్టనం బన రాదు కిట్టాయితంబుగా నట్టె ముట్టడి చేసి చుట్టి విడియు ...
ఉ. రా. 3. 101.

**ముట్టడిప్రేయు.** స క్రి. (ముట్టడి + ప్రేయు) కోట లోనగుదానిని చుట్టుకొని నిర్బంధించు, ముట్టడించు

వ రఘువరుండును పట్టణంబు నెట్టన ముట్టడి ప్రేయ నూహించి, విభీషణసుగ్రీవాంగద జాంబవన్నరున్నందనానుజానుమతంబున ..
సీతా. వి. 3. 29.

**ముట్టణము = ముట్టడము.**

వ. ... పట్టణంబునకు ముట్టణంబు చేసి చుట్టును విడిసిన ... భాగ. 10 పూ. 1529.

**ముట్టనాడు** స. క్రి (ముట్టన్+ఆడు) మర్మము నాటునట్లు పలుకు, నోనాడు

వ . గోత్రవధపాతకనివారణార్థం బశ్వమేధంబు సేయ సమకట్టి మమ్ము నెల్ల పినిగొలియలం జేసి తీండు నేఫలంబు గట్టుకొంటివని ముట్ట నాడినం గ్రీడి యోడకుండుం డని వారి నూఱడించి జై. భా 7 175

**ముట్టముడుఁగు** అ. క్రి (ముడుఁగు+ముడుఁగు) పూర్తిగా తగ్గు, మిక్కలి క్షీణించు.

ఆ చదువు చట్టుపడియె శాస్త్రంబు మన్నయ్యె. బుద్ధి పురువుమేసెఁ బుణ్య మడఁగె, నీతి ముట్టువడియె నిర్మలజ్ఞానంబు, ముట్టముడిఁగె బోధ మూసిఁబోయె భాగ 6 185

**ముట్టముదలించే** స. క్రి (ముదలించు+ముదలించు) తలచి తలచి యడుగు, గ్రుచ్చి గ్రుచ్చి యడుగు

ద్వి గతియును మఱియు నేడ్గడ నీవ యనఁగఁ, బ్రతినఁ జూపమి భక్తి పాడియే దేవ, యనుచుఁ బ్రార్థించుచు నడుగుల కెఱఁగు, చును ముట్ట ముదలించుచును గుణస్తుతులు, దనరి సేయుచు .... పండితా పురా 150 పా

**ముట్టి.** వి. (సం ముష్టిః) పిడికిలి (చూ ముట్టిపాటు)

ఇ. ముట్టిపాటు.

**ముట్టించే** స. క్రి. (√ముట్టు) 1 అంటించు, (దీపము) వెలిఁగించు.

కం. తనధర్మపత్నివలనను, మునుకొని తాఁ బుత్త్రి రూపమున నుదయించున్, విను దీపమందు ముట్టం, చినదీపము రెండుగానె శిఖ యొకటయ్యున్. భాగ. 8. 454.

2. నిప్పు తగిల్చి మండించు.

వ. ... భేరీమృదంగతమ్మటప్రముఖ తూర్యంబులు గొట్టించి, శంఖకాహళంబులు పట్టించి వహ్నియంత్రంబులు ముట్టించి చంచదాఖేటకక్రీడాచుంచు లగునచ్చెంచు లందఱు నవ్వనంబును ఘూర్ణిల్లఁ జేసిన ఆంధ్ర 2. 60.

వ .. అగ్నియంత్రంబులు ముట్టించియు ... మనుచ. 4. 57.

**ముట్టింపించే.** స. క్రి (√ముట్టించే) ముట్టింపఁ జేయు , నిప్పుతగిల్చి మండఁ జేయించు

వ .. వాద్యంబులు చఱపించియు, వహ్నిత్రయంబులు ముట్టింపించియుఁ గోలాహలంబుగాఁ బోవువెట్టించిన .. చంద్రా. 2 84.

**ముట్టికాళ్లవాడు** విశే (√ముట్టు) ముట్టు మోఁకాళ్లు గలవాఁడు, పంగుఁడు, ఒండొంటిని దాఁకు మోఁకాళ్లు గలవాడు (శ. ర.)

**ముట్టి(ట్టు)కొను.** స క్రి. (ముట్టు + కొను స్వార్థమున త ముట్టికోక్ర్)

1 ముట్టడించు , ఆవరించు.

మ ఇదె గంధర్వులు వచ్చి ముట్టికొని రింకెట్లొకొక్కో ... భాఁ. విరా 3. 27.

గీ నకులు సహదేవుఁ గొని ధర్మనందనుండు, మొనసి కౌరవబలముల ముట్టికొనఁగఁ, దలఁచి తఱి వేచి వచ్చుట ధరణినాథ, సింగములఁ బట్టి వేఁటాడుభంగి గాదె. భార. ఉద్యో. 2. 175.

ఉ. అంగదనాథు బ్రమింగిన మృకావళి దన్వెస ముట్టికొన్న సర్వాంగములుం జలింప వెగడందుచు దిక్కులు సూచుచున్నసా, రంగియ పోలె .. భార. ద్రో 1. 17.

చం అరదము చుట్టుముట్టుకొని యాఁగి దశాస్యుని బిట్టదల్చి పై. కుఱికి తెమల్చి పట్టుకొని యుద్ద విడిన్ దనతేరిమీఁదికిన్, సురపతిఁ గొంచుఁ బోవుటలు నూచి ... ఉ రా 4 347

2. పట్టుకొను.

ఆ. వాసవాత్మజుండు వసుధేశనందను, ముట్టికొనిన నొకటి పుట్టెనేని, మనప్రయోజనంబు మఱి యేమి ... భార. విరా 4 261

3 అలముకొను.

కం వగ ముట్టికొనినఁ జిత్తము, వెగ డొందఁగ మేను గలయ వెమ్మఁగ ధృతిపోఁ, తగల నొకతిగయుంటికిఁ, దగి యుండెడు చంద్ర కాంతతల్పము నేరెన్ ....
భార. విరా 2. 30

శా అన్నా లక్ష్మణ నిన్నుఁ బుణ్యనిధి నే నజ్ఞానినై పల్కితిన్, నన్నాపాపము వచ్చి ముట్టుకొనియెన్ .. భా రా అర 1 111.

4 వ్యాపించు.

సీ. కమలాస్య ముద్దుమొగంబు లేమెఱుగుఁల మొత్తంబుపరి చుట్టు ముట్టికొనఁగ ...
భార విరా 2 87

4 ఆక్రమించు

మ అని బృందారకవందిబృందము లమందానందముం బొంది కీర్తనసేయం ద్రిదివంబు ముట్టకొన నుద్దామప్రతాపంబునన్, దనుజానీకము చేరకుండ నడుమ న్వారింపఁగాఁ బూని చ, య్యన నేఁగెన్ ఖగేంద్రపక్షపవనవ్యాధూత దిగ్భిత్తియై. నిర్వ. 3 6.

ఉ ... ఎల్లవాఁ, డుం దనవారిఁ దోకొని కడున్ రథసంబునఁ గూడి వార్తకున్, ముందఱఁ బోయి గోధనము ముట్టుకొన న్వలయున్ మహోగ్రతన్. భార విరా 3. 126

ముట్టిపాటు. వి. (√ముట్టి) పిడికిలిదెబ్బ.

కం. ఒకయే టొకపో టొకవే, టొకయా టొక ముట్టిపాటు నొంద కతండు ..
కకు. 2. 104

ముట్టు. స. క్రి. (త. ముట్టు) 1. తాఁకు, స్పృశించు.

చం. ...న్ననుఁ గే,వలమున ముట్ట నెవ్వరికి వచ్చు ననున్ గలఁగు న్వెనుంబడున్ ...
భార విరా. 2. 104.

కం. వనజాతుఁడు మున్నరిగిన, మునుపడఁగా నతని నేనె ముట్టెద నంచున్, జని మును ముట్టనివానిన్, మును ముట్టినవాఁడు నవ్వు మొనసి నరేంద్రా. భాగ 10 పూ 459.

సీ రథములఁ గట్ట సారథులు ముట్టినమిన్ను దన్నెడిరథవితానములును .. విక్ర. 4 78.

సీ. చెనకె నంచెను సోఁకెఁ జెనసె ముట్టె ననంగఁ దాఁకె నంటంచని తనరుచుండు ...
ఆం. భా 3 132.

2. పట్టుకొను, గ్రహించు

సీ అద్దంబుపిడి ముట్ట వలయు పాణితలంబు లస్తకం బిటియించు లావుకలిమి ...
ఉ హరి. 1. 161.

ఉ. తుమ్మెద త్రిమ్మరీఁడు పయిఁ దోఁచు విశంగిమ పద్మినీనిశాం, కమ్మది తాఁ బరాగపటిఁ గప్పి మధువ్రతిఁ జేరఁ బోవుచున్, నమ్మిక కంగబప్రహరణమ్ములు ముట్టెడుఁ జూడ వమ్మపల్గొమ్మలఁ జెందువారలు తగుల్విరి యాటలు నేరకుందురే. వసు. 3 188.

3 తీసికొను, పరిగ్రహించు

సీ తరుణులార చివుళ్లు దడవినఁ గలకంరదంః తులకు వట్టు దలఁచినారు, రాజాస్యలార మరందంబు ముట్టినఁ బంచరీకంబులఁ బంపినారు.
వరాహ. 3. 95.

4. పొందు

ఆ. .. ఎట్టి తీఱములను ముట్టఁబడిన, వంత తెల్లఁ బాయు నింతులఁ బ్రజలను, నొనరఁ జూడఁ గనిన జనుల కెందు ... భార. ఆది 4. 84.

దండకము ... ఈశానవాణీశముఖ్యుల్ సువిఖ్యాతమైనట్టి నీదివ్యచారిత్ర చారుప్రచారంబు పారంబు ముట్ట న్నుతింపంగలేరు....
కళా. 1 77.

5. (వీణ) మీఁటు, వాయించు

కం కుందనపుఁ గమ్మిఁ బిగిచిన, యందంబున జవరఁదనము నలరుందేనెల్, చిందివగతి మాధుర్యముఁ, బొందుపడన్ వీణెముట్టి పొలఁతుక పాడెన్. కళా. 2. 32.

సీ. తనకంఠరవములు వినవచ్చునట్లుగాఁ బతి

వాదినులు ముట్టి పాడుచు డు,
వి పు. 2. 214

6 ఉపయోగించు

సీ మఘుసేన సేయఁడు మాంసంబు ముట్టఁడు నిద్రయెన్నఁడుఁ బోఁడు.
భా. రా సుం. 302

అ నెలలు నాలుగింట నిష్క్రమణము చేసి, యాఱు నెలలు చన్న నన్నరసము, ముట్టునట్లు చేసి మూఁడవయేఁట జౌలము నేయ వలయు నెమ్మితోడ శిక్షా. 1 17.

సీ చిలుక ముట్టిన ఫలంబులు గోసికొని వచ్చి, పరికించి యారగింపఁగఁ బెట్టు ..
శివరా 3. 65.

7 మార్కొను, ప్రతిఘటించు

ఉ ముప్పురుఁ బూని వచ్చినను ముట్టెదఁ గర్ణుని నేలఁ బెట్టెదన్ ... భార కర్ణ. 3 262.

చం అనిమొన ముట్టి శాస్త్రవచయంబులు దారుణ దివ్యబాణముల్, ఘనముగ నేయఁగాఁ దనువు గాఁడిన నొవ్వఁడు. వి పు 2 34

8 క్రమ్ము, వ్యాపించు

మ బలవద్వైరి నిదాఘమేఘుఁ డగునా పద్మాక్షు మీఁదన్ సము, జ్జ్వలులై చైద్యుఁడు దంతవక్త్రుఁడు జరాసంధుండు పాళ్వుండు పేరలుకం దాఁకి రణంబు సేసిరి యవశ్యాయాంబుద వ్రాతముల్, జలజాప్తుం గని బిట్టు ముట్టిన గతిన్ సన్నద్ధులై యుద్ధతిన్ వి పు. 8 58.

గీ అరుగుచుండువాఁ డొకచో దవానలంబు, గట్టి దిరి కాననం బెల్ల ముట్టి మండ ...
భార. శాం. 3. 340.

9. కలుచు

చం. ఉరగము ముట్టెనా వరుల కుర్విని వెజ్జులు ధర్మశీలురై, గరళము నెక్కుడింతురు ...
భర్తృ. 2. 54.

10 బాధించు.

ఉ క్రూరపు భూతముల్ జనుల ఘోరవిధంబుల ముట్టి యెప్పుడున్, మాఱణ మారకింపఁగ సమస్తజనంబులు నాశమొందఁగా.
భా అను 4 435

11 ఆవరించు, చుట్టుకొను

చం. మఱి పని లేదె వేఁటవు మారికి సిక్కి నిం నుండ నోయి చే, జెఱుఁగఁ గకూన దుర్జయ పరేంద్ర శిఖామణి పీఁటె వచ్చె నే, వెఱన నుఁ జేఁ వేలు పుల వెంపరలాడుచు నాలకిపు మాల, మొలలు తదియధాటి నిను ముట్టుఁ జమీ ... నిల్చినన్ పరాహ 3 54.

శా వేమాఱు న్మఱయానిలు ... యాపీఠన్ ప్రసూనాన్వితా, రామంబు ల్వేగ ముట్టి యందలియళివ్రాతంబుఁ బోఁజోపి శా, నామోదంబులు చూఱపట్టి ... విక్ర 1 66.

అ క్రి 1 కడముట్టు, పూర్ణమగు

కం శివదేవు ముట్టఁ గొల్వఁగ, నవసిల్వఁ యతని పేళ్ల యర్థ మెఱిఁగి సం, స్తవనస్మృతిఁ గూర్చ నాకైన విధాతకునైన నరది నామదిఁ జూడన్.
భార. అను 5 693.

శా పట్టం గైదువు లేక విన్న వయి నాశాపార్శ్వకు ల్యాడుఁడా, యిట్టం గాక సురేంద్ర బాధ పడి మీ రిట్లుఁగ దుఃఖపడఁగాఁ, గట్టాపో యిటు మిన్నకుండుడునె శీఘ్రం బిష్ట భీమేశ్వరున్, ముట్టం గొల్చెదఁ జక్రలాభమునకై ముగ్ధేందు చూడామణిన్. భీమ 6. 61.

ద్వి అట్టిద కాని గుర్వంఘ్రియుగంబు, ముట్టంగఁ గొల్చినయట్టి భక్తాళి.
బస పు. 7 1011 పం.

2. మొదలంటు.

ఉ .. గొడికాఁడ్రు ... వలకాలిపిల్ల వ్రేల్, ముట్టఁగఁగోసి మంత్రివరుముందటఁ బెట్టి కృతప్రణాములై ... జై. భా 8. 41.

3. సంభవించు, కలుగు.

కం. అట్టియెడ మాద్రి పిదపటి, పట్టి కురునృపాలు

రెండుపదు ఉమ్మిలు దా, బెట్టుగ నేసిన వేదన, ముట్టుడుఁ జేడ్పడియె సతఁడు మొనయును దలఁకెన్ భా॥ కర్ణ 2 378

గీ. . ఎంతవేసవి ముట్టిన నెండఁ గమరు, వను వసంతుండు దగుసహాయంబు గాఁగ ...
కు సం. 4. 481.

కం. నావుఁడు ముట్టినజగడం, బీవేళనె తీర్పవేని యేండ్లున్ బూండ్లున్, నీవేమి తీర్చె దనుటయు, నావెలఁదుకఁ జూచి పలికె నాగ్రహ మెసఁగన్.
జై భా 6 68

4 అంటు, వ్యాపించు

సీ మునిశాపదోషంబు ముట్టి యుండుటఁ జేసి, దానధర్మములు భూస్థలిఁ దొరంగె .
వి పు 1. 149.

5. నాఁటు, గట్టిగా హత్తు

ఉ ప్రేమికినఁ గౌఁగిలించి మది ముట్టిన మోహము ద్రెంప లేక లోఁ బొక్కుచు
భా రా అయో. 89.

శా పాదన్యాసములన్ ధరిత్రి పరికంపం బొంద నత్యూతన, మ్మోదంబున్ భయభక్తులు న్మన మునన్ ముట్టఁగ శైలేంద్రుఁడు
హం. 4 58.

6. చెద, ప్రాప్తమగు.

(వ్యవ) నాకు పీరు పంపించిన సొమ్ము ముట్టినది.
వి 1. సాధనము, ఉపకరణము

అ వాహనములు వానివానిముట్టులు నొక్క, వంకగా నొనర్చి వఱసివఫడ, కట్టి వెడలి ...
భార. మౌ. 188.

సీ దామెనలును వల్లెత్రాళ్లును దలుగులు గవ్వము ల్గొడవలి కత్తి నూఁడు ...

గీ గొడుపు వాదోళ్లు మొదలుగాఁ జెడక యుండ, వలయు ముట్లెల్లఁ దెమ్ము ...
హరి పూ. 6. 21.

ద్వి కర్నంపుముట్లెల్లఁ గర మర్థిఁ గొనుచు ...
బస. పు. 5. 3553 పం.

సీ తడవి బ్లోకప్పుడు విడుపనిచేతుఃః రోము చూపెడునట్టి ముట్టు గనెనె
వాల్మీ. 2 121.

(మోము మాపెడునట్టిముట్టు = జపము చేసికొను పనిముట్టగు గోముఖము)

2. పదార్థము

కం పారావతములు శుకములు, శారికలును బుప్ప ఱతలు జనవర పసిడిం, దారముల నైన ముట్టులు, నారయ గృహమంగళంబు లాద ర్శములున్ భార అను 4. 118

3 ఎరుమతి.

గీ. తుంగమునకుఁ బణము పురుషుఁడ కరిపణ. మాఁడుదానికైన నందు సగము, వ్రేఁగు ముట్టు నదు వ్రేఁగువిడుపునను, నోడకూలి గొనుట యుచిత మంద్రు విజ్ఞా 2 66

4. ఆఁడుదాని రజస్సు, ఆర్తవము.

సీ ... ముట్టన నార్తవం బొప్పుచుండు ...
ఆం భా 2. 108.

5 (ఆఁడుదాని) రజస్సు వర్తిలు సమయము.

గీ ముట్టునను భార్యఁ గవయుట మూత్రమును బురీషమును నీరు విడుపు విద్వేషయుక్తి యోషిదుపజీవనము మృణాలోత్కరంబు, ముచ్చిలుటఁ బోలు కల్మషము లెతలంప.
భార. అను 3. 257.

6 తాఁకుడు

వ . మీరు కోల్లసేయుం డేను వెస ముట్టునఁ దాఁకి ధర్మనందనాదులను సమయించెద ..
భా॥ శల్య 1 337.

7 విధము, పద్ధతి

శా ఎట్టెట్టా శివుఁ గల్చె నంటి వింక మీయూ తవ్విత న్గలంగఁగా, నట్టు ల్మెచ్చక యున్న వే తపము సేయం జొచ్చె మున్నాతఁడే, ముట్టుం బోలిన వాఁడుగాఁ దలఁచి తా మోహించె దేశం బులోఁ, బుట్టం బట్టులు మాలెనే నగజ యా

భూతేశ్వరుం గల్వంగాక్ కు సం. 7. 851.

ఉత్తరము ముట్టినతూర్పు = ఈశాన్య దిక్కు.

సీ. . . ఏకాకి యై పోయె నచటికి ననతిదూరమై యుత్తరము ముట్టినట్టి తూర్పున నొక్క మడు వున్న దానిలో నడంగి యుండు, వాడుగా..
భాగ. శల్య. 2 వ.

పాదముముట్టు = తుదముట్టు, కొనసాగు.

ఉ ...తాను జేపట్టిన నిర్జరేంద్రుపని పాదము ముట్టుట నాత్మ నుబ్బుచున్ ..
పదమ 1 120.

పోరుముట్టు = యుద్ధముచేయు.

గీ పోరుముట్టినవాయం జేదువెట్టినవాయం గల హేతి వట భూతి గడలుకొల్పె
రా వి. 6 12.

మొదలు ముట్టంగం బోవు = సంపూర్ణముగాం జెడు

ద్వి చదువును సంధ్యయు జపమును వేల్మి, మొదలు ముట్టంగం బోయి మోట నై బడలి..
ద్వి హరిశ్చ ఉ. 1252 పం.

ఇ ముట్టంబడు, ముట్టడము, ముట్టడి, ముట్టడి వ్రేయు, ముట్టణము, ముట్టవాడు, ముట్టించు, ముట్టింపించు, ముట్టికాళ్లవాండు, ముట్టికొను, ముట్టుకొల్పు, ముట్టుకోలు, ముట్టుకోలుగొను, ముట్టుకోలుపఱచు, ముట్టుకోల్పట్టు, ముట్టుత, ముట్టునీళ్లు, ముట్టుపడు, ముట్టుపాటు

**ముట్టుకొ(లుపు)ల్పు.** వి. (ముట్టు + కొలుపు.) హింసనము, బాధించుట

చం. కుముదవనంబుకోరక చకోరికవండుగ భోగి భాగధేయము ననవిల్తుకాండ్ర కడియాలము చీకటి ముట్టుకొల్పు పున్నమ కొంకవన్నె చేకుఱ నొనర్చిన యొప్పులకుప్ప యామినీ, రమణుండు దోంచె నొయ్యనం గరంబులు చాంచి దిశాముఖంబులన్ ...
రామా. 6. 124.

**ముట్టుకోలు.** వి. (ముట్టు + కోలు) ముట్టడింపు, ముట్టడి. (చూ. ముట్టుకోలుగొను.)

**ముట్టుకో(ల్గొ)లుగొను.** స. క్రి (ముట్టు + కోలు — కొను ?. చూలుగొను

ద్వి . ఒట్టిదామెల, యొఱపు నెల్లి స మాడు చుక్క పాదములు, ఉక్కు కాళియె పెంచిన ముట్టుకోలు, గొన్నకిన్నెరసోనట గజియు తేరోదలు ద్వి పం. 1. 16 పా

2 ముట్టడించు

ఉ. వల్లవబాలురన్ నగరవాకిటికిన్ వెడలంగ ద్రొబ్బుచుడి, గొల్లల ముట్టుకోలొనుండు గ్రూరుని నందుని గట్టుండు ..
భాగ 10 పూ. 1973.

చం క్రమముగ రాణివాసమున ద్రోహ మొనర్చిన వాని కాజ్ఞ తద్భవనము ముట్టుకొల్పని విభావరిం గాళ్లను జేతులు న్నపా, టవిం దిరిగింపం జెల్లను. సారంగ 2. 168

**ముట్టుకోలుపఱచు** స క్రి (√ముట్టుకోలు) ముట్టడించు, అవరించు.

సీ .. రారాజు నొక్కరునిం జాండు, తనయులు తమవారుం దారును జెక్కండ్రు గూడిముట్టును ముట్టుకోలు పఱచిరి ...
భార 2 1 27.

(శ ర పా కూడి చుట్టును ముట్టి గుల్లపటిరి. ముద్రి పా )

**ముట్టుకో(లుప)ల్పట్టు** స. క్రి (√ముట్టుకోలు) ముట్టుకోలుగొను, ముట్టడించు.

ఉ గట్టిగ నాతనిన్ విఱిచి కట్టిరి తన్నిలయంబు ముట్టుకో, ల్పట్టిరి చుట్టుపట్లం బదిలంబుగం గావలి వెట్టిరి ...
సారంగ. 1. 168.

వ. ... హట్టంబులు ముట్టుకోలుపట్టి ...
రామ. 6. 248.

**ముట్టుత.** వి. (√ముట్టు) రజస్వల.

సీ ... ముట్టుత యనంగ నుదక్యయై తనరు ...
ఆం. భా 2 110.

**ముట్టునీళ్లు** వి. బ (ముట్టు+నీళ్లు) బహిష్ఠయైన యాండుది నాల్గవనాండు చేయుస్నానము, ఋతు

స్నానము. (శ. ర., వా)

**ముట్టుపడు.** అ. క్రి. (√ముట్టు) క్షోభముగలుగు, కలతపుట్టు.

చూ. ముట్టుపాటు

**ముట్టుపాటు** వి. (ముట్టు+పాటు) 1 క్షోభము, కలత.

గీ. తలఁకు పుట్టెఁ గొంకు కొలఁదికి మీఱె వె, న్నాటు దోఁచె ముట్టుపాటు దొడరె ...
భార. విరా. 2. 106

2 తాకుడు స్పర్శము

ద్వి పఱతెంచుచో ముట్టుపాటైన నొకని, నరి మురిఁ జంపి మాచయ్య యున్నెడను ...
బస. పు. 4. 26 పం.

3. ముట్టడింపు.

సీ మిగులంగ ముట్టుపా టగుటఁజేసి కలంక, నెఱిఁగి యెఱిఁగింప నెఱుఁగ కిట్లు ...
కళా. 8. 157.

**ముట్టె(ట్టియ)** వి. 1. పశ్వాదులమూతి.

సీ నట్టులనైనను వలువైనవెంపున, ముట్టె యంటఁగఁ బట్టి కట్టి విడువ ...
భార. విరా. 1. 101.

సీ .. మోర నా ముట్టె నా వెలయును ముఖ విశేషములు ... ఆం. భా. 2. 142.

2 పందిముక్కు, పోత్రము.

సీ. ఎగుచుకూఁతలు ముట్టె యెత్తి బిట్టాలించి గమికిఁ గన్నాకయి గాలి యంయు ....
మనుచ. 4. 42.

ఉ. ముట్టియ నింద్రకీలతట మూఁకమిహి ప్రభవంబులైనపె, న్పుట్టలు గ్రుచ్చివైచుచును ఘూరుపాషండము చావకట్టుగా, మట్టుచు ఘర్ఘరధ్వనుల మాటికి మాటికి దిక్పుటంబులన్, ఘట్టన చేయుచు న్వెడఁద కన్నుల నిప్పులు వెళ్ల గ్రయుచున్. హం. 7. 44.

**ముట్టియ తోడి జీవములు** = ముట్టె జీవనాధారముగాఁ గల ప్రాణులు; వరాహములు.

ఉ పుట్టుగు చెట్లకు న్మొలవఁ బోసినవిత్తులు శాంతి ము స్తకున్, ముట్టియతోడి జీవములు... . కోరిక లెవ్వరి నొంప కుండునే? కవిక. 5. 120.

జ. ముట్టెకోడి, ముట్టెచేఁప, ముట్టెమొకము. ముట్టెమోపు

**ముట్టెకోడి** వి (√ముట్టె) పక్షివిశేషము.

సీ . డాబ ముట్టెకోడియు జోద పొన్నంగి· కల్లేడు బొల్లికోడి హంస 3. 12

**ముట్టెచేఁప** వి (√ముట్టె) మత్స్య విశేషము (శ ర)

**ముట్టెమొకము** వి (√ముట్టె) పంది, పోత్రి.

**ముట్టెమోపు** వి (√ముట్టె) కార్యనిర్వాహక సమయము

(వాఁడు ఇన్ని దినములు కానిమ్మని ముట్టె మోపున నాచేత కా దన్నాఁడు.) (శ ర)

**మురా** వి (హిం. మురా.) 1 గ్రామ సమూహము

ఉదా. పోలవరము మురా

2 జనసమూహము. (శ. ర.)

**ముడాసము** = ముడాసు

ద్వి. వాలారుచంద్రిక వన్నియచుంగు, డాలు వాటిల్లు ముడాసంబుఁ జుట్టి, తరుణారుణోద్దామ ధామసంతతులఁ, బురణించు కెంపుల ప్రోగులు వెట్టి
అ మ. క. 5. 259 పా 15 పం

**ముడాసు** = ముడాసము వి (హిం ముండాసా. క. ముణ్డాసు) ఉష్ణీషము, తలపాగ

సీ మెలిపెట్టి చుట్టిన తెలిపరంగి ముడాసు ..

గీ. . . బెడఁగు సూపె . అరుగుదెంచె, దాయదాకారుఁడైన యుద్దారుఁ డొకఁడు ..
శుక 2 426.

ద్వి. పరదేశముగానెట్లపగిది దిండుగను, బెల్లు చుట్టినపెదపెద ముడాసులును .
ద్వి పరమ 6. 407 పా.

ముడి[1] వి. (క. త ముడి) 1. మూట.

వ. .. నానావిధంబు లగునతులంబులు ముడి కట్టం బున నిడికొని ... భాం విరా 1 184

ఉ మాకు మ్యామందలలోనఁ గట్టికొన మంచి పటంబులు లేవు నీముడిన్, సుందర ధౌత చేల ములు శోభిలుచున్నవి తెమ్ము ..
భాగ 10 పూ 1556.

ద్వి పన్నుగాఁ దనచేతిపసిబిడ్డతోడవు, లన్నియు ముడి గట్టి గట్టి యందివచ్చునంత
ద్వి. హరిశ్చ ఉ 280 పం.

2. గ్రంథి, దారములోనగువానిముడి.

ఉ . ఈ, రెండవకీర్తులం దల ధరించిన వాఁడు ప్రదానశీలుఁ డా,తం డిరుపాయగా ముడిచిఁ దార్చినవెంద్రుక లన్మిషంబునన్ ..
నైష. 1 51

సీ వాలాగ్రముల ముళ్లు వైచి లంకెలుగ శార్దూల పోతకముబఁ దోలి తెచ్చి ...
పి శకుం. 4. 69.

కం. విడువనితగు లిరుపుర కి,వ్వడుపున ననుకరణి నుభయవస్త్రాంచలముల్, విడిదేలు నతులతోఁ, ముడిఁబెట్టిరి పంచళరుఁడు ముడి వెట్టఁగన్.
వేం. పంచ. 4. 885, ఆము. 2. 80.

8. కోపాదులచేఁ గలుగుకనుబొమల మెలి.

సీ కనుబొమల్ ముడి నొందుకంటె ము దుగఁ గరంబున నున్నచాపంబు గొనయు మెనయ ...
ఉ రా 4. 62.

4. ముడివలె వ్రాయు కొన్నిహల్లుల మూలు రూపము.

ఉదా : మాముడి. నాముడి మొ

సీ. పట్టె వ్రట్టువయును బరిపుష్టితలకట్టు గుడి సున్న కియ్యము సుడియు ముడియు ....
పా.డు. 1 71.

5 (ఒప్పు) మూఢ్యము

చూ. ముడిగిబ్బ.)

6 చెట్టులోనగువాని బుడిపి (శ : )

7. సంధి , పొందు

చూ. ముడికాఁడు )

ముడిదిన్ననక్క = చివరవఱకు విడువక బాధించు వాఁడు

ద్వి. గడుసు తుంటరి జోగి గ్రక్కినముడుసు, ముడి దిన్ననక్క ముమ్మోటు పిసాళి ...
ద్వి హరిశ్చ ఉ 650 పం.

మూఁడుముళ్లుపడుట = వివాహమగుట.

సీ ఒక్కకన్నియకును నుంకు వెల్లను బెట్టి వడి మూఁడుముళ్లును బడకమున్నె, యంతకాలంపు మున కరగిననాతనితమ్మని నక్కన్యఁ పు దోఁప వరియింప నీఁదగు . . వి

జ. ముడికాఁడు, ముడికాళ్లవాఁడు, ముడిగొను, ముడిగొల్పు, ముడిపాటు, ముడిబొమ్మ, ముడి పడు, ముడివిడు ముడివిడుపు, ముడివెట్టు, ముళ్లపేరు, ముళ్లమారి, ముళ్లువేయు.

ముడి[2]. వి. (క. ముడి.) కిరీటము.

సీ శృంగారరాజ్యలక్ష్మికి ముడి గలసినగతి హంస తిలకంబు కబరిఁ బూన్చి ...
కు సం 9. 212

ముడి[3] విశే (క. ముడి) 1 ముడిసినది. ముసలిది

కం తొడవులు చివికినరొమ్ములు, గుడిముట్టు కపాలమిల్లు గుడి ముడిరొ ద్దె,క్కుడు గట్టు వలువ దోలగు, బడరునకై వవయ నేమి ప్రలయము వచ్చెన్. కు సం 7 870

సీ పెళపెళ విదళించి బెబ్బులిముడితోలు వన్నె దుప్పటి వల్లెవాటు వైచి . . పాండ్వ. 4. 126.

2. వికసింపనిది

సీ. అడిగినపైఁడి యీముడిపువ్వుల కొసంగ నగు

నని వేనగు మొగ మెఱిఁగి

రా. వి. 1. 57

ఉ. ఈవిరివంద కొప్పి మణి యిచ్చిన నీ విది యేమి యిచ్చినం. బోవు గదా బళీ తెలిసెఁ బో వెలి దండకు నేను నౌట నా,పూవుల పూవుబోఁడి ముడిపూవులదండలదానిఁ జేర రా,దా వెల యాలనా యనుచు దద్వట లీలకుఁ బుష్పలావి యున్,

కళ 1 156

చం. ముడివిరు లద్దముల్ సురటులుం దెలిదంతవు నువ్వెనల్ ముడం, బడర ధరించి యూడిగవు టబ్బురపున్ వలిగుబ్బెతల్ తగన్ .

కువల 5. 137

3. పొట్టుపోనిది.

ఉదా ముడిసెలు, ముడిజొన్నలు మొ.

4 అసంస్కృతము

ఉదా. ముడిసరకులు ముడిబియ్యము.

5. అంచు, కమ్ములు లేనిది

ఉదా. ముడిబట్ట, ముడిగుడ్డ మొ (శ. ర.)

జ. ముడిగిబ్బ, ముడిబట్ట

ముడి⁴. వి. సేవ

సీ. పొడుపుప్రొద్దులు రాజుదడ మౌర యనఁ జావమొగములు రాకానిముడులఁ దోఁచె

కళ. 5 172.

ముడి⁵ ముడ్డి. వి గుదము.

ద్వి. వెడమతు లైన యావిప్రులఁ జూడ, వడి ముడిగాఁ జొచ్చి వాత వెళ్లుదురు ...

ద్వి. హరిశ్చ. ఉ 484 పం.

ముడికాఁడు. వి. (ముడి¹ + కాఁడు) ముడియ విడుపు, దొంగ.

కం. వలదుముడికాఁడ రాముని కలికిందిగ నాడి చనుము కాకుండినన, బ్బులుమగనితూపుటగ్గిం, దొలివేలుపువంగడంబు ద్రుంగెడుఁ జుమ్మీ.

అచ్చ రా. అర. 71.

విశ. సంఘాత. దూత.

చం. . రేపు గుబ్బలై, కులుకక పోవు డలముకొన్న నునుంజమఁబూప లంద్రు ప్రే, మలముడికాండ్రు పండిపడు మావిడితోఁపుల గావు గూఁతులన్ ..

కళ. 1. 180.

గీ అనుడు వంజుడు దిండిరాయండువాని, కట్టులని పల్కి విన రోక, చెట్టువట్టు, మొకవు ముడికాఁడు, రాముని మేటితనము, సెప్పెదవు వేనవేలు నాచెంత నిలిచి.

అచ్చ రా. యు 117.

ముడికాళ్లవాఁడు. విశ. (√ముడి¹) ముట్టికాళ్ల వాఁడు, సంజ్ఞువు

సీ .. ముడికాళ్లవాఁడవ సంజ్ఞుండు మీఱుచు నుండును ..

ఆం. భా 2 122.

ముడికొక్కు వి ఒకానొకపురుగు, క్రిమివిశే షము (శ ర .

ముడిఁగించు స క్రి. (√ముడుఁగు) ముడుఁగఁ జేయు.

వ. . నీడోద్భవంబును .. చేయాక యూఁకలు ముడిఁగించుకొని యూఱం బైన యొక్క లతాగేహంబు దూఱి ...

నైష 2. 46.

ముడిగిబ్బ. వి (ముడి³ + గిబ్బ) ముసలియెద్దు. (అఁబోతు అని శ. ర )

ద్వి ఎక్కుడు ముడిగిబ్బ యెమ్ములు బొమ్మ, కక్కురిం బగులోలు కట్టెడువలువ ..

ద్వి. భాగ. 4 స్కం. (శ ర )

ముడిగొను. స. క్రి. (√ముడి¹) 1. ముడివేయు, బంధించు

కం. మెడమన్ననలఁచి యలకలు, ముడిగొనినిజ పాణిపద్మములు గరగరగాఁ, గడుగుకొని తనకు మఱఁదలు, విడెమొసఁగుచుఁ బసిమి పసిఁడి పీవన వీవన్,

పాండు. 3. 31.

ద్వి ముడిగొన్న సంసార మోహబంధములు, విడఁ దన్ని సుజ్ఞాని వెడలినమాడ్కి ...

రం. రా, కిష్కిం. 2556 పొ 8 పం

2. అలముకొను.

ద్వి. ముడిగొన్నవగలతో మొదలంటఁ ద్రవ్వి, పడి

యున్నలతఁబోలెఁ ఒడి మూర్ఛపోయె
రం రా. అయో 95 పా 10 పం

అ క్రి 1 పెనగొను, ముడిపడు

ద్వి దశకంఠ నిన్ను నన్నుఁ దక్కినవారి, ముడి
గొన సంసార మోహపాశముల, వడి గాఁటఁ
గట్టినవాఁడె యాఘనుఁడు ...
రం. రా ఉ. 6 పా 2 పం.

గీ బండిగురివెందతీఁగెచప్పఁగము కెరసి, ముడి
గొనివ్రాతపందిళ్ల నడుమ .. వసు 2 31

చం ... బొమల్, ముడిగొనఁ ... గెలుచు
సముద్ధతిచేఁ ... మీ టుచున్ .
...

ముడిగొల్పు(లుపు) స క్రి ... ముడివేయు

చం కనుఁగవకెంపుకొప్పువిడఁగా ముడిగొల్పెడు
పొందు మీఁదిజం, కెనసెటిచూపు నెవ్వపు నగిం
చనినవ్వు బయల్ గుటించి పల్కును గఁదేటు
మేనుగనుఁగొన్నను జక్కొరబొమ్మ యొక్క
చక్కనిమగవానికి న్వలచెఁ గావలయుం
గలయం దలంపఁగన్. కువల 3 86

సీ. మఱుఁగునా నవ్వల మరల వీడిన నీవి ముడి
గొల్పి పయ్యెద యిడినపొలఁగు ..
కవిరా. 5 281.

ముడిచె వి సాంక్రామికరోగము (శ ర.).

ముడిపా(వా)టు. వి. (ముడి[1] + పాటు) ముడి
వడుట

ద్వి ముఱముఱమని బొమ ల్ముడిపాటు గదుర.
ద్వి. హరిశ్చ పూ 1149 పం

ముడిఇట్ట వి. (ముడి[3] + బట్ట) అంచులు లేని
వస్త్రము (శ ర., బ్రౌ.).

ముడిబొమ్మ(మ). వి. (ముడి[1] + బొమ్మ)ముడి
వడ్డకనుబొమ.

సీ పల్లవింపిఱితల ఫాలంబుముడియును, ముడి
బొమ్మలును జప్పిముక్కుదొప్ప, చెవులు ...
హరిశ్చ. 4. 168.

చం చలమొ మిటారిచూపొ నెఱజాణతనమొ ముడి
బొమ్మొ తక్కుచె, య్యులు గలవో ...
...తియున్ ... వెత ... కామినీ.
... 7 64

ద్వి బొడ్డికన్నులు ముడిబొమలు క్రేల్ జడలు ..
పండితా. దీక్షా 40 ...

ముడియ వి (ముడియు + ఆ ముదుపు)

1 మూట

గీ పెండియును మేఘనాదుండు బాడిమోకు,
మెడకుఁ గాళ్లకుఁ దగిలించి ముడియ గట్టి
దీపించుఁడు నవ్వీరుఁ దేరుమీఁద, బెట్టుకొని వచ్చి
తనమ్రోలఁ బెట్టుటయును రామా 6 ...

2 ఒకవిధ మగుమాట

ద్వి మునికొని మూటలు ముడియలు వీఁపు, నను
గట్టుకొ చుం దల ల్మూడ కొంచు ..
పండితా పర్వ. 3 49

ముడియవేయు = ముడియవైచు

సీ మౌనముద్రయె కాని మాటాడువేడుక కడు
వని ముఖకాంతి ముడియవేయ ..
కవి. 2. 212

ముడియ = పందెము (శ. ర )

ముడియవైచు పదియేదివిషయము నిరూపించి, దానిని
స్థిరీకరించుటకై వస్త్రమును ముడివేసి ప్రమాణము
చేయు.

గీ. కాపు విచ్చివిచ్చికప్పంగమఱచి చే, బోకవి
పట్టుకొనుమఁ బోలఁతివచ్చె, నెల్ల సమయ
ములకు నీకుండు చేల్పని, ముడియవైవ వచ్చు
వడువువోలె కు సం. 8 64

'ముడియవేయవచ్చు', వ్రాఁతప్రతిపా.

సీ ముడియవైవఁగ వచ్చు మొన దారసించిన,
శూరత్వమున వెన్ను చూపఁ డనుచు ....
పాండు 1. 63.

ఉ నాదగుతారకారుచిధనంబు హరించినకన్న

గాఁడు వీఁడే దివసాహ్వయుం డగుఁ గడింది మలిమ్లుచుఁ డంచుఁ బశ్చిమాశాదయితుండు చూడఁ గడసాలివవారుణచేలమున్ వియద్వాది కడంకతో ముడియపై చె నవన్ రవి గ్రుంకె నెంతయున్ విక్ర 3. 22.

ఇ ముడియకట్టు, ముడియవిడుపు.

**ముడియకట్టు** వి. (ముడియ+కట్టు) ఒక విధమగు మూట

గీ. ముడియకట్టలక్రియఁ గట్టువడినవారు ... దశకు 3. 16

చం .. కై, ఘటిలినడేగలున్ ముడియకట్టలఁ గట్టిన లీడ్చుతట్టువల్ చిటిలినగంద మొప్పఁ గయిజీతపురాజులు వచ్చి రంతటన్ ... రా వి 2. 52.

**ముడియవిడుపు = ముడివిడుపు** వి. (ముడియ+విడుపు) దొంగ.

సీ. సంకరి జూదరి జూటు దనాచారి మునిముచ్చుఁ జలపాది ముడియవిడుపు ...

గీ చేర వలవదు మఱి పొందు సేయఁ దగదు నీతి 9.

సీ. ... ముచ్చెత్తు బడికాఁడు ముడియవిడుపు ఆం నం మాన 11.

**ముడివడు** అ క్రి (ముడి[1]+పడు) 1. బద్ధమగు, ముడి గలది యగు.

సీ. మోహపాశంబున ముడివడ్డకతమునఁ దిరుగుదు రెప్పుడు దెలివి మాలి ... వరాహ. 9 124.

మ. బొమ లల్కన్ ముడివడ్డ రౌద్రరస ముప్పొంగం దనర్పన్ భుజాగ్రము లిం దెవ్వ డు నాకు మా అనుచు .. భార. ఉద్యో. 2 188.

గీ. అనుచుఁ గటమర లదరంగ నౌడుగఱచి, బొమలు ముడివడ లోచనాంతములు జేగు, రింపఁ గోపంబు చెమట వర్షింప .. వరాహ. 10 65.

గీ. వ్రేలు పెదవులు దీర్ఘకరాళ జిహ్వ, కయును ముడివడ్డ బొమలును గలుగువాని ... భాగ 10 ఉ. 939

2. సంధిల్లు

చం కొడుకులవేణునాదములు గొబ్బున వీనులకుం బ్రియంబులై, ముడివడ లేచి యెత్తికొని మూర్కొని తల్లులు కౌఁగిలించుచున్, జడి గొన జేఁపు వచ్చి తమ చన్నులయందు సుధా సమంబులై, వెడలెడిపాలు ... భాగ 10 పూ 515.

చ ఉడుపతి శారికిన్ వెఱచి యూఱట యూనని పేరటూమనిన్, ముడివడు కంతుసేనలకు ముయ్యేలగు ట్టయినట్టియిందు రా, నడఁగునె తాపవహ్ని ... మను చ. 3. 84.

గీ . మోవిపవడంబుఁ దమలోన ముడివడంగఁ, దెఱవ యొయ్యారమున వాని దిక్కు చూచె . విక్ర. 8 51

(ఇట సాదృశ్య వాచకము.)

కం అత్తఱిఁ బైపై జాఱెడు, ముత్తెపుఁదలఁ బ్రాలలీల ముడివడునారా, జోత్తమునకు నెమ్మోమునఁ, జిత్తజుతమి పొడమఁ జెమట చినుకులు దనరెన్ పంమ. 2. 41.

3 ముడిచికొను.

కం అడవిఁ దనయిరు గెలంకుల, నడలుచుఁ గను పట్టుబలునిశాటుల హితులం, గడు నుగ్రుల నొగి మొగములు, ముడివడఁగాఁ జూచి సభయ ముగ నిట్లనియెన్. సీతావి 3 75.

4 పెనఁగొను.

సీ గొడుగులుం బడగలు ముడివడ గాయక వంది పాఠకుల రవంబు లెసఁగ ...

భార. అను. 4. 333.

కం తొడిగిన పాముల విసమును, మెడవిసమును నొసలిచిచ్చు మెట్టుల వడయున్, ముడివడఁగా వడకాలము, గడపుట కడుఁ గడిఁది యయ్యెఁ గఱకంఠునకున్. ద్వా. 9 13.

కం. .. మదిలో, ముడివడు సంభ్రమము హర్ష మును లజ్జయు ... దశకు. 5. 108

ద్వి హరిశ్చ. పూ 588 పం.

4 చాపచుట్టగఁ జుట్టుకొను

కం హిమకరుఁడు గుదియు మంచున, బ్రమసి ముడుఁగు దైత్యకోటిఁ, బాణాభిహతిన్, సమయించె వరుణుఁడు ..
హరి పూ. 4. 127.

కం తొలుతఁ బొనుగంటి సుట్టుట, వలనం జోపవలె ముడుఁగు వసుధాస్థలిపైఁ, గులగిరులఁ జేసి యెల్లెడ నిలిపె నజుఁడు.. నేరుపు మెఱయన్.
దశా. 3 212.

5 చేష్టలుడుగు, విరమించు, ఉడుగు

వ. ..నందగోపాలాదులగు ఘోష జనంబులందఱుం దల్లడంబున నందంద మేనులు వడంక నొక్క దెస నుడిగి ముడిఁగి యుండిరి .
హరి. పూ 9. 127

కం అని చుఱచుఱఁ గొఱవిం జూడిన క్రియఁ బలి పలుకుటయును డెంద మవిసి యజ్ఞపతి పిడుగడఁచిన విధమున మేదిని ముడిఁగి పడియె మూర్ఛాగతుఁడై .
మార్క. 1. 198.

కం మొదల విచారింపక చేయుచు రది తుది నొప్పకున్న నక్కడఁగి ముడుంగుదురు విను తలువ లప్పనులొదవక చెడుబూడ్ద నిడిన హుతములకరణిన్ .
భా. రా యు 101.

6. తగ్గు, ఉడించు.

సీ వెడ వీఁట వాఱి నెవ్వడ వడుమోవితో ముడిఁగి వాడినయెల్గు వడఁకు చూప ...
కు సం 5. 549

గీ. గర్వములు వెండువడఁ గౌతుకములు ముడుఁగ, వదటు లాఅఱిపోవఁ బ్రల్లదము అడఁగ, వసుర చిత్తఁబు గావంగ వలవి గాక, సిగ్గుపోయిరి యచ్చర చెలువ లెల్ల .
నృసిం. 2. 90.

"ముడింగె గౌరవంబు." చంద్ర. 3. (శ. ర.)

7. చచ్చు, నశించు.

ఉ డొల్లవు బల్లకోలల ముడుఁగవు మేటి కటారి పోటులన్, ... ఖల్లము లచ్చటన్ హృదయ ఖల్లము లై తగుభిల్లకోటికిన్ .
చంద్ర 2. 10.

ముచ్చెముడుఁగు = అలసిపోవు

ఉ ముచ్చముడింగి యింటిపని ముమ్మర మెల్లను దీర్చి వక్కకున్, వచ్చి ...
కవిరా. 4. 29.

ముడుఁగఁబాఱు = ముడుఁగుటకు సిద్ధమగు.

వ నిద్దనవుముద్దుమొగంబులను దొరగాని సిగ్గునం బోలె ముడుంగం బాఱిననెత్తమ్ము లును ... నీలా. 3 10

సీ అనిశారోమాళి నాస్మలోపల నుంచి మోహాత మోవృత్తి ముడుఁగఁబాఱు ...
చంద్రా. 4. 74

ఔ ముడు గుఁదామర, ముడుఁగుడు, ముడుఁగుపడు ముడు గుబొమ్మంచులు. ముడుఁగుఖ్లుఁ బోవు, ముడుఁచు, ముడుత, ముడుపరి, ముడుపు.

ముడుఁ(ఱుఁ)గుఁదామర. వి (ముడుఁగు + తామర) పొత్తిదామర, నమస్కారి (వ్య. వి.) (శ. ర.)

ముడుఁగుడు వి (బ ముడుఁగుడులు, ముడుఁగుళ్లు.) ముఖము ముడుచుకొనుట (చూ. ముడుఁగుళ్లుఁబోవు.)

ముడుఁగుపడు. అ. క్రి (ముడుఁగు + పడు) చేష్టలుడుగు; చచ్చు.

గీ మోహముఖదుష్టవర్గంబు ముడుఁగుపడియె శమదమాదిశిష్టరక్షణము కలిగె, వళ్ళపరి వారుఁడై జగత్స్వామి యలరె, నింతకంటెను సంతోష మేమి కలదు
ప్రబోధ. 5. 49

ముడుఁగుబొమ్మంచులు. వి బ. (ముడుఁగు + బొమ్మ + అంచులు) వస్త్రవిశేషము

వ ...కరకంచులును బొమ్మంచులును ముడుఁగు బొమ్మంచులును అను పేళ్లు గల పుట్టంబులు గట్టుకొని ...
హ్వా. 3. 188.

ముడుఁగుళ్లుబోవు. అ క్రి. (ముడుఁగుళ్లు + పోవు ) ముఖము ముడుచుకొను, అసహించుకొను.

గీ. అమ్మునీంద్రుండు కడుఁ బేద యగుటఁ జూచి,

తల్లి వేసారికొనెడు చందంబుఁ జూచి, సఖులు ముడుఁగఁ బ్రొఁ బోయెడు సరణిఁ జూచి ..
విప్ర 4 16.

ముడుఁచే=ముణుచే స. క్రి (√ముడుఁగు)

1 ముడుఁగ జేయు

చం. పలికయి పిల్లువాఁకఁ గని ప్రాసెడు నొక్కటి లెక్క యక్కునన్ దల యిడి రెంటి లెక్క యిడినాఁడు ముడించిన కాళ్ల సొంపుచే, నిలిపెడిమూఁటిలెక్క బళి నిద్దుఁ బోవుచు లెక్కమానఁ డీబలకరపుం దపుల్గలుగు బక్క నియోగి యఁటంట్రడు తద్భటుల్
రా. వి 2 71.

ఉ పెంపునఁ జందమాను ప్రతిబింబముఖంబునఁ జుంబనంబు గావింపను రాయఁ దత్కరన వీనరుచు ల్పలితభ్రమంబు పుట్టింపఁగ రోసి పద్మిని ముడించెను మోమునఁ దమ్మి మోడ్పు నాయింపటు నూచి నవ్వె నన నెంతయును న్వికసించెఁ గల్వయున్.
విప్ర 8 ?6.

సీ మెండు మీఱెడు బండికందుల యొఱపునఁ జిలువల యెకిమీఁడు దలలు ముడువ ...
అచ్చ. రా యు. 184, భీమ 4 60.

2. మూటకట్టు.

గీ ప్రాంతమై చీరచెఱఁగున బడుగువాఁడు, హేమ శైలంబు చిదిపి తా లెన్ని ముడుఁచు ...
నైష. 8 148.

కం నెరవుగఁ గొన్ని దినంబులు, నిరతంబుగ నువవసించి నివ్వరియ డుకుల్, దొరకినయట్లు వధూమణి, వరుని కుచేలమున ముడిఁచి పనిచిన యంతన్.
కుచేల. 1 113., హర. 1. 19.

3. నిలువచేయు

గీ అధికభక్తితోడ నమ్మహేశ్వరిదేవి, సిద్ధలక్ష్మి సంభజించి నరుఁడు, నిడివిగాఁగ బ్రదుకు విడువంగ ముడువంగ, బ్రేఁకమైన కలిమి వృద్ధిఁ బొందు
కాశీ 6. 199.

ద్వి కుటిలకుంతల నమ్ముకొన్నధనంబు, వ్యయము గాకుండ సద్వ్యయము ముడిచి, నయ మొప్ప నిచ్చిన నక్షత్రకుండు ..
ద్వి హరిశ్చ ఉ 1211 పం.

4. అపహరించు.

కం నడుపకమీ తెరవొక్కటిఁ, గడుపకమీ శత్రునింటఁ గూఁటమితోడన్, ముడువకమీ పంధనములఁ, నుడుపకమీ యొరులమనసు నొవ్వఁగ సుమతీ !
సుమతి 61.

5 ముడివేయు.

సీ వడిఁ గొల్పి యొకకేల ముడిఁచిన క్రొమ్ముడి, గొబ్బునఁ గటిఁ జుట్టుకొన్న చేలము ..
కా 1 47.

సీ జడముడుల్ వీడిన సవరంగా ముడు చుచు, జిలుగువన్నియల బొంతలు దులుపుచు ....
చెన్న 5 328.

6. తుఱుము, తలలోఁ బెట్టుకొను

కం. మృడ నీతోఁటల పువ్వులు, ముడిఁచినమటి గాని కోసి మూర్కొన్న నరుల్, కడుఁ గాఁగిన సూదులతో, వడవఁగఁ జడి వరకబాధ అందుదురు శివా !
శివ సా. 295.

ఉ పువ్వులు వేడుకైనఁ గడిపోయినవే ముడువఁగ వచ్చునే ..
ఉ హర. 1 73.

కం తొడవులు తొడుగుచుఁ బువ్వులు, ముడుఁచుచు ..
దశకు 10. 7.

7 (కొప్పు) పెట్టు

సీ. ముడువంగ నేర్తురు మూల చాపటికి రాఁ జికుర బంధము లీఁగ జీరువాఱ ... కాశీ. 3. 109.

సీ. ... పల్లెలు కొప్పు విడిచి ముడుఁచు ...
నీలా 2. 85.

సీ. కలదు లేదనుపాటి గారమానె యొకింత వంకించి, తలచిక్కుఁ జాపి ముడిఁచి...
జై. భా. 6. 85

8. (కోపాదులచేతఁ గనుబొమ్మలను) ముడివేయు.

కం కుటిలముగ బొమలు ముడిచెను, గటకటఁ
ఒకఁ దొడఁగెనపుడు కరము వెమర్చెన్
హర 7. 77.

9. బంధించు, కట్టు

ద్వి అరాంకుశ కశుబాలు నాత్మదేహమున, నొక
చోటఁ జెనుటోలనురిద్రాటఁ బెనఁచి, కట్టఁ
బూనిన నింతగడమైనవింటఁ, గట్టిగాఁ గలుగు
పగ్గములనగ్గముల, ముడువ లేమి దయా
ముద్రుండు గట్టు, ఒడిదొ నేమిటఁ బట్టువడని
ప్రహ్లాదుఁడు. అమ క 1. 41 పా. 1 పం.

**ముడుగు** వి అవయవ సంధి

ద్వి మిడుకులు ముడుగులు మొకలు లేఁదొడలు,
దొకలును నొడలును దొనలు కన్గొనలు ..
ద్వి. పరమ 6. 465 పాఁ

**ముడుత** వి (√ముడుచు) 1. వస్త్రపు నెఱి
(శ. ర.)

2 కడుపుమీఁది వళి.

(వ్యవ.) కడుపు ముడుతలు పడినది.

**ముడుపరి** విశే (ముడుపు + అరి[3]) ముడుపు పట్టిన
వాఁడు (వి అ౦ శ ర.)

**ముడుపు.** వి. (√ ముడుచు, కల. త ముడుపు)
1 ధనము

వ గిరీంద్రునకు నుంకువ ముడు పిచ్చి,సంయ
మీంద్రులు పరమానందంబున .. వీర. 3 54.

చం చే,విడిముడి గల్గువాఁడొ దలవెంద్రుక
లంపటురాకుమారికుల్, ముడుపులు నానగాఁ
గురియ ముట్టవు కారణ మేమి కూతురా!
ప్రబంధ 634.

2 దనము గట్టినమూట

ద్వి ముడుపులు కతిరింప మొగి సొక్కుఁ జల్ల,
నడుగు దాఁచుక పోయి యావల నడవ,
నాయంత పొలపరి నలినాయతాక్షి, పోయ
రాజులలోనఁ బొడఁగాన మెందు,
ద్వి నల. 4. 261.

కం నాముద్దుతమ్ముఁ డెన్నం, డేమియుఁ దా
మూఁట గట్ట నెఱుఁగఁడి దేమో, యీ
ముడుపుఁ జూడవలెనని, ప్రామిన కుతుకమున
ముల్లె వదలిచి కాంచెన్. చెన్న 1 115

మ తళుకు న్నెమ్మెడలమీఁది చేడియలచేఁత త్రేట
మిన్నేటిలోఁ, గలయం గానఁబడన్ దదంబు
విహంగ్గందర్పు లీక్షింపఁ ద్వల్లలన ల్గన్గొని
యద్దపు మ్ముడుపు లేలా చూడఁగా నంచు
వాఁరిఁ జూపు ల్మొలింతురు
కవల 1 77.

(అద్దపు మ్ముడుపు = అద్దములో ప్రతిఫలించిన
ధనముమూట, పొందశక్యము కానివని
భావము)

ముడుపుఁగేలు = ముకుళితహస్తము, అంజలి

చం ఇఱుగక యిట్లు నానఖ మూఁది జడ ల్వెడ
జాఱి మౌళిపై, గిఱికొని తోఁచఁగా ముడుపుఁ
గేలఁ దపం బొనరించె భూవరుం,డు ...
కకు 1. 163

**ముడుము.** వి మోఁకాలు, జానువు (శ. ర).

**ముడుసు(డ్సు)** వి 1 ఎముక, అస్థి.

చం .. అమ్మహారథుఁ డు నవ్వుచు భూతపిశాచ
కోటిఁ జూచుడుఁ జని వేయఁ బొచ్చెఁ దివ
సుల్ ధరణిం బడి ఖాతశింపఁగా, ముడుసులు
గుండ్లు దుండ్లు శవముల్ పుఱియల్ సఱియల్
మహస్థలిన్ నరావా. 5 112

ద్వి పెనఁచి వెంద్రుకలతోఁ బెన పెద్ద తలలు,
ముడివడ నేసిన ముడుసులపేర్లు, మెడద్రేల

గీ. కువిటుఁ దవిశినమదిఁ జాటుకొనదు గాని,
వెలసతికిఁ గూర్మి రసికుపై విఱుగుఁదఱుచు,
హేయ మగ ముడ్సు మెక్కిన నిదుఁ గాక,
యొందు శునకంబునకు నెయ్యి యిందు నెట్లు?
కవిక 4 118.

ద్వి జేగురుబొట్టిడి చెవి సంకుగొమ్ముపై, లాగులా
ద్రేలఁ దెల్లనిముద్ది నిల్పి
ద్వి హరిశ్చ. ఉ 1 ... పం.

2. ముడ్డిపూస
(యుద్ధవర్ణనము)

వ. ... బేతాళంబులసందడిఁ దొడికిన మామిడి
సండ్లవడుపునఁ దత్తడి ముకును లెముక
మూలుగలఁ బీల్చు కూశ్మాండంబులను
చంద్రా 6 93

చం. . అతఁడున్, ముడునులు ... ఒడి
మూర్ఛకు మున్ నెగయుగఁ బుంఖముల్,
గనవ ... భా ... యు ...

**ముడేకము.** వి పగాని (చి ని, శ ర)

**ముడ్డి** = ముడి[5] వి గుదము
సీ ముడ్డి మూడి యనంగఁ బొలుచు గుదము
ఆం భా 2 156

**ముడ్డిపూస** వి. (ముడ్డి + పూస) వెన్నెముక
క్రింది చివరిపూస, త్రికము (శ. ర.)

**ముణుఁగు** = ముడుఁగు (ముకుళించు)
గీ ప్రొద్దు వాసినవంతలోఁ బొదలుచుండు,
ముణుఁగు కెందమ్మిరేకులమూఁక యనఁగ.
విరియు చెందొవననలకు వెన్న పెట్టి. నిండె
నెఱసంజ కన్నులపండు వగుచు
యయా. 2 70

కం జలజాతము నగుమొగమునఁ, జెలరేఁగినఁ
గలువ ముణిఁగె సిరిగలవాంఛల్, విలసిల్లిన దిన
గండంబులఁ బొరలెడువారు మొగము ముడుఁ
చుట యరుదే? రా వి 4 81

ద్వి కమలము వికసించెఁ గలువలు ముణిగె . .
ద్వి శ. సా. 3. 88 పా ... పం.

జ ముణుఁగుపడు, ముణుఁగుపఱచు.

**ముణుఁగుపడు** అ. క్రి. (√ముణుఁగు) తగ్గు,
క్షీణించు (చూ. ముణుఁగుపఱచు)

**ముణుఁగుపఱచు** స క్రి √ ముణుగుపడు)
తగ్గించు, క్షీణింపజేయు
సీ చైత్యకాదంబము శ్రావణుస్థాయుఁ గామ
మోహలోభాదుల ముణుఁగుపఱచు ..
మత్స్యపు 2. 122

**ముణుఁచు** = ముంచు[2], ముడుఁచు స. క్రి
ముణుఁగఁజేయు, చూ, ముడుఁగు, ముణుఁగు

**ముతంగి** సం ... ఈ స్త్రీ తెప్పగిసె (వృ వి)
(శ ర)

**ముతరాచే-ముత్తరాచే** వి కిరాతభేదము, బోయ
లలో నొకతెగవాఁడు
సీ ఏకాకిరాయ నీ కోనలో ... ముతరాచ
నీ వల్లపోరను నిలువు ప్రబంధ 198
(ఒక శూద్రజాతి అని శ. ర. బ్రౌ)

**ముతుక** = ముదుక విశ ముదుగు.
సి అట్ట లెత్తినప్రాంత మెట్టులు కడుగుటంబటి
చాటికలతోడి వరువకాళ్లు, నడిప్రాంత ముతుక
గోణమునుమించు దుఃకించు ముసుగత్తి ...
వేం పంచ. 1. 588

**ముత్త.** విశ (క. ముత్తు) 1. ముసలి, వృద్ధ
వృద్ధుఁడు (చూ ముత్తైదువ ; ముత్తాత)
2 ముదిరినది. (చూ, ముత్తాకు.)
జ ముత్తవ, ముత్తవ్వ ముత్తాకు, ముత్తాత ;
ముత్తైదువ, ముత్తో ముత్తో[2]

**ముత్తరము** విశ (మూఁడు + తరములు)
1 మూఁడు వరుసలు.
ఉ అత్తటి వేఁపికాండ్రు యమునాంబుతరంగ
పరంపరాకృతిన్, ముత్తర మైనమూకర సము
త్కరముంగని . మనుచ. 4 40
2 మూఁడు విధములు.
సీ వలకారిదొమ్మి శోఁటుల వల్లడలరేఁపు మసున
కందిచ్చు ముత్తరము తూపు .. ప్రబంధ. 27.
3. మూఁడుపురుషాంతరములు

సీ అయుకఁగిల్మొ న్నముత్తరములథావళి, యంసా
గ్రమున గోసెయుసిమినంచి ... శుక. 2 442

ముత్తరాచే = ముత్తరాజ వి ఒకశూద్రజాతి.
(శ. ర.)

ముత్తటి[1]. వి. (మూడు + తటులు[1]) కాల
త్రయము (చూ తటి[1])

గీ పండ్లు గాయలు చిగుళ్లు, పిందియలు
పూలు ముత్తటులం దసర్చు, నెల్లచెట్టులు నలర
నబ్బల్లిదంపు, కానిరాకాం నెలమిన్కిగోన
మెఱయు అచ్చ రా. బాల. 117.

ముత్తటి[2] వి (మూఁడు + తటులు[3]) స్త్రీల
కడుపుపైనుండుమూఁడుముడుతలు, వళిత్రయము
(చూ, తటి)

సీ కారుణ్యవతులముత్తటులయందముకరంగా
వళితోడ సయ్యాటలాడ .. అని 2 56.

ముత్తవ[1] = ముత్తవ్వ. వి ప్రపితామహి, పితా
మహునితల్లి.

ద్వి ముల్లోకముల కెల్ల ముత్తవన్నాకుఁ, దల్లివి
గాగ నాతల్లి నీయట్టి, తల్లివి గలుగంగఁ దనకు
రోగంబు, లెల్లెడఁ బొదవఁగ నెట్లుండ వచ్చు ?
బస. పు. 3. 402 పం.

2. మాతామహునితల్లి ; తల్లి మాతామహి.
(వా.)

ముత్తవ[2] = ముత్తవపులగము వి. బల, చిట్టా
ముదపుఁజెట్టు.

సీ. ... ముత్తవ యంచనఁ బోలును బల .
ఆం. భా 2. 56

ముత్తవపులగము. వి. చిట్టాముదపుఁ జెట్టు, బల.
(వృ. వి.) (శ. ర , బ్రౌ.)

ముత్తవ్వ = ముత్తవ వి (ముత్త + అవ్వ)
1. వృద్ధపితామహి, పితామహియత్త,

సీ, వరలు ముత్తవ్వ నాఁ బ్రపితామహీసంజ్ఞ ...
ఆం భా 2. 112.

2 వృద్ధమాతామహితల్లి (వా)

ముత్తాకు. వి (ముత్త + ఆకు) ముదురాకు
శా ... ముత్తాకు కుంజముల్
విక్రమసేనము.

ముత్తాడు వి. (మూడు + తాడులు) తాను
నాఁటినతాటిటెంకనుండి మొలచిన తాటిటెంక
నుండి పుట్టి పెరిగిన తాళవృక్షము

గీ అఖిల కల్యాణగుణశీల యాసుశీల. పెట్టెఁ
జేమీఁదుగా నెల్ల చుట్టములకు, భర్తతోఁ గూడ
ముత్తాటిపండు దినియె. నెత్తెమున్మన్మగుబ్బల
నెందజేని పాండు. 4 287

(ముత్తాటి పండుదినియె = పెద్దకాలము జీవించె
నని భావము)

ముత్తాత. వి (ముత్త + తాత) 1. ప్రపితా
మహుఁడు, పితామహుని తండ్రి.

ద్వి. మునుల ముత్తాతలై మూఁడులోకముల,
వినుతి కెక్కిన తపోవృద్ధులు మీరు ...
ద్వి. హరిశ్చ పూ. 83 పం.

మ. మును నారాయణుఁ డేడ నుండు నని మా
ముత్తాత యాత్మీయపుత్త్రుని వేధింపఁగ
నాతఁ డెల్లయెడలందున్ బూర్ణుఁడై యుండు
నంచన .. ఉ. రా 4 20.

సీ. పరఁగు ముత్తాతనఁ బ్రపితామహాభిద ...
ఆం. భా 2. 112

2 మాతామహునితండ్రి , తల్లితాత.

(వ్యవ.) ఈ చెఱువు మాముత్తాత త్రవ్వించినాఁడు.

ముత్తి. వి. (సం. ముక్తిః, ప్రా. ముత్తి) మోక్షము,
నిర్వాణము.

సీ పబల్లిదుఁడు చెవి నిడునక్కరములు చెల్వపు
ముత్తిమేడకు వరుసమెట్టు, లు ....
అచ్చ. రా. బాల. 11.

గీ. ... బత్తిఁ, బత్తి రడిన బుత్తి ముత్తులఁ
రెండును .. నీలా. 1. 118.

ముత్తిక. వి. ముట్టడి (చి. ని.).

కం. ముత్తిక వేయించినదితి, జో త్తముఁ డిఁచుఁగయు
బెదర కుచ్ఛటధీరో, దా త్తమతి నగరుసొఁక వి,
యత్తటి నటు నూఱుగవనియందె పసించెన్ ...
కువల. ౬. 8.

ముత్తిగ వి (మూఁడు + తిగలు) తొమ్మిది

గీ. ముంపుదులకించుముత్తిగమానికముల, మొలక
నిద్దాక డానిసొమ్ముల మెఱుఁగు, ఉమ్ముదిగఁ
గ్రమ్మి నెమ్మేన నొఅపు చూప, రాజవరుఁ
గాంచె లేచి యా రాజవదన. ౬సిక. ౯ 47.

గీ. మఱియు వెలలేని ముత్తిగమానికముల, యంద
లంబులు నుయ్యెల లరదములును, గవని
కట్టులుఁ బెండియల్ గద్దియలును, జాలుఁ
జూచుచు నంగ లోపలికిఁ దూ ఱె.
అచ్చ. రా సుం 9

ముత్తియపుఁగమ్మ వి (ముత్తియము + కమ్మ) స్త్రీభూషణవిశేషము, స్త్రీలుధరించు నొకవిధమగు వగ

సీ. .. చెవులను బవిరెలు కమ్మలును ముక్కు-
ముక్కెర లద్దకమ్మలు ముత్తియఁపుఁ
గమ్మలు ... చెన్న. 2. 207.

ముత్తియము — ముత్తెము, ముత్యము. వి. (సం. మౌక్తికమ్, ప్రా. మోత్తిఅం, క. ముత్తు) ముత్యము.

గీ . చందనమునఁ, భరిణయాగార మలుకంగఁ
జాణ యాణి, గలుగుముత్తియముల ముగ్గుగా
నొనర్పఁ, జతుఁ పుణ్యా-గనాఒనతతిఁ
బొనర్చె .. భార. విరా 5 886.

కం. కరవాఁడినూదితుద మొన, నఁ దలువంబడిన
ముత్తియంబును బోలెన్ ... ౼ష 8 6

గీ పడుచుపనిచేసితివి రేఁగుపండ్లకొఱకు, ముత్తి
యంబులు వెలవోయ ములుచ గలఁడె ...
జై. భా 5. 59.

జ ముత్తియపుఁగమ్మ.

ముత్తు 1 ప్ర. ముపర్ణకము, అదంతము లయిన అమహన్నపుంసకములకుఁ ప్రథమైకవచనమున వచ్చు ప్రత్యయము.

(ఉ. వనము, ధనము మొ.)

కం. అమ్మమ్మ యోఁతసాహస, మమ్మాటకముత్తు
రాదె యమహత్తొటన్, మమ్మును లక్ష్యము
సేయక, బమ్మెః గొల్చెద పఁటంచు వాఁలు
వల్కన్. వాఁవ్య. 4 163

(ఈ యర్థమున నీకవి యొకఁడే వాడి యున్నాడు)

2 ప్రార్థనాద్యర్థక మధ్యమపురుషైక వచనబహు వచనములకు నుజీ, కఁజీ, వడుజీ మున్నగు ప్రత్యయములకు ఆంధ్రవ్యాకర్త తేర్పఱచిన సంకేతము.

ఉదా. చేయుము, చేయన్ మొ.

ముత్తునియ(లు). వి. (మూఁడు + తునియలు) మూఁడు ఖండములు.

సీ. .. శక్తి, గొని భగదత్తుండు దనుజభంజను
వైన నడుమ ముత్తునియగా నఱకి పార్థుఁ
డాతపత్రంబు దునిమిన ...
భార. ద్రో. 1. 353

కం. నరుచేతివిల్లుఁ బలుకయు, మురహరుఁ డొక
శరముచేత ముత్తునియలుగా, ధరఁ బడ
నేసిన .... గయోపాఖ్యానము 2 అ.
భార. భీష్మ. 2. 79.

ముత్తుము. వి (మూడు + తూములు) పంద్రెండు కుంచముల ధాన్యపుమానము, అథకత్రయము

వ. . డాకరేమి అయ్యపాలమున ఊరి దక్షిణ దిక్కున గొల్లపల్లు తూర్పున సీమచేవి . యినపరెకాస్యతోట నేలఒకపుట్టిముత్తుము వడ్ల వట్టు వేయిమ్రాంకులతోడం గూడం గుఱోత్తుం (గ్గచోడ)శత్రమునకు నాచాంద్రార్కమునకు నిచ్చిరి ... ద. భా. 4. 1016.

సీ. ... భార్యధకి ముత్తుమం చనఁగఁ జెల్లు.
ఆం. భా. 2. 271.

ముత్తెపుఁజిప్ప. వి. ముత్తెము + చిప్ప)

1 శుక్తి, ముత్తెములు పుట్టునట్టి యోనిస్థానము (ఆలిచిప్పవంటి) గుల్ల

చం. తామ్రమపర్ణికన్, బొగడతకెక్కు క్రొత్త
తెలిముత్తెపుఁజిప్పలు చేతు బంధనా, ద్యగణిత
తావకీనవరితాఙ్జితకీర్తిక చిన్ వెలి గడన్
ఉ రా. 7 164

ద్వి ముత్తెపుఁజిప్పల ముడిచుమోము, క్రొత్త
సీలపు రంగు గులుకుచుండోయి
ద్వి హరిశ్చ పూ 666 పం.

2. ముత్తెపుఁజిప్పవలెనుండు భక్ష్యవిశేషము

వ వెన్న మెఱుఁగులునిడికుడుకలు లడ్డుకుడుకలు
ముత్తెపుఁజిప్పలుఁ జంద్రకాంతలు .. ఉదిగాఁ
గల భక్ష్యంబులు .. హంస 1 105

వ ఇడ్డెనలు తేనెతొలలు గురుగు లేఁకికాయలు
వెన్నమెఱుఁగులు నిడికుడుకలు లడ్వాలు
ముత్తెపుఁజిప్పలు చంద్రకాంతంబులు ..
ప్రబంధ 116.

**ముత్తెపుఁబంట** వి (ముత్తెము + పంట) ముత్యములు పండునది, చెఱకు

మ వనితాముత్తెపుఁబంటవింటి మొగలీవజ్రీ డు
సత్యా. సాం 8 34.

**ముత్తెపురిక్క.** వి. (ముత్తెము + రిక్క) చిత్తానక్షత్రము, చిత్త (చూ ముత్తెపురిక్క నెల.)

**ముత్తెపురిక్కనెల** వి (ముత్తెపురిక్క + నెల) చైత్రమాసము, చాంద్రమానమాసములలో మొదటిది (శ. ర.)

**ముత్తెపుసవతు** వి (ముత్తెము + సవతు) ముత్యమువలె నుండుచుక్క, చిత్తానక్షత్రము (శ. ర )

**ముత్తెము = ముత్తియము** వి (సం ముక్తా, ప్రా ముత్తా, క. త. ముత్తు; బ ముత్తెములు, ముత్తెలు) ముత్యము.

సీ. అలుతఁ దగిల్చినయాణిముత్తెపుఁబేర్లు హారినీల
హారంబులై తనర్చె .... విక్ర 1, 139.

సీ తీయచ్చిన్నసూత్రమునఁ జిక్కక ముత్తె
ములు రాల గంగరికలు వహింప ..
ఉము 1 60

సీ ...సహ్యాణి ముత్తెం మోముముట్టను శ్రీక
ర బం హారిక వెలయ ఇందు 2 54

సీ, సమస్త ... పార్శ్వస్థిత విమలతార కాగ
ణము ... ముత్తెలక్ష్మ ... నతి కుతు
... దాల్చెఁ దదంతిస్థ, పరిధిరేఖాగ్ర
శృంగా ... ఖాన మమ ల వి 5 50
ఆం భా 2 276

విణ ముక్తామయము

మ తళుకు మ్ముత్తెపు మోదకంబు దగ శృంగారం
బుగాఁ జేసి దశా. 1. 7.

జ. ముత్తెపుఁజిప్ప ముత్తెపుఁబంట, ముత్తెపురిక్క
ముత్తెపురిక్కనెల, ముత్తెపుసవతు, ముత్తెసరులు.

**ముత్తెలపందిళ్లు** వి. బ ఒకమాదిరివస్త్రములు, వస్త్రములలో నొకభేదము

సీ ముత్తెలపందిళ్లు ముత్తరిగోగ్రహణంబులు కర
కంచు నాచువన్నె ప్రబంధ, 272

**ముత్తెసరులు.** వి బ. (ముత్తెము + సరులు)
1 ముత్యాలహారములు. 2 ధాన్యవిశేషము ఒకదినుసు వడ్లు.

సీ సరి లేని తెలిముత్తెసరులకొటారు కల్యాణ
పరంపరలతోలుదీవి . వసు. 1 93

(పై రెండర్థములకు ముదాహరణములు.)

వ .. బంగారుతీగ లిప్పపూరాజనాలు పుష్ప
మంజరులు కస్తూరి నిగరాలు ముత్తెసరులు ...
అను నూటనాలుగువగల పైరుల చేరుడు
బియ్యంపు ప్రసాదంబులు ... ప్రబంధ. 112

గీ అంగడులఁ జేల దద్దయు రం గెసంగి, ముత్తె
సరులును బరువంపు ముత్తెసరులు, వఱలఁ
దరణి సిరులఁ బల్మఱును మెఱసి, ... లరు
వేల్పురానెల వీడు గాఁగ
అచ్చ. రా. బాల. 3.

(ఇది 1 వ యర్థమునకును ఉదాహరణము )

ఉ పోటున వేటునం దిరిగి బోరగిలం బడి యున్న దానవుం, గాటుకకొండ నెత్తు వెలిగొరు తెఱం గున నెత్తి త్రిప్పి చె, గ్లాటము చూపి వీఁడు మునలా మన కంచు బలుండు సంగరా, ఘాటము దాంట వైచిన దిగబడెఁ గ్రోళ యుగంబు చక్కటిన్ ... ఉ. హరి, 4 269.

(వీఁడు మొదలా, వావిళ్లపా.)

3 గనిమ చేరక నేల (శ. ప్లై.)

జ. మట్టముదలించు, ముదలకించు, ముదలపెట్టు, ముదలించు

**ముదలకించే** స త్రి. (√ముదల) 1 ఎత్తి పొడుచు

కం దంచుం జరఘాంచలములఁ, గించుఁదనం బంచు ముదలకించున్ ముంచున్, నొంచున్ విదళన చుంచూ, దంచచ్చంమాపుటస్ఫుటాఘాత ములన్ రామా. 5. 198

(మార్కొను అని శ. ర.)

వ అని ముదలకించి యవ్వీరభద్రుండు రౌద్రో ద్రేకంబునఁ బ్రళయకాలరుద్రుండై ... వీర 4. 109.

2 ఎదురుకొను, మార్కొను

వ ... తలచుటూర్పుల పెంపున నుత్కంప మానంబు లగుచుఁ జెన్నొందు చిన్నిజక్కవ కవలకెలంకులఁ జొక్కపుచెక్కులకదలిక పొద లికల ముదలకింపుచు నిగుడు నిగనిగల తరఁగల య దంబునందిదండలతళుకులకుఁ జెలికా డంబు నెఱప ... కళా 6. 224.

3 వర్ణించు, ప్రశంసించు.

ద్వి .. నాకులస్వామి, మొదలైన దివిజులు మునులు వేదములు, ముదలకింపఁగ రాని మూర్తివి నాకుఁ, బ్రత్యక్ష మైతివి పరమ కళ్యాణ, మూర్తి ...

ద్వి పరమ 8. 220 పా.

**ముదలపెట్టు** స. త్రి. (ముదల + పెట్టు) ఆజ్ఞా పించు

గీ . రుద్రుండు వచ్చి తనకు, మ్రొక్కి నిల్చిలఁ గూర్చుండ ముదలపెట్టి ... వరాహ 10 5

సీ. ముదలపెట్టక నీరమును వ్యయింపఁగ రాదు కోపించె నని మదిఁ గుంద రాదు ...

రుక్మాం. 4. 83.

గీ. కరుణ నంతమాత్రపుచూడిగంబు సాకు, ముదల పెట్టుఁ దఁటంచుఁ గే ల్మోడ్చి మిగుల, వినయ మొప్పఁగ నాయింతి వేఁడు కొనియె ..

కళా. 1 84.

**ముదలించే**. స. త్రి (√ముదల) 1 ఆజ్ఞాపించు, శాసించు.

ద్వి ఇది యేమి రఘురామ యెల్లలోకములు, ముదలింపఁ బురుషోత్తముఁడ వైననీవు, ఈ మోహశోకంబు లేల తాల్చెదవు ...

రం. రా. కిష్కిం. 198 పా. 20 పం.

2. ఎదురాడు, వ్యతిరేకముగాఁ జెప్పు,మార్కొను ప్రతిఘటించు.

ద్వి. మోసపోయితి నిన్ను ముదలింపలేక, నీసత్య సంపద నిన్నింత చేసె ..

రం రా. అయో 128 పా 8 పం.

కం. ఎదురెదురను ముదలింపఁగ, మదిఁ గొంకి పిఱిందివలన మందగతిం జే, రెద నేమటి యున్నెడఁ బ, ట్టెదననుచుగఁ బుష్పకంబు డిగి వచ్చుతఱిన్ ... నిర్వ 7. 78.

ద్వి. ముదలించి తేకరాముని డాగురంచి నుదతి నీళ్ఁగిఁ దెచ్చుట బంటుతనమె ..

రం రా ఆర 181 పా 16 పం.

కం తనకొఱకుఁ గఱకురిపులం, గని యని ముద లించి పొలియుఁగన నర్కధన్, గనుఁగొనక మనుజపతికిం, దనమేనిం బోలెఁ బ్రోవఁదగు భటపంక్తిన్ వేం పంచ 1. 520.

3. ప్రశ్నించు, అడుగు

ద్వి అని తన్ను ముదలించుచును నెట్టయెదురఁ, దనతొంటిభావంబు దాల్చినఁ జూచి ...

బస. పు 3 1147 పం, బస పు 5 319 పం.

4. (బాణాదులు) ప్రయోగించు వేయు.

ఆ త్రిశిరుఁ డంతరు గనలి దివ్యాస్త్రసంపద. రాముమీఁదఁ జూపి ఱంత మొనర్చె, మూఁడు శరము లతఁడు ముదలించి యట వాని, మూఁడుతలలఁ ద్రుంచె మొగ్గరమున ... మొల్ల. రా. అర. 13.

5 సంతోషపెట్టు. సంతసింపఁజేయు.

సీ. .. ఒకఁడు పదప్రౌఢిమకు నిచ్చలో మెచ్చు, నొకఁడు జాతిశ్లాఘ కుబ్బుచుండు

గీ .. వంగువైఖరిఁ గుజాతి, జాడ నిందటిముద లింపఁ జాలు టెట్లు ... వేం పంచ. 1. 14.

ముది విశ. (√ముదియు. క. ముదు , త. ముది యన్) వృద్ధు,ముదుసలివాఁడు · వృద్ధ,ముదుసలిది , వృద్ధము, ముదుసలిది , ముదిరినది.

ఉ ఇమ్ముదివెట్టి వీనిఁ బరమేశ్వరుగాఁ గొని యాడె ... భార. సభా. 2 39.

చం అనుటయు వాంఛఁ డిట్లను జనార్దనుతో ముది జోదు భీష్ముఁ డొద్దనఁ బని లేదు ... ఉ హరి 4. 131.

గీ. ... తాఁ బోనిచో సారె పిలువ నంపు, మచ్చిక యొనర్చె నమ్ముదిమాయలాఁడి .... శుక. 1. 39

సీ చుట్ట చుట్టుకొని శేషుఁడు నిద్రపోవును, ముదిపన్నగములలో మొదటివాఁడు ... వసు 1. 82

గీ అహహ ముదిగొట్టు నెక్కి భిక్షాటనంబుఁ, జేయఁ బోవుట యదియు మేల్పాయ చువ్వె .. హర. 4. 28

వి. ముదిమి, వార్ధకము.

చం. ముది మది చప్పి తోయి మునిముఖ్య ! ... ఆము. 6. 113.

సీ అచటివిప్రులు మెచ్చ రఖిలవిద్యాప్రౌఢి ముదిదప్పినమొనటి పేల్చు .

వసుచ 1 50.

ముదిగారము. వి. మౌర్ఖ్యము, మొఱకుదనము. (శ ర.).

ముదిత. వి. 1. స్త్రీ. ఆఁడుది.

కం. గద విసర వైచె నరకుఁడు, వదలక సతి దునిమె శక్తివైచెను దితిజుం. దది ముదిత దుముకు సేసెను . . ఉ హరి. 1 166.

గీ. మేపుదము పీనిలో నున్నమృగశిశువున, కది ప్రవర్ధన మందెనే ముదితలార !, మండలం జెల్లఁ దానయై యుండు ... నైష 1. 126.

కం కడు నవ్వించుచుఁ దెలుఁగులు, ముడివెట్టం జేరటాఁడు ముదిత కనుబొమల్, ముడి వెట్టె నాలిసిగ్గున . . మనుచ. 5 94

2. భార్య

సీ ముదితకై యఁటమేని నొదవినకామారి యాత్రి తనుజుఁ డైనట్టియుగ్రుఁడు .. దశా 3. 61.

ముదిత. సం. వి ఆ స్త్రీ. ఆనందము, సంతోషము (వాచ.)

ముదితము. సం. విశ (అ. ఆ. ఆ ) సంతోషించినది, ఆనందించినది

వి అ న 1. సంతోషము, ఆనందము · సుఖము.

2 ఆలింగన విశేషము , రతాలింగనభేదము.

ముదిమి. వి· (√ముదియు, త. ముదుమై) ముసలితనము, వార్ధకము.

ఆ యదువు దొట్టి సుతులు ముదిమికి నోపక ... భార. ఆది. 3 95.

చం. ... నా, ముదిమియు నీకుమారుతనమున్ వరుసన్ విజయుం డెఱింగెడున్ ... భార. ఉద్యో. 4. 246.

ఆ. రసరసాయనాఖ్య రత్నద్వయము దెచ్చి·

యందు ముదిమి నొకటి యపనయించు, నొకటి చాల సిరుల నొందించు నని చెప్పి, యిచ్చి యమున నీకు వచ్చె నృపతి .. విక్ర. 2. 163.

సీ ముదిమి ముప్పునఁ దగు ముసలితనము ... ఆం భా. 2. 118

**ముదియ = ముద్దియ** వి (ప్రా. ముదిఆ, ముదియా స్త్రీ) ఆఁడుది

కం రేయుం బవలును మెఱయును, మ్రోయుచు నావిరులకలిమి ముదియలు దమ్ముం, జాయక యు డగఁ బరిరం, భాయతభోగరుచు లొదవె నాత్మేశులకున్. హరి. పూ. 6 112.

కం. ఓముదియ నీవు గొట్టిన, నే మగు నెవ్వారి కైన .. విక్ర. 4 61.

**ముదియు** అ క్రి (క ముదు త. ముదిర్.)

1. ముదిమి నొందు, వార్ధకము నొందు

గీ ముదియ మతి దప్పి నోరికి నొదవినట్లు, పలుకు వెడఁగుమాటలు పాటి యగునె .... భార. ఉద్యో. 4. 248.

సీ వాని, పాలు ద్రావినవారు బలము సత్యము నెక్కుడై యెన్నఁడును ముదియక సుఖింతు, రని విని నతనిఁ గయ్యంబున నోడించి యైశఁ దే వలయు నా కవి ప్రియమున .. హరి ఉ 8 250.

ద్వి ముదిసితి భూభారమునకంటె ఘనతఁ, బొదలు జరాభారము నుదాల్చకతన .. రం. రా. అయో 86పా 7 పం.

గీ ముదిసి ముప్పునఁ బెండ్లికై మొగము వేల్పు, దగవు గాదని రాఁ డయ్యె దాతవేల్పు .... నైష 4. 129.

2 శిథిలమగు, జీర్ణ మగు.

గీ విడువ రాదు దుర్మతులకు విడలు ముదియఁ, దాను ముదియదు ప్రాణాంత మైనరోగ. మనఘ తృష్ణ ... భార. శాం. 5. 377.

కం అది యట్టిద సంసారము మొదలుఁ దుదియు నొక్కరూప మోహం బెచ్చో నదలదు తృష్ణయు నెన్నఁడు, ముదియదు, సదువులను నిట్లు మును గని రార్యుల్ హరి ఉ 5 189.

కం ముదిమి సుమీ చేఁత యాస ముదియక యున్నన్ . సుద. 2 196.

జ ముది ముదిమి. ముదివాడు, ముసుక, ముసుకఁడు, ముదుసలి, ముద్ది

**ముదిర** సం వి అ స్త్రీ. కాముకి, స్త్రీ

కం. ఆకదురునఁ బికరవమును, నాకదురున భృంగరవము నాత్మగవంబున్, పకీకృతముగనేకుల, నేకులు వినవడికె ముదిర యేకులముదిరా? వీథి. 34.

**ముదిరము** సం వి అ పుం 1 మేఘము, మబ్బు. 2 కప్పు

**ముదిరుఁడు.** సం వి. అ పుం కాముకుఁడు. (మే వి, ఆ ని).

**ముదివాఁడు.** విఙ (ముది + వాఁడు) వృద్ధుఁడు, ముదిమినొందినవాఁడు

శా అన్నా నే ముదివాఁడ లేవ వడి లే డెందెందో నీ వేగఁగా సన్నాహంబున వచ్చి నాఁడవు .. సమీర. 7 65

సీ. ముదివాఁడు ముదుసలి ... అలరు వృద్ధాభిధ .. ఆం భా. 2 119

**ముదిసెలి** వి. కార్యకర్త

వ. ... కులోత్తుంగచోడ గొంకరాజుల ముదిసెలి తలయంట్ల ముద్దనాయకుణ్డు శ్రీ భీమేశ్వర మహాదేవరకుం బెట్టిన అఖణ్డవర్తి .. ద శా. 4 1165.

వ. .. శ్రీమన్మహామండలేశ్వర కులోత్తుంగ్గ చోడగొంక్కరాజుల ముదిసెడ్లు దారపనాయకుండును జామెన పెగ్గడయును ద. శా. 4 996

వ. .. కన్యసంక్రాన్తి నిమిత్తమున స్థానపతులు నారుద్రదేవర ముదిసెలి సుప్పు నాయకుణ్డు శ్రీభీమేశ్వరం మహాదేవరకు నిచ్చిన అఖణ్డవర్తి లోహదివియ 1 కి ... ద. శా 4. 1013.

ముదుక = ముదుకఁడు. విశే. (ముదియు) వృద్ధుఁడు, ముసలివాఁడు.

కం. పదునాల్గు మహాయుగముల, ముదుకఁడగు భీమేశ్వరునకు మొగచాలై యుండెడు సాని పెండ్లి యెప్పుడు, నది దక్షారామమహిమ మగునో కాదో ... భీమ 1 112.

కం. ... దశాననా ముదుకఁ గాన మఱఁదోఁ, చినచందం బగునో కాదో చెప్పితి సీకున్ భా. రా యు 4 ?8.

సీ .. నందగోపుఁడు, మొదలుగాఁ గల్గొల్ల ముదుక లెల్లఁ, గడుఁ బ్రోవ్వి .. హరి పూ. 7 157.

2 దళసరియైనది, మోటయినది

ద్వి ముదుకకుప్పసములు ముదముతోఁ దొడిగి, ముదిసిన రాక్షసముగ్ధలు నడువ. రం రా. యు 516 ?? 61 ??

ఉ వేసరి యే మటన్న నిలు వెల్వడఁ జాలఁడు చేత నంటిమా, దాసరి బుట్టయున్ ముదుక దావళి దట్టియుఁ గాని కాన మో, కేసరమధ్య నీప్రతిన గెల్చె ... వైజ 3 94.

గీ పరికతలగుడ్డ యొకపాటి పచ్చడంబు, ముదుక నీర్కావిదోవతి మొలను సంచి, తిత్తి పెండుం గటము బ్రేలహత్తి యొప్ప, నుండు శరుఁడను పేరనియోగి యొకఁడు. హంస. 4. ?6

3 సాంద్రమైనది , చిక్కనిది

వ ... ముదుకవెన్న లంటుకొని మొదుక నయి పిడిచినం బోలవలచు చుంచుతలలును ... హరి. పూ. 5 ?43

సీ ముదుక గాకుండఁ బయ్యెదలోనె కేలార్చి కలయఁ జంటను నొంటఁ గలప మలఁద ... ఆము. 1. 60.

4 లావు, స్థూలము, పృథులము.

(దీనికి నిగాగమము నొక్కచోఁ గానవచ్చుచున్నది.)

?? ... కొక్కెప్పిపము, ?? గ ?? వలసి కన్నోడ్వ, గడియఁ గాచన కుంభకంబు నంబు లైన, ముదుకని చన్నులమొన లొత్తి దిగిచి, ఒలువిడి నద్దఁరల్ ?? ?? వేఁపుచు జనముల మేల్కొల్ప దెలిసి .. ?? రా ఉ 80 పొం. ?? ??.

వ్రాత సన్నబియ్యమునన్న ముదుకబియ్యము పెట్టుతకువ

ముదుకఁడు = ముదుక విశే ముసలివాఁడు, వృద్ధుడు

చం ముదుకఁడ నైన నాదు ఒలము జేఁతున్ విపిదాస్త్రశస్త్రసంపదయును బోయి సీ గుడుఁడు భార్గవుచే విను ... భా ఉద్యో 4 246.

సీ ముదుకని మస్తకంబునకు దాపున నూఱు కాండముల్ దలగడగా నమర్చి జై భా. 2 89.

కం ఇది గాంధర్వవివాహము, సుదతీ మనకిపుడు సాక్షి సూర్యుఁడె యన నో, ముదుకఁడ నీకొడ దీటిన, వదలెద వే నొల్ల ననుఁ బ్రవాళాధర యున్ ... భోజ. 7. 115., భాగ. 10. పూ. 1288.

ముదుకసరులు. వి. బ. ధాన్యవిశేషము

సీ గరుడసరు లోత్తుగంటరాజనములు మోఁదుగ తొడిమలు ముదుకసరులు హంస 4 128.

ముదుగు విశే ముదుక, దళసరి

రగడ. మూల కొదిగెఁ దుది ముదుగుంగోకల్, సాలిఁ దాఁచెను సన్నపుఁ జేకల్ ... బహు. 2 18.

వి మోటుమాట, కఠినోక్తి.

ఆ తొత్తుపేరఁ బెట్టి దొడుకుపేరను బెట్టి, పిల్లి కూనపేరఁ బెట్టి యిల్లు, వెళ్లఁ దే దటంచు మెల్లన ముదుగులు, పాఱవిడుచుచుండుఁ బాటఁ బాట. వైజ 3. 98.

సీ. ఉపబర్హ మెగఁద్రోయ ను కించి మోముపై

మోముఁజేర్చినఁజూచి ముదుగు లాఁడు ...
హంస. 3. 201

ముదుటుంగరము = ముద్దుటుంగరము.

ఉ కానకుఁ గోంచుఁ బో యిపుడు గాల్లను జేతులు గోయుఁ డంచు లో, నూనినకిన్క రాజు ముదుటుంగరమిచ్చెను . .
సారంగ. 3. 26, 3. 22

ముదురు. అ. క్రి. 1. లేతదనము వీడి పరిణతి నొందు

సీ. సడలిన నిడుదకెంజడలును ముదురఁ బండిన నాఁచుదీఁగలుఁ బెనఁగొనంగ ...
పారి ఉ 7 74

కం. ముదిరిన రేయెండలచే. నెద వడ దాఁకంగఁ గొమ్మయెద వడఁ జొచ్చెన్ ..
కళు 3 107.

2. హెచ్చు. అధికమగు.

కం. అని యా రాజకుమారుఁడు, కినిసి పలికెనపుడు వారికిని మాకును నీ, వనితకు వాదము ముదిరినఁ; జని చెప్పితి మప్పురంబుసభవారలకున్.
భోజరా. 7. 79

సీ. అనఘ మహోదరవ్యాధి నాతనువున, నొదవి యంతంతకు ముదురఁజొచ్చె ..
నా పంచ. 4 81.

గీ. వీరశైవంబు ముదిరి యేవేళనైన, హరహర శివా మహాదేవ యనుచుఁ బల్కు ..
హంస. 3 189.

3. పెరుఁగు, వృద్ధిపొందు.

గీ ధనమదంబును వేదవిద్యామదంబు, మోహ లక్ష్మిమదంబును ముదిరి కాదె, కాశికా పట్టణంబునఁ గరుణ లేక, బ్రాహ్మణులు నన్ను నిటు భంగపఱిచి రకట !
కాశీ. 7. 155

గీ. వెఱ్ఱిశైవంబు ముదిరి మద్విమతి వినుఁడు ...
ఆము. 4. 42. మనుచ. 5. 27.

4. ఒదుగు, ముడిఁగియుండు

కం అదురుదురే పగదాయకుఁ, జెదురుదురే ధైర్యలక్ష్మి; మెదలి జీవితవాంఛన్, ముదురుదురే మూలల నరి, కెదురుదురే కాక శూరు లెచ్చో నైనన్.
చంద్రా. 6 96.

విశే. 1. లేఁతతనము వీడినది.

గీ. ముదురుఁదీవెల బిగువుగా మోపుఁ గట్టి ...
హర 1 21.

సీ. కంబు సౌందర్యంబుఁ గబళించు కంఠంబు ముదురు చందురుఁబోలు ముద్దుమోము . .
హ. వరాహ 2. 27.

గీ ముదురు మంకెనపూవు కెమ్మోవి గాఁగఁ, దములు చూపఱఁ గొలిపెడు కొమరుఁ దవవు, జోగురాలును బోలెను జాగు మీఱు, కొలను గాంచిరి మదిలోనికోర్కు లలర ...
యయా. 3 55.

వ. ఖిల్లపల్లవాధరలు భల్లవరంపరలన్ బగిలించిన ముదురు వెదుళ్లనుండి జల్లున రాలి . .
ఉ రా 4. 163.

2. మిక్కుటము. ప్రబలినది, అతిశయించినది.

గీ. ముదురుటూర్పులు గెమ్మోవిపదను దివియఁ, జెమటచిత్తడి చెక్కులఁ జిప్పిలంగ, నున్న తన్వంగి భయ మేద నుపచరించి, యింపు రెట్టింపఁ దెరువరు లిట్టు లనిరి. విక్ర. 7. 102.

ఆ. ఎదురు లేనిభక్తి చిదురుపగానీక, యదరు బెదరు మదిని గదురనీక, ముదురుకరుణ నన్నుఁ జదురుగాఁ బెనిచెదు గదుర మద్వ్రతంబు గాచుకుదుర,
చెన్న 4. 129.

3. చిక్కనిది, సాంద్రము.

సీ. చంద్రకాంతపునీటజాలైనవెన్నెల, ముదురు వెన్నెల జుట్టఁ బదనుఁ జేసి .. పారి. 2. 48

సీ. గదురుకంపు గడించు ముదురు క్రొంజెమటలఁ జొనుపు వుక్కిటిలోనిజొల్లు విడెము ...
చంద్రా. 2. 40.

4. ముదిమిఁ జెందినది , వృద్ధము.

లింగము (వృ వి)

పుం న ఒకజాతిమల్లి (వృ. వి),

**ముద్గలము.** సం వి. అ. న రోహిషతృణము, ఒకఁనుసుగడ్డి (వృ. వి).

**ముద్గలుఁడు** సం వి. అ పుం ఒకానొక ఋషి

**ముద్గష్టము** సం వి అ. పుం వనముద్గము, అడవిపెసర (వృ వి.) (వాచ.).

**ముద్ద¹** వి (త. ముత్తై) కబళము, కడి.

కం. . గొబ్బున నొకముద్దఁ జేసి కొని మ్రింగుఁ జుమీ ! .. సీలా. 2 ౬౯.

గీ. మెదడు ముద్దలు గావించి మెసవి మెసవి .. ఉశా 2 4౬౯, ఆం. భా 2 260.

2 పిండము, ఉండ

కం. లోహమయదైత్యనగరీ, గేహంబులు పావకాగ్నికీలాజ్వాలా, దాహమునఁ గరఁగి మూఁడుస, మూహములై పెద్ద పెద్దముద్దలు నయ్యెన్ ... భీమ. 4 141.

కం మానక నిను దూషించుచు, మానిని విను ముద్దె జేసి మన్ను గొనంగా, నానాఁటికి నాసీచుల, చే నది యంతయును బోపుఁ బెడి పుడికిల్లన్ భోజరా. 8 90.

జ ముద్దకమ్మరి. ముద్దకవ్వము, ముద్దకూడు. ముద్దికొలిమి, ముద్దగించు. ముద్దీఁకె

**ముద్ద²** విశ (సం ముగ్ధా, ప్రా ముద్ధ) ముగ్ధ, అమాయకురాలు, గోల. (చూ. ముద్దరాలు.)

జ. ముద్దరాలు, ముద్దతికము, ముద్దియ,

**ముద్దకమ్మర.** వి (ముద్ద¹ + కమ్మరి.) జాయి కరఁగి యినుము చేసెడియొక్కజాతి (ముద్ద కమ్మరివాఁడు. శ. ర.)

**ముద్దకవ్వము.** వి. (ముద్ద¹ + కవ్వము) మ్రాని బిళ్ల తగిలించినకవ్వము (శ. ర).

**ముద్దకూడు.** వి కబళాన్నము, మాధుకరాన్నము.

సీ. హీనవృత్తిని బిచ్చ మెత్తి గోడలు దాఁటి ముద్దకూళ్లకుఁ బోయి మొత్తులఁ బడి .. వేణు. 41.

**ముద్దకొలిమి** వి (ముద్ద¹ + కొలిమి) జాయియినుముగా కరిగెడికొలిమి (శ. ర.).

**ముద్దగించు.** అ క్రి (√ ముద్ద¹) ఘనీభవించు, గడ్డకట్టు

ద్వి ధృతి ముద్దగించిన దివ్యామృతంబు, లత గరిగొన్నమూల స్తంభ మనఁగ . పండితా దీక్షా ౬ పా.

**ముద్దట** వి పిడుక

కం. గుడిలో ముద్దట లఱచిన, గుడిలో వెంట్రుకలు వాచికొనినను నెపుడుం, గడు వెఱవక వర్తించిన, గడునరి నరకాగ్నిశిఖలఁ గ్రాలు మహేశా .. శివ సా. 293.

**ముద్దయ్య.** వి (ముద్దు + అయ్య) కుమారస్వామి (శ ర)

**ముద్దరాలు.** విశ (ముద్ద² + అలు బ ముద్దరాండ్రు) ముగ్ధ, గోల.

చం ఇది గడు ముద్దరాలు పను లేమియుఁ జేయఁగ నేరదంతయున్. మృదు వొకకీడుపాటునకు మేకొనఁ జాలదు ... భార. విరా. 1. 103.

ఆ చాల ముద్దరాలు జవరాలు గోమరాలు, నీకుఖాత్మురాలి కెవ్వఁ డొక్కొ, మగఁడు చెప్పు మనిన భాగ. 9. 72 ఆం భా. 2 105.

(ముద్దురాలు = మనోజ్ఞురాలు శ. ర పా)

వి. స్త్రీ, ఆఁడుది

కం మీలుం దామరపూలున్, మే లగునమ్ముద్దరాలిమినుకుఁ గనుఁగవన్, బోలక నీట మునింగెన్, మూలకు దొర గాక యుర్లు మూలకుఁ జేరెన్ అచ్చ రా. బాల. 181

మ. సరసిం దోఁచినముద్దరాండ్ర మొగముల్ సత్యంబుగా మించుతా, మర లంచున్ బరువెత్తఁ బోయెడు మదోన్మత్తద్విరేఫంబులు ... ఉ. రా. 6. 84.

సీ. . . ముద్దాడుఁ బులి లేఁటిముద్దరాలి .
కాశీ 2. 48, దశా. 9. 84

ముద్దఱికము వి (ముద్ద[2] + ఱికము) ముగ్ధత్వము ముద్దరాలితనము.

ఉ వచ్చి తదీయమందిరముపవర్తన లెల్ల నెఱింగి యక్కటా. పచ్చవతంబు గల్గుచతిచాడ్పున ముద్దఱికంబు చూపుచున్, ప్రముచ్చిలి రాత్రు లింతింతి మూఁడుజగంబులు ద్రింగుచుండె
కేయూర. 8 228

ముద్దాడు సం క్రి (ముద్దు + ఆడు) ముద్దు పెట్టుకొను, చుంబనము చేయు

ఆ అంగి చెక్కు నొక్కి యక్కునఁ జేర్చి ము, ద్దాడి నీకు ఫలము లారగింప, వలసినన్ని దెత్తు ....
ఉ రా 5 86

మ . జిగిజాళ్వా చెక్కుపున్ ముద్దుచెక్కిలి ముద్దాడుచు
దశా 8. 77

సి ముద్దాడి వలదె యీ మోహనా గునిమోము గండచక్కెర మోవి గలఫలంబు ...
విజ వి 1 71

(ముద్దిడు. శ ర పా.)

2. చుంబనాది పూర్వకముగా లాలించు, బుజ్జగించు.

కం .. మగువయుఁ బతియుం, బొదలెడి విస్మయము మనో, ముదముందఱు కొత్తఁ గొడుకు ముద్దాడి తగన్ .
హరి పూ. 5 188.

సీ. బలితనూజుం డైన బాణాసురుఁడు దొల్లి కార్తికేయుని శూలి గారవించి, ముద్దాడు నెడ చూచి మోదంబు ఖేదంబుఁ బొడమ నెమ్మనములోఁ గొడుకు నిట్లు పాటింపఁదేఁదండ్రి
ఉ. హరి. 5 9

మ. ... మఖశాలాగ్రంబునన్ త్రార్ధదేవుని గట్టించెను వీరభద్రుఁడు భటవ్యూహంబుచే నాగ్రహం,బున ధూమోర్ణపయోధరద్వితయమున్ ముద్దాడుహస్తాబ్జముల్ .. కాశీ. 7.89.

(ఇట పుణుకు అని భావము. అదరించు అని శ. ర ).

ముద్ది[1] విశ. (౧ ముదియు ము లాపె, వృద్ధాగన

గీ. అసిన నమ్ముద్ది మంచి దయ్యైన నేమి నాతనూభవ్య ... నీకు నిదియు లే దన్న నందు, నద్ధ మిప్పించి యవ్వల నడుగు వెట్టు .
శుక 3 49.

గీ ముద్ది యన రాదు గ్రద్దు వయ్యోర్ద్దు ...
శుక. 3 21.

ముద్ది[2] వి ఇదుము, అపద (శ ర )

ముద్దిడు, స క్రి. (ముద్దు[1] + ఇడు ముద్దుపెట్టుకొను, చుంబించు

ఉ నద్దంకచ్చె కన్నుఁగవ చొక్కఁగఁ వుక్కులు మోవి నొక్కమై, ముద్దిడువేః మోవిలని మోవి కొలఁదిఁ దలంచి వెలుపు , ఔర్కు బాచ వత్తుఁగని పెంచిన మేటికిఁ బచక్రీవా, దద్దిర యంచు నవ్వ చతురాస్యుఁడు మాకుఁ జిరాయువీపుతన్
రా వి 1 3.

ఉ ముంగిట నాడుపుత్రుఁ దతిమోహము నందను దొలఁ గాంచి వేడ్కం గరయుగ్మ మెత్తి చిఱుగంతులతో నెడయేడ్పుతోడ డా యఁగఁ జెలంగి యెత్తుకొని యక్కునఁ జిక్కఁగఁజేర్చిముద్దుమో, ముం గమియార ముద్దిడుట ముజ్జగ మేలుట గాక యుండునే
కవిక 1 40.

ముద్దిడుకొను స క్రి (ముద్దు[1] + ఇడు + కొను. స్వార్థమున) ముద్దుపెట్టుకొను

కం. విద్దెములు సేయరాదో, ముద్దులపట్టీ యటంచు ముచ్చటదీరన్, దద్దయుఁ దలిదండ్రులు తను, ముద్దిడుకొన నజుఁడు వెలయు మోహనలీలన్.
ఇందు. 2. 17.

ముద్దియ[1] వి (√ముద్ద[2]) స్త్రీ, అఁడుది

కం. అనుటయు దరిహసితము మో,మునకుఁ దొడవు గాఁగఁ బలుకు ముద్దియ ...
భార. విరా 1. 815.

ఉ గద్దియ డిగ్గి కౌశికుఁడు గాదిలిసూనుఁడు గొండ

పట్టినన్, ముద్దియ దశుగూఁతురు విమూఢత రెండవపుత్రుమైననుం, దద్దయు వేడ్కఁ జూతు నని . కాశీ 6 21.

ఉ ముద్దులు గుల్కుకుందనపుముక్కలిపీట వసించెఁ దమ్మిపూ, ముద్దియగద్దియం బొలుచు ముద్దియ యుద్ది యనన్ శుభోన్నతిన్ ..
విజ వి. 3. 92.

2 ముగ్ధ, గోల.

సీ ... ముద్దరా ల్ముద్దియ ముగుద యనఁగ, ముగ్ధ యొప్పను ... ఆం. భా. 2. 105

ముద్దియ(ద్దె)$^2$ వి (సం. ముద్రికా, ప్రా. ముద్ది అ) తామరపువ్వులోని దుద్దు, కర్ణిక

ఉ అద్దము చూచి చంద్రముఖ యందముగాఁ దిలకంబు కస్తురిన్, దిద్ది యనేకరత్నమయదివ్య విభూషలు దాల్చి యొయ్యెడన్, ముద్దులు గుల్కుకుందనపు ముక్కలిపీట వసించెఁ దమ్మిపూ, ముద్దియగద్దియం బొలుచు ముద్దియ యుద్ది యనన్ శుభోన్నతిన్ విజ. వి. 3. 62.

ఉ సొద్దెపుఁదేఁటి ఱెక్కకొన సోఁకులచే రవళించు తమ్మిపూ, ముద్దెదుమామిస, ద్దడర మోదుగు నేఁజయుఁ నల్వకేడెమున్ . ప్రబంధ 5. 14.

గీ పొలుచుఁ గర్ణిక దుద్దు నా ముద్దె యనఁగ.
ఆం. భా 1. 165.

ముద్దీఁకె వి ముద్దు + ఈఁకె) ఏనుఁగును పొడిచెడి ఒరగోల (శ. ర.).

ముద్దు వి (క ముద్దు త ముత్తు) 1. చుంబనము,

(చూ. ముద్దాడు, ముద్దుగైకొను, ముద్దుగొను,)

గీ. ముద్దు నాఁగను జుంబనం బొప్పుచుండు ...
ఆం భా. 2. 180.

2 ముద్దు వచ్చుపని, ఇంపు గలిగించు పని.

ఉ సందిలి పట్టి యాడు మన నాట్యము లాడుచు ముద్దు-న్ మహా, నంద మొనర్చె బాలిక దిన-బును జుట్టపుఁ బూవుఁబోండ్లకున్.
కళా 6 200.

3 ఆదరము

(చూ ముద్దుగావించు )

4. సొంపు, చక్కఁదనము, ఇంపు, మనోహరత్వము

సీ. పలుకుల ముద్దును గలికి క్రాల్గన్నుల తెలివును పలుకు చన్నుల బెడంగు .
భార. ఆది 8 27

గీ ముద్దు, చిలుకు నచ్చి చిలుకల కొలుఁకు లపుడు ... దశా 2 268

సీ తరుణాంగుళీధూతతంత్రీస్వనంబు తోఁ జిలిబిలి పాట ముద్దులు నటింప ... మనుచ. 2. 27.

5. ప్రేమము

చం. వలిమలయల్లువాఁడు తలవాఁక ధరించిన పూవు గుత్తి వేఁల్పుఁగమిజీవగఱ్ఱ యుడివోవని చేవ్రాలకెంకి వెన్నల ల్మోలచినపాదు పాల్కడలి ముద్దులపట్టి నృసింహాకృష్ణరా, యలఁ గరుణారసంబు నినుపారెడిచూపులఁ జూచుఁగావుతన్.
పారి. 1. 6

వ. ... అద్దేవదేవునకు ముద్దులమనుమలు గావున దశా 3. 125.

చం . ప్రసు, కృక పలుమాఱుఁ జూపఁ జెలి కత్తెలు ముద్దులపాప పొమ్మనన్, మొకము సగంబు వాంచె మణిముద్రికలం జిఱునవ్వు గప్పుచున్. ఉ హరి 5 54.

(ముగులపాప = ప్రేమాస్పదమైనది, అమాయకురాలు )

విశ. 1 మనోజ్ఞము, సుందరమైనది

కం. అద్దేవుఁడుం బైపడ, గద్దింపుగ శైల న్య కనుఁ గీటంగాఁ, బెద్దవడి నటించుచు న,మ్ముద్దియ చిఱునగవుతోడ మ్రొక్కుచు నిలిచెన్.
ఉ హరి 5. 59.

చ తెలికనుదోయిమిం ములును దిన్న నినవ్వులు ముద్దుమోములున్ . విక్ర 1. 79.

కం. వలనుగ నపమ్మద్దుంబై, దలి వలి నిట్టూర్పు

కమ్మకావులఁజేసె వా,విలి పనిచె ననఁగ నిం వే,
ల్పుల ముక్కెవ్వారి నెట్లు పూజించెరో
రసిక. 2 127

2. ప్రేమా గ్రహము, అనురాగము

శా. కోణపల్లభు ముద్దుగ న్గనునుఁబల్కుల్ గ్రోలు
కోలేపు సి. ర్వాణాన.పము శైనపీనులకుఁ
ఒత్స్వాస్యయ బుగంధర్వర్వాడ్విణానాద మొకింత
సమ్మదము గావింపంగ నింద్రాదిగీ, ర్వాణాధీశ
చతుష్టయం బరిగెఁ దారావీథి దూరంబునన్
శైవ. 7 35

ఉ. ద్వారకముద్దుఁజెలె లంట తన్నగరీమణి సృష్టి
యిన్నిటం, దిరుగ దైనచో నిదియ నేర్పులమే
లని యెంచి చెసెఁబో, ధారుణి విశ్వకర్మ ...
విజ వి 1. 20

ద్వి. ప్రొద్దు నేఁ డిదె గ్రుంకెఁ బోలమునుండి,
ముద్దులేగలు వచ్చి మొదవలఁ గలసె ...
ద్వి హరిశ్చ. ఉ 1684 పం.

ముద్దుఁడు విశే. ముద్గుఁడు, గోల, జేల.

గీ. తేరపని మానిపిన వాసుదేవుఁ డిలకు,దాఁటి
శాతాసి వైచె మాధవునిమీఁదఁ, బదిశరంబులఁ
ద్రుంచి గోపాలవిభుఁడు, ముద్దుఁడును బోలె
కన్నులు మూసికొనియె. ఉ, హ 3 100.

ముద్దుగలకాళ్ళపురువు. వి. (మూఁడు + దుగల + . ) జంటముకాళ్ళలి, షట్పదము, తుమ్మెద.

ముదుగల తల్లుల బిడ్డఁడు వి కుమారస్వామి.

ముద్దుగలము వి (మూఁడు+దుగలము) ఆరు జేడలు

ముద్దుగా అవ్య అందముగా, మనోజ్ఞముగా.

ముద్దుగుమ్మ వి (రూ. ముద్దులగుమ్మ)) మనోజ్ఞురాలు, స్త్రీ.

సీ ముద్దుగుమ్మకు శిలీముఖమయ్యె దుమ్మెద
రసిక. 4. 39.

ముద్దుగురియు అ క్రి. మనోజ్ఞముగా నుండు.

సీ ముత్యాలసరులతో ముద్దుగురిసె ..
శైవ 2 .13.

ముద్దుగులము వి. రూ ముద్దుగుము

ముద్దుగొను అ క్రి చుంబనము చేయు

ముద్దుగైకొను. అ క్రి. చుంబనము చేయు

ముద్దుటుంగరము వి రూ. ముదుటుంగరము.

ముద్దుటుంగ్రము వి రూ ముదుటుంగరము

ముద్దుపెట్టుకొను. అ క్రి చుంబనము చేయు.

ముద్దుప్రాలు వి ధాన్యవిశేషము

ముద్దుముద్దు విశే జిలిబిలి

ముద్దురాలు వి ముద్దుగవస్త్రె

ముద్దులగుమ్మ వి ముద్దుగవస్త్ర

ముద్దులాఁడి వి విశే ముద్దుగావస్త్రె

ముద్దులాఁడు వి మనోజ్ఞుఁడు.

సీ పేడకేలు నడుని వెలఁదికి జగమెల్ల ముఖ
మందుఁజూపిన ముద్దులాఁడు .
భాగ 10 పూ. 1253.

ముద్దులుగుల్కు. అ క్రి మనోజ్ఞముగానుండు.

ఉ. ముద్దులుగుల్కు నీ భువనమోహన కుండల
రత్నదీధితుల్ .. కవిక. 6 207.

ముద్దులుమూటగట్టు అ క్రి. మనోజ్ఞముగానుండు.

ముద్దె వి. 1 పద్మబీజకోశము. కర్ణిక.

ఉ కొమ్మలతోడి హస్తములు గుత్తపు ముద్దెల
ముద్దుగుల్కు పొందమ్ముల ..
పంచ 24 154. (ప్రా.)

పొలుచుకర్ణిక దద్దునా ముద్దెయనఁగ ..
ఆం భా 1. 224

2. ముద్దియ

ముద్ర. సం వి ఆ స్త్రీ. 1. ముద్దర, సీలు.

2 అంగుళీయకము లోనగువాని యందుండు సంజ్ఞాక్షరములు

3 సంజ్ఞాక్షరములుగల యంగుళీయకము

4 బంగడ, ధాన్యపురాశిపై వైచు సీలు

5 బుజములపై వైచుశంఖము చక్రము లోనగు ముద్ర

6 నృత్తహస్తములలో నొకటి

7 జపము సేయు సమయమందుఁ బెట్టుకొను అంగుళి విన్యాస విశేషము.

8 సాహెము

9 కావ్యాలంకారశాస్త్రము దొక యలంకారము. సరియైన పదములతోను నామములతోను వస్తు పద్ఘనము గావించుట ముద్రాలంకారము.

10 బిరుదు వర్ణములగల పతకము

**ముద్రణము.** వి అచ్చుపని, ముద్రితప్రతి.

**ముద్రణీపత్రము** వి ఆచ్చు నిర్దుష్టముగా పడినదో లేదో చూచుటకు మొదట ముద్రించిన కాగితము, (ప్రూఫ్సు విల్యమ్సు)

**ముద్రాంకము, ముద్రాంకితము** విణ ముద్రితము

**ముద్రాక్షరము** వి ముద్రవైచిన అక్షరము.

**ముద్రాకారుఁడు** వి ముద్దరలు చేయువాఁడు.

**ముద్రామార్గము** వి. బ్రహ్మరంధ్రము

**ముద్రాయంత్రము** వి. అచ్చుయంత్రము

**ముద్రారక్షకుఁడు** వి. ముద్రలను భద్రముగా నుంచువాఁడు

**ముద్రారాక్షసము.** వి విశాఖదత్తుఁడు సంస్కృత భాషలో రచించిన యొక నాటకము పేరు.

**ముద్రించే** సం స క్రి. (గొండ్లెము) 1. వేయు, బిగించు, తాళముచేయు

కం కలువలకు వమ్ములిందిర, తలుపులు ముద్రించి యున్న తామరసగృహంబులు పాడగుటన్ మూల్లుచు, వలిభూతము లందులోన నదివసి యించెన్ కవిక. 4. 79.

2 ముద్రవేయు, సీలువేయు.

ఉ పంకజలీముఖుండు తురవాణమునన్ బగమెల గెల్చియ. ఖ్యాంచిత పుష్పవృష్టి మసుదానశి నింపఁగ నివ్వు డల్లుము,గ్రించినజాడ దెల్పె సువతీ మధుపంబు పరిచ్ఛవచ్ఛటాకంచుకితో త్పలంబుతుదకమ్మునఁ జిక్కి యచంచలా కృతిన్. వసు 4 133

**ముద్రితము** సం విణ (అ ఆ అ) 1 ముద్ర వేయఁబడినది. 2 మూసివేయబడినది, ముద్దర వేయఁబడినది 3 వికసించినది, ముకుళితము 4. అచ్చువేయబడినది.

**ముధా** సం అవ్య. అ 1 వ్యర్థము, ప్రయోజనము మాలినది

ఇది ముధాప్రయాసము మొదలగుచోట సమాస పూర్వపదముగామాత్ర ముండును )

**మునగ** వి (త మురుంగై.) 1. శిగ్రువు, ఒకా నొకచెట్టు.

గీ ఇఱుకుమ్రాను పెరంటిలో నెక్కుఁబావి, మునగలును జొప్పపెనువామి ... తనర నిరతంబు వెలయు నాతనిగృహంబు ...
శుక 2 408. (మునుఁగు అని చి. ని పా.)
ఆం. భా. 2. 44.

2 శిగ్రుశలాటువు, మునగకాయ.

ఆ. మునగ యుల్లి యడవిమునగ దుర్మాంసము, లానుగమ్ము మలిన మైనయుప్పు, గఱియజీల కఱ్ఱగఱివేము గురుజ యిఁగువ ప్రవర్జనీయ కోటి, భార అను 8 189.

**మునగపూజిట్టువ** వి. పక్షివిశేషము

సీ జిట్టువ మునగపూజిట్టువ గిజిగాఁడు వల్లడ పొడిపిట్ట వంగపండు.

ఆ. అవి యైనపతు లతఁడు దీర్పు .
హంస. 3 12.

**మునన** వి. పతఘ్రమానిమీఁది యరభాగము మీఁట (శ ర)

**ముని.** విణ. మునుశబ్దమునకు వృత్తియం దుత్తర పదము పరమగునపుడు వికల్పముగా నగు రూపము.

ఉదా : మునికాళ్లు, మునివేండ్లు, మునిమాపు మొ.

ముని సం. వి అ. పుం. 1. ఋషి. 2. దమనకము (వ్య. వి) 3. బుద్ధుడు. 4. ప్రియాలువృక్షావిశేషము 5. మామిడిచెట్టు. 6. ఏడు సంఖ్యకు సంకేతపదము.

మునిగించే. సం. క్రి. (√మునుఁగు) మునుఁగునట్లుచేయు. ముంచు, నశింపఁజేయు

చం వనవిలుకాఁడ మన్మథ యనాథవధూపవపాతకంబు నిన్, గొని మునిగించెఁ గ్రూరం హంకసేప కటాక్ష శిఖస్వరూప మై ... నైష. 2. 135

మునికా(గా)లు. వి బ. (మును[1] + కాలు)

1. పాదాగ్రము, కాలికొన

సీ. మునికాళ్లు మోపి నిక్కినఁ బసచ్ఛవి రేల యును బల్లవించిన యొప్పు మెఱయ ... నృసిం. 2. 81

సీ. మట్టియ లొండింటి బిట్టుదాఁకఁగనేల నందంద మునిగాళ్ల నప్పళించు ... భార. విరా. 2. 250.

కం అని చిందరేఁగిన ట్లచ్చెనఁటి ధరాసురుఁడు చెంతఁ దేపడినవిధిన్, మునిగాలఁ దన్ని చను గతి ఘనజఘనం బాసి యబ్బగాఁ డయిపోయెన్. వేం. పంచ 4. 292.

2. అగ్రపాదము, ముందరికాలు.

సీ. కదిసితో మునిగాలు గఱచి వెంబడి దీయుఁ దిగిచి తోడనె లేవఁ దెరువుఁ గట్టు ... చంద్రా 2. 91.

సీ చెవులు ఱిక్కించి చూచి మునిగాళ్లకి నెత్తి కొట్టుఁ దేఱలఁ జాపకట్టువడఁగ . రాజ. చ. 2. 75

మునికోల = ములుకోల. వి. 1. తోత్రము, కొరడా.

చం. .. సత్వసేనుఁ డు,క్కున నిగిడింపఁ జేతి మునికోలయుఁ బగ్గములున్ మహీతలంబున నొగలందునుం బడిన భూవర పార్థుఁడు క్రోధదీప్తుడై. భార. కర్ణ. 1 069.

మ ... అప్పనపాటవ్యముఁ బూని కగ్గములుచేఁ జోద్యంబుగాఁ బట్టుచున్, మునికోలన్ వడిఁ బూన్చి ఘోటకములన్ మోదించి తాడించుచున్ ... భాగ. 1. 228

2. ఆరెకోల,వృషభాదులను నడుపుటకై పొడిచెడి కఱ్ఱ.

క ఒక్క వాఁడు నారయమిత్త్రపుండు, నిశితతర మగుమునికోల నెత్తు రొలుక, మోపుచును ... భార. అను. 2. 210

వ ఇట్లు తాఁ దెచ్చినయెద్దు నెనుపోతును మెడఁ గాఁడి గీలించి ప్రచ్ఛన్నరూపంబున బాదరతులు తోలు మోకు మునికోలయు నంటఁగట్టి పెద్ద యేఁడికోల యమర్చిననాఁగలి భుజాగ్రంబునం దాల్చి . శేష. 3 199.

మునిగొంగు = ముంగొంగు. వి. (మును[1] + కొంగు) చెఱఁగుకొన.

చం. . . కుంచికాం,భ్రముల వలిపంపుఁజేలమునిగొంగొకయించుక యెత్తి ... శుక. 1. 281

మునిచీకటి వి (మును[1] + చీకటి దీనియామ్రేడితరూపము మునిమునిచీకటి.) పొద్దుగ్రుంకినతోడనే పర్వెడుపలుచని చీకటి.

గీ. . మునిచీకటి ముఱిచీకటి. మసక ... యనఁ నవతమసనామధేయ మై యలరుచుండ ... ఆం. భా. 1. 148.

మునిమునిచీకటి = అపసంజవేళఁ బర్వెడిమిక్కిలి పలుచనైన చీకటి.

చం మునిమునిచీకటి న్నడువ ముంగిటవాకిటనైన నొంటిబాటున నడయాడుటవ్వనుల డొంకక పయ్యెదయైనఁ కెట్టయై,నను బెడయైనఁ బట్టు . . దశా. 8. 223.

మునిచెఱఁగు = ముంజెఱఁగు. (వి మును[1] + చెఱఁగు) ముంగొంగు.

గీ. చేరి రవ్వేళఁ దమమునిచెఱఁగులందు, గాసు దుడ్డును బంగారుపూస వెండితునుక మొదలింటి

చిఱువాడు గొనిన చెల్లఁ, గొనుచు మగనాండ్రు తమకల్లగుట్టు మెఱయ ... శుక. ౨ 117.

మునిత్రయము సం. వి అ న పాణినికాత్యాయనపతంజలు లనుముగ్గురుమునులు.

మునిద్రుమము సం వి అ. పుం శ్యోనాక వృక్షము

మునిపల్లు వి బొ (మును[1] + పల్లు) ముందు భాగమునందుండుపల్లు.

(బ. మునిపండులు, మునిపండ్లు, మునిపల్లులు)

చం. .... తద్గణాధిపుల్, ఒఱువిడిఁ జుట్టి పూషు మునిపండులు డుల్లఁగ వ్రేసి రీసునన్. కు సం. 2 212

గీ. నాటుకొని శ్రీమహాశ్మశానమున నున్న, యణుకనగ్నాత్మలవటుఁడైన నాగ్రహమున, గర్వితోద్ధతి నేతెంచుకాళరాత్రి, మృత్యుదేవత మునిపండ్లు మెఱుకఁజాలు. కాశీ. 2 47

సీ. మొసవాడఁ ద్రిప్పి తోమినమునిపండ్లపైఁ దళుకుతళ్కనెడు కుందనపురవలు ... రా వి. 2 57

మునిపిత్తలము సం వి అ. న రాగి, తామ్రము (త్రి ని).

మునిపుత్రకము సం. వి అ పుం 1. కాటుకపిట్ట. 2. దమనకవృక్షము.

మునిభేషజము. సం వి అ న 1 హరీతకి. ఉసిరిక (వ్య. వి) 2. ఉపవాసము, పస్తు.

మునిమనుమఁడు. వి. (మును + మనుమఁడు.) వ. ప్రపౌత్త్రుఁడు, పౌత్రునిపుత్రుఁడు.

1. రుద్రపవనేంద్రాదులు మనుమలై మునిమనుమలై వృద్ధినొందుచుండఁగ నందఱకు నాధారభూతమై కూటస్థబ్రహ్మంబైన నీకు విచారంబేల యని సాభిప్రాయంబుగఁ బల్కిన విని హరి యిట్లనియె. వేం. మా. 4. 137.

2. పౌత్రీపుత్రుఁడు, దౌహిత్రునిపుత్త్రుఁడు; దౌహిత్రిపుత్త్రుఁడు.

మునిమనుమరాలు వి (మును[1] + మనుమ + అలు) 1. పౌత్త్రునిపుత్త్రిక. 2. పౌత్త్రిపుత్త్రిక, దౌహిత్రునిపుత్రిక, దౌహిత్రిపుత్త్రిక.

మునిమనోహరాలు వి. సం వి బ. ధాన్యవిశేషము.

వ. ... రాచవన్నెలు తుంసినవమాలికలు సింధుకర్పూరాలు రాయమెచ్చులు నేఱుమల్లెలు మునిమనోహరాలు వెండిగుండ్లు .. అను నూటనాలుగువగల పైరులచేరుడుబియ్యంపు వట్టిపసాదంబులు ... ప్రబంధ. 112.

ముని(ను)మాపు వి. (మును[1]+మాపు) ప్రదోషకాలము, సంజ.

ఉ అచ్చటు వాసి యల్లఁజని యాహ్నిక వర్తనమాచరించి రా, లచ్చివిలాస మందఁగ నలంకృతుఁడై మునిమాపుదర్శనం బిచ్చిన మంత్రిభృత్యసుకవీశ్వరు లాదిగ నెల్లవారలున్, వచ్చి మహీశుఁ గొల్చి రనివారణఁ జిత్తము లంకురింపగాన్. నిర్వ. 9. 84.

సీ. మునిమాపుజిగిఁ దొలంగిన తమ్మిరేకులరీతిఁ గన్నులదైన్యరేఖ దోఁచె ... అని. 3 121.

కం.... అమ్మెర, మునవనొక్కెడ విశ్రమింప మునుమాపగుడున్ ... దశకు. 7 ౭5.

సీ. చామనిచాయదాసరి ముత్తె మిచ్చినకల మొన్న మునుమాపు దెలుపవలెనె ...

రా. వి. 2. 11, పారి. 1. 49
ఆం. భా. 1. 94

మునిమీసము వి (మును[1]+మీసము) అప్పుడే మొలచుచున్న మీసము.

(దీని యామ్రేడితరూపము మునిమునిమీసము చూ మునిమీసము.)

మునిముంగల. వి (ముంగల+ముంగల.) మొట్టమొదట. (శ. ర.)

మునిముచ్చు. వి. (మును[1] + ముచ్చు) పశ్యతోహరుఁడ, పచ్చెకాఁడు చూచుచుండఁగా దొంగిలించువాఁడు; పశ్యతోహరురాలు, పచ్చెకత్తె.

కం. మునిముచ్చులార మీచేసినపని యటు గట్టిపెట్టి చేకొని యేలా, నను దటిమితి రిక నేయ, వవకుడు నాతోడిదొంగ లై తిరి మీగున్.

ప్రభా. 5 70

గీ వైచి సరగున గ్రమ్మఱ వచ్చి తలుపు, మూసి గడెవెట్టి యుక మునిముచ్చు కాన, యిటు మొగం బైన నాకొద్ది యెఱిగె దనుచ, నిటికిని వచ్చె నవ్విటకంటకియును.

వి. ప్ర 4 50

(ఇట దొంగముని యని యర్థాంతరము.)

వ. . వాదులు ప్రోదులు సేయుమునిముచ్చు బోధలు వినం బనిలేదు. నరాహ. 11 57.

కం. ఏను వల్లభ క న్నుండం, గను పాపం దవియ నేర్పు గలమునిము చ్చి, వసిత తగదిచట నుండన్, వెనుకను దిద్దుకొనవచ్చునే యొక లైవన్. కళా. 5. 196.

మునిముద్ర సం వి. అ. స్త్రీ మౌనవ్రతమును సూచించు ముఖాంగుళి విన్యాసవిశేషము

(సంగీత పారపళ్యవర్ణనము)

సీ. చెలి యని కొమ్మపై చేతు లూదనికొమ్మ మునిముద్ర దాల్పనిముద్దుగుమ్మ. యాసఖాస్థలి లే దయ్యె ... సమీర. 6. 210.

మునిమునిమీసము. వి. (√మునిమీసము) నూనూగుమీసము.

సీ. మునిమునిమీసంబు మొనయునేటనె యమళ తళ మొనర్చి కౌశలముగన్న .. ప్రబంధ. 29.

ముని(ము(ము)చ్చు. మ వి. (ముని+ముచ్చు) దొంగవేషము వేయుమునులు, వంచకు లగు మునులు.

గీ. పవనపర్ణాంబుభతు లై నవసి యునుప, చ్చడాల్కట్టుకొన్న మునిముచ్చులెల్ల, దామరస నేత్రలిండ్ల బందాలు కారె ...

మనుచ. 2 73

మునియేడు వి. ఔ. (మును¹+ఏడు) నిరటిటి పూర్వపువత్సరము, ముందటేడు

స్త్రీ మునియే చే తైనమునిగినకదుము, చను గుబ్బ గోళ్లొత్తి చను గల్పివాడు.

అ. మ క. 4 పా 11. కం

మునివ్రేలు. వి. ఔ. మును¹+వ్రేలు జ. మునివ్రేలులు, మునివ్రేళులు, మునివ్రేళ్లు.) వ్రేలికొన, అంగుళ్యగ్రము.

సీ గ్రంథనకుసుమదంబు సందించి మునివ్రేల మృదుకిసల తై తీగె మెఱుగుసేయు ...

వై జ. 1 .13

కం అని యడిగిన హేమావతి, కని దీర్ఘోచ్ఛ్వాస మొనర విడిచి విజాంఘ్రి, గనుదృష్టి నిలిపి మెల్లన, మునివ్రేలన్ నేల గీరి మునుకొని ... పలికెన్ ... హంస. ...

కం ఉన్న యెడన్ మునివ్రేళుల, చిన్నవినడ నగు చవితి పదిలు దై చేసి, గొన్నియడుగు లరిగి యడరి, యన్నగచరనాథుపై యుయంబున బడియెన్ ... నిర్వ 7. 82

కం మన పొందై నఱపంబును, మునివ్రేళ్ల నె యెన్ను ఆశము మునుమేర విలం, ఘన మొదరించు జపంబును మునుకొని లెక్కడనిజపము ముఖ్యం బగునే ... శుక్ర. 5 86

మునిషీ. వి. (హిం. ముష్షీ) చదువు చెప్పువాడు, బోధకుడు, లేఖకుడు, వ్రాయసకాడు (మి. బ్రౌ)

సీ మునిషీ యొకడు చెప్పు మొనసి బతీచెప్పు ... వేణు. 19

మునీంద్రుడు. సం. వి అ. పుం 1. మునిరాజు, మునిశ్రేష్ఠుడు. 2 శాక్యముని. 3. భరతుడు 4 ఒకానొక రాక్షసుడు

మును¹=మున్ను వి (క. మున్. హల్లు పర మగుచో దీనితుదియుకారము మునకు లోపము వైకల్పికము. దీనియామ్రేడితరూపము మును మును)

2 ముందు, పూర్వము.

కం చనువానిసేయు కార్యంబున కడ్డము సొచ్చి

నేరుపున మెలఁగుచుఁ దా,మును బయిఁ బూను
కొనుటఁ దవ,మును మెలఁగిన మెలఁకువకును
ముప్పగుఁ బిదపన్ భార. విరా. 1 125.

కం. మును రుక్మిణి త న్నడిగిన, దనుజాంతకుఁడే
వరంబుఁ దప్పక యిచ్చున్ ..
ఉ. హరి. 2 77.

సీ. ప్రాణేశ పతికి మున్ పరలోక మరిగెడు చెలువ
లేతపములు చేసిరో కా ...
భా రా యు 392

మ మహి ము న్నాగనుశాసనుండు సృజి
యింపన్ .. వసు 1. 10

2. మొదలు, ప్రారంభము

కం. మును వెఱతు నేయ మీరలు, నను నేసినఁ
గాని . . భార విరా 5 124.

మ. అమరారాతు లనేకు లీరణమునం దస్మద్వమ్మహా
చక్రవిక్రమిగర్వంబునఁ గాలనేమిమునుగాఁ
గాలాంతముం బొందిరి ...
హరి. పూ 4. 183

సీ. అచటిమేటికిరాటు లలకాధిపతి యైన మును
నంచిమొద లిచ్చి మనుప దఱ్ఱులు ...
మనుచ. 1. 51.

కం. దనుజాతఖండనోద్ధతిఁ, జనుమనుజాధిపు
ప్రతాపజాతము మునుముం, గనిపించె నినుచు
జనముల్, గనుఁగొన మార్తాండమండలం
బుదయించెన్ కువల 2 50

మ మునుము న్దెల్పును దూఱఁ దూఱ మఱి
కెంపు న్వెండియుం దూఱఁ గందనగాయం గల
నల్పు దోప నఖకోణశ్రేణిచే విక్రమంబున వాఁ
డుగ్రతఁగొన్నయట్టి విలసన్మూర్తి త్రయీ
తేజముం, గొనుశీల న్విదళింపవే యసురవ
క్షోభిత్తి మిథ్యాహారి ...
ఆము. 4 23 మనుచ 2. 30.

3. పురోభాగము, ముందువైపు

మ. ... లచ్చిని, బట్టలవుంజన్గవఁ బోలుమునొ్న
గముస్ డా చేసి యుల్లాసి యై ...
పాండు. 3. 160.

చ. అరదము నెక్కి . . ... తాల్మితోన్, దురగ
జవంబు మున్గనఁ ద్రోచికడంగెడు త త్తరం
బుతో, హరి సనుదెంచె . . పారి 1. 104.

4. తుద, అగ్రము

సీ మును మించినిడుమోర మూచి దూఁటిన
మహాజడథిపూరము తలకెడవు గాఁగ ...
హరి. పూ 4. 16.

జ మునికాళ్ళు, మునిగొంగు, మునిచీకటి, ముని
చెఱఁగు, మునిపల్లు, మునిమనుమఁడు, ముని
మనుమరాలు, మునిమాపు, మునిమీసము, ముని
ముచ్చు మునిమునిమీసము, మునియేఁడు
మునివ్రేలు. మునుకడ, మునుకొనిపోవు.
మునుకొను, మునుకోలు, మునుగట్టు.
మునుచు[2], మునుపడు మునుపు[1], మునుపు[2],
మునుపట్టు మున్కలి, మున్నీరు, మున్మున్న
కుట్టి, మున్నాపు, మున్వెనుకలు, మున్మను
మఁడు, మున్మనుమురాలు

**మును[2].** నం. మూఁడుశబ్దమునకు వృత్తిని పూర్వ
పద మగునపుడు వికల్పముగా వచ్చునాదేశము.
(చూ మునుమాటు.)

**మునుఁగబడు** అ క్రి (మునుఁగని + పడు
స్వార్థమున) 1. మునుఁగు, మగ్నమగు.

కం . సారరహిత విరహదశా, పారావారమున
మునుఁగఁబడి యున్న యెడన్ .
కువల. 3. 84.

ఉ. ఇక్కవు లెల్ల నిత్తఱి మహీధరసన్నిభ మైన
వీనిమే, నొక్కటఁ బ్రాఁకి నొంప బహుయూథ
భరంబునఁ జిక్కఁబోలు నా, గ్రక్కున వారు
పాటి మునుగంబడ నెక్కిన బిట్టుదూలి వర్ది,
క్కులఁ గూల గాత్రము విదిర్చె నతండు మదద్వి
పాకృతిన్. భా. రా యు. 9. 40.

**మునుఁగు(న్గు)** అ. క్రి (క. ముణుగు ) 1.
స్నానము చేయు , మునక వేయు.

గీ దతువాటి. సప్త　గోదావరీమున, మునిఁగి
భీమేశ్వరునిఁ గాంచె మునివరుండు .
కాశీ 3 16.

ఉ. అంత వేమె పుష్పనది యోాంతకూర నమైన
నంట నన్నంటకు మును దాఁక ..
ఉ రా. 6 57

చం. ఒనిచినఁ దద్దయుం బోదలి పాతెడు వేడ్కల
వెల్లిఁ జెల్లగా, మునుఁగుచు నేలవెల్పుతల
ముందఱిపల్లియ కెం ..　నీలా. 1 100.

(ఒక యాదురికవి దీనిని 'ములుఁగు' గాఁ
ప్రయోగించియున్నాఁడు )

కం. శిల వెంటఁ బడిన నిలువక యలరక్కసి పాఱె
దక్షిణాంబుధికడకున్, ములిగెను కపిత్థంబును
దలకొని శిల వెంటఁ దగిలి దానిన్ దాకెన్ ...
సేతు 5. 154.

2 (జలాదులందు) మగ్నమగు.

కం. వననిధి నడునీటఁ గలము, మునిఁగిన బెగడం
దుచిత్తములు గలిగినత,జ్జనుఁ క్రియ మున్న
సేనలు, గనుగొన దివిగతిఁ దోఁచెఁ గర్ణుం
డంతన్　భార ద్రో 1. 26

కం. వారుణదిగ్వారాకరం,వారి వరుణుఁ డస్తమింప
వర్ణితతీర్థో,దార మఘపావనాశన, పూరములో
మునుఁగుఁ గంబమును దినదినమున్.
విక్ర 2 104.

కం విని యావిప్రవరేణ్యుం, డనయంబును శోక
విస్మయపాదములన్, మునుఁగుచు ..
కళా. 5 54.

చం. అటిమి విభావరీచరులు నమ్మెలనుమర్మము
లాడునేటులన్, గఱులు మునుంగఁ దూలు నెల
కట్టియవాటులఁ గుంతకూలముల్ ...
భా రా. యు. 977.

సీ ... అంత్యకాలమ్మునయం దుర్వితోఁ గూడ
నుదధిలోపల మున్గకున్న వారి ...
హర. 4. 41.

3. అడఁగు, క్రుంగు.

గీ మొదలివెక్కువయును బోయి మునిఁగె
నత్తి . .　కాశీ .. 3.

కం. సత్క్రియనయంగుణములు దలఁ, మెరనదేహ
మును గాంచి యెడరినమొగమున్, మక్కువ
చెవులను మునిఁగినము ...
మహుఁడు మునియఁ గరిచెన్
భోజరా. 1 ...

(మునిఁగిన పీఠేం పా.,

4. క్రుంకు, అస్తమించు.

ఆ మబ్బలి వచ్చు నెడల మార్గం బెఱుఁగం, వెళ్లె
బోయి యడవినట్టనడుమ, క్రొద్దు మునిఁగి
వాన భోరున గురియంగ, దరి వదికిటిమి
కదా మహాత్మ　కుచేల 2 90.

5. కప్పఁబడు, ఛన్నమగు, అవృతమగు.

కం అనుచుఁ దొరగెడునశ్రుల మునిఁగినమో మతని
వక్షమునఁ జేర్చి ..　భాగ. విరా 2 222.

సీ. విస్మయరసరిమఁ ప్రసవమాల్యములు ఘనజటా
జూటంబు మునుఁగఁ జుట్టి ..
పారి. 5. 70. భాగ. ద్రో 1 344.

6 లగ్నమగు, సక్తమగు.

సీ ... అల తితేఁ జెమటచే వసలుకొన్నటాట ;
కుంకుమంబునఁ జిన్నికురులు మునుఁగ ...
కాశీ 1. 3.

7. నశించు, చెడు.

ద్వి. మోటుకన్నును పావ మునిఁగినకన్ను ...
పండితా మహిమా. 273. పా.

ద్వి. మును శంకరునిచేత మునిఁగినమరుఁడు, జని
యించె ... ద్వి భాగ. 10 స్కం. (శ. ర )

ద్వి మినుము మున్ను మునింగె. విష్ణు. పు 3. అ.
(శ ర.)

8 తీఱు, ఉపశమిల్లు

గీ. గుండియలు క్రిమ్మంగి దిగకున్న గ్రుడ్లు మిడిచి,
ధరణిఁ బొరలాఁడుచెనుముది దయ్యములును,
ముడుసునంజుల్లు ముచ్చట మునుఁగ మెసఁగిఁ

చొక్కి సుకియు చుబలితఁపు రక్కసులును.
మైరా. 3 143.

9 గ్రుమ్మకొను, నాటు.

చం. చనుమఱుఁగందు వత్తమునఁ జతురుపాంతము లందు గ్రుచ్చుచున్, మునిఁగినబాణజాలముల ముప్పిరిగొన్న భయంబు ఖేదమున్, సునమున నీడఁగాఁ దొడఁగి మార్కొన లేక కుబేరుఁ డేఁగె నద్దనుజుల నింత చేసినవిధాతకు గోడనఁ బోవుచాడ్పునన్. ఉ. హరి. 1. 42

10. పూర్ణమగు.

తే. తన్ని సాత్త్వికరాజసతామసాత్ము లైన వారలఁ బుణ్యలోకానుభవము, మనుజభావంబు నిరయపీడనముఁ బొందు, మోక్షలక్ష్మి నిర్గుణునకు మునుఁగ మునరు ...
భార. అను 5. 142.

ఆ. అన్యదైవవితతి నర్చించికొలుపు భాఁడిడి ఫలంబు గొనుట వడయఁగనెడి, సద్యమిష్ట ఫలదు జంగమ మల్లికార్జునుని గొలువు మొనరు మునుఁగఁ గొనుట. కు. సం. 1. 12.

వి. స్నానము, మునుఁగుట

కం. క్రీఁగన్నుల మగలఁ గనుచు, వాఁగిన వడఁకు చును మునుఁగు లాడఁగ నూత్నుల్.
అచ్చ. భా 3. 44 బా

సీ. అనిమిషాక్షి మునుంగుడాట లాడెడ వేమె పడుతుక నేఁ జోఱబుడుతఁ గానె ...
చంద్రా 4. 347

మునుఁగ(ంగ)ఁబాఱు = మునుఁగుటకు సిద్ధముగా నుండు.

మ. అనిరుద్ధాకృతిమీఁదఁ జిక్కువడి యయ్యబ్జాక్షిచూపంగముల్, ఘనరోమాంచమువం దనర్చెఁ బ్రియయు నిక్కంబ బిట్లు గన్నట్లు పై, కొని పూర్వానుభవంబు తియ్యమగు కోర్కుల్ చిత్రరూపంబులై, మునుఁగం బాఱుట దెల్పె డుక్ వివశతాముగ్ధంబు లై భావముల్.
హరి ఉ 7. 180.

చం. మగువముఖేందువుం దమృత మొగ్గమునన్ మునుఁగంగఁ బాఱియో

జ. ముచు, ముంచుకొను, ముంపించు, ముంపిరి, ముంపు, ముంపుగొను, మునిఁగించు, మునుఁగఁబడు, మునుఁగుకోడి, మునుక, మునుచు.

మునుఁగుకోడి వి (√మునుఁగు) పక్షివిశేషము.

సీ. మునుఁగుకోడియు డాబ ముట్టెకోడియు బోద పొన్నంగి కల్లెడు బొల్లికోడి .

గీ అది యైనపాము లతఁడు దీర్చు . .
హంస 3 12.

మునుక వి. (√మునుఁగు) 1. మునుఁగుట, స్నానము.

కం ... భాగ్యశాలికిం గలుగుం దుష్కృత మాలిక వడపం గల, కృతమాలిక మునుక దొరకునే యన్యులకున్ ... దశా 1, 124.

కం మునుకలు గంగానదిలో, నొనరించుటకన్న భాగ్య మున్నదె యనుచు, న్మునుకలుగంగా దిగి పరి, జనములు కైలా గొసంగ స్నానోన్ముఖుఁడై. విజ వి. 1. 55

సీ. స్నానంబు వెలయును దానంబు మునుక బుడుక మజ్జన మన . ఆం. భా 2. 160

2 మునుకవేయుట (శ ర).

మునుక(గ)ఁడ వి (మును[1]+కడ) 1 ప్రథమ సమయము, మొదటివేళ, తొలుదొల్త.

కం. మఱునాటిరాత్రి మునుకడఁ దఱి యెఱిఁగిఁ యవంతివిభుఁడు దయ దైవాఱం, గొఱత వడ కుండ వెరవుగ, నెఱమంటఁ కుండ మున్న యెక కరుదెంచెన్ ద్వా 7 107

ఉ. వెగ్గల మైనకూర్మి నరవిందదళాయతనేత్ర కొండకాఁ, దగ్గి పటీరకాష్ఠములయందు రవులొల్కనఁ జేసి కమ్మినవూ, మొగ్గలదండ దామది మున్కడఁ గాశిని విశ్వనాయకు న్దిగ్గన సంస్మరించి జననిం జనకుం దలఁచె. గ్రమంబునన్. కాశీ 5. 158.

**మునుకొనిపోవు** అ. క్రి. (మునుకొను[1] + పోవు)
ముందుకుపోవు

చం. మునుకొనిపోవ కెంతయును ముట్టక నిల్పక భావమున్ దనంబును వెలయం దగుల్పడక పొందుగ వాక్యలిభాగ మొప్పఁగా, నెనిమిది తానకంబులను నేర్పడి వర్ణము లుల్లసిల్ల నే, ర్పెనయఁగ వాచకుండు కడునిం పగురీతిఁ బఠింపగాఁ దగున్. హరి. ఉ 10. 282.

**మునుకొ(నొ్క)ను[1]** అ. క్రి. (మును[1] + కొను)

1 ముందుపడు, ఎదురుపడు

చ. మునుకొని యేను గాంతలును మ్రొక్కుచు నడ్డపడంగ నందఱం, గనుఁగొని ...
భా. రా కిష్కిం. 119.

కం కనుగొని మణిమందిరమున, మునుకొని కలధౌతభిత్తిముకురతలబహి, ర్జనితానుబింబ సమ్మలు, వనితారత్నములు, మెలఁగువల నెఱిఁగింపన్. వసు. 2. 24.

మ. ... వచ్చె ముని్కొని తాత్పర్యముతోడఁ గళ్యపుఁడు దక్షుంగాన సద్భక్తితోన్ ...
కు. సం. 1. 113.

చం. వనిత యొకర్తు ముని్కొని గవాక్షతలంబున నిలుతు లుండుటం, గనుఁగొనఁ జోటు లేమి నొక కార్యము పేరిట బాల నోర్తు వంచనఁ దొలఁగంగఁ బిల్చి రభసంబునఁ దత్సఖిజాలకంబు చే, కొనిహరిఁ జూచెఁ గేకిసలుగొట్టుచు బోఁటులు దాని నవ్వఁగన్. పారి. 3. 13.

2. ముందగు, తలకడచు.

చం అనుపమ సర్వసాధనసమగ్రతతో శుభవేళ వాస్తుపూజనబలిహోమతంత్రములు సద్విధిఁ జెల్లఁగ సూత్రహస్తులై, మునుకొని కోవిదస్థపతిముఖ్యులు శిల్పము లుద్యమింపన ప్పని గనవేగిరింపుఁ బ్రియభావనకుం దగఁ బొండకుండినన్ హరి ఉ. 2 150.

సీ అమృతంబు వెల్లువ యని నిలింపాదులు మునుకొని దోసిళ్ల ముంచి క్రోల.

గీ. ఇట్టులంబుగ వెన్నెల నిట్టవోడిచె .
విక్ర. 6, 69

3. పూను, ఉద్యమించు.

కం. అనిలజభీష్ములు దమతమ, మొనలకుఁ గన్నాకు లగుచు మునుకొని వడి న్వర్జనకుంభసంభవుల ప్రాపునఁ జూపిరి విక్రమంబు భూరిబలంబున్ .
భార. భీష్మ, 2. 291.

సీ. మున్ను వీఁడిచో్పన మునుకొని హోమంబు సలిపి భూతములకు బలులు నొసఁగి
భా, రా. యు. 1329, భాగ. 9. 398.

4. హెచ్చరికతో నుండు, జాగరూకుఁ డై యుండు.

కం. ఆ మిన్నంటిను గోకుల, మున నుత్పాతములు దోఁచె మునుకొనవలయున్ ..
భాగ. 10 పూ. 210

5. ప్రారంభించు, మొదలుపెట్టు.

కం. అని యిట్లు రంభ యూర్వశి, దను నాడిన పలుకు లెల్లఁ దప్పక యుండన్, మునుకొని చెప్పినవంతయు, విని వెడవెడ నవ్వి యమర విభుఁ డవ్వేళన్. వాల్మీ 3. 27.

ఉ. మోక్షము సర్వధర్మముల మునొ్కని కన్గొను దృష్టి తానయై యక్షయ మైన యీజగము లన్నియుఁ, దాన సృజించి ..
వాసిష్ఠ 2 206.

చం. అని యుచితప్రసంగమున నచ్చటఁ గొండొక సేపు నిల్చి యో, మునివరుఁ డీమహాగిరిని ముని్కొని పాటెడురక్తధారఁ యేఁ, గనుఁగొని తన్నిమిత్త మడుగం బనుచెంచి భవత్కటాక్షమున్, గని కృతకృత్యతం బొరయఁ గంటిఁ బురాకృత పుణ్యసంపదన్
భోజరా. 5 218.

స. క్రి. ముందుఁ బెట్టుకొను, పురస్కరించుకొను.

చం. ... విశ్వవేది విలసిల్లుచు నాతని భ్రాతృపుత్త్రిలన్, మ్మునుకొని తత్పురోహితుల మువ్వురనుం బిలిపించి యేరత, మ్మునన నిజకార్య మంతయును

బొచ్చెము లే కెటి గించి వెచ్చెఁన్

మార్క. 8 28

కం అని సంస్తుతించి యంచఱు, మునిగణములు మంకణముని మునుకొని .. భీమ 3 25.

**మునుకొను[1]** అ. క్రి. (మునుము + కొను)

1. వరుసపెట్టు.

క తనకుఁ గలయమ్ములన్నియు, మునుకొని యేయుటయుఁ బూని మున్నున్న తెఱఁగున నచల మొప్ప నిలిచిన, ఘనుఁడు మహోభవు ను నాకుఁ గానఁగఁబడియెన్ హ. ఉ 3 63

(ప్రాఁతప్రతిపా తెలుంగున నచ్చమునను అని క్రొత్తప్రతిపా.)

కం మును తోరణమునఁ బెట్టిన, ఘనతరపరిఘంబు లిలఁ గ్రాలఁగఁ గేలం, గొని చనుఁబట్టినదను జుల, మునుకొని వడి నేలఁ గూలమోది వధించెన్. భా. రా. సుం 470

చం. ... ఘోరపరాక్రమసంపదన్ మదిం, చిరన్నప సార్వభౌముల శచీపతిముఖ్యదిగీశవర్గమున్, మునుకొని గెల్చి పోవుచుఁ బ్రమోదము నల్పఁగ నిండు వచ్చితిన్ ... వరాహ. 4. 51.

2. అతిశయించు.

చం. మొఱసె ఘనాఘనంబులు తమోనికరంబులు మచ్చరించి .... మునుకొని కారుక్రమ్ముకొని ముంచె తజాండకరండమండలిన్ ...

విప్ర. 8 53.

3. వాక్యాలంకారముగాఁ గొన్ని యెడల నుపయోగింపఁబడును.

సీ. క్రూరార్ధచంద్రాస్త్రకృత్తోరుబాహు లై మునుకొని మురమురమూల్గువారు. ...

భా. రా. యు 1446.

**మునుకోల = మునికోళ** వి. కొరడా. కశ

సీ. పంకరుహంబులు బండికన్నులు ...

గీ. ... కైరవములు మునుకోల ...

కు. సం. 4. 489.

ప్రయోగాంతము కావలెను

**మునుకోలు.** వి. √మునుకొను: మునుకొనుట శ. ర.)

**మునుగట్టు** వి. (మును[1] + గట్టు ఉపయాత్రి. పూర్వపక్షతము

సీ మునుగట్టునులు... ఒట్టినయిం ప్ర గోపంపు ... కెంగుచ్చు లనఁగ ...

హ న న 4 6.

**మునుచే[1] = ముంచే** స క్రి √మునుఁగు. మునుఁగఁజేయు, మగ్నముగావించు. శ ర

**మునుచే[2]** అ క్రి √మును[1] మునుకొను. ముందుకడు

సీ మును తేఁడాయెనే మోహాక్రాహ... సామజపరిత్రాణమునకు .. వసు. 2 45.

**మునుపడు.** అ క్రి (మును[1] + పడు) మునుకొను, ముందగు

కం. వనజాతుఁడు మున్నరిగిన, మునుపడఁగా నతని నేనె ముట్టెద ననుచున్, జని మును ముట్టని వానిన్, మును ముట్టినవాఁడు నవ్వు మొనసి నరేంద్రా. భాగ. 10 పూ. 459.

ద్వి. మనసులు చల్లనై మదమత్సరములు,మునుపడ దిగనాడి మోహంబు విడిచి ...

ద్వి. హరిశ్చ. పూ 818 పం.

ఆ .. వచ్చుచున్నవాఁడు వనజాక్షి మారాజు, మునుపడంగ నన్నుఁ బనిచె నిటకు .

చని. 8 28

**మునుపు[1].** స క్రి (√మునుచే[2]) మునుకొనఁజేయు, పొడచూపఁజేయు.

ద్వి. వలుగడఁ జొఁనేయు నలినాప్తు పువ్వు, ములుకులు వెలి కింత మునుపుచందమున, వలమోహనాంగిచే యంటుటవలన, విలు వెల్ల పులకింప ... ద్వి. పద. మ. 4 295 పా.

**మునుపు(న్ను)[2]** వి. వా. (√మును) (త. మున్పు.) 1. పూర్వము, ముందు.

కం. .. కల్పసహస్రములకు మునుపట నేఁ జేసిన యీనువ్రతము దలంపునఁ బడియె భవత్ప్రసాదమున జగదీశా ..
వరాహ. 9. 3.

గీ. అంగి సుఖ మైన వంగంబు లటకు మునుపె చాల సుఖులౌట మనకు దృష్టంబు గాదె ..
ఆము 3 34.

కం. మగవానికంటె మునుపుగ, మగువ కెడలుఁ, బ్రాయ మంత్రు మూవవతి .. కళా 4 47

2. మొదలు, ప్రారంభము.

గీ. మునుపు మధురాన్నములు చవిగొనియె నేని, నడుమ లవణామ్లతిక్తముల్ నంజె నేని, పిదపఁ గటుకార్ద్రిభోజనం బొదవె నేని, బలము నారోగ్యమును జాలఁ గలిగియుండు
వి. పు 4 211

గీ. మునుపు గోసినయది యంటుకొనుచు నుండు, ననుచు విన్నార మట్టిచోద్యములు గనవె.
విక్ర. 2. 46.

సీ. మునుపుగాఁ జొచ్చినవనితలు చల్లెడియుద కంబునకుఁ జేతు లొడ్డుకొనుచు ....
కళా. 2 228.

విశే 1. తొల్లిటిది, పూర్వపుది.

కం మునుపటిభవమున నేఁ జేసిన పుణ్యము వలన మిమ్ముఁ సేవింపఁగఁ గంటిని ...
దశా 1 166.

ద్వి పటుతరభక్తి మువ్పటియట్ల నడిచె ...
పండితా. పురా 160 పొ.

2. అతిశయిల్లినది. బలవత్తరమైనది.

సీ. శుభముహూర్తంబున నిభరాజగామిని శివభక్తి మునుపైన శిశువుఁ గనియె ...
కాశ. 3. 27.

ద్వి. ధనధాన్యవస్తుసద్భటసమేతముగ, మునుపుగా గడిదుర్గముల ముంచినావె...
రం. రా అయో. 138 పొ. 8 పం.

3. దట్టమైనది, సాంద్రము.

ద్వి పడి మూర్ఛమునిఁగినపావనిం జూచి, యడరుచుఁ దలవరు లాచావుచేటు, గని పోదమనుచు నక్కడఁ జేరువందు, మునుపైన పొదలలో ముని గుండి రంత ...
నవ 2. 165 పొ. 2 పం.

**మునుమాటు** వి. (మూఁడు + మాటలు. మూఁడుపర్యాయములు, ముమ్మాఱు

కం అని శమనుఁడు మామూఁకకు, మునుమాటికిఁ జెప్పెఁ గాన మురరిపుభజనం,బునకంటె నితరమగుసాధన మున్నదె నరకజలధి దాఁటఁగఁ బ్రజకున్.
జాహ్నవి. 3 86

**మునుమా.డు** స. క్రి. (మునుము + ఆడు) వరుసపెట్టు

సీ. మోహనాకృతి యేల మునుమాడి కొనియాడఁ బుష్పచాపునివింటఁ బుట్టి రవఁగ ...
భీమ 1 88.

**మునుమి(న్మి)డు.** అ. క్రి. (మునుము + ఇడు) వరుసపెట్టు

చం. . . అనలం బయి నీదగునల్క లోకమున్, మునుమిడ కాల్పఁ జొచ్చినఁ గనుంగొని యేఁ గృప పుట్టి చెప్పెదం, జనునె మహోగ్ర కోపవివశత్వము నీకుఁ ద్రిలోకనాయకా.
భార. ద్రో 2. 164.

కం. పుష్కరషండములోఁ గల, పుష్కరమూలములు గబళములఁ గొనుచున్ సత్పుష్కరతలముల మున్మిడి, పుష్కరములఁ జెఱికిమైచుఁ బుష్కరమునకున్.
కు. సం 1. 94.

సీ. చండగదాదండసారణోద్ధతి యొప్ప మునుమిడి దనుజుల మోది మోది ....
మార్క. 6. 94.

ద్వి. ఎమ్మెలుఁ దక్క మున్మిడి తొల్చి తొల్చి, క్రమమైన భక్తింపఁగా లెక్కగొనక ...
పండితా. దీకా. 323 పొ.

స. క్రి. ఎదిరించు, మార్కొను.

ద్వి. మున్ను వృత్రాసురు మునుమిడి చంపి, సన్ను

తి-పఁగ దేవసంఘుంబుఁ గూడి, వెలుఁగొందు
దేవతావిభుని చందమున ...
రం. రా. బాల. 61 పా 31 పం

మునుము(న్మ). వి. 1. ఎదురు

కం. వీఁడొకఁడు కురుబలంబున, వాఁడిమగఁ
డనఁగఁ జాలువాఁ డిల్బంగిన్, వీఁడేమిసెడి
యెను ద్రోణుల, వేఁడెమి యిట మనకు
మునుము విక్రమమునకున్.
భార. విరా. 5 '10.

2 పురోభాగము, ఎదుటిచోటు.

కం ద్విరదము లొఱగెడివియు నెత్తురు గ్రక్కుచుఁ
గూలెడివి గదుపు లై కలయం దిగుడుపడి
యెడివియు భువిఁ, బొరలెడివియునయ్యెఁ
బవనపుత్త్రిమునుమునన్.
భార. భీష్మ. 2 218.

కం. అని పలికి రామచంద్రుఁడు, వినయం బలరంగ
లేచి వెలఁదియుఁ దాసున్, మునుమున నిలిచిన
మౌనులు కనుఁదనియఁగఁ జూచి చూచి గౌరవ
మెసఁగన్. శేష 4. 122.

వ. ... మునుములన్ గనుమ లొనరించుకొనం
బంచి ... మనుచ 4 37.

3. సేనాముఖము.

వ . అట్టియెడ నాచార్యుండు గయ్యంబు
సేయుమునుమున ధృష్టద్యుమ్నుఁడు దొలంగిన
తెఱపిం గదియఁ బాంచాలపతి దఱిమిన వప్పు
డగ్గురుండు నవ్వుచు. భార. భీష్మ 2. 278

4 వరుస, పంక్తి

గీ బాడుదల నొండెఁ బట్టుము పాండుతనయ,
ముఖ్యు వీరు వారన నేల మునుము వట్టి.
వైరివర్గంబు నెల్లను వారిసమరి, సైన్యయుత
ముగ నద్భుతజయము గొనుము
భార. కర్ణ 2 6.

ద్వి. కదుపులఁ గదలించి కసవును నీరు, ముద మారఁ
గలిగిన పొలముకుఁ దోలి, మునుముగా మేపుచు
ముందట .... పవ. 1 39 పా 12 పం.

5 వస్తుసమూహము.

ద్వి తాంబూలగంధ మాల్యాంబరాదులు మునుఁ
బున నొప్పించి తవయుంటఁ గలుగు, ధనధాన్య
ములు జీవితము మొదలైన, మును మంతయును
దెచ్చి ముందటఁబెట్టి
పండితా పురా. 62 పా

6 వ్యాప్తము, మునిమి

చం మునుమునఁ బుట్టె నాకు లోకముప్పుచపట్టి
భోజరా. 4 164.

(ప్రయోగాంతరము లభింపలేదు

7 తఱచుఁదనము.

ద్వి మినుముమునుమ్మ మునింగె ...
విష్ణు. పూ. 3 (ళ ర

8 కోసెడు పైరునకు ముందున్న పైరు.

గీ మునుమునా నలరు కోయు, పయిరుకును
ముందుపైరుగాఁ బార్వతీశ ..
అం. భా. 3. 22

విశ. తఱచు, అధికము,

కం అడిగెడువారలు మును మయి, పుడికెడువాఁ
డొకఁడు లేక పురుషాల్పతయై, పడఁతులు తఱ
చై కులములు, సెడి యన్యులు ప్రబలి జగము
శిథిలత నొందున్. హరి ఉ. 9. 41

చం అనిన త్రివిక్రముండు మొదలైనపురోహితు
లన్ గ్రహాశివూ, జనములు సేయఁ బంచి
మృదుశాలిమయాన్నముఁ బాయసంబులన్,
మునుముగఁ బిండివంటలు సమూహముగా
నొనగూర్చి యిష్టభో. జనముల భూసురుల్
దనియ శాంతి దలంబుగఁ జేసి రక్తితోన్.
ద్వా 10 22

జ. మునుమాడు, మునుమిడు, మునుముకొను

మునుముకొను. అ. క్రి (మునుము + కొను,
వరుసపెట్టు.

గీ. హరుఁడు బెట్టుగ నవ్వి పెల్లార్చుటయును, విని
సముద్ధతాఁయమున దనుజకోటి. మునుగఁ బఱ

తెచ్చి తాఁకిన మునుముకొని వ్రధించి యిల
యెల్ల నెత్తుట ముంచె నతఁడు.

భార శాం. 3. 447.

కం వనముల వనములభంగిన. గొనివత్తుము కొండ
లెల్లఁ గుంభిని బ్రవయ్యన్, మును ముకొని పెఱికి
తెత్తుము, వనరాశికి మిగిలె నేని వైతుము
లంకన్. భా రా యు 729

**మునుముట్టు** అ క్రి (మును[1] + ముట్టు)
1 మొదలు తాఁకు, మొదలంటు.

కం మునుముట్ట నెఱిఁగి శ్రాద్ధం,బునకుం గై కొనుట
మేలు భూసురునిం గై,కొని యరసి కాఁడనిన
నా, తనియమ్మలిఃంబు నెఱచు ధార్మికు
నైనన్ భార. అను 3 182.

(తొలుదొల్త, ప్రప్రథమమున అని భావము)

కం. అనుటయు వారందఱు హం,సునితో నిట్లనిరి
రాజనూయమునకు మీ,జనకుఁడు దొడఁగినఁ
జాలును, మునుముట్టన వత్తు మిందు మోసము
గలదే. ఉ హరి 4. 40.

2. మూలమంటునట్లుగ, సమూలముగా.

మ. ఘన మైనట్టి తపోధనంబు నెఱయంగాఁ
బోయినన్ బోవనీ, మునుముట్టంగఁ బ్రబోధ
వాసనల పెంపు ల్మాసినన్ మాయనీ, వనితా
ఁత్నముఁ గూడ కెట్లును దమిన్ వారింప లే
వియ్యోడన్. శా 3 28

3 సాంతముగు, తుదదాఁకు

ద్వి మునుపు పల్కులతుదల్ మునుముట్టఁ జదువు,
బనుల దుర్గములు నిచ్చలుబాధ సేయ ..

అ. మ క 1. 10 పొ 21 పం.

ద్వి .. అపరాత్పరుఁడు, మూఁడుకాలంబులు
మునుముట్ట నెఱిఁగి ..

ద్వి. పరమ 1 20 పొ

వ. .. లలాటేక్షణ జ్వాలాజాలంబు మునుముట్ట
నిగుడించి ... భీమ. 4. 139.

**మున్కా(నుక)లి.** వి. (√మును[1]) ముందు
అగ్రభాగము.

గీ. పొసఁగఁ దెలిజీబుమునుఁగుతో నెసఁగి చెలులు
బొదవి నడిపింప మున్కాలి మది వికాస, మమర
విభవంబుచే రమాభ్రమర వేణి, మెలసి వర
లెడుతెరఁ జొర నరుగుటయును

ల. వి 5. 80

**మున్నడి** విణ (మున్ను + అడుగు. వృత్తినివర్ణ
వికారము) అగ్రేసరుఁడు, ముందునడచువాఁడు

ఉ సాదలసత్సహస్రకరశాఖలతో నిముఁ డుగ్ర
మూర్తియై, ఘోరతమమ్ములం దొరఁగఁ గోరిన
మున్నడి యై యనూరుఁడున్, ధీరత మీర
నయ్యెరులతేఁకువ మాన్పె ...

కృ శకుం 3 56.

క్రి విణ ముందుగా

ద్వి. నగరివాకిటనె మున్నడి తేరు డిగ్గి ...

రం రా అయో. 129 పొ 16 పం.
(శ ర. పా)

నగరవాకిట సమున్నతి రథంబు డిగి ముద్రిపా.

**మున్నరక.** వి (మున్ను + అరక.) 1. తొలి
దుక్కి

గీ మున్నరక యనఁ దొలిదుక్కి బొదలు
ముందు అం భా 2 233

2. కష్టస్థితి, (ఇది యుభయయతులలోనిది
కావచ్చును).

చం సరకుగొనందు నన్నుఁ దనచాయల పాతి
నసంచె మత్సరం, దరివిభు సడ్డసేయక యితం
డని రాఘవునాలిజాలి మున్నరకుఁ దెచ్చు
పోలిక ఘనాఘనమాలిక తత్ప్రియానమా,
హరణజయాళి లాళలను నాఁగె సగర్జిత సింహ
నాదయై. చం. రా. 6 52.

గీ. తెరు గఁ పఁగ మాయన్న దిగ్గె నన్ను, నేయ
నేరిపె వింట నొక్కింత నాకు, నావదినె సత్య
భామ మున్నరక యైన, నిలిచి మున్నర
కాసురుఁ గెలిచెఁ గాదె. విజ వి. ప 143.

3. ధైర్యము,

కం. ఇందుండి పోఁగువాఱుం, డందఁడున్ వలల

మో॰ నూలిమగువచూలి, జాళితోఁగూడి వన పాళికేళి సలుప, నుల్లము జనింప గహిమించి యొక్కనాఁడు .. ఉ రా 6 19.

**మున్నీటిరాచూలి** = 1 చంద్రుఁడు

సీ మున్నీటి రాచూలిముక్కఁ గెంజడలోనఁ గ్రొవ్వరిగాఁ దాల్చుకొన్న మేటి ..

ఆ భా. 1 37

2 శ్రీ సాగరకన్యక, లక్ష్మి

**మున్నీటిరాణి** = సముద్రకాంత గంగ.

వ అని యమ్మున్నీటి రాణి చెన్ను మాటికిం గొని యాడుచు, గొంతదవ్వాగి యచ్చట.

యయా 2 47.

**మున్ను** = మును[1] వి, ఔ 1. ముందు, పూర్వము

ఆ అన్న రేంద్రుచేత మున్న గృహీత మై,యున్న నాకటంబు గ్రస్సనింప, నొరున కర్హ మగునె పరిణయ విషయమై, ధరఁ బరిగ్రహింపఁ బరమమూర్తి భార. ఆది. 3. 168

కం. మున్ను గలగోపవర్గము, నిమ్నుం గని కొలిచి భక్తి నీవని సేయన్ ... భాం విరా. 1 288.

వ . ఏకోదకమగ్నంబు లైన బ్రహ్మాండంబుల నారాయణుఁడు వరాహరూపంబున రసాతలం బువలన నుద్ధరించి మున్నటియట్ల నిలుపుచుండు. వరాహ 10 178.

2. పూర్వజన్మము

సీ నే శుకకీటంబ నేఁ బుండరీకంబ నే ఖంజరీటంబ నేను దోమ ..

గీ. నేను మానిసి మున్నంచు నేకతమున, నొం డొరుల తోడుతను జెప్పుకొనుచు రుబుసుఁ, దాక బ్రహ్మమణి పేటి దత్తవాటి సంభవిం చిన ప్రత్యగ్ర చంద్రధరులు. శ్రీరు. 4 83.

3. తొలి, మొదలు.

ఆ ఇట్టు లగుటఁ జేసి యెవ్వరిసెనకు శోకంబుఁ బొందఁ గారణంబు లేదు, జీవుఁ డెల్ల భంగిఁ జెడియెడు వాఁడుగ, దలఁచి నేని వగవ వలదు మున్న భా భీష్మ 1 197

మ మగువాలారు శాంబులం దొంగు సమ్మతి దేసతోఁగూడి య,య్యావి దాడికిఁ బడి పుంగ వగవీ హైయ గక్కిన బు ని,గ్ధర హర్షంబు నొనర్చె మున్ను రుచిసౌఖ్య బుణం బిమ్మ టన్, మఱియుం ద్రోయుమ నించె నెమ్మనమున్ మూరార్ఘసముచ్చాయముల్ నైష 3 99

చం వెలయఁగఁ బెట్టుకోఁ దనము వేసవిఁ జందన చర్చ మును గన్ అము 1 81

(దీని యామ్రేడితరూపము మున్మున్న, ముమ మున్ను మున్ను మున్ను)

కం. విప్పి చరకుఁడు జనులకు, నెచ్చుట మును మున్న వలయు తెఱఁగా నికిన్ . .

భాం విరా 4 248

మ. క. 1, 12 పా 7 పం

చం. నరుఁడని లెక్క సేయఁడు మనంబున శాత్రవు నమ్మహాత్ముచే, యధ్యయనముఁ బెక్కుచోట్లఁ గనియుఁన్ మననాయకుఁ జేమిచెప్ప నిద్ధుని మునుమున్నుగాఁ దేరిన తోడుగ నిన్నెటులైనఁ దేర యిట్లరిపుత భీష్మహారి వనయంబును దుర్బలుఁడయ్యె నట్టిటూ రాఘవ 4 192

(రామాయణార్థమున)

విజ 1. తొలుతటిది, తొలిజన్మము నందలిది

ఉ మున్నిటికట్టికంబు గడు మోహనమై నన నున్న వచ్చివన్ కా 3 116.

సీ మొత్తునాతఁని జూని మున్నిటి దుష్కృతములు పోయె ననుమను నలఁపరాయ

ప్రబోధ 4 27.

ద్వి మున్నిటి ఘోరాఘములు పెరుఁ ద్రెవ్వ, నన్నింటిఁ దనస్ఫూర్తి యనువర్తిఁ బఱఁగి

ద్వి పం మ 3 25 పా.

3. ముందువాఁడు, అగ్రేసరుఁడు, ముందున్నది.

ఉ పాండున్నపాలనందనులు పాయని మున్నుగ నేది యప్డు భీష్ముఁడు గదఁకమై నడుమ

ప్రత్యేకంబ ముప్పంద్రు దాసుల నొప్ప నిచ్చి.
భార. సభా 2. 121

వ. నానాదేశీయాగతులై నతపసులు బ్రాహ్మ ణులుంగా ముప్పణ్ణిఖులం బేరొక్కనికం పదివగ్నిది-యైనడుగ్గు బ్రాలకు . . ద శా 4 1248

**ముప్పటి(ల్లు)లు.** అ్రీ. బ్రాంగి కొంచెము చల్లారు, కవోష్ణమగు

సీ. క్రమముగ దాదు లక్కడను ముప్పటిలినజల ంబు దేర్చి యా చెలువనుతుని, కొనరంగా ంగ టుకయును జుక్కబొట్టును బాటించి—
ద్వా 3 42

**ముప్పదా(డియా)ఱుగు(ర్గు)రు** న. (ముప్పది + ఆఱుగురు) ముప్పదియాఱుమంది, షట్త్రింశత్స ఖ్యాకులు

సీ ఉరులీల ముప్పదార్గురు తుషితులతోడ నెన మంద్రు వసువులు నెనసి కొలువ .
ఉ రా. 4. 289.

**ముప్పది** న. ఔ (మూడు + పదులు) మూడు పదులు,

ఉ తొయ్యలి పీరె వేలుపులు తూర్పున ముప్పది మూండుకోటులు .,
నైష. 5. 21.

కం. ఎప్పుడు హరింగని రమరులు, ముప్పదియును మూండుకోట్లు ...
ఉము. 4.12

వ .. కుటటూరి దక్షనామున చెఱువు దక్ష నాతాన లాప్పదిపుట్లు విత్తుపట్టు ...
ద శా. 4. 1015

మ . కటిరారాజచ్ఛరాసంబు ముప్పది వాల్లూషులం ద్రుంచి ...
ఉ రా 4 302., ఆం భా 2 168.

**ముప్పదిరెంటిగుంపు.** వి (ముప్పదిరెండు + గుంపు) ముప్పదిరెండుచుక్కలుగల నక్షత్రము రేవతీనక్షత్రము (శ..ర.)

**ముప్పదివా(పా)టు.** వి. (ముప్పది + పాటలు) మూండుపదుల సంఖ్యగల పాటలు.

ద్వి. అందు ముప్పదివాట నారంగనిలయు, వంది తామరునిం గై వారంబు సేయు .
ద్వి. పద్మ. 3. 231 పొ

**ముప్పర్వునేల.** వి (√ మూండు.) మూండు కోసుల దూరము

సీ. ఇరువర్వునేల ముప్పర్వునేల, యనినం గ్రోశద్వయత్రయాఖ్యలు చెలంగు . .
ఆం భా. 2 9

**ముప్పాతిక** వి (మూండు + పాతికలు) ఒక వస్తువునందలి నాలుగు భాగములలో మూండు భాగములు మూండు పాతికలు.

గీ . నాదోనవణము, వఱలు ముప్పాతిక యనంగ .
ఆం భా. 2 272.

కం. ఒప్పునది వెన్న వెదురక, పుప్పము వన్నియకుం దెచ్చు భువి నిదియన్నన్, ముప్పాతికరంగం బున, నొప్పు మహోర్మిల మతికుభోన్నతి నిచ్చున్.
రత్న 54.

**ముప్పావు** వి. (మూండు + పావులు) ఒక వస్తువు నందలి నాలుగువంతులలో మూండు వంతులు, మూండుపావులు (శ. ర. వా.)

**ముప్పావులా.** వి. (మూండు + పావులాలు) ఒకరూపాయలో నాలుగువంతులలో మూండు వంతులు, మూండుపావులాలు (శ. ర.)

**ముప్పిడి** వి (మూండు + పిడులు) బాకు, కటారి

సీ మృదుపదాంబుజములు మెఱుంగుటందెలు బైండిదుప్పటియును మొలముప్పిడియును .
క శా. 2. 123,

వం సేవులు వెట్టం గోల్పులికిం జేయికి ముప్పి గుప్పుకౌక్ష్యవం, తులంగని ...
పరాహ 4 86., పారిజా 2. 8.

విఱ. దీర్ఘము, పెద్దది,

ద్వి. మొగవులమోంనూలు ముత్యాలకుచ్చు, విశసి చూపట్టుముప్పికటారం బు .
ద్వి పద్మ 2 94 పొ.

ద్వి విన్నాణమైనముప్పిడిహాడపంబు, కన్నులకల్కి యొక్కతె దాల్చి యొప్పు ..
ద్వి పరమ 3 19౦ పొ

**ముప్పిర.** వి (మూఁడు + పిరిలు) మూఁడు పిరలు, కానిలో మూఁడువంతులు. (శ ౦.)

**ముప్పిరి** వి (మూఁడు + పిరులు) ముప్పేట, త్రిసూత్రి

ద్వి ముడి విస్తరిల్లె భూనుతకుఁ జిట్టుములు, జెడి దంబుగాఁగ ముప్పిరిఁజేసినట్టు, నాయు నీల చ్ఛాయ నమరె ...
రం రా. ఉ. 118 పొ 17 పం

మ .. ఆశ్చర్యకౌ, తుక విభ్రాంతులు ముప్పిరిం బెనఁగఁ జేతోవాతజాతంబునన్
పె. శకుం 7. 116, ఆం. భా 3 295.

విణ. మూఁడుపేఁటలు గలది, మూఁడుపిరులు గలది

ఉ. ... ఏను మనంబున నద్భుతంబుతో, ముప్పిరియైన కౌతుకము మోదము నెక్కొన నాకు సత్కృపం, జెప్పెదుఁ గాక యెట్లునని చేరతి...
భార. అను. 1. 376.

గీ. తళుకు బంగరు ముప్పిరి తగటువోలె, నున్న యది మేను ... వాల్మీకి 3 119.

**ముప్పిరిగొను = ముప్పురిగొను** అ క్రి (ముప్పిరి + కొను) 1. మూఁడు పిరులుగాఁ బెనఁగొను

కం ఆదరము సంభ్రమంబును, మోదంబును దన మనమున ముప్పిరిగొన నా, భూదయితుఁడు వివిధప్రియ, వాదంబుల గారవించె వారి నెల్లన్. పిరా 1 2 0

కం. తనపాలి మృత్యుదేవత. యనుశోలెడు వచ్చి యిట్టు లున్నమహోత్సుం, గని దైత్యేంద్రుఁడు విస్మయ మును భయమును గొతుకంబు ముప్పిరి గొనఁగన్. హరి. ఉ. 9. 200, నైష. 1. 76.

2. పెనఁగొను, చుట్టుకొను.

కం అనవుడు జనపతి నెమ్మన, మునవచ్చెరువాటు మునము ముప్పిరిగొనఁగా ..
నిర్వ. 10. 140.

కం. ఎప్పుడు నీసందేహము, ముప్పిరిగొను నాదు చిత్తమున నిది దెలియం, జెప్పు మన . .
వరాహ 11. 4

కం అప్పుడు మునివరులందఱు, నప్పాపాత్మకుని వలన నవమానితులై, కప్పినకోపాగ్నిశిఖల్, ముప్పిరిగొనఁ గలుషవాక్యములు దమలోనన్
వి పు. 2. 118, కాశీ 4. 101.

3 అతిశయించు

కం. అప్పుడు మదిసానందము, ముప్పిరిగొన నమక చమకముఖమంత్రంబుల్, చెప్పుచు మ్రొక్కుడు భూవరు, నప్పరమేశ్వరుఁడు వరము లడుగు మటన్నన్ . వరాహ. 9 ౭౧

ద్వి అప్పుడు విజయుఁడై యయ్యింద్రజిత్తు, ముప్పిరిగొను ముదంబునఁ దన్నుఁగొలుచు, వారును దానును వడి లంక కరిగి, యారావణునిఁ గాంచి యప్పు డిట్లనిరి.
రం. రా యు. 861 పొ. 15 పం, వసు. 6. 93.

**ముప్పిరిగొల్పు** స. క్రి (√ముప్పిరిగొను) మూ డుపిరులు గలుగునట్లుచేయు. త్రిగుణితము చేయు.

ద్వి దివ్యాంబరావలును, పేని ముప్పిరి గొల్పి పేఁగనేతిలో నుంచి యాయగ్నిలో దరి కొల్పి .. బస. పు. 7. 319 పం.

**ముప్పు.** వి (క తు ముప్పు. త మ. మూప్పు) 1. ముదిమి, వార్ధకము

గీ ముప్పునకు నోమదయ్యెనె ముగ్ధ యీయ, శోద నందగోపునకుగ్రశోకజలధి, యీఁడఁ గొలఁది గా దయ్యెనె యిట్టి దైన, యడరు వెట్టెనె పెన్నిధియనుఁగుబిడ్డ.
హరి. పూ. 7 4౨.

గీ ముదిసి ముప్పునఁ బెండ్లికై మొగమువేల్పు.

జగవు గాదని రాఁదయ్యె దాతవేల్పు.
నైష. 4. 129

ఆ. శిరము నొవ్వఁ దొడఁగెఁ జెవరె మనం బంతఁ, గడిఁది దైయన ముప్పుకాలమునకు
భాగ 6 61

సీ .. ముదిమి ముప్పనఁ దగు ముసలితనము
ఆం భా 2. 118.

2 హాని, చేటు, ఆపద

కం. చనువాని చేయుకార్యంబున కడ్డము సొచ్చి నేరుపున మెలఁగుచుఁ దా, నను బయిఁ బూసి కొనుటఁ దన, మును మెలఁగిన మెలఁకువకును ముప్పుగుఁ బిదపన్. భార విరా. 1 125.

ఆ తప్పఁ జూడఁ దగునె ముప్పున కయ్యెద, వనుచు నాదికాలముననె నమ్మి, నిన్ను నింట నిలిపి నే నీకు నాబిడ్డఁ, బెండ్లిచేసినాఁడఁ బెద్ద వాఁడ
రామా. 7 119

గీ. ముదిసి పెండ్లాడఁజూచిన ముప్పు గల్గు ...
రామ. శ. 50

ముప్పుత్రిప్పులు = శ్రమలును, చిక్కులును,

సీ. ముప్పుత్రిప్పులులేక ముప్పదిమూడుకోటులు సుధాంధసులు నీవలన బ్రతుక . .
వరాహ 7 26.

(వ్యవ) అతఁడు నన్ను ముప్పుత్రిప్పులఁ బెట్టి మూఁడుచెఱువులనీళ్లు త్రాగించినాఁడు

ముప్పుడు వి ఓషధివిశేషము, ఒకజాతిచిన్న మొక్క

సీ కుప్పి సూర్యక్రాంత ముప్పుడు వరి పెండు గాడిదగడప కన్నెకొమర .
హంస 4 10

ముప్పురి = ముప్పిరి వి. (మూఁడు + పురులు తు ముప్పురి మూఁడు మెలికలు)
(చూ, ముప్పురిగొను)

విశ మూఁడుపేటలు గలది, త్రిసూత్రము

మ. అరవిందంబులరీతిఁ జెన్నలరునీహస్తంబులె ట్లౌరె ముప్పురిగాఁ బెన్చినకాలపాశములకున్ ముగ్ధాంగనాగానత, వ్యాసోత్కర్షములైన నీ శ్రుతియుగం బత్యర్థతోర్వీపతిం, కరం బాదా ర్వృతి కెట్లు దాశె మదనాకారా మనో నాయకా
బిల్హ 3 73

ముప్పురిగొను = ముప్పిరిగొను అ క్రి (ముప్పురి + కొను) మూఁడు మెలికలు కలదగు

వ చెప్పరాని వేడుక ముప్పురిగొన విచ్చలవిడి డాఁగి ముచ్చులాడునెడ ..
చంద్రి 2. 18.

ముప్పుపటాలు వి (ఔ మూఁడు + పురుడు + అలు) పురుటి మూఁడవనాఁటిబాలింతరాలు

సీ బాగింపి రంచితోత్సవము ముప్పురుటాలి వైభవంబు తృతీయవాసరమున
పి శకుం 4 62

ముప్పూట వి (మూఁడు + పూఁటలు,) మూఁడు పూఁటలు,

శా ఆ రాజున్ దేవియు మంత్రపూతముగ హోరాత్రపుఁబూగుత్తులన్, బూజల్ సేయుదు రచ్చలం జెలఁగి ముప్పూఁటంబురా రాతి కిన్
రాజ చ. 1 71.

ద్వి ముప్పూఁట నోగిరంబులఁ బదార్థములఁ దప్పక కావళ్ల నెప్పుడుఁ బంపు ..
బస. పు 2. 186 పం

ముప్పెట్టు వి. (మూఁడు + పెట్టులు.) మూఁడు చుట్లు (చూ, ముప్పెట్టు వెట్టు)

ముప్పెట్టు వెట్టు అ క్రి. స క్రి (ముప్పెట్టు + పెట్టు, మూఁడుచుట్లు తిరుగు.

మ విని వేగంబునఁ బాఱుతెంచి యమునావేగం బునన్ . ., మునిఁగెన్ వెంట హలాయుధుండు దఱుమన్ మోహాంధకారంబులోఁ మునిఁగెన్ దజ్జల మెల్లఁ దల్లడపడన్ ముప్పెట్టు వట్టన్ ఎడన్
ఉ. హర 4 298.

మ భవదన్వేషణ తత్పరత్వమున భూభాగంబు ముప్పెట్టు వెట్టి ...
దశకు. 7 3.

ద్వి వెనువెంట మును పొంచికొని యున్నవిప్రు,లను నెఱింగియు నెఱుంగని యట్లు గూడ, నప్పాట నూరెల్ల ముప్పెట్లువెట్టు, చొప్పేగు పడి యుండు .. పండితా దీక్షా 4, పా

**ముప్పేటం[1]** వి॰. (మూఁడు + పేటలు[2]) మూఁడుపేటలు గలది

సీ. ముప్పేటఁ బెనఁగొన్నముఱిఁజచ్చనిగోఁచి వెలిపట్టు పంచయు మొలఁ దనర్చ దశా 5 81

సీ ముప్పేట ముంజితో మొనయు మేఖలరేఖ ధరియించి వలయభూధరము వెలయు సమీ: 2, 2

వి. త్రిసూత్రి ఆం భా 2 295.

**ముప్పేట[2]**. వి॰ కొ తపలకు ముదిరిన?. కొబ్బెర కాయ )

(వ్యవ) ఈ కొబ్బెరకాయ తింకను ముప్పేట గానే యున్నవి

**ముప్పేఁటలాడు** అ క్రి (ముప్పేట లు1 + ఆడు, సంతోషముచే నుప్పొంగు

వ . అభీష్టప్రాప్తి రూపప్రీతిసముచ్చయం బునకు ముప్పేఁటలాడుచు నొక్క సుము హూర్తదినంబున . మృ వి 3 19

**ముప్పొంగు** అ క్రి. (మూఁడు + పొంగు) ఉప్పొంగు, మూఁడుపొంగులు పొంగు

ద్వి మునుపటివలెమేను ముప్పొ గుచున్న, మునిపతి చూచి సమ్మోదంబుఁ బొంది ద్వి భ పా. ?, ?4? సం

**ముప్పొత్తులు** వి. బ (మూఁడు + పొత్తులు) త్రిరావృత్తమగుసంబంధము, మూఁడుకలయికలు, (అర్థ‌సిద్ధి. అని ?. ?.)

**ముప్పొకలాఁడు.** వి॰. ముప్పోకల + వాఁడు) త్రిగుణాత్మకుఁడు, (భగవంతుఁడు.), మూఁడు త్రోవలు త్రొక్కినవాఁడు

క॰. జారుఁడు జన్మావధియును, చోరుఁడు ముప్పోక లాఁడు మునుహితపూజా, చారక్రియలకు నర్హుఁడె, వాఁక యితఁ డనుచు నశుభవాక్యములు న్బ్రుత్తన్ భాగ 10 ఉ 7?1

(అనియమప్రవర్తకుఁ డని భావము)

**ముప్పోకలు.** వి. (మూఁడు + పోకలు) పెక్కు త్రోవలు.

సీ ఈనడవడి యని యెట్లు వక్కాణింతుఁ బాని ముప్పోకలఁ బోవనేర్తు . భాగ 8. 552

**ముప్రొద్దు** వి (మూడు + ప్రొద్దులు) మూఁడు పూఁటలు

మ. వ్రదుమృష్టాన్నము తీసక్రాంమున నెమ్మిన్ వారు ముప్పొద్దుఁ గొన్నిదినంబుల్ భుజి యి చిరి వైష 6 ?42.

ద్వి ముప్పొద్దు ప్రాణలింగప్రసాదంబు, సుప్ర సన్నత జంగమప్రసాదంబు .. బ. స పు. 5 609 పం

**ముప్రోళ్లు** వి. బ. (మూఁడు + ప్రోలులు) త్రిపురములు

ద్వి. ముక్కంటిచిచ్చున ముప్రోళ్ల నేర్చ మిక్కుటం బగుటఁ దొమ్మిదియవలీల .. పండితా వాద. 225 పా.

**ముబ్బడి = ముమ్మడి** వి॰. (మూఁడు + బడులు) మూఁడురెట్లు గలది, త్రిగుణితము

(చూ. ముబ్బడించు )

**ముబ్బడించే = ముమ్మడించే.** అ. క్రి. ($\sqrt{}$ముబ్బడి, మూఁడురెట్లు కలదియగు)

**ముబ్బాములు** వి బ (మూఁడు + బాములు) పెక్కుకష్టములు

మ మునుబృందారకదానవోరగముఖుల్ ముబ్బా ముఁ బడ్డవా, రని నాచే నని యుండు దోర కుటిలవ్యాపార ... భా. రా యు. 820.

**ముముక్ష.** సం వి. అ. స్త్రీ 1. మోక్షేచ్ఛ. ముక్తినిఁ గోరుట. 2. విడువ నిశ్చయించుట.

**ముముక్షువు.** సం విణ (ఉ) 1. విడువ నిచ్ఛ గలవాఁడు విడిచిపెట్ట నిచ్ఛ గలవాఁడు. 2 సంసారసంఘము విడువ నిచ్ఛ గలవాఁడు ముక్తికై ఇచ్ఛ గలవాఁడు.

**ముముచానము** సం వి అ పుం. మేఘము మబ్బు.

**ముముషిషువు** సం.విణ (ఉ) దొంగిలింప నిచ్ఛ గలవాఁడు.

**ముమూర్ష** సం వి అ స్త్రీ. చావనిచ్ఛ, మరణము పొందఁ గోరిక

**ముమూర్షువు** సం విణ (ఉ.) చావనిచ్ఛ గలవాఁడు

**ముమ్మడి = ముప్పడి.** విణ (మూడు + ముడుఁగులు[4]) మూఁడురెట్లు గలది త్రిగుణితము

కం. ఇమ్మడి మనుమని తమ్ముఁడు, ముమ్మడి దానమునఁ గర్ణుముమ్మడి నా శౌర్యమ్మున సురపతి సుతునకు, ముమ్మడి నా వినుతికెక్కెముల్లోకములన్. దశకు 1 78.

చం. .. ఉగ్గడు వగుధీంతన్ సురవగప్రవరుం డనఁ గ్రోధమాంబము, మ్మఁడు బెడఁ గొందె రూపు మహిమ నమ్మరుముమ్మడి యై జగంబునన్ భోజరా 1 33

కం. విశ్వప్రియులఁ గుమారుల, శాశ్వతులను నల్గురన్ బ్రసన్నులఁ గని య,య్యైశ్వరునికంటె ముమ్మడి, యైశ్వర్యము గాంచి దశరథాధిపుఁ డలరెన్ రామా 3 122.

వి మూఁడురెట్టులు, త్రిగుణము.

(చూ. ముమ్మడిగొను)

**ముమ్మడించు = ముప్పడించు** అ క్రి (√ముమ్మడి) ముమ్మడిగొను (ముమ్మడియగు శ. ర.)

**ముమ్మడిగొను.** అ. క్రి. (ముమ్మడి + కొను) మూఁడురెట్టులు కలది యగు, మూఁడుముడుఁగులు కలది యగు

ద్వి. రమ్మశ నీవిటకుఁ బుత్రస్నేహ మాత్మ. ముమ్మడిగొన దదేమో కాని నీకు ... నవ 1 26 పా 10 పం.

**ముమ్మడుఁగు** వి (మూఁడు + ముడుగులు) మూఁడురెట్లు

సీ తత్ప్రతన మూట, గుణిత మైనఁ జము వగున్ మఱి దానిము మ్మడుఁ గనికిపిఁ మాఖ్య నొనరు .. భారి అది. 1 80

**ముమ్మనుమఁడు.** వి (మును[1] + మనుమఁడు) మునిమనుమఁడు.

సీ నిడురపెన్నిఱిగుంపు జడగట్ట సగరుముమ్మనుమండు తపము గైకొనినచోటు . మనుచ 2. 9

**ముమ్మనుమరాలు** వి (మును[1] + మనుమరాలు) మునిమనుమరాలు (శ ర.).

**ముమ్మరము** విణ (త. ముమ్మరం) అధికము, మిక్కుటము, తీవ్రము.

సీ చిలుకు రాగరసంబు చిత్తడిచే ముమ్మరముగాఁ బులకాంకురములు మొలవ .. వరాహ 3. 10.

ఉ నిద్దురవోవుచున్న యెడ నిశ్చయమైనవిధంబు దోఁపిన, నొ్నద్దికఁ జేరి కూడి సుఖ మొందఁగఁ జేసి భ్రమించినట్టియా, ముద్దులు గుల్కు జవ్వనపు ముమ్మరపుం నెఱజాణ యెవ్వఁడో అని. 2 67

సీ మాసి కండూతి ముమ్మరమైనఁ గట్ట దుదాపించి వేఱొక్క వల్కలంబు ... పి శకుం 4. 121

ఉ .. నన్ను నీ. కొమ్మలు నమ్మినారు మరు కోలలఁ గ్గము నేసి పోవఁగా, ముమ్మరమైన తాపమున మ్రొగ్గెదరో భాగ 10 పూ. 1214.

గీ, ముమ్మరముగ నన్నేఁచ మోడి దగునె, చేమముఁ జాలించు పరిపూర్ణ చంద్రవదన ... ప్రబంధ. 7.8.

వి సా ప్రత. చిక్కన. దట్టము.

వ మవ్వంపుదుప్పటంబుం తెరలముసువు లనం
గ్రమ్మనపూదుమ్మురముమ్మరింబులం గొమ్మలం
గానక .. యయా 4 18

ఈ ముమ్మరించు

ముమ్మరించు అ క్రి (√ముమ్మరము) అతిశ
యించు.

సీ ఘనవేణివేణికాంగారు మూరిసినంత మోహాంధ
కారంబు ముమ్మరి చె .... శశాం 4 53

గీ మోదభయభక్తు లాత్మలో ముమ్మరింప, వ ద
నాలి గనాదుల వారిఁ గూర్చి, చిలుక
యానందరసములు చిలుకఁ బలికె ...
తపతీ 3 24.

ముమ్మలు = ముమ్మాలు. వి (మూఁడు +
మాలులు) మూఁడు పర్యాయములు.

గీ ధాన్యముష్టి గులా మెత్తి దాన నిత్య. మేక
తంబునఁ దా స్వయంపాక మాచరించి సాపాటు
సేయుదు నంచు నతని, మొఱఁగి తనయింటి
కేఁగి ముమ్మలు భుజించు. వైజ 2 122.

ముమ్మాలు = ముమ్మలు వి. (మూఁడు +
మాలులు) మూఁడుపర్యాయములు, మూఁడు
తడవలు.

మ విను మంభోజభవుండు మున్ను మదిలో వేదంబు
ముమ్మాలు నెమ్మనమందుం దలపోసె ..
భాగ 2. 35.

కం అమ్మదనాగేంద్రంబును, గుమ్మరసారెగతిఁ
జుట్టుకొని పడి దిరుగన్, ముమ్మాఱె
యనుచుఁ జూవలు, ముమ్మాలుం బొగడి
రొక్కమొగి నవ్వేళన్, శశాం. 5. 29.

ద్వి కిసరు దాఁకక యుండఁ గించిత్తు నొసల,
మసిబొట్టుఁ బెట్టి ముమ్మాలు దూపొడువ.
ప్రభు 2 4? పా. 24 పం

ముమ్మాఱె అవ్య ఆశ్చర్యప్రశంసాదులను
దెలుపును

కం. అమ్మదనాగేంద్రంబును, గుమ్మరసారెగతిఁ
జుట్టుకొనివడి దిరుగన్, ముమ్మాఱె యనుచుఁ
జూవలు, ముమ్మాలుం బొగడి రొక్క మొగి
నవ్వేళన్ శశాం 5 29

ముమ్మాసములు మి. వి బ (మూఁడు +
మాసములు) మూఁడునెలలు

కం. ఘనరహిత మైనమెఱుపు జముని దెనఁ గను
వాఁడు దెల్ల ముమ్మాసములన్ ...
జై. భా. 8 99.

ముమ్మూఁడు స (మూఁడు + మూఁడులు)
మూఁడుమూళ్లు, తొమ్మిది, త్రిరావృత్త మైన
త్రిసంఖ్య

ఆ. మూఁడు మస్తకములు ముమ్మూఁడు గన్నులు,
మూఁడు కాళ్లు రెండు మూఁడుకేళ్లు, గల
మహాజ్వరంబు ప్రళయాగ్ని యనులోలె, నెదు
రుపడియె వార్పు తెలుఁగుతోడ.
హరి ఉ 8. 105.

ఉ. వాఁడమిలోడ వెండియు నవారణ నెంతయు
నాగ్రహించి ముమ్మూఁడు శరంబు లేయ...
జై భా 5 19.

ముమ్మూల విశే. (మూఁడు + మూలలు)
మూఁడుకోణములు గలది.

సీ. ముడివడ్డబొమలను ముమ్మూలముక్కులు ...
ఉ. హరి. 2. 122.

ద్వి పన్ని నదైన్య మేర్పడఁగఁ బల్కుచును,
మున్ను గా మొల నున్న ముమ్మూలశావి
[?] విన్నలి పడి మెడం బెనచి తగిల్చి ...
ద్వి. పరమ. 4. 821 పా.

**ముమ్మూలలజా** వి (ముమ్మూలలజా) మూఁడు మూలలు గలరత్నము.

సీ. నిలువుటద్దములతోఁ దఱతళ త్వెలిఁగ్రమ్ము ముమ్మూలజాముత్తముల నెసంగు, బలు గోడలన్ . ఉ రా 6 127

**ముమ్మొంగి** వి. ద్వీపవిశేషము, ఒకానొకదీవి.

కం. ఈళయు ముమ్మొంగియు బం.గాళము పైగోవ మొదలుగాఁ బొదవెడుద్వీ.పాళిఁ గలనరకు లాతని,కౌలున దిగు మాట నిజము గలవాఁడగుటన్ శుక 3 8

**ముమ్మొన** విశే (మూఁడు+మొనలు) మూఁడు మొనలు కలది.

ద్వి ముమ్మొనల్ గాఁడె ఓమ్మునఁ జిత్రమన గ, ముమ్మొనవుండు ఓమ్మునఁ బుట్టె ... పండితా మహిమ 259 పొ.

వి 1 మూఁడుమొనలు ...

పండితా. మహి 259. పొ.

2. మల్లవిద్యావిశేషము.

వ. ... లోమొన వెలిమొన యసిమొన ముమ్మొన చతురిమొన పుణ్యమొన పాపమొన చాటడుగుమొన దాటడగుమొన కదలుమొన అరమీటుమొన నెఱమీటుమొన సరితాళంపుమొన యాఁదగాఁ గలపదిరెండుమొనల నాటితేటి హంస. 1. 206.

**ముమ్మొనకైదువు** = మూఁడుకొనలుగల యాయుధము, త్రిశూలము

చం. మధుఁడు సమ్మతించి స్మరిమర్దికిఁ గ్రమ్మఱ మ్రొక్కి వత్కులం,బు ధరఁ గలంతకాలమును ముమ్మొనకైదువు నిల్పవే దయా, నిధి గునన.. ఉ. రా. 7 58.

ఇట్లే. ముమ్మొనవాలు

సీ . కేల ముమ్మొనవాలు గీలుకొలిపి . .

నీలా 1 13.

కోటము ఇలపై లవణాసురుఁడి ట్లొలుగన్, గలకాలము వానియగాంముసన్, వల నొప్పెడు ముమ్మొనవాల్ శివుచేసలు వొందెడుశూలమునన్ గలసెన్ ..

ఉ రా 7 143.

**ముమ్మొనవాలుదాలుప్ప** (పు) = త్రిశూలధరుఁడు, శివుఁడు.

గీ తోలుదాలుపు ముమ్మొనవాలుడాల్పు నాఁగ భవదాఖ్య లొప్పు నంధకవిజిత ..

అం నం దేవ. 6

**ముమ్మోటు**. విశే. (మును[1] + మోటు) మూర్ఖులలో మొదటివాఁడు, మూర్ఖాగ్రేసరుఁడు

ద్వి గడును తు టరి జోగి గ్రక్కివముడును, ముడిదిన్ననక్క ముమ్మోటు పిసాళి ..

ద్వి హరిశ్చ ఉ 650 పం.

**ముయ్యంచె** వి (మూఁడు + అంచులు,) 1 వస్త్రవిశేషము

సీ బొమ్మంచు ముయ్యంచు పొప్పళి వోంబట్టు ... ... మొదలుగావల్వలు ధరించి ముదిత అపుడు .. ప్రబంధ. 272.

వ .. కరకంచులును బొమ్మంచులును ముగుడు, బొమ్మంచులును ముయ్యంచులును వెంట సాళ్లును ... ద్వా. 3. 206.

2. మూఁడు అంచులు మూఁడు మూలలు శ ర చూ. ముయ్యంచుతుంగ

**ముయ్యంచెతుంగ**. వి (ముయ్యంచు + తుంగ) మూడంచుల తుంగ (వృ. వి )

కం అయ్యిరు దెఱఁగున కప్పుడు, రయ్యమునకుఁ బరమసాధకంబుగఁ గలిగెన్, ముయ్యంచు తుగ యచ్చట, దగ్యము నేర్పవిను సెప్పెదం గురునాథా. శాఁ మౌ. 54.

**ముయ్యందము**. విశే (మూఁడు + అందములు. మూఁడు అందములు గలది

సీ చెదొవజెకు ముయ్యందంబుగాఁ దీర్చ కమనీయముగ దలకంబు వెట్టు ...

ని. వ్య. 8 62.

**ముయ్యడ** వి (మూఁడు + అడ్డలు) అడు మానికలు

సీ. . . కుడపషట్కంబు ముయ్యడ యనఁ దగు . అం భా 2. 270.

**ముయ్య(ు)లికుట్రు(ట్టు)** వి. మూఁడుఎల్లలు కలిసినతావు

వ నాగణ్ణముక త్తి మహేశ్వరదేవః కుహని [ంఖ] లియర్చన్ నఁకుంగా . . . . . ఇచ్చిన [ఖణ్ణు] కవది [పు] టులవిత్తుపట్టును సర్వ కరంరహారముగా యూరి ఆగ్నేయమున ముయ్యలికుట్టునవి [డ్ని] సి . .

ద. భా 4 1255.

౧. అస్య గ్రామస్య క్షేత్రసీమానః పూర్వతః పొందున, కొమ్మని. యుడియూరి ముయ్యనికు ట్రగుంట

౨ నిర్భతితః కొక్కలిపూణ్డిపాటి పడమటి ముయ్యని కుట్రగుంట

౩ నాయవ్యతః ఉండందొత్తిపాసు, దోవగోపమి ముయ్యసకుట్ర చిత్తూరిశాసనము Ind. IV. 551.

వ ఆగ్నేయతః ఇయ్యూరియుం బిల్లెమపెద్ద పూణ్డియు నెరపులయుం బొంగరునువ ముయ్యలికుట్రసీమా . . .

వందంపూడిశాసనము 976. (అం సా. ప. వ 1.)

వ. . ఆగ్నేయతః మోంతుకత్తియుం బాలూరియుఁ రణస్తిపూణ్డి ముయ్యలికుట్టు[ు]వ వెలంగ గుణపఱుమటికట్టు

రణస్తిపూడిశాసనము. Ep ind. 6.

**ముయ్యాకుపొన్న.** వి (మూఁడు + ఆకులు + పొన్న) త్రిపర్ణిక, ఒకవిధముగు చిన్నచెట్టు.

సీ ముయ్యాకుపొన్నయు మొగలీలు తుత్తెర బంకతుత్తెఱ హంసపాది . . . హంస 4 10.

సీ . . త్రిపర్ణాఖ్య తెలియఁ బడుచునుండు ముయ్యాకుపొన్నన . అం. భా 2 58.

**ముయ్యాఱు** న (మూఁడు + ఆఱులు) పదునెనిమిది.

సీ. అని కడుఁ జింతించ నతఁడు వెండియు గంధ మాదను ముయ్యాఱు మార్గణముల

భా. రా. యు 1076.

శా. వ్యాసప్రోక్త మహాపురాణములు ముయ్యాఱు అందులోఁ జిత్రమై, శ్రీసౌభాగ్య విలాసదం బయి బహుశ్రేయస్కరం బై కడున్, భాసిల్లున్ సుపురాణ మొక్కటి ధరన్ బ్రహ్మాండ మన్పేర . . . చిత్రభా 1. 75 కాశీ. 7 190.

**ముయ్యీడు.** విశే. (మూఁడు + ఈడులు) మూఁడు వయస్సులు గలవాఁడు

కం. గోమునఁ బెరుఁగుచు ముయ్యీ, డై మెలఁగుచు గర్భవైష్ణవాగ్రేసరు లా, నా ముద్దు కొమరు లం గని, కామిని దీపించె దొండ గాచిన భాతిన్.

పాండు 4 261.

**ముయ్యూరు.** వి. (మూఁడు + ఊరులు) గ్రామ త్రయము. మూఁడు ఊరులు.

గీ. కర్ణకంఠోదరాధారకంబు లగుచు, నమరు ముయ్యూరు పిడుఁదు తండములతోడ, వచ్చు టకి వచ్చె నొకయశ్వమల్ప . . . శుక. 3 398.

(ఇట మూఁడుతావులని భావము.)

**ముయ్యెలగుట్ట.** వి. (మూఁడు + ఎల్లలు + గుట్ట) మూఁడుగ్రామముల హద్దులు కలియు చోటు.

1 దేవంపల్లి పలవెల దొడ్డవరపు పొలిమెర ముయ్యెలగుట్ట నందికంభానకు వెళ్లిఁ

2 పశ్చిమముఖమై గట్టెపట్టె పలెవెల ముమ్మడి వరపు దొడ్డవరపు పొలిమెర ముయ్యెలగుట్ట నంది కంభానకు వచ్చెను. కొంకుదురు శాసనము. శ. 1352

2. మూఁడుదారులు కలియుచోటు.

చం. ఉడుపతి జాగికిన్ వెఱచి యూఱట యౌవని పేరుట మనిన్, ముడివడు కంతుసేనలకు ముయ్యెలగు ట్టయినట్టి యుందు రా నడఁగునె

తాపవహ్ని ... మనుచ. 3. 34.

**ముయ్యేడు.** స. (మూఁడు + ఏడులు) ఇరువది యొకటి.

శా ... విద్వేషిణీ, మూతోగ్రశ్వసనుఁడు రామునఁ డలుకన్ ముయ్యేఁడుమారులు రణ, ప్రీతిన్ వైరిధరాతలేశ్వరులఁ జంపెన్ బల్విరన్ .... భార. ఆది. 1. 78

ద్వి మొనకు వేకోట్లుగా ముయ్యేడుమొనలు, తనరఁ గల్గినవాఁడు దధిముఖుం డతఁడు ... రం రా యు 331. పొ. 9 పం

సీ ముయ్యేడువారలంబు లకాలవర్షంబు, జడి పట్టి కురయిఁ బర్జన్యు బనిచి ... హరి 1 14, భా రా యు 354.

**ముయ్యేఱు** వి. (మూఁడు + ఏఱులు.) మూఁడు మార్గములను ప్రవహించినది, త్రిపథగ, గంగ

ద్వి. ముందఱ నున్నది ముయ్యేఱునేల, అందున్న జనులు మహాత్ము లనిన .. ద్వి హరిశ్చ్ర 4 పం.

**ముర** సం. వి. ఆ. స్త్రీ గంధద్రవ్యవిశేషము (వ్యా. వి )

**మురంగి** సం వి ఈ. స్త్రీ. శారుమునగ (వ్యా. వి ) (శ. ర )

**మురండము** సం వి. అ. పుం. భరతఖండమునకు వాయవ్యదిక్కున నున్నదేశవిశేషము, లంపకము

**మురందల** సం వి. ఆ. స్త్రీ. మురలానది (త్రి సి )

**మురగండము.** సం. వి. అ. పుం. ముఖముమీఁది పొక్కు, ముఖముమీఁదిబొబ్బ.

**మురడించు** అ. క్రి. అతిశయించు

ద్వి శృంగార మలవడఁ జెలువొందు మచి,చెంగల్వ పువ్వులు చేర్చినవాని, రీవిగా జిగి మురడింప నెమ్మేన, గోవజవ్వాజి నిగుడ్చిన వాని ... పవ. 1. 52 పొ. 20 పం.

**మురజము.** సం. వి అ పుం. 1 మృదంగము, మద్దెల.

**మురజఫలము.** సం. వి. అ. పుం. పనసచెట్టు.

**మురద్విషుఁడు** సం వి ష్ పుం. మురద్విట్టు, మురారి, కృష్ణుఁడు.

**మురభిదుఁడు.** సం. వి త్. పుం. మురభిత్తు, కృష్ణుఁడు. (రూ మురారి.)

**మురమర్దనుఁడు** సం వి అ పుం మురారి, కృష్ణుఁడు

**మురమలి.** సం వి అ న. వేష్టనము, చుట్టు వాలుట

**మురముర.** వి. 1 మూల్గుటయం దగుధ్వని కను కరణము

ఆ . మురముర మూల్గుచు బొరలుచున్నఁ జూచి కరుణతోడ . ద. శకు. 10 81.

సీ. క్రూరార్ధచంద్రాస్త్రకృత్తోరుబాహులై మును గొని మురముర మూల్గువారు ... భా రా యు 1449.

2 మొరయుటయం దగుననుకరణము.

సీ మురమురపక్కులు మొరయ నుద్భ్రాంతుఁ డై గిరిగిరి చక్రంబుక్రియఁ దిరుగుచు . సమీర. 6, 169.

**మురరిపువు** సం వి ఉ పుం మురారి, కృష్ణుఁడు.

**మురల** సం వి ఆ స్త్రీ. కేరళదేశమున బయలు దేఱిన నదీవిశేషము నర్మద యని వాచ )

**మురలము** సం వి అ పుం ఒకజాతి మంచి నీటిచేఁప

2 ఒకానొకదేశము

**మురలి** సం వి. ఈ. స్త్రీ పిల్లనగ్రోవి.

**మురలీధరుఁడు.** సం. వి అ పుం శ్రీకృష్ణుఁడు.

**మురళి.** సం వి. ఇ ఈ. స్త్రీ అశ్వగతిభేదము.

గీ తనకుఁ బ్రతిదేవుఁ డెవ్వఁడు లేఁ డనుచు నెమకు,

పగిదిఁ దగునడ్డ వేడెము ల్బఅపి మఱియు, భంజళి మురళి ఝుళిపి ఝుంపయు సుధాల, మన గతు లెసఁగఁ జూపుచు వాళి మీఱ.

ప్రబంధ 185

చం. పతగవిభుండు మింటిపయి భంజలికాముఁళి సుధాలవ, ల్గితముల రా సెదుర్పడినఖేచర వర్గము లోనరించి య,ద్భుతముగ మ్రొక్క.

పా. 2 101

**మురళించే** స క్రి 1 (ఒట్టలు) నీరు పోవునట్లు పిడుచు

సీ చీరలు మురళించ నీరంబు తేలకో యిల వాల కటునిట్టు తొలఁకఁ బాఱె ..

శ్రీరం మా 10 32

2 ఆడుము, నొక్కు

వ. .. పెద్దగోళమ్ము మురళించుటకతన నోడు గ్రమ్మమురమ్మేమీఁద వలపు వెలలుచు మోదుగ మొగ్గచాయ నిగ్గెడికురువఁపు మొన వాఁడిగోరంటగోరంట నొత్తు లత్తుక కెంపు నెఁసినయలఁతిగాయములు మాయుటకు.

ప్రబంధ 78.

3 తిరస్కరించు.

దిః ముత్తెపుఁజిప్పల మురళించు మోము, క్రొత్త నీలపురంగు గులుకుకన్దోయి ...

ద్వి వాఁశ్చ. పూ 666 పం.

**మురాయించే.** అ. క్రి అతిశయించు

వ ముంగఱ తూర్య నాదంబులు మురాయించ .

హా. 4. 59.

**మురారి.** నం వి ఇ. పుం. 1 శ్రీకృష్ణుఁడు. మురుని జంపినవాఁడు. 2. అనర్ఘరాఘవనాటకము రచించిన యొకకవి.

(ఇతఁడు పూర్వమీమాంసయందు భాట్టప్రాభాకరమతములకంటె తృతీయమతమును నిరూపించెను)

**మురాళము.** వి. దిగఁదుడుపు, మురాళించుట. (శ. ర.).

జ మురాళించే

**మురాళించే** స క్రి (√మురాళము) దిగఁదుడుచుట. (శ ర)

**మురించు = మురియించు** స క్రి త్రిప్పు

(ఇది యొక యాధునికగ్రంథమం దొక్కచోఁ గానఁబడుచున్నది అని శ. ర )

చం వికటప్రకటాననముల్ మురించుచున్ .

వేం. పంచ 3 159

(త్రౌ పా ముడించుచున్ ముద్రి పా )

**మురికొను** స క్రి (మురియ + కొను ఖండించు

కం గరుడునిఁ దలఁపుము పగతునిగ . యను విజయముం గొను మనుడున్ ...

ఉ. రా 6 10

(శ ర పా 'పొరిగొను', ముద్రి వ్రాఁత ప్రతి పా.)

**మురిడీగొలుసు** వి హస్తభూషావిశేషము, ముంజేత ధరించెడు బంగారు మెలికగొలుసు.

సీ మురుగులు నవరంజిమురిడీగొలుసు లొక్క విసులాంగి హస్తపద్మముల నిడికొ ...

రసిక 1. 75

**మురిప(పె)ము.** వి (√మురియు ) 1 నడక యందలి కులుకు.

మ మురిపెం బొప్పఁగ మందమందగమనంబుల్ నేర్పుదు న్మేదినీ, శ్వరశుద్ధాంతనితంబినీజనులకున్ సంపూర్ణచంద్రాననా . నైష 2. 56

సీ సనకాదులకు లేనిచనవుతోఁ దెలిదీవిదొర చె గట మెలంగుమురిప మెల్ల ..

చం రా. 2. 60.

2 విలాసము ; చక్కఁదనము, సౌందర్యము.

సీ నునుఁదీపఁ జీరికిఁగొనని నీమైఁదీవమురిపెంబు డెందఁబు మరులుకొలిపె

భాఁ. అను 1 50.

సీ. వెడవెడనై చాలవెడనవ్వు వహియించి మురి
పెంబు దటిగిన మోమువాని ..
ఉ. రా 6. 205

ద్వి. అద్దంబు తెరపుచ్చిన ట్లుండుదీని, ముద్దుల
నెమ్మోము మురిపెంబు దూరె .
ద్వి హరిశ్చ. పూ. 169 పం

సీ చిఱుతనవ్వులడాలు చేనున్న వలమురిఁ గవు
మురిపెమునకుఁ గళుకు నింప ...
ఘటికా 1. 128.

3. శృంగార గర్వము.

ఉ ఆతరుణీశిరోమణియు నర్జును చారుకీర్తి నర్జున
విఖ్యాతుని నింద్రనందను నకల్మషమానసుఁ
గామినీమనో, జాతునిఁ జూచి పుష్పశర సాయక
జర్జరి తాంతరంగయై, ఖీతిలి యుండె సిగ్గు మురి
పెంబును మోహముఁ దేఱు చూపులన్.
భాగ. 10 పూ. 1171.

గీ. ప్రొద్దుపోకముఁ గస్తూరిబొట్టు వెట్టు, కీలుజడ
యిల్లి మఱిశావిపూలు చుట్టి, సొగసుఁజేసి
తొగాదిగఁ జూచి సిగ్గు, మురిపెమును బొందు
వనుఁ జూచి ముద్దుపెట్టి.
కువల. 4 177. దశా. 2 366.

4. సంతోషము.

ఉ. పట్టపువేల్పు గొంతమురిపంబున నించుక లేచి
కంతుఁ జే,వట్టిటు ర మ్మటంచుఁ దనపార్శ్వ
మునన్ వసియింపఁజేయుచున్.
చంద్ర. 2. 79.

చం పరధనముల్ హరించి పరభామల నంటి
పరాన్న మబ్బినన్, మురిపము కాని మీఁద
నగుమోస మెఱుంగదు మానసంబు ...
దా. శ. 48.

విశే 1 కులుకుగలది.

గీ. మొలకనగవులు మురిపంపు జిలుగునడలు,
ముద్దుఁబలుకులు గులుకంగ మ్రోల నాఁడు
కొమరులను జూచి మది నుబ్బుకొనుచు నుండె.
అచ్చ. శా. బాల 87

కం అత్తఱి మురిపపునడఁ జెలి, కత్తియగమిగొలుప
మృదులకలభాషలఁద, శ్కొత్తెడువెడనగవుతోఁ
జిత్తభవుం డార్చి వనలు చిదుము నెపమునన్.
మనుచ. 6. 20.

2 విలాసముగలది, చక్కఁదనముగలది

సీ మొలక నవ్వులవాఁడు మురిపెంపు సిరిపెంపు
ముంచయింపఁ గులుకు నెమ్మొగమువాఁడు .
శృం. శకు 3. 113

సీ రమణీయ శృంగార రసమునఁ బసనారు మురి
పంపువలపుల మొలకవోలె ... విక్ర. 6. 44

సీ ముద్దుపల్కులవాని నిద్దంపుటద్దంపు మురి
పంపుసోము నెమ్మోముదాని ...
దశా. 2 10.

మురిపి విశే వక్రమైనది.

సీ మురిపి మోకాళులు ...

ఆ కలుగు నెఱుకుమునుఁడి గనిరి సతులు ....
కు. సం. 6 694.

మురియ = ముఱియ. వి (√ మురియు[2])
ఖండము, ముక్క.

మణిగణనికరము ... పెం,దడిగలుఁ బడగలు
దఱచు మురియ లై, పుడమిఁ గలయుటకుఁ
బొగు లొలయ మదిన్ ...
భార స్త్రీ 2 3

కం ఇరుమూఁడు నెలలశిశు వై, చరణచలనకేళిఁ
గపటశకటముఁ దాఁకెన్, బురుషోత్తముఁ
డింతంతలు, మురియలుగా నిట్టిసత్వములు
మహిఁగలవే ... హరి. ఉ 4 234.

చం ఉరవడి రాఘవాస్త్రతతులు ... శిరములు
మర్మముల్ బరులుఁ జించుచుఁ ద్రుంచుచు
నుచ్చిపారుచున్, మురియలు సేయుచున్
నిగుడ మూఁడుజగంబులు నాఁప నోపునే
భా రా. సుం. 442.

మురియఁబడు. అ. క్రి. (మురియన్ + పడు —
స్వార్థమున.) అతిశయించు

సీ తవరు ప్రక్కుందవనికాది సుఖముః మోహ మంతంతకు మురియఁగఁడఁగ ..
నా॰ పంచ 1 174

మురియించే = మురిఁచే స క్రి. (√ మురియు¹) 1 మురియఁజేయు, త్రిప్పు

సీ కర ముగ్రమగుమొగ మిరుదెస మురియించి యామిషంబులయిక్క లఁరసికొనుచు
భా॰ సౌ 1. 16

కం వలమురిజిగి నగుమెడ కలు, వలమురిపెముఁ జూపుచూపు వనజాతము నా, వల మురి యించుమొగము శై, వలమురి విహసించువేణి వనితకుఁ దనరున్
చంద్రా 4 144

2 మురియఁజేయు, సంతోషపఱచు

సీ. మొలకనవ్వులవాఁడు మురిపెపు సిరిపెంపు మురియింతఁ గలుకు నెమ్మొగమువాఁడు
కృ శకుం. 3 113.

మురియు¹ = ముఱియు. అ క్రి 1 నడచునపుడు కులుకు, కులుకు

ఆ. ... నేచి తిరుగు నీఁక తీఁకలతో రాయు. నొరయుఁ జిత్రగతుల మురియు నవ్వు ..
భార. కర్ణ 2. 66

సీ. మురియంగ నేర్తురు మోహనాస్పద మైన మొగలివాకిటిచాయనగరవీథి
భీమ 1 94

ద్వి ముందఱ నాఁబోతు మురియుచు నడువ
బస పు 4. 90

2. సంతోషించు, సంతోషముచే నుప్పొంగు

కం ముద్దుల నిడి నడకిండ్లన్, ముద్దియ లాతీన్గయ లెవసి మురియుచు నిద్దా, నుద్దుల నెత్తుచు నం దొగి, విద్దెము విద్దె మని కాళిఁద్రొం ఒనుచున్
రా. వి 2. 20

కం. కరములరెంటను దాల్చిన, పరికరములు చూచి యతనిఁ బరమేశునిఁగాఁ, బరికించి లేచి వలగొని, మురియుచు సాష్టాంగదండము లొనర్చి వెసన్.
అప్ప. 1. ౩౬౯

గీ. అట్లు ఖండపరశుమూర్తి కావాప్తిఁ జెంది, చిత్త విశ్రాంతి తాంబూలసిద్ధి గాంచి, మురిసి యమానమూర్తి వై ముక్తికాంత, తో వినోదింపు మయ్య వాతూలతనయ.
సీతారా. 1. 148.

కం. అందఱకును బోనమ్ములు, గందమ్ములుఁ దమ్మలములుఁ గడువడి నిడి తా, నందంబుగ డెందంబున, ముందెన్నఁడు లేనిరోఁజలిమి మురియుచు నుండెన్.
నీలా. 3 54.

3 గర్వించు.

ద్వి. మురియుచు గునియుచు మురకటింపుచును.
బస పు 7. 698 పం

సీ పాటిసేయఁగ వచ్చు భాగీరథి నథంబు ముట్టి పెన్ జాగ నైయె మురియకున్న ...
సంస 1. 90.

4 తిరుగుడువడు; తిరుగు.

(చూ . మురియించు.)

మ ... పతివుంగవగవి హైయంగవీనంబు ని, ర్భరహర్షంబు నొనర్చె మున్ను రుచి సౌరభ్యంబుల న్విమ్మటన్, మురియం ద్రోయుచు నించె నెమ్మనమువన్ మూరాప్త సముచ్ఛ్రాయమున్.
నై ష. 2. 99.

5. ఒప్పు, ప్రకాశించు.

గీ పగము కౌశేయమధ్యము బాగుమీఱ, ముద్దుటుంగరములు వ్రేళ్ళ మురియుచుండ ...
వేం. మా. 1, 184.

ఇ. మురిపము, మురించు, మురియఁబడు, మురియించే.

మురియు². అ. క్రి. 1. తెగు, ఖండితమగు

చ ... పతాకలు మ్రొగ్గఁగ వర్మబంధముల్, మురియఁగఁ జాపముల్ దునియ .
హరి ఉ. 2. 52.

చం మురిసెడురూపులున్ మురిసి మ్రొగ్గెడి

రూపులు మ్రొగ్గి జెట్టినం, దిరిగెడురూపులుం దిరిగి తెల్లెడురూపులుం ద్రెళ్ళి నేలపైం. బోం లెడురూపులుం బొరలి పోయెడి రూపులుం బోయి క్రమ్మఱన్, మరలెడు రూపులన్ మరలి మ్రగ్గెడిరూపులు నయ్యె నయ్యనిన్. కు సం 11 698.

ఆ మురిసి మురిసి రాలె మునివ్రేళ్లు నడుముక్కు చదు కుంబడియెం జీము జాలుకొనియె

వరాహ 9 79.

2. ఊడు, సడలు

సీ కర్ణావతంసంబు కలువలు కన్నీళ్ల మునిసి జేకులు పట్టు మురిసి పడియె ...

పి. శకుం. 3 176

3. భగ్నమగు, విఱుగు.

కం ధనువు దునిమి కొమ్ములు మురిసినవృషభము చండ మగుడు ... భార కర్ణ. 1. 162.

శా. విరు సింతగాక వడిమికి, మురియక నన్నుం బ్రాయివడి చిముడం బాలక యే, బెరకింతును లేక మిక్కిలి, గరగర నగునేబ్రపాలకల మాన్పంబుల్ జై. భా 8. 198

సీ. శూలంబుం దిగిచి వక్షోవీథిం బొడిచిన ముమ్మొన లొక్కట మురిసి పడియె ..

దశా. 4. 177.

ఐ. మురికొను, మురియు, మురిసిపోవు.

**మురిసిపోవు** అ. క్రి. (√ మురియు²) భిన్నమగు, వ్రక్కలగు

వ .. ప్రచండ సమీరప్రసారంబు ఘోరంబుగాం గల్పింపం గల్పాంతకాలంబునం గాలాంబుదంబు లడరి కురిసిన మురిసిపోవుపగిదిం బృథివి యెయ్యెడలను వ్రయ్యంజొచ్చె ..

హరి. ఉ. 9. 314

**మురుండము** వి తుద్రజలజంతువిశేషము.

సీ ... నత్తగుల్ల చుట్టుడుగుల్ల కురిమింద నాం చుడుగవ్వ మురుండము కాకిచిప్ప ...

హంస 4 186

**మురుండు.** సం వి అ పుం. కృష్ణునిచేం జంపంబడిన యొక రాక్షసుండు, మురాసురుడు

**మురుగు** = మురువు² వి. 1. బంగారుకడియము, ముంజేత ధరించెడి ఆభరణ విశేషము

సీ కేలుదామరల మేల్జాళువామురుగులు కెంపు లుంగరములు సొంపు నెఱప ....

అచ్చ తె బాల 87

(ఒక యాధునికకవి దీనిని సానుస్వారముగం బ్రయోగించినాడు.

ఉ కుండలముల్ మురుంగులున్, బంగరు వ్రాతపట్టికలం బాటలు రామొలకట్లుదాయె తుల్ . శ్రీరం మా 9 5.

2. అల్లికవేసిన బంగారుకమ్మి (శ. ర )

**మురుదారసింగి** వి ఒకవిధ మగుగైరికాది ధాతువు

సీ రెంజేసి నేపాళ మొండుపా ల్మురుదారసింగి బదంశముల్ హింగుళీబు, మన్నిటి ...

(చి. కి. చి. ని.)

**మురువు(ర్వ¹)** వి. (త మురుగు ) 1. సౌంద ర్యము, చక్కందనము.

సీ. ముత్యాలమొలనూలు మురువు సూపెడునట్టి జఘనంబుపై మౌంజి నవదరించె ..

హం. 4 11.

సీ మురు వేది వాడినమోముం దామరలును గడు నొప్పి పొందిన కాయములును .

హరిశ్చ. 2. 139.

కం. పరువున మురు వైయుండును, సురపురమునం గల్పతరులు చూపఱ కింపై, పరువున మురు వైయుండును. దురగంబు లయోధ్యం గల ప్రతోళిక లందున్

మొ. రా. బాల. 5, అం. భా. ॥ 41.

2. విలాసము

సీ. వడి నౌడు గఱచుచో వాతెఱ వంటిన

గ్రమున నిందువదన కపుడు, హార్వు మీఱంగ
నీలంపుముర్వు దనరె ఇందు 5 32.

**ముర్మురము** సం. వి అ. పుం 1 తుషాగ్ని, ఉమకనిప్పు, కుమ్ము. 2. ఒకానొక సూర్యుని గుఱ్ఱము,

**ముర్మురుఁడు** సం. వి అ. పుం కామదేవుఁడు, మన్మథుఁడు

**ముర్మిణి** సం వి ఈ స్త్రీ. అంగారధానిక, కుంపటి.

**ముఱకటము** వి త్రిప్పుట, ముఱకటించుట (శ ర)

జ ముఱకటించు.

**ముఱ(ర)కటించు.** స క్రి. (√ముఱకటము) త్రిప్పు

వ అనిన విని మొగంబు ముఱకటించుకొనుచుఁ గద్రువ గరుత్మంతున కిట్లనియె
భార. ఆను. 1. 211.

అ. క్రి. (నడచునపుడు) చలించు, కదలు, ఊఁగాడు.

ద్వి తనుదానఁ జూచుచుఁ దలయుఁ ద్రిప్పుచును, మునుమిడి ద్రోయుచు ముఱకటించుచును ...
పండితా. పురా 101 పొ.

**ముఱకము** వి అతిశయము, హెచ్చు. (ఉదతి, నిక్కు అని (శ. ర.).

వ విటపిమండఁబుల మెండును జెఱకు ముఱకబును, ప్రాసంగుమిసిమియు ..
భీమ. 3. 57.

**ముఱముఱ** వి (సం. మర్మరః.) 1 పట్టుబట్ట మున్నగువానివలనఁ గలుగుధ్వని కనుకరణము.

ద్వి ముఱముఱయను పట్టుపట్టంబు విడిచి, కుఱు మాసియున్నట్టికోకను గట్టి ..
ద్వి శ సా 1. 35 పొ. 6 పం.

ద్వి ముఱముఱమనికొమల్ ముడిపాటుగదురఁ ..
ద్వి. హరిశ్చ. పూ. 1149 పం.

2 కోపము వెలువడుచుటయం దగునను కరణము.

ద్వి. ముఱముఱమని కోమల్ ముడిపాటు గదురఁ, జుఱచుఱనిప్పు లెతుఁగ నుప్పతిల్ల ..
ద్వి హరిశ్చ. పూ 1149.

జ ముఱముఱలాడు

**ముఱముఱలాడు** అ క్రి (ముఱముఱలు + ఆడు) కోపవికారము చూపు, ముఱముఱమను. (శ ర)

**ముఱి(రి)** వి 1 గర్వము, మదము

సీ. అఱచేతఁ గొండఁ జూపఱు నొగడఁ గఁ బూని నెఱిఁగిబ్బతోఁకివేల్పుముఱి యడంచి, చిఱుత పాయపుగొల్ల తెఱవల వలపించి మఱవక పనులఁ బల్లఱును గాచి నీలా 1. 3.

కం. విను దేవర మును దుంఁదుభి, యనురక్కసుఁ డొకఁడు దుంతయై వేల్పులరా, యనికొమ రునిఁ దనతో దుర, మునకు బిలిచినఁ గడింది ముఱితో నతఁడున్ .
అచ్చ. రా. కిష్కిం. 32

ద్వి మొగము వెల్వెఁబాఱ ముఱి యెల్ల సడలి, పొగులుచు వేఁడియూర్పులు సందడింప ..
ద్వి. శి సా. 1 17 పొ. 21 పం.

2. నడకయందలి కులుకు

కం. అత్తఱిఁ బుత్తడికీమునఁ, బిత్తరిఁ గానక కరంబు బెగ్గిలి యనుగుం, గత్తియ దలఁబు నొకచో, మొత్తములై తత్తరలుచు ముడి సడలఁగన్ . సిక 4. 40

విశ 1 (క ముఱి) అల్పము,

(చూ. ముఱిప్రోపు)

దీని యామ్రేడిత రూపము ముఱిముఱి

**ముఱిచీకటి = చిమ్మచీకటి**

సీ. ... జిమ్మచీఁకటి మునిచీఁకటి ముఱి

గీ. చీకటి మసక ముఱిముఱిచీకటి యన, నవ తమసనామధేయమై యలరుచుండు
ఆం. భా. 1 146.

క. ముఱిమి ఱిచీఁటి యప్పుడు, నఱిముఱి భటు లుడుగ కడగి యని సేయంగా. నెఱసి తమ

మెల్ల యెూఁ గ్రిక్కిఱిసిన ముఱిపాసి నిలిచిరింతను న న్

భా విరా 3 195

క ముఱిమ ఱిచీఁటితో నంగదఱురాజులు సమర ముఖగి గ నెల్లటికి, గొఱగలకల నగు నడుపుఁడు, నెఱవగు గోవర్ధనాదినేలకు నను చన్ ఉ హరి 4 272

చం ముఱిముఱిచీకటిన్ గణసమూహముతో నిటుఁ దెల్పఁబోక నంగదఱ మరుగన్ వలెన్ మరవితాన నుతాంబ్బక పెన్నఁ జేరఁగన్.

చెన్న ప 362, అం. భా 1. 146

2. కుత్సితము

కం. ముఱి యారగుపిరులు నీముఱిమెుండెము వేగ దగ్ధముగఁ జేయఁగ జేకుఱుఁ బూర్వా కాఁము చీ, కుఱవుగ శాపమున కవధియును నప్పు డగున్ భా. రా అర 2. 400

వి శా వ్యము,

సీ. ముఱి చెడి దుఃఖమున విఱుగుటయును వీఁగి పిఱుఁద చేరినవారిఁ జెఱచుటయును

అచ్చ. రా బాల 45.

జ ముఱికాఁడు, ముఱిప్రోవు

ముఱికాఁడు విశ (ముఱి + కాఁడు. బ. ముఱి కాండ్రు, ముఱికాఱు) గర్వితుఁడు.

గీ అనుడు నఖుడు దిండిరాయండు వాని, కిట్టు లని పల్కె విన రోరి చెట్టునట్టు, మెకపు ముఱికాఁడ రామునిమేటితనము, సెప్పె దవు వేనవేలు నాచెంత నిలిచి.

అచ్చ. రా యు. 17, బాల 200.

ఉ సన్నబలంబులైన విజసైన్యములం గని రావ ణుడు శౌర్యోన్నతుఁడైన నందమని నొప్పరి కించితిఁ గుంభకర్ణుఁడుం, గన్నది లేదు మెల్ల ముఱికాఱు దగిలుల వచ్చి రేను బో, కున్న భరంబు గాదె యని యుద్ధతిఁ బేర్చి రథాధి రూఢుఁడై. నిర్వ. 6. 127.

ముఱికి వి (√ముఱుగు క ముఱికి) 1. మాలిన్యము, మెదుక, మూర్ధమలము,

సీ త్రోళ్లు వ్రేలాడెడు తుంటిపై బ్రహ్మాఃమ్ముల చింపి దోవతి ముఱికివలువ

వరాహ 6. 17.

సీ ... ముఱికి యనంగను మూర్ధమలము, వెలయుచుండును ...

అం భా 2 134.

2. కన్నులోదకము.

ఆ. గంగ పాఱుచుండుఁ గడలనిగతితోడ ముఱికి పాఱుచుండు స్రోఁతతోడ, దాత యెూర్చిన ట్లధముఁ డోర్వఁగా లేడు. విశ్వ వేమ 1. 64.

ముఱికినాఁడు = ములికినాఁడు వి దే ఒకానొక దేశము

(ఇఁదుండి వచ్చిన బ్రాహ్మణులను ముఱికినాటి వా రందురు.)

ఆ. ముఱికినాఁటివారు మెఱకులు పెనుపరు, లఱవ వారు ద్విజుల కాన సెద్ద, యనుచు దేశ భాషలను గులంబును దిట్టు, నతఁడు దండు వచ్చు శతపణములు విజ్ఞా. 2 59.

ముఱిప్రోవు. వి. (ముఱి + ప్రోవు) అల్పుల గుంపు

కం. ఇడుసులఁ బదమూఁడేండ్లుం, బడి కడుఁ గోపించి వచ్చె బలువిడి నీకవ్వడి దఱియ నుఱికి వడిని, ప్పుడ యిమ్ముఱిప్రోవు నెల్లఁ బోరిగొనెడు బళే.

భార. విరా. 4. 253.

ముఱియ = మురియ. వి. (√ ముఱియు[2]) ఖండము.

కం. రెండు మొనవాఁకోలల, రెండు బుజంబు లును వావిరిం గూల్చి కదుం, గొండవలె నున్న యుబ్బలు, మొండెవు రక్కసునిమేను ముఱియలు చేసెన్.

అచ్చ రా. అర. 118, యు. 301.

వ కొండగోఁటియల ముఱుగుకుబో మటకు సందడించు కంకగృధ్రావళుల మొల్లంబుల ముసుంగుపడుపల్లంబులును .
మనుచ 4. 37

**ముఱుత్రోవ.** వి (ముఱుగు + త్రోవ) మురుగు పోవు మార్గము

గీ పదహాతి వ్రస్సి వఱచు, వంగుదఱి చగు ముఱుత్రోవ నరిగి యొకట ..
అము 6. 17.

సీ. త్రోవలు ముఱుత్రోవ నాఁగ దుర్గంధపూరితవి ..
ఆం భా. 2 53

**ముఱుముండెము.** వి. (ముఱుగు + మొండెము) దుర్గంధపు మొండెము

ద్వి పొరదులు విఱిగినభుజములు నంటు, మెడలును జోడిగపొడ వైనమక్కు, మెడలను గడుగడు నిడుదమూఁపులును, ముడుఁకు మోములు ముఱుమొండెముల్ బండి, బెడగు రూపంబులు
పండితా. పర్వ. 844 పొ.

**ముఱ్ఱ(ఱ్ఱా)ట** వి చిమ్మనగొట్టములో నీరుచల్లు కొనెడియాట.

(చూ. ముఱ్ఱటలాడు)

జ ముఱ్ఱటలాడు.

**ముఱ్ఱ(ఱ్ఱా)టలాడు.** అ క్రి ముఱ్ఱాట + ఆడు) చిమ్మనగొట్టముతో నీరుచల్లుకొనుగు జలక్రీడ లాడు

చ . పురజను లర్థిమైఁ జెలఁగి పోసిన ముఱ్ఱాట లాడ రెల్లెడన్ ..
కు. ప. 9. 51

గీ అనుచు రాగిల్లి జయజయధ్వనులు సెలఁగఁ జొచ్చి ముఱ్ఱటలాడిరి కు. ప 10 469.

కం నరచందనపంకంబునఁ, గొముగ ముఱ్ఱాట లాడి తెలుపెసఁగిరి ..
కు. ప 9 261.

**ముఱ్ఱు = ముఱు** వి క్రొవ్వు.

కం ముఱ్ఱుగఁ గాగినలోహాపు, గుఱ్ఱమునై నెక్కు మనుచుఁ గొట్టుడు రోఁకిన్, గిఱ్ఱునఁ దిఱుగఁ గఁ గఱ్ఱల, ముఱ్ఱుతయు వెళ్లిపోవ మొత్తుడు రోకిన్ ..
సానందో 2 41

2 ముఱ్ఱుఁబాలు ఆవులు మున్నగునవి యీనిన తరువాత మూఁడుదినములవఱకు నిచ్చు పాలు, పీయూషము

గీ ముఱ్ఱు, నాఁగఁ బీయూషనామంబు నాఁగ భూష ..
ఆం భా 2 258

జ ముఱ్ఱుఁబాము, ముఱ్ఱుఁబాలు.

**ముఱ్ఱుఁబాము.** వి (ముఱ్ఱు + పాము) మాతులాహి సర్పవిశేషము ఒకజాతిపాము. (శ ర)

**ముఱ్ఱుఁబాలు = ముఱ్ఱు.** వి జ (ముఱ్ఱు + పాలు) ఆవు మున్నగునవి యీనినతరువాత మూఁడుదినముల వఱకు నిచ్చుపాలు.

వ్యవ.) మాయావు ముఱ్ఱుఁబా లీయలేదు.

**ములక = ములుక**[2] వి. ఒకవిధమగు నాఁకుడు వంటి అల్పవృక్షము

అ పంటపు తీఱువెనుక వనజాతియధరంబు, ములక పంటగిజరు ముష్టిరసమ్ము, చింత లేని వేళ జీడిసమాన మౌ ..
వేమ 3. 268

గీ వెలఁగ నాఁకుడు పల్లేరు ములక వేము, నగిరె నిర్గొళ్ళి మొదలుగా జగతిఁ గల్గు, కంప లన్నియు వేవేగఁ గడచి వడచి . .
హంస. 4. 9.

**ములగ(గ్గ)** వి అర్కుదఫలి.

చం ముల్గ వెల్గ చెవిపావిలి దొగ్గలి పొన్న గటి .
హంస 4 133

(ముగ్గ ముద్రి పా )

సీ ముఁగనంచనఁగ నర్బుదఫలి మునును డు
ఆం. భా. 2. 64. (ములుగ ముద్రి. పా )

**ములముల.** వి. (పుష్పములు) వికసించుట యందవు శబ్దము.

ద్వి ... యోగనిద్రఁ, జాలించి శృంగళాయి మేల్కనవె, ముకుముల వికసించు మొల్ల క్రొన్న నల, వలపులఁ దూర్పువీవలు వెచ్చరింప
ద్వి పరమ. 5. 494 పా

**ములాసాపాగ** వి ఒకవిధమైన తలపాగ

సీ. బిగిమూలాసాపాగఁ బెనఁచి పారమతల్లి శేషాహిఁ జుట్టిన శివుఁ డనంగ...
సుద 3. 164.

**ములికి(ల్కి)** వి 1. బాణము

చం ... తద్విలాసమున్, ములికిగఁ జేసి మన్మథుఁడు ముద్దియ నేయఁ దొడంగె నెవ్వడిన్
నైష 2 109.

గీ పొగడఁ బుక్కిటమధువునఁ బ్రోది సేయ, దీఁదుముఖ దోహదక్రీడ లీడ విడిచె, నలరు విలుకాని ములుకుల కాత్మ నులికి ..
విక్ర. 1. 188.

మహాస్రగ్ధర. .. పొడు పొడు మన్నల్కులు న్ముల్కులున్ రాన్ . అము 6. 75.

మ. ... అపూములుక్క తెగ్గించి క్రొన్ననవిల్కాఁడు నవాంబుజోత్పలవితానం బీను మీనాఖిలో, చనములన్ వింట ఘటింపఁ బొల్చె నవి నిత్యం ద్రాంబకఖ్యాతులన్.
వసు, 2, 48, మనుచ. 3. 45.

2. బాణపుటలుగు.

గీ. గంధవాహంబు లేడును గలుల గాఁగ, విలయ కాలానలజ్వాల ములికి గాఁగ లచ్చి. చను దోయి కుంకుమ బచ్చెనయగఁ, బాల మున్నీటి యల్లుండు బాణ మయ్యె. భీమ 4. 127

గీ. అవుర మెచ్చితి నోబాఁపనయ్య నిన్నుఁ, దిరుగ కీమాట నీమదిఁ దిరము సేయు, హీనకులుఁ డని యితఁడు న న్నేఁ గింటి, పలికె నాయాత్మ కది యంపములికి యయ్యె హరిశ్చ 4 229.

సీ. . . చిలు కవఁగ ముల్కి యవఁగను ఘనము దనరు ... అం భా. 2 313

గీ బొంగఁవుమొనను గ్రుచ్చఁబడి యుండు ఇనుప ముక్క, బొంగరవుముల్లు

ద్వి ననవిల్తు నునుగుందనవుబొమ్మ ముల,కొనల సీలవుములుకులు దాచినట్లు ..
ద్వి పరమ. 3. 148 పా.

**ముళికి ల్కి)నాఁడు = ముళికినాఁడు** వి. ఔ. ఒకానొక దేశము.

గీ పలికినప్పుడు తేనియ లొలికిపడెడు, జకుకుఁ జూపులఁ గ్రొమ్మించు లులికిపడెడు, ములికి నాఁటిది కాఁబోలుఁ దెలికిరాట, కలికి చిలుకల కొలికి యీ తెలికెబోటి. క్రీడా 102.

గీ. ములికినాఁ డనుసీమఁ గోమలులచూవు, ములికి నాఁటిన మరుఁడు దా మూర్ఛనొందు ..
శుక 1 258

సీ మూఁడుగ్రామగ్రాసములతోడఁ గూడంగ మోపూరు పాలించె ముల్కినాఁట ...
క్రీడా. 22.

**ములు = ముల్లు.** వి ఔ (క. ముళి బ ముండులు, ముండ్లు. హల్లు పర మగునపుడు దీని యంతిమోకారమునకు లోపము వైకల్పికము )

1. కంటకము, కొన్నివృక్షములకును లతలకును గల్గువాఁడియైన సూక్ష్మావయవవిశేషము

మ, కలహంబుల్ దమలోనఁ జేసిన నుపేక్షా నైపుణం బొప్ప శత్రులఁ జూడం దగు భూతదానవుల పోరుం జూచిన ట్లెమ్మెయిన్, ములు ముంటం దగఁ బుచ్చుభంగి భార శాం 2. 418

చం అనవుడు నింతి యీ యెడఁ బ్రయాసపడం బనియేమి యంచు వేగన ములు ముంటఁ బుచ్చుట యె కార్యముగాఁ దలపోసి ..
విక్ర 1. 145.

కం. ఆ ఆకాలున విఱిగినములు. కులు దైవను బిదపఁ జీము కూరిచెడుగతిన్ ...
ప్రబోధ. 2. 49.

సీ ము లు వసి యవఁగను తెలఁగుఁ గంటక

సంజ్ఞ ఆం భా 2 88

2. త్రాసుముల్లు. తూనికలో బరువుల తారతమ్య మును సూచించుటకై త్రాసునడుమనుండు అవయవ విశేషము

కం తుల విడి తూచంగ సత్యము, వలనన ములు సూపు గౌరవంబునఁ జేర్చెన్ ..

భార ఆది 4 94

గీ ధనముకలిమియు లేమియుఁ ద్రాసునందు, నిలిపి యెత్తంగ ములు సూపె నిర్ధనత్వ మెక్కుడై దానిదిక్కున ..

భార శాం 4 38.

3. నివ్వరి మున్నగుధాన్యపుగింజలకొన నుండు సూక్ష్మావయవము, శూకము.

మ సొరిదం జేర్చనతీగమల్లియలు ఖర్జూరంబు లున్ బుష్పముం, జరులు న్మామిడిగుత్తులు న్గసుమము ల్పంపెగలు వ్పచ్చగ, న్నెదువూఁ జాలులు గల్గి రాజనపుఁగాంతిన్ దారు ము ల్సూపి చే, లరుదార న్నగుఁ బూవుఁ దోఁటల బలాకానీకదంధంబునన్. .. ఆము 1 36.

4 బాణాగ్రము, అలుగు,

ఉ .. నెమ్మదిన్, వచ్చిరె కర్ణనందనుఁడు నా మనుమండును నంచు మేనిముల్ వ్రచ్చి వెడంద గాయములు పాణితలంబుననంటి చూచు చున్ జై. భా. 3 7.

5 ఒక వస్తువుయొక్క వాఁడియైన యగ్రము

ఉ కోఁటలనంది నెంపములు గ్రుచ్చికిన నంత దిన క్రమంబునన్, మీటిననొవ్వి భుక్తిఁ గొననేరక

కేయూర 3 115

6 నఖాగ్రము

సీ. ములు పడి ప్రాఁబడ్డవలరాజు డాగుమీఁద గంధవుఁబూఁత మేళవించి ... విక్ర 8. 7

విణ సన్ననిమొన గలది

ద్వి. ననవిల్తునునుగుందనపు బొమ్మగములు, కొనలు నీలపుములుకులు డాచినట్లు, ములుగుబ్బ పాలిండ్లమొనలక ప్పొదవె ..

ద్వి పరమ 3. 148 పొ.

జ ములుకోల, ములుగంప, ములుగత్తి, ములు గొలిమిడి, ములుగోరంట, ములుచంద్ర, ములు చిత, ములుచుట్టు, ములుచూపు, ములు జెముడు, ములుతారు, ములుదోనము, ములు దోస, ములుబంతి, ములుబూర్గు, ములుమోదుగు ములుమ్రోంతువు, ములువాలుగ, ములువెంపలి ములువెలఁగ, ములువెలమ, ములువేగి, ముల్లుత్తి, ముల్లొల్లిక

ములుక[2] వి నిర్దయత

కం. అకు కేల లేదు మదిలోఁ, బలుకానలనడుమ డాఁగి పలుకవు మరుపూ, ములికి కలికి చిలుకల, కొలికి చెలి కిట్టిములుక గూడునె యొందుచ్ అచ్చ రా ఆం 96

ములుక[2] = ములక.

(కంటకి, వార్తాకము, ముండ్లవంగ. (వృ వి )

గీ దొండకాయ ములుకకాయ తొట్లకాయ.

హంస. 4 129.

సీ. ములుక ప్రాఁకుడు నీలి గలిజెరు పొడపత్ర దుష్టువు పెన్నెరు తొట్ల మ్రంగ ...

(చికి. చిం.)

సీ. వంగ యనంగను వార్తాక మై యొప్పు కంటకి చను ములుక యన .

ఆం. భా. 2 59

జ ములుకపూవన్నెలు.

ములుకపూవన్నెలు వి బ. (ములుక[2] + పూ + వన్నెలు) వస్త్రవిశేషము.

సీ మంజడిమొకమాలు మాదానకంబులు ములుక పూవన్నెలు ముత్తెపరులు .. ధనా. 3. 35

ములుకు. విశే. (క. ములుకు) 1 తీక్ష్ణమైనది, వాఁడియైనది.

గీ. అనుచుఁ బ్రతికూలవాక్యంబు లతివ పలుక, జిలుకజా నావజీరుఁడు చిలుకుములుకు. టెరు

ఓంపటితాఁకున నలసి సొలసి ధీవర్తన
మెఱలి ప్రార్థింపఁ దొడఁగె.
కృ. శకుం 1 192

2 ప్రకాశమానము

ద్వి ములుకుగె పులకాంకముక్కు లెచ్చ, చిలి
కలగములు రంజిలి చుట్టువాని ...
ద్వి సం మ 8 101

**ములుకో(గో)ల** = ములుకోల వి (ములు + కోల) 1 గుఱ్ఱములను దోలుట కుపయోగించు సాధనము, తోత్త్రము

వ. ... కండరీకుండు కేల నున్నములుకోలయుం బగ్గంబులు విడిచి ...
హరి. పూ. 2. 224.

సీ ములుకోల యనఁగను బొల్చుము దోత్త్రంబు
ఆం. భా 2. 261

2 వృషభాదుల నడపుట కుపయోగపడు (కొనను) ముల్లు గలకట్టె, ఎద్దను బొడిచెడు మునుకోల.

ఉ. రెడ్డిమడియల్ ములుగోలలఁ బూని యొడ్లకో, చేరులు వైచి దున్నుటకు నేఁగిరి కొండ్రకుఁ జాలు వచ్చినన్.
వే. పంచ, 1 687.

**ములుగంప.** వి. (ములు + కంప) ముళ్ళకంప. (వా)

**ములుగత్తి.** వి (ములు + కత్తి) ముల్లుతీసికొనుట కుపయోగించు చిన్నకత్తి.

సీ వడిప్రాంత ముకుగగోణము మించుదుటకించు ములుగత్తి ... వేల పంచ 1 598

**ములుగు**[1]. అ. క్రి 1. మూలుగు

కం. బలదేవుమేను సోఁకిన వెలిమిడిచే వేఁకి సలచి విటకాటముగా, నిలుగుటతో ములుగుటతో, వలమటతో నావులింత లంతంతకుఁ గాన్.
ఉ. హరి 6. 77

సీ. తుయపినసక్వాపకామల లోకవేళ బలిమిమైఁ గుదియింప ములిగిములిగి ..
రుక్మాం. 5 183.

సీ. పెనగాలి యింతిసోఁకిన జాలువిగ్గజంబుఁ మోప గని శేషభోగి ములుగ ...
రా వి 8. 48.

- మొఱయు. ధ్వనించు.

సీ. అలుకనై మీఁజేత నంటనయాక్రొత్తముప్పి ఁ త్తెము సారె ములుగుచుండ ..
క్రీడా 226

వి. మూలుగుట, ఖేదధ్వని

సీ. వెలయు ఖేదధ్వని ములుగు నాఁగ.
ఆం. భా. 1 122.

**ములుగు**[2] వి (సం మూలకమ్) శాండాంము, బొక్కసము

కం తలిదండ్రులు గడియించిన, ములుగులలోవిత్త మెల్ల ముండలకొఱకై, వలపునను సగసి పెట్టుచు, నెలమి మెయిన్ మరిగె నొక్క యాడగచానిన్.
భల్లా 1. 1 ఆ (శ స)

**ములుగొలిమిడి** వి (ములు + గొలిమిడి) ఇతుడము, ఒకజాతిగొబ్బి (వృ వి)

సీ. .. నేతిబీఱ పేరాముటి పీచర ములుగొలిమిడ చెతిపొట్ల యుమ్మెత్త తిప్ప .
హంస. 4, 10.

**ములుగోరంట** వి (ములు + గోరంట) ఝింటి, పచ్చనిపువ్వులు గలిగి ముండ్లు గల ఒక జాతి పూలమొక్క.

సీ. . కొండ, గోఁగు పొగడ ములుగోరంట గోరంట వెలమ . హంస. 4 11.

**ములుచే(ల్చ).** విశ 1. మూర్ఖుఁడు.

కం నెఁకొనుమట్టటికంబును, జెలికాంము మునుపు దనఁకుఁ జేసినమేలున్, దలఁపక యెగ్గులు

వలికెడు, ములుచలకడ నుండిరేని మోసము వచ్చున్ యయా 3 89

కం ఇలు సొచ్చి వెడల సేవు, మఱయుచు నేనాంటి చుట్టమవురా యోరీ, ములువ యిటు నాగ్రహ బున, గలిగిన సొమ్మెల్ల గల్ల గట్టి తినంగన్ విప్ర 4 26

కం మొగమున మీసము గల్గిన, మగవాం డైతేం గడించిమగటిమి మీఱన్, దెగంబడి పోట్లాడ వలెన్, బిగువేమిర రాచములుచ విడతునె నిన్నున్ ఆహ 1 98.

2 మూఢుండు

గీ పడుచువని చేసితివి సేంగుంబండ్లకొలకు, ముత్తియ ంబులు వెలపోయు ములుచ కలండె. భా 5 59.

ఉ. ఒక్కతె యాతని వెనక నొంయ్యన నవ్వుచుం జేరం బోవ వేఱొక్కతె యోటికి జనియె దోచెలి యాపెనుముల్వరాండెడె, యక్కట పాటు దా నెఱుంగ నాపువుగుత్తులతోడి తింగె యం, దొక్కపలాశి గట్టినను యుక్తమ యా నని నవ్వెం గేలిమై. పం 3 198.

3 ధూర్తుండు

సీ. చెడుగు గావన సీమ చెరికి కీడ ములుచ జేరజ మన ధూర్తు పేరువోయు .. అం భా 3 7.

4 మోటయినది.

కం. అమ్మా నీవు సెవులం దిరమ్ముగ విన్నావొ లేవొ ... సిబంటుల్, గ్రమ్మఱకొని వానిం జేసిన, యమ్ముక్త చనుల్ దలంప నచ్చెరువు గదా అప్ప రా యు. 108.

సీ నలువు మీఱినకాయిములుచయొడళ్లు జుంజురు గడ్డములు .. రసిక. 1. 68.

జ ములుచందనము.

**ములుచేంద్ర.** వి (ములు + చేద్ర) వృక్షవిశేషము.

మోద గు ఎచ్చారె యారె, వలి చేంద్రములుచేంద్ర వాడగన్నెరు ద్వి శ సా 2 682 పం.

**ములుచేదనము** వి. (ములుకే + ఛేదనము) మూర్ఖత్వము

సీ కులగోత్రములవారి వెలిసి ట్టెలు కెల్ల మోయించుచుండెడు ములు ఛేదనము వాంస 2 ...6

**ములు(ల్లు)చింత** వి (ముల్లు + ఉచిత ఒక జాతికూరాకుమొక్క (వృ వి)

అ .. ఇది, యేమి నేండు వండిరా ములు చింత కూర, యనిన సూపకారు లతనితోడ. పం మ 5 185.

వ మీ యేలికకుం గూరలలో నెల్ల ప్రియంబని యడిగి వారనిన ముల్లుచింతకూర ప్రియం బగుట విని సంతసంబున .. పంమ 5 181, ద్వి పం మ 3 531.

**ములుచెట్టు** వి (ములు + చెట్టు) సన్నని మొనగల తిరుగుడుచీల.

ద్వి. మేలిమిబంగరు మీంది మూంతలకు, నీలాల ములుచెట్లు నిలిపినయట్లు, సొగసైననీల చూచు కములతోత, జిగిగలుక్కచన్దోయి చెన్నొందు చుండె మృ వి 1. 6.

**ములుచో(నూ)పు** = ముల్లుచూపు అ (శి. ములు + చూపు) 8 అతిశయించు

సీ విషమాస్త్రుశర మీన విద్యుల్లతలపోయగ ములకు ములుచోపుకళికచూపు ... పరాహ 4. 159, అము 1. 63.

2 పూను, యత్నించు

గీ లజ్జ వొలియించు దాలిమి యజ్జగించు, నిండ కొడిగట్టు శీలంబు చిదంజేయు. బ్రహ్మహత్యకు ములుచోపుం బాపవితతి, పంచగోష్ఠివిధంబు భూపాలపుత్రి. పి. శకుం. 4. 163.

**ములుజెముడు** వి. ($\sqrt{}$ములు, సిహుండ భేదము, ఒకజాతిజెముడు. (శ. ర ).

ములుతాసు వి. (√ములు) ముళ్లకంపలతో నేర్పఱచిన యావరణము, ముళ్లకోడి (మా. తారు.)

(మృగములను పట్టెడి యొకదినుసువల అని (శ. ర)

వ .. అగ్రాణము దరిసి మృగములు సంచరించు తావు ఎఱిసి ములుతాసు వేయించి ప్రోగు వారించి వలలు బలపించి తెర లెత్తించి బోను లొడ్డి వి దీములు ఘటించి రామే. 5 81.

ములుదోరణము వి (ములు + తోరణము) తోరణమువలె నమర్చిన ముండ్లసరుస, చోరసాధన విశేషము.

సీ భవనవిపాహితప్రభమగ పేటిక వాలుకాభస్త్రీ తలముళ్లు గద్దగోళ్లు, ములుదోరణము ... వేం పంచ 3 199.

ములుదోస వి (ములు + దోస) రోమశి, ముండ్లు గలదోస

సీ ... ములుదోస వాగను వెలయుగ గంట, కోర్వారుకమ్ము .. ఆం భా 1. 71

ములుబంతి వి (ములు + బంతి) చెండువలె ముండ్లతో నేర్పఱచిన దొంగవానిపనిముట్టు

కం మొలను నీలికాసెయును బదముల నోర చ్చులు ధరించి మునము దలిర్పన్, సెల గోలయు ములుబంతియు, బలపముగ గత్తి యును బూని పటుసాహసి యై హరిశ్చ. 5. 111.

గీ కావు ములుబంతి సికముళ్లు గద్దగోరు, నల్ల దట్టినబిల్ల కన్నంపుగత్తి, బూది దివ్వార్చు పరు విను మూఁడుగ్రోవి, తోలువిచ్చెన మొదలు ముఁడుగ ధరించి. ప్రబంధ. 759.

కం ఒలసముగ గన్నపుగత్తియుఁ, గవముళ్ళను జొక్క నీలిదట్టి యిసుముఁ జీమలక్రోలు గ్రద్దగోరును, ములుబంతియు గత్తెయును ముదలగు వానిన్ పరమ. 4 184.

ములుబూర్గ(రుగు) వి (√ములు) శాల్మలి భేదము, ఒకజాతి బూరుగుచెట్టు.

గీ. వెదురు ములుబూర్గు ములురేగు వెలఁగ వేము వాల్మి. 2 82

ములుము వి. కాపులనీరు పాటించి పండించెడు పొలము (శ ర)

ములుమోదుగు. వి (ములు + మోదుగు) రోహితకవృక్షము

వ హనుమంతు నిరువదిగజికట్టియల గవాతుల బదిములుకుల నొప్పించి ననిచిన ములుమోదుగుల చందంబు నొందించె .. అచ్చ రా యు '64

ద్వి బలుసు ముల్ మోదుగు వచ్చారె యారె వలిచేంద్ర ములుచే ప్ర వాకగన్నేరు . ద్వి క సా 2. 661. పం హంస. 4. 11.

ములుప్రోంతువు. వి (ములు + ప్రోంతువు) ములుమోదుగు

వ దీనిక దక్షిణమున ములుప్రోంతువును దీనిక దక్షిణమున దారెకియం బోలుకుం బత్తిపొలమునం గూడిన పిఠాపురముశాసనము 1024 Ep Ind 5. 90 పా.

ములువాలుగ. వి. (√ములు) మత్స్యవిశేషము, ఒకజాతి చేప (శ ర)

ములువెంపలి వి, (ములు + వెంపలి) కంటక పుంజి, ఒకజాతి చిన్నమొక్క

సీ ములువెంపలి ములుసై గరికిస గుంట గజ్జెరును దంతి బందారి ... హంస 4 10

ములువెలఁగ, వి (√ములు) గతుప్రీకము, ఒకజాతి గడ్డిదుంప. (శ ర, బ్రౌ)

ములువెలమ వి. (√ములు) దికసగను, స్వాదుకంటకము (వృ. వి ).

సీ. ములువెంమ యనఁగఁ తెలఁగును స్వామ కంటకనామధేయము ... ఆం ఖా. 2. 46

**ములువేగి.** వి (ములు + వేగి) వృక్షవిశేషము.
సీ రేఁగు తక్కిలి ములువేగి భూచక్రము మొక్కస కొక్కెస మొల్లమ్రాను ·
హంస. 4. 11

**ములుస్తె** వి (ములు + ఉస్తె) ఒక విధమగు ఉచ్చింత (వృ వి ).
సీ ములువెంపలి ములుస్తె గలిజేరు గుంటగల్జేరను దంతి బంధారి హంస 4 10.

**ములాృను** వి అల్లిక
సీ చలిదినిక్కపుజిల్లుపాలుముల్కానుపై నొయ్యారముగఁ బించ మొయ్యఁ తెరివి .
పాండు 329

**ము(లుగు)ల్గుత్తి** వి (ములు + గుత్తి ఒక విషమైన చోరసాధనము, దొంగవాని పనిముట్టు
ఉ కత్తియు నీలిచీరయును గంకటిరజ్జువు నాసంబు ముల్గుత్తియు వాటురా లినుము గొంకియు నక్షతలొల్కిబూదియున్
చెన్న. 3 294.

**ముల్తొల్లిక** వి (√ములు) మత్స్యవిశేషము, ఒక జాతి చేప ప్రబంధ 195.

**ముల్లంగి.** వి (సం మూలకమ్) ఒకజాతిదుంప.
ఆ చేమ కంద గెనుసు చిటిగోరు పెండ్లము, పొడఁగు తెల్లగెనుసు బూతగెనుసు, అల్లముల్లి పెంపు ముల్లంగి వెల్లుల్లి, గాఁజరయును మొదలు గాఁగఁ గలవు హంస 4. 131

ముల్లంగి నాఁగను రీతిఁ గాంచు మూల కాభిద . ఆం ఖా. 2 72.

**ముల్లడఁచే** అ. క్రి. (ముల్లు + అడఁచు) ముండ్లు గుచ్చి ఆనవాలు చేయు.
సీ. మూసి ముల్లడఁచి గుమ్మెలకొల్పుపై మెత్తు లూడ్వఁడు పస్తైన నుండుఁగాని
పాండు 4 149

**ముల్లాకుటాయి** వి (ముల్లు + ఆకురాయి) ఒక విధమగుటాయి, పత్త్రిపరికు భేదము (శ. ర.)

**ముల్లిడు.** అ క్రి. (ముల్లు + ఇడు) కంచెవేయు, పొలముచుట్టును ముండ్లకంపలనుపాతు
చం మును దవనీమ చేసికొని ముల్లిడి గుద్దట వెండి చెనిమె, త్తనకయి వేరు వెల్లకియుఁ ద్రిప్పెడు కర్షకునట్లు .. ఆము 4 219.

**ముల్లియ(ల్లె)** వి (సం. మూలమ్) 1. మూట.
ద్వి. ఉప్పుముల్లియ నీర నుంచినయట్లు, కప్పురంబున నగ్ని గప్పినయట్లు ..
బస పు 2 384 పం.

కం నాముద్దుతమ్ముఁ డెన్నఁ, డేమియుఁ దా మూటఁ గట్ట నెఱుఁగఁ డిదేమో, యీము దుపుఁ జూడవలె నని, ప్రామినకుతుకమున ముల్లె వదిలిచి కాంచెన్ .. చెన్న 1 115

ద్వి మంచిది నీపని మట్టుచేయంతు. నని కడ లేని కామాంధకాముక, మునిఁగి సొమ్ములుదీసి ముల్లెగాఁ గట్టి
ద్వి శ. సా 1 720 పం.

సీ. .. సొమ్ములు ముడుపులు దె మ్మటంచుఁ, బలుకుచు వారివెంబడి వంటి ముల్లెలు దెప్పించుకొనుచు ను ధీరుఁ డగుచు ..
వేం మా. 3. 60.

ఆ. ముచ్చు తీర్థ మేఁగి ముల్లె విడుచుఁగాని, మ్రొక్కఁ బ్రొద్దు లేదు మొనసి యెపుడు. కుక్క యిల్లు సొచ్చి కుండలు వెదకదా ..
వేమన 2 19.

**ముల్లు = ములు,** వి జా (బ ముల్లులు, ముండులు, ముళ్ళు )
1 కంటకము, కొన్ని వృక్షాదులకుఁ గల్గు వాఁడియైన సూక్ష్మావయవ విశేషము
ఆ. ఒక్కపెట్టలోన నొప్పారుఖద్యోతుల, రెంటిఁ గాంచి వాఁడిముంటఁ బొడిచె . .
భాగ. 9 51.

ముల్లుచూ(నూ)పు = ములుచూపు. అ. క్రి. (ముల్లు + చూపు) 1 ప్రాసునం దుంచినవస్తువులతగ్గు మొగ్గులను సూచించు, ప్రమొగ్గును చూపు.

గీ. మునులతాల్మికి నెవ్వఁడు ముల్లుసూపు మగల మగువల నెవ్వండు మరులుగొలుపు
భాగ 10 ఉ 10

ఆ సత్య మశ్వమేధశతముఁ ద్రాసునఁ బెట్టి, తూన్ప ముల్లుసూపెఁ దుదకు సత్య. మట్టిసత్యమునకు సకలవేదంబులు, సకలధర్మములును సాటిరావు. కృ. శకుం 3 188

2 అతిశయించు.

సీ ధీంకారగుణమున మేరువుతో నెత్తుజూచిన యెడ ముల్లుసూపువాఁడు ..
దశకు 1 75.

సీ. ఎవ్వఁ డేయపథాన మెఱుగు నయ్యపథానమున వాని కించుక ముల్లుసూప
విక్ర 1 20

ముల్లూచే. వి. (ముల్లు + ఊచే తృణవిశేషము హా స 5 45

ముల్లూచి వి తృణవిశేషము. ఒక విధమైన గడ్డి .. ప్రబంధ 01

ముళ్ళపేరు. వి (√ ముడి) స్త్రీల కంఠాభరణవిశేషము.

సీ గొప్పగుఁబయ్యెదలోనఁ బిక్కటిల్లుచుఁ జాలఁ గ్రుళ్ళుచన్నుల నొప్పుముళ్ళపేరు ..
[illegible] 1 102

ముళ్ళమారి. విశ (√ముడి[1]) ఒండొరులకు విరోధమును గల్పించునది, దుశ్శీల, చెనటి: దుశ్శీలుఁడు

సీ ఇక్కకమ్ములు దెచ్చుముళ్లమారి ...
శ్రీరం. మా. 5 34.

ముళ్లువేయు స. క్రి (√ముడి[1]) 1 ముళ్లు వెట్టు, ఒండొంటితో బంధించు.

వ. .. శేషవాసుకిముఖ్యమహానాగంబుల ముళ్లు వేసి చుట్టినం గాని దీనిమొదలివలము కొలపెట్టరాదు .. వరాహ 12. 43

2 ఒండొరులకు విరోధము కల్పించు

(వ్యవ.) వాఁడు ముళ్ళువేయుటలో చాల గట్టివాఁడు.

మువ్వ[1]. వి (మూఁడు + వ) మొనను మూఁడు సందులుగల పెద్దగజ్జె, కింకిణి.

ఉ మువ్వలు గంటలు న్మొరయ ముందటికూఁకటి రావిరేకతో, నవ్వసజాతుఁడాడు ..
హరి పూ. 5. 191

పె పచ్చియేనికతోలుపచ్చడంబు ధరించి గిలుకుమువ్వలకోలఁ గేలఁ బట్టి ...
హర 5 55.

చం మలయపుగాలి రేలు వనమాలివిమానపతాకఘల్లుమం, చులియఁ బసిండిమువ్వగమి యొకొక్కమాటు గదల్ప
ఆము. 1 74, అం. భా. 2. 151

వ్యవహారమునందలి కొన్ని
విశేషప్రయోగములు.

మొన్న కొన్నబిందె మువ్వలాగున నున్నది

(అనఁగా తేలిక యై ఇంపుగనున్న దనుట.)

ఈదినము లంఘనము చేసినచో రేపటికి శరీరము మువ్వలాగున నుండును. (అన గా తేలికగా నుండు ననుట.)

ఉ మువ్వకోడియ, మువ్వపోనె, మువ్వపసరము

మువ్వ[2]. వి. ఒకానొక పట్టణము.

('మువ్వపురి' క్షేత్రయ శ ద)

మువ్వంక. వి.శ (మూఁడు + వంకలు) మూఁడు వంకలు గలది

సీ. మువ్వంకమురువుతో మురళి యొకొక్కవేళ మ్రోయించు భువనైకమోహనముగ ...
పాండు. 4. 134.

సీ. ముప్వంకమురుపుతో మురళి యూఁదెడునిండు
సొగసు గోవులఁ జక్కఁ జొక్కఁజేయు ..
ఘటికా. 1 128.

**ముప్వంకపట్టిన** వి (ముప్వంక + పట్టిన) త్రిశూలము

సీ. బిరుదురాకాసులఁ జరిమార్చు ముప్వంకపట్టి
సకా మనోభవవిరామ ... నిరం 3. 12.

**ముప్వంచే.** వి. (మూఁడు + పంచలు - వృత్తిని వర్ణలోపాదులు) మూఁడుపంచలు.

సీ. బోడ వైనముప్వంచఁ బోలుచునట్లుగ నేనుఁ
గులకు గుత్తములకుఁ గొట్టములును ...
భార ఉద్యో. 1 93

విశే. మూఁడుపంచలు గలది (శ. ర.).

**ముప్వంచాకు.** వి. (మూఁడు + పంచేలు + ఆకు) ముయ్యాకుపొన్న (వృ వి) (శ. ర.)

**ముప్వంచే.** వి వృక్షవిశేషము.

ద్వి తేవదారువు కల్వె దేవకాంచనము, నావిరి రేల
ముప్వంచు పంచాది ..
ద్వి శ సా 2. 666 పం.

**ముప్వంటులు.** వి. బ (మూఁడు + అంటులు) నెలపురుడు.

సీ. శవరి ముప్వంటుల దినములయందు పూతన
చనుబాలతోఁ ద్రావె నుసురు, నెఱి బోరగిలి
యాడనేఱనినాఁడ పాదమునఁ దుత్తుమురుగాఁ
దాఁచె బండి. హరి పూ 8 58

ఉ. చంట విషంబు మెత్తుకొని చంపుదు నన్నుకు
వంచు వచ్చి ముప్వంటులనాఁడు పూతన
యవారణ నెత్తికొనంగఁ జన్నుఁజాల్గొం
టయుఁ బ్రాణముల్ దిగిచికొలును..
హరి ఉ 4 235.

**ముప్వకోడియ(డె)** వి. (ముప్వ[1] + కోడియ) కాఁడికిని గంతకును క్రొత్తగా నలవటిచెడి యెద్దు (శ. ర.).

**ముప్వదోనె.** వి. (√ముప్వ[1]) అడుగున ఒంటి పలక గలదోనె. (శ ర.)

**ముప్వన్నియవేల్పు** వి (మూఁడు + వన్నియలు + వేల్పు) సూర్యుఁడు

కం పువ్వులఁ బూఁతలు గైకొని, యవ్వల
యావనజభావనానవము అలరన్, జవ్వనులు
మెలఁగ నత్తఱి, ముప్వన్నియవేల్పు చరమ
భూధర మెక్కెన్ ఘటికా 2 134.

**ముప్వన్నె** విశే. (మూఁడు + వన్నెలు) మూఁడురంగులు గలది.

సీ ముప్వన్నెపులితోలు మొలదిండుగాఁ గట్టి
కర్కోటకాహిఁ బాగ గ బిగించి ..
హర. 5 55

సీ. తనుభృశత్రాన్త వేష్టనలగ్నబర్హిబర్హంబు
ముప్వన్నెంచుం గై చెలంగ .. ఆము. 1. 59

**ముప్వన్నెమెక(గ)ము** వి (ముప్వన్నె + మెకము) పులి, చిత్రకాయము

సీ కటిభాగమునయందుఁ గట్టు రంగులు నాఁ
వె లుగారు ముప్వన్నెమెకముతోలు ..
కాశీ 2 146

సీ కమ్మల నిప్పుకల్ గ్రమ్మచు ముప్వన్నె మెక
మిర్లఁ గదియుపోలికల మొసలి, కన్నుల
రాకాసిమిన్న కోన మెకంపుగుంపులఁ, దార్కొని
యంచవాన గుఁరని . అచ్చ రా యు 311

సీ ముప్వన్నెమెకముతోల్మన్నవు నడికట్టు గాయ
చక్రాయుధచ్ఛవిని దెగడ .. రంగా 1

సీ ముడిచినయెుంటికెంజడ మూయ ముప్వన్నె
మెగముతోలు కిరీటముగ ధరించి ...
మనుచ 1. 59

**ముప్వన్నెవిల్లు** వి. (ముప్వన్నె + విల్లు) ఇంద్రధనుస్సు

గీ. వర్షధారావశేషాన్వవాయయుక్తి, వాయువశమునఁ దెరలుముప్వన్నెవిల్లు, వేడ్కఁ వెన్నాడు
శశివోలె వెలఁది చాపలమున నంమాహరించు

శుకము దవులుచు పాండు 4 285

మువ్వపసరము = మువ్వకోడియ (శ. ర).

మువ్వీసము వి. (మూఁడు + వీసములు) 1. రూకలో పదాఱింట మూఁడు భాగములు.

సీ. ... పణషోడశాసంబు పరగు వీస, మనఁగ . మువ్వీస మంచనఁ బొల్చుఁ దత్త్రి యాఖ్యయై ... ఆం. భా 2 272

2. ఒకవస్తువున పదునాఱు భాగములలో మూఁడు భాగములు (శ. ర)

మువ్వ(వు)రు = ముగ్గురు న. బ. (√మూఁడు) ముగ్గురు.

(మూఁడు శబ్దమునకు మహన్మహత్వార్థకరూ ము)

కం అవ్వాశాంగవజానిన మువ్వురు సీల్కుటకుఁ దాన మూలం బనుమన్, నెవ్వగలు వగల నీనం. గ్రొవ్వటి వెసఁ జొచ్చె నగ్నికుండము లోనన్. విక్ర 6 160

కం ఇవ్విధమున నధ్వశ్రమ మవ్వనమునఁ దీర్చు కొని వనాటప్రవరుల్, నవ్వుమొగంబుం తోఁ జని, మువ్వురుదొరలకును జాఁగి మ్రొక్కిన పిదపన్ రామా 7 11.

శా స్త్రీలన్ మువ్వుర నిచ్చె నాఁగ్రసుతంన్ శ్రేష్ఠానుపూర్వంబుగాన్ ...

ఉ. రా. 1 293. భాగ ఆది 5 34.

సీ అనఘా మళినాఁ సంజ్ఞఁ దతనికి మువురుం, దనయులు సుమతియుఁ బృథుఁడును, ఘనుఁ డుగ్రతిగ్ముఁడు నన౦ బ్రకాశితతేజుల్. హరి పూ 3 82

కం అమ్మువ్వురకు గానము హరి, యిమ్మెయి నభ లంబు నేర్చ .. కళా 2. 37.

సీ అనఘుతఁ దాని యతుగుమల్లి కార్జునుండు, కూర్మి ముదగొండశరభన్నకూఁతు నుంద, రీసతిమణిఁ బెండ్లియై భాసురశ్రీ,మూర్తులను బోలుతన యుల మువురఁ గనియె. చెన్న. పీఠి 41

మువ్వెట్టి. వి. (మూఁడు + వెట్టులు) త్రివిధ మగుకూలి లేని సేవలు.

మ .. అనురా,ధిపు మువ్వెట్టియుఁ గొన్న రాజసకులాధీశుండ .. భా. రా యు 200

ఉ ఇట్టివిధంబునన్ విబుధు లెప్పుడునుం గను గాపులట్లు ము,వ్వెట్టియుఁ జేసి చేసి . హర. 3 11.

శా లీలం గొంటి కుబేరపుష్పకము బల్మిం గిట్టి మువ్వెట్టులం, దూలందోలితి వాసవాదిసుర లన్ ... భా. రా యు. 54

గీ అష్టదిగ్రాజులను దవ కరియుఁ గోరు, వెట్టు కాపులఁ జేసి మువ్వెట్టి గొనియె ... తపతీ. 1. 25.

మువ్వెత. వి (మూఁడు + వెతలు) త్రివిధమగు బాధలు.

ద్వి తఱలిపోవఁగనీక దం గిటి గిచి, మొఱలు వెట్టఁగఁ గట్టి మువ్వెతఁ బెట్టి ... ద్వి. హరిశ్చ ఉ 1264 పం

మువ్వెలుఁగు వి. (మూఁడు + వెలుఁగులు) 1 త్రేతాగ్నులు, మూఁడగ్నులు.

గీ కెడల బలరామకృష్ణులు నడుమఁ దానుఁ భద్రదంతావళము నెక్కి పాండవేయ ముఖ్యుఁ డతిరాజసంబున మువ్వెలుంగు, పోలికఁ బొనఁగ వచ్చెను బ్రోలికడకు ... విజ. వి. 3. 177

2 సూర్యుఁడు.

గీ మువ్వెలుఁగులోని పరతత్త్వమో యనంగ, శుద్ధనాట్యంపుఁదెరువునఁ జూడఁ బొలిచె కకు. 3. 85.

మువ్వేల్పుటిక్క = మువ్వేలుపులయిక్క. వి ముకుంద 1. 34. పొ 2. పం.

మువ్వేలుపులయిక్క = మువ్వేల్పుటిక్క వి. (మువ్వేలుపులు + ఇక్క) సూర్యుఁడు.

గీ కోరి ముమ్వేలుపులయుక్క కొలమునఁదు, జమిలిచౌవంచకేర్లరాచలివెలుఁగున, కేపుతోఁ బుట్టె వెదరులు వాపి పజలఁ, బ్రోవ నరుదుగ నిరుదుగభూపు లూని అచ్చ రా. బాల. 132

**ముమ్వేలుపులు** వి. బ మూఁడు + వేలుపులు త్రిమూర్తులు, బ్రహ్మవిష్ణుమహేశ్వరులు

(చూ ముమ్వేలుపులయుక్క)

**ముసటి.** సం వి ఈ స్త్రీ ధాన్యవిశేషము, ఒకజాతిధాన్యము

**ముష** సం వి అ స్త్రీ లోహములను కరగించెడి మూస, మూష.

**ముషితము.** సం విశ. (అ ఆ అ) 1 దొంగిలింపఁబడినది అపహరింపఁబడినది. 2 మోసపుచ్చఁబడినది వంచింపఁబడినది.

**ముష్కము.** సం వి అ పుం 1 అండము, వృషణము. 2. అరడకోశము, అండములుండు సంచివంటితోలు. 3. సమూహము, రాశి, ప్రోగు, మొత్తము 4. మొక్కపుచెట్టు, మోఘము (వృ వి.)

**ముష్కరుఁడు** సం విశ (అ ఆ అ) 1 పెద్ద వృషణములు కలవాఁడు 2 దుష్టుఁడు

క ముష్కర హితవృత్తిని బం. పుష్కర పత్త్రాక్షుఁ బట్టి భోగించుటచే, ముష్కరహితుఁడవు గమ్మని, నిష్కరుణ శపించి మౌని నిలయముఁ జేరున్. దశా 7 1 164

3 కృపణుడు, దీనుఁడు

మ. ధరణీరాజ్యము గోలుపోయి .. ముష్కరుల న్నార్థులఁ గొల్చిన న్గలదె సౌఖ్యం బెంత యన్ .. భార అ 6 165

శ్లో గతశ్రీకాన్ హృతరాజ్యాన్ కృపణా న్గత చేతసః, అరణ్యవాసినః పార్థా న్నానురోద్ధుం త్వ మర్హసి .. సం భార వన 268 16

4 మూర్ఖుడు

మ. . అధమశ్రేపుత్తుృండు జూదరి వెంటం దమకించి సౌబలునిచేతన్ భూమి గోల్పోయి ముష్కరుఁడై వెండియు నొడ్డఁగా నతఁడు వఱ ప్రౌఢిమై గెల్చె ....

భార ఉద్యో 3. 358 4 81.

క గురుఁ దల్లిని దండ్రిని సోదరుని నకారణము గ్రోల్లదముఁ బల్కిన ము, ష్కరుచేత సూఱు పణములు, ధరణీశుఁడు గొనుట నీతి దండుపఁ పేరన్ విజ్ఞా ప్రా 43.

**ముష్కుఁడు** సం. వి అ పుం 1 మాంసలుఁడు బలవంతుఁడైన మనుష్యుఁడు 2 చోరుఁడు దొంగ.

**ముష్టి** సం వి ఇ స్త్రీ 1. పిడికిలి 2 పిడికెఁడు బియ్యము మొ

గీ. ఇంట నెవ్వాఁడయిన బిఱ మిడిన ముష్టి, వెట్టినఁ గరాశితేశియొప్పిదము దోఁప, నెగిరపడి యిందులకు మీర లెవ్వ రనుచుఁ, బెద్దపులిఁబోలె రొప్పు నాబిసరుహాక్షీ

శుక. 3 318

3 బిచ్చము. (ఈయర్థము తెనుఁగునందుమాత్రమే కానవచ్చుచున్నది)

సీ మిన్నంతసంపదఁ తెన్నారయుండియు ముష్టికి లోనయ్యె మునితనడుము .

చంద్రా 2 ..

(ఇట పిడికిలియని రెండవ యర్థము.)

4 పిడి, కత్తిపిడి 5 పలపరిమాణము 6 అపహరించుట, దొంగిలించుట.

**ముష్టింధయుఁడు** సం వి అ పుం. పిడికిలి నోట నుంచుకొని చప్పరించువాడు, శిశువు, చంటి పిల్లవాఁడు

**ముష్టింపచుడు** సం. విశ (అ ఆ అ దరిద్రుఁడు (శ ం)

**ముష్టికాంతకుఁడు.** సం వి అ పుం ముష్టికుఁ జ పినవాఁడు, బలరాముఁడు.

**ముష్టికుఁడు** సం. వి ఆ పుం. 1 స్వర్ణకారుఁడు, బంగారుపనివాఁడు 2 ముష్టికాసురుఁడు

(కంసుని మల్లురలోని వాఁడు)

**ముష్టిదేశము** సం వి అ. పుం పిడికిటఁ బట్టు చోటు, విండినడిమి ప్రదేశము

**ముష్టిద్యూతము.** సం వి అ న ఒక రకపు జూదము, గవ్వల ముష్టితో నాడుజూదము

**ముష్టిబంధము** సం. వి. అ. పుం. 1 పిడికిలి పట్టుట, సంగ్రామము. 2 పిడికెఁడువస్తువు.

**ముష్టిమేయము** సం. విశే (అ ఆ అ) పిడికిటఁ గొలువఁ దగినది.

**ముష్టియుద్ధము** సం వి అ న. గుద్దులాట.

**ముష్టీముష్టి** సం అవ్య ఒండొరులు పిడికిళ్ళచే గ్రుద్దుకొని చేయునది యుద్ధము

(ఈ క్రి వి భాగ సమాసమునందుముష్టాముష్టి అని యతివయు దాకారము ప్రయోగింపఁబడినది కాని 'ముష్టాముష్టి, బాహాబాహి' మొదలగు ప్రయోగము లసాధువు లని 'అన్యేషామపిదృశ్యతే' సూత్ర మనోరమ యందు సిద్ధాంతము చేయఁబడినది

కం భీమాసురవీరులము, ష్టాముష్టి రణచ్ఛటచ్ఛటాశబ్దా బుద్ధామం బై తత్స్వపినము, హామ్మగ పతుఁకు నతిభయానక మయ్యెన్ ...

భార, అం 8 395.

**ముసగన** వి. కోపమున గలుగు చిఱచిఱ

కం అసమంజుని వెడలించిన, వసుధేశ్వరుఁ డేఁనాపవాదముఁ జెందెన్, దెస లెఱింగినవరముల కా మునుగఁ లని కైక నోరుమూయించెఁ దలఁన్ చం రా. 4. 56

గీ మునగసలఁ బోరుగురుభీష్మముఖుల సఖుల, నాన్మసైన్య శ్రేష్ఠు లైనవారిఁ, జూచి యధిపతి యొక్కడసుద్దు లనుచు, నడిగివారిందులోఁ దగినంతఁ జెప్ప. రాఘవ. 4 49.

2 గుసగుస, రహస్యసల్లాపము

కం రాచిలుక రాణివాసము, లోచెలి యొలమావి చిన్నియుపురగలపైఁ, జూచితె ముసగస లాడుచుఁ, జూచెద రాతలిరుబొడవునోరణ గండ్లన్, కు ౭ 91

సీ. ... మునగస గుసగుస ముచ్చట యన సల్లాప సంజ్ఞ లై యుల్లసిల్లు ...

ఆం భా. 1 117.

**ముసజ్జీ.** వి వస్త్రవిశేషము

రగడ. మాదళంబులు వెన్నమణుగులు ముసజ్జీలు చాదరలు పైరిణీ ల్చక్కనిబాయిలు

హంస 5 356.

**ముస(ర)ద్ది** వి లేఖకుఁడు, వ్రాయసకాఁడు

సీ దేశపాండ్యా తాను దినవలె నని చెప్పు ముసరద్ది దెవిలోన మొఱఁగి చెప్పు .

వేణు 16.

చం. అను లవార్త తెల్ల సమయ పుముసద్ది లిఖ సు పవునా, దనచరకమ్మ

ల వి 4 119.

(ముఖాది అపముద్రి.)

**ముసనాబు** వి అందము ప్రక్క తెర.

సీ. అలరారుకురువేఱుతకుకుబల్మునసనాబుఁ బరువంపు బొగడపూబటువుదిండ్లు ...

చంద్రా 3. 69.

సీ ఉదికంబకము లింపొసఁగు దంతపుగొడెల్ నయము మించిన మునసాబుసడము ...

రా. వి, 2 43.

సీ. . ముసనాబుకుచ్చులు పసిఁడిసరిగె కుట్టు తాపెత బటువులు ... అందలం బెక్కి ...

దశా. 7 129.

**ముసవు.** వి ముచ్చట, కోరిక, అభిలాషము

సీ. కేవ నాజవరాలిలావణ్యసరసిలో మునుఁగుదు వెన్నఁడు ముసవు దీఱ.

వరాహ 11 56.

ముసముస వి. 1. పంది మూర్కొనుటయందలి ధ్వని కనుకరణము

గీ. ముట్టె విగియించు ముసముస మూరకొనుచు వదరు సంరక్షితక్షోణి యజ్ఞఘోణి ... భాగ 3. 418.

2 ముసరుట క్రిమ్ముటయం దగువనుకరణము

వ .. చెరలు కదుపులలెన్నగా బుస్సుబుస్సనఁ గూర్చి మొగవీర్చుచు ముసముసన ముసరు కటకచీకటితుటుముల నందంద గ్రందు కొని బొల్లిమొకంబు మెకంబులును .... ప్రబంధ. 186

3 పడిసెము పట్టినప్పుడు బిడ్డలు విడుచు శ్వాసముల ధ్వని కనుకరణము

(చూ ముసముసలాడు.)

4 కోపమున గలుగు చిఱచిఱ

సీ. ముసముస జంకించు మొకరితు మ్మెదబారుపూఁ బోఁడిపాలపు వేర్పున హరించె భాను 3. 24.

(శ ర పా ముసరి జంకింపుచు ముద్రి పా.)

జ ముసముసమను, ముసముసయను, ముసముస లాడు,

ముసముసమను అ క్రి (ముసముస + అను)

1. ముసముసమని ధ్వనిచేయు

సీ ముసముసమనఁ జుట్టి కొనవెంద్రుకలు వట్టి వాలు మ్మని యందియ లులియఁదాఁచి ... కవిక. 4. 166 (శ. ర. పా.)

2 కోపమున చిఱచిఱలాడు

ద్వి ముసలి రోషంబున ముసముసమనుచు, ముసలలాంగలముల మునుకొని విసరె.

అభిమన్యుచరిత్ర (శ. ర)

ముసముసయను. అ క్రి. (ముసముస + అను) కోపమున చిఱచిఱలాడు.

కం జలరుహసంజాత సఖాస్థేమున కొగి సేఁగి యతని సత్త్వగుణంబున్, దెలియుటకై మతి వందనములు సేయక యున్న వజుఁడు ముస ముసయనుచున్ భాగ 10 ఉ 1269.

ముసముసలాడు అ క్రి. (ముసముసలు + ఆడు) బిడ్డలు, పడిసెముచే ముసముసయని శ్వాసము విడుచు

(వ్యవ) ఆ పిల్లవాఁడు మూఁడ్నాళ్ళనుండి ముస ముసలాడుచున్నాఁడు

ముసరికొను అ క్రి. (ముసరు + కొను, స్వార్థ మున) కలియు, పర్వు, వ్యాపించు.

కం ఇదె ప్రేఁపయడలి ప్రమథులు, ముసముస శతకోటిసంఖ్య ముసరికొని ప్రియంబు దలిర్ప దీనఁ గోలలు, గుదియలు గై కొంద్రు తమకుఁ గోరి ధరింపన్, హరి ఉ 6 14.

స. క్రి. చుట్టుకొను, పరివేష్టించు

వ. అనుచుం గనుంగొనుచు ముసరికొని చను చుండం బాయీలరాజనందన రాజమంది రంబు చక్కటికి నరుగునవసరంబున . భార. విరా. 1. 300.

ముసరు. అ. క్రి (క. ముసఱు. త. మూసు)

1. పర్వు, వ్యాపించు.

సీ. మోహాంబువలనఁ బై ముసరు లోభంబు లోభావేశమువఁ గాను మగ్గలించు ... భార అర. 4. 288.

గీ వాసితానవరుచిరనిశ్వాసములకు. ముసరి కారించు నెలదేఁటి ముసురుఁ జోపి ... కు. సం. 9. 318.

సీ. సంయమీంద్రులు శివార్చనలు చెల్లింపక ప్రసవంబునకుఁ దేఁటి ముసరు వెఱచు ... పి. శకుం. 2. 45.

2. పైఁబడు.

కం. ...ఏను నివ్వెఱపడితిన్, జివ్వన ముసరి కిరాతులు, క్రొవ్వెసకంబెసఁగఁ బూఁబగొని రజ్జనులన్ .. భాని వహా .13.

కం వాసవనందనుఁ డెంతయు, గాసిలి యున్నాఁడు మనలఁ గని యించుకయుం, దా నైరణ సేయఁడు గనుఁ మోనము లేకొక్కమొగిన ముసరంగ వలయన్ ...
భార. విరా 4 231

కం. తృణావర్తుఁ డవని కవచాటముగా, సుంకరువలియై విసలిస, వరు దరు దవ ముసరి విసరి హరిఁ గొనిపోయెన్ ..
భాగ. 10 పూ 264

జ ముసరికొను

**ముసలము** సం. వి అ. పుం న. 1. దుడ్డుకఱ్ఱ 2 రోఁకలి 3 శస్త్రవైద్యమునందలి సాధన విశేషము

**ముసలాముసలి** సం అవ్య రోఁకళ్లతో జరుగు నది (యుద్ధము)

**ముసలాయుధుడు** సం వి అ. పుం. బలరాముడు

**ముసలి = ముదుసలి.** విశ. వృద్ధుడు ; వృద్ధ

కం . ముసలిగదా పుట్టినిల్లు ముఖోర్జ్వలతకున్.
మనుచ 6. 47

కం. పేకి నెద్దులు తే కూ,రూరికి మోచుకొని తిరుగునొక ముసలియు నేఁ డేఱు గలిగి యొక యెద్దున బోరదిగంబరుఁడు సరియె పురికాఁ వుఁకున్
రా. వి. 1 56.

సీ ముదివాఁడు ముదుసలి ముసలి పెద్ద ముడుకు .. అంగడం బనఁగను నలరు వృద్ధాభిధ .
ఆం భా. 2. 119, ఆము 5. 58

జ ముసలితనము

**ముస(ష)లి** వి సం వి న్ పుం. 1. బలరాముఁడు 2. శివుఁడు. ఈ. స్త్రీ. బల్లి, గృహగోధిక

**ముసలితనము** వి (ముసలి+తనము) వృద్ధత్వము, ముదిమి

కం. రసనేవంబావం దన, ముసలితనం బడిగి తరుణమూర్తియుతుండై, వసుధావరుఁ డిటికిఁ జని.
వి|క 2. 157.

సీ. ముదిమి ము వ్వనఁ దగ ముసలితనము ..
ఆం భా. 2. 118.

**ముసల్యుఁడు.** సం. విశ. (అ ఆ అ) రోఁకటిచేఁ జంపఁదగినవాఁడు.

**ముసాంబ్రము** వి. (హిం ముసాంబర్ మి. బ్రౌ.) ఒక విధమగు మందుపస్తువు. (శ ర)

**ముసాపు.** వి. నానుడువాన. ముసాబు (శ ర).

**ముసాబు.** వి నానుడువాన.

ఆ. తన్నుఁ దెలియ కున్నఁ దగ వేదములు వెట్టి, సన్యసంపదకు ముసాబు వెట్టి వేమన 2 422.

**ముసానమ్మ** వి. ఒకానొక గ్రామదేవత.

గీ మోసపోక ముసానమ్మ ముదరాలు, దారె నడినప్పు లేక పాతాళమునకు
కాశీ. 5 269.

**ముసి.** విశ. 1. అసత్యము, బొంకు.

కం. గతజీవుఁడు వేఁ గనియెడు, కత యది ముసియయ్యెఁ బం కంఠునియెడఁ దా, నతఁడు మను బ్రతికి వేఁ గై, బలిమాలిచె జగముఁ జచ్చి భారము వాపెన్ రామా. 8. 230.

2 వి. బాధ.

(చూ. ముసిముట్టు)

జ ముసిముట్టు

**ముసించె.** అ. క్రి చెడు.

ద్వి. బుద్ధి గల్గినయానుబుద్ధియుఁ జూటి, బుద్ధి చెప్పి నను నాబుద్ధి ముసించె ...
ద్వి శ. సా 1. 692 పం.

**ముసిండి.** వి ముష్టిచెట్టు, వృక్షవిశేషము, ముష్టిపండు.

(దీనిపండ్లు మిక్కిలి చేదై ప్రాణాపాయకరములై యుండును).

సీ. పూతాత్ములపవనంబు పూరించుపుక్కిళ్లు ముసిఁడిఁ దూఁ తోడ ముద్దుగుఱియ ... క్రీడా 224

సీ. ముసిఁడి మ్రాఁకునఁ బండ్లు పసమీఱఁ గలిగించి
యించున కేల పుట్టించఁడయ్యె ...
నీలా. 1 111.

సీ. ముసిఁడి మ్రాఁకున నైతము బండ్లు గల్పించి
చెఱకున కేల సృజింపఁడాయె ...
వైజ 3. 121.

ఆ విను మనుజ్యలోకమున సిరి యనునె యాఁకొని
ముసిండి దినిన గ్రొవ్వు లావుఁ గలుగునయ్య
శకుని కర్ణు దుశ్శాసన మంత్రితంబు గాన్యతంత్ర
మగునె భార ఉద్యో 3 333.

**ముసిమి** వి ప్రేమానుబంధము

ఆ ప్రసవభాగ్యమహిమఁ బ్రబలియు నెటువంటి
ముసిమియో యెఱుంగ విసువు లేక,
తారసించి ముద్దుతమ్ములఁ జివురాకుఁ గోండ్లు
కొలను సొచ్చి వుచ్చికొనిరి
వేం. పంచ 4 153.

**ముసిముట్టు** అ క్రి. (√ముసి) బాధపడు

వ. ఇట్లు బహుభంగులఁ దవకాఱించు కల్మషంబుల
ముసిముట్టుక మెఱయు నాజగజెట్టి చందంబు
విని ... నృసిం. 5 4.

**ముసిముసి.** విణ మందము, అలంతి (నవ్వు).

సీ. ప్రాణేశునొసలిలాఱాంకంబు వొడగాంచి ముసి
ముసినవ్వుతో మోము మలఁచు ...
నైష. 7. 191.

చం ముసిముసినవ్వు మోముపయి ముచ్చట లాడ
రివంచె మ్రోఁతతో, గుసగుస లాడ వంచగమి
గూడఁ జనెన్ జెలి శారి మ్రోలకున్ ...
ముకుంద. 3. 202.

కం. ఒనఁగినఁ గైకొని సంతస, మెసఁగ సదస్యులు
ఫలించె నృప నీసుకృతంబు సమస్తం బని పలు
కన్, ముసిముసి లేనగవు తనదు మోమునఁ
దొలఁకన్ ... చం. రా. 2. 41.

క్రి. విణ మందముగ, మెల్లఁగ (నవ్వు).

కం. పనిలేనిపని ముఖాంబుజ, ముసకుం జెన్నగ్గలింప
ముసిముసి నగినన్, వనరుహగేహిని విభునిం,
గను గొని యి ట్లనియె నగ్రగణ్యము గాఁగన్.
విప్ర. 4. 37

**ముసుఁగు = ముసువు** వి (క. ముసుకు)
కప్పుడు, అవగుంఠనము.

గీ ముసుఁగుఁ దొలఁగించి తనులత మోద మెసఁగ
బద్మమధ్యంబునం దున్నపద్మవోలె, హంస
తూలికాతల్పంబునందు నుండి, యాకళావతి
మనుజనాయకునిఁ జూచి ... విక్ర 6 140

గీ కొన దిగఁగ నీలిపుట్టంబు ముసుగు వెట్టి,గాఱు
లెగఁద్రోసి చప్పుడు గాక యుండ, వచ్చె
నూర్వశి యర్జునావాసమునకు ..
హర 7 119

మ ... సంసారంపుఁద్రోవ న్సదా, చనుచుండున్
ఘనమోహాఖేద మనమున్ సంసారి పాంథుండు
వాసిన లన్ ధూళి ముసుఁగు గాఁగ ..
ఆము 3 70

చ సతు లిరువంక నిర్వురును శయ్యపయి న్నిదు
రింప నాథుఁ డొక్క తెకు ముసుంగు మోముఁ
పయిఁ గాంచుచు మెల్లన నొత్తగిల్లి ...
గంథ 58.

జ. ముసుఁగుకొను, ముసుఁగుడు, ముసుఁగుడువడు,
ముసుఁగుదన్ను, ముసుఁగుబొంద, ముసుఁగు
ముసుఁగుదన్ను, ముసుఁగుబొంద, ముసుఁగు
వడు, ముసుఁగువాఱు, ముసుఁగువేయు

**ముసుఁగుకొను** అ. క్రి (ముసుఁగు + కొను)
క్రమ్ముకొను.

కం. తోరము లగునవ్వర్షా, వారములం దొక్కనాఁ
డవారితధారా, సారంబు పయోధరముల్,
ఘోరంబుగఁ గురిసె ముసుఁగుకొని నిశదాఁకన్
వైజ 2 148.

**ముసుఁగుడు.** వి. (√ముసుఁగు) అవగుంఠనము,
కప్పుడు.

(జ. ముసుఁగుడువడు.)

**ముసుఁగుడువడు** అ క్రి. (ముసుఁగుడు + పడు)
కప్పుడువడు, ఆచ్ఛాదితమగు.

కం అచ్చపడి యుభయబలములు నచ్చెరువుగఁ జిత్రరూపుల ట్లుండ శర,ప్రోచ్ఛలితచండ దీప్తిన, ముచ్చయములు పెలుచఁ బరగె ముసుఁగుడువడఁగాన్ ..
భార. భీష్మ 1 240.

(శ ర పా ముసుఁగువడంగాన్ ముద్రి. తాళ ప్రతి పా.)

**ముసుఁగుదన్ను.** స. క్రి (ముసుఁగు + తన్ను)
1 మఱుఁగుపఱుచు

సీ కడ లేనివీడ్యంపుఁగప్పు చందురకావిమోవి పల్లొత్తుల ముసుఁగుదన్న ...
పాండు 3 10

2 ఆచ్ఛాదించు, కప్పుకొను

(వ్యవ) వాఁడు దుప్పటి ముసుఁగుదన్ని పండుకొన్నాఁడు.

**ముసుఁగుబొంద.** వి (ముసుగు + బొంద) మట్టలూడనితాడు లోనగు చిన్నచెట్టు (శ ర)

**ముసుఁగువ(ప)డు** అ క్రి. (ముసుఁగు + పడు)
1. వ్యాపించు, క్రమ్ము.

కం కడులజ్జయు దైన్యంబును, నడచు ముసుగు వడఁగ నాఱు నాత్మగతమునం, బుడమి వివరంబు లేదే, యడఁగెద నన్నట్టి దయ్యె నప్పుడు కర్ణా ... భార, అర. 6. 14.

గీ. మొగముపై శోకదైన్యముల్ ముసుఁగు పడఁగ మార్క 3 11

సీ ఉడురాజబింబంబు నుల్లసమాడెడుముక్తాతపత్త్రిముల్ ముసుఁగువడఁగ ...
భా. రా యు 470.

2 ఆచ్ఛాదితమగు, కప్పఁబడు

గీ చాతురీరీతి వేర్వేఱ సంగ్రహించి, వనిత యొకజీనిపావడ వానిమీఁద, ముసుఁగువడఁ జుట్టి పై లక్క ముద్రఁబెట్టి, యొరులు గన కుండ నలుదిక్కు లరసి చూచి ... విప్ర. 2.87.

వ. .. కొండగోటియ ముఱుగుడుబొందులకు నందడింపుకలకగృధ్రావళుల మొల్లంబుల ముసుంగుపడువల్లంబులును .
మను చ 4. 67.

**ముసుఁగువాఱు** అ క్రి . ముసుఁగు + పాఱు) వ్యాపించు.

సీ చంద్రాబ్జనఖకాంతిచంద్రికల్ నతభూప ముకుటాగ్రమణులపై ముసుఁగువాఱ
కవిరా 1 101.

**ముసుఁగువేయు** సం క్రి (ముసుఁగు + వేయు) కప్పు, ఆచ్ఛాదించు

సీ పాలురుముంజిముత్యాల యొఱగుపాగ మెఱుఁగునొసలిబొత్తరిబొట్టు ముసుఁగువేయ ...
సారంగ. 1. 79

**ముసుఁడి** వి. (క. ముసుండి) సమూహము.

ఆ బలు వెత్తియున్నపరుసంపు టొడళులు, గలుగునెఱకుముసిఁడిఁ గనిరి సతులు . .
కు సం. 6 694

**ముసురు** వి. నిరంతరవర్షము, ఎడతెగనివాన, వృష్టి, వర్షము

(బ ముసురులు, ముసుర్లు, ముసుళులు, ముసుళ్లు,)

కం చలిగాడ్పుల ముసురుల మెయి, వలిగొని ధాత్రీపురంధ్రి వలిఁ బచ్చలికం,బలిఁ గపిసి కొన్నవిధమునఁ, బొలుపుగఁ జివ్వరలు గవిసె భూతల మెల్లన్. కు సం. 6. 757.

చం మునురుదినంబులందు మన మోసలఁ బంచట రంగు మీఁటటన్, ... గిరిశభక్తు లనేకులు నిండి యుంద్రు ... హర 2. 40.

మ. ... ఒమ్ముగూడఁ బోల మంబళ్ళోయుచుం బట్టి పెన్ముసురం దిఁగెడుకాఁవుగుబ్బెతల ...
ఆము 4 133.

సీ పసపస యను నది మును రనఁగను మీఱు ...
ఆం, భా. 1. 75.

గీ. వానితాననరుచిరనిశ్వాసములకు, మునరి కారించునెలదేటి ముసురు జోఁపి ...

కు. సం. 9. 318.

(ఇట సమూహము అని భావము.)

కం ... కురిసిరి ముదమున, నెగడుచుఁ గుసుమ
ములఁ ముసురు నిర్జరు లధిపా ....
భాగ. 10. ఉ. 23. భాగ. 4.375.

జ. ముసురుకొను, ముసురుగవియు, ముసురు
మూతి

**ముసురుకొను.** అ. క్రి. (ముసురు + కొను)

1. ఎడతెగక గురియు.

కం. దెసలు ప్రసన్నము లయ్యెను, ముసురు
కొనియెఁ బుష్పవృష్టి మురజధ్వని పెల్లైనఁగె
దివి శుభానిలము లొలసె వహ్ని ప్రదక్షిణా
ర్చులం గనుపట్టెన్. జై. భా. 6. 87.

గీ. ... పథికు, లుసురుమన ముసుర్కొన్న
యమ్మొసురులోన, రాఁడు పతి యంచు నిర్భర
రతులఁ దేల ... శుక. 2. 343.

2. కవియు, ఆవరించు.

కం. ముసురుకొనుజరభరంబున నసురుసు రై
యున్న మమ్ము వడకించితి వి, ట్లుసురుమనఁ
బట్టువడు మొక,యసురకు నీ వనుచుఁ బలికె
నాగ్రహ మెసఁగన్. మనుచ. 4. 84.

వ .. విసరుహదళనయనలు ముసురుకొని బలిసి
నిలిచి కొలువఁ బ్రతిసంక్రమణవారోత్సవాదుల
యందుఁ జేరోలగం బవధరింతువు ...
భీమ. 3. 211

**ముసురుగవియు.** అ క్రి, (ముసురు + కవియు)
కవియు, వ్యాపించు ముసురుకొను.

గీ. వరుని పాశుపతాదిబాణముల పెంపు, భీము గద
సొంపు నమ్మి యుద్ధాముతిలఁ, జెలఁగి వెల
పేది యక్కడిబలము ముసురు, గవిసి యెపుడుఁ
గయ్యమునకుఁ గాలుద్రవ్వు.
భార ఉద్యో. 2. 226

(ముసురుకవియు అని శ. ర.)

**ముసురుతేనె.** వి. ఒక విధమగుతేనె, మధువిశే
షము

వ ... ముసురుతేనె పూఁదేనె జుంటితేనె పుట్టతేనె
పెరతేనె కట్టతేనె కురుజుతేనె ...
ప్రబంధ. 112.

**ముసురుమూతి.** వి. (ముసురు + మూతి) కోప
వికారము గలముఖము,

ఉదా : ముసురు మూతివాఁడు (శ ర. .

**ముసువు** = ముసుఁగు.

మ ముసువు న్మెచ్చటియు ప్రవహస్యమునను
న్మొద్రించి నానాదివౌ. కను లాస్థానముఁ గూడి
యాడుదురు శ్రీకాశీప్రదేశంబునన్, గన వై
పుట్టెడుభాగ్యమైన మనకున్ గల్పింప దా
దైవము . కాశీ. 7, 206.

**ముష్టి.** వి. ముసిఁడి, వృక్షవిశేషము.

సీ. పురుషుఁ డొల్లనియట్టి పొలఁతియావన మెల్ల
ముష్టిచెట్టది పూలఁ బూసినట్లు ..
కలు. శ 87.

**ముస్త.** సం వి. అ. స్త్రీ. నిడుముస్తె, తుంగ
ముస్త. (వృ వి)

**ముస్తము** సం. వి అ పు న. ఒక దినుసుగడ్డి.
నిడుముస్తె వృ. వి పుం. స్థావరవిషభేదము.

**ముస్తాదము.** సం వి. అ పుం. పంది, సూక
రము.

**ముస్తాదు** = ముస్తీదు. విశే

(సంసిద్ధము)

సీ విరుదువస్తాదులఁ జేర్వేల నాడాడ ముస్తాదుగా
నిల్పఁ గుస్తరించి ... రంగా. 2 199

**ముస్తాబు** = ముస్తీదు.

(విశే. సంసిద్ధము)

(వ్యవ.) అత్తవారింటికి వెళ్లుట కతఁడు ముస్తా
బైనాఁడు

**ముస్తీదు** = ముస్తాదు, ముస్తాబు, ముస్తీబు,
ముస్తైదు

విశే. (హిం ముస్తయిద్) సంసిద్ధము

సీ కండచక్కెర దండిఖాణావుతెలుకల జీని
ముస్త్రీదుతేకీలు నడువ ...
ఉ. హరిశ్చ 3 13.

సీ తలబొమిడికము కత్తళము కేడెము కత్తి
యూనిగాఁ గలవి ముస్త్రీ దొనర్చ ..
ఉ. రా. 4 278.

వి. పరికరము, పనిముట్టు.

గీ ... రాజు, స్వారి వెడలెడివేడ్క తో సాదిఁ
జూచి, తెమ్మని ముస్త్రీదు ఘటియించి తేజి
నవఁగ ... ఉ. హరిశ్చ 4 18.

వ. తమతమ ముస్త్రీదులతో సిస్తుగా దోస్తిని చుట్టు
ముట్టి కోపాటోపంబున .. ప్రబంధ 788

ముస్త్రీబు = ముస్త్రీదు.

విజ (సంసిద్ధము)

సీ. ఎలదేఁటిగమిమేటి యొలగోలుమూఁకల నెల్ల
ముస్త్రీబుగా నెచ్చరించి ... శశాం. 4 66

గీ. అనిన నీవంతనేర్పరి వగుదువమ్మ. లెమ్మ
ముస్త్రీబు గమ్మ శీఘ్రంబుగాను ...
చంద్ర. వి 5 84.

ము(స్త్రియ)స్తె. వి (సం ముస్తా) 1 తుంగ గడ్డ.

సీ సెలయేటియిసుకలంకల వరాహంబులు
మొత్తంబులై త్రవ్వి ముస్తె లెత్త .
మనుచ 2. 7.

2 తుంగ) వృ వి.

(దీనిభేదములు నిడుముస్తె, నాగముస్తె, వట్రువ
ముస్తె )

ముస్తైదు = ముస్త్రీదు

విజ (సంసిద్ధము).

గీ అమరుముస్తైదుతేజితో వరుగుదెంచె, దారు
ణాకారుఁ డైనయుద్ధారుఁ డొకఁడు ...
శుక. 2. 426.

ముహిరుఁడు సం విజ. (అ. ఆ. అ.) తెలివి
తక్కువవాఁడు, అవివేకియైనవాఁడు. వి. అ.
పుం మన్మథుఁడు.

ముహురాభాష. సం. వి అ. స్త్రీ. మాటిమాటికి
మాటలాడుట, అనావశ్య సంభాషణము.

ముహుర్భుక్కు సం = ముహుర్భుజము.

ముహుర్భుజము సం వి జ్. పుం. గుఱ్ఱము,
అశ్వము

ముహుస్ సం అవ్య. (దీనికిఁ దెనుగున వ్యస్త
ప్రయోగము లేదు) తరుచు, మాటిమాటికి, విడువ
కుండఁగ.

ముహూర్తము సం వి అ న పుం. 1 నిమేష
కాలము. లిప్త, అల్పకాలము. నలుబది యెనిమిది
నిమిషముల కాలము

## మూ

మూ. విజ. వ్యుత్పత్తియందు మూఁడుశబ్దమునకు మీది
వర్ణము లోపింపఁగా మిగిలినరూపము.

గీ నరవరోత్తమ నేఁడు మూనాళ్లనుండి
యనుజుగొన వెంటఁ దిరిగెదు ననుర
యొకఁడు ... మనుచ. 4 73.

(మూన్నాళ్లనుండి శ. ర. పా.)

మూండు = మూఁడు. స. రెండునొకటి.

కం. పోండిగ వగజ తపశ్శిఖ, మూండుజగంబులను
దీవ్రముగఁ బర్విన బ్రహ్మాండము గాఁచిన
కాంచన, ఖాండముక్రియఁ దాల్చెఁ దత్ప్ర
భా భాసితమై. కు. సం. 6 814.

మూఁక. వి. (√మూఁగు.) 1. సేన, దండు

కం. వీఁకఁ బఱతెంచి నలుగడఁ, దాఁకినఁ గడు
నలిగి ఘోరతరశరహతి నమ్మూఁకలు విరి

యఁగ నర్జునుఁ, డాఁకరమున నేసె నుగ్రుఁ
డయి రణభూమిన్.
భారం ఆది 8 200.

సీ. మూఁకల విరియించి వీఁక నాచార్యాది
యోధుల నెల్లర నొక్కదెసకు, వెలిచి ...
భార. ద్రో. 2, 186.

కం. అఁకరముతోడ నప్పెను,మూఁకలపై కుటిక
కఠినముష్టినిహతులన్, మ్రాఁకుల శిలలను
భీముఁగు,ప్రోఁకలు గావించి రపుడు పాండవ
డక వడన్
భా. రా. యు. 634, భోజరా 4. 84

2. సమూహము.

చం. ... నిరవద్యకలారవామృతం, బులకలిమిం
బికాంగనలమూఁకకు మూకత సంఘటిం
చుచున్, చిలుకలకొల్కికంధర ఘటింపఁగఁ
జెల్లదె కంధరాంకమున్ వసు. 2 71.

ఆ. కొన్ని వెంటియేనుఁగులుఁ దాను జోకయై,
మూఁక దప్పి దప్పి మోము లెండఁ, జల్లగాలి
జాడ మెల్లన యని యా,సరసిదరని నింపు
తెరసి యంత.
వాల్మీ. 1 100, కవిజ. ౩. ౭1
ఆం. భా. 2. 100.

మూఁకలుగట్టు = గుంపుగూడు

ద్వి అనశనవ్రతులుఁ బంచాగ్నిమధ్యగులు, మొద
లైనతాపసుల్ మూకలుగట్టి, సదయాత్ము
డగురామచంద్రునిఁ జేర
రం. రా అర. 148 పొ 21 వం

మూఁకలుగొను = సమూహములుగా నుండు

వ. మూఁగ వేఁగిఁ మొదలుగఁ జెక్కు తెఱగుల
మ్రాఁకులు మూఁకలుగొని ..
పి శకుం 2 14

వ. వీరంబు బహుళరింబు తెత్తినచాడ్పున
మూఁకంగొని వేఁక నిడమి నాఁకం గొనక
వీఁక నొక్కుఁకునం గరిపురాధీశ్వరుం
దాఁకి ... పి శకుం ౬, 113

మూకవిప్పు. విఱ. (మూఁక + విప్పు) చెదరఁ
గొట్టునది.

సీ . . మొనయు చింతాశ్రేణి మూఁకవిప్పు .
మనుచ 4 108.

మూఁకుడు వి జొ (మూఁత + కుడుక.)

1 కుండమీఁద మూయుట కుపయోగించు
మృణ్మయపాత్రము, శరావము.

చం . పతి చెప్పిన సంతస మంది దాని
నొయ్యన దరిఁ జేరఁ బిల్చి పులియంబలి
యించుక వోసె మూఁకుటన్ ..
చెన్న. 2. 26

గీ వానిఁ దెలిరేకుమూఁకుటఁ గేసరాన్న,పుంజ
మపుడు బడిమిఁ ద్రిప్పి పోసె నొకతె .
చమ. 1 81

గీ చిఱుతనోయిన మూ కుటిచెలుపుఁ దాల్చి,
హత్తె నొకచో విశాఖ వింధ్యాద్రి
యందు .
కాశీ 1 186, ఆం. భా. 2. 248.

2 మూ త.

గీ. దాది యటు పెట్టి పసుపాడఁ దలఁగి చనుడు,
బరణిమూఁకుట నెలకొన్న బన్నసరముఁ,గఱచి
కొనిపోయెఁ జిల్క ప్రగల్భవిటుఁడు, బాలి
కామానసముఁ గొనుపగిది నపుడు .
పాండు. 4 2[1]1

మూ గ[1] = మూవ[1] విఱ (సం. మూక:
త మూన్గై . క మూగ ) మూఁగవాఁడు
మూ గది

(ఇది సానుస్వార మని శ ర నిరనుస్వారమని,
చి. ని )

సీ పెక్కు కాలపు మూఁగ కెక్కుడు వాక్ప్రౌఢి
వసు. 3 134.

ఉ ఊరికి మూఁగలో యనఁగ నుండి రగస్త్యా
పుల స్త్య గౌతముల్ ..
హరిశ్చ. 1. 180.

సీ. మూఁగ నా వెఱయు మూకుఁడు ...
అం. భా. 2 121, దశా 1. 10.

జ మూఁగదయ్యము.

మూఁగ² వి ఒకానొకచెట్టు

వ ... ఇప్ప కప్పురమద్ది గద్దగోరు గోరంట వెలమ యాలిమిరి మూఁగ వేఁగిస మొదలుగఁ బెక్కుతెఱంగుల్రమాఁకులు ...
పి. శకుం 2 14.

మూఁగ³ వి శ (మూకాన్) 1 పక్షివిశేషము.

సీ. నామాలకేతఁడు నల్లాన కప్పెట కాకియంబటిబోరిగాఁడు మూఁగ . .
హంస. 3. 12.

సీ. వంగపండును గోరువంక కప్పెట పొట్టిపిట్ట పావురము కన్నెంటి మూఁగ .
సుద. 3. 194.

2. దోమ (శ. ర).

ద్వి పుణియమూఁగలు బొడబొడమని మ్రోయ
ద్వి. హరిశ్చ పూ. 2060 పం

మూఁగ⁴ = మూవ వి 1. మువ్వ

ద్వి కనకఘంటలును మూఁగలును గజ్జెలును, దనరుమేఖల కటిస్థలి వలపడఁగ ..
(నవనాథ. 4 187, ప్రా 2 పం.

2 ఫలహారవిశేషము.

వ. .. చిమ్మిలుంటలు నటుకులు మూఁగలు లాజలుఁ బేలాలు ... ద్రాక్షలాది యైన ఫలహారంబులను . హంస. 1. 105.

మూఁగంబాఱు అ క్రి (మూఁగన్ + పాఱు, స్వార్థమున) మూఁగు.

శా పేఁగాదే నడవం జతుర్ముఖునితో నింద్రాది దిక్పాలకుల్, మూఁగంబాఱి భవత్పదాబ్జములకున్ మ్రొక్కంగ జే కున్నచో, నాఁగన్ వచ్చియు నాఁగఁ జాలనిప్రతీహారన్ విడంబించుచున్. దాఁగన్ బోయి తలారివాని యెదుఁన్ దాఁగఁగ నీ కేటికిన్.
ఉ హరి 4 92.

మూఁగఁబడు. అ. క్రి (మూఁగన్ + పడు స్వార్థమున) చుట్టుకొను

ఉ ... అయొలదేఁటిదాఁటు లో, నూనినడప్పి మూఁగఁబడి యున్నతచంచచంచుకోటిచే నానెడుఁ జూడు మందగరుదంచలఝుంకృతు లుల్లసిల్లఁగన్ పాం 4, 5.

మూఁగఁతిట వి. (√మూఁగు) దట్టముగా పెరిగినతిఁట. (శ. ర)

మూఁగదయ్యము. వి. (మూఁగ¹ + దయ్యము) మూకపిశాచము

కం. గట్టిగను మూఁగదయ్యము, వట్టిదదో కాక చెట్టొ బలురాచట్టో, యిట్టులు మన మిందఱమును, జుట్టుం బిలువఁగ నోరెత్త చూడక యున్నె. వాల్మీ 3. 118

మూఁగపోఁత వి. (√ మూఁగు) తుషసమేత ధాన్యము

గీ. .. తుషస, మేతధాన్యాభిధలు మూఁగపోఁతనంగ, మూన యనఁగాను ...
అం. భా. 2. 298.

మూఁగికొను. స. క్రి. (మూఁగు + కొను, స్వార్థమున) ముట్టుకొను, ఆవరించు.

కం. పేఁగి పురద్వారము బిట్టాగి నిలిచి తమ్మునఁ జూడ నడవిదిరుగుడుల్, మూఁగికొన గగన ముట్టిటు,గాఁగ లయాంబుదములీల గర్జించుటయున్ ఉ. రా 3. 269.

మూఁగు¹ స. క్రి ఆవరించు, చుట్టుకొను.

సీ. గోపాల నవపుష్పగుచ్ఛంబు మూఁగినపరిచారి కాద్విరేఫములలోనఁ ..

గీ. గఱయఁ దొలుకాముసోములు గఱపు ...
ఉ. హరి. 4. 187.

అ. క్రి. 1. కవియు, ముసరు.

ఉ ... ఒక్కతె కోయుగుత్తికిన్, మూఁగుచు ...
కళా. 3. 17.

2. గుంపుగూడు, సంక్షోభవించు.

చం మూ ఫ్రలో, మునుఁగఁగఁ జేసి యార్చె దివి మూఁగిన వేల్పులు భీతినొందఁగన్ ... హరి. ఉ. 1. 129.

3 అతిశయించు.

ఉ మొత్తితి సర్వదిక్పతుల మూఁగిన గర్వము విచ్చి పాఱఁగా ... మొ. రా. సుం. 49.

మ. ..ఉగ్రతురై కోర్కులు మూఁగె వస్తువులపైఁ గన్గొనలం దంద్ర యెక్కుడుఁ దోఁచెం గమనీయ దౌహృద పరిశోభంబునం బొల్తి కిన్, హరి ఉ 3 180.

కం .. పురుషవర్గంబు జయ, శ్రీలోలత నేతెంచుట, నేల యవిసి మూఁగినట్లు నెఱసె బలంబుల్ . భా. భీష్మ. 1 186.

4 వ్యాపించు

కం హాసయుం, గిరిని విశిఖంబు లేసిన, మొనపడె గగనంబు మొయిలు మూఁగినమాడ్కిన్ .. ఉ హరి 1, 147.

(మొనపడు ముద్రి, ప్రాతప్రతిసా)

జ ముక్కుఁడమూఁక, మూకవిస్పు, మూఁగం బాఱు, మూఁగఁబడు, మూఁగటీఁట, మూఁగపోఁత, మూఁగికొను.

మూఁడవకంటివేల్పు. వి (మూఁడు + కన్ను + వేల్పు) శివుఁడు.

ఉ మూడవకంటివేల్పుఁ దనముందరఁ బెట్టుక నిశ్చలస్థితిన్ . . కాశ. 4. 99.

మూఁడి వి. ముడ్డి, గుదము

గీ. వేఁడు తగవరి యొందును మూఁడి చొచ్చి, వాత వెళ్లెడువాఁడె యెవ్వాఁడు నంచు ... కళా. 2 79.

ద్వి ఓడక కురులు విట్టోడిసి రాఁ దిగివి, మూఁడివోఁ దాటించి మూతులు నులిమి, యెగ్గులుఁదప్పులు నెన్ని ... ద్వి. హరిశ్చ. 1204 పం.

గీ, ముడ్డి మూఁడి యనఁగను బొలుచు గుదము, అం భా 2 186.

మూఁడు = మూండు. న, బౌ (త. మూన్ఱు · కం మూఱు, మ. మూన్ను. తు. మూజి. దీనికి ద్వితీయాది విభక్తులందు మూఁటిని, మూఁడిటిని మూఁడింటిని మున్నగురూపము లగును) రెండుకొకటి

గీ అనుదినంబును గొలువంగ నాత్మ మెచ్చి మూఁడు నెలలకు వరదుఁడై వేఁడివెలుఁగు .. మార్క 7. 160

రగడ. మూఁడుమోముఁ బోటుముట్టుఁ బట్టెడు శూర, వేఁడిచూపునఁ, దియ్యవిలుతుఁ ద్రుంచినధీర!

(సంబోధనవిభక్తి)

త్రిపురాంతకోదాహరణము 20 పా.

ఉ మూఁడుగుణంబులన్ వరుస మూర్తులు మూఁడు ధరించి లోకముల్, మూఁడు రచింపఁ బెంప లయముం బొరయింపఁగఁ జాలుదేవుఁ డ,న్వాఁడవు నీవకావె సుర గ్రగముఁ ద్రోఁనఁ బురింపరుండవై, నాఁడవు నీవ ధర్మునఁడ వనం బిత్మవర్గము నేలువాఁడవున్. భా. రా యు. 6. 22.

కం. మూఁడుజగంబులలోపల, వాఁడిమగంటిమిఁ గడంగి వడి వాలమునన్, వేడిమితో మూర్కొన నె,వ్వా, డోపును రామవిభుని వాసవశౌర్యున్ భా రా. అర 239.

గీ. ఆయుపాయముల్ మూటికి ననువుగాని, యట్టిపగతునియెడ భేద మాచరింప, వలయు ... భార. శాం. 2. 416.

సీ ... తద్గణము త్రిగుణిత మైన,వాహిని యగు దాని వడి మూఁట గుణియింపఁ బృతన నాఁ బరఁగుఁ దత్పృతన మూఁట ...

ఆ గుణిత మైనఁ జము వగున్ .. భార. ఆది 1 80, చిత్రభా. 7. 80.

**మూఁడవతొలుపలుకు** = సామవేదము.

సీ తులకించు మూఁడవతొలుపలుకు రవలి కోవెల కూఁతలకు నొక్కవింత నెఱప.
యయా 2 50.

**మూఁడుజాలు** = మూఁడు యామములు (చూ జాలు)

ఆ తనిసి మూఁడుజాలతటిప్రా ద్దొకించుక, ఒల్లపడిన నల్లనల్ల వెడలి ...
హరి. పూ. 6 99.

**మూఁడేమాటలు** = సంగ్రహముగా నున్నది, లేక కొంచెమే యనుటను దెలుపును

కం అన శుక మిట్లనుఁ గుతుకం,బునఁ గథ కొదవ యని సెంత మూఁడే మాటల్,విని పొమ్మ ..
శు 2. 207

**మూఁడుకన్నులయ్య.** వి (మూఁడు + కన్నులు + అయ్య) శివుఁడు, ముక్కంటి

ఆ. మూఁడుకన్నులయ్య ముదముతో నిచ్చిన, ప్రళయకాలభూరి భయదవహ్ని, చటులకీల జాలసంయుక్త మైనట్టి,పాశుపతము. బూనె ఫల్గునుండు ...
గయో. 2. ఆ.

**మూఁడుకన్నులవాఁడు.** వి. (మూఁడు + కన్నులు + వాఁడు) శివుఁడు, త్రిలోచనుఁడు

వ. దుష్యంతుం డలంతులంత పోవువాఁడు కాఁడు, వాఁడితూపులవేఁడిమిఁ జూపక మూఁడు, కన్నులవాఁడు వచ్చిన ఱిచ్చపడండు ..
పి శకుం 3 31.

**మూఁడుకన్నులవేల్పు.** వి (మూఁడు + కన్నులు + వేల్పు) శివుఁడు, త్రినేత్రుడు.

గీ. మూఁడు కన్నులవేల్పుతో మోహరించి, నేఁడు దేహంబు లేక యున్నాఁడు దాను ...
నైష. 4. 28.

**మూఁడుకా(గా)ళ్లముసలి.** విజ. (మూఁడు + కాళ్లు + ముసలి) నడవ నోపిక లేనంతటి మిక్కిలిముసలి (చేతి నూతగ నుండు కఱ్ఱయే మూఁడవకాలు)

సీ తల్లి మదేకపుత్త్రిక పెద్ద కన్నులు గాన నిప్పుడు మూఁడుకాళ్లముసలి ..
నైష 1. 109.

(కన్నులుగానదు వావిళ్ళప్రతిపా)

మ వరుసన్ మాతను మూఁడుగాళ్ళ ముసలిన్ వర్జించి తేజోధురం, ధరమిత్త్ర ప్రియపుత్త్రి పుణ్యజనులన్ వర్జించి రత్నాకరం, స్ఫురదా వాస మహాబలార్థవద విస్ఫూర్తుల్ విసర్జించి.
చంద్రా. 6. 130.

**మూఁడు².** అ. క్రి. 1. (చేటు మొ) సంభవించు, కలుగు.

గీ ఓలతాతన్వి శివయోగి యొకఁడు లేఁడు, నేఁడు మొగసాల నిది యేమి మూఁడె నొక్కొ!
హరి 2 59

ద్వి ధనమును భార్యయుఁ దనయు లనఁగఁ, దనరిన యేషణత్రయమును మూఁడి, వదలక బహుమోహవార్ధిలోఁ జిక్కి ..
ద్వి ళ. సా. 8. 116 పా. 18 పం.

కం, నాఁ డర్ధరాత్రి పూతన, పోఁడిమి చెడ మొన్న బండ బొరిలఁగఁ బడియెన్, నేఁడిదె యీముద్దులకును, మూఁడెను నిష్కారణంబు మూలాగ్రముగన్. వి. పు. 7. 144.

(కీడు అని అర్థాపహాసము)

గీ. అట్టిపెట్టికిఁ బోరఁ జా పెట్టిభంగి, నయ్యోఁ దేఁకి నూతన కంచితామ్ర,ములకు దైవోపహతిఁ జేటు మూఁడెనొక్కొ!
భార. కర్ణ. 1. 43.

కం. విదురుఁడుఁ దండ్రియుఁ దనకుం, బదివేల విధములఁ జెప్పఁ బాటింపఁడు దుర్మదమునఁ దగియెడుబుద్ధులు,పిదిఁ మూఁడనమర్త్యుఁ డేల విను నుచితోక్తుల్ ...
భారం. స్త్రీ 2 40.

ఉ. కోడలు మ్రొక్కినన్ మదిని గుందుచు నక్కున నక్కుఁ జేర్చి కినిన్, వేఁడుక నిచ్చె నప్డు రఘువీరుఁడు రాముఁడు వార్ధి మేరగా, నీడితకీర్తితోఁ బుడమి యేలెడు వంచు

దలంచెఁ గైకచే, మూఁడఁగ నున్నదీని
మునుముట్ట భవజ్జనకుం డెఱుంగునే.
భా. రా. అయో. 91.

(ఇట ప్రాసపాంకర్యము కన్పట్టుచున్నది.)

2. ముగియు.

ఉ అంతటఁ గాశియాహివిభుఁడు ... సంతత
కాలకూట విభ చండవిషోల్బణ పూత్కృతుల్
ఉగ్రం,బంతయు మూఁడఁ జేయఁగ రయంబున
వచ్చె ... వి. పు. 7. 866

జ మూఁడ్చు

మూఁడు(డుచు) స క్రి (√మూఁడు[2].)
(చేటు మొ) కలిగించు. సంభవింపఁజేయు.

గీ కాన యుత్పాతములు మూఁడుచుఁ దరత
రంబ ... కాశీ. 6. 59.

మూఁత వి. √మూయు.) 1. మూయుట.

గీ అటుల వచ్చిన ప్రియభర్త యంబకముల,
మూఁత చాలించి యామించుముద్దగుమ్మ,
సిగ్గు కడ్డంబుగాఁ బతిచేల మఱిమి, కొనుచుఁ
బలికెను జిన్నెలు కొసరుచూప.
హంస. 2. 68.

2 మూయుటకు తగినమూఁకుడు లోనగునవి.
(శ. ర.)

3. అడ్డము, వ్యవధానము.

గీ. అడ్డి యడ్డము మూయి కప్పడపాటు,
మఱుఁగు చాటోల మోలిమి మాటు
మూఁత, యనఁగ వ్యవధాన మౌ ...
ఆం. భా. 1. 79.

మూఁతపొడుపు. వి. (మూఁత + పొడుపు)
బాలక్రీడావిశేషము.

సీ. దాయాలు సొగటాలు దాఁట్లాయి చదరంగ
ము చు జోడురాళ్లను మూఁతపొడుపు ...
హంస. 3. 146

మూఁతబల్ల. వి. (మూఁత + బల్ల) వాచూరు
పట్టె. (శ ర.)

మూఁపు. వి (త. మూ౯. క. మ. తు. మురి)
భుజశిరస్సు

సీ .. చండభానుని కధిష్ఠానమగుట, భారంబు
భరియింప బరువు పడ్డదివోలె మూఁపుమూఁ
పునను౦డి మొక్కలమున, వనిలంబు లేదును
నంచెలంచెలు గట్టి యాకాశవీథి నందంద
నడవ ...

గీ నడచు రవితేరు ... కాశీ 1. 182.

సీ. ఉనుకువేళ్ళను గంధమును నాభిమండి మూఁపుల
దాఁక బంగారు పూఁతఁ బూసి ...
వైజ. 4. 67.

గీ కొప్పుఁము మూ. పటంచన నొప్పు
నంస,ము ...
ఆం. భా 2 187. విక్ర. 8. 18.

మూఁపులు మూఁడగు = ఒడలుప్పొంగు,
ఉత్సాహ మధిక మగు.

ఉ. ఆపురమర్దనుండయిన నాతని నడ్డము దాఁకి
నిల్వఁగా, నోపఁడు మత్స్యయంత్రము
మహోద్ధతి నేసి స్వయంవరంబునన్,
ద్రౌపదిఁ గైకొనం జెనకు రాజకుమారులపా
టెఱుంగమే, మూఁపులు మూఁడగున్ రిపు
చమూపులఁ గన్నపుడే కిరీటికిన్.
విజ. వి. 3. 169.

ద్వి మనమున నిటువంటి మనుగడ కలిగె. వని
సంతసించి మీయవ్వ తాతయును, బొదలుచు
వచ్చి మూఁపులు మూఁడు గాఁగ, వదె
పిత్తెదరు మాట లాడవే తండ్రి !
ద్వి. పరమ. 3. 153. పొ.

కం. అని మూఁపులు మూఁడై లాలన రథకారు
నకు సంబళముఁ గంబళ మిచ్చి నిలిచి కుహా
నార్తి గడ,ల్కొన నప్పుడ నిలిచి పేరుకొని
పతి కనిరెన్. వేం. పంచ. 3. 262

మూఁపురము. వి. (త. మూపు. క. మ. తు.
మురి.) ఱుఁపురము, కకుదము.

వ. మేయుతఱి వీఁ పెక్కి ఱేఁ చొక్కటి మూఁపురంబు గఱచి కఱచి యెఱచి పడ వైవన్ దోడియొక రెండుమూఁడు వెనుక ముందఱ నందంద కాళ్లఁ బెనంగుచు .. మనుచ. 4. 37.

గీ దరుల తడివఁడు బొదువు మూఁపురము లంటు. ఝల్లుగంటల నాఁటోతు లల్లనిల్ల ... అము 4. 156.

సీ మూఁపుర మంచన నూఁపుర మంచనఁ గకు దభిధాన మై ప్రకాలుచుండు ... ఆం. భా. 2 262

**మూకము** నం. వి. అ. పుం. మత్స్యము, చేఁప

**మూకాంబ.** నం వి ఆ స్త్రీ దుర్గాదేవి యవ తార భేదము.

**మూకీభవించే.** నం అ. క్రి మూఁకత్వము నొందు, మూఁగయై యుండు

వ. శరీరసహస్రంబు వెడనెడం బడిన నీర శంఖపణవ దుందుభికాంస్య కాహళాదు లును సమానవ్యసనంబు లయి మూకీభవించె నన నడఁగి యుండ .. హరి. ఉ 2 54

**మూకుఁడు.** నం. విశే. (అ ఆ అ) 1 మూఁగవాడు 2. దీనుఁడు, కనికరింపఁ దగిన వాఁడు. చెడ్డస్థితిలో నున్నవాఁడు.

పుం. ఒకానొక రాక్షసుఁడు.

మూగురు = మూవ్వురు. న. ముగ్గురు. (మూఁడు ~~నకు మహన్మహతద్ద్యోతక~~ రూపము.

మూగేలు. వి గంధమూషిక, ~~చుంచు (శ. ర.)~~.

మూచూచే. న. క్రి (మూర్కొను + చూచు, మూతి + చూచే. శ. ర.) మూర్కొను, అఘ్రాణించు.

కం. ఏమ మొరు చూచినమూచూ, చినభోజ్యము నింద్యము ... భార. అను. 4. 109

మూట. వి. (త. మూట్టై. క. మూటె మ. మూడ.) సరకులు పోగుచేసి కట్టినముడియ.

సీ .. ద్రవిణంబుమూట వారలకు నిచ్చి .. హర 1 20

సీ. వన్నెలగని చొకారవు మానికములు మూట ... నీలా. 2. 27.

జ. మూటకట్టు.

**మూటకట్టు.** వి. (మూట + కట్టు) మూట కట్టుట

సీ. శరభంబు నైనను సరభసంబునఁ గిట్టి మూట కట్టుగఁ గట్టు మొక్కలములు ... విక్ర. 1 77.

(మూటకట్టుగన్ = మూటకట్టినట్లు గట్టిగా.)

కం వెఱవక నీగుడిలోపల, గుఱుకొని యాలావు పెట్టుకొని యుండెడిపా, దఱిజముదూతలు గుకట్టఁ, గఱపింతురు మూటకట్టు గట్ట మహేశా ! శివ సా. 189.

మూటుము = ముటము (శ ర.)

**మూఢమంచే** వి హిమాని, దట్ట మగుమంచు, లోకమును మూఢముగా చేయుమంచు.

గీ అర్జునుఁడు గవియించిన యంపమూఢ, మంచు దళముగఁ గప్పిన మార్గణాంశు, జాలముల వెస విరియించె శాంతనవప, తంగుఁ డుద్ద్యోతమాన ప్రకాశావలిల. భార. విరా. 5 169.

(అంపమూఢుమంచు. భా. ల. వ్యా. పా )

కం. .. అంబర మెల్ల గప్పి వేసవిఁ, బరఁగుం బెనుమూడమంచు పౌరవముఖ్యా ! భార. మౌ. 4.

**మూఢగర్భము** నం. వి అ. పుం. నిరుద్ధగతిక మైన గర్భము.

శ్లో. సర్వావయవసంపూర్ణో, మనోబుద్ధ్యాది సంయుతః, విగుణాపానసం మూఢో,మూఢ గర్భోఽభిధీయతే ...
(సుశ్రుతవ్యాఖ్యానము.)

**మూఢము** సం వి అ పుం. ఐ (సాంఖ్య) పంచభూతములు.

విశ. 1 మూర్ఛపడినది, సొమ్మసిలినది. 2 తెలివి లేనిది, మందబుద్ధి. 3. (జ్యోతి) సూర్యునకు సమీపించినది, అస్తమించినది (గ్రహము)

**మూఢసత్త్వము.** సం విశ. అ. ఆ అ.) వెఱ్ఱి యెత్తినవాఁడు, మతి లేనివాఁడు

**మూతిము** సం విశ (అ ఆ అ) కట్టఁబడినది, బద్ధమైనది

**మూతి.** వి (క మూతి త మూంజి మ మూచ్చి)

1. పై పెదవియు క్రింది పెదవియును. మూతి వలెనుండు అగ్రభాగము.

సీ ... అగు వా వాయి నో ర్మూతి నా వక్త్రంబు ఆం. భా. ౭. 142

గీ త్రిపురనందన పరభవదుఃఖమునకు, నుల్లమున దురపిల్లుచు నున్నసరసి, వేఁడికిట్టూరుపో యన పెడలెఁ గ్రొత్తతావి మూతులు విచ్చు నెత్తమ్మివిరు లు. భార విరా. 2 26

గీ . నవ్వువ ట్లల్ల విచ్చెఁ, గలయ మూతులు కేతకీగగనతతులు ఆము 4 84,

2. మీసమును గడ్డమును, శ్మశ్రువు.

కం. అలరుక్మి రుక్మవసనుఁడు, తలయును మూతియును గొర్గి తను విడుచుటకున్, విలపించుచు . భోజసుతా. 4. 145.

కం. తలయును మూతియు గొఱుగుట, తలఁ దఱుగుటకంటెఁ దుచ్ఛతరము మహాత్మా . భాగ. 10 పూ 1770.

ఐ. మూతిముట్టు.

**మూతిముట్టు** స. క్రి. (మూతి + ముట్టు) 1. మూతితో ముట్టు, వాసనచూచు.

సీ. మొకరితుమ్మెద మూతిముట్ట నోడెడివేఁడి నిశ్వాసపవనంబు నివ్వటిలఁగ . శివరా, 2 107.

సీ కోమలినిట్టూర్పుల క్రొవ్వేఁడి నెత్తావి మొకరి తేంట్లను మూతిముట్ట వెఱచె .. నైష ౭. 108

౨. తిను, భక్షించు.

గీ మొకరతేఁటులు మూతిముట్టవు తేనియల్ శ్రీమధుశాసి కర్పించి వాని . ఘటికా ౩. 74

సీ ప్రాణ ఋద్ధి బు పర్ణాంబుపులు గాని మూతి ముట్టరు కందమూలఫలము . పి శకుం 4 121

**మూత్రకృచ్ఛ్రము** సం వి అ న నీరుకట్టు, మూత్రము పడునపుడు నొప్పి గలుగు రోగ విశేషము

**మూత్రగ్రంథి** సం వి ఇ పుం మూత్రాశయము మీఁద గట్టిపడుట

**మూత్రపుటము** సం వి. అ. న పొత్తికడుపు, వస్తి

**మూత్రము** సం. వి అ న ప్రస్రావము, ఉచ్చ

**మూత్రవర్ధకము** సం విశ. (అ క్రి. ఆ) మూత్రవృద్ధి చేయునది

**మూత్రశుక్రము.** సం వి అ న మూత్రముతో శుక్రము పడిపోవునట్టి రోగము

**మూత్రాశయము** సం వి అ. పుం వస్తి పొత్తికడుపు, మూత్రస్థానము

**మూత్రించు** సం. అ. క్రి. మూత్రమువిడుచు, నీరువిడుచు

గీ. జనుఁడు కలు ద్రాగి అంకాడి నెఱచి దినియు, నిలిచి మూత్రించెఁ జండాలలననఁ గూడె .. శివరా. 4 54.

**మూదల** విశ (క మూదలె. మూల + తలె ౦) 1 ప్రమాణము, నిర్ణాయకము.

కం వేదములకు నిఖిలస్మృతి, వాదములకు బహుపురాణపర్గంబులకున్, వా దైనచోటులన

శా, మూదల ధర్మార్థకామమోక్షస్థితికిన్ ...
భార. విరా 1. 4

2. సంబంధించినది

ఆ. విశ్వరూపువలన నైశ్వర్యకర మైన, యిట్టి విద్యఁ దాల్చి యింద్రుఁ డపుడు, మూఁడు లోకములకు మూద లైనట్టిశ్రీ. ననుభవించి మి చె నధికమహిమ
భాగ. 6 913

చూ మూదలించు, మూదలిక

**మూదలించే.** స క్రి (√ మూదల. శ మూదలి క మూదలిను.) 1 తాఁకు, స్పృశించు

ఉ. చూచె వనీవిభూతి యొక నొంచ్చిన నిద్దురా కన్ను మూయను, న్నేచె మెఱుంగు లెల్లెడల నిండఁ దళుక్కనఁ దోఁచి మాయుమై, తోఁచె నఖిలకాశరుచిఁ దొయ్యలి యమ్ముని మూదలింపఁగా, మోచె పమీసపుం గదళి మోహనగర్భము మెచ్చ నచ్చరల్
[illegible]

2. తాఁకు, కవియు.

వ. ఇట్లు దాఁకి మహాఘోరయుద్ధంబు సేయుచున్న త్రిశిరోసురేంద్రు నిక్ష్వాకునరేంద్రుఁడు గని కోపించి వాని కరచరణశిరంబు లొక్కపెట్టఁ దెగ నేసి మేలువాడి జంభాసురేంద్రుం గిట్టి ముట్టి మూదలించిన నతనికవిగల కబ్బగింపక గూండ్రించి.
కు. సం 12 845

3 ఎదురించు

ఉ. పాండునృపాగ్రనందనుఁడుఁ బావనియుం గవలుం బలంబుమై, నొండొరు మూదలించు కాని యొక్కటఁ దాఁకినఁ దీవ్రవిస్ఫుర, త్కాండవిదారితాంగకులఁగా నొనరించి ...
భార, కర్ణ. 2. 19.

4. స్మరింపఁజేయు.

ఉ ... మును సుయోధనుచందముఁ జూపి యప్పుడే, మంటి యుపేంద్ర నన్నని రణాగ్రమునన్ నిను మూదలించెదన్. .
భార ఉద్యో, 3. 56.

5 ఎత్తిపొడుచు, మురలకించు

ఉ. పన్నినవాఁడ నింకఁ జెడి పాఱకుమీ యని మూదలించి చే,నున్ననిశాతబాణము మహోద్ధతిమై నరిఁ బోసి యేసివన్, గన్నుల నోరనెత్తు రొలుకంగ శతాంగముమీఁద వ్రాలె ..
ఉ హా. 3. 52.

ఉ. పాడియు సత్యముం గలుగుపాండవకోటికి నీవు దొల్లి యొ,ప్పాడిమెయిన్ సభం గరము భంగ మొనర్చితి నాఁటియందఱుం, జూడఁగ నేఁడు తత్ఫలము సూపెద నీ కని మూదలించి మై, నాడఁగ నేసెఁ ..
భార శీవర్వ 3. 112.

గీ నిన్నుఁ గన్నప్డ చక్రాగ్ని నీఱుసేయ, వచ్చి మూదలించుట కింత వలసెఁ జేయ ...
హరి. ఉ. 6 217

6 ఘట్టించు.

సీ కావున నయ బు .

గీ. కప్ప కుండఁగ నే దేని తప్పటొంటు, మత్స రాహంకృతులను గామమునఁ గ్రోధ, మోహముం బ్రత్యవాయంబు మూదలించు, తప్పు లేకయ శిక్షింపఁ దగవు గాదు.
కాశీ. 5. 319.

**మూదలిక.** వి (√మూదల) తాఱ్కాణము. (శ ర).

**మూన**[1]. వి. 1. తుషసమేత ధాన్యము.

సీ. ... తుషసమేతధాన్యాభిధలు మూఁగపోతనంగ, మూన యనఁగాను ...
ఆం. భా. 2 288.

2. నాఁటెడు వరిమొక్క.

(వ్యవ.) ఈయేఁడు ఆచేనిలో ఒక్కమూన కూడ పెట్టలేదు.

**మూనదిరుగు** — నాఁటినవరిమొక్క వేళ్లుపాఱు.

నాఁటుకొను.

(వస్త్ర ఈచే నప్పుడే మూన దిఁగినది

**మూన2** వి వస్త్రగాలితముచేయఁగా రాలక నిలిచినది. (శ. ర )

**మూను.** స. క్రి. వస్త్రగాలితము చేయు (శ ర.).

**మూన్నా(నా)ళ్లు.** వి ఐ. (మూఁడు + నాళ్లు మూఁడు దినములు.

గీ. చెఱఁగు మాసిన మూన్నాళ్లు సిగ్గుతోడఁ,బతివి లోకనమార్గంబుఁ బరిహరించి
కాశీ 2 72.

కం శిరము దెగఁ గోసి నీపదఁసరసిజములఁ మూన్ని నీప్రసాదంబున శం,కర మూన్నాళ్లకుఁ గరుణా,కర గోవిఁదుండు వడసె ..
శివ సా 403

గీ. అని వసిష్ఠుండు మఱియు నిట్లనియె నట్లు, దానవునిఁ గూర్చుకొని రఘూద్వహుఁ డతండు, దొలుత మూనాళ్ళు వార్ధిఁ బ్రార్థించి పిదప, నలవు గుందించి | మొక్కిన వభయ మొసఁగె సమీర శి. 173.

సీ వెసలలో మూనాళ్ల వెన్న లుండఁగ నాఁడు కాఁచి డించిననెయ్యి గిఁగఁబెట్టు
శుక. 2. 561.

**మూన్నెలలు.** వి ఐ (మూఁడు + నెలలు.) మూఁడునెలలు.

కం వినుతగుణ హానిష్యాన్నం,బున నొకనెల మత్స్యమాంసమున రెండునెలల్, విను లేడి మాంసమునఁ బిత,లొనఁగఁగ మూన్నెలలు దృప్తి నొందుదురు-గడున్.
మార్క. 3 199

కం. తెగ దివ్వుడు మూన్నెలలకుఁ దగ నడుగఁగ రెండు దీర్చెదను . జై భా 8. 209.

(ఈ క్రింది ప్రయోగమున మూన్నెల్లు అని కలదు సాధుత్వము చింత్యము.)

ఆ. మొదటిమాసముందుఁ బదనుగా బుద్బుద, భాతి నుండు నాల్గుపక్షములకుఁ, బిండరూప మగచుఁ జెంపొంది మూన్నెల్ల, కవయవములు పుట్టు ననఘచరిత
సానందో 4 58

**మూయి** వి (√మూయు) కప్పు, మూఁత

గీ. అడ్డి యడ్డము మూయి క ప్పడ్డపాము మాటు మూఁతయనఁగ వ్యవధాన మౌ ..
ఆం భా 1 86.

**మూయించు** స క్రి (√మూయు) మూయఁ జేయు

కం. అసమాజు వెడల వడిచిన, వసుధేశ్వరుఁ డేజనాపవాదముఁ జెందెన్, దెస నెఱిఁగిన విరములకా, మునగన లని కైక నోరు మూయించెఁ బతిన్ చం రా. 4. 56

**మూయు.** స క్రి (త మూఁడు మూయు క ముచ్చు కప్పు, అచ్ఛాదించు.

సి. నునుబట్టతలలపైఁ గనకంపుఁ జెఱఁగులఁ బట్టుఁజీరలు మూయఁ బట్టినారు .
నైష 7 63

ఉ .. మటుమాయల నీలికాన నా,మూసిన ముత్తెపు మెలఁగు ముద్దుఁగుమారునిమీఁద నెట్టుగాఁ, జేసితి వింతమచ్చరము చెల్లునశే మఱి యూఁడుదానికిన్ సారంగ. 3 53

కం. మఱి యైదువేలయేఁడులు,దెఱచినను మూయ కినునిదెసఁ జూచుచు నే,డైఱ నూర్ధ్వబాహుఁడై మతిఁ,దఱుమక శ్రుతి నొడివి కొనుచుఁ దప మొనరించెన్ ..
ఉ రా. 2. 164.

(కనుమూయక = ఱెప్పవేయక.)

2 మూఁత పెట్టు.

గీ. అలఁ జెరవ మూయ మూఁకుడు గలదు కాక, నోరు మూయఁగ మూఁకు దెందలను గలదె ... సారంగ. 2. 249

కం. అనఁ జెవులు మూసికొనుచుం,దనమదిలో నలిగి కమఁడు తలిరుఁబోఁడీ, వినఁ దగని

పలుకు పలుకం,జనునే తలపోయ నిట్లు చాలు నుడుగుమీ యయా. 3 154.

అ క్రి. 1 ముకుళించు, మొగుడు

ద్వి. కలువలు మూయ నక్షత్రముల్ మాయ, జలజముల్ వికసింప ... నెఱిఁదూర్పు, గొంగపై నిలిచె నాదిత్యుండు ..

ద్వి హరిశ్చ. పూ. 551, పం.

2 మూఁతపడు

కం. వినవయ్య కర్ణుగర్వం,బని నాతఁ డభేద్యక వచుఁ డగుటయు విలునేర్పును నతనిబాహు విక్రమ,మును దలఁచిననాఁడు గన్ను మూయదు నాకున్

భార. అర 1 270.

(కన్నుమూయదు = నిద్రరాదని భా)

తలుపుమూయు = తలుపు దగ్గఱగావేయు బంధించు

గీ. శాత్రవపారక్రమానంతజాడ్యుఁ డైన,ధవుని గని యున్సు రంచును దలుపు మూసి,గుబ్బ కవమీఁదిపయ్యెదకొంగు పఱచి, నేలఁ బవ శించు మగువ కన్నీరు దొరఁగ.

శుక. 3 483

జ మూఁకుడు, మూఁత, మూఁతపొడుపు, మూఁతబల్ల, మూయి, మూయించు, మూసికొను, మూసినమురికి.

మూర. వి. (త. ముళమ్, క మొళ మ. తు. ముళ మ్.) హస్తప్రమాణము, రెండుజేనలకొలఁది

వ .. మూర కొక్కండును జేన కొక్కండు నుగాఁ గుట్టినడొల్లుటుల్లారు ఉల్లసిల్లఁ బల్లవించినపల్లంబులపై ఆము. 4 35

మ. ఇరువై నాలుగుమూళ్ల మేర యని గో సెక్కింపఁగా నేల .. కాశీ. 1. 53.

సీ. ... మూర నా హస్త మొప్పును ...

ఆం. భా 2. 141.

జ. మూరకోక, మూరకోల.

మూరకోక వి. (మూర + కోక) బాఁచోఁవు. (చి ని , శ ర)

మూరకోల మూ + కోల) గజపుగోల వి. గజముబద్ద (శ ర మూరకోలతకో చి ని.)

మూరటిల్లు అ క్రి మ్రోయు

సీ. రాజులు గొల్వ భద్రగజాధిరూఢుఁడై భేరి మృదంగముల్ మూరటిల్లఁ ...

శ్రీరం మా 10. 114.

(ప్రయోగాంతరము కనఁబడలేదు)

మూరి వి (√మూరు) 1. చిత్తవిభ్రమము. మోహము

చం. అనుపమదివ్యమూర్తి ... సుకుమారి తన్ను విటవర్గము వల్గడ వచ్చి ప్రీతితోఁ, గనుఁగొని మూరిఁ జూడ నెడ గానక సూటెలు వాఱుచుండె మో,హినియును బోలె నొక్క శరదిందునిభానన నిల్చి ముఁగిటన్.

కు సం. 8 124.

2 అతిశయము (చూ మూరిఁబోవు)

మూరిఁబుచ్చు. స క్రి (√మూరిబోవు) 1. వర్ధిలఁజేయు.

సీ .. వెన్నుఁడు శౌంపు రెట్టింపఁ గ్రమ్మఱఁ బట్టి యెడఁదఁ ..

గీ దమక మినుమడిగాఁ గౌను దక్కఁ దొడిగి, బిగువుఁ గౌఁగిటఁ గదియంగఁదిగిచి తివుట, మోవి గదియంగఁ గోర్కులు మూరిఁబుచ్చు, కలిమి యాబిడచూడ్కులు గాచుఁగాత.

ద్వా 4 218.

2 సంతోషపెట్టు.

సీ మధురార్ధదండకమంజరి మంజులబుధుల నింపుల మూరిఁబుచ్చరేని ...

కావ్యా 4. 44.

మూరిఁబోవు. అ. క్రి. (మూరి + పోవు.) 1. అతిశయించు.

గీ. లీల మూరిఁబో వచ్చరలేమపిందు, బలసి

యభివందనము సేయఁ బోలితె ...
భార శాం. 3. 337.

శా. దేవోత్తంసుఁడు భక్తవత్సలుఁడు చిత్తేశస్వభావుండు గౌరీవామాంగుఁడు శంకరుండు దయ మూరింబోవఁ గొంగేలుపన్, జావ న్వచ్చినపుర్వుఁ బట్టి తగునీసద్భక్తికిన్ మెచ్చితిన్, నీ వేయర్థము నన్ను వేఁడెదవు దానిం జెప్పుమా నావుడున్.
శాశ. 2. 101, అము. 6 25.

2 వర్ధిల్లు.

ఉ. తొమ్మిదిపెన్నిధానములు దూఁకొని యర్థవిభుం డనం బ్రశస్తమ్మగుపేర్మి నిందుధరుసఖ్యము గాంచినమేటి యొుఁడుచో, టిమ్మెయి మెచ్చ కివ్విరమహీధరుపాదము నాశ్రయించి సౌఖ్యమ్మున మూరిఁబోయెఁ బెఱయుద్రుల కింతటిపేర్మి గల్గునే
హరి ఉ 6, 10

3. దృఢమగు.

గీ. తనయ బంధుకళత్ర మిత్రకులమీఁద, మూరిఁ బోవఁగఁ బ్రాఁకినమోహలతను ...
పి శకుం 4. 86.

4 విజృంభించు

సీ వేఱ యొకతె, విశ్వకర్మకనూజ విశదలావణ్యస, ముజ్జ్వలఁ జేకొని మూరిఁబోయి, ... త్రిదివభూమి వెల్వడియును ...
హరి. ఉ. 4, 43.

4. సఫలమగు

మ. కడుభక్తిన్ మిముఁగొల్చి మీదయఁ ద్రిలోకఖ్యాతసత్పుత్రు నేఁ, బడయం గోరఁగఁ గూఁతు రిప్పు డుదయింపం జాడియె యిప్పుడీ, పడఁతిం బుత్రునిఁ జేసి మీదగు కృపాప్రావీణ్యముం జెంపు నే, గృహ నాకోరిక మూరిఁబోవఁగఁ గృతార్థత్వంబు నొందింపరే.
మార్క. 7. 185.

6. సంతోషించు.

కం మదిలో నన్నుఁ దలంచుచు, బహిరిభ్యసూత్ర హవ్యభాగ మనలునం, దొదవించితేనియును న,భ్యుదయము నే నొందె మూరిఁబోవనె చెప్పమా
హరి పూ 3 45

గీ. గాడ్పు మురిపంబు నెందును గలిగి యెల్ల, వారి మనసులు వేడ్కల మూరిఁబోయె ..
హరి. పూ. 9. 68.

ఉ ఆరభసంబునప్డు కరినాదులచే దల లేని బొందులం, బారె కడంక లూరె నని చూపఱు మెచ్చుల మూరిఁబోయి రా, సూరెల మున్నె కన్నడిపసుంటిన వామభుజా భుజాదులం, బీరము సూపి త్రెళ్లె నవి భీమ మహోత్కభురాహతంబులై ...
కకు. 5 50.

7. సంకోచించు

సీ తొలిమ్రొక్కు చెలిచెవిఁ జిలికించుఁ జిలికించి మురిపెంపుసిగ్గున మూరిఁబోవు ...
కావ్యా. 3. 122.

8. నశించు, చెడు

ఆ. చదువు చట్టుపడియె శాస్త్రంబు మ న్నయ్యె, బుద్ధి పురువుమేసెఁ బుణ్య మడఁగె, నీతి ముట్టపడియె నిర్మలజ్ఞానంబు, ముట్ట నుడిగెఁ బోధ మూరిఁబోయె
భాగ. 6 135 6 240.

మూరు. అ. క్రి. (సం మూర్ఛ) అతిశయించు,

ఆ. ఇతనిఁ జూచి మీకు నెత మోహము గల, దంతకంటె మాకు నధిక మైన, మోహరసము మూరి మోచి యున్నది యీకు, మారుఁ డొకఁడరూప మాకు మీకు .. వి పు 7. 100.

సీ ఊరువుబలువేఁడి మూఁగఁగ మలినకరగతాబ్జము చురచుర బుదెల్ప, నంతంతకును హెచ్చు నతను, తాపస్ఫూర్తి ననిశంబు నెదఁ బర్వ నదరుదెల్ప
భోజసుతా 3 90

ఇ. మూరి, మూఁబుచ్చు, మూరిఁబోవు.

మూరుకొండ వి రూపగంధ, ఒక విధమగు ఓషధి (శ. ర.).

మూరుకొ(రొ్క)ను. సం క్రి. ఆఘ్రాణించు, మూచూచు

గీ కరి సెలంగి నీమీఁద బుష్కరము సాఁచి, మూరుకొనియెడు డుగులమ్రోల నిల్చి, ముద్దుగురియుచుఁ బలుములు ద్రొక్కు నిట్టి, దాని నిన్నేల పొపుదు మానసీయ
భార అను. 4. 77.

ఆ కావరంబుతోడి కందర్ప విక్రియ, మోర మోర మోపి మూరుకొనియె ... కాశీ 4. 271.

శా పూవుంబోఁడి విశాలలక్ష్మిఁ గనుచుం బుష్పంబు మూరొ్కఁచు వీణావాద్యంబులు వించు ...
భీమ. 5 191.

కం. గజ మంటినట్లు యడఁచున్, భుజగము మూరొ్కనినయట్లు పొరిగొను ధరణీ. భుజుఁడు నగినట్లు చంపుం, గుజనుఁడు మన్నించినట్ల కొనుఁ బ్రాణంబుల్
వేం పంచ 3 78, యయా. 4 19.

జ మూచూచు.

మూరుతము. వి (సం, ముహూర్తః) శుభ కాలము

కం మూరుతము డాసె నిదిగో, వారులు కట్టుకొని మేలివని కన్గొనఁగాఁ, గోరి పజే ల్లెల్ల నున్నా, రోరాయఁడ జాగు సేయుటొప్పునె యిటులన్ . అచ్చ. రా. అయో. 47. (మూరతము. ముద్రి. పా.)

గీ. . నీలకు, వెన్నునకును బెండ్లి వెస నొనర్ప, వలయు నంచుఁ బూని వల నొప్ప మూరుత, మొజ్జబాపనయ్య నొయ్య నడిగి ...
నీలా 3. 78.

మూర్ఖపండితుఁడు సం. వి. అ. పుం. చదివిన మూర్ఖుఁడు, చదివినవాఁడై నను దెలివిలేనివాఁడు.

మూర్ఖభ్రాతృకుఁడు. సం. విశే (అ. ఆ అ.) మూర్ఖుఁడు సోదరుఁడుగాఁ గలవాఁడు

మూర్ఖము. సం వి అ. పుం ఒకజాతి చిక్కుడు. (వ్యు. వి.).

మూర్ఖు(ఁడు) సం. విశే (అ ఆ. అ) అవివేకి.

గీ. ఏల యాశీవిషంబుల నెఱిఁగి యెఱిఁగి, మూర్ఖువై యలిగించెదు ...
భార. సభా. 2. 204.

చం. అవినయబుద్ధివై హరికి నర్ఘ్యమయోగ్యమ యంటి నీవు మూర్ఖవు శిశుపాల యింకఁ బలుకన్ వలసెన్ ... భార. సభా 2 24.

మూర్ఛ సం. వి. ఆ స్త్రీ. 1. మూర్ఛిల్లుట, సొమ్మసిల్లుట 2. ఆత్మనెఱుఁగమి ఆత్మవిషయకాజ్ఞానము 3. సంగీతమున సప్తసర్వముల యొక్క క్రమమైన యారోహణావరోహణములు. 4. పెరుగుట. అభివృద్ధి

మూర్ఛన సం. వి. ఆ. స్త్రీ. 1. సొమ్మసిల్లుట, మూర్ఛపడుట 2 అభివృద్ధి, పెరుగుట 3 గంధకముతోఁ బాదరసమును భస్మము చేయుట. 4. సంగీతమునందుఁ గ్రమముగా సప్తస్వరముల యొక్క యారోహణావరోహణములు.

మూర్ఛనము. సం. విశే. (అ ఈ అ) 1. మూర్ఛ గలిగించునది. మూర్ఛిల్లఁ జేయునది. (సాధనము)

. వృద్ధిఁబఱుచునది చేర్చునది, బలపఱచునది.

మూర్ఛపు(వు)చ్చు. మి స. క్రి. (√మూర్ఛ బోవు.) మూర్ఛనొందఁజేయు.

గీ. రామ! యాశక్తిఁ గొని కాదె రావణుండు, మున్ను మనలక్ష్మణుని నొంచి మూర్ఛపుచ్చె.
ఉ రా 2. 285.

కం. .. నాఁనంబు పృథుతరవతు, న్నూన్యతంబు నేసి విజయుఁడు, నీతనయుని మూర్ఛపుచ్చె నిష్ఠుర వృత్తిన్ .. భార. భీష్మ. 3 343.

మూర్ఛాలుఁడు. సం విశే. (అ. ఆ అ.) సొమ్మసిల్లినవాఁడు, స్మృతితప్పినవాఁడు.

మూర్ఛితము సం విశే (అ. ఆ. అ) 1. మూర్ఛపడినది, సొమ్మసిల్లినది. స్మృతితప్పినది. 2, పెంపు

చేయఁబడినది హెచ్చింపఁబడినది. 3 ఉన్నతమైనది

**మూర్ఛిల్లు(లు).** సం అ క్రి. మూర్ఛపోవు, సొమ్మసిల్లు

స్రగ్ధర ... కవలు మూర్ఛల్గతిం దాఁకినం జా, కుండం బోకుండఁ గౌరవ్యులకు వశమె బిట్టుల్కి మూర్ఛిల్లకుండన్.
భార. ఉద్యో. 1. 323.

వ అట్లు శ్రుతాయువు మూర్ఛిల్లిన ...
భార భీష్మ. 2 75.

చం. గతుఁకుఁ బాసె నశ్వములు గంధగజంబులు మూర్ఛిలెన్ రథ, ప్రతతులత్రోవ గట్టువడె ... కేశవుఁడు .. శార్ఙ్గగుణంబు దీటినన్ ...
ఉ. రా. 2 60.

**మూర్తమాడు** అ క్రి. (శ. మూర్తమూను.) విశ్రమించు.

సీ నాకు మీపాదార్చనము సేయ వడలింగ మూర్తి చేకుఱె వచ్చి మూర్తమూడి ...
కాశ. 1. 35.

**మూర్తము.** సం. విణ (అ. ఆ. అ) 1 మూర్ఛిల్లినది, స్మృతితప్పినది, స్మారకములేనిది. 2. తెలివిలేనిది. 3. మూర్తీభవించునది. శరీరము దాల్చినది. 4 కఠినమైనది, గట్టిది. 5. (వేదాంత) పరిచ్ఛిన్న పరిమాణముగలది. (క్రియ గలదని తార్కికులు)

**మూర్తి.** సం. వి. ఇ. స్త్రీ 1. గొప్పతనము, మహత్త్వము.

చం. మనుసెలగోల సేకొని మనోహర యౌవన మేను రాజుచూపును బ్రజచూడ్కులం దిగువఁ బుష్కరపత్త్రిలిభంబు లైనలో, చనము బు మూర్తి దెల్పఁగ ససంభ్రమతం జనుదెంచె నల్లనల్లన వెడభీతి దోఁప జనులన్ వెగడయ్యెడు దృష్టిఁ జూచుమన్ ... భార. విరా. 1. 276.

2 స్వరూపము 3. దేహము. శరీరము 4 ప్రతిమ విగ్రహము 5. కాఠిన్యము, గట్టితనము

**మూర్తిపుఁడు** సం. వి అ పుం. విగ్రహములఁ బూజించువాఁడు. దేవలకుఁడు పూజారి

**మూర్తీభవించు** సం. అ క్రి. దేహముధరించు. ఆకృతిదాల్చు.

గీ ... మూర్తీభవించు మంచు, వలువమును వల్కుటయుఁ గాంణములుగాఁగ ..
వరాహ 6. 53.

**మూర్ధకర్ణి** సం. వి ఈ. స్త్రీ ఛత్త్రము, గొడుగు.

**మూర్ధజము** సం. వి అ. పుం. తలవెండ్రుక (గుఱ్ఱము సింహము మొదలగువాని) జూలు

**మూర్ధన్యము.** సం విణ (అ ఆ అ) 1. తలనున్నది. 2. మూర్ధస్థానమునఁ బుట్టినది. (ఋ, ౠ, ట, డ, ఢ, ణ, ర, ష యను వర్ణములకు పేరు.) 3. ముఖ్యమైనది. శ్రేష్ఠమైనది.

**మూర్ధపుష్పము.** సం. వి అ పుం శిరీష వృక్షముఁ దిరిసెనచెట్టు.

**మూర్ధము** సం. వి న్ పు 1 తల, శిరము. 2. అలికము, నొసలు 3 శిఖరము, ఎత్తయిన భాగము, శిరోభాగము 4 ముఖ్యమైనది, ప్రధానమైనది.

**మూర్ధరసము.** సం. వి అ. పుం. భక్తఫేనము, వార్పుమీఁదిగంజి.

**మూర్ధవేష్టనము.** సం వి అ న తలపాఁగ.

**మూర్ధాభిషిక్తము.** సం. విణ. (అ ఆ. అ). అసాధారణ మైనది (ఉదాహరణము)

**మూర్ధాభిషిక్తుఁడు** సం విణ. (అ ఆ అ). 1. పట్టాభిషేకము చేయఁబడినవాఁడు.

వి అ పుం. 1 పట్టాభిషేకము నొందినరాజు. 2. క్షత్రియుఁడు, రాచవాఁడు. 3 మంత్రి.

**మూర్ధాభిషేకము.** సం. వి. అ. పుం. పట్టాభిషేకము.

**మూర్ధావసిక్తుఁడు** సం. వి. అ. పుం

1 పట్టాభిషేకము నొందిన రాజు. 2 బ్రాహ్మణునకు క్షత్రియస్త్రీయందుఁ బుట్టినవాఁడు

**మూర్వ.** సం. వి. ఆ స్త్రీ లతావిశేషము చాఁగ (వృ వి). (దీనినార వింటినారికిని, క్షత్రియుల మౌంజికిని ఉపయోగించును)

**మూల**[1] వి. కొప్పు.

సీ ముడువంగ నేర్తురు మూలఁ గమ్మనితావి, గలుగుక్రొవ్విరులు లోఁ గందకుండ ..
మూల ... భీమ 1 94

ంగడ తళుకు బంగరువిరులు దాఁచినావఁటె
మూల,నళు కేల కాల రుద్రాక్షతరువుల
ఉ. రా 6 61.

సీ. ముడువంగ నేర్తురు మూల దాపటికి రాఁ
జికురబంధము లీఁగ జీరువాఱ ...
కాశీ 3 10?.

సీ .. కబరికిఁ దురుము. కొప్పు క్రొవ్వెద మూల
నా నొప్పుఁ బేళ్లు.
ఆం భా. 2 145., కవిక 3 109

**మూల**[2]. వి. (త. మూలై. క మూలె. మ. మూల).
1 విదిక్కు, దిఙ్మధ్యము.

సీ .. తొలుదాలుపు నొక్కమూల కనిచి .
సీలా. 1. 42

కం. ఉలు ముఱిమి మూలగాత్పులు, చఱచి విసరఁ
జొచ్చె ... హర 2 17.

2. కోణము.

గీ అచటఁ దిగమూల లేర్పడ నరుఁగు నిలిపి ..
అచ్చ. రా. యు. 3 22

(త్రిగమూలలు = మూఁడు కోణములు.)

గీ మూల యన రోక యనఁ గోణ మొప్పు .
ఆం. భా 1 71.

గీ తనగృహంబున గూఁటిలోఁ దలుపుమూలఁ,
ఓడుతతో నాయకుఁడు దాఁచి పెట్టినట్టి, మాక
అర్పించి వానితోఁ గూడి మెలఁగె ..
శుక. 3. 131.

(తలుపుమూల = తలుపునొద్ద కోణము)

3 గొంది, చాటైన ప్రదేశము.

సీ ననఁబోడి మునుఁగొప్పునకు దీటు గాక నిచ్చలును జీకటులు మూలలను డాఁగె ...
నీలా 2 20.

వ . ఏపట్టున నిలువం జాలక మూలమూల కరుగు మకర కర్కటకాది జంతుసంతానంబుల కగుబడబానల సంతాపంబునకుఁ గొంత చింతించుచు .. దశా. 1 261.

గీ. కడిఁది నిట్టూర్పుగాడ్పుల గ్రహగణంబు, లొక్కమూలకుఁ జిక్కి నత్యుగ్రదృష్టి,నిగుడుచో శైల్లి నిగుడులై తొలఁగయును . .
దశా 3. 171.

సీ మునుఁ గేసికొని మూలమూల డాఁగినదికాధిపుల కిప్పుడు బయల్ దేఱఁ గలిగె .
ఉ. రా. 1 105.

4. చోటు, ప్రదేశము

సీ. ఒకమూల మకరాలయ ౕ
చారవిందముల్ వేడ్కఁగొనుచు ...
కృష్ణ. 4. 49.

5. లోకము.
సీ. తన కన్యములు లేక తనరారి ముమ్మూల
విభుఁ డయ్యెఁ గ్రేపుల వెదకువాని ...
భాగ. 10 పూ 544.

**మూల** సం. వి. అ. స్త్రీ శతమూలి, చల్లగడ్డ, ఓషధి విశేషము,

**మూలఁద్రోచు** = నిరసించు, పరిత్యజించు
గీ అతనిఁ దనసొమ్ముఁ జేసి ము న్నాఁగి యున్న, మోహముఖులైనజ్ఞాతుల మూలఁ ద్రోచి, సంహృతాసురులైననిర్జరులకరణి, మది వివేకాదివర్గ మభ్యుదయ మొందె
పాండు. 4 208.

మూలఁబడవైచుట = నిష్ప్రయోజనముగ నుంచుట.

సీ. రతిరాజు బాణసంతతి మూలఁ బడవైచి, చాపంపు గడపటఁ జప్పఁ జేసె
చిత్రభా. 3. 103.

మూలఁబడు = 1 అడఁగు, అస్తమించు

గీ. పరఁగఁ గలకొద్ది మరలకుఁ బంచి యొసఁగి జాలువృత్రారి యనురాజు మూలఁబడిన, బలిత మయ్యో విరోచనప్రభవతేజ, మమర గాఢతమస్ఫూర్తి నవనయించి ...
దశా 5 27.

(పై రెండర్థములకు నిదియే యుదాహరణము)

2. చెడు, నశించు.

ఉ. ... క్రమ్మతి యిల్లు సొచ్చి పేరక్కున నేర్చి వార్త గలదా యన దూతిక యేడ వార్త నా ముక్కుకు వచ్చె నీచెలిమి మూలఁ బడన్ విడు మిల్లు సేరెదన్.
వేం. పంచ 1. 262

మూలకము. సం. వి. అ. పుం న. ముల్లంగి (వృవి) పుం. ఒకదినుసు విషము.

మూలకర్మము. సం. వి. న్. న కార్మణము, ఓషధ్యాదులచేత చేసెడి యుచ్చాటనాదిక్రియ.

మూలకారిక సం. వి. అ. స్త్రీ. పొయ్యి, ఛుల్లి

మూలకుఁజొనుపు = అప్రయోజక మగునట్లు చేయు, పనికిమాలిన వానిఁగాఁజేయు

వ. ... ప్రబలతమస్ఫార దురహంకార వీర భట కృపాణికా చాకచక్యంబులు రాత్రిం చరకరాళ కరవాలకాళిమంబులు మూలకుం జొనుప ...
వసు. 6. 9.

మూలకృచ్ఛ్రము సం. వి. అ. పుం. న. తపో విశేషము (దీనియందు దుంపలుమాత్రము తిని బ్రదుకుదురు.)

మూలకొత్తడ(ళ)ము. వి (మూల[1] + కొత్తడము.) బురుజు.

గీ. మూలకొత్తళములు చెల్లు బురుజు లనఁగ ...
ఆం. భా. 3. 18.

మూలకొత్తు = పరాభవించు

సీ. క్రమజలాభివ్యక్తసహజసాంక వమదా మోదంబు చిలుకల మూలకొత్త ....
వసు. 3, 132.

మూలగ = మూలుగు[2]. వి (త. మూళై. మ. మూల.) మజ్జ.

ఉ. ... దేగ వడిం జని గిట్టి పట్టి మేన్ చించిన, గాలిమూఁగయుఁ జెక్కెముఁ జక్కెర నద్ది యిచ్చి యే, తెంచె నొకండు దా లవిటి దీటుచు లావులు గూడ దువ్వు చున్
చంద్రా. 2. 105

(చి. ని. శ ర. పా మూలుగ. ముద్రి. వ్రాఁత. ప్రతి. పా)

మూలజము. సం. వి. అ న. అల్లము (వృవి).

మూలటిక్క మి. వి. (మూలము + టిక్క) ప్రధానస్థానము.

గీ. చంద్రబింబాస్యకుచశైల జన్మభూమి, గాన రారూపుఁబోలె నక్కడఁ దిచలికి, నించుకం తయుఁ గంపింప దివముకొనుచు, ముజ్జగం బులు పచరించ మూలటిక్క.
పాండు, 4. 6.

(మూలటిక్క, ముద్రి. ప్రతి. పా.)

మూలత్రికోణము. సం. వి. అ. న. సూర్యాది గ్రహముల గృహరూపరాశి విశేషము.

శ్లో. సింహో వృషశ్చ మేషశ్చ కన్యా ధన్వీ ఘటో ఘటః. అర్కాదీనాం త్రికోణాని మూలాని రాశయః క్రమాత్

మూలదుంప. మి. వి. (మూలము + దుంప) మూలకందము, ప్రధానకారణము.

గీ గంగ మనుజులపాలింటికల్పవల్లి, సన్నిధి

గన్న పెన్నిధి జహ్నుకన్య, యమునవది భవ రోగ దివ్యౌషధంబు, ముక్తిలతకు భాగీరథి మూలదుంప . . జహ్నవీ. 1. 35

సీ. బలువిడిఁ దమ్ముల నలరించురసికుఁడు, మూఁడు మూర్తులకును మూలదుంప ...
సీతా. 2. 127 ,భీమ 5 157.

**మూలదేవుఁడు.** సం. వి. అ పుం కంసుఁడు (త్రి ని)

**మూలపాల్పఱచు** = మూలపాలువైచు, నిఁడుగ విడిచిపెట్టు.

మ అలరుందూపుల మూలపాల్పఱచి సొం పొనిచ్చుచాపంబునం, దలపెంపెల్లఁ ద్రుంచి కరించి మకరాంకం బవ్వలం ద్రోచి యచ్చల మేపారఁగఁ జిన్నిబాలకులచేఁ జప్పట్లు వెట్టింతు ... కవిక. 3 109.

జ మూలకొత్తడము, మూలమట్టము, మూల వసము.

**మూలప్రకృతి** సం. వి. ఇ స్త్రీ. 1 ప్రకృతి, మాయ (సాంఖ్యమతమున). 2. ప్రధానము.

**మూలఫల** సం. వి. అ స్త్రీ. కొమ్మునన గొలిమిడి (వృ వి). (శ ర.).

**మూలఫలదము.** సం వి. అ పుం. పనస (వృ. వి.).

**మూలబంధము.** సం. వి. అ పుం. పునాది. (శ ర.)

**మూలబర్హణము.** సం. వి. అ. న. ఉన్మూలిం చుట, పెకలించుట.

**మూలబలము.** సం. వి. అ. న. ప్రధానసేన. (మన్మథవర్ణనము)

సీ. అబలలు సోపిన నాకాశమునఁ బాఱునళి శుకములు మూలబలము గాఁగ ...
కు. సం 4. 431.

**మూలభద్రుఁడు.** సం. వి. అ పుం. కంసుఁడు (త్రి ని).

**మూలభృత్యుఁడు.** సం. వి. అ. పుం. వృద్ధ భటుఁడు, వంశపరంపరగా వచ్చుభటుఁడు.

**మూలమట్టము.** వి. (మూల[1]+మట్టము.) గోడ మూల మొదలగువానిని సమకోణములుగాఁ జేయుట కుపయోగించు శిల్పిసాధనము (శ. ర.).

**మూలము.** సం. వి అ. న. పుం.

1 వేరు. (వృక్షాది) మూలము. 2. మొదలు (అంగుష్ఠమూలము మొ ) 3. ఆధారము. మఱొకదానితో వతికిలొనెడిచోటు.

ఉదా . బాహుమూలము, పాదమూలము, ఊరు మూలము, కర్ణమూలము మొ.

4 ప్రారంభము, ఆది. 5 మూలాధారము; పునాది; మొదటికారణము 6. మట్టు, అడుగు, క్రింది భాగము. 7. మూలగ్రంథము (వ్యాఖ్యానము కానిది ) 8. పొరుగు, ఇరు ప్రక్కలు, మూలధనము, పెట్టుబడిసొమ్ము, మొదటి 9. సొమ్ము, 10. (గణిత) వర్గమూ లము, పదము. 11. ఒక రాజు యొక్క స్వీయదేశము (సొంతనాడు).12. చెట్ల గుంపు, చిట్టడవి, తుప్పడవి. 13. పిప్పలీ మూలము. 14. ఒకవిధ మయిన యంగుళీ సన్నివేశము, ప్రేళ్ళనొకమాదిరిగా నుంచుట, (అభినయహస్తము). 15. రాజధాని, ముఖ్య పట్టణము, 16. నికుంజము, పొదరిల్లు. 17.పిప్పలి, పుష్కరము, శూరణము మొదలగు చెట్లమూలము. 18. మూల యనునక్షత్రము. (ఈయర్థమున నిది దర్భాది.)

వ. ... దక్షిణవామలోచనంబుల ధనిష్ఠామూల లును ... భాగ. 5. 2. 87.

వ నిమిత్తము, కారణము.

కం. నరవరనుత నీ కిదు,ర్మరణమునకుఁ బూన నేల మదిలోపల నే,పరభేదము గల దది యె,వ్వరి మూలము చెప్పు మనిన వాఁ డవనతుఁడై ..
ద్వా. 8. 117.

**మూలముట్టుగన్** ఆమూలము, ఆరంభము మొదలు

క్రొని.

గీ మూలముట్టుగఁ దెల్పె నమ్మునివరుండు, ప్రార్థి తుం డయి నాకు వప్పరమవిద్య ..
మనుచ. 3. 139

ఉ. అనవుడుః బరివడి వెరకం, ఇవ వలసినసొమ్ము డావ చనుబెంచినచో, ఉన్న దిన నవ్వె నితని ముఖ, ముద నికామంబు మూలముట్టుగ నను చున్ ..
భోజ 3 242.

సీ అదె యన్నదిగీ. మూలమని దాని నిప్పుడు మూలముట్టుగాఁగఁ జెఱచెద నంచు నాగ్రహముచేయు ...
ప్రబోధ 5. 51

మూలఝా(ఝా). వి వి. (మూలము + ఝాయి) వజ్రము.

సీ ఆ మూల నునుమూలఝామొత్తముః చలులా మూలముగఁ దీపతుండ నలయు .
వసు. 2. 57.

సీ. మూలఝాళాళంబములు పెక్కు జత సేసి జాళువాప్రతిమలచా లమర్చి ....
చంద్రా. 2. 86., ఉ. రా. 2. 292.

సీ. పొలుచను వజ్రంబు మూలరా లన, మగరా లవంగను, గురుజా లనంగ ....
అం భా. 2. 278.

మూలఱేఁడు. వి (మూల² + ఱేఁడు) నిర్బతి, కోణపుఁడు

సీ. వాలు మోచుకయుండు మూలఱేఁడు ....
అచ్చ రా సుం. 41

మూలవసము. వి. (మూల¹ + వసము.) పట్టము లోని కమ్మకము నిమిత్తము వచ్చు సరకులపైఁ బుచ్చుకొను సుంకము ...
కొండవీటిశా. శ 1142

మూలవ్రతి. సం. విశ. (న్. సి. న్) దుంపలు మాత్రమే తిని బ్రదికెడివాఁడు.

మూలాధారము సం వి. అ. పుం.) (యోగ.) గుహ్యలింగస్థానములకు మధ్య నుండు మూలాధార చక్రము

మూలాహ్వము. సం వి. అ. వ. ముల్లంగి, మూలకము (వృ వి)

మూలి సం. వి. ఈ స్త్రీ. ఒల్లి న్. పుం. చెట్టు వృక్షము.

మూలిక. సం. వి. అ స్త్రీ. వేఱు, దుంప

మూలుగ. వి. వృక్షవిశేషము

సి నారువ సుఁటపొన్న వారిజమును బొన్న నెల్లి మూలుగ బిల్లు నెమిలియడుగు .
హంస 4. 11.

మూలుగు¹(ల్గు) అ క్రి (త. మునంగు. క. ముల్గు.) 1. ధనదేవత మొ. వస్త్రార్థముగానున్న నన్ను పరిగ్రహింపుఁడని సూచించుచు కూయు

ఉ. వాలినవేడుకన్ బహుసువర్ణముఖంబున ము న్నరుత్తమా, పాలునిచే మహీసురు లపారను దక్షిణ లంది తెప్పలం, దేలి యథేచ్ఛఁ గొం చరుగ నిల్చినవిత్తము వెక్కసంబుగా, మూలుగు చున్న దిప్పుడు నముద్రితమై తుహినాద్రి చేరు వన్ .
జై భా. 1 66.

ఉ. పాళము మీఱుపెద్ద పెదపాళములై బలితం పుఁగాఁగులన్, మూలుగు చున్న ప్రాఁబసిఁడి ముంచి ధనార్థుల కిచ్చు .... పాండు. 4. 211.

2. (బాధచే) ఒకవిధముగా రోదన ధ్వనిచేయు.

కం. తలనొప్పి కడుపుకుట్టుం, బలుగులుపుం గాళ్ళ తీపు పాటించుచు వచ్చెలి మూల్గు శాన్పుమీఁదం తెలుపుఁడు దత్తచ్చికిత్స సేయ న్నగుచున్ ...
శుక. 2. 205,

ద్వి బాలిక పువ్వులపానుపు విడిచి, మూలను బవళించి మూల్గుచు నుండె ...
ద్వి. శ. సా. 1 35 పా. 11 పం.

వి అట్టిధ్వని.

(వ్యవ.) వాని మూలుగుచేత నాకు నిద్రపట్టలేదు.

మూలుగు(ల్గు) = మూలగ. వి. ఎముకలమధ్య

నుండు మాంససారము, మజ్జ

సీ. మూల్గులు చెమ్ముతోడ ముదుక గకుడగ
జాదు సేసినవల్లజారు గాచి ..
హరి 2 121

సీ. . మూలుగు నా మజ్జ బొలుచు ..
ఆం ఖా 2. 188

మూలేరము సం వి అ పుం జటామాంసి (వృ. వి.)

మూలేరుడు. సం వి అ పుం రాజు ప్రభువు

మూల్యము సం వి అ న. 1 వెల క్రయము, విలువ 2 ఒద్ధి, లాభము 3. మూలధనము, మొదటిసొమ్ము, పెట్టుబడిసొమ్ము

మూవ[1] = మూగ[1]

గీ కరగి వడ్లను జెరుగును గలుపుభంగి, నకలనికటంబు లగుప్రశ్న లడిగె నదియు, మూవలమువోలె దీనుదే జావ నేల, యీడు జోడుగ జెప్పెద నెఱిగినంత ..
వాసిష్ఠ 2 182.

మూవ[2] = మువ్వ.

ద్వి మూవలగంటలమ్రోతకు వెఱచి, దేవి యున్నసగంబు ధృతి దన్ను గలయ ...
బస. పు 8 604 వం

మూవు = మూగు అ. క్రి. ముసరు.

గీ. తమముఖంబులు దశితాంబుజములు సావి, మూవుతేటులు గని .
కు సం 9 286

చం. అలు లొదిగూడు ... సుగంధము మీఱు బువ్వగుత్తులపయి మూవు, బువ్వులు ద్రావు
కు సం. 4. 461

మూవురు = మూగురు న. ముగ్గురు (మూడు నకు మహన్మహాత్మార్థక రూపము.)

కం. అవిద్రవు లేద్వురైనను, నేవురు ముప్పుర్రును నైన నిమ్మహిలోనన్, భావితసభ యగు గాపున. మూవు రపశ్యంబు వలయు ముఖ్యులు సభకున్
విజ్ఞా ప్ర్రాయ 3.

కం. ఈవిధమున గర్ణుయు లగు, మూవురతో రాజ సతులు మునుమును సుతులన్. శైవాత్ములు గని రిద్దఱ
ఉ హరి 4 10.

మూష సం. వి అ స్త్రీ 1 మూస 2 గాలి రంధ్రము, గవాక్షము

మూషకపర్ణి సం వి ఈ స్త్రీ ఎలుకజీడి (వృ వి)

మూషకము సం వి అ పుం ఎలుక

మూషకవాహనుడు సం. వి అ పుం. ఎలుక వాహనముగా గలవాడు, గణేశుడు, విఘ్నేశ్వరుడు

మూషకారాతి. సం వి ఇ పుం. పిల్లి, మార్జాలము

మూషకుడు సం విఅ. (అ. పికా అ.) దొంగతనము చేయువాడు.

మూషణము. సం. వి అ. న దొంగిలించుట. చౌర్యము

మూషము సం. వి. అ పుం. 1 ఎలుక; చుంచెలుక 2. గుండ్రనికిటికి, గాలిరంధ్రము. 3. మూస.

మూషికము. సం వి. అ పుం. 1. ఎలుక. 2. ఎలుకచెవిచెట్టు. 3 ఒకానొక దేశము.

మూషికరథుడు సం వి. అ. పుం మూషిక వాహనుడు, గణేశుడు

మూషికారాతి. సం వి. ఇ. పుం. మార్జాలము. పిల్లి

మూషితము. సం విఅ (అ ఆ అ.) దొంగి లింపబడినది.

మూస. వి. బంగారు లోనగువానిని గరగెడి పాత్రవిశేషము.

చం. ధమనియు శ్రావణంబు మొలత్రాసును బట్టెడ నీరుకారు శాణము పటకారు మూస బలునాణెరీతులమచ్చు లాదిగా, నమరగ భద్రకాంక సమాహ్వయు డొంగ డొక

మ ము వచ్చురెన్. హంస. 2 181

**మూసిక** వి (సం. మూషికా.) నాచుక్రోవి.

గీ. ..శాళి,బొట్టు [మూసికతోఁ గూర్చ పొసఁగ నఱుతఁ, బ్రాడు గట్టక ...
నీలా 1. 103

**మూసికొను** స. క్రి. (√మూయు) చుట్టుకొను

ఉ. .. పెఱవట్టుల వీచు లుపగ్రవృత్తిమై మూసికొనంగ వత్తు ..
భార. విరా. 5. 250.

**మూసికముఱికి.** విఱ. (√ మూయు) అప్రయోజకుఁడు.

సీ మూసినముఱికి నిరోగ్యహి స్వామిద్రోహి దుష్టు రోఁతమారి బోనకారి ...
హంస. 5. 113.

## మృ

**మృగగామిని.** సం వి. ఈ. స్త్రీ వాయువిళంగము (వృ. వి ) (రా. వి ).

**మృగజీవనుఁడు.** సం. విఱ. (అ అ. అ ) వేఁటకాఁడు, బోయవాఁడు.

**మృగణ** సం వి ఆ. స్త్రీ. వెదకుట పరిశీలించుట.

**మృగతృషము.** (తృట్టు) ష్ స్త్రీ. ఎండమావులు, మరీచిక.

**మృగతృష్ణ** సం. వి ఆ. స్త్రీ. మరీచిక, ఎండమావులు

**మృగదంశకము.** సం. వి. అ. పుం. శునకము కుక్క.

**మృగదంశము.** సం. వి. అ. పుం. శునకము, కుక్క.

**మృగదృశ + (దృశ్కు).** సం. వి శ. స్త్రీ. మృగాక్షి, లేడిచూపులు గల స్త్రీ

**మృగధరుఁడు.** సం. వి. అ. పుం. చంద్రుఁడు.

**మృగధూర్తము.** సం. వి. అ పుం నక్క

**మృగనయన.** సం. వి ఆ. స్త్రీ. మృగాక్షి, లేడి కన్నులుగల స్త్రీ

**మృగనాభి.** సం. వి. ఇ. స్త్రీ. కస్తూరి.

**మృగనాభిజ** సం. వి. అ. స్త్రీ. కస్తూరి.

**మృగపతి** సం. వి. ఇ. పుం. సింహము.

**మృగపాలిక.** సం. వి. అ. స్త్రీ. కస్తూరి మృగము.

**మృగపిప్లువు** సం. వి. ఉ పుం చంద్రుఁడు మృగలాంఛనుఁడు. (శ్రీ. వి )

**మృగప్రియము.** సం. వి. అ న కొండలమీఁదఁ బెరుగు గడ్డి.

**మృగబంధిని** సం. వి ఈ స్త్రీ జంతువులను బట్టుకొనెడి వల

**మృగభక్ష.** సం. వి. అ. స్త్రీ. జటామాంసి (వృ.వి ).

**మృగమదము.** సం. వి అ పుం. కస్తూరి.

**మృగమదవాస.** సం వి ఆ. స్త్రీ. కస్తూరి. మల్లిక, ఒకజాతి యడవిమల్లె.

**మృగము.** సం వి అ. పుం 1 (అ)చతుష్పాజ్జంతువు, నాలుగుకాళ్ల జంతువు 2. లేడి. 3 వేఁటాడఁ దగినజంతువు. 4. కస్తూరి. 5 అన్వేషణము, వెదకుట. 6 విమర్శనము, పరిశోధించుట 7. అడుగుట, వేఁడుట. 8 ఒకజాతి యేనుఁగు. 9 పురుషులలో నొకజాతి. 10. మృగశీర్ష నక్షత్రము 11. శాకద్వీపమున నొక దేశభాగము

**మృగయ.** సం. వి. ఆ స్త్రీ. వేఁట

**మృగయువు.** సం వి. ఉ. పుం 1. నక్క, జంబుకము 2. బ్రహ్మ, 3. బోయ, వేఁటకాఁడు,

**మృగరాజము** సం. వి. అ. పుం. 1 సింహము, 2 సింహరాశి 3. పెద్దపులి.

మృగరిపువు నం వి. ఉ పుం సింహము.

శ్లో తులాభ్యర్థాః కథితా హరిర్మృగపతిః పంచా ననః కేసరీ, హర్యక్షో నఖరాయుధో మృగ రిపుః సింహాశ్చ కంఠీరవః ..

హ లా ని 2 59.

మృగరోమజము. సం వి. అ. న ఉన్నెబట్ట, రాం కవము.

మృగరోమము నం వి న్ న. ఉన్నె

మృగలక్ష్మఘుడు. నం వి. అ పుం. బుధుడు, గ్రహములలో నొకడు

మృగలాంఛనుడు నం. వి అ పుం చంద్రుడు

మృగలోచన. సం. వి ఆ స్త్రీ లేడికన్నులవంటి కన్నులు గల స్త్రీ.

మృగవధాజీవుడు నం వి అ పుం. వేట కాడు

మృగవల్లభము. నం. వి. అ న. కుందురుతృణము, కుందురు (వ్వ. వి.).

మృగవాహనుడు. నం వి అ పుం జింకరౌతు, వాయువు

మృగవ్యము. నం వి అ న, వేట, ఆఖేటము

మృగవ్యాధము. నం. వి. అ. పుం. ఒకానొక నక్షత్రము

మృగశిరము. నం. వి న్ న. మృగశీర్ష నక్షత్రము.

మృగశీర్షకము. నం వి. అ పుం అభినయ హస్త విశేషము (శ. ర)

మృగశీర్షము నం వి అ న. ఒకానొక నక్షత్రము.

మృగశ్రేష్ఠము. నం వి. అ పుం. పెద్దపులి

మృగాంకము నం. వి. అ. పుం కర్పూరము.

మృగాంకుడు సం. వి అ. పుం. 1. మృగలాంఛనుడు, చంద్రుడు.

2. మృగవాహనుడు, వాయువు

మృగాంగన. నం వి ఆ స్త్రీ ఆడుజింక

మృగాండజ. నం వి ఆ స్త్రీ కస్తూరి

మృగాంతకము నం = మృగాదము

మృగాక్షి నం వి ఈ స్త్రీ. లేడికన్నులవంటి కన్నులు గల స్త్రీ

మృగాజినము నం వి. అ న కృష్ణాజినము. లేడిచర్మము

మృగాజీవము నం వి అ పుం సివంగి, తరుపు (శ ర).

మృగాజీవుడు నం వి అ పుం. బోయవాడు (శ. ర).

మృగాదనము. నం వి అ పుం తరుపు సివంగి.

మృగారాతి. నం వి ఇ పుం 1 సింహము. 2. కుక్క

మృగావిత్తు. సం విఋ (ద్) వేటకాడు.

మృగాశనము. నం. వి. అ. పుం సింహము.

మృగాస్యము. నం వి. అ పుం సింహరాశి.

మృగి. సం. వి. ఈ. స్త్రీ. ఆడులేడి

మృగితము నం. విఋ. (అ ఆ. అ) 1. వెదకబడినది 2 యాచింపబడినది.

మృగీదృక్కు. సం. వి. శ్. స్త్రీ ఆడులేడి చూపులు గల స్త్రీ

మృగేంద్రచటకము. నం. వి. అ పుం. డేగ, శ్యేనము.

మృగేంద్రము. నం. వి. అ. పుం. 1. సింహము 2 పద్దపులి. 3 సింహరాశి.

మృగేంద్రాసనము. సం వి. అ. న. సింహాసనము.

మృగేష్టము. నం. వి. అ. పుం. ఒకజాతిమల్లె, ముద్గరము (వ్వ వి) (రా. ని).

మృగోరా_ప్రపు నం. వి ఈ. పుం. బుడమ (వ్య ు) (శ వ.).

మృగ్యము నం విణ. (అ. ఆ. అ) వెదకఁదగినది. పరిశీలింపఁదగినది. విమర్శింపఁదగినది.

మృచ్ఛకటిక నం వి ఆ స్త్రీ. శూద్రకకవి రచించిన యొక నాటకము.

మృజ నం వి ఆ స్త్రీ 1. శుభ్రపఱుచుట, పవిత్రముచేయుట 2 శుద్ధి, శుభ్రత, పవిత్రత.

మృజము నం. వి. అ పుం. వాద్యవిశేషము

మృడాని నం వి ఈ. స్త్రీ. పార్వతి.

మృడీకము నం వి అ పుం. లేడి.

మృడుఁడు నం వి అ పుం శివుఁడు.

మృణాలము నం. వి అ. పుం న. తామర తూఁడు, బిసము.

వ వీరణమూలము, వట్టివేరు. (మే ని.)

మృణాలసూత్రము. నం. వి అ, న. తామర కాడలోని దారము

మృణాలి నం వి ఈ. స్త్రీ. మృణాలము.

మృణాలిని నం వి. ఈ స్త్రీ 1. పద్మలత, తామరతీగ 2 పద్మసమూహము. 3. పద్మములతో నిండినచోటు, పద్మముల ప్రదేశము.

మృతండుఁడు నం వి. అ పుం. సూర్యుఁడు.

మృతకము. నం వి. అ పుం. న. శవము, పీనుఁగు. వి అ న. 1. మృతాశౌచము. 2. మృతి. చావు.

మృతకల్పుఁడు నం. విణ. (అ. ఆ. అ) మృతప్రాయుఁడు, చచ్చినవాని వంటివాఁడు.

మృతకాంతకము నం. వి. అ. పుం. జంబుకము. నక్క.

మృతజీవము. నం వి. అ పుం. తిలకవృక్షము. (రా ని.).

మృతపుఁడు. నం. వి. అ పుం. మాదిఁగవాఁడు.

మృతప్రాయుఁడు. నం విణ (అ ఆ. అ.) చచ్చినవానితోఁ దుల్యుఁడు.

మృతమత్తము. నం. వి. అ పుం జంబుకము, నక్క (త్రి. ని).

మృతము నం. విణ. (అ. ఆ. అ) 1 చచ్చినది, మృతిఁబొందినది 2 మృతతుల్యము. చచ్చినదానితో సమానమైనది, నిరుపయోగమైనది. 3 భస్మము చేయఁబడినది,

వి. అ. న 1. మృతి, చావు. 2 భిక్ష, యాచనవలన సంపాదింపఁబడిన యాహారము (చూ — అమృతము)

మృతసంజీవనము. నం. విణ. (అ. ఈ. అ.), చచ్చినవానిని బ్రదికించునది (కరణము)

వి అ. న. చచ్చినవానిని మరల బ్రదికించుట.

మృతసంజీవని నం. వి. ఈ. స్త్రీ. 1. చచ్చినవానిని బ్రదికించుట. 2 చచ్చినవానిని బ్రదికించెడి యమృతము 3 ఒకానొక విద్య (దీనిని శుక్రుఁడు కచున కుపదేశించెను.)

మృతాంగము. నం వి అ న శవము,

మృతాలకము నం. వి అ. న ఒకజాతి రేగడిమన్ను, తొగరిమన్ను

మృతి. నం. వి ఇ. స్త్రీ మరణము చావు

మృత్కాంస్యము. నం వి. అ. న. మంటిపాత్ర. (త్రి వి.)

మృత్కిర నం వి అ. స్త్రీ. వానపాము, ఎఱ్ఱ.

మృత్తాలకము నం. వి. అ పుం 1 తొగరి (వ్య.వి.) 2. తొగరిమన్ను. 3. అడవితొగరి తీగ (శ వ.).

మృత్తిక. నం. వి. ఆ . స్త్రీ. మన్ను.

మృత్తు. నం. వి. ద్, స్త్రీ. మన్ను. మృత్తిక.

మృత్యుంజయుఁడు. నం. వి అ. పుం శివుఁడు.

మృత్యునాశకము. నం. వి. అ. పుం. పాదరసము.

**మృత్యునాశనము.** సం. వి. అ. న. అమృతము.

**మృత్యుపాశము.** సం. వి. అ. పుం. యమ పాశము.

**మృత్యుపుష్పము** సం. వి. అ. పుం. చెఱకు, ఇతువు (వృ. వి).

**మృత్యుఫలము.** సం. వి అ. న. ఒకదినుసు పుష్పృతము

**మృత్యుఫలి.** సం. వి ఈ. స్త్రీ కదళీవృక్షము. అరఁటిచెట్టు

**మృత్యుబీజము** సం. వి అ పుం వెదురు (వృ వి)

**మృత్యుభృత్యము,** సం. వి. అ. పుం. రోగము, జబ్బు

**మృత్యులోకము.** సం వి. అ. పుం. యమ లోకము పితృలోకము.

**మృత్యువంచనము.** సం వి అ. పుం. 1 కాకోలము. మాలకాకి. 2 బిల్వము, మారేడు (వృ. వి.).

**మృత్యువంచనుఁడు.** సం. వి. అ పుం. శివుఁడు.

**మృత్యువు** సం. వి ఉ. పుం. 1. యముఁడు 2. బ్రహ్మ 3. విష్ణువు. 4. మాయ. 5 మన్మథుఁడు కామదేవుఁడు.

స్త్రీ వు. మరణము. చావు.

**మృత్యుసూతి.** సం. వి. ఇ. స్త్రీ. ఆఁడుపీత

**మృత్స.** సం. వి. అ. స్త్రీ. మంచిమన్ను.

**మృత్స్న** సం. మృత్స

**మృద** సం. వి. అ స్త్రీ. మృత్తు.

**మృదంకురము.** సం. వి. అ పుం. హారీతపక్షి, పచ్చపిట్ట.

**మృదంగఫలము.** సం వి అ పుం పనసచెట్టు.

**మృదంగము.** 1. మద్దెల. 2. వెదురు (వృ. వి.) 3 ధ్వని, శబ్దము.

**మృదాకరము.** సం వి. అ. పుం అశని, పిడుగు.

**మృదితము** సం విశే. (అ. అ అ) 1. నొక్కఁబడినది 2. చూర్ణముగాఁ జేయఁబడినది.

**మృదిని** సం. వి ఈ. స్త్రీ. మంచిమన్ను

**మృదుకర్ణాయసము** సం. వి అ న. సీసము

**మృదుగమన.** సం వి. అ. స్త్రీ హంసాంగన ఆఁడుహంస

**మృదుచర్మి.** సం వి. న్ పుం. భూర్జవృక్షము, బుజేఁ త్తిరి (వాచ.).

**మృదుచ్ఛదము.** సం. వి అ. పుం మృదుచర్మి.

**మృదుత్వక్కు.** సం. వి. చ్. పుం. మృదుచర్మి

**మృదుచ్ఛకము** సం వి అ న. ఒంగారము.

**మృదుపత్త్రము** సం వి. అ. పుం. నలదము (వృ.వి)

**మృదుపర్వకము.** సం. వి అ. పుం పేము, వేత్రము (వృ వి.).

**మృదుపుష్పము** సం వి అ పుం. శిరీష వృక్షము, దిరిసెనచెట్టు

**మృదుఫలము.** సం వి అ. న 1 వికంకత మనుచెట్టు, 2. మధునారికేలము (వృ. వి)

**మృదుభాషి.** సం. విశే. (న్. నీ న్. 1. మెల్లఁగా మాటలాఁడువాఁడు 2. తియ్యని మాటలు చెప్పువాఁడు.

**మృదురోమము.** సం వి న్ పుం. శశము, కుందేలు

**మృదులము.** సం. విశే. (అ. అ. అ) మృదువైనది, నున్ననిది, లేఁతది, సుకుమారమైనది, వి అ. న. జలము, నీరు.

**మృదువర్గము.** సం వి. అ. పుం. అనూరాధా మృగశీర్షా చిత్రా రేవతీ నక్షత్రముల సమూహము.

**మృదువు** సం. విశే. (ఉ. ద్వి. ఉ ఉ)

1. మెత్తనిది 2. సౌమ్యమైనది. మంచిది.

వి ఉ పుం. శనిగ్రహము, మందుఁడు.

**మృద్గము** సం. వి. అ. పుం. ఒకజాతి చేప

**మృద్గర్భము** సం. వి. అ. పుం. ఇంద్రనీల రత్న దోషము.

ఉ. విదితముగ నీలమణిలో, మృదు పగుమ న్నున్న నదియె మృద్గర్భ మగున్, మునమునఁ బూనిన మానవుఁ, డుగర ప్రాణంబుబాధ నొందుచు మండున్ .. ర త్న. 60.

**మృద్వి** సం. వి. ఈ. స్త్రీ ద్రాక్ష.

**మృద్వీక** సం. వి. అ. స్త్రీ. మృద్వి (వ్యు. వి)

**మృధము** సం. వి. అ. న యుద్ధము, పోరు.

**మృష** సం. అవ్య. అసత్యము.

శా. జాతుల్ సెప్పుట సేవ సేయుట మృషల్ సంధించు టన్యాయ విఖ్యాతిఁ బొందుట కొండెకాఁ డవుట .. కాశీ. 4. 100.

**మృషాధ్యాయి.** సం. వి. న్. పుం ఒక విశేషము, ఒకజాతి కొంగ.

**మృషాలకము** సం వి. అ. పుం. మామిడిచెట్టు.

**మృషోద్యము.** సం వి. అ న అసత్యము చెప్పుట, కల్లలాడుట, అసత్యకథనము.

**మృష్టము** సం. విశ (అ. ఆ అ.) పవిత్రమైనది. శుభ్రమైనది.

వి. అ న మిరియము

**మృష్టేరుకుఁడు** సం విశ (అ ఆ. అ) 1 భోగ్యపదార్థములు తినెడివాఁడు. భోగియైన వాఁడు, విలాస యుక్తుఁడైనవాఁడు. 2 అతిథి ద్విట్టు, శి దాత, ఈవి గలవాఁడు.

# మె

**మెంచే.** వి. (సం. మ్లేచ్ఛః. పా. మిలిచ్ఛో.) మ్లేచ్ఛుఁడు.

సీ. .. మెంచ యనంగను మ్లేచ్ఛుఁ డొప్పు .... ఆం. భా. 2. 290.

**మెండాడు** అ. క్రి. (మెండు + ఆడు) సంచరించు, తిమ్మరు.

సీ. విటుఁడై మెండాడు వీధుల జంతల పెనుగాటు కలకవప్పు తెరనెఁ గాక . కవిక. 4. 90.

**మెండియ(డె)ము.** వి చూపుడువ్రేలను ధరించెడి యుంగరము, తర్జన్యాభరణము.

కం. మెండియపువ్రేల వెండియు, మెండినికిఁ బోరుగు వ్రేల మేలిమిపసిఁడిన్, గొండొకవ్రేల జలంబును, నుండంగా వలయు బ్రాహ్మణోత్తము చేతన్. విజ్ఞా 1 77.

జ మెండీఁడు

**మెండీఁడు.** వి (మెండెము+ఈఁడు) చూపుడు వ్రేలు. తర్జని, ప్రదేశిని

కం మెండియపువ్రేల వెండియు, మెండినికిఁ బోరుగు వ్రేల మేలిమిపసిఁడిన్, గొండొకవ్రేల జలంబును నుండంగా వలయు బ్రాహ్మణోత్తముచేతన్ విజ్ఞా 1. 77.

విశ. మార్గదర్శకుఁడు

ద్వి. మిండలు మిండలు మెలఁతల వరయ, మెండీలు మెండీలు దుండగిం పంగ .. పండితా. పర్వ. 858 పు

**మెండు.** వి 1 ఆధిక్యము

సీ. కొట్టవై చినతల ల్గుట్టలై కాటుకకొండల దండిని మెండుసూప .. దశా. 6 137

ఐ. కోమలతరతమాల మాలాకార శాఖోట విట పిసండంబుల మెండును ... భీమ. 3 57 లా. 2. 64, ఆం. భా 3. 24.

2 అతిశయము.

వ. మిటమిటం గాయుదట్టంపుఁ బండువెన్నెల మెండున బెండువడి డెందంబు గంది తాలిమి చిందువంది కెందలిరు పాన్పునందనమునొందక .. మను చ 3. 28

వ ... ఎండ మెండునం బెండుపడకుండ గడితంపు పచ్చడంబు ఉల్లెడల వడువునం బట్టువాఁ ను... శుక 2. 10.

3. ఉద్ధతి. మిడిసిపాటు

ద్వి. దండకాటవిఁ జొచ్చి దశకంధరుండు, మెండు వం గొనిపోయెను మేదినీసుతను ...
రం. రా. ఉ 120 పా. 18 పం.

4. విధము, రీతి.

గీ చండవాతోత్థధూరజో హిండనమునఁ, గొండ మెండునఁ గదలక యుండుదైత్య, మండ లేంద్రునిదేహము ... దశా. 4 26.

వ ... పుట్టచెండుమెండున మిక్కుటంబుగఁ బుటంబు లెగయ నిశేచ్చం జనుహాయంబులు ...
చంద్ర. 3. 64

వ. ఇత్తెఱంగున నక్కార్తవీర్య ద్విశ్యవర్యులు .. అఖంగురప్రళయకాల మార్తాండ మండల ద్వితయంబు మెండున ... ఉ. రా 5 246.

5. మిట్ట, ఉన్నతభూమి.

గీ. మెట్ట యన మిట్ట నాఁగను మెండు నాఁగఁ దోఁచు నుత్తాననామంబు ...
ఆం. భా. 1. 158

6. మెలి. (చూ. మెండువెట్టు.) విణ అధికము, మిక్కుటము, అధికుఁడు, గొప్పవాఁడు.

వ. ... గగనమణి గాయు నీరెండ మెం డనం బరగు ... ఆము. 6 98.

కం. మండలపతి సముఖంబున, మెండైనప్రధాని లేక మెలఁగుట యెల్లన్, గొండంతమదపుటేనుఁగు, తొండము లేకుండినట్లు దోఁచుర సుమతీ...
సు. శ 88.

సీ. మిక్కిలి యెక్కువ మెం డగ్గలము పెచ్చెరుగు నాఁగ నధికంబు దోఁచుచుండు ..
ఆం. భా. 3 24.

క్రి. విణ. అధికముగ, మిక్కుటముగ ...

సీ. నడిగొండచఱిదండ నడ దండమున మెండ నరుగండకముగం డడంచె నొకఁడు ...
రా. వి. 3. 65.

ఇ మెండాడు, మెండుకొను, మెండుమీఱు, మెండువెట్టు, మెండొగ్గు, మెండొడ్డు, మెండోడు.

మెండుకొను. అ. క్రి (√మెండు) 1. అతిశయించు.

వ వెండియు మెండుకొనుశబ్దంబువలన శరదబ్ద రుచిస్ఫూర్తియు వగుపురుషుండు సంభవించె...
వరాహ. 9. 115

కం. వెండియు దినదినమును దన,దండను వేదండయాన తరితీపువగల్, మెండుకొన నుండఁ గన్నుల, పండువుగాఁ జూచి కామపరవశుఁ డగుచున్.
శశా. 2. 91

వ. భగ్గున నెగయునిజావయవతాపానలంబు డఁబున విడంబించు దగద్ధగితమార్తాండోపల కలిత కీలికీలామాలికల చాయలవగిది మెండుకొని ..
చంద్రా. 2. 84

2. విజృంభించు.

ఆ నికుంభుఁ డంతఁ,బండ మైవకాలదండంబుఁ దాల్చిన, దండధరుఁడపోలె మెండుకొనుచు .. భా. రా. యు. 1218.

3. (దిగ్భ్రమచెంది) ప్రోగుపడు.

సీ. బహుళకపిధ్వజప్రభలు లోచనములు మిణుమిట్లుగొనఁ బర్వ మెండుకొనుచు ...

గీ. నడచు కౌరవరాజసైన్యంబుఁ గదిసె ... అర్జునుండు ... భార. విరా. 4. 248

4. నిండుకొను, సమృద్ధమగు.

కం. రెండవప్రబంధము యఖ, కాండము లేదింటి యందుఁ గలయర్థములన్, మెండుకొని సభల నొప్పుచు, నుండఁ గలదు ...
పంచ. 2. 233.

శా. ఆర్ద్రైతేయతనూజ నింగి వడఁగా హస్తిద్వయంబు పై నొక్కనాఁ, డేదిక్కుం జెలిపిండు మెండుకొనఁగా నేకాంతనిద్రారతిన్, మోదింపన్ ... ఉ. హరి. 5. 84

5. అధికమగు, దశ మెక్కు, చిక్కఁబడు

(వెన్నెల) వ. కుముదకాండ ప్రకాండకాండవిత పాండుపరాగమండలంబున మెండుకొనుచు.
వసు 4 23.

మెండుమీఱు అ. క్రి. (√మెండు) అతిశ యించు, మెండుకొను

గీ మెండుమీఱిన పగటిపేరెండ దాఁకి
ఆము 2. 56.

మెండువెట్టు స క్రి (√మెండు) మెలివెట్టు, పెనవేయు.

గీ. పండచేలావుగల గట్టిపండువెదురు, తండ ములఁ గొమ్ముసంగల మెండువెట్టి, బెండు పఱచినకైవడిఁ బెనచి విఱుచుఁ, బోతరించిన దుష్టులప్పాఱములోన ..
చంద్రా. 2. 61.

మెండొగ్గు అ క్రి. (√మెండు) ఎదిరించు

ద్వి. కండక్రొవ్వున నన్నుఁ గైకొని రాక, మెం డొగ్గెదవు మంచెమేలముల్ మాను ...
ద్వి. హరిశ్చ. ఉ. 894 పం

మెండొడ్డు. అ. క్రి. (√మెండు.) 1. ఎదిరించు.
గీ. మించి మెండొడ్డ సాగె నమిత్త్రకులము ...
దశా. 2 51

సీ మాటికిమాటికి మగనితో మెండొడ్డి చల పాదితనమున నలగి యుండు ..
శశాం. 4. 82

2. చెప్పినదానికి వ్యతిరేకముగా వర్తించు

సీ తనమేధ చక్రభ్రాదంభసంభ్రమమున మెండొడ్డు కుండలిఁ గుండలించు ... బహు. 1 60.

గీ ఒరులు చెప్పినవెనుకఁ దా నొకటి చేసె, పనెడిమాటకు మెండొడ్డె ననఁగఁ దోఁచు ..
ఆం. భా. 4 108.

మెండోడు అ క్రి. (√ మెండు.) పాటిదప్పు.

ద్వి. దండనీతిక్రియల్ దానధర్మములు, మెం డోడి చెడిపోవు మింతురు రిపులు ...
రం. రా. అయో. 128 పొ. 22 పం.

మెంతి వి (సం మేథి, క. మెంతె, త. మెంతి యమ్) 1 సస్యవిశేషము

ఉదా మెంతికూర.

సీ. మెంతి యనంగను మేంథినామము తగు . .
ఆం. భా. 2. 246.

2. మెంతులతోఁ జేయఁబడిన యొకవిధ మగు తాలింపు వస్తువు

ఉదా, మెంతిపెరుఁగు, మెంతికాయ మొ.

బ మెంతులు ధాన్యవిశేషము

మెంపు. అ. క్రి. ఎదురేఁగు, ఎదురుగా వచ్చు.

వ. .. లేఁగదూడలకు మెంపుచు గుంపులై యట్టు లెత్తి యంబే యని యఱచుచు జట్టి జట్టన నట్టాడుధేనువులఁ బేరుపేరం బిలుచు వారును . వి. పు 7. 147.

మేకపుటాము వి (మేకము + అము) మృగ మదము, కస్తూరి

గీ. మేలిగొజ్జంగిపూనీట మేకపుటాము, గలిపి బలురాచతెరువులఁ గ్రంతలందుఁ, జికిలి ..
అచ్చ. రా అయో

మేకము = మెగము వి. (సం. మృగః. ప్రా మిడి) 1. నాలుగుకాళ్ళ జంతువు చతుష్పా జ్జంతువు.

కం. చెలువునడు మనిసివను బెను, వెఱ మేకములు పెదరినను వివేకనిధి యుక్కఱి బహుళ సైన్యమఱిముఱిఁ, బఱచిన నాఁగంగ రాదు బలియుఁ కైనన్. భార. శాం. 3. 16.

కం కానమేకా అని యమగతి,తో వావేఁట మునియుగము ద్రుంగించెఁ దుదన్ ...
రాఘవ 1 25

2 జింక, కురంగము

ఉ కాంతలారఁ మేకము గన్నదిమొ ఎుగా, నాఁడువారి నెఱుఁగఁ దడవిలోన, గోఁచి బిగియఁ గట్టుకొనిన యావడుగని, మర్త్రికాని

మ . ...ట్టావికుట్టాకుగో, గ ము శ్మెకి- ..
అము 4 184.

ఆ మెంటవెం దినియెం గుడిచె మెక్కె లో
సేశెను, వమలె నాటిగించె నా భుజించె,
ననుట కాశ్య ఉగుచు నలరారుచుండును ...
ఆం. భా. 8. 118.

కం. అనయంబు నవటివెలిది,య్యనిపండులు మెక్కి
చొక్కి యక్కుజపుశిగ, స్వైరుమిసుకులు
నక్కొనలు, గొనకొని యెలుగించు మరుని
గుజ్జపుం దుటుముల్
అవ్వ రా. బాల. 118

సీ. ఫలమూలములు దిని బ్రదుకు మక్కుటులకు
మేలోగింబులు మెక్కం గలిగె ...
ఉ రా 5 278.

**మెక్కొను** అ. క్రి కలుగు, సంభవి చు

చం. కని హృదయంబు ఝల్లుమన ఘల్లుమనంగం
బదాంగదంబు దిగ్గన వెస లేచి లేనడయొ
యారముతోం రెరచాటుం జేరెం గా,మిని
చెలికత్తె తత్తరము మెక్కొవ గద్దియం
దెచ్చి యుంప నుంచినతమి వందుమీంద
నివసించె ధరావరుం డాదరాత్ముం డై.
కువల. 8 58.

**మెగము** = మెకము. వి (సం. మృగః, ప్రా. మిడీ) (లేడి)

గీ ... రఘురాముం డచట మాయ, మెగము
వధియించి కైకొని వగలు వొదువు, నంత
రంగంబుతో నేంగె ....
భా రా. అర. 2 68.

(క్రూర జంతువు)

సీ కాన రే యే మైనం గని మెగాల్ దినియెనో
కానరే యని వేటకాండ్ర నడుగు ...
సారంగ. 8. 281.

సీ ఆది నిండు చలివెలుంగా కాదు మబ్బు
చేసుగుం దోలు తెఱనోటి మెగము గాని.
వే. పంచ. 4. 288.

(తెఱనోటి మెగము = సింహము)

**మెచ్చించు** స. క్రి. (√మెచ్చు.) 1 మెచ్చు నట్లు చేయు, శ్లాఘింపం జేయు

ద్వి చెచ్చెర దేవరచిత్తంబు వడసి, మెచ్చించు వాండ నమ్మిక బాపు మనుండు ...
రం రా యు. 812 పా 11 పం

కం. . సంగ్రామాచలమున నిదె నను మె,
చ్చించెద వే నళుడు నిన్ను నేశా సందున్.
హం. 7.64

ద్వి. మెచ్చించె శివదేవు మీ రొక్కమాటి.
కిచ్చ నవ్వుట సాలదే నన్ను మనుప .
బస. పు. ౯. 908 పం

2 సంతోషపెట్టు

సీ. వ్రేల్మిడిం జాణూరు విఱిచి లోకముల
మెచ్చించినట్టి యాజగజెట్టి యితండె ..
భార. ఉద్యో. 2. 175

శా నీతోడ్పాటున నేం ద్రివిష్టపముల నైల్వంగ
నూంకింతు నా,చేతం గర్ణుండు రూపుమాలి
చను మెచ్చింతున్ నిను జూడుమీ ...
భార. కర్ణ. 8. 130

సీ. ... ఇటమీంద బరమేశ్వరుండు తండ్రి
గాకున్న జన్మంబు కనటు వోదు ..

గీ. తగవు మెచ్చ కద్దేవుండు తండ్రి గాండు.
గాన మెచ్చింతుం దపముచేం గానలోన ...
ఉ. హరి 5 6.

శా .. దైవత, శ్రేష్ఠున్ విష్ణుని బ్రహ్మవార
నుతి మెచ్చించెన్ సముద్యత్తపో, నిష్ఠాత్మ
ప్రవరుం డితండు వరాహ 1 1.7.

**మెచ్చు** స. క్రి. (క. త మెచ్చు) 1 శ్లాఘి చు. పొగడు.

మ. రమణీ! పుత్రుల కర్థి నే నిడనవిక్రాంతాభి
నామంబు లెల్ల మదెన్ మెచ్చవు నీవు రాజ
తనయాలంకారముల్ గ వాక్శో
మార్క 8. 107.

గీ. దిట్టతనమున విచ్చేము దేహి యనుచు, వాడవాడల భిక్షించ మేకూడుగాని. యిట్టి దివ్యాన్నములు మెచ్చునే శివుండు ..
హర. 5. 16

మ .. భావోదయ, స్ఫుటభేదంబు లెఱింగి తద్రసగతుల్ శోధించి యచ్చంపుమె, చ్చుటకున్ దావల మై చతుర్యపతి సంతో షిల్లు నెల్లప్పుడున్ ...
కావ్యా 3 138

2 గారవించు

వ కల్మాషపాదుండు శక్తి యనుమహామునిం గని తెరువు దొలంగు మని రాజాభిమానం బున మెచ్చక పలికిన
భార. ఆది 7 110.

ఉ. ఎక్కుడుమోహదృష్టి తిర నిచ్చుఁ దలంపక వచ్చి వేఁడినం, జక్కనివాఁడు కాఁ డనుచు జక్కెరవిల్తుని మెచ్చ రన్నచో
దశా 1 90.

3, లక్ష్యపెట్టు, సరకు సేయు

ఆ. ప్రొద్దు నేఁడు పెద్ద వోయె నిత్యము నిట తెచ్చి యిచ్చుబలియుఁ దెచ్చి యీఁగ, నొల్ల కెలుఁగు లిచ్చుచున్నవాఁ డమ్మను, జాధముండు మెచ్చఁ డయ్యె ననుచు.
భారా. ఆది 6. 290

సీ. మెచ్చక యెదు రైనమృత్యువు మెడ ద్రొక్కి క్రొవ్వాఁడి కోఱలు ద్రెవ్వ వ్రాచి .
నృసిం. 2. 119.

కం. గుజ్జములపరువు మెచ్చని,నజ్జలఁ గట్టిన రథంబు . భాగ. 10. పూ 894.
మనుచ 1 50.

4 గణించు, లెక్క వేసి చెప్పు.

మ, కనియొం బ్రస్ఫుటసర్వ లక్షణకుభాకారుం గుమారాగ్రణిన్, జనిలగ్నగ్రహచార సంప దలు మెచ్చం బంచె దైవజ్ఞులన్ ...
కళు 4 35.

5 క్రి. సంతోషించు, ప్రియపడు

ఉ. దుర్యోధనుఁ డర్థిఁ జూపఁగ సహో దరవీరులుఁ దానుఁ జూచి లక్ష్మీధరమూర్తి యెంతయును మెచ్చె మనంబునఁ దద్విభూతికిన్ ... భార సభా. 2 162.

గీ ధర్మపరులు వరాటికా దానమాత్ర, లాభమున కైన మెత్తు రుల్లములలోన ..
నైష 2. 77.

గీ వదలి శౌర్యంబు విద్యలవానికరణి, నింద్ర జాలంబు పన్నెదవే బలీంద్ర, యిదిగో వజ్రంబు మెచ్చి యిచ్చెదను గొనుము .
దశా 2. 408

వి. 1 శ్లాఘు, పొగడ్త.

కం. నొచ్చియుఁ బెనఁగినఁ గృపయును, మెచ్చుఁ గదిరి విప్రుతోడ మెయికొని పోరి, ట్లచ్చు పడ నేఁటి కని విస్మయచ్చుఁడు గ్రేడించి యొండువలనికి నడచెన్
భార. భీష్మ 2. 307.

మ. ... దేవి యగ్గలికం బెద్ద పెనంగి డస్సి తిటు లింకం జాలు ని ల్మంచు మెచ్చులు దోడ్తోడ మనంబునం బ్రియము లై సొంపారఁ బ్రేమంబునన్ హరి. ఉ 4. 159.

చం. పఱు పగునారికేళవనపంక్తులు మామిడి తోఁపులుం గడున్, మెఱయుచు నాత్మకు న్ముదము మెచ్చును నచ్చెరువున్ ఘటింపఁ గన్ .. కళా. 2 134.

సీ. కాంతిసంపద నిశాకరుతోడ నొరసిన మెచ్చు మీఱఁగ నొర వచ్చువాఁడు ...
దశకు 1 75.

సీ. ఇచ్చ నెచ్చినకోర్కి లిచ్చు మెచ్చులచెట్టు...
సమీర. 6. 80. ఆం భా, 1. 111.

2. శ్లాఘించువాడు. ఒట్టు,

ఉ. క్రచ్చఱఁ బారిజాతలతికావనదేవత జంభ వైరిపై, మచ్చికఁ గూర్పఁగా నవసుమప్రకరం బుల వేల్పుఁజేటిలో, విచ్చినపైఁడితామరల

మున ) శ్లాఘించు.

గీ అట్టు లరుగుదెంచినట్టియయ్యతులకు, సతుల గతుల నతులు నుతులుచేసి, యతివినీతి నున్న క్షితితలపతిధృతి, మతిని మెచ్చికొనుచు మౌను లనిరి

దశా. 1 171

**మెచ్చుగొల్పు.** స. క్రి. (√మెచ్చుకొను) మెచ్చుకొనఁజేయు, మెప్పించు

శా సందర్భంబు నవార్థగర్భ మగుచుం జాటు క్రియన్ మించఁగాఁ, జెందుల్ ద్రొక్కుచు నిండి యంతట రసశ్రీ మెచ్చుగొల్పఁగ నా, నందాంభోధి తరంగముల్ వలెఁ బ్రబంధంబుల్ భువి న్నిల్పి వాల్మీ 1 12

**మెచ్చులాఁడి** వి. (మెచ్చులు + ఆఁడి) మెచ్చుకొనఁదగిన స్త్రీ.

సీ ఒఱపుఁజూపులఁ గాంచనోత్తరీయములకు మీనంచు వ్రాయునే మెచ్చులాఁడి .

కకు 1. 2.

వ నిలింపపతికోలువు వెలచెలువుల చెలువంబులు మెచ్చని మెచ్చులాఁడులు .

ఉ రా 5 249.

విశే. మెచ్చుకొనఁదగినది (శ ఎ)

**మెచ్చులాఁడు:** విశే. (మెచ్చులు[1] + ఆఁడు) మెచ్చుకొనఁ దగినవాఁడు (శ.ఎ)

**మెచ్చులుసేయు** అ. క్రి (మెచ్చులు[1] + చేయు) సంతోషము కలిగించు

వ మెచ్చుపెరుగు నచ్చపుఁబచ్చల చాయలు మెచ్చులు సేయఁ బచ్చికల మ... విచ్చల విడిఁగ్రచ్చుకొని మెసవ ను ...చు సంకిపు రాజికి . ...సు. 3 11.

**మెచ్చుపచ్చు.** అ. క్రి (√మెచ్చు[1]) స్తుత్యమగు, శ్లాఘాపాత్రమగు.

గీ అంత నర్ధశశకంధరుం డంతలోనఁ, దెలిసి హాను మంతుఁ జూచి నీబలము మెచ్చు, వచ్చె నీకు బ్రేటునఁ బంక్తివదనుఁ డమరఁ, వైరి ప్రేత లోకముఁజూచి వచ్చె నౌర

భా రా యు 82.

మత్తకోకిల. మెచ్చువచ్చుకడాని బంగరు మేటి మంచముమీఁదటన్, హెచ్చుపువ్వులపాన్పు పైఁ బడి యెంతయున్ విరహార్తితోన్

శుం. 4. 9 .

**మెచ్చువడు** అ. క్రి (మెచ్చు[1] + పడు) మెచ్చుపడు శ్లాఘనొందు.

చం ... పరిపూర్ణవిలాసము లద్భుతంబుగా, సుజనుల కెల్ల మెచ్చువడఁ జూపి వరంబు లొసంగి విత్తమున్, నిజముగ సంగ్రహించి యట నేను కుబేరున కప్పుదీర్చెదన్. వెం. మా. 5 ...

**మెటిక[1] (కె)** వి. అంగుళిపర్వము, వ్రేలిగనుపు

కం చెలువుఁడు మాఱాడిన మెటికల పెళ్లున విఱిచి తిట్టి కనలుచు నిందింతలు గాకుండం బొడిచిన, కలహప్రియురాలు దీనిఁ గంటె సుధీంద్రా.

సానందో. 5. 198

సీ. పినతల్లి మెటికలు పెళ్లున విఱుచును నన్న దమ్ములు చూడ రతులకరణ ...

హంస 3 150

జ. మెటికవిఱుచు

**మెటిక[2] = మెట్టిక** వి. సోపానము

సీ మెటిక మెట్టనఁగను మెఱయు సోపానంబు... ఆ భా. 2. 22

**మెటికవిఱుచు.** స క్రి. (మెటిక[1] + విఱుచు) ఏవగించు.

కం. అని మగని మెటికవిఱుచుచుఁ, జనుదెంచిన యతిథికోటి సంబంధిజనుల్, వినఁ దిట్టి శాపెకుడుచుచు, ననయంబును తిట్టినింద కలుకక యుండెన్. శేష. 1 95

**మెట్ట.** వి (క. మిట్టు) 1 కొండ, పర్వతము.

ద్వి. వట్టియాకులు గాలివడిఁ దూలుఁ గాక, మెట్టలు దూలునే మేటిగాడ్పునకు

బస పు. 7.571 పం.

చం. జలవిధులైన మెట్టలగు శైలములైన నడఁగు
నవ్వియ, తలమయినం దలంబ యగు ..
హరి పూ 1. 117.

సీ చిన్నారిజాబిల్లి జేసక్రొవ్వెదపువ్వు మెట్ట రాచ
బిడారు పట్టినిల్లు . రసిక. 1. 2
ఆ భా 2 27

౭ నీరు లేనిభూమి

గీ మెట్ట మెరక గనుఁగను మెఱయుచుండు.
స్థలికి సజ్ఞలు . ఆం. భా 2 5.

సీ విషరాశివిష మానువిషధరంబుల రోసి మెట్టకు
నరుగుక్రొమ్మెఱుఁగు లనఁగ .
దశా 2. 238.

౮ పాదము, కాలు

గీ. చుట్టువాలును నెవ్వ పోఁగొట్టువాలు, బిట్టు
గాలుపసిండిక్రొంబట్టు పేలు, మెట్ట జాలు
మొగిల్పిన మెట్టఁజాలు, నట్టిడాలును గల జెగ
జెట్టిఁ దలఁతు. అచ్చ. రా. బాల 3

గీ. మెట్టదమ్ముల వందియల్ బిట్టు మొరయ,
దిట్టతనమునఁ జెలరేఁగి పట్టపగలె, నెట్టుకొని
యెల్లవేతలనట్టులందు, గుట్టు లరయుచు
మెలఁగు నప్పట్టి మఱియు. నీరా. 1. 75.

విశ. ఉన్నతము, ఉత్తానము (జలప్రదేశము).

గీ. మెట్ట యన మిఱ్ఱు నాఁగను మెండు నాఁగఁ
దోఁచు నుత్తాననామంబు ..
ఆం. భా. 1 158

జ మెట్టకెందమ్మి, మెట్టచెంగల్వ, మెట్టజీలుగు,
మెట్టతమ్మి, మెట్టతామర, మెట్టపంట, మెట్ట
వాల్పిట్ట. మెట్టాడు

**మెట్టకెందమ్మి** వి (మెట్ట + కెందమ్మి) మెట్ట
నేలఁ బుట్టెడి యెఱ్ఱదామర (వృ. వి.), దాని
పూవు

వ. .. కలిగొట్టుచెట్టులపట్టున నిట్టలంబుగాఁ
బుట్టుమెట్టకెందమ్ములకు .. ఉ. రా. 6 24.

**మెట్టచెంగల్వ** వి. (√మెట్ట) మెట్టనేల మొల
చెడి యెఱ్ఱగలువ

గీ మెట్టచెంగల్వపుప్పొడుల్ మెట్టి మెలఁగు,
చలువతెమ్మెర యమ్మెటిక్రమము మాన్పె
ఉ. రా. 4 167

**మెట్టజీలుఁగు.** వి (√మెట్ట) సస్యవిశేషము.

ద్వి మెట్టజీలుగుమేలు మెట్టపాలయ్యె ..
(విష్ణు. పూ 8 ౪ ర.

**మెట్టత(ద)మ్మి** వి. (√మెట్ట) మెట్టనేలఁ బుట్టెడి.
తామర (వృ వి), స్థలపద్మము.

గీ. నిలుతు రొకచోట మెట్టతమ్ములు జనింప
ఉ రా 1. 170

సీ ఇది చెల్వ చెల్వంబు గదిసి పైఁ బడ మూఁడి
మేను జేర్చినకమ్మ మెట్టదమ్మి ..
రా. వి. 4 14.

గీ తెలిమెట్టదమ్ముల వెలిఁబెట్టఁగాఁ జాలుశ్రవ
ణాంతకాంత నేత్రములవాని .. దశా 3 27.

**మెట్టతా(దా)మర** స్త్రీ. (√మెట్ట) స్థలపద్మిని
(వృ వి.), స్థలపద్మము

సీ. ... జీలుగు మెట్టదామర వెట్టిసెనగ జంబీరము
కాఁచి నల్లకాఁచి .. హంస 4. 10

చం. కురిసినక్రిందిపుప్పొడులఁ గొంచు నగంబుల
మీఁదికై పిశం, గరుచులఁ గొన్ని పెల్లగసె
గాడ్పు సుశ్రీ మాధవుండు రా, నెఱపుగఁ
బూవుసొమ్మిడి నవేందిర భూమికి వెండి
మెట్టదా, మఱి వనంబు తాఁగొన భ్రమద్గతు
లౌ మలుచుట్టులో యనన్ ఆము. 5. 124.

సీ. స్థలపద్మ మగు మెట్టతామర యనఁ బైఁడి
తామరయనఁ బచ్చతామర యన, నేల
తామర యన ... ఆం. భా 2 69

సీ. జనకకన్యపిసాళి జళుకుకందోయితో సరియైన
మెట్టదామరలు కొన్ని .. ఉ. రా. 6. 29.

**మెట్టపంట.** వి. (√మెట్ట). 1. జలమక్కఱ
లేక యే పండుపంట.

సీ. సకలదైవతబుభుక్షాపూర్తి కెవ్వాఁడు పుట్టు

గానవిమేరి మెట్టపంట ... మనుచ 1 '8

2 వర్షాధారమువలనఁ బండుపంట

(వ్యవ.) ఈయేఁడు వర్షములు లేక మెట్టపంటలు పోయినవి

**మెట్టబందారి.** వి వృక్షవిశేషము (వృ వి).

సి నేల, తంగేడు మెట్టబందారి దుండుగ ప్రహ్లాదండి భూతుల సెట్టిదండి
హంస 4 10

**మెట్టవా(లుపి)ల్పిట్ట.** వి. (మెట్ట + వాలు + పిట్ట) కోడి. చరణాయుధము.

గీ మెట్టవాల్పిట్ట రామేరిదిట్టవేల్పు, గ్రచ్చులోడఁ గూర్చ మము నిచ్చఁ గాచుఁగాత ..
విచ్చి రా బాల. 8.

**మెట్టాడు** అ. క్రి. (మెట్ట + ఆడు) త్రొక్కు డు లాడు (మిట్టాడు. శ ర.).

వ అనుచుఁ దలంగిపోక యిట్టునట్టుం జుట్టు మెట్టాడు చిట్టివడుగుల నానట్టు నగవునుం గోపంబుఁ గదురం నదలించుచుం దనమేళగాండ్ర నాలోకించి .. ప్రభా 1. 107

**మెట్టించు.** స క్రి (√మెట్టు[1]) 1. ఆయత్త పఱుచు, సిద్ధపఱుచు.

సీ. బండ్ల మెట్టింపు పై బరువులెక్కించుమీ దళ్లను బూన్పు కాళ్లవ నునుపు .. హరి పూ. 6. 21

2 త్రొక్కించు.

కం . కాంతల యిడుగు లెత్తి చేతుల, మెట్టఁ కువ శశి సన్నెకల్లు మెట్టించె గడన్ .
శశాం 5 141.

కం త్రిపదంబులచే సురలను, విపదంబుధిఁ దేల్చి నట్టి విష్ణుని చే స, ప్తపదంబులు మెట్టించిరి, ..
ముకుంద 3 295

**మెట్టిక–మెటిక[2].** (మెట్టు[1] + ఇక. స్వార్థమున) సోపానము, తాప

శా. పన్నీటిమున్నీటిబల్, త్రోవ గట్టిన పచ్చమెట్టికలపైఁ దోడ్తోడఁ గ్రీడింపఁగాన్.
రా వి 3 79.

చం అని జననేత తత్ప్రియసఖాగ్రణికే ల్కయిదండఁ బూని చ,క్కనితెలిమిన్న మెట్టికలుగట్టినత్రోవ నగేంద్ర మెక్కె . చంద్రి 2. 5.

సీ పైఁడిమెటిక లెక్కి పై కేఁగి చేఁతగట్లఁదు దాఁగురుమూఁత లాడి యాడి .
యయా 3. 53

సీ మెటిక మెట్టనఁగను మెఱయు సోపానంబు.
అం భా. 2. ౬౭, పాంచా. 4 21.

**మెట్టికొను.** స. క్రి. (మెట్టు[1] + కొను. సార మున) తొడిగికొను.

గీ విటునివలె హారి సొగసుగ వేస మెసఁగఁ, దాల్చి విటక త్తెవలె నుండుతరుణిఁ గూడి పాదుకల మెట్టికొంచు నాప్రథితయుజ్ఞ. వాటిఁ జేరంగఁ జూచుచు వచ్చుచుండె ... వేం మా 1. 156.

**మెట్టినయిల్లు,** వి. (√మెట్టు[1]) అత్తవారియిల్లు.

గీ అవిభునిదేవి శ్రీవెంగళాంబ పుట్టి, నిల్లు మెట్టిన యిల్లు వర్ధిల్లఁజేసె ... వసు. 1. 63

ఉ. పుట్టినయింటి కెంతయు సమున్నతి చల్లఁ దనంబు మీఱఁగా, మెట్టినయిల్లు గహ్వరము మీఱియు వెండిఁ బ్రసిద్ధికెక్క ...
శశాం. 1 14.

**మెట్టియ(ట్టె) = మట్టియ, మట్టె** వి (త మెట్టి) స్త్రీలు కాలిరెండవవ్రేల ధరించుభూషణ విశేషము.

సీ అరిగింపుఁడు మీర లని ప్రియంబాడెడు పొలుపున మెట్టియ ల్గులకరిప పారి 2 19.

గీ భువన సమ్మోహనాకాంక్షఁ బుష్పధన్వి, పొన్నుమెట్టియ నెత్తమ్మి పూవునడుమఁ, బ్రాణమై డాఁచె ననఁగఁ గట్టాణిముత్తి. యంపుముంగరం విలసిల్లె నబ్జముఖికి
సుద 5. 144

సీ గిలుకమెట్టెలడాలు చలువకుచ్చెలపై జాళు వాఱంగారుసరిగఁ గూర్చ .. ఢశా 2. ౬౬.

గీ . మెట్టెలు పిల్లాండ్లు మొదలుగాను,

గీ. ఇన్నగంబునఁ బ్రవహించు సన్నపాటి, నిర్ఝరమువోలె మందాకినీస్రవంతి, గాన నీ మెట్టు మోక్షంబుకట్టుమట్టు, కనుడు గీర్వాణవరులార కన్నులార  వరాహ. 6. 87.

గీ. మరుని వాశీకసాయకోత్కరము కరము, ధరముఁ దరవిడి మెఱము చేయకిరిది సొరిది, నుఱిగి నవి మెట్లు తెగఁగోయునురువదీర్ఘ, రంబుల జనింపవో శతారములు గావొ.  వసు. 2 114.

కం. తొడిగినపాముల విసమును, మెడవిసమును నొసలిచిచ్చు మెట్టులవడయున్, ముడివడఁగా వడికాలము, గడవుట కడుఁగడిఁది యయ్యెఁ గఱకంఠునకున్.  ద్వా. 9 12.

3. తిన్నె.

గీ. మిట్టుఁ బల్లంబు గట్టును మెట్టు నొక్క, మిట్ట మై యది నునుపారు మహిత మైన, యక్కొలన ...  భార అను 1. 220.

4. సోపానము.

సీ. తనశోణ కమలాంఘ్రితలరుచుల్ మగఱాల తెలిమెట్లఁ గెంపుమెట్టుల నొనర్ప ..  ఉ రా 5 154.

సీ. పుడమివింతలు చూడ నడరుకోరిక గన్న మిన్నేగు దిగుటకు మెట్టు దొంకె ...  శశాం. 1. 10.

సీ మెటిక మెట్టనఁగను మెఱయు సోపానంబు  ఆం భా 2. 22.

5 ఆశ్రయము, ప్రాపు.

సీ కంబాలు మెట్టు గ్రక్కునఁ గదల్చె...  పారి. 1 23

సీ. శూద్రులకును మెట్టు శూరులవిడపట్టు మంత్రివర్గములకు మనికిపట్టు ...  శివధ. 1. 16.

6 సుంకము తీసికొనెడిచోటు, ఘట్టము (శ. ర.).

7 శిరస్సు, తల

చూ మెట్టుఁద్రాలు.

8 మొత్తము, వెఁసి.

గీ. నీవిచార మే నెఱిఁగితి గారవమునఁ, దొడరి నన్నుఁ బంపించి నీకొడుకు రాజుఁ, జేసి మధుర యేలింపఁ జూచెదవు జాల్మ, మెట్టునకుఁ బన్నె తరములు పెట్టి చూడ. హరి  పూ 8. 70.

సీ. నిగరంపుఁజనుకట్టు నగరుఁపురవికెమేల్ సరిగ కుట్టుల మెట్టు సడల నిక్క ....  రా. వి 8 125.

9 బండి యిటు నటు గదలకుండ బండిక్రిందఁ గట్టెడుకఱ్ఱ

సీ పంకరుహంబులు బండికన్నులు చంపకంబులు నొగలుత్పలంబు లిరుసు, .. కేతకుల్ మెట్టులు ..  కు. స . 4 489.

10. కాలు

సీ నిండు బంగరుపట్టు కొండ వంచినమెట్టు వెలయువాని శుకాత్మ నొఱయువాని ..  చంద్ర 5. 57.

11 వీణసరకట్టు, వీణాదండమున కుండు మెట్టు.

గీ .. నార, దుండు వీణగవుసెనను దొలఁగఁ జేసి, మెట్లు తడఁబడ దుడుకుగా మేళవించి, ...  కువల. 5. 59

ఉ ... దంతపుమెట్లవెంబడిం, జేవడి వీణ మీటుటయు ..  ఆము. 1. 62.

సీ మేళవించినవి సుమ్మీ దీని మెట్లని మానసలాలసంబున మహతిఁ జేర్చి ...  పారి. 5. 86.

గీ. పారె మెట్టన సోపానసంజ్ఞ దనరు  ఆం. భా. 1 126

12. చెప్పు, పాదరక్ష.

సీ అట్ట లెత్తినప్రాంతమెట్టులు కడగుటంబటి చాటికలతోడి వరువకాళ్లు, ..  వేం. పంచ. 1. 598

సీ పచ్చిట్టితో లక్కఱచుచ్చాలమెట్లందికొనఁ దాసి యూరెల్ల గుత్తవట్టి ...  ఆము. 6. 69

సీ. నడునెత్తిసికలు గిర్జ్ఞామంబు లెకపాఱ

మెట్టులు క్రొవ్వాఁడి మెఱుఁగుసురెలు ....
రసిక. 1. 63.

సాం. వి. మాన. 44., ఆం. భా 2. 298.
18. పాదుక.

గీ. సింహగతి మీఱువసురాజుచెంత నొక్క, తోయ ధరవేణి పాదము ల్గడిచి మెట్లు, వెట్ట నొక కన్య హస్త మర్పింప వచ్చె, సలిల భవనంబు నకుఁ బ్రజోత్సవము మెఱయ ...
వసు. 5. 77.

విణ ఉన్నతమైనది, ఎత్తైనది.

(చూ. మెట్టునేల.

జ. మెట్టించు, మెట్టిక, మెట్టికొను, మెట్టినయిల్లు, మెట్టుఁబ్రాలు, మెట్టుగుదె, మెట్టునేల, మెట్టులుగొను, మెట్టువరి, మెట్టువిల్వేలుపు, మెట్లగుంటక.

మెట్టు². వి. పులికటుగు, అభిషుతము. (పులి, మజ్జిగ' అని శ ర )

గీ. .. మెట్టనఁగ మెడ దనంగఁ బులిమెట్టనంగఁ
తెలఁగుచుండు నభిషుతాఖ్య ...
ఆం. భా. 2. 250.

మెట్టుఁబ్రాలు. వి. బ. (మెట్టు¹ + బ్రాలు ) తలఁబ్రాలు,

కం. తదనంతరంబ హర్షము, పొదలుమదిన్ మెట్టుఁ బ్రాలపుట్టికలయెడన్, గదియన్ బట్టినపెంరెరఁ, గదియించిరి బంధుజనులుకన్యావరులన్ ..
మనుచ. 5. 79.

ఉ ... వధూవరులం గడానిబం,గారపుమెట్టుఁ బ్రాలపుటికల్ గదియించిరి గొందఱై దువల్ ...
విజ వి. 3 112.

మెట్టుగుదె. వి. (మెట్టు¹ + గుదె.) ఒకవిధమగు శకటావయవము.

సీ. సింధువారంబులు సీలలు గేతకుల్ మెట్టులు
మొల్లలు మెట్టుగుదెలు ... కు నం, 4 439.

మెట్టునేల వి. (√మెట్టు¹) మెట్టభూమి, మెరక నేల ...
ద. శా. 4. 1243.

మెట్టులుగొను. అ క్రి. (మెట్టులు¹ + కొను.) మెట్లవలె నేర్పడు, సోపానము లగు.

లయగ్రాహి. వి ట్టడరి కేల మెడ సుట్టి తెగ నెత్తు వడు నట్టలు శిరంబులును మెట్టులుగొనం బ్రో, వెట్టు ...
కు. సం 12. 953.

మెట్టువరి. వి. (మెట్టు¹ + వరి) ఋడుమ, జిలమ మున్నగు వర్షాధారమునఁ బండెడు వరిసస్యము.
ద. శా. 4. 1384.

మెట్టువిల్వేలుపు, వి. (మెట్టు¹ + విల్లు + వేల్పు.) శివుఁడు, గిరిధన్వుఁడు.

దండకము. అరిదివిరుదా నీవు రాయంచతేజీ వజీరుండవై చుట్టు వాల్డాల్పవై మెట్టువిల్వే ల్పవై ...
అచ్చ. రా. యు. 161.

మెత్రిలు. అ. క్రి. ప్రసరించు, తొలఁకు.

చం తొలఁకెడు తత్తరంబు వగతోఁ దొడినిగ్గు హిజారుమీఁద మెత్రిలవడి నొంటికట్టునఘటిం చినచీర సగంబు మూఁపుపై, నలవడ బోఁటి దట్టి మొదలైనవి తేఁ దిరుమంజ నంపువే. ళలు దరితప్పె నంచు నవలా భయమందుచు నిల్లు వెల్వడున్
శుక. 3. 16,

(ప్రయోగాంతరము గానరాదు.)

మెట్లగుంటక. వి. (మెట్టులు¹ + గుంటక ) ఒక విధమగు గుంటక ఒకానొక సేద్యపుఁ బనిముట్టు (శ. ర.).

మెడ వి. (త. మిడఱు.) 1. కంధరము, గ్రీవము. ఱు.

గీ త్రుంచి తోడన ముప్పదితూపు లతని, యొడల నాఁటుడు హయములమెడలు సూతు, గళము నజ్జనపతికుత్తుకయును దునిమె, ఘోర భల్ల షట్కమున్తైనఁ గుంభభవుఁడు.
భార. ద్రో 5. 59.

చం .. సిరుకోఁ, శ్రొ్ా్కకొాఁ మంచు గ్రుంకు మెడ గుంపులవంపులు దోఁవ . .
ఆము. 1 71.

సీ. మెడ యెత్తి కలయంగ మింట నరయు ..
మనుచ. 3 16. ఆం. భా. 2 141.

2 కుత్తుక గళము,

ద్వి మృడునకు నరమాంసమే కాని యొండు.
మెడకుఁ జోదయ్యేనే మే లయ్యె ననుచు.
బస. పు. 4 635 పం

సీ. ఎండెండ నపలందు వెండి మీ ల్మెనలంగ మ్రింగి
మెడ ల్పాంబు కొంగగుంపు ...
ఇందు 3 94.

మెడగట్టు = తప్పించుకొన శక్యముగాకుండునట్లు కూర్చు

శా. ఆలుఁ బిడ్డలుఁ దల్లిదండ్రులు ధనం బంచు
న్మహాబంధనం, బేలా నామెడఁ గట్టినాఁ
డవు . కాళ. ళ, 9

మెడఁజుట్టుకొను = తప్పించుకొన శక్యము గాకుండ నేమకొను

గీ ఆస లన్నియు మొదలంటఁ గోసి యున్న,
గోఁచికట్టిన కటువంటిగొడవ గడన,రాక మెడఁ
జుట్టికొనియె నూరక యకార్య, కరణ శీలుర
కెప్పాటఁ గలదె సుఖము. పాండు 5. 288.

జ మెడకాయ, మెడతెరువులు, మెడనూలు,
మెడవంపు, మెడవల.

మెడకాయ = మెడ (శ ి.)

మెడతెరువులు. వి (మెడ + తెరువులు) పికిలి పిట్టలు మున్నగువాని మెడలమీఁది చాలలు.

సీ మెడతెరువులు వల్లిపొడలు కాలీఁలు సోగ
లాగలు నిక్కు-రాగికాళ్లు ... ప్రబంధ. 130.

మెడద. వి. వనము, అడవి.

సి మెడది వాటిలుకిత్తు వెడదవా వడిఁ గ్రోలి
బెడది వాపెడు గొత్పయెడద వాఁడు ...
ప్రబంధ. 217.

మె(ణ్ణా)డనూలు. వి. ఔ. (మెడ + నూలు.) కంఠాభరణ విశేషము. (బ. మెడనూలులు, మెడనూళులు, మెడనూళ్లు.)

సీ. వ్రేలివలంబున వ్రేలెడు మెడనూళ్లు జాళువా
ముంజేతి జతులప్రాళ్లు .. రా వి. 2 44.

సీ. కమ్మల పచ్చల కడియాలబొట్లును పతకాలు
మెడనూళ్లు బాహుపురులు .. ధనా 3. 87.

లయవిభాతి చిలువ మెడనూలు పనిమలవు తాలి
చూలు మొల నలరునునువాలు మెక మెలయు
వలకేలున్ .. అచ్చ రా బాల. 216.

సీ మెఱుఁగంచు కమ్మలు మెణ్ణాలు గెలల
ముక్కర యడ్డబుడగలు కట్లసరులు ...
హంస. 4. 168., ఆం. భా. 2 148.

మెడవంపు వి (మెడ + వంపు.) గ్రీవాగ్ర భాగము, మెడ కొనభాగము

సీ మెడవంపు నాఁగను మీఱు గ్రీవాగ్ర
భాగము ... ఆం. భా 2. 142.

మెడవల వి (మెడ + వల ) జాలభేదము, ఒక విధమగు వల

కం మెడవల సన్నపువల త్రో,పుడువల డొంక వల
మిట్టముక్కిడివల దాఁ,టుడువల సింగిశమను
కువ, తెడవల కుందెవల మొదలయిన బలువల
లన్. హంస 4. 185.

మెడిదము. వి ధ్వని, చప్పుడు

గీ. గొరగొరం జనుపందుల ఘుర్ఘురంపు, మెడిద
ములఁ బుడమియు వడవడ వడంక, నెపుడు
నెడయాని చీకట్ల నివము గొనుచు, నోంటిఁ
జొం రానియట్లుగా నుండె మఱియు.
యయా 1. 116.

(శ ర. పా., బెడిదము. ముద్రి. పా.)

మెడుకు అ. క్రి త్రుళ్లు, ఎగిరిపడు

వ. ... జడియుచు నొడియుచుఁ గదలుచుఁ బొద
లుచు మిడుకుచు మెడుకుచు వ్రేయుచు
రోయుచు ... ప్రబంధ. 788.

మెడుద. వి. పులికడుగు, అభిషుతము

గీ, ... మెట్టసఁగ మెడు ద,నంగఁ బులిమెట్టనంగఁ

తెలుంగుమందు, నభిషుతాఖ్య ...
ఆం భా. 2. 250.

పులిమజ్జిగయని శ ర.)

మెఱకరి. వి. (మెఱకు + అరి³) నేర్పరి, చతురుఁడు, ('బ్రహ్మచారి' అని శ ర)

సీ మీసంద్రిచే గుజ్జుమెఱకరి గొన్న భూగగనంబు తెలంగఁ గలిగె నాకొ్క ... ఉ. హరి. 5. 26.

మెఱకు వి నేర్పు, చాతుర్యము

ద్వి. తొడిమతోఁ దొడిమ పొందుపడంగఁ జుట్టి, మిడ్రవేల్లనందుమై మెఱకుగా వైచి ....
ద్వి పరమ 4 268 పా.

జ మెఱకరి.

మెఱ(డ)త. వి ఈతబద్దలు వెదురుబద్దలు మొదలగువానితో నల్లిన యావరణము, మెల్ల.

ద్వి. మెండుగా ననులకు మెఱత గావించి ... పల్నాటివీరచరిత్ర (శ. ర.).

మెతుక = మెదుక విజ (సం. మృదు, త. మెదు) 1 మృదువైనది

ఉః మెతుకనేల

2 మందము

ఉ. మెతుకయెద్దు (శ. ర)

వి తలవెండ్రుకలయందుఁ జెమట మున్నగువానిచే నేర్పడుముటికి (వా)

మెతుకు = మెదుకు వి (త మెదుక్కు) అన్నకణము, సిక్థకము

గీ మీఁదియన్నంబులోఁ గొన్ని మెతుకు లెత్తి, ధర్మరాజాయ చిత్రగుప్తాయ యనుచు, భూమిపై సిల్పి పిదప నాపోశనంబు, గొనుట ధర్మంబు విప్రుండు గుడుచునపుడు.
విజ్ఞా. 1 68.

గీ .. మెతుకన సిక్థకమ్మన మీఁఱు ...
ఆం. భా. 2. 257.

మెత్త వి (సం. మృదుః. త మెత్తై.)

1. తల్పము, పఱుపు

గీ. కారుక్రొమ్మెఱుంగులవంటి కాంత లాయి, లింబు చేసిరి నవలతాంతములమెత్త ...
వరాహ 4 156.

చం. . నవభూరుహపల్లవరాజి మెత్తగా, ధవద సఖుండు దేవవనితాతతిచేఁ బఱపించు ముందట ...
కాళ 1 99

గీ. ... శయ్యాఖ్య చెల్లు సెజ్జ, పఱుపు తలిపము దఱబము పాన్పు మెత్త, యన
ఆం భా 2. 163.

2. గుఱ్ఱపుఁబల్లము క్రింది పఱుపు

వ. .. పట్టపట్టెడలు గడిని పల్లంబుల వలయు గెలపులం గట్టి మెత్తలార్చి కళ్లెంబులతోన తురంగంబుల మందురాగారంబులకుఁ దివియు వాహకుల పరస్పరభాషణంబులు .
వరాహ. 4. 120.

3 గుఱ్ఱపుఁబల్లము.

సీ. పసిఁడిపక్కెర జరిజాజు మెత్తయు ముత్తియంపు జొంపములు చొక్కంపుఁగెంపు .
రసిక. 1. 85 (శ. ర. పా.)

(మెత్తాము త్తియంపు ముద్రి. పా.)

4 సాగరము మోసెడియెద్దులగంతమీఁదిపఱుపు. (శ. ర.)

విజ (క. మెత్తన్న.) 1 మృదువు, సుకుమారము

(కన్నడభాషయమందు దీనికి నిగాగమము నైకలికము)

కం. చని తద్వృత్తాంతము మెత్తనిగలుకులఁ జెప్పె వింధ్రతనయునితోడన్ ..
భాగ. వి రా. 4 13

లయగ్రాహి. బిత్తరముగం దిగిని మెత్తమెదడు ల్లోన్నసి గుత్తగొనుచుండ భయవృత్తిఁ గల నొక్కెన్ .. భాగ 6 373.

వ. ...కాళ్లగట్టి విడువ నెత్తంబున మెత్తని గటిక

మేసి పోసరించి .. ఆము. 4 95.

సీ మెత్తనివిద్యలు మేలుగా నెఱిఁగించి .. దశకు 5 14.

చం. పలుచనిచెక్కులుం జిలుకపల్కులు మెత్తని మేనుదీఁగలున్ ... విక్ర. 1. 79.

2. సరసము, రసార్ద్రము.

ఉ రాతిఁ దోడువోయినది రానుతుడెందము మెత్తగాదు ... సారంగ 2 87

3 అల్పము, కొంచెము.

శా అత్యార్త ధ్వనుఁ డప్పు డాగ్రహసహావ్య గ్రాత్ముఁడై దానవున్, మొత్తెన్ మెత్తని వీఁక ఁ దీణకరాంభోజంబునన్ పాండు 5 109

క్రి. విశే ద్రరు మందముగా

మ .. కెంద మిన్నపూమొగ్గచేఁ, దను వైవంగని భర్త గుబ్బ యని మెత్త న్గోర నొత్త న్నితం, బిని సీత్కారముతోడఁ జొక్కుచును గప్పెం బైఁట నున్నిగ్గునన్. దశా. 4 21

జ మెత్తఁజేయు, మెత్తఁదనము, మెత్తఁబడు, మెత్తఁబాటు, మెత్తఁబాఱు, మెత్తకన్ను, మెత్తగిల్లు, మెత్తన

**మెత్తఁజేయు** స. క్రి (మెత్తన్ + చేయు) రసార్ద్రము గావించు.

చం పూ, విలుతున కెంతదొడ్డపని వెన్నెల బిట్టని కాయునంతలో, పలన కెరఁగి పొంగు పసి బాలురచిత్తము మెత్తఁజేయఁగన్ పాండు 5 212

వ. అని సర్వంబునకు సర్వేశ్వరుఁడు గలఁడు ప్రజల రక్షింప నేను సమర్థుఁడనే యని విరక్తుండై పలికిన వతనిచిత్తంబు మెత్తంజేయం జాలక వెచ్చనూర్చుచు నచ్చెలువ వెండియు నిట్లనియె. కుచే. 1 85

**మెత్తఁదనము.** వి. (మెత్త + తనము) మృదుత్వము, మార్దవము.

సీ. నెత్తమ్మి రేకులమెత్తఁదనము దెచ్చి యచ్చు. నఁ బెట్టినట్లుండ మొంది ... భార. విరా. 2. 52.

సీ. వనరాశిఁ దగుమెత్తఁదన మెర్గియేచు చేబల మని బాడబానలముఁ దెగడు .. కు సం. 10 526.

**మెత్తఁబడు** అ క్రి. (మెత్తన + పడు)

1. మృదువగు, బింకము విడుచు.

సీ. గోగ్రహణంబునఁగోలె నెంతయు మెత్తఁ బడ కుండుదురె వారు పద్మనాభ .. భార ఉద్యో. 3 92.

గీ. .. మహేంద్రుని ధైర్యాతిశరిన మైన. చిత్తము తెక తెక నుడికి మెత్తఁబడియె . పరమ 1 114

వ వెన్నెలపులుఁగుల మొత్తంబుల బిత్తరింపుం బములకు మెత్తంబడి .. నీలా 3 10.

2. లొంగు, వశమగు

కం. అను నప్పలుకుల కయ్యం, గన కోపము గదిరి నీచుగావున జంకిం,చినఁ గాని మెత్తఁ బడి పోఁ, దని మనమునఁ దలఁచి యిట్టు లనియెం జెలు చన్. భార. విరా. 2 54.

గీ మఱియు నెన్నియొ బిసిబిసిమాట లమరఁ, బ్రియము చెప్పియు బెదరవైచియు హితాము, వృత్తిఁ దెలిపియు నొకకొంత మెత్తఁ బడఁగఁ, జేసి కేల్పట్టి తిగిచె నాచెలువఁ గదల. ప్రభా. 5 27.

3. తగ్గు, క్షీణించు

కం. మెత్తుము గదె మన మెప్పుడుఁ ది,లోత్తమ చక్కఁదన మీశలోవరియెదుటన్, మెత్తఁ బడె దానిచెలు వని, యత్తఱి గుసగుసలఁ బోయి రచ్చర లెల్లన్. విజ. వి. 3 107.

4. రసార్ద్రమగు.

కం. అత్తఱి బిత్తరిఁ గని భూ,భృత్తనయోత్తముఁడు దత్తరిలు చిత్తమునన్, మెత్తఁబడి క్రొత్తవల పులు,హత్తఁగ నత్తెఱవ కిట్టు లనియెం బ్రేమన్. రసిక 3 76.

**మెత్తఁబాటు** వి. (√మెత్తఁబడు) 1 మృదుత్వము, మార్దవము, బింకములేమి.

గీ. పిటికితనము నేమఱుటయు నొంటవతనము, మెత్తఁబాటునఁ గార్యంబు వత్తెఱంగు, నేరమియు విషయంబులఁ గూరుటయును, గలుగు పతికి నుండదు సిరి దొలఁగి పోవు.
భార. అర. 6. 34.

మత్త వానరోత్తము లెత్తఱిన్, మెత్తఁబాటొకయింత లేక క్రమింపఁగాఁ దమ పాటు పేశెత్తి పోవక క్రోవకున్ ఫలియించు కాలము వచ్చినన్ . రామా 6 69.

వ. యాజ్ఞవల్క్యుయు ననేక ప్రకారంబులం బ్రార్థించి యతనివలన మెత్తఁబాటు గానక మున్ను తననేర్చిన వేదంబులు రుధిరరూపంబుగా ఛర్ది చేసి. వి. పు 4. 88

కం అత్తఱి నీల్గక చిక్కన, నెత్తురు ద్రావుడుల వలన నెవ్వడిఁ బాల్పన్, గుత్తుకల రక్కసుఁడు విని, మెత్తంబాటూని లోన మిగుల నడలుచున్. అచ్చ. రా. యు. 196.

2. మాంద్యము.

సీ మొన మెత్తఁబడు కల్వమొగడలు బరికించుఁ బరికించి కడుమెత్తఁబాటుఁ గాంచు ..
చంద్రా. 5 42.

**మెత్తఁబాటు.** ● క్రి. (మెత్తన + పాటు) మెత్తఁబడు

మ .. సత్త్వగరిమన్ మధ్యంబు గన్పట్టఁగా, వడిఁ బన్నుంగవ మెత్తఁబాటెఁ గరిన వ్యాపారమల్లే కదా .. చంద్రా 5. 42.

**మెత్తకన్ను.** వి. (మెత్త + కన్ను) చేనుకోసిన తరువాత నిలిచియుండు చొప్పదంటు.

మ పెసరుంగాయకు మెత్తకన్నులకునై పేఁటాడుమన్ గొట్టెలన్, మసలం జూచుచు దోసచేల్ చెఱుకుచాల్ నుగ్గాడుచున్ ..
రా. వి 2. 65.

**మెత్తగిలు(ల్లు).** అ. క్రి. (√మెత్త) మృదువగు, మెత్తనగు

కం అని యదరవైచి వన్నడిగిన వానిం జూచి మెత్తగిలంగఁ గంటిన్, నిను నెవ్వఁ డెఱుఁగు నెటు పో,యినవాఁడో నీకుమారు నెవ్వం డెఱుఁగున్. వేం. పంచ. 1 609

**మెత్తడము.** వి (√మెత్తు) మెత్తుట. ('మంటిమెత్తడము' శ. ర.)

గీ. మృత్తికాగేహములు మంటి మెత్తడముల, దృఢము లగుగతి పార్థివ దేహచయము, పార్థివములైన గోధూమ ఫలయవాఖ్య, పోష్యమాణంబులై దార్ఢ్యమునఁ జెలంగు.
వి. పు. 3. 362.

**మెత్తడి.** వి. (త. మెత్తంపారై.) ఒకజాతి చిన్న చేప (శ. ర., బ్రౌ.).

**మెత్తన.** వి. (√మెత్త. త. మెత్తణవు.) మృదుత్వము, మెత్తఁదనము.

చం మును దనసీమ చేసికొని ముల్లిడి గుద్దట వెండి చేని మెత్తనకయి వేరు వెల్లఁకియుఁ ద్రవ్వెడు కర్షకునట్లు ... ఆము 4. 219.

విశే. మృదువు

చం. . గొంతి ముద్దునే,యుకొడుకు మేను లేఁత దనయుల్లము మెత్తన యిట్టియాఁతఁ డెట్లొకొ యొరు నాశ్రయించు ...
భాం విరా. 1. 98.

కం. ఒత్తికొనుము రానీఁ జన, దెత్తినరోగముల రిఫల నింద్రియముల నుత్పత్తి సమయముల నెఱుఁక, మెత్తనగా రాదురాదు మీఁ జయుఁ ఁన్ భాగ. 10. పూ 167

క్రి. విశే. ద్ర మెల్లగా, ఒయ్యన

కం ఆమూర్తియట్టితేజం, బామహిమ నిజాంతరంగ మద్భుతభీతి, వ్యామోహితంబు సేయం,గా మెత్తనఁ గొంత సేపు కనుఁగొని యలుకన్.
హరి. పూ. 5. 146. 4. 217.

కం. అత్తఱి గంధర్వవిభుం, డత్తామరసాక్షివదన మక్కునఁ గృపతో, నొత్తి మొగ మెత్తి.

యశ్రులు, మెత్తనఁ గొనగోరఁ జాలమీటుచుఁ బలికెన్. మనుచ. 3. 137.

(దీనియామ్రేడితరూపము మెత్తమెత్తన.)

గీ. మెత్తమెత్తన నఱచేత నొత్తుకొనుచు ... హర. 2. 95

గీ. జెద రుడిపి వ్రీడజాడ్యంబు వదలఁ జేసి, కాంత నొగి మెత్తమెత్తనఁ గౌఁగిలించె .. ప్రభా. 5. 44

వ. అప్పురిటిపట్టి నల్లనల్లన పట్టుకొని పోయి మాలినీనది సైకతంబున నేకతంబునఁ బద్మపత్రంబులు పొత్తులుగా నమర్చి మెత్తమెత్తన నునిచి దివంబున కరిగె. పి. శకుం. 2. 146.

మెత్తినగోడ. వి. (మెత్తిన + గోడ.) లోపల నెముక లుంచిపెట్టినగోడ (శ. ర.)

మెత్తు. స. క్రి. (క. త. మెత్తు. మ. మెత్తుగ) దట్టముగఁ బూయు, లేపనము చేయు.

సీ. బండికంబెన చాయలైన సీ మాలిన మేన మెదడు గందపుఁ బూసి మెత్తినాఁడు ... మనుచ. 4. 73.

సీ కరముల మెత్తిన కర్పూరరేణువుల్ కస్తూరి కాగురుకణము లయ్యె .. విక్ర 1 139.

సీ నెత్తిఁ దంగేడాకు మెత్తి రేచకి నిమ్మపంటి పుల్సున నూటి పట్టు వెట్టి . కాల. 3 110.

(ఇటఁ గట్టి యని భావము )

ఉ చారువటీరపంకమునఁ జాలఁగఁ బన్నీరు పోసి మంచికస్తూరిని మేలవించి తమ చొక్కపు మేనుల మెత్తుకొన్న నొ,య్యారపుబాగు మించెఁ గుసుమాయుధుఁ డుగ్వి సువర్ణ కారుఁడై, మీఱదువన్నెకై పటిక మెత్తిన హేమశలాకలో యనన్ చిత్ర. భా 3 18.

వి 1 పూఁత, మన్ను లోనగువానితో దట్టముగాఁ బూసినపూఁత

సీ. మూసి ముల్లుడఁచి గుమ్మెలకొల్చు పైమెత్తు లూడ్వఁడు వస్త్రైన మండుఁ గాని ... పాండు. 4. 149.

సీ తండుల మాషముద్గముల గాదెల నించి మీఁద బిళ్లలమర్చి మెత్తువెట్టు .. శుక. 3 348.

2 ప్రాపు, ఆశ్రయము

గీ. ఎడమ చేతను తాతాళ మణఁగఁ బట్టి, మీఁద దక్షిణహస్తంబు మెత్తుఁ జేసి, ధరణి యుబ్బాఁత లూఁచె నాదైత్య విభుఁడు, కల్ప విసరంబువేళ దిగ్గజమువోలె. శేష 4. 95,

జ మెత్తడము, మెత్తినగోడ, మెత్తుకొను.

మెత్తుకొను. స. క్రి (మెత్తు + కొను, స్వార్థమున.) దట్టముగాఁ బూసికొను

ఉ చంట విషంబు మెత్తుకొని చంపుదు నర్భకు వంచు వచ్చి ము, వ్వంటులనాఁడు, పూతన యవారణ నెత్తికొనంగఁ జన్నుఁబా,ల్గొంటయుఁ బ్రాణముల్ దిగిచికోలును ... హరి 4. ఉ. 233. చిత్రభా. 3. 21.

మెదడు. వి (సం మేదః, క. మెదడు) మస్తిష్కము, తలయందుండుక్రొవ్వు.

గీ .. ప్రథనభూమి, మెదడుప్రోవులమయ మయ్యె మిక్కుటముగ ... హరి. ఉ 10 55.

చం కలచినపీనుఁగు న్వెడఁదకప్పెరయు న్నొల్లఁ బచ్చితోలులున్, బుఱియలపేరులున్ మెదడు పూఁతకు ఝుమ్మని మూఁగునీఁగలున్ ... ఉ హరి. 2 126.

సీ మస్తిష్కనామంబు మను మెదడం చన ... ఆం భా 2. 133.

సీ. ఎలనీటిబొండలంబులువోలె మెదడెల్ల జుఱ్ఱి వైచిన డొల్లుపుఱ్ఱెగములు ... ఆము. 6 17, భార. భీష్మ 2. 71.

జ. మెదడువట్టు.

మెదడువట్టు. అ. క్రి. (మెదడు + పట్టు) క్రొవ్వుపట్టు, మస్తిష్క పూరితమగు.

ఉ తొట్టినరోషవిస్ఫురణతో ధరణిం గల పక్కణ

స్థలుల్, బట్టబయల్లుగా మెదడు వట్టినపాండు కపాలఖండముల్, గట్టిన వెండి నాళములకై వసి నటుట ఖురాంచలంబులన్, మట్టి నిషాద మస్తములు మాఱ మణీరమణుండు కల్కియై.
వరాహా. 8 75

**మెదపు.** స. క్రి. √ మెదలు.) కదల్చు, చలింపఁజేయు.

సీ. ఎవడింకి మని మొంది గడ నంది రొదఁ జెంది బొడనంది పెదపంది మెదవు నొక్కఁడు
చంద్రా 2 58

వ్య. వాఁడు సభలో నోరు మెదపలేఁడు

**మెదలాడు** అ. క్రి. (మెదలు + ఆడు. స్వార్థమున.) మెదలు, సంచరించు.

సీ. చెలఁగె దిక్తటులఁ గోయిలరావముల సౌరు మెదలాడె గండుతుమ్మెదలబారు ..
కృష్ణ. 4 42.

**మెదలించు.** స. క్రి. (√ మెదలు.) కదల్చు, మెదలఁజేయు.

కం. వదనము విదుర్చుకొను చది తుదినాలుక యెత్తుచేతఁ దూపొడుచుక్రియన్, కదలించు చౌడ లొరగన్, మెదలించున్ దగ్గు మ్రొగ్గు మేదినిఁ బొరలున్ .. ద్వి. 1. 271.

చం. .. అతిసాధు మునీంద్రుఁడువోలె వేత్రముల్, తెలవక బాకినోరు మెదలింపక జైనుక పట్టినంచు .. భాగ. 9. 207

చం. వగపులకుం బ్రసాదవచనం బొక టాడఁడు మ్రోల నిల్చినన్, మొగ మటుపెట్టుఁ గేల్మోగిచి మ్రొక్కినఁ జే మెదలింపఁడు ...
వేం. పంచ. 1. 434

**మెదలిక.** వి. (√ మెదలు.) మెదలుట. (శ. ర.)

**మెదలు.** అ. క్రి. 1. కొంచెము కదలు, కదలు

ఆ. ఎత్తికొని చనగ ని మ్మగునట్లుగా, మెదలు చున్నవ్రయ్య లదిమి రెంటి ...
భార. సభా. 1. 147.

సీ. తలలపెండలములో మిలమిల మెదలెడుకర పదంబుల నవఖండములును ...
భార. ద్రో. 1. 386.

గీ. మీనశృంగంబునను నావ మెదలకుండ గట్టిగాఁ గట్టివైచి యుత్కంఠ మెఱయ ...
దశా. 1. 208.

ఉ. గాడ్పుదా, నీఁ దన వచ్చునే మెదలనీ దనలాకృతి వేఁడి సూపుచున్ ..
సారంగ. 2. 125.

2. సంచరించు, తిరుగు.

చం. ఇది కడుఘోర మైనవన మిక్కడ నక్కడఁ దాపసోత్తముల్. మెదలరు దుష్టరాక్షసన సమీపము గావున .... భా. శా. ఆర. 1. 40.

మ. అదెవక్తంచరు లిందు నందును మహోగ్రాకారులై క్రందుగా, మెదలం జొచ్చిరి ..
భార. ఆర. 7. 254.

సీ. సంచారమా చెంత నించుకంతయు లేమిఁ జెదలుఁ బ్రుట్టులు నేల మెదలఁ దొడఁగె ...
వాల్మీ 3 140.

3. వీచు.

రగడ. మెదలె మలయాచలసమీరములు సారములు . రాఘవ. 2 6.

4. వర్తించు, ఉండు.

చం. అదియును గాక పూర్వకృత మైనయఘంబులు వ్యాధిరూప మై, పొటివినఁ దాను గైకొనక పోవునె చచ్చినఁ గర్మశేష మై, వదలక క్రమ్మఱం దగిలి వచ్చుట సిద్ధము పాపయుక్తిమై, మెదలినఁ గీడు తప్పఁ దుదిమే లొదవున్ విను నిక్కమింతయున్.
భోజరా. 1. 106.

ద్వి. మసలి పల్లెలఁ జొచ్చి మనుజులఁ బట్టి, మెసఁగఁ జొచ్చిన నిండ్ల మెదలంగ వెఱచి, వెసఁ గాపురంబులు విడిచి వచ్చితిమి ...
ద్వి. హరిశ్చ. పూ. 522 పం

జ. మెదవు, మెదలాడు, మెదలించు, మెదలిక, మెదలుచు

**మెదలుచే(ల్చు)** స క్రి. (√ మెదలు) మెదలించు, కదలుచు

కం. వాయుతనూజుం, బిడికిటఁ బొడిచిన గ్రుద్దులు, మిడుకఁ గెడసి కాలు చెయ్యి మెదలుపకున్నన్. జై భా 8 26

ఉ వీరలు గంగలోఁ బులినవేదులమీఁద బృసీ నివిష్టులై, వోరు వృథా మెదల్చుచుఁ గనుంగవ మోడ్పడ నక్షమాలికల్, సారెకుఁ ద్రిప్పుచున్ ప్రబోధ 2 8

**మెది(యి)ంచే = మెదుచే** స క్రి (√ మెదుగు) మెదించు, కలియఁగలపు

సీ విరిదేవెలోనఁ గప్పురము వోసి మెదించి తడయ కొక్కుమ్మడిఁ ద్రావుదావ. రసిక. 4 85.

గీ కూర్మి జిల్లేడుదూదిని గోళఫలరసమునను మెదియించి వత్తిగాఁ జక్కఁ జేసి, కుసుమనూనెను గిండిబు పోసఁగఁ బెట్టి, చూపలోనాదు రెటువంటి సుదతులైన హంస 5 130.

సీ మేనఁ బొక్కులు పొక్క మెదియించి సున్నంబు మెత్తఁ జెల్లునె మీకు మెలఁతలార ... నీలా. 3. 34.

**మెదుక = మెతుప** విశే. (సం. మృదుః, త మెదు) మందుఁడు

సీ మెచ్చు మన్నించెనా మెదుకపాలసుఁడైన దొంతనంబున నిల్పి పరిభవించు పాండు. 1 74, 5. 63

వి. తలవెంట్రుకబయంపుఁ జెమట మున్నగువానిచే నే ఏడుములికి, పింక ..

సీ. పాలు పేది మెదుకకంపును నీనుసిగయును బల్లి మీసములును బిల్లికనులు ... హరిశ్చ. 4. 103

ద్వి. మెదుక పట్టినతల మెడ గండమాల, నుదుటి మీఁదటినుడి నుబిగొన్న బొమలు .. ద్వి హరిశ్చ ఉ. 1081 పం.

జ. మెదుకగొను.

**మెదుకగొను.** అ క్రి. (మెదుక + కొను) చెమట మున్నగువానిచే జిడ్డుపట్టు.

వ ... ముదుక వెన్నలంటికొనుట మెదుకగొని మొదుకనయి పిడచినం బోల పలచుచుండు తలలును. హరి పూ 5 142.

**మెదుకు** వి మెతుకు (వా శ ర)

**మెదుగు.** అ క్రి 1 నలఁగు

గీ కాంచి యీగాని యగుఁ దురంగములు నీరు ద్రావునది గాక యున్న నుదయ్యత్ఖురప్రకాండ ముద్రిలచేత సంకలిత మగుచు, మృదురజోరాజి మెదుగ నేరదు పథంబు జై భా 2. 8.

కం ఇది మార్గ మిందుఁ జన నున్నది నలుందట నర్థయోజనంబునఁ జాలన్, మెదిగినతెరువం దరుగుము, మదిమెదవ నిరంతరాయముగ శీఘ్రమునన్ .... శ్రీరం 3. 518.

2. ధాన్యము పొట్టుపోవునట్లు నలఁగు.

(వ్యవ) వడ్లు బాగుగ దంచినఁ గాని మెదుగవు.

3 బలహీనుఁడగు

కం పచ్చినయమ్మునఁ గనూలిక, పుచ్చినఁ గోపించుఁ గాని .. పోవిడువఁడు దానిచ్చెద ననినను గన్యలు, మెచ్చరు వార్ధకముచేత మెదిగిన వానిన్. వి. పు 5. 137.

జ మెదించు, మెదుగుడు, మెదుచు, మెదుపు

**మెదుగుడు** వి (√ మెదుగు) మెత్తనిగుడ్డ ('పాఁతగుడ్డ' అని శ. ర.)

సీ జలకమార్చు నఖంపచస్వచ్ఛజలములఁ దడి యొత్తుఁ గడు మెదుగుడులఁ బొదివి .. పాండు. 2. 19.

**మెదుచే.** స. క్రి. (మెదుగు) 1. నలఁగఁ

గొట్టు.

ఉ॥ కాదేని సప్తసాగరములు గలఁచి, మేదినీ ధరముల మెదిచి నుగ్గాడి, యీరసంబున దిగ్గజేంద్రకుంభములు. దాటించి మేదినీతనయ సాధింతు

రం రా. అర 168 పొ. 17 పం.

2 మేదించు, మర్దించు

సీ తేటి ముట్టనిపువ్వుఁదేనియఁబువ్వాడి మెదిచి పాదంబుల మెత్తి మెత్తి. విక్ర 4 162.

గీ. ... అడవిపసవులు మెదిచి పై నలఁదుతలిసి, కన్నియలపిండు లెంతయుఁ గలుగుదాని ...

యయా 2. 48.

సీ. మదను మైపూఁతకు మెదిచినకస్తూరితో నొవ్వు క్రొవంపుసాన యనఁగ ... పరమ. 3. 281.

3. కాటుక మొదలగువాని నొకచేతిత్రేవేలిపైనుంచి వేఱొకవ్రేలితో రాచు ...

గీ చీర చేతితోఁ గాటుక చిక్కమెదిచి ...

కు. సం. 8. 99.

మెదుపు. స క్రి (√ మెదుగు.) 1. నలఁగఁ గొట్టు.

కం. వేగ నరేంద్రుఁడు రాకే, కాగా యిటు చనఁగ వాఁడిపలుమొనసోఁకన్, భోగంబుల నిను మెదుపదె, భోగిని రైనపుడు చేరఁ బోరాదునుమీ సారంగ. 2. 27.

2. మేదించు, మర్దించు, కలయఁగలుపు.

గీ. ... నీరజాప్తు, సానఁబట్టినరాపొడి చల్లి మెదిపి ... మనుచ. 2. 36.

గీ. ... రాలినట్టి, పొడుము నూతనఘటముతో నిడి ప్రభాత, సమయమునఁ బ్రత్యహంబు నాళ్యమున మెదిపి, వేసరక చిన్న మెత్తు సేవించునరుని, నాలుకను గాపురంబుండు నలువ చెలువ. అప్ప 2. 481.

మెదుపు. విశ. (సం. మృదుః, త. మెదు.) మెత్తనిది.

వ .. ఇసుకమెదువు నెలవులం బన్నినపసవు టాకుంజప్పరంబులలోనం గుప్పళించిన కప్పురంబుతోడి కురువేరు పరిమళంబులును ...

పాండు. 4. 16.

2. మందము (శ. ర.).

మెనుపు. స. క్రి. (కవ్వముతో) ఎనుచు, కలియఁ జేయు (శ. ర.).

మెప్పించు = మెచ్చించు స క్రి. (√ మెచ్చు¹)

1. మెచ్చునట్లుచేయు, శ్లాఘింపఁజేయు.

గీ. ..., వంత మలరంగ నిన్ను మెప్పింతుఁగాన ..

పారి. 1. 181.

సీ మఱియు రసమంజరీముఖ్యమధురకావ్యరచన మెప్పించికొంటి గీర్వాణభాష,ను ...

ఆము. 1. 13

గీ. ... అగజ నీవు, నింత మెప్పించుకొంటి నీకెవ్వరీడు ... ప్రభా. 1. 132.

2. రంజించు, సంతోషపెట్టు.

సీ. ఏరాజునకుఁ జెల్లు నింద్రుని మెప్పించి నవరత్నసింహాసనంబు వడయ, .. విక్ర. 4 44.

సీ. ... భ్రమరికావళుల నర్తనగతులను, ...

గీ. నాడి మెప్పించు నెట్టిచోద్యంబొ తరుణి, ...

కాశీ. 6 169

మెప్పు¹. అ. క్రి. ఎగురు, దుముకు,

సీ. ఒకపరి యానంద ముప్పొంగఁ జెలరేఁగి మెప్పుచు వెన్నెలకుప్ప లాడు . .

ఇందు. 2 148.

మెప్పు² వి. (√ మెచ్చు¹) 1. శ్లాఘ, పొగడ్త

కం. తలఁకక మెలఁగెడి మెకములు, నలుఁగుల పాల్వేసి మృగయు లౌ నని పొంగెన్, బలుఁగుఱ వేఁటలు గని మెప్పులు గులుకఁగ మరలుఁ డనుచు బోయలు దెలుపన్ ..

ఉ రా. 7. 93.

2. సంతోషము.

ఉ అచ్చటి రత్నమందిరము లాస్మకు మెప్పొనఁ

గూర్చునే కిదా .. ఉ రా 2. 251.

3 వరము

సీ. నీ వొసంగెద నన్న నెఱమెప్పు లివ్వుడు మఱి చినాఁడవు లోన నెఱుక మాలి ..

అచ్చ. రా అయో. 31.

విశే. శ్లాఘాపాత్రము, మెచ్చఁదగినది.

ఉ. ... అ. యొయ్యప్పులకుప్ప మెప్పుగుతుళోదయ వైభవలీల ఁంజిలన్ . ఇందు. ౭. 98.

మెయి[1] = మయి[1], మై[1]. వి. (క త మెయ్)

1. దేహము, ఒడలు.

గీ మేను నెమ్మేను మై మయి మే మెయి యొడ, లన శరీరంబు దగు .. ఆం. భా. 2. 134.

సీ. అతఁడు పంద్రెండు వాలమ్ము లావీభత్సు మెయిఁగ్రుచ్చి ... భాం. శల్య 1. 122.

కం. కాంచనపాంచాలికవలె, మించిన యశోకాంచ నాంగి మెయిజిగి పలు వ్యాపించం గాంచిన తరువులు, కాంచనతరువుల తెఱంగుఁ గైకొన నవటన్ ... ఉ రా 2 125.

సీ ఘనసాంద్ర కాశ్మీర గంధసారోదార మృగమద పంకంబు మెయిఁ దనర్పు . విక్ర 1. 6.

2. పార్శ్వము, ప్రక్క.

వ. . . నిష్ఠురాఘాతంబుగాఁ దెనంగుసైన్యద్వీతి యం... మందరమథితాంబుధిచందం బగుట కుం..గి యుచ్చిపోయెడు శరంబులు సిరు మెయిఁ గెలిచిన కుంతురకాదులను ...

భాగ భీష్మ. 1. 267.

ఉ .. శిష్యులం క్తి య.తాన్యాదిలీల నిర్మెయిల యుండుఁ దనుం గొలువన్ మహోన్నతిన్ ...

విక్ర 6. 5

3 వెంబడ

కం ఏకరసమయ క్షేత్ర మ, నేకౌషధిరసమయంబయి నయట్ల సుమీ. యేకవిధ మైనబుద్ధియ, నేకము లగుకర్మముల మెయిం బోకన్నపా ..

భార. శాం. 4. 195.

శ్లో. యథా హ్యేకరసా భూమిరోషధ్యర్థానుసారిణీ, తథా కర్మగతా బుద్ధిరంతరాత్మానుదర్శినీ .. సం. భార. శాం 204. 17.

గీ. మేఁతకై పోవుకడువుల మెయి వడిన క.శీ.ద కన్యాతటంబుల నిందునందు, నాడుచును వాడు మనువల్ల వాన్వితముగ, నరిగె బలదేవుఁడును తోన యరుగుదేర .. హరి పూ 7 8.

4. విధము, రీతి

కం. మనలోన నెవ్వఁ డెమ్మెయి, పనివెంటను విరటు మనము పడయుదము . .

భార. విరా 1. 65.

సీ. హిమరుచి కీమెయి యొందుండి వచ్చె నితాంత సుధాపూర్ణకాంతి దనర ... కు సం ౬. 600.

గీ తంద్రెపిమ్మట నివి యేమితగిన భంగిఁ, బంచు కొన నేర కిమ్మెయిఁ బ్రతిదినంబుఁ, బోరు చున్నారము ... విక్ర 2 8, నైష 1 45.

జ. మెయికొను, మెయికోలు, మెయితాలువు, మెయిపాలు, మెయిమఱపు, మెయిమఱువు, మెయివడి, మెయివెట్టు, మెయిసిరి

మెయి[2] = మయి[2] మై[2], ప్ర. ప్రధ. 1 కొన్ని యెడలఁ దృతీయావిభక్తియందు వచ్చును

చం. . . సంజయుం, బనిచె మహారణంబు పంపాటి మెయిన్ సకలంబుఁ జెప్పఁగన్

భాం. భీష్మ. 1. 7.

ఉ. పలు దురంత వేదన మెయిన్ బొరలాడెదు తాల్మి దక్కి మే.లే లలితాంగి ..

మనుచ 3. 64.

ద్వి. మేఘవాహను డొంటిమెయి సూడఁ జూచి, మేఘనాదుఁడు మాయ మిగులఁ గావించె ...

రం రా ఉ 79 పా 7 పం.

కు సం. 4. 441.

2. కొన్ని యెడల సప్తమీవిభక్తియందు వచ్చును.

చం. ... అప్పని మెయి నగ్నిచేత నగుఁబా టగు నన్వెఱతో భవద్దయా, వనవిధి నాశ్రయించు

౨. పొందు.

సం. వేలుగఁ గనినం బ్రకృతికిఁ, జూఱవిడిచినట్ల తనదుసుజ్ఞానము నస్కాఖ విడిచి తన కంటెను, మీఱ నొకటి లేమిగాన్పు మెయికోఁ వలయున్. భార. అను. 4 202

('అంగీకరించు' అని శ. ర.)

**మెయికోలు** = మయికోలు, మేకోలు, మైకోలు వి. (√ మెయికొను)

(పూనిక, ఉద్యమము.)

కం. తమతమదేశంబులకై, మిముఁ గొని పాండవుల గెలుచు మెయికోలువ భూ, రమణులు గొందఱు వచ్చిరి. భార. భీష్మ 1. 31

**మెయితాలుపు.** వి (మెయి[1] + తాలుపు) శరీరధారి, ప్రాణి.

రగడ. తవిలి యెన్నఁడు నేని నిమ్మెయితాలుపు లకును గీడు సేయక ...

అచ్చ రా. యు. 64

**మెయిపాలు.** వి. బొ (మెయి[1] + పాలు) సమభాగము.

(బ. మెయిపాలులు, మెయిపాళ్లు.)

కం. పెక్కండ్రు పూఁటవారలు, తక్కొని మెయి పాళ్ల వరువఁ దగు నొకచాయం, జెక్కండ్రు పూఁటయగుచో, నొక్కనిచే నైన నర్థ మొడయండు గొనున్ విజ్ఞా. 3. 86

శ్లో. బహవః స్యుర్యదిస్వాంశైర్దద్యుః ప్రతిభువో ధనమ్, ఏకచ్ఛాయాశ్రితేష్వేషు ధనికస్య యథారుచి. సం. విజ్ఞా. వ్య. (శ. ర.).

గీ. పెండ్లిచేసిన నిల్చెడి పేద లైన, కూఁతుఱకుఁ దల్లిధనమైనఁ గొనుట యుచిత, మందఱును నొక్కతంగివా రగుదురేనిఁ, దారుమెయిపాలు గొనుటయ ధర్మ మెందు ... విజ్ఞా 3 127.

**మెయిమఱపు** = మయిమఱపు, మైమఱపు వి. (మెయి[1] + మఱపు) పారవశ్యము, ఒడలెఱుంగమి (శ. ర.).

**మెయిమఱువు** = మయిమఱువు, మేమఱుగు. మైమఱువు. వి (మెయి[1] + మఱువు) కవచము. (శ ర).

**మెయిమెయి.** మయిమయి, మైమై. క్రి. విశే. ద్రు. 1 అనాయాసముగా.

ఆ. మెయిమెయిం బెరంగి మెప్పించి ముక్కంటి. చే వరంబు గొని విశిష్టదివ్య, కార్ముదీప్తుఁ డైన గాండీవి నోరఁ డాజిఁ, జెనయఁ జాలుకునికి సెప్ప నేల. భార. ద్రో. 1. 45

గీ మతరహస్యంబు చెప్పక మగుపచంద, మెల్ల నేర్పడ మెయిమెయి నెఱిఁగి రమ్మ...

దశకు. 6. 167.

2. నిరుపద్రవముగా

కం. ఏ నపుడు ధర్మపాశా, దీనుఁడ నై కోపమునకు దీకొనరింపంగా నేరకున్న మెయి మ్మెయిఁ, బో నయ్యెంగాక యింకఁ బొమ్మా యిచటన్ ... భార విరా. 5. 91.

కం నాకన్నుల యెదురం బడి, యేక్రియ మెయి మెయిన బ్రదికి యేఁగెదు నింకన్ ...

భా. రా. యు. 1558.

వ అమ్మొనసలి .. యక్కుమారు నుక్కుఁదండ సంబులుపోలెఁ దనరెండుకోఱలం బిట్టూఁది కఱవక మెయిమెయిం గబళించి కనుగంద కుండ జలాధిదేవతాసమీపంబునకుం దెచ్చుటయు .. కాశీ. 4 68.

**మెయివడి** = మయివడి, మైవడి వి. (√మెయి[1]) 1. సమ్మతి, ఒప్పుదల.

గీ పలుకు లేర్పడ విని మెత్తబడినయట్లు, సుభగ మెయివడి చూపుగాఁ జూచి తనదు, హృదయ మెఱిఁగించుతెఱఁగున నిట్టు లనియె ...

భార. విరా. 2. 259.

2. విధము.

సీ. భావించి నీముద్దుఁబలుకుల మెయివడి బలపడఁ గఱచురాచిలుక లివియు ...

కు సం 6 687.

ఆ కయ్యమునకు వలదు కాల్దివ్వ నధిప సా, మమున భేదమునను మార్తు మనము, మైత్రి జేసి చెఱుచు మెయివడిఁ దప్పించు,కొనుటెఱం గెఱింగికొనుట మేలు ..

భార. శాం. 2. 282.

3 సామ్యత

మ. ... ధర్మనందనుం డతనియుద్ధతికిం బుయి లోఁడి మెయివడి గలనడవడిం బ్రవర్తిల్లు చుండియు జూదంబువెంట మోసపోయి తొడరి చిక్కునం బడియె ... భార. ఉద్యో. 1. 22.

**మెయివెట్టు.** అ. క్రి. (మెయి$^{1}$+ పెట్టు) మేను పెంచు, పుష్టిఁబెందు.

గీ. హర్షమందస్మితముతోడ నమ్మురారి, యపుడ హయముల మెయివెట్టునట్లు సేసి, తఱిమి నీళులఁ బ్రావించి తడవి మగుడఁ, దెచ్చె . .

భార. ద్రో. 3. 163.

**మెయిసిరి.** వి. (మెయి$^{1}$ + సిరి) నాట్యగతి భేదము.

కం. లయకోపు దృష్టియును వళి,నయ ముడుటు దురమ్ము మోడి నయ మున్నతిరే, కయును బ్రమాణము వారువున్, మెయిసిరి యవఘంకము మురువు మెలఁకువ యమరున్. ప్రబంధ. ..

**మె(యిదు)ద్దు.** అ. క్రి. పటవశమగు.

శా. సాహాచారవిచారదక్షులు . అట్లె నిన్ను నెనయన్ భావించి దుర్వాసన, సారాం భోసధ నీఁది మెద్దు సుమహాసౌఖ్యాత్ములై మర్త్యులా, భారాధేయవిముక్తి యుక్తు లగు దుర్ దారిద్ర్యవిద్రావణా ..

కు. సం. 10. 46

**మెర.** వి. 1. సంశయము.

చం. వెఱ మెర లేనియట్టి బలువీరుఁడు కృష్ణ కుమారుఁడొక్కచేఁ, జఱచి ...

భాగ. 10. పూ. 662.

2. విధము.

కం. రోమలతారాహు వదన, యామవతినేతఁ బోదువు దమచను లాఁగాఁ, గామాహితుఁ డికుంటెడు, నామెర వెలఁదికిని ద్రివళు లతి శయ మయ్యెన్ ... ప్రబంధ. 295

**మెరక.** విశే. మెట్ట. (వి. మెట్టనేల. శ. ర.)

గీ. మెట్ట మెరక యనంగను మెఱయుచుండు, స్థలికి సంజ్ఞలు ... ఆం. భా. 2. 5.

**మెరకు** స. క్రి. త్రిప్పు.

ద్వి. దండియై యామ్యహస్తంబున గోరు, గొండి వల్పటికంటికొల్కిలో మునిచి, యల్లనఁ గంటి గ్రుడ్డనియక యుండ, మెల్లనఁజుట్టును మెరకి పెకల్చి. పండితా. మహి. 251 పు

**మెరమెర$^{1}$.** వి. 1. వ్యథ, దుఃఖము

సీ. అమ్మహాత్ముని హృదయమునకు మెర మెర పుట్టింప నేటికిఁ బోయి కాంచి ...

భార. మౌ. 157.

కఁ. మురముర దివిజుల హృదయము, మెరమెం యిదె యడఁగు ననుచు మెఱసెన్ హరి యున్ ... భాగ. 10 ఉ. 161.

చం. మెర మెర యేల నీకు హరిమిత్ర సుతుండు .. మిత్రుఁ డుత్తమ, స్థిరమతిఁ బొల్చు నొక్క .. ... పద్మ. ..

2 సంశయము: సంభావన.

కం. అరివధము పాప మని మది, మెర మెర గల నను దగిన మెయిఁజేయుము భూపా ప్రయ శ్చిత్తము .. భార. శాం. 1. 260.

భార. అశ్వ. 4. 171.

3. భేదము.

కం పురుషుఁడన వేఱొకండే, పురుషోత్తముఁడైన యేన పురుషోత్తముశా, స్ఫురణకుఁ బు షత్వం బును, మెర మెర గల దదియకాదె మెయి కొనుఁ గ్రియకున్. భార. భీష్మ. 1. 199

4. మాలిన్యము.

ద్వి. పరమ మాహేశ్వర పట్టభద్రుండు, మృడుని భక్తులలోని మెర మెర వోవఁ, గడిగి నిర్మల

ములు గావించుకతన ...

ప్రభు. 2. 60 పొ. 22. పం.

చూ. క్రౌర్యము.

సీ. మీనాక్షిపై నింత మెరమెర సేతువే చేరి మీనాంక రక్షింతుగాక ... తపతీ. 4. 26.

జ. మెరమెరపడు, మెరమెరపాటు, మెరమెర లాడు.

మెరమెర[2]. వి. తళతళ మనుకాంతి.

రగడ. మెరమెరని కొలనిదరి మీ లంచు లకు ముకులు, మరగె నీకనుదోయి మాయింపు చక చకలు ... మనుచ. 3. 84.

మెరమెరపడు. అ. క్రి. (మెరమెర[1] + పడు) సంశయపడు.

వ. అని చిత్తమోహంబు దిరస్కరించుచు నిజాశ్ర మంబునకు వచ్చి తనమనంబున మెరమెర పడుచుండును ... వా. రా. 4. 110.

మెరమెరపాటు. వి. (√ మెరమెరపడు) సంశయ పడుట, మెరమెరపడుట.

ద్వి. నరకుపేయుదునె యీ సామ్రాజ్యపదవి, మెర మెరపాటేల మీకుం జిత్తముల ....

ద్వి. హరిశ్చ. పూ. 1515 పం.

మెరమెరలాడు. అ. క్రి. (మెరమెర[1]) వ్యథ నొందు, బాధపడు.

వ్యవ. ఎదుటివాని సంపద చూచిన మనస్సు మెర మెరలాడును, కన్ను మెర మెరలాడు చున్నది.

మెర్వు = మెర్గు, మెఱుంగు, (చూ. మెర్వుడు పుర్వు.)

జ. మెర్వుడుంబుర్వు.

మెర్వు(ఱువు)డుంబుర్వు. వి. (√ మెర్వు.) మెఱుంగుడుంబురుగు, ఖద్యోతము.

సీ. కమలబాంధవునితోఁగదలు మెర్వుడుంబుర్వు దేవతాకుజముతోఁ దెల్లదుమ్మి ...

గీ. సాటిరానట్టిపగిది ... చెన్న. 5. 71.

మెఱచే = మెఱయు. అ. క్రి. తళుక్కునం ప్రకాశించు.

సీ. ఘనతటిల్లతలయ ట్లెనిమిది దంష్ట్రలు మెఱ వంగ బందులు గొంటికి పెలుచ ...

భార. ఆది. 6. 201.

గీ. పలకయును వాలునుం గొని యలఘువవము, మెఱయ నేలకు లంఘించి మెఱుంగుమెఱచి, నట్లు నని . భార. ద్రో. 4. 101.

గీ. చిలుకమావులు గట్టిన చిగురుతేరి, పసిండిబలు మీనుపడగ యెద్దెసలమెఱవఁ, జెఱకు విల్లు పూవమ్ము లేర్పాటు ధరించి, గట్టి బిగిసి యే తెంచె నక్రోడిమిమగండు .

హరి. ఉ. 6. 58., భీమ. 6. 2. 9

జ. మెఱపు, మెఱపుందీఁగ.

మెఱపు. వి. (√మెఱచే. క. మెరహు.)

1. విద్యుత్తు, మించు.

సీ. మదచకోరమరాళమండలి చెలరేఁగఁ బఱచు చేడియ లను మెఱపు లడఁగ ..

పారి. 2. 49.

సీ. ఒఱపులేఁ బొలుకారుమెఱపుచేవ నదల్పఁ గల కంఠి కంటిచూపులబెడంగు ...

పరమ. 3. 125.

2. ప్రకాశము, తళుకు.

సీ. జింకతాలుపరియు జింకతాలుపరియు మఱుం దియు ననుంగునై మెఱపుం బూత.

అచ్చ. రా. బాల. 8.

ద్వి. నెఱప్పైన కవిత వర్ణింప నం దెనంగు, మెఱ పుల చందాన మెఱపులు బొదవె.

ఆ. మ. క. 2. 72 పొ. 2 పం

మెఱపుందీఁగ వి. (మెఱపు+తీఁగ) తీఁగవలె నో యైన మెఱపు (శ. ర.).

2. జ్యోతిష్మతీలత (శ. ర.).

మెఱ(ద)ము. అ. క్రి. 1. (నాంటినళల్యాదికము) ఇటునటు మెదలు.

వ. నెఱఁకులమెఱుఁగుటమ్ములు మెఱమిన తెఱంగున నతని చరిత్రస్మరణంబులు చిత్తోత్కంపంబు నొనరింప ... నృ.సిం. 5. 4.

సీ. మొనసి మేనులు చుఱుక్కని పొక్కఁగాఁ దూరి మెఱముచు విసరు తెమ్మెరకుఁదోడు. యయా. 5. 81.

చం. . జ్యాజను లాడెడిమూడ ఉమ్మలై యురు వడిగుండెలో మెఱముచున్నవి సోదరులార యిట్యోడవ్ .. ఉ. రా. 6 211, ఆము ?. 40

2. చెలరేఁగు, విజృంభించు.

గీ. హరిహరబ్రహ్మగాఢ మానాపహారి, త్రిభువనానుద్వేహారి పరితకుండు, కమ్మవిలుకాఁడు మెఱమశృంగారవనము, లోనిగురివెందపొద క్రిందదాని మనిచి. విక్ర. 8. 57.

స. క్రి. 1. మెదలు, కదలు.

శా. కంఠోపాంతము దాడలున్ మెఱముచుం గాలాగ్నిచండంబునన్, గుంఠీభూతుఁడుగాక. భాగ. 10. పూ. 449.

మ. గవిలో బెబ్బులి డాఁగి గ్రుడ్లు మెఱమంగాఁ గాంచి రా జేసె మనుచ. 4. 46.

2. ఇటునటుఁ ద్రిప్పు, (కత్తితోఁ బొడిచి, ఇటు నటుఁ ద్రిప్పు.

సీ. ఈటిమెన సంధించి మెఱమినక్రియ, నవద్రుమకోటు లున్మూలితములు గాఁగ .. భోజరా 7. 44

ద్వి. మెఱుఁగుఁగైదపుఁగ్రుచ్చి మెఱమినట్లుండ, మలికి భూపాలుఁ డాయుగ్మలిఁ జూచి .. ద్వి. హరిశ్చ. ఉ. 2౧౫ పం.

వ. చక్రంబులఁ ద్రుంచుచు సబళంబుల నొంచుచు నురయల మెఱముచు శూలంబులఁ దుఱుముచు ... భాగ. 6. 370.

3. ఛేదించు.

కం. సురవీరుఁ డొక్కశరమునఁ, గంఠాలము గ్రుచ్చెఁ జక్కఁగా వాలమునన్, గరి దున్సియపలఁ దురగం, బురగముక్రియఁ ద్రెళ్ళి డొల్ల నుఱము న్మెఱమెన్. అ. వి. 2. 84.

4. బాధించు.

గీ. మరునిసాళికసాయకోత్కరము కరము, ధరముఁ దరమిడి మెఱము చేయరిది నొరిది నుఱిది నవి మెట్లు తెగఁ గోయునుం నదీఘు, రంబుల జనింపవో శతారములు గావొ. వసు. 2. 114.

వి. 1. తలక్రిందుగా వేసెడుదుముకు, పిల్లమెఱము.

చం. పెఱుకుదు మింక లంక నని పేర్చి కపీంద్రులు దిక్కులార్వులం, బఱియలు సేయుచున్ బ్రమరి పాఱుచుఁ గేరుచుఁ గ్రేళ్లు దాఁటుచున్, మెఱములువైచుచు న్నెగసి మేఘము లంటుచు .. భా. రా. య. 283.

సీ. కడలినీటను చెంటి కరడు పొర్లువిధాన కుఱుచగా ముంగలి మెఱము వైచి .. ప్రబంధ 109.

కం .. వనజాతునియెదుర మెఱము వైచిన భంగిన్ . జై. భా 9. 103.

2. గంతు.

* మెఱములు వైచుచు మింటికి నెగయుచు .. .. చప్పటుల్ చఱచుచుఁ గుప్పించుచు .. అచ్చ. రా. యు. 90.

రగడ. పాటమాలి నృపాలసుర వనపాలు .. డు .. .. డాఁచెను, రాలుపూలలరాలు .. మెరాలు తేజవరాలు వైచెను చంద్రా. 4. 134.

మెఱమెచ్చు. అ. క్రి. (మెచ్చు[1] + మెచ్చు[1]) మిక్కిలి మెచ్చు

సీ . పోయి వచ్చెద నని మెఱమెచ్చుఁ బలికి. వేం. మా. 5. 149.

వి. 1. ఇచ్చకమునకైన పొగడ్త.

గీ. తక్కుఁగలసైనికుల నెల్ల నుక్కడంచి, మిగుల సంగ్రామభూమిలో మెఱసినట్టి, రిపుయముని తీవ్రతకును సైరింపలేక, వెఱచి చోళావనీ భర్త విఱిగి చనియె. పరమ. 4. 159.

ఉ. ఎఱుఁగుదు మున్ సుకేశుఁడు మహేశు కృపన్ విశ్వావశిరాముఁ డౌ, ఎఱుఁగుదు వానిపుత్రకు లహీనవరంబులు బ్రహ్మ యీయఁగా, మెఱసి జగత్త్రియంబునకు మీకును బాధకు లౌట ... ఉ. రా 1. 327.

5. పూను, ఉద్యమించు.

గీ. మెఱసి యుపకార మొనరింప మేలు వచ్చుఁ, గీడు వచ్చు మనంబులో నోడ వలదు ... కాశీ. 2. 107.

6. అతిశయించు.

కం. ప్రాకటనవరసకలనా, సాకల్యము మెఱయు మధురసమధుద్రాక్షా, పాకప్రబంధరచనన్, జోకం దగుతిక్కయాయజూతుం దలతున్. విప్ర. 1. 11.

ద్వి. చిఱునవ్వు నవ్వి వసిష్ఠుఁ డాగ్రహము, మెఱయఁ గౌశికసంయమి కిట్టు లనియె ... ద్వి. హరిశ్చ. పూ. 352 పం.

7. ప్రసరించు.

గీ. ఆకసంబు నుండి విహంగరాజు, భక్తి నెఱకల నీడ నప్పద్మశాఖు, మీఁదఁ బచరించె బీఱెండ మెఱయకుండ .... హరి. పూ. 7. 189.

స. క్రి 1. మెఱయునట్లు చేయు, మెఱపు మెఱయించు.

సీ. మఱి మూఁడవది నిల్పి మెఱసి బిట్టుఱిమి, శీకర వారి సృష్టిఁ జీకటిగ నలమ ... ఆము. 4 61.

2. ప్రకటించు, బయలుపఱుచు.

ఆ. రాజసుతుఁ డోడ రమణఁ బాండవభృత, రాష్ట్ర సుతులు వృద్ధరాజులొద్దఁ, దద్దయును ముదమునఁ దమతమవిద్యలు, మెఱసి రెల్ల జనులు మెచ్చి పొగడ. భార. ఆది. 6. 11.

ఆ. అరులగుణములైన నగ్గింతు రెప్పుడుఁ, గలయ బెరసినపుడు గలితనంబు, మెఱయుగురు మహాత్ము లెఱుఁగఁడు తుదిమొద, లెట్టివారి నితఁడు బెట్టు పలుకు భార. విరా. 4. 228.

ద్వి. వలసైన తనవైభవంబెల్ల మెఱసి, కొలువుండె నుత్తరగోపురంబందు ... రం. రా. యు. 350 పా. 1 పం.

కం. అని యిట్లు గురుపుసన్నిధిఁ, దనగర్వము మెఱసి విప్రతతులను నిందించిన నావైశంపాయన, ముని ముందుచు యాజ్ఞవల్క్యముని కిట్లనియెన్ ... వి. పు. 4. 84.

జ. మెఱయించు, మెఱవడి.

**మెఱవడి(ఱి).** వి. (√ మెఱయు. బ. మెఱవడులు, మెఱవళులు, మెఱవళ్లు.) 1. అతిశయము.

సీ. మిత్రప్రతాపంబు మెఱవడిఁ గుదియించి యతిశయస్ఫూర్తిఁ జయ్యన హరించి ... చంద్రా. 4. 27.

కం. వడి వేఱువేఱుశిరసులు, గడిగి బెడం గయిరి కుంతి కాంచినకొడుకుల్, వెడవింటిజోదు మెఱవడిఁ, గడిగిన నారాచపంచకంబో యనఁగన్. పాంచా. 4. 14.

గీ. జిగిబిగి మెఱవడియు వడిసొగసులంద. చందములు నందచందమ్ము ల్సాదులు దెలి,యక వితాకవితల రాజహంసకవులఁ, గదిసి కావు కావనెడి కాకవులు కవులె. ప్రబంధ. 16.

2. ధైర్యము.

ద్వి. కాళ్లను రెండు నఱకమ గుత్తుకకుఁ, గడికండలుగఁగొట్టి కలుషంబు వుట్టి, మృడుని ముందఱఁ బెట్టి మెఱవడిఁ బట్టి ... పండితా. పురా. 90 పా.

ద్వి. మిఱుమిండ వయనారు మెఱపణి మెచ్చి ...
బస. పు. 4. 1025 పం.

3. నేర్పు.

సీ. మెప్పించివాఁడవు మెఱవడిఁ గర్ణాటనరనాయ కుని వీరనారసింహ .... మై. 1. 18.

కం. పని మెఱవడి వలరుశరుడపచ్చులచవికెన్ .. యయా. 4. 86.

చం. కరచరణాదు లందఱికిఁ గల్గినయంతటనే సమర్థతన్, మెఱవడిఁ గాంచనేర్తురె మనీషి వరుల్ ...
కృష్ణ. 2. 104., ఉ. రా. 4. 291.

4. ప్రకాశము, శోభ.

గీ. మంచిగుణములు గలయట్టి మనుజునందు, స్వల్పగుణ మైన నది ప్రకాశంబు నొందు, శ్వేత గిరిశిఖరంబుపై శీతకరుని, కిరణజాలంబు మెఱవడిఁ బొరయుకరణి. నా. పంచ. 1. 351.

5. విధము.

వ. ... తగరుల నన్నల దాఁకొన్నవీఁక, తులువలపోట్లాటమాడ్కి రక్కము పుంజులు కఱచి కాట్లజట్లు గఱచుక నారెలు డుస్సి పాఱు వరుస ప్రేటిలువేసిన మెఱవిడిని ...
ప్రబంధ. 788.

6. ఉద్రేకము, విజృంభణము.

వ. అని వఱియుం జెఱకువిలుతుని మెఱవడిఁ దరపిన నెఱబిరుదు లెఱుంగుపడన్ ...
భాగ. 8. 396.

(ముద్రితపా. మెఱవడి నెఱసిన. శ. ర. పా.)

7. గౌరవము.

కం. వెఱవకు నీవు సురేశ్వర, యెఱుఁగుదు నే నాదురాత్ము నిప్పుడ వానిన్, మెఱవడి యొనర్చి బుద్ధులు, గఱపి వరం బిచ్చి శాంతుఁ గావింతు రహిన్. శేష. 4.

(శ. ర. మెఱవడి యొనర్చు = గౌరవించు.)

8. ఊరేగింపు (శ. ర.).

విశే. ప్రకాశించునది, శోభిల్లునది.

కం. నెఱ వగ్గలింపఁ జుక్కలు, తఱచై పొడమ టయు గగనతల మొప్పారెన్, మెఱుఁగారు ముత్యములచే, మెఱపడి యగునల్లపట్టు మేల్కట్టు గతిన్. విక్ర. 6. 64.

సీ. బంగారు మెఱవడిపల్లనంబులతోడఁ గెంబట్టు కీలు పక్కెరలతోడ ... పి శకుం 1. 111.

ద్వి. కుఱుచ కెంజడలు బాగుగ నెత్తి చుట్టి, మెఱవడిగా భూతిమెయినిండ నలఁది ...
ద్వి. హరిశ్చ. పూ. 64 పం.

**మెఱికలు.** వి. బ. ఇంచుకపొట్టు వీడినబియ్యము.

గీ. అమరికలఁ గల్గి సంకటి తమిదరొప్పై, వేఁట పొట్ట జెన మినుపపిండి మెఱిక, లొడికముగ బొక్కి దగఁ దీరఁ బడ్డకొల్లఁ, గఱచికాటుల గెల్చు రక్కముకోళ్లు. ప్రబంధ. 132.

**మెఱియ.** వి. గుండ్రాయి.

కం. కఱకంఠుభక్తవెలిగాఁ, గొఱగా వెవ్వియును నవియుఁ గొన్నిటివాళ్లల్, మఱి పిండకూడు వెట్టిన, మెఱియలక్రియ మెఱచు మీసమెదుకుల మెఱపుల్. శివ. సా. 197.

చం. మెఱియలవంటిరక్కసులు మిక్కిలి లెక్కకు మీఱి క్రొవ్వు నేత్రైరయుఁ దలిర్పఁగా ...
ప్రభా. 1. 81.

ఇ. మెఱియఁడు, మెఱియత.

**మెఱియఁడు.** విశే. (√ మెఱియ) గుండ్రాతి వంటివాఁడు, కఠినుఁడు. ('చలింపనివాఁడు' అని శ. ర.)

గీ. త్రిమ్మరి గదా సదాగతి తెలిసిచూడ, మెఱియఁడుగదా యనంగుఁడేతఱి మఱి మడి,యఁడు గదా యల్లజైవాతృకుఁడు దలంప, నిట్టి చెడుగులచే బాధ కెట్టులోర్తు. సారంగ. 2. 127.

**మెఱియత.** విశే. (√ మెఱియ) గుండ్రాయి వంటిది, కఠినాత్మురాలు.

కం. నీ విచ్చో మెఱియత వై, శావరమున వలపి

నట్లు గయ్యాళింపం,గా వెఱచి పేద మొఱగా,
నే వీరిని వారిఁ దగిలి యేల వచింతున్.
కళా. 3. 222.

**మెఱుఁగంచుకమ్మ.** వి. (మెఱుఁగు + అంచు + కమ్మ) ఒకవిధ మగుకర్ణాభరణము.

సీ. మెఱుఁగంచుకమ్మలు మెణ్ణాలు గెలల
ముక్కర యడ్డబుడగలు కట్లసరులు . .
హంస. 4. 188.

**మెఱుఁగారు.** అ. క్రి. (మెఱుఁగు + ఆరు1) మిక్కిలి ప్రకాశించు.

కం. స్మరమందిరమ్మ శోభా,కరముగ మెఱుఁగారు
పసిఁడికంబము లనఁగాఁ, గరమొప్పు నగతనూ
జకుఁ, గరభోరులు వొలుచు మదనకరికర
లీలన్. కు. సం. 3. 291.

వ. మెఱుఁగారు తమతమసిడంబు లుల్లసిల్లం
జెలువు మిగిలి చనుదేరన్ ...
భార. భీష్మ. 1. 95.

**మెఱుఁగారుఁబోఁడి(ఁణి).** వి. (మెఱుఁగారు + పోఁడి) మిక్కిలి సౌందర్యము గల స్త్రీ.

ఉ. ఆమెఱుఁగారుఁ బోఁడిజిగి యబ్బెడుగుబ్బల
చాకచక్యమా, యేమని చెప్పవచ్చు జగతీశ్వర
శాశ్వతరూపసంపదల్ ... హంస 1. 58.

ద్వి. ... తెలిగన్నులనీరు, మీఁటుగు వేడు నామెఱుఁ
గఁటుఁబోఁణి ... నవ. 1. 70 పా. 3 పం.

**మెఱుఁగిచ్చు.** అ. క్రి. (మెఱుఁగు + ఇచ్చు) వన్నెపెట్టు.

చం. గొనకొని సామగానమునకున్ మెఱుఁగిచ్చు
చతుస్స్వరంబులం, బెనకొని మ్రోయ వీణ
మొరయించుచు ... కు. సం. 3. 325.

**మెఱుగిడు.** అ. క్రి. (మెఱుఁగు+ఇడు) వన్నెపెట్టు.

చం. ... వేదవా, క్యవిహితవృత్తిమై నభినవా
భ్యుదయం బొనరించి కీర్తి మా,ధవుఁగొని
యాడలం దమకృతంబులకున్ మెఱుఁగిడ్డ
యట్లుగన్. భా. అశ్వ. 4. 174.

**మెఱుఁగీఁటె.** వి. మెఱుఁగు + ఈఁటె) ఒక విధమగు వేఁటసాధనము, వాఁడియగునీఁటె.

చం .. ముకుందుబల్లెముల్, తలముడు లుర్లు
బోనులు తెరల్ మెఱుఁగీఁటెలు ప్రోఁగు చుట్ట
లున్, ... దవరంగ వెంబడిని బోంగి చెలం
గుచు నేఁగి రౌండొరుల్ ... ఇందు. 2. 58.

**మెఱుఁగు(గ్గు).** వి (త. మెరుకు) 1. మెఱుపు, విద్యుత్తు.

ఆ. మెఱుఁగు మొగిలు సొచ్చు తెఱఁగున నాట్య
మం, దిరము సొచ్చి తనదుగురువుకడకు,
వరిగి నెమ్మి నిట్టులను నిఁతి ..
భార. విరా. 4. 27.

కం. మెఱుఁగుల కచిరత శశికిం, గఱయును మణి
కనకములకుఁ గాఠిన్యము లేఁ, బొఱకుం
గాఢ్యము దక్కఁగ, మెఱుఁగెల్లను వచ్చి గిరిజ
మేనన నిల్చెన్ .... కు. సం. 3. 318.

ఉ. కన్నులు గండుమీలుఁ దొలుకాతు మెఱుం
గులుఁ గాముబాణముల్ ..
విక్ర. 3. 49., నీలా. 1. 56.

2. తళతళమనుకాంతి ; కాంతి, ప్రకాశము.

గీ. మిన్నమిడుఁగురులై రెండు మెఱచుచున్న,
మెఱుఁగు లోకవుట్టలో నున్న నెఱుగ కేను,
బుట్ట గ్రొప్పించి యారెంటి పొడవు గావ, కుడిగి
వచ్చితి విస్మయపడి మనమున ...
భార. అ. 3. 179.

సీ. మెఱుఁగులు దూఁగెడుమృదుకరపల్లిక లల్లాడఁ
జల్లుపోరాడి యాడి . నిర్వ. 3. 49.

సీ. మెలఁత మేని మెఱుంగు మెఱుంగు కాదు
మెఱుంగు .. సా. క్ర. 1. 119.

3. నెయ్యి మొదలైనవానిబిడ్డు

సీ తొలఁకి మింటికిఁ బొంగుదుగ్ధపాథోరాశికర
డుమీఁది మీఁగడల మెఱుఁగు ...
మనుచ. 5. 38., ఆం. భా. 2 259.

4. వన్నె, ఉత్కర్షము.

గీ. కానఁ గవితాభిముఖుఁడైన కవివరునకు, మిశ్ర కావ్యంబె కావ్యమై మెఱుఁగుఁ దెచ్చు ... కవిక. 1. 10.

5. వాఁడి, తీక్ష్ణత. (చూ. మెఱుఁగుసాన.)

విశే. 1. తళతళమను కాంతి గలది, కాంతి గలది.

సీ. భావింపనరుదైన భావమర్మంబులు మెఱుఁగుఁ జూపులలోన మేళవించి ... విక్ర. 2. 81.

సీ. నీలమేఘముడాలు డీలుసేయఁగఁ జాలు మెఱుఁగుఁ జామనచాయమేనితోడ ... ఆము. 1. 12.

ఉ. హాటకకలశంబులకును, సాటియగు వధూటి మెఱుఁగుఁ జాలిండ్లు .... నైష. 2 17.

గీ. .. నీలత్వమున సరిగావు తెలియ, నెఱిగలిగి యొక్కమొత్తమై నిడుదలై దట్టమ్ములై మెర్గులై కారుక్రమ్ముచున్న, వికచకమలాక్షి నునుసోగవెంద్రుకలకు ..

విజ. వి. 1. 35., పారి 1. 37.

2. తీక్ష్ణము, వాఁడియైనది.

కం. నూతనమొకమణితూణము, ద్రోణితశార్ఙ్గము మెఱుంగుఁదూపులుఁ బడసెన్. కళా. 5. 20.

ద్వి. మెఱుఁగుఁగోలలతోడి మృత్యువునోరు, తలలక డాకాలఁ దన్ని దట్టించి ...

హరిశ్చ. పూ. 82 పం.

ద్వి. హరిశ్చ. ఉ. 214 పం.

ఇ. మెఱుఁగంచుకమ్మ, మెఱుఁగారు, మెఱుఁగారుఁబోఁడి, మెఱుఁగిచ్చు. మెఱుఁగిడు, మెఱుఁగీఁకె. మెఱుఁగుఁగంచము, మెఱుఁగుఁబోఁడి, మెఱుఁగుగడ్డి, మెఱుఁగుజెట్టి, మెఱుఁగుడుఁబురువు. మెఱుఁగుడునూనె, మెఱుఁగునల్లలు, మెఱుఁగురిక్క, మెఱుఁగువెట్టు, మెఱుఁగుసాన, మెఱుఁగెక్కు.

**మెఱుఁగుఁగంచేము.** వి. (మెఱుఁగు + కంచేము) బొమ్మరివిద్య కుపయోగించునొక విధమైన కంచేము.

చం. ... మెఱుఁగుఁగంచేము లక్షితలోన్నతంబు లౌ, గదలు గుదార్లుపగ్గములు కత్తులబోనులు గడ్డపారలున్, వడిఁ గొని మేటిబొమ్మరులు వచ్చిరి విల్లమహేశుపాలికిన్.

చెన్న. 2. 209.

**మెఱుఁగుఁబోఁడి (జో).** వి. (మెఱుఁగు + బోఁడి

బ. మెఱుఁగుఁబోఁడులు, మెఱుఁగుఁబోండ్లు) మెఱుపువలె మనోజ్ఞురాలగు వాఁడుది; ఆఁడుది.

కం. చలదింద్రనీలగోళా, మలకోమలతారతార మండలములుప, ద్మలములు ప్రాంశుశ్వేతం, బులు చపలము లౌర మెఱుఁగుఁబోఁడి నయనముల్ .. నైష. 3. 164.

చం. ... మేడలసోరణగండ్లవెంట రేల్, చని యుడురిక్కమొత్తమును జక్కఁగఁ జూచి మెఱుంగుఁబోఁడులిచ్చనులిడికిళ్లఁ బట్టి ...

నీలా. 1. 29.

గీ. మిగులభయమునఁదమతమమెఱుఁగుఁబోండ్లు, చేరి తముఁదామె కౌఁగిటఁ జేర్చ ...

దశా. 1. 191.

**మెఱుఁగుగడ్డి.** వి. (మెఱుఁగు + గడ్డి) తృణ విశేషము, ఒకవిధమగు గడ్డి (వృ. వి.)

సీ. .... ఎఱగొయ్య వెణుతురు మెఱుఁగుగడ్డి.

హంస. 5. 45.

**మెఱుఁగుజెట్టి.** వి. (మెఱుఁగు + జెట్టి) ఒక విధమగుజెట్టి (శ. ర.)

**మెఱుఁగుడుఁబురు(గు, ర్గు, ద్వు)వు.** వి (√ మెఱుఁగు. త. మిన్మినిప్పూచ్చి) మిడుఁగుఱుఁబురుగు, ఖద్యోతము.

వ. ... మొకరితుమ్మెదలు రొదలు గల మెఱుఁగుడుంబురువులట్లు మిసమిసని మెఱవ ...

మనుచ. 3. 28.

చం. సురవరవర్ణినీమణులు శోభిలుమి ట నటించు వేళఁ ద్రుంపు హారనీలహారస్ఫురుచిఁ బొల్చిన చోటులఁ ద్రోవ గానమిన్, గరమరు దంది తత్తఱిని గాఢతమఃపటలప్రచారులై, యుగుతర దీప్తులన్ మెలఁగుచుంద్రు మెఱుంగుడుఁ బుర్వులో యనన్ భల్లా. 1. ఆ. (శ. ర.).

**మెఱుగుఁడునూనె.** వి. (√మెఱుఁగు) పెట్టెలు మొద లగు వానికి మెఱుఁగుఁ దెచ్చుటకై పూయునట్టి యొక విధమైననూనె, కఱ్ఱనూనె. (శ. ర.).

**మెఱుఁగుడునల్లలు** వి. బ. (√ మెఱుఁగు) ఎడ నెడ బంగారుకట్లు గ్రుచ్చిన నల్లపూసలు (శ. ర.).

**మెఱుఁగురిక్క.** వి. (మెఱుఁగు + రిక్క.) 1. పగడము. 2. తళతళయనుకాంతి గలనక్షత్రము (బ్రౌ. శ. ర.).

**మెఱుఁగు(ఁబె)వెట్టు.** అ. క్రి. (మెఱుఁగు + పెట్టు) ప్రకాశమును గలిగించు.

ఉ. పాండురియగ్రనందనుఁడు పాలడుగం దగ నీఁడయేని మా, కొం డన నేల మేలది సుయోధనుఁ డింతకు మున్ను పెక్కులు, ద్దండతఁ దాను జేసినవిధంబుల కెల్ల మెఱుంగు వెట్టిన, ట్లుండెడు .... భార. ఉద్యో 2. 184.

క. నుసుఱాతమెఱుఁగువెట్టిన, కనకప్రతిమయును బోలెఁ గన్నియ యొప్పెన్ ...

నైష. 6. 42.

క. రవిశశిముకురములు శరద్యువతి మెఱుఁగుఁ బెట్టుభూతియో యనఁ బర్వెన్ ....ఆము.4.142.

**మెఱుఁగుసాన.** వి. (మెఱుఁగు + సాన) ఆయుధాదులకు వాఁడి గలిగించుఱాయి.

గీ. చెఱకువిలుకాఁ డురం బను మెఱుఁగుసాన, పైని మొనయిడు కాంచనాంబకమురేఖ ...

దశా. 2. 282.

(నిదాఘవర్ణనము.)

సీ. మదనవిస్ఫూర్తికి మాఱటముక్కంటి మిహిరబింబమునకు మెఱుఁగుసాన...చంద్రా. 2. 16.

**మెఱుఁగెక్కు.** అ. క్రి. (మెఱుఁగు + ఎక్కు) వన్నెగాంచు. ఉత్కర్ష వహించు, పెంపొందు.

కం ... అతనియున్నయెడ గోధనమున్, మెఱుఁ గెక్కి పాఁడి నేమిం, గొఱఁత వడకయుండఁ జేఁపి కురియుచునుండున్ ...

భార. విరా. 1. 108.

ఉ. మానుగఁ దప్పులున్న ననుమానము సేయక మోదమానస, న్మానసులైనవారు పలుమాఱు, పరీక్షలొనర్చి తీర్చినన్, హీనకవిత్వమైన, మెఱుఁగెక్కదె ... ద్వా. 1. 15.

సీ. ఒఱగంట మెఱుఁగెక్కు నొరయంగఁ గల, తెక్కు వహొన్నంచువకెక్కర యుదుటు, సూప .. దశా. 2. 66.

**మెఱుకు.** స. క్రి. పెఱుకు, ఉత్పాటించు.

సీ. మెడ మెట్టి గోర్గొండి మెఱికి వుచ్చుఁడు వీని గ్రుడ్లు చెక్కుల నెత్తురులు స్రవింప ..

కాశీ. 3. 152.

శ్లో. ఉత్పాటయాస్య నేత్రే త్వం నిధాయ చరణౌ గళే .. సం. కాశీ. 3.

గీ. మృత్యుదేవత మునిపండ్లు మెఱుకఁ జాలు.

కాశీ. 2. 47.

**మెఱుము**[1] అ. క్రి మెఱచు, తళుక్కని ప్రకాశించు.

కం. ఉఱుముచు మెఱుముచుఁ బిడుగులు, వఱ లగ వలుగడలఁ బడ నవారితవృష్టుల్, గుఱుకొని కుఱియఁగఁ బంచెను, మఱియును నయ్యనలు మీఁద మఘవుం డలుకన్.

భార. ఆది. 2. 270.

కం. మెఱుము ధనుర్దండము గుణ, ముఱుమంగ విశిఖతతి దొరుఁగ నొక్కటఁ దఱచై, పఱవ రుధిరంపుఁగాలువ, లఱిముఱి ఘనసంఘుఁడు ద్రోణుఁ డడరె నరేంద్రా.

భార. ద్రో. .. 234.

వి. మెఱపు, విద్యుత్తు.

(వ్యవ.) నట్టి యుఱుములు మెఱుములే గాని వాన లేదు.

మెఱుము² స. క్రి. 1. కొట్టు, ప్రహరించు.

వ. .. ప్రతిపక్షులం దఱిమియు వాలంబుల మెఱిమియు ముష్టిఘాతులం గ్రుమ్మియు... సీతావి. 3. 106.

2. పొడుచు.

వ. ... ఇరువురు మెయి మలంచి పాసియు డాసియు ... లాసియు వ్రేసియుఁ దఱిమియు మెఱిమియు నొండొరుల దేహంబులు రుధిరాపూరంబువం దడిసి ... ఉ. హరి. 3. 64.

మెలఁకువ. వి. (√ మెలఁగు) 1. వర్తనము.

కం. చనువాని చేయు కార్యం,బున కడ్డము సొచ్చి నేరుపున మెలఁగుచుఁ దా,నును బయిఁ బూసికొనుట దన,మును మెలఁగిన మెలఁకువకును ముప్పగుఁ బిదపన్. భార. విరా. 1. 125.

చం. అలరుచుఁ గేళివేళఁ బ్రియునాస్యముఁ గన్గొని సిగ్గుచే మదిం, గళవళ మందఁగాఁ జివర కన్నులు రెండును మూసికొన్న నా, మెలఁకువకుం గవుంగి లిడి మెచ్చును ... శివధ. 1. 5., సుద. 2. 94.

2. భద్రముగా వర్తించుట.

బంధురవృత్తము. ... ఏనికపోఁ జనియెడు వలపగునల తఱిమలచేతం దగఁ దచ్చి మెలంకువ సం,తనగలిగిన గెలుపుల సిరినెలఁతన్ దక్కంగైకొని ... యయా. 4. 165.

కం. జలతైలబిందు వయి నా,మెలఁకువ వెల్లివిరియైన మేలగునే ... ఉ. హరి. 5. 198.

3. జీవనము.

చం. చలనము లేక యీనృపతి శయ్య నహర్నిశమున్ సుఖించునా, మెలఁకువ హానిచేయుటకు మేకొని రాఁ దగునయ్య ... నా. పంచ. 1. 315.

4. సంచారము, స్వేచ్ఛాసంచారము.

కం. మెలఁకువ లగుచోటుల మను,కుల కందువలను జలంబుఁ గొనునెడలను మేఁ,తల పట్టుల మృగముఃకును, వల లొడ్డుచు వేఁటకాఁడు వల నురఁ జనఁగాన్. ద్వా. 3. 24

కం. మెలఁకువలు చాలి తమతమ, నిలయంబుల కెగసి వచ్చునెమళుల పింఛో,జ్జ్వల రుచులు ... కవిక. 4. 80.

5. ధైర్యము, దిట్టతనము.

ద్వి. మెలఁకువ చెడి తోఁక మెడమీఁద వైచి, సొలసి కెలంకులఁ జూచుచుఁ జాఱి .. రం. రా. కిష్కి. 20వ పా. 3 పం.

6. స్థలము, చోటు.

కం. తగువాఁలు దానును నా,మృగములు విహరించునట్టి మెలఁకువ గని లో,నిగురొత్తెడు వేడుక న,జ్జగతీశుఁడు సన్నఁజేసి చంచుల కనియెన్ ... చిత్ర భా. 3. 131.

7. ప్రౌఢత్వము, నేర్పు.

కం. చిలుకల పిలుకలపలుకుల, కులుకులు గల మెలఁకువలకుఁ గొఱత ఘటించుం, జిలిబిలి పలుకులు వలుకుచు, జలకము కలికికి నొసఁగఁ జనిరి పొలంతుల్ ... అచలా. 2. 31.

చం. తెలుఁగుననఁ జెప్ప నేర్చిన సుధీజనులెల్ల నెఱాసు ధూర్జటీ, బళి యనఁ దళ్కు గుల్కువగ జాఱుతేట మెఱుంగుమాటలన్, మెలఁకువ గాంచు బెళ్కుజిగిమించు ప్రబంధతతుల్ ఘటించువా ... కృష్ణ. 1. 27.

8. నాట్యగతిభేదము.

కం. .. మెయిసిరి యవఘళము మురువు మెలఁకువ యమరున్ ... ప్రబంధ. 108.

9. తెలివి, జ్ఞానము ; ప్రబోధము, అవబోధము.

ఆ మోడ్పుకేలు ఫాలమునఁ జేర్చుకొని యున్నఁ, గరుణ నతఁడు నన్నుఁ గాంచి పలికె, వన్నె జెంగి వందనం బొనర్చితి నాత్మ, మెప్పుపుట్టె నీదు మెలఁకువకును. అప్ప. 1. 38.

సీ. ... మేలుకొంట యనఁగ మేలుకంట యనఁగ, మేలుకాంచుట యనఁగను మెలఁకువ యన ...

అవబోధ మెప్పు ... ఆం. భా. 1. 142.

(వ్యవ) దొంగ యిల్లు దాఁటి పోవువఱకు వారికి మెలఁకువ రాలేదు.

10. మల్లవిద్యా సంబంధమగు పదునాఱు ఉపవీత ములలో నొకటి.

వ. అప్పీరుండు దండనిల్కడ కదలు మెలఁకువ ఓలి ఘనంబు లాదియాషోడశోపవీతంబుల రీతుల నేర్చి ... హంస. 1. 206.

**మెలఁకువకాఁడు.** విశే. (√ మెలఁకువ) జాగ రూకత కలవాఁడు.

సీ. ... జాగరూకాభిధాన, మలరు మెలఁకువకాఁ డన ... ఆం. భా. 3. 11.

**మెలఁకువఁపడు.** అ. క్రి. (మెలఁకువ + పడు) జాగరూకత వహించు, దూరదృష్టి కలిగియుండు (వ్యవ.) మీ రావనిలో ముందే మెలఁకువ పడితిరి కనుక నెఱవేఱినది.

**మెలగాఁడు.** అ. క్రి. (మెలఁగు + ఆడు స్వార్థ మున) సంచరించు.

శ్లో. వెలుఁగొందు నవరత్న విమల శృంగముల, మెలఁగాడు కస్తూరి మృగములగముల ... నవ. 4. 206 పా. 13 పం.

**మెలఁగించు.** స. క్రి. (మెలఁగు) 1. వర్తింపఁ జేయు, నడపు.

కం. ... వీరిన్, సరిఁ దనకొడుకుల మెలఁపిన, తెరు వున మెలఁగింప వలదె ధృతరాష్ట్రవిభున్ ... భార. ఉద్యో. 1. 359

ద్వి. కాంచనభూమి మై కర్మజాలములు, మేరల నక లంబు మెలగించువాఁడు .. రం. రా ఉ. 39. 32 పం

కం. సంగడి లోకము లన్నియు, మ్రింగుచుఁ గ్రక్కు చును బయఁ మెలఁగించుచు ను, ప్పొంగెడు వేడుకకాఁ డటు, మ్రింగుడువడె బకునిచేత మీఁ దెఱిఁగి నృపా. భాగ. 10. పూ. 446.

2. త్రిప్పు, తిరుగఁజేయు.

కం. ... నీకోమలిక మెఱుఁగుటకునై, రాముఁడు మెలఁగించి చూచె రమణి నిన్నున్ ... భా. రా. అర. 1. 148

**మెలఁగు = మెలవు.** అ క్రి. 1. ప్రవర్తింను, నడచుకొను, అనుకూల్యముతోఁ బ్రవర్తించు.

కం. అరయ నెన్నండైనను, మీరలు నా కెగ్గు గాఁగ మెలఁగుటలేదో, పొం వడలార భారి. అర్థ. 1 94.

కం. పతికనుసన్నల మెలఁగుము . విక్ర 4 . 96

కం. ఇల్లాలు మెలఁగకున్నను, గుల్లా సౌఖ్యంబు పతికిఁ గొండంతైనన్, ఇల్లాలు మెలఁగుచున్నను, గొల్లా సౌఖ్యంబు పతికి గోరంతయినన్. శేష. 1. 139.

2. వర్తించు, ఉండు.

చం. కలిమికి నొప్పుగాఁగ బలగం బయి నీకడ నాత నూభవుల్, మెలఁగఁగ జూడఁ గానన యమే యభుజాబలశాలి విక్రమోజ్జ్వలుఁడు సుభద్ర పట్టియును వమ్మయిపోయె .. భార. సౌ. 2. 29.

గీ. మీనరాశిని సూర్యుండు మెలఁగుచుండ ... భీమ. 6. 36.

కం. మెలఁగుదురు గాక కడుపునఁ, గలకాలము జాత శాగ్నిఁ గమలి బలీంద్రా ... దశా. 2. 385., ఇందు. 3. 72.

3. సంచరించు, తిరుగు.

సీ. మిణ్ణుఁ బల్లంబునై మెలఁగంగఁ దనరథ ప్రముఖ వాహనములఁ బఱప ననుపు, గామస్న మేదినిఁ గడునమస్థలిఁ గాఁగ వెరపున నొన రించి ... భార. ద్రో. 2. 211.

ఆ. కుడచినపుడు నిద్ర గూరినయప్పుడు, మేలు కొనినయపుడు, విష్ణుకీర్తనంబు మెలగినపుడు విష్ణుచింతయుఁగాని, పలుకఁ డో డుబుద్ధిఁ దలఁపఁ డొండు. నృసిం. 3. 150.

కం. మెలఁగక మృగములు విహగము, లులియక లేఁబొలఁ జిగురు లొత్తక ... నెలవుల, నట వస వన మమరెఁ జిత్రరాటవివోలెన్. కు. సం. 5. 468.

4. (పొట్టతో మెల్లమెల్లన) జరగు, ప్రాకు.

సీ. పాలుపారఁగా లోఁగిలి పాన్పువాల్గు మూల
ఁకును వచ్చును మెలఁగి మెలఁగి
హరి. పూ. 5 190.

5. ప్రసరించు, వ్యాపించు.

సీ. పతివిలోకనములు పడఁతుకమైఁదీవఁ గల
యఁగాఁ బలుమఱు మెలఁగుచుండు..
భార. విరా. 5. 395.

6. ప్రవహించు, పాఱు

కం. గుఱ్ఱముఁ గొనిపో బుద్ధుల, కుఱ్ఱఁడ మీతాత
యొద్దకున్ నీతండ్రుల్, వెఱ్ఱులు నీ కైరదె
యీ, మిఱ్ఱున గంగాజలంబు మెలఁగ శుభ
మగున్. భాగ 9- 215.

7. వీఁచు.

కం. తలిరుటతుదఁ జినుకులు జల, జల పడియఁగఁ
దడిసి మెలఁగు చలికరువలిను, నొప్పెలపమున
విరియు పరువపుఁ, దొలుమొగడలవలపుఁ
దెలుపు తోఁటలలోనన్. పార. 5 103.

సీ కమనీయ తపనీయ కదళికావనంబు కదళికా
వనంబుఁ గలసి మెలఁగె ...
వసు 1 149.

జ. మెలఁకువ, మెలఁకువకాఁడు, మెలఁకువపడు, మెలఁగాడు, మెలఁగించు, మెలపు, మెలన.

**మెలఁత** వి. (√ మెలయు) స్త్రీ, అఁడుది

సీ. ఎలమి నమ్మెఁ... న స్నేలయుఁ... దివిరిన
... ... గాదె . .
భార. విరా. 2. 86.

గీ. అలక తిమిరాభిదృశ్య ఫాలార్ధచంద్ర, మెలఁత
యిది కృష్ణపక్షాష్టమీరాత్రియామ.

ఉ. అపురిమించుటోవరుల నాడు మెలంతలగాన
మాధురిన్, బ్రాపితజీవ లయ్యును దదగ్రమణి
ప్రతిమల్ ...
హ. వ. 1. 8., సునుచ. 6. 66.

సీ ... మెలఁతుక వెలఁది మెలఁత ....

గీ .. ముద్దుగుమ్మ యన స్త్రీ, సమాఖ్యలు ...
అం. భా. 2. 104.

**మెలఁతుక.** వి (మెలఁత + ఉక. స్వార్థమున.) ఆఁడుది, స్త్రీ

చం. మెలఁతుక లప్పురిన్ నిడుదమేడలఁ గ్రీడలు
సల్పుచుండి మిం, చులు జళిపించు కన్గవల
సోరణగండ్లముంజూడ నీ డగున్ ....
పి. శకుం. 1. 73.

గీ మెలఁతుకలమిన్న నిద్దంపుమేల్పసిఁడి, గలుగ
కుఁడిన .. నిప్పచ్చరంబు, పిడుచు సెటులు...
నీలా. 2. 36.

సీ. ... మెలఁతుక వెలఁది మెలఁత ..

గీ. .. ముద్దుగుమ్మ యన స్త్రీస, మాఖ్యలు ...
అం భా. 2. 104.

**మెలఁ(చే)పు** స. క్రి. (√ మెలఁగు) మెలఁగఁ జేయు, నడపు.

కం. పంచాలకు లై యుండుదు, రిలపెద్దప్రఖ్యాతికర
మున కగుదురు వీరిన్, సరిఁ దనకొడుకుల
మెలఁపిన, తెరువున మెలఁగింపఁ దగదె ధృత
రాష్ట్రునకున్ . . భార. ఉద్యో. 1. 259.

(చి. ని., భా. ల. వ్యా పా "తనకొడుకులు
మెలఁగిన తెరువున" ముద్రి. పా.)

వ. దవ్వుచేరువు లనిర్ధార్యంబులుగా మెలఁగన్
దేశికాశ్వంబు మెలఁపుచు ...
మనుచ. 4 115.

**మెలకు.** అ. క్రి జ్వలించు, మండు.

వ. .. హాలాహలదహనంబు జగంబులం గోలా
హలంబు సేయుచున్నసమయంబున మెలకు
సెగల మిడుకం జాలక నీ కైన దేవ
తలును. .. భాగ. 8. 216.

**మెలన.** వి. (√ మెలఁగు) నడక, ప్రవర్తన.

గీ. నాతి మగవాని నమ్మట రోత గాదె, వాని
మెలన తా వద్దంబులోని ముడుపు.
Miscell. 1. 557. Line 9. (తా.)

మెలపాడు. అ. క్రి. (√మెలపు) నర్తించు, నృత్యము చేయు.

సీ. రంభాదిహరిణనేత్రలు మెలపాడిరి పాడిరి కిన్నరాబ్జాతముఖులు ..
హ. న. 2. 114.

మెలపారు. అ. క్రి. (మెలపు+ఆరు) మృదు వగు, మెత్తనగు.

పీ. తలిరాకుకంటెను మెలపారునడుగులు ధర మీఁద మోపుడుఁ దెరలి పోవు ...
కు. సం. 6. 670., కు. సం. 5.502.

మెలపు. స. క్రి. (√మెలయు) మెలయఁజేయు, ప్రవర్తింపఁజేయు, వడపు.

కం. మును సరసీరుహగర్భుఁడు, తపమదిలో మతిఁ నిర్మిశప్రజ ధర్మం,బున మెలపఁ జాలుపురుషుం, డనవద్యుం డొకఁడు వలయు నని చింతింపన్.
వరాహ. 7. 14.

కం. ... వృషలి మన సీయక కడుఁ, జను వీయక మెలపవలయు సమ్ముఖచరులన్ ...
కవిక. 2. 18.

పీ. సింధుజ నెద నుంచి సిరుల మించిరఁ గాని మిహికాంశుఁ గనుసన్న మెలపరాదు ...
వసు. 8. 94.

కం. పగవాని పక్షమునవాఁ, డగపడినం గాచెనేని నత్యాసన్నుం,డుగ మెలపఁ దగదు మెలపినఁ, దెగు నుపమర్దుండపోలె ధీతహితుండై.
నా. పంచ. 3.308.

వి. = మెలుపు, మెల్పు. 1. జాగ్రత్త. అప్రమత్తత.

గీ. ఇట్లు దమతమవర్తించు నెడల సకల, జనములకు హృదయానురంజన మొనర్చి, శాల్మి పుయితోట యడఁకువ తగవు మెలపు, నెటిదెఱంగను జాటింప నేర్పు గలిగి.
భార. విరా. 2. 8.

ఆ. మీరు నిదుర దక్కి మెలపున నాచర, ణంబులొత్తుచునికి నాకుఁ బ్రియము ...
భార. అను 2. 300, పారి 2. 12.

2. చాతుర్యము, నేర్పు.

గీ. అలరునెత్తావి పొలివోని యలరు లేఱి, మెలపు వలవాటు నెడఁదల మేకొనంగఁ, బ్రణయ సఖులకుఁ గన్నులపండు వగుచుఁ, జతురముగ నోర్తు పుష్పాపచయము చేసె.
నిర్వ. 8. 38.

ఆ. రాజకీరములకు రసవంతముగఁ బల్కు, మెలపు దెలుపుకరణిఁ బలుకఁగలఁచె ...
కు. సం. 3. 275., రాఘవ. 2. 6.

3. సౌందర్యము, చక్కఁదనము.

సీ. ఒఱపుమించినవాని నెఱమించు నెఱమించు మెలపుఁ గందించునెమ్మోనివాని ...
చంద్రి. 3.79.

గీ. కడిఁది జడదారిసిగపూవు కళలప్రోవు, మెలపులకు సీమ కామునిమేనమామ, కట్టివేల్పు మఱంది భోగముబంగారు, రిక్కగమిమక్కువ ఱఱంగు రేవెలుంగు
కృ. శకుం. 1. 22., గంధ. 1. 74.

4. మార్దవము, మెత్తదనము.

సీ. అజగస్నాధుల నటవోకవోలెఁ గన్గొని దక్షిణమునకుఁ జన నఱండు, మెలపుతో మృత్యువమృత్యువ యొట వోయె దని పలుమాఱు సాంత్వనము దోఁప
భార ద్రో 2. 166.

ద్వి. పాలిండ్లపయ్యెద బయలుపర్చితినొ, మేలపు మాటల మెలపు దప్పితినొ ..
పండితా. పురా. 125.

5. ఉల్లాసము, ప్రమోదము.

చం. చలుపులపుట్టినిండ్లు నవసౌరభలక్ష్ముల కంతరంగముల్, మెలపులకు న్నివాసములు మెచ్చుల చేరుగడల్ విరక్తతా, కలనల కెత్తుకోళ్లు తమకంబులకుం గయిదండ లామనిన్,

మలయుచు వచ్చె గంధగిరి మంథర బంధురగంధ వాహముల్. కవిక 4. 12.

6. నడక, సంచారము

ఉ. కాలు మెఱుంగులో మెలపుఁ గైకొనసేర్చిన పైఁడిబొమ్మలో, మారుని దీములో కలికి మాటలచంద్రికలో చెలంగుళ్ళం, గారరసాధి దేవతలో కమ్మనిక్రొవ్విరి తీఁగెలో యనన్, వారిజపత్త్రలోచనలు వచ్చిరి మోహవిలాస మూర్తులై. వి. పు. 5. 146.

7. చాంచల్యము, కదలిక.

సీ. మృగమదంబును మదమృగమును హసియించు గాయంపువలపు కన్దోయి మెలపు ...

అని 2. 26.

8. స్థైర్యము

సీ కదుఁబేద యగుకాను గమనవేగంబున మెల పేది జవజవ జలదరింప ...

కవిక. 3. 151.

9 మాంద్యము, మెల్లఁ దనము.

సీ పూఁదీఁగఁబోఁడిచూపులు చంచలము లని మెలపు నెన్నడపున మేళవించె ....

విక్ర. 4. 17.

10 విధము, రీతి.

వ తనయందు నివి మొదలయిన తీర్థంబులు గల వని యవనీజనంబులకుఁ దెలుపు మెలపున వెలుంగుచు .. కాశ. 1. 142.

మెలయు = మెలియు. అ. క్రి. 1. వర్తించు, ఉండు,

(చూ కలయు. ఇది కలయు ధాతుపూర్వకము గానే ప్రయోగములయందుఁ గానవచ్చు చున్నది.)

గీ. కాంతలిద్దఱు వచ్చుటఁ గలసి మెలసి, సంభ్ర మంబునఁ బుష్పావచయ మొనర్చి ...

రాజ. చ. 3. 42.

గీ. మాటలాడుచుఁ బాడుచు మంద మంద, గమన ములఁ గామినీమణులో గలసి మెలసి, వన విహారంబు గావింప వారిఁ గూడి, యలరె వనమున్మథునిలీల నబ్జముండు

ఉ. రా. 3. 209.

గీ. అనుచు వనిచినకూరిమి వణఁగి మణఁగి, కలిమి కేమిని భర్తతోఁ గలసి మెలసి, హెచ్చు తగ్గుల పోకరిక నెనక మెసఁగ, వెలసె విలపితకీర్తుల వెంగమాంబ.

కృ. శకుం పీఠి. 1. 78.

2. జాగరూకతతోనుండు (శ. ర.).

3. పెనఁగు (శ. ర.).

జ. మెలఁత, మెలఁతుక, మెలపాడు, మెలపారు, మెలపు.

మెలరారు అ. క్రి. 1. మనోహరమగు, ఒప్పిదమగు. (ఈ రూప మొక్క కు సం. నందే గానవచ్చు చున్నది)

సీ. మెలరారు క్రేఁగంటి మెఱుఁగు దీఁగల దుల్లు కారాకు లొక్కొక్క క్రొక్కారు మెఱుఁగులు...

కు. సం. 7. 903.

సీ తెలిమోముపైఁ బర్వి తొలఁకాడుచాయలో మెలరారు కనుఁగవ మెఱుఁగు లడరు...

కు. సం 8. 9.

2. చలించు. త్రుళ్ళు

కం ఎలమెడు జలజాతంబులు, మెలరారెడు జల చరములు మేలిల్లెడుని,క్కొలల మంద...

కు, సం. 10. 391.

మెలవు = మెలఁగు. అ. క్రి.

(మరలు, తిరుగు.)

వ ... దీనిపడుమట వడగొండియేఱు ఉత్తర మించి మెలవినమెలవంక కొల్లిప్రోలును మల్ల ప్రోలును గూడినచోటి పుట్టయపీనుము...

పి. శా. శ. 1024. Ep. Ind. 5.

మెలి వి. (√ మెలియు సం. మిళితం) మెలిక, పెన.

శా. తైలాంచత్కచపాశిఁగూర్చి మెలు లొందం

జుట్టి మేల్పాగలన్.. రా వి. 2 51.

2. చిక్కు.

సీ జన్నిదంబులు ముత్తెసరులు జిక్కులుపడ్డ
పెంఁ లు విప్పుచుఁ గొంత మేల మాడి...
మృ వి. ౨. 88.

మెలిక వి (మె + ఇక, స్వార్థమున, మెలి, పెన
వ్యవ) వాటములు మెలికలు పడినవి.

మెలికించు స క్రి. (√ మెలిక) మెలిపెట్టు,
పెనవేయు.

సీ. బహుమార్గముల నందిపడగలు గట్టిరి మెలి
కించి కట్టిరి మేలుకట్లు...
వీర. 3. 118.

మెలిగొను అ. క్రి. (మెలి+కొను) 1. పెనగొను,
చిక్కువడు.

సీ. నవమైనకృష్ణాజినముతునక మెలిగొన్న ధవళ
యజ్ఞోపవీతంబు మెఱయ....
ద శా. 5. 81.

చం. ... తాళగతి బంగరుగాజులు మ్రోయ హార
ముల్, మెలిగొన నూర్పు లుప్పతిల ...
అలికులవేణి యోర్తు శిర సంటెను తెంటిగు
రాకుఁబోఁడిసన్. కవిజ. 3. 26.

2 వంకర దిరుగు.

సీ. ... ఇనుపకడెంబులు నింగలంబు, గురిసెడు
మిడిగ్రుడ్లు నెఱచూపులను నేపుమీఱడు మెలి
గొన్న కోఱమీస,లు ...
ఉ హరిశ్చం. 4. 157.

మెలిదారము వి (√ మెలి) జాతిపనివాండ్రు దిండు
ప్రక్క కొయ్యలకుఁ గట్టెడు బిగిదారము.
(శ. ర.).

మెలిపె(వె)ట్టు స. క్రి. (మెలి+పెట్టు) పెనవేయు.
సీ. మెలిపెట్టి చుట్టిన తెలిపంగిముడాసు పైల
పేటాకట్టుపనుపుఁ జెలఁగు, బంగరుమ్రాఁతల
నట్టుహిజారు ... శుక. 2. 426.

మెలియు = మెలయు అ. క్రి. పెనఁగు (శ. ర.).
జ మెలి, మెలిక, మెలికించు, మెలిగొను, మెలి
దారము, మెలిపెట్టు, మెలివడు, మెలుచు.
మెలువు.

మెలివడు అ క్రి. (మెలి+పడు) మెలిగొను.
(శ. ర.).

మెలుత = మెలఁత మెల్త, వి నెలఁత, స్త్రీ.
కం. ... అమ్మౌని, లోకము నేరుటయు నమెత్త
లుఁత యెలుఁ గెసఁగన్ . .
భార. అను 3. 221.

ద్వి. మెచ్చ దింద్రాదుల మెలుఁత యానంబి
మెచ్చునే యెలుఁగమే మీదాసికొలఁది ...
పండితా మహిమ 281 పు.

(క్రొత్త ప్రతిపా. మెలఁత ప్రాఁత ముద్రి పా.)

మెలుచు స. క్రి (√ మెలియు) మెలివేయు.
పెనచు.

ద్వి. అనుమాన మేల రమ్మని చెట్టఁబట్టి, మెలు
చుచు బంగారు మేడలోపలికిఁ. బొలఁగనీయక
వెంటఁ దోడ్కొని పోయి . .
ద్వి. శ. సా. 1 509 పం.

(మెలఁచుచు అపముద్రి.)

చం. ... కేలఁ గేల్, మెలిచిన బెళ్కుచూడినల
మిన్నలచిన్నెల వెన్నుదన్నులల్, పొలపుల
చూలపుత్తుకలఁ జొత్తిలఁ జూచె అతాంగి
నాథునిన్. ర. న. 1. 2.

మెలుపు = మెలపు. మెల్వు వి (√ మెలియు)
(మార్దవము, సౌకుమార్యము)

సీ. అలసభావంబున పొలుపును మెలుపును
గలుగు నగ్గిరి న కలఁచి ... చి ...
... ట. ... 7.

కం. మెలుపును గొప్పను సుస్థి... దేని
లేదు తను కుమపలవన్, నిల... నని
తప్పద, తలముల నెలసె ... ములు
వొల్చున్. రు. గు. . 85

కం వనితలు మేలుపుమెయి మెలు... నఁ గివిన

నొప్పుపోటములు మొదలగు ప్రసన్నని తొడ వుఖ గ్రద్దలు దివి, య నరేంద్రులు గొంద ఉనికి యచ్యుత కంటే.

భార. స్త్రీ. 2. 17., కు సం. 8 18.

(మెల్లఁదనము.)

సీ. ... గౌరి వచ్చి, వెనుకదిక్కున మెల్పునఁ జేరి మోమున కలఁచిన వ్యినుమడచెలువు నొనఁగఁ, దమ్మిఱేకుల నుల్లసమ్మాడు తన మృదుకర యుగ్మమునను శంకరుని నేత్ర, యుగ్మమల్ల మూసి ...

భార అను. 4 419

(చాతుర్యము, నేర్పు.)

సీ. ఆసీనుఁ డయి తదీయాంఘ్రి పద్మంబులు తన చారుపాణి పద్మముల మెత్త, మెత్తన యొత్తుచు మెలు పొందఁ గర్జంపుఁబలు కులఁ జిత్తవిభ్రమము మాన్పి.

భార. మౌ. 1. 78.

చం. చెలువను గౌఁగిలించుకొని చెక్కును జెక్కును నంఘటిల్లఁ దొ, ట్రిలుచుఁ బదంబు లొక్కటొకటిం బెనఁగన్ మెల పొప్పఁ దార్చి తేఁ, దలిరుల తొంపముల్ గలుగు దట్టపుఁ బూఁబొదరింటి లోనికిన్.

కళా. 3. 84.

(చక్కఁదనము, సౌందర్యము.)

సీ. భద్రనిదోఘ్రతాతపత్రంబు గ్రాలుచు మిన్నేటి రంగల మెలుపు గొలుప ...

భాగ. 6. 260.

మెలుసు వి (సం. మిశితమ్?) మెలిక, పెన.

గీ. బిఱుగు మెలుసులకలఁకలు గలిగిగొనుచు, మె చ్చొప్పక్కరిని దగులక మిళితెఱఁగు, మెలుఁగు వెలుఁగఁగఁ జేయుచుఁ గుఱయ మెలుఁగుఁ, బరమపరిపూర్ణ నిర్గుణబ్రహ్మమునకు.

సీతారా. 2 6.

వ. అప్పుడు నప్పుడు గాకుండఁ దప్పటడుగు లిడుచు నినుపగొలుసుల మెలుసులు పిడినఁ జాలంబులు మహోత్తాలుం డయిన బిడ్డనిఁ నడ్డంబు గాక కీ లూడి పీడిపడ ...

భాగ 10 పూ. 142

మెల్కువ. వి. జాగరూకత, మెలఁకువ.

ఉ ...తద్గణ, స్తోమము గాంచి భక్తి మదిఁ దొల్కఁగ సంగయ పల్కె మెల్కువన్ ...

చెన్న 3. 274.

మెల్త = మెలఁత వి. ఆఁడుది, స్త్రీ

ఉ . సా, రంగముఁ జాయఁ డీయవసరంబున మే లని మెచ్చితో సుమీ, గ్రింగియుఁ గ్రాయు నచ్చిలువ మెల్త విధుం గసుగంద కుండఁగన్. నైష. 8. 178.

ఇ: మెల్తుక.

మెల్తుక వి (మెల్త+ఉక. స్వార్థమున) ఆఁడుది, స్త్రీ.

ఉ. .. మేదినీ, పుత్రి మదాశ్రమ స్థలము పొంత వనంబునఁ ద్రోచి వచ్చె సౌ, మిత్రి తపస్వి బాలకులు మెల్తుకఁ గన్గొని వచ్చి నాకుఁ ద,న్మాత్ర నెఱుంగఁ జెప్పుటయు.

నిర్వ. 10. 131.

చం. మెలఁగుచు నున్నవానిఁ గని మెల్తుక యొక్కతె భూసురుండ కాఁ, దలఁచి ...

మార్క. 5. 18.

మెల్పు = మెలుపు.

సౌకుమార్యము, మార్దవము.)

చ. .. విదురాది సజ్జనులబుద్ధికి రా మచితంబు తోడి మె,ల్పునఁ బరుసందనంబునను భూతము లెల్ల నెఱుంగ నాడుమీ ...

భార. ఉద్యో. 3. 23

సీ. భావంతి నడపాదు పదగతు లవ మెల్పు దల కొని క్రాలు పదక్రమములు ...

కు. సం. 6. 713.

(మాంద్యము, మెల్లఁదనము.)

ఉ. అప్పు డొకర్తు కొంచె మగు నాభరణంబులు

సన్నపూఁతయున్, గొప్పిడి త్రిప్పి లోఁ జెరివి కొన్న నడఁగిన పూవులుం బయిం, గప్పిన చేఁకొంగు మనుఁగవ్వను మెల్పువ నేఁగు మెట్టెలేఁ, బవ్వడు వెన్నుఁ జేయు గతి చందము వింతఁగఁ జూపు వయ్యెడన్.

నిర్వ. 6. 58.

శా. ధేనుగ్రాసము మాన్ప దోస మని సందేహించిన్ సస్య మెం,తే వష్టం బగు నైన నేమి మఱియున్ విత్తంగ యామంబులో, నా నన్నన్ మునుమెల్ల మిక్కిలియు నేఁ డాఁ కొందు రీధేనువుం, చానో మానము దప్పి మేసినది యింతం దోలెదన్ మెల్పునన్

వరాహ. 10 40.

ఉ. గంధవహుండు వీచె నెనకంబున నాత్మజు మీఁద మెల్పునన్ ....

భా రా యు 1718.

(నేర్పు)

సీ. కాఁడిన విషకంటకములు మెల్పునఁ బుచ్చి తన పెచ్చు పాదపద్మములు గాఁచి ...

జై. భా 6. 85.

(రీతి, విధము,)

చం. నిలువక మెల్లఁ దాటు వట్లు నిల్పవ మెల్పు వటించుఁ బట్టఁ జే,యలంతికిఁ జేరినం జిదిమి వట్టులు దూరము దాఁటు ...

భా రా అర. 2. 46.

మ. .. మాయఁ బన్ని పెలుచం గోళంబులో వాలు మె,ల్పువ రాజిల్లుచు మాట మెత్తఁ దనమున్ లో వాఁడియు న్నేర్పడన్ ...

భాగ. 10. పూ. 223.

మెల్ల[1]. విఱ కొంచెము వంకరైనది (కన్ను. చూపు) కేకరము.

(వ్యవ ) ఆ పెండ్లి కుమారునికి మెల్లకన్ను. అట్లు మెల్లచూపు చూడకు.

ఱ, మెల్లకంటి, మెల్లకంటివాఁడు.

మెల్ల[2] విఱ. (త. మెల్. కర్మధారయమున నిగాగమము.) 1. మందము, వేగము లేనిది.

ద్వి మెల్లనినడపులు మృదుభాషణములు, వల్ల భత్వములు చిత్తోల్లాసములును .

పండితా. పర్వ. 335 పు

2. శాంతము, ప్రసన్నము.

ఉ .. మెండుగ మ్రోయుగజ్జెలును మెల్లనిచూపులు మందహాసముల్. చాటువు

3 మేలైనది.

(వానిపని యిప్పుడు మెల్ల శ. ర.)

క్రి విఱ. క్రియా. 1. మందముగా, త్వరపడక (దీని యామ్రేడితరూపము మెల్లమెల్లన్, మెల మెల్లన్, మెల్మెల్లన్.)

శా. ఏమే చెల్లె బిజీన రాఁగదవె యేలే జాగు యోసక్క లోఁ, తేమోనే వెఱతున్ భళా యెఱుఁగమే యీబూటకా లమ్మలా, రా మెల్లం దిగరమ్మ .. ఉ హరిశ్చ. 3. 37

ఆ నల్లగ్రోల నిచ్చి మెల్లనె చివ్వంగి నోరి జిఁకఁ దివియునేరు పొదవు, వేటకాఁడు వోలె ...

ఆము. 4 193.

మ. కర మొప్పారు నిశానవోఢకు నిశాకాంతుండు మెల్మెల్లనే, కరముల్ సాఁచి తమోవినీలపట ముత్కంఠం దొలంగింప ...

కవిజ 3 77

గీ అలరు మెల్లఁగ వన శకైంర్థ మగుచు ...

ఆం. భా. 3 76

2. బిగ్గరకాకుండ, ఉచ్చైర్ధ్వని లేకుండ.

(వ్యవ) మామకు నిద్రాభంగము గలుగును, మెల్లఁగాఁ బనుపుకొనుము. పెద్దలతో మెల్లఁగా మాటాడ వలయును

ఱ, మెల్లన.

మెల్ల[3]. వి. ఊరబయలు.

సీ. ...మెల్లన నికర్షణ మొప్పు ...

ఆం. భా. 2. 23

**మెల్లకంటి.** విశే. (మెల్ల[1]+కన్ను) కేకరాక్షుఁడు, కొంచెము వంకర యైనచూపు గలవాఁడు, కడకంటి కొంగిన కనుపాపగలవాఁడు, కలది వి వాయసము, కాకి. (బ్రౌ.)

**మెల్లకంటివాడు.** విశే. (√మెల్లకంటి) కేకరుఁడు,
గీ ... మెల్ల, ంటివాఁ డనఁ గేకరాఖ్య యగు .. ఆం భా 2 120.

**మెల్లన.** వి. (√మెల్ల[2]) 1. అల్లన, మాంద్యము, మంద స్వరము.

సీ భోగించువారలఁ బుల్కుపుల్కనఁ జూచి మెల్లన గ్రుక్కిళ్లుమ్రింగువారు ..
నైష 7 53.

సీ మననుకక్కుఱితి మెల్లన లేచి చేతులఁ గాంతుని జబ్బుగాఁ గౌఁగిలించు ...
మనుచ. 3. 123

కం. తనరెడు లజ్జాభయవా, సన లుద్బోధమునఁ దనర సతి గనుఁగొని మెల్లన నిలుఁ డని యావ లిడన్, ఆనిరోధ్కాకనెపముఁ జెప్పి సకియ లిరువురున్.
ప్రభా. 5. 37.. సీలా. 2. 11

2 శైథిల్యము, నడలు.

సీ అంగంబు మెల్లన వక్కుఁ దేర్పనె గాని మించి బిగ్గరఁ గౌగిలింప రాదు ...
దశా. 2. 311.

**మెల్లము.** విశే. ఉపశమిల్లినది, తగ్గినది.
దీ॰ మీఱినతాపంబు మెల్లంబు చేసి ...
ద్వి. పరమ. 5. 41 పొ.

**మెల్లా.** వి. చవిక. (శ ర., బ్రౌ )
(వ్యవ.) వా ళ్లామెల్లాలోఁ గూర్చుండి మాట లాడుచున్నారు.

**మెల్లె.** వి. చివక, చువ్వ.
సీ. పెండె గట్టెడుచోటఁ బెనుపగడుపుఁడీఁగ లీత మెల్లెలు దుల్య మెపుడు నృపతి ...
శా. వి. 3. 41.

**మెళవ.** వి. ఒంటిపాటు, ఏకాకిత్వము.

గీ. ఒంటిమైనేఁగు చలముల నుడుగరమ్మ, మెళవ లిడరమ్మ కవగూడి మెలఁగరమ్మ, తగినజత గూడి తలఁపులు దలఁచరమ్మ, యేను దెలిపిన చందమే యున్నరమ్మ.
చంద్రా. 4. 197.

**మెసఁగు = మెసవు.** స. క్రి. 1. తిను, భుజించు, మ్రింగు, కబళించు.

సీ. తివుటఁ జుక్కలతేని దినగోరు మెసఁగిరి ...
నైష. 7. 82.

గీ ఎంగిలికి రోఁత పడక మెసంగువారు, గాన విద్యలపైఁ బ్రేమ గలుగువారు, విష్ణునామ త్రయజపంబు విడుచువారు, నిరయమార్గాను వర్తులు నిశ్చయంబు. శేష. 3. 44.

గీ ...మంచిపనసపండుల మెసంగు, జాణలకు మావిపండులు చవియ కావె ..
సీలా. 2. 31.

వ. పంచతన్మాత్రసహితం బైన యమ్మహామానసంబు నిర్జ్ఞానమయంబుఁ గబళించుచాడ్పున నహంకారంబు గబళించు, నయ్యహంకృతి మహాబుద్ధి మెసంగు. సీతారా. 2. 158.

2. అనుభవించు.

కం. శివయోగినింద విని యొడి, యవివేకులు తనువు వెడల నంతమువందున్, దవిలి నరకంబు మెసఁగుచు, భువి చనునంతాఁక యమునివురి ముందు రొగిన్. శివధ. 3. 39

**మెసవు = మెసఁగు.** స. క్రి. తిను, భుజించు; కబళించు, మ్రింగు.

గీ. వేఁడి యగుదాఁక నోరువ మాఁడు గలిగెఁ, బులిసినది గగ్గె నన్నంబు పోఁకయంత, యొసఁగి తుత్తార్పు వెసఁ జల్ది మెసవనైన, పాప ముడిపించుకొందుఁ దవంబుకలిమి.
పాండు. 4. 153.

కం. ... నిలింపవిరోధీ, నామెయిమేదోమయదృ

ప్రామిషములు మెసవు మన్న నతఁడును
నా_ర్తిన్ . . అము 6. 53.

కం. ఫాలాతుఁడు కబళింపఁగ, హాలాహల విష ము
కొంత యవశిష్టం బై, తూలగ నది వృశ్చి
కములు, ఖ్యాళంబులు మెసవి విషవ దాఖ్యల
వెలసెన్. దశా. 2. 222.

గీ. కలువపిశితంబు మెసవురాకాని కాకి...
కాశీ 2.49., ఆం. భా. 3.118.

# మే

మే = మేను వి 1. దేహము ఒడలు

ఉ ... పరిశ్రమ పారవశ్యమును, గూడి ప్రమాణ
కోటి వనఘుండు సమీరణనందనుండు మే,
యాడక నిద్రవోయె ...
భార. ఆది. 5 170.

శా. విధి నామేఁ బ్రాణముల్ నిల్పె .
భార. శల్య. 2. 21.

కం. మే నిమిరి శిరముమూర్కొని, దావవపరిపంధి
యొంతధన్యనో నియత ధ్యానసురు లయిన
మునులుం, గానననినుఁ గంటి మంటి గత
కల్మష మై పారి. 3.26
ఆం. భా. 2. 134.

2. విధము, ప్రకారము.

ఉ .. పాండవుల్, మిక్కిలివారు నీతలఁపుమే
గెలుచున్ వలమే మహీశ్వరా ..
భార. ద్రో. 6 124.

3. తెగ, సంఘము.

చం. అనునినసూనుమాట విని యందఱుఁ గన్గొని
పెద్దలెల్ల ని, న్ననుమతి సేయ సైన్యముల
నన్నిటఁ బన్నఁగఁ బంపు రెండుమే,ల వడత
మిత్రిగర్తులబలంబుల ముందటఁ బంచి
వానిపో,యిన మఱునాఁడు పోద మనియెం
గురునాథుఁడు దుస్ససేనుతోన్ ...
భార. విరా. 3. 123.

(రెండుమేల శ. ర పా.)

4. పార్శ్వము

శా. ... ఇ,శ్మలం బాయనివేల్పుచాలు గల
సామిన్ వెన్నునిం గొల్చెదన్ ...
చంద్ర 5 58.

శా. .... ఇశ్మేలన్ జేర్కొనువేల్పుచాలు నెద
నెమ్మి న్నిల్వఁ బూఁబాలు నే,వేళం బూతల
మేలుమేలును గలావెన్నున్ నినుం గొల్చె
దన్.. ప్రబంధ. 154.

జః మేకొను, మేకొలువు, మేకోలు, మేగలి,
మేతాలువు, మేపుట్టువు, మేమఱుఁగు,
మేవడి, మేవడికాఁడు.

మేందుఁడు సం వి అ. పుం. మేఠుఁడు, మావటి
వాఁడు (త్రి వి.).

మేంఢ్రించు. స క్రి. పోఁగొట్టు, నశింపఁజేయు
(ఛేదించు అని శ. ర )

శా. మింటన్ ద్రోసినద్రోంత చాలిమిని లో
మేంఢ్రింప మున్ నీవు నా,యింటం బుట్టెద
వంచుఁ గంసుఁడు దొడిన్ హింసించె నీ
యన్నలన్... భాగ. 10 పూ. 124.

మేంథి, సం. వి. ఈ స్త్రీ మేంథిః, మేంతి (వ్య. వి.).

మేఁక వి. (సం మేకః) 1. ఛాగము, అజము

గీ ఓ మే యే మే యి దే మేమే లేమ యేమే.
మేఘపుష్పంబు దే వంచు మేలమాడ,
మేమేమేమేలు దఱ చయ్యె మేలుమేలు,
మేఁక మేఁకన సభవారు మిగుల నగిరి.
నైష. ... 11..

మ. ... మేఁ, కెరువుం గుంపటమంచ మెక్కరి
ప్రభుత్వైకాప్తి రెడ్లజడిన్ ...
అము 4. 134.

2. చింబు, ఛాగి, ఆఁడుమేఁక.

సీ. .... మేఁక చుచ్చును జింబు మీఱు ఛాగి.
ఆం. భా. 2. 165.

మేకవన్నె పులి = మేఁకవలె పై కి సాధువుగాఁ
గనఁబడుచు లోపల పులివలె క్రూరస్వభావము
కలవాఁడు, కలటి.

ఉ అక్కట మేఁకవన్నెపులు లఁగన లెన్నిట నిన్నె చూచినన్... కవిరా. 1. 134.

జ, మేఁకతిండి, మేఁకపోతు, మేఁకసారము.

**మేఁకతిండి** వి. (మేఁక + తిండి) అజాదనము• తోఁడేలు (శ ర)

**మేఁకపోతు** వి. (మేఁక + పోతు) ఛాగము, మగమేఁక.

(వ్యవ) వానిది వట్టిమేఁకపోతు గాంభీర్యము.

**మేఁకసారము** వి. (మేఁక + సారము) స్వరవిశేషము, గాంధారము (శ.ర.).

**మేఁగు** = బ్రేఁగు స. క్రి. పూయు, లేపనము చేయు.

సీ. కమ్మగొజ్జఁగినీటఁ గలయఁపి చల్లిరి మేఁగి మెత్తిరి క్రొత్తి మృగమదంబు.
శివరా. 2. 53.

ద్వి. . పెన్నలఁపు, మించి కందెననూనె మేఁగిన ట్లున్న, మొగమునఁ జీకట్లు ముడి పడఁ గల్గు.
ద్వి. హరిశ్చ ఉ 1390 పం.

సీ. . నమాంబువులు పైనఁ జిలికి కప్పురము వీనుల నూఁది మేలిచందన మెద మేఁగి తాళ, పాళలంబు ఁచఁబూని.
చెన్న. 4. 21.

**మేఁడి.** వి (సం. మేథీ, ప్రా. మేఢీ. ఇది శ. ర. ననుసరించి సానుస్వారముగా గ్రహింపఁబడినది కాని నిర్ధారకప్రయోగము లేదు) మేఁడితోఁక.
సీ శ .. ముష్టి సంగ్రాహ్యదారువు పొలుచు నేఁడి, యనఁగ ... ఆం. భా 2. 232.

ఉ. మేఁడియు సీరమున్ భుజము మీఁద భరించుచుఁ బోతునెద్దుతోఁ, గూడఁగఁ గాఁడిఁ బూన్చి మునికోల కరంబునఁ బట్టి పగ్గపుం, ద్రాడును మోకు వాఱెనయు దాలిచి ముందట వెన్కఁ జుంగు వ్రేలాడఁగఁ గానె కట్టుకొని యక్కుటిలాత్మకుఁ డేఁగెఁ జేనికిన్.
శేష 4. (శ. ర.)

జ: మేఁడికోఱు, మేఁడిచీల, మేఁడితోఁక, మేఁడిపాలు, మేఁడిపోగ.

**మేఁడికోఱు.** వి. (√మేఁడి) సేద్యగానికి వచ్చు ధాన్యభాగము.

**మేఁడిచీల.** వి. (√మేఁడి) మేఁడి జాఱి రాకుండ వేసిన చీల (శ ర)

**మేఁడితోఁక,** వి. (√మేఁడి) దున్నువాఁడు పట్టుకొనుటకు మేఁడిచివర అడ్డముగాఁ జెక్కిన చిన్నకొయ్య (శ.ర.).

**మేఁడిపాలు** వి. (√మేఁడి) సేద్యగానికి వచ్చు ధాన్యభాగము (శ. ర.).

**మేఁడిపోగ** వి. మేఁడితోఁక (శ. ర.).

**మేఁత,** వి (√మేయు) పశుపక్ష్యాదుల యాహారము

(ఇది మనుష్యుల విషయమునఁ గూడ నుపయోగింపఁబడును)

సీ తనసంతతికి మేఁతఁ గొని వచ్చురీతి దిక్కరి కరీరంబుల గఱుల వాను ...
దశా 1. 289.

గీ. మఱియుఁ గలదివ్యసరసులు నెఱయఁ జెఱిచి, తనదు కేళీ దీర్ఘికలందుఁ గనకనళిన, జాతులెల్ల నాఁటించినాఁ డాతఁడు, డింద్ర, యటు చవక మేఁత వడచునే హంసములకు.
ప్రభా 1. 120.

చం. కొలకొలమంచు మేఁతలకు గూఁడులు వెల్వడు పక్షిరాజముల్ .. పారి. 2. 69

సీ. మినుకుటూర్పులవాని మిసిమిమేఁతలవాని మెఱుఁగుఁజామని చాయమేనివాని ...
పాండు. 1. 213.

సా: పఁటియాఁతకు లంక మేఁతకు సరి.

**మేఁతకాఁడు.** విశే. (మేఁత + కాఁడు) తిండిపోతు, మేఁతరి.

సీ. కోలాహలాభీలహాలాహలజ్వాల మెడబంటి మెసఁగిన మేఁతకాఁడు... వరాహ. 11. 14.

మేఁతరి = మేఁతరీఁడు. విశ. (మేఁత + అరి.)

1. తిండిపోతు, ఘస్మరుఁడు.

కం. ... అ, బ్భాలమేఁతరిచెలి గ్రిమ్మరు, పాల మేతటిసైన వేలుపులు సొరదసుమీ ...
అచ్చ రా. బాల 113.

2. ముఖ్యుఁడు.

సీ. అంతట చామయ్య యనుదొమ్మరిలమేఁతరి తనవీడును దాను గదలి ..
చెన్న. 2. 204.

మేఁతరీఁడు = మేఁతరి. విశ. (మేఁతరి + ఈఁడు స్వార్థమున) (ముఖ్యుఁడు.)

మ. కనిరొం దొమ్మరిమేఁతరీఁడు ... ఉద్యాన మున్ .... చెన్న 2 214.

మేఁ(తా)తలాడు = మేపాడు. అ. క్రి. మేఁతలు + ఆడు.) మేఁతమేయు.

సీ. మిన్నేటిదరులందు మేఁతలాడుచు నున్నయు దుటురాయంచలేఁగొదమ యశఁగ ...
పారంగ. 1. 122.

కం. ఆకాకి నాకపథమున, నేకాకిత మేఁతలాడ నీరముగములం, గీకామండల మగుసర, యూకానవమునకుఁ బోవ మన్నెడ నటకున్ ...
వేం. పంచ. 2. 7.

మేకము. సం వి. అ. పుం. – మే అని కూయునది, మేఁక, ఛాగము.

(కల్పద్రుమాది కోశములం దీపదము రా. ని. లో నున్న దని కలదు. కాని రా. ని. లో లేదు. వ్యుత్పత్తినిబట్టి వ్యాకరణముచే సాధువు గాన గ్రహింపఁబడినది).

మేకలకన్య. సం. వి. అ. స్త్రీ. నర్మదానది.

మేకలము. సం. వి. అ. పుం. ఒకానొక పర్వతము.

మేకు. వి. ఇనుము మున్నగువానితో చేసిన చీల (శ. ర)

ద్వి మొన సూపి నన లొత్తుమొగడల దనరి, మినుకుఁదేఁటులతోడ మేకులు చేసి, యూని వగలి నాకు నిగురుఁబళ్కొమ్మ, గానరాకుండ నల్లడ విఱ్ఱవీఁగి ...
ద్వి. పరమ. 4. 266 పొ.

సీ. .. మేఁకన నెసఁగు కంఠు ...
ఆం. భా. 2. 218.

మేకొను = మైకొను. స క్రి. అ. క్రి. (మే+కొను) అంగీకరించు, ఒప్పుకొను.

కం. ఉన్నారు మంచి యేక్రిన, మిన్నలవలె రాజు పంపు మేకొన కిఁక మీఁ, రెన్నఁటికి మీవిలాసము, లిన్నియు నెన్నటికిఁ జెప్పరే చెలులారా ... రామా. 2.83.

ద్వి. ధారుణిపై నవతారంబు సేయ, మీరును దోడ్పాటు మేకొనవలయు ...
రం రా బాల. 18 పొ, 30 పం.

ఉ. అక్కట కౌరవాన్వయ మహార్ణవ మింకెడు నట్లు పుట్టె నిం, దొక్కరుఁ డైనఁ గేశవు హితోక్తికి మేకొనఁ డయ్యె ...
భార. ఉద్యో. 4. 54.

ఉ. పె, లెల్లి తినవేడ్క నవ్వరమహీరుహముం దవసొమ్ము సేఁతకై, మెత్తవ వేడెఁ జిత్తవిభు మేకొని యచ్చతురుఁడుఁ జెచ్చెరన్ ...
హరి. ఉ. 1 204

స. క్రి. 1. పొందు.

కం. మృతుఁ డంట పుట్టుఁ జెరుగును, మృతుఁడంట వేఱొకఁడు గుడువ మేకొనుఁ దృప్తిన్
నైష. 7. 75.

కం. ఇనుమంతగాని లేఁ డీ, ఘనిశ లుఁడు కాఁడు గూటిప్రాయమువాఁ డీ, శ్లైపత మహాభక్ష్య రానులు, మెసఁగెరి వినుపఁడు ప్రేతషష్టి మేకొనఁడు గదే పాండు. 4. 150.

ఉ. భూరిజటల్ ప్రవాహముం పొల్పుఁ గనన్ ఘనబాహుశాఖలన్, మీటి యుపర్ణ పర్ణదిశ

మేకొనఁ గ్రొన్నెలరేక కోరకా, కారముఁ బూన నీలగళకాంతులు లేఁటులనీటుఁ జెంద మఁ, దారములీల కూలి ధననాథునకున్ గనుపించి యిట్లనున్ ... ఉ. రా. 2. 815.

2. చేయు, ఒనర్చు.

ఉ. మించి ముఖాబ్జ చుంబనము, మేకొని నవ్వు విభుఁడు నేర్పువన్ ... నైష. 7. 183.

అ. క్రి. 1. పూను, ప్రయత్నించు.

ఉ. ప్రమ్చిర నేల యేఁ గలుగ ముద్దియ నాకు వృకోదరుండు వివ్వచ్చుఁడుఁ దోడు గాఁగ జనవంద్యుఁడు ధర్మసుతుండు పంప నీ, మెచ్చుగ శత్రుసంక్షయము మేకొని చేసెదఁ గాక . భార. ఉద్యో. 3. 120

ఉ . . మీ, మీనివుణత్వముల్ దెలియ మేకొని యమ్మునిని లోను చేసినన్ ...

వాల్మీ. 3. 69

చం. చలనము లేక యానృపతి శయ్య నహర్ని శమున్ సుఖించు నా, మెలఁకువ హాని చేయుటకు మేకొని రాఁదగునయ్య ...

నా పంచ. 1. 815.

2. ఓర్చు, తాళు, సహించు.

చం. ఇది గడుముద్దరాలు పను లేమియుఁ చేయఁగ నేర దెంతయున్, మృదు వాకకీడుపాటునకు మేకొనఁ జాల దుదాత్తచిత్త ...

భార. విరా. 1. 103.

3. కలుగు, సంభవించు.

ఉ మిత్త్రులచెయ్దులన్ సుఖము మేకొనునంటయుఁ జెందు దుఃఖముల్, శత్రులచెద్దు నంటయును సన్మతి దా ధనమూల మంటయున్ ....

భార. శాం. 2. 207.

దండకము. ... మేకొన్న పేరల్కతోఁ బుష్పలా వర్తికాబ్దంబులం బంపఁగా ...

పారి. 3. 33.

4. తహతహపడు.

క. ఇనుఁ డెఱిఁగె ననుచు సమయాం, గన నీల పటంబు దాల్చి కలయాశల మే, కొని యెడు జారిడికై వడి, వనఁ జీకటి పుడమిఁ జెలఁగె నలినహాళంబై ... విప్ర. 2. 22.

(ఇది కొన్ని యెడల పాదపూరణమునకై ప్రయోగింపఁబడును)

ఉ. మేలున నంతసిల్లనెడ మేకొని యాపద లొందు నాపదల్, తూలఁగఁ బూని సౌఖ్యములు తోఁచు ... భార. ఆర 5. 341.

ఉ, మేకొని నీదుభక్తి కుది మెచ్చితి దక్షిణలిచ్చి నట్లు కా. త్వా కనుఁగొంటి నీదగు కృతజ్ఞత యింతియ చాలు ...

ఇందు 1. 177.

మేకొలుపు. స. క్రి (√మేకొను) 1. మేకొనఁ జేయు, అంగీకరింపఁజేయు,

చం మెయివడి గౌరి నీశ్వరుఁడు మేకొలిపెన్ రతికిం గ్రమంబునన్ ...

కు. సం. 9. 345.

క౦. అని ప్రియము గడల్కొనఁ బల్కిన నెంతయు హావభావలీలాగతులన్, దనచతురోక్తులచే నా,యనమది మేకొలుప లేక వ్యాకుల మతియై . . సారంగ 2. 85.

2. కలిగించు.

ఉ. ... కర, శ్లాదఁగనీక మంథనగ మాడిన నాఁటి పరిశ్రమక్రమా, ప్రమేడితవేగవాసనలు మేకొలిపెన్ బళిరే తదస్త్రముల్ ...

రామా. 7. 108.

3. పొందించు.

సీ. పులితోలు విడిపించి జిలుగుదువ్వటపురింగుల వల్లెవాటు మేకొలుప వచ్చు ...

రామా. 2. 110. (ధరింపఁ జేయవచ్చునని భావము.)

మేకోలు = మయికోలు. మెయికోలు, మైకోలు. వి. (√మేకొను) 1. సమ్మతి, అంగీకారము.

మ. అని యామౌ_త్తికవాశ మిమ్ముటయు సాంద్రా నంగముం బొంది మా,నిని మేకోలునఁ గుండలావదనముస్ వీక్షింప వయ్యంబుజా,నన కాని మ్మని పల్కఁ గృత్రిమ విమానం బెక్కఁగాఁ జేసి య,ద్దనుజాధీశుఁడు తా నదృశ్యుఁ డయి చెంతం బో యె సంతుష్టుఁడై ...
కువల. 4. 91.

మ. .. పూ దోఁటలోఁ, దనమేకోలున వచ్చి యున్న యువనాథప్రౌఢు సాధ్వీకమా,నని రూఢప్రడిమాను రాగ మిసురొందం గూడి క్రీడింపఁగన్. శుక. 2.389

సీ ఇయ్యకో లొప్పికో లీకోలు మైకోలు మేకోలు సమకోలు మేము దొడఁబ,డిక యొడఁబా టనుట కనుపట్టుచునుండు సమ్మతి పేరు ...
ఆం ఖా. 1. 104.

2. కోరిక, అభీష్టార్థము.

గీ తగులు గానిచ్చు పీఠమర్దవిటచేట, కులకును విదూషకులకు మేకోలు వడపి, తండ్రి గడి యించినట్టి వి_త్తంబు వోవ, లొల్లగాఁ దయ్యె నవ్విప్రవల్లభుండు. శుక. 4 111

3. పూనిక, ప్రయత్నము.

మేఖల సం. వి అ స్త్రీ. 1. నడికట్టు, మొలనూలు మొలత్రాడు. 2. ద్విజులు ధరించెడి మౌంజి, ఉపనయనమందు ధరించెడి తృణవిశేషముతోఁ జేసినపడికట్టుకట్టు 3 పర్వతనితంబము, కొండనడుము 4. క_త్తి పట్టుకొనుటకై కట్టిన త్రాడు 5. గుఱ్ఱము కడుపుక్రిందనుండి జీను మొదలగునవి కట్టెడితోలుపట్టె, ఒంగువాఱు. 6 నర్మదానది. 8 పృశ్నిపర్ణి, ఉమ్మెత్త.
(వ్య.వి.)

మేఖలము సం. వి. అ. పుం. ఒకానొకకొండ.

మేగలి = మైగలి. విణ (మే+కలి) శూరుఁడు (వి. పూనిక అని శ. ర.)

కం. ఆటోప మడఁగి యచ్చుటి, మేటిమగలు బిచ్చపడిరి మేగలి కర్ణుం,డే ఓలవికిఁ గవిసె ధను ర్జ్యా ంకృతి సెలగఁ బాండవాగ్రజుఁ డెలుచన్. భాం. కర్ణ. 2 133.

(శ ర. కరాంతప్రతిపా. మెయిగలి. ఆనంద ప్రతిపా. మేగ ఐ. పా అని అన్యప్రతి. మేగల ఖా. ల. వ్యా)

మేఘంకరము సం. విణ (అ. ఈ. అ) మేఘములఁ గలిగించునది.

మేఘకఫము సం. వి అ. పుం. కరిక, వడగల్లు.

మేఘచింతకము. సం. వి. అ. పుం. చాతకపక్షి.

మేఘజాలము. సం. వి అ న. 1 మేఘసముదాయము, మబ్బులగుంపు. 2 అభ్రకము

మేఘజీవనము. సం. వి అ. పుం. చాతకపక్షి

మేఘజ్యోతిస్సు. సం వి. . న. మెఱుపు, విద్యుత్తు.

మేఘడంబరము. సం. వి. అ పుం. ఉఱుము, గర్జితము

మేఘదీపము. సం. వి. అ పుం. మెఱుపు, విద్యుత్తు.

మేఘద్వారము. సం. వి. అ. న. మొగులుదారి, ఆకాశము.

మేఘనాదము సం వి. అ పుం. 1. మేఘధ్వని, ఉఱుము 2. పలాశవృక్షము. 3. తండులీయము, చిలికూర (వ్య. వి).

మేఘనాదానులాసకము. సం. వి అ పుం. మయూరము, నెమిలి

మేఘనాదానులాసి సం వి. న్ పుం మయూరము. నెమలి.

మేఘనాదుఁడు. సం వి. అ. పుం. 1. వరుణుఁడు. 2 రావణునికొడుకైన యింద్రజిత్తు.

మేఘనామ సం. వి. న్. పుం. ము_స్తకము, ము_స్తె (వ్య. వి.).

మేఘనిర్ఘోషము సం. వి. అ పుం ఉఱుము

మేఘపథము సం. వి అ. పుం. మేఘమార్గము. ఆకాశము.

మేఘపుష్పము సం. వి. అ న. జలము, నీరు

మేఘభూతి సం. వి ఈ స్త్రీ. పిడుగు, అశని.

మేఘమార్గము. సం. వి. అ పుం. ఆకాశము,

మేఘము. సం. వి. అ. పుం. 1. మబ్బు 2. (సంగీ.) రాగభేదము 3 ముస్తె (వ్య వి) వ అభ్రకము,

మేఘయోని. సం. వి. ఇ. పుం పొగ, ధూమము

మేఘరంజి సం. వి న్. న. ఒకానొకరాగము

గీ. అనిలసుతుఁడు త్రిలోకమోహనము గాఁగ, మేఘరంజి యొనర్చి యమేయుతాన, లహరిఁ జెంగటిగండోపలంబు గరఁచె ..

సమీర. 6. 213

గీ. ... శంక, రాభరణమును శోకవిరాళి మేఘ, రంజి గుజ్జరి పంతువరాళి నాట

ప్రబంధ. 97, హంస. 5 124

మేఘవన్నె. మి. వి. ఒకవిధమగు వస్త్రము, మబ్బురంగుబట్ట.

గీ. .. మేఘవన్నెలు పచ్చపట్టు, గరుడపచ్చలు నేత్రముల్ తురగవళ్ళు, హంసవళ్ళును బదాఖ్యలు పాశిణవళ్లు, మొదలుగా వల్వలు ధరించి ముదిత లపుడు ...

ప్రబంధ. 272.

మేఘవర్ణ సం. వి అ. స్త్రీ.. నీలిమందుచెట్టు

మేఘవర్ణము. సం. వి. అ. పుం. న. వస్త్ర విశేషము

వ తోఁపులు మేఘవర్ణంబులు పచ్చపట్టులు చీనీలు సాలువులు కళ్ళాయిలు నడికట్లు చాద రులు హాసావళులు తగటిపాగలు ...

ప్రబంధ. 605.

మేఘవహ్ని. సం వి. ఇ. పుం. మెఱపు. విద్యుత్తు.

మేఘవాహనుఁడు. సం. వి. అ. పుం ఇంద్రుడు, మబ్బురౌతు.

మేఘవిస్ఫూర్జితము. సం. వి. అ. న. 1 మేఘ ధ్వని, ఉఱుము.

2 (ఛంద.) వృత్తభేదము.

మేఘవేశ్మము సం. వి. న్ న. ఆకాశము, మొగులుపట్టు.

మేఘసారము. సం వి. అ పుం. ఒక రిసుషు కర్పూరము, చీనకర్పూరము (వాచ.).

మేఘసుహృదము. సం. వి. ద్. పుం. మయూ రము, నెమలి.

మేఘాఖ్యము సం వి అ. న. అభ్రకము.

మేఘాగమము. సం. వి. అ పుం మబ్బులిరాక, వర్షర్తువు, వర్షాకాలము.

మేఘానంద సం వి అ. స్త్రీ. ఒకజాతికొంగ, ఒక విశేషము

మేఘానంది సం వి. న్. పుం. మయూరము, నెమలి.

మేఘాస్థి. సం. వి. ఇ న. కరక, వడగల్లు.

మేచకము, సం. విశే. (అ. చికా. అ.) నల్లనిది. నలుపురంగు గలది.

వి. అ. పుం. 1. నలుపు. 2. నెమిలికన్ను. 3. మేఘము. 4. పొగ. 5. చనుమొన.

న. 1. చీకటి 2. స్రోతోంజనము.

మేట. వి. ప్రవాహముచే కొట్టుకొనివచ్చి కమ్ముకొనిన యిసుక (శ. ర).

మేటరి విశే (మేటి + అరి[3]. స్వార్థమున) మేటి, శ్రేష్ఠుఁడు

శా జ్యోతిశ్శాస్త్రులకెల్ల మేటరివి ...

భాగ. 10 పూ. 285.

మేటి విశే (క మేటి) 1. గొప్పవాడు. (క) పరాక్రమమున.

కం. గురుపుత్త్రుఁడు తేజోనిధి, సురాసురుల కైనఁ దేఱిచూడ నరిది సం,గరమున నీతని నీశ్వర, వరజనితుఁడు మేటి శౌగవవ్యూహమునన్.

భార. విరా. 5. 8.

(చ) ధనమున.

సీ అచటిమేటికిరాటు లలకాధిపతిసైన మును

సంచి మొదలిచ్చి మనుప దలు, లు ..
మనుచ. 1 50.

(ట) పరిమాణమున.

గీ. మేటివక్రంబు సందిటc బ్రాటc బట్టి ...
కాశీ. 4 69.

కం. పోటరియై రణములోన భుజబల మెల్లం,
దేటపడc జూపి కుండిన, మేటియశం బెల
కలుగు మీరాజునకున్ . విక్ర. 4. 69.

గీ. పెటిలె బ్రహ్మాండభాండంబు చిటిలె దిక్కు,
లుడిలె పాతాళభువనంబు ఉదిలె నభము,
మేటి ఘాటీజనిత కాలకూటవిషము. చిమ్ము
వెలువడి యంతంతc బెచ్చుపెరుcగ
భీమ. 4 61.

(త) విద్యలయందు.

కం. చాటు ప్రబంధరచనా, పాటవకలితుcడవు
శబ్దపరిచితియందున్, మేటివి దీనిం దెనుc
గునc, జాటించి రచింప నీవ ప్రౌఢుcడ వర
యన్, రాఘవ. 1. 12.

(ప) కులాచారములయందు.

శా. ... దు,శ్శీలాగారము వారయోవతము నిస్సీ
మేటి వాటించునే ..
పాండు. 3. 42.

2. అధిపుcడు, ప్రభువు.

గీ. అంబురాశి వదంబుల కచలములకు, నాహి
మాద్రి పతులకుc గళ్యపసుతుండు, మేటియై
యొప్పు శ్రీయ సురకోటి కెల్లc, బ్రభుcడ వీ
వొక్కరుcడ కావె పద్మనాభ
హరి. పూ. 7. 206

3. శ్రేష్ఠుcడు

మ. ...ఇం కేల చిం,తిల నీపుత్త్రిలయందు మేటి
యనcగా దీపించు విద్యాగరి,ష్ఠులలో శ్రేష్ఠుcడు
బ్రహ్మనిష్ఠుcడు గనిష్ఠు ండింపుబిం బావరా ·
ఉ. రా. 2. 184.

సీ. ... కన్నాకు మేల్బంతి నికరము మేటి మేలు,
. తనరు శ్రేష్ఠము .. అం. భా. 8. 15.

వి. (క. మేద) (కసవు, వామి, (గడ్డి) కుప్ప,
(శ. ర).

జ. మేటరి, మేటితనము, మేటిల్లు.

**మేటితనము** వి. (మేటి + తనము) గొప్పతనము

కం. తనువు గలయాత్మ లెల్లన్, దనవశముగc
దనరుదండధరుc డట్లు విచే,తనుc డయ్యె,
మదుభ్జాఘూ,తన కింతియు చాలు మేటితనమని.
యొలమిన్ హరి. ఉ 10. 141

**మేటిల్లు** అ. క్రి. (√ మేటి) అతిశయించు

కం. ఏమి మడివాల యే మీ,భూమీశ్వరు నర్థి గానc
బో యెదము సఖా,భూమికిc జని యెదు వారికి -
శ్రీ మేటిల్లంగ మంచిచీరలు వలయున్. హరి
పూ. 9, 18.

**మేటుల** నం. వి. అ. స్త్రీ ఆమలకి, ఉసిరికచెట్టు
(వృ. వి)

**మేతి** నం వి అ. పుం 1. స్తంభము, 2 కళ్లము
మధ్యమున నెడ్లను గట్టెడిరాడు. (స్తంభము)

**మేతుcడు** నం వి అ. పుం. మావటివాcడు,ఏనుcగును
నడుపువాcడు.

**మేడ** వి. 1 సౌధము

సీ. మేడల ముత్యాల మేలుకట్టులు గట్టి రత్న
దీపిక లగారముల నుంచి .. విక్ర. 4 136.

సీ. మేడన స జ్జన మేలుమ చ్చనcగను నుప్పరి గన
సౌధ మొప్పుచుండు ... అం. భా. 2. 17

సీ. మలయజం బేపిటc దొలుcకెక్క డులిచి మేడల
కిడ్డమిగులు ధూములకు డిగ్గు ... ఆము. 2. 3.

2 దేవళము, దేవగృహము.

సీ. అదె కుక్కుటేశ్వరం బయ్యెపొంతిముమేడ
హుంకారిణీ దేవి యోలగంబు .... భీమ 3.56.

**మేడి** వి. అత్తి, ఉదుంబరము (వృ. వి.)

గీ మేడిపండ్లును మొదలుగాc గూడిమాడి, చెంచె
తలు దెత్తురిత్తు విచ్చేయవయ్య.... కాళ. 3.69.

దండకము ... నీమెయి వ్వల్వ గ్రుడ్డుంగముల్

మేడిపండ్లున్ వలెం బ్రోవులై యుండు...నీలా 2 41.

సీ. . అత్తిమేడి యనంగ నపు నుదుంబ, రంబు. . ఆం భా. 2. 42

**మేడికాయబోనము** = సారహీనము.

కం. రాగంబు నొడిచి ముక్తి, శ్రీ గౌరవముల కపేక్ష చేయుమునులకున్, నాగేంద్రయాన యైహిక, భోగం బిది మేడికాయబోనము సుమీశ్రీ. విప్ర. 2. 80.

**మేడించు** = మేదించు స క్రి. (సం. మృడ్) మర్దించు.

సీ పూఁదేనెఁ జిలికి కెంబుప్పొడి మేడించి చుక్క బొట్టుగ దిద్ది నొక్క చెలికి .. చమ 1 77.

**మేడు** వి. 1. అజ్ఞానము.

(చూ. మేడుపడు.)

2. వంచన. మోసము.

(చూ మేడ్పెట్టు).

జ మేడుపడు, మేడ్పఱచు, మేడ్పెట్టు.

**మేడుప(డ్ప)డు** అ. క్రి. (√ మేడు) అజ్ఞతనొందు.

కం. ఈగికిఁ గలుచు హరిద్రా.రాగం బది నిల్వదె యిది రతి మేడ్పడి నం,భోగగతిఁ గలుచు విటు నివి.రాగం బది నిల్చు భావరస జనసంబై. కు. సం 8 163.

గీ చదురుఁ డై మేడ్పడి యడుగువాఁడు...
దశకు. 6 133.

ఉ. మేడ్పడి రాజ్యగర్వమున మీఁదు తలంపవు గాక . . ఉ హరి 5. 198

ద్వి ప్రామిడి యై మేడుపడియెడుదానఁ, గామి నీ వెఱుఁగవే కడయింటిపొడువ ... బస పు 4. 503 సం.

(ప్రామిడిమై మైదుబడియెడు దానఁ, గామి ... ప్రాఁతప్రతి పా )

**మేడెము**[1] వి (క. మేడె) 1. గుంపు, సంఘము

సి. రథికహాస్తిపకతౌరంగికుల్ వలగొని మేడెమై కనఁజూపుమేర నడవ ...

ఉ. రా. 3. 136. (మేడమై శ. ర. పా).

2 యుద్ధము.

కం ఓరో- వంకముక్కున, నూరుపు దెల్ల డించి నేల యొడితి నన్నన్, వారః మేడెముఁ బొడుతురె .. బస. పు 6. 25 (బ్రౌ).

(మేడము పొడతురె శ. ర. పా.)

ద్వి ఒడితి నన్నను మేడెము పొడువఁ, బాడిశే బస. పు. 6 58 సం.

**మేడెము**[2] వి. చెక్కడపు జుమికీయంచు వనితవము (శ. ర, బ్రౌ.).

**మేడెము**[3] వి. గుదస్థానము

సీ. వాఁడికొల్తుల నాఁటవైచి మేడెములోన . . వి పు. 8. 471.

**మేడ్పఱచు-మేడ్పెట్టు** స క్రి. (√ మేడుపడు) వంచించు.

సీ. ... దశాశ్వ్యంతరమున. కరిగి మేడ్పఱచి కామాతురుఁ జేసి యిమ్మునినాథు నిట దెచ్చె ముదముతోడ ... దశకు. 5 35.

**మేడ్పెట్టు-మేడ్పఱచు** స. క్రి. (మేడు+పెట్టు) వంచించు.

సీ. మును వసుపాలితుధవము పెడ్డువఁ గొన్న తరుణి మేడ్పెట్టెడు మెఱపు గొంటలి ..దశకు. 5.88..

**మేఢ్రము** సం. వి. అ. పుం. జొట్టేలు, గొఱ్ఱెపోతు.

వ శిశ్నము, పురుషుని గుహ్యావయవము

**మేణత** వి. ముట్టడి.

మ . కృష్ణరాయమహారాయలు వుదయగిరి దుగన్ంమీద విడిశి ప్రతాపరుద్రగజపతిని కొండ వీడు పర్యంతం విరుగంబొడిచి వుదయగిరిదు ర్గానకు మేణత చేయించి దుర్గం పుచ్చుకొని ... నె, కా. 3. 1886.

**మేతాలుపు(ల్పు)** వి (మే+తాలుపు) శరీరధారి

సీ పొర యూని మేతాలుపులఁ జిఱ్ఱుమని వెఱ కొలుపుచు రెండునాల్కలు దనర్చ ... అచ్చ. రా బాల. 106.

కం తల లేక నిరుపు లగు చేతులు గ్రాలఁగ నతవి లోన దొరకినమేతాల్పుల. నెల్లఁ బట్టి

భ్రమింగెడు, పాలమేపరి నొకనిఁ జూచి పొది లిన కినుకన్. అచ్చ. రా. అర. 117

మేథి. సం. వి. ఇ. పుం. కళ్లమునందు పశువులను కట్టుటకు పాఁతినరాడు.

మేథిక. సం. వి. అ. స్త్రీ. తృణవిశేషము. మెంతి (వృ. వి.)

మేథిని. సం వి ఈ స్త్రీ. = మేథిక, తృణవిశేషము (వృ. వి.).

మేద. సం. వి. అ. స్త్రీ ఒకానొక ఓషధి.

మేదకము. సం. వి. అ. పుం. 1 పిండితో చేసినకల్లు. మద్యపిష్టము.

మేదకుఁడు విశే వెట్టికాగులవాఁడు.

గీ. ... మతి లేనిమేదకుండు, మౌనివర్యులఁ జది వించుమట్టినీడఁ, బంచముఖుపీట మే నోస రించెనేని .. పాండు. 1. 101

ద్వి ఒకవిచారము మాకు నొదవె నీరాజు, సుక వాసి పనిపంద చూపుగుట్టంబు, మామిడిక్రింది సోమరి మేదకుండు ...

ద్వి. హరిశ్చ. ఉ. 1497 పం

సీ. మితభాషి యగువాని మేదకుండని పల్కు జడుఁడంచు వచియించు శాంతిపరుని

రామలిం. 32.

మేదజము. సం. వి. అ. న. ఒకజాతి గుగ్గిలము.

మేదము. సం వి. అ. పుం 1 ఒకానొక సంకరజాతి 2. ఆలంబుష యనెడి యోషధి (వృ. వి.)

మేదర. వి వెదురుతడకలు, చాపలు మున్నగునవి అల్లుకొని జీవించు ఒకజాతి (శ. ర.)

జ. మేదరి, మేదరసాని.

మేదరి. వి. (మేదర + ఇ[3]) మేదరవాఁడు, వెదురు బద్దలతో చాపలు లోనగునవి యల్లెడి యొకజాతి వాఁడు.

ద్వి. వీఁగుచుఁ జేటలవేమయ్యఖువిని, దాఁ గాక మఱియు మేదరులు గొందఱకు, జీవితంబులు జేసి చేటలు చాలఁ, గావించి ...

పండితా. పురా. 162 పొ.

ద్వి తినతోడిజోడుమేదరులు సోదరులు ...

ద్వి. పరమ. 2. 127 పొ.

మేదరిసాని. వి (మేదర + సాని) మేదరవాని భార్య.

సీ. కొడుకుఁగుట్టఁడు చన్నుఁ గుడుప కట్లుంట విచారించి మేదరిసాని యపుడు ...

పరమ. 1. 179.

మేదస్తేజస్సు. సం. వి స న్. అస్థి, ఎముక.

మేదస్సు. సం. వి. స్ న. వప (సప్తధాతువులలో నొకటి.)

మేదావి వి. 1. బ్రహ్మచారులు మేధావీభూయాసమ్ అను మంత్రమును చెప్పుచు అగ్నికార్యాంతమందు ధరించుబొట్టు.

గీ. దబ్బవ్రేలియుంగరము మేదావిబొట్టు, మడుఁగు పేటిక పిరచుట్టు బెడఁగుఁ గాఁగ, ఎడుగు చందంబు హరి. ఉ. 10. 238.

సీ. మూర్తిత్రయీమధ్య మునివర్ణ మిదియ నాఁ ద్వైత్రిపుండ్రమధ్య మేదావి యొనర ...

రా, వి. 2. 36

2. అగ్నికార్యభస్మము.

వ. .. బొట్టునకు మేదావి మేచినలవాటునఁ గఁదిన యంగుళీద్వితయంబు దేఁటి గుట్టినం బృథగ్వర్ణమూర్తు లగుసంపత్తికలు గలుగుల రుహాం బనఁ బ్రశస్తం బగు హస్తం బెత్తి స్వస్త్యస్తు తే యని యాశీర్వదించుట.

పాండు. 4. 150

మేదించు = మేడించు. స. క్రి. (సం. మృద్.)

1 మర్దించు.

సీ. మంచినీన్నిట మేదించినపారంగనాభి పంకంబున నాభిదీర్చి ... వరాహ. 3. 109

సీ గోడలు పూయింగఁ గుమ్మగందంబున మేదించినట్టి జవ్వాదియడుగు ... యయా. 1.119.

సీ. గొజ్జంగిపూఁదేనె కులికి మేదించిన కమ్మ
కస్తూరి మేనఁ గలయ నలదు ..
కాశీ 3 118

2. నేర్పు, అభ్యసింపఁజేయు, మప్పు

సీ కోడె లన్నింటిని గూడంగఁ దోలించి
మేదింప దుక్కికి మెదుకలైన, గ్రుచ్చు
గి త్తెలఁ బట్టి ముకుదాళ్లు గుట్టించి ..
నా పంచ. 5 13

**మేదిని** సం. వి ఈ స్త్రీ 1. భూమి. 2 ఒకా నొక సంస్కృత నిఘంటువు. 3 మేద (వృ.వి.)

**మేదినీద్రవము.** సం. వి అ పుం దుమ్ము, ధూళి. (త్రి ని)

**మేదినీపతి** సం వి ఇ పుం భూపతి, నేల ఱేఁడు.

**మేదిరము.** వి. (సం. మేదస్) మెదడు

సీ హరునిచే మడిసిన యంధకాసురు నాఁడు
వెసఁగనే కడుపార మేదిరములు ..
మైరా. 3. 145

**మేదు.** స క్రి. 1. పూయు

సీ లోకపాలోన్నత ప్రాకారములయందు మృగ
మదపంకంబు మేదిరొక్క . భోజరా. 2 101.

2 మెదుపు.

ప ... బొట్టునకు మేదావి మేదునలవాటువం
గందినయంగుళీద్వితయంబు దేఁటి గుట్టినం
బృథగ్వర్ణమూర్తు లగుసంవర్తికలు గలజల
డంబం బన .. పాండు 4 152.

**మేదుఁడు.** సం. వి అ. పుం. ఒకానొక రాక్ష సుఁడు

**మేదురము** సం విశ (అ. ఆ. అ.) సాంద్రము. దట్టమైనది.

**మేదురితము.** సం విశ (అ. ఆ. అ.) దట్ట మైనదిగాఁ జేయఁబడినది, సాంద్రీకృతము.

**మేదోజము.** సం. వి అ. న. అస్థి, ఎముక.

**మేదోవృద్ధము.** సం వి. అ. న. మేదోధాతువు.

**మేధ** సం. వి ఆ. స్త్రీ (సు, దుర్, వ్యతిరేకా ర్థకమగు నఞ్ అ, పూర్వపదముగా నుండిన బహువ్రీహిసమాసమున మేధస్ అని మారును
ఉ సుమేధస్, దుర్మేధస్, అమేధస్ .

1 ధారణశక్తిగలబుద్ధి. 2 తెలివి, బుద్ధి.

**మేధము.** సం వి అ. పుం. 1 యజ్ఞము.
2. హవిస్సు (కల్ప)

**మేధాజిత్తు.** సం. వి. త్. పుం. కాత్యాయనుఁడు (త్రి. ని.).

**మేధాతిథి.** సం వి ఇ. పుం మనుస్మృతిపై వ్యాఖ్యానము రచించిన యొక పండితుఁడు

**మేధారుద్రుఁడు.** సం వి అ. పుం. కాళిదాసుడు (త్రి. ని)

**మేధావంతుఁడు.** సం విశ (త్. వతీ, త్) తెలివిగలవాఁడు, బుద్ధిమంతుఁడు.

**మేధావి** సం విశ (న్. నీ న్.) 1. చాలబుద్ధి మంతుఁడు, మంచిజ్ఞాపకశక్తి (ధారణ) గల వాఁడు. 2. తెలివి గలవాఁడు, బుద్ధిమంతుఁడు
వి న్. పుం 1 శుకము, రామచిలుక. 2. మద్యము, సారాయి.

**మేధావిని.** సం. వి. ఈ. స్త్రీ. బ్రహ్మభార్య, సరస్వతి.

**మేధి.** సం వి. ఇ స్త్రీ = మేథి.

**మేధ్య.** సం. వి ఆ. స్త్రీ మండూకాద్యాది

శ్లో మండూకీ బ్రహ్మజా శంఖపుష్పీ జ్యోతి
ష్మతీ మునిః, విష్ణుక్రాంతా వచా శ్వేతా
మేధ్యాయాం సప్త సమ్మతాః (రా. ని.)

**మేధ్యము.** సం విశ. (అ. ఆ. అ) 1. యజ్ఞము నకుఁ దగినది. 2 పవిత్రమైనది.

వి అ. పుం. 1. ఛాగము, మేఁక. 2. ఖదిర వృక్షము, సండ్రచెట్టు. 3. యవధాన్యము.

**మేన.** విశ. (√మేను) స్త్రీకి తోడఁబుట్టినవాని యొక్కయు పురుషునకు తోడబుట్టిన దాని యొక్కయు స్త్రీ పురుషులకు తండ్రి తోడఁ

పుట్టిన వాని యొక్కయు తల్లితోఁబుట్టిన వాని యొక్కయు దేహసంబంధము కలవాఁడు: కలది.

(దీనికి వ్యస్తప్రయోగము లేదు.)

ఉదా: మేనల్లుఁడు, మేనత్త, మేనమామ

**మేన.** సం. వి. అ. స్త్రీ. హిమవంతుని భార్యయగు మేనక.

**మేనక.** సం. వి. అ. స్త్రీ. 1. ఒకానొక యప్సర స్త్రీ. 2. హిమవంతుని భార్య.

**మేనకాత్మజ** సం వి. ఆ. స్త్రీ పార్వతి.

**మేనకోడలు** వి. ఔ. (మేన + కోడలు) పురుషునకు తోఁడఁబుట్టినదాని కూఁతురు: స్త్రీకి తోడబుట్టిన వాని కూతుఁరు

(వ్యావ) ఆమె తనమేనకోడలినే కొడుకునకు చేసికొనవలె నని గట్టిపట్టు పట్టినది.

**మేన(య)త్త.** వి. (మేన + అత్త) తండ్రితోఁడఁ బుట్టినది

సీ. ... పద్మనాభుఁ గావఁగఁ జనుదెంచి కడుఁ బ్రీతి ని ట్లను నవఘ యే మీకు మేనత్త మగఁడ... హరి. 1 186

భ. అతివిస్మృతస్వరూపధరుఁ డైన కుమారకుఁ బ్రీతితోఁడ సాత్వతిఁ దమమేనయత్తను ముదంబునఁ జూడఁగఁ గోరి యద్భుత, ప్రతిభులు రామకేశవులు పన్నుగ నేఁగిరి...

భార. సభా. 2 55.

**మేనబావ.** వి. (మేన + బావ) తనకంటె పెద్దవాఁ డగుమేనమామకొడుకు, మాతులేయుఁడు, తనకంటె పెద్దవాఁ డగు మేనత్త కొడుకు.

కం నిను నెఱుఁగ కుండి యాదవుఁ, డని సఖుఁ డని మేనబావ యని యే సహాభో, జనములు సల్లాపంబులు, నొనరించుచు మేలమాడు చుండుదు నెపుఁడున్.. భార. భీష్మ. 1. 217.

ద్వి. కురునాయకుని కొలకొలమాటలకును, హరి మేనబావను నాత్మఁ గైకొనక ..

అ. మ. క. 5. 255 పా. 2 పం.

సీ. మేనబా వని మేర మాని యుండక బుద్ధి బలదేవునెడ భక్తి మెలఁగవమ్మ ...

ముకుంద. 3 309.

**మేనమఱఁదలు.** వి ఔ. (మేన + మఱఁదలు) తనకంటె చిన్న దగుమేనమామ కూఁతురు, మేనత్తకూఁతురు.

సీ భరతకులాగ్రణి పాండవసింహంబు సర్వ ధన్వజ్ఞుఁ డాసవ్యసాచి, తనమేనమఱఁదలి భవశాక్షిఁ దోడ్కొని చనియె నాతని కది చనదె చెప్పఁడ ..

భార అది. 8. 203.

ఉ. ఇది వీరభద్రభుజ వీర్యకళ్యయే, మిన్నక కాదు నీదయినమేనమఱఁదలు నీక చేరె నీ, యన్నుఁ బరిగ్రహింపుము ..

హరి. పూ. 6. 168.

మ. ... సందర్శనశోభితా, ద్యనుజన్ మేనమఱఁదలిన్ విమలలోలాపాంగన్ ... వనజాతాక్షుఁడు పెడ్లియాడె నహితవ్రాతంబు భీతంబుగన్ ... భాగ 10 ఉ 145.

**మేనమఱఁది** వి. (మేన + మఱఁది) తన కంటెఁ చిన్నవాఁడగు మేనమామకొడుకు, మేనత్తకొడుకు

చం భువనము లొక్కపెట్టు మృతిఁ బొందిన జీవము లావహింప నేర్తు వలచినట్టులైన గుణాఢ్యుఁడు మేనమఱంది పౌత్రుఁ జా, వవిడుతె ... భార అశ్వ 3. 177.

**మేనమామ.** వి. (మేన + మామ) తల్లితోఁడఁ బుట్టినవాఁడు, మాతులుఁడు

కం. మదుమథనుఁ డాక్షణంబున, మధుర గుఱిచి కదలి మేనమామఁ దగఁ దడీ, యభరిత్రికి విడుకొలిపి యధికప్రమదంబుతోడ వన్నయుఁ దానున్... హరి. ఉ. 1. 169.

గీ. మిసిమిపెంసీమ వలరాజు మేనమామ ...
మనుచ 1. 18.

కం. కంచికిఁ జని బహువిభవస, మంచిత మగు మేనమామమందిరము ప్రవేశించి తనవనితఁ గనుఁగొని, సంచలత వహించి గుండె జల్లన నున్నన్ ... విక్ర 7 126.

**మేనటికము** వి (మేన + టికము) 1. మేన మామకూఁతురు మేనత్తకొడుకున కిచ్చి చేయు పెండ్లి సంబంధము

(తోడఁబుట్టిన దానియొక్కయు తండ్రితోడ బుట్టిన దానియొక్కయు, దేహసంబంధ భావము. శ ర)

(వ్యవ.) వారిపిల్లవానికి మేనటికమే కాని పై సంబంధము చేయరు.

2. పరిహాసము.

ఉ. గిరిశ గళమూలహాలాహల కాలకాంతితో, మేనటికంబు లాడుతనమేటి త్రిశూలముఁ బూని యుద్ధతిన్
మనుచ 4 96.

**మేన(య)ల్లుఁడు.** వి (మేన + అల్లుఁడు బ. మేనల్లురు, మేనయల్లురు) పురుషునకుఁ దోఁడఁ బుట్టిన దానికొడుకు, భాగినేయుఁడు, స్త్రీకి తోడఁబుట్టిన వానికొడుకు.

మ. హరిమేనల్లుఁడు గొంతికూర్చుమనుమండ నన్నత్తనూజుండు ...
భార. ద్రో. 2. 236.

సీ. అమ్మహాసురుని మేనల్లుఁడు లవణుండు మధు దైత్య తనయుఁ డున్మాద బలుఁడు ...
హరి. పూ. 5 59.

కం. నిమఁ బట్టి పాండుపుత్రులఁ, మేనల్లురఁ దొఱంగె ధరణీశ్వర ..
భార. కల్యా. 1. 79.

శా. నా మేనల్లురు బాహుసత్త్వవికసన్మాహాత్మ్య విఖ్యాతు లా, రాముం గృష్ణునిఁ జూచు వేడుక మనోరంగంబునం దాడెడున్ ...
హరి పూ. 8 75.

**మేవాదము** సం. వి. అ. పుం 1. మయూరము, నెమలి. 2. పిల్లి 3 మేఁక

**మేని** వి కాంతి (శ. ర.)

**మేను** = మే. వి ఔ 1. శరీరము.
(కొన్ని యెడల దీనికి హల్లు పరమగునపు డుత్వ లోపము

సీ అతఁడు వంద్రెండు వాలమ్ము లాబీభత్సు మెయిఁ గ్రుచ్చి కృష్ణుని మేనియందుఁ, బది వాలు తూపులు వఱపిన మదిలోన నగ్గించి ...
భార. కల్యా 1. 212.

సీ. మెలఁత మేనిమెఱుఁగు మెఱయు కారు మెఱుంగు చిగురు కెంపులగ్రోవి చిన్ని మోవి.
విక్ర 1. 119.

ఉ .. న, న్నిమ్మఱఁగ జానిసీని నొకనిం బఱిఁ గాననియట్లు గాఁగ మేన్, గాఱియ వెట్టి యైన నొడికంబుగ వండుదు నెల్ల కూరలున్ . భార విరా. 1. 77.
ఆం భా. 2. 134.

2. జన్మము, పుట్టువు.

సీ. ఏమిటఁ జూచిన నీయింత తొలుమేన సుకృతంబు సేయుట ప్రకట మయ్యె ...
విక్ర 4. 198.

కం. విను ప్రద్యుమ్నునిఁ దక్కన్, మనము నే నొరు వరించ మాట విడుపు మా,ఘనుఁ డొల్లకున్నఁ జెందుదు, మనసిజ శిఖిఁ దనువు వ్రేల్చి మఱునటి మేనన్ ...
ప్రభా. 3. 102.

గీ. కోరి తొలుమేనఁ దన కైన కొదవలెల్లఁ మాన్పుకొన వచ్చి ... పారి. 1. 17.

3. పార్శ్వము, ప్రక్క.

(ఇరుమేను = రెండుప్రక్కలు.)

గీ. తఱిమి సాత్యకి గృతవర్మ దాఁక నతఁడు,

నేచి మార్కొని నిరుమేను పూచి యొప్పు, మిగులు మోదుగుఁ బ్రాఁకులపగిది గాఁగ నడరె, మార్కొన్న రెండు వాలంపగముల.
భార భీష్మ. 1. 251.

కం పెంజీకటి ఠద్దాసరి యచ్చుం దదహాతులను గపోణిపోటుల నిరుమేనం బోడుముచుఁ బెనగుచు బోనం బట్టి వటంబుఁ జేర్చి వాఁ డిట్లనియెన్.
ఆము 6. 24

**మేనుపూను** = జన్మమెత్తు, అవతరించు

**మేనుమఱచు** = ఒడలెఱుంగకుండు. పరవశమగు.

సీ మరువంపువలపుఁ బల్మఱు క్రోలి క్రోలి కన్ ప్రామ్ని యూఱక మేనుమఱచుఁ గొన్ని ..
పాండు 1. 181.

**మేనువైచు** = పండుకొను, శయనించు.

వ ఆయ్యంతి ... ఏకాంత భవనంబున విరహ శయ్యపై మేనువైచి చింతాక్రాంతయై యుండె
శివరా. 2 22

గీ. జన్నంపుఁ గూటిదొరల, మాటకయి మేను పూనిన మేటివేల్పు ..
నీలా 3. 51.

జ; మేన, మేనకోడలు, మేనత్త, మేనబావ, మేనమఱఁదలు, మేనమఱఁది, మేనమామ, మేనటికము, మేనల్లుఁడు.

**మేపరి** విశ (మేపు + అరి³) తినువాఁడు.
(చూ పాలమేపరి.)

**మేపాడు.** అ క్రి (మేపు + ఆడు) ఆహారము గొను.

కం. పోఁ మునిమేపాడి కపింజల మత్తటిమఱి వచ్చి శశము నివాస స్థలిఁ గనుఁగొని ...
వేం. పంచ. 3. 108

(మేఁతాడు. శ ర సా )

**మేపు.** స. క్రి (√మేయు) పశుపక్ష్యాదులను ఆహారము తినునట్లు చేయు.

(ఇది మనుష్యాహారవిషయమున నిందాద్యోతకముగా నుపయోగింపఁబడును.)

సీ. ... వత్సముల్ మేపుచు వత్సనృపుడు ...
దశా. 6. 155.

కం. ... కృప కృప, చాలుం గారాకు మేసి చంపకు ప్రజలన్ .
ఆము. ?. 32.

(వ్యావ.) చిన్నతనమునుండియు వీరి కుటుంబము నంతయు తెగమేపఁగా తుదకు విద్యావిహీనులై నారు వానిని అత్తవారు చాలాకాలము మేపినారు

వి 1 (పశుపక్ష్యాదుల) ఆహారము, తిండి.

కం. రేపకడ నీరు ద్రావక, మేపు గొనక మున్న గోవు మిక్కిలి భక్తిన్ .
భార. అను. ?. 18.

కం గోపకుమారకశేఖరు, నేపున నష్పంబు గఱచు టీక్షించి వగన్, మేపులకు దొలఁగి గోవులు, వాపోవుచు నుండె ఘృషభ వత్సంబులతోన్.
భాగ. 10 పూ 647.

చం కనుకని తెల్లవారుననుక ప్రతి గోరెడు పల్లవాళి మేపులనుఁగాని వెడెముఁ గలుపు లాహిరి మేపుల నిద్రబుచ్చి చెందన చిఱునవ్వుతో నవుడె నిద్దురలా యని వింతపైఁడి పట్టిన వెలముద్దుగుమ్మలు పడిన్ శయనించిరి చప్పరింబులన్
కువల 2 112.

2. దోసె పిండి మొదలైనవానికి నూటి కూడఁ జేర్చెడు మినపపప్పు లోనగునది (శ. ర )

**మేపుట్టువు** వి. (మే + పుట్టువు) 1. కుమారుఁడు, ఆత్మజుడు

ఆ అనిచి నోఁకు జని యనుఁగు మేపుట్టువుఁ, బోదివిడొనివ వాఁడు నుదరి లేచి, వ్రేల్మి పోవఁబెట్టి వ్రేల్మిడిఁ దే రెక్కి కడిఁది మగతనంబుఁ గడలుకొనఁగ ...
అచ్చ. రా. యు. 340.

2. కూతురు, తనూజ (శ. ర ).

**మేపుఁడు.** విశ. (√మేయు) మేయునది.

కం. గాలికవణంబు మేపుడు. చాలుపులంబోలి

తరకసంబున నౌఅపూ, స్మౌలి యసలంజిపిం జల, వాలారుందూపు ఉఅక వామిగ చేసెన్. అచ్చ. రా. యు. 293.

మేమఱుఁగు వి (మే + మఱుఁగు) మైమఱుపు కవచము.

సీ మైమఱు ననఁగను మేమఱుఁ గనఁ గత్తళ మ్మనఁగా బొందళం బనంగ. జో డనఁ గవ చంబు శోభిల్లు .. ఆం. భా. 2. 204.

మేము. అ క్రి. స క్రి. అంగీకరించు, ఒప్పుకొను. (చూ. మేముడు.)
జ· మేముడు )

మేముడు వి. (√మేము) అంగీకారము, ఒప్పు దల

సీ. ఇయ్యకో లొప్పుకో లీకోలు మైకోలు మే కోలు సమకోలు మేము జోడఁబడిక యొడఁబాటునుట కనుపట్టుచునుండు సమ్మతి పేరు .. ఆం. భా. 1. 104.

మేమెయి = మయిమయి, మేమే, మైమై వి అనాయాసము.

"క్రి విఐ అనాయాసముగా" అని (శ. ర.)

ఉ. వాలి యెలుంగు సూపి కృతవర్ముఁడు సైన్యము నిర్వరించి యు, స్మీలితవిక్రముం డగుడు మేమెయి నాతనిఁ దాఁకె నస్త్రవి, ద్యాలసితుండు సాత్యకి ... భార. శల్య 1. 322.

గీ వారి మేమెయిఁ గొనియాడువారికోర్కు, లొసర జంగమమల్లికార్జునుఁడు నొసఁగు ... కు. సం. 12. 1004

ఉ. ఆటున మూర్ఛపోయిన బ్రహస్తుఁ గనుం గొని యుంకఁ దాఁకినన్, గీ టడఁగించు నర్జునుఁడు గేనలుఁదే యని భీతచిత్తులై, మేటిమగల్ నలం జెదలి మేమెయి మార్కొన లేక పాటినం, గాటుకకొండ వోలె దళకంఠుఁ డెదిర్చె మహీమహేం ద్రునిన్. నిర్వ. 7 52

మేమే[1] = మేమెయి.

మ. ... ఇద్దరున్ భుజబలాటోపంబుమై నొండొ రున్, మిగులం జాలక కొంత సేపువడి మేమేఁ జోరి రుగ్రాక్ష్మతిన్ భార. విరా. 2. 348.

మేమే[2] వి. రాకవాదులయందు దుఃఖమువలన కలుగుధ్వని కనుకరణము.

కం. సామీ యల్లదరాసురు, సామి స్ఫృత దేహుఁగా వచఃకళ చేతన్, మేమే శిక్షించుతటి, స్మీమే యన విడిచినాము మిము దూరుటచేన్. పార్వ. 5. 128.

మేయము సం విఐ (అ ఆ. అ.) 1. కొలువఁ దగినది 2 జ్ఞేయము, తెలియఁ దగినది.

మేయించే. సం స క్రి. ఊహించు, అనుమానము సేయు.

కం ఆయెడ నిద్దఱుమిండలఁ, బాయక రతిసల్పు కాఁపడఁతుక యెటులన్, మేయించి బొంక వలెఁ జెపు, మా యని చక్రాంగవంశ మండన మనినన్ హంస. 4 161.

మేయు స క్రి. (పశ్వాదులు) తిను, భక్షించు.

చం. నునుఁజిగురాకు మేయుతటి నోరికెలంకులఁ దేఁటి గుట్టవన్, వనతరుశాఖలన్ గువకువ ధ్వనిఁ బాఱుపికాంగనన్ ... మనుచ. 3. 82.

సీ. ... ఎల్ల కడల, మెలఁగుచు నసి నెల్ల మేయుచు గోడలు వెలుగులు పెండెముల్ విఱుగఁ ద్రొక్కి ... నీలా. 2 43.

వ. తియ్యనివోరం జేదు మేయుట న్యాయంబు గాదు ... ప్రభా. 1. 90.

2. అనుభవించు.

కం. మౌని నయినాఁడ రాముని,చే నొగచేపట్టు మేసి చిత్తంబున కు, ద్యానారామపదం బవ, సానవిరామాహ్వయంబు జఱుకగు ననినన్. చం. రా. ౬. 60

6 నోటనుంచు.

మ. కలుచం గోశబిలంబు వెల్వడి యదఃఖడ్గా హిపై వచ్చుచోఁ, జలనం బించుక లేక యీతనిరిపుక్ష్మాపాలసంఘాత మో, చెల హస్తాంబురుహాంగుళీమయమహాసిద్ధౌషధీ పల్లవాం, చలము ల్మేసి భజించుజాఁగుకతన్ సంగ్రామరంగంబునన్. నైష. 6 157.

జ మేఁత, మేఁతకాఁడు, మేఁతరి, మేఁతరీఁడు, మేఁతలాడు, మేపరి, మేపాడు, మేపు, మేషుడు.

మేర వి 1 ప్రదేశము, చోటు. (సం మిరా, ప్రా. మేరా, క మేరె.)

సీ నిట్టలు ద్రోయుచు నెరవులకలమేర లెల్లను బిగియెక్కి యేర్పడంగ ...
భారం. విరా. 1 245.

చం. మదగజరాజకుంభముల మచ్చరికించు నురోజ కుంభముల్, గదిసి కలంతమేరయునుఁగైకొని యున్నవి యెల్లవారికిన్, విదితముగాఁగ ...
నైష. 8. 65.

సీ ఒకమేర సుకుమారసకుమార కరవీరవరవీర తరుసముత్కర మెసంగ....
ఇందు. 3. 30.

2 క్రమము, విధము

సీ. సూకరపతిమేర నేకపద్ధతిఁ బోని యలరు విల్తు నిభంగి యతనుతఁ గని ...
ప్రబంధ 6.

మ, ఆమలాత్ముం డగునట్టిధీరునకు సింగాధీశతిమ్మావనీ, రమణీనాథకుమార తిమ్మమనుజేంద్ర స్వామిరంగణమా, రమణు ల్గల్గి ధరిత్రి దాళ రథిమేర ల్దాల్చిరారు. భామ. 1. 23.

సీ. భయభక్తియుక్తి నెప్పటిమేరఁ దనయాజ్ఞఁ జాలింప దయ్యెను జారకులము . .
దశా. 2. 51,

3. ధర్మము, న్యాయము.

చం .. అమృతంబు సురాళికిఁ బంచిపెట్టి నిఁ కెటువలె నమ్మ వచ్చు జగదీశ్వరుఁడే యొక యింత మేర లే, కిటువలెఁ జేయఁ జూచె మన కెయ్యది తప్పు గణించి చూడఁగన్ . .
దశా 2 382.

గీ. అప్పుడట నుండ మేర గా దనుచు మేమ్ము విడిది కిమెను దోడ్కొని వెడలి రాఁగ, నతఁడు చనపల దంచని యడ్డగింప.. పాండ్వ 4 160.

శా. చేఁన్ బోవఁ బ్రధాను లడ్డమయి యాజ్ఞేపించి యల్లేఁగఁగా, మేరా నీ వెటఁ బోయె దెవ్వఁడవు . ఉ రా 3 230

4. ఏర్పాటు

కం ఏమిట నీకేఁ దక్కువ, నామేరకు నడ్డపడితివి ... భార. ఉద్యో. 3 296.

గి. ఆమేఁ లెల్లను నబ్జజుం డెటిఁగి, సామీఁద గోపించి నయ మింత లేక ...
రం రా యు. 293 పొ 5. పం

గీ. వెఱచి పలుమాఱుఁ జాఱెడివిష్ణుభటులు, విమ్ము నెగచుట దైవంబుమేర గాదె, మనకు నెప్పుడు దైవంబు మంచి దదును, నాఁడు గెలుతము పగవారి నేఁడు వలదు.
భాగ 3 636

5 మర్యాద, హద్దు.

ఉ. అంబుధి మేర తూర్పునకు నబ్ధియ పీ మటు యామ్యదిగ్విభా, గంబునకుం బ్రతీచికిని గౌతమి సీమ ... భీమ 5. 76.

శా. .. బొ,రౌరా యానకు మేర లే దనుట సత్యంబె కదా ధారుణిన్..
దశా. 2. 246., అం. భా 2. 191.

(తుద, అంతము అని భావము )

6. దూరము

వ. మహానుభావులం గొంతమేర యైనం గొలిచి వచ్చుట భాగ్యంబు కాదే..
కళా. 1. 53.

మ. ఇరువై నాలుగుమూళ్ల మేర యని గోసెక్కి-
పంగా నేల ... 1, 53.

7. పద్ధతి

కం. మీ రరయని ధర్మంబుల, మేరలు నెఱుకలును
గలవె మీకుం దగవే, నారాయణభక్తి పరత,
వారించెద ననుట యిట్లు వైదికవర్యా...
నృ సిం. 5 17.

మేరకంబము — సరిహద్దు దెలుపుటకు పాతిన
కంబము.

మ స్వగతక్షోణికి మేరకంబములు ప్రాకైన్యంబు
వస్త్రాద్రియున్. కవిక. 3 146.

మేరమానిసి = మర్యాదగల మనుజుఁడు, పెద్ద
మనిషి.

గీ మేరమానిసి సా దుపకారి గోల, నిగ్ర
లుండు .. సారంగ. 2. 264.

మేఁ(లు)మీఱు = అధికమగు.

సీ. వారాశిగర్వంబు మేఁమీఱె ...
మనుచ 3. 23.

ఉ. ... విషాదహర్షము మేరలుమీఱుట లేర్పడన్
బడన్. జొచ్చె వక్షస్సఁత్సు నిషూదను
చూడ్కుల నీఱు నిప్పులన్ ...
కళు. 2 128.

మేరవెట్టు = కట్టడసేయు

ఆ. శిఖలు చూపకుండ శిక్షింప పాలికినై, నోరు
దెరవకుండ మేరవెట్టి, వేఁడి యెల్ల నుడిపి
విబుధారి కినుకమై, భీతిపాత్రుఁ జేసె వీతి
హోత్రు నృసిం 2 118.

జ మేరగట్టు.

మేరకుఁడు నం వి. అ. పుం విష్ణుశత్రువు

మేరగట్టు వి. (మేర + గట్టు) చక్రవాళ పర్వతము

సీ. చుట్టుకొం డన మేరగ ట్టనఁ జక్రవాళాచల
సంజ్ఞలై యలరు ... ఆం. ఛా. 2. 28.

మేరు(వు), నం వి. ఉ. పుం. హేమాద్రి, సుమేరు
పర్వతము.

మ, బలవన్మేరుశరాసనంబును బర బ్రహ్మాస్త్రము.
గల్గుట, శ్వేలుకానిం దృణ మైన చాపమున
గాలిం బోవువేయల్గులం, జలమానించి సగంబు
చేసి తవు నౌ సంకల్ప సిద్ధుల్ గొనం, బలుమేరు
న్నిరసింప లేఁజిగురుఁగొమ్మం జేవ గాకుండునే
వసు. 3. 179.

ఉ. అక్కట దిక్కులేమి రజతాచల మొక్కఁడు
పెల్లగించె వే, లొక్కఁడు వంచె మేరు మఱి
యొక్కఁడు వింధ్యము నేల ఁజూచె ...
చంద్రా. 1. 15

మేరుకమ. సం. వి అ. పుం ధూపము, యక్ష
ధూపము (వాచ).

మేరుధాముఁడు. సం. వి న్ పుం శివుఁడు.

మేరుపృష్ఠము. సం. వి. అ న. 1. స్వర్గము.

2. ఆకాశము.

మేరువు వి. 1. వీణాగ్రము.

ఉ. .. పచ్చలం. బన్నినయట్టి మేరువును బాగగు
తంత్రులు మించ నొప్పమే, ల్కిన్నర శెంతఁ
జేరి యొుకకిన్నరకంఠి యొునంగ నయ్యెడన్.
చంద్రి. 2. 95 ఆం. ఛా. 1 126.

2. ఎక్కుటకును బరువెక్కించుటకు పొడుగుగా
కట్టవలె వేయించెడియునుక లోనగు వానిదిబ్బ.
సారుప

కం మేరువఁ తీరు కురుఁజుల, సౌరు వితానప్రతాన
చతురపతాకా, చారువిపణి గారుడమణి,
తోఁణఘృణి యేమి చెప్పుదుం బురిలోనన్.
రా. వి. 5. 49.

ఉ. వేడుక నిట్లగణ్యరుచివిభ్రమధన్యయగేంద్ర
కన్య రాఁ, జూడఁ దలంచి నిల్చిరి వసుక్షితి
పాలపురీపురంధ్రికల్, మాడువులన్ హజార
ముల మచ్చుల సజ్జల గోపురంబులన్, మేడల
నాట్యశాలికల మేరువలన్ భువనేశ్వరంబు
లన్. వసు. 6. 64.

గీ. ఎచటఁ జూచిన వాణిగా నేర్పరించి, పెద్ద

ముత్యాల ముగ్గులు పెట్టువారు, నెదు
జగపు(పుమేగుపు లెత్తువారు, నైరి పీటను
గలిగినవార లెల్ల

యయా. 4 81., విజ. వి 2 69.

1 హారము మధ్యమందు వ్రేలెడుమణి (శ ర)

మేల సం వి. అ. స్త్రీ 1. సంగమము, కూడిక
2. సభ, పెక్కం్రడు కలిసినసంఘము
3 సుర్మా, కాటుక. 4.నీలిమందుచెట్టు.5 మసి,
సిరా 6. రాగానుగుణముగ స్వరస్థానములు
యందు మెట్లు కుదుర్చుట, శ్రుతి సరిపెట్టుట

మేలగొను. అ. క్రి (మేలము + కొను) పరి
యాచకములాడు, మేలమాడు.

సీ. నును వెడంద యురంబునను జీనిసరిపెణలిమ్న
జన్నిదముతో మేలగొనంగ .

దశా 1 27

మేలనము. సం. వి. అ. న. 1. కూడిక, సంగమము
కలయిక, 2. సభ పెక్కండ్రు కలిసి
3. కలుపుట 4. యుద్ధము, తాకుట.

మేలమాట. వి. (√మేలమాడు) పరిహాసముచేయుట.

చం. గురుతర సుందరాననము కోమలికంబులు
ముద్దుమాటలు, వన్నెపు లతిప్రసంగములు
నప్పుట నప్పట మేలమాట లంతరిత కళా
నిధానములుఁ దాడనపీడన భాషణంబులున్,
బరువడి నొందనేర్పు ప్రియభాషలు గల్గు
నరేంద్రభామకున్ విధి. 6

మేలమాడు. అ. క్రి. (మేలము + ఆడు) పరిహా
సించు, గేలిచేయు.

క. నిను నెఱుఁగ కుండి యాదవుఁ, డని సఖుఁ
డని మేనబావ యని యే సహాభో, జనములు
సల్లాపంబులు, నొనరించుచు మేలమాడు
చుండుదు నెపుడున్.

భార. భీష్మ. 1. 217.

గీ. ఓమె యేమె యిదే మేమె లేమ యేమె
మేఘుపుష్పంబు దే వంచు మేలమాడ.
మేమెమే మెలు దలుచయ్యో మేలు మేలు.
మేక మేఁ కన సభవారు మిగుల నగిరి.

నైష. 6 114.

క. కలహంసగమనల కన్నులబెళుకులు మీన
పఙ్క్తులతోడ మేలమాడ అని. 2 56.
(ఇట నుపమాద్యోతకము)

మ. ... తమలము బుష్పంబులన్ లోనుగా
లలితద్రవ్యము లెల్ల నా కొసఁగె మేలం
బాడుచున్ బ్రీతితోన్ ... దశకు. 4. 20.

మేలము. వి. 1 పరిహాసము.

క. వనితలు మేలుపుమెయి మెలు, పునఁ దిగిచిన
నొప్పుహారములు మొదలగు ప్రసన్నతితోడవులు
గ్రద్దలు తివి, యనరేంద్రులు కొంద ఉసిరి
యచ్యుత కంచే. భాగ.స్త్రీ. 2 17

వ. అన్నారినివహంబును మేలంపుమాటలకై పడి
హంసగమన హంసాభిముఖ యైన యాత్రఁ
[illegible]

నైష. 2. 46.

గీ. మేల మన మందె మేల మనఁగఁ, బొలుచుఁ
బరిహాసములు .

ఆం భా. 1. 159

2 పరిహాసోక్తి

కం రాజునకుఁ దియ్య మెసంగెడు, పూజావచన
ముల నెయ్యపుంబలుకులఁ జేరోజుమెయి
ఒంపుమిత్రసమాజములకు మే ములఁ గుమా
రులకుఁ దగన్ ...

భార. ఉద్యో. 3 179.

చం. బలిదనుజేంద్రుఁ గట్టి లని పల్కఁగ విందుము
గాని నేఁడు మా, చెలి యదె పుష్పదామక
ముచే సినుఁ గట్టగఁ గంటి మింక నె, మ్మెలు
పచంపరా దనుచు మేలము లాడెడుసల్పిత్య
బొట్ల సన్నల నెసకొల్పుచుం గెలన
నవ్వెర ధర్మజభీమ ఫల్గునుల్.

పారి. 5. 81.

3 జాగరూకత

కం. ఉలోనన తా మేల్కని, బాలారత్నంబు కూర్మిపతి కౌఁగిటిలో, నాలిథ యగుటఁ గదలక, మేలమ్మునన నుండె విభుఁడు మేల్కను ననుచున్. కృ శకుం 3.59.

జ మేలగోను, మేలమాట, మేలమాడు.

**మేలము** సం వి అ పుం కలయిక, మేలనము.

కం అమ్ముదిత రత్నకటకచయ మ్ముదితనినాద మయ్యె నయ్యెడఁ జల మేలమ్మని పతితోఁ దగు మేల మ్మని సహజానురక్తి లాలించు క్రియన్ . ఎసు 6. 80

సీ పొలుపొంది నలగుణంబులపై క్రుతు ల్గూర్చి సారెఁ దన్మేళప్రకార మరసి...హా న. 2. 63.

2 నివాసము

సీ రమణ లక్ష్మిమందిరమ్ము మేలమ్ముగాఁ గని సదాశి గుణమ్ముగా గ్రహించి .విష్ణు. 1. 44.

**మేల(క)ము** సం. వి అ పుం 1. సమావేశము, కలయిక. 2. ఐకమత్యము 3. అంగడ, బజారు, సంత 4 సంఘము 5. సభ

**మేలాంధుకము.** సం. వి అ. పుం మసిబుడ్డి, సిరాబుడ్డి

**మేలాంబువు.** సం. వి. ఉ. పుం. మసిబుడ్డి, సిరాబుడ్డి (వై. ని ).

**మేలానందము** సం వి. అ. పుం. మసిబుడ్డి, సిరాబుడ్డి (వై. ని.).

**మేలిగాఁడు.** వి. (మేలిమి+కాఁడు) శ్రేష్ఠుఁడు.

సీ. నలువతూ పరివోసి బలిమిమై నద్దోసకారి రక్కసు మేలిగానిమీఁద, నేసిన .. అచ్చ. రా. యు 267.

**మేలిమి (మ్మి).** వి. (మేలు+ఇమి) 1. శ్రేష్ఠత; అధిక్యము.

చం. ... ఏ,మిగతిఁ దలంచినం బగకు మేలిమి లేమి ధ్రువంబు కేశవా ... భార. ఉద్యో 3. 21.

ఉ .... ఆజికిం, బూనితి నిల్వు మింక నెటఁ బోవఁగ వచ్చు భవద్దిగీశల, ఓమ్మనితవద్భోగముల మేలిమికిం దుది యయ్యె నియ్యెడన్ ... పారి. ఉ. 3.261.

కం. వేలిమి నేసె మృగాంకుని, మేలిమి గను గత యిడె నుమేధుఁడు నుదుటన్ .. దశా. 5. 75.

చం. చదువుఁ మేలు సాముపస చక్కఁదనంబు తెలుంగు సంపదం, బొదలెడుమేల్మి పేర్మిగల భూరిభుజాబల శౌర్యధైర్యముల్ , నద యతయు స్వివేకసంస్థితు లాకృతిఁ జెందెనో యనన్ శుక 1 263.

2. అపరంజి ప్రశస్తమైన బంగారము.

ఉ చొక్కపు రత్నపుందళుకు బోయగపున్నెర మేల్మితొట్లలో, ముక్కున నుంచి లేట వగ మాటలు నీ కెనయన్ సువర్ణ స, మ్యక్కర కంకణధ్వనులు మూర్తిలయం గొలుసుల్ గదలుచ్చుచున్, బొక్కుచు రాజనందనకు జోలలు పాడుదు రంగనామణుల్ .. ఇందు. 2. 140.

సీ. ... అతిశుద్ధచామీకరాఖ్యలు చనఁ గడాని, మేలిమి యపరంజి జాళువా కుందనం బుదిరి నా .... అం. భా 2. 279

3 వలపు, ప్రేమ

గీ. అనిన విని యూవిశాల యూరార యనుచు, మెచ్చి తనమదిలోఁ గలమేలి మెల్లఁ, దెలిసితివి జాణ వౌ దని పలికి ... హంస 3. 228

విణ 1. శ్రేష్ఠము, ఉత్కృష్టము.
(దీనికి వృత్తియం దంత్యవర్ణము వికల్పముగా లోపించును.)

వ. ... కయ్యంబు గజిబిజిగాఁ దలంచుచు వాని పిన్నతమ్ముండు మేలిమిరథంబునం దగు తురంగంబులం బూన్చికొని... భార. ద్రో. 4 285.

ద్వి మీ రానతిచ్చిన మేలిమిమాట, వారు వీరన కెల్లవారికి హితము ...
రం. రా. అయో. 86 పు. 16 పం.

సీ ... సభాపర్వంబు విని పాపిష్ఠ, మిడుపది యారణ్య మింపార విని తనివండ్లును మేలి దుంపలును శీత, జలకుంభములు గలసర్వశాస్త్రము సమృద్ధి గలిగించునన్న మిం పొలయ నొసఁ గఁ, గీడను ... హరి ఉ. 10. 300.

గీ . పాలఁ బుట్టినమాత్రాన మేలిగుణము, నేఁడు నీ కేల గల్గు నో నీరజారి ..
మనుచ. 3. 41.

2 శుభప్రదము, మేలుకలిగించునది.

ద్వి మేదినీవిభుఁ గాంచి మేల్మియశతలు, వేద మంత్రముల దీవించి యిచ్చుటయు ...
ద్వి. హరిశ్చ. పూ. 444 పం.

మేలిమిగట్టు వి (మేలిమి+గట్టు) మేరుపర్వతము, బంగారుకొండ

సీ జగముల దిగుల నిచ్చలపు మేలిమిగట్ట ...
అచ్చ రా. యు 204.

మేలిల్లు అ. క్రి (√మేలు) శ్రేష్ఠమగు, ఒప్పు.

కం. ఎలమెడు జలజాతంబులు, మెలరారెడి జల చరములు మేలిల్లెడుని, క్రొక్కల మండ నెందుఁ బోయెనో జల మనునాశంకఁ జేయు జలము మలరుచిన్ ... భా సం 10. 391.

సీ. మేలిల్లునీలతమాలమేల్ ధూమసంహతు లపఁ దనరు నత్యసితభాతి ...
భా. సం. 5. 561., 1.36.

కం. మడియిల్లు తత్వముల వెను,బడక నిజాజ్ఞా ప్రశస్తి భావింపఁగఁ బొ,ప్పడు సాత్వికగుణ సంగతి, మృడుఁ డనునామంబు నీకు మేలిల్లు శివా ... శివ పా. 82.

వి. ఒప్పు, పొగను.

గీ. ... చెల్లుఁబై మేడ యొప్పు మేలి ల్లనంగ ...
ఆం. భా. 3. 48.

మేలిల్లు². వి (మేలు+ఇల్లు) చంద్రశాల, పైమేడ.

గీ ... చెల్లుఁ బై మేడ యొప్పు మేలిల్లనంగ ...
ఆం. భా. 3 48.

మేలు వి బొ. అనా. (క. మేలు.) 1. శ్రేష్ఠత. గొప్పతనము, ఆధిక్యము

(బ. మేలులు. మేళులు, మేళ్లు, దీనికి కొన్ని పట్ల హల్లు పర మగునపు డుత్వలోప మగును.)

వ. ... కొదమతామేళ్ల మేళ్ల నగుమీఁగా ళ్లతో ... ఆము. 6. 98.

చం. అనిన సువందపల్కు విని యాయెలనాగ మతొక్కరాజుమేల్, వినగఁ దలంచి వేడ్కఁ బదవే పదవేగలి చిత్రలీలతోఁ ..
ఇందు. 5. 130.

శా. ఏయేభూములు చూచినావె కొరవంజీ రూపలావణ్యరే, ఖాయుక్తిం దగుకొమ్మ లెందుఁ గల రీక్ష్మామండలిన్ హావభా, వాయత్తైక విలాసవైఖరులమే లం దెవ్వరిం జెందు ... శుక. 1. 17

2. వరము, దేవతలవలన నగులాభము.

మ. ... సరోజాక్షా తపస్సిద్ధికిం, దగుమే లిచ్చుటఁ గాదు పూర్వవిహితార్థం బింత కిం జేటికిన్ ... ఉ. హరి. 2 200

3. ఉపకారము.

కం. తను లోకము గొనియాడఁగ, విని యుబ్బఁడు సజ్జనుండు వెండియు గడుమే, లొనరించుఁ గీ డొకించుక, యును దవదెసఁ దోఁపనీక యుడుపుచు వచ్చున్.
భార. ఉద్యో. 2.48.

గీ. మీకులముశేటఁ జేపట్టి మీవిరోధి, యైనపులిఁ జెంది మెచ్చఁగ్గ మూనెఁ గాదె, యట్టిమే లైన నెఱిఁగి యాహరుని పేర నెనఁగుసొంంగ ధరుఁ జూపుఁ డేణులార. సారంగ. 3 235.

4 సుకృతము, పుణ్యము.

ఉ .. శరీరధారులకు నాపద వచ్చిన వారి
యాపదల్, గ్రన్నన మాన్చి వారికి సుఖం
బులు సేయుటకన్న నొండుమే, లున్నదె ..
భాగ 9 647

5 సుఖము

కం గ్రక్కునఁ జని యక్కలతోఁ, జక్కెరవిలు
కానికేళిఁ జతురుఁడనైనేఁ, దక్కాంతల
నిద్దఱ నిరు, ప్రక్కల నునిచికొని మేలు వడ
సెద ననుచున్ .. శుక 2. 346

ఉ. . ఎలఁ బ్రాయపు ముద్దుగూఁతుమేలెన్నక
యిచ్చితిం జడునకే వని నీజనకుండు చింతి
లున్ .. దశా 6 37.

గీ కామసుఖదివ్య సుఖములు కాంతఁ దొలఁగు,
మేలిషోడశాంశంబునఁ బోలలేవు, గాన
కామము నిను శత్రుఁ గరణిఁ జంపి, బ్రహ్మ
పురమున నుండెద రాజుఁబోలె
భార. శాం 4 53

శాంతి పర్వణి శ్లో. యచ్చ కామసుఖం లోకే
యచ్చ దివ్యం మహత్సుఖం, తృష్ణాక్షయ
సుఖస్యైతే నార్హతః షోడశీం కలాం. అని
గీతయం దున్నందున మూఁ భూతభారతాను
సారమున మేలుశబ్దమున కిట సుఖమర్థము.

6 లాభము.

గీ సింధురమహాశ్వ ముఖ్యముల్ చేర్చుదాల, దీవి
వణిజుల కూళ్లు సద్గృహములు పురిఁ.
గొలువుఁ దేజంబు వెల మేలు గలుగఁ
బ్రాఁత, వారిఁగాఁ జేయు నరి నవి చేరకుండ.
ఆము. 4 258.

సీ. మేలు చేరిన మహీపాలున కెఱిఁగించి
యనుభవించుట నీతి .. దశకు. 6. 17.

7. శుభము.

ఉ. మేలున సంతసిల్లునెడ మేకొని యాపద
లొందు ... భార అర. 5. 341.

ఉ ... వి, శ్వేశ్వర మేలుకుప్ప నిను నెవ్వఁడు
గోరి భజించు వాఁడపో, శాశ్వతలక్ష్మి
మృత్యుంజయ నాఖ్యయుతుండు ..
భాగ 10 పూ 127.

వ. ఇంతనుండియు మీకు మేలయ్యెడు ...
హర. 3 19

8. శ్రేయస్సు, క్షేమము.

శా. ఈ యర్థంబు ఘటింపవన్న నృప నీ కెంతేని
మేలయ్యెడున్ ... నైష 3. 70.

కం. ఓవెఱ్ఱులార యేఁటికి, నీవెడఁగు విచారములు
సహింపఁగ రాదా, యేవారికైన మేలా,
చావులు తర్కితము లుగ్ర సంగ్రామములన్.
భీమ. 4 52.

9 హితవచనము, మంచిమాట.

వ. నాకు నీవు సుయోధనునట్ల కావున మే
లాడెద ... భార ద్రో. 1.51.

10. న్యాయము, పాడి

ఉ. మంచికుమారులం గుసుమ మంజుశరీరులఁ దెచ్చి
చెల్లరే, యంచితవజ్రసారులు మహాద్రి కఠో
రులు నైనమల్లురం, గ్రించుగఁ బెట్టి రాజు
పెనఁగించుచుఁ జూచుచు నున్నవాఁడు మే
లించుక లేదు ...
భాగ 10. పూ. 135

11. అందము, చక్కఁదనము.

సీ. కేళిమై నొక్కట లీలఁ గ్రేళ్లనఁగెడువాలు
గు నోగలమేలు డించి ...
భార విరా. 2 83.

సీ. అడుగుఁదమ్ములకాంతి విడివడి పగడంపు జిగురు
టాకుల మేలు చిందు సేయు ...
జాహ్నవీ. 4. 21

12. మదము.

ఉ. ... మస్తకమంటుచు దృష్టిదండగ, నృట్టిన
కర్ణచామర మపారపుమేలును మేలు మేలనం
బట్టపుదంతి నిల్పె నరపాలుని చెంగట మావటీఁ
డొగిన్. రా వి. 2. 45.

మ. తలిరుంబోంపపుడాలు పూరజపునిద్రాజాలు నత్తేటిగం, టలచాలున్ విరితేరెమేలు తరు లంటం బ్రాకు లేదీగ చేక్కల జారీలు ... వలరాచంతుల కైవడిన్ వవము బ్రోవన్ బ్రిమ్మరున్ దెమ్మరల్. చంద్రా. 4. 38.

13. వలపు, మోహము.

గీ మీకు నామీఁద మిక్కిలిమేలు గలిగె, వేని దేవరయూడిగం బిచ్చవచ్చి, నట్టు గాలింప కుండ వే నంతకుమతి, నయ్యె.. వి.పు. 2.219.

ఉ. చెప్పెడి దేమి నాకుఁ గలజీవన మంతయు నీక కూర్చి యెల్లప్పుడు నిన్నుఁ బాయక ప్రియా చరణం బొనరింప నేర్తు నీ,చొప్పున కీవు నియ్యకో కొని చొక్కపుజక్కవగుబ్బలాడి మేల్, దప్పక యంతరంగమునఁ దారిచి నన్ను నదీనుఁ జేయవే. వసు 2. 130.

గీ వలపు కూరిమి మేలు నా నలరుఁ బేళ్లు మోహమునకును శారదాంబుదనిభాంగ ... అం. సం. మాన. 47

14. సొంము, నిగ్గు.

శా .. ఈసభామండప, శ్రీవిస్ఫూర్తికతంబున న్మిగులనాచిత్తంబు నానందము, ద్రావైచిత్రిఁ గరంచుచున్న యది యేతద్ద్వారకా పట్టణం, బీవిశ్వంబునఁ గల్గుమే లిదియపో యొందు న్వివేకించినన్. కళా. 2. 12.

కం, నటనాహంకృతిఁ దమలోఁ, జిటిపొటిజగడంబు లూర్వశీరంభలకుం, బొటమిన మే లేర్పఱుపఁగ, నిట నిను రప్పించె నిర్జరేశ్వరుఁ డధిపా. విక్ర. 2. 87.

15. పై భాగము, ఉపరిదేశము.

చూ. మేలిల్లు, మేలుకట్టు.

16. భద్రము, జాగ్రత్త.

సీ. మే లుప్పరంబు తుమ్మెదమందరొద మందటిలు పొదల్ దూఱుచోఁ గలువకంటి ...

చంద్ర. 3. 148.

విశే. 1. మంచిది, ఉచితము.

శా ... ఏ, మేమీ కృష్ణుఁడు మందలో బలెనె తా నింద్రద్రుమోత్పాటనం. బీమై నిచ్చటఁ జూప వచ్చె నిది మేలే ... పారి. 4. 60.

ఉ. ఏల దురంతవేదన మెయిన్ బొరలాడెదు తాల్మి దక్కి మేలే లలితాంగి యెంతపని లెమ్ము. ... మనుచ. 3 64.

గీ. తాము చేసినయవి యెల్ల ధర్మములఁట, మేము చేసిన దఘమఁట మేలు గాదె, యు కరణి వచ్చె వారల కింతయుగ్ర, గణ్యతయు మాకు నింత లాఘవము జగతి దశా. 1 254.

(ఇందు వ్యతిరేకలక్షణచే అనుచితమును దెల్పును)

1. శ్రేష్ఠము.

చం. నుతజలపూరితంబులగు నూతులు నూటికి కంటె నూనృత, వ్రత యొక బావి మేలు.... భార. ఆది. 4. 96.

కం. అతిసంభ్రమమునఁ ద్రిజగ,త్పతి నర్చన సేయఁ దలఁచి పరిమళమంద. స్మితకుసుమ మృదుల పల్లవ, తతిలో మే లేఱికొని ముదం బొదవ మదిన్ .. కు సం 5. 501.

గీ. దీవులం దెల్ల నేరేటిదీవి లెస్స, భరతఖండంబు మేల్తదంతరమునందు .. హం 2. 8.

3. శుభప్రదము, క్షేమంకరము.

ఆ. మంచివారి కెల్ల మంగళప్రదలయ్యుఁ గల్లరు లకు మేలు గానియట్టి, తనువు లెన్నియైనఁ దాల్చి లోకములకు, నేమ మెల్లప్రొద్దుఁ జేయు దీవు ... భాగ. 10. 93.

కం. దానవనాయక నీకుం, గానుకగా మేలువార్త గలిగినఁ జెప్పం,గా నరుదెంచితి ... వరాహ. 11. 39., ఆము. 5. 120.

4. అధికము; ఎక్కుడు; అధికురాలు.

శా. శైలోత్తుంగ శరీరుఁడైన రిపుమస్తం బుగ్రదం భోళికిన్, మేలై పేర్చుకఠోర ముష్టినిహతి న్నిర్భి న్నముం జేయఁగా ... హరి. పూ. 7. 104.

మ. పరివాదాస్పదవాద మోదమదిరాపానంబుచే మత్తులై, హరి మేలంచు హరుండు మేలనుచు నాహా కొంద ఱీపొం దెఱుంగరు కైలాసనగం బునందు మును లేకత్వంబు భావించిరి. ... ఉ హరి 2. 68. ఆము 6. 80.

ఉ. అరయ నెఱ్ఱప్రోలని కులాంగ్గన గొమ్మమ మేలు సీతకున్, వారిజబంధు కాంత్తకును వాసవు కాంత్తకు లక్ష్మిదేవికి ... కా ప మ. 5 4 7 పొ.

5 బాగు, లెస్సయైనది.

సీ మా ... ఆంధ్రకవిత్వంబు నందుఁ బ్రబంధంబు మేలుగాఁ దజ్ఞులు మెచ్చఁ జెప్ప...విక్ర 1 20

క్రి. విశే. సంపూర్ణముగా.

సీ పరశురామునకు మేల్సరియైన తనయందుఁ గలిగె భంగంబు శిఖండిచేత .

భార. భీష్మ 1 47

అవ్య. 1. ప్రశంసను దెలుపును
(దీనియామ్రేడిత రూపము మేలుమేలు.)

ద్వి. మేలు నీమాటలు మెచ్చి రందఱును జాలుఁ బురే రత్తసంవాద మేల. . ద్వి. హరిశ్చ పూ. 840 పం.

ఉ పిం.గారము బాపురే బవరగడ్డము మేలు నుఁరస్థలోరుని, స్తారముచాఁగురే... శుక.1 268

కం. .. వీరులు సూచి మేలు మే లని పొగడన్... భార. ఆది. 6, 32.

2. పరిహాసమును దెలుపును.

గీ. ఓమె యేమె యిదే మేమె లేను యేమె మేఘపుష్టంబుఁదే వంచు మేలమాడ, మేమె మేమెలు దఱు చయ్యోమేలుమేలు. మేఁక మే కవ సభవారు మిగుల నగిరి ... నైష. 6 114

మ. ... యా, మికుఁడో నాఁ డిరిగెన్ గొలంకుర మకు న్నే లెంత హీనంబొకో ...

చూ. మేలిమి, మేలిమిగట్టు, మేలిల్లు[1], మేలిల్లు[2]. మేలుకట్టు, మేలుకను, మేలుకనుపు, మేలుకమ్మి చీర, మేలుకాంచు, మేలుకొను మొ.

మేలుక(ల్క)ట్టు వి. (మేలు + కట్టు) 1. ఉల్లెడ, వితానము

సీ అరుదార మేలుక ట్లాయితం బై చూడ నొప్పారి తను పగుచప్పరములు . భార ఉద్యో. 1.95.

కం. సరోవరలక్ష్మికిఁ, గట్టిన కెంబట్టు మేలుకట్టుం బోలెన్ .. కు. సం. 10. 886

సీ మృదులాంబరంబుల మేలుకట్టుల చేత సరిలేని ధూపవాసనల చేత . జై భా 5 157.

ఉ ... పచ్చలా పలక పీటలు మేలినకాను కుట్టు మేల్. కట్టులు గ్రొత్తనెత్త పలకల్ తెరలుం బిక దారిజారువా, బిట్టలగూండ్లు .. వాల్మీ 3 84..

సీ పట్టుఁబుట్టముల మేల్కట్టు లమర్చి కేవని బయళులను గొల్లెనలు వన్ని .. నీలా 3 48. ఆం భా 2. 158

2. మెట్టు

ద్వి. స్ఫటికంపు మేల్కట్లపై నెక్కవేని, కుటిల కుంతల యెట్లు గుట్ట లెక్కెదవు . . ద్వినల. 2 భా. (శ ర).

మేలుక(ల్క)ను = మేలుకొను అ. క్రి. (మేలు+ కను) నిద్రనుండి లేచు, మెలకువ నొందు

కం. . ప్రస్పదిత పారకసవముల, క్రందున ధర్మజుఁడు మేలుకనియె నరేంద్రా. భార ద్రో. 3. 6.

సీ. తాఁకినవాఁడు దత్తఁపాటుతో మేలుకని ముచ్చ్రము చ్చంచుఁ గళవళించె . . కాశీ. 4. 124.

కం. అనిలసుతుం డంతన మే,ల్కొని నీల్గుడు నతని వజ్రఘనకాయముఁబొం, దినలతికాజాలము తె,ల్లను ద్రెస్సె ... భార. ఆది. 5. 172.

మ. అనఘా యింత తదీయసుప్తిదళ కర్షంబైన కాలంబు మే,ల్కనుచందం బిది నా నెఱుంగఁ డొకఁడుం ... హరి. ఉ. 9. 92.

మేల్కానకనిద్దుర = పెద్దనిద్ర, చావు

ఉ. వాలుమగం డతం డనఁగ వానికి నెక్కుడు దళాన్యు శక్తిచే, నేలకు వ్రాలి మేల్కనని నిద్దుర నొందితి వయ్య తమ్ముఁడా. భా. రా. యు 1587

మేలుక(ల్క)నుపు స. క్రి. (√ మేలుకను) మేలుకనఁజేయు, మేలుకొలుపు

గీ. ఇట్టిదురవస్థఁ బొందితి నేమి సెప్పఁ, గలదు కుంభకర్ణుని మేలుకనుపుఁ డింక .. భా. రా. యు. 654.

సీ. దుగ్ధాబ్ధి లోపలితోయజాతుల మేలుకనిపి తీరంబున కనుపకున్న ... భోజరా 1. 29.

సీ కాంచీపురోపాంత కంపాతరంగిణీ నాళీకావన రాజి మేలుకనిపి . . కాశీ 1. 130
(ఇట వికసింపజేయు అని భావము)

కం అని తనుఁ గౌశికముని మేల్కనుపంగా లేచి ప్రథమకాలవిధులు దీర్చి .
భా. రా. బాల 338

మేలుకమ్మిచీర. వి. (మేలు+కమ్మి+చీర) ఒక మూఁడంగుళములవెడల్పు చాయనూలితో నేసిన అంచులు గలకోక (శ. ర.).

మేలుకా (ల్కా)ంచు = మేలుకొను. అ క్రి. (మేలు+కాంచు) నిద్రనుండిలేచు.

గీ. మంజుపాఠకరవమును మధురమాగ, ధస్వనంబును వినుచు మాధవుఁడు మేలు కాంచి ...
భాగ. కాం. 2. 128.

గీ. మృదులతల్పంబుచితశయ్య మేలుకాంచి, యమలరుద్రాక్షధారణం బాచరించి.
హర. 7. 30.

సీ పసు వడ్డింపంగ నింపారఁ గుడిచి మెత్తనిశయ్య నిద్రించి వినుతభద్ర, గీ. గావకరిబృంహితముల మేల్కాంచునట్టివారు ...
భార. ఉద్యో. 3. 188.

గీ. వెన్నెలలు గాసెఁ గన్నులవిల్తునయ్య, నిదుర మేల్కాంచెఁ గడలి నయ్యాదనునందు ...
అచ్చ. రా. కిష్కి. 69.

మేలుకొ(ల్కొ)ను = మేలుకను, మేల్కాంచు. అ. క్రి (మేలు+కొను) నిద్రనుండి తెలివి నొందు, జాగ్రదవస్థనందు.

గీ, మేలుకొనఁగదె రాజన్యమీనలక్ష్మ, కాలకంఠసమర్చనాకాల మయ్యె.
నైష. 8. 13.

మ. అనినం బెబ్బులి చిన్నవోయి మఱి యొండాలోచము ల్మాని యుం,డె నరేంద్రాత్మజుఁ డంత మేలుకొని యొన్ దెందంబునన్ . .
విక్ర. 3. 94.

గీ. నిదుర మేల్కొని వేదము ల్నెమకి కానఁ జాల కంభోజభవుఁడు ... దశా. 1. 202.

మ. జయ శీతాంశుకులావతంస నిషధస్వామీ మహారాజ య,వ్యయధైర్యాకర నిద్ర మేల్కొనుము సంధ్యావేళ యేతెంచె ..
నైష. 8. 3.

2. రాఁబోవుకష్టము తప్పించుకొను, జాగ్రత్తపడు.

ఉ. . . అవసానపు వేళల దండధారచే, జడ్డలె కాని మేలుకొన సాగ దయో తలపోసి చూచినన్, బిడ్డలు లేనివాని కడవిన్ మృగజన్మము రోఁత పుట్టదే ...
వి. పు. 5. 102.

(వ్యవ.) అతఁడావిషయమున ముందే మేల్కొన్నాడు.

స క్రి. మోహించు.

ఉ. రా. 4. ఆ. (శ. ర.)

మేలుకొ (ల్కొ) లుపు (లుప్పు) స. క్రి. (√మేలుకొను) 1. మేలుకొనఁ జేయు.

గీ. ఎందు ద్విజరాజు నా మించు చందమామ, మనల నిద్రాంధకారాబ్ధి మునుఁగఁ జేసె, మేలుకొలిపె నిమొందు . . ఉ. రా 4. 248.

వ. చని తదీయగేహదేహళీ ప్రదేశంబున నిలిచి పరిచారికల మేలుకొలిపి ... విక్ర. 7. 159.

గీ. మేల్కొలిపి యుండ వింజా్ట్య మెల్ల మెల్ల
హార. 7. 121.

సీ నిలుచుండి వీణచేతులఁ బూని తెలిగంటి
బయకాఁడు మేల్కొల్పుపదముఁ బాడ ..
కువల. 2 125

2. వ్యక్తీకరించు, స్పష్టపఱుచు.

గీ. అతివ పీతావదాతారుణాసితమణి, దీప్తికల్పిత
దేహోపదేహ యగుచు, పొంగొరోచనా
గంధసాంఘుసృణ, మృగమదాలేపపునరుక్తి
మేలుకొలిపె ... నైష. 5. 6

**మేలుకోలు.** వి (√మేలుకొను) 1. మేలుకొనుట.

సీ మేలుకోలును జగ మేలుకోలును కళ్కిఁజాలు
నాలను గలలీలవాఁడ ...
ప్రబంధ. 224.

2 మేలుకొనుట, అవబోధము (శ. ర.).

**మేలుచే(యి)** వి, (మేలు+చే) పెచ్చు

చం. అనితల నీవ పాండుతనయాపలి కెప్పుడు
మేలుచేయు నా,తనయులకుం బరాక్రమము
తక్కువయుం బ్రకటింప విందు ..
భార భీష్మ. 2, 258.

(మేలుచేయి. శ ర. పా.)

విశ. పెచ్చైనవాఁడు.

సీ త్రిదశేంద్రుఁ డాత్మీయపదపరిభ్రష్టుఁ డై
యదితిఁ గావఁగఁ బోయి యాహవమున,
బలి మేలుచే యైనభంగియు వజ్రంబు గై
కొన్న తన్ను లాకాశవాణి, వలదన్న లె
ఱఁగును వరుసతోఁ జెప్పిన ...
హరి. ఉ 10. 191

ఉ. హేమధరాధరేంద్రమున కెక్కటి పెద్ద
భృతిన్ భుజంగమ, స్వామికి మేలుచేయి
పటువాగ్విభవంబున ... నైష 1. 28.

గీ. అట్లు దనవారు మేలుచేయైనభంగి, వినినధృత
రాష్ట్రుఁడు ... భార. భీష్మ. 23.

గీ ఖండనంబునఁ బార్థునేఁ బడక నేఁడు
మేలుచేయైతినేనియు మృత్యువునకు, నెన్నఁ
డును నగవడ ..
భార కర్ణ. 2. 107.

(గెలుపుకలవాఁడు. అని. శ. ర.).

**మేలుప(ల్బ)డు** = మేలువడు. అ. క్రి (మేలు+పడు) వలపుగొను, మోహమందు.

ఉ ఎవ్వనిఁ జూచి మేలు పడితే యరవింద
దళాక్షి నీమనం, బెవ్వఁడు నొచ్చెఁ జెప్పఁ
గదవే మదకోకిలవాణి ... విజ వి. 3. 81.

గీ ... మేలుపడినకోమలులచేష్ట, లట్టుకాఁగద
ప్రాణనాయకులయెడల ...
కవిరా. 5 37.

మ. ... నఖిహితోక్తులపరాకున్ మీఱనిక్కొమ్మ
యొక్కనిపై మేల్పడి యేఁగుచున్న నొలపుం
గాన్పించె నాచూడ్కికిన్ ...
ఉ రా. 4. 193.

సీ పాలేటిచూలి యై యాలగాపరిపయి దద్దయు
మేప్పడుముద్దరాలు ...
అచ్చ భా. 1. 1 పా.

**మేలుబ(ల్బ)ంతి.** వి. (మేలు + బంతి)
1. విద్యార్థులు ఒరవడి వ్రాయు మాదిరికి మీఁద మొదట వ్రాసిన అక్షరములపంక్తి, ఒరవడి. ఒజ్జబంతి (శ. ర.).

ఉ. కన్నులు దీర్ఘముల్ నగుమొగం బవురా
తలకట్టు తమ్మిపూ, పున్నమచందమామలకుఁ
బొక్కిలిచక్కఁదనంబుఁ జెప్పగా, నున్నదె
మేలుబంతులు పయోధరముల్ మఱి కొను
నున్న యా, నెన్నిక కెక్కు వ్రాఁతఫల
మివ్వరవర్ణినికి న్నిజంబుగన్ ...
విజ. వి. 2. 104.

(ప్రశస్తమైనచెండ్లని వాచ్యార్థము.)

2. ఒరవడివంటిది, ఒకపని ఇతరులు నేర్చుటకు మొదట చూపుమాదిరి.

గీ. తొంటిసీవంశకర్తలఁ బొంరితవముఁ, బ్రబలు సచ్చరితంబులు బాపికాల, మేదినీనాథులకు నెల్ల మేలుబంతి, గాఁ బ్రవర్తింప కెల దుష్కర్మ వైతి వి పు. 2 109.

గీ అతని యుత్తమ చారిత్ర మఖిలవిష్ణు, భక్తజన ముఖ్యులకు మేలుబంతి యగును దశా. 3. 152.

మ జననీ నీవు మహాపతివ్రతవు నీ ధాత్రీ మిల్లాంగ్ర కెల్లను మేల్బంతి రమూర్వహంఘ్రి యుగళీల గ్నాత్మవై యుండుమీ. ఉ. రా. 6. 274.

ఆ. భట్టి నీకు హితుఁడు పరమవిశ్వాసియు, భట్టి బుద్ధి మేలబంతి నీకు . . విక్ర. 8 135.

ఆ. హీనజన్మ మటుట యెవ్వఁడే నొకప్రాణి. సంత సిలుట ముక్తిఁ బొంతగనుట, మేలె కాదె శివియ మేల్బంతి గాఁడె నశ్వరంపు దేహ మమ్మి పరము గొనుట ... ఆము. 6. 29.

విశ. శ్రేష్ఠుఁడు, శ్రేష్ఠురాలు.

గీ. ...అవ్వలంతి, మన్ను వేలువు మేల్బంతి మదికి మీఱ. .. నీలా. 2 45.

కం. సైకము నడుము విలాసర, సైకము నెమ్మొగముదీనిమృదుమధురోక్తుల్, సైకముఁ దెగడున్న సెలా, సైకములో నెల్ల మేలుబంతిది బళిరా.. విజ. వి. 2. 107

కం ఇంతీ మదనుని పట్టపు,దంతీ యొసపరిమిటారి తండములో మేల్బంతీ యేమే రతిపూ, బంతి దయఁజూచి నన్ను బ్రతికింపఁగదే...
సారంగ. 2. 211.

మేలు(ల్మ)మచ్చు వి. (మేలు + మచ్చు) 1. ఉప్పరిగ, సౌధము.

సీ. అచ్చటఁ గొలువఁ గొల్వై చెల్వు గనువారి మేలు మచ్చులమీఁద మెలగువారి ... ఉ. రా. 8 326.

సీ. విష్ణు స్థలమణులవెలఁ దీర్చు బలుబచ్చు శ్రీల తాంగి వసించు మేలుమచ్చు .. ఘటికా 1. 140.

సీ. మేడన సజ్జన మేలు మచ్చవఁగను నుప్పరిగస రోధి మొప్పుచుండు. అం. భా. 2. 17

కం. అచ్చటి యిరువంకల మేల్మచ్చుల పై బారు దీరు మగువల మొగముల్, నిచ్చలపు మేలు కట్లం, గ్రుచ్చిన యద్దంబు లని తగుల్కడు జగముల్. రా. వి. 5. 66.

సీ. పచ్చడాల్ హెచ్చురాగచ్చు రాణించు డాల్మచ్చటల్ మేచ మేల్మచ్చగములు. కృష్ణ. 2 127.

2. బాలక్రీడావిశేషము.

కం. అచ్చన్ని చెలువ దాఁగన, గ్రుచ్చిళ్లను నాల్గు కంబముల యాటలు మేల్మచ్చులును గచ్చకాయలు,నచ్చనగండ్లాదు పరవయస్యలతోడన్. పాంచా. 1 57.

మేలుము(ల్ము)సుఁగు వి (మేలు + ముసుఁగు) సువాసినులు వేసికొను ముసుఁగు, అవకుంఠనము,

చం. అనవరత ప్రయైధర యహీన సమీర విధూప శాల్మలీ, ఘనతర తూలరాశి పయిఁ గన్పడఁ బర్వమహాంతో మిషం బునఁ బోలుపొందె నొక్క వెలిపుట్టము మేలుముసుంగుఁబూని యద్రినమణి కార్తిఁ దెల్పి సురదీర్ఘికఁ గ్రుంకెడఁ బోవుచాడ్పునన్.

పె. శకుం. 2. 234.

సీ. సలిలాబ్జపాణి యచ్చపు మేలుముసుఁగు నా ఫేనపంక్తులు దరినాని యొసఁగ ...

శుక. 3. 320.

వి. .... బహ్వాంతంబులగు ఇటిమానుష కదంబంబులపయిం గమపట్టు మేల్ముసుంగుల తెఱంగున రంగుమిగిలి ఖరకరుం డురుకిరణ నికరంబులు పఱపి ... విప్ర. 2 14.

మేలురా. అవ్య. (√మేలు) ఆశ్చర్యార్థకము.

శా. ఔరా మైజిగి మేలురా నగుమొగంబ న్నన్న కన్నెల్కు ల,య్యారే చన్గవ సైక పుంగవునటి రఘ్యూరె యేలోకమం, దీ రామామణిపాటిఁ బోలఁగలదే యెవ్వానిఁ గాంక్షించునో, వారిం

తెప్పునకంబె యుజ్జగతి దైవానుగ్రహం బెట్టిదో.
ఇందు. 5. 114.

**మేలురాక.** వి (మేలు+రాక) స్వాగతము
ఆ. ... సంప్రీత జనలోక, రాకవచ్చె మేలురాక యగుచు. ..
భాగ. 10. పూ. 963.

**మేలురాసి.** వి (మేలు+రాసి) తూర్పెత్తిన ధాన్యపు ప్రోగు (శ. ర., చి. ని., బ్రౌ.).

**మేలువడి** విశే. (√. మేలు) ఋజువు.
వ. అతండును గొండరామాలి సేయు సత్కారం బంగీకరించి ముహూర్తమాత్రంబు విశ్రమించి మేలువడిచూపునం జూచి ప్రస్తావనోచితంబుగా నిట్లనియె,
హర. 4. 17.
శ్లో. ఉమాం న పశ్యన్నృజునైవ చక్షుషా .
సం. కు. సం. 5.32

**మేలువడు = మేలుపడు.** అ. క్రి. (మేలు + పడు) వలపుగొను
చం. కమలదళేక్షణా యమరకాంతు జయంతుఁడు నేను గూడియుం,టిమి కద నాఁడు వాని నెఱ నీటు ల వెక్కడ వాని వింతయం, దముఁకు వాని యిచ్చకపుఁ దల్కులకున్ మఱి వానిమేని డాల్, కొమరున నేను మేలువడి గుత్తకు నిచ్చితి నేమి చెప్పుదున్.
కువ. 4 176.

**మేలువాఁడు.** వి. (మేలు+వాఁడు) 1. వల్లభుఁడు, వలపుకాఁడు.
గీ. . . అంబుదపుడంబు మీఱుగాత్రంబు వావి, మేలు సమకూర్చు నలమేలు మేలువాని .
ఘటికా. 2. 195,.
గీ. .. భువనసుందరి యనియెడు భోగసతికి, మేలువాఁడు ..
సారంగ, 3. 125
2. జారుఁడు.
కం. వలచివవతి కేచిన్నెలు, గలవో యచ్చిన్నెలెల్లఁ గనుపించుచు న,వ్వెలవెలఁది సోమదత్తుని, వలకు ప్లోఁబఱిచి మేలువానిం జేసెన్.
శుక. 3. 52.
గీ. .. జారుపేరు మేలు,కాఁ డనఁగ మిండఁడన మిండగీఁ డనఁదగు .. ఆం. భా. 3. 115.
విశే. 1. శ్రేష్ఠుఁడు.
గీ. మేదినీంద్రులలో నెల్ల మేలువాఁడు ....
సారంగ 3. 125.
2. శుభకరుఁడు.
సీ. మను మేలువాఁ డనఁగను శుభకరసంజ్ఞ...
ఆం. భా. 3. 3.

**మేలైవచ్చు.** అ క్రి (మేలు+ఐ+వచ్చు.) అచ్చివచ్చు.
సీ. అచ్చివచ్చె ననంగ నైవచ్చె ననఁగ మేలైవచ్చె ననుట యొ ...
ఆం. భా. 3. 94.

**మే(లుక)ల్కత్తి** వి. (మేలు + కత్తి) ఖడ్గము, అడిదము
సీ వాలు ఖండా కరవాలు మేల్కత్తి తరవళి నరాజి పిరంగి యడిద, మన ఖడ్గనామ మై యలరుచునుండును ..
ఆం. భా 2. 214.

**మేల్తరము.** విశే. (మేలు + తరము) శ్రేష్ఠము.
చం సరిగ మెఱుంగుఁ జంటకుఋసంబునఁ జన్గవ. పిక్కటిల్ల మే, ల్తరమగు కావిపింజియ పదంబులఁ జిందులుద్రొక్కఁ ...
వాల్మీ. 2. 130.
ఉ విండ్లకు మేల్తరంబు ఘనవేణి కనుంబొమ దోయి బంగరుం, గి ర్లకు మేటిసాటి తులకించు చనుంగవ ... హంస. 1. 61.

**మేల్దావరి.** వి (మేలు+దావరి) వేశ్య
సీ. వడపుఁజాన గడించు వడఁతి మేల్దావరి భోగవుఁజేడియ పొత్తుటాలు ... నా వేశ్య వెలయు ... సాం. ని. మాన. 13.

**మేల్పని.** వి. (మేలు+పని) శుభకార్యము.

ఉ. అప్పు డదను డెయ్యె దలఁగించి పక్షి యుఁబ్బయు నుమంత్రుఁ డనంగఁ బరఁగు ప్రెగ్గడయును మేల్పనికిఁ గడంగి కూడుపఁ దగు, సకలుఁ దెల్లి పంతసముసఁ గూర్చి. అచ్చ. రా. అరణ్య. 44.

**మేళ(ము).** సం. వి. అ. పుం. వేశ్యాది జనసమూహము (ఈ యర్థమునకు సంస్కృత గ్రంథముల యందుఁ బ్రయోగము కానఁబడదు.)
రగడ .. మిపులఁ దపసికి నించె మేళములఁ దాళములు, రాఘవ. 2 6.

గీ. మేళముఁ గూడివిటులంతో మేళమాడి, కొనుమ నత్తురు వెలజాతికొమిరె లెపుడు .. ప్రబంధ. 19.

వ. .. రామలింగసాని సర్వసాని నైతమైన మేళ 1 కి, కాకాండిని గ్రామం ...
తిరుమలంమంగారి చెవ్వుకింద వరిమడి. ఖం. దళా 702.

**మేళగాఁడు.** వి. విఙ. (మేళము + కాఁడు)
1, మేళము వాయించువాఁడు (శ. ర.).
2 వర్తకసంఘముస ముందువాఁడు.

వ అనుమఁ దలంగిపోక యిట్టునట్టుం జుట్టు మెట్టాడు చిట్టివడుగుల నానట్టు వగవునం గోపంబుఁ గదుర నవలించుచుం దనమేళగాంద్ర నాలోకించి ...
ప్రభా. 1. 107.

**మేళగి(వి)ంచు.** స. క్రి. (√మేళము) 1. జతపఱచు.
చం. ప్రహరిచరింతు రెప్పుడును భైరవు లర్ధనిశాగమంబులన్, గహాకహా నిష్ఠురాట్టహాస గర్వితకంతకకఠోరహుంకృతుల్, బహుల భుజాడమడ్డమరుఖాంకృతినాదము మేళగించి దిక్కుహరము లోర్చుహాటకపుఁగోటల మీఁదట దక్షవాటికన్. భీమ. 1. 108.

2. కలుపు, మిశ్రముచేయు.

ఉ. భావము పల్లవింప నొకపంకజలోచన ప్రాసె నొక్కెల, జ్ఞానతి మించుగుబ్బవలి చన్నుల పై మకరీకలాపమున్, ... వావిరిఁ గమ్మనీరు మృగనాభిరసంబున మేళవించి ...
నైష. 3. 102.

గీ. తేనెయును గోఘృతంబును దిలలు మేళవించి సౌభాగ్యపతయే యటంచు వేల్చి ...
వరాహ. 9. 59

వ. ... పరిశుద్ధకాశ్మీరకేసరాసారంబులు, పరిమృదితకైతేయసారంబులఁ బసిమి యొసఁగ సగఁ బాలు మేళవించి...
వసు. 2. 11.

3 వీణ లోనగువాని తీగములను స్వరానుకూలముగ నమర్చు

సీ. మేళవించినవి సుమ్మీ దీనిమెట్లని మానసలాంసజబున మహతిఁ జేర్చి ...
పారి. 5. 86.

శా ... ప్రభాతాయాతవాతాహతాం, లోలత్తంత్రుల మేళవింపఁగదవే లోలాక్షి దేశాక్షికిన్...
మనుచ. 3. 57.

సీ. వినికి వేళయి దంచు వీణె మెచ్చుగ మేళవించి తెచ్చిన గానవిద్యదాని . .
ఉ. రా 4 223.

అ. క్రి. కలియు. మిశ్రమగు.

సీ చూపుల నిగురొత్తుసోలంబుతోడన సోలంబు తనువున మేళవింప ... విక్ర. 1. 166.

సీ. గిల్కు గిల్కున మ్రోయు కింకిణీపుంఖంబు తాళమానంబుతో మేళవింప ..
క్రీడా. 1. 136.

కం. పతత్త్రితయము నొకచో, భూతలమున మేళవించి పొగడొందుట మ, చ్చేతోగతి దోఁపదు సము, పేతావృతి ముకురకుక్షినిభమును లోలెన్.
పాండు. 1. 155.

**మేళము.** విఙ. స్వరాద్యనుకూలముగా నమర్పఁబడినది.

శా. వాలారుం గొనగోళ్ల నీ వలసతన్ వాయించుచో నాటకున్, మేళం బైనవిపంచి నిన్న

మొదలుస్ సీ వంటమిం జేసి యా,యాలా పంబె యవే. బల్కెడు ...
మనుచ. 3. 57.

వి 1 సన్నాయి మొదలగు వాద్యముల జత

ఉ. మేళము ఘుమ్మనన్ శ్రుతి సమేతమునన్ జత గూర్చి మద్దెలన్, దాళము లావజంబులును దండెలు జంగులు నొక్క మ్రోతగా.
శ్రీరం మా. 4. 153

2. రాగానుగుణముగ స్వరస్థానములయందు మెట్లు కుదుర్చుట.

సీ. పాలు పొంద నలగుణంబులపై కుదుళ్లు గూర్చి పారెం దమేళ ప్రకార మరసి ...
హ వ 2 63.

జ మేళగించు.

మేళరామక్రియ. సం. వి. ఆ స్త్రీ. (సంగీ.) ఒకానొక రాగము, ముప్పదిరెండు నపుంసక రాగములలో నొకటి

సీ. . మేళరామక్రియ గౌళ నారాయణ గౌళ...
హంస. 5. 124

సీ రామక్రియయు మేళరామక్రియ వసంత సామంత శుద్ధవసంత మధ్య, మాదులు ...
ప్రబంధ. 96.

మేవ. వి. మత్స్యవిశేషము, ఒకవిధమగు చేప. (శ. ర., బ్రౌ.)

మేవడి వి. (√మే) నమ్రత.

ఆ. అరినృపాలు పెంపు నాత్మీయశక్తియు, నెఱంగి మూఢవృత్తి నెదురుపడక, యుచితవృత్తి నతని యుద్ధతి మేవడిం, గడపి హీనబలుండు నెడక నిలుచు...
భార. శాం. 3. 90.

2. ఉపాయము.

ఆ. కయ్యమునకు వలదు కాల్ద్రివ్వ నధిప సా, మమున భేదమునను మార్తుమనము, మెత్తంజేసి చెఱుచు మేవడిం దప్పించి, కొనుతెఱం గెఱింగి కొనుట మేలు.
భా. శాం. 2. 282.

సీ. తెలిసి మేవడిం సరుల గాయపు గని కన్నుల చెమ్మన వన్నుం గాంచి ...
నిర్వ. 8. 72.

విశ. ఉచితము.

చం. ప్రియ మెసంగం దగం బిలిచి పెట్టెడికూడది తిన్నకూడు ద, క్కియవయహీనతం దమకు నాపద యైనెడ నిట్టు నట్టు నే, మియు ననలేనికూడదియు మేవడి యై చను ...
భార. ఉద్యో. 3. 222.

చం. తనమది లజ్జ వాపి వసుధాపతి మేవడియైన మాటపొం,దు వందగం జేరికోరికలు దోంచుతెఱం గెఱుంగం దలంచి యల్లన యడుగంగ సమ్మద విలాసము నేర్పెలు నెమ్మొగంబు నూ, తనరుచి నొప్పంగా వికచతామరసానన వేడ్క నిట్లనుస్.
నిర్వ. 8 68.

మేవడికాండు విశ. మేవడి + కాండు) 1. నమ్రత కలవాండు (శ. ర.)

2. ఉపాయము కలవాండు (శ. ర.).

మేవీధి. వి. (మేలు + వీధి) రాజమార్గము.

ద్వి. మేవీధి నడి బండ్ల మీంది కెత్తుచును.
ద్వి. పరమ. 7. 516 పం.

మేవు = మేంగు (శ. ర.).

మేష. సం వి ఆ. స్త్రీ. చిన్న యేలకులు.

మేషకంబలము. సం, వి. అ. పుం. రోమముతో నల్లిన గొంగళి, ఉన్నికంబళి.

మేషము. సం. వి అ. పుం 1. పొట్టేలు, గొఱ్ఱె. 2 మేషరాశి.

మేషాండుండు. సం. వి. అ. పుం. ఇంద్రుండు.

మేషి. సం. వి ఈ. స్త్రీ. 1. ఆండుగొఱ్ఱె. 2. తివిశము, నెమ్మి (వ్య వి.). 3. జటామాంసి (వ్య. వి.).

మేహఘ్ని. సం వి. ఈ. స్త్రీ. పసుపు

మేహనము సం. వి. అ. న. మూత్రవిసర్జనము, ఉచ్చపోయుట. 2. మూత్రము. 3. శిశ్నము.

మేహము. సం. వి. అ. పుం. 1. మూత్రమువిడుచుట, ఉచ్చపోయుట. 2. మూత్రము, ఉచ్చ. 3. ప్రమేహరోగము. 4. పొట్టేలు, గొఱ్ఱె.

# మై

మై = మయి. వి 1 శరీరము.

సీ. సుదతి నీమై చక్క(జూచుట కోడెద( గను
  బాటు వారయునో యని తలంచి ...
  భార. విరా. 2. 47.

చం. ..కాంతకు గొజ్జ(గినీటితేటచే, జలకము లార్చి
  మై( గలయ( జందనపంక మలంది యొంత
  యున్ ... విక్ర. 1. 186.

సీ. ఉత్సాహ మొదవ మై నుబ్బించె నేనియు( బచ్చి
  గోడలజాడ విచ్చు దిశలు.
  ఉ. రా. 2. 196. పారి. 2. 49.

2 జన్మము.

కం. ఇల నొలుగె నట్లు భుజగం, బులు పెన(గొన
  రాము( డాదిపురుషుం డయ్యున్, బలి ముని
  బంధించినయా, ఫల మొకమై( గుడువ కేల
  పాయు నవ(గన్. భా. రా. యు. 567.

3. పార్శ్వము

మ. . . వీ(డె పతి చేర్పం జేరె నంచున్ మదిన్,
  దొల(గం గోరి యొకింత హ్రియోరసిలి శాంతుం
  డున్నయా మైకి( జేరె లతాతన్వి విభుండు
  తా వపుడు తార్చెన్ సెజ్జకున్ ....
  చంద్రా. 6. 138.

ఉ. వేత్రము( గేల( బూని ... నిక్కులు లై
  యిరుమై మానాఖ్యమ, ద్గా త్రులదంతి వక్త్రిల
  శతంబు వినీతి భజింప ...
  ఆము. 6. 96.

4. విధము.

శం. తలకొని నీకుం బ్రాణం, బులు డాపక మోపి
  నట్లు పోర(గ నిమ్మై(, బలుక( దగునె ...
  భార. భీష్మ. 3. 175.

శం. ఒడ లెంతయు( బులకింప(గ(, బుడుకుచు
  మేఃముల మోసపుచ్చుచు నమ్మై, తెడ(గు
  సిలుగులం బెట్టిరి, పక(ముక లాబుళ్ళక్కంగుల
  భాద్రిపముఖ్యా ..
  భా. రా. బాల. 79.

శా. ... ఏ,మేమీ కృష్ణు(డు మూ(దలో( బలెనె
  తా నిం(ద్రద్రుమోత్పాటనం, బీమై నిచ్చుట(
  జూప వచ్చె వది మేలే ... పారి 4 60

. . డవ

ఉ. చిత్తము ఉల్లసిల్ల నలసింహాకిశోరము
  లొక్క్మై మదో, న్మత్తగజావళిం బొదువు
  మాడ్కి ... భార. ఉద్యో 2. 140.

6. మీ(దు.

ద్వి. అతనితోడిద లోక మరి కూడు నీళ్లు, మఱి(
  దలంపక నేలమై శ యనించు ..
  ద్వి పరమ. 4. 311.

ద్వి. పనుపడ( గదళికావత్రముల్ పఱచి, యం
  దుమై వేర్వేఱ నావిదు లునిచి .
  ద్వి. పరమ. 4. 267.

జ. మైకాను, మైకోలు, మైగవి, మైజాఱు,
  మైజాఱుచీర, మైతాలుపు, మైతెంచు,
  మైపూ(త, మైమఱచు, మైమఱపు, మైమఱువు.

మై. ప్ర. 1. తృతీయావిభక్తియందు వచ్చెడి
  ప్రత్యయము.

ఆ. ఒంటిమై( గళింగు నరవడి( దలపడి, పుత్ర
  పోదరాప్తభూరిసైన్య, హీము( జేసి ...
  భార. భీష్మ. 2. 84.
  (ఒంటిమై = ఒంటిగా )

మ. ఆయకాలంబున( బ్రాణిజాతము ననాలస్యం
  బుమై బ్రమింగ వే(డి యుదగ్రోద్ధతి( దో(చు
  దండధరుమాడ్కిన్ వచ్చుదుర్వారని, శ్చయు
  నాశాస్త్రవు( గాంచి ...
  హరి. ఉ. 1. 151.

మ. ... చెప్పెద సమాధానంబుమై( గార్యముం,
  గమ(గొ మ్మాహవభూమి రాము( డెవయంగా
  రాదు ... భా రా. అర 1. 247.

2. చతుర్థీ విభక్తి ప్రత్యయము.

చం. అడవికి వేఁటమై నరిగి యాతఁ డొకానొక వాఁడు ... పాండు 5. 1౪.

ద్వి. మకరకేతనుతండ్రిమై నంకితముగ, నొక కొన్నిపద్యంబు లొనరించి మఱియు ... ద్వి. పరమ. 3 165 పు.

3. సప్తమీవిభక్తి ప్రత్యయము.

సీ రాత్రిమైఁ దాఁకి క్రూరతఁ బోరి మగఁటిమి వాసిన యంగారపర్ణుకంబె ... భార. కర్ణ. 2. 24.

ఉ అప్పుడు కర్ణసైన్యమమరాధిపనందనుఁ జుట్టుముట్టఁ దే, రుప్పరవీథిమై వలయ మొప్ప వెసం బఱపించి క్రీడి ... భార. విరా 5. 98.

ఉ. ఎవ్వఁడు రోరి తాను నొకయెక్కుఁడు వీరుఁడపోలె రాత్రిమైఁ, జివ్వకు వచ్చి ముచ్చి మిగఁ జేరినవాఁడు ... ఉ. హరి. 3. 48.

మైందహనుఁడు సం. వి న్. పుం. మైందుని జంపిన వాఁడు, కృష్ణుఁడు.

మైందుఁడు. సం. వి. అ. పుం. కృష్ణునిచేఁ జంపఁబడిన యొకానొక రాక్షసుఁడు.

మైకము = మయికము. వి. మత్తు.

ద్వి. ఉడుగనిమదముల నొలయు తుమ్మెదలు, కడు నొప్పు నమ్మదకరు లెల్ల నిపుడు, కడు మేనుకిల్ల మైకంబులతోడ, మెడ లెత్తుకొని ముక్కు మెదలకున్న వియు ... రం. రా. యు. 280 పు 22 పం.

మైకొను = మయికొను. మేకొను. స. క్రి. అ. క్రి. ($\sqrt{\text{మై}^1}$.)

1. సమ్మతించు, అంగీకరించు.

శా. .. విఖలస్త్రీరత్నమున్ నీకు నే. నావాహించితి మీరు సన్మిత్రవచర్యాసక్తి మైకొన్న నా, కోవిశ్వోదయ కార్యసిద్ధియగు .. కు. సం. 1. 72

మ. ... ఉ, న్మదుఁ డై యింతి వధింపఁ గాదవక యన్యాయంబు మైకొన్న నా, వద లేతెంచుట కేమి సందియము... భా. రా. యు. 1413.

కం. మమకారదూరునకు మిత్రములు గళత్రములు నన్నదమ్ములు ననుబంధమల పరిష్వంగము ధర్మె మె మైకొన మణుఁగు సగము మైలయు సగమే ... పాండు. 5 220 కు. సం 410.

స. క్రి. పొందు.

సీ. అల్లదనంబున యసువు మైకొనఁ జూచునదపు కాంతికి వింతతొడవు గాఁగ... భార. విరా. 1. 245

అ. క్రి. కలుగు.

సీ. లలితమాణిక్యశలాకలలాగు మైకొన గ్రీవము ర్నన భంగిఁ గొమ్ము లొప్ప ... భా. రా. అర. 2. 24.

మైకోలు = మయికోలు. వి. ($\sqrt{\text{మైకొను}}$) సమ్మతి, అంగీకారము.

శా. ... నీ, వాలేఖర్షభునాజ్ఞ సేయఁ దగదే యజ్ఞాతి మైకోలు మైన్ ... నై ష॰ 3. 125.

సీ. అల్లయాచెలి మంచి దని మెచ్చుకోఁ గోవగించ మైకోలు గాంచునేర్పు .... కువల. 5. 35.

సీ. ఇయ్యకో లొప్పికో లీకోలు మైకోలు మేకోలు ... ఒడబా టనుట కనుపట్టుచు నుండు సమ్మతిపేరు... అం. భా. 1. 104.

మైగలి = మేగలి. విశ. ($\sqrt{\text{మై}^1}$) కూరుఁడు.

ఉ. ధీరజనోత్తముండు సహదేవుఁడు మైగలి దుస్ససేనుఁడున్, వీరులు విచ్చలింపఁ బ్రబవి న్నద్రువం బోరి నార్వఁ బోరుచో .... భార. కర్ణ 1. 116.

మైజాలు = మయిజాలు. వి. (మై$^1$ + జాలు) ఒకవిధమగు పైఁటకొంగు. (కొంత యొడమెడముగా నడ్డకమ్ములు పాఱించిన యాఁడుదాని చీరకొంగు. శ. ర.) చూ. మైజాలుచీర.

మైజాలుచీర. వి. (మైజాలు + చీర) ఒకరకమగు పైఁటకొంగు గలచీర.

సీ. గొంటుపూసలు రెండు గుండ్లముంగరలు మైజాలు చీరలు పెనసన్నగొలుసు ...
శుక. 2. 332.

సీ. కానెకట్టిది యేల కప్పరుగా మైజాలుచీరఁ దాల్పు మటంచుఁ జిమ్మరేఁగు..
శుక. 2. 456.

మైతాలుపు. వి. (మై[1] + తాలుపు) ప్రాణి, శరీరి (శ. ర.).

మైతెంచు. స. క్రి. (√ మై[1]) ధ్యానించు.

మ. శివు గౌరీసహితంబు సన్మనములం జింతించి మైతెంచి భైరవు యోగీంద్రులఁ గొల్చి ...
కు. సం. 9. 327.

మైత్రము. సం. విణ. (అ. ఈ. అ.) మిత్రుని సంబంధమైనది. వి. అ. పుం. ఒకానొక సంకరజాతి. న. 1. మైత్రి, స్నేహము. 2 అనూరాధా నక్షత్రము. 3. ఆదిత్యలోకము (వాచ.). 4. పురీషోత్సర్గము. 5. ఉష్ణ కాలము.

మైత్రావరుణి. సం. వి. ఇ. పుం. అగస్త్యుఁడు.

మైత్రావరుణుఁడు. సం. వి. అ. పుం. అగస్త్యుఁడు.

మైత్రి. సం. వి. ఈ. స్త్రీ. 1. దయ.

కం. మైత్రిం బోలెడు ధర్మము, ధాత్రీదివిజులకు లేదు ...
భార. శాం. 5. 103

శ్లో. జప్యేనైవ తు సంసిధ్యే ద్బ్రాహ్మణో నాత్ర సంశయః, కుర్యా దన్యన్న వా కుర్యా న్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే.

2. స్నేహము, చెలిమి. 3. అనూరాధా నక్షత్రము.

మైత్రుఁడు. సం. వి. అ పుం. 1. గొప్ప బ్రాహ్మణుఁడు, బ్రాహ్మణశ్రేష్ఠుఁడు. 2. స్నేహితుఁడు

మైత్రేయము. సం. వి. అ. పుం ఒకసంకీర్ణ జాతి.

మైత్రేయిక. సం. వి. అ. స్త్రీ. మిత్రయుద్ధము, స్నేహితుల యుద్ధము (త్రి. ని.).

మైత్రేయుఁడు. సం. వి. అ. పుం. 1. ఒకానొక ముని, 2. బుద్ధదేవుఁడు .

మైత్ర్యము. సం వి. అ. న. స్నేహము, చెలిమి.

మైథిలి. సం. వి ఈ. స్త్రీ. సీత.

మైథిలుఁడు. సం. వి. అ. పుం. మిథిలాధిపతి.

మైథిలులు = మిథిలాజనులు.

మైథునము. సం. విణ (అ. ఈ అ) 1. దంపతులుగానైనది, జతయైనది.

2. వివాహముచేఁ గలిపినది. 3. రతిసంబంధమైనది వి. అ. న. రతి, సురతము, (దీనియంగములెనిమిది.)

శ్లో. స్మరణం కీర్తనం కేళిః ప్రేక్షణం గుహ్యభాషణం, సంకల్పోఽధ్యవసాయశ్చ క్రియానిష్పత్తిరేవ చ, ఏత న్మైథున మష్టాంగం ప్రవదంతి మనీషిణః.

2 వివాహము. పెండ్లి, 3. పరస్పరము కలియుట, కలయిక, కూడిక. 4. అగ్న్యాధానము, దంపతులగ్నిని స్థాపించుట.

మైద[1] వి (సం. మదః) మత్తు, మైకము.

చం తనుకర నిత్యపుష్పితల తాతటిలోనన యుండి నిద్రమైదను బడి రేప మేల్కను మదారి మధువ్రత నాథుభంగి .. హరి. పూ. 6 40.

మైద[2] వి కురింటకము, గోరంట (వ్యా.వి.).

సీ మైద గోరంట నా మనుఁగురంటక సంజ్ఞ ...
ఆం. భా. 3. 57.

మైదు. = మయిదు. వి. 1 మాయ.

2 మైకము.

3. చొక్కుపొడి (శ. ర.).

మైనపుజిడ్డి వి. (మైనము + జిడ్డి) మైనపుగుడ్డ (శ. ర)

మైనపువత్తి వి (√మైనము) దీపము వెలిగించుటకు మైనముతోఁ జేసినవత్తి (శ.ర.).

మైనము = మయినము. వి. (సం. మదనః) సిక్థకము, మధూచ్ఛిష్టము.

సీ. బూది బ్రుంగిన మొగంబున గౌదకట్టు మైనపు మైలప్రాఁతౌతు నా వెలుంగ ...
ఆము. 6. 80.

శా. కలికి వరాటరా జవ్వడు గప్పు పిడెము వెట్టె నవ్వుచు, న్నలు నడపంబు వానికి ఘణాఘం పట్లి దళాంతరంబునన్, బలితపుఁజేలు మైనమునఁ బన్ని యతం డదె మూచి ఖీతిఁ ద, మ్ముల మిం వైచిన న్నగిరి మూఁగిన రాజకుమారు లందఱున్ నై. ష. 6 141

గీ. ... మైన మనఁగ, బొలుచు సిక్థంబు . ఆం. శా. 2. 280.

జ: మైనపుజిడ్డి, మైనపువత్తి

మైనాకస్వస. సం వి ఋ స్త్రీ. పార్వతి, మైనాకుని తోడఁబుట్టువు.

మైనాకుఁడు సం. వి. అ. పుం హిమవంతుని పుత్రుఁడు (పర్వతవిశేషము).

మైరికుడు సం వి. అ పుం. జాలరి, కైవర్తుఁడు (శ. ర.).

మైపూఁత వి. (మై$^1$ + పూఁత) కలపము, అంగ రాగము.

గీ. చెమటచిత్తడి మైపూఁత దెమలి చనిన, నెమ్మ నంబునఁ దమకంబు నివ్వటిల్ల ... విక్ర. 4. 226.

సీ పుడమిపై నిచ్చలుఁ బొంలుచో మెరలిన బూడిద మైపూఁతబూది గాఁగ ... అచ్చ. రా. సుం. 28.

మైపూఁత పసపు = చాయ పసపు.

సీ మైపూఁత పసపును మధుకంబు సైంధవ లవణంబు చిత్రమూలంబు బరడు .. అప్ప. 2. 431.

మైపోక. విశ. తేలిక కాశీ. 6. (శ. ర.)

మైమయి = మయిమయి, మైమేయి, మైమై.

వి. అనాయాసము.

మ ప్రగుణోత్సాహులు యాదవోత్తములకుం బ్రత్యర్థులై తొల్లి యే,మగలున్ మైమయిఁ బోరొనర్చిరె వృథామానాఢులుం డైనయూ, పగతుం డెంతటివాఁడు... హరి. ఉ. 6. 131.

ఉ . . ఆ భూవిభుఁడుండు నీవు ననుఁ బొందక పోయెదు నన్ను మైమయిన్, బోవఁగ నేఁ యిత్తునని పూని నృపాత్మజ వంటఁబట్టి ... భోజ. రా. 4 225.

మైమఱచు. అ క్రి. (మై$^1$ + మఱచు) ఒడ లెఱుఁగకుండు, పారవశ్యమునొందు.

ఉ. . వాఁడీవిభుఁ డిప్డు మైమఱచి నిదుర వోవఁగ ... దశా. 1 275.

వ. ఇట్లు వారసీమంతినీశ్వసితనిరంతరలతాంత శరలీలావంతోషితస్వాంతుం డై మై మఱచి విక్ర. 6. 107.

2. మూర్ఛిల్లు.

గీ. మైమఱచెఁ గడపట్టె సొమ్మసిల్లె ననఁగ మూర్ఛ కాన్ సాం. ని. మాన. 42.

మైమఱుపు వి (√ మైమఱచు) 1. మూర్ఛ.

సీ. ... మైమఱుపు భ్రమరి, యనఁగ మూర్ఛా వ్యాయం బలరారుచుండును . ఆం. శా. 2. 223.

2. పారవశ్యము (శ. ర.).

మైమఱువు = మేమఱుఁగు. వి. (మై$^1$+ మఱువు) కవచము, తనుత్రాణము.

గీ. భల్లముల గట్టిమైమఱువెల్లఁ జించి, యతని నెత్తుటిలో ముంచె శితశరముల ... భార. భీష్మ. 2. 54.

సీ ... మావుల రెంట మైమఱువు నొకట, నాత పత్త్రము రెండు శాతశరంబుల ఘునరయం బునఁ ద్రుంచి ... భా. రా. అర. 1. 221.

కం. తామనుఁడును తుష్టిలుఁడు, నై మైమఱవు లును వాండ్లు నమ్ములు గదలన్ ... మార్క. 5. 111.

ఆం. శా. 2. 204.

మైమెయి = మైమయి. వి. అనాయాసము.

చం. ... ఎంత భీ,కరబలు లయ్యు వహిఁ బడి కాలక మైమెయిఁ బోవ నేర్తురే .. కు. సం. 12. 338.

మైమై = మైమయి. వి. అనుపద్రవము.

కం. ధర్మతనూభవుదెస దుష్కర్మము రూపించి సభ నొకండును మైమైఁ, బేర్మి సెడక పో నేర్చునె.
భార. ఉద్యో 1. 25.

మైరేయము. సం. వి. అ పుం. న. ఒకదినుసు మద్యము, ఆసవము.

మైల = మయిల విశే. (సం మలినమ్) 1. మలినము. మురికియైనది.

సీ. పరవధూటుల మైలపరిధానములు గట్టు చూలాండ్రఁ గొందఱు నోఁకుఁడనియు.
వరాహ. 11. 131.

2. అశుచి (శ.ర.).

వి. . . మలినవస్త్రము, మురికిగుడ్డ.

కం. ... నేఁ, బ్రాఁకట భూసుర కన్యక, నీ కట్టిన మైలఁ గట్ట నేర్తునె యనివన్ ...
భార. ఆది. 3.155.

ఉ. ... చేబలు వొప్ప నోఁకుడు, బట్టము కట్టు కొన్న వృషపర్వుని కూఁతుర నట్టినేను నీ, కట్టినమైలఁ గట్టుదునె కావరమేఁటికి వచ్చె నీ కనన్ ...
యయా. 3, 75.

ద్వి. ఉడికించి విదిలించి యుదికి ఘట్టించి, మడచుట మైలలు మడుగు సేయఁగను.
పండితా. దీక్షా. 86 పు.

2. మాలిన్యము. మురికి.

ఉ. ... ఒక్కప్పుడు మైల దోఁప నడయాడదు రాధ ముకుందు చెంగటన్ ... దశా. 8.220.

3. మడ్డి

సీ. బూది బ్రుంగిన మొగంబున గౌదకట్టు మైనవు మైల పాఁజౌత సా వెలుంగ ..
ఆము. 6.60.

4. చీకటి, అంధకారము.

చం. జిలిబిలిమైల నల్దెసలఁ జేకొనియెన్ జనియెన్ మరీచికల్ ...
హంస. 4. 4.

5. ఎఱుపు తెలుపు పసుపు నలుపు కలిసిన రంగు.

ఉదా – మైలావు.

జ, మైలక్రోవి, మైలచాయ తొండ, మైలపడు.
మైలసంత, మైలారి, మైలారు, మైలావు.

మైలక్రోవి. వి. (మైల+క్రోవి) మురళి (శ.ర.).

మైలచాయతొండ వి. (మైల+చాయ+తొండ) ఒక దినుసుతొండ (శ.ర.).

మైల(ప)పడు అ క్రి. (మైల+పడు.) 1. మాలిన మునొందు, కళంకితమగు

చ. ... సిజవంశము మైలపడంగఁ జేసి తింట జగడ మింటిలోనె హావణింపక నీ విటులొంటి వచ్చుటన్ . .
జై భా. 6. 28.

2. కాంతి హీనమగు.

ఆ. అగ్ని సల్లనైన నబ్జమిత్రుఁడు మైలపడ్డ నుర్వి వొరలఁబడిన మేరు, నగము సంచలించినను బొంకు వొరయునే, సాదుపలుకు నెమ్మనమున నమ్మ.
భార. అశ్వ. 1.38.

మైలసంత. వి. (మైల+సంత) మత్స్య మాంసాదులు విక్రయించు సంత

గీ ఇంతులకుఁ బ్రీతిగా మైలసంతలోన...
క్రీడా 77

మైలారి = మయిలారి. వి. (మైలారు) ఒకానొక క్షుద్రదేవతను బూజించువాఁడు

వ మైలారి మన్నెరితలారి తురకపింజారి విప్ర వినోదులును
హంస. 3 29.

మైలారు. వి. (√మైల) ఒకానొక క్షుద్రదేవత

గీ సందులను నారసంబులు సలుపువారు, నెడము గుడిచేత నారతు లిచ్చువారు, సాహసము మూర్తి గైకొన్న సరణివారు, ధీరహృదయులు మైలారు వీరభటులు
క్రీడా 142.

సీ గొంగ డై మైలారుఁ గొనియాడు నొకవేళ నొసలిపై బండారు పసుపు దాల్చి.
కాశీ. 7.230

మైలావు వి (మైల + ఆవు) ఎఱుపు+పసుపు+తెలుపు+నలుపు గలసినవరంగు గల ఆవు. (పొగచాయ గల ఆవు అని శ.ర.)

మైలుతుత్తము = మయిలుతుత్తము. వి. (సం. మయూరతుత్థమ్) ఒకనొక మందు వస్తువు(శ.ర.).

మైవడి = మయివడి విశే. అనుకూలము.

వ. ... నెఱి సంగడీలకై వడి నెల్లనడవడికి మైవడియై మెఱయు చిఱుఁదొడలును ..

వృసిం. 3. 14.

వి. 1. సమ్మతి

వ. అంత వసంతకుం డక్కుసుమకోమలి నూరార్చి కుసుమాయుధుపురవశారంబునకు నుద్యోగింపు మని మైవడి నూలుకొలిపి.

కు. సం 5. 581.

ద్వి వడ్డింపఁ దవసి మైవడి నారగింప.

బస. పు. 6. 499 పం.

గీ బెదరి చేరని బలియుని బిగియఁబట్ట, కతని మైవడినే వచ్చి హస్తఁ జేఁత, క్రమము పెనఁగెడు బలుమీను ట్రాటఁ జేఁదు, నొడ్డుగాలంపు వేఁటకాఁ డుపమ గాఁడె.

ఆము. 4 251.

2. అనుకూల్యము

చం. వెలయు నుమామహేశ్వరులవిర్బ్యమునం దుదయించునట్టి దో, ర్బల కలితుండు గాని సురపాలకవిద్విషుఁ దారకాసురున్, గెలువఁడు పోరిలో మకరకేతనుఁ బంపుఁడు వారికిం దప,శ్చలనము సేసి మైవడిఁ బ్రసంగము సేయు జగద్ధితంబుగాన్.

కు. సం. 4. 389.

3 నేర్పు.

చం. ... తగిన పల్కులమైవడిఁ గల్పసుందరిన్, జనపతియందుఁ జాల విరసం బగు చందముఁ బొందఁ జేసితిన్ ...

దశకు. 7. 52.

4 విధము, రీతి

కం. మేలపు మైవడి నగవున, మేలపులం దోడి వారి పీఠించి ...

నైష 3 67.

మైసరి = మయిసరి వి జక్కిణి యను నాట్యమునందలి యంగవిశేషము.

సీ. లాఁగు మైసరియుఁ బల్లటియుఁ గత్తెరియు తెక్కు విలసిల్లు జక్కిడివిధ మొకర్తు.

ఉ రా 6. 139.

## మొం

మొంతె = మొరితె.

సీ. ... మొంతె మొరితె యనఁ బ్రహ్వాకూర్చాఖ్య యలరుచుండు ...

ఆం భా. 2 240

మొండరి. విశే. (మొండి + అరి[3]. స్వార్థమున) మొండివాఁడు, మూర్ఖుఁడు.

ద్వి. ఒకవిచారము మాకు నొదవె నీరాజు, సుకవాసి పనిపంద చూపుగట్టింబు .. మొండరి చల్ల చప్పుడు గోడచేర్పు, చండిపో తనునట్టి జాడ నున్నాఁడు.

ద్వి. హరిశ్చ. ఉ. 1466 పం.

ద్వి బండఁ దనక కడుమొండరి యనక, రెండు చేతులు లేని మొండి వీఁ డనక.

పండితా పురా, 101 పొ.

మొండి = మొండు. విశే. (సం. ముండమ్. ప్రా. మొండం) 1. చేతులు కాళ్లు తెగిన వాఁడు, తెగినది, కాళ్లు చేతులు లేనివాఁడు.

ద్వి. మొండి యైనెత్తుట మునిఁగి యున్నాఁడ, దండించి బేతాళ తల ద్రుంచి పొమ్ము.

ద్వి. శ. సా. 2. 787 పం. (శ.ర.పా.)

ఉ. ... చీ కొఱమాలిన మొండివాని కే,చొప్పునఁ జిక్కెనో తరుణి చుట్టలలోఁ దలవంపుచేసె.

భోజరా. 5.297.

సీ. ... మొండి నా నపదుఁ దెనఁగు ...

ఆం. భా. 2. 122.

2 కొంతతెగినది (కాలు, చేయి మొ.)

ఉ: తనమొండిచేతులు తలమీదఁ జేర్చు, కొని నమస్కృతు లొనంగుటయు . .
ద్వి. శి. సా. 2.39 పా.

సీ . మొండి, మొఱ్ఱిన ఛిన్నత్వ మొనరును·
ఆం భా. 2. 124.

3 మొక్కపోయినది

ఉదా – మొండిగంటము, మొండికత్తి. మొ॥.

4. మూర్ఖుఁడు, మూర్ఖురాలు.

సీ. నక్క చిక్కులమారి పెక్కుకురూపి దూబర దిండి బోంకులబాన మొండి. చెన్న 2. 24.

5. బోసియైనది, వట్టిది, ఆభరణాదిశూన్యము.

ఉదా :– మొండిమెడ, మొండిచెవులు మొ.

జ: మొండరి, మొండికట్టె, మొండికెత్తు, మొండివాఁడు, మొండీఁడు.

మొండికట్టె. విశ. (మొండి) మొండితనము కలవాఁడు, కలది, మూర్ఖుఁడు; మూర్ఖురాలు.

సీ. ఆకతాయి వికారి యడిబండ గుండఁడు మొండికట్టె గులాము ముప్పెగోవు.
హంస. 5. 118.

గీ ....మొండి, కట్టె నాఁగను గుణనామ్యగాఁ జెలంగు ...
ఆం. భా. 3. 7.

మొండికెత్తు. అ. క్రి. (√మొండి) బండతనము కలవాఁడగు.

(వ్యవ.) వాఁడు ఎంతకొట్టినను మొండికెత్తి కదలకున్నాడు

మొండియము = మొండెము. వి. కబంధము, తలలేని దేహము.

ఉ. గం డొకపండితోఁక తొడుకం గడకం జెలువంది గొట్టిన, నొమ్మొండియ మూడి కుక్కతల ... పడిన న్వరాహ మా, యండలఁ జెట్టు గుట్టయన కన్నిటి కాచిన నూడ దమ్యో ...
కకు. 4. 81.

మొండివాఁడు విశ (మొండి + వాఁడు)

1 చేతులు లేనివాఁడు

ద్వి. ఒం డేమి నీదుదోర్దండసంగతిని, మొండివానికి వచ్చె రెండు చేతులును
పండితా పురా. 10. 4 పా.

2. మొండితనము కలవాఁడు, మూర్ఖుఁడు

(వ్యవ.) మొండివాఁడు రాజుకంటె బలవంతుఁడు

మొండీఁడు వి. జ. (మొండి + ఈఁడు స్వార్థమున. మొండితనము కలవాఁడు, మూర్ఖుఁడు

కం. మొండీఁడు పాపకర్ముఁడు, చండాలుం డాడి నీచజనుఁ డుత్తమవం, శు, డైనవాని వడచిన, దండు వుడిగి చంపు టుచితధర్మము పతికిన్ ...
విజ్ఞా. 2 124(

కం తలుసంటి దన్ను నెదిరిని, నెఱుఁగఁడు దన కొలఁది పుడుకలేటఁడు మొండీఁ, డలజాతి...
కు నం. 7.880.

మొండు = మొండి (శ. ర.) విశ. కొంత తెగినది (కాలు, ముక్కు మొ.)

ద్వి గ్రుక్కక రామానుజుండు శూర్పణఖ, ముక్కును జెవులును మొండు సేయుటయు...
రం. రా బాల. 6 పా 16 పం.

(చి.ని.పా. మోడుసేయుటయు ముద్రి. పా. మొండిసేయుటయు శ. శ. సా.)

మొండెపుగాము. వి. (మొండెము + గాము) కేతుగ్రహము. (రాహువు. అని. శ.ర..

మొండెపు రక్కసుఁడు. వి. (మొండెము + రక్కసుఁడు.) కబంధుఁడు.

కం. రెండు మొనవాఁడికోలల, రెండుబుజబులును వానిరిం గూర్చి కడుం, గొంపవలెనున్న యబ్బలు, మొండెపు రక్కసునిమేను మురియలు చేసెన్.
అచ్చ రా అర 118.

మొండెము = మొండియము. వి. (సం. ముడమ్, ప్రా. మొండం) తల లేని శరీరము.

కం. రెండమ్ములఁ గరయుగ్మము, ఖండించి నటు

ప్రచండకాండం బోకటన్, గుండలదీప్తుల తోడను, మొండెము భువి డొల్లఁ జేసి ముద మున వార్వెన్ హరి. ఉ. 4 129

మ అలకాధీశుఁడిదూత నిట్లతఁడు ప్రాణాంతంబు నొందించి యా, తలయున్ మొండెముఁ గొల్చిలో మెలఁగుభృత్యశ్రేణి పాల్వేసె...
ఉ శా. 2 829.

సీ మొండెముల్ మొసళులు కండలు కప్పలు మెడ డస లేనుంగుపడుపు దీవు, లు. .
ఆచ్చ. రా. యు 482
ఆం. భా. 2 225.

జ. మొండెపుగాము, మొండెపు రక్కసుఁడు.

మొకబంగము వి. (సం. ముఖభంగః) మొగము విఱుపు, కోపము.

ద్వి మక్కువ వేమాఱు మామాఱు గాఁగ, మ్రొక్కి తోకొని రమ్మ మొకబంగ మెడయ...
ద్వి పం మ. 4.318.

మొకమాలు = ముకమాలు. వి. (హిం. ముహమాల్) ఒకవిధమగు మేలుజాతిపట్టు.

సీ పగడంపుఁగంబము ల్పచ్చరాబోదెలు గొనవారు మొకమాలుగోడఁబారు.

గీ. కలిగి . అలరారుదేరాహజారమువను ...
రసిక. 3.141.

చం. నకినెలి పట్టెమంచమునఁ జాయవ కాసితివాని పైఁ దురం, గి మొకమాలులేవున నొగిన్ శయనించి మనోభవవ్యథన్ ..
హంస. 1.69.

మొకము = మొగము. వి. (సం. ముఖమ్. ప్రా. ముహం) ముఖము, వదనము.

చం. .. ఊరక ననుఁ గన్నఁ బ్రామి విధి రత్నపు బొమ్మల నాఁచికొన్ననా, మొకమున ప్రేలు చున్నయవి ముప్పురమూర్తులు నంచు నార్తుఁడై.
ఉ. హరి. 2. 6.

ద్వి చిలికిచూపులు సునుకెక్కులముద్దు, మొకము కెంపులమోవి మొలకనవ్వులును...
రం. రా బాల. 60 పా. 15 పం.

చం. .. మీ, సకియ వివాహవేళఁ బురశాసను పాణిఁ బరిగ్రహించుచో, మొకమున బుప్పమంచు నహి ప్రమోగిన నెట్లు భయంబుఁ జెందునో...
హర. 4. 27.

మొకమజ్జనము = ముఖమార్జనము, మొగము కడుగుకొనుట.

కం మొకమజ్జన మై సంధ్యా, దికకృత్యము లాచరించి..
సారంగ 3. 156.

మొకమెఱుక = ముఖపరిచయము, కొంచెము స్నేహము.

కం. మొకమెఱుక గలదు గదవే, మకరాంకుని యనుఁగుమేనమామకు నీకున్, దిశమకలు నేగువల దను, మకటా మేతపయి కేఁగునవు దైనఁ జెలీ.
విజ వి. 2. 199.

జ. మొకమోట, మొకమోడు, మొక్కట్టు.

మొకమాట (ము) = మొగమోట. వి. (మొకము+ఓట) 1. దాక్షిణ్యము, పరచిత్తానుకూలవర్తనము.

చం. ఆని కడుఁ దెంపుచేసి సుతుఁ డాడినమాటకు మాఱుపల్క నే, రనిమొకమోట నాన్నపతి రత్నము కొండొక వెచ్చనూర్చి...
భోజరా. 4. 46.

కం. పాటి గలదె పసరమునకు, వేటలవిం గదిసి వపుడె విఱువక నే న, వ్మాటల బేలుపడితి మొక, మోట దరిద్రత్వమునకు నొగిఁ బొత్తయ్యెన్...
భోజరా. 6. 55.

2. సంకోచము

కం. వికసితశిరీషకోరక, సుకుమారశరీర సార శోభాన్వితలన్, మొకమోట మింత గలుగక, యకటా మోదంగఁ జేతులాడెనె నీకున్...
హరిశ్చ. 2. 158.

మొకమోడు. అ. క్రి. (మొకము+ఓడు) దాక్షిణ్యపడు, సంకోచించు.

కం. అకటా తగ దని పలికిన, మొకమోడక నమ్మ బన్నములఁ బఱచి రొగిన్... దశకు 8. 12.

కం. ఒకనిని జ పను జెలుపను, బ్రకటితముగఁ బ్రోవ నెఱిఁగి బలవంతుఁడు వా,నికి నడ్డపడక యున్నను. మొక మోడక పణపహ్రమ్ముం గానవలయున్ విజ్ఞా 2 101

మొకరము = మొక్కరము వి. స్తంభము.

ఉ. వచ్చి నృపాలకేళిగృహవాటము నెచ్చెలి పిండు చాట్పనం, జొచ్చి మెఱుంగుదేఱు లొగచుట్ట పుతా మ్మొకరంబు మాటుగా నచ్చపలాక్షి నిల్వ... వసు. 6 26.

(శ. ర పా. మొగరము వ్యస్తుద్రి. పా.)

సీ. రమణ మాటుగ నున్న రతనంపుమొకరంబు డంబుగా నవలఁ గ్రొందెంబు నెప్ప...
చమ. 3. 90

మొకరి. విశ. (సం. ముఖరమ్) 1 మ్రోయునది, ధ్వని చేయునది.

సీ. మొకరి మట్టెలమ్రోత ముద్దుచూపఁగ రంభ కనకంపు గొడుగులాగాలు దొడిగె...
హర. 7 187.

మ. వలిపంపుదెః మాటులం దిరుగు జాళ్వామేలి కీల్పొమ్మలం, దెలనాదుల్ విరిచందువా మొకరి లేఁదేంట్లార్పటు శ్వేత్రహస్తులు సామంతులు లొల్కు దెల్పులనుద్దుల్ చామర గ్రాహిణీ, వలయా రావము వందిమాగధులకై వారంబు లోరంబుగన్. చం. రా. 2.56.

కం. అదొర యేగతి వారల,వా దుఱుపన్ వలయు వింటివా వినలేదో, పైదలి యనినఁ బ్రభావతి. మోదము వెలిఁజిలుకఁ జిలుక మొకరికిఁ బలికెన్, శుక. 2.89.

(చిలుకమొకరి, విశేషణోత్తరపదకర్మధార యసమాసము).

2. అగ్రేసరము, ముందునడచునది.

సీ. ఇరుఁగోపులను దుమ్ము లెగయించునది సిలే ముస్తీబు గలకాలు మొకరిపోఁటు...
కువల 2.127.

3. అసంబద్ధవచనము లాడుఁవాడు, పొసఁగని మాటలాడునవి.

ద్వి. కుం మున దగ బొమముడి పెట్టుకొనుచు మొకరియై పెఁరగి యేపున మల్లచఱ్

రం. రా. సుం.

(శ. ర)

జ. మొకరితనము.

మొకరితనము వి. (మొకరి + తనము, వాచాలత, అసంబద్ధవచనములాడుట.

చం. మొకరితనంబుతో వెనుక ముంద రెఱుంగక తామె గానవి, ద్యకుఁ బ్రభు వైవలీల దుర హంకృతిఁ బోరెడు వీరితోడ ..
సమీర 9.138.

మొక్క[1] = మోక వి. (సం. మాలికా) 1. మొలక అంకురము.

సీ. మొలక మొలవ మొక్క మోక మోసిరిక మొటిక నా నంకురం బొప్పుచుండు
ఆం. భా. 2 35.

ఉ. మీసపుమొక్క నిక్కునకు మిక్కలి దొల్కురి వాన కుంతలా, ళినురపాల సీలమణిలీలకుఁ గ్రొమ్మనుపాన... రా. వి. 2.25.

శా. కానీ రం దని కేకరాశుచిమొక్క బ్రేక్కలన్.. కారన్. ఆము 2.26

2. పల్లవాంకురము, చిగురుమొలక

సీ. ముందట నెలమావిమొక్కల నలరింపఁ గర్తదా నగు చెలికాఁడు వడువ... హరి.ఉ. 6.58.

3. వి. ఒకజాతి జొన్నలు. (శ. ర)

జ : మొక్కజొన్న, మొక్కమామిడి.

మొక్క[2] వి. 1. మడఁగినమొన.

గీ. ఖరునిఁ దునిమిన శితసాయకంబు మొక్క దీర్చుచున్నాఁడు కంటి పై దేహివిభుని...
భా. రా. యు. 361.

సీ. గురుకుచాకుచపాతకుంతాంగజాంబుజాస్త్రముల మొక్కలు దిద్దుపాన యనఁగ...
రా. వి 3 30.

శా. వేనుం డీగతిఁ బాపకర్మములు గావింపంగ నాక్రి
డునన్, వాన ల్గల్గక మానె నారబము లెండన్
బొాచ్చెఁ బెక్కావదల్, గాన న్వచ్చె సమస్త
దేశముల మొక్కల్ దాఁక నన్యోన్యదు,
ర్మానక్రోధమునం బ్రజ ల్చెడిరిజూము ఒయ్యె
నానాఁటికిన్. వి పు. 2. 107

మ. ...ఉద్భటా, చలకూటోపలకోటిరూపు చెడ
నిచ్చల్ రాయఁగా నైనమొక్కలు
.. భూకాంతకు నున్నవయ్యె.. మనుచ. 1 : 5.

విశే. (సం మోఘః) 1. వ్యర్థము (శ ర)
2 మొనచెడినది, వాఁడి చెడినది.

ద్వి. అక్కజంబగుచు వజ్రాయుధం బుండ, మొక్క
సురియకును మోహించినట్లు ..
బస పు. 7 661 పం.

(మొక్కలసురియ ప్రొత్తప్రతి. పా.)

3 లేఁత, చిన్న.

వ. ...గ్రక్కునఁ బోడము మొక్కనగవుల మోము
దమ్ములకు వేఱొక్క వింత తెలివి యొక్క.
ఆము. 4. 35.

జ. మొక్కపడు, మొక్కపఱచు, మొక్కపాటు,
మొక్కవుచ్చు, మొక్కపోవు, మొక్కలుపోవు.

మొక్కఁడు విశే 1. బలసినవాఁడు.
(శ. ర. బ్రౌ.)
2 దృఢచిత్తుఁడు. పట్టినపట్టు విడువనివాఁడు.
(బ్రౌ.)

మొక్కకట్టు = మొలకకట్టు.

మొక్కచె (చ్చె)డు అ. క్రి. 1. అశాభంగమునొందు.

వ. .. చొక్కరవింటి చక్కనిసామి ... పువ్వు
ముల్కులేసి చిక్కుపఱుప జక్కపజవరాలు
మొక్కచెడి యిక్కడక్కడం దిరిగి...
ప్రద్యుమ్నచరిత్రము. 3.75.

2. అవమానము (శ. ర.)

మొక్కట్టు వి. (మొకము+కట్టె) ముఖవైఖరి.
(శ. ర. బ్రౌ.)

మొక్కజొన్న వి. మొక్క[1]+జొన్న) యవనాళ
భేదము, ఒకజాతి జొన్న (వ్య. వి.)
(వ్యవ । ఈ సంవత్సరము మొక్కజొన్న
బాగుగా అంటలేదు. 2. బ. ఒకజాతి జొన్నలు.
(వ్యవ ) ఇప్పుడు మొక్కజొన్నలను గూడ
ఆహారముగా నుపయోగించుచున్నాము.

మొక్కడి = మొక్కళి వి. చిన్నదంతములు గల
ఏనుఁగు శ. ర.

జ మొక్కడీఁడు.

మొక్కడీఁడు వి. (మొక్కడి+ఈఁడు స్వార్థమున)
మొక్కడి.

సీ. ... మొక్కడుఁ దనసల్పదంతగజాఖ్యదనరు..
అం ఖా. 2.194.

మొక్కపడు అ క్రి (మొక్క+పడు) 1 మొన
మడఁగిన దగు.

సీ. కరముఁ గోకిలభటోత్కరముచేఁ జగురుc
గ్రొంబదనువంకిణి మొక్కపడఁగఁ జూచి.
చంద్రా 3.117.

2. భంగపడు, చెడు.
(చూ. మొక్కపఱచు.)

మొక్కపఱ (ఱు) చు మొక్కపుచ్చు స. క్రి
(√మొక్కపడు.) 1. మొనవపోఁ జేయు,
కుంఠితముచేయు.

సీ. రాజుపైఁ గొలగానిరహిఁ జూచి తనవాలు
మొక్కపఱచునగు మోముఁ దలఁచి... జలకఁ
జేసినవాఁడిచూపుఁ దలఁచి... రా వి. 3.189.

సీ పరికించి చొరలేక పైపైచి వజ్రాది బహు శస్త్ర
ములు మొక్కపఱచుటకును...
దశా. 10.9.

2. భంగపఱుచు, పరాభవించు.

గీ. ...ఆబల్లిదుండు, వారి వందఱఁ బెక్కు
క్రొవ్వాఁడిములికి, మొత్తములచేతఁ దర్దయు
మొక్కపఱచి... అచ్చ, రా. యు 332.

వ. ...చుక్కలఱిగి మొక్కపఱుచునఖచక్రవాళ
చంద్రికల... ఆము. 6.98, కుక. 2.200.

3. చెఱుచు, భగ్నముచేయు.

కం. దిక్కులిమగువలయాలువు, మొక్కపోఁటిచెదిన...
పారి. 1. 50.

గీ. పొలసుమేఁతక్రొన్నన్నబోఁడిబెగల, యాలువులు మొక్కపఱిచియు మేలికత్తె, లానిపై నెక్కి మొనసి పాలసుల నెల్లఁ, జిదుమఁగల బల్లిదుఁడ వటె గదలె తండ్రి.
అచ్చ. రా. బాల. 159.

**మొక్కపాటు** వి. (√మొక్కపడు.) భంగపాటు, పరాభవము.

ఉ. కల్లరి చేరిజంబు విటకంటకి మిక్కలితత్తనూజయుం, దల్లి నతిక్రమించినను దామ వహించుకొవంగ జాలదీ, ట్లల్లవఁ దేరఁ దీసి యిపు డాచెదు గెక్కడ మొక్కపాటు దే, నుల్లము వం దలంచినదొకో...
విప్ర. 4. 88.

**మొక్కపుచ్చు = మొక్కపఱచు** స. క్రి. (మొక్క² + పుచ్చు) మొక్కపోవఁ జేయు, కుంఠితము గావించు, భంగపఱచు.

ఉ. ... అడ్డము,న్నాఁడు మదాతిరేకమున నా కవరోధము సేయ వేఁడి య,వ్వాఁడిమి మొక్కపుత్తు నని పక్షమువన్ బలితెంచి తాఁకినన్...
భా. రా. సుం. 28.

**మొక్కపో (వో)** వు. అ. క్రి. (మొక్క² + పోవు)

1. వాఁడిచెడినదగు, మొఱవపోవు, కుంఠితమగు.

మ. కదనోద్దతత నొక్కయమ్మునైనన్ బ్రక్కల్ సేసె నవ్వాలి నా,ప్రదటం బిప్పుడు మొక్కపోదు నిను ద్రుంపంజాలుఁ గ్రొవ్వాడి మిన్...
భా. రా. కిష్కిం. 4, 24.

సీ. గురుగోత్రతటములు గోరాడ నునుమొక్కపోయినవలిగొమ్ము్మదోయి మెఱయ...
హరి. ఉ. 7. 79.

2. భంగపడు,-పరాభవము నొందు.

గీ. మునులమనసులు నొప్పించి మొక్కవోయి, తైసిదొలఁగినవా రెంతలేసివార,లు ...
పి, శకుం. 2. 37.

సీ. భృంగంబు చెలిచూపువెఱుకులో నిలువుమీ మొక్కలంబున నొంటి మొక్కపోక...
వాల్మీ. 3. 86.

సి. భూమిధరారాతిచే మొక్కవోవనియరిది బిడ్డనిఁ గాంచినట్టిమేటి ...
విజ. వి. 1. 127.

వ. అంత నక్కడఁ గంసుఁడు పూతన పోయిన పోక నిజావ్వు లగు దనుజులచేత విని నందగోపతనయు దెస శంకించి మున్ను కౌశికాదేవిచేతి పరిభూతి వలన మొక్కవోయి లజ్జించి యున్నవాఁడు.
హరి. పూ. 5. 168.

(ఇట శౌర్యహీనుఁడయి అని భావము.)

3. నశించు, చెడు.

వ. ... పేరుగల బిరుదుమూర్తులఁ బెక్కండ్ర జయించి యెక్కడను మొక్కవోనిమానుషంబున ననూనగర్వుండ వగుచు...
కళా. 8. 106.

4. హానిచెందు, కీడొందు.

గీ. లక్కయిలుచెంత నొక్కింత మొక్కవోక, వెక్కసపుఁ గౌరవుల నెల్ల లెక్కఁగొనక, కన్యకై కొంటి రిఁక మేలు గలుగు ననుచు, వత్సనూరార్చ సబలుఁడై చనియె శౌరి.
పాంచా. ?. 18.

ఆ. కిక్కసంబుచేతఁ గాలునిచేతను, మొక్కవోదురు తుది మొనసి వేమ...
వేమ. 7. 124.

**మొక్కమామిడి.** వి. (మొక్క¹ + మామిడి.)

1. జీడిమామిడి, అగ్రమబీజము (వ్య. వి.). (శ. ర.)

2. విత్తనము నాఁటి పెంచిన మామిడి, అంటు మామిడి కానిది (వ్య. వి.) (వా.)

**మొక్కము.** వి. (సం. ముష్కకః) వృక్షవిశేషము, మోక్షము (వ్య.వి.). (శ. ర.)

**మొక్కెము.** వి. 1. గడెమ్రాను, గడియ, అర్గళము

గీ. .... నీ మనసులోన, గడియ సడలించు తలుపు, మొక్కెము దిగిచి...
విప్ర. 4. 62.

కం. ... మత్తచకోరాక్షి కేళి మందిరమపుడు,
దవ్వృత్తిఁ జొరంగాఁ జూసిన, ముత్తెమున లెం
దలుపుబూసి మొక్కరం మిడియెన్
శుక 2 1. 6

2 నిరోధము, ఆటంకము

ఉ. మక్కున నొక్కటిం గఱచి మొక్కర
మేమియు లేక పాఱి తా, నొక్క శిలాగ్రంబు
పయి నుండి రయంబున మెక్కవచ్చి..
నా. పంచ 1 224

3 స్తంభము (శ రం.).

మొక్కరము[2] = మొక్కలము. వి. శౌర్యము

సీ. కరము వా దిదుమామయుఁడు వాలించు
మొక్కరము వా నిమేలి కరముపాడ
ప్రబంధ. 2. 217

మొక్కలపడు అ (క్రి. (మొక్కలము + పడు)
ఔద్ధత్యమువహించు, మిడిసిపడు. (చూ
మొక్కలపాటు.)

మొక్కలపాటు. వి. (√ మొక్కలపడు) ముష్కరత్వము.

ఉ. పెక్కు తెఱంగులం గరనిపీడన మే నొనరించి
వంచినన్, ప్రుక్కక మిట్టిమిట్టి తలఁజూపుచు...
మొక్కలపాటుఁ జూపెదవు...
చంద్ర. వి. 2. 129

మొక్కలము = మొక్కరము[2] మొక్కలి వి (సం.
ముష్కరః, ప్రా మొక్కలం) 1. మూర్ఖత,
మొఱకుతనము.

చం. . శౌరి మొక్కలమున యాదవుల్ వెనఁ
గఁగాఁ గని మాన్పఁ డుపేక్ష సేసె...
భార. మౌ. 112.

కం. నిక్కము హరిదాసులకును, మొక్కలమునఁ
గీడుచేయ మొనసిన రేనిన్. ప్రుక్కదె వాసవు
పట్టిన, చొక్కపుఁ బలకైనఁ బెద్దకూలంబై
నన్. నృసిం. 4. 116.

చం. తొలఁగగదమ్మ నాకు నిటు దోసము గట్టకు
మమ్మ యింత మొక్కల మిది యేఁటికమ్మ
కొఱగాని కులంబునఁ బుట్టినట్టి నా, వలనఁ
ప్రయోజనం బొకటి వచ్చునె చెప్పఁగదమ్మ.
భోజరా 2 105.

2 మోటుతనము

అ. కావు గలిగి మొక్కలమ్మునఁ గీచకా, రాతి
నొచ్చ ధార్తరాష్ట్రువెంపు, వలన నొచ్చుచున్న
వాఁడు గావున దర్మసంగరమున నెదిరి జయము
గొనుట భార. శల్య 2. 270.

ద్వి. విప్రుండవై యిట్లు విపులకోపమున, నీప్రాణి
నొప్పింప నేల నా కనక, తక్కక నీకుక్కతల
ప్రయ్యవాఱ, మొక్కలంబుగ నీకు మోదంగఁ
దగునె. రం. రా ఉ 1285 పా 2 పం.
కపిక. 8 105.

3. ఔద్ధత్యము, మిడిసిపాటు.

ద్వి. వాఁడి తేజముతోడ వచ్చుకౌశికుని, కనలెడు
తెంపు మొక్కలమును జలముఁ, గనుగొని
చిత్తంబు గలఁగి భూవిభుఁడు.
ద్వి. హరిశ్చ. పూ. 1169 పం.

4. శౌర్యము.

సీ శరభంబునైనను సరభసంబున గిట్టి మూట
కట్టుగఁ గట్టుమొక్కలములు... విక్ర. 1.77.

చం. .. బొందడీ, తలి తెలమాలి యంపసాది
తారెడు తెమ్మెర చుట్ట మిట్టనీ. కలవడుచెట్లు
మొక్కలపుటందము లబ్బర మెంచి చూచి
నన్. యయా. 5, 80.

2. ధైర్యము.

చం. నలినదళాక్షి నీవు బలినందను కూఁతుర విట్టి
నిన్ను మొక్కలమున నొక్కరుండు దన
కౌఁగిటఁ జేర్చునె.... ఉ. హరి. 5. 87.

కం. అక్కట బలితపుటడవిన్, మొక్కలముగఁ
గోల నునిచి మోమోడకనీ, విక్కడకు రాఁగ
నెదలో, నక్కటికం బేల పొడమ దయ్యో
చెప్పుమా. అచ్చ. రా. అర. 79.

6. ఉత్సాహము.

సీ. ... మూఁపు మూఁపుననుండి మొక్కలమున,

ననిఁంబు లేడును నంచె లంచెలుగట్టి యాకాశ వీథి నందంద నడవ. కాశీ. 1. 131.

చం. ... పన్నిదంబునకు మేషములం దలపెట్టఁ జూచుచో, మెలఁతుకమేష మాఖలుని మేషముఁ దాఁకి వధించెఁ జూచి, మొక్కలమున నాతఁ డాతగరు కాయము నొచ్చె జయాభిలాషియై భోజ. రా. 5. 260.

సీ. ప్రణయానులాన సంపత్తిలోఁ గొంకకమున్నాడి యే తెంచు మొక్కలంబు.. కావ్యా. 3.41

7. అతిశయము, ఆధిక్యము.

గీ. ... మొక్కలంబు, దోఁపఁ దోతెంచు దీప్తుల తోడి దివియ, గాఁటవంబునఁ గనుఁ గొని చేరఁ బోయి. దశకు. 7. 102.

కం. ఉపకార ముత్తముఁడు తన, కృప మొక్కల మున నొనర్పఁ గల్పిషుఁ డొకప్రత్యుపకారము వెదకం డొక, యపకారమె రోయు నొండె నాపదఁజేయున్. కేయూర. 3. 110.

8. బ. ఉత్సాహవచనములు.

కం. ఎదురుకొని వీడుఁ బట్టుకు, ముదమారఁగఁ దాన యనిచి మొక్కలములు నిం, పొద విందు నట్టివియుఁ గా... భారం. అశ్వ. 4. 156.

మ. బలియుం డుగ్రుఁడు యౌవనాశ్వధరణీ పాలుండు తత్సైన్యు లా,జుల ముక్కాఁకల నారితేజీవమహోశూరుల్ చలంబెత్తి మొ,క్కల ముల్ పల్కితి... జై. భా. 1. 87.

(ఇట ముష్కరవచనములు అని శ. ర.)

విశే. 1. అప్రతిహతము, అకుంఠితము.

చం. ననుఁ గని యొండుసత్త్వము మనంబున నెగ్గిలి పాఱునప్పు డిమ్మునివరుఁ డిట్లపోలెఁ గృప మొక్కలమై శరథంబు గాఁగఁ జే,యునో తగ దాని నట్లయిన నుద్ధతి నాకుఁ జరింప లేదు ... భార. శాం. 3. 95

శీ. పోయుగపుఁ జిత్రరూపంబుఁ జూచుచోట, వేసరు విలోచనంబులు వికృతదైత్య, లక్ష్య మీక్షించు టలు మొక్కలింపుగెలుపు, గైకొనియె సత్య భామ సంగ్రామసీమ ఉ హరి 1. 161.

2 ముష్కరము, ముష్కరుడు

ఉ... వాతితోడ వీఁ, డెక్కటిపోరికిం దొడరు టెక్కడ యెక్కడి సంగతంబు లీ, మొక్కల పుంబ్రసంగములు మోసము దెచ్చు దురూహ లేకదా చం. రా. 2. 64.

కం తగిన సహాయము గలిగిన, పగతుని యెడ మొక్కలంపుఁబని గా దనినన్, జిగురు విలు కాఁడు రతి నను,బెగడించెదు నీవు సహజభీరువ వగుటన్.

ప్రబోధ 1 52.

3 ఉద్ధతుఁడు, మిడిసిపాటుగలవాఁడు.

కం ఎక్కడి ధర్మరహస్యము, లెక్కడి చుట్టఱిక మింక నేఁటివినయముల్, మొక్కలపు శత్రుఁ డొంటిన్, జిక్కినఁ జంపుటయె నీతి సిరుల వలసినన్. వి. పు. 8 406.

చం కలువలదాయ వంగడపు గామిడిచాముసు దెచ్చినట్టి మొ,క్కలపుఁ బిసాశిరక్కసుని గట్టిగ లో నిడుకొంటి వింక రా,నెల కడిమిం గలఁచుఁ గవ నిన్ననుచున్ దమ జేని కే,ల్పడన్, దెలుపఁగ నేఁగె నాఁ బఱచెఁ దెల్లగ నేఱులు నీటివామికిక్ అచ్చ రా. కిష్కిం 64. ప్రబంధ. 605.

జ. మొక్కలవడు, మొక్కలపాటు, మొక్కలి, మెకిక్కలించు, మొక్కలింపు, మెంక్కలి కాఁడు, మొక్కలీఁడుఁ, మొక్కలితనము, మొక్కలుఁడు.

మొక్కలి = మొక్కలము, మొక్కళి. విశే (√మొక్కలము.) 1. ఉద్ధతము, ఉద్ధతుఁడు, సొగరుఁబోతు.

ఉ. వెన్నెలబైట కేఁగు నది వెచ్చగఁ దోఁచిన సైఁచలేక " లేఁ, బొన్నలనీడఁ జేరు నట మొక్కలి తేంట్లు మొఱంగ....సుదం.శా.2.162.

సీ. కెలనఁ జరించు మొక్కలిగడిరాజులఁ జెఱ నుంచు గుహాలలో శిఖరికులము.

సత్య. సాం.. 1.74.

2. మూర్ఖము.

చం. .. ఆకెమం,దులు దల కెక్కి బుద్ధిచలితుఁ డగు వృద్ధుఁడు పెక్కు సేయు మొ,క్కలి వగఁ బైన మయ్యెడవ కానకు ఖానుకులీనశేఖరా.

చం. రా. 4 40.

వ. ఇక్కై వడి నమ్మొక్కలివగ రక్కసిచుక్కల రాజుచేత నొక్కవడువున విడువంబడి..

ఉ. రా. 4.221.

3 శౌర్యముగలవాఁడు. శూరురాలు.

వ .. ముక్కంటిపండుల మెక్కు మెక్కలిని గన్న ముక్కంటిపొగడిక నమరిన ప్రౌఢ. .

ప్రబంధ. 2.16

సీ. ప్రబలదిగ్గజములు ప్రతిఘటించినఁ గాని మొక్కలిజంతయై మూలఁ ద్రోయు...

ఘటికా 1. 50.

మొక్కలించు. అ. క్రి. (√మొక్కలము.)

1. ఉత్సహించు, పూను.

సీ లంఘనలాఘవోల్లసనఁబుమై మొ క్కలించి వార్ధులు చౌకళింపకుండ .. కవిక. 1. 14.

1. ఔద్ధత్యము చూపు.

సీ. రా వదేమిర యింత కావరమా యని మొగిఁ దిట్టి యమునిపై మొక్కలించె. సీతా. 2. 156.

మొక్కలింపు. వి. (√మొక్కలించే) ముష్కరము చేయుట (క్షేత్రయ. శ. ర.).

మొక్కలికాఁడు విఖ. (మొక్కలి + కాఁడు. స్వార్థమున) ఉద్ధతుఁడు, పొగరుఁబోతు.

కం. మొక్కలికాఁడౌ టొకచే, తక్కిన గుణము లను గాన దైవతములచే, మ్రొక్కులు గొనఁగా వీనికి, నెక్కడ వ్రాసితిరో యోగ మేమందు నిఁకన్ పార్వ. 2. 102.

ఆ. మూఢులై వనరుల మొక్కలికాండ్రయా ..

వేమ. 2. 229.

మొక్కలితనము. వి (మొక్కలి + తనము) ముష్కరత్వము, మూర్ఖత.

కం. చక్కనివనితా పురుషుల, కెక్కడివాపులు మనోజుఁ డెక్కడ నున్నాఁ, డక్కడఁ దగవులు వడమనె, మొక్కలితనమేల మేలములు వల దింకన్ శుక 2. 531, 3. 26.

మొక్కలీఁడు. విఖ (√మొక్కలము.) 1. ముష్కరుఁడు, మొఱకువాఁడు.

సీ. మంత్రి విద్వేషంబు మాన్యపరాభవంబును ప్రజాపీడనంబులును గలిగి, మొక్కలీఁ డగుటయు మ్రుచ్చిలి మంత్రులాతనిఁ జాపి...

శార. అశ్వ. 1. 18.

ద్వి ముక్కుమో మెఱుఁగక మోమోటపడక, మొక్కలీఁ డనుచందమున విడజాడఁ, జాడియే నీకు.

అ. మ. క 2. 92 పా. 15 వం.

2 శూరుఁడు, ధీరుఁడు

సీ. చేఁదు భోజనముచేసిన మొక్కలీఁడు దశాధ్వరధ్వంసదీక్షాధికారి ...

వరాహ 6. 89.

కం. రక్కసులలోన మాటికి, నొక్కనిగా నేర్పరించ్చి యుంచెను గాఁబో, లుక్కుపొడి శాలుచున్నది, కక్కసపున్ మొక్కలీండ్రఁ గముఁగొను వట్లన్.

మల్లుపు 2. 7.

మొక్కలుఁడు. విఖ. (√మొక్కలి) (సం. ముష్కరః ప్రా మొక్ఖలో). శూరుఁడు

ఉ ఎక్కడివారొకో గరుడుఁ డెక్కుడుగాఁ గలవారు వీరపో, యొక్కుడువారు లోకుల కనేకవిభాకరభీకరాకృతుల్, ముక్కుట మూవురిక్కడకు మొక్కలులై యరుదెంచి రంచుఁ జే,రుక్కున యాదవత్రయ రణోద్భటులై చటులైకవిక్రముల్.

ఉ. హరి, 6. 37.

మ. అలుకం జేర్చి ప్రలంబమర్దనుఁడు దా వచ్చిరు

కంఠంబునన్, హల మత్యుగ్రతతోఁ దగిల్చి ముసలం బంకించి యందంద మొక్కలుఁ డై త్రేయఁగ నంగముల్ వదలి రక్తం బుచ్చి మూర్ఛిల్లి బె ట్టిలపైఁ బచ్చిన యట్లు వ్రాలె మగధుం డివేళ నజ్ఞానమా.
పద్మ. 9. 854.

మొక్కలు(లో్వి)వోవు = మొక్కవోవు.

అ క్రి. (మొక్కలు + పోవు)
మొనలు మడఁగిన దగు, కుంఠిత మగు.

సీ. వలరాచ తూపులవలను మొక్కలువోవ వాలుగ్రేఁ గన్నులవాఁడిమియును ...
హరి. ఉ. 7. 47.

శా. మొక్కలో్వియున తెక్క మొక్కగమితో మూర్ఛాలసత్వంబుతో, జిక్కుల్వడ్డ లతాత్రు మావకులతో శీర్ణోపలశ్రేణితో, నకోళ్లాహల ముర్వి వ్రాలియును... వసు 2. 165.

ఉ. అక్కట దోఁప నీ వతనియాదల కేలున వంటి యాజడల్, చిక్కులు వాయ దువ్వి కయి చేసెదవే యటు సేయఁ బోయినన్, మొక్కలు వోలె నీ చిలుక ముక్కులవంటి నఖాంకు రంబులు ... రామా. 6. 153.

మొక్కళి. వి. కెంపునందలి అధికకాంతి.

సీ. పద్మరాగాభిధఁ బరఁగు గెంపన... తత్కాంతి విడి యవఁ దవరుచుండు, వాకాంతి మెండైన నలరు మొక్కళి యన... ఆం. భా. 2. 277.

2. మొక్కడి. గజవిశేషము, చిన్నదంతములు గల ఏనుఁగు.

ద్వి. భీమంపురవములఁ బేర్చి రౌద్రంబు, మోములఁ గలిగిన మొక్కళిల్ కోటి...
రం. రా. యు. (చి. ని.)

గీ. గజవిశేషంబు ముందు వెక్కలను జూడ, నట్టి వాఁడును గెంపులయందుఁ జాట, మునఁ దళుక్కమఁబిగి దగు మొక్కళియన.
ఆం. భా. 3. 64.

వి॰. మొక్కలి. పొగరుబోతు, ముందు వెనుకలు చూడనివాఁడు. ఆం భా. 3. 64

మొక్కన. వి. ఒకజాతి చెట్టు, వృక్షవిశేషము.

సీ. రేఁగు తక్కిలి ములువేఁగి భూచక్రముమొక్కన కొక్కెన మొల్ల మ్రాను. హంస. 4. 11.

మొక్కు = మ్రొక్కు అ క్రి. నమస్కరించు, దండముపెట్టు (శ. ర.).
వి. 1. నమస్కారము శ. ర.).

2. మొక్కుబడి.

(వ్యవ.) అతఁడు మొన్ననే తిరుపతికి వెళ్లి మొక్కు చెల్లించుకొని వచ్చినాఁడు.

జః మొక్కుబడి.

మొక్కుబడి = మ్రొక్కుబడి. వి. (√మొక్కు) దేవతాప్రార్థన.
(వ్యవ.) సంక్రాంతి మొదలగు పుణ్యదినములలో మొక్కుబళ్లు చెల్లించుట వాడుక.

మొగ¹. వి. (సం. ముఖమ్, ప్రా. మొహమ్.)
1. అప్రాణి ముఖము

కం. పొగరు మొగకడలి యక్కలిఁ, దగిలి నిలువఁ బడిన గనపతరియుం బోలెన్ ...
కాశీ. 1. 133.

2. ద్వారము.

ద్వి. త్రిగుణాత్మకమ్మైన దేదీప్యమైన, ముగురు వేలుపులకు మొగ యాకసంబు.
రం. రా. ఉ. 9 పొ. 29 పం.

కం. తమవారిం బిలిచిన వైశమ చని వా రంద ఱున్ బోలనుమే పరికల్లు మొగం బాపిన పెనుజాయి మొగిం బడఁ దన్ని లోని కేఁగి కడంకన్. అచ్చ. రా. యు. 445.

3. మొదలు. ప్రారంభము.

చం. ... లెక్కకున్, మిగిలిన సేన నొక్కఁ డహ మించి వధించుట యెట్లు వారిలో, మొగఁ దగువాని కింత మసిమోవక త్రుంగుట యెట్లు సైన్యముల్ .... జై భా. 2. 43

మొగజోదు — యోధాగ్రేసరుఁడు.

సీ. హలపాణి ప్రథముఁ డాహవశాలి సాత్యకి
నేను రెండవవాఁడ నిట్టివాఁడ, మొగజోదు
కృతవర్మ మూఁడవవాఁడు నాలవవాఁడు
నిశరుఁడు ఉ. హరి 4. 200

జ. మొగకటు, మొగకొను, మొగకొలువు, మొగచాఁటము, మొగచాళి, మొగదల, మొగపాళము, మొగపు, మొగపులతీఁగె, మొగమాడువు, మొగరము, మొగరాడు, మొగలివాకిలి, మొగవాడ, మొగవాఁటము.

మొగ² = మొగ్గ వి ముకుళము

రగడ. మొగలివిరుల్ పూమొగ లివె నెచ్చెలి.
యయా. 4. 25.

మొగకట్టు అ. క్రి. (√మొగ.) 1 అభిముఖమగు.

కం. అదలిచి ద్రోణుఁడు భీష్ముఁడు, మదమున నిలు నిలు మనంగ మఱియును మొగక, ట్టద సేన భీమసేనుఁడు, గదిసి పిఱుఁద వంటవార్వఁ గౌరవనాథా. భార భీష్మ. 2.113.

2. క్రందుకొను, అతిశయించు.

ఉ. కంకణనిక్వణంబు మొగకట్టఁగఁ గౌనసియాడ రత్నతా, టంకవిభూషణంబులు వడంకఁ గుచంబులు రాయిడింపఁగాన్...
నైష. 6 102

("మ్రోఁగు" అని శ. ర.)

మొగకొను. అ. క్రి. (మొగ¹ + కొను) అభిముఖమగు.

కం. పెనుగాలిని వెనఁ గూలిన, వనముక్రియం బడిన పాండవబలముఁ గంటే, విను మింక నెన్నఁడును మొగ,కొన రీయోడిశనువారు గురుకోల్తలకున్. భార. ద్రో. 1. 301.

స. క్రి. పొందు.

కం విను డీసుఖమును దుఃఖము, వనిత్యములు గావ వానియాగమకాలం,బున ముదమును శోకము మొగ,కొనమియ చుమ్ము అవు శాంతి గోరుజనులకున్. భార. శాం. 1. 189.

(మొగకొనవనీయమి (శ్రా. పా.).

మొగకొ(లుపు)ల్పు స క్రి (√మొగకొను) అభిముఖము చేయు, ప్రోత్సహించు.

చం. భీతికిం, దెరు నగునట్లు చెప్పి కడుదీనత తోఁచఁగ నాడి సంధి కృకుర్పతిఁ దమ్ము ద్రోపు మొగకొల్పఁగఁ జాలక నాకు భీష్ముఁడు, గ్గురుఁడును దోడు చెప్పిరి.
భార. అశ్వ 3 31.

ఉ. అమ్మెయి నూరకుండ ననుయాయిజనమ్ములు పెక్కు లాడి చీ, త్తమ్ము కలంకదేర్చి యుచిత క్రియకున్ మొగకొల్పి బంధునం, ఘమ్ముల నిందుఁ దెత్తెము.. భార. మౌ. 167

మొగచాటు విశే. (మొగము + చాటు) మొగము మొత్తునది. వెగటైనది.

కం పదునాల్గుమహాయుగముల, ముదు కగు భీమేశ్వరునకు మొగచా టై యుండదు సాని పెండ్లి యెప్పుడు... భీమ. 2. 112.

మొగచాళము, వి. (√మొగ¹) స్వరవిశేషమును దెలుపు వీణతీఁగెలలో నొకటి.

ద్వి. తవరుచు మొగచాళమును నవరాణ, మును మఱి నవరాణమును దీపు బెఱయ...
లీల సారణయుఁ దలిర్ప. బస. పు 3. 925 పం

మొగచాళి వి. (మొగ¹.) మల్లబంధవిశేషము.

వ.. పిడుగులు బిడుగులు గదిసిన చందంబున మొగచాళిఁ బూని వారలపై ధాణుధారలం జూప నప్పట్టునఁ జుట్టి... ప్రబంధ. 788.

మొగడ = మొగ్గ¹ వి. (√మొగడు) సం. ముకుళమ్. 1. కోరకము.

సీ. మొగడతమ్ముల నేల మూసితే నతి మూయఁ దగదె మానసభూనిధానము లవి...
వసు. 1. 109.

కం అగడితలోఁ గెందామర, మొగడలుగనువట్టెఁ జాల మూఁకై చూడం, దగి మున్నిటం దేలుచు

జెగడపివాప్వాపుటగ్గిప్లిల పోవన్.

యయా. 1. 80

ద్వి. హరిశ్చ. ఉ. 66 పం.

ఆం. భా. 2. 40.

2 తలుపులు మునుజూరు మొదలగువానిపై నిర్మించునుబ్బు, బొగడ.

సీ. తగఁ బద్మరాగంపుమొగడలఁ జెలువొందు వైదూర్యవలభులు వన్నెఁ జూప

భాగ. 8. 808.

మొగడులు చెప్పెంద శ. ర. పా. మొగడులు = ఇంటివడికొప్పులుఁ (శ. ర.).

ద్వి. పగడంపువాచూరుఁ బద్మరాగములు, మొగడలు వైదూర్యముల మందిరములు ...

ద్వి. హరిశ్చ. పూ. 176 పం.

3 బట్ట అంచున మొగ్గవలె నిర్మించిన చిత్ర విశేషము

సీ. అపరదిక్పతి కట్టినట్టి సాగరమను పుట్టంబు తుది వ్రాంత మొగడ యనఁగ ...

వైజ. 1. 54

మొగడు = మొగుడు. అ. క్రి. ముకుళించు. (చూ. మొగడుదామర).

అ. మొగడ, మొగడుదామర.

మొగడుదామర = మొగుడుదామర. వి.(√మొగడు.) వమస్కారి (వ్యు. వి.).

సీ. ... ముణుఁగుదామర నా మొగడుదామర వమస్కారి చెలగు ...

ఆం. భా. 2. 68

మొగత(ద)ప్పు. అ. క్రి. (మొగము + తప్పు]) మొగము మఱియొక వైపునకుఁ బెట్టు, అభిముఖుఁడు కాకుండు, వెనుదీయు, విముఖుడవియు.

చం. నడిఁకెదువాఁడు గాఁడు గురునందనుఁ డక్కట తండ్రి చావున,ప్పుడు మొగతప్పి యొుండుగకఁ బోరుచు నుంచెనో ...

భార. ద్రో. 1. 9 2.

సీ. మొగతప్పితిమి ణమున మన మకట మువ్వు రము ...రాజు నొక్కరునిఁ ... తనయులు నమువారుఁ ... ను ... ద్రుఁ గూడి చట్టును ముట్టి కల్పించెరి .

భార ... 1. 27.

సీ. . పౌదిని యొన్నఁను ... మొగతప్పి ... మోంలు నులుపును ననువాఁడు నై ... నటట .

హరి. పూ. 8 133

శా. దట్టించుం ... నవ్వు రద ముద్దం ... గతుండంబునన్, బట్టుం గ్రిందికి నెత్తు నెత్తి మొగదప్పం ద్రిప్పు దర్పంబునన్, గిట్టున్ ...

భా. రా. ... 129.

నా. పంచ. 8. 162.

మొగతిరుగు అ. క్రి (మొగము + తిరుగు) మొగదప్పు, వెడమొగముపెట్టు, వెనుదీయు.

గీ. కటకటా సృష్టిఁ జీకట్లు గవిసె నిందిరాధవుఁడు నైతమును గానరాకపో రొ వనుచు బ్రహ్మాండభాండ మధ్యమున బ్రమసి తిరుగ నారదముని మొగతించె నపుడు.

వరాహ. 9. 113.

సీ. .. గుహుమీదఁ గొలిపినఁ బైఁబెట్ట కడి మొగతిరుగుడు వమరనాథుఁ, డంకుశముతో మడమ

కు. సం. 19. 499

కం. అలిగి దశార్ణాధీశుఁడు, గొలిపెను భగదత్తు మీఁదఁ గ్రూరగజము నుజ్వలము లగునతని తోమర, క్షములతాఁకున నది చలించి మొగతిరిగె వెనన్ ...

భార. భీష్మ. 3. 151.

మొగదల. వి. (మొగ[1] + తల) 1. ముందటి భాగము

వ. ఇట్లు రౌద్రంబుగాఁ బఱతెంచు నతని మొగదల నిలువ వెఱచి గోపాలురు కనుకనిం బఱచి కృష్ణువెనుక కొదిగిన ...

పద్మ. 9. 188.

2 ఎదురు (శ. ర.).

**మొగపడు** స. క్రి. (√ మొగము) చూచు (అంగదుని వచనము)

కం. ఏ నిటు నీల్గుట విన్నన్, మానసమున దుఃఖ మొంది మరణంబొందున్, గాన మును దార మొగపడి, మానుగఁ గుశలంబు లడిగి మఱి నేర్పుమరన్.

భా. రా కిష్కిం. 679

ద్వి. వచ్చి సురాథుఁ డన్వాఁడు లంకేంద్రు, నచ్చుగా మొగపడి యతనితో నసియె ..

రం. రా. ఉ. 57 పా 4 పం.

వ. కంసుండు మీనిమిత్తంబున మీ తండ్రిదెసం బరుసనై యున్నవాఁడు తన్ను మొగపడక ముందర నతనిం గనిన నెంతయుం గలుషించు .. హరి పూ 8 204.

అ. క్రి కనఁబడు, అగపడు.

చం మొగపడెనేని యిద్యోడ సముద్ధతి నైకొని కాతు నాతనిన్ ... దశకు. 4. 113.

**మొగపాళము** = మొగవాళము. వి (√ మొగ) నిస్సరణము (శ. ర.).

**మొగపిటికి** వి. (మొగము + పిటికి) కూర్మము, తాఁబేలు,

గీ. మొగపిటికిఁ గాంతప్రపదముల్ దగులఁ బోవు . హ న 4. 43.

**మొగపు** వి (మొగ[1] + పూస.) 1. హారము మున్నగు భూషణములందు చీల యుంచు కొనుట కేర్పఱిచిన వస్తువయైన పూదె, కొలికి పూస

సీ. ధాత్రీమహాదేవి తాల్చిన మున్నీటి మొలనూలి రత్నంపు మొగ పవంగ ... ప్రభా. 1. 54.

సీ. .... ముంజేకడెంబుల మొగపు లరసి ..

దశా. 2. 183.

2. ఒడ్డాణము మున్నగువానియందు కూర్చెడు బిళ్ల.

ద్వి. పోలింపఁ దగుమొగపులతోడ దెసలు, డాలించు మణుల యొడ్డాణంబుఁ బెట్టి

ద్వి. పరమ. 4. 274 పా. 11 పం.

ద్వి మొగపుల మొలనూలు ముత్యాలకుచ్చు ..

ద్వి పరమ 2. 91 పా 3 పం.

3. హారాదుల ముఖభాగము.

మ తనరూపంబు క్రమక్రమంబున దళద్బ్రహ్మాండభాండంబు నిం, డినచో భాస్కరుఁ డందెకు న్మొగపు మాణిక్యంబు గా నత్తవా, రినిధానీ పరివేష్టితాఖిలధరిత్రీమానము క్ష్మోలఁ బెట్టిన పాదంబున దైత్యభేది బలి మెట్టెన్ వామనాకారుఁడై . వరాహ. 8 25.

4 మొగపుతీఁగె, ఆభరణ విశేషము

కం అందముగ మీఁద దినమణిఁ, బొందించి విభాత మలనభోరమ కిడఁగాఁ, గుందనపు మొగపుఁ గూరుచు, చందంబున నంతపూర్వ సంధ్య జనించెన్ ... కవిక. 4 195.

**మొగపు(ల)తీఁగె** (గియ. వె.) వి (√ మొగపు) స్త్రీల కంఠాభరణ విశేషము

సీ. ముత్యాల పేరులు మొగపు దీఁగెయు బవన్నసరములు గీలించె జాణ యోర్తు ...

యయా. 4. 89.

కం. పడతుక యొక్కతె యపుడా, యొడయనిఁ బొడ గనఁగ వచ్చె నొడ్డాణము వే,మెడ నిడి మొగపుల తీఁగియ, నడుమున నిడి యలంతి వలపు నాటుకొనంగన్.

రసిక. 1.89.

ద్వి. కళుకుగాఁ బొఁజుల కమ్మలు దాల్చి, తెలివిగా మొగపులతీవ లంకించి.

ద్వి. పరమ. 2. 55 పా. 4 పం.

**మొగపెట్టు.** స. క్రి. (మొగము + పెట్టు) ఎదిరించు.

చం అలవడ వానితోడిపగ వజ్జుఁడుఁ గందఁగ నీయలంతి పిరుతె మొగపెట్టె నాసురవిరోధికి నోడినవార వోరులన్ ...

కు. సం. 4. 371. 12. 953.

మొగబీఱ వి (మొగము + బీర) ములుగొలిమిడి, ఒకవిధమగు పూలచెట్టు.

సీ. ముయ్యాకులొన్నయు మొగబీఱ తుత్తిరి బంకతుత్తిరి హంసపాదిగంటె, కామజీలుగు ...
హంస 4 1

సీ. నందిఁ గట్టిన చంద్రశేఖరుఁడు వెలయఁ

(గీ.) బెట్టె మూఁకుడులో మొగబీఱపత్రి, మట్టి ధూపార్తి దీపముఁ బెట్టు చమురుఁ, బొందు పఱుచుక మునిమాపు పూజ సేయ.
హంస 1 182.

మొగమగు. అ. క్రి. (మొగము + అగు.) మొగము పెట్టు, మొగము త్రిప్పు, అభిముఖమగు.

సీ ఘనతర ద్రోహిఁ గొల్వనకు రానియక మొదలు వంచకునకు మొగముగాక...
నీతి. 49.

గీ. ... క్రమ్మఱ వచ్చి తలుపు, మూసి గడె వెట్టి యిఁక ముని ముచ్చుకాన, యిటు మొగంబైన నాకొద్ది యెటిఁగె దనుచు, నింటికిని వచ్చె నవ్విటకంటకియును.
విప్ర. 4. 31.

మొగమాట. వి. (మొగము + ఆట) బాలక్రీడా విశేషము.

సీ. తూరవ తుంకము ల్తూనిగతానిగ చిడుగుడు మొగమాట చిల్లకట్టె ...
హంస 3 146.

మొగమాడువు. వి. (మొగ[1] + మాడువు) ద్వార మందలి మేడ, గోపురము

మధ్యాక్కర ... దిమతాత మల్లవరాజు వేరె ఉదానుం గట్టించెం, గ్రమంబున దానిక కలశ బి డ్డట్లుగా మొగమాడు, వమరంగ శ్రీయుద్ధ మల్లుడెత్తించె నమితతేజుండు.
శా. వ. మ. 2. 5.

మొగమానికము. వి. (మొగము + మానికము) రత్నములలో ప్రధానమయినది, వజ్రము.

ద్వి. మూల లెన్మిది యైన మొగమానికముల, డాలించు విమల తాటంకముల్ పూని
ద్వి, పరమ 5 429 పా.

మొగమిచ్చేమాట. వి. (మొగము + ఇచ్చు + మాట) ముఖము నెదుట సంతోషము కలిగెడునట్లు పలికెడి పలుకు ఇచ్చకము.

ఉ ఈనయగారవుం బ్రియము లీవన లీమొగ మిచ్చుమాట లే,లా. .
పారి 1. 125.

మొగమిచ్చు. అ. క్రి. (మొగము + ఇచ్చు) సుముఖత నొందు, ప్రసన్నత నొందు.

చం. చలిఁబడి యున్నపేరలుక లయ్యువయి న్మొగ మీనికాంత లా, తొలుకరివేళ కామజయ దుందుభిఘోషము వోనిగర్జకుం, గళవళ మంది బిట్టు తముఁ గౌఁగిటఁ జేర్పఁగఁ బ్రాణ వల్లభుల్ ఁ, దెలియఁగ నేర రాత్మలఁ దదీయ విశుద్ధవిదగ్ధభావముల్.
కవిక. 6. 18.

మొగము వి (సం. ముఖమ్, ప్రా మహం, క. మొగ, ముగమ్) 1 వదనము

సీ. అలచెందొవలవిందుచెలు వొందు వెనఁజిందు మొగమున తొక వింతజిగి దొలంకె.
పారి. 1. 56.

గీ. . మొగంబున రౌద్రంబు మునుకొవంగ, విజయపాలుని చిత్తంబు విహ్వలింప.
విక్ర. 3. 80.

గీ. మగువ మొగమున కెన గాక మిగులఁ బొగిలి, తొగలి చెలికాఁడు పదియాఱు తునియ లయ్యె ..

నీలా. 2. 21., ఆం.భా 2. 142.

2. నోరు.

ఉ. నారదుఁ డప్పు డోనృపతి నల్వమొగంబున దీని కారణం, బారసి విందు మన్న.
కకు. 2. 90.

3. ఎదురు, సమ్ముఖము.

చం...భీష్ముఁ డా, దిగఁ గురు సేవలోనగణుతింపఁగఁ చేర్చిన యోధకోటి నా, మొగమునఁ బడ్డ నెట్లడరి ముట్టెదనో యటుసూచుచుండుమీ ... భార. భీష్మ. 2 17.

చం. ...బలవంతుఁ డొకం డిటు చేసె నంచు నీ, మొగమునఁ దెల్పి నీ హృదయముక్ నొగిలించుట కార్తిఁ జెందెదన్ .
ఉ రా. 4 270,
భార. ఉద్యో. 4. 270.

4. అగ్రభాగము

ఆ. అగ్గురుఁ డొండొక, యరద మెక్కి యల్ల వరిగె సేన, మొగమునకు రయంబు మిగుల...
భార. ద్రో. 4. 155.
భార. భీష్మ 1 116.

5 ద్వారము

ఉ. ... నిత్యల, శృంగలతికాలవాల మగుజీవన మంతయు నీమొగంబ కాఁ, బాలన సేయు మిప్పురము భామిను లెల్లను నిన్నుఁ గొల్వఁగన్... భార. విరా. 2 253.

ఆ. మాకు నింపు గాపు మాను మీనుద్దులు, కలహముల మొగంబ కలియుగంబ.
వైష. 7.107.

6. దీనితృతీయావిభక్తిరూప మైన'మొగమున' అనువది కొన్ని భూతార్థకధాతుజ విశేషణముల కనుప్రయుక్తమై తోడనే వెంటనే యనునర్థ మిచ్చును

కం. పోయినమొగమున వచ్చుటఁ, జేయుతెఱంగెల్ల నీకుఁ జెప్పితి... భార. ఉద్యో. 1 369.

విశే. ప్రధానుఁడు, ముఖ్యుఁడు.

కం. సేనమొగ మీతఁ డైనం, బూని మహీశ్వరులు నీకుఁ బొడిచెద రే...
భార. ఉద్యో. 4. 244.

ఉ. ఆహారివీరవాహిముల కన్నిటికి న్మొగ మై మరుత్సుతుం డాహవదోహలుం డమరె...
భార. అర. 7.42.

మొగమొగములు చూచు = ఒకరిమొగ మొకరు చూచు.

గీ. అన్నాదనుశాసనమున కనర్హ మైన, కల్లు ద్రాగుట కాదని తపనకుండు, జోగియొంగిలి రోఁ తని సౌగతుండు, మొగమొగంబులు చూడ సిద్ధగురువరుఁడు. ప్రబోధ. 3.53

ఉ. ...ఇంతెచాలుఁబో, గ్రక్కున నక్కలు న్మొగమొగంబులు చూచుకొనంగఁ గల్గెఁగా..
శుక. 2.83

ఒక్క మొగమగు = ఒక్కవనికై పూనుకొను, ఏక కార్యాసక్తు లగు.

సీ సచరాచరం బైనజగము లెల్ల (గీ) నొక్క మొగమై కడంగినఁ జిక్కువఱచు, దివ్యబాణజాలంబుల దీటుకొలిపి...
భార ఉద్యో. 4. 229.

చం. ...సేనలు దండనాథులతో, సురవడిఁ జేర్చి యార్చుచును నొక్కమొగంబయి దైత్యు లమ్మహీ, వరు నలయించి పట్టుకొనువారయి.
భా. రా. అర. 1. 206,

ఉ. అంధకకాలకేయ మహిషాదులు దైత్యులు బాహుశైలద, ర్పాంధులు గూడి యొక్క మొగమై వడి దొమ్మి యొనర్చి వైద్యు ని, ర్బంధము నేసి కైకొనిరి .. మణికమ్రసుధార సహేమకుంభముల్ . హర 6 95.

మొగమింత చేసికొను = 1. సంతోషముచే ముఖము వికసింపఁజేసికొను

గీ. చెలఁగి తొగకొమ్మ మొగమింతచేసికొనఁగ...
కువల, 1. 25.

2. లజ్జాదులచే ముఖము ముడుచుకొను.

(వ్యవ.) నే నామాట తలపెట్టఁగనే వాఁడు మొగమింత చేసికొనియెను.

6 మొగమున = సంకోచింపక, సిగ్గుపడక.

సీ. అదె వచ్చె నిదె వచ్చె నని నా కెదురుచూచు నీకు నీతింతు నే నేమొగమున...
కాశీ. 5. 323.

ఇట్లే. ఏ మొగముతో

కం కాంతుం డెఱిఁగిన నాతని, పొంతికు నేమొగముతోడఁ బోయెదు చెపుమా..

శుక. 2. 93.

జ. మొగచాటు, మొగతప్పు, మొగతిరుగు, మొగపడు, మొగపిఱికి, మొగపెట్టు. మొగబీఱ, మొగమగు, మొగమాట, మొగమానికము, మొగమిచ్చుమాట, మొగమిచ్చు, మొగముట్టు, మొగమువాఁచు, మొగముసెదరు, మొగమూర్పు, మొగమోట, మొగమోటకాఁడు, మొగమోడు, మొగజూ, మొగవడము, మొగవిచ్చు, మొగవీణె, మొగసరి, మొగసిరి

మొగముట్టు వి మొగము + ముట్టు) అశ్వముఖాలంకారము.

సీ. మురువై నచక్కని మొగముట్టు సవరించి నవరత్నమయఖలీనం బొనర్చి ...

సారంగ. 1 81.

సీ. మగజాల మొగముట్టునిగనిగ ల్వెలయార్చు వారుమంజి ముత్తెంపు సరిపెణలు.

చంద్రా. 2 69.

సీ మొగము ట్టవఁగ నశ్వముఖవిభూష దనరు..

అం భా 2 199.

మనుచ. 4. 28.

మొగమువాఁచు. అ. క్రి. (మొగము + వాఁచు) మిక్కిలి యపేక్షచే బాధపడు.

కం. మన మలరించుచు నెమ్మెయిఁ, జనువాఁడావలను నూపె జనవర నాకం,బున కిది పొరుదల యెఱఁగ,మున వాఁడును మొగము వాఁచుఁ బో యిందుండున్. శుకు. 2. 72

(వ్యవ.) ఈ కఱవు కాలములో ప్రజలు కూటికి గుడ్డకుకూడ మొగము వాచినారు.

మొగముసెదరు. అ క్రి. (మొగము + చెదరు) వైమనస్యము కలుగు, మనసులో నొప్పి కలుగు.

కం. తగ వెఱిఁగి మానఘనుఁడై, నెగడి యవవలిప్త మార్గనిష్ఠుఁ డగుబుధున్, మొగము నెదిరిఁగఁ బలుకుట, జగతీసుర వధము తోడ సరి యని రార్యుల్.

హరి పూ 8. 89.

మొగమూర్పు. వి. (మొగము + ఊర్పు) ముఖవాయువు.

గీ. ... నన లిచ్చె గత జరత్సు, మంపు వావిలి మొగమూర్పు నింప నోర్తు ...

ఆ. ము 5. 184.

మొగమోట (ము) = మొకమోటము

వి. ( √ మొగమోడు ) 1. దాక్షిణ్యము, పరచిత్తానుకూల వర్తనము

కం కొనవయ్య గోవు మాచే, నన విని మొగమోట మనము నార్ద్రితఁ జెనువన్ ...

భార. అను. 2. 279.

కం. ఇవి చెప్పిన, మొగమోటన మనువుచుఁడి మూసితి వబలా ..

హరి. పూ. 5. 222.

కం. అనవుడు హలధరుఁ డచ్చటి, జనపాలకసుతులఁ జూచి సత్యము వలుకుం, డని యడిగిన వారలు రుక్మనిహితులై పలుకరైరి మొగమోటమునన్.

భాగ. 10. ఉ. 298

కం. మగఁడింటికిఁ జనుదెంచిన, మొగమోటము వట్టి మోహమును జిత్తములో, నిగురొత్త మొలుఁగుఁ జూపులఁ, జిగురాకుంబోఁడి పూజసేసె న్నగుచున్.

విక్ర. 8. 80, వి. పు. 1. 144.

2 సంకోచము, ముఖభీతి.

చ. . నాకు నెఱుఁగఁ జెప్పి పొమ్మనుటకుం దగనే మొగమోట లేక మన్నవయెడనైన రాజులమనంబులు ద్రిప్పఁగ బల్మి గల్గునే...

నిర్వ. 9. 27.

ద్వి. ముద మంది మదిలోన మొగమోట లేక,
మదిచలింపక సభామధ్యంబునందు ..

రం రా. అయో. 111 పా. 18 పం.

మ. మొగమోటంబున నీవు వారియెదురన్
ముఖ్యాంబు యుద్ధంబ కాఁ, దెగనాడన్
వెలుతేరి .. ఉ. హరి. 4. 169

సీ. . ముఖభీతి దగు మొగమో టనంగ ..
ఆం భా 1 133
దశకు. 3 9

మొగమోటకాఁడు విశే (మొగమోట + కాఁడు) దాక్షిణ్యము గలవాఁడు

సీ తనలోఁతుపాఁతుసైతము గానరాఁ గూర్మిఁ
గలసిన మొగమోటకాని వదలి .
వరాహ 1 32.

(ఇట అదికూర్మమని వ్యంగ్యార్థము)

మొగమోడు అ. క్రి (మొగము + ఓడు)
1. దాక్షిణ్యపడు.

(ఇది యుభయయతులలోనిది)

ఉ. అన్నినయట్ల యిమ్మునిసురాధిపులం బెడ
నాడుచున్ననీ. యున్నతికంబె వాకు మొగ
మోడి సహించిరి గాక .
కు సం. 2. 163.

క. మాడకు మిక్కిలి యడుగము, చేడియ
మత్స్వామి మున్ను చేసినమేరల్, జాడఁగ
నడపఁగఁ దగు మొగ, మోడంగా రాదు
మాకు మొగి నెవ్వరికిన్ ...
హరిశ్చ 5. 94

మొగమోడక చెప్పితిఁ గౌరవేశ్వరా ...
భార. ద్రో. 1 305

క. నీ మంచితనపు వటనల, నే మొగమోడుచు
వెఱుంగ కిట్లుండితిఁ గా, కేమిటికి వాకు
నీదువృ. ధామాధురి .... ప్రభా. 1. 86.

2. సంకోచించు.

చం. ... కూడుద మీతఁడు నొవ్వకుండగా,
మనమును నీతనిన్ బలసమగ్రుల మై యటు
గాక యోడి రం,మునికి ప్రమాద మేను.

కం. తగవరి యగుటా నొంచినఁ, దగుదండము
రాజు వాని దఁడింపఁ దగున్, మొగమోడి
విడిచె నేనియు, నగుబాటగుఁ బాప మొందు
వరనాధునకున్. విజ్ఞా 2. 122.

చం ... సత్యము ధర్మ మెఱింగి యుండియున్,
దెగ మొగమోడి యున్న జననిందితు లొందుదు
రెం దధోగతుల్ ... ఉ రా. 7. 237.

మొగరంబము వి. తుమ్మెద (చి. ని., శ. ర)
(వేశ్యాంగనావర్ణనము.)

సీ. పక్కు లెత్తిన గోటిపసలు సిబ్బెపుఁ బొడల్
భ్రమరకఁబులు మొగరంబములను ...
చంద్రా. 1 32.

మొగరము[1] = మొగ్గరము. వి. వ్యూహము
(చి. ని. శ ర.).
జ : మొగరించు.

మొగరము[2] = మొకరము వి. (మొగ[1] +
రాడు [2]) మొగరాడు.

సీ ... మొగరాడు మొగరంబు నాఁగను దగు
నికేత, నాగ్రిమస్తంభాఖ్య ...
ఆం. భా. 2. 220

మొగరాడు వి (మొగ[1] + రాడు) గృహాగ్ర
స్తంభము, మొగరము.

సీ. .. మొగరాడు మొగరంబు నాఁగను దగు
నికేత, నాగ్రిమ స్తంభాఖ్య ....
ఆం. భా. 2. 220.

మొగరించు. స. క్రి. (√ మొగఁ ము[1]) ఎదిరించు. (అక్రమించు. శ. ర.)

కం. అగనో కావో వరములు, డిగవిడువఁగ రాదు
హంస డిభకుల నమ్మెన్, మొగరించిన హరు
నయినను, జగ మెఱుఁగఁగఁ దోలి తమ్ముఁ
జంపెద ననుమీ. ఉ. హరి. 4. 167.

మొగజా. వి. (మొగము + జాయి) వజ్రమణి,
ప్రధానమణి.

మ. మొగలిం గేదఁగిరేకు వంకకుహాశి న్మత్తఖ్యంబు చక్రాతిలో, మొగజూత ళ్కనఁటిన్ మిటా రి కపురంపుంబల్కు గారాకు దీవగమి న్లేజిగు రుక్కువిల్లునటు లీవై దేహు యాగ క్రియా, జగతిం బాల యొకర్తు సీత యను సంజ్ఞం గల్గి వర్ధిల్లఁగన్. చం. రా. 3. 71.

మొగలి. వి. కేతకి, గేదఁగి(వృ వి.)(బ. మొగలులు, మొగళులు, మొగళ్ళు. దీని భేదములు తెల్లపూ మొగలి, పచ్చపూ మొగలి.)

ఁగడ ... మొగలివిరుల్ పూమొగ లివె నెచ్చెలి. యయా. 4. 25.

ద్వి. మోదుగు కలువిద్వ మొగలి సంపెంగ, గేదంగియును నాఁకెడము వారిజము. ద్వి. శ. సా. 2. 658 పం.

సీ .. మొగలిపువ్వున ముండ్లు మొలచినట్లు. వైజ. 3. 125.

చం... నవ గంధలుబ్ధ భుజగీపరివేష్టన నా మొగళ్ల పిం, డునఁ తెలిగెం బసిండి తగడుం దెగడుం బువురేకు మొత్తముల్ ... ఆము. 4. 95.

ఆం. భా. 2. 79.

జ. మొగలిత్రాఁచు, మొగలినార, మొగలిపనస, మొగలిరేకు, మొగవేలు,

మొగలింగ. వి తిలిమిరి, వరుణము (వృ వి.).

సీ. ముక్కుదాఁడిమి బీర మొగలింగ కోఁదాడు నేఁదాడు ఖర్జూర మీఁత వేల, తాడి ... హంస. 4. 11.

సీ వరుణనామము బలిమిరి యన మొగలింగ నాఁగ నిసుకమ్రాను నాఁగ దనరు .... ఆం. భా. 2. 48.

మొగలిత్రాచు. వి. (మొగలి + త్రాఁచు) మొగలి చెట్లలో నుండు తెల్లని చిన్న విషసర్పము (వా.).

మొగలినార. వి (మొగలి+నార) మొగలియూ డలనుండి తీయునార. (వ్యవ.) మొగలినారతో నులక పేని మంచము నేయుదురు.

మొగలిపనస. వి. (మొగలి+పనస) అనాస, ఒకానొక పండ్లచెట్టు (శ. ర.).

మొగలిరేకు. వి. (√మొగలి) 1. మొగలిరేకు వలె నుండు స్త్రీల శిరోభూషావిశేషము. (శ. ర, నా.).

2. కంఠ మందలి నఖక్షత విశేషము.

సీ నరవి నఖక్షతస్థానముల్ వివరింతు ... మెడ నున్న యవి యె మొగలిరేకు అనఁ దగు ... వేంక. మాన. 1. 75.

మొగలివాకిలి. వి. ౙా. (మొగ¹ + వాకిలి, వ్యుత్పత్తి ని వర్ణాధిక్యము.). 1. ముఖద్వారము, తలవాకిలి

సీ, దక్షవాటికయందుఁ దరుణేందుమౌళికి మొగలి వాకిట ధామమును రచించె. భీమ. 1. 74.

1. పేజారము, ఆస్థానమండపము.

చం...అ, వ్వనజదళాక్షి నిన్ మొగలివాకిటి కీడిచి తెచ్చి చోరందం, డన మొనరింపఁ జూడఁగ ... భల్లా. 5. (శ. ర.).

మొగలు వి. మహమ్మదీయులలో నొకతెగ.

గీ. పాదుషావారి మీఁబులరీదుసైదు, ధక్కను మొగల్లరీబుపఠాణు లారిః పౌఁజులు పలాయనీ మొనర్చువటిమ గల్గు. తురుకదొరలము . . రంగా 2. 39.

మొగలేఱు వి ౙా. (మొగలి + ఏఱు.) సువర్ణ ముఖరినది, కేతకినది

కం. బాలక యిచట శిలావట, మూలంబునఁ గొండవఁడ మొగలేటిదరిన్, శైలసుతాపతి భక్తుల, పాలిటిపెన్నిధి వసించు భక్తింగొలుమీ. కాఁ. 3. 56, 1 66.

మొగవడము వి. (మొగము + వడము. సం ముఖపట.) ముఖాచ్ఛాదనము, ముఖకవచము, (ఏనుఁగుమీఁదఁ గప్పెడు వల్లకంబళము, శ. ర.)

కం. జలధారలు మదధారలు. జలదంబులు మొగ వడములు చంచానిలవి, హ్వాలగహ్వర రవ ములు గర్జలు గా గిరు లమరె సమదసామ జసమతన్. హరి. పూ. 6. 105.

వ తదనంతరంబున యుద్ధసన్నద్ధులై గజంబుల మొగవడంబు లెత్తించి.

కు. సం. 11. 704

మొగవాడ. వి. (మొగ + వాడ, దేవాలయాదులలో దేవుఁడు మొదలగు వారికి ముందుఁ గట్టెడు అడ్డుతెర.

ద్వి అంకకాఁడునుబోలి హరిభక్తు లలర, నటి మటి మొగవాడ దెఱచి వీక్షింప ..

బస పు. 4. 302 పం 7, 203 పం.

మొగవాళము మొగపాళము. వి. (√మొగ[1]).

1. ఇల్లులోనగు వానిముందు భాగము.

సీ. మొగవాళ మన గను దగుతు నిస్సరణము ...

ఆ. భా 2. 23.

2. కారెము గూడ మున్నగువానితో తోడు నీళ్ళు పాఱెడుకాలువ మొదటి పచ్చిక పెల్లలు మొదలగువానితో నేర్పఱచిన యెత్తు ప్రదేశము, మొత్త

ద్వి అగపడి కావేరియంబు పూరంబు, మొగవాళమునఁ గుంభమున ముంచి ముంచి, యెడపడకుండ నీరెత్త ...

ద్వి పరమ. 4 288

మొగవిచ్చు అ క్రి (మొగము+విచ్చు ముఖభాగమున వికాసము గలదగు, అగ్రభాగమున వికాసము గలదగు.

సీ మొగవిచ్చు పసిఁడిగేదఁగిఱేకుగమి మించు వికదచ్ఛదములను విద్రిచి విద్రిచి ...

పాండు. 4. 220.

మొగవీణె. వి. (మొగము + వీణె సం. ముఖవీణా) వాద్యవిశేషము (శ ర, వా.).

మొగసరి. వి. (మొగము + సరి) మొగముట్టు అశ్వాదుల ముఖాలంకారము

గీ. జిగిదొలఁకు తేజ పాలాని మొగసరియును, ఖాని సాహిణి యొకకత్తలాని దెచ్చె.

చంద్ర. 2. 17.

సీ మొగసరి కైరవంబులకు నుచ్చాటన కలిత యంత్రం బంధకారమునకు ...

వరాహ 1 23.

సీ. జిగి మించు చౌదంతి మొగమునఁ గీల్కొన్న హరినీలముల మొగసరియనంగ ...

భాను. 3 17.

మొగసల = మొగసాల (శ. ర)

మొగసాల = మొగసాల వి (సం ముఖశాలా)

1. రాజగృహము, తలవాకిటి చావడి, మోసల, అజారము

ద్వి మొదని యారావణు మొగసాల గాచికొని యుండు రోకల కోటిరాక్షసుల ...

రం. రా. యు. 203 పా. 28 పం.

వ నాలుగు యోజనంబుల విస్తారంబు గలుగ రచియించి మొగసాలలు వరుఁగులు ఒసిఁడిప దీర్చి యతని మందిరం బర్ధయోజనవిస్తీర్ణంబై విరజం బనుపేర ... హరి ఉ 4. 211.

ఉ ...పులస్త్య మహర్షి ... అద్దరా, కాంతునివీటికేఁగి కుతుకం బెసఁగన్ మొగసాలనిల్చినన్ ...

ఉ రా 2. 259, ఆం. భా, 2 14.

2 తలవాకిటిసంచ.

గీ ఓ లతాతన్వి శివయోగి యొకఁడు లేఁడు, నేఁడు మొగసాల నిది యేమి మూఁడె నా కొ ..

హర 2. 39.

కం. వగ దప్పి తిరిగి వెతిగిన, పగిదిన్ దలవాంచి యెల్లబంధులు దెగడన్, మొగసాల వచ్చి నిలిచిన, వగ సాలక జనని దొడుకవచ్చెన్ శానిన్..

ప్రబంధ. 6. 77.

సీ. అగు నన్న నల్లేని మొగసాల నుండుఁ డాయన యూరలేఁడు .. పాండు. 4. 158.

మొగసిరి. వి. (మొగము + సిరి) 1. లోకమోహన మగు ముఖశోభ.

ద్వి. అరయ నందఱకంటె నహిరాజశైల, మురవైరి కిటువంటి మొగసిరి గలదొ ...

ద్వి. పరమ. 3. 167 పా. 14 పం.

2 వశీకరణౌషధము.

కం. చప్పట్లువెట్టి చేతులు, విప్పుచు మంత్రించి కుంచె విసరుచు రాగం, బొప్పగ మొగసిరి కాటుక, గప్పిన కనుఁగవలఁ గొలుపు కల యఁగఁ జూచెన్... వా. రా. 2. 221.

సీ. మృగము చేరఁగ వచ్చు మొగసిరి చూర్ణంపుఁ దిలకంబు లలికసీమల ఘటించి ... పి. శకుం. 1. 113.

ద్వి. ఒగి ఫాలమున నొప్పుచున్న రుద్రాక్ష, మొగసిరి మసిబొట్టు ... ద్వి. పరమ. 2. 31 పా.

మొగి. వి. 1. పూనిక, ఉత్సాహము.

కం. సాధులకుఁ బేదవారల కెగ్గుల్, మొగిఁ జేయు దుర్వినీతుల, కగు ననిమిత్తాగమంబు లయిన భయంబుల్ ... భార. ఆది. 1. 85.

కం. విప్రుఁడొకఁడు నూతన కావ్యం, బది గైకొని చెంతకుఁ జని, మునమున నాశీర్వదించి మొగి నిట్లనియెన్ ... ఘటికా. 1. 12.

ఉ...పంక్తికంఠుఁ డాఖిలభుజా ప్రతాపమును బెంపును మీఱఁగఁ బోరె వారితోఁ, రేలుఁ బగళ్లు నాక నలిరేఁగి మొగిన్ బదిరెండు మాసముల్. ఉ. రా 3. 375.
భార. సభా. 1. 214.

2. తడవ, పర్యాయము. (ఈ యర్థమున ఒక్క శబ్దపూర్వకముగనే కానవచ్చుచున్నది)

కం. తనరినయజ్ఞంబతీర్థం, బున కరిగె వగంబు లొక్కమొగి గ్రక్కదలన్ .. భార. ఆది. 2. 70.

చం. తఱిమి సుశర్మఁ గిట్టి యతిదారుణ భంగి రణంబు సేయ వాఁ, డుఱక నిశాతసాయకము లొక్కమొగిం బది మేనియందుఁ గ్రిక్కిఱి యఁగఁ జేసి ... భార. విరా. 3. 215

ఆ. వార లొప్పమక్కివాయ యంచుఁ బరిచి, రొక్కమొగిని దిశలు పిక్కటిల్ల ... భీమ. 6. 18

మ. కలంకన్ ఘూర్ణిలు ఘోష మొక్కమొగి దిక్చక్రంబులం గ్రమ్మినన్ .. వసు. 2 142.

3. మొత్తము (ఇది ఈ యర్థమునను తఱచుగ ఒక్క శబ్దపూర్వముగనే గానవచ్చుచున్నది.

సీ. తడవిండ్లు సేపట్టి తడయక యెలుకులై యార్చుచు భూతముల్ లాత్మసతుల గీ. నెలు కుసతులఁ గావించి యయ్యెలుకరాజు, ముందటం బక్కియల నొక్కమొగిన నిలిచిరి.. భార. అర. 1. 300

కం. వాసవనందనుఁ డెంతయుఁ, గాసిలి యున్నాఁడు మనలఁ గని యించుకయుం దా వైరణ సేయఁడు గను, మోసము తే కొక్కమొగిన ముసరఁగ వలయున్ ... భార. విరా. 4. 230.

కం. విని కడఁగి యసుర లెనుబది, యొనిమిదివే లొక్కమొగిన యెత్తిన హరియుం, గనిని ... ఉ. హరి. 1. 147.

ద్వి. మున్నీరు తరువంగ మొగి నైనవెన్న తిన్నెయో యన నొప్పు తెలిదీవినడుము ... అ. మ. క 1 19 పా. 14 పం.

4. విధము, రీతి

శా ... ప్రద్యుమ్నుం డాహవకేళి సేయునెడఁ దోర్దర్ప భూతముల్ ప్రీతితోఁ, నామ్నా యాగతభూపమాంసములు చేయారంగఁ గూర్చున్ వెసన్, నిమ్నోన్నతావతలంబు లొక్కమొగిగా నిండార బండారముల్. ఉ. హరి. 6. 69.

ఉ. జవ్వని యించుకే మొగముచాటున నుండఁ గుబేరసూతి యా, దవ్వుల నుండి నాపెదవి తప్పక కన్గొని నే నెఱింగిలో. నువ్విళులూరు ముద్దుమొగి యూరక తా బయలానినందు కీ, నవ్వఁగ దాను నవ్వి నుతనాథకుమా రునిఁ బిల్తునా యనున్. కువల 5.16.

ద్వి. జగములు భయమందె సకలభూతములు,

మొగి దప్పె జను లెల్ల మూర్ఛాత్ములైరి
రం. రా. ఉ. 184 పా. 23 పం.

5 మొవ్వు, లేత ఆకు మొలక.

కం. మొగి విరిసి కళుకు గూడక, సగులక, వెడలు పుసునిడుపుఁ బసిమియుఁ గలదై, జిగురరఁ టాకులు పెట్టిరి, దిగదిగ నద్దేవియాజ్ఞ దివ్య పురంధ్రుల్ . భీమ 2 128

ద్వి. కనుపట్టె వెన్నుచెంగటి నీలవేణి, యన టికె మ్మొగిమీఁదియశివం క్తిఁ దెగడి
ఆ. మ. క. 2 64 పా. 16 పం.

అవ్య. క్రి. 1 పూర్వము, మునుపు

2 పురోభాగము, ఎదుట.

సీ. మున్మున్న మునుముందు మొగి ముంగల యనఁగఁ దగును బురఃపురార్థములుగాను
ఆం. భా. 8. 78.

(పై రెండర్థముల కిదియే యుదాహరణము)

8 కొన్ని యెడల వాక్యాలంకారముగా ఉప యోగింపఁబడును.

ఉం. ఒగి విల్లు సూతుతలయుం, దెగి పడ నొక టొకట వారులు ద్రెళ్ల నిరుగడన్, మొగి రెంట మూఁట నిరుసులు, నొగలు విఱుగ నొకట వాని నొ సేయుటయున్ ...
భా. రా. అర. 1. 336

కం. ఒగదుపకారార్థముగా, మొగి రుద్రులు రుద్ర లోకమున నుండి భువిన్
శివ సా. 1 74.

చం. ఎఱకలు దిద్ది కంధరము లెత్తి మొగిం జర లాట మున్నుగాఁ, బఱచుచు లేతవెన్నె లలు పారణ సేయుచు . .
పి. శకుం. 3. 159

మొగి(యి)ంచు. స. క్రి. (√మొగియు) మొగి యఁజేయు, ముడుచు.

గీ. కేలుదమ్ములు మొగియించి కెలన మన్న, చిన్నముద్దులసిరియాళ సెట్టి కనియె ...
హర. 2. 73.

గీ. పృథులగతి మించి తమపేరు లేర్పరించి, నేరి పొడగాంచి వేర్వేర చే మొగించి
ల. వి. 1. 64

మొగిడించు. స. క్రి. (మొగుడు + ఇంచు) మొగుడఁజేయు, ముకుళింపఁజేయు.

చం. వదనసరోజపంక్తి శరవర్షమునన్ మొగిడింపఁ గాన న, య్యో ద దశకంధరుం డిచట నెచ్చట లేఁడు తనూజుఁ జూపి శ్యామ దొలఁగి యున్నావాఁడు ... నిర్వ. 6 150

చం. .. వనజాతపీఠిఁ గ, న్నర మొగిడించి సృష్టికరణాయతి మూఁకుఁ ద్రోఁచి భారతీ, చరణశిఖావిభ్రమసంబులఁ బ్రస్తుతి సేయు ధాత వేం. పంచ. 1 ?, వీర. 3 57.

వ. అమ్మహర్షులు పరమేశ్వరానుమతంబున నిజార్హస్థానాసీను లై కరకమలంబులు మొగిడించి .. కు. సం. 4 218.

కం. తమ్ములు మొగిడించినఁ దను, కొమ్మలు లోఁ జిక్క నిక్కుకూరిమిఁ జట్టన్, ద్రిమ్మరు మగతుమ్మెద కా, నెమ్మది వగ గాక యున్నె నెలఁతలఁ బాయన్, యయా. 2. 74.

(మొగడించు. శ. ర. పా.)

మొగియు అ. క్రి. 1, కవియు, వ్యాపించు.

చం. గగనము తారకాగ్రహవికాసవిభాసిత మై వెలింగెడున్, మొగిసివచీకటిం జెఱిచి ముంగలి దిక్కులు తెల్లఁ జేయుచున్ ... నెగడెడు నింగిఁ జందురుఁడు. భా. రా. బాల. 394

2 పూను యత్నించు.

చం. .. శూరశూన్యమీ,నగరము లంక నింకఁ గదనం బనుమాటలు సిక్కె నేగతిన్, మొగి యఁడు పంక్తికంఠుఁడు సముద్ధతిఁ జెంపటి యుద్ధకేళికిన్. భా. రా. యు. 1128

గీ. పరవినీతప్రబంధముల్ భంగపఱుప, మొగిసి ప్రాసంబుచేతనే మోసపోవు, సాధుజన సంచిత పదార్థచౌర్యరతుఁడు ...
రా. వి. 1. 18.

జ : మొగించు.

మొగిలు = మొగులు వి ఔ. మేఘము

(బ. మొగిలులు, మొగిళులు, మొగిళ్లు.)

ఆ మెఱుఁగు మొగిలు సొచ్చు తెఱఁగున వాల్మీ నుం, దిరము సొచ్చి తనదుగురువుకడకు, వరిగి నెమ్మి యిట్టు లను ...

భార. విరా. 4 27

చం గగనతలంబు నెత్తురులఁ గండలు నెమ్మెలు నొక్క యమ్మడిన్, మొగిళులు లేకయుం గురిసె మొత్తము లై పెనుగ్రద్దలాడె

భార ద్రో 1 162

ఉ . గార్మొగిళ్ళగొదతోఁ జెలఁలాడెడు బొబ్బరింతగా, ద్రుబ్బి విసజ్జ గాఁగఁ జెవులూఁదిన వల్లవుఁ డుర్విఁ గూలఁగా, బెబ్బులిగోఁతుల్త్రో ల్గఱచి ... ఆము. 6. 26

సీ మూఁక లై పొడ వైన చీకటిమ్రాఁకులచాళ్లు గార్మొగిళ్లు గాఁక .

యయా. 4. 4

సా. మొగిలులోపలినీళ్లునమ్ముట = ఎపుడో రాఁబోవుసందిగ్ధ మైనఫల మపేక్షించుట.

ద్వి పనుపడ మొగిలులోపలినీళ్లు నమ్మి, దొన నీళ్లుఁ జల్లువేఁదురు లెందుఁ గలరె . .

ద్వి. హరిశ్చ. ఉ. 4. 20 పం

జ · మొగిలుత్రోవ, మొగిలుపగవాఁడు.

మొగిలుత్రోవ వి (మొగిలు + త్రోవ . ఆకాశము

కం. చేసిన నాతఁడు తొల్లిటి, దోసంబులఁ బాసి మొగిలుత్రోవను జేశే, వేసంబున నరుగుచు రా, కానుఁదొరి నన్నదారి కన్నినఁ దెలిపెన్ ... అచ్చ. రా. అర 118.

(ఇట్లే : మొగిలుదారి )

కం. జేజేరాజూబాజుజ, గాజిగి నొగిఁ దెగడి నెగడఁగాఁ జాలెడుమే, త్తే జూనెడు కుత్తుక గల, జేజేకు నొగిలుదారిసిగ జేజేకున్ .

అచ్చ. రా. బాల. 26

మొగిలుపగవాఁడు. వి (మొగిలు + పగవాఁడు.) వాయువు

క మిగిలిన చెట్టుంద్రిమ్మరి, జగబంటులు నందునందుఁ గని రటువలెన, మొగ్గిలు పగవాని కూనయు, నొగిఁ గొందఱఁ గూడి యరుగుచుండెడు నెడలన్.

అచ్చ రా కిష్కిం. 87

(మొగిలుపగవానికూన = వాయుపుత్త్రుఁడు. హనుమంతుఁడు).

మొగుచు = మొగుడుచు. మొగుడ్చు

స. క్రి (√ మొగుడు) మొగడఁజేయు, ముకుళింపఁజేయు

కం మొగిచినచేతులు ముందల, నిగిడించి నితాంత వినయనీతిం జూరల్, దగ విన్నవించి రిట్లని భార. విరా 3. 79.

సీ అంబమూర్తి, మిగులఁ దెలుపెక్కె మొగిచిన మీఁగికంటి, ఉప్పు పద్మరేణువు లటి నొప్పు మిగిలె, నభవునకు గఁగసలిల విహారలీల, హరి ఉ. 7 74

ఆ ఒక్క యెఱుకుఁ జేఁడు నక్కకొమ్మను నిల్చి, గోఱజంబు జున్నుఁ జాఱపప్పు, తీలిగఱుల యంకోలలు సెలవిఁడుఁ, గాను కిచ్చి కరయుగంబు మొగిచి. మనుచ. 4. 14

కం హ్రస్వణి సూత్రాకృతి యగు, చిన్మూర్తిఁ బురాణపురుషు శేషావాసున్, గన్మొగిచి లోనిమాపున, సన్మాన్యుఁ డతఁడు చూచు నమయమునందున్. పాండు 4 76

మొగుడు = మొగడు అ. క్రి ముకుళించు. సంకుచితమగు

కం మిడికెడిఁ బెదవులు వ్రేళులు, మడిగెడుఁ గనుదోయి మొగిడె మూయెదురఁ గడున్, వెడవిఁక యొడలు చేసెదు, కడపల జపముఁ నక నేఁడ గలదో లేదో.

ఉ హరి. 4. 44, ఆము. 4 12.

కం. కోకనదంబులు మొగుడన్, గోరంటులు విరిసి దిశలకుం జన ... కు. సం 8. 84

గీ వారి ముఖమండలములతో వారిజములు, మొగిడె శోకతమంబుతో నిగిడెఁ దిమిర, పటలి ... భార. సౌ. 1 19

మొగుడఁబాఱు = ముకుళించుట కుమ్ముభమగు, మొగుడ నాఁటించు.

గీ మొగుడఁబాఱిన యరవిందము ను బాసి, గములు గములుగ మత్తభృంగములు గూడి

బ మొగిడించు, మొగుచు మొగుడుచు, మొగుడుదామర, మొగుపు, మోడుచు, మోడు పుఁగేలు, మోడ్పుఁజేయు.

మొగుడుచే(డ్చు) = మొగుచే స క్రి. (√ మొగుడు) మోడుచు, ముకుళింపఁజేయు

కం. ఇదె నీరాయని దెచ్చెద, నెద నమ్మలికంబు మాని యెలనాఁగరో నెమ్మదిను డు మింక నని చేయిడొయిచె మొగిడిచి జోహారులిడ చను సెడలన్ అచ్చ రా సుం 17..

గీ. హరియు నమ్మౌని యనుమతి నర్ఘ్యపీఠమున సుఖాసీనుఁడయి కరములు మొగిడ్చి ... పారి. 1. 46.

చం .. అయోధ్య కేఁగు చెంచిరి వినయంబు మించ రఘుశేఖరుఁ గాంచి ప్రణామముల్ ఘటించిరి కరముల్ మొగిడ్చిరి వచి చిరి. యిట్లని యంద ఱొక్కటన్ ... ఉ. రా 8 253.

మొగుడుదామర = మొగడుదామర. వి. (మొగుడు + తామర) ముడుగుదామర, నమస్కారి (వ్య.వి.) 1 (శ ర)

మొగుపు. వి. (√ మొగుచే) మోడ్పు, మొగుడుట

గీ కొలువు వందున్న యాదవకోటి యెల్ల, మొగుపుఁగేలు ఫాలంబున మోచి యుండ. ఉ. హరి. 1 120

రగడ ... రామా శికిలో గణుతికి వెక్కిన (శ్రీ) నృసిహ రనకుఁ జేతులమొగు పని. హంస. 4. 218.

మొగులు = మొగిలు మొయిలు. మొయులు. వి దే సం మేఘః. త. ముహిల్, బ. మొగులులు, మొగళులు, మొగళ్లు, కొన్ని యెడల దీనికి సాల్లు గామకపు దుల్వలోపము నగు) మేఘము

సీ ముయ్యేడువాసరంబు లకాలవర్షంబుఁ గురియింపఁ బంపు మొగుళ్ళగములు ... పారి. 2. 15.

కం నిలువక తరగుల్మాంతరములలో వడిఁబాఱు నపుడు మొగుళులు వాఱం, దీగెల వెలుఁగుచు నెడనెడఁ, బలుమఱు జందురుఁడు దోఁచుపగిదిం దోఁచున్ భా. రా. అ. 2. 54.

సీ గగనమ్మము కట్టు మొగులుతో నుదయించెఁ ... దిక్కునఁ దోఁచె శక్రధనువు ... విక్ర. 4 27.)

సీ కారొత్తన్న కటికి చీకటి మొగుల్మొత్తంబు గుర్తిసిన వడగండ్ల గుంపు లనఁగ ... పారి. 2 58, ఆం. భా 2. 71

మొగులుముట్టు = మేఘమును తాఁకు, మహోన్నత మగు

సీ మొగులుముట్టిన మహామూర్ధంబు ధర మోపఁ బాదాంబుజములకుఁ బ్రణుతిఁజేసి ... కాశీ. 1. 99.

జ: మొగులుకడిమి, మొగులుధారి, మొగులువిరి.

మొగులుకడిమి. వి. (మొగులు + కడిమి) ధారాకదంబము, నీటికడిమి (వ్య. వి.).(శ. ర.)

మొగులుదారి. వి. మేఘద్వారము, ఆకాశము. (శ. ర).

మొగులువిరి. వి. (మొగులు + విరి) మేఘపుష్పము, జలము.

గీ. మొగులువిరి నీరు వాఁగను దగు జలంబు. ఆం. భా 153.

మొగ్గ[1] = మొగడ వి ముకుళము

గీ ... లేబొండు మల్లెపొదల, తుదల జవ్వట లై కడుదొడ్డ లగుచుఁ, బోడమె మొగ్గ లగము లగ్గి బొబ్బలట్లు .. ఆము. 2. 56.

సీ గ్రుచ్చినట్టుగ జాదుకొన్న మొగ్గలగుంపు ప్రకటపాటలబిందుపాళి గాగ ....

గీ. ... వాహ్యాళి వెడలు మదను, మదపుచేనుఁగు బోలె నామని దవర్చె ...

రాఘవ. 2. 5

సీ మొల్ల మొగ్గల నెనయు పల్లోవలవాఁడు ..

నీలా 1. 83 ఆం. భా 2. 40

మొగ్గచెమటలు = మొగ్గవలె నుండు చెమట బిందువులు.

కం. డగ్గఱి జలపానాగత, దిగ్గజకటగళితమదన దీసౌరభన, మ్మగ్గంధవహము తనువుల, మొగ్గచెమట లాఱ విసర ముదితాత్మకులై

వరాహ 7. 56

జ: మొగ్గతొడుగు, మొగ్గవిచ్చు

మొగ్గ[2]. వి. వేళ్యాదులు తల పాదములతో చేరు వట్లు విల్లువలె వెలికిల వంగుట.

(శ. ర. గ్రా. చూ. మొగ్గతిలు, మొగ్గవాలు.)

జ: మొగ్గతిలు, మొగ్గవాలు.

మొగ్గతిలు. అ క్రి. (√మొగ్గ[2]) మొగ్గవాలు.

ఉ. ఉ గ్గడలించివైవ నెటికొప్పిడి ముంజె అఁగుం బదాంగుళిన్, మొగ్గతిలం దగుల్పడఁగ మూపునఁ గ్రొమ్ముడి వేగ హత్తుకో, దిగ్గన లేచి... ఉ. హరిశ్చ. 4. 26.

మొగ్గతొడుగు. అ. క్రి. (మొగ్గ[1]+తొడుగు) కోరకితమగు, మొగ్గలు పొడమినదగు.

(వ్యవ. మల్లెతీఁగె ఆకులు దూసిన మొగ్గ తొడుగును.

మొగ్గరము = మొగరము. వి. 1 వ్యూహము, సేనాసన్నివేశవిశేషము.

కం. అగ్గలిక మెఱసి కడఁగుచు, మొగ్గంములు గడచిపోయి మునుమును మఱదిన్, మొగ్గ తిలఁజేసి దీనికి, సిగ్గువడని నిన్ను నేమి చెప్పుదుఁ జెపుమా ... నిర్వ 5. 128

సీ . . పాండవసేనఁ దఱిసి మందాకినీ తనయుఁ డేచి, గీ. చేదిపాంచాల కేకయులాది గాఁగఁ, గల్గుభూపాలకోటి మొగ్గరము లెల్లఁ, గలఁగఁ దిరుగుడువడ ... భార. భీష్మ. 1. 293.

సీ. వ్యూహంబు వెలయుచునుండు మొగ్గర మన నొడ్డణ మంచన నొడ్డవంగ ...

ఆం. భా. 2. 110.

2. గుంపు

కం. డగ్గఱి పిశితాశను లోక, మొగ్గర మై కోట నొర సముద్ధతు లై వన్ ... నిర్వ. 4. 57

ఉ ముందు పసిండితమ్మిబలు మొగ్గలమొగ్గర మావరించు ... చందనగంధి చన్నుఁగవ చంద్రుఁడి .. కృష్ణకుం. 2. 12.

3. యుద్ధము

కం మొగ్గరములోన యిరువుర, యగ్గలికలు మెఱసె గదలు వాకన మంటన్ ..

ఉ హరి. 3 61

ఆ. మూఁడుశరము లతఁడు ముదలించి యట వాని. మూఁడుతలలఁ ద్రుంచె మొగ్గరమున...

మొ. రా. అర, 18.

మొగ్గలము. విశ అతిశయించినది, మిక్కుటమైనది.

ఉ మొగ్గలమైనకోర్కి దుదిముట్టఁగ మత్సవ శీలఁ జూడ నా, కగ్గముగాఁగ వంశము సుధాంశుఁడు గల్గినరాత్రివోలె నీ, విగ్గురు గర్భసంపద వహించియుఁ జెప్ప వ దేమి నావుడున్, సిగ్గున లేఁతనవ్వుఁ గదిసెం గమలానన ముద్దుమోమువన్.

నిర్వ. 8. 82.

మొగ్గవాలు అ. క్రి. (మొగ్గ[1] + వాలు) మొగ్గ వేయు, తల పాదములతో చేరునట్లు విల్లువలె వెలికిల వంగు

కం. అని యడుగుచుండ బాలిక, కను నులుముచుఁ బెంచి విలపించి కటకటవాపో, యెను మొగ్గ వాలు చందంబున నడు మెగనెత్తికొనుచుఁ గొత్తులమీఁదన్ . కళా 6. 160.

మ...ముత్యాల పేరులు వక్షోజతటిం బుటం బెగయఁగాఁ ద్రోపాడఁ జన్నుల్ కటి. స్థలిపై వేనలి మొగ్గవాల చదుగుల్ చండింప... సాం గ 1 44 (ఇట 'నర్తింపన్' అని భావము)

మొగ్గవిచ్చు. అ క్రి (మొగ్గ + విచ్చు) 1. వికసించు,

2. యథాయథలగు, చెల్లాచెదరగు (శ. ర.)

మొగ్గు = మొగ్గు. అ క్రి వ్రాలు, ఒరఁగు (ఇది శ. ర లో 'మ్రొగ్గు' గా గ్రహింపఁబడినది అయినను పెక్కుగ్రంథముల రేఫవర్జితముగా నుండుటఁబట్టి ప్రత్యేకముగా గ్రహింపఁబడినది)

ఉ. అగ్గజరాజ కుంభకుచయందము చందము డెందముం దమిన్, మొగ్గఁగఁ జేయఁడాయఁ జను . కవితా 5. 88.

సీ. తలిరాకుపై మొగ్గునలరు మొగ్గ యనఁగ మోవిపై ముక్కు అముత్తె మమర .. శుక. 3 433

సీ అటమున్నె వాకిట కరుదెంచి మదదంతి డిగ్గి పాదములపై మొగ్గినట్టి, రాజహంసునిఁ బట్టె రా వి. 5 73.

కం. త్రాసును వేశ్యయు నొకసమ, మౌ సందేహింప వలవ దవనీస్థలిలో, వీసం బధికం బెచ్చుట, నోసరి గా కందుమొగ్గు చుండును సుమతీ సుమతీ. 66 (ప్రా.)

2. నేలఁగూలు, క్రిందఁబడు.

చం. పొడిచిన మొగ్గి యప్పొలసు బోనవు మేటి మగండు వీర మేర్పడ వడి లేచి.. అచ్చ. రా. యు 305.

వి హెచ్చు, ఆధిక్యము

ఉ చూడరె వీఁడరే యెవరు శోభనవేళఁ దగ్గు. మొగ్గుగా, జాడ తెలుంగఁగా వలదె . చెన్న, 5, 103.

మొటిక = మొట్టిక, మోటిక. వి. 1. మొలక, అంకురము.

(వ్యవ) మొన్న పెట్టలో పాఁతివకంద అప్పుడే మొటికలు వేయుచున్నది

పీ. మొలక మొలవ మొక్క మోక మో సిరిక మొటిక నా వంకురం బొప్పుచుండు .. అం భా 2 35.

సీ ఎన్ని సేర్చినది తా నిన్నటి మొటికగా యా కొమ్మ కిడఁక బొమ్మనఁ గదమ్మ ... కువల 26 (నిన్నటి మొటిక = 'పసిబాల' యని భావము).

2 తునుక (శ ర, గ్రా.)

మొటికాయ = మొట్టికాయ వి. తలమీఁదఁ బిడికిటితో బిడచపోటు. (చూ చీకటిమొటికాయ).

మొటికెలి వి (√ మొట్టు. వ మొటికిళ్ళు) మొట్టికాయ.

(చూ. చీఁకటి మొటికిళ్లు)

మొటిగిడి. వి నీచుఁడు.

కం కటిలుఁ డపకారి జూదరి, లొటలొటకాఁడాగడీఁడు లోభి ఖలుఁడు దుర్వృత్తుఁడు బలురోగి తక్కరి, మొటిగిడి పాపవగరాను ముట్టకు మబలా.... ప్రబం. 644.

మొటిమ. (మె). వి యౌవనమున మొగము మీఁద లేచెడుపోటమ, అవగఁడము

సీ... మొటిమె నా వదనభర్జవు సంజ్ఞ వలులు చుండు... అం. భా. 2. 129.

మొట్ట వి. మత్స్యవిశేషము, ఎగిరి యెగిరి పడెడు చేప, శఫరము.

అ పరిక మొట్ట రొయ్య పరిగ యుఁగిలికము

చీకటింపు జెల్ల నారజెల్ల, కుంటముక్కు మొదలుకొని కలవన్నియు బంటువారి కెల్లఁ బంచి యిచ్చె. ద్వి. 1 221.
(వ్రాఁతప్రతి. పా. మొట్టె. అని శ. ర పా.)

సీ. ప్రోష్ఠి మొట్ట యవ మీను...
అం భా. 1. 159

**మొట్టమొదలు** వి బొ. (మొదలు+మొదలు) మిక్కిలి మొదలు అత్యంతము, ఆది.

ద్వి చిట్టివాఁ డెఱుఁగునె శివభక్తి పథము, అట్టు గా దని పువ్వుమట్టిన చెయ్యి, మొట్ట మొదలికిని గొట్టఁదే శ్రీవత్స.
పండితా పురా 97 పా.

**మొట్టి** విజ పొట్టి

సీ. పొట్టి మొట్టి గిటక పొదిటి పొదడు... తింగణా యనఁగను వామనాఖ్యదవరు...
అం. భా. 2. 128.

(వ్రాఁత ప్రాఁతప్రతి పా. మొటిమ శ ర.పా. మొటిమె బ్రౌ. పా.)

**మొట్టిక**=మొటిక (శ. ర.).

**మొట్టికాయ**=మొటికాయ. వి. (√మొట్టు) తలమీఁద పిడికిటితోఁ బొడుచుపోటు. (చూ చీకటి మొట్టి కాయ)

**మొట్టు** అ క్రి. (క మొట్టు) తలమీఁద పిడికిటితోఁ బొడుచు, పిడికిటితో పొడుచు.

ఆ. తిట్టెనేని మొట్టు మొట్టెనేఁ గొట్టును, గొట్టె నేని యముఁడు కొద్దిపఱచు... వేమ. 3. 58.

ఉ కిట్టి వెడంద పేరెర ధకీరున మొట్టితి నోరుఁ గొట్టితిన్, గట్టిడిదిట్ట కూశముని గర్వ మడం చుట నాకు భారమే... చంద్రా. 3. 34.
(ఇట పొడుచు అని భావము)

వి తలమీఁద పిడికిటితోఁ బొడుచు పోటు.

(వ్యవ) పిల్లవానిని నాలుగు మొట్టులు మొట్టి కూర్చుండఁ బెట్టెను.

జ మొటిక, మొట్టికాయ, మొట్లమారి.

**మొట్లమారి** విజ (√ మొట్టు) మొట్టికాయలు తినుస్వభావము గలవాఁడు (స్వనవర్ణనము.)
సీ ?ముపగ్రగకలశముల్ చక్రవర్తు లటంచు మొట్ల మారులనరి మొనపఁ దగునె చంద్రా. 4 127

**మొడికట్టు.** వి విధము. రీతి

సీ. ముత్తియంబుల తీఁగె మొడికట్టు పనులచేఁ బట్టు మేల్కట్టుల వరలు విరుల...
ఇలా. 2. 13. (బ్రౌ)

**మొదుచు.** స. క్రి. మెదుచు, మేదించు.

సీ కాటుక మొదుచుచు కన్నుల నిడఁబోయి పొల్తుక గళమునఁ బూసికొనుచు...
కు. సం. 8. 66.

**మొడ్డ.** వి. మేఢ్రము, మగగుఱి (వా.)

వ...ఇది విఘ్నము సేసినవాండు గాడిది మొడ్డ తిన్నవాండు.. (కొణిదెన శాసనము)
ద భా. 4. 629.

**మొత్త.** వి. 1 వాకిటి లోపలి ప్రక్కగోడ. (శ. ర., బ్రౌ.)

2. కారెము గూడ మున్నగుదానితో తోడు నీళ్లు పాఱెడు కాలువ మొదట పచ్చిక పెల్లలు మొదలగువానితో నేర్పఱుపఁ బడిన యెత్తు ప్రదేశము మొగవాశము[?] (శ. ర.).

3 అర్ధకాయము (పొట్ట అని బ్రౌ.)

(వ్యవ.) అతఁడు మొత్త కదుపుకొవ లేకున్నాఁడు.
జ మొత్తపిరి.

**మొత్తగాఁడు** వి. (మొత్తము+కాఁడు) సేనా నాయకుఁడు. (నారదుఁడు.)

సీ. భవదూర పథమునఁ బరమ భాగవతుల మూఁకల నడిపించు మొత్తగాఁడు...
వరాహ. 6 26.

**మొత్తపిరి.** (మొత్త+పిరి.) పతపు కడవక్రింద మెత్తగా నుండుటకై అరిణ మొదట నుంచెడు అల్లికపిరి (శ. ర.).

**మొత్తము.** వి. 1. సమూహము.

కఁ అత్తఱి పాషాణంబులు, నెత్తురు నెమ్ము లును గురిసె సిష్ఠురనినదా, యత్తమయి వఖము పిడుగుఁ, మొత్తంబులు వడిఁబొ నగరమున నెల్లెడలన్. భార ఉద్యో. 4. 160.

కం సోమకునకు పూనూర్వురు సుతు, లాముఖ్యా యణులు జంతుఁ డాదిగఁ గీర్తి, శ్రీమహితు లైర పృషతుఁ, డామొత్తంబునకు నెల్ల నపరజుఁ డధిపా. హరి. పూ. 3. 98

సీ సెలయేటి యిసుకలంకల వరాహంబులు మొత్తంబులై త్రవ్వి ముస్తెలెత్త. వసుచ 2 7, ఆం. భా 2 100.

2 సేన

ఉ. యవిభాతి పఱచి హనుమంతుఁ డెడఁ దఱుము బలుమొత్తముల కుఱికి యరదంబు లఱి, ముఱి ధరణి ద్రెళ్ల. భా. రా. యు. 661.

గీ బలము లడఁగినఁ దమ కెదుర్పడఁగఁ దెరపి, గలుగుటకుఁ బొంగి యార్చి శంఖంబు లొత్తి, తాఁకి రెక్కటి రెండు మొత్తముల దొరలు. నోర్చి ఫణిపతి తలలు సుఖ్ఖాఁతలూగ కవిక. 2. 198.

3. బాహుళ్యము, తఱుచు.

ఉ.. మోమున దైన్య మొందఁగా, బ్రుచ్చిలి వందుచు న్వగల మొత్త మెదం గలపంగ నాత్మలోన్.. మార్క. 6. 10.

4. వెఱసి, అంతు

ఉదా లెక్క మొత్తము

విశే సాంద్రము, తఱుచైనది.

కం అరదంబులు పొడిపొడియై, హరులగములు మగ్గునూచ మై మొత్తపుఁగా, ల్వురు సిదు రుపలై పడ నిష్ఠురగతి విహరించె వాయు సూనుఁడు గదతోన్. భార. భీష్మ. 2. 367.

ఉ.. కర్ణుఁ డొప్పె వరుణోజ్జ్వల మండల కాంతి పూరము, నొత్తపు దీప్తులుం దగ నినుం డపరాత్రి వెలుంగు చాడ్పునన్... భార. కర్ణ 3. 339.

వాడుకలోని కొన్ని విశేషార్థములు.

1. మొత్తముమీఁద వాఁడు చాల శాంతుఁడు. మొత్తముమీఁద=అన్ని విషయములు ఆలోచించి చూడఁగా.

2. మొత్తమువ కాకార్యము జరగలే దన్నమాట. మొత్తమునకు=ఎంత శ్రమపడినను.

జ: మొత్తగాఁడు.

మొత్తించు. స క్రి. (√మొత్తు) మొత్తఁ జేయు, కొట్టించు.

శా .. దైత్యస్వామి నేఁ డక్కటా, మోహం బించుక లేక పుత్రు నెటులన్ మొత్తించఁ బంచెన్ ... దశా. 4. 172

మొత్తు స క్రి (త. మొత్తు) 1 కొట్టు, తాడించు

చం హిమగిరిరాజనందన మహేశ్వరు మొత్తె మధూళకాపరా, గములు శశాంకశేఖరుని కన్నుల మూఁటను జిందునట్లుగన్ ... హర. 1. 25.

అ. దొంగకామఁ డంత బొందడిఁ జిగురాకు, వాలు వెఱికి యుఱికి వారి మొత్తె.... భాగ. 9. 26, ఆం భా. 3, 124

2. ఇది కొట్టు ధాతువువలె కొన్ని ధాతువుల తుముర్థంతముల కనుప్రయుక్తమై ప్రేరణా ర్థము సూచించును

గీ. అనవధానత యావగిఁజంత మూవె, పర్వతం బంత యపరాధభరము కొలిపి, కాళ వెడ లంగ మొత్తినఁ గాసిఁబొంది, తిరుగుచున్నాఁడ నిదె యేమ దిక్కుమాలి. భీమ. 2. 157.

ఉ చిత్తరు వన్న నిశ్చయముచే నెదు రుండి మొగంబు చూడ మో, మెత్తును సత్యపుం భ్రమ సమృద్ధిని గ్రమ్మఁ బలుఁ దత్ క్షణంబులో, వొత్తుచుఁ దత్తరంబుఁ ద్రపయున్ మగుడంగ నిరీక్షణేచ్ఛఁ బో, మొత్తును తర్చచూపు దమ మోచుట దోఁచిన నోసరిల్లుచున్. ప్రభా. 1. 039.

3 అడచు. క్రుంగఁజేయు.

గీ మిత్తి మొత్తిన ముమ్మొన మేటివాలు, వాఁడు కాశీవిహారి విశ్వప్రభుండు, కనికరంబున నెదుట సాక్షాత్కరించె .. పె శకుం 1. 18.

సీ. అడుగు లొత్తినపట్లఁ బిడుగు మొత్తినయట్ల బహుమహాశైలములు పగిలి పడఁగ...
రామా. 6 88.

కం అత్తఱిణంబె కొని నడు, నెత్తి నగుల సూర్య భానునిన్ మొత్తినచోఁ, దుత్తుము రై వాఁడిలఁ బడె . ఉ రా. 3. 26

4 నలుకు

చ. ..యప్పిసాళిపై, నుఱికి చలంబు మీఱఁ దల యూఁడఁగ మొత్తెను వాలికత్తియే, వెఱఁగు దలిర్పఁ బుచ్చుకొని వేల్పులు నింగిఁ జెలంగి యార్వఁగన్ . అచ్చ. రా సు. 115.

ఉ ... భీకరకరాసి వెసన్ జళిపించి దేవకిన్, ముందలపట్టి వంచి తెగమొత్తఁ గడంగిన ...
వి. పు 7. 9.

5. పగులఁగొట్టు

ఉ చంపుదుమే కృతాంతు శిఖి చండమయూఖుల జారిగొందుమే, దంపుదుమే కుభృత్పరివృఢం బుల మొత్తుదుమే యజాండమున్ ...
కాశీ. 7 34.

6 వాయించు, మ్రోగించు

ఉ. మొత్తిరి దుందుభుల్ ప్రమథముఖ్యులు హర్షిత చిత్తవృత్తులై ... కాశీ. 6 145.

అ క్రి. గ్రుచ్చుకొను, నాటు.

గీ ముల్లు తీసినచోడఁ గొఱ్ఱు మొత్తినట్టు, లొకటి సేయంగఁ బోయిన నొకటి యయ్యె.
అహ 2. 109.

వి. దెబ్బ, క్షతి, కొట్టు.

(వ్యవ) వానిని నలుగురును నాలుగు మొత్తులు మొత్తినారు.

తలమొత్తు = నెత్తిపై చేతియుంచు, (ప్రమాణము చేయునపుడు ఇతరులపై చేతి నుంచెదరు.)

కం తనుఁ దునుమఁ దలఁచు తత్కాలమిచ్చిన్నను మున్నె యతఁడు మిసిమికటారిన్, దునిమి ఒలి యొనఁగె సాహా, మెనయఁ దల మొత్తి జానయిచ్చెద ననుమున్ శుక 2. 77

జ : మొత్తించు, మొత్తులాడు, మొత్తుపడు

**మొత్తులాడు** అ క్రి (మొత్తులు + ఆడు) కొట్లాడు.

గీ శక్తిలో నీవు నీలోన శక్తి యెపుడు, జాయ కుంకుమ భాస్కరప్రభలవోలె. నీరహస్య బు మదిలోన నెఱుఁగలేక, మొత్తులాడుదురూఁక మత్తిగాండ్రు. వరాహ. 11 6.

చం రయమున వృష్టికై యొదిఁగి రవ్వలపై విధి యితు రుగ్రతన్, వాయపతిమీఁద దంతిపతి నాతనిపై నృపతిం గజాదినిర్ణయముల మొత్తు లాడుదురు .. సమస్త దిశాగతు లైన యధ్వగుల్ ... ఆము. 4. 131.

చం. చిలుకుల గట్లఁ గైదువులఁ జెట్టుల ద్రుడ్ల వొడళ్ళు నజ్జుగాఁ, దలకొని మొత్తులాడి జెడి దమ్ముగ నెత్తురు లేఱులై చనన్ జలమునఁ బోరుచో .. అచ్చ. రా. యు 199.

**మొత్తుపడు** అ. క్రి (మొత్తు + పడు) కొట్టుపడు. దెబ్బతిను.

వ. ఇట్లు మొత్తుపడి యమకింకరులు శంకర కింక రులకుం బ్రతిఘటింపక నుకుమూరుం బరివేష్టించి.
శివరా. 4 60., నైష 8. 79

**మొదటిపల్కులు.** వి బ. (మొదలు + పల్కులు) వేదములు

సీ బలుసంజడంబు కెంబట్టుపల్లము గాఁగ మొదటి పల్కులు మువ్వపదువు గాఁగ.... ప్రబంధ. 51

**మొదటివేల్పు.** వి. (మొదలు + వేల్పు) సుర జ్యేష్ఠుఁడు, బ్రహ్మ

సీ. అచటివిప్రులు మెచ్చ నిఖిలవిద్యాప్రౌఢి మది మది దప్పినమొదటివేల్పు .. మనుచ. 1, 50

**మొదయము.** వి. తృణవిశేషము, ఒకజాతిగడ్డి మొర్రి

గీ. పరిక ముల్లూచి మొదయము నైటితుంగ

మొదలుగాఁ బూరి దవలింపఁ బోదలు వె-లు ... ప్రబంధ. 201

**మొదలంటు** అ. క్రి (మొదలు + అంటు) సమూలమగు, పూర్తియగు.

ద్వి ముక్కును జెవులును మొదలంటఁ గోసె, నక్కామరూపిణి యక్కజం బొదవ ... రం. రా. బాల. 27 పా 19 రం.

గీ అన లన్నియు మొదలంటఁ గోసి యున్న, గోఁచికట్టున కటువంటి గొడవ గదవ, రాక మెడఁ జుట్టుకొనియె .. పాండ. 5 258

గీ. స్వామి యుత్తరపథిక పాశ్చాత్యు లెల్ల వేదముల నుద్ది మొదలంట విడచి రొక్క-చోట నె దైనఁ గలిగినఁ గూటికొఱక ... ప్రబోధ. 2 46

**మొదలారి**, వి (త ముదలియార్) అరవశూద్రు లలో నొకతెగవాఁడు (శ. ర.)

**మొదలార్చు**. స. క్రి. (√మొదలాఱు) సమూలముగ నశింపఁజేయు, క్షీణింపఁజేయు.

కం పొదు గోత్తి పితికి క్రేపుల, మొదలార్చుట ప్రజల నధికముగ నరి గొనుటల్, కదుపులఁ బెనుచుట తగ నరి, యదనం గొని ప్రజలఁ బ్రోచు టవనిపతికిన్. రుక్మాం 3. 20

**మొదలాఱు**. అ. క్రి. (మొదలు + అఱు) సమూలముగ నశించు.

కం. ఉదకము గఁపును నీడలు, మొదలాఱ గఁ దలఁకు మృగసమూహంబులయా, పద లెటిఁగి యుట్టి యమ్మృతా స్పదమై కడుజల్ల నైన చంద్రునిఁజేరెన్... ద్వా. 9. 10

**మొదలిజేజే** వి. (మొదలు + జేజే) పూర్వదేవుఁడు, రాక్షసుఁడు.

సీ. మొదలిజేజేబంటు ఉదుటు మీఱఁగ వారిఁ బోదివి చేయిఁ జెలఁ బొడిచి...
అచ్చ. రా. యు 430.

**మొదలిపేరు**. విశే (మొదలు + పేరు) అగ్రగణ్యుఁడు, తొలుతఁ బేర్కొనఁ దగిన వాఁడు, అగ్రగణ్య, మొదటఁబేర్కొనఁ దగినది.

సీ కడుపుచల్లఁగ మేలి కొడుకులఁ బడసిన నుద తుల కీచాము మొదలి పేరు .
కేయూర. 1 86

**మొదలిప్రోలు** వి. (మొదలు + ప్రోలు) రాజధాని, ముఖ్యపట్టణము.

అ. దండుతోడఁ గూడి తరలి గొబ్బున దమ నేల కరిగి మొదలిప్రోలు సొరక, మిత్తి వేఁటకాని తత్తడియూర నిం, పెసఁగ నిలిచి ప్రజల వేలు చుండె అచ్చ రా. అయో. 115.

**మొదలివేలుపు(ల్పు)**. వి. (మొదలు + వేలుపు) ప్రధానదైవము, శివుఁడు

గీ మొదలివేలుపుఁ బొడఁగంటి ప్రొక్కఁ గంటి
ఉ హరి 2 178

ఆ. కాలిక్రేలఁ గన్నగారాబు గూఁతురు, మొదలి వేల్పుఁ గూడి మురియుచుండ.. ద్వా 4. 22.

**మొదలు**. వి. బొ (త. ముదల్, క, మొదలు) ఆది, ప్రారంభము.

చం. ఎదలక బుద్ధి నంతరరివర్గము నోర్చి జితేంద్రి యుండ వై, మొదలన దేశకాలబలమున్ మఱి దైవబలంబు గల్గి భూ, విదితబలుండ వై యహితవీరుల నోర్వఁగ నుత్సహింతె ...
భార. సభా 1. 58.

సీ. నీమహాయజ్ఞంబు నిర్వర్తితంబు గాఁ దత్పర మతి భారతప్రసంగమున విష్ణువంశంబు మొదలిఁ టను డియు నేను గీర్తించితి నిర్ధపుణ్య ..
హరి ఉ. 8. 312.

సీ ఉదయాచలేంద్రంబు మొదల నెవ్వనికుమారత కుఁ గ్రౌంచాచలరాజ మయ్యె ...
మనుచ. 1. 11., ఉ రా. 5. 15.

2. పూర్వము, తొల్లి.

గీ. ... అంత యెఱుక, యొంఁ గలిగెనేని యొటిఁ గింపు దేను మొదల, నెవ్వతె నటన్న ...
ఆము. 5. 75.

3. వృక్షాదుల దిగువ భాగము, ప్రకాండము.

సీ. కోరి ఫలార్థులై వారలయెక్కిన మ్రాఁకుల మొదళులు వీఁకఁ బట్టి . భార ఆది. 5 166

గీ. పంచభూత సుధాకర భాస్కరాత్మ రూప మగురూపు నీరూపు రుచిర, రూపమొలఁ గెదవె మాకు వేళ్ళలో మొదలు చూచి, చెట్టెలుఁగు వారి కాకులు చిదుమ నేల ఉ. హరి. 4 95

సీ తుద మొదళ్లకుఁ జిక్కఁదునిసి పొలఁగ మోరఁ గుల శైలములఁ జిమ్ముఁ గొంత తడవు.
భాగ 3, 637., ఆం భా 2. 26

4 మూలకారణము.

కం. ఇది యేమి తెలఁగు దీనికి, మొద లెయ్యది నాకుఁ దెల్లముగఁ జెప్పఁడు తీ, ర్చెద .
భార, ఆది 6. 262

కం. అవ్వకు మొద లగు పాపవు, జవ్వన మెదిరిఁచె జిగి యొసఁగ నామేనన్... మనుచ 6. 42

ద్వి మూఁడుమూర్తులకును మొద లైన మూర్తి .. పండితా దీక్షా. 53 పొ., భోజరా 5. 302

5. మూలధనము.

ఆ. కర్షకునకు నేల కాల మెఱుంగుట, జట్టు కాని కేది సంభవించె, తండు విలువమొదలనగు లాభ మును నెడ,వ్యయము గల్గుటయు శివప్రదములు.
భార. అను. 5. 75.

కం. జనకుఁడు గొన్న ఋణముఁ ద, త్తనయుఁడు వడ్డియును మొదలుఁ దా నరువఁదగున్..
విజ్ఞా. 3. 84.

(వ్యవ.) తన్ను మాలినధర్మము మొదలు చెడ్డ బేరము లేదు

విశ. 1 ప్రథమము, తొలుతటిది.

కం. శరనిధి పరివృత విశ్వం,భరఁగల భూపతులు పాండుపతికృతమునఁ గిం,కరులై ప్రతి సమ కల్పిత , కరువై రది మొదలు గాఁగఁ గౌరవ్యు లకున్ భార ఆది 5. 40.

ఆ. మొదలిరాజు సభయముగ నిల్లు సమరంబు, తొలఁగి చనియె వట్టి పెఱబలంబు, దొరలు నిలిచి పోరు టరది ... భార కర్ణ 2 397

గీ. మొదలిపక్షంబు విదియయం దుదయమైన, చంద్రరేఖయుఁబోలె నా చంద్రవదన ...
విక్ర. 7 41.

కం వదనైక స్తంభకవక, సదనము సిరి కొఱ కొనర్చు స్రష్ట నిలువు న, మొదలింటి శంఖ శంకువొ, యిది యనఁగాఁ గంబుకంఠ మింపు ఎసింపన్ పాండు. 2.40 , ఆం. భా 3.24

2 ప్రాక్తనము. తొల్లిటిది , తొల్లిటివాఁడు, పూర్వుఁడు.

ఆ. మొదలి పెక్కుజన్మములఁ బుణ్యకర్మముల్.
భార, ఆది. 3 120.

చం ... మా, మొదలిటువా రొనర్చు విధముం గొనియాడితి మేము నిర్యోడన్ ...
భార విరా 1. 179.

3 (క. మొదలిగ) ముఖ్యుఁడు, ప్రధానుఁడు. ...కులోత్తుగ రాజేంద్ర చోడయరాజుల ముదిసెలి గుద్దవాది మొదలి భీమినయకుఖ్ఖు ...
ద శా. 4. 1054.

అవ్య. ప్రభృత్యర్థకము, ఆరంభించి, మొదలుకొని..

శా. ... విసించి నిన్న మొదలున్ నీ వంటమిం జేసి యా, యాలాపం బెయవేళఁ బల్కెడు ...
మనుచ. 3. 57.

సీ. కనుగొన్న మొదలు తక్కినమాట లాలింప బుద్ధి పుట్టని పుట్టుభోగి విడిచి ...
వరాహ. 1. 32.

వ. ఇది మొదలు నాకు మీర లత్తమామ లైతిరి...
కళా 6. 186.

జ: మొట్టమొదట, మొదలువల్కులు, మొదటి వేల్పు, మొదలంటు, మొదలాఱు, మొద లార్చు, మొదలిజేజే, మొదలిపేరు, మొదలి ప్రోలు, మొదలివేలుపు, మొదలుకొను, మొదలు పెట్టు, మొదలు ముట్టు, మొదలాడు, మొదలెత్తు, మొదల్చెడు

మొదలు కొ(ల్కొ)ను. అ. క్రి. (√మొదలు)

1. ప్రారంభముచేయు, ఉపక్రమించు.

కం. వినినదియును నెయ్యెడ నేఁ, గనినదియును మునికృపం బ్రకాశంబై తోఁచిన యదియును విశదంబుగ, వినిపించెద మొదలుకొని సవిస్తారముగన్ భా. భీష్మ. 1 78.

(ఇట 'ఆదినుండియు' అని తాత్పర్యము.)

కం అనుటయు వైశంపాయన, ముని జనమేజయ నృపాల ముఖ్యునితో ని, ట్లనుఁ దత్కథాప్రపంచము, వినిపించెద మొదలుకొని వివేకనిధానా .. ఉ. హరి. 4. 5.

సీ. ... ఎచట, నుండి తది మొదలొక్కటి చెప్పుమువిద యనిన ... కళా. 8. 275.

2. సమూల మగు, మొదలంటు

గీ. కొనలు దెలియంగ వలె వనుకోర్కిఁ జేర్చి, మొదలఁ బొదవిన పదిలంపుటీ నమర్చి, మొదలుకొని మేనులు చెమర్చి మద మెలర్చి, గదలరొద లార్చి గగనంబు గదల నార్చి.
జై. భా. 2. 83.

(ఇట నాపాదమస్తకము అని భావము.)

సం. క్రి. ప్రారంభించు, తొట్టు.

(వ్యవ.) వన్నయ మొదలుకొని చిన్నయ వఱకును గల కవులందఱును ప్రామాణికులు.

మొదలుపెట్టు. స. క్రి. (√మొదలు) ప్రారంభము చేయు, ఉపక్రమించు.

(వ్యవ.) నెల దినముల క్రిందటనే యిల్లు కట్టుట మొదలు పెట్టినారు.

మొదలుముట్టు. అ. క్రి. (√మొదలు) సమూలమగు, మొదలంటు.

చం. ... గొల్లనిఁ బిలిపించి నీవు పదిలంబుగఁ గోడెలఁ బట్టుకున్న నా.మువఁ దనరారుచున్ మొదలు ముట్టఁగ మేయును జైరులన్నియున్.
నీలా. 2. 59.

మొదలూడు. అ. క్రి. (√మొదలు) నిర్మూలమగు, మొదలంటఁ బోవు.

ఉ. ఉల్లము చల్ల నయ్యె మొదలూడె మనోరథముల్ జగంబుపై, నొల్లమి పుట్టె ...
కవిక. 6. 211.

మొదలెత్తు. అ. క్రి. (√మొదలు). మొదలంటఁ బోవు, సమూలముగ నశించు.

చం. ధరణిపు చక్కి కట్టెదురఁ దామఁట సాక్షికిఁ జేష్ట నష్టతఁ, బొరసె మనోనురాగ పరిపూర్తి నొకించుక నేపు నిర్భర, స్మరశర పుంఖ సంఘటిత షట్చరణ ప్రమాదాగరుచ్ఛటా, స్ఫురదనిలావతారమున బోరనఁ దా మొదలెత్తెనో యనన్. నైష. 6. 7.

మొదల్చెడు. అ. క్రి (√మొదలు) చచ్చు, మరణించు.

సీ. ... నీల్గుట మొదల్చెడు టడంగుట ...మీఱును మరణము ... ఆం. భా. 2. 225.

మొదవ. వి. బల్బజము, ఒక జాతి తృణము 1 (చి. ని., శ. ర.)

మొదవు. వి. పాఁడియావు, ఆవు.

మధ్యాక్కర సదమల శశదిందు శంఖనిభ మైన చాయయుఁ గలుగు, మొద విది నిధి చేరినట్లు నేరె నిమ్మునికిఁ బుణ్యమున ...
భార. ఆది. 7. 98.

సీ. అదనుతోఁ దేఁపి చన్నవిసి యోషధుల మన్మొదవు కొండల కెల్లఁ బిదుక నెఱఁగె ...
మనుచ. 2. 11.

ద్వి ప్రొద్దు నేఁడిదె గ్రుంకెఁ బొలమున నుండి ముద్దు లేఁగలు వచ్చి మొదవులఁ గలసె ...
ద్వి. హరిశ్చ. ఉ. 188. 4 పం

వ. శ్రీ రాభిషేకము...మొదలియడవున నావ బోల సోమనివసమున మొదవులు ...
ద. భా. 4. 1188.

కం. ఉదకము చేతనె కపటపు, మొదవు మడిసె మొదల నుదకములచేన తుదిన్, బ్రదికె నుదకంబు ధరలో, నది గాన విషామృతాహ్వయంబులు దాల్చెన్. వరాహ. 10. 61.

సీ. అశిగినఁ గొదుకక పుడమి వేల్పులకు నిచ్చులుఁ
బాఁడి మొదవులుఁ జాల నొసఁగు ...
సీలా. 1 49

2 తొలి చూలి యావు.

సీ. ప్రథమ గర్భిణి పేరు పరుగును మొదవన
ఆ భా 2 582

**మొదుక** విశే. 1 కఱకు, బిఱుసు (కర్ణాటాంధ్ర యందున దీనికి నిర్గమను బహుళము)

సీ. పొదివిన నందుఁన మొదుకని యఱచేత మీఁకతో
మోఁటలు వ్రేసి వ్రేసి హరి పూ. 6 161

2. సాంద్రము, పట్టమైనది (శ ర).

జ : మొదుకన

**మొదుకన** వి (√మొదుక.) 1. కఱకుఁదనము (దీని యామ్రేడిత రూపము మొదు మొదుకన)

వ . ముదుకవెన్న లంటికొనుట మొదుకగొని
మొదుక నయి పిడిచినం బోల వలచుచుఁచు
తలలును ... హరి పూ 5 142.

సీ మువ్వన్నె బాఱల మొదమొదుకన యైన
మేనిచాఁ పత్యుగ్రమై వటింప ...
సుద. 5 53

2. బరువు.

వ .. కరవాలంబు శుండాల కుంభస్థలంబులు
వగులవ్రేసిన మెద డంటి మొదుక నైనఁ గేతు
దంతంబులు నఱికి చులకంజేయుచు
భార. భీష్మ 2. 71

**మొద్దఁడు.** విశే. (సం. ముగ్ధః) 1 మూఢుఁడు
(శ ర.).

చం ...భా, నిటువలె నెద్దు మొద్దనికి నేమిటికిం
దగులంబు సేసె .. సురా 60.

2 లావైనవాఁడు (శ. ర.)

**మొద్దు** విశే. (సం ముగ్ధః) 1. మూఢుఁడు, మూఢురాలు.

కం ఎద్దు సుమీ యిదికూడని, పద్దు సుమీ నాదు
మాట పాలించితివా, ముద్దుసుమీ యా సానిది,
మొద్దుసుమీ. చంద్ర వి. 3 42

2 వాఁడిచెడినది, మొనపోయినది.
(చూ. మొద్దువోవు)

శి. లావైనది, స్థూలము.

సీ. మొద్దు మ్రోడులు దాఁకి మొనగోళ్ల .మట్టుకు
మురిసిపోయిన కాళ్ళు మొద్దువ్రేళ్ళు ..
సురా 57.

ద్వి. బప్పికల్లు ల న ట బలిసినతొడలు, మొద్దుఁ
బాదంబుల ముడిగినవ్రేళ్ళు ...
ద్వి హరిశ్చ ఉ. 1090 పం.

వి 1 కొమ్మలు విఱిగినమ్రాను, స్థాణువు.

సీ మొద్దు మ్రోడులు దాఁకి మొనగోళ్ళమట్టుకు
మురసిపోయిన కాళ్ల మొద్దువ్రేళ్లు ...
సురా 57

2 చెట్టుకొమ్మలక్రింది భాగము, ప్రకాండము.

గీ. .. పో ల్ప్రకాండము మొద ల్మొద్దనఁ గను. .
ఆం. భా. 2 36.

జ. మొద్దువోవు.

**మొద్దువోవు** అ. క్రి (మొద్దు+పోవు) వాఁడి లేనిదగు, మొన చెడినదగు

సీ వజ్రహస్తుని చేతి వజ్రాయుధము జాగ్రదుద్దీప్తి
వాడిటి మొద్దువోయె.. భీమ. 4. 107

గీ బుద్ధ నీగట్టిహృదయసంపుటముఁ దాఁకి, కుంతి
తము లయ్యె మరునంపకోల లెల్ల, మొద్దు
వోయి కదా యిప్డు ముఁవిరోధి, యలరు
లెల్లను వర్తులాస్యంబు లయ్యె...
నైష 8. 139

**మొన** వి (క. మొనె త. మునై.) 1. సైన్యము

కం. విను కొంత తైనఁ గడుఁబెంపున మార్కొని
కడిమి మీఱి పొంగి యడరివన్, మొన యొంటి
యైన విఱుగుం, జనునే కయ్యంబు వోదుః
శక్తులకైనన్. భార. శాం. 3. 17

ఉ . నిన్ని మొన్నటతోడఁ బో విడుచునే గుహా
డిప్పుడు సూడు మంతయున్ ...
భా. రా. అయో. 245

శా. ఆలోకించెను శ్యాముక్తపటుశాతౌఘుంబుచే నీ మొనల్, నేలం గూల . ఉ. హరి 4.195.

2 వ్యూహము.

కం. మొన దీర్పు వెరవు యంత్రము, ఱనేకము లొనర్చు నేర్పు .. సేనాపతికి సైనికములు గావలయున్ . భార. శాం. 3. 360.

కం. ఎనుబది యెనిమిదిరథుః, దనుజులు రాతసులు నడువ దమసైన్యంబుల్, మొనలై పది యక్షౌహిణు, లనూనగతి నడువ నడిచి రా నృపతనయల్. ఉ. హరి. 4 222

గీ. అవధరింపుము జనమేజయక్షితీశ, వరుస కిట్లను నమ్మౌనివల్లభుండు, దైవసైన్యంబు లీరీతిఁ దనతరింప, వెడలి మొన లేర్పరించి యుద్వేల వృత్తి. పారి. 5. 2.

3. దురము, పోరు.

కం. నడచి మొనచేయ నాయిత,పడి విడు విడు మనుచున్న ప్లవగబలంబున్...

భా. రా యు. 6. 51.

ఉ ... పంచశర సుందరరూపుల జారవీరులన్, గ్రొన్నన వింటివాని మొనకుం గదియించెద నంచు నెంచుచున్. హంస. 3. 208.

4 సేనాముఖము, నాసీరము

సీ. ... పొల్చు సేనాముఖము మొన యనఁగ...

అం. భా 2. 210.

5. అగ్రము, కొన

కం. సకలక్షత్ర భయంకరు,నకు ఖార్వ ప్రథికి నని మొనన్ మార్కొన నో,పక వలియం బాఱఁడె యీ, ముకుందుఁడు భయాతిరేకమునఁ బది మాఱుల్. భార. సభా. 2 46.

సీ. మొన లావులించి వాసన నల్లఁ బసిగొని లేఁదేఁటిగము లెంగిలిం బుడ,... గిరిజ పూజించెఁ బసిఁడి తామరల వరదు... కు సం. 3.351.

సీ చిగురుఁ దామరపాకు జివ్వంచుఁ జనుదోయి మొనల గ్రొవ్వేఁడిని మునుఁగబాఱి ...

నైష. 2. 119.

చం. ... పట్టిఁ గ్రోవ నాఁ,గలిమొన హస్తినాపురి పెకల్చితి కౌరవవీరు లెల్ల బెగ్గిల నంరేవతీ రమణికిం బతినై యదువంశమౌక్తికా

హరి. ౨. 66.

అం. భా. 2 37.

6. శస్త్రవిద్యా విశేషము. ఒక విధమగు సాధన.

సీ ... సాదకాఁ డనఁగను శస్త్రధరుఁ,

గీ దలరు దద్విద్య సాధన యనఁగ నెగడు, వలకు పరువడి గాయమానంబు విసరు, మొన లనఁగను దద్భేదములు చెలంగు ..

అం భా. 2 205.

వ. ...అఁమీటు మొన నెఁమీటు మొన సరి తాలంపు మొన లాదిగాఁ గలపదిరెండుమొనలు.

ప్రబంధ 78.

7. ఖడ్గాదులధార, వాదర.

మహాస్రగ్ధర .. నై,చిన చక్రంబా విరోధిక్షితి పతి నడగించెం జలంబున్ దహించెన్, మొన లన్ వేయింటన్... వరాహ. 5. 41.

8. బాణాగ్రము.

మ ఇనవంశోత్తమ నీ మొనం దునిసి పో నే వాలినో నప్తసా,లినో మారీచుని తల్లినో...

చం రా. 6. 45.

9. ముందు, పురోభాగము.

లయగ్రాహి. ఆ యెలుఁగుచేఁ బులుఁగురాయనికి జోడగు జటాయు వమరాలి పగదాయకు మొనై యో, రియొచటికిం జుణిఁగి పోయెదు పలాశపశదా యని... చం. రా. 5. 72.

(చూ. ఎదురు, ప్రతి?)

ద్వి ముందర నీడేరి మొనకు రా వనుచు ..

ద్వి. శ., పా. 2. 517 పం.

మొనలకైదువ–త్రిశూలము.

కం. మఱి యూరుఁ బడమి తేరును, గలిగిన నెఱవేల్పు మొనలకైదువు తాల్పు ...

అచ్చ రా. అయో. 118.

ఇక్లే, మొనలవాలు, మొనవాలు.

ఉత్సాహ. మొలను దోలుఁ దలను జాలు మొనల

వాలు నిండు వెన్నెలలఁ బోలు నొడలిడాలు...
నీలా 1. 119.

సీ ఒక కేల మొనవాలు సికపట్టు వినుజాలు మొన తోలు నెమ్మేనఁ దెలుపుడాలు ...
చెన్న. 4 80.

జ. మొనకట్టు, మొనకాఁడు, మొనకాలు, మొన కెక్కు, మొనకొను, మొనగాలు, మొనగుబ్బ, మొనగురుపు, మొనగోరు, మొనచేయు, మొన దేఱు, మొనపడు, మొనపల్లు, మొనయిడు, మొనలిడు, మొనలెత్తు, మొనవ్రేలు, మొన నెలవి

**మొనకట్టు** అ. క్రి. (√మొన) 1. మూర్కొను, ప్రతిఘటించు.

వ. వాఁడు పడినం దక్కటిరాజులుం గౌరవులు నీకు మొనకట్టరు... భార. కర్ణ. 3. 127.

2. ఉత్సహించు, ఉత్సాహపడు.

కం వనరుహగర్భన కైనను, వనరుహలోచనున కైన వనరుహాఁపుజూ, టునకైనఁ దరముగాద, మ్మునివరుకోపాగ్ని కెదిరి మొనకట్టంగన్.
హరిశ్చ. 1. 208

3. గుంపుగూడు.

చం కలువలు నిక్కఁ దమ్ములు మొగంబులు ముచ్చముడుఁగ నింగిఁ జుక్కలు మొనకట్టి మొత్తములుగట్టి విహంగమ పంక్తి నీడముల్, వెలకొని చేర.. ధనా. 3. 28.

వి. 1. ఉత్సాహజనకమగు మూలికా విశేషము. (ఒకానొక స్తంభనమూలిక శ. ర.)

సీ. మొనకట్టు నెత్తమిచ్చి మొత్తమ్మునకు రచ్చపట్టు రమావధూ పరివృఢునకు ...
చంద్రా. 5. 120.

(విశే. ఉత్సాహకరము. అని శ. ర.)

సీ. చనవుతోఁ దారికట్టును మొనకట్టును దెలుపు వారల మనవులు ఫలించె ... కువల. 5. 56.

2. ఉత్సాహము. (శ. ర.)

**మొనకా(గా)ఁడు.** విశే. (మొన + కాఁడు. బ. మొనకాండ్రు, మొనకాండ్రురు. మొనకాఱు)

1. శూరుఁడు

కఁ. ఎట్టి మొనగాండ్రు రేనియుఁ, గట్టిగ నా యెదుట దిటము గలఁగఁగఁ ఒఱతు, ర్నెట్టు కొని నేఁడు మిగుల, న్బొట్టెఁడ వీ వెట్లు నిలిచి పోరెదు చెపుమా... అచ్చ. రా. బాల. 202.

2. ముఖ్యుఁడు, ప్రధానుఁడు (శ ర).

వి. సేనాధిపతి.

కం అని యతఁడు వల్కఁగా నింద్రుని మొగ మును జూచి నారదుఁడు మే లింకన్, మొన గాండ్రకు మద్దత్తుగ, పనిసేయఁగ వేల్పు బొజ్జ వంసఁగ వలయున్. మల్లు. పు. 2. 10

**మొనకాలు.** వి (మొన + కాలు) పాదాగ్రము, కాలికొన.

గీ. కరివరఘోటశైల సంఘట్టనమునఁ, దిరిగెఁ దరఁ గలు భూమి భృద్వరుల, సత్త్వగరిమ యొంచని బలు మొనకాళ్ళమీఁద, నదరు జడమూర్తులకు గెలు పగునె యొందు . ఘటికా. 2. 126.

**మొనకెక్కు** అ. క్రి. (√మొన) అధికమగు హెచ్చు.

కం. మనను గరగించు సిగ్గులు, మొనకెక్కని కోప ములను ముచ్చటగా నూతన భూషణములు గోరుచు, మొనయుట మొదలైన వెల్ల ముగ్ధల చేష్టల్. గఁధ. 1. 38.

**మొనకొను.** అ. క్రి. (√ మొన) 1. తోఁచు, స్ఫురించు.

కం. చని యమ్మునిని గనుఁగొనఁగను, దనపాదాం గుష్ఠమునను, ధర వ్రాయుచు నిల్చిన నెవ్వతె వీ వనినను, మునివర చిత్తమునఁ దెలియ మొన కొను వనియెన్ .. అధ్యా. ఉ. 224. పో.

2. సమీపించు, చేరువగు.

కం. వినరైతి రిట్టిహేతువు, జనియింపఁగ వలసె మనకు సాంఘాతిక మై, మొనకొనియె మరణకాలం, బనుమానం బింక నేమి యనపుడు నతన్. రంగా 3 155.

**మొనగాలు** వి. (మొన + కాలు) అశ్వగతి విశే షము.

గీ పొలుచు నాస్కందితి విశేషము మొనగా
ఁ నగ. ఆం భా 2 198

ఉ వీతశశీనమై యతులవేగమున న్మొనగాలు
ద్రొక్కుచు తృష్ణా తురంగంబు నెక్కి యలసస్థితిఁ
జేడ్పడకుండు వానికి, జేతఁడు నేల మేరుగిరి
సింధువు వత్సపదంబు దూరితృ. ష్ణాతినుఁ
దైనవానికి నిజాంతగతార్థము దవ్వు పెద్ద
యున్. వేం పంచ 2. 150

మొనగుబ్బ. వి (మొన + గుబ్బ) స్తనాగ్రము.
చం ఒకనికి మోముచుంబనము లొక్కనికిన్ మొన
గుబ్బ పోటు.. హంస 4 89.

మొనగురుపు వి (మొన+కురుపు) వ్రణవిశేషము
కం కని దీని నెత్తఁ దోడ్పడు, మనుజుని దలఁ
పగఁ బసులమారిదయ వచ్చె, న్మను గండ
మాల మీఁదను, మొనగురుపుం బుట్టె నన్న
మోనం బాయెన్. ద్వా. 1. 53.

మొనగోరు వి. (మొన+గోరు) నఖాగ్రము
వ. . మచ్చరంబున విచ్చలవిడిఁ గదిసి పయింబడి
జెడిదములగు నిడుద మొనగోళ్ళ గ్రుచ్చినఁ
దామును నెదిరి పై కొని కొట్టుతఱి ...
చంద్రా 2 84.

(ఇది భల్లూక వర్ణనము)

మొనచే(సే)యు స. క్రి. (మొన + చేయు)
వాడిఁచేయు, పదనుబెట్టు

ఉ. చిత్తజుఁ డల్లి తూపు మొనచేసినఁ జేయఁగ
నిమ్ము పైధ్వజం, బెత్తిన నెత్తనిమ్ము వచియిం
చెనఁ గల్గినమాట గట్టిగా విజ. వి. 3.15.

అ. క్రి. 1. ఉదయించు, పొడచూపు.

ఉ. తోయజవైరి మాసె రవి దూర్పుదెసన్ మొన
చేసెఁ జుక్కలుం, జాయలు దీసె ...
కృ. శకుం. 3.54.

మ. కటి దొడ్డైన నౌటఁ గన్గవ కటాక్ష శ్రీల
గర్వంబు చూపుటఁ జన్నుల్ మొనచేసి
యుంటఁ బగడంబున్ దార్కొనన్ మోది
పూనుటఁ దారుణ్యపు బందుక ట్టగుట మేమం

దీపకుం జెప్ప కె.చ్చటికో పోదయు మిటారి
బాల్య వసమాప్త్ర ప్రాప్త దార్ఢ్యమై.
చం రా 6 72.

2 మోహరించు.

సీ. మోహరించె ననఁగ మొనఁజేసె ననితోఁచు ..
ఆ. భా. 3. 101.

మొనదేఱు అ. క్రి (మొన + తేఱు) నిశితమగు
వాఁడి కలది యగు.

గీ. వృపుతఁపు రేఁపె నపుడు మాధు పదపాంగ,
సాన మొనదేఱినయనంగళరమనఁగ .
రా. వి 2. 120.

మొనపడు అ క్రి. (√మొన) ఆవృతమగు, కప్పఁ
బడు.

కం. విని కడఁగి యసుర లెనుబది, యెఁమిదివే
లొక్క మొగిన యెత్తిన హరియుం, గినిసి
విశిఖంబు లేసిన, మొనపదె గగనంబు మొయిలు
మూఁగిన మాడ్కిన్.. ఉ హరి 1. 147.

మొనపల్లు వి. బొ (మొన+పల్లు) దంతాగ్రము.
పంటికొన

సీ చక్కెర కెమ్మోవి చవిచూడనే కాని మొన
పల్లు చుఱుకున మోపరాదు.. దశా 2 311.

సీ మొనపంట మదుపు వేఁడిన నీళ యొసఁగ
నందుమఁ జఱు క్కని మోవి నొక్కుదాని....
ఉ రా. 1 . 319.

మొనపు. అ క్రి (√మొనయు) 1. కలుగు, పుట్టు.

గీ. తనతనూజుని బిరుదగాథలు వినంగ, మొనపు
వేడుకన సురరాజు మొగము, తెల్లఁబాఱు
నిఁకననితెలిపెడభంగి నాస,శిలలామంబు వద
నంబు తెల్లఁబాఱె ... వరాహ 3. 5.

సీ. గళలిప్తకస్తూరికారేఖ లొరిజలు ననుఁజెక్కుల
జవాది మొనపుమదము.

గీ. అంగసంభవుమదపుచేనుంగు లనఁగ, వఱలు
దురు వీరుఁ బన్యాలావణ్యవతులు...
చంద్రా. 1. 32.

2. ప్రకాశించు, ఒప్పు.

గీ. తోఁచె హరిణాంకబింబంబు నాఁచుతోడి,

దొడ్డ పుగతీ . చిలువ, బిలువసీరువిభావ వెన్నె
లలు మొనవె .. వరాహ. 4. 147.

3. హెచ్చు, అతిశయించు.

కం అరుదెంచినఁ బనిసెపములఁ, బరిచారిక లెల్లఁ
దొలఁగఁ బార్థివుఁడు మకో, హాంపర్యంకమునకు
నా, తరుణిఁగరము పట్టి తిగిచి తమకము మొన
వన్. వరాహ. 4. 180.

చం. .. మంత్రి పురోహితదండనాథశా, సనధరు
లాతణాబ శుభసంభ్రమసన్న హానానులావ
ముల్, మొనపగ నమ్మహానగరముం గయి
సేయఁగఁ బంచి రెంతయున్... వసు. 5. 63.

స. క్రి. 1. మొనయఁజేయు, పూనఁజేయు

సీ. సముద్రగకలశముల్ చక్రవర్తు లటంచు మొట్ల
మారుఃసరి మొనవఁ దగునె .
గీ. గల్పినున్న ప్పగవకు. చంద్రా. 4. 127.

2. కలిగించు, పుట్టించు.

మ వనిత ల్నవ్వఁగఁ గౌఁగిలింపఁగన నిశ్వాసింప
గానం బొనర్ప నదల్పం బలుక న్మధాసవము
గూర్పం దన్న నంటన్ననల్, మొనపుం బొన్న
కురంటకంబు తిలకంబు న్సిందువారంబు ప్రేం,
కణము న్సంపగి గోఁగును న్వకుళముం గంకే
ళియు న్మావియున్. రామా. 1. 190.

సీ. జోడన ద్దూఁటించుచోఁ గవ్వపుంగొండ వెను
వెంటఁ బుట్టచెండనువు మొనవ ..బహు. 3.6

**మొనయించు.** స క్రి. (√మొనయు)

1. మొనయఁజేయు, కలిగించు.

గీ. మల్లికాయోగ మంది సంపఁగి సువర్ణ, పుష్ప
ములు పెక్కు మొనయించెఁ బొలఁతిమోడు...
ఉ రా. 1. 171.

3. వ్యాపింపఁజేయు.

సీ. వినుఁగెంపు వగఁజాలు మనుఁగెంపు తెగడాలు
మొనయింపుకుండలంబులు వెలుంగ ....
ఉ. రా. 1. 99.

**మొనయిడు.** అ క్రి. (√మొన) వాఁడి గలిగించు.
పదనుపెట్టు.

గీ. చెఱకువిలుకాఁ డురం బనుమెఱుఁగుసాన, పైని
మొనయిడు కాంచనాంబకము రేఖ ...
దశా. 2. 232.

**మొనయు.** అ క్రి. 1. యత్నించు, పూను.

కం. చని ఖాండవంబు గాల్పఁగ మొనసి మహా
హస్తియూథముఁబోని ఘనా, ఘనములచే
బాధితుఁ డయి .. భార. ఆది. 8. 219.

గీ. సత్యమును శౌచమును...కలిమి పుణ్యవృత్తిం
బిదిగలుగువరుఁడు, మొనయు దీనిమూఁతగఁ
గొని మోతమునకు ..భార. అశ్వ 1. 192.

గీ. మూఁడులోకంబులను గావ మొనసినట్లు, నేత
ము మొల్లనకయిదవు చెన్ను మీఱ . .
హరి. ఉ. 6 34

ద్వి. మునిశాపభయమున మునిఁగి యొండాడ,
మొనయక యూఁకొట్టి మొక్కుచునున్న ..
ద్వి. హరిశ్చ. పూ. 1417 పం.

2. కలుగు, జనించు, పుట్టు,

చం. అనుటయు నాదిదేవుఁ బరిమాత్మ, గనుంగొని
నెమ్మనంబులన్ మొనయుకుతూహలాంకురము
మోడ్పడ... నృసిం. 1. 88.

కం అవి విని ధర్మతనూజుఁడు, జనపతులును
గృష్ణుఁ జిత్తసరసిరుహములం, దునిచిరి పుల
కాంకురములు, మొనయఁగ నానందబాష్ప
ములు వెడలంగన్... ఉ హరి. 2. 61.

కం. అనుమాటలోను వెలిగా, మొనసినపేరాస
వారముఖ్యయుమటి తజ్జననియు నొంకొరుఁ,
గడవం, బని దిగ్గనఁ దలుపు దీసి సంభ్రమ మొద
వన్. విప్ర. 4. 63.

3. సంభవించు. తటస్థించు.

మ ..విఘ్నంబు పూజావిధిన్, మొనయన్ దానవ
చంద్రుఁ డద్భుతరసాంభోరాశిమగ్నాత్ముఁడై.
ఉ రా. 3. 219.

సీ. దైవంబుకృప లేక తను బ్రోవఁదెవ్వఁడు,
మోహ మగ్గల మైన మొనయుఁగీడు. ..
రామలింగ. 10 , సారంగ. 2. 117.

4. అవతరించు.

కం. మోహము లేక జగంబుల, మోహింపఁగఁ

జేయ నేర్చి మొనసినకృష్ణున్, మోహింపి చెద
మనియెడి, మోహమున విధాత దాన మోహి
తుఁడయ్యెన్. భాగ. 10 పూ 5-3

కం. అని పలుకుచుండ నిద్దఱు. వనితలు తప్పు మ
వెడలి వలరాయనిపూ. దొననుండి వెలికి మొన
సిన,కనదనుపమగంధిలాభ్రు శికలో యనఁగన్.
సుద. 6 21.

5. ఒప్పు, శోభిల్లు.

సీ. ముత్యాలముగ్గులో మొనయుస్త్రీ ష్టెలఁ దమ
యంగసంగ సౌఖ్యములవలన

గీ. అల్లతపసి, యింతులును నేర్పుమై నే్పు తు
రన్న .. రామా. 1 124

కం అలవడ శబ్దార్థములకు, తెలువంబగు నవ్య
క్తిస్పృజియించి సముజ్జ్వల దుత్ప్రేక్షావ్యంజన,
ములచే నుత్ప్రేక్ష యనఁగ మొనయుం గృతు
లన్ .. కావ్యా. 5. 44.

గీ మొనసె నొకకడ సామిసంపుల్లమల్లి, పాటలీ
చంపకోత్పల ప్రౌఢిమములు... పారి 3 46.

6 ప్రత్యక్షమగు, గోచరించు.

కం. తొల్లిటిమునులు తపంబులు, మొల్లముగాఁ
జేసిరి శౌరి మొనసినపిదపన్, సల్లలితంబుగ
వేఁడరె, యుల్లములకుఁ బ్రియము లైన
యుచితార్థంబుల్ ... కుచేల. 1. 95.

7. రూపొందు

సీ. తనయవృశ్యత నడుమనె తాల్చి సాంగమై
మొనసినయతను సమ్మోహవిద్య ...
వసు. 2 27.

8 నశించు, అణఁగు.

చం. తవదగు సంతతిన్ గనలి, తానె వధించిన
పాపముల్ చెడన్, మునిగెఁడునాగుణగ్రకిణ
ముల్ మొనయంగ శమంతపంచక, మ్మునఁ
బితృతర్పణోచ్ఛలనమున్కలు వెట్టు భవద్భుజా
యుగం, బున కిదె వందనంబు భృగుపుంగవ
రూప విహంగవాహనా. మనుచ. 6 109.

9 సిద్ధమగు, ఉన్ముఖమగు.

గీ. . పె. ., వెనఁగి యున్నను బ్రావింప
మొనసి యున్న . భా. అరి 5 56.

10. వ్యాపించు, అలము.

మ. అనిశంగైత భదైత్యవైరి దరహాసాంకూరము
ల్మోవిపై, మొనయం గొంచొక నిల్చి
పారి. 4 12.

సీ మొనయు సంపతులకు మోహమీవై ఖరి
వనుమాడ్కిఁ జీకటు లలమె దిశల....
దశా. 7. 152.

కం చిత్తజుఁడు జగముపై దం, డెత్తను నవియిద్ద
మంపు చేనుఁగనంగా, హత్తుకొనె దిశలఁ
దిమిరము, ముత్తెపుఁ జౌడోలి యనఁగ మొన
సెం దారల్ రసిక. 4 98.

11. జరుగు

కం వెనుకకు మొనసి కదంబునఁ. బెనఁచి తిరిగి
నిఖిలలోక భీకరుఁడగు న,ద్దనుజేంద్రు ననా
యాసంబునఁ జంకిట నిఱికి యింద్రపుత్త్రిఁ
డచలుఁడై. నిర్వ. 7 83.

12. ఇది కొన్నిచోట్ల వాక్యాలంకారముగఁ
బ్రయోగింపఁ బడును.

గీ. మొనసి మొలనూలి మువ్వల మొరవ మమరె,
కు. సం. 8. 179.

ద్వి. మోని మై మీచేత మొనసి కోల్పడితి, నో సం
యమీశ్వర యోవరబ్రహ్మ.
రం. రా. బాల. 44 పే. 31 పం.

స. క్రి. ఆచరించు, చేయు.

సీ. మునుల మై తపములు మొనయుదమా యని
మౌనులై యుందురు మాట లేక....
భాగ. 10. పూ. 454.

కం. వనమునఁ బుట్టినశాకము, లనయము భక్షింప
దనకు నాఁకలి బెడదే. విను మును నోఁదర
పోషణమున కెవ్వఁడు కష్టవృత్తి మొనసెం
జెపుమా. నా. పంచ. 2.135

అ. క్రి , స. క్రి మార్కొను, ప్రతిఘటించు.

చ. అనుపమదివ్యశస్త్రధరులైన యమర్త్యుల
కాహవంబులో, మొనయక కాలకేయులు

సముద్రము౯ జొచ్చి.. భార. ఆర. 3. 9.

గీ. కనిమపె-గిన యంతకుకరణి యంత్య.కాల రుద్రునిచిచ్చ మకాండమృత్యు.ముఖము నుగ్ర భావముదోచు మొనయు వీర,సమితిఁ దెగ టార్చునప్పు డాశలుద్యనందు.

భార. శల్య. 1. 252.

గీ. ముజ్జగ౦బులు నొక్కటి మొనసె నేరి, మీఱి నీదాఁక రానిత్తుమే నిశాచ, రేంద్ర నీసత్త్వ మొగిని నీ వెఱుఁగ వెండు, నిన్ను మార్కొని మర్త్యులే నిలుచువారు రాజ. చ. 2. 57.

గీ. సత్కవీశ్వరు నెదురింగఁ జాల కవలఁ, జెదు కూఁతలె కూయును జెనఁటి మొఱకు, మత్త :ర కుంభవిదళ నోద్వృత్త హరిని, మొనయ లేకను గుక్కలు మొఱుఁగు నటుల ...

భోజసుతా 1. 13.

జ: మొనవు, మొనయించు.

**మొనలిడు.** అ. క్రి (√మొన) అంకురించు, మొల కెత్తు.

సీ. తీలిమీఁద లేఁతకెంగే లిడి తడవుచో మొనలిడు నొండొక ముద్దుఁజెలువు... కళా. 6. 196

**మొనలెత్తు** అ క్రి. (√మొన) మొలకలెత్తు.

కం. ననలు మొనలెత్తెఁ దేనెలు, చినికెం జిగురాకు గంటెఁ జెదరె వలితతుల్, దనువున నిపూఁడీఁ గకు, ఘనమైన నృసింహుబొందు గలుగఁగ బోలున్ వరన 5 175.

**మొనల్పడు.** అ. క్రి (√మొన) మొనలేర్పడు.

చం. కొనలు మొనల్పడఁ గొఱడు కోలవిదంబున దూయఁ జెక్కు చక్కని కుఱుమట్టపుం జి ఱుతకట్టియ నోరు కొసంగి కొట్ట నెత్తిన మునికాళ్ళ గోళ్లుపడిఁ ద్రెంచి తటాలునఁ గుక్కిపట్టెడం, గొని పువిఁ గట్టు పట్టి నృప కుంజరు చెంగట నొక్కఁ డుద్ధతిన్.

చంద్రా. 2. 95.

**మొనవ్రేలు.** వి. ఔ. (మొన+వ్రేలు) అంగుళ్య గ్రము, వ్రేలికొన.

తు. లలనాచిత్తము నొయ్య నొయ్య మొన వ్రేలన్ నేల వ్రాయించి ని,శ్చలవృత్తి న్వరవర్ణపూర్ణఫల కాపంగ బు నొందించి. నెయ్యంపు టొజ్జలు . వసు 3 100.

**మొలసెలవి** వి (మొన + సెలవి) సెలవి మొన, సృక్కాగ్ర భాగము

కం మొనసెలవి యెత్తి ప్రియయు నా,ననమున్ మూర్కొనుచు వట్టు నా కెడు వేళన్. . మనుచ. 6 78.

**మొన్న.** వి. ఔ (మొదలు+నాఁడు, క. మొన్నె)

1 కడచిన దినమునకు పూర్వదినము.

కం నిన్నన మొన్నన నావలి, మొన్ననఁ బ్రకృత తిథిముందు మూఁడు వరుసగా నెన్నఁగ సరివడి వచ్చును... ఆం భా. 1 92.

చం అవ విని యుత్తరుండు డగ నజ్జనపాలకు తోడ నిట్లను, న్మనకొక రాజ్యముం గలదె నన్నును నిన్నును నిన్న మొన్న వీ, రనితర సాధ్యశత్రు విజయంబునఁగాంచిన యప్డు గల్గఁ జేసినయది దక్క.. భార. విరా. 5. 349.

ఉ. అతఁడు మొన్న నున్నతమదాంధత దాడిగ నేఁగుదెంచి యా,పోతర మేమి చెప్ప వను బూఁతికిఁ గైకొన కప్సరో వధూ, వ్రాత నిశాత పాణిరుహవారి సలాలస నవ్యపల్లవ, బ్రై తనరారునందన మహావనిలో విడియించె సేన లన్. ప్రభా. 1. 72

2. అచిరభూతకాలము, కడచిన కొలఁది కాలము.

ఉ. వింటిరె తమ్ములార యొకవింత వినంబడె మొన్న యేమొ ము,క్కంటిఁ గవంగ నెల్ల తెఱగంటి దొరల్ మును లేఁగి ముక్కి మీ,బంటుల మమ్ము నొంచెదరు బాదలఁ బెట్టి సుకేశపుత్తు, లక్కంటకులన్ వధించి మముఁ గావఁగదే శివ యంచు వేడినన్.

ఉ. రా. 2. 4.

ఉ. అమ్మక చెల్ల యే మెఱుఁగ దారయ మొన్నటి చిన్నబాల యీ,యమ్మ... ఇందు. 2. 4

**మొప్ప** వి. ఒకవిధ మగు జలజంతువు. (గ్రా.)

జ. చేప మెడ కిరు ప్రక్కలనుండు ద్వారములు (శ. ర. .

మత్స్యాదుల శ్వాసకోశములు [బ్రౌ]

మొప్పె. విశే. మూర్ఖుఁడు.

ఆ ఎద్దుఁ దెలుప వచ్చు నేఁడాదికైనను, మౌని దెలుపవచ్చు మాసమందు, మొప్పెఁ దెలుప రాదు ముప్పదేండ్లకునైన... వేమన. 2. 88.

గీ. మణులుఁ గోకలుఁ గస్తూరి మలయజంబుఁ, గప్పురంబును హరియించు మొప్పె లెల్ల, నేకవింశతియుగము లనేక నరకముల వసించియుఁ గాకులై పుట్టుచుండు. శేష 4 25.

సీ అతతాయ బిగాది యడిగుండ బండఁడు మోఁడికట్టె గులాము మొప్పె గోపు... హంస 5. 117.

జ మొప్పెతనము.

మొప్పెతనము. వి (√మొప్పె.) మూర్ఖత.

కం. ముప్పది యాఱేండ్లది యుం, దెప్పుడు నొక్కరుని నెఱుఁగ దేలాగున నీ, విప్పుడు దిద్దుకొని యెదో, మొప్పెతనము మాన్పవే యముందు అవనిలో

చంద్ర వి. 2 106.

మొయి(యు)లు = మొగులు. (త. ముహిల్ — బ. మొయిలులు, మొయిళులు, మొయిళ్లు) మేఘము, మబ్బు

కం మాసె నభోమణి నక్కలు, గూసెం గలయంగ దెసలకుం బలుసాయల్, సేసెం బఱ మొయిళు లడరి, మ్రోసెం దమయంతిఁ దూర్యము లుపధ్వనులై. భార. విరా. 4. 86.

కం. ... హరియుం, గినిసి విశిఖంబు లేసిన, మొన పడె గగన బు మొయిలు మూఁగిన మాడ్కిన్... ఉ. హరి. 1. 147

గీ. ... మొయిలు మొగులు మబ్బన మేఘాఖ్య లగును ... ఆం. భా. 1 71.

మొర = మోర. వి. పశ్వాదులదీర్ఘముఖము.

సీ. కరమూలమున వెండి మొరవంక కడియంబు మూఁడు మూలల లింగ ముద్ర లొత్త... క్రీడా. 101.

మొరడు వి. మ్రోడు, స్థాణువు.

కం మతియ కళాకృషి బీజము, మతియె ధనఫలప్రదతరుమూలము తలఁపన్, మతియ చెలిమతియ చుట్టము. మతిహీనులు చూడ మొరడు-మ్రాఁకులు ధాత్రిన్... కేయూర 2 '24

సీ. మొరడు వంగిన సెట్టిమునకకు జవరాలి మోము గాననివాని ముకుర మయ్యె

వే పంచ 5. 165

(ఇట మొరుడువంటిది గావున నడుమును గౌణముగా 'మొరడు' అని కవి వాడియున్నాఁడు.]

మొరపము[1]. వి (√మొరయు) ధ్వని, మ్రోత

తే. .మొనసి మొలనూలి మువ్వల మొరపమమరె. . కు. సం 8 179

చం. . గడ్డమున గూఁడులు పెట్టిన పక్షికోటిపెన్, మొరప మెఱుంగ రెట్లు మునిముఖ్యుని యాతను వంచుఁ దాపసుల్ ..

వరాహ. 10. 68.

సీ. చరణంపు సరివణి మొరపంబు విన్న రంతుల కట్ల యెదురు నిఁతులకుఁ దొలఁగి...

అము. 9. 64.

మొరపము[2] వి. శర్కర, గులకఱాయి.

సీ, ...మొరప మనంగ శర్కర దనర్చు....

ఆం. భా. 2. 29.

(క్రొత్త. ప్రాఁత ప్రతిపా. మొరప యనఁగ ప్రాఁత ప్రతిపా.)

మొరము(ర్ము). వి. 1. శర్కర, గులకఱాయి,

ఆ. మొరపవాన పెల్లుగురిసె సులాకృతతి, డొల్లెఁ బడియెఁ బడుగు నెల్లకడల...

భార. ద్రో 3. 36.

సీ. మృదుశయ్యపై నున్న మెలఁతకా పల్లేరు ముండ్లు దట్టంబైన మొరప నేల...

ప్రభులిం. 2 64.

2. గరకైన చూర్ణము. [మొరుము అని వా.]

సీ అనువొంద నందంద యల్లార్చు బలుగద శత్రు

దేహంబులు చరిపి, చదిపి, చదలు మొఱ్ఱగఁ బరివ్రశక్తి శూలాదులఁ బఱపి పీనుఁగు లుర్వి నెఱపి నెఱపి... హరి. ఉ. 7. 17.
పిండిమొరుము, పసుపు మొరుము (వా).

**మొరయించె.** స. క్రి. (√మొరయు) 1. మ్రోగించు, ధ్వనింపఁజేయు.

ఉ. మొరయించున్ మరుఁడిక్షుచాప మలిశింజిను
దక్షవాటీ మహాపురమధ్యంబున ముజ్జగంబు
గెలువన్... భీమ 1. 69

కం. వెండియు రాముఁడు...సాం, బుండును శం
ఖంబు లప్పుడు మొరయించి రోగిన్..
చిత్రభా. 7. 67.

సీ. తరుణీమణి యొకర్తు తంబురా మొరయించ
వెలఁది యొక్కతె ముఖవీణె యూఁద...
వాల్మీ. 3. 125.

2. చాటించు.

సీ. మముఁ జొచ్చినా రెఱుంగుము సుమ్ము రిపులని
మొరయించుగతి మాఱుమ్రోసె గిరులు..
కవిక. 2 83.

మ. ... సిద్ధపురీశుపైఁ జమటకు న్మావహా...రి
కోత్తంసని,శ్చితవేశన్ మొరయింపఁ బంచు
టయు... విక్ర. 4. 49

**మొరయిక.** వి. (√మొరయు) మ్రోఁత.

కం. పదమా మొరయిక చెలియా,పద మాటికి నీకు
బ్రహ్మపదమా... రా వి 4 64

**మొరయు.** అ. క్రి. 1 మ్రోయు, ధ్వనించు.

మ. ...రత్నాలతాటంకముల్, మొరయు న్నూపు
రమేఖలా వలయముల్ మ్రోయంగ ..
హర 6. 117

మ. కురిసెన్ ఝల్లున నింగిమ్రాని విరిచిన్కుల్
దేవతాదుందుభుల్, మొరసెన్ ...
ఉ. హరిశ్చ. 4 89.

సీ. మొరయు మేఖలతోడి గురునితంబబింబు
మందయానమునకు వంద మొసఁగ—
ప్రబోధ. 1 71.

2. (పక్షులు మొ.) కూయు.

మ. కృకవాకుల్ మొరసెన్ గృహోపరిఁ బ్రథం
గన్ ఘోగ్ర క:ర ధ్వనిన్ ... మనుచ. 3.55.

మ. ..త్రిభంగిగా మొరసెఁ జెంతం దామ్ర
చూడామణుల్... వసు 4 126.

చం. పరువడి భేకముల్ మొరయఁ బ్రాగ్దిశనుండి
కడంగి తెమ్మెరల్, నెరయ..
శుక. 1. 166.

3. (ధ్వని) ప్రవర్తిల్లు, కలుగు

మ. మొరసెం దివ్యమృదంగనిస్వనము సమ్మో
దానుసంధాయి యై... 1. 180.

కం. కురిసె విరిసోనవానలు, దొరసె సుధాంధోవ
ధూమఘురగానంబుల్, మొరసె దివిఁ దూర్య
రవములు, విరిసె న్మనిని మానసారవిందము
లంతన్. రామా. 3. 117

జ : మొరయించు, మొరయిక.

**మొరళి.** వి. మోరటి, ప్రియాలము, ఒకానొక చెట్టు.

సీ. దినములోఁ గ్రొత్తయొత్తిన కజ్జవాది
ముక్కలు మురియని మొరళిపప్పు...
పి శకుం, 1. 98

**మొరసు.** వి 1. మొరము, గులకఱాయి.

చం. పరువు లిడంగ నాత్మ ఖురపాతములం గన
కాద్రి చెగటన్, గర మపరంజిరా మొరసు దట్ట
ఫనేలల చూర్ణితంబులై, ఖురశికలట్ల యాట
...కవిక. 2. 100.

సీ. మొరపనేల యనంగ మొరసునేల యనంగ
కర్కరిలాపనీసంజ్ఞ వెలయు...
ఆం. భా. 2 8.

2. కాఁపులలో నొకతెగ

గీ. పంట మోటాటి పెడగంటి పాకనాఁటి, యర
వెలమ లాదికొండారె మొరసుగోన, కొణిదఁ
కాపులు మొదలైనవారిఁ దనరు, కాఁపులకు
నెల్లి మిన్నయ యక్కాఁపు కొడుకు...హంస.
4. 166. (బ్రౌ. పా.)

విశే. మోటు. మూఢము.

గీ. మొరసు మోసు పిశాచి నా మూఢుఁ డొప్పు
ఆం. భా. 3. 8.

మొరిఁకె = మొంకె వి. బాలిక లాడుకొను చిన్నచేట.

కం. అమ్మరో రావే బంగరు, క్రొమ్మొరిఁకెను ముత్తియములు గొని తేవే... సమీర 2. 70.

సీ. చేట నా కూర్పంబు చెలఁగు మొంకె మొరిఁకె యనఁ బ్రహ్మకూర్మాఖ్య యలరుచుంతు... ఆం. భా. 2. 240.

మోఱ = మొట్ట వి. [క. మొఱె] ఆర్తధ్వని.

గీ. మొట్ట యన మొఱ యనఁగ వాపోక యనఁగఁ, గూయి వాఁ గూఁత నాఁగ నాక్రోశ మొప్పు ... ఆం భా. 1. 115.

కం. ఆ మొఱఁ వేమఱుఁ జెవి నిడి మనుచ 4. 67

గీ. ఏను మీచెలి నిం తేల యొరవు సేయ, ఎంత వారైన మొఱ యాలకింతు రకట, ప్రాణ సఖులరె కావరే ప్రాణ మిచ్చి, మమత విడువక మాన్పరే మధుపబాధ... పి శకుం. 2. 75. వరాహ. 8. 34.

జ. మొఱయిడు, మొఱవెట్టు, మొఱవైచు.

మోఱఁగు స. క్రి. 1. వంచించు, మోసగించు.

సీ. .. అనిమిషసంఘంబు నొక కారణమునఁ బావకుఁడు మోఱఁగి, అయరిగి తనదు గుప్తి యర్థించి గోవుల, నాశ్రయించె... భార. అను. 3. 101.

మ. కమలాభర్త భవద్విరోధిపయి చక్రంబుం బ్రయోగింప నుత్తమశస్త్రం బది యాత్మ నామ కళిదాదర్పాంధు నిన్నున్ మొఱంగి మహారాహువుఁ దున్మియుం దుమును కేఁగెం గాక చక్రంబు చేఁదుమురై పోవని వారలుం గలరె నీ దోషంబు గాదే శశీ. వసు. 4. 31.

కం. విను ముత్తమురాలుసుమీ, జనకాయక జనకతనయ సందేహపడం, బనిలేదు మాకుఁ దెల్లము, జనులకు మము మొఱఁగ రాదు సకలక్రియలన్. భార. అర. 7. 163.

ఆ. నీడఁ గడవఁ బాఱ నేఁకు వెలి గాఁగ, వడుగు వెట్టి తిరుగ నాత్మ మొఱఁగి, యొకటిఁ దలఁప వరుల కొదవిన నొదవ దేకరణి మృత్యుదేవిఁ గన్నుఁ గ్రాము.. మనుచ. 4. 106.

2. కప్పిపుచ్చు, మాటుపఱచు : పొంచు

గీ. పంచభూత సుధాకర భాస్కరాత్మ. రూప మగురూపు నీరూపు రుచిరరూప, మొఱఁగెదవె మాకు వ్రేళ్ళతో మొదలు చూచి, చెట్టెఱుఁగు వారి కాకులు చిదుమ నేల. ఉ. హరి 4 95.

సీ. లీలతో నా మొఱాలించఁడే మొఱఁగుల మొఱ లెఱుంగుచుఁ దన్ను మొఱఁగుఁవాడు భాగ 8. 87.

గీ. ఇంతదడవును నాయొద్ద నిచట నుండి, యరిగెఁ జదువంగ వని భర్త కతిన మొఱఁగు... కాశీ. 4 85.

వ. ...ఒక్కతరుషండంబు మఱుంగున మొఱంగి యేపునం దూపు సంధించి... రామా. 5. 313.

వి. 1. వంచన, మోసము.

ఉ .. ఓరి మెఱుంగుఁబోఁడులే, కెవడినైన వేఁడు దుర గాదె మొఱంగు లెఱుంగఁ గోరువా, రై వినరానిమాట లకటా మగవానికిఁ జెప్ప వచ్చునే... వెం. పంచ. 4. 466.

2. మోసపుఁబలుకు, వంచనావచనము.

గీ. ఈవు గోత్రాల వైయుండెదే కుమారుఁ, డుదయ మొందక పోవునో యువిదసుతుఁడు. కలిగినప్పుడు కోడలు కలదె నీకు, వమచునేరిమి మొఱఁగు లిట్లాడుటయును...వి. పు 6. 226.

విశే. మొఱవెట్టువాఁడు.

సీ. లీలతో నామొ ఱాలింపఁడే మొఱఁగుల మొఱ లెఱుంగుచుఁ దన్ను మొఱఁగు వాఁడు.. భాగ. 8. 87.

జ: మోఱఁగుడు.

మోఱఁగుడు. వి. (√మొఱఁగు) వంచన, మోసము

సీ....వంచన మెసంగు.

గీ. జడుఁగు క్రుక్కు కికురు పిక్కుజుఁణుఁగు మొఱఁగు, దనఁగ.... ఆం. భా. 292.

మొఱక. వి 1. మొక్క, మొన, వాఁడి.

కం విఱుగుట గానక నెరయం, దఱతఱకలు వాఱఁ గొంతదడ వది గోటికెన్, గోటికివ నొగులదు పగులదు, చిఱుమొఱకలు బోయెఁ నుల్లసిలె దంతంబుల్ ... వేం. పంచ. 4. 540.

2 న్యూనత, తక్కువతనము [శ. ర.]

విశే న్యూనము, తక్కువయైనది. [శ ర.]

మొఱకదము వి. [√మొఱకు] దౌష్ట్యము.

సీ....క సుని మొఱకదములు.

గీ తలఁపవచ్చినఁ జంపక తొలఁగు నెవ్వఁడు...
హరి. పూ. 9. 170.

మొఱకు (ర్కు) విశే. (సం. మూర్ఖః)

1. మూర్ఖుఁడు.

కం. వెఱఁ గంది శౌరి యిట్లనుఁ, దెఱవా మీతండ్రి నిట్లు దెగి చంపిన యా, మొఱకు శతధన్వు నిప్పుడ, వఱకెద మోమోట లేక నాచక్రము నన్. వి. పు. 6. 283.

మ. మొఱకై యెప్డుఁ బ్రచండకోపుఁ డగుచున్ బోనాడుభూభర్తకోఁ, కక్కరుఁ డాత్మీయుఁ డనం గలాఁడె... మల్ల. 1. 47.

గీ. పెద్దలెల్లఁ బ్రతిష్ఠించుపిదప లింగమూర్తి యగుఁ గాని శిలయను మొఱకు గలఁడె... చెన్న. 2. 175.

1. పరుషము.

ద్వి. మొఱకు వెండ్రుకలును ముదురు మీసములుఁ, గఱకుగల్లనిమేను గలచోరు నొకని... ద్వి. హరిశ్చ. ఉ. 2269పం.

3. క్రూరుఁడు.

సీ. అనుచు వాతాఱ పలికినయాగడంపు, ముచ్చటల కబ్బురం బంది మొఱకుతురక, కఱకుఁదన మూఁది... రంగా. 2 86.

వి. ఒకానొకయాటవికజాతి.

ఉ. పాయక వేరు వెల్లకియు...కానలో, నేయెడఁ దారయై పొలుచు నెర్కులు మొర్కులు నేక పాదులున్... కు. సం. 6. 692.

జ మొఱకదము మొఱకుఁదనము.

మొఱకుఁడు = మొఱకు. విశే మూర్ఖుఁడు.

కం ...తల్లిదండ్రులు, మునుకొని చెప్పఁగ వినియు మొఱకుడై వచ్చినపిదప నిల్వఁగను నం,గన వశమా చనినఁ జనియెఁగా కనువారన్
భో. రా. 6. 107.

అ ముఱికినాఁటివారు మొఱకులు గనవరు, లఱవ వారు ద్విజుల కాన పెద్ద యనుమ దేశభాషలను గుఱంబును దిట్టు, నతఁడు దండు వచ్చు శత పణములు. కళా. 2. 66.

గీ. దీని తెనియఁ ద్రావినమానవులకు. జరయు రుజ యును దప్పియుఁ జావుఁ గలుగ, దనఁగఁ గొందఱుబోయలు విని కడంగి, యుఱక మొఱకులై చఱిఁ బడ నుఱికిరపుడు.
భార. ఉద్యో. 2. 278.

మొఱకుఁదనము. వి. (√మొఱకు) మూర్ఖత.

కం. మొఱకుఁదనంబునఁ బెఱచెలిఁ జెఱఁగొని నీమనుఁ డుఱకఁ జెడఁ జాల్పడె రూ,పటి యని నలువకుఁ దెల్పఁగఁ. ఒఱచెననన్ మింట నంచ జారులు సనియెన్ అచ్చ. రా. కిష్కిం. 61.

వ. ... మొఱకుఁదనంబున మీఁది కుఱికి బెట్టుగాఁ బదఘట్టనంబులు వరగించురట్టడి దనుజులును...
ఉ. రా. 4. 291.

మొఱమొఱ. వి. (సం. మర్మరః) బట్టలు లోనగు వాని మ్రోఁత కనుకరణము.

ద్వి. మురువైనకుచ్చెల మొఱమొఱ మెఱయ
ద్వి. పరమ. 2. 56 పా.

జ; మొఱమొఱలాడు.

మొఱమొఱలాడు. అ. క్రి (మొఱమొఱలు + ఆడు) (వస్త్రములు మున్నగునవి) మొఱమొఱయని ధ్వని చేయు (శ. ర.).

మొఱయించు న. క్రి. (√మొఱయు) మ్రోగించు ధ్వనింపఁజేయు.

సీ. కెంజడల్ పైబ్రాలి కెంపు లీన విపంచి మొఱయించు నారదముని యనంగ... రా.వి. 3.9

గీ. నాకి మొఱయుంచి తెగలింద నాఁగ దిగివి
దశా. 7. 1. 206., వేం. మా. 3. 8.

మొఱయిక వి. (√మొఱయు) ధ్వని, మ్రోఁత.

సీ. మొఱయికనిడుతంతి మొఱయ నానందాబ్ధి
మునిఁగి కన్ఱెప్పలు మోడ్చి మోడ్చి ..
మల్లుపు. 2. 89.

(మొఱయికనిడు = మొఱయించు.)

మొఱయి(లి)డు. అ. క్రి. (మొఱ + ఇడు) ఆర్తనాదముచేయు, మొఱపెట్టు.

కం. ఏ యెడఁ బతిఁ బొడగానక, ... కూయిడు
మొఱయిడు... కు. సం. 5. 547.

కం. అఱవు లుడిగి పోపో నీ యఱచేతికిఁ బండ్లు
వచ్చినప్పుడు మమ్ముం, గఱచెదవు గాని తగు
నెడ, మొఱయిడు మది యెట్టిదైవములు విని
యెడినో. కళా. 3. 218.

గీ. అఱచె వాపోయె నేడ్చెను మొఱలిడె నవఁ
దవరు రోదనమును జేసె ననుట కాఖ్యలు...
ఆం. భా. 3. 84., దశా. 4. 84.

మొఱయు. అ. క్రి. ధ్వనించు.

సీ. మొఱయికనిడుతంతి మొఱయ నానందాబ్ధి
మునిఁగి కన్ఱెప్పలు మోడ్చి మోడ్చి...
మల్లుపు. 2. 89.

జః మొఱయించు, మొఱయిక.

మొఱవ విణ. వాఁడిచెడినది. (చూ. మొఱవపోవు.)

జః మొఱవపోవు

మొఱవపోవు అ. క్రి. (మొఱవ + పోవు) 1. వాఁడి చెడిన దగు, మొక్కపోవు.

సీ. మొఱవపోయెనో వక్రముఖనక్రహారమహాసం
పర్కనిర్వక్రచక్రధార... సిం. నార. 4.

2. క్షీణించు,

సీ. ముదిమి నింద్రియశక్తి మొఱవపోకుండంగమైథు
నక్రీడ యేమఱమి యుఱవు... కాశీ. 6. 83.

మొఱ(లు)పెట్టు. అ. క్రి. (మొఱ(లు) + పెట్టు) 1. ఆర్తనాదముచేయు, కూపెట్టు.

మత్తకోకిల. ఎంతయున్ మొఱపెట్టి వేగము
శీశ్వరా మము దేవతాహతచేఁ బడకుండఁ
బ్రోవవె యంచు.. దశా. 1. 273.

2. కష్టములు చెప్పికొను.

కం. వగఁ బొగులు దీనజనముల, ఖగగమనుఁడు
ప్రోవకున్న గతి యెవ్వరికిన్, మగువ విను
రాజు గొట్టఁగ, మొగసాలకు మొఱలుపెట్టు
మూఢులు గలరే... కుచేల. 1. 75.

3. పెద్దగా ధ్వనిచేయు.

వ. ... కనవుఁ గఱచి చేయెత్తి మొఱపెట్టుట
కరులయంద...

ఆము. 4. 157. (ఏనుఁగు పక్షమున.)

మొఱవైచు. అ. క్రి. (మొఱ + వైచు) మొఱపెట్టు, ఆర్తనాదముచేయు; పెద్ద ధ్వనిచేయు.

ఉ. ... సమస్త నిర్మాణ ధృతిప్రచారకరు మాధ
వునిం జెనకంగఁ బోవు గీర్వాణుల బోకుఁ
దంచు మొఱవైచెనో యన మ్రోసె వంత
నిస్సాణము పాకశాసనుహజారమువం గదనాభి
కంసిరై... పారి. 4. 83.

మొఱసడము. వి. ఉడుపకుక్క, ఉడుములు మున్నగువానిని వేఁటాడెడు శునకము.

ఆ. కాలుద్రవ్వి యునికిఁ గని కొమ్ముటుడుములఁ,
గఱచి తిగిచెఁ గొన్ని మొఱసడములు ...
చంద్ర. 2. 45.

కం. జాగిలములు మొఱసడములు, సాగెఁ గలిసి
చాపముక్తకరంగతి వంతా, జాగిలము లెదిరెఁ
బందుల్కై గోధాదికముగాలి కడరె నితర
ముల్... మనుచ. 4. 41.

మొఱి (కి) విణ. మొట్టి (శ. ర.).

మొఱుఁగు = మొఱువు. అ. క్రి. 1. (కుక్క) కూయు, అఱచు.

సీ. ... పెక్కు లయ్యుఁ గుక్క, లిభకుంభదళన
మహిష్ఠనిష్ఠురనఖముఖుఁ డగు హరి మీఁద
మొఱిఁగి యేమి, అ. పేయపోవు ...
భార. సభా. 2. 33.

చం ... దవుదవ్వులఁ గన్గొని సారమేయముల్,
మొఱుఁగఁగఁ బౌరబాలకులు మూఁకలు గట్టి
పిఱుంద రాఁగ. .తూఁగుచు వచ్చె నొ క ం డు
భిక్షుకున్ ..

భో. జరా. 3. 43., ఆం. భా. 1. 123.

2. ప్రేలు, ప్రలాపించు.

కం. మఱి శివుఁడు భక్తిఁ గొడుకుం, దఱిగిన చిఱు
తొండనంబిఁ దనవాఁ డనుఁగా, కెఱుఁగక
యేఁటికిఁ గారులు, మొఱఁగెడు నీ మంత్ర
తంత్రములు పేకొనునే... శివ. సా. 483.

వి 1 కుక్కకూఁత, భషణము (శ. ర.)

2 ప్రలాపము, ప్రేలుట.

(వ్యవ.) ఇంక నీ మొఱుఁగులు కట్టిపెట్టు.

జః మొఱుఁగుడు.

మొఱుఁగుడు. వి. (√మొఱుఁగు) కుక్క కూఁత' భషణము (శ. ర).

మొఱవు = మొఱుఁగు (శ. ర.).

మొఱో = మొఱ్ఱో. వి. (భయదుఃఖాములచే చేయు) ఆర్తధ్వనికి అనుకరణము

మ. పని లే దేఁటికి బాధపెట్టె దనున బ్రహ్మణ్య మైతో మొఱో, యని యుచ్చైర్ధ్వనిఁ గూఁత వెట్ట ముఖశాలాగ్రంబునన్ శ్రాద్ధదేవునిఁ గట్టించె ను వీరభద్రుడు .. కాశీ. 7. 89.

మొఱ్ఱ = మొఱ వి. ఆర్తధ్వని.

చం. తగవులు నిల్పఁ బాల్పడిన దైవము వక్కట
నీవు ముచ్చువై, మగువల మాత్రకున్ బయి
సిమాలిన నేరికిఁ జెప్పికొందు మి,జ్జగమున రాజు
గొట్ట మొగసాలకొ మొఱ్ఱ పవిత్ర కీర్తియన్,
బొగడికఁ గన్ననీవ తలపోసి యొఱుంగుట కాక
యచ్యుతా... పరమ. 4. 110.

గీ. మొఱ్ఱ యన మొఱ యనఁగ వాపోక యనఁ
గ,, గూయి వాఁ గూఁత నాఁగ న్నాక్రోశ
మొప్పు.. ఆం. భా. 1. 115.

మొఱ్ఱి వి. అంగన్యూనత.

(వ్యవ.) ఆ పెండ్లికొడుకునకు కొంచెము గ్రహణపు మొఱ్ఱి యున్నది.

సీ. మొఱ్ఱి న భిన్నత్వ మొనరును...

ఆం. భా. 2. 134.

విశే. 1 అవయవలోపము కలది, మొఱి.

(చూ. మొఱ్ఱిపోవు)

2. న్యూనము, (సందర్భాదుల) కొఱఁత కలది

వ. ... ఓరి నీవు నక్కఁ బెట్టిమొఱ్ఱి చేష్టలు చేసిన భంగము సుమీ యసిన మన బ్రతుకే వెట్టిమొఱ్ఱి యై యున్నది .. మృ. వి. 2. 82.

జ. మొఱ్ఱిపోవు.

మొఱ్ఱిపో(పోవు). అ. క్రి (మొఱ్ఱి + పోవు.) అవయవలోపము కలది యగు

(వ్యవ.) ఆ కుండ మొఱ్ఱిపోయినది.

మొఱ్ఱో. వి. (భయదుఃఖాములచేఁ జేయు) ఆర్తనాదమున కనుకరణము.

గీ. ఓడితేనియుఁ బట్టి మొఱ్ఱో యనంగ, లింగ మును గట్ట కుడుగము ... ఆము. 4. 60.

ద్వి. మొక్కలంబుగఁ గుయో మొఱ్ఱో యనంగ, బిగువు పగ్గంబుల బిర బిరఁ దెచ్చి, తగనంటఁ గట్టి రాస్థానంబునందు.

ద్వి. శ. సా. 3. 158. పం.

కం. అందునఁ జావక మిగిలిన, కొందఱు పఱతెంచి యసురకొల్వున మొఱ్ఱో, యందఱు మ్రింగెను దానవు, లందఱకును వీఁడు దారుణాంతకుఁ డనుచున్. మొ. రా. సుం. 132.

మొల.[1] వి. 1. చీల, కీలము.

సి. గఱి గావ నొడళుల విఱిగెడు వస్త్రముల్ బొలఁగు సంధుల కిచ్చు మొలలు గాఁగ...

కు సం. 11. 692.

(నక్షత్ర వర్ణనము.)

సీ. ఇనకరము క్రమై యిలఁబడు నభమని నలువ దాఁచిన వెండిమొల లనఁగ...

శివలీలా విలాసము కొమ్మన. 1.

గీ విత్తరవుగుల్వ తేఁపునఁ బెరుఁగు నంచు, పెంచి మును వల్వ మొదలను నినుపమొలలు, నించ నవి యంత నిలువక పెరయఁ బెరుఁగఁ, బోలఁతి నెఱిఁ గంచెల బిగించఁ బోలుఁ జమ్మి. అచ్చ. రా. అర. 24.

కం. అరపైకంబును జేయని, హరివాసరమునకునై నిజాత్మజుఁ దునుమన్, గరవాలుఁ జేతఁ బూనిన, కరణి యినుపమొలకు మేడఁ గాల్చుట సుమ్మీ. రుక్మాం. 5. 148.

2. త్రాసుముల్లు (చూ. మొలత్రాసు.)

జ. మొలత్రాసు

మొల² వి. 1. నడుము, కటిప్రదేశము

కం. తలుగులపోది యొకదెసఁ బె,య్యలదామెఁ యొక్కవలన జనువై యుఁడన్, మొలమోపి పెక్కుచుట్లన్, జలుద్రాటం జుట్టి గోపభావం బమరన్... భార. విరా. 1. 275.

చం. కలచివపీనుఁగు స్వేదఁదక స్పైరయున్ మొలఁ బచ్చితోళులున్... ఉ హరి 2 126.

గీ. వలదు కుక్కల విడువంగ వలన దేయ, వడిచి మొలపిడియమ్మునఁ బొడువ వచ్చు... మనుచ. 4. 20, ఆం. భా. 2. 136.

2. కట్టుబట్ట.

సీ. తల పీడ మొల పీడ నలుగడఁ బఱచినఁ బూరి గ్రసించినఁ బోవనీక... దశా. 6. 135,

జ. మొలకట్టు, మొలకత్తి, మొలగులికి, మొలత్రాడు, మొలపూస, మొలవఁకి, మొలవిడి.

మొలక(ల్క)=మొలవ మొక్క. (√మొలచు)

క. మొళకె. త ముళై,) 1 అంకురము, మొక్క.

సీ. మొలక మొలవ మొక్క ... మొటి కవంగ నంకుర మొప్పుచుండు... ఆం. భా. 2. 35.

సీ. తోరణమాలికాహిశాంకురచ్ఛాయ వె లఁ ది లేఁజిలువవ్వు మొలక గాఁగ... నైష. 6 82.

గీ. మొనలు చూపినముత్యాలమొలక లనఁగ, నొఱపు తోడుఁతఁ జెలిపలువరున దనరె... యయా. 4 58.

సీ. తనతల నెలమొల్క తళతళ జిగిగుల్క వెలయు ము త్తెపుతురాబెళుకు గాఁగ.. ఇం దు. 1 7. (నెలమొల్క=బాలచంద్రుఁడు)

ఉ. రా. 1 186,

2 అంకురితబీజము, మొలకెత్తినవిత్తు.

వ. ...చతురంహాలికుండు నల్లువరువఁపు మొలకల చెలువునఁ బెల్లుడుల్లు ఫల్గునాశుగసంఘాడనవ్రీ కీర్ణ శత్రుశేఖరవజ్రజంబులవలనను... భార. విరా 5. 6?.

3. మూలవ్యాధి, అర్శము.

సీ అ ర్శంబు మొలక యం చనఁగ వెలయు... ఆం. భా 2 198.

4. వ్రణమునందలి దుర్మాంస విశేషము (శ. ర.).

విణ. లేఁత, చిఱుత, చిన్న.

సీ. ఈరేడు భువనంబు లేలు సంపద చేడె మొలక చందురుఁ దాల్చు ముద్దరాలు.. భీమ 1. 4.

కం. మొలకలు రాజకుమారులు, తల్లిదండ్రులు లేనివారు దయకర్హులు భూ,తలమునఁ గల ప్రజ లందఱు, నొలిచిన నొలి నాడెదరు సుబోధను బాధన్... హై. భా. 1 68.

శా. జీవంజీవసుహృత్కళాధరుఁడు లక్ష్మీశేఖర త్వయుం దక్క న్యయ్యాశ్ర హాచంయమవంద్యు యిమ్మొలక ప్రాయంపున్నరుల్ నేర్తురే,యావి ళ్లెక్కడ... శామా. 4. 86.

సీ. పలుకఱగ నేర్తురు పాటలాధరముల మొల్క లేనగవులు ముద్దుగురియ... భీమ 1. 94.

మగమొల్క=పురుష శిశువు.

ఉ. ...నాదు సంపదకు దిక్కగుచున్ మగమొల్క నీ కిఁకన్, బుట్టునొ యంటమే నితవిపోఁడిమి గంటిమ... కళా. 4. 74.

మొలకకట్టు=మొక్కకట్టు. వ. క్రి. (మొలక +

కట్టు ) మళ్ళలో చల్లుటకై విత్తనములు మొల కెత్తుటకు తడిపి ముడియఁగట్టు.

గీ. అంఁరుదేనియ నానిచి మొలకకట్టి. శర్కరా బీజముల సుధాశాదభూమి, భావజుఁడు విత్త.. పాండు. 3. 191

**మొలకట్టు.** వి. (√మొల.$^2$) 1. మొలత్రాడు, కటసూత్రము.

ఆ. బంగరు మొలకట్టురంగు మీఱంగ నా,నాగ భోగ మద్రినడుమఁ జుట్టి ... దశా. 2 16,

సీ. వాలుగడ్డంబులు కేల జాడింపుచు మొలకట్ల గచ్చడంబులు చెరుపుచు.. చెన్న. 5 328

2. కట్టుకోక, అంతరీయము.

సీ. మొలకట్టు పాటుటాకులు జాఱకుండఁగ దీటి కట్టిన బలుశివకట్టు... చంద్రా. 2. 39.

(శ.ర. వ్రాఁతప్రతి పా. మొలఁగట్టు ముద్రి. పా.)

**మొలకకెంపు.** వి (మొలక + కెంపు.) రత్నాంకురము, లేఁత కెంపు,

ద్వి. మొలక కెంపులపిడి మొలవంకిఁ జెక్కి... రఘునా. 7 పా. 13 పం

**మొలకత్తి** వి. (మొల$^2$ + కత్తి) బాకు, మొలను చెక్కు కొనుకత్తి.

సీ. కిసలయాధరమేనిపసపుడాల్దుప్పటి కాసె నొప్పగు మొలకత్తి యమర...శశాం. 5 14

**మొలకబంగారు.** వి. (√ మొలక) పుట్టలలో పురుగులవలన కలుగు బంగారము. (శ. ర., బ్రౌ.)

**మొలకబేడలు** వి. బ (మొలక + బేడలు) నీట నానఁబెట్టి పొట్టు తీసిన కాయధాన్యముల దళములు.

సీ. శాల్యోదనంబులు సద్యోఘృతంబులు మొలక బేడల పప్పు మోదకములు, తలవంటకంబు లప్పళములు వడియంబు లతిరసంబు వడలామవడలు ... బ్రహ్మో. 3. 330.

**మొలక(కె)లెత్తు** అ. క్రి. (మొలకలు + ఎత్తు) కలుగు, అంకురించు.

ఆ. అట సుశీలమగఁడు నరుదెంచి యొకకొన్ని, దివసములకు దొరలఁ దిరియునానఁ, గోసి తన కులంబు వాసియు వన్నెయుఁ, దలఁచుకొనుచుఁ దెలివి మొలకలెత్త. పాండు. 4. 207.

గీ. మునిజనావంద కందముల్ మొలకలెత్త, రావణగ్రీష్మకృత ప్రథరాతలంబు, శైత్య మొందంగ .. దశా. 7 1. 18.

**మొలగ.** వి ఒక జాతిచెట్టు.

వ. ....వెఁగల మొలగల బీఱల గారల వేములఁ బ్రేముల.. పి శకుం. 2 14

**మొలగులికి.** వి. (మొల$^2$+కులికి) 1. సస్య విశేషము.

2. ఐ. ధాన్యవిశేషము (శ. ర.)

మొలకొలకి, మొలకొలుకులు (వా. శ. ర.)

**మొలచే(ల్చు).** అ. క్రి 1. (వృక్షాదిస్థావరాదికములు) పుట్టు, జనించు.

(క) వృక్షాది స్థావరములు

చం వలవదు రోయఁబాండవుల వారొక యూఱట లేని త్రిమ్మటన్, బలమటి వన్య సత్త్వముల పాల్పడి చచ్చినచోటఁ బూరియున్, మొలవదె ...శార. విరా. 3 95,

చ ... తొ,య్యలిహృదయాల వాలమునయందనురాగ లతా వితానముల్, మొలచె కెలిఁగి యంగజుఁడు మోహనబాణము నారిఁ గూర్చినన్. విక్ర. 4. 146. మనుచ. 2. 10

(చ) సంతోషాదిమనోధర్మములు.

కం తదనంతరంబ రాముఁడు, మొదలగు యాదవుల కెల్ల మోదము వెలఁగున్, మదిమొలవఁ జక్రధరుపై, వదలక వినువీథిఁ బుష్పవర్షము గురిసెన్. ఉ. హరి. 1, 122.

చం పొలఁతుక గంగచేరువ తపోవన భూములు

చూడ నీమదిన్, మొలచిన కౌతుకంబు దుగి
ముట్టఁగ లక్ష్మణదేవు నిన్ను నం,దులకు మనో
ముదం బెసఁగఁ దోకొనిపో నియమించితిన్...
నిర్వ. 8 132.

సీ. చూర్ణాలకంబుల స్రుక్కుఁ జక్కఁగఁ దీర్చి
నలువు నెమ్మోమునలో మొలవఁ బెట్టు...
నైష 7. 172.

(ట) మానవాది జంగములు.

చ. చలువవెలుంగు వేల్పుల రసాయనపుం దొన
పొలవెల్లిలో, మొలచిన ముద్దుపంటఁడు కుము
ద్వతి వేడుక కాఁడు తమ్మిలోఁ, గిలి గల చంద్ర
బింబముఖికిన్ సయిదోడు చకోర భోజనం,బుల
నెఱదాత చందురుఁడు పూర్వదిశాస్థలి నొప్పె
నయ్యెడన్. కవిరా. 5. 180.

శా. పుట్టం బుట్ట శరంబునన్ మొలవ నంభో
యాన పాత్ర బునన్, నెట్టం గల్గను గాశఁ
గొల్వను బురాణింపన్ దొరంకొంటి..
భాగ. 1. 7.

సీ తమ్మిఁ జాల్చినవానిఁ దమ్మి దొల్చినవానిఁ
దమ్మి మొల్చినవాని, దాంసించు...
నరస. 1 64.

2 ఆవిర్భవించు, ప్రత్యక్షమగు.

కం. అచ్చుతురాననమూన్నుం, డచ్చటఁ దా నపుడు
మొలచి యాశీర్వాదం, బిచ్చెనె యింద్రుఁడు
మెఱుఁగులు, దెచ్చెఁగదా ప్రాయమునకు దీవన
ననివన్.... కకు. 3. 45.

3. ప్రాప్తించు, సంభవించు.

మ ... ఇపుడు కళ్యాకుల్య ప్రసాదంబుచే, మొల
చెన్ గర్భము నాగమూరమణి కాముగ్ధన్ విచా
రింప నే,తలపుం జెంద నెఱుంగనట్టి యఖలం
దప్పెంచుచే తప్పగున్... చెన్న. 1. 202

ద్వి మొలచెఁ గాళ్లను రెండు మును గురుభక్తి.
పండితా. పురా. 109 పొ.

కం. అలుకయు మదమును గర్వము, నొలుకు
నకారణవిరోధ మొందుజనులచెయ్యుల కెక్కు

దైనయాపద, మొలచేను మదుబిందుకళహా
ములచందమునన్.. కేయూర. 2. 109.

జ: మొలక, మొలకకట్టు, మొలకకెంపు, మొలక
బంగారు, మొలకబేడలు, మొలకలెత్తు, మొల
తెంచు, మొలవబెట్టు, మొలవేయు.

మొలతెంచు. అ. క్రి. (మొలచు + తెంచు
స్వార్థమున) కలుగు, పుట్టు.

కం. మునివర నాదగుచిత్తం,బునఁ గౌతూహలము
సాల మొలతెంచి తలి,ర్పున నెలరారెడు..
శార. అను 4. 447

కం. ఏనుఁగు జేయుకెలం గెద,లో నాలోకించి
ధర్మలోభము ధర్మ,గ్లాని కర మయ్యె నని
య,జ్ఞాననఁ బొందుటకు సంశయము మొల
తేరన్. దశకు 592.

సీ తరణికూటమున మే యురలి పద్మిని మేన
మొలతెంచు మధుమద మొలుకకుండ...

గీ. గిరిజ పూజించెఁ బసిఁడితామరల వరదు...
కు. సం 3 351.

మొలత్రాడు. వి. దే. (మొల$^2$ + త్రాడు) కటి
సూత్రము, మొలకు కట్టుకొనుత్రాడు.

సీ. ముందటిది క్రూడి మొలత్రాటఁ దవిలిన
తోఁకగోఁచులవెంటఁ దూలువారు...
ఉ. హరి 1. 102.

గీ. జమిలి మొలత్రాట నిను కచ్చడ మమర్చి....
విక్ర. 2. 97.

ద్వి. ముప్పిరి యగుదొడ్డ మొలత్రాడుగట్టి...
పండితా. పురా. 100 పొ

మొలత్రాసు, వి. (మొల$^1$ + త్రాసు) ముల్లు గల
త్రాసు.

చం. ధమనియు త్రావణంబు మొలత్రాసును
బట్టెట నీరుకారు శా,ణము పటకారు మూస
బలు నాణెపరీక్షలమచ్చు లాదిగా, నమరగ భద్ర
కారక సమాహ్వయుఁ డొండొకఁడుండు
నప్పురిన్... హంస. 2, 181.

మొలనూలు వి. ఔ (మొల$^2$ + నూలు, స్త్రీలు అలంకారార్థము ధరించెడు కటిసూత్రము, రశన

సీ .. మొలనూలిమువ్వల(మోఁత నిగుడ
విక్ర. 8 39

సీ. ధాత్రీమహాదేవి తాల్చినమున్నీటి మొలనూలి రత్నాలవుమొగ పనంగ... ప్ర.భా. 1. 54.

సీ. ముత్యాలపేరులు మొలనూళ్ళు .
ధనా. 2 57, ఆం భా. 2. 150

మొలపించు. స క్రి (√మొలచు) మొలచునట్లు చేయు

ఉ ఏ యెడ నెన్నఁడున్ గననియింపును గుల్కెడు తద్గళస్వనం, బాయతమైనకాతుకము నద్భుతమున్ మొలపింప... క.భా. 1. 92

సీ కండచక్కెరదీవి దండకెంపులరీవి మొలపించు చెంగావి మోవిదాని... ఉ. రా 2. 266.

మొలపూస వి (మొల$^2$ + పూస) మొలత్రాటి యందుఁ గట్టెడిపూస, బాలుర కటిసూత్రమువందు గ్రుచ్చుబంగారు మొదలగువానిఘుటిక.

గీ. ఘోరవాలంబు దలపోయ మేరు వయ్యె, భూరితారావళులు మొలపూస లయ్యెఁ, గమలినీనాయకుఁడు బొడ్డుఘంట మయ్యె, ననుచు రాఘవునకుఁ దోఁచె నట్టివేళ.
సీతావి. 2 150

మొలవ వి. అంకురము.

సీ. మొలక మొలవ మొక్క మోక మోసీరిక మొటిక నా నంకురం బొప్పుచుండు...
ఆం. భా 2. 55.

మొలవంకి. వి. (మొల$^2$+వంకి) మొలలో చెక్కుకొను కత్తి.

సీ. మొలవంకికొద్ది బెబ్బులిని గెల్చిననాఁడు గలిగె నీ ముంజేతి గవ్వదండ... చంద్రా. 2. 57.

చం. అసి మొలవంకి డుస్సి సమరార్భటిఁ జావడి క్రిందికిన్ గుభాలున దుముకన్...
అహ. 1. 104.

మొలవఁబెట్టు. స. క్రి. (మొలవన్ + పెట్టు) నాఁటు.

సీ. ఈ నీఁజానన చాన కుదురుచేసి వలయు బీజము లెల్ల మొలవఁబెట్టె... కు. సం. 7. 850

మొలవిడి. వి. (√మొల$^2$) పశురోగవిశేషము.

ద్వి. మొలవిడి నెలతెవుల్ ముకుబంతి కవట, తలయేరు తొడకు వాతము కల్ల వాపు, ... అదిగానెన్నఁ, గలపసరాలరోగములకు నెల్ల...
నవ. 1. 41 పా. 3 వం

మొలవేయు. స. క్రి (మొలక+వేయు) నాఁటు, కాకరగింజలు మొలవేసితిని. (శ. ర )

(వ్యవ) చింతగింజ మొలవేసినాఁడు = చాలకాలము నివసింప సంకల్పించినాఁ డనుట.

మొలాజేమతు వి. (హిం. ములాజిమిత్) ఆశ్రయించుట.

శా. రంగారాయఁడు మా మొలాజెమతుకై రా కేఁటికిం జిక్కె ... రంగా. 2. 89.

ఉ. ... మీ,యాదరణన్ మొలాజుమతుకై చనుదేరఁ దలంచినాఁడు స,మోదముచేత రమ్మనెడి ముఖ్యముగాఁ దమకౌలు వచ్చినన్...
రంగా. 2. 167.

మొలాము = మలాము, మొల్లాము, మోలము, మోళము వి. (హిం. ములమ్మా) 1. బంగారు, వెండిమొ. వానిపూఁత (శ. ర.).

2. పుండ్లకు పూసెడిమందు (శ. ర.)

మొలుగు(ల్గు) = మోలుగు. వి. వృక్ష విశేషము.

సీ. జువ్వి మామిడి జీడి నురుగుడు మొలుగు పాపట చంద్ర పసిరిక పాల రేల...
వేం. పంచ. 4. 522.

సీ. గరుగుకాయయు మొల్గుకాయ యందుగుకాయ లుసిరికెకాయలు మస్తెకాయ,

గీ.ఆది, యైన యూరుఁగాయలు గల వతనియింట,
హంస; 4. 185.

ఆ. పక్కి వేళ్లపిట్ట పరగంగ వెణుతుతు వేరివట్ట,

మిఠెము వెల్లులియును, నూరి నీళ్ళఁ ద్రావి నూనెయు మొలగాకు, రసము గొనఁగ నెలుక విసము లడఁగు. (చికి. చి. ని.)

**మొల్ల** వి. కుందలత, బొడ్డుమల్లె (వృ. వి.)
1. బొడ్డుమల్లెపూవు.

సీ. మొల్ల యనఁ గుందము చెలంగను
ఆం భా 2. 52.

సీ. సన్నజాజులు నురిపొన్నలు గలిగొట్లు మల్లెలు సంపెఁగెల్ మొల్లవిరులు.. ఉ. రా. 3 201

చం ...దృక్తరళకాంతులు నుత్తరమిచ్చు వంత రాం, తరముల నవ్వులుం గలువతండము మొల్లలు నంచు ఆము. 2. 20.
పారి. 3. 51.

జః మొల్లమ్రాను, మొల్లసుగంధి

**మొల్లమి¹ = మొల్ల¹ము.** వి 1. సాంద్రత, తఱచు

ఉ వాల్లకముల్ సనిద్రకములై పొరలన్ జలజాత జాలముల్, మొల్లమి నుల్లసిల్లఁ దమముల్ దమముందటిచోటి కేఁగఁగా, బల్లునఁ దెల్లవారె సమభల్లరణార్థిఁ గుండె ఝల్లనన్.
రా వి 1. 78.

వ. అవిరళదళకిసలయవిలసితలతావితానంబులు మరకతకురువిందనిచయఖచితంబులగు నగతులపగిదిఁ జూపట్ట నమకట్టు జల్లుల మొల్లమి నుల్లసిల్లుచు .. కళా 6 224.

2 వర్గము, గుంపు.

కం. చల్లని కమ్మఁదెమ్మెరలఁ, జల్లెడు ననుకూల పవనసంతతు లెసఁగన్, మొల్లమి గని యష్టమది, గ్వల్లభు నాఁబోతు అంకెవైచె నిమ్మంటన్.
రామా 7. 165

గీ. తుటుము మొల్లము మొల్లమి తుట్టె వర్గ, మనఁగ వర్గము తగు... ఆం. భా. 2. 100.

విశే సాంద్రము, దట్టమైనది, తఱచైనది.

కం. మొల్లల వైచినలక్ష్మి, వల్లభసుతుఁ గాల్పవే యవారితవృత్తిన్, మొల్లమిగ జాల వైచిన, యల్లగణాధిపున కిదె యపవర్గ మజా.
శివ సా 449.

వ .. మొల్లమిగ నంతకంతకు దిగంతంబులు దంతంబును దిరిచిన యుడుపులంబోలె దీంద్రింప.. మనుచ. 6 28.

**మొల్లమి² = మొల్ల²ము** వి. ధనము.

కం అని యిట్లు పలికి మంతన, మున కాతనిఁ బిలిచి మీరు మొల్లమి గలవా, రని కంసుఁ డెఱిఁగి యుండును, జన దిచ్చట నుండ నొండు చాయకుఁ జనుఁడీ. వి పు 7. 103.

గీ తల్లులను దండ్రియును దాము మొల్లమి గని, మెల్ల సంతోషములఁ జెంది యుల్లసిలఁగ.
దశా 8. 28.

**మొల్ల¹ము = మొల్ల¹మి.** వి. 1 మొత్తము, గుంపు

...ధరం బన నెద్ది పొలపంబు పుట్టించు నిల్లాలి మెఱుఁగుఁ మొల్లములకు.. పాండు. 5. 261.

గీ తుటుము మొల్లము మొల్లమి తుట్టె వర్గ, మనఁగ వర్గము తగు.. ఆం భా. 2. 100.

రగడ. చాలు చాలు నీసంపెఁగ మొల్లము, జాల కంటెవే పాదరి మొల్లము... కువల. 3 127.

2 తఱచు, సాంద్రత

వ.. కొండగోఁటియమఱుగుడుబొందుంకు నందడించుకంకగృధ్రావళుల మొల్లంబుల మునుంగు పడు పల్లంబులును. మనుచ 4 37.

3 పెంపు, అతిశయము

ఉ. పెల్లుగ గుబ్బచన్నవలు పెంపెసలారఁ గడింది వేడుకల్, మొల్లము మీఱఁ గ్రొత్త తెలిముత్తియపున్ రతనంపు సేసబ్రాల్, చల్లుచుఁ జేరటాండ్రు ధవళంబులు పాడిరి కొందఱయ్యెడన్... రసిక. 6. 200.

వ.. అల్లంబు మొల్లంబును... కాశీ 7. 165.

విశే. 1 సాంద్రము, దట్టమైనది.

ఉ. మొల్లపు మొల్లపూఁ బొదల మొగ్గల వగ్గలమైనతీవలం, దల్లనఁ జల్లనై యొలయు

నందపు గంధవుఁ గొండ గాడ్పుచే, నల్లిక బిల్లి కన్ దనరు నామిడిమామిడిక్రింద భూమిభృ, త్తల్లజుఁ డల్లజాలరివిధంబునఁ బొంచి హరించె డెందమున్... కృ శకుం. 2. 220.

ఉ ఇల్లోక పట్టునం గడచి యేఁగఁగ నేరని చుంచు కుట్టులన్, మొల్లపుఁగాటు కోవలకు మున్న రకం గొనిపోవఁ జూతురే ... అచ్చ. రా బాల. 104.

2. అధికము, హెచ్చు.

శా. ...బ్రహ్మాండ భాండంబు భే,దిల్లన్ బెట్టుగ నార్చి పేర్చి గ్రహణయోద్వృత్తాంతకాకారుఁడై, మొల్లం బైన బలఁబులం బొలిచె సమ్మూర్ఛ్య త్రవ్వతాపంబునన్.. భా. రా. యు 1. 374.

గీ మొల్ల మగుకీర్తివాఁ డేఁడి మొల్లలార, శుక నిగదితునిఁ జెపుఁడు కింశుకములార. భాగ. 10. పూ. 1015.

ఉ. ఎల్లవిధంబులన్ వినుతికెక్కిన యీవ్వపు కూర్మి పత్నినై, మొల్లము లైన సంపదలు మోచి వెలుంగుచు నున్న నాకు నీ,తల్లి సపత్ని నౌదు వని తాఁ బలుమాఱును వచ్చి నాకడం, బ్రల్లదముల్ వచించు నది పల్కులు నే వినఁ జాల నెన్నఁడున్... వి. పు. 2. 12.

మొల్ల²ము = మొల్ల²మి. వి (సం. మూల్య మ్) ధనము.

ఉ. ఎల్లధనంబు నోటుపడి తిందుకులేశ్వర యింక నొడ్డఁగా, మొల్లము నాకుఁ జూపుమని ముందట సారెలు ద్రోచి యాడఁగా, నొల్లక యున్న సౌబలునకు. . భార. సభా. 2. 194.

కం. నాయింటి మొల్లమునకును, నా యొడలికిఁ బ్రాణములకు నావారికిఁదా, నాయిక యై . దశకు. 5. 55.

ద్వి. తనమొల్ల మంతయుఁ దత్కారణమున, సము యుడు బస. పు. 4. 397.

మొల్లమ్రాను వి (మొల్ల + మ్రాను) వృక్షవిశేషము.

సీ. ... మొక్కవు కొక్కెన మొల్లమ్రాను ..
గీ. మొదలుగాఁ గల్గు బహువిధభూరుహములు. హంస. 4. 11.

మొల్లసుగంధి. వి. విశ (√మొల్ల) మొల్ల పూవు వంటి పరిమళము గలది

ఉ మొల్లసుగంధి నామమను మోహము నాఁటి వెట్టి నీవు న,న్నొల్లక వీడనాడెద వయోతగవా వి. పు 2. 263.

మొల్లా వి. (హిం. ముల్లా) మహమ్మదీయ పురోహితు లుచ్చరించు మంత్ర విశేషము

మ. . .పై కారవం,బుల మొల్లా పరియించుచున్ మధుజలంబుల్ జల్లి వేగాడ్పు భా,నులచేఁ జైత్రపు సైదుజీర్ణదళ వహ్నుల్ గంటె త్రొక్కింపఁగన్... చంద్రా. 4. 208.

మొల్లాము = మొలాము.

ద్వి పసిఁడి మొల్లాము గుబ్బల కవాటములు. ద్వి. పరమ. 3. 146.

మొవము = మొగము. వి.

సీ. మొవముత కెగయు చన్గవపైని నునుమోవి తళుకుఁ గుంకుమ పసంతములు చల్ల ... దశా. 2. 273

మొవలి. వి. మొగలి. (వ్య.వి.) వి. శా. శ. 1024

మొవు = మొవ్వ వి. మోవు.

ఉ. నాసిక పేరురిమవ్వపుటవంటికిఁ బై బొమలాశ లయ్యె ను,ల్లాసము చూపుతేత మొవు లాగ మెయిం దిలకంబు గల్గెడున్ ... కవిక. 6. 209

మొవుదు = మొగుడు. అ క్రి. ముకుళించు.

కం. కవిసర్ప గారుడం బను, కవితా లతు మొనర్చి గర్వితమద దుష్కవి సర్పంబు మొగములు, మొవిడించి కలంచి ముంచ మదుగ నేర్తున్... కవిస.

మొవ్వి. వి. ఒకానొకచెట్టు.

బొలియక చిక్కిన యుతియ బంట్లు, పఱచి
తొలివేల్పు జేని క త్తెఱఁగు దెలుప...
అచ్చ. రా. సుం. 101.

మొసలిపట్టు. వి. (√మొసలి) మకరాలయము, సముద్రము.

కం. పంతమునఁ బ్రొద్దుపస యుక్కిగింతుమొ సత
మొసలిపట్లఁ గినుక నిగుడ నిం,కింతుమొ...
అచ్చ. రా. యు. 16.

మొసలిపోగులు. వి. బ. (√మొసలి) మకరకుండలములు.

సీ. మొసలిపోఁగుల నిగ్గుటొ సపరిసాము కూటము
లైన చెక్కుటద్దములవాని ...
చం. రా. 2. 5.

మొసలిరాసి. వి. (మొసలి) మకరరాశి. (చి. ని., శ. ర.)

మొసలివా(యి) వి. (మొసలి మోముకూపముగల కత్తిపిడికొన, మొసలికాటు,

మ. ... జాళువా మొసలివా దీప్తార్చి గాఁగజ్జలా,
న్వితధూమాసితరేఖ పైయలుఁగుగా విజ్ఞాన
దీపాంకురా,కృతి నందంబగు వందకం బఘులతా
శ్రేణిచ్ఛిదంజేయుశన్. ఆము. 1. 6. ఆం. భా. 216.

మొసలివాతమ్మంట్లు. వి. బ. (మొసలి + వాయి + తమ్మంట్లు) మకరకుండలములు, మొసలిమోము చెక్కిన కర్ణాభరణ విశేషము.

సీ. మిసమిసల్ నిడిగించు మొసలివాతమ్మంట్లు నొక
కేలఁ బద్మంబు నొకట గదయు ...
విప్ర. 5. 65.

మొసలివాపోగులు. వి. బ. (మొసలి + వాయి + పోఁగులు) మకర కుండలములు.

గీ. మొసలివాపోఁగు లింపెసఁగ వీనులఁ బెట్టి తలలి
హొంబొమిడిః ల్ దనర నిల్పి ...
అచ్చ. రా. సుం. 34.

మొసలివాయొంట్లు. వి. బ. (మొసలి + వాయి + ఒంట్లు) మకరకుండలములు.

సీ. మొసలివాయొంట్ల కెంపుల కెంపు ద్యుకోట్ల
సంకర్తరుచులతో సంధి సేయ ...
ఉ రా 280

మొసలిసొమ్ములు. వి. బ. (మొసలి + సొమ్ములు) మకర కుండలములు.

ద్వి. ముద్దుల మొసలి సొమ్ముల చకచకలు, తద్ద
యుఁ జెక్కుటద్దముల నర్తింప...
ద్వి. పరమ. 2. 122 పా.

మొహదా. వి. అడ్డకత్తి, పట్టిసము

సీ. మిహిపసిండి పరుంజు మొహదా కెలంకుల తావు
గుజ్జరి నేఁత కేవడంబు... మనుచ. 4. 28.

సీ. పట్టిసతామము ల్పట్టె మన మొహదా యన
నడ్డకత్తి నా నలరుచుండు ...
ఆం భా. 2. 215.

మొహరి(రీ). వి. (హిం. మొహర్) ముప్పది చిన్నముల యెత్తు బంగారు నాణెము.

(వ్యవ.) పూర్వకాలమున ధనికులు మొహరీల పేర్ల నెక్కువగా ధరించెడివారు

మొహరు. వి. (హిం. ముహర్) ముద్ర.

గీ. మీఁగాళ్ళపైఁ బింజె జాగైనదోవతుల్ జిగి
తరంబైన పార్షి మొహర్లు... వేణు. 59.

మొహళము. వి. ఒకవిధమగు కూరాకుచెట్టు (శ.ర.).

## మో

మోఁకతి(రి)ంచు = మోఁకారించు. అ. క్రి. (√మోఁకాలు) మోఁకాళ్లు నేలకానువట్లు ముందఱికొఱగు.

గీ. మ్రొక్కమైతిమి భవుఁ డని మోఁకతించి...
కాశీ. 4. 110.

వ. వాఁడు భయభక్తితాత్పర్యంబులతోడ మోఁక
తించి వరంబులు నేల నూఁది నమస్కరించి...
వి. పు. 7, 381

మోఁకతి(రి)ంచుకొను. అ. క్రి. (మోఁకతించు +

కొను=స్వార్థమున` మోఁకాళ్లు నేల కానునటు ముందఱి కొఱగు

వ ... ఘోటకంబు వెగ్గలంబుగ మ్రొగ్గియు నగ్గలిక చెడక మోఁకటించుకొని ...

మను చ. 4 115.

మోఁకటిల(ల్ల)ఁబడు. అ క్రి, (మోఁకటిల్లన్ + పడు స్వార్థమున) మోఁకటించు, మోఁకాళ్లు నేల కానునట్లు ముందఱి కొఱగు.

సీ. ఆర్చి యొకవంక సాత్యకి యడ్డగింప, వాసుదేవుండు వఱవంక వచ్చి యుఱుము, వ్రేయు నవ్వీరుఁ డచ్చోట వ్రేసెఁ దత్తఱిచి పౌండ్రుఁడు ధర మోఁకటిల్లఁబడియె

ఉ. హరి. 2. 65.

వ. అమ్మేదినీపతి పార్శ్వభాగంబు బెట్టడఁచిన మోఁకటిలంబడియును . .

భార. శల్య 2 267

*శ. ర. పా 'మ్రోఁకరిలంబడియును' ము॥ద్రి. పా

శ్లో. స విహ్వలః ప్రహారేణ జానుభ్యా మగమన్మహీమ్ సం. భార. శల్య. 58 56

కం వీఁక సెడి ఘనగదాహతిఁ, దోఁకయుఁ గదలింపలేక దుస్సహపీడన్, మోఁకటిలఁబడియె నేలను, సోఁకోర్వక దిగ్గజంబు సుడిసుడిగొంచున్. భాగ 3. 561

మోఁకటి ( రి ) ల్లు ( లు ) = మోఁకటించే. అ క్రి. (√మోఁకాలు) మోఁకాళ్ళు నేలమీఁద నానునట్లు ముందున కొఱగు.

చం. వన మటి మోఁకటిల్లి రథవాజులు మాఁటిము దప్పి నిల్చినన్. భాగ. 10. ఉ 1105.

మోఁకారించు = మోఁకటించే. అ. క్రి మోఁకాళ్లు నేల కానునట్లు ముందఱి కొఱగు.

కం, ఒకచేతఁ బట్టి తివిసిన, నొకయింతయుఁ గదలకున్న నొగి మోఁకారించుక బలిమి రెండు చేతులఁ, బెకలింపఁగఁ బూమటయును భేదిలకున్నన్. కా 4. 73.

కం. పుడమిన్ మోఁకారించిన, వడితోఁ జేయూఁది శ్రీనివాసయగారే, యడిదే వని యొండొరులుఁ, బడి దయగాం ద్రసలు పెంటప ట్టన కచటన్ . . పాంచా. 1. 782.

మోఁకాలు వి. ఔ. (మోఁదు + కాలు. మోఁద + కాలు శ. ర క. మొణకాలు) జానువు. (బ మోఁకాలులు, మోఁకాళులు, మోఁకాళ్లు )

గీ ... వచ్చినట్లు, మూర్ఛవోయి మోఁకాళులు మోవఁబడియె... భార. ద్రో 4. 45

కం శిర సుండఁగ మోఁకాలను సేసలు వెట్టుట, శీలతనము గాక మీకుఁ బెద్దఱికంబే. .

ఉ. హరి. 1 96.

గీ. ... గాడుపుకుట్టుఁ డవ్వాలునడుమఁ, బట్టుకొని సన్న మోఁకాలఁ బెట్టి విఱిచె ...

అచ్చ. రా. యు. 242.

ద్వి మోఁకాళ్ళ మోచేత ముష్టి వందంద, దాఁకి చిపడఁదీసి తలలు ద్రొక్కించు ...

రం. రా యు. (చి ని.)

గీ ముడుము మోఁకాలు నాఁగఁ జెన్నడరు జాను.

ఆ. భా. 2 165.

(శ్రీ) రా మోఁకా లొడ్డుట = ఐశ్వర్యము కలుగుచుండ వారింప నెంచుట.

కం. కౌరవనాయక పాండుకుమారులు నీతోడి పొత్తు మనియెద మనఁగా, (శ్రీ) రా మోఁకా లొడ్డిన, వాంఛిధముకాదనీవు వల దనుకెల్లన్.

భార. ఉద్యో. 3 348.

ఐ మోఁకటించు, మోఁకటించుకొను, మోఁకటిల్లఁబడు, మోఁకటిల్లు

మోఁచెయ్యి(యి)మోఁచేయి వి మోఁదు + చెయ్యి మోఁద + చెయ్యి. శ ర ) కూర్పరము.

ద్వి అణుమూర్తియను భక్తుఁడతఁడు మోఁచెయ్యి, గణనాథ పావపైఁ గదియించి తివియ...

పండితా. పురా. 125 పా.

సీ. కూర్పరంబు మోఁచెయ్యి నా ...

ఆం. భా. 2. 198.

**మోఁచేతిమ (డుపు) డ్పుటిల్లు** వి (మో చేయి + మడుపు + ఇల్లు) మోఁచేతిమడుపువలె కట్టిన కట్టడము

(రెండిండ్లు కలిపి కట్టిన కట్టడము. శ. ర.)

**మోఁచేయి = మోఁచెయ్యి** వి లౌ (మోడు + చేయి. మోఁడ + చేయి శ. ర.) కూర్పరము.

గీ. చిత్తజలజంబులో నున్న శివుని వీడి, వెలి నవసి యుంచువేల్పు సేవించు టెల్లఁ, జాణి నున్నట్టి కబళంబుఁ జాఱవైచి, కడఁగి మోఁచేయి నాకుట గాదె దెలియ .. శివధ. 2 118

వ. వరాంతకారులపైఁ బడి మడఁగి రెండుమోఁ చేతుల పోటుల. ప్రబంధ 7౦.

ద్వి. మోఁచేతఁ బగులంగ మొగములు బొడిచి. పూఁచిన శస్త్రాస్త్రములు పొడిచేసి ౦౦. రా. యు (చి ని)

**మోఁత** వి (√మోయు) 1. మోయుట, వహించుట

ఆ. పుస్తకములు జడలు పులితోలు చర్మంబు, కఱ పాలు వదిలఘ లైన, మోఁతచేటె గాని మోక్షంబు లేదయా... వేమ 8 196

2. బరువు, భారము (శ. ర.).

**మోఁద.** వి. (√మోఁదు) మోఁదుచేత కట్టిన నెత్తురు గడ్డ (శ ర).

**మోఁదకట్టు.** అ క్రి. (మోఁదు + కట్టు) మోఁదు చేత నెత్తురుగడ్డకట్టు. (శ. ర.)

**మోఁదు** స క్రి. కొట్టు, ప్రహరించు

గీ. .. కోపించి మెఱసిన ప్రతిభటాలి, మీఁద గవిసి తుంగలఁగొని మోది నిరవ, శేషముగఁ జేసె భార. మౌ. 1. 61.

కం రాఁ దిగుచు నెగుచు వగుచుం, బోఁ దట్టుం బట్టుఁ దిట్టుఁ బోకిఁ బోతి రోఁజున్, మోఁదు మెడ ద్రొక్కు నెక్కును, మీఁదికి నెగయించు వంచు మెయి సారించున్. ఉ హరి 6 108

ఉ వేఁదుఱు గొన్న మానవుని వేమఱు గంటియు బిట్టు గాల్చియున్, మోఁదియు నీటఁద్రొక్కి

యను మునొ్ర్కస్ తీవ్రఁ గడంగువెజ్జు వ, శ్లేఁదగ విన్ని చందముగ నీపనిఁ దీర్చుటకై పెనంగితిన్, ఏమి సేయుదున్. నృసిం 5. 13

ఈ దెబ్బ, ప్రహారము.

మ. అరి నీకె నటు మోఁదులం బడి కడుం ద్రాణా ర్తుఁడై పాటిపోయిన సుగ్రీవుఁడు.. భా రా కిష్కిం 203.

ఉ మోఁదుల కొంక నన్ను జూపినన్ దశకు 4 12

జ మోఁకాలు, మోఁచెయ్యి, మోఁచేయి, మోఁచేతిమడ్పుటిల్లు, మోఁద, మోఁదకట్టు, మోఁదు లాట, మోఁదులాడు

**మోఁదులాట** వి (√మోఁదు) కొట్లాట దెబ్బలాట.

గీ .. వృష్ణిభోజాంధక వీరు లెల్ల, మునివర నిర్దిష్ట ముసలాత్మకము లైన ముయ్యంచు తు గల మోఁదలాటఁ.

సీ బెట్టు యొడొటుప్పలఁ బరిమార్చుటయును .. భారం మౌ 9౦.

**మోఁదులాడు** అ. క్రి (మోఁదులు + ఆడు) దెబ్బ లాడు

చ . .బోఁలుం, దొడలను వీఫులున్ దలలు నొప్పఁ గడంగ మోఁదులాడుచున్ .. అచ్చ. రా. యు. 194.

**మోక = మొక్క, మొలక.** వి 1 అంకురము.

సీ మొలక మొలప మొక్క మోసిక మొటక... నాకు న-కురం బొప్పుచుండు. . ఆం. భా. 2. 35.

2. వృక్షకము, చిన్నచెట్టు.

గీ ధవళకేతకిధూళి గాత్రమునఁ జఱచి, మోక మామిడి కొకకొంత ద్రొక్కి నిలిచి, యొడ లిలోఁ జక్కసగము నా కొసఁగు మనుడు. నద్రికకన్య తల వాంచె హరుఁడు నవ్వె. ఉ హర. 5. 56.

సీ లికంబు బలు తేనియలఁ బోఁక మోకల

పుష్పుఁ బాకల తావిఁ బుక్కిలించి
భీమ. 1. 97

ఉ. కా యను మేటితప్పు కొడుకా యను సిద్ధపుఁ బూఁతవోవి మో,కా యను ...
అచ్చ. రా అయో 90

మోకు. వి. లావుత్రాడు, తాడి మొదలగు చెట్లెక్కుటకు నుపయోగించు లావుత్రాడు.

సీ. అనుఁడు రిక్కను లతనిఁ దోడ్కొని తొలంగఁ నేఁగి మోకులు పగ్గము లెన్నియేని, గూర్చి బిగఁగట్టి తద్దయు వార్చికొనుచుఁ, దప్పెటలు మ్రోయఁ బ్రో లెల్లఁ ద్రిప్పి మఱియు
అచ్చ రా సు 65

వ ఇట్లు తాఁ దెచ్చిన యెద్దు నెనుపోను మెడఁగాడి గీలించి ప్రచ్ఛన్నరూపంబునం బాదరిఁకులు తోలుమోకు మునికోలయు నంటఁగట్టి పెద్ద మేడికోల యమర్చిన నాఁగలి భుజాగ్రంబునఁ దాల్చి.
శేష 5 198

కం. మోకును నిచ్చెనయును దా,టాకులబందంబు మెత్త నగుపడదోలున్, జో కగు కత్తుల దొన యును, దూకంబునఁ బూని నిల్చెఁ దొయ్యలి యెదుటన్...
సురా. 58.

మోక్షకుఁడు నం. విశ. (అ. కి.కా. అ) 1. విడుదల చేయువాఁడు, విడిచిపెట్టువాఁడు

2. ఉద్ధారకుఁడు, కష్టములనుండి తొలఁగించి రక్షించువాఁడు.

మోక్షణము. నం.వి.అ.న. 1. విడిచిపెట్టుట, వగలి వేయుట, 2 నిర్బంధమునుండి తొలఁగించుట, కష్టమునుండి కాపాడుట, 3. (కన్నీరు) కార్చుట, 4. అమిత వ్యయము చేయుట, 5, బాణము మొ.. విడుచుట, వేయుట.

మోక్షద్వారము. నం.వి.అ.న. సూర్య మండలము.

మోక్షపురి. నం. వి. ఈ. స్త్రీ. కాంచీపురము.

మోక్షము. నం. వి. అ. పుం. 1. విడుపు, విడుదల. 2. కష్టమునుండి తొలఁగుట. 3. ముక్తి, జన్మబంధమునుండి విడుదలయగుట (ఇదియ నాల్గవ పురుషార్థము, 4 మరణము, చావు. 5. (జ్యోతి) రాహుకేతువులు సూర్యచంద్రులను విడుచుట గ్రహణకాలమున విడుపు, గ్రహణము యొక్క సమాప్తి 6 మొక్కపుఁజెట్టు. పాటల (వృ.వి.)

మోక్షి. నం. విశ (న్ జి. న్.) మోక్షము గోరువాఁడు, ముక్తి పొందువాఁడు

మోఘ నం. వి అ. స్త్రీ 1 పాటల కలిగొట్టు. (వృ.వి) 2 విడంగము, వాయువిళంగము (వృ వి)

మోఘపుష్ప. నం. వి. అ. స్త్రీ. గొడ్రాలు, వంధ్య

మోఘము. నం విశ (అ. ఆ. అ.) వ్యర్థమైనది, నిష్ప్రయోజనమైనది, 2 సోమరియైనది, అలసము.
3 దినము వి అ పుం. ఆవరణము,కంచె, వెలుగు.

మోఘాలి నం. వి ఇ. పుం. ఆవరణము, వెలుగు. కంచె

మోచ నం వి. అ స్త్రీ. 1 కదళీవృక్షము, అరఁటిచెట్టు. 2 బూరుగుశాల్మలి, (వృ వి). 3 నీలిమందు చెట్టు

మోచక. నం. వి. అ. స్త్రీ. ముచ్చె, ఒకవిధమగు పాదరక్ష (శ ర.. స సం.)

సీ వివురుల గెలువఁ దాల్చిన కెంపు జోడుల కరణి నంఘ్రుల మోచకలు రహింప...
కృ. శతం. 3 27.

('మోచికలు' ముద్రి)

మోచకము. నం. విశ. (అ. చికా. అ.) 1 విడిచిపెట్టునది 2. విడిపించునది. వి. అ. పుం.
1. మోక్షము, మొక్కపుచెట్టు. 2. శోభాంజన వృక్షము.

మోచనపట్టంకము. నం. వి. అ. పుం. నీళ్లు మొదలగునవి వడియఁగట్టు సాధనము.

మోచనము. నం. విశ. (అ. ఈ అ.) విడుపు గలిగించునది, నిర్బంధము మొదలగువాని నుండి తొలఁగించునది (సాధనము). వి. అ న. 1. విడుపు. 2. గర్వము, తలతిక్క. 3. వంచన, మోసము.

మోచని. నం వి. ఈ. స్త్రీ మీఁగాలు గుదికాలు

సైతము కప్పుకొని యుండెడు పావోసు, పార్ష్ణిత్ర (శ. ర).

**మోచము.** సం అ పుం 1. కదళీవృక్షము, అరఁటిచెట్టు. 2 శోభాంజనవృక్షము.

**మోచయిత.** సం విశ (పు స్త్రీ పు విడుచువాఁడు, వదలి పెట్టువాఁడు.

**మోచాటము** సం. వి అ. పుం 1. రంభాస్థి, అరఁటిదూట 2. చందనము. 3 కృష్ణ జీరకము, నల్ల జీలకఱ్ఱ.

**మోచికొను** స త్రి (మోచు + కొను – స్వార్థమున) ఎత్తికొను, వహించు

కం. మోచికొని వారవాత్మజుఁ, డాచెలువందేఁ
నిట్టు లరిగి పురము దృగ్గోచర మగుటయుఁ
దమ్ములఁ, జూచుచు వారలకు ధర్మసుతుఁ డిట్ల
నియెన్... భార. విరా. 1, 155

**మోచితము** సం విశ. (అ. ఆ అ.) విడిపింపఁ బడినది (శ. ర.).

**మోచు=మోయు.** స. త్రి. 1 వహించు.

సీ. పౌండ్రభూవర నీవు భావంబునందు మకీ
యాంకములు మోవఁ దివిరితేని, నాపాలి
కేతెంచి నమ్రుఁడ వై యేను నీవాఁడ నా
కిమ్మి నీదు చిహ్నా, ముల
హరి. ఉ. 6 203.

గీ. అడుగుఁ జెంది భోగావతి యతిశయిల్లఁ, బరిఖ
లక్ష్మిశుకరణిఁ జూపట్టె వనియె, దాను బురి
కోట యాకాశతటిని మోచి, సమధికోన్నతి
గౌరీశుచంద మొందె... విక్ర. 1 65.

ద్వి. మోవ నోపినవస్త్రములు మోపుగట్టి, లావునఁ
గొనిపోయి లంజియ కిచ్చె ..
పండితా. దీక్షా 74 పొ.

ఉ. భూవరముఖ్యుసన్నిధికిఁ బోయెడు మామిడి
పండ్ల పుట్టికల్, మోవఁగఁ గూలి పుచ్చుకొని
మూఢతఁ గుల్కెడు గ్రామ్య చేష్టితం, బావ
హిలంగ నేఁగి... కళా. 6. 158.
ఆం. భా 3. 119.

2 ఎత్తికొను

ఆ అకట మనము వచ్చినది కడుదవ్వు నేఁ, డప్పు
డుఁబు సొత్తమని తలంచి, తఱిమి నడచితిమి
లతాంతన్వి యిది వడ, గొనియె మోచి తెమ్ము
కొంతదవ్వు. భార విరా 1. 151

కం విమఁ డీతగుసంబంధపు, టెసయికఁ గని
మోచి తెచ్చి యిచ్చె వనరె చుల్కని నరులు
కాన మాపుర, మునుకున్ విజయంబు సేయఁ
బుత్రిక నిత్తున్. ఆము. 6. 119

3 తాఁకు, స్పృశించు

ఉ పూచిన తీఁగెలన్ మధురభూరిఫలంబుల వ్రేఁ
గునన మహిన్, మోచిన కొమ్మలుం గలిగి..
ఒప్పు వింధ్యాచల పార్శ్వ కానన మవన్యవనీ
విభవోపమాన మై కేయూర. 3 10

గీ కమియ నామూలచూడంబుగా ఫలించి, యంబ
రము మోచి యున్న యుదుంబరములు..
కాశీ 1 91.

ద్వి అని పెక్కు భంగుల నారాజుదేవి దనుమోవ
నాడిన దిక్కు వాక్యములు..
ద్వి హరిశ్చ ఉ 1182 పం.
పాండు 3 155

మ ఒలిమి ద్రెంపఁగఁ బోలెఁ బాయవడుచుం
బర్యాయశంగంబువన్, గలనూ లెల్లను వంటు
మోపఁదెగి... ఆము 4 3.

(అటుమోవన్ = అతుకువఱకు)

4. అను. ఆక్రమించు

శా నీ వింకనన్, బాధం బెట్టకు వాఁడి సూది
మొన మోవం జాలు నంతైన నే, నీధాత్రీతల
మీము వారలకు .. భార. ఉద్యో. 2. 251.

5. అంటుకొని పోవు.

చం. కనుఁగవ మ్రాన్పడంగ నెఱక ల్విరియంబడ
బోర మోవ నెండిన వదనంబులం దెఱచి
పిక్కనయజ్ఞులు దల్లడించుటల్. గనఁబడ
నూరుపు గ్గళముగా నిగుడ న్వడఁ గుంది

యీారెలుఁ, గునఁ గమవాని బిల్చుచు శకుం
తము లయ్యోడ నిల్చె బ్రామఁకులన్ ...
పారి. 4. 21.

6 పొందు.

గీ. ... అట్టి వానికి నింద మోవఁ, జేసెఁగా విధి
కటకటా దోసకారి. సారఁగ. 2. 263.

ఉ. ఎల్లవిధంబులన్ వినుతికెక్కిన యీాన్నృపు
కూరిమిపత్ని నై, మొల్లము లైన సంపదలు
మోచి వెలుంగుచు నున్న నాకు నీ, తల్లి సపత్ని
నౌదు వని తాఁ బలుమారును వచ్చి సాళడన్,
బ్రల్లదముల్ వచించు వది పల్మరు నే వినఁజాల
వెన్నఁడున్. వి. పు. 2. 12.

ఉ. ఆవసుధామరప్రభువు నమ్మని యిట్లను వత్స
వినుమ నా, భావ పథంబువన్ నిను నపావునిఁగాఁ
గనుఁగొంటి నాగ్రహ, వ్యావృత చిత్తవృత్తి
నిటు లాడితి మీఁ దరయంగ లేక నా, యీావచ
నంబు తప్ప దనయం బెద మూర్ఛిత నన్ను
మోచుటన్. పాండు. 5. 259.

7. పోషించు.

ద్వి తన్ను మోచినచోటఁ దగ నట్టె పెట్టి,
మిన్నక సురిఁగిన మెత్తురే జనులు ... ద్వి.
హరిశ్చ. ఉ. 2. 477 పం.

8 లక్ష్యముగాఁ గొను గుఱి సేయు.

ఉ. చిత్తరు వన్న నిశ్చయముచే నెదు రుండి
మొగంబు చూడ మో, మెత్తును సత్యపుం
భ్రమ సమృద్ధిని గ్రమ్మఱుఁ దక్షణంబులో,
నొత్తుచుఁ దత్తఱంబుఁ ద్రవయున్ మగుడంగ
నిరీక్షణేచ్ఛఁ బో, మొత్తును భర్త చూపు దను
మోచుట దోఁచిన నోసరిల్లుచున్
ప్రభా. 1. 139.

౯. గ్రీ. అనుకొను.

సీ. నిమ్మలు మాదీఫలమ్ములు నతిరమ్యముగఁ
బండి నేలపై మోచి యుండు. ...
కు. సం. 7. 930.

2. నిండు

చం... కంజభవాండము మోవ శీల మైఁ, బెనిచిన
దంభవామను నుపేంద్రుని నిన్ను సమాశ్రయిం
చెదన్. మనుచ 6 111.

ఆ ఇతనిఁ జూచి మీకు నెంత మోహము గల,
దంత కంటె మాకు నధిక మైన, మోహరసము
మూరి మోచియున్నది యీాకు, మారుఁ డొక్క
రూప మాకు మీకు వి. పు. 7 100.

8. మొదలుకొను, ప్రారంభించు

గీ .. శంకరాద్రి, కాననము మోచి మందరాగంబు
దాఁక, ఛాయ పెట్టిరి తనూజులంబు దొరలు.
మనుచ 5 44.

తలమోచు-శిరసావహించు.

సీ. .. ప్రచండమేఘ, కులము లాతని యాజ్ఞ దల
మోచి యతని యాయుధము చిహ్నంబగు
నొడలు నొప్ప హరి. పూ 7 125.

జ. మోచికొను, మోపరి, మోపరిగాఁడు, మోప
రిఁడు, మోపు, మోపుకాఁడు, మోపుకొను,
మోపుకోలుపు, మోపుదల, మోపెట్టు.

మోజా వి. ఒక జాతిచెప్పు, పాదరక్షావిశేషము

సీ పాదరక్షాభిధ పరగును జెప్పన మలకడ మ్మనఁగ
నమ్మాళి యనఁగఁ, దద్విశేషమ్ములు తగుఁ
జాయపోసు పాపో మూడు పుద్దము ముచ్చె
మెట్టు, కవును మోజా యనఁగ.
ఆం. భా 2. 293.

గీ. చరణముల లేఁత చిగురుమోజాలు దొడిగి,
కటిభరంబునఁ గురువేరు కలయఁగట్టి, పొగ
డలును బొడ్డుమల్లెలు పొన్నవిరులుఁ. జాన్పు
పను సాల్గుదిక్కులఁ బఱచివైచి...
పి. శకుం. 3. 41.

**మోట.** వి॥ (సం. మూఢ.) 1 మూర్ఖుఁడు, మొద్దు.

ద్వి చదువును సంధ్యయు జపమును వేల్మి,
మొదలు ముట్టఁగఁ బోయి మోటనై బదరి...
ద్వి. హరిశ్చ. ఉ. 1252 పం.

2 స్థూలము, బలిష్ఠము.

ద్వి. మాటున నసుర గ్రమ్మఱ వచ్చి తాఁక, మోటతా డెత్తుక మోఁదె వావాలి...
రం. రా కిష్కిం. 209 పు 8 పం.

వి. కపిలె, ఎడ్లను కట్టి నీరు తోడెడుయంత్ర విశేషము.

సీ. ఏత మనఁగ ఘటీయంత్ర మెసఁగుచుండు మో టనఁగను దద్భేద మొనరు ...
ఆం. భా. 2. 293.

చూ. మోటకత్తి

మోటకత్తి. వి. (మోట+కత్తి) మచ్చుకత్తి, చెట్టు కొమ్మలను గొట్టు పెద్దకత్తి.

ఉ. కట్టినసీలిడి ఫ్లు సెల కట్టియవిండ్లును విండ్ల గాసెకల్, చుట్టి నొసళ్ళపై నిడినజుంజుఱుఁ బల్లసిగల్ కటీతటిన్, బెట్టిన మోటకత్తులును
మనుచ. 4. 83.

ద్వి. మలయంగ నెడరొండిమయి నోర గాఁగ, మొలత్రాటఁ జెక్కిన మోటకత్తియును...
ద్వి. పరమ (చి. ని.)

మోటకము. సం. వి. అ. పుం. న. మాత్ర, గుళిక. న. శ్రాద్ధకాలమున నీయఁబడిన భగ్నకుశ పత్రిద్వయము, విడదీసిన రెండు దర్భపుడకలు.

మోటనము సం. వి. అ. న. నలఁగఁగొట్టుట, పిండిచేయుట, బ్రద్దలుకొట్టుట. పుం. వాయువు, గాలి.

మోటపాటి = మోటాటి వి. రెడ్లలో నొకతెగ (శ. ర)

మోటబరి వి. బరువు మోసెడియెద్దు (శ. ర).

మోటాటి = మోటపాటి వి. రెండ్ల (కాఁపుల) లో నొకతెగ

గీ. పంట మోటాటి పెడకంటి పాకనాఁటి, కొణిదె కాఁపులు మొదలైన కోటిఁ దనరు, కాఁపులకు నెల్ల మిన్న యకాఁపు కొడుకు...

మోటించు. స. క్రి. పోటిగా నిలుపు.

(వ్యసన) దూలము పడకుండ స్తంభమును మోటించినారు (శ. ర)

మోటిక = మొటిక. మొట్టిక వి. అంకుశము, మొటక.

ఉ ... పరిపాటిగఁ గెంజిగు గర్కి డకల్పడన్, మోటికలెత్తి క్రొవ్విరులు మొగ్గలు వెగ్గల మయ్యె నయ్యెడన్ (మోటికలెత్తు = అంకురించు అని భావము)... విప్ర 2. 23.

మోటు. వి (సం. మూర్ధః) 1. స్థాణువు, మోడు.

సీ. పాట పాడుదు రొక్కచోట మోటులు సల్లవించి కోయిలలకు విందు సేయ ..
ఉ. రా. 1. 170.

ఉ. కాలిన మోటువంటికొలఁగాని శరీరము పల్లవెంట్రుకల్ . వి. పు. 2. 134.

సీ. మోడు మో టనఁగ నొప్పును స్థాణునామంబు.
ఆం. భా 2. 36.
దశా. 9. 19.

2. మాటు, వేఁటకాఁడు పందివేటలో దాఁగుటకయి ఉపయోగించుతెర, పల్లము మొ॥

సీ. సట లెత్తుకొని యొత్తుకటి వ మోటూసపడి యేయఁ బొడుతు నీపాద మాన ...
మనుచ. 4. 64.

సీ. పొదిగువ్వలు మోటుపలకలు పోటుగుంజలు చిక్కములు నురు ల్జాగిలములు ...
శుక 1 165.

గీ. జాకకిపంక్తులకు మోటు .. హంస. 2. 84.

గీ మొద్దుగుఱ్ఱము, మూర్ధకహయము.

ఉ. . . నదకగుఱ్ఱపుమోటుల వేసడంబులం, బెల్లుగ నెక్కి పౌరజనబృందము వోఁ బురి నైదువాళ్లు భూ, వల్లభుఁ డుండి తాఁ గదలె వాయుజ ముఖ్యులతోడ వేడుకన్... జై. భా. 2. 113.

3. మూర్ధకహయంబు వెలయును మోటునాఁగ....
ఆం. భా. 2. 196.

విశే 1. పెద్ద, స్థూలము, దట్టమైనది.

గీ. మోటుపలుక నిజాంగంబుమాటు గాఁగ, వెలయ... రావి. 5. 20.

2 పరుషము, కఠినమైనది

(వ్యవ.) వాఁడు తఱచు మోటుమాట లాడును

3. మూఢుఁడు

గీ మొఱను మోటు పిసాళి నా మూఢుఁడొప్పు...
ఆం భా. 8 8.

జ. మోటుకన్ను. మోటుకాఁడు, మోటుపఱచు, మోటువడు

**మోటుకన్ను** వి. (మోటు+కన్ను) ముద్దువాఱిన కన్ను, ఒక విధముగాఁ జెడినకన్ను

ద్వి. తూఁటు గట్టినకన్ను దూలగొన్నకన్ను, మోటకన్నును బాపమునిగినకన్ను
పండితా. మహిమ. 278 పొ.

**మోటుకాఁడు** విణ (మోటు+కాఁడు. వి మోటు కాండ్రు. మోటుకాఱు) మాటు పెట్టుకొని వేఁటాడువాఁడు

ఉ అత్తటి వేఁపికాండ్రు యమునాంబుతరంగ పరంపరాకృతిన్, ముత్తర మైనసూకరసముత్కరమున్ గని మోటకాండ్రు విల్లెత్తకమున్న శాజుమది కెక్కుడునట్లుగ దీని మిత్తికిం, బుత్తమటంచు బల్లెడలు బోరన దుయ్య భయంకరాకృతిన్..
మనుచ. 4 4.

**మోటుపఱచు**, స. క్రి (√మోటుపడు, 1. వఱుకు ఖండించు

గీ మెఱసి సీదుసహోదరి ముక్కుచెవులు, మోటుపఱచినఖడ్గంబె క్రోలఁ గ్రాల ...
భా. రా. యు. 661.

(మోడుపఱచు. శ. ర. పా.)

2. కొట్టు, ప్రహరించు.

కం. మోదిన నప్పాలబోనవు, జోదులు వెండియును వాఁడిసురియల గుదెలం, గైదువుల నారసంబులఁ, గాదుకొని కలంచి మోటుపఱచిరి వారిన్.
అచ్చ. రా. యు. 133.

**మోటువడు.** అ. క్రి. (మోటు + వడు) ముద్దువాఱు, చెడిపోవు.

ఇవ్విధంబున నావిద్య లెల్ల మోటు, వడినఁ జెట్టెక్కి చేతులు విడిచినట్లు, శోకచింతా నిమగ్నుండ నై కురంగ,నయన కృపఁ జూచి రక్షించు నన్నటంచు.
వరాహ. 1, 96.

**మోట్టాయితము** సం, వి. అ. న. విరహకాలంబునఁ బ్రియునికథాదులయందు మనసు దగిలియుండుటను దెలియఁజేసెడు స్త్రీయొక్క శృంగార చేష్టా విశేషము.

**మోడము** వి మేఘావరణము, మందారము.

గీ ... మోడ, మన గ మందారం మనఁగ మేఘావృతి దగు ...
ఆం భా 1 71.

**మోడామోడి** వి ఒకానొక స్వరస్థాయి.

ద్వి. కుఱుడి మోడామోడి .. అడిగా నొగయు తాయములు. బస. పు. 3 942 పం

**మోడి**¹ వి గణికాదులు మొగ్గవాలి కాలికి సమీపమందుంచిన వస్తువు చేకొనుట.

క . ఉయ కోపు దృష్టియును వళి,నయ ముదుటు దుమ్ముర్మ మోడి నయ మన్నతి రే,కయున ప్రమాణము హరువున్. మెఱసిరి యవఘుళవ్ము ముదువు మెఱకువ యమరున్.
ప్రబంధ. 108

**మోడి**² విణ. (సం మూఢః, క. మోడ) మొండి మూర్ఖుడు

గీ వారసతు లైన యీ కీమ వారివలెనె, మోఁమానిసి నైన నే గోడు లేదు ...
వైజ. 2, 95

వి. 1, అనాదరము

(చూ . మోడిసేయు )

2. చలము, పట్టుదల.

గీ. కొమ్మ నిను దక్కి దక్కించుకొనెడి యామమ్మురమ్మగ నన్నేఁచ మోడి దగునె .
ప్రబంధ. 73

3 కోపముచేఁ దాల్చు మౌనము , కోపము.

గీ మోడి యనఁ గోపమౌనంబు పొల్చు నభవ...
ఆం. భా. 1. 185.

గీ. కోపరీతులు మోడి నాఁ గొఱలుచుండు ...
ఆం. భా. 3. 53.

సీ. మ్రొక్కి వేఁడినఁ గాని మోడి మానని వాఁడు
పెక్కులు బతిమాలి వేఁడసాగె ...
కలు. ౫. 84.

సీ. చూడవే కన్నెత్తి పీడవే మోడి నీ వీడ వే రావె
నీవాఁడ నేను... శశాం. 4 84.

3 బింకము

గీ. పంచకము తొమ్మిది విరివియై పరిధవిల్ల, మోడి
శిర సెత్తుటయుఁ గల్గి మొయిలులోని, జలము
తే నోపు పాదరసంబువంటి. యుత్తమాశ్వంబు
సాహిణి యొకఁడు నిలిపె
సారంగ. 1. 81.

చం బొమ ముడిపాటు జంకెనయు పూనికయున్
మురిపెంబు మోడి పంతము చిరునవ్వుదోఁప...
శశాం. 3. 68.

జ: మోడిసేయు

మోడి³. వి. వకిప్మివైఖరి , వైఖరి, విధము.

సీ. . .రే జోతిఖాగోడ జాజుటాకు, చేకొని
వహొన్నుకాన శీఁగె మోడిపములఁ జిత్రపటముల
తళుకు వెలసి...

గీ కళుకు బంగారు రేకుల కుళుకు మీఱ, జెళుకు
తెఁమానిఃపు జగతులను సోయగంబుడం
బగు వైజయంతాబులోన. ఘటికా 2 66.

గీ మోముఁ జూచిన శశిరేఖ మోడి యమరె,
మాటఁ బోడిమి జూచిన మంజుఘోష ..
శశాం. 3. 50.

చం పలుకుల నేర్పులున్ జిలుఁగుఁ బయ్యెద
జార్పులు వింతమోడి నవ్వులు ...
శశాం. 2. 107.

మోడిసేయు అ క్రి (మోడి² + చేయు) అనాదరము చూపు.

గీ. పసిడి చీరలు గోవులుఁ బసులుఁ గొంచు
నూకలిండ్లును బండ్లును నోలి నొసఁగ, నలయు
నివియెల్ల నొసఁగి యవ్వల మోడి, నేయు
కెంతయు సంతుష్టి సేయవలయు,
హరి ఉ 10. 316.

మోడు¹ = మ్రోడు. వి. 1. స్థాణువు.

సీ. మోడు మో టనఁగ నొప్పును స్థాణు
నామంబు... ఆం భా. 2. 36.

2. ఉండవలసిన యవయవాదులు పోవుటవలన మొద్దువలె నుండు పదార్థము.

గీ. కామఁ గాసిన కమలంబు కరణిఁ బొలుచు.
కర్ణుతల యిలఁ బడియు నుదీర్ణ కాంతి. నొప్పు
నట్టియుఁ జూచి శల్యుండు సిడము. ద్రెప్పి
మోడైన యరదంబు ద్రిప్పె నధిప.
భార. కర్ణ 3. 471.

మోడు². విశే. (మూఢుఁడు. )

సీ. బొగ్గునం దైలంబు బుట్టంగ నేర్చునే యిలమీఁద
మోడు నిగ్గెల తలఁచు ... నీతి. 73.

(చంద్రవర్ణనము.)

చం. గురుసతిఁ గూడు రట్టునకుఁ గొంకని మోడు
వియోగినీస ముత్కరముల కీడు ..
వరాహ. 4. 24.

జ · మోడుపడు,

మోడుచే(డ్పు). స. క్రి. (✓ మొగుడు) 1. (చేతులు) జోడించు.

ఉ. మ్రొక్కెద వాసుదేవునకు మోడ్చెదఁ జేతులు
సవ్యసాచికిన్ ... భార. ఉద్యో 1 302.

ఉ. తోడికుమారులున్ సఖులు దూరమునంద కరార
విందముల్, మోడిచి ఫాలభాగమున మోపి
నమస్కృతు లాచరింపఁగా .. కాశీ 6. 5.

ఉ. మ్రొక్కు లొనర్తుఁ గేలుగవ మోడిచి ...
నీలా 1. 7.

ద్వి మోడ్చుఁడు చేతులు మ్రొక్కుఁడు సాఁగి
పండితా మహిమ 298 పా.

2 (కన్నులు) మూయు.

చం. మొలచిన కూర్మిఁ గన్నుఁగవ మోడ్చినయట్లు దళ[illegible]సఖావనా, [illegible]ముగ నాన్యపాటకురిఁ బాయక చూతురె మర్త్యభామలు... నైష. 137.

చం. .. జలదేవత హాయని కన్ను మోడ్చెనా, వనరుహముల్ ముడింగె.. పారి. 232.

సీ. ఆవులు నాకఁగ న్నట్లు మోడ్చు పఱలను బులుల చన్గుడవఁగఁ బోవు లేళ్లు కళా. 3 10.

3. (పువ్వులు) ముడుచు.

శ కలపములు గూర్చి బహువిధ, తిలకంబులు వెట్టి వింతతెఱవున బలు పువ్వులు గట్టి కట్టి మోడ్వఁగఁ, దల ముడువఁగ సరులు గ్రువ్వఁ దద్దయు నేర్తున్ భార. విరా. 1. 620.

మోడుప(డ్ప)డు. అ. క్రి (మోడు + పడు)

1. తునుఁగు, తెగు.

కం. మోడుపడిన చేతులతోఁ, గిడగుదశః బొందికాక కిన్నరగీతా, మ్రేడిత ముద్ర్యశ సంపత్, క్రీడలు నీ కకట యిప్పుడు దెలియఁగ నగునే. హరి. ఉ. 8 478

2 బోడిగుగు, కొమ్మలు ఆకులు లేక యుండు.

గీ ఆర్వగులు కోడిగములకై యాకులెల్ల, ద్రెంచి శాఖా వితానముల్ ద్రుంచివైప, మోడుపడి యుండె నది నిల్వ నీడ పట్టఁ, గొమ్మయును లేమి తనయందు గుదురకొనఁగ శుక 2 499

3 మొక్కపోవు.

చం. అనుటయు నాదిదేవుఁ బరమాత్ముఁ గనుంగొన నెమ్మనంబులన్, మొనయు కుతూహలాంకురము మోడ్పడఁ గోపము చిచ్చు తాఁకునన్, ఘనతర బోధపల్లవము గందఁగ నైరణ యవశ్రవహ్రవతం,బుశకు విఘాత మొంద ముని పుంగవు లొక్కట నుగ్రమూర్తులై ... నృసిం 1 87.

4 ప్రమాను డు, నిశ్చేష్టమగు

ఉ. వీరలు గంగలోఁ బులినవేములమీఁద బ్రుపిని విష్టులై, నోరు వృథా మెదల్పుచుఁ గనుంగవ మోడ్పడ నతమాలికల్, సారెకుఁ ద్రిప్పుచున్ ప్రబోధ. 2. 8.

మోడుపు(డ్పు). వి. (మోడుచు) మొగుడుట, ముకుళించుట

మ మిక్కుటంపుఁ దమి సొక్కి నాల్గంత కన్మోడ్పున్ . దశా 8 77

కం. పెన్నెరులఁ జెమట మోడ్పుం, గన్నులు వదలుకవుఁగిళ్లు గలవారలకున్, బన్నిరు గ్రోలుటయు నంత నిద్దుర పోవుటయు హితం బై యుండెన్... సారంగ 2 151

సీ. ఆలాపగతిఁ జొక్కి యరమోడ్పుఁ గనుదోయి [illegible] విభ్రమముఁ దెలుప ... మనుచ. 2. 27.

మోడుపు(డ్పు)ఁగేలు. వి (మోడుపు + కేలు) దోసిలి, అంజలి.

గీ. మ్రొక్కి నిలుచుండి నుదుటిపై మోడ్పుఁగేలు, భక్తిఁ గదియించి యిట్లని ప్రస్తుతించె. భార. ద్రో. 5. 408.

మ. అని కీర్తించి తపస్వికేసరి యఖండానంద దుగ్ధార్ణవం, బునఁ గ్రీడించుచు ఫాలభాగమున మోడ్పుంగేలు గీలించి కాశ. 1. 147.

మోడ్పుఁజేయి. వి. (మోడ్పు+చేయి) నమస్కారమునకై చేసినయంజలి

సీ అంతరాంతరముల నాకాశచరకోటి మోడ్పుఁ జేతులు మస్తముల ధరింప... నైష. 3. 6.

మోణము. సం. వి. అ. పుం. 1. ఎండినపండు. శుష్కఫలము.

2 పాములపెట్టె, పాములబుట్ట, 3. వక్రము 4. మక్షికము, ఈఁగ. (మే ని.)

మోతాదు వి (హిం మోతాద్) ఒకసారి యిచ్చు మందు, అనల్పానధికమగు పదార్థము, హెచ్చుతగ్గు కాని పదార్థము.

(వ్యవ) వైద్యుఁడు మూఁడు మోతాదుల మం దిచ్చెను.

శా ముం దెల్లప్పటికిం గళింగమునకున్ మోతాదు కాఁగన్ జమా,బందీ ద్వాదశలక్ష రూపికల కేర్పాటున్నది... రంగా 2 7.

**మోతుకు = మోదుగు** వి పలాశము. 1.

ద్వి. జాతిగా గళములు చాఁచి చెలంగి, మోతుకు మొగ్గఁ మురువు వటించు ...
నవ 1. 10 పా 1 పం.

**మోద** వి ఇన్నూరు తములపాకుల కట్ట (శ. ర. వా)

**మోదకము** సం విశ. (అ. దికా. అ) 1. సంతో షించునది, ఆనందించునది 2. సంతోషింపఁ జేయు నది, ఆనందింపఁ జేయునది, వి పుం. న 1 ఉం డ్రము. 2 గుడము, పుం. క్షత్రియపురుషునకు శూద్ర స్త్రీయందుఁ బుట్టిన సంకరజాతి

**మోదనము.** సం. వి. అ. న. 1 సంతోషము, ఆనం దము 2 సంతోష పఱచుట, ఆనంద పఱచుట 3. మైనము

**మోదమానము** సం. విశ. అ. ఆ అ। సంతోషించు చున్నది (శ. ర.)

**మోదము** సం. వి. అ. పుం 1 సంతోషము ఆనం దము, ఉల్లాసము 2. పరిమళము, సువాసన.

**మోదయంతి** సం వి ఈ. స్త్రీ ఒకజాతిమల్లె, వన మల్లిక (వృ వి)

**మోదయము.** వి తృణవిశేషము, బల్బజము (శ ర)

**మోదర.** వి. ఖండము (చూ. మోదరలాడు) జ. మోదరలాడు.

**మోదరలాడు.** స. క్రి (మోదరలు + ఆడు) తును కలు సేయు, ఖండించు

సీ. విఱువు కంఠాస్థుల నుఱిచి చివ్వంగుల మొత్తి మోదరలాడు మత్తకరుల ...
పి శకుం. 2. 12.

ద్వి. ... ఖటుల పందరను, మొత్తి మోదరలాడి మొనసి గుండెలకు నెత్తురు దిగఁదన్ని పీ ల్చెల్ల నెఱచి ద్వి పరిమ 6. 461 పా

**మోదాఖ్యము.** సం. వి. అ పుం ఆమ్రవృక్షము, మామిడిచెట్టు

**మోదా(ద)లు.** వి బ మొదవులు, అవులు. (ఇది శాసనములందు మాత్రమే గానవచ్చుచున్నది.)

వ ..జాయపనాయకుండు అఖండ దీపమునకుఁ బెట్టిన మోదాలూ 25 Ep ind. No 3 No. 15 (year S 1153)

వ. .. అవవున బ్రముచె కొమ్మనబో అని ఆ (ద్వమును,)ల ఎఱ్ఱబో... వనమునం బెట్టిన మోదాలు 50 నిత్యుఁడి అడువగల త్రిభువ నాంకుశ .. ద. శా 4 10 2. A.

వ స్వస్తి 11 ) శ్రీ (శకవర్ష బు)లు 1175 అగు ప్రమాది సంవత్సర జ్యేష్ఠ శు (ద్ధ) 7 మ, పిన్నిమల్లె పెగడ గణపయ శ్రీదాక్షారామ భీమనాథ దేవరకు అనవలకిచ్చిన మోదలు ..
10. ద శా 4 1047.

**మోదించు** సం అ క్రి 1. సంతోషించు.

ద్వి ... తెమ్మని ... వనుఁడు, మొంద... చిఱునవ్వు మొలకలు నిగుడ
రం రా అయో. 96 పా. 7 పం.

శా. ఈ యాఖ్యాన మెఱిగి చిత్తమునయం దే ప్రొద్దు మోదించువాఁ, డాయుష్మంతు డు శ్రీ సమే తుఁడు హర పూ. 2. 264.

2. క్రీడించు, విహరించు

ద్వి అందంద నందమై యాపన్న కాళ, ముందఱ మృగ మిట్లు మోదించుచుండె..
రం. రా. అర 172 పా. 19 పం.

**మోదిని.** సం వి ఈ స్త్రీ 1. అజామోద (వృ వి) 2. మల్లిక వృ వి.) 3 యూథికయనులతావిశేషము 4. కస్తూరి. 5. మద్యము

**మోదిలు(ల్లు) = మోదించు.** సం అ క్రి. సంతసించు.
కం ... అ, వ్వేదమయు మొగము గనుఁగొని,

మోదలి మృదునుడు వాక్యముల నిట్లనియెన్
వా రా 1 54

ద్వి అలివల్కు రాముడు నాలక్ష్మణుండు, నన
కాదులును నభాందులు మోదిలిరి..
రం రా. బాల 62 పా. 17 7ం

**మోదుగ(గు,వు)** వి కింశుకవృక్షము, పిల్లితు
సీ .. నెగడు గింశుకము మోదుగ యనంగ
ఆం. భా 2. 41

గీ. ఎలమిమై జాజి యాఁకుపు ఓనుఁగు ను,
నోఁచునామని యనుతెఱనోరిమెకము, గోప్య
వంగము దగుమోదుగులను మొగ్గ, కమరె దమ
రంగు మిన్నెల్ల నలముకొనఁగ ..
యయా. 4 5

గీ. అతఁడు మృగకృత్తి పెళపెళ యనఁగఁ జను,
గోఁచి గట్టిన మోదుగుల నెగయ .
ఆము 4. 63

కం ఈ చందంబునఁ దెఱవులు, వేచియు నయిఁ
బూఁచి లాఁచి వేసియుఁ బైపైఁ గ్రోచురు
దిరమునఁ దడిసిరి, పూచిన మోదవుఁ తోడ
బుట్టువు లనఁగన్. ఉ వాం 3 63

ఱ మోదుగతొడిమలు, మోదుగుమాడు

**మోదుగతొడిమలు** వి బ. (మోదుగ + తొడిమ) ధాన్యవిశేషము

సీ. గరుడసరు లోపితుగంటరాజనములు బుడగ
తొడమలు ముదుకసరులు
హంస 1. 128

**మోదుగుమాడ** వి. (√మోదుగు) మోసుగు విత్తు (శ ర )

బ. శాలిధాన్యవిశేషము (శ. ర ).

**మోదెన** వి శివమల్లిక (వృ. వి ).

(రూ. మోదెనము శ. ర. పాశుపతము చి. ని )

**మోపరి.** విశే. (మోపు + అరి³ ) భారమును వహించువాఁడు.

చం. తరుణుల కౌఁగిట వ్ననుమతమ్ము వృథా విరు
లెత్తఁజేసె మోపరులుగాఁ జైత్రుఁ డంచు ..
ఆము 5 126
చం రా. 2. 10

సీ మోపరియై తైన మోవ వేసాఁడు నోరిది
నాదాయమే చూచుఁ గాని .
సీత 47.

ద్వి మోపరి కగుతగ్గ మెగ్గులభారము, మోపించు
కొనునట్టిముగ్ధన కగునె ..
ద్వి. భాగ. 2 స్కం (శ ర )

సీ భారవాహకుపేరు పరగుచుండను బెస్త
మోపరి బోయడు బోయ నాఁగ
ఆం భా 2 288.

**మోపరిగాఁడు** విశే మోపరి + కాఁడు) నీచుఁడగు మోచువాఁడు

ద్వి గడిత్రుళుల్ మోపరిగాండ్లె మోవంగ .
పండితా దీక్షా 29 పా

**మోపరీఁడు** విశే (మోపరి + ఈఁడు, స్వార్థమున) మోయువాఁడు.

సీ పుడమినివాల్గంటి నిడువాలు పడగగుబ్బను
నెత్తుక మోయువెూపరీఁడు ల వి 1 65.

**మోపాది** వి (మోపు + ఆది) అపాయము.
(చి ని , ప్రౌ , శ ర ఇది యేడాదివంటిది)

**మోపి** వి ముండమోసినది, విధవ చి ని.. ప్రౌ శ ర.)

**మోపించే.** స క్రి (√మోచే) మోయఁజేయు.

కం కోపించు సురల వెలువడఁ, ద్రోపించె సురారి
బలిమి ధూర్జటి నీళ్ళన్, మోపించె విష్ణుఁ
బనులం గాపించెను మీకు నౌరయు గడి దాపిం
చెన్ .. కు. సం. 4 881.

కం నడవం జాలనివారలఁ, దడయక మోపించి
తెచ్చి ధగణీశుఁడు తాఁ. దడ వోర్వని కార్య
ములకు, నెడనేయక పాడి నిర్ణయింపఁగ వల
యున్... విజ్ఞా. 3. 18, కాశీ 5. 62.

**మోపిక** వి. (√మోయు) భారము (శ. ర).

**మోపిడు** స. క్రి (మోపు + ఇడు ) 1. ఎక్కుపెట్టు.

ఉ. అపువువింటిజోదు మధుపావళి నారి యొనర్చి చక్కఁగా, మోపిడి పట్టి జుమ్మనుచు బ్రోయఁగ మీటుచు నున్నవాఁడు.. పి. శకుం. 2 130

ఉ. కొండ లొకింత యెత్తనొక కొండయు మోపిడ లేక దక్కఁగాఁ, గొండ లొకింత యెక్కుడుచు. భాగ. 10 ఉ 1090

2. మూటగట్టు.

ద్వి మోపిడి తవమోవ నోపివన్నియును, నేపారఁ గొనివచ్చి యిచ్చె లంజియకు ...
బస. పు ౯. 88

మోపిళ్లు. వి. బ. బాలక్రీడా విశేషము.

సీ గోటి దొర్లుడుకాయ గొళ్ళిళ్లు మోపిళ్లు...
హంస. 3 146

మోపు స. క్రి. (√మోచే) 1. వహింపఁజేయు మోవఁజేయు

గీ. మరల సొమ్మిచ్చుటకు .. పూఁటకాఁ పైన హరిని. జట్టు మోపి చనంగఁ గచ్ఛపముమీఁద గట్టు నిల్పె సురాసురగణము లపుడు ...
దశా 2 197.

2. ఆనించు, అనునట్లు చేయు

గీ. శాంతి నొందుటకై ధర్మ సంవిభాగ, కరణ మొనరింప వచ్చిన కమలనాభు, వాక్ప్రవృత్తిఁ బాటింపక వాఁడిసూది, మోపి వంతైయుర్వి నీ మోప వంటి... భార. శల్య 2. 74.

ఉ. ..గాఢతరక్షతిఁ దూలి నేలపై, జానులు మోపి మాగధుఁడు సత్త్వ మఱం బడి సొమ్మ నోయినన్... హరి. ఉ 1. 128

కం. విను మాయావిధ మిట్టిది, యని యాపియ వెరవు గలుగ దవనిం జరణం, బనఘా మోపని జంతువు. సమచొప్పరయంగ రాని చందం బొందున్... భార. శాం. 4. 190

చం. చనుఁగవ వ్రేఁకము న్జఘన చక్రభరంబును మోవ లేక యొ,య్యనఁ బదపంకజంబు లల సాలసవైఖరి మోపుచుం జనా,ర్దనభుజ మూఁతగాఁగ వనితామణి యేఁగెఁ బరస్పరాంగ మే,ళనమున రోమహర్షముకుళవ్రజ మొండొరుమేను నిండఁగన్.

పారి. 4 25., హర. 2 117.

3. చేర్చు.

చం తిరిచి కవుంగలించి జగతీవిభుఁ డక్కము లాయతాతి నె,మ్మొగము మొగంబునుం గదియమోపు భార. విరా. 1. 247

సీ కొకిలికి వేసంపుగూని మూపులమీఁద మూఁడు పంగల యాఁకు మోపినాఁడు ...
మనుచ 4. 78

సీ కదియ నాసాశిఖాగ్రమునఁ దర్జని మోపి ...
నైష. 5. 9

4. లేనిది కల్పించు, ఆరోపించు.

గీ వైష్ణవులమీఁద ముచ్చు లన్యాదు మోపి, యధిపునకు నెడ సేయుచ మనుచుఁ జెప్పి...
పరమ. 3 55.

గీ. తల్లి నామీఁద వఁట లేనితప్పు మోపె, నఁట యలయనుఁగుఁ దండ్రి దా నదియె నిశ్చయంబు నేసెనట. సారంగ. 2. 273.

గీ . నే డొక్క ముచ్చుఁ, దనము నామీఁద మోపవంతనె తలార్లు . శుక. 3 208.

5 గుచ్చు, నాటఁజేయు, దోపు

సీ చక్కెరకెమ్మోవి చవి చూడనేకాని మొన పల్లు చుఱుకన మోపరాదు
దశా. 2 311.

సీ. చరమరింఛాపుటాంచలటంకశిఖరంబు లుద యాద్రి చటి జాఱకుండ మోపి .
కాశీ. 1 126.

కం. తలగులపొది యొకదెసఁ బె,య్యలబాము వ యొక్కవలన నను వై యుండన్, మొలమోపి పెక్కుచుట్లన్, బలుత్రాటం జుట్టి గోచభావం బమరన్... భార. విరా. 1. 175.

వి. 1. మోచుట, వహనము.

వ. .. తమతమకై యెడపడనికావటి మోపుల కతనం గంది కాయలు గాచివంగిన వలుద మూఁపులను... హరి. పూ. 5. 142.

2. కట్ట

గీ. ముదురుదీవెల బిగువుగా మోపు గట్టి...
హం. 1. 20

గీ బిసము లాదట వందలుఁ బెఱికి రొంపి, వోవ నీటఁ దెమల్చి మోపుగ నమర్చి ...
భార. అను 3. 223.

3. సమూహము, గుంపు.

సీ మెఱుఁగారు కెంజాయ మెఱసిన యెఱకల మోపున నెసఁగు పెన్ ప్రోఁతతోడ ...
భార. సౌ. 1. 16.

చం .. తమ్మికెంపు పెన్, దొడవుల మోపు వఱెస్త్ర చమంగపచక్కి నొకింత చూపఁగా, వడి మగుడంగ నేఁగుచెలువం గని నవ్వుచు నింతు లింపునన్... యయా. 5. 14.

సీ. తనగాలి యింతసోఁకిన జారుదిగ్గజంబుల మోపు గని శేషభోగి ములుగ... రా వి. 3. 50.

4. మూట

ఆ ... తత్కరుణ వడసి వసిఁడిఁ ద్రవ్వితండ, ములు నృపాల పెక్కుమోపులు దెత్తుము, రమ్ము భారవహులఁ దెమ్ము చాల ...
భార. అశ్వ. 1. 62.

మ. బలియుం డొక్కపటానిరౌతు తనబాహా నూకుచున్ రెండువీ, థుల మాష్టీలతలల్ కరాసిలతికం దుండించుచుం బట్టి కా, నల రెం దత్తనువుల్ దరం బడుట భూపాళ్లు ప్తిచే వెట్టిమో,పులు నేలంబడవైచి కూలబడుకాఁపు లోర్వెలె నప్పట్టువన్... కువల. 2. 141.

ఉ ... విడియంపుఁ జొక్కుతో, మైలలమోపు వీఁపున నమర్చిన రేవుగుజాని నెక్కి....
శుక. 3. 103., భార. అశ్వ. 3.157.

5. భారము, బరువు.

సీ. క్రొవ్విరులెసఁగి పూగొలలమో పొసక నవకంపు లేఁదీఁగె నెవులునట్లు... కు సం. 3. 9.

ఆ. సూతపుత్ర యితఁడు సాతలఁ బెద్దమో, పెత్తి నమ్మి యున్నయట్టిచోటఁ, గ్రందు సేయ వాఁడు గాదని సైరించి, యున్న బ్రదికి తింక యూరకుండు. భార. ఉద్యో. 4. 251.

చం ...టక్కరి బలుమోపు మోచు నయగారి తనం బది యుట్టిగట్టినన్ ...
ఉ. హరి. 4. 46.

6 బరువైనవస్తువు.

మ పఱమూరల్ బలభేదిదొట్టిసురలన్ బాధించు టంజేసి వ్రాఁలు నాకుం దలచూప నోడుదురు శూరశ్రేష్ఠు లన్యుల్ జగంబుల తే రెవ్వరుఁ గయ్యపు స్థలమునన్ గొంచెన్ ద్రిలోకేశ బాహులు వే యాఱడిమోపులై యెటుల బోవో పుం దలం కయ్యెడున్... హరి ఉ. 7. 16.

ఉ. ఆవరిమోపకారనిధి యప్పుడు వేల్పులరా యభార మ,వోర్వు వహించి ...
నైష 3. 76.

సీ కమల యేనిశ్చఁ రమణులేకడకు మోపై నిల్చి యతనిపేరఁ దుగుపఱిచె... వసు. 1. 66.

7. ఎక్కు, జ్యాసంధానము.

కం ... రిపుభంజనము రత్నభూషిత రూపంబును గురుదేశాహ్లాదనమును వగునిజకార్ముకంబు మో పెడలించెన్... భార. విరా. 1. 170

8. శాఢ్యత, పూచి.

సీ. కన్నులు లేనిమాకన్నులుఁ గాళులు నీవకదన్న మానిఖిలవంశ ఆ. మును నముద్ధరించుమోపు నీయదియ క,దన్న... భార. ఆది. 7. 261

కం. .. పృథివీపతి సీతలన తన కార్యభద్గంబుల మో పెక్కించె రిత్తవోవునె నీకున్ ...
భార. విరా 5. 23.

9. అధికము.

ఉదా: ఐవువెల మోపైనది.

మోపుకాఁడు విజ (మోపు+కాఁడు) భారవాహి.

కం నీ వేటి మోపు కాఁడవు, నా వెరపున నిన్ను
వడపినను గర్వం బేలా వెడఁగ ....
భార. ఉద్యో. 3. 320.

మోపుకొను. స. క్రి. (మోపు+కొను, స్వార్థమున) చేర్చు, పెట్టుకొను.

వ. అబ్రహ్మచారి దెచ్చినపుస్తకంబుఁ బుచ్చుకొని
శిరంబున మోపికొని కన్నుల కద్దుకొని తిరుగ
నతనిచేతిక యిచ్చిన... కళా. 4. 59.

మోపుకొలుపు(ల్పు) స. క్రి. (√మోపుకొను) మోపుకొనఁజేయు, ఆవేశింపఁజేయు.

గీ చేతిక లొనర్చి తేనియ ల్చిలుకఁ బలికి, మోహ
మూరించి తరితీపు మోపుకొల్పి, యతనిమీఁదను
బతికిని హితము వొడమ, మున్నె యొనరించి
వానితో మురియఁ దొడగె...హంస. 2. 169.

మోపుదల. వి. (√మోపు) 1. ఆరోపణము 2. భారము (శ. ర.).

మోపెట్టు స క్రి. (మోపు + పెట్టు) ఎక్కుపెట్టు, జ్యాసంధానము చేయు.

కం. ఎవ్వరికిని మోపెట్టను, దివ్వను శక్యంబు కాని
దృఢకార్ముకమున్... భార. ఆది. 7. 25.

మ .. పాలిక గర్వంబులా,డిన నిక్కంబగు నల్క
నర్జునుఁడు గాండీవంబు మోపెట్టఁ గృష్ణుని సార
థ్యము నై జగత్త్రితయనంక్షోభంబు గాకుం
డునే... భార. విరా 1. 268.

మ. మతశక్తిన్ నృపసూనుఁ డట్టిధనువున్ మోపెట్టి
యైంద్రాయుధో,ద్ధతి పాథోదనిరానియ ద్యెక్కె...
రాఘవ. 2. 108.
ఆం. భా. 2; 112.

మోము = మొగము. వి ముఖము.

కం. భూమీశుఁ డపుడు మంత్రుల, మోములు
గనుఁగొని సగర్వమున నిట్లని యెన్...
భార. విరా. 5. 241.

ఉ. మొగ్గతిలంబడెం జెమట మోమునఁ గ్రమ్మఁగ
ద్రావిడోత్తముం,డు... హర. 1. 21.

గీ. మోముదమ్మిని జిరునవ్వు మొలకలెత్త...

శా ... అ.య్యా మీతంద్రి గడింపలేదుగద
వెయ్యార్లెన్నడుం జాలు మీ, మోముల్
దింతురుగాక యిం కమచు వీఁపుల్ చిట్లిపోఁ
గొట్టుచున్... శుక. 3. 277
ఆం. భా 2. 42.

(ఇటు నిందాద్యోతకము.)

మోమునవ్రేలు = ఎల్లప్పుడు కన్పడుచుండు.

సీ. ... కర్ణభీతి, నుల్లల నుకుకుచు నుండుదుఁ
గర్ణుఁడు విడువక మోమునవ్రేలు నాకు...
భార. కర్ణ. 3. 33.

మోముచూచు = మోమోటపడు.

ద్వి. తెమ్ము మా కవి యని దేనిమై నున్న
సొమ్ము లన్నియు మోముఁజూడక యొలిచి....
ద్వి. హరిశ్చ. పూ. 1527 పం.

మోముముడుచుకొను = కోపగించు.

సీ. మీఁదఁ జల్లక మాన మిట్టిమీనై పడ్డ ముంతు
నిఁతకు మోము ముడుచుకొనిన ...
బహు. 2. 61.

మోమువిచ్చు = ముఖవికారము చేయు.

చం. ... దళనకోరకముల్ వెలయంగ మోవి మె,
ప్పలరఁగ మోమువిచ్చుచును వద్దముఁ జూచె
నొకర్తు వేడుకన్... నృసిం. 2. 86.

జ. మోముట్టు, మోముపట్ట, మోముముట్టు,
మోమోట, మోమోటపడు, మోమోటమి,
మోమోటము, మోమోడు.

మోముట్టు — మోముపట్టి, మోముముట్టు. వి. (మోము + ముట్టు) అశ్వాదులముఖాలంకారము.

సీ. గండురానిగ్గు చొకాటంపు మోముట్టు తొగ
రికలపతాణి దుమికియాడ ...
ఉ. హరిశ్చ. 3. 131.

(మన్మథాశ్వవర్ణనము.)

వ. అగస్త్యేశం గన్నేరుల ముట్టు మల్లెవిరుల జాలంబు మంకెన పూలెంకెవన్నెలు దావ వంబుల పక్కెరలును. .
పాండు°. 5. 136 (91 పా 21 పం)

**మోముపట్టు** — మోముట్టు (√మోము) అశ్వాదుల ముఖాలంకారము.

చం. .. మోముబట్టనీ, ఒలరిచి రాజుమ్రోలకు హయంబొకసాహిణి దెచ్చెఁజెచ్చెరన్.
పె. శకుం. 1. 117.

**మోముముట్టు—మోముట్టు.** వి (మోము+ముట్టు.)

ఉ. చక్కసి మోముముట్టు మణిశాలిఖలీనము మేలుజాళువా, పక్కెరపీలికుచ్చు లిరుప్రక్కల నెక్కిడి చేర్పుసింగిణుల్... రామా. 2 20.

ఉ. బంగరుజల్లులున్ బికిలిబంతితలాటము ముత్తియంబులున్, రంగుగ మోముముట్టు నవరంజి ఖలీనము పట్టుపల్లమున్, సింగిణి విండ్లు తూణములు చిల్కులకోలలు పట్టియంబులున్, సంగతి పార్శ్వభాగములఁ జక్కఁగఁ బూనిచి పాదినిల్పినన్. ప్రబంధ. 182.

**మోమోట** = మోమోటమి. మోమోటము. వి. (√మోమోడు.)

1. దాక్షిణ్యము, కనికరము.

గీ. అకట మోమోట లేక తా రంత చేసి, బ్రతికి పోయిరె పులి పేదపడినఁ బసుల, వాండ్రె యొక్కొడి రనుకత వచ్చె వాకు ...
ఉ. హరి. 4. 102.

మ. ఇతఁ డాపాపనియట్ల వెంట్రుకలు మోమింపారుకన్నుల్ జగన్నుతుఁ డజ్ఞాతుని పోలికైనయురమున్ మూర్ధంబు మోమోటకుం, బ్రతి యేమే నొకదైవ సంఘటనమైఁ బ్రాణవ్యపాయంబు లేక తగం బుత్రుఁడు వచ్చె నొక్కొ వను మాంగళ్యంబు నొందింపఁగన్...
హరి. ఉ. 5 203.

మ. జగతీమోహనవతంసభూషణము విశ్వఖ్యాతముం గాశికా, నగరంబు స్పెడఁజాసి నీకును జగన్నాథైకచారిత్ర యీ, చిగురుంబోఁడికి వాకునుం గటకటా చేడ్పాటు వాటిల్ల నీ. ముగురం గూర్చి న ముండదైవమునకున్ మోమోంట లేదోనుమీ... భీమ 3. 6.

2. ప్రీతి.

సీ మోమోట వలరు తమ్ముల తావు లగలింపఁ గనుసన్నమను ఝుషకముల వలఁప...
వేం. పం. చ. 4. 122.

3 మనస్సంకోచము.

శా. నీమోమోటలు మాని నీరజముఖి నిక్కంబెఱింగింపవే... పారి. 1. 83.

శా. మోమోటేమియు లేక దూఱదరు మీ మోసంబు చింతింపరు ...
భాగ. 10 పూ. 826.

**మోమోటపడు.** అ. క్రి. (మోమోటము + పడు.) మనస్సంకోచమునొందు.

సీ. మోమోటపడక తమ్ములచాయ నిరసించి పలు తెఱంగులఁ గుందముల హసించి ...
పె. శకుం. 1. 43.

ద్వి. ముక్కు మోమెఱుఁగక మోమోటపడక, మ్రొక్కళీఁ దనుచందమున విడనాడ...
అ. మ. క. 2. 92 పా. 14 పం.

**మోమోటమి** = మోమోట. మోమోటము. వి. (√మోమోడు) మనస్సంకోచము

కం. మోమోటమిచే మీతో, నేమియు ననవోవఁ డితఁ డిప్పుడు మీ రా, రాముని కానల కను పుఁడు, నేమంబునఁ బడమి జేనిఁ జేయుఁడు భరతున్... అచ్చ. రా. అయో. 49.

**మోమోటము** — మోమోట, మోమోటమి వి. (√మోమోడు) మనస్సంకోచము.

కం. రామునిదెస కష్టేఁగిన, ప్రేమావేశమున మనసు బెగడ వివేకం, బేమియుఁ దోఁపక తగ వును, మోమోటము దక్క యలుక ముద్దియ పలికెన్.... భా. రా. అర. 2. 72

శా. ఆ ముక్కంటి దరస్మితంబున సుపర్వాధీశు లన్ జూచి మీ,తో మోమోటము లేక తెల్పెద....

ఉ. రా. 1. 318.

కం. లేమా నీవెత మానుప,లేమా మోమోటముస నళింపఁగ నిపుడే, లే మాఱుమాట యొసఁ గుము, వేమాఱును దలఁక నేల వేఁదుఱు మీఱన్.

నీలా. 2 93.

మోమోడు అ. క్రి. (మోము + ఓడు) 1. దాక్షిణ్యపడు.

కం. ఆడిరి ప్రమోదవృత్తము, పాడిరి మంద్రక మహాప్రబంధమ్ముల మో, మోడిరి తెర్థికులకుఁ గొ,ల్లాడిరి కైవల్యలక్ష్మి నమరులు ముకులున్.

కాశీ. 2. 37.

దండకము ... ఈ కావకస్తోత్ర మెవ్వారికిన్ కాశమా వాకికిన్ ఘోరకారాలగ చ్ఛృంఖలా బంధముల్ వీడు మోమోడు భూపాలుఁ డాలంబులో వైరిసంఘంబు లోడున్.

వరాహ. 11. 118.

2. సంకోచించు.

గీ. మొదల నప్రియ మయ్యును దుది గరంబు, పథ్య మగువల్కు ప్రియులందు బలిమినైనఁ, బలుకవలయు మోమోడక యొలసి యట్టి, వాఁడు దగుసహాయుండు భూ వల్లభునకు.

భార. పభా. 2. 192.

కం. అక్కట బలితపుటడవిన్, మొక్కలమునఁగ గోల నునిచి మోమోడక నీ,విక్కడకు రాఁగ నెదలో, నక్కటికం బేల పొడమద య్యిట్టి చెపుమా.

అచ్చ. రా. అర. 79.

శా. సాహంకారత శంకరుం డలిగి నేత్రాగ్నిన్ పయిన్ బంపినన్, స్వాహాకాముకుఁ డౌట ని న్నతఁడు గావంబోలు మోమోడి...

మనుచ. 3. 47.

మోయించు. స. క్రి. (√ మోయు) మోవఁ జేయు, వహింపఁజేయు,

గీ. మందరాద్రిని మోయించి మాధవుండు, పట్టి తెప్పించె నిర్జరప్రతతిచేత... హర 6. 49

వ. ... కొందఱు కులుకులాఁడులు తమకులుకు గుబ్బలం బోలకున్న నీళ్లు మోయించి రకఁ జాలు జాలువాగిండ్లు పూని...

ఉ రా. 5. 248.

మోయీను. వి. (హిం. మోయీను. మి. గ్రా.) బత్తెము.

సీ. మోయీను కుగ్గాణమును జెప్ప వడ్లగింజలకు బరాతముల్ నరవి వ్రాయు. వేణు. 65.

మోయు. స. క్రి. 1. వహించు.

గీ. తోయజాక్షుండు బాహాచతుష్టయమున, మాట మాత్రనె మోయఁడే మందరాద్రి.

హర. 6. 48.

మ. ...పొల మంబల్మోయుచుం బట్టి పె,న్మసురం దీఁగెడు కాపు గుబ్బెతల... ఆము. 4. 133.

2. అంటు, తాఁకు.

గీ. మెదడు ముద్దలు గావించి మెసవి మెసవి, కుతిగ మోయఁగ నెత్తురుల్ గ్రోలి క్రోలి.

దశా 2. 435.

గీ. ... తన్నృపతి బలశ్రీ గలంగ, నరిగి మునిఁగెఁ దశ్కాండచయంబులోన, మునిఁగి యాఁగెను జనమేను మోయకుండ, దాని తిరమైన శాస్త్రాంత ధర్మపటిమ. రాఘవ. 4. 236.

జః మోఁత మోపిక. మోయించు.

మోర. వి. (క. మోరె, త. ముఱై) 2. పశ్వాదుల దీర్ఘముఖము, ముట్టె.
(పందిముట్టె.)

సీ. మును మించి నిడుమోర ముంచి దూటిన మహాజలధిపూరము దలకెడపు గాఁగ...

హరి. పూ. 4, 16.

చం. బల మిఁక నేమి సెప్ప నిను పండువెదుర్లన లీల మోరత్రో,పులఁ బడఁ జొప్ప వంచుకొను పోలిక వంచి తదగ్రధాన్యముల్, సెలవుల ఫేన ముట్టిపడ జిట్టలతోడనె చప్పరించు న,ప్పొలము

వరాహపోతములు ఘూవర తొండము లేని యేనుగుల్. మనుచ. 4. 98.

శ్లో. ... మోర నా ముట్టె నా వెలయును ముఖ విశేషము లగు .. అం. భా. 2. 142.

(పశుముఖమునకు.)

సీ. అరచేత మోరలు చఱచియుం దఱిమి.. నీలా. 3 74.

(పశుల శునకముఖముఁకు.)

వ. ముంగిన మోరలంబోని మోరలు సంసారె సారెకు నెత్తి మనుచ 4 27.

కం. మోరలు పై కెత్తుచు భా. శౌరములతోఁ జెలంగె భపకము లపుడు... రసిక 1 107.

(ఉష్ట్రిముఖమునకు)

ఉ. నురువు లురువు వెడదనోళ్లతోడుత మోరఁ లెత్తికొనుచు వేఁదు కె త్తినట్టు, లుబ్బురేఁగి యున్న యుష్ట్రిములును భా రా య. 5.8.

(భల్లూకముఖమునకు)

వ మృగాంకమండలంబు సగము కఱశిన రాహుగ్రహభూమికల చందంబున నదంద తిరుగు బొల్లిమోర భల్లూకంబులును. పార 2. 67

(అశ్వముఖమునకు.)

వ. ... వివిధవిశిఖపరంపరలు వరఁగింప ముందటి కాళ్లు దునిసిన మ్రొగ్గతిలంబడియును మోరలు పఱియలై వ నెఱి దప్పం గూలియు .. అనేక ఘోటకంబులు రూపఱిన.

భార. భీష్మ 3. 239.

(కొన్ని యెడల ముఖసామాన్యముగ నుపయోగింపఁ బడినది.)

సీ. దక్షవాటికఁ జూచి దక్షప్రజాపతిఁ బొగడె నల్మోర్ల నంభోజభవుఁడు... భీమ 3. 135.

శ్లో. బ్రహ్మా తుష్టావ సంతుష్ట శ్చతుర్భి ర్వదనైరపి. సం. భీ. మ.

సీ. కూడనిత్తునె మాఱుకొని మోర యెత్తిన గది మెద... బహు 2 61.

సీ. జోదుల తనువులు భేదించి మోరలు గళ్యాల తోడఁ జెక్కలుగఁ జేసి..

భార. కర్ణ. 1. 140.

జ. మోరకొట్టు, మోరతెల్పుమెకము, మోరతోపు, మోరత్రోపుఁదనము, మోరపక్కియ, మోర మెకము

మోరకొట్టు. వి (మోర + కొట్టు) చపేటము, చంప కాయ

కం కొసరు వగమాట లలుకలుఁ, గుసిగుంపులు తిట్లు మోరకొట్టులు జారుం, డనమనుఖంబుగఁ గైకొను, బనవె ద్దగుమగఁడు మండిపడుఁ గుసుమాంగీ... శుక. 1. 441.

మోరట. సం వి. అ. స్త్రీ మూర్వ, వింటినారికై యుపయోగించెడి నారచెట్టు, చాఁగ (వ్య వి.)

మోరటము సం. వి అ. పుం 1. తియ్యనిరసము గల చెట్టు 2 క్రొత్తగా నీనినయావుపాలు, ముఱ్ఱు పాలు, జున్నుపాలు. న. 1. ఇక్షుమూలము, చెఱకుమొదలు, 2. అంకోలము, ఊడుగు(వ్య.వి ).

మోరటి. వి ప్రియాళము. (శ. ర.) (వ్య వి ).

మోఁటిలు(ల్లు). అ. క్రి మోము మీఁది కెత్తు.

ద్వి. ఏనొక్కరుండ వన్నిటఁ దో డొకరిఁ, గానక బెగడి నల్గడలు చూచుచును, బడలుచు గగ్గోలు వడి మోరటిలుచు ...

విష్ణు. పూ. 3 ఆ. (శ. ర.).

మోరడి. వి. హెచ్చరికపదము. ప్రబంధ. 605.

మోరడు—మోరడు. వి. మోడు, మొద్దు, స్థాణువు.

(బ మోరడులు, మోరళులు, మోరళ్లు.)

సీ. అమృతంపుసోన పై నడరినట్లీ పాట చెన్నువ మోరళ్ళఁ జివుళు లెత్తె ...

వృసిం. 2. 88.

మోరతెల్పుమెకము. వి. (మోర + తెల్పు + మెకము) భల్లూకము, ఎలుఁగు.

గీ. అంతఁ గొందఱు కోఁతిబంట్లా తెఱంగు, తాము కడ కేఁగి తెలుప నారాచమిన్న, మోరతెల్పు మెకపుఱేఁడు మొదలు గల్గు, బల్లిదుల నేర్చి పోరికిఁ బనుపుటయును ...

అచ్చ రా యు. 298.

(మోరతెల్పు మెకపుఱేఁడు = జాంబవంతుఁడు.)

**మోరతో(త్రో)పు** వి (√మోర) అనాలోచనము, అనాలోచనచేష్ట.

ద్వి మునియనుష్ఠాన మిమ్ములఁ జేయఁ బోవ, మునివేల్పులను బట్టి మోరత్రోపునను, వనధి లోపలఁ జాఱవైచె ననలుఁడు.

రం. రా. యు. 311 పా. 22 పం.

ఉ. ... చూపు నీ, వీరతఁ గాండివీశ పద వీర త వృత్తిని మోరత్రోపునం, జాఱెద నన్నఁ బోవి డఁడు స్వర్ణవిలోచనుఁ డంచు నుగ్రుఁడై ...

దశా. 3. 200.

ద్వి. కడుకోపమున విటకంటికి పలికె, వల దన్న నేఁటికి వచ్చెద వింక, పొలసు వైవఁగ నదె పోపొమ్ము కొండఁ, దల నెత్తుకొన నీకుఁ జం మెయిం తేలఁ, దొలఁగరా యీమోరతోపు లేమి టికి. ద్వి పరమ. 4. 209

**మోరత్రోపుఁదనము** వి (మోరత్రోపు + తనము- స్వార్థమున) అనాలోచనము, అనాలోచనచేష్ట

గీ. ... దైవతసైన్యము నాథునంబు, గుఱియు శర వర్ష మొక్కింత సరకుగొనక, మోరత్రోపుఁ దనంబున మోఱకించి, తాఁకె పెనుబోతురా కాని శాకవిభుని. వరాహ. 11. 64.

ద్వి. తూలగించక మోరత్రోపుఁ దనంబు. చాలింపు మనవుడు సచివనందనుని ...

నవ. 1. 41 పా. 10 పం.

**మోరప(క్కి)క్కియ.** వి. (మోర + పక్కియ[3]) మత్స్యవిశేషము, ఒకజాతిచేఁప.

గీ. మోరపక్కియ దొండును గూరముప్పు. పుల్ల రుజు గెచ్చె గెండెయు బొమ్మడాయ..

హంస. 4. 187.

**మోరపాక = ఓరపాక.** వి పంచను దూలములు లేక గోడపైనుండి ప్రక్కకు దింపి రాదుఁ యాధారమునఁ గట్టినశాల (శ ర).

**మోరము** వి మోర, ముఖము

కం. నాటకశాలను మోరపుఁ, బాటకు మాతండ్రి యచలవరుఁ తుంచుట నెచ్చోటికి నిజముగఁ జనినం, జీటియ్యఁడు సంబళంబు చెల్లెడిచోటన్

పార్వ 2 168

(మోరపుఁబాట = నోటిపాట, కంఠగానము)

**మోరమెకము** వి (మోర + మెకము) వానరము.

ఆ. అంతఁ బ్రొద్దుమాలియానతిఁ గడలకు, దఱు లమోర మెకపుదాఁటు లేఁగె.

అచ్చ. రా. యు. 81

**మోరిజా** వి. (హిం. మోర్జా. మి. ప్రా) తుపాకులు పిరంగులు పెట్టుకొనుచోట.

చం. బలముల నెచ్చరింపుచుఁ దుపాకులమూఁకలు దంధమాలు నిట్టలముగ మోరిజా ల్పురుజు డాయఁ గిలార్పుచు రంగా. 3. 77.

**మోరు**[1] వి (త మోర్, క. మొసరు మ. మోర్.) చల్ల, దండాహతము

గీ పాలు ఫలములు నెడనీళ్లుపానకములు, మారుఁ బిండ్లూరుఁగాయలు తైరు తొంతి, పాంకుల వణంబు జంభలఫలరసములు, నించఁ దగునీరు మో రారగించి లేచి. ఘటికా 2.16.

ఉ వడ్డన జూపి రంత చెలువల్ తెలియోగిర మొల్పు బప్పు మెం, దొడ్డినకూరగాయ ఘృత ముక్కెర చక్కెర తేనె లడ్డువా, లిడ్డెన నాన బాలు చలియించనితైరులు మోగమేరుపై, గిడ్డిఁ దలంచిరోయనఁగ గేస్తుల కబ్బె సమస్త భాగ్యముల్. పాంచా. 4. 42.

సీ. గారెలు బూరెలు చారులు మోరులుఁ గమ్మని మాఁకవల్ ఘమ్మనెపనచ ...

ఉ. రా. 6. 122.

జ; మోరుండ

మోరు². వి. (పర్వత) శిఖరము.

వ. ఇవ్విధంబున నమ్మేరునగంబునం దొక్క మోరు నీ అగుటయు... ఉ. హరి. 6. 76.

సీ. దరులతడివందు పొదవుమూపురములంటు, ఘల్లుగంటల నాఁబోతు లుల్లసిల్లె, గిరుల మోరులునవి సముద్గీర్ణసలిల జలధరచ్ఛేదములు ప్రాలఁ జెలఁగుకడణి... ఆము. 4. 156

వ. తనసముద్దామతేజోభరంబునన్ జడిసిన మేరుగిరి మోరులుంబోలె... మనుచ. 5. 71.

గీ. పొలుచు శిఖరపుగొనపేరు మోరు నాఁగ... ఆం భా. 2. 18.

మోరుండ. వి. (మోరు¹ + ఉండ) భక్ష్య విశేషము.

సీ. లడ్డువంబులు చక్కిలాలు మోరుండలు ఖండంబు చెలిమిడి మండపప్పు ... హర. 6. 55.

వ. .. తిమ్మనంబులు పాలకాయలు చక్కిలంబులు మోరుండలు మనోహరంబులు .. ప్రబంధ 1. 112. హంస. 1. 105.

మోఱకతె(త్తి య.) వి. (మోఱకము + కత్తె) మూర్ఖురాలు. కృషా. ఠ. (శ. ర.)

మోఱకము వి.(√మోఱకు సం మూర్ఖతా) మూర్ఖత్వము.

సీ. అఖిలలోకేశ్వరుం డగురమాధవుతోడ విడువని వైరంబు దొడరునట్టి, మేఱక యేటికో మొలచె దైత్యునిబుద్ధి... నృసిం. 1. 20.

సీ ఇక్కొమ్మ నడపించునెడ వీరిఁ బఱపుదు ననుట మోఱక మగు నని తలంచి... దశకు. 5 91.

సీ. చంపంగ వచ్చినజమునిదూతలకు లంచము పెట్టి వచ్చెనో చావ నొల్లఁ, బొమ్మని మోఱకంబునఁ ద్రోచి వచ్చెనో... భోజరా. 4. 58., పద్మ. 10.67

విణ. మూర్ఖత

ఉ. చర్మభావ మొంది సుస్పర్శసుఖముల, కాస జేసి నీవు ననుదినంబు, గజమువేడ్కఁ దగిలి గజము లోఁబడుభంగిఁ, గట్టువడకు మోఱకంపు మనస... వా రా. 4. 145.

మోఱకించు. అ. క్రి. (√మోఱకము) మౌర్ఖ్యమవలంబించు.

గీ ... దైవతసైన్య ఘనాఘనంబు, గురియుశరవర్ష మొక్కింత సరకుగొనక, మోరత్రోపుఁ దనంబున మోఱకించి, తాఁకె నెనుపోతు రాకాసి నాకవిభుని... వరాహ. 11. 64

మోఱకుఁ(డు) = మోఱకు. (సం. మూర్ఖః)

విణ. మూర్ఖుఁడు.

ఉ. పాఱగ నమ్మహీపతియుఁ బాయక తోడన పాఱెఁ బాఱ న,క్కాఱడవిం గిరాతతతి కాపురముండెడుపల్లె చొచ్చి పె,న్మోఱకు భంగి మాంసములు ముక్కునఁబంటిగ మ్రింగుచుండ దై,వా ఱడుభక్తి నత్రిమునిపట్టియ కామదిలోఁ దలంచచున్... భోజరా 1 115.

కం అగు దేశకాలబలయుత, ముగఁ జేసినపోరవర్గములు మోఱకులై. తెగబాటి తమ్ముఁ జెదిరిని, వగవక తొడరుటలఁ గీడు వర్తిల్లుఁదుదిన్. భాఁ విరా 4 208.

శా. మో మడ్డఁబు గదల్చి మోఱకుఁడునుంబోలెన్ శివారాధకుం,డు... హర. 2. 57.

వ. అప్పుడ మ్మోఱకుండు పురోహితులం బిలిపించి. నృసిం. 4. 90.

జః మోఱకతె, మోఱకము, మోఱకించు.

మోలము = మొలాము. వి. బంగారులోనగు వాని పూఁత (శ. ర.).

మోలుగు = మొలుగు. వి. నల్లచాయచెక్క.

వ. ... మోలుగుమడ్డిం దోఁచి మూర కొక్కుం డును జాన కొక్కుండును గాఁ గట్టినదొల్లు టుల్లారు లుల్లసిల్ల ... ఆము. 4. 85

మోళంగి. వి. ములక (వ్య. వి.) (శ. ర.)

మోళము = మొలాము. వి. బంగారులోనగు వాని పూఁత.

గీ. జమునినాలుకతో నెకనక్కెమాడఁ, దమక
పడు గ్రొత్తపైఁడి మోళముకటారి...
నైష. 8. 64.

మోవి[1]. వి. పెదవి, ఓష్ఠము.

కం. ... తమిమ్రెకెంపుగుంపును, ముగుదనిగారెం
పుఁదొగరుమోవికి దొరయే. నీలా. 2. 22

లయవిభాతి ... చిగురుజిగి నెగచుమోవిన్, నగవు
నిగుడన్... మనుచ. 4. 117.

గీ పరగుఁ బల్కపు మోవి వాతెఱ పెదవియు
నాఁగ నోష్ఠంబు... ఆం భా. 2. 142

సీ. మెలఁత మేని మెఱుంగు మెఱయుకారు
మెఱుంగు చిగురుకెంపులగ్రోవి చిన్ని మోవి. .
విక్ర. 1. 119.

మోవి[2]. వి. ఒకజాతి యడవిచెట్టు

(ఇది పనస వంటి యాకులు గలిగి యుసిరిక లంత
పండ్లు గలిగియుండు. ఇది శ్వేతనీల భేదంబులచే
ద్వివిధంబు. నల్లమోవి పండ్లకంటెఁ దెల్లనివి
మిక్కలి మధురంబు లయి యుండు. ఈ వృక్షం
బులు వేంకటాద్రి లోనగు ప్రదేశంబులఁ గలవు
చి. ని.)

తోటకము. మోవులు రోవులు మోఁదుగు లొద్దుల్
రావులు నిప్పలు శాణ దలిర్పన్...
యయా. 2. 48

సీ. వెలగపండులు పుల్ల వెలగపండులు మోవి
పండ్లు నంకెనపండ్లు బలునుపండ్లు ...
శాశ. 3. 69

సీ. ఎలమి పల్వరుసల నీమోవి ఫల మందసొరిది
నీకును జవి నూపఁగలమ... విప్ర. 3. 19.

మోవి[3] వి. చిన్న మట్టిపాత్రము.

సీ. కాంతు దంతక్షితిఁ గాంచని మోవియు
మోవియే చల్లమ్ము మోవి గా .
ఆహ 3. 28

మోవి[4] వి. అగ్రభాగము.

ద్వి. నులిగాయ లెడను గానుగుగింజమోవి, మలి
చిన పేరు చన్నులమీఁద బెళఁక...
అ. మ. క. 1 56 పా. 20పం

మోవు వి. ముడుత పీడని లేఁత ఆకు మొలక;
అట్టి తాడిచెట్టు మొలక.

రగడ. మెలచు మొవ్వుల నంటిమోవులను మోవు
లను. భాను 2 68.

గీ విలసితోరుల నవఁటిమోవు లెనయించి, లలిత
పదములఁ జిగురాకు లలవరించి, యందమగు
మేనఁ బన్నీటిగంద మలఁది, సలిపి రింతిక
కైత్యోపచారవిధులు. ఇందు. 3. 19

గీ. ... మోవు, నాఁగఁ శాఖాగ్రతరుణపర్ణంబు
చెలఁగు... ఆం. భా. 2. 77.

మోషకుఁడు. సం వి. అ. పుం. దొంగ, చోరుఁడు.

మోషణము. సం. వి. అ. న. 1. దొంగిలించుట.
అపహరించుట, 2. నఱుకుట, వశింపఁజేయుట.

మోషము. సం. వి. అ. పుం. చౌర్యము, దొంగ
తనము.

మోస = మోసము. (క. మోస) 1. దొంగతనము.

గీ మోసఁ దర్కించి యవ్వైశ్య ముఖ్యుఁ దెచ్చె...
కాశీ. 5. 68.

2. ప్రమాదము.

గీ కాన నెంత రహస్యంపుఁగార్య మైన, నొరు
లెఱుంగరు వన్నని యునికి మోస...
భార. అను. 2. 214.

చం. ముదితల నమ్మ యేమఱుట మోసనుమీ యని
బుద్ధి చెప్పుచున్.. కాశీ. 9. 9.

ఆ. ఉర్వి నేలునాతఁ డుద్ధరింపఁడు నెయ్యు
మెసఁగ భ్రాతృజనము నింత దెలియ, నేర
కునికి యధిప నీమోస భ్రాతృపుత్రులకు నేల
మీఁదఁ గలుగుఁ బొందు. మార్క. 8. 14.

3. అనత్యము.

సీ. ఇది భోగమోక్షసంపదలకు మూలంబు
మోస లే దది ఘనంబులకు ఘనము...
ప్రబోధ. 1. 21.

4. అడ్డు.

గీ. రాజు పరిసరవర్తులు రాష్ట్రజనము, మున్న నశియించి చనుటకు మోస లేదు, గాన సర్వజ్ఞుఁ డనఁగ లోకంబుచేత, వినుతిఁ బొందినరాజు వివేక మమరు. నా పంచ 1 138.

5. వంచన

గీ. మోస గాకుండ నపరాధములకుఁ దగిన, శాస్తి యన్నింటి కిబ్భంగి సంభవించె .. నై ష 7. 192.

ఇ మోసకారి, మోసపుచ్చు, మోసపోవు

**మోసకారి** విశే. (మోస + కారి) వంచకుఁడు, మోసము చేయువాఁడు

గీ. . అప్పుడచ్చెలువ మోస, కారి కెనిమిటి యో వన్నె కారి మగఁడ, యేల చూపితి విప్పుడ యీధనంబు, ధనపిశాచము లివి యథార్థమ్ము సుమ్ము శుక. 3. 223.

**మోసనాలు.** వి. బ. ధాన్యవిశేషము

వ. కూటికుప్పలు శాలుసంపెఁగలు కందర్ప భోగులు గజపతిలాగీలు బొందడీలు పునుఁగుఁ దావులు తేనెతొాలలు మోసనాలు గుబ్బుపుఁ దోఁకలు తేటచలములు. ప్రబంధ. 112.

**మోసపుచ్చు** స క్రి. (√మోసపోవు) వంచించు, మోసముచేయు.

చం....వికటవర్మని నెంతయు మోసపుచ్చి.. దశకు. 7. 129.

కం. అని తపసి తప్పుశిందుఁడు, ధనమదుగశ్ర మోహ మదుగఁ దలఁచిన నీలాఁ,గున మోస పుచ్చి యేఁగిన, వెనుక నియమపరత నాటవిక వల్లభుఁడున్. వరాహ. 7. 94.

గీ. హాఁణ మై రామపర్ణశాలాంచితవన, భూముల బెడంగు దృక్పర్వముగ మెలఁగుచుఁ, బ్రబలు మార్తాండసంతతిప్రభువు మోస,పుచ్చుటకు నంచి తా మోద మచ్చుపడఁగ. రాఘవ. 3. 85.

**మోసపోవు.** అ. క్రి. (మోసము+పోవు) 1. భంగ పడు, వంచితుఁడగు.

గీ. పరవినీతప్రబంధముల్ భంగపఱుప, మొగిసి ప్రాసంబుచేతనే మోసపోవు. రా వి 1 13.

చం ... ఈ, యఱవకు వాశి యింతయుఁ రి యా నని కానక మోసపోయితిన్. వై జ 4. 95.

ఆ. మనము మోసపోయి యనిమిషపతిసూతి, తోడఁ బోడిచితిమి యదోషవృత్తి, నతఁడు సమయకాల మంతయుఁ గడచిన, వచ్చెనో యెఱుంగ వలయు నిజము భార. విరా. 5 372.

కం. తనచేసిన పురుషార్థము, తనసొమ్ముగ నెఱిఁగి వరుఁడు దానపరుం డై, యనుభవి యై మన వలదా, దినములచే మోసపో కతిస్థిరభక్తిన్... విక్ర. ౭. 185.

గీ. ఏమఱుటఁ జేసి యిటువంటి యెడరు పుట్టె, మోసపోయితి మెఱిఁగిన మోస గలదె... నా పంచ. 3 94.

**మోసము-మోస** వి 1. వంచన, దగా.

కం. ... మోసంబు గాక ధర్మజుఁ డట్ల,బ్బినఁ బోనిచ్చుటరాధా,తనయునకున్ బుద్ధియగుసె తప్పెం దప్పెన్. భార కర్ణ. 2, 3.

గీ. కంటిరే వీరవరులార కార్య మంత, మోస మయ్యెను సురల నమ్ముటను నేఁడు... దశా. 2 381.

2. ప్రమాదము, పొరపాటు.

ఉ. ముక్కు మొగంబు చూడ కొక మోసపు మాటకు విశ్వనాయకుం, డెక్కడికైనఁ బొమ్మ నుచు నెట్టనిచూపులఁ జూచె వల్కలిన్ ... భీమ 3. 8.

కం. విని తద్గ్రంథార్థము నెమ్మనమున నూహించి తెలిసి మ్రాన్పడి కడకుం, దనమోసమునకు భయ పడి, జనపతి యటు చనఁగ నిలిచి సంతాపము నన్... ఆము. 2. 77.

సీ...మోస మనఁ బరా కనఁ జమఁ బ్రమాదము... ఆం. భా. 1. 138.

3. అసత్యము.

కం. అనుఁటయు వా రందఱు హాం, మునితో నిట్లనిరి రాజమాయ మువకు మీ, జనకుఁడు దొడఁగినఁ జాలును, మునుముట్టిన వత్తు మిఁదు మోసము గలదే... ఉ హరి, 4. 40.

ఉ. నీసరి యైన దేవతటనిం గలఁగించెద నీ వడం పుమా, నా న శి శేషవన్నగఫణానివహాంబు నటంచు నప్పరిం, జాసలు చేసికొన్న వన ఖాసిలు సాలశిఖాశి ఖేయమున్, మోసమెయైన విష్ణుపదమున్ బలిపీరముముట్టనేఃటికిన్.విజ.1.5

4. తప్పు, అపరాధము

ఆ. కాలఁ జేతఁ జేద గావు నీయట్టివాఁ, డకట యుండఁదగిన యాలయంబు, మున్ను జేసి కొనని మోసాన నీపాట్లు, పడగవలసె నిట్లు వడికి రేయి కేయూర 3. 277.

5. భంగము, అపాయము,

శా. ... తా నందఱన్, మోహాయత్తులఁ జేసి నాఁడు మనకున్ మోసంబు వాటిల్లె నీ,దక్షత్వంబునఁ జక్కఁజేయ వలయున్ దైతేయ వంశాగ్రణీ. భాగ 7. 251.

కం. ... కాలం,బు న్నరులకు వయసుఁ బుచ్చి మోసము దెచ్చున్. ఆము. 2. 79.

ఉ. .. ఇవ్విభుఁ డివ్విధి నీల్గునట్లుగా, మున్నొక మౌని దిట్టుటయు మోసము నేఁడిటు గల్గె... కవిక. 1. 52.

6 అవమానము.

కం నీమాట నమ్మి పోయిన, నా మోసముఁ జెప్ప నేల... కాశ. 3. 163.

7. అజ్ఞానము

కం. తనయందఁ దోఁచువిషయము, లనుభవగోచరము లగుట యది మాయాసం, జనిత సఁవప్నం బై యా,త్మునికిం దమఁ గానలేని మోసము దెచ్చున్... భార. శాం. 4. 123.

మోన(సా)ల = మొగసాల. వి. (సం. ముఖశాలా)

1. నగరి తలవాకిటిపంచ.

ద్వి. జనకజఁ జూసె నాజనవాథుఁ డంచుఁ జనుదెంచి యగరిగి మోసల దేరు డిగ్గి...

ర. రా. ఉ. 125 పొ 23 పం.

కం రాసుతు డని తొడిఁబడఁ దెగి, గాసిని బెట్ట కడియాసఁ గామక మన మీ, మోసాల నున్న నెక్కడ, మోహా తౌనోయటంచు ముంచినభీతిన్. సారంగ. 3. 34.

సీ మోసాల ల్దడవి లోముంగిళ్లు గముఁగొని గొందులు పరికించి కొల్ల గాంచి...

అచ్చ. రా. సుం. 8.

2. ముంగిలి, ఇంటిముంగిలిసాల.

సీ. ఢుంఢివిఘ్నేశుఁ దుండుప్రదేశ మీఱించి లోలార్కు నగరి మోసాల వెదకి.. కాశీ.2. 41.

ఉ. ఆతరలాఱి యొక్కతెయ యానడురాతిరి పెక్కుమోసలల్, వేతఱియంగఁ దూఱియట వీథికి వెల్వడి సందిక్రంతగా, నాతనియిల్లు సొచ్చి... వా. రా. 2. 177.

సీ. హాజారము హజార మనునవి రెండును మోసాల మొగసల మోస లనెడి,నివి మూఁడు నంతైదు నెసఁగునుముఖశాలకు...ఆం.భా.2.14

3. తలవాఁకిలి, నోరు.

సీ. పెనుఱాఁగయై ప్రోఁగుచునును మోసలకు నేఁగు వలు మొగంబుల వేల్పు చెలువ దొరయు ... సీలా. 1. 52.

(1. 3. అర్థముల కుదాహరణము.)

మోసు. వి. మొలక, అంకురము.

చం. మలయసమీరణాభిహతి భ్రమాకుల నాకులు డుల్లి డుల్లి క్రొ,మ్మొలకలు సాఁగి సాఁగి విరి మోసులు గెందలిరొత్తి యొత్తి..కు.సం.4.443.

సీ. మొలక మొలవ మొక్క మోవ మోా సిరిక మొటిక నా నంకురం బొప్పుచుండు ...

ఆం. భా. 2. 35.

శా. ఆసుద్దుల్ విని చేఁ గృపాణిఁ గొని జావాయుగ్మ మీఱించి బల్,మీసంబుల్ వడిఁ గొల్పి బల్మినగవుల్ మీఱన్ దృగారుణ్యముల్

మోసుల్ బూనఁగ మానసాంమహిపాలుం
డాప్తుఁడం గాంచి యో.వాో సూరుం డరుదెంచె
నంచుఁ బలికెన్ వాలుంకార మేపారఁగన్...
రా వి 4 125

2 మోవు, మొవ్వు

చం. మొలక లోకింత గావఁబడి మోసులు మెల్లనె
వెళ్ళి పోగలై. సారంగ. 3. 257.

ద్వి తునిసిన మొండిచేతులు రెండు నపుడు,
మొలచి యంకురము లై మోసులు సాఁగి...
పండితా. పురా 103.

కం ... ముదిత కనుబొమల్, ముడివెట్టె నాలి
సిగ్గున, ముడివెట్టెన్ నారి చెఱకు మోసున
మరుఁడున్.. మనుచ. 5. 94

3 అందము

సీ. నాభినామంబు నెన్నడుమఁ గస్తురిరేఖ
మోసుగాఁ బాపట మోయఁ దీర్చి...
వైజ. 4. 30.

ఱ: మోసులెత్తు.

మోసు(సె)లెత్తు. అ. క్రి. (మోసులు + ఎత్తు)

1. మొలకలెత్తు, అంకురించు.

మ. బలిచూడామణు లందు విష్ణుపదజుల్ పాటిం
చుధావ్యంపుది, ప్పలు చంద్రామృతసాంద్ర
సేకముఁనఁ బై పై మోసులెత్తంగ....
వసు. 1. 100.

మ. మొదలం బీజము గల్గి యుండఁగఁ గదా
మోసెత్తిమూలంబుతో,విదితస్కంధము మించి.
వి. పు. 3. 152.

చం పొలుపుగమోసులెత్తుచనుపూపలు ఱొమ్మున
నిక్క ... శుక. 2. 154.

2. పుట్టు, కలుగు.

గీ. మోహ మెంతయు నెమ్మది మోసులెత్త, నహహ
వల పంత బలవంత మయ్యె ననుచు...
చంద్రా. 4. 146.

గీ. అమహాదేవి కుడుగక యనుదినంబు, ప్రొమొక్కో
దము ప్రొమొక్కదము భక్తి మోసులెత్త ....
మార్క. 6. 132.

కి కొంచెము కొంచెముగా పైకివచ్చు.

ఉ. అంకురభిన్న మై కుపిత మైనను దాఁకి
యురంబు దూర్చి వజ్రాంకునిదంతిదంతము
లుదగ్రగతిం బెకలింపరాక యాతంకము
నొందఁగా విఱిగి తచ్ఛకలంబులు మోసు
లెత్తఁ గీ, ర్త్యంకురలీలఁ దాల్తు నిఁక నవ్వల
నా కెదు రెవ్వ రెయ్యెడన్ ...
రామా. 7. 171.

మోహణము. సం.వి. అ. న కత్తి లోనగువాని పిడి.

ద్వి. అలుఁగు మోహణమున హస్తంబు దొడిగి ...
బస పు. 5 444 పం.

మోహన. సం వి. అ. స్త్రీ. (సంగీ) ఒకానొక
రాగము. (శ. ర.)

మోహనపునరులు. వి. అ. ధాన్యవిశేషము.

సీ. సాలంక లలుఁగురాజనములు సంభావు లవ
నరదార్లు మోహనపునరులు ...
హంస 4. 128.

మోహనము సం విణ. (అ. ఈ. అ.) మోహమును
గలిగించునది.

(సాధనము.)

వి. అ పుం. 1. మన్మథబాణములలో నొకదాని
పేరు 2. ఉమ్మెత్తచెట్టు, 3. త్రిపురమల్లిక,
బొడ్డుమల్లియ, (వ్య.వి.) 4. స్పృక్క (వ్య.వి.)
న. 1. సొమ్మ, మూర్ఛ. 2. శత్రువు కలవర
పడుటకై (మోహపడుటకై) చేసెడి ఐంద్ర
జాలకమంత్రము, అభిచారికమంత్రము.

మోహము. సం. వి. అ. పుం. 1. స్మృతి తప్పుట,
మూర్ఛ. 2. కలవరపడుట,తబ్బిబ్బగుట. 3.అవిద్య.
4. నివ్వెఱపాటు, ఆశ్చర్యము, 5. అజ్ఞానము,
6. దుఃఖము, 7. ధర్మ విమూఢత్వము, 8. శత్రు
వును భ్రాంతిపెట్టుటకు లేక కలవరపఱచుటకుఁ
జేసినఐంద్రజాలిక (మంత్రశాస్త్ర సంబంధమైన)
క్రియ.

9. వలపు, కామానుబంధము.

గీ. మోహినిపై మోహమునఁ బెక్కుదివసముల్ దన్నుఁ దా నెఱుఁగక యున్నవాని... విప్ర. 4. 44.

ఉ. మొల్లసుగంధి నామనసు మోహము నాఁటి వెట్టి నీవు న, న్నొల్లక పీడనాడెద వయో తగవా... విప్ర. 2. 233.

**మోహరము.** వి. 1. వ్యూహము, మొగ్గరము.

కం. అరయుదము గాని యిమ్మోహరమునకును డాపరించి యరదముఁ బోని, మ్మురవడి నత నిక యుఱికెద, వరుదుగ నెబ్బంగి నెవ్వ రడ్డం బైనన్... భార. విరా. 4. 246.

చం. మునుమును వీఁకఁ దాఁకి యొక మోహర మచ్యుతుచేత బ్రుగ్గుటన్, మొనలు గలంగినన్ గని సముద్ధత వృత్తి నదల్చి వెన్నుద,న్ని నిలిచె దానవేశ్వరుఁడు .. నిర్వ. 3. 13.

ఆ. మూలబలముతోడ మోహరంబుగఁ దీర్చి సుమతి సుతుఁడు సైన్యసమితి నడపె ... విక్ర. 4. 84.

2. సేన.

కం. మోహరములు రెండును స,న్నాహంబునఁ దారసించినన్ ఫల్గున సే,నాహంకృతి యుడి వో ను,త్సాహంబున శౌరి పాంచజన్యం బొత్తెన్... చిత్ర భా. 7. 66.

3. సమూహము.

మ. వరునిం గన్నులమొఱంగి యి ల్వెడలి పోవం బోయి జారోప భో,గరతిం జొక్కఁ గఁ జొక్కుచోఁ దలవరుల్ గద్దించినన్ డాఁగ డా,గి రయోదారత నిల్లు సేరి సతి భంగిం గుట్టుతో బంధు మో,హరముం జెందఁగ నవ్వ ధూమణి మదోన్మాదంబు తోరంబుగన్... శుక. 2. 508.

(బంధుమోహరము దినవెచ్చము వంటిది)

వ. వీథివీథుల జగన్మోహంబుగా నటించు వాహనంబుల మోహరంబులు చూచుచు .. కుచేల. 2. 10.

**మోహరాత్రి.** సం. వి. ఇ. స్త్రీ. కాళరాత్రి, ప్రళయము వట్టురాత్రి. కుచేల. 2. 10.

**మోహరించు.** అ. క్రి, స. క్రి. ఎదుర్కొను, ప్రతిఘటించు.

గీ. మూఁడుకన్నుల వేల్పుతో మోహరించి, నేఁడు దేహంబు లేక యున్నాఁడు దాను .. వైజ. 4. 23.

వ. నానాదేశరాజన్యులం గూర్చి యేడక్షోహిణులబలంబుతో మోహరించె నయ్యవసరంబున. పద్మ. 10. 49.

శా. నాచిత్తంబున నిత్తెఱంగె పొడమెన్ నాగారి ముస్నైన్య చనన్, బ్రాచీదిఙ్ముఖుఁడైన నాకు సరసం బ్రద్యుమ్నుఁడున్ నీవు హే,లాచాతుర్యము దాపలన్ వలపలన్ లావై పచారింప ధా,త్రీచారంబున మోహరింతము పురారిం జేరవై తిమ్మెయిన్... ఉ హరి. 6. 65.

సీ. దేహసౌరభ్యంబు మోహరింపఁగఁ జాలు బహువిధపుష్పసంపదలతోడ ... సుద. 5. 149.

అ. క్రి. వ్యూహముగా నేర్పడు.

కం. ఐనను క్రౌంచవ్యూహవి, ధానంబున మోహరించి దారుణచాపు, స్థానక మై .. భార. భీష్మ 2. 25.

ఉ. .. వేలుపుల్, ముప్పదిమూఁడుకోటు లొక మూఁకయి వెల్వడి మోహరించినన్ ... వరాహ. 11. 60.

ఉ. వారల మోహరింపుఁ డని వాసవుఁ డేఁగె నుపేంద్రుఁ గాన... నిర్వ. 6. 82.

సీ. మోహరించె ననఁగ మొన చేసె నని తోఁచు... అం. భా. 3. 101.

స. క్రి. మోహించు, ప్రేమించు.

గీ. సమయభేదంబు లాత్మ రాగములు గనుక,చూచి యడుగనిని మెచ్చుఁ జూచినావె, దయను

రమ్మని చేసాఁచి గ్రయుఁట ప్రిదివ్వ. మోహిరి తలంపులో నిను మోహరింప ... ప్రబంధ. 716.

**మోహరీ** వి మొహిరీ (శ. ర.)

**మోహించు.** సం. అ క్రి 1. అజ్ఞానముపొందు.

2. మూర్ఛిల్లు 3 వలపుచెందు, మోహపడు.

శా ము న్నాబ్రహ్మ మృగాక్షితిన్ దనయకున్ మోహించి క్రీడింప నాశిన్నుం డౌవాగిఁ జూచి పాఱుపగిదిన్ భాగ 1. 145.

స క్రి వలచు, ప్రేమించు

తే. హంసతూలికాతల్పంబునందు మేను, సేర్చ వప్పుడు నేత్రరాజీవయుగముఁ, జేరి చుంబించి మోహింపఁజేయ నతని, నగివ నిద్రయు నీవు నేమోడు రోగా . నైష. 2. 88.

**మోహింపించు.** సం స క్రి మోహింపఁజేయు.

మ ఎలమిన్ దైత్యుల నాఁడురూపమున మోహింపించి పీయూషమున్, జలితాపన్నుంకన్ సురోత్తములకున్ జక్క నిచ్చెంచి నిర్మలరేఖన్ వీఁసిల్లు శ్రీపిఘనిఁ దనాత్మయా వధూయాం ముసఁదంఁతున్.. భాగ 8. 409

**మోహితుఁడు.** సం విశ అ. అ అ) మోహము నొందినవాఁడు (శ. ర.).

**మోహిని.** సం వి ఈ స్త్రీ. 1 ఒకానొక యచ్చర. 2. అమృతము పంచిపెట్టునపుడు రాక్షసుల మోహ పుచ్చుటకై విష్ణువు తాల్చిన యొక సుందరి స్త్రీ రూపము. 3. ఒకజాతి మల్లెపూవు. 4. ఉపోదిక, మట్టుబచ్చలి (వృ.వి.)..

**మోహీము.** వి హిం. మోహిము. మి. (రౌ) దండు విడిసెడిచోటు

గీ అపుడు చంద్రకుతితాపుఘనాజ్ఞ పడసి, నడసి కొన కేఁగి పడవాళ్లు దండువెంట, గడి ఘిరాయించి పైనముల్ గండుట, నికుల కెల్ల మోహీము సాటఁఖుడు...రంగా. సంరం.

**మోహోపమ** సం వి. అ. స్త్రీ. (ఉపమానోపమేయముల భేదము తెలియకుండఁగ చేసెడి) ఒక కావ్యాలంకార భేదము.

శ్లో. శశీత్యుత్ప్రేక్ష్య తన్వంగి త్వన్ముఖం త్వన్ముఖాశయా, ఇందుమప్యనుధావామీత్యేషా మోహోపమా మతా ...

కావ్యాదర్శము. 2 25

## మౌ

**మౌంజము.** సం. విశ. (అ. ఈ. అ.) ముంజ యను గడ్డితోఁ జేయబడినది.

**మౌంజి.** సం. వి ఇ. స్త్రీ. ముంజగడ్డితో ముప్పేటలుగా వేయఁబడి బ్రాహ్మణుఁ డుపనయనాది కాలములయందు ధరించునడికట్టు

శ్లో. మౌంజీ త్రివృత్సమా శ్లక్ష్ణా కార్యా విప్రస్య మేఖలా, క్షత్రియస్య చ మౌర్వీ జ్యావైశ్యస్య శణతాంతవీ, ముంజాలాభే తు కర్తవ్యాః కుశాశ్మంతకవల్వజైః త్రివృతా గ్రంథినైకేన త్రిభిః పంచభిరేవ వా. సంస్కారతత్త్వమ్ (వా చ.).

**మౌజీబంధనము** సం. వి అ. న మౌంజి కట్టుట.

**మౌంఢ్యము.** సం. వి. అ. న 1 ముండనము. వప నము, గొఱుగుట

**మౌకలి** సం. వి. ఇ. పుం. కాకి.

**మౌకులి** సం వి. ఇ. పుం. కాకి.

**మౌచల్యుఁడు** సం. వి అ పుం. బట్టలుకుట్టుట, రంగువేయుటచే జీవించు వైదేహకుఁడు, రామకుఁడు (వై. ని.).

**మౌక్తికప్రసవ.** సం. వి. అ. స్త్రీ. శుక్తి, ముత్తెపుచిప్ప.

**మౌక్తికఫల.** సం వి అ. స్త్రీ. తెల్లయుప్పి (వృ.వి.) (శ. ర.).

**మౌక్తికము** సం. వి. అ. న. ముత్తెము.

**మౌఖరి.** సం. వి. ఈ. స్త్రీ. ముఖరభావము. ముఖరత్వము (శ.ర.).

**మౌఖర్యము.** సం. వి. అ. న. వదరుబోతుతనము, వాగుట, వాచాలత్వము.

**యథాకాలము.** న క్రి. విశ. సరియగు కాలమున, అదనున.

**యథాక్రమము.** సం. అవ్య. క్రి. విశ. క్రమాను సారముగా, వరుసగా.

**యథాగతుఁడు.** సం. విశ. (అ. అ. అ) తెలివి లేని వాఁడు, అవివేకి, మూర్ఖుఁడు.

**యథాజాతుఁడు** సం విశ. (అ. అ అ) అవివేకి, మూర్ఖుఁడు 2. నీచుఁడు, నీచజాతివాఁడు, అనాగరికుఁడు

**యథాతథము.** సం. అవ్య. క్రి విశ 1 సరిగా, హెచ్చుతగ్గులు లేకుండగా, 2 తగునట్లుగా, ఉచితమైనట్లు, 3. నిజముగా జరిగినట్టు

**యథాపురము.** సం. అవ్య. క్రి విశ వెనుకటివలె, పూర్వకాలమందువలె.

**యథాపూర్వము.** సం, అవ్య క్రి. విశ వెనుకటివలె, ఎప్పటివలె.

**యథాప్రాణము.** సం, అవ్య క్రి విశ బలానుసారముగా, శక్త్యనుసారమున, యావచ్ఛక్తిని.

**యథాభాగము.** సం. అవ్య. క్రి. విశ. ఒక్కొక్క విభాగముల ప్రకారము, వాటాల వంతు ప్రకారముగా. 2. తగినచోట, అర్హస్థలమున.

**యథామతి** సం. అవ్య క్రి. విశ. బుద్ధ్యనుసారముగా, బుద్ధికొలఁది.

**యథాముఖీనము.** సం. విశ (అ అ అ, అభిముఖముగా నున్నది, ఎదురుగా నున్నది.

**యథాయథము** సం. అవ్య. క్రి. విశ. 1. సరిగా 2 క్రమప్రకారముగా, 3. చెల్లాచెదరు

కం ప్రమానికి బోటియకు సలిల, స్థానమునకుఁ గాకవి వరసజ్జలచరముల్, లో నెఱిసిన క్షితిఁ బసిం, దానిఁ గమంగొని యథాయథముగఁ బఱచెన్. వేం పంచ. . 177.

**యథాయథలు.** సం. అవ్య. వి చెల్లాచెదరు.

కం. అంకలియు నీరువట్టును, దాఁకిన ప్రజకలము డిగి యథాయథలుగనే, ప్రాఁకులకుఁ జేరి. దశకు 10 87.

చం, దశములు వీనిఁ గన్గొని యథాయథలయ్యె మరాళకేతనాదులు సమరస్థలిం బడి రెడు రొక్కని నీవును నేను వీనితోఁ దలపడి పోరనున్నఁ బనితప్పు నిజంబు .. జై. భా. 7 181.

సీ కరమెత్తి ఘీంకార భరవృత్తి పరువెత్తి యళికి యథాయథలయ్యెఁ గరులు. రా. వి 5 15

**యథార్థనాముఁడు** సం విశ. న్. సార్థకమైన పేరుగలవాఁడు పేరును సార్థకపఱిచెడి పనులు చేయువాఁడు. శ్లో. పరంతపోనామ యథార్థనామా, రఘువంశము. 6. సర్గ.

**యథార్థము.** సం విశ (అ అ. అ) 1 సత్యమైనది, సరియైనది. 2. అన్వర్థమైనది, అర్థమునకు సరిపడినది, ఉచితము, సార్థకమైనది. అవ్య క్రి. విశ 1 సత్యముగా 2 సరిగా, ఉచితరీతిని.

**యథార్థవర్ణుఁడు** సం. వి అ పుం చారుఁడు, వేగువాఁడు (వాలా. ని)

**యథార్థీకరించు.** సం స. క్రి. సత్యముగాఁ దలంచు.

గీ. మంత్రులకు నైజములు మృదుమధురఫణితు, లవియ యార్థీకరించి వాయసముఁ బెంచి, యేల చెడిపో యెదవు... వేం. పంచ. 3. 243.

**యథార్హము** సం క్రి. విశ. గుణానుసారముగా లేక విలువ ననుసరించి.

**యథార్హవర్ణుఁడు.** సం. వి. అ. పుం. చారుఁడు, వేగువాఁడు, దూత.

**యథావిధి.** సం. అవ్య. క్రి. విశ. విధిప్రకారముగా, శాస్త్రానుసారముగా, తగునట్లు, శాస్త్ర ప్రకారముగా.

**యథాశక్తి.** సం అవ్య. క్రి. విశ. శక్త్యనుసారముగా, శక్తికొలఁది.

**యథాశాస్త్రము.** సం. అవ్య. క్రి. విశ. శాస్త్రమునందుఁ జెప్పఁబడినరీతిగా, ధర్మశాస్త్ర ప్రకారముగా

**యథాశ్రుతము.** సం అవ్య. క్రి విశ. 1 వినినట్లుగా, వినిపింపఁబడినట్లుగా, తెలుపఁబడినట్లుగా. 2 వేదానుసారముగా. వేదప్రకారముగా. విశ అ. ఆ అ. వినిపింపఁబడినదానిని ననుసరించినది, తెలుపఁబడినదాని ననుసరించినది

**యథాసంఖ్యము.** సం. వి. అన. అర్థాలంకార విశేషము. అవ్య క్రి. విశ. సంఖ్యనుబట్టి. సంఖ్యాప్రకారముగా, వరుసగా,

**యథాసంభవము.** సం. విశ (అ. ఆ. అ) సంభవించినది, సాధ్యమైనది.

**యథాసుఖము.** సం అవ్య క్రి విశ. సుఖముగా, ఆనందముగా, ఆనందమిచ్చునట్లు. వి పుం చంద్రుఁడు (వై ని.).

**యథాసుఖుఁడు.** సం వి. అ. పుం. చంద్రుఁడు.

**యథాస్థితము.** అవ్య. క్రి విశ 1 నిజముగా, సరిగా. 2, ఉన్నదియున్నట్లు

**యథాస్వము.** సం అవ్య. క్రి. విశ. 1 ఉచితముగా 2 సరిగా, తనమాట ప్రకారముగా,

**యథేచ్ఛము.** సం. అవ్య. క్రి. విశ 1. కోరిక ప్రకారము, ఇష్టమువచ్చినట్లు. 2 కావలసినంతగా, మనస్తృప్తిగా, తృప్తియగువఱకు

**యథేప్సితము.** సం. అవ్య. క్రి విశ. యథేచ్ఛము

**యథేష్టము** సం. అవ్య. క్రి. విశ. యథేచ్ఛ.

**యథోచితము.** సం. అవ్య. క్రి విశ సరియగునట్లు, తగినట్లు.

**యథోత్తరము** సం. అవ్య. క్రి. విశ. వరుసగా, ఒకటి తర్వాత నొకటిగా.

**యదర్థము** సం అవ్య. క్రి. విశ. ఎందునిమిత్తము. ఎందుకు, దేనికై.

**యదా,** సం అవ్య. ఎప్పుడు, ఏకాలమున. (తెలుఁగున సమాసపూర్వపదముగనే ప్రయుక్తము.) ఉదా. యథాకృతము, యథాగతుఁడు,

**యదీయము.** సం విశ, అ.ఆ.అ. ఎవనిసంబంధమైనది, ఎవరది, దేనికి సంబంధించినది, దేనిది.

**యదువు** సం వి ఉ పుం 1. యయాతిదేవయానులకుఁ బుత్రుఁడును యాదవుల కాదిపురుషుఁడువగు,నొక రాజు 2. మథురాపురమునకుఁ బ్రాంతమునయున్న నొక దేశనామము, దశార్హదేశము 3, యదువంశీయుఁడు 4 మనుష్యుఁడు (కే. ని).

**యదృచ్ఛ.** సం.వి.అ.స్త్రీ. 1. ఇచ్ఛచొప్పున, ఇష్టము వచ్చినట్లుచేయుట. 2. ఆకస్మికముగా సంభవించుట, ప్రయత్నములేకయే ప్రాప్తించుట.

**యదృచ్ఛాభిజ్ఞుఁడు** సం. వి అ పుం, తనంతటతానే వచ్చినసాక్షి, ప్రయత్నములేకయే వచ్చిన సాక్షి. దబ్బాటుసాకిరి.

**యదృచ్ఛాశబ్దము** సం వి అ,పుం. గుణాదులను దెలుపనినామవాచకము, సంజ్ఞాశబ్దము, సంజ్ఞావాచకము, (డిత్థ. డవిత్థాదికము.)

**యదృచ్ఛితుఁడు.** సం వి. అ. పుం. స్వయందత్తుఁడు, పుత్రునిగా స్వీకరింపుమని తనంతటతానే వచ్చినవాఁడు,

**యదృవిష్యుఁడు** సం వి. అ. పుం తన ప్రయత్నములేకయే కావలసినది యగునని యూరకుండువాఁడు (వై ని).

**యద్వదుఁడు.** సం విశ (అ ఆ అ) అనుత్తరుఁడు, సమాధానము చెప్పనివాఁడు (వై. ని).

**యద్వృత్తము** సం. వి, అ. న సాహసకార్యము. (విల్యమ్సు)

**యధనము,** సం వి. అ. న. రతి,సురతము

**యమకము,** సం. వి. అ, పుం. సంయమము. 1 (వ శబ్దాలంకారభేదము 2. యుగళము, జంట 3. కవలలు, యమలులు. 4. నూనెతో కలిసిన నేయి పేరు (వై. ని.) విశ, (అ. ఆ అ) నియమించువాఁడు (దే. ని.).

**యమకింకరుడు.** సం. వి అ, పుం. యమదూత.

**యమకీటకము** సం. వి. అ. పుం. 1, అడవిపేను. 2 వానపాము. ఎఱ్ఱ (విల్యమ్సు). 3, కుమ్మరిపురుగు. (శ వ) 4. జలజంతువిశేషము, ఘుల్లురి (ం.ని,).

యమకీలుఁడు నం. వి. అ. పుం విష్ణువు (విశ్వమ్ను)

యమకుఁడు, నం. విజ. (అ ఆ అ) కవలపిల్లలలో నొకఁడైనవాఁడు. వి.అ.పుం. 1. కవలతో నొకటి, జంటలో నొకఁడు, జతగా నుండువాఁడు.

యమకోటి నం.వి అ.ఈ.స్త్రీ. లంకకుఁ దూర్పుదిక్కున నున్న పురాణప్రసిద్ధమైన పట్టణము, దేవనిర్మితమైనది.

యమఘంటము నం వి అ పుం (జ్యోతి) యోగ విశేషము..

యమజుఁడు. నం.విజ (అ ఆ అ) కవలలుగ బుట్టిన వారిలో నొకఁడు

యమదంష్ట్ర. నం. వి. అ స్త్రీ. 1. యమునికోఱ యముని దంతము. 2 మృత్యుముఖము. (ఆశ్వ ఆశ్వయుజమాసమునఁ దుదియెనిమిది దినములును గార్తిక మాసమంతయును యమదంష్ట్రాదినములు) ఇవి రోగ దినములుగా నెంచ బడినవి యమదంష్ట్ర నములు (వాచ.).

యమదగ్ని. నం వి.అ.పుం జమదగ్ని ముని (వాచ).

యమదలము. నం వి అ. పుం. ఒకానొక వృక్షము, అశ్మయోని (ర. ని.).

యమదూత. నం.వి అ.పుం 1. మృత్యుదూత, యమ భటుఁడు. 2. కాకి (విశ్వమ్ను).

యమదూతకుఁడు. నం.వి అ.పుం 1 యమభటుఁడు యమదూత. 2 కాకి.

యమదూతిక. నం. వి. అ. స్త్రీ. చింత చెట్టు.

యమదేవత నం, వి అ. స్త్రీ. భరణీనక్షత్రము

యమద్రుమము. నం వి అ. పుం. శాల్మలీ వృక్షము, బూరుగుచెట్టు (వాచ).

యమద్వితీయ. నం.వి అ.స్త్రీ. కార్తిక శుక్ల ద్వితీయ, భ్రాతృద్వితీయ, ఆఁడుతోడఁబుట్టువులు అన్నదమ్ములకు భోజనము పెట్టఁదగినదినము.

యమధాటి. నం. వి. ఈ. స్త్రీ. ఆయుధవిశేషము, జయుదాడి.

యమధారము. నం.వి.అ, పుం, రెండువైపుల వాఁడిగల యొకవిధమగు కత్తి, అట్టియాయుధము.

యమనము నం. విజ అ. ఈ. అ. నియమించునది. వి. అ న 1. ఆఁపుట, అణఁచుట. 2 బంధించుట 3 ఉపరమించుట. 4 నియమించుట, పరిత్యజించుట

యమనిక నం. వి. అ. స్త్రీ. = యవనిక, తెర, తిరస్కరిణి.

యమనుఁడు. నం. విజ, అ. ఈ. అ. నియమించువాఁడు వి అ పుం. యముఁడు, మృత్యుదేవత.

యమపాశము నం వి అ. పుం. యమునిపాశము, యముఁడువేయు ఉరి.

యమప్రియము నం వి అ పుం. వటవృక్షము, మఱ్ఱిచెట్టు

యమభగిని నం. వి ఈ. స్త్రీ 1 యమునానది 2 పార్వతి (వై ని.).

యమము నం. వి. అ. పుం. 1 అణఁచుట 2 వశము,లో నుంచుకొనుట 3. ఇంద్రియ నియమము ఇంద్రియముల స్వాధీనతలో నుంచుకొనుట 4. అహింసావ్రతము 5 యమనియమాసనప్రాణాయామప్రత్యాహారధ్యానధారణసమాధు లను నెనిమిది యోగాంగములలో మొదటిది 6, కాకి. 7 రెండుసంఖ్యకుసంకేతము న. 1. కవ, జంట — భరణీ నక్షత్రము. 2. (వ్యాక.) ప్రాతిశాఖ్య ప్రసిద్ధమైన వర్ణవిశేషము. 3. అష్టవిధములగు నశ్వగతులలోనొకటి (కే. ని.).

యమరథము. నం. వి అ. పుం. 1 మహిషము. 2. యమునిస్యందనము (కే. ని.).

యమరాట్టు. నం. వి. జ్. పుం. యముఁడు, మృత్యుదేవత.

యమలపత్రము. నం. వి. అ. పుం. కోవిదారము, అశ్మంతక వృక్షము.

యమలము. నం. వి. అ. పుం. రెండుసంఖ్యకు సంకేతము, జోడు. అ. న. జత. కవ.

యమలి. నం వి ఈ స్త్రీ 1. జత, జోడు, కవ. 2. రెండు ముక్కలుగల బట్ట.

యమలుఁడు. నం. విజ. (అ. ఆ. అ) కవలలో నొకఁడు. ద్వివ కవలు.

యమళిక. సం వి ఆ. స్త్రీ. చర్మవాద్యవిశేషము, జమళిగ (శ. ర.)

యమవ్రతము సం. వి. అ న. రాజధర్మవిశేషము, పక్షపాతము లేక పాపులను శాసించుట (ఆం ని).

యమసూర్యము. సం వి. అ న పడమర ముఖముగల గది యొకటియు నుత్తరముఖము గల గది యొకటియుఁ గల పెద్దయిల్లు. (విల్యమ్సు).

యమస్వస. సం. వి. ఋ. స్త్రీ. 1. యమునానది 2. దుర్గాదేవి.

యమి. సం. విశే. (న్. న్. న్.) సంయమము కల వాఁడు. వి. న్. పుం. 1. కామాది వికారముల నణఁచినవాఁడు, ముని 2. హంస. (అము. 4 శ. ర.) ఈ. స్త్రీ యమునానది.

ద్వి. ద్యావాపృథువులు, భూమ్యాకాశములు

యమించు సం. స. క్రి. అణఁచు.

ఉ. నిక్కమునట్ల కాన తగునీతిపరుల్ మురలుక్కి వంబునన్, మిక్కిలియైన వారిని యమింపక తక్కుదురే ధనేశ్వరుం డక్కట, లెస్సనేసె నడి యానసెడన్ దిగధీశుఁడొక్కఁడున్, ద్రిక్కక యుండఁ ద్రుళ్ళడఁపఁ ద్రిమ్మరిఁ గిట్టిపోవలసెం గ్రమంబునన్. నిర్వ 4. 42

యముఁడు. సం. విశే (అ. ఆ. అ) 1. కవలలో నొకఁడు, ఒకమాఱు ఒకగర్భమునఁ బుట్టిన వారిలో నొకఁడు, ఒకటె (మే.ని.) 2 సహాపాపి, సహచరుఁడు. వి అ. పుం. 1. మృత్యుదేవుఁడు. అంతకుఁడు. 2 శని బ. యములు, అమడలు, కవలు.

కం యము లమితశౌర్య్యలిరిన్నృప, యము లమల చరిత్రనిరతు లనఁగా... భార. ఆది. 6. 96.

యమున. సం. వి. ఆ. స్త్రీ. 1. యమునానది, యమ సోదరి. 2. దుర్గాదేవి.

యమునాభిదుఁడు. సం. వి. ద్. పుం. బలరాముఁడు.

యమునాభ్రాత, సం. వి. ఋ. పుం. యముఁడు మృత్యుదేవుఁడు.

యయాతి సం. వి. ఇ. పుం. నహుషుని కుమారుఁడగు నొకానొక చంద్రవంశపు రాజు, షోడశ మహారాజులలో నొకఁడు.

యయావరము. సం. వి. అ. పుం. యాయావరము.

యయావరుఁడు. సం. వి అ. పుం యాయావరుఁడు.

యయి సం. వి. ఇ ఈన్. పుం 1. అశ్వమేధ యాగమున కుపయోగించెడి గుఱ్ఱము. 2 అశ్వము, గుఱ్ఱము. 3. బాట, దారి. 4 మేఘము (వి.న్ పుం.) 1 శివుఁడు (విల్యమ్సు) 2. సూర్యుఁడు. 3. బ్రాహ్మణుఁడు. 4. మోక్షమార్గము (శే ని స్త్రీ.) 1. ఆప్తి, పొందుట 2 దివ్యదృష్టి. 3 దీర్ఘవృష్టి (కే. ని.).

యయువు సం. వి ఉ. పుం. 1. యాగమున కుపయోగించు గుఱ్ఱము. 2. గుఱ్ఱము. 3. మోక్షమార్గము 4. బ్రాహ్మణుఁడు (ఆం. ని) 5. ప్రాప్తి. (వై. ని.) స్త్రీ. 1. పొడుగుదండము. 2. పొందుట (వై ని.) న. వాక్కు (కే. ని.)

యవ సం వి. అ. స్త్రీ. 1 రశ్మి, కిరణము. 2 మనీష, తెలివి

యవ(ము) సం. వి. అ. పుం. 1. యవధాన్యపు గింజ. 2 ఆఱు ఆవగింజల యెత్తు 3 అదృష్టమును సూచనచేయు చేతివ్రేళ్ళపై నుండెడి యవగింజ వంటిరేఖ. బ. వ ధాన్యవిశేషము.

యవకము. సం వి. అ. పుం యవలు అనెడి ధాన్యవిశేషము. 1. అలసందెలు. 2. కారు మినుములు (శ ర.).

యవక్యము. సం వి. అ. న. చిన్నయవలు పండెడి నేల (హాలా ని.)

యవక్షారము. సం వి. అ. పుం. సురేకారము పెట్లుప్పు, యవలవలన కలుఁగు ఉప్పు.

యవక్షోదము సం వి అ. పుం. యవలపిండి.

యవచూర్ణము. సం. వి అ. న. యవలపిండి.

యవజము. సం. వి. అ. పుం. యవక్షారము, సురేకారము

యవతిక్త. సం. వి. ఆ. స్త్రీ. శంఖినియను లతా విశేషము (వాచ.)

యవనద్విష్టము. సం. వి. అ. పుం. గుగ్గిలము (రాజని).

యవనప్రియము. సం. వి. అ. న. మరిచము, మిరియము (హేమ. ని).

యవనము. సం. వి. అ. పుం. 1. పందెపు గుఱ్ఱము లేక వేగముగల గుఱ్ఱము 2. వేగము, వడి. 3. గోధూమము 4. తృణవిశేషము, గడ్డి తృణము 5. ఒకానొక దేశము విశే. (అ. ఆ. అ.) వేగముగలవాఁడు (వాచ.) న. మిశ్రణము (కే. ని.)

యవనాచార్యుఁడు. సం. వి. అ. న. జ్యోతిశ్శాస్త్రమును రచించిన పండితుఁడు (వాచ.)

యవనాలి. సం. వి. ఈ. స్త్రీ. యవనుల లిపి, యవన భాషాలిపి.

యవనారి. సం. వి. ఇ. పుం. కృష్ణుఁడు.

యవనాలము. సం. వి. అ. పుం. ధాన్యభేదము.

యవనాళజము. సం. వి. అ. పుం. యవక్షారము.

యవని. సం. వి. ఈ. స్త్రీ. 1. యవనస్త్రీ. 2. ... ఒకానొక ఓషధి (వాచ.).

యవనిక. సం. వి. ఆ. స్త్రీ. తెర, తెరచీర.

యవనుఁడు. సం. వి. అ. పుం. 1. గ్రీసుదేశస్థుఁడు 2. ద్వీపాంతరవాసి, మ్లేచ్ఛుఁడు (కే. ని.). బ. 1. గ్రీసుదేశజనములు. 2. గ్రీసుదేశపు జ్యోతిశ్శాస్త్రజ్ఞులు.

యవనేష్టి. సం. వి. అ. స్త్రీ. ఖర్జూరి.

యవనేష్టము. సం. వి. అ. పుం. ఒకరకము వెల్లుల్లి 2. ... సీసము. అ. న. 1. సీసము. 2. సీరుల్లి లేక వెల్లుల్లి. 3. మరిచము, మిరియము (వ్య. వి).

యవఫలము. సం. వి. అ. పుం. 1. వెదురు (వ్య.వి). 2. జటామాంసి (వ్య. వి.). 3. కుటజ (వ్య. వి.), కొడిసిచెట్టు. 4. ప్లక్ష, జువ్వి (వ్య.వి.).

యవమధ్యము. సం. వి. అ. పుం. 1. వాద్యవిశేషము (విల్సన్సు). న. 1. తపోవిశేషము, చాంద్రాయణవ్రతభేదము 2. పొడవు, కొలత (విల్సన్సు). స్త్రీ. (వైదిక.) ఛందోభేదము (వం. ని.).

యవలాసము. సం. వి. అ. పుం. యవక్షారము, సురేకారము.

యవశూకజము. సం. వి. అ. పుం. యవశూకము (రా. ని).

యవశూకము. సం. వి. అ. పుం. యవక్షారము, సురేకారము, పెట్లుప్పు.

యవసము. సం. వి. అ. న. 1. సవు.

మ. ... ఖడమి న్యాటిల్లిపై విప్పులై, యవసంబంచులనాడఁగా నెగసె వాత్స్యాశిన్ గజ శస్త్రముల్. ఉము. 2. 48.

యవసురము. సం. వి. అ. న. యవలనుండి తీసిన సారాయి.

యవాగువు. సం. వి. ఊ. స్త్రీ. 1. గంజి, అన్నపుగంజి, ఇతరధాన్యములనుండి తీసిన గంజి, జావ.

యవాగ్రజము. సం. వి. అ. పుం. 1. యవక్షారము సురేకారము, పెట్లుప్పు. 2. యవాని (దుష్టయవము).

యవాని. సం. వి. ఈ. స్త్రీ. 1. దుష్టయవము (వాచ.) 2. ఓమము. (వై. ని.) విశే. వడిగలది (శ. ర.)

యవానిక. సం. వి. ఆ. స్త్రీ. యవాని.

యవాపత్యము. సం. వి. అ. న. యవక్షారము, సురేకారము.

యవామ్లజము. సం. వి. అ. పుం. పులిసిన యవల గంజి, ఆరనాళము.

యవాషము. సం. వి. అ. స్త్రీ. పంచదారలో నొక భేదము.

యవాసకము. సం. వి. అ. పుం. 1. ఒకజాతి ఖదిర

వృక్షము. 2. తీటకసింద (వృ ని) అ స్త్రీ. ఒకానొక తృణము, గుండాసిని

యవాసిని. సం. వి. ఈ స్త్రీ యవాసదేశమున నొక మండలము (విర్యమ్ము).

యవాహ్వము. సం. వి. అ పుం. యవక్షారము

యవిష్ఠుఁడు సం. విణ. (అ. ఆ. అ) చాల చిన్నవాఁడు వి అ పుం. 1. అనుజుఁడు, అందఱికంటె చిన్నతమ్ముఁడు 2 అగ్ని, యోగాగ్ని.

యవీయసి సం వి ఈ స్త్రీ 1 కొమ్మపొట్ల (రం. ని.). 2 చెల్లెలు, అనుజ.

యవీయసుఁడు. సం. విణ. స్ సీ. స్) 1. మొగటివానికంటె చిన్నవాఁడు 2 యువకుఁడు. వి. స్ పుం 1. ఒకనికంటె చిన్నవాఁడైన సోదరుఁడు, అనుజుఁడు 2 శూద్రుఁడు (అ ని.)

యవ్యము. సం. విణ. (అ ఆ. అ) యవలు చల్లఁదగినది, యవలుపండునది వి. అ. పుం. 1 మాసము, నెల. న. 1. యవలపొలము

యశఃపటము. సం. వి. అ పుం. వాద్యభేదము, ఢక్క

యశదము. సం. వి అ న. ధాతువిశేషము.

యశము సం వి న్ న 1. కీర్తి ప్రఖ్యాతి. 2. మాహాత్మ్యము. 3. ప్రతాపము. 4. సత్త్వము, బలము. 5 ధనము. 6 సిరి. 7 జ్ఞానము. 8. జలము, నీరు (కే. ని.).

యశశ్శేషము సం వి. అ పుం చావు, మరణము.

యశశ్శేషుఁడు సం. విణ. (అ. ఆ. అ.) కీర్తిశేషుఁడు, మృతినొందినవాఁడు.

యశస్కరము. సం. విణ. (అ. ఈ. అ) కీర్తిని కలిగించునది, పేరుతెచ్చునది.

యశస్కరి సం. వి. ఈ. స్త్రీ. పాలకూర, జీవ (వృ. ని.) (రం. ని.)

యశస్య సం. వి. ఆ స్త్రీ 1. పాలకూర జీవంతి (వృ ని.). 2. గంధద్రవ్యవిశేషము. బుద్ధి (రం. ని.).

యశస్యము సం విణ. (అ ఆ. అ) 1. కీర్తికరము. 2 ప్రఖ్యాతిగలది.

యశస్వి. సం విణ (న్. ఈ న్.) కీర్తిగలది. ప్రఖ్యాతిగలది

యశస్విని సం వి. ఈ స్త్రీ 1 అడవిప్రత్తిచెట్టు 2. మేనేరుతీఁగె, జ్యోతిష్మతి (వృ ని) యవతిక్త (వృ. ని.). (రాజ ని)

యశస్సు. సం = యశము

యశోద. సం. వి ఆ స్త్రీ 1 నందుని భార్య యుఁ గృష్ణుని తల్లియగునామె 2. ఒకానొక ప్రేశకర్మలో నుపయోగించు నిష్టకలు (కే ని)

యశోదము. సం. విణ. (అ ఆ అ.) కీర్తిని నిచ్చునది, కీర్తిగలిగించునది వి అ. పుం పాదరసము

యష్ట సం వి ఋ. పుం. యజ్ఞము చేయువాఁడు

యష్టి సం వి. ఇ, ఈ పుం, స్త్రీ 1. దండము, కఱ్ఱ. 2. ఊఁతకఱ్ఱ. భుజదండము 3. చేతికఱ్ఱ 4 జండాకఱ్ఱ. ధ్వజస్తంభము 5 ఆయుధవిశేషము. 6 హారము, సరము పేట 7 లత తీఁగె. 8. యష్టిమధుకము అతిమధురము 9 వృక్షవిశేషము భార్గి (వాచ.) 10 తోమరము 11 తరవారి, ఒకానొకయాయుధము (కే ని.).

యష్టిక సం. వి. ఆ స్త్రీ నూఱుపేరులహారము. (శ ర) 1. కఱ్ఱ దుడ్డుకఱ్ఱ 2 ముత్తెములహారము, ముత్తెములపేట. 3. వాపి, దిగుడుబావి. 4. యష్టిమధుకము, అతిమధురము (వృ ని.)

యష్టికము. సం. వి. అ. పుం. నీటిపక్షులలో నొకటి, జలకుక్కుటవిశేషము.

యష్టిప్రాణుఁడు సం. విణ. (అ. ఆ. అ) 1. దుర్బలుఁడు, బలములేనివాఁడు, శక్తిలేనివాఁడు. 2 శ్వాసములేనివాఁడు.

యష్టిమధుక(ము) సం. వి ఆ. స్త్రీ న. అతిమధురము (వృ ని).

యష్టిమధువు. సం. వి. ఉ. న. యష్టిమధుకము (వృ ని.)

యష్టికము సం. వి. అ. న. యష్టిమధుకము (వ్య. వి.)

యష్టిపుష్పము. సం. వి. అ. పుం. ఒకానొకచెట్టు, పుత్రజీవవృక్షము (వాచ.).

యష్టిమధు సం. వి. ఉ. పుం. యష్టిమధుకము (వ్య. వి.)

## యా

యాగము సం. వి. అ. పుం. 1. దేవతలకు హవిర్భాగము లిచ్చుట, యజ్ఞము. 2. శైవులు మున్నగువారు వేయు సర్వతోభద్రాది మండలము (శే. ని.).

యాచకుఁడు. సం. విణ. (అ. త్రి. అ.) 1. భిక్షుకుఁడు, బిచ్చగాఁడు. 2. ప్రార్థించువాఁడు, మనవిచేయువాఁడు.

యాచన సం. వి. ఆ. స్త్రీ. యాచనము.

యాచనకుఁడు. సం. విణ. యాచకుఁడు.

యాచనము. సం. వి. అ. పుం. 1. అడుగుట, ప్రార్థించుట. 2. మనవి, ప్రార్థన, విజ్ఞాపన.

యాచించు స. క్రి. అడుగు.

గీ. ధరణిపతికి నాస్తికునకుఁ జాపండునకును, గర్మములువిడిచి యాచించు గర్వితునకు, నీపరము గోష్ఠమో పుత్రి యోపురంధ్రి, తప్పిదాయు నెఱిఁగింపఁదగవుగాదు

పాండు. 211

యాచిత సం. వి. ఋ. పుం. 1. యాచకుఁడు 2. ప్రార్థించువాఁడు.

యాచితకము సం. వి. అ. న. 1. యాచనవలన సంపాదింపఁబడిన వస్తువు. 2. ఎరవు తెచ్చుకొనిన వస్తువు.

యాచితము. సం. విణ. (అ. ఆ. అ.) అడుగఁబడినది. 2. యాచించువాఁడు (వాచ.) వి. అ. న. 1. యాచావృత్తి, యాచన.

యాచిష్ణువు. సం. విణ. (ఉ.) యాచనాస్వభావము గలవాఁడు, యాచ్ఞాశీలుఁడు.

యాచ్ఞ. సం. వి. ఆ. స్త్రీ. 1. వేఁడుట, అడుగుట. 2. భిక్షావృత్తి, భైక్షజీవనము 3. అనుసర్తనము (కే. ని.)

యాజకము సం. వి. అ. పుం. 1. రాజసంబంధమైన యేనుఁగు 2. మదపుటేనుఁగు, మత్తగజము (రం. ని.).

యాజకుఁడు. సం. వి. అ. పుం. 1. యజ్ఞము చేయువాఁడు, ఋత్విక్కు.

యాజనము. సం. వి. అ. న. యాగముచేయించుట.

యాజన్యము. సం. వి. అ. పుం. యజ్ఞము. (కే. ని.)

యాజన్యుఁడు. సం. వి. అ. పుం. క్షత్రియుఁడు (కే. ని.)

యాజము సం. వి. అ. పుం. 1. వండినయన్నము, ఆహారము 2. యజ్ఞభూమి (సం. ని.)

యాజయిత సం. వి. ఋ. పుం. యాగము చేయించెడి ఋత్విక్కు.

యాజి సం. వి. ఇ. స్త్రీ. యాగము, క్రతువు. విణ. (న్. నీ. న్.) (సమాసాంతమున) యాగము చేయుచున్నవాఁడు. (సోమయాజి).

గీ. వ్యాసయాగవేదికయందు సమిద్ధమూర్తి వెలుఁగుచుండు తేజమునందు ప్రేల్చఁ బ్రాణములను యాజియట్లంతరమున నొనర్చు, యాగమున వీతకల్మషుఁడై వెలుంగు. భాగ. శాం. 5. 149.

యాజ్యుఁడు సం. వి. అ. పుం. యజ్వ, యజ్ఞము చేసినవాఁడు (విగ్రహమ్ము).

యాజుషము. సం. విణ. (అ. ఈ. అ.) యజుర్వేద సంబంధమైనది.

యాజుషుఁడు సం. వి. అ. పుం. యజుర్వేద ప్రకారము కర్మములు చేయువాఁడు.

యాజ్ఞవల్క్యుఁడు. సం. వి. అ. పుం. ఒకానొక ముని (యాజ్ఞవల్క్యస్మృతి), ధర్మశాస్త్రకర్త, శుక్లయజుర్వేద ప్రవర్తకుఁడు.

యాజ్ఞసేని సం. వి. ఈ. స్త్రీ. యజ్ఞసేనుని కూఁతురు, ద్రౌపది.

యాజ్ఞికము. సం. విణ. (అ. ఈ. అ.) యజ్ఞసంబంధమైనది. వి. అ. పుం. (కుశ.) తృణవిశేషము.

2 యజ్ఞోపయోగివృక్షము. అశ్వత్థము, ఖదిరము, పలాశము.

**యాజ్ఞికుఁడు.** సం. వి. అ. పుం. 1 యజ్ఞము చేయువాఁడు, యజ్వ, యజమానుఁడు. 2 యాజకుఁడు, ఋత్విక్కు. విణ. (అ ఆ.అ.) యజ్ఞవిద్య చదువువాఁడు, తెలిసినవాఁడు (కే ని.).

**యాజ్యము.** సం వి అ న 1. యాగదక్షిణ 2. యాగారబ్ధధనము. (రం. ని) 3 యజ్ఞమున కుపయోగించు స్థలము మొ. (వాచ)

**యాజ్యుఁడు.** సం. విణ. (అ.ఆ.అ.) 1. యజ్ఞసంబంధమైనవాఁడు. యజ్ఞమునఁ బ్రధానముగా నుద్దేశింపఁబడినవాఁడు. 2. శాస్త్రప్రకారము యజ్ఞము చేయుట కర్హుఁడు. వి. అ. పుం 1. యజ్వ యాగము చేయువాఁడు. 2. ఇతరునికై యజ్ఞము చేయువాఁడు.

**యాత** సం. వి ఋ స్త్రీ 1. తోడికోడలు, మగని సోదరునిభార్య వి. ఋ పుం. 1. పథికుడు. బాటసారి, వెళ్లువాఁడు, 2. అత్త, భార్య తల్లి 3 మేనమామభార్య (రం ని.).

**యాతన(ము).** సం వి ఆ స్త్రీ. 1 తీవ్రవేదన, బాధ 2. నరకదుఃఖము.

**యాతము** సం. విణ (అ ఆ.అ ) కడచినది, గతించినది, గతము. వి.అ న. 1. అంకుశముతో నేనుఁగను దోలుట, నడిపించుట. 2. గతకాలము, కడచిన దినములు

**యాతయామము.** సం. విణ. (అ.ఆ.అ.) 1. పాసినది, రుచిచెడినది 2. ఉచ్ఛిష్టమైనది, తిన మిగిలినది. 3. జీర్ణించినది, వయసుమరలినది.

**యాతవ్యుఁడు** సం. వి. అ. పుం. శత్రువు, యుద్ధార్థము వెళ్ళఁదగినవాఁడు. విణ. (అ. ఆ.అ.) గంతవ్యుఁడు (వాచ.).

**యాతుఘ్నము.** సం వి అ. పుం. గుగ్గులు. (రాక్షసులఁ బోఁగొట్టునది)

**యాతుధానుఁడు** సం. వి. అ. పుం. 1. రాక్షసుఁడు, 2 నిరృతి (శ ర).

**యాతువు.** సం. వి ఉ. పుం 1. బాటసారి, పాంథుఁడు. 2 వాయువు, గాలి 3 సమయము, వేళ. 4 యముఁడు (శ ర) వి ఉ న. 1 పిశాచము, రాక్షసుఁడు వి వెళ్లువాఁడు. 5 పాపము (కే.ని.)

**యాతృకుఁడు** సం. వి. అ పుం బాటసారి, మార్గస్థుఁడు

**యాత్ర** సం. వి. ఆ. స్త్రీ 1 ప్రయాణము వెళ్లుట, గమనము ... సేన వెడలుట, దాం.. వెడలుట 3. తీర్థమునకుఁబోవుట 4. మహోత్సవము. 5. ఉత్సవదినము. 6 జాతర. 7. జీవిక, జీవసాధనము 8. (కాలము) కడపుట 9. త్రోవ 12 ఉపాయము. 13. సాధనము.

**యాత్రసంచి.** వి. (యాత్ర+సంచి) అసిమి సంచి, ఒకవిధమగు చిన్న గోనె (బ్రౌ ని.).

**యాత్రికము.** సం. విణ (అ. ఆ. అ.) యాత్రకు సంబంధించినది. (నక్షత్రము, సాధనము మొ.)

**యాత్రికుఁడు.** సం. వి. అ. పుం. 1. బాటసారి, మార్గస్థుఁడు. 2. తీర్థవాసి. తీర్థయాత్ర చేయువాఁడు.

**యాథాకథాచము.** సం. విణ. అ. ఆ. అ. 1 ఏసందర్భమునవైనఁ దటస్థించినది. ఏసందర్భమునవైన వచ్చినది 2 అప్పుడప్పుడు సంభవించినది, తాత్కాలికమైనది.

**యాథాకామి** సం వి న్ పుం. తనయభిప్రాయప్రకారము పనిచేయువాఁడు, తనయిష్టము వచ్చినట్లు పనిచేయువాఁడు.

**యాథాకామ్యము.** సం వి అ. న. తనయిష్టము వచ్చినట్లు పనిచేయుట, తన యభిప్రాయుప్రకారము పని చేయుట.

**యాథాతథ్యము** సం. వి అ. న. 1. సత్యత్వము, యాథార్థ్యము, సరళత, తిన్నఁదనము.

**యాథార్థ్యము.** సం వి. అ న. 1. సత్యత, వాస్తవికత్వము. 2. న్యాయము! అర్హపము.

యాదఃపతి. సం. వి. ఇ. పుం. 1 సముద్రుఁడు, సముద్రము. 2. వరుణుఁడు (సీటికి ప్రభువు)

యాదము. క్రి విశ. గాఢముగా.

సీ అమృతాబ్ధి సొచ్చి యాదము నిద్రవోయిన పీతాంబరుఁడు బిట్టు బెదరిలేవ.

కు. సం 11 57?

యాదతము. సం. వి అ న 1. యాదవులకు సంబంధించినది. 2 గోమహిషాదికధనము, పశుధనము

యాదవి సం. వి. ఈ. స్త్రీ. దుర్గాదేవి.

యాదవుఁడు. సం. వి అ పుం యదువంశమునఁ బుట్టినవాఁడు, యదువంశపురాజు. 2. శ్రీకృష్ణుఁడు.

యాదస్సు సం వి. స్. న. క్రూరమైన జలజంతువు, నీటిజంతువు.

యాదృక్షము. సం. విశ (అ. ఈ. అ.) దేనిపోటివి. ఏవిధమైనది.

యాదృచ్ఛికము సం. విశ (అ ఈ అ.) 1. నిర్నిమిత్తముగా దానంతటస్థించినది, ప్రయత్నము లేకయే వచ్చినది. 2 ఆకస్మికమైనది. అనుకొనకయే సంభవించినది.

యాదృశము. సం. విశ. (అ. ఈ. అ.) యాదృక్షము.

యాదోనాథుఁడు సం. వి అ. పుం. 1 సముద్రుఁడు. 2 వరుణుఁడు.

యానకము. సం. వి అ న. వాహనము, బండి మొ

యానపాత్రము. సం. వి. అ న. నౌకాభేదము. ఓడ జనులెక్కిపోయెడి యోడ.

యానము. సం. వి. అ. న. 1. గమనము, ప్రయాణము. 2. శత్రువులమీఁదికి వెళ్లుట, దాడివెడలుట. (రాజ్యతంత్రము నందలి యాఱుగుణములలో నొకటి). 3. వాహనము. (బండి, రథము, పల్లకి, అశ్వము, గజము మొ.) ఇది పంచవిధము. 1. సంధానయానము. 2. ప్రసంగయానము 3. విగృహ్యయానము. 4. సంభూయయానము 5. ఉపేక్ష్యయానము.

*. కరితురగరథపదాతులు. ధరణీదేవునకు గంగవరి నిచ్చినభూ, వరుఁడు రవికింబ శతభా, సుర యానములెక్కి తిరుగు సురలోకమునన్

జైమి. 1 5 7

యానముఖము సం వి. అ న బండియొక్క ముందుభాగము. కాడి కట్టెడివైపు, చోటు.

యాపకము సం విశ. (అ.ఆ అ) యాపనము చేయునది.

యాపన. సం వి. అ స్త్రీ యాపనము

యాపనము సం వి అ. న 1 వెళ్లునట్లు చేయుట, పంపుట. 2 వెడలగొట్టుట బయటికి త్రోయుట 3 కాలక్షేపము చేయుట, కాలము గడుపుట

యాప్త. సం. వి. అ. స్త్రీ. శిరోజటి

యాప్తకములు సం. వి అ పు ద్వి. వ పునర్వసూ నక్షత్రములు (వైని).

యాప్యము. సం విశ అ. ఆ అ) 1 త్రోసివేయఁ దగినది, నిరాకరింపఁ దగినది 2. నీచమైనది. అధమమైనది. 3. నింద్యమైనది 4. వ్యాధివిశేషము

యాప్యయానము. సం. వి అ న. పల్లకి, సవారి

యాభము. సం. వి. అ. పుం. మైథునము. సురతము

యామకుఁడు. సం. విశ. (అ.ఆ.అ.) వెళ్లువాఁడు. పోవువాఁడు. వి. అ పుం. పథికుఁడు, బాటసారి (కే.ని).

యామఘోషము. సం. వి. అ. పుం 1. కోడిపుంజు 2 అ. స్త్రీ. (ప్రతిజామునకు గంటలు కొట్టెడు) ఘటికాయంత్రభేదము. ఒకానొక యంత్రము.

యామనాలి. సం. వి. ఈ. స్త్రీ. యామఘోషము.

యామము. సం. వి. అ. పుం. జాము అహోరాత్రకాలములో నెనిమిదవ భాగము. మూఁడు గంటల కాలము. 2 యమము, యోగవిశేషము 3 సంయమము, నిగ్రహము. 4. సామభేదము (కే.ని.).

యామలము. సం వి. అ న. 1 జత. యుగళము. కవ. 2. తంత్రశాస్త్రభేదము.

యామవతి. సం. వి. ఈ స్త్రీ. త్రియామ. రాత్రి.

**యామాత.** సం. వి. = జామాత.

**యామి.** సం. వి. ఇ ఈ. స్త్రీ. 1. స్వస. ఆఁడు తోఁబుట్టువు 2 రాత్రి, రేయి. 3 కోడలు. స్నుష (ఆ.ని.) 4. పూజ్యస్త్రీ, కులస్త్రీ యముని భార్యలలో నొకతె. (వాచ.) 5 దక్షిణదిక్కు. 6. యమయాతన. 7 భరణీ నక్షత్రము

**యామిక.** సం. వి ఆ స్త్రీ 1. రాత్రి. 2. పసుపు (ఆ. ని).

**యామికుఁడు** సం వి అ పుం కావలివాఁడు, ఆరక్షకుఁడు. రాత్రి కావలి కాచు వాఁడు.

**యామిత్రము.** సం. వి. = జామిత్రము.

**యామిని** సం వి ఈ. స్త్రీ 1. రాత్రి. 2 పసుపు.

**యామినీపతి.** సం వి. ఇ. పుం. 1. చంద్రుడు. 2. కర్పూరము.

**యామీర.** సం. వి ఆ. స్త్రీ రాత్రి

**యామీరుఁడు** సం. వి అ పుం చంద్రుఁడు

**యామునము.** సం. విణ (అ. ఆ. అ.) యమునా నదీసంబంధమైనది వి. అ న నీలాంజనము, ఒకవిధమైన కాటుక.

**యామునాచార్యుఁడు** వి. వైష్ణవాగ్రేసరుఁడు. ఆళువందారు, వైష్ణవమతోద్ధారకుఁడు.

గీ. యామునాచార్యుల డొక్కఁడు నీమహాత్ము
డొక్కఁడును గాదె మన్నతిని బుద్ధిరంచిరి.
ఆము. 4, 29.

**యామునేష్టకము.** సం వి. అ. న సీసము.

**యామేయుఁడు** సం. వి అ పుం భాగినేయుఁడు, మేనల్లుఁడు.

**యామ్య.** సం. వి ఆ స్త్రీ. 1. దక్షిణదిక్కు. రాత్రి.

**యామ్యము.** సం విణ (అ. ఆ. అ) 1. దక్షిణ దిక్కున నున్నది. 2. యమునిసంబంధమైనది. వి అ పుం. 1. చందనము. 2. వసుగు (రం. ని.) వ భరణీనక్షత్రము.

**యామ్యాయనము.** సం. వి. అ న. దక్షిణాయనము.

**యామ్యుఁడు.** సం. వి. అ పుం. 1. యమభటుఁడు. అగస్త్యుఁడు.

**యామ్యోద్భూతము.** సం వి. అ పుం. ఒక నొం గృతము, శ్రీతాళము (వ్య.వి.).

**యాయజూకుఁడు** సం వి అ పుం పలుమారు యజ్ఞములు చేయు స్వభావము కలవాఁడు. యజ్ఞ శీలుఁడు. పలుమారు యజ్ఞములు చేయువాఁడు.

వ్యాసయముగా వీచె గ్రొన్ననతావిగలి, యలయుచు యాయజూకాగ్నిహోత్రములు. పలగొను శిఖ లుక ఇకుడొప్పు మిగలె
ద్వి పఁమ 3. 149 పా 1వ పం.

**యాయావరము** సం వి అ పుం. 1. అశ్వమేధ యాగమునిమిత్తమై యొసఁగఁబడిన గుఱ్ఱము 2 రాజ శేఖరుఁ డను నాలంకారికుఁడు పుట్టిన వంశము పేరు. వి అ.న. ఆయవారము, ఇంటికిఁ దిరుగుచు ధాన్యమునుగాని బియ్యమునుగాని యాచించుట.

**యాయావరుఁడు.** సం. విణ (అ. ఆ అ) తిరుగుచు తిరుగువాఁడు, త్రిమ్మరియైనవాఁడు స్థిరనివాసము లేనివాఁడు వి. అ. పుం. 1. తిరిగెడి భిక్షుఁడు, ముని 2. జరత్కారుఁడను పేరుగల ముని

**యాయి.** సం. విణ. (న్. నీ. న్) వెళ్లుచున్న వాఁడు, గమి.

**యావకము** సం వి. అ పుం, న. 1. యవాన్నము యవాహారము 2. లత్తుక ఎఱ్ఱరంగు 3. సగము పండినయవలు (వై. ని). ఈ కారాలు మినుములు

**యావచ్ఛక్తి.** సం. అవ్య. క్రి విణ శక్తికొలఁది సాధ్యమైనంతలో

**యావజ్జీవము.** సం అవ్య క్రి విణ బ్రతికియున్నంత వఱకు ప్రాణమున్నంత కాలము.

**యావత్.** సం విణ (త్. తీ. త్.) (ఇది తెనుగున సమాసపూర్వపదముగనే ప్రయుక్తము.) సాకల్య

మున ఉదా. యావజ్జీవము పరిమితి-యావచ్ఛక్తి సాంఖ్యము—యావద్ధనము

యావన. సం వి. ఆ స్త్రీ నింద (కే ని)

యావనము సం విణ. (అ. ఈ అ) యావన సంబంధమైనది. వి అ. పుం ధూపద్రవ్యము, సల్లమడ్డి.

యావనాలము. సం. వి. అ పుం. ధాన్యవిశేషము, జొన్న

యావనాలి. సం వి ఈ స్త్రీ యావనాలములనుండి పుట్టిన శర్కర

యావనాళశరము సం. వి అ. పుం తిరిభేదము.

యావన్మాత్రము. సం విణ. (అ. ఆ అ.) ఎంత పరిమాణముగలది, ఎంతదూరముగలది

యావము. సం. విణ (అ ఆ అ.) యవసంబంధమైనది. యవలతో చేసినది వి. అ పుం. 1 యవాన్నము 2. లత్తుక—ఎఱ్ఱరంగు 3. ఉలవ. 4 మాసము (కే. ని) 5 మాషము

యావశూకము. సం. వి. అ. పుం. యవక్షారము సురేకారము. పెట్లుప్పు (లై ని).

యావసము. సం. వి. అ. పుం. 1. గడ్డిమేటి. 2 గోగ్రాసము, మేత. 3. మిత్రుఁడు (కే.ని.).

యాష్టీకుఁడు సం. విణ. (అ. ఈ. అ) దుడ్డు కఱ్ఱతో యుద్ధము చేయువాఁడు. కఱ్ఱ యాయుధముగాఁ గల వాఁడు. వి. అ. పుం. దుడ్డుకఱ్ఱ యాయుధముగాఁ గల యోధుఁడు.

యాస. సం. వి ఆ. స్త్రీ. మనవశలాకమడి (రం.ని.).

యాసము. సం. వి అ. పుం. ప్రయత్నము, పూనిక (అ. ని.). తీఁగెసంద. యవసము (వ్య వి.).

యాస్కుఁడు. సం. వి. అ. పుం. నిరుక్తము రచించిన యొకగ్రంథకర్త

# యి

యియక్షువు. సం. విణ. (ఉ) యజింప నిచ్ఛగల వాఁడు. యాగము చేయగోరువాఁడు.

యియాసువు. సం విణ. (ఉ) పోవనిచ్ఛగలవాఁడు. వెళ్లఁగోరువాఁడు

# యు

యుంజానుఁడు సం వి. అ పుం సారథి, రథము తోలువాఁడు 2 బ్రహ్మముతో నైక్యము గాంచుటకై యోగాభ్యాసము చేయుచున్న బ్రాహ్మణుఁడు 3 బ్రాహ్మణుఁడు

యుక్త. సం వి. ఆ. స్త్రీ గంధద్రవ్యవిశేషము రేణుక (వ్య వి)

యుక్తము. సం విణ. (అ. ఆ అ) 1. కూడుకొన్నది, చేరికొనినది. 2 న్యాయ్యమైనది 3 ఉచితమైనది 4 లెక్కకుకలియకూడినది. వి. అ న పారము.

యుక్తరథము. సం. వి. అ పుం కదిసును రసాయనము (వీర్యము)

యుక్తరస సం. వి. ఆ స్త్రీ రాస్నము రాష్ట్రము (వ్య. వి)

యుక్తరూపము. సం. వి. (అ ఆ. అ.) తగినది యోగ్యమైనది.

యుక్తాయసము. సం. వి. న్. న. కాష్ఠ, కుద్దాలము, కఱుగుద్దలి (రం. ని.).

యుక్తి. సం. వి ఇ. స్త్రీ. 1 కూడిక, కలయిక 2. ఉపాయము, సాధనము 3. పన్నుగడ, యోజన. 4. న్యాయము, సకారణముగా విషయములను తెలుపుట. 5. ఊహ. అనుమితి 6. కారణము. హేతువు. 7. వ్యవహారము. 8. అర్థాలంకారము. ఉద్దేశమును సూచించుట. ఉద్దేశమును మఱుఁగుగాఁ జెప్పుట. 9. నాటకాంగ విశేషము 10. విధము (ఈయర్థమాంధ్ర గ్రంధములందే కానవచ్చుచున్నది.)

కం చూడగ శివభక్తునిఁ గని, వేడుక గొనియాడఁడేని వృథయాతని మిథ్యాడంబర దేవర్చన, యోడునఁబోసినజలంబు యుక్తిమహేశా

శివసా. 154

సంఘటన, యోగము

కం. కురుముఖ్యులు ధృతరాష్ట్ర విదురభీష్ములు గురులు మాకు ద్రుపదప్రభుఁడున్, గురుఁడు మురాంతకుఁడు జగద్గురుఁ డిట్లు నమితమునను నగున్ శుభయుక్తుల్. భార. అ. ౧౩.

**యుక్తికరుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) 1 తగినవాఁడు. అర్హుఁడు (యుక్తి చేయువాఁడు. వ్యు అర్థము) 2 రుజువుచేయఁబడినవాఁడు, నిరూపింపఁబడినవాడు.

**యుక్తుఁడు.** సం. వి. అ. పుం. పరబ్రహ్మముతో నైక్యముచెందిన యోగి బ్రహ్మైక్యానుసంధానముగల సన్యాసి. విణ. (అ. ఆ. అ) నియుక్తుఁడు, అధికారము నియోగింపఁబడినవాఁడు అభియుక్తుఁడు

ఉ. ధర్మసుతుఁడు పెంచె ననుఁ దాన తురంగమశాస్త్రశిక్షకుం, గర్మరుఁ జేసి యాత్మతురంగముల కెల్లను నన్నుయుక్తుఁగా నర్మిలి,నిల్పి భార. విరా. 1 267

**యుగంధరము.** సం. వి. అ. న. 1 బండిలోనగు వానిరౌగ, కూబరము కాఁడికట్టెడి కఱ్ఱ 2. పర్వతభేదము (వాచ) 3. సాల్వదేశములోని యొకరాష్ట్రము (వై. ని.)

**యుగకీలకము** సం. వి. అ. పుం. కాఁడిసీల (బండి సీల)

**యుగపత్** అవ్య. (దీనికిఁ దెనుగున వ్యస్తప్రయోగము లేదు.) ఒకమారుగా, ఒకపర్యాయముగా

**యుగపత్రకము.** సం. వి. అ. పుం. యుగపత్రము.

**యుగపత్రము** సం. వి. అ. పుం. కోవిదార వృక్షము. తుమికిచెట్టు, ఎఱ్ఱకాంచనము.

**యుగపార్శ్వగము.** సం. వి. అ. పుం. మరపుఁగుఁగా డి మోసెడుయెద్దుల దాపునఁ గట్టెడి యెద్దు

**యుగము.** సం. వి. అ. పుం. 1. బండి, నాఁగలి మున్నగువాని కాఁడి (న) 2. జత. కవ 3. యుగ్మము, ఏకాన్వయముగల రెండుశ్లోకములు. 4. ప్రపంచకాలవిశేషము. (కృతత్రేతాద్వాపరకలియను యుగములు నాలుఁగు) అనేక సంవత్సరములకాలము. దీర్ఘకాలము. 4. నాలుగు సంఖ్యకుసంకేతపదము. 6 నాలుగు మూరల పరిమితిగల కొలత: భార. 7. ఒకానొక యోషధి బద్ధి

**యుగలకము.** సం. వి. = యుగలము.

**యుగలము.** సం. వి. అ. న. 1 జత. కవ, ద్వయము 2. ఏకాన్వయముగల శ్లోకద్వయము.

**యుగలాక్షకము.** సం. వి. — యుగలాఖ్యము

**యుగలాఖ్యము** సం. వి. అ. పుం. వస్త్రాము బర్బూరము

**యుగళి** సం. వి. ఈ. స్త్రీ. — యుగలము.

**యుగవర్తకుఁడు.** సం. వి. అ. పుం శని. (వై. ని.)

**యుగాంతము.** సం. వి. అ. పుం యుగము యొక్క అంతము. ప్రళయకాలము, మహాప్రళయము, మధ్యాహ్నము.

**యుగాంశకము.** సం. వి. అ. పుం సంవత్సరము ఏఁడు ఏడాది.

**యుగి.** సం. వి. న్. పుం సాంగవేదవేత్త (వై. ని.)

**యుగ్మకము** సం. వి. అ. న. యుగ్మము.

**యుగ్మపత్రము.** సం. వి. అ. పుం. కోవిదార వృక్షము, ఎఱ్ఱకాంచనము

**యుగ్మపత్రిక** సం. వి. ఆ. స్త్రీ. శింశుపాల వృక్షము

**యుగ్మము** సం. విణ. (అ. ఆ. అ) సరిసంఖ్య గలది వి. అ. న. జత, యుగలము. 2. కూడిక. కలయి... 3. కవలు, 4. ఏకవాక్యముగా నుండెడి పద్యములు. 5. మిథునలగ్నము 6. తిథివిశేష యోగము (వాచ)

**యుగ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) కాఁడికట్టఁ దగినది. గుఱ్ఱము, ఎద్దు. మొ. వి. అ. పుం 1 కాఁడికట్టఁబడిన ఎద్దు మొ, రథాశ్వము, రథముకుఁగట్టెడి గుఱ్ఱము. అ. న. 1. వాహనము, బండి. మొ. 2. శివునివిల్లు, శివధనుస్సు. (వై. ని.)

**యుజము.** సం. విణ. (జ్. 1 సహాయకము 2 సరసంఖ్య గలది (శై. ని).

**యుజినుఁడు** సం. వి. అ. పుం. వాయువు, గాలి (వై. ని.).

**యుజుఁడు** సం. వి. జ్. పుం. సమాధిలోనున్న వాడు

**యుతకము** సం. వి. అ. న. 1 జత, కవ, 2. మైత్రి, చెలిమి 3. అగణము. పెండ్లికాలమున వధూవరుల కిచ్చినసొమ్ము (పెండ్లిబహుమతి) 4 స్త్రీ ధరించెడి యొకరకము వస్త్రాదికము. 5 స్త్రీ వసనాంచలము. ఆడుదానిపైటకొంగు. 6 స్నేహమేర్పఱచుకొనుట, 7. ఆశ్రయము సశరణము దిక్కు 8 కూర్పాగ్రము చేటయంచు 9 సానాగ్రము కాలము దుర్భాగము 10 సంశయము.

**యుతము** సం. విణ (అ. అ. అ.) 1. కలిసినది. మిశ్రితమైనది 2 కలిగియున్నది కూడనది 3 విడఁదీయఁబడినది వేఱుపడ్డది 4 లెక్కకు కలియఁగూడనది. వి. అ. న. 1 పోరు సిదుము 2. గ్రహయుద్ధము

**యుద్ధరంగుఁడు** సం. వి. అ. పుం. కార్తికేయుఁడు, కుమారస్వామి (శై. ని.).

**యుద్ధసారము** సం. వి. అ. పుం. గుఱ్ఱము (శై. ని.)

**యుద్ధము** సం. వి. ధ. స్త్రీ. యుద్ధము, కయ్యము, పోరు

**యుధానుఁడు.** సం. వి. అ. పుం. 1. యోధుఁడు, క్షత్రియుఁడు. 2. శత్రువు. వైరి.

**యుధిష్ఠిరుఁడు.** సం. వి. అ. పుం. 1. యుద్ధమున స్థిరుఁడు (ఒంటరివాఁడు.) పాండవజ్యేష్ఠుఁడు, ధర్మరాజు. 2. ఇంద్రుఁడు (వై. ని.).

**యుధుఁడు.** సం. వి. ధ్. పుం. యోధుఁడు వీరుఁడు.

**యుధ్మము.** సం. వి. అ. పుం. 1. యుద్ధము. 2. బాణము, అమ్ము 3 ధనస్సు, విల్లు. (విల్యమ్స్)

**యుధ్మఁడు.** సం. వి. అ. పుం. యోధుఁడు. (విల్యమ్స్).

**యుయుత్స** సం. వి. అ. స్త్రీ. యుద్ధము చేయవలయు ననెడి యిచ్ఛ, కయ్యమునందలి కోరిక.

**యుయుత్సువు** సం. విణ. ఉ. యుద్ధముచేయవలయునని కోరుచున్నవాఁడు. పోరసిచే గలవాఁడు. వి. ఉ. పుం. పోట్లాడువాఁడు కలహశీలుఁడు జగడమాడెడివాఁడు.

**యుయుధానుఁడు.** సం. వి. అ. పుం. 1 ఇంద్రుఁడు. 2. క్షత్రియుఁడు, యోధుఁడు 3 సాత్యకి

**యుయువు** సం. వి. ఉ. పుం. అశ్వము, గుఱ్ఱము.

**యువ.** సం. విణ (న్. న్. న్.) 1 ప్రాయపువాఁడు, పడుచుఁదనముగలవాఁడు. (పదియాఱేండ్లు మొదలు ముప్పదియేండ్లవఱకుఁగల వయస్సుగలవాఁడు) 2 బలవంతుఁడు, ఆరోగ్యవంతుఁడు 3 శ్రేష్ఠుఁడు. మంచివాఁడు. వి. న్. పుం. 1 పడుచువాఁడు తరుణుఁడు. 2 (వ్యాక.) పెద్దవాఁడు బ్రతికియుండునప్పుడు అవశ్యమునఁబుట్టినవారిలోఁ జిన్నవాఁడు 3. అఱువది సంవత్సరములలో నొకటి. ధాత, తరువాతిది

**యువఖలతి** సం. విణ (అ. ఈ. అ) యౌవనమునందు బట్టతలగలవాఁడు, బట్టతలగలది.

**యువగండము.** సం. వి. అ. పుం. పోత్రపుబొటిమె పడుచువాండ్రకు గండస్థలమున బయలుదేఱు పొక్కు.

**యువతి** సం. వి. ఈ. స్త్రీ. 1. పడుచుఁదనముగల గల స్త్రీ తరుణవయస్కురాలు. (పదియాఱేండ్లు మొదలు ముప్పదియేండ్లవఱకుఁగల వయస్సుగల స్త్రీ. 2. కన్యారాశి. 3. పసుపు.

**యువతీష్ట.** సం. వి. అ. స్త్రీ. స్వర్ణయూథిక (వాచ.) (వృ. వి).

**యువరాజు.** సం. వి. అ. పుం. చిన్నరాజు. పట్టమహిషికిఁ బ్రథమపుత్రుఁడై పట్టాభిషేకమునకర్హతగల రాజపుత్రుఁడు.

యుష్మద్. (సమాసాదియందుఁ బూర్వపదముగా నుండి మీరు అను వర్థమిచ్చెడి) మధ్యమ పురుష సర్వనామము. ఉదా. యుష్మదాగమనము. యుష్మత్కారుణ్యము మొ.

యుష్మదీయము. సం. విణ. (అ. ఆ. అ) మీసంబంధమైనది భవదీయము

యుష్మాదృశుఁడు సం. విణ. (అ ఆ అ) మీవంటివాఁడు, భవాదృశుఁడు.

## యూ

యూక. సం. వి. అ. స్త్రీ. పేను.

యూకము. సం. వి. అ. పుం. పేను.

యూతి సం వి ఇ. స్త్రీ. మిశ్రముచేయుట. కలుపుట ఏకముగుట.

యూథనాథము సం. వి. అ పుం తెగకు ముఖ్యమైన యేనుఁగు పరికాఁడు, గజరాజము.

యూథపము సం. వి. అ పుం. యూథనాథము.

యూథము. సం వి. అ. న. మంద. సజాతీయ పశు పక్షిసమూహము. (గొఱ్ఱెలమంద. పశులగుంపు.)

యూథి సం. వి ఈ స్త్రీ. యూథిక (వృ. వి)

యూథిక. సం. వి అ స్త్రీ. 1. ఒకజాతిమల్లె అడవిమొల్ల (వృ. వి) 2. పెద్దగోరఁట. (వృ వి) .(శ. ర.).

యూపకటకము. సం. వి. అ. పుం. యూపస్తంభముపై నుంచెడి గుండ్రనికట్టుబిళ్ళ.

యూపకర్ణము. సం. వి. అ. పుం (యూపమునకుఁ జెవివంటిచోటు.) నేతితోఁ దడుపఁబడెడి యూపస్తంభ భాగము.

యూపద్రుమము. సం. వి. అ. పుం. ఖదిర వృక్షము: చండ్రచెట్టు.

యూపద్రుమపు. సం. వి. ఉ. = యూపద్రుమము.

యూపము సం. వి. పుం. 1. యజ్ఞపశువును గట్టుటకై పాతినకొయ్య. 2. జయస్తంభము. జయమును సూచించు స్తంభము. ౩. గంగరావి చెట్టు.

యూపు. సం. వి ఊ పుం. యూపము (వై ని).

యూష. సం. వి అ. స్త్రీ. 1 ఛాయ ౨ హ స. (కే. ని.).

యూషము సం. వి అ పుం. 1 హింస (కే ని.) 2 బ్రహ్మదారు వృక్షము. (వాచ.) ఫుం. న. ఏదైన పదార్థమువేసి కాచిన చేరపులుసు, పప్పుకట్టు

యొక్క అను షష్ఠీవిభక్తి ప్రత్యయము (ఆదిసమాసవిగ్రహవాక్యములయందే కానవచ్చును ఇది) 1 సంబంధార్థకము ఉదా—వాని పుస్తకము = వాని యొక్క పుస్తకము. 2 కర్త్రర్థకము

సీ కోరి ఫలార్థులై వారలయొక్కని ప్రాఁకుల మొదలకులు వీఁకఁబట్టి భాగ. ఆది ౫ 169 (వారలయొక్కన ప్రాఁకులు—వారలయొక్క యొక్కన ప్రాఁకులు — అనఁగా వారి లెక్కన ప్రాఁకు లని భావము)

కం. నీవగచిన యీయర్థము. భార. ఆర. ౫ 121.

కం అనిలజు పుట్టినదివసము, నన యఁట దుర్యోధనుఁడు భార. ఆది. ౫ 105.

యోక్త సం విణ. (ఋ. త్రీ. యు) యోజన చేయువాఁడు, యోగకర్త

యోక్త్రము సం వి అ న 1. త్రాడు. పలుపు. పగ్గము ౨. అంగుళి (కే ని.)

యోగక్షేమము. సం. వి. అ. న సంపద సంపాదించుటయును సంపదను పదిలపఱుచుటయును.

యోగజము సం. వి. అ. న. అగరుచందనము పుం. (న్యాయ) అలౌకికసన్నికర్ష విశేషము. విణ. (అ.ఆ.అ.) యోగమువలన జన్మించినది.

యోగదానము. సం వి. అ. న. మోసముగల దానము.

యోగనిద్ర. సం. వి అ స్త్రీ. 1. యుగాంతమున శ్రీవిష్ణుని నిద్ర. 2. దుర్గాదేవి.

యోగపట్టము సం. వి. అ. న. యోగి ధ్యానసమయమున వీఁపుమీఁదనుండి మోఁకాళ్లమీఁదికి జుట్టు

నెట్టుకొనెడిబట్ట, అవసక్థము. యజ్ఞోపవీతమువలె యోగి ధరించఁదగిన సూత్ర భేదము.

యోగపట్టె. వి. వి. (యోగము+పట్టె) యోగులు జందెమువలె వేసికొనెడి పట్టులో వగువానితో నేసిన వట్టె.

సీ పంచవన్నెల యోగపట్టె పొందుగవైచి ప్రొద్దు నిద్దపుమేనఁ బూఁది బూని సారంగ 3 181.

యోగిపదకము. సం. వి అ న. యోగపట్టము.

యోగపీఠము సం. వి అ న దేవతల యొక్క ఆసనము

యోగమాయ సం. వి ఆ స్త్రీ 1. ప్రపంచకసృష్టిని మిత్తమగు భగవంతుని శక్తి 2 దుర్గాదేవి

యోగము. సం వి. అ. పుం. 1 కలయిక, కూటమి; యత్నము, కూర్పుట. 2 ఉపాయము. 3. కవచము 4 ధ్యానము, చిత్తవృత్తి నిరోధము. 6 ఇంద్రియ నిగ్రహము 6 ఐక్యానుసంధానము, జీవాత్మను పరమాత్మయందు ఐక్యము చేయుట. 7. అపూర్వ వస్తులాభము 8 దేహస్థైర్యము. 9. శబ్దగ్రయోగము. 10. భేషజము, ఔషధము 11. ఒకానొక శాస్త్రము (రాజవర్తయోగము) 12. ద్రవ్యము ధనము 13. కార్మణము, చిల్లంగి 14. సముదాయార్థమున ననుకూలమైన వ్యుత్పత్తి శక్తిగలగుట, అవయవశక్తి 15. అన్యథా రూపప్రతిపాదనము. 16. జోస్యతి. 17. నక్షత్ర యోగ విశేషము; సంబంధవిశేషము. (సిద్ధయోగము, అమృతయోగము) 18. ఫలము, మోక్షము 19. (వ్యాక.) సూత్రము 20 (జ్యోతి) గ్రహ కూటమి. (రాజయోగము సాధనయోగము.) 21. వేగము (కే. ని.)

యోగరంగము సం వి. అ పుం నారంగము నారంజ (వ్యా వి.)

యోగరత్నము. సం. వి. (అ అ. ల.) అవయవశక్తి సముదాయశక్తి, చేతనుగూడ వక పదార్థమును దెలుపుపదము. పంకజము ఆతపత్రము మొ.

యోగవాగ(ము)లు. వి. వి. బ.) యోగము+వాగ(ము లు అంతరిక్ష మార్గమున బోయెడి యోగ ద్దలు మెట్టెడు పావకోళ్ళు.

ద్వి యోగవాగలు మెట్ట నుద్యక్తుడగుచు, వాగలు గిరులపైఁ బడిలమే యనుడు.

పండితా. పర్వ 384 పా.

సీ. ... పైకవ్వుకొనుగోరు పడమువజ్ర.

గీ. కవచముగఁ జేసి యోగవాగములు ఫాల, పయనమును మఱి స్వర్ణవేదియు నొసంగి

చెన్న. 87.

చం. పదముల యోగవాగలను పాణితలంబున నాగబెత్తమున్, మదుట విభూతిరేఖయు మనోజ్ఞకటీతటిఁ గావిచీరె. అహ 3. 5.

ద్వి ఘనమైన యోగవాగఁబులఁ దొడగి, తన చేగఁ జికిలిబెత్తముచేతఁబట్టి

ద్వి. శ పా 2 920 పం (బ్రౌ పా.)

యోగవాహము. సం వి. అ పుం (వ్యాక) విసర్జనీయ జిహ్వామూలీయోపధ్మానీయాను నాసిక్యముల ధ్వని.

యోగవాహి సం వి న్ పుం, 1. క్షారము 2 పాదరసము

యోగసారము సం వి. అ. పుం అన్నిజబ్బులకు గడకర్మిందు సర్వరోగహరమగు చింతామణి.

యోగాచారుఁడు. సం వి. అ. పుం. విజ్ఞానమునకు నిత్యత్వమును బోధించు బౌద్ధమతావలంబి.

యోగాధమనము సం, వి. అ. న. మోసముగల కాటు, వంచనగల కుదువ.

యోగారూఢుడు సం విశ అ ఆ అ. నిశ్చలమగు సమాధియందున్నవాఁడు.

యోగాసనము. సం వి అ. న. నిశ్చలధ్యానము చేయుటకుఁదగిన యాసనము. (స్వస్తికాసనము మొ)

యోగి. సం విశ, (న్. నీ. న్.) 1. అన్వితుఁడైన వాఁడు. కలిసియున్నవాఁడు, 2. యోగమభ్యసించు వాఁడు, యోగాభ్యాసము కలవాఁడు వి.న్.పుం, 1 ధ్యాననిష్ఠుఁడు, సన్యాసి; మంత్రశాస్త్రజ్ఞుఁడు, మాంత్రికుఁడు 3. యోగమతానుసారి, యోగి

మహావలంబి 4 పంకగజాతివిశేషము. 5. నారంగము, నారింజ (వృ. వి.) యావశూకము, ఒకానొకయుప్పు (కే. ని.).

యోగించే. కం స. క్రి కూర్చు

గీ. శుష్కములు దెప్పలేకున్నచోట నార్ద్రకంబు
గనుమడి యోగింపఁగలుగుగుణము
బేషజకల్పము 21. పా

యోగిని. సం వి. ఈ స్త్రీ 1. మాంత్రికురాలు మంత్రకర్త్రి. 2. భక్తురాలు, సన్యాసిని 3. శివపరిచారికల లేక దుర్గాపరిచారకలజాతి 4 దుర్గ.

యోగీశ్వరి. సం. వి ఈ. స్త్రీ 1 మంత్రకర్త్రులలో ముఖ్యురాలు, మాంత్రికశ్రేష్ఠురాలు 2 దుర్గ

యోగీశ్వరుఁడు, సం వి. అ పుం 1 యాజ్ఞవల్క్య మహర్షి 2. యోగిశ్రేష్ఠుఁడు

యోగుడు సం వి. అ పుం 1 విశ్వాసఘాతకుడు 2 చారుడు 3. నైయాయికుడు.

యోగేశ్వరి. సం వి అ. స్త్రీ 1 దుర్గ 2. వంధ్యాకర్కోటి (వృ. వి ).

యోగేశ్వరుఁడు. సం. వి అ. పుం శ్రీకృష్ణుడు

యోగేష్టము. సం వి అ. న. సీసకము.

యోగ్య సం. వి. అ. స్త్రీ 1. అభ్యాసము. 2 శాస్త్రాభ్యాసము (మానవయోగ్య, ధనుర్యోగ్య అస్త్రయోగ్య మొ. 3. సూర్యుని భార్య 4, గుణనము, హెచ్చువేయుట. 5. ఎఱ్ఱగజ్జెరు. రక్తపునర్నవ. (వృ. వి.) 6. భరణీ నక్షత్రము (కే ని.)

యోగ్యత. సం. వి. అ. స్త్రీ (న్యాయ) అర్థశక్తి, ఒకపదార్థమునకు మఱియొకపదార్థము కలిసినపుడు బాధలేకపోవుట, "అగ్నినా సించతి" అనుచోట యోగ్యత లేదు.

యోగ్యము. సం. విశే. (అ. ఆ. అ ) అర్హమైనది, తగినది, ఇంద్రియగ్రాహ్యము, ఇంద్రియములచేఁ దెలిసికొనఁదగినది. వి. అ. పుం. 1. పుష్యనక్షత్రము. న. 1. యానము, వాహనము, బండి 2. చందనము, పరిమళద్రవ్యవిశేషము. 3. రొట్టె: అపూపము. 4. పాలు 5. యంత్రము. న స్త్రీ. బుద్ధి. 2. ఒకానొక గంధద్రవ్యము, భరణీనక్షత్రము (కే. ని.).

యోగ్యుఁడు. సం విశే. (అ. ఆ. అ.) 1. తగినవాఁడు. అర్హుఁడు. 2 సుగుణములుకలవాఁడు. 3. ఒకపనికిఁ దగినవాఁడు 4. యోగమునకుం దగినవాఁడు. 5. నిపుణుఁడు, ఉపాయముగలవాఁడు.

యోచించు. సం. అ. క్రి ఆలోచించు (క.ర.)

మ. అనివాతూలుఁడు శేషుఁడాగ్రహము చేయం
బూను వాక్యంబులన్, విని యోచించి వినోద
ముగ్గుట కావేళన్ ఁ మేశుండు వారని వారిం
పక... వేం మా. 4 51.

ఇట్లు ప్రయోగమున్నదిగాని యోచనాశబ్దము సంస్కృతమున కానరాదు

యోజకుఁడు. సం. విశే అ. ఆ అ యోజనము చేయువాఁడు

యోజన సం. వి. ఆ స్త్రీ. 1 సంధానము, కలుపుట. 2 వ్యాకరణానుసారమైన యన్వయము 3 నిర్మించుట, కట్టుట, కూర్చుట 4. స్థితి

కం రాజా యేమని చెప్పుదు, నాజగతీసురుని
మొదటి యణఁకువకును ధా, త్రీజనులు రోయు
నప్పటి, యోజన శాశ్వతమయ్యె నొక
పర్వతమై. ని. ం. ౬. 14. 2.

ఆలోచన

గీ. అట్టి నన్నునుజేరి భయంబులేని, పొలుపుతో
నున్న దీపువుఁబోణిచెంత, ననుచు గవుకున
బట్టరా దరయవలయు, యోజన యొనరిచి
సేయుట రాజనీతి. శుక. 2. 249.

యోజనము. సం. వి. అ. న. 1. కలుపుట, సంధానము చేయుట. 2. అన్వయించుట, వాక్యార్థము నన్వయించుట. 3. నాలుగుక్రోసులదూరము ఆమడ. 4. సంయోగము. 5. పరమాత్మ, పుం. నూదిగొంటువక్క.

యోజనగంధ. సం. వి. ఆ. స్త్రీ. 1 కస్తూరి 2. వ్యాసుని తల్లియగు సత్యవతి. 3. సీత

యోజనగంధిక. సం. వి = యోజనగంధ

యోజనపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. మంజిడి, మంజిష్ఠ (వ్య. వి.).

యోజనవల్లి. సం. వి. ఈ. స్త్రీ. యోజనపర్ణి.

యోజనీయము సం. విశ. అ. ఆ. అ. యోజనము చేయదగినది.

యోజయిత. సం. విశ. ఋ. ఈ. ఋ. యోజకుఁడు

యోజించు. సం. స. క్రి. ఆలోచించు.

క. యోజింపుమనుచుఁ జెప్పిన, నాజాఁబునకు వచ్చి యమ్మంత్రివరుం, డేజాడఁ బ్రియ మెుసఁ గ్రెద, రాజున కని తలఁచునంత జాబునకుఁ దగన్. గాథా. 2. 77

అ. క్రి. కూర్చు, యోజనసేయు.

శా. హారుండు జంతువులకుం బ్రాణాంతకాలంబునం, దోంకారాఢ్యమంత్రరాజము చెవిన్ యోజించు నెల్లప్పుడున్. కాశీ. 2. 95

యోటకము. సం. వి. అ. పుం. నక్షత్రమేళనము. నక్షత్రముల కూడిక.

యోత్రము. సం. వి. అ. న. యోక్త్రము.

యోధనము సం. వి. అ. న. 1. యుద్ధము, పోరు. 2 ఆయుధము.

యోధనుఁడు. సం. వి. అ. పుం. యోధుఁడు, వీరుఁడు, యోద్ధ.

యోధము సం. వి. అ. పుం. యుద్ధము, కయ్యము.

యోధి సం. వి. న్. పుం. యోధుఁడు, పోటరి, యుద్ధభటుఁడు, సిపాయి, జగడమాడువాఁడు

యోధుఁడు. సం. వి. అ. పుం. (యుద్ధము చేయువాఁడు) వీరుఁడు, పోటరి, యుద్ధభటుఁడు, సిపాయి.

యోద్ధ. సం. వి. ఋ. పుం. యోధుఁడు, యుద్ధభటుఁడు.

యోని సం. వి. ఇ. ఈ. స్త్రీ. పుం. 1. స్త్రీ గుహ్యాంగము, ఆఁడుగుఱి 2. జన్మస్థానము, ఉత్పత్తిస్థానము. 3. ఆకరము, గని. 4. గృహము, ఉనికిపట్టు 5 కారణము. 6. పూర్వఫల్గునీ నక్షత్రము 7. జలము, నీరు 8. తామ్రము.

యోనిజము సం. విశ. (అ. ఆ. అ.) 1. యోని నుండి జన్మించినది, జరాయుజము 2. అండజము వాచ.)

యోనిముద్ర. సం. వి. అ. స్త్రీ 1. (తంత్ర) దేవీపూజాంగమైన ముద్రావిశేషము. అంగుళసన్నివేశవిశేషము 3. రతిబంధవిశేషము, మూలబంధము.

యోనిరంజనము. సం. వి. అ. న. ఋతుస్రావము. ముట్టగుట.

యోనిసంకరము. సం. వి. అ. పుం. అశాస్త్రీయమైన సంకరజాతి వివాహముచేత వర్ణసంకరమగుట.

యోనిసంబంధము. సం. వి. అ. పుం. వివాహసంబంధము, స్త్రీ పురుష సంబంధము.

యోష సం. వి. ఆ. స్త్రీ. స్త్రీ, ఆఁడుది.

యోషణ. సం. వి. ఆ. స్త్రీ. కన్యక, చిన్నపిల్ల.

యోషిత సం. వి. ఆ. స్త్రీ. యోష.

యోషిత్తు సం. వి. త్. స్త్రీ. యోష.

యోషిత్ప్రియ సం. వి. ఆ. స్త్రీ పసుపు.

యౌకము. సం. వి. అ. పుం. శ్వాసనిరోధకరోగము, ఊపిరికుట్టు.

యౌక్తికము సం. విశ. (అ. ఈ. అ.) 1. యోగ్యము. తగినది. 2 యుక్తియుక్తమైనది.

యౌక్తికుఁడు. సం. వి. అ. పుం. రాజుయొక్క నర్మసచివుఁడు.

యౌగపద్యము. సం. వి. అ. న. ఏకకాలమందు సంభవించుట.

యౌగికము. సం. విశ. అ. ఈ. అ. యోగమునకు తగినది. 2. వ్యుత్పత్తిగలది, వ్యుత్పత్త్యర్థముగలది.

యౌగికరూఢము. సం. విణ. అ. ఆ. అ. రూఢశ్లిష్ఠమందే కాక యౌగికార్థమందు కూడ ప్రయోగము కలది.

యౌగుఁడు. సం. వి. అ. పుం. యోగమతావలంబి, యోగమతము ననుసరించువాఁడు.

యౌతకము. సం. వి. అ. న. అరణము, పెండ్లి కాలమున వధువున కిచ్చిన ద్రవ్యము.

యౌతవము సం. వి. అ. న. పరిమాణము. కొలత, తూనిక.

యౌతుకము. సం. వి. యౌతకము.

యౌధేయుఁడు. సం. వి. అ. పుం. యోద్ధ.

యౌనము. సం. విణ. (అ ఆ. అ.) 1. యోని సంబంధమైనది. 2. వివాహసంబంధమునఁ గలిగి నది. వి అ. పుం 1. యోనిసంబంధమువలన కలిగిన పాపము న. గర్భాధానము, షోడశ కర్మలలో ప్రథమసంస్కారము (వై. ని).

యౌనికము సం. వి. అ. పుం. వాయుభేదము, స్వేదమును హరించునది (వై. ని)

యౌవతము. సం. వి. అ. న. యువతీబృందము. యువతీసమాజము,

యౌవనకంటకము సం. వి ఆ పుం. న. వ్రణ భేదము, యువగండము.

యౌవనము. సం. వి. అ న. 1 యువభావము పడుచుతనము. తారుణ్యము (పదునారేండ్లు మొదలు ఏఁబదియేండ్లవఱకుఁ గల ప్రాయము.)

యౌవనలక్షణము. సం. వి. అ న. లావణ్యము 2. కుచము. స్తనము.

యౌవనాశ్వుఁడు. సం. వి. అ. పుం. యువనాశ్వుని పుత్రుఁడగు మాంధాత.

యౌవరాజ్యము. సం. వి అ న. యువరాజత్వము. లేక యువరాజుయొక్క హోదా.

యౌషిత్యము. సం. వి. అ. న. స్త్రీత్వము. స్త్రీధర్మము.

యౌష్మాకము. సం. విణ. అ ఈ. అ. మీసంబంధమైనది, మీది. యుష్మదీయము.

యౌష్మాకీనము. సం. విణ. అ. ఆ అ. మీసంబంధమైనది మీది యుష్మదీయము.

య్వాగులి. సం. వి. ఈ. స్త్రీ. మండిగ, అన్నము వండితిసిన కల్లు. (వై. ని).

య్వాగులక్షి. సం వి ఆ. స్త్రీ. పుల్లగంజి (వై.ని.)

# ర

ర. ఉభ. ఒకానొక అక్షరము,

ర. సం. వి. అ. పుం 1. అగ్ని. 2. కామము. కామాగ్ని 3. క్షయము, నాశము 4 వజ్రము 5 హస్తము. 6. ఋతువు న 1 రుధిరము. నెత్తురు. 2. శిరము. తల. 3 ధాన్యము. 4. ప్రకాశము. 5. గ్రుడ్డు, అండము. 6. కడుపు, కుక్షి. 7 వక్రము వ. భయము. ఆ స్త్రీ. 1 బంగారము, 2. శాల 3. దానము 4. నడచుట. విణ. 1. విరసము. రసహీనమైనది, 2. తీక్షణము, ఉగ్రమైనది. (దీనికి తెనుఁగుప్రత్యస్తముగా ప్రయోగము కన బడదు)

ర = రా¹ అవ్య. ప్రశంసాదులను తెలుపును.

(క) ప్రశంసకు.

(వ్యవ) నీవు ర సత్పుత్రుఁడవు.

(చ) ఆశ్చర్యమునకు.

ఉదా:— అద్దిర, బళిర.

(ట) సంతాపమునకు.

గీ. అతనిరాకఁ దలంపక యధికభీతి
బోవుటయు తిచ్చవడి ముండపెంగు లకటం
మోసపుచ్చెర వన్నని డాసి [illegible] యలిగి
మతిమంతుమెడ బిగ్గ నులిమి [illegible]

కేయూర. 3. 74.

(త) సంభావనకు.

కం. నలకూబరుండు రంభం, గలయుట విని చిన్నఁ
బోవు కలభాషిణిరీ, తుటా దిరిగిచూచి దీని
గలఁచెర యిప్పార్త తావకరమై యనుచున్,

కళా. 3. 74.

(ప) వాత్సల్యమునకు.

-చం. జననముఁ జెప్పి యేఁ దెలుప సత్యము నమ్ముమి కుంతిభాషణం, బనితనుజత్వజాత కృప నంబుజ మిత్రుఁడు వల్కె.... భార. శాం 1. 58

(గ) సంతోషమునకు.

ఉ. నీ చెఱఁ బాసి పోయి రజనీచర చక్రి భజింప ముక్తిపొం, దేచెర యేచెఱం దవుల నే నిఁక, ... 45.

(ఙ) కోపమునకు

శీ. ఎవ్వఁడవు రోరి నీవు నా యెదురఁ బాఱు, పంచి నేఁటితి బాహుదర్పంబు మెఱసి, యెఱుఁగవుర యోరి నన్ను... 60

మ. ....రూపముం దాల్చి వంచన నెవ్వాఁడుర చేరినాఁడట దురాశన్ రంభ నంచున్ వెసన్. ... 3. 242.

(డ) నిందకు.

ఉ. వంచన రాముదేవిఁ గొనిపచ్చిన యట్టులు గాంచు రోరి వ, ... చర ... 4

(చ) ప్రార్థనకు.

ఉ. ఏలర యీ చలం బుడిగి యేలర ... 

రంతుఁడు. సం. విణ. (అ. అ. అ.) 1. దరిద్రుఁడు. దీనుఁడు 2. మందుఁడు, త్వరలేనివాఁడు.

రంతుతి. సం. వి. ఇ. స్త్రీ. ఒకానొకవృక్షము (వై. ని).

రంతువు. సం. వి. ఉ. పుం. 1. ఇఱ్ఱి, జింక. (తెల్లనివెంట్రుకలును మెత్తనితోలునుగల ఇఱ్ఱి) 2 నీవృక్షేరము.

రంగఁడు వి. (శ్రీ)రంగనాథుఁడు (శ. ర.).

రంగజము. సం. వి. అ. న. సిందూరము.

రంగజీవకుఁడు. సం. వి. అ. పుం. 1. నటుఁడు, నాట్యజీవి. 2. రంగులువేయువాఁడు, చిత్రకారుఁడు, శిల్పి.

రంగద. సం. వి. ఆ స్త్రీ. స్ఫటిక (వాచ.)

రంగదము. సం. వి. అ. పుం. 1. వెలిగారము, టంకణము. 2. ఖదిరసారము, కవిరి.

రంగదాయకము. సం. వి. అ. పుం. 1 కంకుష్ఠము. 2. ధాన్యభేదము (వాచ).

రంగపత్త్రి. సం. వి. ఈ. స్త్రీ. నీలివృక్షము, నీలిమందుచెట్టు

రంగపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. రంగపత్త్రి.

రంగబీజము. సం. వి అ న. రజతము, వెండి.

రంగభూతి సం. వి. ఇ స్త్రీ. ఆశ్వయుజ శుక్ల పూర్ణిమ

రంగభూమి సం. వి. ఇ. స్త్రీ. 1. నాటకరంగస్థలము, నాటకశాల. 2. యుద్ధస్థానము, సాముచేయుబయలు

రంగమల్లి. సం. వి. ఇ స్త్రీ. వీణ. (అ. ని).

రంగమాత. సం వి. ఋ. స్త్రీ 1 లక్క, ఎఱ్ఱరంగు. 2. కుట్టని, కార్యకర్త్రి.

రంగము సం. వి అ పుం. 1. రంగు, వన్నె 2. నాటకరంగము, నాటకమాడెడుచోటు 3. స్థలము, ప్రదేశము. 4 దర్పము, గర్వము. 5. యుద్ధరంగము, కయ్యపునేల. 6. నృత్యము 7. (శిక్ష) అచ్చును అనునాసికముగాఁ బలుకుట. 9. ఖదిరసారము. 10. వెలిగారము (వాచ.) పుం. సి. 1. తగరము. 2. (శ్రీ)రంగపట్టణము.

రంగము. వి. సోదె (శ. ర.)

రంగ (గా) రి. వి (రంగు+అరి[3].) రంగులువేసి జీవించు ఒకానొకజాతి. (శ. ర.)

రంగరించు = రంగలించు.

ఆ. పిడకబూడిదయును బెంపొందుకలబంద రసము నాముదమును రంగరించి, తలకు నంట నిలుచుఁ దఱుచైనవెక్కులు, వగకుఁ బొన్న కాయ వరుసఁ గూర్చి. (చి. శి. చి. ని)

రంగలరు. అ. క్రి. (రంగు+అలరు) శోభిల్లు, ఒప్పు.

వ. హరిద్రాచూర్ణమునఁ దజ్జోవర్ణ విశీర్ణాత్మ్యర్ణవ యోరుహావరాగరంజితార్ణో నిషిక్తంబులైన

చలువ నిగనిగని జిలుగుపావడలు హేమాంబ
రమ్ముల తెలుగున రంగలర...
ఇందు. 3. 58.

రంగలాసిని. సం. వి. ఈ. స్త్రీ నల్లవావిరి, శేఫాలిక.

రంగలించు = రంగరించు స. క్రి. (క. రంగళిసు) ద్రవ ద్రవ్యమునందు మఱియొక వస్తువునుజేర్చి వ్రేలితో కలయమెదపు, కలయఁ గలుపు.

వ. రంగుమీఱుకూరలరంగరంగత్కుడుంగంబు లంత రంగంబునకు వేడుక రంగలింప మరాళమండ యానాథపళవర్ణనరిపూరితంబై
చంద్రి 4 38.

రంగవల్లి సం. వి. ఈ. స్త్రీ ముగ్గు, శ్వేతచూర్ణాది కముతో లతాద్యాకారముగా రచింపబడు చిత్రము.

రంగశాల సం. వి. ఆ. స్త్రీ. నృత్యశాల, నాటక శాల.

రంగాజీవుఁడు. సం. వి అ పుం రంగజీవకుఁడు

రంగాయించు. స. క్రి. (√రంగు.) రంగుచేయు (శ. ర.).

రంగారి. సం. వి. ఇ. పుం. కరవీరము. గన్నేరు (వృ. వి.)

రంగారు. అ. క్రి. (రంగు+ఆరు) 1 ప్రశస్తమైన వన్నెగలుగు.

సీ. రవలపావడదాని రంగారుబంగారు తమ్ములఁ గేరుహస్తములదాని దశా. 2.16.

గీ. పొలుచురంగారు బంగారుపొదలబెడఁగు.
దశా. 1, 203,

వ. రంగారుబంగారుబొమ్మల ప్రతిబింబములకు.
ఉ. రా. 1. 136

2. ప్రకాశించు, ఒప్పు.

సీ. బంగారుబ్రాఁత చెఱఁగుల రంగారుపట్టు దుప్పటి కటిఁగట్టువాని. ఘటికా. 2. 178.

సీ. బంగారువలువున రంగారుకటిమీఁదఁ జక్కఁగా నొక్కహస్తంబు చాచి. కళా. 8 148.

3 విలాసయుక్తమగు.

ద్వి. రంగారఁగా బొంగరా లాడు చవుడు. సంగ డింద్రసుగూడి చరియించుచుండ.
ద్వి. శ. సా. 1. 48 పం.

రంగావతారకుఁడు సం వి. అ. పుం. నటుఁడు, నాటకజీవి.

రంగావతారి సం. వి. న్. పుం రంగావతారకుఁడు.

రంగి సం, విశే. న్. ఈ. న్. రంగిణి. స్త్రీ రూ. 1 రంగువేయువాఁడు 2. అనురాగముగలవాఁడు. 3. నాటకరంగమున నాడువాఁడు.

రంగిణి. సం.వి ఈ.స్త్రీ. 1. శతమూలి, పిల్లిపీచర. (వృ వి)

2 కైవర్తిక, తుంగముస్త (వృ వి.)

రంగిల్లు అ. క్రి (√రంగు) రంజిల్లు, ప్రకాశించు.

పీ క్రొవ్విరిచెఱువుపున్న వప్పువాతెఱకాంతి రంగిల్ల సితరుచుల్ దొంగలింప కు. సం. 5. 520.

రంగు వి. (సం రంగః, క రంగు, హిం. రంగ్) 1. సొంపు

గీ ఒదవెఁ గడు రంగు రక్తియు మదనవీర, కదనజ యభద్రకంపాశీకలకలాము, కరిణచణ కోకిలక లాపక రంజిత, కాకలికలందును బలాశకలిక లందు. చం. రా. 6. 7.

ఉ. రంగగునీనిజాకృతితెఱం గెఱుఁగంగ నిజంబు వల్కుమా, యంగననిన్నుఁ గన్గొనినయంత వనంగుఁడు సంగడించెడిన్ భాగ 5, 28

శా. ఆయారమ్ములఁ బొల్చుబొమ్మల బెడం గాపల్ల వశ్రేణిరం, గాయాశావుల మించు పూఁబఱపు లావా యొన్నఁగా శక్యమే. వసు. 1 138,

2 రంజనము, రాణ.

పీ. రంజన మగు రాణ రంగు రక మన
అం. భా. 2. 237.

3, శుక్లాదివర్ణము.

శా...అప్పట్టునన్, బుట్టుం గెంపున నింపుమీఱు రవిపెంపుం జెంపి దట్టంపు కెం, బట్టుంబట్ట

మాపుతుల యుత రేత రాలాపంబులు.
వరాహ. 4. 120.

**రంజకము.** వి. తుపాకి చెవిని కాల్చుటకు పెట్టెడు మందు.

వ. ...సివంగులు చుట్టుకొనుహరువున సరవత్తుల వేగమున రంజకంబు వినుసున సురటి ద్రిప్పినట్లు.
ప్రబంధ. 788.

సీ. బాదరునాఁగను బరఁగుఁ దుపాకిలోపలను జానకి త్రాఁడు నిలుపుతావు, చుఱుకైనమందు పేర్ప రఁగు రంజక మన.
ఆం భా. 2. 212

**రంజకము.** సం విణ అ ఆ అ
1. రంగువేయునది. 2. కామమును బెంచునది, కామోద్రేకము గలిగించునది. 3 సంతోషపఱచునది, ఆనందింపఁజేయునది.

వి. అ. న. 1. హింగులము, ఇంగిలీకము. 2. ఒక ఓషధి, కాంపిల్లము, రోచని (వృ. వి.). 3. ఏరండము, ఆముదపుచెట్టు (రం. ని.).

**రంజకుఁడు.** సం. వి. అ. పుం. 2, రంగులు వేయువాఁడు, చిత్రకారుఁడు,

**రంజణ.**=రంజణి వి. గాదెవంటికాఁగు. (శ. ర.)

**రంజణి**=రంజణ.

గీ. గాదెపోలికనుండెడి కాఁగుపేరు, రంజణి యవంగ వెలయు
ఆం. భా. 3. 85.

**రంజన.** సం. వి. ఆ. స్త్రీ. రంజనము (కే. ని ).

**రంజనము.** సం. విణ. (అ. ఈ అ.) 1. రంగువేయునది. 2 ఆనందపఱచునది, సంతోషపెట్టునది. 3. కామాది వికారము నుద్రేకింపఁజేయునది.

వి అ. న. 1 రంగువేయుట. 2 రంగు, ఛాయ. 3. సంతోషము, ఉల్లాసము. 4. ఆనందపఱచుట, ఆనందము గలిగించుట. 5, రక్తచందనము, ఎఱ్ఱచందనము. 6. ముంజగడ్డి, తృణవిశేషము. 7. హింగులము, ఇంగిలీకము. 8. కట్ఫలము, శేకు, (వృ వి).

**రంజని.** సం వి. ఈ. స్త్రీ. 1. నీలివృక్షము నీలిమందుచెట్టు. 2. పసుపు. 3. మంజిష్ఠ, మంజిటి 4 గుండారోచనిక, కంపిల్లము (వృ. వి.) 5. మణిశిల, మనశ్శిల (కే. ని.).

**రంజసానువు.** సం. వి. ఉ. పుం. 1. మేఘము 2. ధర్మము (కే. ని.).

**రంజితము** సం. విణ (అ. ఆ అ) 1 రంగు వేయఁబడినది, వర్ణము వేయఁబడినది. 2. సంతోషపఱుపఁబడినది, ఉల్లాసపఱుపఁబడినది

**రంజిల్లు** అ. క్రి. ఎఱ్ఱనగు.

మ. వలఁ గేల్ దమ్మిలచాయఁ గెంపులబలెన్ రంజిల్లు నమ్మొత్తియంబులు రా పాడుచు దోయిలింపుచును మోముం జందురున్ నవ్వు వెన్నెల లల్లల్లన సోఁకగాను మిగుల న్నిక్కంగ నొక్కుమ్మడిన్, దలఁ బ్రాల్వోసె నెలంత రాచనెలకున్ దార్కొన్న కోర్కెన్ దగన్.
యయా. 4. 111.

**రంజిల్లు. (లు)** సం. అ. క్రి. 1 అనురాగము పొందు (శ. ర.).

2 ఒప్పు, ప్రకాశించు

చం. సలలితచర్చ ధర్మ్యపదసారసభక్తి జితాగ్ర్యయార్క్య రంజిలు నల సినయార్యుసతి సితమ శీతమయూఖ కీర్తియై.
శశాం పీఠి. 1. 63.

సీ. మెఱుఁగుంచు కమ్మలు దొంగయవం చటుడించి మణుల రంజిల్లు కమ్మలు ధరించి
హం. 1. 217.

వ ... వ్యాధియకరమ్మున రంజిల్లు నసుందామ రాగరసమకరందమ్మున
మనుచ 2. 87.

3 సంతోషించు.

ఉ. ముచ్చటలుం బ్రసంగములు మున్నటిరాజుల చర్యలుం గథల్, చెప్పం జానతి మన్ననిఁ జిత్తము రంజిల సాతఁ డత్తటిన్.
హంస. 1. 33. హంస 1. 51.

**రప్పించు.** స. క్రి. (√వచ్చు) 1. రావించు, రాఁజేయు.

కం. నటవాహాంకృతిఁ దమలోఁ, జిటపోటి జగడంబులూన్చి రంభలకుం, బోటమిన మేలేర్ప నుపఁగ, నిట నిను రప్పించె నిర్జరేశ్వరుఁ డధిపా. విక్ర. 2. 87.

సీ. పతికళావతి యనుదానిఁ బద్మనయన, దమసహోదరి గారాపుదాదికూఁతు, నంతికమునకు రప్పించి యాదరించి, వరమ్రసాక్షిణిఁ గావించి నగుచు పలికె. నైష. 8. 54.

కం. క్రమమున ధరణీశరణ, క్షమమగుతద్ధర్మనీతి చాతుర్యవిశేషము శేషమరసి యధిక ప్రమదుఁడయి ప్రసంగవశత రప్పించి తగన్. రాఘవ 3. 5.

2. కలిగించు.

ఉ. ఉంచినయగ్రహారముల నున్నతవైఖరి విద్యలెల్ల, రప్పించిన విప్రవక్త్రముల, బెంచిన వన్యవనోత్కరంబులన్, నించిన బత్తిటాకముల నెమ్మిగనందగు వెంగళాంబ, యక్షయ్యంచిత కీర్తిసౌధవిశదాక్షర సూనమరాళరాజమై. వసు. 1. 64.

ద్వి. మానంబు దప్పించి మరను నొప్పించి. దీనత రప్పించి దిగులు దెప్పించి. ద్వి. హరిశ్చ పూ. 1613 పం.

**రప్పు** హిం. వి. పోగుతీయుట (శ. ర)

**రబాబు.** వి. (హిం. రబాబ్) వాద్యవిశేషము.

సీ. గోటివాద్యంబు కిన్నరమీటుబడ్డి, వాద్యము రబాబు వగలు సర్వంబు మెఱయ, దురుసుగతిఁ జూపఁ బార్వతీవరుని మెచ్చి, జూపుర రిగంచువయ్యంటఁ ఇక్కఁ జేర్చి, కువల. 4. 112.

సీ. వేటుగజ్జెలు మద్దెల వీణచెంగు, ముంశిసాగంగ తిత్తి కిన్నెరరబాబు, శంఖకాహళాది వాద్యములొ సరసరీతి, పాటక్రకులఁగూడి నాదమేర్పాటు సేయ. మల్లుపు. 4. 64.

వ. ... పికిళులు బచ్చికోళ్లు రుద్రవీణియలు స్వరమండలంబులు తంబురలు కిన్నెరలు రావణహస్తంబులు రబాబులు ... ప్రబంధ. 605.

**రభసము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉగ్రమైనది, తీవ్రమైనది. 2. తొందరగలది, అతిత్వరగలది. 3. సంతోషము గలది, ఆనందముగలది.

4. గొప్పది.

వి. అ. పుం. 1. తొందర. 2. ఆలోచింపక పనిచేయుట. 3. కోపము, కోపావేశము. 4. హర్షము. సంతసము. 5. ఔత్సుక్యము. ఉత్కంఠ.

**రభసుఁడు** సం. వి. అ. పుం. మ్లేచ్ఛుఁడు. (శే. ని)

**రభస్సు** సం. వి. స్. న. రభసము.

**రభువు.** సం. వి. ఉ. పుం. వార్తాహరుఁడు, దూత. (వై. ని).

**రమ.** సం. వి. ఆ. స్త్రీ. 1. విష్ణుభార్యయగులక్ష్మి. ధనాధిష్ఠానదేవతయగు లక్ష్మి. 2. సంపద. 3. శోభ, కాంతి.

**రమకుఁడు** సం. విణ. (అ. ఆ. అ) క్రీడాపరుఁడైనవాఁడు, ఆటలాడువాఁడు.

వి. అ. పుం. ప్రియుఁడు, ప్రేమపాత్రుఁడు.

**రమఠధ్వని.** సం. వి. ఇ. పుం. ఇంగువ, హింగువు.

**రమఠము.** సం. వి. అ. న. హింగువు, ఇంగువ.

**రమఠుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) క్రీడనశీలుఁడు. (శే. ని)

**రమణ—రాణ.** వి. (సం. రమ్యమ్) 1. ఒప్పిదము.

క. ...రమణను వైశ్రవణు చైత్రరథమునకు సమానముగా దీనిని... భా. ఆది. 4.15.

మ. తమవక్త్రాధరకేశయౌవనయశోద్దామ ప్రభావంబులన్, రమణంబోలుదుమన్న ... కు. సం. 7. 888.

2. ప్రేమము, ప్రీతి.

ఆ. అతులమగుచు దివ్యమైన యా మోక్షమా,
ర్గంబు చూపవలయు రమణతోడ.
భాగ. 5 172.

మ. రమణం బొప్పు సరోవరం బనిలజున్ రాజీవ
రాజీవ, సత్సముదాశ్రితవ్రజ చక్రవాకబకహంస
క్రౌంచనాదంబులన్. భార ఆది. 6. 172.

గీ. రాజనందనపాలికి రమణనరిగి
దశకు. 6 167.

గీ. రాము డాదిత్యకులభర్త రమణవచ్చి, కరుణ
సేయ నలకఁ దగుగట్టితాల్మి.
రాఘవ. 3 35.

3. ఆనందము, సంతోషము.

సీ. మందాకినియు ను గాళిందియు నిరుచక్కి
రమణంబై విజామరంబు లిడిరి. హర 4.52.

ఆ. రాజసుతులతోడ రమణఁ బాండవధృత,
రాష్ట్రసుతులు వృద్ధరాజులొద్దఁ, దద్దయును
ముదమునఁ దమతమ విద్యలు, మొఱసి రెల్ల
జనులు మెచ్చి పొగడ. భార. ఆది. 6 11.

గీ. రమణనారామలక్ష్మి యారామవిభుని, బూజ
గావించు చందానఁ బొల్పెనపుడు.
ఉ. రా. 6. 25.

4. ఆసక్తి.

ఆ. పొలుచు ద్రుపదరాజపుత్రీస్వయంవర, రంగ
మునకుఁ జనిరి రమణతోడ.
భా. ఆది. 7. 165.

ఆ. . హృదయహారి వివిధ, రత్నరాజి సుంద
రంబైన మగధేశు, రథముపేరఁ బనిచె రమణ
తోడ. భార. సభా. 1. 214.

5 ప్రసిద్ధి

సీ. బ్రహ్మభాగవతాది పదునెనిమిది పురాణము
లలో ప్రాకటంబు రమణఁ గాంచు. సురా. 8.

6. విధము.

సీ. కప్పూరురేణువు కమలాప్త బింబంబు రాహు
మండలమున రమణఁ గప్పు
భార. భీష్మ. 1. 242.

వ. .. యోగంబులం దాత్మయోగంబు రమణ
నోషధులయందు యవలనొంబగన..
భాగ 12. 48.

కం. శ్రీరామ మంత్రి వరద సు, ధీరత్నముకుల
వధూటదీపించు య్య, శోదారమణీరమణవిష్ణు,
శ్రీరంజితకోండమాంబ చిరధన్యములన్
పాండు. 1. 56, భార. శాం. 4 62.

7. ఇది కొన్నిచోట్ల వాక్యాలంకారముగ నుప
యోగింపఁబడును.

గీ. జనులు నిగ్రహానుగ్రహశక్తుఁడైన, రాజు
శాసనమువఁజేసి రమణతోడ, నోలిఁ దమతమ
మర్యాద లొక్కనాఁడుఁ, దప్పవోడుదు రిమ్మ
హితలమునందు భార అర 3 350.

ఆ. రమణతో వనాంతరమున రేతస్స్కంద,
మయ్యె నవనిపతికి నెయ్యమొనర.
భారం. ఆది. 3 27.

సీ. .. రాక్షసంబు నాను, రంబు గాంధర్వంబు
రమణం బైశాచంబునను నెనిమిది వివాహముల
యందు. భార. ఆది. 4. 54.

రమణవోలె—విధముగా.

సీ. దేవశానదికి శోభావహమ్ముగ హేమరాజీవ
ముదయించు రమణవోలె.

ఆ. మానినీలలామ మేనక కుదయించె రాజవదన
శైలరాజకన్య కు. సం. 3. 272.

జః రమణకెక్కు. ఱమణించు.

రమణ సం. వి ఆ. స్త్రీ 1. భార్య. గృహిణి.
2 మనోజ్ఞ స్త్రీ. ఇంపైన యాడుది.

రమణకెక్కు అ. క్రి. (రమణకు+ఎక్కు) వన్నె
కెక్కు, శోభిల్లు

సీ కటగత చక్రవిక్రమశక్తి నెవ్వాని రాజూమ
జత్వంబు రమణకెక్కు. వసు. 1. 13.

రమణము సం వి. అ. పుం. 1. గార్దభము, గాడిదె.
2. వృషణము. 3. మహారిష్టము, వేము (వృ.వి).
న. 1. క్రీడ, ఆట. 2. సరసము, ముద్దులాట.

వినోదము. 3. రతి, మైథునము 4. ఆనందము, సంతోషము. 5. జఘనము. 6. జంబూద్వీప మండలి నవవర్షములలో నొకటి రమ్యకవర్షము. 7. పటోలీమూలము, పొట్లవేరు.

**రమణి** నం వి ఈ. స్త్రీ. 1. మనోహరురాలగు యువతి. 2. భార్య, గృహిణి. 3 స్త్రీ, ఆడుది. 4. కలబందచెట్టు, బాల (వృ. వి.).

**రమణించు** = రవణించు. అ క్రి. (√రమణ) ఒప్పిద ముగు, ఒప్పు,

గీ. అప్పురంబున రమణించె హర్మ్యచయము.

నిర్వ. 1. 52.

**రమణీయము.** నం. విశే. (అ. ఆ. అ) 1. మనోహర మైనది, అందమైనది.

**రమణుడు.** నం. వి. అ. పుం. 1. ప్రియుడు, భర్త. 2. కామదేవుడు, మన్మథుడు 3 అర్జునుడు

**రమతి.** నం వి. ఇ పుం. 1. కామదేవుడు, 2. ప్రియుడు, నాయకుడు. 3. స్వర్గము. 4. సమయము. 5 వాయసము, కాకి. 6. కాముకు (వాచ.) 7. పథ (కే. ని.).

**రమము.** నం. విశే అ. ఆ. అ. ప్రియమైనది, ప్రేమా స్పదమైనది.

వి. అ. పుం. 1. సంతోషము, ఆనందము 2 అశోక వృక్షము (వృ. వి.),

**రమరమి** = రమారమి. వి క్రమము (శ. ర.).

**రమాకాంతుడు.** నం. వి. అ పుం. విష్ణువు, లక్ష్మీపతి. ఇల్లేంమాపతి, రమాప్రియుడు మొ

**రమాప్రియము.** నం. వి. అ. న. పద్మము, తామర పువ్వు.

**రమారమి** = రమరమి. వి క్రమము.

పంచచామరము. రమాకుమారసారె పాంథశాలి మెంచనిట్లుమీ, రమ్యాయుమాధినాథుతోడ రాయి డించి మించినే, రమాని తార నీకునుం దురంగ మొక్కకీరమా, రమారమిన్నెలంగ కౌరరవ్వ నేయ సొంమా.

కృష్ణ. 4. 81.

**రమి (యి)ంచు** నం అ క్రి. 1. క్రీడించు.

ఉ. భూవిభుఁ డెప్డు భూమిసతిఁ బొంది రమింప మహోన్నతుం డగున్ భార. శాం. 3. 125.

2 ఆనందించు

కం. సమరమునవ్వుడు నీకి, యమృత పదప్రాప్తి హేతువగు సమ్యగ్బోధము వివరించితి వచలత, రమింపు మిందెవుడు శమధురా ధుర్యుఁడవై. భార. అశ్వ. 1. 224.

స క్రి. సంభోగించు.

మ. జవరాంద్రన్ రమియింపఁ గానరతి భాస్వ చ్చంద్రికారాత్రులన్, సవిశేషంబగు విదగ్ధ నైన నసినైన స్వైరులంగెల్చి ప్రా,భవమొప్పన్ యశమొందఁ గానరు జనుల్ . ..

మల్లభూ. 3. 46.

**రముడు.** నం. వి. అ. పుం. 1. ప్రియుడు, భర్త 2. మన్మథుడు కామదేవుడు

**రమ్య.** నం. వి. ఆ. స్త్రీ. 1. రాత్రి. 2 స్థలపద్మిని (వృ. వి.).

**రమ్యకము.** నం. వి. = రమ్యము.

**రమ్యపుష్పము.** నం. వి అ. పుం. శాల్మలి వృక్షము, బూరుగుచెట్టు (వృ. వి )

**రమ్యము.** నం. విశే. (అ. ఆ. అ.) మనోహరమైనది, అందమైనది.

వి అ పుం. 1 చంపక వృక్షము 2 బక పుష్పము (వృ వి.)

వి. అ. న. 1. పురుషుని శుక్రము. 2. పటోలి మూలము, పొట్లవేరు. 3. జంబూద్వీపాంతర్గత మైన నవవృక్షములతో నొకటి.

**రయము.** నం. వి. అ. పుం. 1. నదీప్రవాహము, ప్రవాహము. 2. వేగము, వడి, త్వరం.

**రయి.** నం. వి. నో. న. 1. ధనికుడు, డబ్బున్న వాడు. 2. జలము, నీరు.

**రయిక.** — దైశ. వి. అవిక, కంచుకము (వా., శ. ర.).

రయంబున వెంబడ వాగెనల్లియు. య్యనఁగను మూసికన్ దెలుచునంతటలో మునిసీమఁజేరఁగన్. శుక. 2. 58.

చం. పతియలతేజి నెక్కి వరపాలురు గొల్వ హయాధి రోహపాంఁడితిసరిదాఁట్లు జోడనలు నిబ్బరముస్ రవగాళ్లు వేడెముల్. జతురతఁజూపి ... చంద్రా. 2. 70.

సీ. రవగాలుఁకు సాటిరాక గాడ్పుపటాణి పొదలు సిగ్గునఁబోయి పొదలఁజొచ్చె. ఉ. రా. 1. 68.

రవడి. వి. అప్పు. ఋణము (శ ర.).

రవణ = రమణ వి. (క. రవణి. త. ఇరణి) ఒప్పిదము.

సీ కువలయాధీశుఁడై రవణఁజెందుచు గాని చక్రాభి రక్షణోత్సవములేదు. ఇ. దు. 4. 40.

రగడ. రవణరంజిల్లెడు పరాగములరాగముల, నవవిల నవములఁ బున్నాగముల నాగముల. భాను 2.68

రవణకము. నం. వి. అ పుం. రవణము.

రవణము. వి. 1. భూషణము.

సీ. వేల్పుటింతులలోన విఙ్ఞపీఁగుచు మేన నవరత్న రచనల రవణ మెటిఁగె మనుచ. ౨. 11.

మ. ఇవి నాసొమ్ములు వీనిలోన మగఁడా యేమేమిసీ విచ్చి నాఁ, డవునా తల్లియుఁ దండ్రి బాంధవులు వేడ్కల్ మీఱఁ జేయించి రీ, రవణంబుల్ విను వీని లోన నొకటారంబై నని జూఁనీ, చెవులాకుల్ వగ నేయవచ్చితివి నీవే నింతనే నోర్తునే. రుక్మాం 4 122.

వ. సుశర్మయు నేలినవాని పనిఁబూన జోడు పక్కెరం కైదువు బిరుదురవణంబు మొదలైన సవరణంబులం జూడ వక్కజంబుగాఁ గూడి భార. విరా. 3 131.

2. కాంతి

కం. రవరవలు నెఱపునీలఁపు, రవరవణము తోడఁ జెలియరాళకచంబుల్, కవకవనవ్వున్ పలిజ,క్క వకవఁ గలకంరకఁరి కరివకుచంబుల్. విజ. వి. 1. 65.

3. పోటి, సామ్యము.

వ. ... అంగజ భసితాంగరాగ సంగత గంగాధరాంగ రంగద్విభా విభవంబుతో రవణంబుగని ... ఉ. రా. 4. 163.

జ రవణించు, రవణింపు, రవణిల్లు.

రవణము. నం. విజ. (అ.అ.అ.) 1. అలుచుచున్నది. పెద్దకూఁత కూయుచున్నది 2. మ్రోఁగునది,ధ్వని చేయునది 3. తీక్షణమైనది పాఁడిగలది, వేఁడి గలది 4. చంచలమైనది, స్థైర్యములేనిది,

వి అ పుం 1. ఉష్ట్రము, ఒంటె. 2. పికము. 3. మేలుజాతి గుఱ్ఱము. 4 పొట్లవేరు. 5 పటోలము, పొట్ల (వ్య వి.) 6. గర్దభము, గాడిద. 7. భ్రమరము. 8 శబ్దము. ధ్వని (కే. ని.)

న కంచు.

రవణించు—రవణించు అ క్రి (√రవణము) ఒప్పిదమగు.

సీ. అమరేంద్రముక్త మేఘములఁ దెప్పుక్రమంబు రవణించ మించు వాయువులు విసరె దశా 7. (2) 78. 231 పా.

రవణింపు వి. (√రవణించు) ఒప్పిదము.

సీ. రవికోటిరుచి పెంపు రవణింపు మణికిరీటంబు వాఁడు సులలాటంబు వాఁడు వైజ. 1. 82.

రవణిల్లు అ క్రి. (√రవణించు) ఒప్పిదమగు, కవికంఠభూషణము. నవరత్న విశ్రమ మునవ్ నజసాన జగంబులన్ గవుల్, కవికంరభూషణముగా రచియింతురు మాటి మాటికిన్, రవణిల్లు కల్పమువ నందక మాణిమ పేంద్రరుక్మిణీ, ధవునత్కథాసుధలఁ దత్పరులైన మహాత్ములట్లుగాన్ అప్ప 4. 230 పా.

రవనడ. వి (రవ + నడ) అశ్వగతి విశేషము.

గీ. . జోడనవడ్డ వేడె, ము రవనడ చుట్టు పేరెము. పరువులనఁగ, బంచధారల జెన్నగుఁ బంకజాక్ష. ... 81.

రవపొళము వి (√రవ[1]) విశ్వాలి సన్నపాటుదా (వస్త్రము). శ. ర.

రవమంచేము. వి. (√రవ[2]) సకినలమంచము. (ఈ పదము సంస్కృతమని శ ర.).

రవము సం. వి అ పుం 1. పక్షుల కలధ్వని, 2. చప్పుడు, శబ్దము

రవరవ. వి. 1. ధ్వన్యనుకరణము.

గీ. ఓరచూపుల విటులందా నూరడించి గిల్కు మెట్టెల రవరవల్ గుల్కరింప, చికిలిచేసిన తామ్రమంపు౦ జెంబు బూని, వీథినేతె చె సాతాని వెలంది యొకతె. వీథి 17

కం. కవకవనై పదనూపుర, రవరవ లా గుబ్బ కొన్న రతిపతిగతులం, జివచివనై విటుచెన్నకు, రవళిన్ రతిసల్పురతుల రవరవం గనియెన్ భాగ. 6. 100

కం. వవవవ సౌరభముల సెక్కువకువలయ వర్ష మపుడు గురిసెన్ మొరసెన్, రవరవ ముజ రవంబులు. దివి దివిషజ్జలజముఖులు దెలిసి నటింపన్. మనుచ 4. 118.

2. స్పర్ధయందగు ననుకరణము

కం. వవవవ మను నెమ్మేనులు, రివరివ మను మధ్యములు ద్విరేఫశ్రేణుల్, జవజవ మను వేణికమది, రవరవ మను మరుండు వారి రంగులు గనినన్ చమత్కా ౯. 108

3. స్పర్ధ, జగడము.

చం. కులమును రూపము న్మగని కూరిమియుం గల దానవంచునీ, వల వల రుక్మిణీ రమణివాసిం బెనంగంగ సత్యభామయున్, గులమునురూప ము న్మగని కూరిమియు న్గలదాన వంచు నావలం బచరింపంగా రవరవల్ వొడమెన్ మది వారికెంతయున్. పారి. 1 42.

కం రవరవలు నెఱపునీలపు, రవరవణముతోడం జెలియరాళకచంబుల్, కవకవనవ్వున్ పలిజ, క్కవకవం గలకంఠకంఠి కరివ కుచంబుల్ విజ. వి. 1. 85.

సీ. తివిరివేల్పులమీంద రవరవల్ నిగుడించు వడుపున నూర్పులు గడలుకొనంగ. 4. అచ్చ. రా. సుం. 11.

4. కాంతి విశేషము.

కం. రమణులికడకనుప మనో,రమకున్ మజ్జనము దీర్చి రవరవ కచపిం,ఛమునకుం గాలాగరు ధూపము వెట్టి జవాది నంటువాపి నిపుణతన్. 6 మనుచ. 9 4.

గీ. రవరవల గుబ్బలొండొంటి రాయుచుండ ప్రబంధ 18.

రవలి = రవళి వి. ధ్వని

కం దివమునకు నేగి చిక్కన, యవయవములతోడ నర్ధరామరుం డుండం, గవకాచు దేవ దూతలు, రవలిం జనుదెంచి యమర రాజ రుదందన్. శేష. 1. 112.

సీ. మణితులాకోటి కోమల ఝణత్కారంబు రవలిమట్టెల మ్రోంత యవఘళింప. భీమ. 1. 104.

చం. మొగములతమ్మి వాసనకు మూంగెడు తేంటు లందోలు కేలికై, చిగురుఁమేపరుల్ గదియం జిల్కెడు పల్కులంజేర గిరముల్, బెగడం గమించునందెరవలింగల హంసలు రాస సైన్యమై, తగు మరుమించుంబోణి కెనం దాలుతు రిచ్చటి శాలిపాలికల్. చం. రా. 3 98

రవళి = రవలి. వి. (క. రవళి). 1. ధ్వని.

మ కలవం బెంతయు వింతగా నలంది చెంగల్వ త్నెలనిన్నించవే, నలింగిల్కొల్పి పసిండి యందె రవళిన్ రాయంచ లంతంత రాం జెలులుం దానును సత్యభామ సనుదెంచె న్నాథుం డుప్పొంగంగన్. పారి. 3. 14.

గీ. అత్తెఱంగున నదరిపాటారజంపు, వన్నెం జోడకట్టి తాంబాడు సన్నరవళి, పాటలళి ఝుంకృతి శ్రుతింబాదుకొనంగం, జూడకయ చూచు చూపుతో నుడియుటయును. మనుచ. 6. 32.

(సన్నరవళి = సూక్ష్మధ్వని)

మానిని. అంచుమనంబున వద్భుతమందుచు నా సరసీరుహామంటినఁ గో, పించి ఘనాఘనభీకర గర్జల వెంపునడంచెడు పెన్ రవళిం, గొంచెపు మానిని కొంచకదల్చిన గొబ్బున సారథి గూలఁగవీ,ఉంచి నృపాలుఁడు చేష్టలుదక్కి మహీసమదేహరుచి న్నిలువన్. వరాహ 8.78.

మహాస్రగ్ధర. ... వాతాఘాత ఘూర్ణ ద్ధ్వనధుఁ రవళుల్ వాద్యముల్ మీఱఁగా ...
అము 4. 185.

2. హుంకారము, గర్వధ్వని

సీ. పడతియబ్బురపుఁబెండొడల నిగారింపు రంభా పటుత్వంబు రవళిగెల్చు. రసిక. 2 77

(ఇట నుత్కర్షమని భావము.)

జ. రవళించు.

**రవళించు.** అ. క్రి (√ రవళి) ధ్వనించు

ద్వి. ప్రవిమలరత్నదర్పణ తోరణములు, రవళించి దాఁటు సాంబ్రాణి తేజీలు.
ద్వి. హరిశ్చ. పూ. 125. పం.

**రవసెల్లా.** వి (రవ[1] + సెల్లా) మిక్కిలి సన్నపాటి సెల్లా.

గీ. పసిఁడిచెఱఁగుల రవసెల్ల పైనివేగ, పొదు పుగాఁ గప్పికొని పూలపొద మఱుఁగున, నిలిచి యళుకుచు బెళుకుచుఁ జెలులఁ జూచి, చిలుక వలె ముద్దుపల్కులఁ బల్కె నిట్లు.
వేం. మా. 4. 261.

**రవాణా.** హిం. వి. పంపుట (శ. ర.).

**రవాయి.** వి. కృత్రిమ పద్మరాగ మణి.
(చి. ని., శ. ర.)

**రవాలు—రవగాలు.** వి. 1. అశ్వగతి విశేషము.

కం మిత్తియుఁ బితరులఁ జేఁడు, వ్మత్తిలితిరుగఁగఁ జూచినలిఁ బొగరడగన్, మొత్తిన తెలిగిత్త రవా, ల్త్తడి నెఱరౌత వల్లలల దొరితాతా.
అచ్చ. రా. కిష్కిం. 108

2. అశ్వము, గుఱ్ఱము.

గీ. తత్తడి రవాలునడగఁడు కత్తలాని, తురిక బాబా యనఁగ నొప్పుఁ దురగమునకు.
సాం. ని. తిర్య. 71.

**రవాళి.** వి రవళి, ధ్వని.

ఉ. గుత్తపు గుబ్బలాఁడి సుమకోమలి ముద్దుల గుమ్మ మల్లిపూ, గుత్తి మెఱుంగుఁదీఁగెలతకూన మనోజురవాళి జాళువా, ముత్తెపుఁ గోల ...
నిరం. 4. 82.

సీ. కెరలి నెమ్మలు సేయు కేకారవంబులు లావుకలెత్తు నీలల రవాళి చంద్రా. 2. 81.

జ. రవాళించు.

**రవాళించు** అ. క్రి. (√ రవళి) రవళించు, ధ్వనించు (శ. ర.)

**రవి** సం వి ఇ పుం. 1. సూర్యుఁడు. 2. పర్వతము. 3 జిల్లేడుచెట్టు 4 పండ్రెండు సంఖ్యకు సంకేతపదము

**రవికాంతము** సం. వి అ పుం. సూర్యకాంతము, సూదంటురాయి

**రవిజుఁడు** సం. వి అ పుం 1 శని గ్రహము. 2. కర్ణుడు. 3. వైవస్వతమనువు. 4. సావర్ణి మనువు (వాగ) 5 యముఁడు 6. సుగ్రీవుఁడు ఇట్లే రవితనయుఁడు.

**రవిణె** వి. గంట (ఇది యింద్రునితో నూర్వసి యన్నమాట)

సి. శివుఁ డొ్కనాఁడు దేశికిమెచ్చి వాకిచ్చెఁ బెద్దపట్ర్జపుఁ గుచ్చుబిరుదుఁ విణె. వాక్మ. 3.86

**రవినేత్రుఁడు** సం వి. అ పుం. విష్ణువు ఇట్లే రవిలోచనుండు మొ.

**రవిప్రియము.** సం వి. అ. న 1 ఎఱ్ఱతామర పువ్వు, కెందమ్మి. 2. బ ధారము (శ్బ. వి.). 3. తామ్రము, రాగి

ఇట్లే రవినాయకము, మొ.

**రవిరత్నము** సం. వి. అ. న. మాణిక్యము, కెంపు

**రవిరేక = రావిరేక.** వి బిడ్డలు కూకటియందు

ధరించెడి రావాకువంటి పతకము.

సీ. మొలకకూకటిఁ గ్రాలు ముత్యాల రవిరేక తనిసి తంపబొట్టితో శాదరింప. కాశీ 3. 240.

**రవిలించు.** స. క్రి. (√రవులు) రగుల్చు. మండించు.

చం. గుడుగుడిఁ గ్రాగబంగు జడఁగూర్చిన చిలుమ్ గుడాకుముద్దపైఁ, బడి రవిలించి క్రోవి పొగ వచ్చెడు రీతిని మించఁ గేలముల్, పొడువును గాక యాఱియును బోవక నేర్పున పీతిపాటో ద్రుంచ, చ్చెడుగులఁ గొల్చు.. పార్వ. 2. 78,

గీ అగ్గి రవిలించి యావాలు గుగ్గిలంబు
అచ్చ రా యు. 488

గీ నిప్పుకలువెట్టి రవిలింపఁ గప్పులెరవు, జాణ మంటలు వెదచల్లఁ జాగెమిగుల.
అచ్చ. తా. సుం, 166.

**రవిలోహము** సం వి. అ. పుం. (రవిప్రియ లోహము) తామ్రము, రాగి.

**రవివారము** సం వి అ. పుం. ఆదిత్యవారము, ఆదివారము ఇట్లే ఁవిదినము మొ

**రవీషువు** సం. వి. ఉ. పుం. కామదేవుఁడు, మన్మ థుఁడు.

**రవుతు.** వి (సం రాహుత్తః) సాది, రౌతు

చం. . తటిమూడు రాక వెలుఁగునొందె - త్రముల కైవడి నాఘనయోధు లుండ నీ, రవుతులు జోడులన్ రథికరాజియు వారిమొనల్ గలంపఁగాన్. భార ద్రో. 1 378

గీ. ఇవిగదా తెలిమావు రవుతు సంతుపిసాళి తొడ సెజఁ బవళించు నొదయ లయ్యె.
ముకుంద. 1. 84 పా. 1 పం.

మ. మదదంతపళదంతము ల్నలకు నమ్మావంతులు దాృంప్రితన్, బెదరన్ జల్లము గుజ్జమున్ రవుతునున్ పేటాలుతుఁడెంబులై, చెదరంగా వడిద్రవేయువీరంథికశ్రేణిన్ బలౌఘంబులన్, గుదియంబేయుభటాళిఁ ద్రుంచు విలసద్ఘోరాసి ధారాహతిన్. విక్ర. 6. 78.

**రవులు**=రగులు. అ. క్రి. మండు, ప్రజ్వరించు (చూ. రవులుకొను).

జ. రవిలించు, రవులుకొను, రవులుకోలు.

**రవులు(ల్కొ)కొను.** అ. క్రి. (రవులు + కొను. స్వార్థమున.) మండు, రగులుకొను.

సీ. .... అవులనాపొట్నూర రవులుకొనియె.

గీ. ... కృష్ణ, రాయశాహు ప్రతాప జాగ్ర వ్మహాగ్ని. మనుచ. 1 37.

సీ. ... అవులనాపొట్నూర రవులుకొనియె.

గీ. ...ఔర నీదు రవగాహా, ఖేలదుగ్ర ప్రతాపాగ్ని కృష్ణరాయ. అము. 1. 86

చం కువలయపత్రనేత్ర కనుఁగొల్కులయం దుద యించె జాప్యబిఁ,దువులు ధరానురుఁడు తనుఁ దోడ్కొని పోకయుపేక్షసేయున, న్నవదర విందచక్రమిథునంబుల సహ్యావశాఁగ జాగ్ని చే, రవులుకొనంగఁ బుట్టిన నిరంతర ధూమము సోఁకియో యనన్. శివరా. 7. 122.

కం. చనదెంచి మ్రొక్కి నిలిచిన, వనితామణిఁ జూచె దివిజవల్లభుఁడు రవు ల్కొనుకోప వహ్నికీలల,దను బొమముడి ధూమపంక్తి కొదువం దీర్చన్ నిరం. 4. 108.

ఉ గబ్బుమదించుపందము పొకాలిపికాలి కుకాలి అంతులా, గుబ్బులుఁరేఁగ బుప్పొడులు గొబ్బున జబ్బన రాలుచుండగా,మబ్బున గుజ్జుఁ గెంజిగురు మావిడి చూచి చలించె గబ్బిలే, గుబ్బ తకంతుచే బిరుసుఁ గ్రోవి రవుల్కొనెనంచు నయ్యెడన్. కకు. 3. 84.

**రవులుకోలు.** వి. (√రవులుకొను) రవులుకొనుట.

సీ. ఇల్లిల్లుఁ దిరుగ నొక్కింత బుప్ప శిఖ యర్పెనే నింటలోఁ బూరియిడివిసరక, రాఁజదు రాఁ జిన రవులు కోల్వోపాలఁగాని కల్గదు మఱి దానఁగలిగె, నేని ఖ్యాడగుటమందు ...
అము. 4. 127 (వేదం. పా.)

**రవ్వ**[1] = **రవ**[1]. వి. వజ్రము.

సీ. కురులు కూడనినాఁడె యిలుగ్రాసివమేని రా
కాసి సేసిన రవ్వయితఁడు. బహు. 4. 82.
(ఇట వజ్రమువంటివాఁడు, దిట్టరి అని భావము).

రవ్వ²=అవ్వ వి. 1. నింద, దూఱు.

ద్వి. రాచకూఁతునుగొని రవ్వగాకుండ, దాఁచిన
మీమూల ధనమెల్లఁబెట్టి.
ద్వి. హరిశ్చ. ఉ. 1050. పం.

కం రవ్వకుమొదలగు పాపవు, జవ్వన మెసిరించె
జిగియొసఁగ నామేనన్. ముకుచ. 6. 42.

2. దౌష్ట్యము.

ఆ నమ్మి నిదురవోవ నా పట్టిచుంచుమా, తేఁగ
తోఁకతోడ లీలఁగట్టి, వీధులందుఁ దోలె వెలఁది
నీ కొమరుండు, రాచబిడ్డఁడైన రవ్వమేలె.
భాగ 10 పూ. 332.

రశన. నం. వి. అ స్త్రీ. 1. త్రాడు, దారము.
2 కళ్లెపువాఱు, కళ్లెపు పగ్గము. 3 నడికట్టు,
ఒడ్డాణము, కాంచి, 4. నాలుక, జిహ్వ.

రశ్మి. నం. వి ఇ. పుం. 1. త్రాడు, పగ్గము.
2 కళ్లెపువాఱు, కళ్లెపు పగ్గము 3. సూర్య
కిరణము. 4. నేత్రలోమము, కను ఱెప్పవెండ్రుక.
5. రాఁబడి, ఆదాయము, ఆస్తి.

సీ. బలము తక్కువయైనఁ బైబట్ట బరువగు నంచార
ముకిగిన నడలు రశ్మి. రామలిం. 50

(ఈ యర్థమునఁ దెలుఁగుళందే ప్రయోగము
కన్పట్టుచున్నది.)

ఆ. ... మేము కడిపెఁడు బిడ్డల, వార మెట్లు
బ్రతుకువార మనుజ, నీవెఱుఁగకుండ నే వంక
నైనను, గలుగు రశ్మిగలదె తెలుపు మాకు.
భోజరా. 6. 144.

వ పద్మము, తామరపువ్వు. స్త్రీ. జ్వాల.

రస నం. వి. అ. స్త్రీ. 1. రసాతలము, పాతా
ళము. 2. భూమి, పుడమి. 3. జిహ్వ, నాలుక.
4. ద్రాక్షపండు. 5. అందుగు, (వ్య. వి.)
6 చిఱుబొద్ది 7. కొట్టిలు. (శ. ర.) 8. దూర్వ
(వృ. వి.).

రసంగి. వి. ధాన్యవిశేషము (శ. ర.)

రసకము. నం వి. అ పుం. 1 కుశి. ఇనుముతో
చేసినవస్తువు. 2. ఒకానొక జూదము. 3 మాంసాది
క్వాథము.

రసకర్పూరము. నం. వి. అ పుం. న కర్పూరరసము

రసకేసరము నం. వి. అ న. 1 కర్పూరము.
2. వకుళము, పొగడ (వ్య. వి) 3. వేధకము
(వృ వి.) 4. నాగపుష్పము, నాగకేసరము
(వ్య. వి)

రసగంధకము. నం. వి అ. పుం. . 1 గోపరసము,
పరిమళముగల యొకానొక బంక జాతి త
ళోళము 1. గంధకము

రసగంధము నం. వి అ పుం న. రసగంధకము

రసగర్భము. నం. వి. అ. న. 1. రసాంజనము.
2. ఇంగిలీకము.

రసగుండు మి. వి. (రసము+గుండు) పాదరసము
పూసిన గోళాకారవస్తువు (చి. ని., శ. ర.)

రసఘ్నము. నం. వి. అ. పుం. వెలిగారము.

రసజము. నం. వి అ పుం 1. గుడము, బెల్లము.
2. మద్యకీటము, మద్యము పులియబెట్టుటవలనఁ
బుట్టెడి పురుగు. న. రక్తము, నెత్తురు ఇట్లే రస
భవము మొ.

రసజ్ఞ. నం. వి. అ. స్త్రీ. జిహ్వ, నాలుక.

రసజ్ఞత. నం. వి. అ. స్త్రీ. 1 కావ్యరస గ్రహణ
కౌశలము. 2. రుచుల నెఱుఁగుట, రుచిజ్ఞానము.
3. వివేకము. (గుణదోష) జ్ఞానము.

రసజ్ఞత్వము. నం. వి. అ. న. రసజ్ఞత.

రసజ్ఞము. నం. వి. అ. పుం. 1. అయోభేదము,
2. అయస్కారము. (కే. ని)

రసజ్ఞుఁడు. నం విశే. అ. అ. అ. 1 రుచినెఱిఁగినవాఁడు
2. వస్తుసౌందర్య మెఱిఁగినవాఁడు, కావ్య
సౌందర్యవేది.

వి. అ. పుం. 1. రసమెఱిఁగిన మనుష్యుఁడు, విమర్శ
కుఁడు, కవి. 2. రసాయనశాస్త్రజ్ఞుఁడు.
3. వైద్యుఁడు.

రసజ్యేష్ఠము. సం. వి. అ. పుం. తియ్యఁదనము, మధురము. 2. శృంగార రసము.

రసతేజస్సు. సం. వి. స్. న. రక్తము, నెత్తురు.

రసదాడి. (?) వి. (సం రసదాళికా) ఒకజాతి యరఁటిచెట్టు: ఆ యరఁటిపండు.

సీ చిన్నజాబిలిదాల్పు సింగిణి రసదాడికేస్వామి శుభ కరం బిభకరంబు. చం. రా. 1. 41.

గీ. వారుచెట్టునఁ దనుదానయారబండి, నట్టివరువంపు రసదాడి యరఁటిపంటి, గొలలు చక్కెరనెయ్యి మక్కువ నొసంగ. శుక. 2. 37.

సీ చక్కెరఁ బొంలించి చాలించు రసదాళ్ల కడఁ ద్రుంచియుంచిన కమ్మనపడయు. పాంచాలీ. 4 58,

గీ. అవఁటగొలనుండి పండి తనంతఁదానె, యవని రాలిన రసదాళి యువతిపంప, ఖుటికల కొంలది నవసుధాఘుటిక లనుచు, గుటుకు గుటుకున మ్రింగె వజ్జటికులఁబు బహు. 4. 48.

2. ఒకజాతి చెఱకు.

చ .. చెన్నగురసదాడి గుంపులు పురాంతికసీమల... వసు. 1. 113.

రసదాలిక నం. వి అ. స్త్రీ. పుండ్రేఁకువు, ఒక విధ మగు చెఱకు. (వృ.వి.) (వాచ.).

రసధాతువు నం. వి ఉ. పుం. పాదరసము.

రసధేనువు. సం. వి ఉ పుం. దానమిచ్చుట కొఱకు ఇక్షురసముతో నిర్మించిన ధేనువు (వాచ.).

రసన సం. వి. అ. స్త్రీ. 1. జిహ్వ, నాలుక. 2. కాంచి, మొలనూలు, 3. త్రాడు. 4. ఒకానొక లత, రాస్న. (వృ. వి). 5. ఆస్వాదన, చవి చూచుట (కే ని.).

రసనము. సం. వి. అ న. 1. చప్పుడు, ధ్వని. 2 అన్నము. 3. రుచి, కమ్మఁదనము. 4. రుచిని గ్రహించెడి రసనేంద్రియము. జిహ్వ. 5. కషాయము, ద్రవరూపమగు ఔషధము. 6. స్నేహము జిడ్డు. 7. విషము 8 ఫలము, పండు. 9. నిర్యాసము, జిగురు. 10. బంగారము 11.రూప్యము, వెండి (కే.ని.).

రసనేత్రిక. సం. వి. అ. స్త్రీ. ఎఱ్ఱపాషాణము, మనశ్శిల.

రసపాకజము. నం. వి. అ. పుం. 1. గుడము, బెల్లము 2 రుధిరము, నెత్తురు.

రసఫలము, నం. వి. అ. పుం. నారికేళవృక్షము, కొబ్బరిచెట్టు. (వృ.వి.).

రసమాణిక్యము. నం. వి. అ. న. పాదరసముతోఁ జేయఁబడిన మాణిక్యమువంటి ఒక వస్తువు.(వాచ.)

రసము నం. వి. అ. పుం 1. పసరు, పుష్పాదుల రసము. 2 ద్రవము. 3. నీరు. 4. మద్యము, త్రాగుడు పదార్థము. 5 పే యౌషధము, త్రాగఁదగిన మందు 6 రుచి, చవి. (రసములారు: కటు అమ్ల మధుర లవణ తిక్త కషాయములు.) 7 రుచి గల పదార్థము 8. ఒకవస్తువు వందలి యభిరుచి, ఇష్టము, వాంఛ. 9 ప్రేమ, అనురాగము. 10. (కావ్యాదులయందు) శృంగారాది—శృంగారము హాస్యము, కరుణము, రౌద్రము వీరము, భయానకము, బీభత్సము, అద్భుతము అని ఎనిమిది రసములు. శాంతము చేర్చి తొమ్మిదని కొందఱనిరి. వాత్సల్యము చేర్చి పదిగా నెంచఁబడినవి. 11.పారము, చేవ. 12. దేహధాతు విశేషము. 13. వీర్యము, శుక్లము 14. పాదరసము. 15. విషము, విషముగల త్రాగుడు పదార్థము. 16. చెఱకు రసము. 17. అమృతము. 18. పులుసు, చారు. 19 ఆఱుసంఖ్యకు సంకేతపదము. 20. రసనేంద్రియము, నాలుక. 21. గోపరసము. గంధద్రవ్య విశేషము. 22. సువర్ణము, బంగారు. 23. అన్నము. (వాచ.) 24. శబ్దము, ధ్వని. 25. చెట్టునుండి వెడలుబంక. 26. లశునము, వెల్లుల్లి. 27. ఫలము ప్రయోజనము. 28. భోజనము. 29. స్నేహము. 30 ఇంగిలీకము. 31. హరిద్వర్ణము. 32. మాంసము 33. పులికడుగు. 34. ఏనుగు. 35. మండము. (కే. ని.).

రసయోని. నం. వి. ఇ. స్త్రీ. వెలిగారము (వై.వి.)

రసరాజము. నం. వి అ. పుం. 1. రసాంజనము. ఇట్లే రసనాథము మొ.

రసలోహము సం. వి. అ. పుం. 1. రసాంజనము. 2. పాదరసము.

రసవతి. సం. వి ఈ. స్త్రీ వంటసాల, వంటిల్లు.

రసవర్గము సం. వి. అ. పుం. ఆహారపదార్థము.

చ. అచలితవృత్తి నిట్లువిడియం దళవాయి వలాళివీడు మె చ్చుచు నంకోటకేగు జలసూత్రపుఁ జోటు లెటింగి యడ్డక, ట్టుచు రసవర్గ మచ్చట గడున్వడిఁ జొంగనీక సూరతా, రచవలఁ జిల్లరల్ సలుపు రక్కసిపాలియగాంధ్రఁ గొట్టుచున్. కువల. 3. 2.

రసవాదము. సం. వి. అ. పుం. పాదరసమును కట్టు బంగారము చేసెడి విద్య (శ. ర.).

రసశోధనము. సం. వి. అ. న. 1 వెలిగారము 2. పాదరసశుద్ధి.

రససింధురము సం. వి. అ. న. 1. తుత్తనాగ మునుండి తీసిన ఇంగిలీకము 2. పాదరసము. 3. మైలుతుత్తము. 4 సూరేకారము, పెట్లుప్పు.

రససిద్ధుడు సం. విణ. అ అ అ 1. కవిత్వ మున నిపుణతగలవాడు, శృంగారాది రసముల యందు నేర్పుగలవాడు. 2. రసాయనశాస్త్ర మునఁ బ్రవీణుఁడైనవాడు.

రసస్థానము. సం. వి అ. న. ఇంగిలీకము

రసాంజనము. సం. వి. అ. న. 1. అంజన విశే షము.

రసాగ్రజము. సం. వి. అ. న. రసాంజనము.

రసాఢ్యము. సం. వి. అ పుం ఆమ్రాతకి, అంబా ళము (వృ. వి).

రసాతలము. సం. వి. అ. న. 1. పాతాళములోని లోకము, అధోలోకములలో నొకటి

రసాధిక. సం. వి. ఆ. స్త్రీ. కాకోదుంబరము, కాకిమేడి (వృ. వి)

రసాధికము. సం. వి. అ. పుం. వెలిగారము.

రసాభాసము. సం. వి. అ. పుం. 1. బాహ్య దృష్టికి రసమువలెఁ గాన్పించుట, రసమును భ్రాంతి. 2. రసము ననుచితరీతిగా స్పష్టపఱుచుట.

శ్లో ఏకత్రైవానురాగశ్చే త్తిర్యఙ్మ్లేచ్ఛగతోఽపి వా, యోషితో బహుసక్తిశ్చే ద్రసాభాస స్త్రిధా మతః

రసామ్లము. సం వి. అ. పుం. చుక్రము, చింత పండు.

రసాయనఫలము. సం. వి. అ న హారీతకి, కరక (వృ. వి) (త్రి ని).

రసాయనము సం. వి. అ న. 1 జీవనౌషధము, సంజీవిని. 2. సంజీవినివంటి పదార్థము, ఆనంద మిచ్చెడి లేక తృప్తిపఱచెడి పదార్థము.

ఉదా: శ్రోత్రరసాయనము, కర్ణరసాయనము మొ. 3. వెండిబంగారములుచేయు విద్య లేక రసవాదశాస్త్రము 4, కొన్నిమందు దినుసులు కలసిన పదార్థము. 5 తక్రము, చల్ల. 6 ఒకానొక విషము, 7. పిప్పలి.

పుం. ఒకానొక ఓషధి, విడంగము (వృ వి)

రసాయనములు నారికేళ-, గుడూచి-, శిగ్రు పుష్పాది, చూతఫలాది రసాయనములు, లోహ రసాయనాదులు.

రసాయనశాస్త్రము. సం. వి. అ న. కెమిస్ట్రీ.

రసాయనుడు. సం వి. అ పుం. గరుత్మంతుడు.

రసాల సం. వి. ఆ. స్త్రీ. 1. నాలుక. 2, ద్రాక్ష 3. గటిక. 4. చెక్కెర సుగంధి ద్రవ్యములు కలిసిన పెరుగు

రసాలము. సం. వి. అ న. 1. శల్లకీద్రవము. 2. రసగంధము.

పుం. 1. చెఱకు. 2. మామిడి.

రసాలస సం. వి. ఆ. స్త్రీ రక్తనాళము, ధమని.

రసావళ్లు(శులు) మి (ఏకవచనము, రసావళి) అపూపమువంటి భక్ష్యవిశేషము.

కం. తనయుంటనవ్వు డాయిత, మొనరి చిన సమ్మ దావులోలుకు రసావళ్లను మినుపవడలు జావట్లును గోదుమపిండివంటలున్ గలవ నినన్. విష్ణు. 3. 377.

రసి. సం. విశ. స్. రసముగల.

రసి. దే. వి పుంటిచీము (శ. ర.).

రసిక సం. వి. ఆ. స్త్రీ. 1. రసికురాలు. 2 నాలుక 3 చెఱకురసము. 4. రశన, మొలనూలు.

రసికము. సం విశ 1. రుచిగల. మధురమైన 2. రసవంతమయిన 3. అందమైన 4 రసగ్రహణశక్తిగల 5. చతురతగల 6. కాముకమైన. 7. ఏదేనొక విషయమునందాసక్తిగల.

ఈయర్థమునందు సమాసములోనే ప్రయుక్తము) క్రీడారసికుడు.

రసికుఁడు. సం. వి. పుం. 1. రసజ్ఞుఁడు. 2. ఏనుగు 3. గుఱ్ఱము. 4 సారసపక్షి, బెగ్గురు

రసికత సం. వి ఆ. స్త్రీ. రసజ్ఞత

రసికత్వము సం వి అ న. రసికత

రసికేశ్వరుఁడు సం. వి. అ పుం. రసికురాలి నాథుఁడు, కృష్ణుఁడు (విల్యమ్స్).

రసితము సం. వి. అ న. 1. ద్రాక్షారసము. 2. ధ్వని, అఱపు, గర్జనము

విశ. 1 రుచిగల. 2 రుచిచూడఁబడిన 3. మొలామువేయఁబడిన. 4. ధ్వనించిన.

రసీదు ఆంగ్ల. చెల్లుపత్రము, ఏదేని ముట్టినట్టు వ్రాసియిచ్చెడు పత్రము.

రసునము. సం. వి. అ. పుం. ఏటిక

రసేంద్రము సం. వి అ పుం. పాదరసము

రసోత్తమము సం. వి. అ. న. పాలు

రసోద్భవము. సం వి. అ న ముత్యము

రసోన(క)ము. సం. వి అ. పుం. వెల్లుల్లి.

రసోపలము సం వి. అ. న. ముత్యము

రస్తా హిం వి దారి.

రస్తు దే. వి. వస్తుసంభారము.

ఉ. ... వారలు ఘనంబుగ మార్గము లడ్డగించినన్ సన్నుతశౌర్య రస్తు మన సైన్యముఁ జేరుట దుస్తరంబగున్. కృష్ణ. 3. 67.

చం. పరఁగెడు రస్తు కొట్టడులు భద్రముగా నొగి బిగముద్రలన్, గరిమ నొనర్చి... హంస 1. 109.

రస్న = రసన.

రస్యమానము. సం. విశ రుచిచూడఁబడుచున్నది.

రహటము వై. వి. (√అరఘట్టము, మహారా. రాహాట) ఘటయంత్రము, నూతిరాట్నము, గిరక.

రహటు. వై వి రట్టు.

రహణము సం వి. అ న. ఎడబాటు, విడువలి.

రహదారి. హిం. వి స్వేచ్ఛగా అందఱును పోఁదగిన దారి.

రహము. సం. వి అవ్య. చూ. రహస్సు, రహస్యము.

రహస్య. సం. వి ఆ. స్త్రీ ఒకనది

రహస్యము. సం. వి. అ. న. 1. ఏకాంతము, గుట్టు, 2 మంతనము. 3 కందువ 4. సైగ.

విశ. దాఁచఁదగిన, ఉపగూఢము.

మ అళినీలాలక నీవు నీపతిరహస్యక్రీడ వర్తించు వేళ... పారి. 1. 60.

రహస్సు. సం. వి. స్. న. 1. రహస్యము. 2 సురతము

రహి. దే వి 1 అందము

మ. .. వింధ్యంబు దాటిన గొజ్జెఁగల్లురియు మున్నీరైన యక్కమ్మనీరుఁ రహింగూడిన నేర్పరించుగ ముత్తై రోలంబకాదంబముల్. ఆము. 5. 121.

సీ. పొడుపుఁగెంపు వహింపు బెడిదంపు వినుఁగెంపు రహినింపు కంఠహారంబు వాఁడు. ఉ రా. 1. 18.

2 బాగు.

కం. . గంధవహములు, శరీరములనేదఁదీర్పఁ జనుదెంచె రహిన్. పారి. 2. 102.

మ. ... మహావాల్లభ్య సౌభాగ్యవ, ద్రతనర్ధేశ కుమారుఁ డంత రహిగాఁ దన్నేలుకోఁబోలు

నాయన దాని త్తజీవట్టివల్లభకు దన్నై వెయొందు మున్నాఁడో కో. కళా. 3. 48.

3. విలాసము.

చం. సరసులనర్మ మింపులు నొసంగఁ గదంబపు దండ,గట్టుచోఁ గరఁగుటఁజెప్పు దృక్తరళ కాంతులు నుత్తరమిచ్చు వంతరాం,తరముల నవ్వులున్ గలువతండము మొల్లలు వంచు మిన్నుగ్రుచ్చి రహినిరిత్తనూ లొసఁగి సిగ్గు వహింతురు పుష్పలావికల్. ఆము. 2. 20.

4. ఆనందము, సంతోషము.

కం జంభాహితుఁ డూర్వశిపై, రంభపయిం గరుణ కలిమి రహిఁ దన్నట నో,జృంభణల తార తమ్యము, సంభావించుటయె కాని చాలఁడు తెగడన్. విక్ర. 2. 77

గీ. తానవంబుగ దొరఁజేయు వారిమంత్రి,మునకు వేగమె లోఁజేయఁజవదు వాఁడు,క్రొత్త మన్న వరహి ననుఁగులకు జెప్పనయిన వది చెడు. ఆము. 4 260.

5. ఉల్లాసము, మనోవికాసము.

సీ. ఒక యిక్కనిది వితర్దిక నిక్కమని వదా గ్రమునిక్క రహి నెక్కఁగాఁ దలఁతు వసు. 4. 73.

6. ప్రేమము, అనురాగము.

సీ. నెటికవట్టి వసిండి నీటిగ్రాఁత దెఱంగువెలి వట్టు రహిఁగట్టె వెలఁదియొర్తు. ఆము. 6. 128.

7. ఆసక్తి.

కం. ఆ విభునవంతరంబుధ, రావలయముఁ బూని తీవు రహిమైఁ దిరుమల్, దేవియును నన్న పూర్ణా,దేవియుఁ గమలాబ్జముఖులు దేవేరు లుగాన్. ఆము. 1. 33.

చం. తన మృదుగీతికాపరిణతధ్వని వైఖరిఁబల్క మంచు మిం,చినరహిఁ జేతివీణియకుఁ జెక్కులు గీఁటుచు నేర్పుచున్నదో,యన నఖరాంకరంబుల వయమ్మునఁ దంత్రులు మీటి గానమిం,పొనరఁగఁజేయు వాణి ... పారి. 1. 5.

కం. రామైనఁ గొంతమేల్ వా,రాయణ మీ మనసుకింపు రహి నిక నెపుడున్, మీయంత దడివెదరెవని, యాయంగన యితనిపాద మల్లనఁ బట్టెన్ కళా. 4. 115.

8. రక్తి

సీ. రహిపుట్ట జంత్రగాత్రముల జాల్ గరఁగించు విమల గాంధర్వంబు విద్య మాకు మనువ. 2. 43.

9. కాంతి, శోభ.

చం. ... తారకభటాళితో నిశాధిపుని బలంబుఁ జేఁగిఁగతిన్ రహి వీడెను బాండుచంద్రికల్. వసు. 4 125.

ఉ. ...జక్కవ లొక్కట జోడుగూడె వే, వేయుతి యాడఁదోడ రహి వీడె వినిర్మల సాంద్ర చంద్రికల్. చంద్రా 5. 113.

10. సత్త్వము, బలము.

కం. అహితుని నాళ్చర్యకరం, ప్రవహింపవిధిఁ జాలడీలు వటిచె నతండున్, రహిఁ దిరుగఁ దెచ్చుకొని వి,గ్రహచేష్ట లడంగ నొంచెఁ గరు వలిపట్టిన్. రాఘవ. 4. 163.

11. ప్రసిద్ధి, కీర్తి

కం. శ్రీరంగరాజు రామ, జ్మాఁమణుసిరంగ రాజుమహిం హి కెక్కెన్, ధారాధరిఖేచర మం, దారాధళకారిదాన ధారానిధియై రామా. 1. 64.

(రహికెక్కు=ప్రసిద్ధి కెక్కు, కీర్తి వహించు అని భావము )

12. విధము, రీతి.

సీ. అంజనాచలముపై వరుణాతపము మించు రహి మేనఁ గనకాంబరము దనర్ప. ఉ. రా. 2. 42.

సీ. అకసం బంటిన కీకసరానలు రజతశైలంబుల రహి వహింప. దశా. 6. 137.

13. పోలిక, సాదృశ్యము.

సీ. జహ్నుజారుణసరోజ విరాజ మానవరాగ ములతో రహివహిలచు. గీ. విమల కైవల్య పదము శ్రీవిష్ణుపదము ఇందు. 1. 45.

14 ఉత్కర్షము, అతిశయము.

సీ. ఆ రాజు విమలవిఖ్యాతిచంద్రికనిచ్చ రహి కెక్క జూచె జారప్రసంగము ... వసు. 6. 88.

(రహి కెక్కన్ = అతిశయింపన్ అని భావము.)

జః రహించు.

రహియి(ం)చు అ. క్రి. (√రహి). 1 వర్ధిల్లు, పెరుగు.

మ ... అరుల్లసిం, చె నురుప్రకాంతి జనించె గర్భము రహించెన్ మించె నిట్టూరుపుల్.
ఉ. రా. 1. 181.

సీ. పులకాంకురంబులు పొడిపొఱెనె కదా చెక్కు టద్దములకు జిగి రహించె. కవిరా. 5. 125.

2. ఒప్పు, శోభిల్లు.

మధురగతిం గడ. కలిగి ధరిత్రిని ఘనత వహించెను, అలకాపురిముకన్న రహించెను.
కుచేల. 1. 23.

సీ. తతమై రహించునితంబబింబముc జూచి ...
దశా. 2. 308.

ఉ. ...రోహిణీ, కాంతుని రేఖc గ్రొమ్మెయిలు కప్పుటc జూసి రహించినట్లు త, త్కాంత తనూవిలాసరతికాంత తళుక్కునc జెంత నిల్చవన్. శుక. 1. 381.

స. క్రి. వర్ధిల్లc జేయు.

కం. ఇందిందిరవవమందిర, యిందిందిరవందనుండ యేలినయెడ నీ, మందిందిరమై తేనియ, మందిందురహింతుననుచు మదమేమిటికిన్.
రా. వి. 4. 63.

2. పొందు.

సీ. ఆర్యాభిగణ్య సౌకర్యంబును రహించి ...
ఉ. రా. 1. 2.

(ప్రయోగాంతరము లేదు.)

రహితము, సం. విణ. అ. ఆ. అ. త్యక్తమైనది. వదలి వేయcబడినది.

# రా

రా[1]. అ. క్రి. వచ్చుధాతువుయొక్క ప్రార్థనార్థక రూపము, ఏతెమ్ము. రమ్ము.

ఉ. రాయనుc గాయనుం దొగలరాయనిc గేరుని గారపుంగుడా, రాయనుమేటి నాడెపు దొరా యను .. అచ్చ. రా. అయో. 89.

మ. తుదిరాజ్యమ్ము సగమ్ము గొమ్మడవియందుం బేరు వంచించియుం. బదుమూcడేcడులు నీవునుం దిగదాపాలిక పోవచ్చునే...
భాc. ఉద్యో. 3. 97.

=ర,

అవ్య. స్త్రీలతో మాటాడునపుడు "ఏ" అనునది అనుప్రయుక్తమగునట్లు నీచమిత్రోద్దేశమున పురుషులతో మాటాడునపుడు ఏకత్వమునcదును ప్రయుక్తమగును.

(కోపమునకు)

శా.... నా, జింకల్ భుక్తిగొనంగ నేమిటికి రాచే చిట్ట ప్రమోయించియా, తంకంబున్ ఘటి యించితి... హర. 1. 4.

(ప్రశంసకు)

కం. వికచాబ్జదళాగ్రంబుల, మకరందము కరుడు గట్టి మతిజాలనిపో, లికనువ్నవిరా సఖయా, లికుచస్తనిమృదుపదాంగుళినఖపంక్తుల్.
వరాహ. 3. 119.

(ఆశ్చర్యమునకు)

ఉ.... ఆ సరోజముఖ...నా, కావిధమెన్నc డబ్బునో దయామతినానతి యిమ్మనంగనో,

రా! వలరాచవేగిరము రామకు నంచఁ జెలంగి నవ్వుచున్. ఉ. హరి. 5 71.

(ప్రశ్నమునకు)

శా. ప్రారంభించిన వేదపారమునకుం బ్రత్యూహ మౌనంచునో, యేరా తమ్ముఁడ! నన్నుఁ జూడఁ జనుదేవు... పాండు. 3 33.

(అనాదరమునకు)

కం. నోరెనవినుండ కేనో, రోరి ... మూ సమీప పూర నెమనియున్, దూరము వోయితివే నో, మ్మేరితిని నీకు దక్కునే కానీరా...
ఆము. 6. 82.

(అధిక్షేపమునకు)

కం. ఏరా ఘోరి నిశాచర, యేరా వృత్రారి నెఱుఁగవే నాతోడన్, బోరాడలేవు పోరా, కోరా యభయంబు నిల్చుకోరా తనువున్...
దశా. 2. 407.

కం. ఈ కారణములుగలవను, నాకొండిదియె వాసుదేవుఁ డదిగాకయుఁ గీ, డే కురువంశమున కతని, రాకయతండేమిచేసెరా పాపాత్మా
భార ఉద్యో 3. 171.

ద్రు. "వచ్చు" ధాతువు నుద్యంతరూపము. వచ్చుటకు, వచ్చునట్లు మొ నర్థము నిచ్చును.

ఉ... ము, న్నచ్చట వచ్చుటన్ జెదరినట్టి బలంబులు దన్నుఁ గూడిరాఁ, జొచ్చినవారితో బలము జొచ్చినలాగును గన్న లాభమున్.
విక్ర. 2. 154.

ఉ.... అపదా, ల్వెన్నెవసిండి మేకలకు రాఁ బని యేమిల సాధనాములల్. విజ. వి 1. 7.

సీ...., తోడిచేడియలు నాతోడి వంతులకు రానయిరింపఁ జాలఁడో నన్ను తాంగి. పాం. 1. 84.

రా². వి వృత్తియందు 'రాచ' శబ్దములోని 'చ' వర్ణము విభాషను లోపింపఁగా మిగిలిన రూపము.

చ.... వజ్రదోః. పరిఘ వశీకృతాన్య నృపాలకు లప్పురి రాకుమారకుల్. ఆము. 2. 54.

ఉ. కొండొక సేపు నిల్చిచేను కోరిక రాకొము రుండు,...వటంబునీడఁ గూర్చుండె...
విక్ర. 3. 78.

ఉ.. మంచుఁగొండ రా, చూలినిగూడె...
సీలా. 1. 1.

ఉ. ...మంచుఁగొండ రా,యల్లునికిం బినాకికిఁ బ్రియంబున నూర్వశిపెట్టె భిక్షమున్.
హర. 5. 46.

(కొండరా=పర్వతరాజు. హిమవంతుఁడు)

రా³ వి. (సం. రాజన్.) చంద్రుఁడు

(దీనికి వ్యస్తప్రయోగము కానరాలేదు. ఉదా : రారేక. రారాయి. మొ.)

శా....రా, రాలంగట్టిన తిన్ని యన్నిలిచెమూల స్ఫాటికాపాత్రితోన్. ఇందు. 3. 65.

జ : రారేక.

రా⁴=ఱా.

వి. (√రాయి). శిల, పాషాణము.

సీ. నేలయు నింగియు దాలముల్వాయింప... జేనుంగుపురుడో మూరా నారఁగొన గాలిగం టిడ... కు. స. 3 185.

కం. రాకొమరు నెఱులనీలవు, రాకొమరుఁడు నిరాక రించు రాకాచంద్రున్, రాకొట్టు మొగము.
విజ. వి 1 65.

వ. ... పటికపురాచేట్ట నేలలనెట్టకొని....
మనుచ. 3. 28.

రా. సం. వి. అ. స్త్రీ. 1. బంగారము. 2. విభ్రమము. 3. దానము. 4. ధనము

రాంచలము సం. వి. అ. పుం. కటకము మ ల్లు.
(పల్లమ్ము)

రాంకవము. సం. న. అ. న. మృగరోమముతో నేయఁబడిన వస్త్రము. రోమవస్త్రము.
(కంబళము, శాలువ.)

రాంభము సం వి అ. పుం. సన్న్యాసిధార్యమగు వెణవదండము

రాఁజఁబెట్టు. స. క్రి (రాఁజిన్ + పెట్టు) రాఁజు నట్లుచేయు, వృద్ధినొందించు.

గీ. ఏను సంధికిఁ బోయినఁ దాను ధార్తరాష్ట్రీ మానసములఁ బగ రాఁజఁ బెట్టి, పన్నుఁ బట్టింపఁ జూడఁడె... భార. కర్ణ. 3. 124.

రాఁజు అ. క్రి. 1. (నిప్పు) అంటుకొను, ప్రజ్వరిల్లు

సీ. ఇల్లిల్లు దిరుగు నొక్కింతబ్బుశిఖ యబ్బెనే నింటిలోఁ బూరియిడి విసరక, రాఁజదు రాఁజిన రవులుకో ల్వాపాలఁ గాని కల్గదు ... ఆము 4. 127.

సీ అప్రొద్దు ప్రాయిరాఁజనట్టి నిర్వేదయు భోగించు నైశ్వర్యము లెనిమిదియు .. పాండు 1. 101.

చం పొగయక రాఁజకొక్కమొగి భోరన మంటలు విస్ఫులింగముల్, సెగని ... పురారినేత్ర శిఖ మల్పె మహాశనిపాతభీమమై ... కు. సం 5. 528.

కం తన మదిలోపల రాఁజెడు,వనవిల్లుని కాఁకచేత వలనతియగుచున్ మనుకొన్న సెగల కోర్వక, నను జాన్నుననున్న రాజునుం గనిచెల్వన్ యయా 5 93.

2. పొగయు, ప్రధూమితమగు

సీ. మొగము రాఁజి దివంబు మిగుల మండెడు నర్ఘ వహ్ని చేపట్టిన స్వాహ యొంత ... ఘటికా 1. 42.

3. దుఃఖించు.

చం. అతఁడు సితాంబరావరణమైన మహీమణి పీఠ మెక్కి యచ్యుతు నిజసింహపీఠ, గతుఁ జూచి మురాంతక యేఁతచిన్నవో, యితి మది నెంతవంతగలదీ యదువీరులు నేల చాలధీ,రతఁ దరలించి చిత్తముల రాఁజెద రన్న మురారి యిట్లనన్. ఉ. హర. 6. 4

రాఁబట్టు. స క్రి (రాన్ + పట్టు) 1. ఇచ్చిన దాని మరలఁదీయు. 2. సేకరించు; వచ్చునట్లు చేయు. (శ. ర.)

సీ. ఒకటికి రెండుగా నొగి వడ్డి రాఁబట్టి ధనమెల్ల మూఁను దాఁచుకొనుట .. రామ. 566.

రాక = రాకడ వి. (√వచ్చు). 1. ఆగమనము, వచ్చుట.

మ. పనగన్ వే చని దోర్బలంబున రణప్రావీణ్యముం జూపి నీ, వసురానీకముఁ ద్రుంచి భూప్రజలకున్ హర్షంబు గావించి శా, క నుమీ రాక జయంబుతోక ప్రజ దుఃఖం బొందఁ గా రాకన్నీ యనువర్గంబుల పోక గా నెఱుఁగు పెక్కాడంగ నింకేటికిన్. భార. శాం. 2. 438

కం ... క్రీడే కురువంశమున కతని, రాక యతం డేమి చేసెరా పాపాత్మా. భార. ఉద్యో 3 171.

ఉ అకులమయ్యె భోగవి దె యాదల అన్నియు ప్రస్సెఁ బ్రాణముల్, రాకలఁబోకలం బొలిసె. భాగ. 10 పూ 687.

2. ప్రసారము, వీచుట.

చం. ... వేసవిన్, మలయపుగాలి రాకలకు మానసముల్ చిగురొత్త దంపతుల్ ... ఇందు. 3. 112.

కం. ఈ కరణి వన్నె పాగ్రణి, యే కరణియములు మాని హిమకరవిలస.ద్రాకలకు వ్వలిదెమ్మెర. రాకలకున్ జాలిగొని విరాళిఁ బడంగన్ ... కువల. 4. 102.

3 జైత్రయాత్ర, దాడి.

చం. అది మొద లాన్నృపాలుని శుభాకృతి కన్నులఁ గట్టినట్లు నా, మది వలపించుచున్నయది మారుని రాకకు నోర్వరాదుగా... ఇందు. 2. 93.

అ. తండ్రిపాలు మాకుఁ దగునంచు నటియరి, తనము సేసి రాక తప్పఁగాక ... భార. ఉద్యో. 1. 250.

అవ్య. (వచ్చుధాతువు యొక్క వ్యతిరేక క్త్వార్థక రూపము.)

1. వచ్చుటమాని.

(వ్యవ.) తాను రాక కుమారునిఁ బంపినాఁడు. 2 వచ్చుటకు) నేరక, చాలక, శక్యముగాక మున్నగు నర్థముల నిచ్చును (ఈ యర్థములను ఙ్యంతక్రియల కనుప్రయుక్తమయియే యుండును).

గీ. అవుల దాఁటి పోవను రాకయద్రికరణి, గతినమై యాఁగె నవు డంధకారపటల, మెంతయును క్షితిఁ బొందితి వేను రథ్య, ములునురథ మీద్వగా లేక ముచ్చముడిగి ... హరి. ఉ. 5. 82.

రాక. సం. వి. అ. స్త్రీ. 1. పూర్ణచంద్రుఁడు గల పున్నమ. 2. తొలిసమర్త యాడిన పడుచు. 3. గజ్జి, తీఁట. 4. నదీభేదము, ఒక యేఱు.

రాకము. సం. వి. అ. పుం ఎండ, సూర్యకాంతి. (కే. ని)

రాకట్టు.[1] వి. (రాయి+కట్టు). 1. శిలారత్నాది నిబద్ధభూమి. వెలకట్టు, కుట్టిమము.

ద్వి. పటికంపురాకట్టుపై నెక్కనలయు, కుటిలకుంతలి యెట్లు గుట్టులు గడచె... ద్వి. హరిశ్చ. పూ. 1891 పం.

విణ. రత్నఖచితము, మణులు చెక్కినది.

సీ. పుంజాలదండలు పూదెలకడయాలు ముంగురులక రాట్టుటుంగరములు... ధనా. 3. 37.

రగడ. చౌకట్లుకొంట్లు చేసరులునున్ మొలకట్లు రాకట్టు చుట్టుంగరములు బల్ దేకట్లు... హంస. 5. 356.

వ. అవ్విరించి జనకునకు నగణంబు గామించులు గండపెండెరంబులు రాకట్టు మొలకట్టు లుంగరంబులు ముంగై మురారులంగదంబులు ప్రబంధ. 605.

రాకట్టు[2]. వి. (రాచే + కట్టు) రాజశాసనము, శాసనము

సీ. వందిమాగధుల కై వారంబువిను చెవి విబుధారి రాకట్టు వినఁగ నేర్చు ... దశా. 2. 112.

రాకడ = రాక. వి. (√వచ్చు,) 1. ఆగమనము.

ఉ. పోకడ రాకడల్ వశముపోవక మన్మథుఁ డావవెట్టి వ,ట్లాకలకంఠి నిల్చె వచలాకృతిఁ జిత్తరు బొమ్మకై వడిన్. కృ. శకుం. 258.

గీ. పలికకుఁ దమరాకడ యెఱుఁగఁ జెప్పి ... నీలా. 2. 47.

2. మల్లవిద్యావిశేషము.

వ. హస్తవీక్షణము, నయనవీక్షణము, లిత, రాకడ, ఏకసరము, పైసరము .... మల్లుపు. 2. 69.

రాకాసి = రక్కసి వి. (సం రాక్షసి.) రాక్షసుఁడు, రాక్షసస్త్రీ.

సీ. ఆకసంబునఁ బాఱు రాకాసుల పురాలుఫాల లోచనుఁ డవలీల గెలిచె .. వరాహ 9. 65.

ద్వి ఢాకాలి పెండెంబు డమరువుఁ గత్తి, రాకాసి తలలతోరవు వనమాలి .. ద్వి. హరిశ్చ. ఉ 132 పం.

7. పగిలి రాకాసి దేహంబు మొగవుముత్యమయ్యె ముంగాముూరి ంంగైమురారి . . మనుచ. 6. 115.

గీ, కలుషపిశితంబు మెసవు రాకాసి కాశి, కాశీ. 2. 49

సీ. ... నేత్రైక సర్వాంగలక్ష్మి, నొప్పురాకాసి తద్దుర్గతిమాని తా వనయంబు జాత్యుచితరూపంబులైవ, దృశ్యాణి పదగతుల్ దీపింప.... రాఘవ. 3. 74.

రాకాసిప్రోలు = లంక, రాక్షసపట్టణము.

గీ. విల్చి రాకాసిప్రోలు విభీషణునకుఁ, దిరముగా నిల్పి సెకజానఁ దేరివట్టి, చాలు పేరింటి పూఁబోఁడి నోలిఁగూడి, తాను దమ్ముఁడుఁ దగ నయోధ్యకును వచ్చె. యయా. 3. 37.

జ: రాకాసి ములికి.

రాకాసి ములికి. వి, (√రాకాసి).

అసురాస్త్రము.

గీ. అట్లు నెఱజోదు లిర్వురు నదరి పెక్కు, గడిఁది తూఁపులఁ బోరాడునెడల నోఁకు, మిన్న రాకాసిములికి యామున్న జేని, సై నిగిడ్చిన నదిదద్దవలపుమీఱ. అచ్చ. రా. యు. 378.

రాకించే. స. క్రి. మోఁదు, చిరుకఁగొట్టు.

కం. పోకనడగొట్టిశేసియు, రాకించుఁజుమీమొ గంబు రాచట్టుపయిన్ శ్రీ కాశిక వందించిన, నీకింతట నేలపోవు నీచచరిత్రా.

భీమ. 2. 153.

రాకిడి = రాగిడి వి. స్త్రీ. శిరోభూషణవిశేషము. (జడబిళ్ల అని శ. ర.)

ద్వి. పౌజులకమ్మలు వల్లెరుపూలు, రాజిల్లు రత్నాలరాకిడివెట్టి...

ద్వి. శ. సా. 1. 258. పం.

సీ. బటువుముత్యముల పాపటబొట్టు రాకిడి జడ బిళ్ల లను గచ్చులడరి వెలుఁగ ...

వేం. మా. 1 130.

రాకుఁడు నం. వి అ. పుం. సూర్యుఁడు.

రాకొట్టు[1]. వి. (రాయి + కొట్టు) రాలునింపిన కొట్టు (చూ. రాకొట్టు[2]. వి.)

రాకొట్టు[2] స. క్రి. 1. (√వచ్చు.) రారా పో రాయని యేకవచనాంతముగా ఉచ్చరించు.

కం. కవులు పొగడువేళఁ గాంతలుండినవేళ, సుతులుముద్దువేళ సూరవరులు, ...ణముసేయువేళ రాకొట్టిపిలుచుట, పాడి యిదియు మిగుల భజనకెక్కు.

ద్వా 7 65.

2. తిరస్కరించుట

కం. రాకొమరు నెఱులు నిలువు, రాకొమరు నిరాకరించు రాకాచంద్రుడున్, రాకొట్టు మొగము కెంపగు, రాకఁగని పరాకుసేయు నౌఁ బదంబుల్.

విజ. వి. 1. 65.

వి. తిరస్కారము.

సీ. కొమ్మపాలిండ్లకుఁ కొండలీడంటి మాత్రకు కెల్ల రాకొట్టు పాలుచేసె

చమ. 2. 49.

రాకొమరుఁడు. వి. (రాచే + కొమరుఁడు. నం. రాజకుమారః.) రాజకుమారుఁడు. రాచేబిడ్డఁడు.

కం వాకిలివెడలి యొఱుంగవు, రాకొమరని యెఱుఁగు వులి యటఁ ట్యాంతరభూ, పాకలవం బెట్లో దవెను, మాకున్న నిజంబుఁ జెప్పుమా గురుపుత్రీ.

విక్ర. 3. 128. పై వ. 2. 22.

రాకొమ్మ వి. (రాచే + కొమ్మ) రాజభార్య

గీ. ముచ్చుఁదవమున రాకొమ్మఁదెచ్చినట్టి, యయ యియఅక్కనుఁ డిదె డాఁగియున్నవాఁడు.

అచ్చ. రా. కిష్కిం. 90.

రాక్ష. నం. వి. అ. నం. లాక్ష.

రాక్షస. నం. వి. అ. పుం. అఱువది సంవత్సరములలో నొకటి, ఆనంద తరువాతిది.

రాక్షసము. నం. వి. అ పుం. 1. కన్యక యొక్క బంధువుల జయించి బలాత్కారముగఁ గన్యకను హరించికొనివచ్చి చేసికొనెడి వివాహము. (ఎనిమిది విధములగు వివాహములలో నొకటి )

2. (జ్యోతి) ఒకానొక యోగము.

విశే. (అ.ఈ.అ ) రాక్షససంబంధమైనది.

రాక్షసి. నం. వి. ఈ. స్త్రీ 1. రాక్షసస్త్రీ, రక్కసి. 2 లంక. 3. శిశిరఋతువునందలి రాత్రి 4. కోఱ, దంతము. 5. చోరపుష్పి, శంఖిని. (వృ వి.). 6 చండిక.

రాక్షసుఁడు. నం. వి అ. పుం. 1. పిశాచము. 2. రక్కసుఁడు.

రాగకాకు. వి (సంగీ) ఒక స్వరస్థాయి.

ద్వి...' అంకుశలలిత, గాఢంబులలి రాగకాకువు బొచ్చు, గాఢంబు మఱిదేశికాకువు సింధు. .... యాదిగానొగయు కాయములు.

బస. పు 3.940. పం.

రాగఖా(ం)డవము. నం వి.అ.పుం. రాగషాడవము.

రాగచూర్ణము. నం. వి అ. పుం. 1. ఖదిర వృక్షము. 2. సిందూరము. 3. లక్క, లాక్ష. 4. ఎఱ్ఱనిపొడి. బుక్కా, బగ్గుండి.

రాగచూర్ణుఁడు. నం. వి. అ. పుం. కామదేవుఁడు, మన్మథుఁడు.

రాగదాలి. నం. వి. ఇ. పుం. మయూరమనెడి ధాన్య విశేషము.

**రాగపుష్పము.** సం. వి. అ. పుం. 1. బంధూకము, మంకెశచెట్టు. (వృ. వి.).

2. వాడనివియు గుండ్రముగ నుండునట్టివియు నగు పుష్పములుగల చెట్టు, రక్తామ్లానము. (వృ. వి )

**రాగపుష్పి.** సం. వి.ఈ.స్త్రీ. జప,దాసనము (వృ.వి ).

**రాగప్రసవము.** సం. వి. అ. పుం. రాగపుష్పము. (వృ వి )

**రాగమంజరి.** వి. ఒకానొకరాగము, ఎనిమిది పురుష రాగములలో నొకటి.

సీ. భైరవి శ్రీరాగ బంగాళ హిందోళ మాళవులును రాగమంజరియును... ప్రబంధ. 95.

సీ. భైరవిమాళవి బంగాళ హిందోళ రాగమంజరియు శ్రీరాగ గౌళ, భూపాళ లెన్మిదిపురుష రాగంబులు... హంస. 5.128.

**రాగము.** సం. వి. అ. పుం. 1. రంజనము, రంగు వేయుట, 2. రంగు, వన్నె. 3. ఎఱుపు, రక్త వర్ణము. 4. ఎఱ్ఱరంగువేయు సాధనము, ఎఱ్ఱ లత్తుక. 5 అనురాగము; వలపు. 6. ప్రీతి. (సంగీత) భైరవ్యాది.

శ్లో. భైరవః కౌశిక శ్చైవ హిందోళో దీపక స్తథా, శ్రీరాగో మేఘరాగశ్చ రాగా షడితి కీర్తితాః,(భరతుఁడు).

8. కాంత. 9. మాత్సర్యము. 10 (యోగ) పంచ క్లేశములలో నొకటి. (అవిద్య,అస్మిత.రాగము ద్వేషము, మరణభయము అనునవి పంచక్లేశములు. కల్ప.)

**రాగయుజము.** సం వి. క. పుం మాణిక్యము, కెంపు.

**రాగరజ్జువు.** సం. వి. ఉ. పుం. కామదేవుఁడు, మన్మథుఁడు.

**రాగలత.** సం వి అ స్త్రీ. మన్మథుని భార్య.రతీదేవి.

**రాగవంతము** సం. వి. క. పుం. పూగము, పోఁక (వృ వి.). (వై.ని .).

**రాగవుఁడు.** విశే. (సం. రాఘవః) రఘువంశోద్భవుఁడు.

గీ. వినుము కల వేల్పుజెడదాఁకి విన్ను చూల్కి, మేనరుల సిట్టుపుట్టువు మేటితపసిఁ, గాంచి యిట్లనునంత నగ్గట్టుమీఁదఁ, దరలిరాఁగవుల వలికి దాఁటి చనుమ. అచ్చ. రా. అర. 2.

వి. శ్రీరాముఁడు.

ఉ. అంతఁ బెద్దబాపనయ్యల యానతి, వడసి యొక్క మంచిగడియదోయి, యందు రాగవునకుఁ బొందుగాఁ దనపట్టిఁ, బెండ్లి సేసె మఱియు బేర్మితోడ. అచ్చ రా. బా. 192.

**రాగశాలవము.** సం. = రాగషాడవము.(వై.ని.)

**రాగషాడవము.** సం. వి. అ పుం. ద్రాక్షదాడిమాది ఫలములతో చేసిన ఒక విధమగు మధురభక్ష్యము. (విల్యమ్సు).

**రాగసూత్రము.** సం. వి అ న. 1. పట్టుదారము, 2. త్రాసుయొక్క త్రాడు.

**రాగాంగి.** సం. వి. ఈ స్త్రీ. మంజిటి మంజిష్ఠ.

**రాగారువు.** సం. విశే. ఉ. దాన మిచ్చెదనని (ధర్మము చేసెదనని) యాశపెట్టి తుదకీయక యాశాభంగము గలుగఁజేయువాఁడు (విల్యమ్సు.)

**రాగాశని.** సం. వి. ఇ. పుం. బుద్ధుఁడు.

**రాగి¹.** వి. (క. రాగి. త. ఇరాహి ) సస్యవిశేషము తవిఁదపైరు.

బ. ధాన్యవిశేషము, తవిఁదలు, చోళ్లు.

సీ. ... రాగులు, గోధుమలును, యవలుగొని యున్న త్రిగుణమౌ నందుఫలము. రెట్టమతము 3. 40.

రాగిసంకటి = వండిన రాగి పిండిముద్ద.

చం. బొడ్డుగిన్నెలో, మునుతురు రాగిసంకటి తలో దరు లద్భుతభక్తిఁ జూపుమన్. శుక. 3. 325.

**రాగి².** వి. (సం. రక్తః) 1. తామ్రము, పంచ లోహములలో నొకటి

గీ. చక్రి పాదమంగఁ బార్థివ స్థానమయ్యె,నోరి మీ వంశమందుఁ దాఁ గోర్వఁజాలు వారిఁ జూపుమా కుమ్మరావమున రాగి, ముంత లేటంగఁ గలదె నీకింత యేల. ఉ. హరి. ౪.48.

2. ఎఱుపు, రక్తవర్ణము.

సీ. రాగిదేరెడు చొకాంపు నీలిచల్లడంబు ఉడంబు చీకట్ల బలము నేయ సారంగ. 3 28.

విశ. 1. తామ్రముతోఁ జేసినది

ఉదా:- రాగిచెంబు. రాగివళ్లెము. మొ.

2. రాగివలె ఎఱ్ఱనివర్ణముగలది, ఎఱ్ఱనిది. (చూ రాగిజుట్టుపిట్ట).

3. రావి, అశ్వత్థము (వృ. వి) (శ. ర., బ్రౌ)

జః రాగిజుట్టుపిట్ట.

రాగి. సం. విశ. (స్. జ్ స్.) 1. రంగువేయఁ బడినది. 2. రంగువేయువాఁడు. 3 ఎఱ్ఱనిది. 4. ఎక్కువ కామముగలవాఁడు, కామవశుఁడైన వాఁడు 4. రాగాతిశయమునఁ బ్రేమించువాఁడు, అనురక్తుఁడు. 6. ఆనందించువాఁడు, ఉల్లాసపడెడి వాఁడు.

రాగిజుట్టుపిట్ట. వి. (రాగి$^2$ + జుట్టు + పిట్ట). కోడి, తామ్రచూడము.

రాగిజుట్టుపిట్టతాలుపు = కుమారస్వామి.

ఆ. బొమ్మగాఁడిపాట వమ్ములనేసిన, సొమ్మ వోయిమేటి కొమ్మమెకవు, బిరుదురాగిజుట్టు పిట్టతాలుపువాలుఁ, గోలఁగొంచగట్ట వోలె బ్రాలె. అచ్చ.రా. యు 208.

రాగిడి. వి. = రాకిడి. (బ్రౌ., చి, ని., వా.)

రాగిణి. సం వి. ఈ. స్త్రీ. 1. సంగీతాంగమైన రాగభేదము (దీని జాతులు ముప్పది. ముప్పది యారు అని కొందరు).

2. విదగ్ధురాలగు స్త్రీ. 3. తృణధాన్యభేదము.

రాగించు. సం. అ. క్రి. రాగిల్లు,

కం. చంచుల కాంతులువెన్నెలఁ, జించి యమృత ముట్టనొసఁగు చెన్నునకును రా.గించుచుఁ జవినొక్కుచుఁ గబళించుఁ జకోరికలు సమ దళీలాలసలై. నిర్వ. 6 ఆ. (శ. ర.)

రాగిలు(ల్లు) సం. అ. క్రి.=రంజిల్లు. 1, సంతసిల్లు, సంతోషించు.

కం. దమియింపఁ దగినవారల, సమయమున దమించి వారి సంపదలు మహీ, రమణుండు దనదు బండా,రముగా సమకూర్చు జనము రాగిల్లంగన్. భార. శాం. 2. 395

ద్వి. రాజులు బుధులును రసికులును కవి, రాజులు గోష్ఠిని రాగిల్లి పొగడ.
రం. రా. బాల. 4 పొ. 27 పం.

శా. ... విషవృక్ష స్ఫూర్తియుం గీర్తితా, రంకి ప్రౌఢత వట్లయే్నుడిపెదవ్ రాగిల్లుఁడీ రందఱున్. హరి. పూ 6. 73.

2. అనురాగము కలిగియుండు.

ద్వి. అవెవచ్చెఁ గపిసేనలని కోప ముడిగి, రవి తనూజుని మీఁద రాగిల్లుచుండె.
రం. రా. కిష్కిం. 223 పొ. 20 పం.

3. ప్రకాశించు, శోభిల్లు.

వ ... కటికిచీకటి మొత్తంబు మధ్యంబున నిగ నిగని నెమ్మేను దీఁగెరాగిల్ల నల్లన వసియించె..
విప్ర. 3. 60.

కం. ... చూడన్, రాగిల్లుచును, దదగ్రిమ, భాగంబున నున్న కనకపాత్రము లేమిన్. విప్ర.5.4.

4. గర్వోక్తులు పలుకు

ద్వి. రావణుతోఁగూడ రాక్షసప్రతతి, వేవిధం బున నైన నేమె చంపుదుము, రామభూపాలక రణమున ననుచు, రామునిముందఱ రాగిల్లు వారు. రం రా. యు. 282 పొ. 19 పం.

రాగుఁడు. సం. వి అ. పుం. 1. రాజు, ఱేఁడు. 2. సూర్యుఁడు 3. చంద్రుఁడు.

రాగె. వి. అంకవన్నె, గుఱ్ఱము నెక్కుటకు పార్శ్వ ములయందు త్రాటితో నేర్పఱిచిన మెట్టు.

గీ. వాజిగుణమును రాగెయు వాగెథూమి, మూన
మును శరశస్త్ర సంధానవములును ...
ప్రబంధ. 184.

ద్వి. రాగెలు బిగియించి రథసంబుతోడ, వాగి
య సడిలి చున్నవరెండుగడల. దాటించి..
ద్వి. పరమ. 2. 280 పొ.

ద్వి. ... సిద్ధుఁడు కోపగించి, . , రాగెలు బిగి
యించి రవళిసేయనుచు, ....
ద్వి. పరమ. 2. 82 పొ.

**రాఘవము.** సం వి అ. పుం. 1. ఒకజాతి పెద్ద చేఁప. 2. సముద్రము.

**రాఘవుఁడు.** సం. వి. అ. పుం. రఘురాజవంశమునఁ బుట్టినరాజు, రాముఁడు.

**రాచే.** వి. (సం. రాజ) రాజున్. (దీనికి సమాస పూర్వావయవముగానే ప్రయోగములు కన్పట్టుచున్నవి. "విణ" అని శ. ర)

ఉదా: రాచేవాఁడు, రాచేటికము.

జ: రాకట్టు², రాకొమరుఁడు, రాకొమ్మ, రాచేకందు, రాచేకుఋపు, రాచకూఁతురు, రాచకొడుకు, రాచేజడదారి, రాచేజాపిల్లి, రాచజిల్లేడు,రా చేదారి, రాచేవగరు, రాచేవడక, రాచేనెలవు, రాచేపగ, రాచేపదవి, రాచేపట్టె, రాచేపాడి, రాచేపుంపు, రాచేపుట్టువు, రాచబావఁడు, రాచమాట, రాచయీవి, రాచటికము, రాచనల్లెను, రాచవాఁడు, రాచవీథి రాచవేఁట, రాచవేల్పు, రాచసింగము, రాచసిరి, రాచిలుక, రాచిల్కదొర, రాచూలి, రాతబిసి, రానిరాబారి, రాపట్టి, రాపులుఁగు, రాయంచ రాయంచగిండి, రాఱేఁడు, రాసాని రాకంగము. రాసిరి.

**రాచేకందు.** వి. (రాచ). రాజకుమారుఁడు.

సీ. జడదారి నెలదండఁ జని క్రచ్చఱగయాళి
రాకానిఁ జెందిన రాచకందు.
అచ్చ. రా. అయో. 98.

**రాచేకిక్క.** వి. (√రాయి.) రాతిప్రదేశము.

సీ. కనుపట్టె సీశైలమున దశకన్యకాధవుఁడు
సామాన్యపుఁ దపసివోలె, నొకపిన్నరాచకిక్కనుండు నీగిరి వలకాపట్టణంబు పక్కణము-
వోలె. వరాహ. 6. 87.

**రాచేకుఋపు.** వి. (రాచ). ప్రాణాంతకముగా వీఁపున లేచెడి మహావ్రణము (శ. ర.).

**రాచేకూఁతురు.** వి. (రాజే.) రా-కన్య.

చం. శరశత మైదుకైదువుల జంతయటంచువిరాళి.
కొగ్గిడ,గ్గలుటయు రాజకూఁతురుల గాలికి
గిలికి సోఁకశక్యమే. చం. రా. 299.

ఆ. కొడుకుఁగాంచు రాచకూఁతు రెద్దానికి, వట్టి
పనికి నుచితమైన సమయ, మొదవెఁ దడయు
టెంక నొప్పదు జనములు, వట్లు గాని పురుషు
లనరు మిమ్ము. భార. ఉద్యో. 3. 199

**రాచేకొడుకు** వి. (రాజే) రాజపుత్రుఁడు.

ఆ. రాజకొడుకు లెల్లఁ జూచుచునుండిరి.
భార. ఆది. F. 207

**రాచజడధారి.** వి. (రాచే.) రాజర్షి.

గీ. రాఁజనముఅభమా వేల్పురానులవీదు, రాచసిరి
మానివీనికో రాచలంబు, రాచబావని మాటకు
రాఁజనునొకొ, రాచజడదారిలీల నీరాచే
మాల. ఉ హరిశ. 4. 167.

**రాచేట్టు.** వి. (√రాయి.) చేట్టురాయి, భూమగ్నశిల, చేట్టు.

కం. సోకనఁ గొట్టిలేనియు, రాకింటఁ జుమీ
మొగంబు రాచట్టుపయిన్, శ్రీకాళిక నిందించిన-
నీకింతట నేలపోవు. నీచచరిత్రా భీమ. 2 158.

కం. గట్టిగను మూఁగదయ్యము, వట్టివదో కాక
ఱట్టో ఒలురాచట్టో, యిట్టులు మనమింద
ఆమను, జట్టుఁ బిలువఁగ నోకిఁత చూడకి
యున్నే. వాల్మీ 8. 118.

**రాచేజాబిలి.** వి. (రాచే) రాజచంద్రుఁడు. రాజశ్రేష్ఠుఁడు.
గీ. ... పెద్ద, లెన్న నారా చేజాబిలి చెన్నుమీఱు. నీలా. 1 43.

**రాచేజిల్లేడు** వి. (√రాచే) రాజార్కము, శ్వేతార్కము (వృ వి)

**రాచేదారి** వి (√రాజ.) రాజమార్గము, రాచేబాట.
గీ తేరులా కొమ్ముటేనుఁగు బారులావ, సారులా చౌక్కటపు రాచేపారులా కొ,టారులా తీరులా గొనరాకునౌర, ప్రోలి యొయ్యారి మేరిశీఁ బొగడవరిది. అచ్చ. రా. బాల. 34.

**రాచేనగరు** వి (రాచే) రాజసంబంధమైన గృహము.
సీ. పన్నిటతోఁ గదంబముఁ జేసి పూసినమృగహాభిపస రాచనగరు దెలుప. ఆము 2 75.
గీ గ్రహణ సంక్రమణాదుల రాచనగరఁ, గాసు వీసంబు లెడలమి గ్రాసమునకు, నాధివెట్టిరి క్షేత్రంబులందుఁ గొన్ని, లెస్సయుండునె గృహకర్తలేని బ్రతుకు. మనుచ. ౬. 129

**రాచేనెలవు** వి. (రాచే.) రాజధాని, రాజు నివసించు చోటు.
గీ. చేరి తేజేలు మఱి జడదారిగములు, నచ్చటలఁ గొల్వ వేగమ్న లతని మొదలి, రాచనెలవేలెఁ గేల్మనేరాజుతండ్రి, యతఁడు గొనియాడ నెగడె యయాతి పుడమి యయా. 1. 19.

**రాచేపగ.** వి (√రాచ.) 1. రాజశత్రువు.
ఆ. ఇట్లుచాలు పేరియొలనాగఁ బెండ్లియై, గాధి వట్టి వనిచి కదలిచనుచు, దెగి యెదుర్చు రాచపగ నేలవేలుపు, బీరమెల్లఁ జక్కఁబెట్టి యంత. యయా. 3 13.

2. క్షత్రియుఁడు వహించు విరోధము (వా.)

**రాచేపదవి.** మి. వి. (√రాచే.) రాజసంబంధమైన ఉన్నతస్థితి.
ఆ. అందంబు ... కంబగట్లుభూమి కానిక గఁగఁ బెం, పెసఁగు రాచబదవు లెల్లఁ బడసె. దశకు 1. 21.

**రాచేపట్టి.** వి. (√రాచే.) రాజపుత్రుఁడు.
గీ. తనకనలు చేష్టలంత భీతిని ఘటింప, మగిడి శరణన్నఁ దన్మహిమయుఁ దదాత్త, తన్మహా దైన్యము గణించి దయ దలిర్పఁ, గాచె నేమన వచ్చుడా రాచపట్టి రాఘవ. 2 109.

**రాచేపాడి.** వి. (రాచే.) రాజధర్మము.
సీ. అక్కట రాజాన్వయంబునఁ బ్రభవించి నీచుఁడై. యేమియు రాచపాడి, యెఱుఁగక నడురేయి యెల్లజనంబులు సుప్తులై యుండ గఁ జోరు నట్లు, ననుదెంచె నెవ్వఁ డాతనిఁ గోరి వెదకెద. హరి. ఉ. 6. 149.

(క్రొత్తప్రతి. పా. రాచపాటి. ప్రాతఁప్రతి. పా.)

**రాచేపుండు.** వి. (రాచే) రాజవ్రణము.
సీ. . రాచపుండనఁగను రాజవ్రణము పేరు తేజరిల్లు. ఆం. భా. 2. 150.

**రాచేపుట్టువు.** వి. (రాచే.) క్షత్రియుఁడు.
కం. రంగుగఁ జూపఱ కోర్కులొ,నంగన్ డోనంబు లడఁచఁ జనుదెంచిన యా,గంగం గని మై యెల్లను, బొంగం దగ్గ మ్రొక్కె రాచపుట్టువు మదిలోన్. యయా. 2. 45

**రాచేబాపఁడు.** వి (రాచే.) విశ్వామిత్రుఁడు
గీ. రాఁజన సులభమా వేల్పురాచవీడు, రాచ సిరిమానివీని కౌ రాచలంబు, రాచిబాపని మాటకు రాజునునొకొ, రాచజడరారిలీల నీ రాచమాల. ఉ. హరిశ్చ. 4. 167.

**రాచేమాట.** వి. (√రాచే,) మంచిపలుకు.
సీ జమునిల్లు సొచ్చిన జంతువునైనను గాచునెమ్మెయినను రాచమాట
భాం. విరా 2. 204.

**రాచేయావి.** వి. (రాచే) రాజులుచేయు దానము.
ద్వి. ఈ చతురోక్తుల కేమికారణము, రాచయావుల నమ్మరాదను మాట, యీ చందనమున నిల్చె, ద్వి. హరిశ్చ. పూ. 1405 పం.

**రాచేటిక(ర్క)ము.** వి.(రాచ+ఈకము.)1. క్షత్రియత్వము.

కం. ... శస్త్రీహతిఁబో,ల్పొందఁగ రాచఱికము నీయందొక్కటఁ దోఁచుచున్నయది తల పోయన్. దశకు. 3. 7.

2. రాజత్వము, రాజధర్మము.

సీ. సచరాచర ప్రపంచమున్నను పాలించు రాచ ఱికమ్ము కాపాడికాఁడు, వరాహ. 11. 14

కం. రాచము రత్నముపరిగాఁ, గాచు మహా మహుల తపము చూఱలఁబోసి, వేచింతయు మదిఁబెట్టవు, రాచఱికం బిత చెఱుతురా నరనాథా. రాజ. చ. 2. 16.

కం. ఓ చెల్ల విరహిణీవధ, మేచతురత నీకు దురి తమే చేయుపమల్, రాచఱికవు ఫలమో య,య్యోచంద్ర వివేక మెఱుఁగవాకో గురు సేవన్. మనుచ. 3. 86.

గీ. పౌలతులెల్ల మెచ్చ భూమి భృత్యాన్వయంబు, సంగ్రహించి విప్రపారసాహి, యద్దిరయ్య వింతయాఁడురాచర్కంబు, నిర్వహించె సతుల ఖర్వమతులు. నిరం. 1. 84.

రాచేవన్నెలు. వి. బ. (√ రాచే.) ధాన్యవిశేషము.

వ... పసుపుముద్దలు మంచివిరులు రంభచెక్కిళ్లు చిలుకముక్కులు మధురములు చామరాలు పెంపెముడువులు రాచవన్నెలు తులసీవనమాలి కలు సింధుకర్పూరాలు రాయమెచ్చులు యేరు మల్లెలు. ప్రబంధ. 112.

రాచేవాడు. వి. (√ రాచ.) 1. క్షత్రియుఁడు.

(ఆమ్రే. రాచ = క్షత్రియస్త్రీ.)

గీ. ఏచి పచరింతు రచ్చటి రాచవారు. యయా. 1. 15.

వ. వలరాచ రాచవారికి వనదేవత లొనర్చు నీ రాజనప్రదీపాంకురంబులుం బోని. నైష. 1. 95

సీ. వలరాచ రాచవాఁడలి కాఱుకను వెచ్చఁగరఁ గిన యలకనికరపుఁ జోటు, ... మనుచ 2. 9.

గీ. ... ఓ యమ్మ యగ్రవర్ణుఁ, చెట్టవట్టియు. దండంబుఁ బెట్టఁదగునె, రాచవారికి నంచు. నారాజవదన. దశా. 8. 35.

2 రాజు, పాలకుఁడు.

సీ. పేమణిహనుమంత బిరుదాంకుఁడగు రాచవారికి నెయ్యంపు వరసుతుండు ... నైష. 1. 32.

3. రాజబంధువు.

సీ భద్రమా నీకు నీవాహాభృశక్తిఁ బ్రజలకు లెస్సలా రాచవారు... మనుచ. 5. 4.

రాచేవీది. వి. (√ రాచ.) రాజసంబంధమైనవీథి.

వ. వీడుచొచ్చియా రాజు రాచవీథింజనునప్పుడు. యయా. 4. 155.

రాచేవేఁట వి. (√ రాచ.) క్షత్రియులవేఁట. క్షత్రియ సంహారము.

సీ అన్యుల నల్పంబు వడుగంగఁ బాఱెదు రాచ వేఁటలఁ జాలరవ్వ దెచ్చె,దు ... భాగ. 10 పూ 377.

రాచేవేల్పు. వి. (√ రాచే.) రాజశ్రేష్ఠుఁడు

చం పొదరిలు వెళ్ళివచ్చె వలపుల్దగ నింతియు రాచ వేల్పుతోన్, యయా 5 149.

రాచేసింగము. వి. (√ రాచే ) రాజసింహము. రాజశ్రేష్ఠుఁడు.

చం. కలన నెదిర్చెనేనిఁ దిగకమ్మలవేలపునైనా మార్కొనం, దలఁపుదురు ... పాలుపు దర్పరే వెలుఁగుప్రొద్దుకాలంబుల రాచేసింగముల్. నీలా 1. 86.

రాచేసిరి. వి. (√ రాచే.) రాజ్యసంపద, రాజ లక్ష్మి.

కం. రాచసిరి యుండియును మది, యాచేవికిం జొరదునాకు హరికి నిచటి బాల్యాచరణ ముపై మక్కువ, యేచందమ్మునను మఱవ నెన్నఁడు రామిన్. హరి. ఉ 2. 79.

గీ. ... నుచు గమనోమ్ముఖుండైన యధిపుమోము, రాచసిరికన్నె తప్పక చూచి చూచి, ప్రాణ

నాయక నిన్నెడఁబాయఁజాలఁ, దోడికొని.
పొమ్మన్న వన్ను నీతోడనెమ్మి.

కృ. శకుం. 3. 60.

**రాచిలుక(ల్క)** వి. (రాచే+చిలుక). రాజకీరము, శ్రేష్ఠమైన చిలుక.

చ. పొలఁతుక యోర్తురాచిలుక బోదక రాగ్రము నందయుంచ భూ.తలపతి దర్శనంబునకు దత్పాంతం జనుదెంచి నిల్చె ...

విక్ర. 4. 204.

**రాచిల్కదొర** వి. (రాచిల్క+దొర.) మన్మథుఁడు (కుసుమవర్ణనము)

సీ. స్తుతసంకు మదగంధ చూర్ణసౌరభదాత రాచిల్కదొర యెల్లి ప్రాపుదెలియ.

రా వి 3 76.

**రాచు** స. క్రి 1. అఱుగఁదీయు.

చం. ద్రవిడకుటుంబిమల్ వస్తుపురాచిన రత్నపుఁ దాపక్రిందనం,బవు తెరవాఁగా నిదురవోయి గరుత్మతి పచ్చఁబాఱినన్, భవనరోమరాశి ములు భర్మమయచ్ఛద గుచ్ఛనిస్ఫుర, ద్దివిజ ధునీ మరాళవితతి భ్రమఁబూన్పఁబురిన్ భ్రమించుచున్.

అము. 1. 64.

2. సంఘర్షణముచేయు.

మత్తకోకిల, రాచెఁగొమ్ములు నింగిగోఁగులు రావులుం గడురీవులన్ ...

యయా. 4. 7.

3. (బట్టమున్నగువానితో) తుడుచు, పోఁగొట్టు, రుద్దు

ఉ. ..ఈ, యెప్పెడి చందమామ కిది యొప్పునె కప్పుని పైఁటకొంగులం, దప్పక రాచిచూచి...

దశా. 1. 84.

4. వలఁచు, వలఁగజేయు.

కం అఁటని యెంచక మనియెడు, కాలంబునఁ దల్లి మాట గడవక దానిన్, వేలనిడి కాలరాచితి, నీలాగున వచ్చునమచు నెవ్వఁ డెఱుంగున్.

శుక. 2. 447.

సీ. ఉప్పరఁటెగసి వే కుప్పించి రథరథ్యరథికులఁ దమురగా రాచివైచు.

రాజ. చ. 2. 75.

5. విచారణచేయు.

సీ. పరవాదినీ శుకపరపుష్ట మధుకరావంబు లన్నియు రాచి తెచ్చి ...

కు. సం. 3. 321.

6. చెఱచు, నశింపఁజేయు.

ఉ నీచమదోయి సఁకుమదనిర్భర వాసనమేవ నూన న,య్యో చిరసౌఖ్యముల్ గనుట యెుండెఁ దపం బొనరించి పాశముల్, రాచు టయెుండెఁ గా కిహపరంబుల కూరకదూరమై వయ,శ్చి చన రెంటికిం జెడిన రేవడ నాదునె నీరజేక్షణా.

మనుచ. 3. 105.

● క్రి 1. అతిశయించు.

ద్వి. తనరార జనులెల్ల ఘనకీర్తిసేయ, రాచిన సద్భక్తి గోచరుండగుచు.

బస. పు. 6. 962 పం.

2. విజృంభించు, చెలరేగు.

ద్వి. పాడగునమచు శాపఁబుబిచ్చుచను, రాచిన మడివాలు మాచయ్యగారు, నాచౌడరాయఁ డేకాంతరామయ్య.

బస. పు. 7.918 పం.

గోళ్లురాచు = గోళ్లతో గీఱు.

ఉ. అయెలప్రాయమువన్ భవదుదంచితకీర్తియు గోళ్లురాచఁగాఁ, గాయఁబుఁ డాకెపై వలిగి కత్తులనూఱుచునుండు . .

కళా. 7. 35.

●: రాచుకొను, రాపిడి, రాపు, రాపుడు, రాపుడు రాయి, రాపాడి, రారాపు

**రాచుకొను.** స. క్రి. (రాచు+కొను-స్వార్థమున) ఒరయు, సంఘర్షణముచేయు.

మ. ... మృగం,బులమై రాచుకొనం దవస్వుల దివఁబుల్ సద్దినంబుల్ సుమీ.

మల్లభూ. 3. 98.

అ. క్రి. ఒరసికొను.

సీ. భూరిదిగ్భిత్తులతో రానికొన సన్నగఱు కెక్కి- కప్పూరు కంఠమొప్ప. హరి. ఉ. 7. 92.

**రాచోలి.** వి. (రాచే). రాజకుమారుఁడు, రాజకుమారిక.

కం. రాచూలికి సుచితంబగు, నారాచముగాదె రణమునం దరులఁ దెగఁజూచుచుఁ దిరుగని నడపున, నేచి యసురలోకమునకు నేఁగుట తరుణీ. భార. ద్రో. 2. 322.

గీ. అంత నచ్చట రాచూలినంత బెరయఁ, దోడఁ బుట్టువు గాఁడిన తూపువెటికి, వైచి క్రొవ్వేఁడి కన్నీరు వరదవాఱఁ, బలుదెఱంగుల నిట్లని పలువరించె. అచ్చ. రా. యు. 391.

గీ. ఆనుమ జోకొట్టుదురు జవరాండ్రఁగూడి, జోలపాడుచు రాచూలి వోలిబాల, కిసలయ గ్రాన ముదితకోకిలకదంబ, కంఠకలనాద సమధురగాన ఫణితి. పె. శకుం. 3. 85.

గీ. అనిన నుప్పొంగి రాచూలియయ్యయింక, జాగు గావింపనేల యిచ్చటి కయోధ్య, యేలు నొడయనిఁ బెండిలి కిపుడు పిలువఁ, బనుపవలెనని నెయ్యమేర్పడఁగఁ బలికె.

అచ్చ. రా. బాల. 186.

**రాజకదంబము.** సం. వి. అ పుం. కదంబభేదము. కడిమిలో నొకభేదము (వృ. వి).

**రాజకము.** సం వి. అ న. రాజసమూహము, రాజబృందము.

విణ. (అ. ఆ. అ) దీప్తిమంతము, ప్రకాశము కలది

**రాజకర్కటి.** సం. వి. ఈ. స్త్రీ. చీనాకర్కటి. పెద్దదోస (వృ. వి)

**రాజకశేరుపు.** సం. వి. ఉ. పుం. భద్రముస్త, నాగముస్తె (వృ. వి).

**రాజకీయము.** సం. విణ. (అ. ఆ. అ.) రాజ సంబంధమైనది. ప్రభుత్వసంబంధమైనది.

**రాజకుఁడు.** సం. వి. అ. పుం. చిన్నరాజు, సామంతరాజు.

**రాజకూష్మాండము.** సం. వి. పుం. వార్తాకి, ముళ్ళ (వృ వి.)

**రాజకోశాతకి.** సం వి. ఈ. స్త్రీ. పెద్దబీర (వృ. వి).

**రాజక్షవకము.** సం. వి. అ పుం. రాజసర్షపము, ఒక దినుసు ఆవాలు.

**రాజఖర్జూరి.** సం. వి. ఈ స్త్రీ శ్రేష్ఠఖర్జూరము (వృ. వి).

**రాజగిరి** సం వి. ఇ. పుం. మగధదేశమందలి యొక పర్వతము

**రాజగ్రీవము.** సం. వి. అ. పుం ఒకజాతి చేప (విఁశ్వము).

**రాజఘ్నుఁడు.** సం. విణ. (అ ఆ. అ) తీక్ష్ణమైనవాఁడు, ఉగ్రుడైనవాఁడు.

వి. అ పుం. రాజహత్యచేసినవాఁడు, రాజులను జంపినవాఁడు.

**రాజచిర్భిటము**=రాజచిర్భటము. సం వి. అ. పుం. కారవేల్లము, కాఁకర (వృ వి.).

**రాజచిర్భిటి.** సం. వి. ఈ. స్త్రీ రాజచిర్భటము, కాఁకర (వృ. వి)

**రాజచిహ్నకము** సం వి. అ న. యోని, ఉపస్థ (విశ్వము).

**రాజజంబువు.** సం. వి. ఊ. స్త్రీ. 1. పిండ ఖర్జూరము (వృ. వి) 2. పెద్దనేరేడు (వృ. వి).

**రాజతము.** సం విణ (అ. ఆ. అ.) వెండితోఁ జేసినది, రజతమయమైనది, వెండిది.

వి అ న వెడి.

**రాజతరువు.** సం వి. ఉ. పుం. కర్ణికార వృక్షము (వృ వి)

**రాజతాలము.** సం. వి అ. పుం. పుంగవృక్షము, పోఁకచెట్టు (వృ. వి.).

**రాజతాలి.** సం. వి ఈ. స్త్రీ. పూగవృక్షము, పోఁకచెట్టు (వృ. వి.)

**రాజతేనిశము.** సం. వి. అ. పుం ఫలలతా విశేషము, కర్బూజ (వృ వి.) (త్రి. ని.).

రాజదండము సం. వి. అ పుం 1 రాజశాసనము. 2. రాజాజ్ఞ. 3. రాజుచే విధింపఁబడిన శిక్ష. 4. రాజునకుఁ జెల్లింపవలసిన యపరాధ ద్రవ్యము—దఁడుగ.

రాజదంతము. సం. వి అ. పుం. దంతరాజములలో నొకటి, ముందుపల్లు. (పైవరుసలో ముందుండెడి రెండు పండ్లలో నొకటి. (వాచ.)

రాజదృషదము సం వి త్ స్త్రీ. తిరుగలి యొక్క యడుగున నుండెడి ఱాయి, తిరుగటి క్రిందిఱాయి (వి.వ్యమ్ను)

రాజదేశీయుఁడు. సం. వి. అ. పుం. కొంచెము తక్కువగ రాజుతో సమానుఁ డైనవాఁడు, ఇంచుమించుగ రాజంతవాఁడు. (ఇఙ్లీ. రాజకల్పుఁడు.)

రాజధర్మము సం. వి అ పుం 1 రాజు యొక్క ధర్మము, రాజు చేయవలసిన పని. 2 రాజులకు సంబంధించు ధర్మము, రాజులకు సంబంధించు శాసనము.

రాజధానము. సం. వి. అ న. రాజధాని.

రాజధాని సం. వి ఈ స్త్రీ రాజనివాసము, ప్రధాన నగరము.

రాజధాన్యము సం. వి. అ. న. శ్యామాకము, ధాన్యభేదము.

రాజధుత్తూరము. సం వి. అ. పుం. పెద్ద ఉమ్మెత్త (వ్న. వి.)

రాజన. వి. శాకభేదము, ఒకానొక జాతి కూర దినుసు.

గీ. రాజనలతోడి శృంగబేరములతోడఁ జిరుగడపుఁ బెండలములతోడఁ జేమతోడ. భీమ. 2. 56.

రాజనము. వి. సస్యవిశేషము.

సీ. బలురాజనంపుఁ బొట్టలు పీఁకవాతెఁ బో ముద్దియపిక్కల కుద్దిగాక. అచ్చ.రా.అర. 22.

చం. కమఁగొన వయ్యెఁబండి యొరగంబడి యుండెడు రాజనంబు... చంద్రా. 1. 39.

కం. జలముకు ఫలరసంబులు, గలుపంబురు హోత్పలము గరుమలు ముత్యంబులు మీలు మణులు శంఖులు. వలినన్నము చెఱకు రాజనపుఁ గొలమెల్లన్. కు. సం 2 925.

వి. ధాన్యవిశేషము.

మ. సోరిడిం జేర్చిన తీఁగమల్లియలు ఖర్జూరంబులుం బుష్పమంజరులున్ మామిడిగుత్తులుం గుసుమముల్ సంపెంగలుం బచ్చగ, న్నెరు పూఁతాశలు గల్గి రాజనపుఁగాంతిం దారుమున్నాపిచే, లరు దారన్నగు బుష్పదోఁటల బలాకా నీకదంభంబునన్. ఆము. 1 66.

వ.... మిల మిఁని రాజనపుమడుఁగ టోగరంబులు కాశీ. 7. 185.

రాజనయము. సం. వి. అ పుం. రాజనీతి

రాజనీతి సం. వి. ఇ. స్త్రీ. రాజు తెలిసికొనవలసిన సామాద్యుపాయ చతుష్టయము, అ విషయమును దెలుపు శాస్త్రము.

రాజనీలము. సం. వి. అ. న. పచ్చ, మరకతము (ఆ. ని.)

రాజన్యకము. సం. వి. అ. న. యోధుల సమూహము, క్షత్రియుల సమూహము.

రాజన్యము. సం. వి. అ. పుం. 1. అగ్ని. 2. క్షీరికావృక్షము, పాలచెట్టు (వ్న. వి)

రాజన్యుడు సం. విశ (అ. ఆ అ.) రాజసంబంధమైనవాఁడు.

వి. అ. పుం. 1. క్షత్రియవంశజుఁడు. రాజపుత్రుఁడు. 2. అగ్ని.

రాజన్వంతము. సం. విశ. (త్. తీ. త్.) మంచి రాజుగలది, మంచి (న్యాయముగల) రాజుచేఁ బరిపాలింపఁబడినది.

(దేశము). (రాజవంతము=రాజు గలది.)

రాజపటోలము. సం. వి. అ. పుం. పటోలము, పొట్ల (వ్న. వి.).

రాజపటోలి. సం. వి. ఈ. స్త్రీ. మధురపటోలి తియ్యపొట్ల (వ్న. వి.).

రాజపట్టము. సం. వి. అ. పుం. విరాటదేశమందుఁ బుట్టిన మణి విశేషము. ఒకానొక రత్నము.

రాజపథము. సం. వి. అ. పుం. రాజమార్గము.

రాజపలాండువు సం. వి. ఉ. పుం. రక్తపలాండువు, నీరుల్లి (వృ. వి).

రాజపీలువు. సం. వి. ఉ. పుం మహాపీలువు, పెద్ద గొలుగు (వృ. వి).

రాజపుత్రము. సం. వి. అ. పుం. మహారాజ చూత వృక్షము. ఒకజాతి మామిడిచెట్టు. (వృ. వి)

రాజపుత్రి. సం. వి. ఈ. స్త్రీ. 1. రాజుకూఁతురు. 2. రాజపుత్రజాతిస్త్రీ 3. జాతి, మాలతి, కటుతుంబి మొదలగు వృక్షముల పేరు. 4 రేణుక యనెడు సుగంధద్రవ్య విశేషము. 4. గంధ మూషకము, చుంచు. 6. రాజరీతి.

రాజపుత్రుఁడు. సం. వి. అ. పుం. 1. రాజు యొక్క కుమారుఁడు, 2. క్షత్రియుఁడు. యోధులవంశమునఁ బుట్టిన మనుష్యుఁడు. 3. బుధుఁడు (గ్రహము) 4. ఒక సంకరజాతి వాఁడు. 4. రాజపుత్రవంశమని ప్రసిద్ధమగు వంశమునఁ బుట్టినవాఁడు.

రాజపుష్పము. సం. వి. అ. పుం. నాగకేసర వృక్షము. (వృ. వి.).

రాజఫణిజ్ఝకము. సం. వి. అ. పుం. నారంగ వృక్షము, నారింజచెట్టు. (వృ. వి.).

రాజఫల. సం. వి. ఆ. స్త్రీ. జంబూవృక్షము, నేరేడు. (వృ. వి.).

రాజఫలము. సం. వి. అ. న. పటోలము, పొట్ల (వృ వి.).

రాజబదరము. సం. వి. అ. న. 1. రక్తామలకము. (వృ. వి).

2. లవణము, ఉప్పు.

పుం. ఉత్తమకోలి. (వృ. వి.) (వాచ.)

రాజబల. సం. వి. ఆ స్త్రీ. గెంతెమగోరు (వృ. వి.) (శ. ర.).

రాజబీజి సం. విశే. న్. ఈ. న్. రాజసంతతివాఁడు. రాజవంశస్థుఁడు.

రాజభద్రకము. సం. వి. అ. పుం 1 కుష్ఠము. 2. నింబము, వేము. (వృ వి) 3 పారిభద్రకము. (వృ. వి.)

రాజభూయము. సం. వి. అ న రాజత్వము, రాజధర్మము.

రాజభృంగము సం. వి. అ పుం. తెలివిగల కూఁకటి మూఁగపక్షి (వై. ని.).

రాజభోగ్యము. సం. వి. అ. న. జాజికాయ. పుం ప్రియాళువు (వృ వి.).

రాజమార్గము సం. వి. అ. పుం. పెద్దబాట, రాజవీథి, పెద్దవీథి. (ఇశ్లే – రాజవర్త్మము, రాజపథము మొ)

రాజమాషము. సం. వి. అ. పుం ఒకజాతి కాయ ధాన్యము, బొబ్బర, అలసందె.

రాజముద్ర. సం. వి. ఆ. స్త్రీ. రాజసంబంధమైన ముద్దర

రాజముద్గము. సం. వి. అ. పుం. ముద్గభేదము మకుష్టకము, అడవిపెసర.

రాజయక్ష్మము. సం. వి. న్. పుం. క్షయరోగము.

రాజయోగము. సం. వి అ. పుం. 1. జాతకుఁడు రాజుగాఁ దగినట్లు సూచించెడి గ్రహముల యొక్క యోగము. 2. (యోగ) రాజు లభ్యసించుటకై యేర్పఱుపఁబడిన సులభమార్గము.

రాజరంగము. సం. వి. అ. న. రజతము, వెండి.

రాజరాజమాడ మి. వి ఒకనొక నాణెము.

వ.... శ్రీకరణమాణికము కొడుకు కుడి యణ్ణునుం గామాసాని కొడుకు గాపిరట్టడి చేత నిరువది రాజరాజమాడలు వట్టి అలము వలయు చుట్టు ఇరువది పుట్లునేల చతుస్సీమ ములతోఁగూడ... ద. శా. 4. 1288.

రాజరాజు. సం. వి. అ. పుం. 1. సార్వభౌముఁడు, చక్రవర్తి. 2. కుబేరుఁడు. 3. చంద్రుఁడు.

రాజర్షి సం. వి. ఇ. పుం. 1. రాజఋషి, తపస్సు చేయుటచే ఋషిగా నెంచఁబడిన క్షత్రియుఁడు. (జనక విశ్వామిత్రాది.)
2. రాజశ్రేష్ఠుఁడు (వాచ).

రాజరీతి. సం. వి. ఇ. స్త్రీ. కాంస్యము—కంచు.

రాజవంతము సం. విశ. (త్రి. ఈ. త్రి.) రాజుఁగలది (దేశము. శ. ర.)

రాజవంశ్యుఁడు. సం. విశ (అ. ఆ. అ.) 1. రాజసంతతివాఁడు రాజవంశస్థుఁడు. 2. (మనుష్యులలో) ఒకానొకజాతి పురుషుఁడు. (వాచ)

రాజవర్తము సం. వి. అ. పుం. గ్రోత్తపట్ట (వై. ని.)

రాజవల్లభము. సం. వి. అ. పుం 1. ప్రియాలువు 1. రాజబదరము, పెద్దరేఁగు. 3. రక్తామ్రము.

రాజవల్లి. సం. వి. ఈ. స్త్రీ. ఒకానొకలత. "తోయవల్లి." (రం. ని.)

రాజవాహ్యము. సం. వి. అ. పుం. గజరాజము, పెద్దయేనుఁగు.

రాజవృక్షము. సం. వి. అ. పుం. ఱేల (వృ. వి.) (శ. ర.)

రాజవ్రణము. సం. వి. అ. న. (చూ. రాచపుండు.) (శ. ర).

రాజశాకము సం. వి. అ. పుం. ఒకజాతి కూరాకు, వాస్తూకము, చక్రవర్తికూర.

రాజశాణము. సం. వి. అ. పుం. పట్టము, పట్టునూలు.

రాజశృంగము. సం. వి. అ. న. రాజచిహ్నమైన బంగారుకామగల గొడుగు, శ్వేతచ్ఛత్రము.

రాజశేఖరుఁడు. సం. వి. అ. పుం. 1. శివుఁడు, చంద్రశేఖరుఁడు. 2. ఒకానొకకవి, అలంకారికుఁడు.

రాజసభ. సం. వి. అ. స్త్రీ. 1. న్యాయసభ. 2. నృపసమాజము.

రాజసము. సం. వి. అ. న. రజోగుణమువలనఁ గలిగినది. దుర్గర్వము.

ఆ. అనిన బాహ్లికాదులగు కురువృద్ధుల, నాత్మజనకుఁ గృష్ణు నాదరింప, కతఁడు రాజసమున నప్పుడు దిగ్గున, లేచిపోయె సంచలించెఁ గొలువు. భార. ఉద్యో. 2. 373.

కం. అనవుడు నవ్వుతఁ బవనా, శన శశవము దగిలి రాజసమునఁ బరీక్షి, జ్జనపాలు చనుట కృశుఁడను మునివలన నెఱిఁగి కోప మూర్ఛాన్వితుఁడై. భార. ఆది 2. 167.

గీ. ...,చేరి యాశీర్వదించినఁ జేయి మొగిచి, దమ్ము గూర్చుండుమనఁ డెంత రాజసంబొ దశా. 2. 100.

విశ. (అ. ఈ. అ.) 1. రజోగుణముకలది. 2 రజోగుణము ప్రధానముగాఁ గలది.

రాజసర్పము. సం. వి. అ. పుం. సర్పభుక్కు, పెదపాము (వాలా. ని.).

రాజసర్షపము సం. వి. అ. పుం, 1. నల్లావాలు. 2 పరిమాణ విశేషము, ఆవగింజ యెత్తు.

రాజసారసము. సం. వి. అ. పుం. మయూరము, మగనెమలి.

రాజసి. సం. వి. ఈ. స్త్రీ. తృణవిశేషము, దూర్వ (వృ. వి.).

రాజసూయము. సం. వి. అ. పుం. న. ఒక రాజు తక్కిన రాజులజయించి సర్వాంగీకృత సామ్రాజ్యమునకు గుర్తుగా సామంతరాజుల సహాయముతోఁ బట్టాభిషేక సమయమునఁ జేసెడి పెద్దయజ్ఞము.

రాజస్కంధము. సం. వి. అ. పుం. అశ్వము, గుఱ్ఱము. (విల్సన్.)

రాజస్వము. సం. వి. అ. న. 1. రాజసంబంధమైన సొమ్ము. 2. పన్ను, సామంతరాజులు చెల్లించెడి కప్పము.

రాజస్వర్ణము. సం. వి. అ. పుం. దుత్తూర వృక్షము. ఉమ్మెత్తచెట్టు (వృ. వి.).

రాజహంస. సం. వి. అ. పుం. 1. ఎఱ్ఱని కాళ్లును ముక్కునుగల హంస, కలహంస. 2.ధూమ్రవర్ణము లైన ముక్కు కాళ్లు ఱెక్కలుగలహంస.

రాజహర్షణము. సం. వి అ న. తగరపుష్పము (వాచ)

రాజహస్తి. సం. వి. న్. పుం. గజరాజము, పెద్ద దియు నందమైనదియు నగునేనుఁగు.

రాజాద(త)నము. సం. వి. అ. పుం. ప్రియాల వృక్షము, మోరటి (వృ. వి.).

(దీని పండులోని గింజల పిండితో లడ్డుకలుచేసి రాజులు భుజింతురు.)

రాజాదని. సం. వి. ఈ. స్త్రీ క్షీరిణి, పాలచెట్టు.

రాజానకుఁడు. సం. వి. అ. పుం 1. సామాన్యరాజు, చిన్నరాజు 2. పండితులకును కవీశ్వరులను పూర్వ కాలమున నీయఁబడిన బిరుదము.

రాజాన్నము. సం. వి. అ. న 1. ఆంధ్రదేశమునఁ బండెడి ధాన్యవిశేషము, రాజనము 2. రాజు వలన లబ్ధమగు నాహారము, రాజానుగ్రహమువ దొరికిన యాహారము 3. రాజార్హమగు భోజనము.

రాజాబహాదరు. వి. ఒకానొక బిరుదు.

సీ సంస్థానము నొసగు సమయంబునందె వంశక్రమంబుగన రాజాబహాదరు మొదలైన బిరుదులు ... రంగా. 1. 116.

రాజామ్రము. సం. వి. అ. పుం. మామిడి జాతిలో శ్రేష్ఠమైన చెట్టు, ప్రశస్తమైన మామిడి (వృ. వి.)

రాజార్కము. సం. వి. అ పుం. కాష్ఠీలము, రాచ జిల్లేడు (వెఱ్ఱి జిల్లేడు శ.ర ).

రాజార్హ. సం.వి ఈ.స్త్రీ. జంబు, నేరేడు (వృ. వి.).

రాజార్హము సం. వి. అ. న. అగరుచందనము, చందనవిశేషము.

విశే. (అ. అ. అ.) రాజునకుఁ దగినది.

రాజాలాబువు. సం. వి. ఊ. స్త్రీ. స్వాదుతుంబి, మిష్టా లాబువు (వృ. వి.).

రాజావర్తము. సం. వి. అ. పుం. 1. తక్కువజాతి వజ్రము, ఉపరత్న భేదము (గాజు మొ.)

సీ. ... ఇంపు, పొసఁగు రాజావర్తపుంబారువము లకు బొంచు వైదూర్యంబు మించుగన్ను.

రావి. 5. 86.

3. విరాటదేశమునుండి తెచ్చిన వజ్రము.

న. చిత్రపటము, రంగురంగులబట్ట (వై. ని.).

రాజాహి. సం. వి అ. పుం. రెండుతలల పెనుపాము.

రాజి సం. వి. ఇ, ఈ స్త్రీ 1. రేఖ, గీటు. 2. పంక్తి. 3. నల్లావలు. 4. సూన, కొండనాలుక, 5. రాజ సర్పము, ఒకవిధమగు పాము.

రాజిక. సం. వి. అ. స్త్రీ. 1. పంక్తి, శ్రేణి, 2. మడి, చేను, 3. నల్లావలు. 4. (తూనికలో నుపయోగించెడి) యావలు.

రాజికాఫలము సం. వి అ పుం తెల్లఆవ, గౌర సర్షపము (వృ. వి.)

రాజితము సం. విశే (అ. అ. అ.) ప్రకాశితము (శ. ర )

రాజిఫల. సం. వి. అ స్త్రీ. చీనాకర్కటి, పెద్దదోస

రాజిమంతము. సం. వి అ. పుం. రాజిలము (వై . ని )

రాజిలము సం వి. అ. పుం. రెండుతలలపాము, డుండుభము (ఇది విషములేని ది).

రాజిల్లు(లు) సం. అ. క్రి. ప్రకాశించు (శ.ర.).

రాజీనకము. సం. వి. అ. పుం. ఒకానొకచేఁప, రాజీ వము (వై.ని ).

రాజీఫలము. సం. వి. అ పుం పటోలము, పొట్ల (వృ. వి.) (వై. ని.).

రాజీలము సం. = రాజిలము (వై . ని.)

రాజీవంతము సం. వి. అ. పుం పటోలము, పొట్ల (వృ వి.).

రాజీవము. సం. వి. అ. పుం. 1. మృగవిశేషము, హరిణభేదము, సారిసపక్షి. 3. ఏనుఁగు. 4. మత్స్య భేదము, ఒకానొకచేఁప.

న. తామర, పద్మము.

రాజు సం వి న్. పుం. (ఇది తఱుచు తత్పురుష

సమాసాంతమున పుంలింగమున అకారాంతమును స్త్రీలింగమున ఈకారాంతమును నగును.

ఉదా : ఖగరాజతురంగః. రాజ్ఞీ, బహువ్రీహిని స్త్రీలింగమున నకారాంత, ఈకారాంత, ఆవా రాంతములును నగును.

ఉదా: బహురాజానౌ, బహురాజే, బహురాజ్ఞ్యౌ. మఱియును స్వార్థము ప్రధాన మగునపుడు తెనుఁగున నుత్వదుఙ్లోపములగును. ఉదా. విదుర రాజు, రాజు, ఖగరాజు.

స్వార్థప్రధానమగునపుడు త్వదుఙ్లులగును.

ఉదా; హతరాజుఁడు. ఈ "రాజు" అను పదము, తత్సమమేయని చిన్నయసూరి, తిమ్మకవి మొ. వారి సిద్ధాంతము. వైకృతముగూడ గలదని కొందఱు.)

1. ఱేఁడు, నృపాలుఁడు.

ఆ. విదురరాజు పాండువిభునకుఁ జేయించె, నన్య లోకహితములైన విధులు. భార. ఆ. 5. 127.

ఉ. రాజవివేకియై నిరపరాధమహీసురవత్సుని ... వధూవ్యాజమునన్ వృథాకుపితుఁడై ... వధి యింపఁగఁ బంచె... విక్ర. 3. 67.

గీ. రాజుగాఁడవన్న కంబమురాయఁడితని, వేస మును మేలుబాగెనుసేసియుంట, నిపుడు గముఁ గొంటిమి ... యయా. 1. 120.

సీ. ... ఒడయఁడుదొర, రాయఁడురాఱేఁడు రాణెకి మీఁదన నరపాలసంజ్ఞలై పరఁగుచుండు.. ఆం. భా. 2. 132

కం. కాదనక వేగవేఁగక ... రాజువలచినదే దేవుల సానియనఁగఁ దెలియమె నిన్నున్.

ల. వి. 4. 80.

2. రాచవాఁడు, క్షత్రియుఁడు. 3. యుధిష్ఠిరుఁడు, ధర్మరాజు. 4. ఇంద్రుఁడు. 5. చంద్రుఁడు, 6. ప్రభువు, యజమానుఁడు. 7. పృథుచక్రవర్తి. 8. యక్షుఁడు. 9. సోమవల్లి (కే. ని.).

విశే. తనజాతియందు శ్రేష్ఠుఁడు, ప్రధానుఁడు. ఈ యర్థమున నిది సమాసమందే ప్రయుక్తము )

రాజేంద్రుఁడు. సం. వి. పుం. రాజాధిరాజు.

శ్లో. చతుర్యోజనపర్యంతమధికారీ నృపో భవేత్, యోరాజాత చ్ఛతగుణ స్స ఏవ మండలేశ్వరః, తస్మాద్దశగుణో రాజా రాజేంద్రః... (వాచ.)

రాజ్ఞి. సం. వి. ఈ. స్త్రీ. 1. రాణి, రాజుభార్య. 2. సూర్యునిభార్య. 3. కాంస్యము, కంచు.

రాజ్యము. సం. వి. అ. న. 1. ప్రభుత్వము, చక్రవర్తిత్వము, దొరతనము. 2. రాజాధికారమునకు లోఁబడినదేశము, రాష్ట్రము. 3. రాజశాసనము, ఏలుబడి దేశపాలనము. 4. లక్ష గ్రామములపై అధికారము.

శ్లో. లక్షాధిపత్యం రాజ్యం స్యాత్, స్సామ్రాజ్యం దశలక్షకే, శతలక్షే మహేశాని, మహాసామ్రాజ్యముచ్యతే. (వాచ.)

రాజ్యలోభము సం. వి. అ. పుం. రాజ్యాశ, రాజ్య మధికము చేయవలయుననెడి కోరిక.

రాజ్యాంగము. సం. వి. అ. న. రాజ్యపరిపాలనకుఁ గావలసినది. (స్వామ్యమాత్య సుహృత్కోశ రాష్ట్రదుర్గ బలరూపమగు రాజ్యసాధనము.)

రాజ్యాభిషేకము. సం. వి. అ. పుం. రాజ్యమున రాజును స్థాపించుట, రాజుయొక్క పట్టాభిషేకము.

రాటనము = రాట్నము. (సం. రహాటః.) 1. చెఱుకు గానుఁగ.

కం. ఎగయుశిరంబులు వథమున, కొగిఁగ్రమ్మెడు రక్తజలము లొలుకుచు భువిపై, మగుడఁ బడుఁజూఁడఁ గడురంగుగ నోలిన రాటనమున గుండ్రలపోలెన్. కు. సం. 11. 787.

2. నీరుచేఁదుయంత్రము.

ద్వి. కీలువొందించి యాత్రియరాటనములు, వాలి యాడించు నా వడ్రంగియతఁడు. బస. పు. 4. 65. పం.

3. గానుఁగ.

గీ. అప్రతిష్ఠాఖ్య వరకంబునందు దుష్ట, వరునిఁ
ద్రిప్పుదురొగి రాటవములఁగట్టి.
మార్క. 2 68.

**రాటము**[1] వి. మల్లబంధ విశేషము.

ఉ. వ్రేసిన లేదు బంతియని వ్రేటున వెంబడిఁ
జొచ్చి బిత్తరిన్. డాసి శెళాన లాగెను తటా
లున వ్రేసి గుణంబు రాటమున్, సీసము ...
మేల్ జెగజెట్ల కై వడిన్. ప్రబంధ. 790

**రాటము**[2]. వి (సం. రాష్ట్రమ్.) జనసమ్మర్దము
(శ. ర.).

**రాటువము** వి. మల్లబంధ విశేషము

వ. ఖేచరు లగ్గించి యగ్గడింప నగ్గోపకుమారుండు
పాటవంబునను రాటవంబునకుం జనివెన్నెక్కి
నిక్కిన నక్కంసభటుండు.
భాగ. 10. పూ 1345.

**రాటి** సం. వి ఇ పుం. వశీ స్త్రీ యుద్ధము.

**రాటు.** వి. (సం. రాష్ట్రిమ్) ఉపద్రవము, శ్రమము
(చూ. రాట్పుడు).

జ. రాట్పుడు.

**రాట్టు** సం వి ట్ పుం రాజా, ప్రభువు
విజ స్వజాతి శ్రేష్ఠుఁడు, శ్రేష్ఠమైనది.

**రాట్నము = రాటనము.** వి (సం రివాటః)

1. చెఱకు గానుఁగ.

మ ఇలకు స్వేర్గుగఁ బండి తీగవవపుం డ్రేఁకు
చప్పటల్ దీపు లగ్గమై ప్రాల మరుస్వనంబు
లెనఁగంగాఁ ద్రిప్పురాట్నంపుగుం, గ్రలునాఁ
దేనెకొలంకులం బొఁ లిపా అన్విచ్చు పంకేరుహాం,
బులనాడెందలసంపఁ దేఁటివలయంబుల్ తార
ఝుంకారముల్. అము. 4 152.

ఉ ఓసిగయాళికాన వను మ్రుగు వెఱుంగవె రోస
మెత్తివం, దోసమెఱుంగ వీటఁగల తొయ్యలు
లెల్లను గుంపుగూడినం, గ్రాసముచెంద నీ
గళము రాట్నమునం బిగియించి నెతునో,
కోసుకతిందునో. శుక 2 578.

2. నూలువడుకు యంత్రము, ఏకులరాట్నము.

కం. వడిదారంము చెవులుం ద్రొక్కుడు వలకయుఁ
దిండు కదురు గుంజలునుం ద్రొక్కుడుబొమ్మ
యు నుం ద్రిప్పుడు, పుడక యునుం గలుగు రాట్న
ములు గై కొనుచున్. శుక. 2. 420.

సీ. అనయంబుఁ బుత్రు తిన్నని తొక్కుపలుకు
లాలింపని చెవులు రాట్నంపుఁ జెవులు.
చంద్రా 1. 53.

సీ. తంతు సంతతి .. సముత్పాదనయంత్రంబు
రాట్నముంచనఁగను రహిఁ కెక్కు.
అం. భా 2 294.

3 ప్రత్తిరాట్నము, ప్రత్తిని దూదినేయు
యంత్రము

గీ. దూదిపాటలఁ దేనియల్ దుముకుచుండఁ,
జిఱుతొడల నంటఁగాఁ గోక నెటిక క్రిక్కి
ఱియ వడంచుచుఁ గూర్చుండి రెడ్డిఁడుము,
జిగిజింగిన రాట్నంబుఁ ద్రిప్పుచుండె
ఉ హరిశ్చ. 4 24.

4. జలయంత్ర విశేషము

ఉ. ...కాలువల్, బాయలుగాండ్లు నూతులును
బావులు రాట్నములున్ జలార్థమై, సేమఁగ
నయ్యెఁగాక మఱి సేయని నాఁడు లా మె
పుట్టు వే. ద్వా. 6 70.

**రాట్ప(ుప)డు.** అ. క్రి. (√ రాట) శ్రమనొందు.

ఉ. బింబఫలాధరోష్ఠి మణిభిత్తిపుటంబులయందు
నాత్మబింబంబు గరావలంబన సమ్మర్థముగా
మదిఁగోరుఁ గేలి,సౌధంబులయిన్ సమున్నత
నితంబపయోధర భారగుర్భ్వీ, రంబునఁ గోమ
లాంగకము రాట్పడఁ గేలివిహారవేళన్.
కాశీ. 4. 210.

**రార** సం. వి. = రాథ (కే. ని.)

**రాడి** సం. వి. = రాటి.

**రాడు** వి. దౌ. (బ. రాడులు, ఱులు) గుంజ
స్తంభము.

సీ. .. గీ ... పొలంబు దుండుగలమళ్ల యొారు లఁ దూలిరాదు, చిక్క నేతాలపాడలు సీమఁ జనచు. ఆము. 6. 13.

గీ. ధరనిదాఘవాళావాతి నెరియకుండ, వివిధ మాల మంటపము గావించె నవఁగ, నొప్పె నీలాభ్రపటల మచ్చుప్పరమున, రాళులన నెల్ల దెస వానకాళు లమరె. కు. సం 6 754.

జ. రాపడు.

రాథ. సం. వి. అ స్త్రీ. 1 వెలుఁగు, ప్రకాశము. 2. గౌడరాష్ట్రమునఁ బ్రధాన పట్టణము పేరు 3. అంరము, శోభ.

రాథము. సం వి అ పుం పిచులము, ఒకానొక చెట్టు (వ్య. వి.).

రాణ = రమణ వి. 1. ఒప్పిదము.

రగడ. పోఁడిమిగ వకుళ కుజపూగములఁ బూగముల రాణ దనరారెను బరాగముల,... రాఘవ. 2. 6.

2. రక్తి గానమాధుర్యము.

సీ. నీ విలాసమచర్చ్రికావిశేషమనుమీ సంగీత సాహిత్య సౌరభంబు, నీ కటాక్షశ్రీవిపాక భేదమచుమీ వేణువీణాదుల రాణలెల్ల. ప్రభా. 3. 114.

శా. పంచాంకోపలసౌధవీథికలపై నింపొంది చిత్రంబుగా, వీణెల్ కేలధరించి రాగలహరీ విస్ఫూర్తి మైఁజొక్కుచున్, జాణల్ సాధ్యకుమారు లాగమ విధాన స్నిగ్ధగానంబులన్, రాణల్ మీఱఁగ నాలపించెదరు చిత్రప్రీతిమై వింటివే. సుద. 5.19.

3 ప్రేమము, అనురాగము.

సీ. కానలోఁదారు మృగంబుల కైవడిఁ గైకొని యసమాస్త్రుకరమ్రకలవఁ, దవరు చొక్క పురాణ మునిదంపతులు దమకంబులు దేర నెయ్యంబుమీఱ. రాఘవ. 1. 20.

(శారశార్థమున.)

ఉ. వీణియమ్మట్టుటల్ మిగుల వింతలు పెంపుడు చిల్కలోదతో,రాణదలిర్పఁ బల్కుట గరంబు బవు రూపము... కళా. 6. 212.

4. అసక్తి

ఉ. ... శ్రీరంగనివాసుఁ డెంతయును రాణ దలిర్పఁగ దేఁగవేఁటమై, వంగవ లున్న చోటికి నొయ్యారపుఁజాగులు మీఱవచ్చి ... పరమ. 3. 145

5. వేడుక, కుతూహలము.

సీ అనవనకోటియందను నరసులగోడి నిష్ట పురాణపరిచితిఁ బ్రియమందెదు. రాఘవ.1.19.

(శారశార్థమున.)

6. అతిశయము, ఆధిక్యము.

ఉ. అణిమెఱుంగుము త్తెవుటొయ్యారపు ముగ్గులు రత్నదీపికా,శ్రేణులు ధూపవాసనలు హృద్య నిరంతర వాద్యఘోషముల్, రాణఁ బొసంగఁ బ్రోలు మిగులం గనువిందొనరించు నిత్యకళ్యాణముఁ బచ్చతోరణమునై జనులందఱు నుల్లసిల్లఁగన్. విజ. వి. 1. 19.

సీ. రాణనొప్పారు నిస్సాణరావంబులు కాహళరావముల్ గ్రందుకొనఁగ ... భా. రా. బాల. 687.

సీ. పచ్చని పౌరుముంజి పనివాగెపక్కెర పారసీకల్యంబు పట్టమయము, రాణనొప్పారు పైఁజాణంబు సింగిణితళుకుల కోరుల తరకసంబు. మనుచ. 4. 28.

7. విధము.

వ. ... చెలికాని చేడ్పున విడుదులం జూచుచుఁ దూణంబురాణ వెనుదవిలిపోవుచుఁ పథిక జమం దన పట్మ్రికవాసులం జూచి మరలుచు ... చంద్రా. 6. 93.

జ: రాణించు, రణింపు, రాణింబు, రాణిల్లు.

రాణము. సం. వి. అ. న. 1. పత్రము, ఆకు. 2. నెమిలితోఁక. (విల్యమ్సు.). పుం. నాదము, ధ్వని.

వ. మఱియు నిక్కలాచల సంతానంబు ... పాడు
వేల్పుగా నీల పాణిరిత మాణిక్యవీణా మధుర
రాణామృతంబులఁ గరఁగి .. వసు. 2 11.

**రాణి** వి (సం. రాజ్ఞీ. ప్రా. రాణీ.) 1. రాజుభార్య.
(చూ. రాణివాసము).

2 భార్య

గీ. పుండరీకాసనమునఁ గూర్చుండి మదికి, నించు
వేడుక వీణవాయించుచెలువ, వలువరాణి మహా
త్మలో వెలయుఁగాత... మను చ. 1. 5.

సీ తలవాఁకిటను రాణీనిలిపి సమ్మతిఁ జెందెఁ దన
రాయసమునకుఁ దప్పుగా దె...ఇందు. 1. 145.

జః రాణివాసము, రాణివాని.

**రాణిక.** సం. వి. అ. స్త్రీ. గుఱ్ఱపుఁ గళ్లెము (ఆ. ని).

**రాణించు.** అ క్రి. (√రాణ.) 1. ఒప్పు, శోభించు.

శా. ఆలాపంబులఁ బెక్కు నేమముల తాయం
బుల్ ప్రయోగంబులున్, దాళంబుల్ మొర
యంగ రాగముల తానాతానమానంబులన్,
డాలున్ రక్తియు రేఖయున్ సరళియున్
రాణింపఁ గద్వైష్ణవీ, శిలాచిహ్నితగీతముల్
మహతిఁ బల్కించెన్ విచిత్రంబుగన్.
వరాహ. 11 35.

ఉ. ఎంచఁగ మేచకద్యుతివహించుట సోగలవంగఁ
దాము రాణించుట వెమ్మిమైఁ గడు గణింపఁగఁ
బొల్చుట దావిభూతిచే, మించుట నాలతాంగి
మనుమించు కురుల్ సరియైతనర్చియున్, బించ
ముశై చరించె నలిపించె ఘనాఘన చిక్విలాన
తన్. విప్ర. 2. 45.

సీ. రమమాడ్కిఁ గమలజురాణి రాణింపంగ వాణి
మాడ్కిని లక్ష్మి వలన మించ. ఇందు. 1. 106.

2. ఇష్టమగు.

కం. ప్రాణేశ్వరుండు గడుని,ప్రాణత నున్నాఁడె
దేమొ తన కన్నులకున్, రాణింపనో యితనికి
మగ,పోణిమియే లేదొ యనుచుఁ బొక్కుచు
మదిలోన్. శుక. 1. 202.

3. సంతసించు

ద్వి. అవనిజ ఘనశోకమంతయు మాన్పు, రవి
మానునునసెల్ల రాణింపఁజేయు, వచ్చెనో
యనఁగ నవ్వనచరేశ్వరుఁడు, అచ్చుగా నాగిరి
యల్లనడిగ్గి.
రం రా. కిష్కిం 199. పొ 16 పం.

4. అతిశయించు

గీ. మన్ను గేస్తుఁడు వగ్గియు మిన్ను సిరుఁ,బ్రొద్దు
వెలగాడ్పు లెవ్వాని రూపులయ్యె, నట్టి తెలి
గట్టు మన్కిపట్టైనదిట్ట, యొరపు రాణింపఁ గల
లోన నొక్కనాఁడు. నీలా. 1. 12.

(ఇది కొన్ని యెడల వాక్యాలంకారముగాఁ
బ్రయోగింపఁబడును.)

కం. రాణించి షడ్జమంజుల, వీణానిఃక్వణనమలర
విలసితవేణు, క్వాణవధురీణమగుపర, గానీకృత
మనోజ్ఞ మధురంగానము వినియెన్.
భా. రా. కిష్కిం. 435.

**రాణింపు.** వి. (రాణించు) ఒప్పిదము, సొగసు.

ఉ. పెంపరయంగ నొక్కయెడఁ బిచ్చుల మయ్యోను
మేనఘర్మముల్, కంపవలీల నొక్కయెడఁగం
టకితంబగు వన్యకామినిన్, పొంపుగనీకు నాయ
కుఁడు సొమ్ములఁ బెట్టుచుఁ జూచి నంత
రాణింపుగ లేమరో యొటచనిల్చెనో మాన
మెఱుంగ లేమియున్.
శృం. రస 1. 11 పొ. 20 వ.

**రాణింబు** = ణింపు. వి. (√రాణించు). ఒప్పిదము,
సొగసు.

సీ. బింబంబుడంబు రాణింబు రాణించు కెమ్మోని
వాఁ డెవలేని రవిబాఁడు ఇందు. 4. 22.

**రాణిల్లు** = రాణించు. (√రాణ ) ఒప్పు, శోభిల్లు.

వ. అట్టి సమయంబున నట స్వయంవరోత్సవంబు
వకు ... గోమేధికత్సరుద్యుతి స్ఫూర్జిత
కృపాణి పాణి రాణిల్ల భవదీయవిమత
రాజన్యమానసంబుల నెపుడు నెపుడు నెడఁ

రాయక యున్న దాననని ...
చంద్రా. 5 124.

రాణివాసము. వి. (రాణి+వాసము). 1. అంతఃపురము, అంతిపురము.

గీ. వవ్యపాల్య కింకారోహణము లొవర్చి, రాణి వాసంపునతులు పార్శ్వములఁ గొలువ, భద్రగజ మెక్కి మారాజు ప్రాభవమున, వన్మదాశేరవని కేఁగిరాఁడు నేఁడు.
ఉ రా. 3 186.

గీ. .. గత్నకాంతులు వెలయగ రాణివాస నతుల సేవలఁ జొక్కు శ్రీ పతిరిఁ గాంచి.
దశా. 4. 103

(ఇట "ము" లోపము చింత్యము)

గీ. ... వగరవఁగ రాజగృహనామ, ధేయమౌ రాణివాస మంతిపురమవఁగ, నలరు శుద్ధాంతము,
అం భా. 2. 18

2. అంతఃపురస్త్రీ, రాజు యొక్క భార్య.

వ ... ప్రవరోద్యాపన కనియును, వ్యాధిమాను కోనవియును తెప్పింప ప నారాణివాసంబు గుప్తాగుప్త ప్రకారంబులం బంపుద్రవ్యంబు...
అము. 4 53.

సీ. విదితంబుగ విచిత్రవీర్యుని రాణివాసముతకు నడిదెచ్చి చనినవాని.
విప్ర. 4. 44.

సీ బ్రహ్మాకుఁ బట్టంపురాణివాసంబయ్యె రాజ నక్రీడాభిరతులఁ బోక.
కాశ. 2. 7.

గీ గౌరి యొక్కతె యాకాశగంగ యొకతె కాశి యొక్కతె దక్షిణకాశి యొకతె, నలుగురను శంభునకు లోకనాయకునకు, రాణివాసం బులను రాగరనము పేర్మి.
భీమ. 3. 95.

3. భార్య, పెండ్లము.

ఉ చుక్కల రాణివాసముల సోయగపుంజనుదోయి త్రెక్కువం, జిక్కనైన యక్కు యదుని హుఁడు బాణవరంపరాహతిన్, వ్రక్కలు సేయ...
పారి. 5. 10.

4. చెలఁ చేపడిన జేజే రాణివాసంబుల అతినిద్దురలతో నడుగులొత్త.
రామా. 9. 144.

రాణివాసి. వి. (రాణివాసము+ఇ[3]. అని శ. ర.) అంతఃపుర స్త్రీ.

ఉ. ఓసరవో యెని శ్వేడకుండ నయో వను రాణివాసిగాఁ, జేసితొ తొత్తులఁబనులు సేయఁగ నిచ్చినఁ బోలదంటనే, వాసికిఁ బోరనన్నుఁ గడవంబని పాటలు సేయు వారలే, రి...
వేం. పంచ 1. 249.

రాణువ. వి. 1. సేన

ద్వి. రాచే మొత్తను నెక్కు రాణువ యుక్కు, గోచయంబుల దిఁడుకోమట్ల మెండు.
ద్వి. ఠ సా. 1. 3. పా. ష. వం.

కం. అంతటఁ బెఱరాణువ హాను, మంతుం దను పేరఁ బరఁగు మాష్టిని మదా, క్రాంతుని గెలిచెదనని నిజ, కాంతుఁడు చవఁ డొడును మాలెఁగద యుపు డనుమన్.

కం. ఓపాపాత్మక లోనికి, పొమ్మని చనవొసంగి రాణువయెల్లదాన్, నీ పార్శ్వంబుగఁ జేసి మ,హా పరమాప్తునిగ నడపనాదట నిన్నున్.
సారంగ. 7. 161.

2. పరివారము.

కం. మునుకొని తత్ప్రకృతంబున, దన శక్తియు దేశకాంధగన్నము నృపవ,ర్తవమును రాణువ సంచును, గని మాటాడంగవలయుఁగద సభలోనన్.
శుక. 196.

చం. సరసుఁడు మంచివాఁడు గుణశాలి వివేకి పరోపకారి యం, దటికిని రైనవాఁడు నెఱదాత మహాత్ముఁడు నేతగాఁడు నే,ర్పరి యని రాతు రాణువలు బంధువులున్ గొనియాడ నెప్పుడున్, మెఱయుచు నుండుఁ జూచియును మేమిఁక వేఱ నుతింప నేటికిన్.
మల్లుపు. 1. 25.

రాత. సం. వి. అ. స్త్రీ విహారిణి, తిరుగు వలవాటు గల స్త్రీ.

**రాతనము.** వి. (రాయి+తనము.) శిలాత్వము, రాతితనము

సీ. సుమనోవతంసమౌచును బుణ్యజను౦కీ దని మిషేంద్రమణి రాతనమదెంద. దశా. 1. 62.

('రాజుతన' మని రెండవ యర్థము.)

సీ. భారతీనాథుండు ప్రణతచింతామణి రాతనం బూనియు రక్తినెరవు, ... గీ. అతని భజి యుంప మనకోర్కులబ్బుటరుదె.

ఉ. రా. 2. 159.

(ఇట రెండవ యర్థమున 'రాజసత్వ' మని భావము)

**రాతపము.** సం. వి. అ. న. రాగపాకబము. (వై. ని.)

**రాతబిసి** వి. (రాచే+తబిసి). రాజర్షి, విశ్వామిత్రుఁడు.

కం. అడుగుం దమ్ములు గూరిమిఁ గడిగి తగం గాఁచవించి కరమరుచు నిప్పుడు వచ్చిన పని యేమని, యడిగిన రాతబిసిఁ జూచి యాయన తోడన్. యయా. 3. 4.

**రాతము.** సం విశే. (అ ఆ అ.) ఇవ్వఁబడినది. వి. న. దానము.

**రాతి.** సం. వి. ఈ. స్త్రీ. = రాత. (కే.ని.).

**రాతికొడుకు.** వి. (రాయి+కొడుకు). మండూకము. కప్ప.

గీ. విషమశరుఁడేయు తూపుల వేట్ల నెన్ను, వాఁడు వాథూలముని శాపవర్ణితతుల, రాతికొడుకైన యిల్వలా రాతిచుట్టు, మనసు గరగించి మమ తలఁక్షెవఁగెఁ గాన. పాండు. 5. 314.

విశే. నిశ్చలుఁడు.

గీ. గొంటుబావఁడు తారాతికొడుకుఁబోలె, వట వలకులోను గాకయుండుటకుఁ దోడు, వన్ను వదవద వణఁకించి నలఁపవలసి, వర్ష మిదె యూఁదయును దాను వచ్చెననుచు.

విప్ర. 3. 66.

**రాతిగొరక.** వి.(రాయి+గొరక.) మత్స్యవిశేషము.

సీ. ... మినికల్లిరుజుతేలు మీనుదొల్లిక రాతిగొరక మారవుమును గుంటముక్కుగీ మోర పక్కియ దొండును... హంస. 4 187.

**రాతిపోటు.** వి (రాయి+పోటు). త్రవ్వినపుడు భూమిలోపల రాయి తగులుట.

గీ వెల్లితలగాక క్రిఁజెవల్ వేరువరువు, రాతి పోటునులేని భారాటినేల. విప్ర. 2 18.

**రాతిబదనికె** వి. (రాయి+బదనికె) పర్వతముల పైఁబుట్టు ఔషధివిశేషము.

సీ చోఁటవవప్పు సితశర్ఘూముల్ ద్రాక్షలు తేనె కావళ్లు రాతిబదనికెలు. ప్రబంధ. 133.

**రాతియుప్పు** వి. (రాతి+ఉప్పు.) సముద్రమందు పుట్టెడియుప్పు, అక్షీబము (శ. ర.).

**రాతిరి** వి (సం. రాత్రిః) రేయి, నిశి

ఉ రాతిరి మూషకంబు వివరం బొనరించి కరండ బద్ధమై, భీతిలిచిక్కి యాఁపడెడి పెద్దయు డస్సిన పాముపాత సంపాతముఁ జెందె దానిఁ దిని పాము దొలంగె బిలంబుత్రోవనే

భర్తృ. 1. 88.

గీ. మొగులుమై చీకటుల నెక్కుఁజిగి మెఱుఁగులఁ బగలు రాతిరి రాతిరి పగలుచేసె

ఆము. 4. 109.

సీ. రెయిరేయిరాతిరి రేతిరనఁగను రజని పొల్పును. ఆం. భా. 1. 94.

**రాత్రకుఁడు** సం. వి. అ. పుం ఒక సంవత్సరము లంజెయింటఁ గాపురముండు వాఁడు (కే. ని )

**రాత్రి.** సం వి. ఇ. ఈ. స్త్రీ. 1. రాతిరి, రేయి. 2. పసుపు.

**రాత్రించరి** సం. వి. ఈ స్త్రీ. రాక్షసస్త్రీ.

**రాత్రించరుఁడు,** సం. వి. అ పుం రాక్షసుఁడు.

**రాత్రిందివము** సం అవ్య. రేయుంబవలును. అవిచ్ఛిన్నముగా, విరామములేకుండఁగా.

**రాత్రిక** సం. వి. ఆ. స్త్రీ. రాత్రి.

**రాత్రికరము.** సం. వి అ. పుం కర్పూరము.

**రాత్రికరుఁడు.** సం. వి. అ. పుం. చంద్రుఁడు

**రాత్రిచరి.** సం. వి. ఈ. స్త్రీ. రాక్షస స్త్రీ

**రాత్రిచరుఁడు.** సం. వి అ. పుం. (రాత్రులఁ దిరుగువాఁడు.) 1. చోరుఁడు, దొంగ. 2 రాత్రుల యందుఁ గావలి తిరుగువాఁడు, రాత్రులందు ప్రహరితిరుగువాఁడు 3 రాక్షసుఁడు, పిశాచము.

**రాత్రిజము.** సం. వి అ న నక్షత్రము (విలక్ష్యమ్సు)

**రాత్రిజలము.** సం. వి. అ న మంచు, హిమము, (ఆ. ని.)

**రాత్రిజాగరదము.** సం. వి అ పుం. (రాత్రుల నిద్ర గానీయనిది). మశకము, దోమ,

**రాత్రిజాగరము.** సం. వి అ. పుం 1. కుక్కుటము, కోడి 2. శునకము, కుక్క (కే. ని)

**రాత్రిపుష్పము** సం. వి. అ. న కలువ

**రాత్రిమరుఁడు.** సం. వి అ. పుం. యమదూత యగు రాక్షసుఁడు (త్రి. ని.).

**రాత్రిమణి.** సం. వి. ఇ. పుం. 1. చంద్రుడు, 2. కర్పూరము.

**రాత్రివానస్సు.** సం. వి. స్. న. 1. రాత్రులఁ గట్టు కొనెడి వస్త్రము, 2. చీకటి, అంధకారము.

**రాత్రివిరామము.** సం. వి. అ. పుం. ఉషఃకాలము, అరుణోదయకాలము.

**రాత్రివిశ్లేషగామి.** సం. వి. న్. పుం. చక్రవాక పక్షి.

**రాత్రివేదము.** సం. వి. అ. పుం. కోడిపుంజు.

**రాత్రివేది** సం. వి. అ.పుం. కోడిపుంజు.

**రాత్రిసత్రము.** సం. వి. అ. న. ఒకానొకయాగము (వాచ.).

**రాత్రిహాసము** సం. వి. అ. పుం. తెల్లకలువ, శ్వేతోత్పలము.

**రాత్ర్యంధుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) రేచీకటి వాఁడు, నిశాంధుఁడు,

**రాధ.** సం. వి. ఆ. స్త్రీ. 1. గోలోకమందుండు పరమాత్మకు అర్ధాంగియైన శక్తి. 2 కృష్ణుని ప్రియురాలగు గోపిక. 3. కర్ణుని పెంచిన తల్లి—అధిరథుని భార్య. 3. విశాఖానక్షత్రము 4. వైశాఖ శుక్లపౌర్ణమాస్య.

**రాధంతరి.** సం. వి. ఇ. పుం ఐరావతము ఇంద్రుని యేనుఁగు (వై. ని.).

**రాధన.** సం వి అ. స్త్రీ. పూజనము.

**రాధనము.** స వి. అ. న. 1. సంతోషము, తృప్తి. 2 సంపాదించుట, పొందుట. 3 సాధనము,

**రాధము.** సం. వి. అ. పుం. వైశాఖమాసము. విశే. (అ. ఆ. అ.) విశాఖానక్షత్రమందు జనించినది. (కే ని)

**రాధస్సు** సం. వి. స్. న 1. అన్నము, 2. ధనము. (కే ని.)

**రాధారమణుఁడు.** సం వి. అ. పుం కృష్ణుఁడు. (శ్లే, రాధాకాంతుడు మొ.).

**రాధి.** సం. వి. ఈ. స్త్రీ, వైశాఖ శుక్ల పౌర్ణమాసి.

**రాధిక** సం వి. ఆ. స్త్రీ. రాధ.

**రాధేయుడు,** సం. వి. అ. పుం. కర్ణుఁడు, రాధాపుత్రుఁడు.

**రాద్ధము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. వండఁబడినది, పక్వముచేయఁబడినది. 2. సిద్ధము చేయఁబడినది.

**రాద్ధాంతము.** సం. వి. అ. పుం. సిద్ధాంతము, స్థిరపఱుపఁబడిన విషయము.

**రాద్ధాంతితము.** సం. విశే. (అ. ఆ. అ.) సిద్ధాంతము చేయఁబడినది, సప్రమాణముగా స్థిరపఱుపఁబడినది.

**రానిరాఖారి.** వి. (రాచ + నిరాహారి) రాజర్షి. విశ్వామిత్రుఁడు.

గీ ఎల్ల చెట్టులు వలర నబ్బల్లిదంపు, రానిరాహారి నెల మన్కిగోన మెఱయు ...

అచ్చ. రా. బాల. 117

**రాపట్టి.** వి. (రాచ + పట్టి) రాజకుమారుఁడు.

కం కనుమూసినఁ గనువిచ్చినఁ, గనుపుల నిలుకాని వ్రాయఁ గణఁగిన నేవేఁల్పును దలఁచిన రాపట్టియ, కనుపట్టెడు నెట్టులోర్వఁ గలఁ గలకంఠి
రా వి 4. 22

రాపడు[1] అ. క్రి. (రాయి + పడు) 1 రాయి యగు రాయివలెనగు

మ. శమి మూర్ధన్యురాణి రాపడినమై జాడ్యంబు ముక్కోటి చాపమునం గల్గు గురుత్వమామరవ రావత్వంబుకన్దృష్టి వార్ధి మహోదగ్ర ద్వేష దోషము గ్రదశవక్త్రభృత్ రోషారమున్, శమ మొందింపఁగ నెజ్జెరాలయిన కాంతన్ భక్తి భావించెరన్. చంద్రా 1 2.

చం. చొరని బిలంబులున్ వెదకఁ జూడని క్రంతలుఁ గాలు రాపడం, దిరుగని త్రోవలుం గలవె చేరిన యీనురికోటి కచ్యుతా ...
ఉ హరి. 1 181.

2. దృఢపడు, గట్టిపడు.

ఉ.. సూత్రి మోపికుం, ఒట్టుచుఁ దెట్టియల్ దరులు బల్పుగఁ జేర్చుచుఁ గట్ట రాపడని మెట్టుచు యోజనార్ధశత మాత్రము గట్టిరి వాఁడు వానరుల్. భా. రా. యు. 272,

రాపడు[2] అ. క్రి. (రాపు + పడు) రాపిడిపడు, రాపుడుపడు.

శా పగ్గంపున్ బలుబిల్వ రాపడఁగమన్ బ్రాఁగెంపు జూచాయలన్. డిగ్గం ద్రావిన వారుణాబ్జ గృహవాటీభాగ్రమాసంచల, ద్దృగ్గాఢ స్తనకుంకు మద్యుతులతో ... ఉ. రా. 4 253.

సీ. బింకంపు పానులవంక రాపడి నెంవంకపై. బూనిన వానిమాని .. వసు. 1. 76.

రాపడు.[3] అ. క్రి. (రాడు + పడు.) బ్రామ్పడు స్తంభించు.

గీ. రాపడియె సామమతి సాంద్రతాపమునఁ గ. రంగె హేమాభిధాన నిర్ఝరలతాంగు, లిట్టు దనుఁజూచి సిగ్గుపాటెనయ వినయ, వినతయై యున్న నగరాజతనయఁచేరి. వసు 5. 14.

రాపాడు న క్రి. (√రాయు). రాయు.

మ. వలిఁగేల్దమ్ముల చాయఁగెంపులబలెవ్రంటిల్లు నమున్త్రిత్తియం,బులు రాపాడుచు దోయిలింపుచును... దలఁ బ్రాలోర్వినె నెంతరాచే నెలకున్ దార్త్యాకార్యం దగన్. యయా. 4.111.

అ క్రి. ఒరయు.

సీ. తలకెక్కు వలపునఁ దగులు శూర్పణఖ ముక్కును చెవుల్ రాపాడుకొనిన చోటు.
సారంగ. 1. 109.

అ. అన్నగంబు పొంతఁ బన్న గాభరణుని,నిలయ మొప్పు వప్రవలయ మొప్పు. గోపురంబుతోడ నేపున రాపాడు, గోపురంబుతోడఁ గోమరు మిగిలి. విక్ర. 5. 71.

రాపిడి. వి (√రాచు) సంఘర్షణము, ఒరయిక (దీని యామ్రేడితరూపము 'రారాపిడి')

సీ. మూలాశ్మ సంఘాతముల రాపిడిని జేసి కమ రంబు సుఖయించి కన్ను మోడ్చె.హరి. 6.60.

శా. రారంపిళ్ల భుజాంగదంబుల మణుల్ రాలంగ సిద్యాహరుల్, గారా మొ . . స త్తి కొంద్రు వను... మను వ. 4 26.

రాపు. వి. (రాచు). 1. రాపిడి, సంఘర్షణము. (దీని యామ్రేడితరూపము. 'రారాపు.')

గీ రంభ రంభాగ్రమఫల సమగ్రంబు గాఁగ, నమృత దివ్యాన్నభిక్ష కామారికొసఁగె రాపుఁ జిన్నుల వడుమ రారాజుపట్టి, పట్టి యొత్తిన నఖరేఖ బయలుపడఁగ. హర. 5, 43..

చం. .. ఉల్మగఁ దమినింగ ద్రొక్కు వగ తక్కులు టెక్కులులేని . . . కల హించి మించు పెనురాపులు . . . నేఁచ నెమ్మదిన్. శుక 3. 378.

సీ. రతిదేవి నెవ్వగు రారాపుఁ జన్నులు గఁడ కమ్మ లకు నివుగడలు కొలువ ... నైష. 7. 41.

మ... వా. నకికే యీడగు రాజుఁ జూచి మయి పెంచ్చనే మట్టుగాకున్ననా, రవికే కాదిది యేఁడి యుని సఖిన్ రారాపుఁ జేసెం గడున్. రా. వి. 5. 62.

కం. రారాపు లేల సేసెదు, రారా నను౯ జలువ కలువ రారామేడన్, రారాయని చలిరాకు జి,రారాయని కేళి నేలరా రాకొమరా .
సారంగ 2 128

2. నింద, అవ్వ.

ఆ. ఓ కుమార యిట్లు వోకుమారాపులి౯, దేకుమా రహస్యదేశికులకు, నీకు మారమణుని నెయ్యంబె తగునుగా. నీ కుమారమణుల నెయ్యమే౯.
శుక. చరిత్రము 2. 144

జ: రావడు².

రాపుడు. వి (రాచు) రాచుట (శ ర.).

రాపుడురాయి. వి (√రాపుడు) గోడలు లోనగునవి నునుపగుటకై రాచెడు రాయి (శ ర.).

రాపులుఁగు. వి. (రాచే + పులుఁగు.) కంకము, రాబందు.

గీ. కాకములు రాపులుఁగులును గ్రద్దలునువ్వ,కం బులును మానసము వికలంబు సేయ.
భార. స్త్రీ. 2. 9.

ద్వి. కొక్కెర బెగ్గురుకొంగ రాపులుఁగు...
ద్వి. హరిశ్చ. పూ. 623 సం.

రాపూవు వి (రాయి + పువ్వు) అశ్మపుష్పము.

గీ. ...రాపూవనంగ నశ్మపుష్పంబు వెలయును.
ఆం. భా. 2 61.

రాపొడి. వి (రాపు + పొడి.) ఆకురాయి మొద లగువానితో రాచిన బంగారు మొదలయిన వాని పొడి.

గీ. ... నీరజాప్తు, సానఁబట్టిన రాపొడివల్లి.
మనుచ. 2. 36.

సీ. ... రాపొడి నా పృష్టరజము చెలఁగు...
ఆం. భా. 2. 275.

రాబందు వి. రాచపులుఁగు. (శ. ర.)

రాబడి. వి. (వచ్చు.) వచ్చేబడి, ఆయము (శ. ర.).

రాభస్యము. నం. వి. అ. న. 1. సంతోషము, ఉల్లా సము. 2. సాహసము, 3. బలత్కారము, తీవ్రత.

రామ. నం వి అ. స్త్రీ. 1. అందకత్తె, మనో హారిణియగు యువతి 2. గీతాదికళలలో నైపుణ్య ముగల స్త్రీ. 3. ఆఁడుది, స్త్రీ. 4. ఇంగిలికము. 5. ఇంగువ 6. ఒక విధము గోరోచనము 8. గైరి కము, జేగురు. 8. నది, ఏఱు. 9. అశోకము (వృ వి.) 10. శ్వేతకంటకారి (వృ. వి.). 11. గృహకన్య, కలబంద (వృ. వి). 12. జాల చిలుబొద్దిచెట్టు (వృ. వి.) (వాచ)

రామందాడి వి. (రాముని + దాడి) అసంఖ్యము.
(చి. ని, శ. ర.)

రామకర్పూరకము నం. వి. అ. పుం. 1. తృణవిశే షము. ఒక విధమగు తృణము.

రామకుఁడు. నం. వి అ. పుం. 1. బట్టలు కుట్టుట చేతను రంగులు వేయుటచేతను జీవించు వైదేహ కుఁడు 2. దౌత్యముచే జీవించు మాగధుఁడు, (కే. ని)

రామక్రియ వి. (సంగీ.) ఒకానొకరాగము, ఇరువది నాలుగు నపుంసక రాగములలో నొకటి.

సీ. రామక్రియయు మేళరామక్రియ వసంత సామంత శుద్ధవసంత మధ్యమాదులు...
ప్రబంధ. 69.

సీ. ...రితి, గౌళ రామక్రియ మేళరామక్రియ గౌళ నారాయణగౌళ... హంస. 5. 124.

రామఖల్లి. వి. (సంగీ.) ఒకానొక రాగము.

ఉ. ...ముఖారి దేవగాంధారి వరాళి కన్నడ ధనాసరి ఘూర్జరి పూరిబేగడా, యారభి రామ ఖల్లి మొదలై తగురాగము లింపు మీఱఁగన్...
చెన్న 2. 236.

రామగిరి. నం. వి. ఇ. పుం. ఒకానొక పర్వతము, చిత్రకూటపర్వతము, (వాచ)

రామచంద్రుఁడు. నం. వి. అ. పుం. రఘురాముఁడు, దశరథుని జ్యేష్ఠపుత్రుఁడు.

రామచిలుక. మి. వి. (వామ + చిలుక) ఒక జాతి చిలుక.

కం. కింజాత రాగమణిగణ, సంజాతరుచిచ్ఛటావి
శంకట మగుచున్, తంజిలు పంజరమా నృప,
కుంజరుఁడా రామచిలుకకుం దగనిచ్చెన్ ..
రాజ చ. 189.

సీ ధఃరామచిలుకతో సరి యాకు చిలుకైనఁ
బడఁతి పల్కుల సరి పైకమగును ...
చంద్రా. 4. 105.

**రామరము.** సం. వి. అ. పుం వ. హింగువు ఇంగువ 2. అంకోలము, ఊడుగు (వృ. వి ).

**రామరి.** సం. వి. ఈ స్త్రీ. నాడీహింగువు, ఒక విధ మైన ఇంగువు

**రామణీయకము** సం. విశే అ ఈ. అ. అంద మైనది, మనోహరమైనది

వి అ. న. మనోహరత, అందము.

**రామతమ్మ** వి. శుకము, చిలుక.

ద్వి. చెంగటి ముద్దరాచిలుక లాలించి, తమ్మఁ
బెట్టెవ రామతమ్మ నా ముద్దు, గుమ్మ మా
టాడరా .. ద్వి. పరమ 2 నర పా.

గీ జీవపదమైన నమఁబాసి సీమగాని, సీమఁజరి
యింపఁ దగునటే రామతమ్మ ... తపతీ. 3.22.

**రామతాడు.** మి. వి. (రామ + తాడు) పెద్దతాడు. (వృ. వి.) (శ. ర.).

**రామదాసు.** వి. పక్షివిశేషము (శ. ర.)

**రామదూత.** సం. వి. అ. పుం. 1. హనుమంతుఁడు. వానరము.

**రామదూతి.** సం. వి ఈ. స్త్రీ. తులసీభేదము, రామ తులసి.

**రామనవమి.** సం. వి. ఈ. స్త్రీ చైత్రశుక్లనవమి, శ్రీరామజన్మదినము.

**రామన్న** మి. వి. (రామ+అన్న) శుకసంబోధనము నుపయోగించు మాట

సీ. రామన్న యిట్టి విరాలితాళఁగఁజాల బొబగు
చెల్లెలి ప్రేమఁ జూడవోయి, రామన్న చూచి
తిరముగా శుభస్య శీఘ్రంబన్న వార్తలోఁ
గాంచవోయి, రామన్న గాంచి ద్వారవతీ పురం
బున కతివేగశాలివై యరుగవోయి,...
చమ. 3. 21.

**రామన్నాట** వి. బాలక్రీడా విశేషము.

సీ. ... చెమ' .కా యెత్తుగొడుగు బొంగరములు
రామన్నాట పాడుగుళ్లు... హంస 3. 46.

**రామపూగము.** సం వి. అ. పుం ఒకదినుసు పోఁక, నిడుపుతొడిమగల పోఁక (వృ వి.).

**రామబాణము.** సం. వి. అ. పుం 1. మల్లబంధ విశేషము.

వ. విష్ణుచక్రంబును, రామబాణంబును, నాగ
బంధంబును, తొలకరి మెఱుపును ...
మల్లువు 3. 69.

2 తాటాకు పుస్తకములను గోటికివేయు క్రిమి విశేషము 3. పుష్ప విశేషము (శ. ర.).

4 ధాన్య విశేషము

వ గంగాజలములు కేసరలు చంద్రవంకలు వెన్న
ముద్దలు దాళువాళు నాఁళ్లు రామబాణాలు
కకాఁకులు . ప్రబంధ 112.

సీ రామబాణాలు రెక్కామలు వెన్నముద్దలు
జిల్మెబుడములు దాళువాలు . హంస. 4.128.

**రామభద్రుఁడు.** సం. వి. అ. పుం రఘురాముఁడు. దశరథపుత్రుఁడు.

**రామము.** సం. విశే. (అ. ఆ అ.) 1 అందమైనది, సొగసైనది. 2 నల్లనిది. 3. తెల్లనిది 4. ప్రధా నము, ముఖ్యము (శే. ని ).

వి. అ. పుం 1 పెద్దదుప్పి, మృగభేదము

న 1 కుష్ఠము. 2. తమాలపత్రము . 3 వాస్తూ కము, ఒకానొక కూరాకుచెట్టు. 4. రతిక్రీడ, 5. ధ్వజము 6. శబ్దము 7 మౌళి, శిఖ. 8. లక్ష్మి, చిహ్నము (శే ని )

**రామలక్ష్మణులు.** సం. వి. అ. పుం. బ. ధాన్య విశేషము.

చ. ... జున్నుఁప్రాలు చిన్నిచుక్కలు కళింగలు
వంగపరులు జగన్నాథప్రియములు రామ

లక్ష్మణులు కలియుగమహిమలు కానరలు ...
ప్రబంధ. 112.

రామలవణము సం. వి. అం. న కాంభరి లవణము (వాచ.)

రామలు. వి. బ. మత్స్య విశేషము.
(చి ని, బ్రౌ, శ. ర)

రామవల్లభము. సం వి అ పుం భూర్జపత్ర వృక్షము (వ్ర.వి).

రామశరము. సం. వి. అ పుం. శరవృక్షభేదము. (వ్ర వి.)

రామసఖుఁడు సం వి అ పుం సుగ్రీవుఁడు.

రామసాగరములు. సం వి అ. పుం. బ. ధాన్య విశేషము శ. ర).

రామసింగు మి వి త పాటవంటి యద్ధసాదనము

సీ రామసింగుల భీకరములైన మ్రోఁతలు యుఱవడి యుఱుముల తెఱఁగు నిప ...
(రంగా. 3. 112.)

రామానుజుఁడు. సం వి అ. పుం వైష్ణవమతగురువు ఇతఁడు ప్రఖ్యాత సంస్కర్తయు విశిష్టాద్వైత వేదాంత మతస్థాపకుఁడను, బహుగ్రంథరచయిత (కర్త)యు

రామాయణము సం. వి. అ. న. రామచరిత్ర. (ఏడు కాండములుగా నిరువది నాలుగువేల శ్లోకములు గలదియు, వాల్మీకి రచితమును, రామచరిత్రాత్మకమునగు ప్రసిద్ధ కావ్యము)

రాముఁడు, సం వి అ. పుం. 1 జమదగ్ని పుత్రుఁడగు పరశురాముఁడు, భార్గవరాముఁడు. 2. కౌసల్యా దశరథుల పుత్రుఁడును, రామాయణ కథానాయకుఁడువగు శ్రీరాముఁడు, రామచంద్రుఁడు, రఘురాముఁడు 3. వసుదేవ పుత్రుఁడును శ్రీకృష్ణ సోదరుఁడు నగు బలరాముఁడు.

రాముని. మి. వి. (రాచ+ముని). రాజర్షి, విశ్వామిత్రుఁడు.

క నీ రాముని లక్ష్మణుతో, నీ రాముని వెంటఁ జనుపు వింక నితనిచే, నీరజనిచరయగు ధర, నీరజహితవంశరచిత నీ కేమిటికిన్ ..
చం రా 2 68.

రామురాము వి నమస్కారవిశేషము.

రగడ. పార్థస్థలమున జాగవసించు పరబ్రహ్మ మునకు రాము రాములని ... హంస 4. 214.

రాముల్క. వి (రాచే—ముల్క.) సర్పాక్షి (వ్ర వి.)-

సీ. . వాఁకుడు వాఁ బిన్నముఁకవాఁగను నేల ముల్క యనఁగ. రాముల్క నాఁగసర్పాక్షి ప్రబలు... ఆం భా. 2. 49

రామేశ్వరము సం. వి అ. పుం. దక్షిణదేశము నందుఁగల యొక పుణ్యక్షేత్రము

రాయ(ఁడు.) వి. 1. ప్రభువు, రాజు.

క. ఓ రాయఁడ యీ యంగద, కోరువ లేకింక వచ్చె నూళ్లన్నియు ... నీలా. 2 58.

సీ. కడిది రాయ కుమార గండపెండేరంపు రవళి కంచుకిలోక రవముగాఁగ ... సారంగ 2.35.

సీ. చెలికత్తెయగు మంచుమలపట్టి పోరామి గీలు కొల్పిన రాయగేస్తురాలు... ప్రబంధ. 2 (రాయగేస్తురాలు = రాజపత్ని.)

ఉ ఆ యొలనాగవేణి మెఱుఁగారు కటారికి మానటీఁడగున్. బోయనవచ్చు వమ్మె ఱుఁగుఁ బోఁడిపిఱుఁదు సమస్త భూమికిన్, రాయ ననఁగవచ్చు ...
విజ. వి. 1. 119.

ఉ. కన్నడరాయ యిక్కొడువఁగన్న ప్రియా పరభుక్తభాక్కథన్... అము. 1. 14.

మ . పద్మిని కరాంభోజంబునన్ మందమం, దపట ద్వాయుచలద్దళాంగుళులు గన్పట్టంగ నవ్వెల్లు రా, యని రారాయని పిల్చెనాఁదగె ద్విరేఫాద్యంతదీర్ఘధ్వనుల్.
విజ. వి. 1. 139.

సీ. ఏకిమీఁడు పాదుసా యేలిక మన్నీడు సాహేబు రాయఁడు సామి పబువు, ... రాయలు ...

ఱేఁడన వర్తిలు నృపుపేళ్ళ ...
సాం. ని. మాన. 11.

మ......నలుమోమయ్య హాటాహుటిం గదలెఁ
జెంతం జేరి జేజేల రా,యలు సాహోయని
హెచ్చరింప... దశా. 2. 67.

(ఇట శ్లేషార్థకము.)

సీ. ... కడలిరాయలు లోఁతు గన్న గబ్బి ....
మనుచ. 5 47.

(ఇట శ్లేషార్థకము.)

సీ. దర్పకాకార దాతలరాయ యని వెంటఁబడు
బట్టువారికిఁ జాఱవైచి... శుక. 4, 111.

(ఇట శ్లేషార్థకము.)

2. కొన్ని యెడల సంజ్ఞావాచకముల తుదిని ప్రయోగింపబడు బిరుదము.

మ. ... ముఖం,బున దీర్ఘాయువు నిచ్చుఁగావుత
గుణాంభోరాశికిం గృష్ణరా,యనికి న్వారణ
రాజవక్త్రుఁడు కృపాయత్తైక చిత్తాబ్జుఁడై ...
పారి. 1, 3.

చ. ... ... పాల్కడలి ముద్దులపట్టి నృసింహ
కృష్ణరా,యలఁ గరుణారసంబు నిమపారెడి
చూపులఁ జూచుఁ గావుతన్ .... పారి. 1. 6.

ఉ. .... శాంబరీ, ఖిల్లుఁడు కృష్ణరాయల కభీష్ట
శుభప్రతిపాది గావుతన్ .... మనుచ. 1.2.

గీ. .... ఆ నృసింహప్రభుండు తిప్పాంబవలన,
నాగమాంబిక వలన నందనులఁ గాంచె, వీర
నరసింహరాయ భూవిభుని నచ్యు,తాయ
తాంశజు శ్రీకృష్ణరాయ నిన్ను.
ఆము. 1. 81.

రాయదొంగ = రాజాజ్ఞ వలన దొంగతనము చేయువాఁడు.

ద్వి. అనుపములైన యేకాంగ వీరులను, రాయ
దొంగలఁ జౌర్యరసిక శేఖరుల, నాయెడం బిల్చి
రహస్యంబునందుఁ,బన్ని యీ మూఁడవప్రాసా
దమింక, నెన్ని లాగులనైన నీడేర్పవలయు,
... ద్వి. పరమ. 7. 619.

జ. రాయబారము, రాయబారి, రాయమెచ్చులు, రాయటికము, రాయనము, రాయనరులు.

రాయంచ. వి. (రాచ — అంచ) (సం. రాజహంసః) కాళ్ళను ముక్కును ఎఱ్ఱగనుండు తెల్లజాతి హంస.

సీ. రాయంచ యొయ్యంచుఁ జీరకు జోకయగుఁగాక
పర్వయేనిక తోలుపచ్చడంబు, ...
హర. 4. 28.

క. రాయంచ మందగతిఁ జను, వాయసమతి తీవ్ర
భంగివలను మెఱసి తీ,లాయితము లొప్ప
బహుగమ, నాయాసము నొంది పఱచువగ్గలిక
మెయి న్... భార. కర్ణ. 2,65.

ఉ మించిన వేడ్క వీనులకు మిక్కుటమై మధు
వృష్టి గ్రమ్మ రా,యంచలు కూయఁ గ్రౌంచ
మును నావలఁ గూయఁగడంగు భంగిఁ
బ్రౌ, ఢాంచిత శబ్దసారులు మహాకవు లాద్యులు
కావ్యశయ్యఁ గీ,లించిన కీర్తి నంగసుఖలీలకు
నేమను గాంతుఁ జేసితిన్. నృసిం. పీఠి 13.

రాయంచగిండి. వి. (రాయంచ + గిండి) రాయంచ వలె నుండు గిండి, జారీ.

సీ. పడమటి వన్నిటి కుడినీరు రాయంచగిండులు
చెంగటఁ గీలుకొల్పి, ... దశా. 7.276.

రాయడి = రాయిడి. వి. (√ రాయు.) బాధ. ఉపద్రవము.

గీ. అస్మదాదులు సేయు రాయడి సుపర్వ,
లచ్యుతునితోడఁ దెలిపినారనియొ భయముఁ
జెందెదవు గాని ... ఉ. రా. 2, 19.

ఉ. మాయకుఁడైన యస్మదరిమండల నాయకుఁ
డిందుఁ గల్గుటన్, రాయడిపుట్టు నన్న
విధురంబగుబుద్ధి నిరామితక్కఁగన్ ...
రంగా. 2. 152.

రాయణము. సం. వి. అ. న. బాధ, నొప్పి. (విల్లమ్సు.)

రాయబారము. వి. √రాయ. (సం. రాజభారః.) దౌత్యము, దూతకృత్యము.

ఉ. ఆ వరమోపకారనిధి యప్పుడు వేల్పుల రాయ
బారమున్, మోపువహించి...
నైష. 3. 76.

గీ. అది గణింపఁగనేమిఁక నమరనాథుఁ, డాది
దిక్పతు లొకరొకరనుప రాయబారముల సంచ
రించు నానారదునకు, దినము నొకచోట
నిల్వఁగాఁ దీఱదయ్యె ...
ఉ. హరిశ్చ. 2. 48.

గీ. రాయబారంబు వచ్చితి రాజవేంద్ర, యచల
కవ్యక పనుప వింధ్యమున నుండి...
కాశీ. 6. 217.

సీ. రాయబారియనంగ రాజదూత యగుఁ దద్భా
వంబు తగు రాయబార మనఁగ, ...
ఆం. భా. 2. 189.

రాయబారి. వి. (రాయబారము + ఇ[3])· రాయ
బారము నడుపువాఁడు, దూత.

గీ. రాజరాజులు పంపిన రాయబారు, లొక్కవంక
విలాసిను లొక్కవంక, బలసి కొలువంగ నతుల
వైభవముతోడ, రమణఁ గొలువుండె జనవయ
రాఘవుండు... వి. పు. 1. 17.

సీ. గజపతి నరపతి జాఘ్మైఖర్తలంపిన యొడికంపు
రాయబార్లొక్కవంక ... తపతీ. 1. 14.

ఆ. రాత్రి గాని కావరా దులూకములకుఁ బగలు
గాని కానఁబడదు మనకు, రాయబారి సంధి
చేయుటకై పోవఁ గాలమెద్ది పొందుగాదు
తలఁప ... నా. పంచ. 3. 35.

సీ. రాయబారి యనంగ రాజదూతయగు ...
ఆం. భా. 2. 189.

రాయమెచ్చులు. వి. బ. (√రాయ). ధాన్య
విశేషము.

వ. మధురంములు చామరాలు పెండెముడుపులు
రాచవన్నెలు తులసీవనమాలికలు పింధు కర్పూ
రాలు రాయమెచ్చులు యేఋమల్లెలు ...
ప్రబంధ. 112.

రాయటికము. వి. (రాయ+టికము.)1.రాజత్వము,
క్షత్రియత్వము. 2. రాట్త్వము, ప్రభుత్వము.

సీ. రాచటికమ్మన రాయటికమ్మన రాజరాడ్భావ
కర్మములు వెలయు. ఆం. భా. 2. 182.

రాయశృంగారములు. మి. వి. బ. (√రాయ) వస్త్ర
విశేషము.

వ. .... వసంత విలాసంబులును రత్నకీలితంబులును
రాయశృంగారంబులును తారామండలంబులును
నాగజావళులును ... అను పేళ్లుగల పుట్టం
బులు ... ద్వా. 3. 188.

రాయసము[1]. వి. (√రాయ.) క్రివి. రాచక్రివి.

గీ. చలువ దుప్పటి వలెవాటి వెలయరాయ,సమున
నెదురేఁగి ... దశా. 1. 98.

సీ. తలవాఁకిటను రాణ్కినిలిపి సమ్మతిఁ జెందెఁ దన
రాయసమునకుఁ దప్పు గాదె ...
ఇందు. 1. 145.

సీ. హెచ్చు చీరలఁ గళ్ళనింటికిఁ బంపించి వెమక
వర్తకుఁ డాడు వెల యొసంగు ...

గీ. రాయసమ్ములు నరికమ్మ వ్రాయఁదగదు,
విశ్వకర్మకటంచన వినక మీరు, పడుక యిలు
కట్టుడంచని బళువు చాటుఁ, బ్రాథమిక కామినీ
భోగవరత నతఁడు ... పార్వతీ. 1. 62.

రాయసము = వ్రాయసము. వి. 1. రాజలేఖ,
జాబు.

క. జనకనృపు నుత్తరంబని, జనపతికిం దెలిపి
రాయసము వ్రాయ నియోగిని బిలిచి
యొసఁగ నతఁడును, జనపతి కనుసన్న వదియు
సరభసఫణితిన్ ... దశా. 7. 224.

మ. ... శ్రీరంగ రాయల చిత్తం బిగురింప
రాయసము వ్రాయం జాలితానా సుధీ,తిల
కుండక్కయమంత్రి వెంకటపతీ దివ్యశక్త్యా
వాక్పతీ .. ల. వి. 1. 19.

చం. హరిదపధిజమారవణు లా తురగాళి నదుళ్లు
పట్టమ్ముల్, తరువుల రాయసంబుల విధం బునే

గన్గొని శ్వేతమానవేశ్వర.పకుఁ దెచ్చియిచ్చిన సువస్తుపరంపరం దెక్కఁగూడు పె. స్వైరసుల రీతిఁ దత్సవనవీథిఖురాంకము లుండు నుర్వరన్. వరాహ. 12. 60.

సీ. కమ్మయనంగ లేఖయగు రాయసమన రాజ లేఖదగు ఆ. భా. 2. 188.

2. కార్యకర్త పని, వ్రాఁత

సీ. కలితకార్య విచక్షణులు రాయసముల్ వ్రాయు ఘనులు వాఁకిటి దండఁగాచియుండ ... ఘటికా 1. 11.

విశే. రాయసకాఁడు, లేఖరి

సీ. ... చెవిటి రాయసమైన సేవకుఁ డక్లైన వారసుగాఁడు దివానునయిన .. వేణు. శ. 46.

సీ. ఒక చక్కిరాయసహాల్ ప్రకట వాగ్వైఖరిఁ జదురులై దినసరుల్ చదువుచుండ, .. భోజసుతా. 1. 104.

**రాయసరులు (ర్లు).** వి. బ. (√రాయ) ధాన్య విశేషము.

సీ. సన్నమూదులు పచ్చగన్నేర్లు కోదండరాముల్ కేసర్లు రాయసర్లు. ... హంస. 4. 128.

వ. దాళువాలు నారళ్లు రామబాణాలు కటకసరులు రత్నసరులు జీనిసరులు రాయసరులు పచ్చదివసరులు ... ప్రబంధ. 112.

**రాయి = ఱాయి.** వి. బొ. (బ. రాలు.) 1. శిల, పాషాణము.

క. చేతఁగొని యుప్పు వములట, రాతిపయిని ముప్పుగొనుట రాత్రి దధి మధూ, పేతంబుగఁ గుడుచుట ధ, ర్మేతరములు రేయి సక్తు వెగ్గ వరేంద్రా. భార. అను. 4. 110.

ఉ. ఆ రసికాగ్రగణ్యుని సమంచిత రూపగుణ ప్రపన్నగంభీరితఁ గన్నఁ గామినుల పేరిటి రాలయినం గరంగు .... విక్ర 4. 144.

ఉ. సాలములో యవందగు రసాలములం బరిపాకలీలచే, రాలు మెఱుంగు ముత్తియపు రాలు ఖగంబుల గుంపుఁ దోలఁగా ... దశా. 1. 116.

2. పర్వతము

క సామర్థ్యము గలిగినది, కోమలి ధైర్యమువ రాతిగా తురు సుమ్మీ. . సుద. 2. 30.

రాతికిడునట్టి గిలిగింతలు = వ్యర్థములు

గీ. అతఁడు పరసౌఖ్యమునె కోరి యానఁ బొందిఁ, దిహమునం దుచ్ఛసౌఖ్యాప్తి కింత యైన, రాతి కిడునట్టి గిలిగింతలై తనర్చుఁ, గాని ప్రియురాలి చేష్టలు గలఁచ వతని .. హంస. 3. 203.

రాయిగొట్టిన గొడ్డలి = మోఁడివాఁడు.

ద్వి. ఘుటిక సిద్ధుఁడు రాయిగొట్టిన గొడ్డ, లట మటకాఁడు మహామాయలాఁడు, గడుసుతుంటరి జోగి ప్రక్కన ముడుసు ... ద్వి హరిశ్చ ఉ 649 పం.

జ. రా4, రాకట్టు1, రాకొట్టు1, రాచక్కి, రాచేట్టు, రాతనము, రాతికొడుకు, రాతిగొంక, రాతిపోటు, రాతిబదనికె, రాతిచుప్ప, రాపడు1, రాపూవు.

**రాయింత.** వి. (√రాయు) రాయిడి.

ఉ ఇంతుల మోము రాయలిఁక నెచ్చటలేవుర యో హిమాంశుఁడా, యింతుల చూపు నీ శరము లెల్ల నడంచు పువ్వువిల్తుఁడా. యింతుల మేను చంపకము చేరి హరించునె మత్తభృంగ రా, యింతలఁ జేయఁగావల వదింతుల చెంతల సారెసారెకున్. గంధ. 226.

**రాయిడి = రాయడి.** వి (√రాయు). 1. ఒరియుక.

సీ. ఘనమైన రాగాపు చనుదోయి రాయిడిఁ దుంబీఫలంబు దుంగుడుకుఁ జెంద ... మను చ. 1. 5.

సీ రామంచ యొఱకల రాయిడిఁ దుప్పుం సల్లెడు కొలఁకుల చలువలందు ... నృసిం. 3. 75.

సీ ... రాయిడి రారాపు గింపసంగ, వమమర్దనం బొప్పు ... ఆం. భా. 2. 223.

2. కలహము, వివాదము

మ. కమతో రాయిడిగొన్న యున్నతుల సద్వాశంబులున్ రూపఱున్ .... హరి పూ. 6. 85.

ద్వి రావణుతో వల్గి రాయిడి పుట్టి దేవపీడొ
కర్కు( దెకెంచియున్నాఁడు ...
రం, రా. యు, 300 పా. 15 పం

క. ఘోరముగ నిట్లకారణ, వైరముఁ బూనంగఁ
దగునె వసుధాధిప యీ, యారణ్యులయిన
దనుజుల,తో రాయిడిఁగొమట మేలె దోర్గర్వ
మునన్. భా. రా యు 1. 53.

3. బాధ, ఉపద్రవము.

సీ. క్రోవిగుంటలు దక్కగుల్లలు చిక్కంగ నివిరిన
గొంగరాయిడికి మిడికి .. వేం. పంచ. 1. 294.

క. తారుగనుఁ గొన్న రాచేకు,మారుని సౌందర్య
రేఖ మరులు గొలుపఁగా, మారశరపీడి
తాత్మక లై రాయిడిఁబడుచు నాలతాంగులు
మదిలోన్. వరాహ. 1 15

క. రక్షణములేక సాధుఁడు, రక్షితుఁడగు నుత
జేసి రాయిడులందున్, రక్షణములు రెంటుగలి
గిన శిక్షితుఁడగు ఖలుఁడు పాపచిత్తు డగుటన్.
భాగ. 10 277

4. దూఱు, నింద

క బిట్టలిగి ప్రేంత లొగి, దవ, పట్టడి నంద ముంగఁ
దెల్పి రాయిడివెట్టన్ .. నీలా 1 79.

రాయిడించు. అ. క్రి. (√రాయు) 1. ఒరయు.

చ. ఇల నిజసామ్యవర్తుల పయిం దమవారిఁ
గదల్చు నాత్మహా, స్తలసిత ఖ మకుంభముల
దంభమణంపఁగ వంతువోక య,న్యులగతి
నీవు నీవనుచు నొంటక గుబ్బలు రాయి
డింపఁగా, జలకముఁ దేల్చె రిద్దులబిజాలక
నీలకచాశిరోమణుల్. రా. వి. 5. 54.

క. అంభోజముకుళ సమకుచ,కుంభంబులు రాయి
డింపఁ గోరిక లలరన్, ఖుంభావతుల నిమఁ
గడు, సంభావించెదము మాకుఁ జనవీ
వలయున్. హరివం. 2. 127.

2. కలహించు, వివాదపడు.

ద్వి. తొడరి వసిష్ఠునితో రాయిడించి, కడయక తన
ఘోరతపము పెంపునను, జడయ దుర్లభమైన
బ్రహ్మఋషిత్వ, మదరంగ ...
ద్వి. హరివం. ఉ. 2870 పం.

పంచచామరము. రమాకుమార సారె పాంథ రాజి
మెచ్చనిట్లు బీ,రమా యమాధినాథుతోడ రాయి
డించి మించి నే,రమానితార ...
కృష్ణ 4 91.

ద్వి వారక నిముఁ గొనవచ్చినవారి,తో రాయి
డించి పోదోల నీపాలె, మలకలుమాని యీ
మాలని నేలి, .. ద్వి. హరివం.ఉ. 1468 పం.

సీ. స కసావి భవన్న హరి స్తంభగర్భ స్ఫుటీకృత
పటపటల తోక గీ. నవఘుళించి విడంబి చి
హ కగించి, రాయిడించి ధణ ధణాం నము
రిత్న నానుగు ల (ప్రతిధ్వనులీన విం యు,సల హా
పటల మ చటిపించి నటు యమున. (ఇటు
ఉ మాదో్యోత ము) వరాహ 3. 26.

సీ నకనూపుర ణత్కార నిక్వాణ బన పల
మెట్టియలతో రాయిడి . (ఇటు ఉపమా
ద్యోతకము). హర. 5 44.

3. అతిశయించు

గీ పొసఁగ వజ్రంపుఁ బాట ట్టుపెట్టి, రవళి
మెట్టెం మ్రోఁతలు రాయిడింపఁ, బంచసాయకు
మోహనబాణ మనఁగ, నిందుబింబాస్య మెలఁగు
నమ్మందిరమున .... వి. పు. 6. 14.

స. క్రి. బాధించు.

గీ. అహహాయవి సింధుళకవిదేహకవనాయు, జాది
గాఁగల నిఖిలదేశాల నెల్ల, రాయిడించునె
తిరుమలరాయ వేంక,టావనీంద్ర భుజప్రతా
పాగ్ని కరణి ... చంద్ర 1. 19

రాయిడికత్తె (త్తియ). వి. (రాయిడి + కత్తె)
ఉపద్రవముచేయు స్త్రీ

ఉ. రాయిడికత్తెలైన పెనుఁబ్రామిడి యత్తల
యిండ్లఁ గోట్రముల్, సేయు విలాసిమల్
మునుకు సెందఁగ వేశ్యలప్రక్క దాపులం
బాయని కాముకుల్ ... విక్ర. 6. 73.

ఉ. ... విరాళిగాకయే, రంపెల గొట్టుగాక బలు
రాయిడికత్తియగాక యెప్పుడున్, సోంపాక
యింతలేని యెడ జూదరికత్తియగాక యెంత
యున్ ... ధనాభి. 2. 60.

రాయు. అ. క్రి. 1. ఒరయు, స్పృశించు.

సీ. రాజుల సందడి రాసిన తొడవులు మురిసి
రాలిన పొడి ముగ్గుగాఁగ.
భార. విరా. 3. 74.

సీ. వరుసఁ దరతరంబ వనములు సత్ఫలరాసు
లయినభంబు రాయుచుండు ...
కు. సం. 7. 930.

మ .. కీర్తి ప్రవాహంబు వారణగండ స్థలకుంభ
కూలములతో రాయుం దివారాత్రముల్.
నైష. 2. 42.

2. ప్రతిఘటించు.

గీ. మెఱసి మూఁడులోకంబుల మేటిమగలు, రాయ
నేర్తురె యాదవరాముతోడ. ఉ. హరి. 1. 8.

క. తారకితగగన చక్రము,తో రాసెవనంగ రేలు
తొగపువ్వుల నొప్పారె విపులనిర్మల కాసారం
బులు సారస ప్రసవ సేవ్యములై.
హరి. పూ. 7. 115.

సీ. తారకా మందార తారాచలంబులతో రాయు
నెవ్వాని చారుకీర్తి.. క్రీడా. 14.
(ఇట నౌపమ్యద్యోతకము).

3. కలహించు.

సీ. తమలోన రాసి భూధవులు చూటలు గొన్నఁ
గటము లెల్లను తోయి నెలవు వెడలి,
హరి. ఉ. 9. 56.

గీ. రజకితోడ నుదక్యతో శ్రమణతోడ, విధవతో
నాథులో రాయు వెలఁదితోడ, జెడిపెతోఁ
జాలఁ బోరామి సేయఁజనదు, ప్రాణసంకట
ములను బుణ్యాంగవలకు ... కాశీ. 2. 74.

కం. వైరులు రాయుట హితస,త్కారముపక
యనువులిచ్చెఁ దస్కరుఁడు ....
వేం. పంచ. 3. 217.

కం. భారతవర్షము వకుఁగాఁ, గౌరవులును పాండ
వులును, గాంతుం గడుఁబెల్లై రాసి యొం
డొరులతోఁ, బోరం దెగి రిట్టి లుద్ధబుద్ధులు
గలరే ... భార. భీష్మ. 1. 28.

4. రాల్పడు, (గొంతు) కంపించు.

ద్వి. రాసిన యెలుఁగును రథమార్గధూళి, ధూస
రంబగు మేనఁ దూలిపై కొంగ, తుంగస్తనంబు
లఁదోఁగ నంగంద, దొంగలి ఱెప్పలం దొరఁగు
కన్నీరు ... రం. రా. ఉ. 122. పొ. 26.పం.

ఉ. గొంతులు రాయఁ గో యనుచుఁ గూఁతలు
వెట్టిరి గ్రామ్యభూసురుల్ ... పాంచా. 2.52.

5. చొచ్చు, ప్రవేశించు.

చ. అదిమొదలీ వధూటి విరులంటదు కస్తురి
గిరుబొట్టు పెట్టదు పువుఁదోఁట రాయదు
పటంబులు వ్రాయదు .. కువల. 3. 78.

6. ప్రకాశించు.

ఉ. చొక్కి యొకింత నిక్కి బలసూదనుదిక్కున
రాయుచుండుటన్, జక్కఁగ వేఁగదిప్పుడు
నిశాసమయం బిది ... క్రీడా. 51.

■ రాపాడు, రాయడి, రాయింత, రాయిడిం
రాయిడించు, రాయిడికత్తె.

రాయుఁడు. సం. వి. అ. పుం రాజు, ప్రభువు.
(విల్యమ్సు.)

రారాజు. వి. (సం. రాజరాజః) 1. రాజులకు రాజు,
చక్రవర్తి, సార్వభౌముఁడు. (శ. ర.)

2. కుబేరుఁడు.

గీ. రంభ రంభాగ్రమఫలసమగ్రంబుగాఁగ, నమృత
దివ్యాన్నభిక్ష కామారి కొసఁగె, రావుఁ జన్ను
లనడుమ రారాజుపట్టి, పట్టి యొత్తిన నఖరేఖ
బయలుపడఁగ. హర. 5. 43.

3. దుర్యోధనుఁడు.

గీ. ...రారాజనిల్లునిలజుపకు, దుస్ససేను మంది
రము పానర్థు కు వరుసతోడ దుర్మర్షణుసీయును
దుర్ముఖునియు, నిండ్లు గవలకు సంప్రీతి నిచ్చె
నృపతి. భార. శాం. 1. 396.

గీ. చెలఁగు దుశ్శాసనుఁడు దుస్ససేనుఁ డనఁగఁ,
బ్రబలు దుర్యోధనుండు రారాజన భవ...
ఆం. భా. 2. 182.

**రారాపు.** వి. (రాపు+రాపు) మిక్కిలి యొరయిక, ఉపద్రవము.

శా. ఏ గంధర్వుఁడు దర్పవిలాసములు మున్నీక్షించి
లోనెంతయున్, రాగాంధుండయి కోరి పాత్రక
కడున్ రారాపులం గంతుఁడు, ద్వేగం బందగఁ
జేయ నెవ్వగల నువ్విళ్లూరుచు న్వేగువాఁ, డా
గంధర్వ కుమారుఁ డంగభవవిద్యాపారగుం
డాత్మలోన్. మనుచ. 3. 68.

**రారేక**[1]. వి. (రా[3]+రేక.) చంద్రరేఖ.

సీ. రారేక నుదుటిపై గిత్నాల క్రొందళ్కు రావి
రేక బెడంగు రహిఁ జెలంగ... ఇందు. 2, 141.

శా. రారేకవన్నగు చెక్కుటద్దములు దోరంబార
నానందవుం, బారావారములో మునిఁగి కులు
కుం బాలిండ్లపైఁ బల్మరున్, జీరల్జారు...
బహు, 3. 58.

**రారేక**[2]=రావిరేక. వి. 1. పిల్లలకు ముందు సిగను గట్టెడు రావియాకువంటి యొక నగ.

కం. అక్క ధరపుత్రి వాకున్, ముక్కంటికి వేలు
లేదనుచుఁ దెలుపుటకున్, మిక్కిలి కనుదాల్చిన
గతిఁ, జక్కని రారేక నెన్నొసల దరియించెన్.
వరాహ. 6, 6.

సీ. బుడుత కల్వల విందుఁబోలు నెన్నొసలిపైఁ
జెలువంపు రారేక చిందులాడ, ...
నీలా. 1. 75.

2. కర్ణభూషావిశేషము.

సీ. చెవులపువ్వు బొగడ బవిరె రారేక కుంపెన
రావిరేక మురువనఁగఁ గర్ణభూషావిశేషము
ల్పెచ్చు ... ఆం. భా. 2. 148.

**రారేఁడు.** వి. (√రాచే.) రాజులకు రాజు, చక్రవర్తి.

కం సదమదమగుచుండిరి య,మ్ముదితయు రా
రేఁడుఁ గూర్మి ముంచుకొనంగన్ ...
యయా. 5. 152.

**రాలకామ్లము.** సం. వి. అ. పుం. సాలవృక్షము.

**రాలఁగొట్టు.** స. క్రి. (రాలన్+కొట్టు) రాలుచు, రాలునట్టుచేయు (శ. ర.).

**రాలము.** సం. వి. అ. పుం. సాలవృక్ష నిర్యాసము, సాలవృక్షము యొక్క జిగురు.

**రాలించు.** స. క్రి. (√రాలు) రాలుచు, రాలునట్లు చేయు.

సీ. మావితోఁపులు పండి మహిమీఁద రాలించి
మొక్కలు మొలిపించుఁ జెక్కుగాను ...
రామలిం. 94.

**రాలు.** అ. క్రి. 1. గళితమగు, క్రిందఁబడు.

గీ. రాలియున్న పుష్పప్రకరము విదిర్చి, చెమ్మగా
నున్న సేసిన సెజ్జయనఁగ, వేగుటయుఁ జుక్క
లన్నియు విశద, భాతిఁ జెలువొందెఁ జూడ
నంబరతలంబు. భార. విరా. 2. 239.

శా. రారాపిళ్ళ భుజాంగదంబుల మణుల్ రాలంగ
విద్యాధరుల్, గారామొప్పఁగ నెత్తికొంద్రు
నను... మనుచ. 4. 76.

గీ. కృతపయఃపాన నవమేఘ పృథుకములకు
రాలె నొయ్యనవడగండ్ల పాలపండ్లు,...
ఆము. 4. 82.

శా. ... ఈ కంథచే, వేలకుల్ కనకంబు రాలు
విద్రుపన్ విశ్వంభరాధీశ్వరా ... విక్ర. 2. 7.

2. విఱిగిపడు.

శా. వాలోత్క్షిప్తగిరుల్ సురారిపురిపై బ్రాలన్
విశీర్ణంబులై, రాలె న్గోపురముల్ గ్రహంబు
లురలెం బ్రాసాదముల్ నుగ్గులై, తూలెన్ ...

3. నశించు.

శా. నీ బాణంబులు రాల నీ ధనువు ఖండీభూతమై
పోవ నీ, జోబిల్లిన్ ఫణియంట నీబలము లాశా
విథిపాలై చనన్. నీ బంట్రౌతుతనంబు స్త్రీల
యెడనే నిన్నెవ్వరు న్నవ్వరే. మాబాలామణి
నేఁచఁ బోకు మకటా మర్యాద గాదాత్మజా.
ఇందు. 4. 58.

4. అతిశయించు.

సీ ...గీ. యోగికై వడి మిగుల విరాగిరీతి, వదియె లోకంబుగానున్న యాపదంతి, నేఁప రాలెడు తమ్మిరుమ్మిఁ పిరంగి, వీరుమటు మాయ మాయింప నేరద య్యె. స దంశా. 2 157.

జ. రాలఁగొట్టు, రాలించు, రాలుఁగాయ, రాలుఁ గాయతనము, రాలుగొను, రాలుచు, రాలుపు, రాలువారు.

**రాలుఁగాయ** విశే (√రాలు.) తుంటరి, దుష్టుఁడు (చూ. రాలుఁగాయతనము)

**రాలుఁగాయతనము** వి. (రాలుఁగాయ+తనము) దుండగము.

గీ. వాఁడు నానాఁటి కభివృద్ధి వఱలఁ బెఱిగి, కాఁకెను దేఱ గడిమీఱ గట్టిపాఱి, రాలుఁ గాయతనాన బేఁజఖుదారి, నాఱితేఱియు బలు గుంటమూరి యయ్యె.. హం. స. 5. 110.

**రాలుగొను** అ. క్రి. (రాలు+కొను. స్వార్థమున) గళితమగు, క్రిందఁబడు.

చం. అడరు నవాంబుధారలు జటాటవిలోఁబడి విభ్రమించి వెల్వడి చనుదెంచి రాలుగొని వక్షములన్ వెడనిల్చి.. కు. సం. 6. 767.

**రాలుచే(ల్చు)** స. క్రి. (√రాలు.) 1. రాలునట్లు చేయు.

చం... పాదపంబుల వెన వేళ్లతోఁ బెఱికి పువ్వులు రాలించి డొల్లఁ దాఁచి...భా. రా సుం. 333.

సీ. వనదేవతాగాత్రమునను జైత్రుఁడు నించి కడఁగి రాలిచిన చిక్కన మనంగ ...

ఉ. రా 6. 5.

శా. రక్ష స్సైన్యములోఁ గబంధములు గృధ్రంబుల్ వటించెన్ ద్రిలోకక్షోభంబుగ మేఘము ల్గురిసె నిర్ఘాతాస్థిమాంసాస్రముల్, వక్షమ్మ హేప మునొవ్వ నిప్పుకలు గూబల్ చూపులన్ రాల్చె.

ఉ. రా. 2. 32.

2. విదలించు, దులుపు.

ద్వి. . తలిరుల రాల్చి పత్రంబుల దుల్చి....

ద్వి. పారిజా. పూ. 1211 పం.

గీ. .. రాల్చె జాడించె నసఁగను రహికి నెక్కు, విదిలిచెనటన్న పలుకుగా వేదవేద్య ...

అం. భా. 3. 132.

3 చల్లు.

మ. .. ద్విజానగుల్ క్షితిహితా వ్యాజామలాపంబుతో, నలఘుశ్రీకరశాఖ కాంచల వినిర్యత్కాసరార్ద్రాక్షతంబులు రాల్చెన్నర దేవ రత్నముకుటీభూషా విశేషంబుగన్.

వసు. 1. 150.

**రాలుప(ల్పు)డు**. అ క్రి. (ఎలుఁగు) కంపించు.

ఆ. అట్లు వీతిహోత్రుఁ డగ్నిలోఁ బడుటకు, శోక విహ్వలఁ జత్తమాకులముగ, నెలుఁగు రాలు పడఁగ నిట్లని పలవించె.

భారి. శాం. 3. 329.

గీ. .. పంరగద్గది కావ్యక్తి కాకు వికృతి, రాలు పడఁ బండ్లిగుల్చుచు దీలుపాటుఁ, బ్రకట దైన్యంబు దోఁప లోభంబు వచ్చె.

నైష 7 62

కం. చంచములు వడకు ... ... నొడలు రాలుపడు నెలుఁగావ, మరణమున నెట్టి చిహ్నము, లరయన్ యాచకుఁడు ధాల్చు నచ్చిహ్నములన్. వేం పంచ. 2. 142.

వ. కొండొక సేపునకు మూర్ఛదేఱి యన్నిపాలుం డెలుంగు రాల్పడ నిట్లనియె ...

భారి. సా. 2 12.

ఉ ఏసిన నింతినొచ్చి నెలుఁగెంతయు రాల్పడఁ గోప జృంభణం, జేసి ముఖా... మొ...గ.

భో. రా 5. 102.

జ. రాలుపాటు.

**రాలుపాటు** వి. (√రాలుపడు.) గద్గదము, కంప నము.

చం వెలిచిన కన్నునీరు జడివెచ్చని చేన్నుల మీఁది వేఁడియున్, దొలకరి ఘర్మతోయములతోఁ గలసె న్మెయి ప్రమాను పాటుతో, నెఱుఁగువ రాలుపాటొదవె నెక్కు వివర్ణతతోవ లోపలం, గలగొనె నారటంపుఁ బులకంబులతోఁ బొడ తెంచెఁ గంపమున్.

ఉ. హరి. 5. 112.

**రాలుపు** వి. (√రాలు.) రాలుట.

సీ. ఆకురాలుపు గండ్ల నానెడు నాస నింతడు గూఁది బంకంటి యంగలార్చి ...

ఆము 5. 117.

**రాలువారు.** ం. క్రి (√రాలు) జాలు, ప్రవహించు.

సీ. ఎర్ణన తెల్లచో వర్ణనకెక్కంగ రసములు చిలుకొత్తి రాలువారి ... కు సం. 1. 36.

**రావడి = హోవడి** వి. ఉపద్రవము. (శ. ర)

**రావణగంగ.** సం. వి. ఆ. స్త్రీ. లంకాపురమునఁ బ్రవహించునది

**రావణహస్తము.** వి. వాద్యవిశేషము.

వ . . పికిళులు బచ్చికోళ్లు రుద్రవీణియలు స్వర మండలంబులు తంబురులు కిన్నెరలు రావణ హస్తంబులు రబాబులు .. ప్రబంధ. 605.

వ కాహళుల్ డోళ్లు శంఖములు రావణ హస్తములు డిండిమంబులు .

(బలరామచరిత్రము) (బ్రౌ ని.)

**రావణారి.** సం. వి అ పుం శ్రీరాముఁడు, రఘురాముఁడు

**రావణి** సం వి అ.పుం. ఇంద్రజిత్తు, మేఘనాదుఁడు.

**రావణుఁడు** సం. వి అ (అ అ అ.) అఱచువాఁడు, రోదనము చేయువాఁడు.

వి అ పుం రాక్షసముఖ్యుఁడును, లంకాధిపతియు నైన రాక్షసుఁడు.

**రావము.** సం. వి. అ. పుం. 1. అఱపు, బొబ్బరింత, జంతువుల యఱపు. 2. ధ్వని.

**రావి = రాగి.** వి. అశ్వత్థము (వృ. వి.).

ద్వి. రావులఁగొట్టి వారణములఁగట్టి మావులఁబట్టి గ్రామమ్మవులఁ గట్టి ...

ద్వి. హరిశ్చ. పూ. 1207.

కం. . . . చివురలఁ గెం, పారు నొక పిప్పలముఁ గని, యా రావిన్వాదసాతికై వఁగొనుచున్.

ఆము. 4. 57

సీ. రావి మామిడి కొండరావి మేడియ బ్రహ్మ మేడియు జీడమామిడియుఁ జింత ...

హంస. 4. 11.

జ : రావిరేక.

**రావించు.** స. క్రి. (√వచ్చు) రప్పించ వచ్చువట్లు చేయు.

కం. రావించి తగవుమై సంభావించవలకొక నాఁడు పాండవులఱుపం, బోవిడువరె మిగలుడురే, నీవచనంబులకుఁ బిలిచి నిలుపుము హరిన్ ..

భార. ఉద్యో 2. 206.

కం. కావున శ్రీనగమునకేఁ, బోవఁగ నూహించి మిమ్ము బోధించుటకై, రావించితి నా వాక్యము. భావింపఁగవలయు నిపుడు పర మార్థమునన్ ... విక్ర. 1. 202.

కం. ... చూతముగా, రావింపు మటన్న నాఁటి రాత్రి చనంగాన్ ... ఆము. 4. 55.

**రావిపూరాజనాలు.** వి. బ. ధాన్యవిశేషము.

సీ. ... పలిక రాజనా లీశ్వరప్రియములు రావి పూరాజనాల్ రత్నసరులు, ...

హంస. 4. 128.

వ. ... వంగాకుబుడమలు ప్రయాగలు పసపు గన్నేర్లు గుత్తి బలుగుత్తులు రావిపూరాజనాలు పొన్న శ్రీరాజనాలు నివ్వరులు ...

ప్రబంధ. 112.

**రావిరేక = రారేక², రాప్రేక,** వి. (√రావి.) 1. పిల్లలకు ముందుసిగయందుంచెడు రావియాకు వంటి ఆభరణవిశేషము.

సీ. ... రారేక నుసుటిపై రత్నాల గ్రొందళ్క రావిరేక బెడంగు రహిఁజెలంగ ...
ఇందు. 2. 141.

ఉ. మువ్వలు గంటలు న్మొరంయ ముందటి కూఁకటి రావిరేకతో, నవ్వనజాతుఁ డాడు ...
హరి. పూ 5. 191.

2 కర్ణభూషావిశేషము,

సీ. చెవులపువ్వు బొగడ బవిరె రారేక కుంపెన రావిరేక ముర్వునఁగఁ గర్ణభూషావిశేషము లొప్పెలు ...
ఆం. భా. 2. 145.

**రావు.** వి. (సం. రాజన్.) రాజు. (ఇది కొన్ని విశేష్యముల కడపటఁ బ్రయుక్తమయి శ్రేష్ఠార్థక మగును.)

సీ. ... సింగపుఁగొదమ తేజీరావు రవద్రొక్కఁ బొగరెక్కి త్రిశిఖుఁడు దగిలి వెడలె, .
రామా. 3. 67.

**రావుతు(ఁడు)=రావుత్తు.** వి రౌతు, సాది.

అయ్యగ్రాహి. రావుతుల తుండములు మానవుల మగ్గుఁదుర గావలికవంబులు గజావయవరాశి, భావభయవస్తులు ...
భార. స్త్రీ. 2 5.

ఉ. గిబ్బపటాణి రావుతుఁడు గెల్పొసఁగుం గృతినేత కెప్పుడున్ ...
చం. రా. 1. 2.

ద్వి. హితులు భృత్యులు పురోహితులును రాజ, సుతులు బందరులు రావుతులు లెంకలును ...
పండితా. వాద. 172 పు.

గీ రవుతు రౌతు రావు తనఁగ రాహుతుఁడగు ..
ఆం. భా. 2 203.

**రావుత్తు (ఁడు) = రావుతు, రాహుత్తు.** వి (క. రావుత. త. ఇరావుత్త. మ. రావుత్తు. మహా. రాహుతా) రౌతు, అశ్వసాది.

గీ ... తొలు కారుకలఁక పులుఁగు మావు రావుత్తు నిలిచె బ్రాహ్మణుని బ్రోల...పాండు. 1 51.

ఉ పీఁకమోముతా లెపలుక నెక్కిన రావుతు రాజు...
భీమ. 1. 2.

**రావెడలు.** అ బ్రీ. (రాన్+వెడలు) పైకివచ్చు పైకిఁబడు.

కం. జలరాశిఁ దిమి తిమింగలములు నాఁదగు మీల సత్వములు వినలేదే, కులశైలనుతుఁడె జలచరములతో రావెడల నుమియుఁ బునుకల తోడన్...

**రావ్రేక=రావిరేక.** వి. పిల్లలకు ముందుసిగ యందుఁ బెట్టెడి రావియాకువంటి భూషణ విశేషము

సీ. మొలక కూఁకటిఁ గ్రాలు ముత్యాలరావ్రేక భసితంపు బొట్టుతో జాదరింపఁ, జాలబుగ్గల కాంతిపల్లవంబులతోడఁ జిన్ని లేనగవులు చెలిమి సేయ...
కాశీ. 3. 240.

**రాశి.** సం. వి ఇ పుం. 1. ప్రోగు, సమూహము, గుంపు, మొత్తము. 2 (గణిత లెక్కకై వేసిన యంకెలు, వ్యక్తావ్యక్త గణభేదము 3 రాశిచక్రము యొక్క ద్వాదశాంశము, మేషాది. 4. పరిమాణవిశేషము, ఆఢకము (కే ని).

**రాశిచక్రము.** సం. వి అ న మేషాదిరాశుల చక్రము.

**రాశిభోగము.** సం వి అ. పుం. సూర్యాది గ్రహముల గమనము.

**రాష్ట్రము** సం. వి. అ. న. 1. దేశము, రాజ్యము. 2. మండలము, దేశభాగము (పంచగ్రామములపై నున్నది) 3. ఒక దేశపుజనము, ఏదేశస్థులగు ప్రజలు. 4. ఉపద్రవము. 5 ప్రాణి. జీవి.
(వై. ని).

**రాష్ట్రిక** సం. వి. ఆ. స్త్రీ. నాకుఁడు (స్ప. వి). (శ. ర.).

**రాష్ట్రీయుఁడు.** సం. విణ. అ ఆ. అ.) రాజ్యమునకు సంబంధించిన వాఁడు.

వి అ. పుం. (నాట్య). రాజస్యాలకుఁడు (రాణి యొక్క సోదరుఁడు.).

**రాష్ట్రియుఁడు** సం. వి అ పుం. =రాష్ట్రీయుఁడు.

రాసకము సం. వి అ. న. దృశ్యకావ్యభేదము, ఒకానొక ఉపరూపకము.

రాసభము. సం వి. అ. పుం. గాడిదె, గార్దభము.

రాసభవందిని. సం వి ఈ. స్త్రీ. మల్లిక, మల్లి (వ్య. వి.).

రాసమండలము. సం. వి. అ. న. రాసక్రీడ, గోపికలును శ్రీకృష్ణుఁడును మండలాకారముగఁ జేసిన నృత్యము, అట్టిప్రదేశము, మండపము.

రాసము సం. వి అ పుం. 1. అఱపు, కోలాహలధ్వని. 2. (సామాన్య) ధ్వని. 3 సల్లాపము, మాట 4 గోపికలును శ్రీ కృష్ణుఁడును గలసి యాడిన యాట, రాసక్రీడ. 5. పరిహాసము. 6. రసము (శ. ర.).

రాసయాత్ర సం వి ఆ. స్త్రీ. కార్తిక పూర్ణిమనాఁడు జరుగు భగవదుత్సవము (వాచ)

రాసాని వి (రాచే+సాని). రాజుభార్య.

ఉ. పైనపుడట్టి గట్టుకొని బద్దుబపుట్టిక వెంటరాఁగ రా,సాని పసాని నవ్వునెల జవ్వనిరాఁగని యొక్కసాని యో,సాని మిటారి నీకు దొర సానికి నీనడ చెల్లదించు భూ,జానిపటానిగా యవక జిక్క వెసం దిగికొమ్మకొమ్మనెన్. రా వి 2. 59.

రాస్తా వి. (హిం. రాస్తా) రాజమార్గము, బాట.

సీ. కలుపలదొర చల్లగాలి వజీరులు పూనిరాస్తాను చపాను గొలువ .. గీ. మదనువాదుసిపాదండు గదల నపుడు. అని. 3. 19.

రాసి. వి. (సం. రాశి). 1. ప్రోఁగు, పుంజము.

శా. . తి న్నాళ్ళచ్చున్ బిలసానుశృంగములఁ బూర్ణక్రోధుఁడై కాష్ఠముల్, రాసుల్ గానిడి చిచ్చువెట్టఁ బనిచెన్ రౌద్రంబులో భృత్యులన్. భాగ. 10. పూ. 1672.

(ఇటళ స. ప్రాసము)

గీ .. కుప్పయన రాసి యనఁగను గువ్వయనఁగ, రాశియగు... ఆం. భా. 2. 101.

2. మొత్తము.

ద్వి... రాసి నీకెదురుత్తరంబులు వల్క, నా సరో జాతుండు నలుకు నే నెంత...

ద్వి. హరిశ్చ. ఉ 2623 పం.

3. మేషాదిరాశి. (శ. ర.).

రాసికెక్కు=ప్రసిద్ధికెక్కు.

ద్వి. ధరనెవ్వరేఁ బరతత్త్వనిర్ణయము, గని యూకులక్కంబుఁ జేకొనుం డనుచు, రాసికినెక్కు మర్యాదగావించి.

ద్వి. పరమ. 5 667 భా

రాసింగము. వి. (రాచే+సింగము). రాజసింహము, రాజశ్రేష్ఠుఁడు.

దండకము. ... దుర్లభాగితమూనథ మత్తేభయూథంబులం జించిచెండాడు రాసింగమున్ సింగభూపాలు భూపాల గోపాల గోపాలికా కృష్ణగోపాలు .

భోగినీదండకము.

రాసిరి. వి. (రాచే+సిరి). రాజలక్ష్మి.

కం. సిరివంటి బడేబీబీ, విరితోఁటకి వెన్నుఁడనఁగ వేయచు మిగులన్, గరగరిఁదనకెడ రా, సిరులందు నమీనుఖాను చెలువములగమీ...

యయా. 2 1.

చం. గరతరమైనలేమి సమకూరిచి యెవ్వరి కిరదరాని రా,సిరిగలదండనాథు గృహసీమకుఁ బోవఁగఁబంచి యచ్చటన్ ...

చెన్న. 5. 847.

రాసీరసము. సం వి అ.పుం. 1. రాసక్రీడ. 2. వినోదము, ఉత్సవము 3. జనసంఘము, సమూహము. 4. శృంగారరసము. 5. ప్రసవావంతరమువవా అపరాత్రి 6. పరిహాసము, వేళాకోళము చేయుట. 7. * రసనిద్ధి, రసాయన శాస్త్రము నందలి నిపుణత. * (వాచ.).

రాసీవాసము. సం. వి అ. పుం. = రాసీరసము.

రాసేశ్వరి సం. వి. ఈ. స్త్రీ. రాధ.

ఉ. రింగుల వల్లెవాటు సవరించి మెయిన్ మృగ
నాభినించి.. సారంగ 2. 218.

సీ. కలువగొంగకు లేని బలువ గంగను జీనివలువ
వలువ రింగలపైని గలుగువాని ..
ప్రబంధ. 802.

సీ. గోణముపైని రింగులు వారఁగట్టిన వలిపె
దుప్పటి కటిస్థలి రహింప.. చం రా. 2 61.

రింఛోళి సం. వి. ఈ. స్త్రీ సమూహము.

రింజ వి మల్లబంధ విశేషము, కాలు పట్టుకొను
టకుఁ జొచ్చినచో కాలు తప్పించి సందిటఁ మెడఁ
బొదివిపట్టెడి పట్టు.

గీ. కళవరావకుఁ జొచ్చి డొక్కరము హత్తి,
చడికిమెఁ బిడఁగొని పట్టసమునఁ దొడరి,
తోరహత్తంబునను బొత్తమూరి జృంభణమ్మ
నను రింజపట్టి విన్నాణ మెసఁగ ...
ఉ. హరి. 3. 69
(చి. ని., శ. ర పీఠిక పా)

రింజ=రిమ్మ వి ఉన్మాదము.

సీ. .. రిమ్మ యసంగను రింజ యనఁగ, వెఱ్ఱి
యనఁగను విచ్చ యన గ మమ్మాద మనఁగ
నున్మాదసంజ్ఞ ... ఆం భా. 1. 136.

రికము=అికము. అప భావార్థము నందు వచ్చు
ప్రత్యయము.

చం. అఁ యఁగఁ దల్లి టక్కనెలియంద్రకుఁ దక్కు
మ గగ్గినట్టి చుట్టరికమువారికిన్ ...
ప్రభా 3. 88.

రికిరించు స క్రి నిక్కఁబెట్టు.

సీ. పసుట్టె పోకలు విసరి తారుచుఁ జెవుల్
రికిరించుకొని దిశల్ రేసి చూచి ...
రసిక 1 113

రికేబు. వి. (హిం. రికాబ్) సేవకుఁడు.

గీ. రేయి సుల్తాణి జగమాపరింపఁ దలఁచి,
పొలుచు నిరులను బలురికేబులును బనిచి,
కొలల నెత్తిన సున్నంపుఁ గుండ లనఁగఁ,
జాలఁ గనుపట్టెఁ దారకానముదయంబు.
విప్ర. 3. 28.

సీ. ఇటు వల్లెత్రాటి మిక్కుటపు చెక్కురికేబు
కెడగొప్ప తిప్ప వీక్షించినాఁడ ...
ప్రబంధ. 149.

రిక్క. వి (సం. ఋక్షమ్.) నక్షత్రము.

క. ఒక్కొక్కటి వేయికోటులు, మొక్కలపుం
గపులు గలుగు మొనలవి ముయ్యే, డొక్కటఁ
గొలువ బొలుచునా, రిక్కలఁ దాఁకిన
పొడువు దరిముఖుఁ దధిపా.
భా. రా. యు 854.

సీ. రిక్కలోయి నిశావురే చామతుఱుముపైఁ
జెరివిన మల్లె క్రొవ్విరులుగాని ...
నైష. 8. 161.

జ. రిక్కదారి, రిక్కదొర, రిక్కరాయఁడు,
రిక్కఱేఁడు

రిక్కదారి వి. (రిక్క+దారి) ఆకాశము.

ఆ ... వెన్ను, నడుగు రిక్కదారి యన నభంబై
తగు .. ఆం భా. 1. 69.

రిక్క(ల)దొర. వి. (రిక్క+దొర) చంద్రుఁడు.

వ. దంష్ట్రాంగదవర్గళ లాలాజలంబు రాహువు
ముక్కాలు గ్రాసంబుగా మెక్కవం జిక్కిన
రిక్కదొర ప్రక్కం బొరఁగు సుధాధారలం
గేరడంబాడ ... రా. వి. 3. 65.

సీ. నెఱయూఁగి బలువెట్టు నిగనిగల్ గడునవ్వి
రిక్కలదొర రంగు త్రుక్కఁజేసి ....
రామ. 371.

రిక్కరాయఁడు. వి. ( రిక్క + రాయఁడు )
చంద్రుఁడు.

సీ. చెక్కు నొక్కెదయంచు దిక్కరిగ్రామణి
యక్కుఁజేరదెయంచు రిక్కరాయఁడు ...
వసు 1. 80.

ఆ. చెక్కు దివియలున్న జక్కవ చెలియున్న,
రిక్కరాయఁడున్న జుక్కలున్నఁ, జిన్నివేడి

చూడ్కి చేడియ నెడఁబాయు, నవ్వు డంధ
కారమయ్యె జగము. భర్తృ. 2. 14.

రిక్కరించు. స. క్రి. నిగుడించు, రిక్కించు.

స రిక్కనిక్క వెక్కరింపుచుఁ జెవులు రిక్క
రించుచుఁ బండ్లిగిలింపుచు.. పిక్కటిల్లు మర్క
టంబులును .. ప్రబంధ 186.

రిక్కఱేఁడు. వి. (రిక్క + ఱేఁడు) నక్షత్రేశుఁడు, చంద్రుఁడు.

కం. కావున నా విన్నప మో,దేవర నీయెదను
నిలిపి తేఁకువ మీఱం,గా నేంచేయుఁడు
గొబ్బున, నావుడు రా రిక్కఱేఁడు నగుచుం
బలికెన్ ... అచ్చ రా కిష్కిం. 58.

గీ. చొక్కి మిక్కిలి రక్కసి రిక్కఱేఁడ్లు, చక్క
నయ్యకుఁ జిక్కి .. దశా. 2. 304.

రిక్కించు. స క్రి నిక్కఁజేయు

సీ. రిక్కించి వీనుల చక్క లదంఁజేయు ఘుర్ఘుర
ధ్వని ప్రతి ఘోషమురుము .. ప్రబంధ. 218.

మ. తన చూ పంబుధిమీఁదఁ జూచి శ్రవణ
ద్వంద్వంబు రిక్కించివం,చిన చంచద్భుజముల్
సముత్కటంబు టిసీమంబు లం బూన్చితో,క నభో
వీథికిఁ బెంచి యాఘ్రి పరియంగాఁ గెట్టి
బిట్టూఁద గ్ర,క్కన నక్కొండ యిడఁగఁ
ద్రొక్కి పయి కిం గుప్పించి లంఘించుచున్.
రామా. 6. 93.

గీ. మించు రిక్కించె నన,గ సిక్కించె ననుట.
ఆం. భా. 137

రిక్కు. వి. త్రిప్పుట యందగు ధ్వన్యనుకరణము.

సీ. రిక్కురిక్కు నఁ దోఁకఁద్రిప్పి జాడించుచు
ఖురపుటంబులఁ దలగోఁకుకొనును ...
హరివ. 2. 49.

రిక్త. సం. వి. ఆ. స్త్రీ చాంద్రమానపక్షమున చతుర్థి నవమి, చతుర్దశి తిథులకుఁ బేరు.

రిక్తత. సం. వి. ఆ. స్త్రీ. 1. దారిద్ర్యము, 2. శూన్యత.

వం. ఘనమగు నాకు రావితిలకం బతిరిక్తత మున్న
వోర్తులో,, గనికర మూని ...
అము. 5. 135.

రిక్తపాణి. సం. విశే. (ఇ) రిక్తహస్తుఁడు.

రిక్తము. సం. విశే. (అ. ఆ. అ.) 1. శూన్యమైనది, ఏమియులేనిది, 2. నిష్ప్రయోజనమైనది, వనికి మాలినది.

వి. అ. న 1. శూన్యప్రదేశము, ఆకాశము, 2 అరణ్యము, అడవి

రిక్తహస్తుఁడు సం. విశే. (అ ఆ. అ.) 1. శూన్య హస్తుఁడైనవాఁడు (పువ్వులు మొ. బహుమానవు బదార్థములేనిచేతులు గలవాఁడు.) 2. నిర్ధనుఁడు దానములు చేసి దరిద్రుఁడైన వాఁడు

రిక్థగ్రాహుఁడు సం. విశే. (అ ఆ.అ) దాయము తీసికొనెడివాఁడు.

వి. అ. పుం. దాయాదుఁడు, జ్ఞాతి, వారసు.

రిక్థము. సం. వి. అ న. 1 దాయము, విభాగార్హమైన పిత్రాదులధనము. 2. ధనము, ఆస్తి.

రిక్థహారి సం. వి న్. పుం 1. దాయాదుఁడు, జ్ఞాతి, వారసు 2. మేనమామ, మాతులుఁడు.

ఉ. వరిబీజము, మట్టి విత్తు.

రిక్థి. సం విశే (న్. ఈ. న్.) 1. దాయమును పుచ్చుకొనెడవాఁడు, ధనస్థైనవాఁడు.

వి న్ పుం. దాయాదుఁడు, జ్ఞాతి.

రిష. సం. వి. ఆ. స్త్రీ. రిష, ఈ పేనుగ్రడ్డు.

రిటి సం. వి. ఇ. పుం. 1. నుంటలు చుఱుముట మగుట 2 స్వర యుప్పు. సంగీతశాస్త్ర విశేషము 4 భృంగరిటి, శివుని చాలుకులలో నొకని పేరు. (విద్యమ్మ)

రిట్ట. వి. ఒకానొక చెట్టు,
పి. శా. శ. 1024, Ep. Ind 5.

రితము. సం. వి అ. న. 1. గతి, గమనము.

వి. (అ.ఆ.అ.) గతము, గతించినది.

రిత్త. వి (సం. రిక్తమ్.) 1. వ్య అబద్ధోక్తి.

కం. నీయొద్దనాడినంతయుఁ, జేయని కతఁడో
పు రిత్త సెప్పెడువాఁడే ..
భార. ఉద్యో. 2. 193.

కం. రిత్తలు రచ్చెడువాఁడే, మత్తగజాయుత

బలుండు మారుతియని నుద్వృత్తుఁడగు దుస్ససేనుని, నెత్తురురము వ్రచ్చి త్రావు నీవుం జూడన్ ...
భార. ఉద్యో. 4. 204.

2. వ్యర్థత

ఉ. వంచన లేక యాననము వాంచిన యప్పుడు ఫాల మోర గా,వించుడుఁ జెక్కుటద్దములు వ్రీడభరంబునఁ గెంపెక్కించుచు గ్రించి మనంబు తాలిమి గభీరత రిత్తకునెత్తఁ బూనినన్, మించి ముఖాబ్జముం బనము మేకొని నవ్వు విభుండు నేర్పునన్.
నైష 7 183.

విణ 1. వ్యర్థము, నిరర్థకము.

చం. నెమ్మనంబునన్, విపులశమంబు గై కొనని వీరతపస్వి తపంబు నింద్రియా, ద్యపరిమిత సౌఖ్యమునవ నియోగి వివేకము రిత్త యాంయన్ ...
సీతారా 3 134

2 వట్టిది, శూన్యము.

గీ. విత్తు సహకారిగాకున్న రిత్తనేల, వంధ్య మగుఁగాక తా ఫలవంతమగునె ...
భారం. అను. 1.156.

గీ. అత్తయును మామయునులేని రిత్తయింట, మనువు మనిపెదు నీయింతి మగనితోడ ...
హర. 3. 25.

చం. .. ... దృక్తటరింకాంతులు మత్తంమిచ్చు వంతరాం,గరముల నవ్వులు స్గలున తండము మొల్లలు నంచు మిన్ను గ్రుచ్చిరిహిని రిత్త నూలొనఁగి సిగ్గువహింతురు పుష్పలావికల్.
అము. 2. 90.

3. కల్ల.

వ. ఇట్లు నిర్భర్త్సింపఁబడి వైదర్భిం జూచి రిత్తయలుకఁ దెచ్చుకొని యుపదేశగురువువగు వాకు రతిరహస్య వార్త సెప్పవైతి, ధూర్తవై నీవు సెప్పకుండు గాకేమి? .. ఇదె చూడుమని.
నైష. 8. 70.

4. ఇతరమైనది.

గీ. ... ఆటు,నెలల తొకనాఁడు భోజనాదులకుఁ దెలియు,నాఁడు పీఁడజయ్యుఁడు రిత్తనాఁడు దెలువ, బలిమిఁ దెలియనాఁడి పని బలము దూలు.
భా. రా. యు. 876.

క్రి. విణ. 1 ఊరక, వ్యర్థముగా.

కం రిత్తదడవు గాకుండఁగ, నిత్తటి నాచార్యు తోడి యీనుడిగి వెనం, తొత్తము శకట వ్యూహము, చిత్తంబున నొండు దలపు నేర్పకు మింకన్.
భార. ద్రో. 3. 68.

కం. మాయఁ బ్రకటించుచుమ వెడ, మాయవు మంత్రములు రిత్త మంత్రించుచు భూనాయక నందన గనుఁగొను, మాయామదిరాక్షి నీ మదాలసయగునే.
మార్క. 3. 81.

సీ. .. , సరసోక్తులకు నదుత్తర మీయకుండుట చూపు లేకయ రిత్త చూచుటయును ...
దశా. 7. 70.

వ. .. ప్రతిఫలిత తారకంబులు ద్రాక్షాఫలంబులని రిత్త చప్పరించువారను ...
ఎను 4 23

3. నిష్కారణముగా, ఊరక.

కం. కావున మనుజుఁడు సేయక, దేవుం డీయంగ లేఁడు తెగి యేమియు నా,నావిధధాన్యము లుండిన, వావిరి వండక యె రిత్తవంటక మగునే ...
కుచేల 1. 81.

కం. ... తాముసు పెట్టనిది రిత్త దవకేలబ్బున్...
విక్ర. 2. 182.

వ ... రిత్త బంకించువారుమ ... పారి. 4. 66

జ : రిత్తకత్తె, రిత్తగాఁడు, రిత్తకురిత్త, రిత్తవడు, రిత్తవాఁడు, రిత్తవుచ్చు, రిత్తవోవు.

**రిత్తకత్తె.** విణ. (√రిత్త) సంబంధములేని స్త్రీ, తేర కత్తె.
(శ. ర.)

**రిత్త(కా)గాఁడు.** విణ. (రిత్త+కాఁడు) తేరకాఁడు సంబంధములేనివాఁడు.

కం. ఉన్నంత నీవు గలిగితి, బన్నంబులు దలఁక

(శ ర. పా. కప్పువిప్పగు. ముద్రి. పా )

రిప్పము సం. వి అ. పుం. లగ్నమునకు ద్వాదశ రాశి, వ్యయస్థానము.

రిప్రము సం వి అ న. 1. పాపము. 2. దుఃఖము. (కే.వి.)

రిమ్మ=రింబ వి క్రిక్కి, ఉన్మాదము.

గీ. దండహస్తిమనోజుండు దండవెట్టె, నమ్మహీ దేవు నెమ్మది రిమ్మవొడమ. శుక. ౨. 453.

సీ. తనరు వేళాకోళమనంగఁ గ్రిక్కియనంగ రిమ్మయనంగను రింబయనఁగ, వెట్టియనంగను విచ్చియనంగ నున్మాదమనంగ నున్మాద సంజ్ఞ... ఆం. భా 1. 136

జ రిమ్మగొను, రిమ్మపట్టు

రిమ్మ(లు)గొను. అ. క్రి (√రిమ్మ) ఉన్మాదము నొందు

వ నెమ్మనంబునం గ్రమ్మిన యమ్మలికంబు పెంపున రిమ్మగొని పొమ్మసిలి.. చిత్రభా. 8. 94.

వ. విద్యుల్లతా విలోకంబున రిమ్మలుగొని సొమ్మలు వోవుచున్న లేఁగలు. భాగ 10 పూ. 904.

రిమ్మపట్టు అ క్రి. (రిమ్మ+పట్టు) దిమ్మెక్కు.

ఆ. ఱొమ్ముద్రొక్కి మోము రిమ్మపట్టఁగ మోఁది. భాగ. 5. 2. 157.

మ. ... పార్థమస్తంబు విట్టుగలం దాఁకిన రిమ్మ పట్టి వివశుండై వ్రాలెన మ్మోటియున్. జై. భా. 5. 76.

రిరంస. సం. వి. అ. స్త్రీ. 1. రమింపనిచ్ఛ, ఆడ వలయునను నిచ్ఛ. 2. రతి యందలి యిచ్ఛ, విషయసుఖములు పొంద నిచ్ఛ.

రిరంసువు. సం. విశే. (ఉ) రమింప నిచ్ఛగల వాఁడు. (శ, ర.)

రిరక్ష. సం. వి. అ. స్త్రీ. రక్షింప నిచ్ఛ.

రిరక్షువు. సం. విశే. (ఉ) రక్షింప నిచ్ఛ గలవాఁడు.

రిరి. సం.వి.ఈ.స్త్రీ. కాంస్యము, కంచు (విల్యమ్సు).

రివట. వి. ఉపశాఖ, రెమ్మ.

కం. ఒక గృధ్ర మెండిపోయిన, యొకచర్మము గఱచికొనుచు నుడుపథమునరా, నొకకంగిఁ బ్రిదిలిపడి యది యొకయొండిన రివటమీఁద నుండఁగ నెలమిన్. భోజరా 4 23.

సీ. రెమ్మ రెబ్బ రివట రివ్వ రెలగచివ్వ.. ఒలగు గోల బరగు నెలయన మపశాఖ చెలఁగమ... ఆ, భా. ౨ 37

రివరివ. వి. కుచ్చెళ్ల ధ్వని కనుకరణము.

సీ. గమగమ మైకదంబములు గుభాళింప రివరివ గుచ్చెళ్ల రవణ మెసఁగ... ప్రబంధ. 18.

జ : రివరివమను.

రివరివమను. అ క్రి (రివరివ+అను) కదలుట యందగు ధ్వని కనుకరణము.

కం. నవనవమను నెమ్మేనులు, రివరివమను మధ్యములు ద్విరేఫశ్రేణుల్, జవజవమను వేణికమది, రవరవమనుమరుఁడుగ!వారి రంగులు గనివన్... చమ. 3. 108.

రివ్వ[1]. వి. పక్షి విశేషము.

సీ. మానిపుల్కిటిగాఁడు జీనువ యొల్లంకి డాబ తీతువు నెవ్వ డాయ రివ్వ. (పార్వ. 6.77)

రివ్వ[2]. వి. రెమ్మ, ఉపశాఖ.

కం. చెఱకువఁ బుచ్చఁక రివ్వలఁ, గఱచిన రసమా వనిగతి... కు. సం. 8 159.

సీ. రెమ్మ రెబ్బ రివట రివ్వ రెలగ చివ్వ.. ఒలగు గోల బరగు నెలయన మపశాఖ చెలఁగను... ఆం. భా. 2.36.

రిశ్యము. సం.వి.అ.పుం. ఒకజాతిలేడి, మృగవిశేషము.

రిష్టము. సం. విశే. (అ. అ అ.) 1. యోగ్యము, అధమము.

2. దురదృష్టము గలది, అదృష్టములేనిది.

వి. అ. న. 1. హాని, కీడు. 2. దురదృష్టము, దౌర్భాగ్యము. 3. నాశము, నష్టము. 4. పాపము. 5. మంగళము, మంచి యదృష్టము.

పుం. 1 ఖడ్గము, కత్తి. 2. కుంకుడు చెట్టు.

రిష్టి. సం. వి. ఇ. స్త్రీ. అశుభము. అమంగళము.

పుం. 1. ఖడ్గము, కత్తి 2. రంధ్రము, బెజ్జము.

## రీ

రీఙ్గ. సం. వి. ఆ. స్త్రీ 1. నింద, దూషణము. 2. లజ్జ, సిగ్గు 3. అణఁకువ (విల్యమ్సు.)

రీఠ. సం.వి.ఆ.స్త్రీ. రీఠాకరంజము (వ్య.వి).

రీఠాకరంజము. సం. వి. అ. పుం. రీఠ, ఒకానొక వృక్షము.

రీఢ. సం. వి. ఆ. స్త్రీ అమర్యాద, అగౌరవము.

రీఢకము. సం. వి. అ. న. వెన్నెముక (విల్యమ్సు).

రీణము. సం. విశే.(అ ఆ.అ) స్రవించునది, కాఱునది.

రీతి. సం. వి. ఇ. స్త్రీ. 1 కాఱుట, ప్రవహించుట. 2. గమనము, చలనము. 3 నది, స్రవంతి. 4. మేర, హద్దు. 5. పద్ధతి. 6 వైఖరి, స్వభావము. 7. వైదర్భ్యాదిశైలి. (వైదర్భి, గౌడి, పాంచాలి, లాటిక, యని నాలుగు విధములు). 8. ఇత్తడి, పిత్తలము. 9. ఇనుపచిట్టెము. లోహకిట్టము. 10. పంక్తి, వరుస. (కే.ని.)

రీతిక. సం వి. ఆ స్త్రీ =రీతికము.

రీతికము. సం. వి. అ. న. 1. లోహపుష్పము, లోహకిట్టము. 2. పుష్పాంజనము.

రీతిగౌళ. సం. వి. ఆ. స్త్రీ ఒకానొక రాగము.

గీ. రీతిగౌళయు నీలాంబరియును ఘనము, దన రుహుసేరనాటయు నని నప్పున, కములు ముప్పదిరెండు రాగములు ... ప్రబంధ. 97.

రీతిపుష్పము సం వి అ. న. =రీతికము.

## రు

రు. అవ. 1. వర్తమానాద్యర్థక ప్రథమ మధ్యమ పురుషములు బహువచన ప్రత్యయము. ('ఇ' కారము మీఁద నిది 'రి' గా మారును.)

ఉదా : వచ్చుచున్నారు, రాఁగలరు, వత్తురు, రారు, వచ్చిరి.

2. ప్రార్థనార్థక మధ్యమపురుష బహువచన 'డు' వర్ణకమునకు ఎదాను అనుప్రయుక్తమగునపుడు ఆదేశముగా వచ్చు ప్రత్యయము

చం. చిలుకకు మావికిం బగలు సేయకురే అత కూవలార ... కకు. 1 130.

ఉ. ...మల్లియలార మీ పొదల మాటున లేఁడు గదమ్మ చెప్పరే ... భాగ. 10. పూ. 1011.

3. అల్లుడు మున్నగు శబ్దముల ప్రథమా బహువచన ప్రత్యయము

ఉదా అల్లురు, బాలురు

4. 'కూఁతు' శబ్ద ప్రథమైకవచన ప్రత్యయము.

ఉదా : కూతుఁరు.

రుంజ వి (త ఉరుంజల్) చర్మవాద్య విశేషము. డంగురము.

సీ ... డంగురమున రుంజ నా వీరాణ మసఁగను వీరణంబు ... ఆం భా. 1. 128.

జ. రుంజకాఁడు.

రుంజకాఁడు. వి.(రుంజ+కాఁడు) రుంజ వాయించుచు కంసాలులను యాచించు నొక జాతివాఁడు.

సీ. వ్యాపారివిత్తంబు వారకాంతలపాలు కల్లు వి త్తము రుంజకానిపాలు .... రామలిం. 28.

విశే. రుంజ వాద్యము వాయించువాఁడు

రుండము. సం వి. అ. పుం. కబంధము, మొండెము.

రుంశిక. సం. వి ఆ. స్త్రీ 1. రణరంగము, యుద్ధరంగము. 2. దూతి, కార్యకర్త్రి. 3. ఇంటి గడప. 4. మనుష్యాతీతశక్తి. (విల్యమ్సు.)

రుంద్రము. సం. విశే. (అ. ఆ. అ.) విరివియైనది. (శ ర.)

రుకుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ఔదార్యము గలవాఁడు, దాత. (విల్యమ్సు.)

రుక్మాముపుంజా. వి. ఒక జాతి కోడిపుంజు.

వ. ...రుక్కాముపుంజులు కలచికాట్ల జట్టులు గలచుక నారెలు డుస్సిపాలు వరుస ... ప్రబంధ. 788.

రుక్కు. సం. వి. క్. స్త్రీ. 1. బాధ, వేదన. 2 రోగము, తెగులు. 3. ఆండు గొఱ్ఱె. 4. కుష్ఠము. కుష్ఠురోగము. (విల్యమ్సు)

చ్ స్త్రీ 1. సూర్యకిరణము. 2. కాంతి. 3 ఇచ్ఛ. (శ ర.)

రుక్ప్రతిక్రియ. సం. వి ఆ స్త్రీ. జబ్బుకుదురుట, మందు పుచ్చుకొనుట, రోగప్రతిక్రియ.

రుక్మకారకుఁడు. సం. వి. అ. పుం. స్వర్ణకారుఁడు, కమసాలి.

రుక్మము. సం. వి. అ. న. 1. బంగారము. 2 ఇనుము. 3. నాగకేసరము, (వ్యా. వి). 4. ఉమ్మెత్తచెట్టు.

రుక్మిణి సం వి. ఈ. స్త్రీ. విదర్భ దేశాధిపతియైన భీష్మకమహారాజు కూఁతురు, శ్రీకృష్ణుని భార్య, ప్రద్యుమ్నుని తల్లి.

రుక్షము సం విణ (అ ఆ. అ) = రూక్షము,

రుక్సద్మము. సం వి న్. పుం. పురీషము, మలము (విల్యమ్సు).

రుగ్ణము. సం. విణ (అ. ఆ అ.) 1. విఘాతము చెందినది, భంగమైనది 2. వంగినది, వంకర యైనది 3. రోగముఁ జెందినది, రుజాయుతము.

రుగ్ణుఁడు సం. విణ. (అ. ఆ. అ.) రోగముఁ జెందిన వాఁడు. జబ్బుగా నున్నవాఁడు.

రుచ సం. వి ఆ. స్త్రీ. = రుక్కు (చ్).

రుచకము. సం. విణ (అ. ఆ. అ.) 1. మనోజ్ఞమైనది, ఇంపైనది. 2. ఆఁకలి పుట్టించునది. 3. తీక్ష్ణమైనది, చుఱుకు మనునది.

వి. అ. పుం. 1. మాదీఫలము. 2. పావురము.

న. 1. దంతము, పల్లు. 2. కాసు, స్వర్ణముద్ర. 3. ఆస్వాద్యమైన రసము, 4. పుష్పమాల, పూలదండ. 5. సౌవర్చలవణము, 6. గుఱ్ఱపు మెడ మీఁద నుండెడి ఆభరణ విశేషము. 7. మాంగల్య ద్రవ్యము 8. సర్జికాక్షారము.

రుచి. సం. వి ఇ. ఈ స్త్రీ. 1. వెలుఁగు, తళతళమను కాంతి. 2. సూర్యకిరణము. 3 కాంతి, అందము. 4. చెవి, నోటికింపగుట. 5. బుభుక్ష, ఆఁకలి 6. ఇచ్ఛ, అభిరుచి. 7 అత్యాసక్తి, వ్యామోహము 8. ఒకజాతి గోరోచనము. 9. సిరి, లక్ష్మి. (శే ని.) 10. రీతి, విధము.

(ఈ యర్థమున తెలుఁగునందే ప్రయోగము కన్పట్టు చున్నది )

శా ఆ మందోద్భవబీజమండరుచి సయ్యాటించు చుఁ జ్ మక్షికా, స్తోమంబాతతపక్షగుచ్ఛ మగుచున్ దోతేరఁగా శ్మశ్రులం, బై మిన్నొవ్వ తదంగసంగతి మధువ్యామోహముం జేయు దో, ర్ద్రో మర్త్యాలికిఁ దద్విహారకలిత ద్రుస్కంధ వీరుచ్ఛిఖల్. పాండు. 4. 254.

11. కమ్మన.

చం ... అప్పుడు ద్రుపదాధిరాజసుత పొల్పుగ వండిన శాకమూలముల్, గడురుచి నిష్టభోజనసుఖంబును దృప్తియుఁ గూర్చుచుండఁగన్. భార. అర. 1. 44.

పుం. 1. ప్రజాపతులలో నొకఁడు. 2. ఆలింగన భేదము.

రుచి(యి)ంచు. సం. అ. క్రి. 1. ఇష్టమగు.

గీ. ....అప్పార్థుకోర్కి, యంత సఫలతఁ బొందెడు నచ్యుతుండు, నెట్లు దనకు రుచించెఁ దా నట్లు సేయు... భార. ద్రో. 5. 379.

కం. శాంతిం బొందుట నీకుం, గుంతీపుత్రులకు మేలగున్ దానికయే, నింతయు నాడెద నది నీ, కెంతయు రుచియింపకునికి నెఱిఁగి యెఱిఁగియున్. భార. ఉద్యో. 3. 170.

సీ. ... నీకంటె బాలికుండు, కలఁడె యెవఁడు బుత్రుఁ బోలియింతె నా కృష్ణుఁ డెక్కటి

తద్రాజ్యమెల్లఁ దావ,కొని రిత్తపట్టంబు నిమఁ బూన్పు నతని పెట్టెదు నన్నపిండంబు గుడిచెదకట. గీ. యెట్లుగాఁ బెద్దవాఁడ వైతేమి బ్రతుకు, సిగ్గటివ భోగమెట్లు రుచించె నీకు, హరికి బంటవుగాక నీవవనిపతివె, యిట్టి రాజధర్మ ధ్వంసి నేను సైప. హరి. ఉ. 2. 25.

2. ప్రకాశించు.

వ. ఉదయార్కబింబ సుందరదేహుండగు తనకు వికీర్ణ కపిల జటావళులు ప్రత్యగ్ర మరీచులయి రుచియింప... హరి. ఉ. 1. 34.

స. క్రి భక్షించు.

కం ఇతెఱఁగున నా ప్రశ్నల, కుత్తర మిమ్మిక యూరకుండుదువేనిన్, బ్రత్తుం బ్రేవులు సాదగు నెత్తుటఁ జొత్తిల్ల దాఁచి నేఁడు రుచింతున్. దశకు. 10 69.

**రుచిగొను** వి. స క్రి (రుచి+కొను) ఆదరించు.

గీ. పరమముని యతివ శతమన్యురతిహేతు, పున మహాశాపహతిఁ జేసి తను విశ్రుతిగ, నున్న నేల యంతవచింప నొగి నరుదని, తత్కథల్ రుచి గొనుచు రాత్రనయులందు. రాఘు. 2. 36.

**రుచిర.** సం. వి. అ. స్త్రీ. 1. ఒకవిధమైన గోరోచనము. 2. ఛందోభేదము.

**రుచిరము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. మనోహరమైనది, సుందరమైనది. 2. మధురమైనది, తియ్యనిది.

వి. అ న. 1. కుంకుమపువ్వు 2. లవంగము. 3. మూలకము, ముల్లంగి దుంప.

**రుచిరాంజనము.** సం. వి. అ. పుం. శోభాంజనము (వ్యు. వి.).

**రుచిష్యము.** సం. విశ (అ. ఆ. అ.) మనోహరమైనది, ఇంపైనది.

**రుచ్యము** సం. విశ. (అ ఆ. అ.) రుచిరము.

వి. అ. పుం. 1. శాలి. 2. కతకము, ఇందుగు (వ్యు. వి.)

స. సౌవర్చల లవణము.

**రుచ్యుఁడు.** సం. వి. అ. పుం. పతి, భర్త.

**రుజ.** సం. వి. ఆ. స్త్రీ. 1. భంగము, ముక్క. 2. జర, ముసలితనము, 3. మృత్యువు, మరణము. 4. రోగము, తెగులు (కే. వి.).

**రుజాకరము.** సం. వి. అ. న. కర్మరంగము, కిరాలము (వ్యు. వి.).

**రుటము.** విశ. (సం. రూఢమ్) రూఢము

కం అటు ముందట పటుశైత్యోద్ధన,ద్పుటమయి దిట మయి నిగాఢదళసంతతి విస్ఫుటమయి రుట మయికడునా, వడమయి బటువయిన దొక్క వటముం గనియెన్. ప్రబంధ 207

సీ. వట్టివేరున కీవు వట్టవేరులు సేయ వట్టివేరుఁ ములిఁపైన చెలికి... రా. వి. 3. 106.

2. దృఢము, బలాఢ్యము.

ఉ. ఖానుకులీనుదేవిఁ జెఱపట్ట దశాననుఁ జెంచ బ్రహ్మత, శ్వాసిఁణపమీరు సౌరవుగయాత్ర కమర్చిన పైఁడి జోడు నె,మ్మేని రుటఁపు లేటి తల మిన్న వరాణి యనఁగ .. చం. రా. 5. 62.

ఉ. అంగముబం గురఁగ మదమందముగాఁగ వలంది మౌళి సం,పంగివిరుల్సిరుల్లన రుమాలు ధరించి రుటంపుటంగిపై, రంగు మెఱుంగు బంగరు చెఱంగుల రెంటెము నాల్గు కొంగులు బ్రింగులువారఁ గట్టి .. బహు. 4. 5.

3. తీక్ష్ణము

గీ. కఱకనంగను రుటమనఁ జురుకనంగఁ, దీండ్ర మనఁ దీండ్రయనఁగను దీక్ష్ణనామ,ధేయములు.. అం. భా. 1. 84.

వి. 1 రూఢి.

కం. అచ్చేడియ తచ్చనలకు, నిచ్చ మహోత్సాహమంది యిచ్చెలువకునే, మిచ్చిన బుణంబు గాదని, బచ్చె రుటం బచ్చువడఁగ భావించె మదిన్. బహు. 5. 124

2. దార్ఢ్యము.

గీ. ఒక్కమొత్తంబుగా వన్నె యుక్కుమీఱ, నిగుడి తన మీఁదఁ గవియ వన్నిటికి నన్ని రూపుల

ధరించి వాటిపై రుట మడంచి, పట్టి యొక క్రాంట దేవకి పట్టి గట్టె... సుదంశా. 4. 60.

3. ఒప్పిదము.

సీ. ముడుఁగుఁ దామర క్రింద వడఁగు క్రొంజబ పుతో నకెనెల పట్టి మంచపు రుటంబు, దగ్గఱ నేస్తకాంద్రకు నిడ్డజగపీఁట తళుకు బంగరు కాసెఁ దగులు తగులు... బహు. 5. 129.

రుట్టు. సం. వి. ష్. స్త్రీ. కోపము, కినుక.

రుణస్కార. సం. వి. ఆ. స్త్రీ. సాధుగోవు, మంచి యావు, సులభముగాఁ బాలు పిదికికొన నిచ్చెడి యావు (విల్యమ్సు).

రుతము. సం. వి. అ. న. మృగపక్ష్యాదుల అఱపు, కూఁత, ధ్వని.

రుతి సం. వి. ఇ. స్త్రీ. రుతము, ధ్వని.

రుత్త. వి. నాశము. వాని రూపు రుత్తాయెను పో (శ. ర.)

విశ. రిత్త, వట్టిది.

సీ. .. రుత్త లోటారంబు రిత్త చీడు, సొళ్లు వా రిక్తాఖ్య శోభిల్లుఁ... ఆం. భా. 3 15

రుత్తు. స. క్రి. కొట్టు, ప్రహరించు. (శ.ర., చి.ని.)

రుదనము. సం. వి. అ. న ఏడ్పు, రోదనము.

రుదితము. సం. వి. అ న. 1. రోదనము, ఏడ్పు. 2. ధ్వని.

సీ. గిరిగరుత్కండన క్రీడాసమారంభ దంభోళిరుదితముఁ ద్రస్తరించి... పి. శకుం. 3 93.

రుదురక్క = రుదురాక. వి. రుద్రాక్షము.

గీ. పులికళాసముకకపాలఖాదిపూఁత, జడలుఁ బొత్తంబు రుదురక్కసరులు కావి,పుట్టములు లాతమును జోగివట్టియయును, దవర నియ్యెంతిఁ జేరి దీవన లిడుటయు ...

అచ్చ. రా. అర. 53.

చం. తిరుపతి కొప్పులందముగఁ దీర్చిన బూడిద బొట్లు మంచి వేర్పఱచిన మించునట్టి రుదురక్కలపేరులుఁ గావికోకలన్.... శుక. 3 91.

రుదురాక = రుదురక్క. వి. (సం. రుద్రాక్షః) రుద్రాక్షపు పూస.

గీ. ...రుదురాకలిడ్డసంది, నూతనంహిత లిఖికించి చోరఁదొడఁగిరి... అము 4 46.

సీ. గబ్బి నిబ్బెంపుచన్గవ పైవ గలగల రుదురాకపేరులు ఝ్రూఁత లూఁగ... పార్వ. 4. 21.

చం. ... పొన్, పొదివిన యట్టి యేక మొగపున్ రుదురాకల దండ సందిటన్, వదనమువన్ మృదుస్మితమువర్తిలు యోగినిఁ గాంచి భక్తితోన్ ...

అహ. 3. 5.

రుద్దు. స. క్రి. (క. రుద్దు.) 1. మర్దించు, రాయు.

శా. బ్రద్దల్వారి ధరిత్రి లీల దెలిబాబాఁ జూచి వేఁటాడుచున్, రుద్దున్ ఘల్లున కొమ్ము కస్లెగయఁగా నూరారునవ్వల్వడున్...

శకాం. 2. 24.

సీ. వడితేచియుండినఁ బరఁగ మేనఁబొసంగఁ దైలంబుచేత రుద్దంగ వలయు ...

వేం. మా 4. 293.

2 తోము, నిర్మలముచేయు.

గీ ప్రామెఁ దొలిచెను వెలచెను దోమె రుద్దె, నవఁగ నిర్మల మొనరించెనమట యొప్పు...

ఆం. భా. 3. 127

జ. రుద్దుడు.

రుద్దుడు. వి. (√రుద్దు) తోమకము, తోముట.

సీ. తోముడు ప్రాముడు తుడుపు రుద్దుడు పులుము డవ మార్జన సంజ్ఞ పొలుచుచుండు.

ఆం. భా. 2. 160.

రుద్రజట. సం. వి ఆ. స్త్రీ. జటావల్లి, రుద్రజడ చెట్టు.

రుద్రజడ. మి. వి. రుద్రజట, సువాసనగల యొకానొక మొక్క (వృ. వి.) (వా.)

రుద్రజము. సం. వి. అ. న. పాదరసము.

రుద్రపత్ని. సం. వి. ఈ. స్త్రీ. 1. దుర్గాదేవి. 2. అతని, వల్లవిసిచెట్టు.

రుద్రప్రియ నం. వి. ఆ. స్త్రీ. పార్వతి, హరీతకి, కరకచెట్టు.

రుద్రభువి నం. వి ఈ. స్త్రీ. రుద్రభూమి, శ్మశానము.

రుద్రవింశతి. నం. వి. ఆ. స్త్రీ. ప్రభవాది షష్టి సంవత్సరములలో చివరి ఇరువది సంవత్సరములు. (ప్లవంగ మొదలు క్షయ వఱకు గలవి)

శ్లో. ఆద్యా తు వింశతిర్బ్రాహ్మీ ద్వితీయా వైష్ణవీ స్మృతా, తృతీయా రుద్రదైవత్యా శ్రేష్ఠ మధ్యాఽధమా భవేత్ ... (వాచ.)

రుద్రవీణ. నం. వి. ఆ. స్త్రీ. వీణాభేదము, ఒక విధమగు వీణ.

సీ. ... మంచి, నీళ్ల గిండియు గాజు నిలువుటద్దము రుద్రవీణకిన్నెర వట్టివేళ్ల సురటి. సురా. 106.

రుద్రవీణె(ణియ) మి వి. ఒక విధమయిన వీణ.

సీ. జాళువా చందువ జ్జాలవల్లిక తమ్మపడిగము వెత్తంపు బలక,రుద్ర. గీ. వీణె వింజామరలు వట్టివేళ్లసురటి... రసిక. 4. 4.

వ .. పికిళులు, బచ్చికోళ్లు, రుద్రవీణియలు, స్వరమండలంబులు... ప్రబంధ. 605.

రుద్రాక్రీడము. నం. వి. అ పుం. శ్మశానము.

రుద్రాక్షపిల్లి. మి. వి. మనోగతమగు భావమును కప్పిపుచ్చి పైకి సాధువుగాఁ గనఁబడు వంచకుఁడు, వంచకుఁడు. (బ్రౌ)

రుద్రాక్షము. నం. వి అ. న. 1. రుద్రాక్షవృక్షము యొక్క కాయ (జపమాలలో నుపయోగింపఁబడును). 2. రుద్రాక్షపూస.

గీ. చెవుల రుద్రాక్షపోఁగులు చవుకళింప. మనుచ 1.59.

ద్వి వలుద రుద్రాక్షతావళములు వక్ష, వలయంబులను నిడువాలైవ జడలు... పప. 3. 281 పా.

రుద్రాక్షపన్నెలు. మి, వి. బ. వస్త్రవిశేషము.

న. ... నిండువన్నెలును నుఱుతచాఱలవన్నెలును నురవన్నెలును పుప్పొడివన్నెలను గంటెవన్నెలును రుద్రాక్షవన్నెలును నాగబంధంబులను .. ద్వా. 3 188.

రుద్రాక్షి. నం. వి ఈ. స్త్రీ నంచెమల్లియ (వృ వి.). (శ. ర.)

రుద్రాణి. ం. నవి. ఈ. స్త్రీ రుద్రునిభార్య, పార్వతి.

రుద్రారి. నం. వి ఇ. పుం. కామదేవుఁడు, మన్మథుఁడు.

రుద్రావాసము. నం. వి. అ, పుం. రుద్రుని నివాసము 1. కైలాసపర్వతము. 2. వారణాసిపురము, కాశి. 3. శ్మశానము.

రుద్రుఁడు నం. వి, అ. పుం 1. శివమూర్తి భేదము (వీరు పదునొకొండుగురు.)

శ్లో. అజైకపా దహిర్బుధ్న్యో విరూపాక్ష స్సురేశ్వరః, జయంతో బహురూపశ్చ త్ర్యంబకో ప్యపరాజితః, వైవస్వతశ్చసావిత్రో రుద్రా ఇతి స్మృతాః. (వాచ.)

2 శివుఁడు. 3. అగ్ని. 4. ఏకాదశ సంఖ్యకు సంకేతము.

రుధిరము పుం. విశే. (అ. ఆ. అ.) ఎఱ్ఱనిది, ఎఱ్ఱరంగుగలది.

వి. అ. న. 1. రక్తము, నెత్తురు. 2. కుంకుమపువ్వు. 3. మణిభేదము.

పుం.1. ఎఱ్ఱరంగు. 2. అంగారక గ్రహము.

రుధిరోద్గారి. నం. వి. ఇన్. పుం. ఒకానొక సంవత్సరము పేరు. దుందుభి తరువాతిది.

రుద్ధము. నం. విశే. (అ. ఆ. అ) 1. అడ్డగింపఁబడినది, అడ[illegible]పఁబడినది. 2. చుట్ట[illegible]బడినది, ముట్టడిబడిన

రుప్పు = రువ్వు[1]. న. క్రి. జాలు మొ. విసరు. (బ్రౌ., వా.)

రుప్పాయిళ్లు వి. చెల్లాచెదరు.

శా. కాయం బెక్కడమంచెనేమి వనితా కందర్పుఁ బ్రాణేశ్వరున్, జాయంజాలవు ప్రాణముల్

మనసు రుబ్బాయిబూళ్లుగాఁ జేయుటన్, డాయ నవ్వచ్చుఁగదా పయోధరములంటం గాఁగిటం జేర్చి యా, చాయంబై కొని చెక్కునొక్కి రతిరాజ్యశ్రీలఁ దేలింపుదున్.
వేం. పంచ 3. 284.

రుబ్బు. స. క్రి. (క. రుబ్బు.) నానిన పప్పు మొదలగు వానిని ఱోటిలో వేసి పొత్రముతో మెదుపు.

(చూ. రుబ్బుఱోలు)

జ. రుబ్బుగుండు. రుబ్బుఱోలు

రుబ్బుగుండు. వి. (√రుబ్బు) రుబ్బెడు పొత్రము. (వా) ఇక్లే రుబ్బుపొత్రము (వా)

రుబ్బుఱోలు వి (√రుబ్బు) నానిన పప్పులోనగునవి రుబ్బుటకు ఱాతితోఁ జేసినసాధనము.

గీ. ఇలుకు ద్రాను పెరంటిలో నెక్కుబావి, మునుఁగలను జొప్ప పెనువామి జనుము రుబ్బుఱోలు పిడుకలకుచ్చెల దాలిగుంత ...
శుక. 2. 408.

రుమ. సం. వి ఆ. స్త్రీ. 1. సుగ్రీవునిభార్య 2. ఉప్పుకము, ఉప్పుపండుపొలము.

రుమాలు = రుమాలువు వి. ఉష్ణీష విశేషము, ఒక విధమగు తలగుడ్డ.

సీ తనకెంజడలచిన్నె తళుకు చంద్రిక వన్నె పూల సైకపు రుమాల్ పొలుపు గాఁగ ...
ఇందు. 1 7.

చం చిటిలిన గంధముం దళుకు చెంపను వ్రేలు రుమాలుజాఱు దుప్పటియును నిద్రదేఱు ముఖపద్మము...
శుక. 1. 515.

సీ. చెంద్రిక పూవన్నె జిలుగురుమాలుపై జాతి మిన్నల తురా చౌకళింప... దశా. 1. 71.

జ. రుమాలుగుడ్డ.

రుమాలుగుడ్డ. వి. (రుమాలు + గుడ్డ) చే రుమాలు, చిన్న రుమాలు.

సీ. అలకముల్ మాటి యాొదలఁ బాగఁజుట్టి పై వడ్డకట్టు, రుమాలుగుడ్డ కట్టి... వైజ. 2. 4.7.

రుమాలువు = రుమాలు. వి. ఉష్ణీషభేదము. ఒకవిధమగు తలగుడ్డ.

సీ. ముందర ముడిగొని ముంగొంగు వెలిపెట్టి మాటుచెంగావి రుమాలువులును.
రా. వి. 2. 44.

చం మినుకుఁ గడాని తాయెతు సమేళపుఁ గ్రొవ్విరి దిండు దండ డాల్పని వలెవాటు చల్వవలి పంపు రుమాలువు గట్టి ...
కువల. 2. 54.

గీ. మఱిరుమాలువు గాదని మత్స్యనేత, చొపసిగఁ గెంపు తాయెతు చేరుఁజేర్చె .
పాంచా 1 68.

రుమీచూరకత్తి. వి చిన్నకత్తి, సురియ.

మ. తల నిద్దాతగటీలు పేరణుల పైదట్లున్ రుమీ చూరకత్తులు జోళ్లుం బదనించినట్టి కటిహేతుల్ తళ్కుగుల్కంగ రి, క్తులురన్నైత్రకరాళ వక్త్రములన్ గ్రక్షోణిఁ గంఖాణికా, వళికందోళి సలాముఁ జేయ యవనవ్రాతంబు భూభర్తకున్.
రా. వి. 2. 52.

రుమ్మీపిరంగి. వి. గుండ్రని యొకరకపు పిరంగి.

గీ మేఁత గొనివచ్చు తమ్మి రుమ్మీపిరంగి, దొరతురంగివిలాసంబు దొరయఁగొల్చు, గంపవింటికిఁ దెచ్చు నాకాపుబిగువు, టొంగవగల గుబ్బలాడి యొక్కొక్కవేళ. శుక. 2. 410.

(తమ్మిరుమ్మీపిరంగిదొర = మన్మథుఁడు.)

గీ యోగికైవడి మిగుల విరాగిరీతి, వదియొ లోకంబుగా నున్న నాపడంతి, నేఁప రాలెడు తమ్మిరుమ్మీపిరంగి, వీరు మటుమాయ మాయింప నేరదయ్యె.
సుదంశా. 2. 157.

రురువు. సం. వి ఉ. పుం. 1 మృగభేదము, ఒకజాతి లేడి. 2, ఒకానొక రాక్షసుఁడు.

రువాణము. విశే. చక్కనిది, సుందరము.
(వి, కాంతి. అని శ. ర.)

చం. కలకల నవ్వు చక్కనిమొగంబు వెడంద, యురంబు సింగముం, గలంచు రువాణపుంగవును గల్గిన యాకురువీరపుంగవున్ ... విజ. 2 21.

గీ. పిడికిటమ్ములు వీఁపున నిడిన పొదియుఁ, దెలిరువాణపు వెదురు ముత్తియపుఁ జేరుఁ, గలిగి యొటుకు నాయంకుఁ డొక్కండు వచ్చి, పుడమిరావెల్పురాయని కడనునిల్చి ...
చంద్రా. 2. 40.

రువారము, విశ. 1. సవిలాసము.

ఉ. వచ్చి పురంబు వాకిట రువారపుఁ గోడె తనంబు తోడఁ గన్నిచ్చకు వచ్చు చేడియల నెచ్చరికించుచు ధూర్తకోటితో, మచ్చరికించుచున్ . విక్ర. 8 8

2. సుందరము, చక్కనిది.

చం. ... తోఁచెఁబయిఁ గ్రొందొగ రివ్వడు నెమ్మితో నిశావనిత మఱుంగువట్టిన రువారపుఁ జెంద్రిక పావడో యనన్ ....
చంద్ర. 4. 72

సీ. వాలు మెఱుంగు రువారంపుఁ గొనగోటఁ జెక్కిలి నొక్క నొచ్చెవని వేఁడు ...
మల్లపు. 4 92.

ఉ వచ్చె వసంతకాలము దువారపుఁదేనె పసిండి నీరువన్, బచ్చెవ మూఁటతేఁటి నిను పౌజులఁ దీరుగ వ్రాసియున్న యా, వచ్చనివిల్లువంచి సుమబాణుఁడు పాంథుల ధైర్యవర్మముల్, గ్రుచ్చి చవంగ మవ్వమగు క్రొవ్వునఁ గ్రొవ్విరి తూఁపు తేయఁగన్ ... మద. 2. 45.

3. ఇంపు.

మ. గరుడారోహమొనర్చు మాధవు క్రియన్ గాండాపతంసంబు బంధురలీలాగతి నెక్కి రానుతుఁడు! దోర్దోస్సైన్యముల్ గొల్వఁగా, నొరిదిన్ సన్నరుమాలుహొన్ నరిగెకుచ్చుల్ చెన్నువన్ జౌకళించ రువారంబుగ వాద్య నాదముల దిక్చక్రంబువన్ నిండఁగన్.
ఇందు. 2. 55.

వి. ఒయ్యారము, విలాసము.

ద్వి. అనగ వాలిగు వారువారంబు, లానీటు లాపాట లావికాసంబు ..
రఘునా 32. పొ. 12 పం.

ఉ. వచ్చినఁ జూచి కీరము రువారము మీఱ ముఖారుణద్యుతుల్, బచ్చెన వన్న నా నృపతి పాలికిఁ బోయొదవేమొ పొమ్ము... శుక 2. 97.

రువ్వ. వి. దమ్మిడి. (శ. ర., బ్రౌ.)

రువ్వపులుఁగు వి. కాటుకపిట్ట.

సీ. ... కాటుకపిట్ట రువ్వపులుఁ గనఁ దవరు ..
అం భా. 2 91.

రువ్వము వి (సం రూపమ్) తడవ, ఆవృత్తి

కం. పది రువ్వ బులు భక్తిం, బదిలుండై వినఁగ వలయు భారతము జగద్విదితగుణ వాని కన్నిటి, కొదవు ఫలము తేర్పబడింతు కోలిశ నీకున్ . హరి. ఉ. 10. 283.

సీ తొలుత రువ్వము వినఁగలుగు వగ్నిష్టోమ యాగంబు ఫలముఁగామార్గసిద్ధు, లీ లోకమును వఁ గాంచి... హరి. ఉ 10 284.

రువ్వు[1] అ. క్రి. విసరు, వీచు

ద్వి. విడువక రువ్వెడు విషమ వాయువున..
ద్వి. హరిశ్చ పూ. 2157. పం..

=రువ్వు స. క్రి 1. విసరివైచు.

మ. ధరఁబాంథుల్ బెగడొందఁ ద్రిమ్మరియె భద్రశ్రీమహీభృన్న్మృపా, నరసాలానవసత్య శృంఖలిత చంచన్మారుతేభంబు కేసరసాలా నవపత్రముల్ తులుమమన్ జైత్రాహజాగ్ర ద్విలానరసాలా నవధిప్రసూన రజముల్ సారెన్ బయిన్ రువ్వుచున్ . చంద్రి. 4. 32.

వ. విద్యాధరసందోహంబుల రువ్వినవు జెందినవముప్వఁపుఁ జెందిరంబును ..
భీమ. 5. 120.

2 చిమ్ము, చల్లు.

ఉ. .... అ, తంకవిధాయి తీవ్రవికటల్ వెద చల్లుచు నూర్పుగాడ్పు కూ, లంకష సప్త

సాగరజలంబులు తువ్వరగాఁగ రువ్వుచున్.
వరాహ 7. 7.

3. గ్రుద్దు, పొడుచు

వ. . . పాదంబుల జవురుచుఁ బిడికిళ్ళ రువ్వుచు వలశేతులం జాదుచు ... వీర 4. 107.

వి ఆక్షేపము, విసరుట.

కం. అని జవ్వను లవ్వనిఁ గ్రొవ్వునఁ బువ్వులు గోసి కడుదవులొల్లకను నవ్వుల్, వనరువ్వులు కొందఱు మెచ్చని చివ్వలు నివ్వటిల్లఁ జని యవ్వలనన్ కువల. 4. 143.

కం. ఎవ్వారికి వలచెనొకొ యీ, జవ్వని యని రవ్వ మీఱు సోక్తులు లే,నవ్వులు ముడిచినపువ్వుల, రువ్వులుఁ దనయందె సమధిరూఢము లగుటన్.
పాండు 3. 66.

రువ్వు². వి ఆవృత్తి, వల్లె

ద్వి ఆ తరువాతఁ దా నాతరువాయి, యేతరి యోజ రువ్వియుఁ బోనంత ...
ద్వి. పరమ. 2. 127. పొ.

సీ వినుము రె డవరువ్వు విని యతిరాత్ర యజ్ఞము షణ్మ్యమొందె భోగముల నెలమి.
హరి. ఉ. 10 284.

సీ. పదవర్ణ సౌష్ఠవ ప్రకటనం బెంతయు నిపు మీఱంగ రువ్విచ్చి యిచ్చి ...
కళా. 4. 42.

రువ్వు³ వి. వేగమునందగు ధ్వని కనుకరణము.

కం తూరుపు తెలతెలనై రాఁగా రువ్వున విసరునీఁద గాడ్పులు నయ్యా సారమును ముట్టుకొనె ... వెం. పంచ. 1. 483.

చం. విడివడి రువ్వునన్ గగనవీథికి గుఱ్ఱము చౌకళించినన్ ... కువల. 4. 163.

రుశత్ (శత్రంతము) హాని చేయుచున్నది, అనిష్ట మగుచున్నది, అసంతుష్టి గలిగించుచున్నది (మాట.).

రుశతి నం. వి. ఈ. స్త్రీ. అశుభకరమైన వాక్కు, అమంగళమైన మాట.

రుష. సం. వి. ఆ. స్త్రీ. కోపము, కినుక.

రుషితుఁడు. సం విణ అ. ఆ. అ. కోపగించినవాఁడు.

రుష్టుఁడు. సం విణ. (అ. ఆ. అ.) రుషితుఁడు.

రుసి. వి (సం ఋషిః) ఋషి.

సీ. కోపాగ్నిఁ గడుఁబరితాపంబు నొందెడు రుసులకు వభయంబు లొసఁగెఁగాన ...
భీమ. 2 12.

రుహ. సం వి, ఆ. స్త్రీ. దూర్వాతృణము.

రుహము. సం. విణ. (హ్. అ ఆ. అ.) సమాసాంత ము) మొలిచినది, బయలుదేఁనది.
ఉదా. మహీరుహము.

# రూ

రూ. సం. వి ఈ. స్త్రీ. బంగారము.

విణ. కామరూపము కలది (నానార్థరత్నమాల).

రూక వి. (సం రుక్మమ్.) 1. ఒకానొక నాణెము.

సీ మోసపోయితి దీని మంతవాటునకై నఁ జేకూర్పలేనైతి రూకరుట్ర .. నిరం. 2. 123.

సీ. రూకంతగాని లే దేకై నది నముంబు వచ్చు బంగారుమై హెచ్చుడిగికి ... సారంగ. 2.47.

ద్వి. నూఱు మాడలకు మున్నుగ రూకవడ్డి ...
ద్వి. కల. 1. 221.

2. ధనము (శ. ర.).

రూకపాత్కె. వి. ఓషధీ విశేషము.

చ. గురుగెల బొద్ది చెంచలియుఁ గుచ్చలి చిట్టి తగిర్సి తుమ్మి దు,స్సరి బలుగూటి బొద్ది నెలి చల్మిడి పల్లెరు రూకపాత్కె వెల్వరిగిసె ముగ్గ వెల్గ ... హంస. 4. 132.

రూక్షగంధకము. సం. వి. అ. పుం. రూక్షగంధము.

రూక్షగంధము. సం క్లీవి. అ. పుం. గుగ్గులువు.

రూక్షణము. సం వి. అ. న. 1. ఎండించుట, శుష్కముగాఁ జేయుట.

**రూక్షదర్భ.** సం. వి. అ. పుం. తృణవిశేషము. హారిదర్భ (వృ. వి.).

**రూక్షపత్త్రము.** సం. వి. అ. పుం. శాఖోట వృక్షము.

**రూక్షప్రియము.** సం. వి. అ. పుం. ఓషధి విశేషము.

**రూక్షము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. కఠినమైనది, కఱుకైనది. 2. ఒగరైనది. (రుచి). 3. ఎండినది, శుష్కమైనది.

వి. అ. పుం. 1. వృక్షము, 2. దంతి, నేపాళము. (వృ. వి.).

**రూడి.** వి. (సం. రూఢిః) 1. స్థైర్యము.

కం. వేడుక నమ్మౌని మ్రుందటం, బాడిమి మాడి డితిమి పెక్కు వరహానంబుల్, రూడిగం బలికితి మెల్లుం, జూడదు మావలను నీరసుం డన మండెన్. భార. ఆది. 6. 156.

గీ. పదురంములు వర్తించు రూడగాంగ, నమ్మ హానిధి ... మార్క. 5. 117.

2. నిశ్చయము.

ద్వి. రూడిగా రాకుమారుని జంపె వనెడి, యాడిక తలంగూడె నభిమాన మెడలె. ద్వి. హరిశ్చ. ఉ. 2481. పం.

3. ప్రసిద్ధి (చూ. రూడికెక్కు.).

జ. రూడికెక్కు.

**రూఢికెక్కు.** అ. క్రి. (√రూఢి) ప్రసిద్ధికెక్కు.

సీ. నీతేంసుట్టులు నీఱయిపోయినం బాండు సుతులము చెప్పంగం బూవ, గీ. లేకపోదె యుబ్బుంగం బల్కి... ముసుకుందు, తోడ నేను మీ రెమ్మెయి రూఢికెక్కి, వెలుంగ గోరుట కతమునం దంచి చానినోలనుతుం డెత్తిపెట్టె నేమనంగంగలరు. భార. అశ్వ. 1. 168. దశా. 1. 119.

**రూఢము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. మొలిచినది, మొలక యెత్తినది. 2. పుట్టినది, ఉత్పన్నమైనది. 3. ప్రసిద్ధమైనది, సర్వవిదితమైనది. . నిశ్చితమైనది, రూఢియైనది, 5. అవయవశక్తిని అపేక్షింపక రూఢ్యర్థమందు ప్రసిద్ధమైనది.

(ఉదా. లావణ్యము మొదలగునది).

**రూఢి** సం. వి. ఇ. స్త్రీ. 1 పుట్టుక, ఉత్పత్తి. 2. ప్రఖ్యాతి, ప్రసిద్ధి.

ని. రోహిణాకాంత మనురూఢిగా కందిత మహనీయరత్నసామగ్రి గలదె ... కా. సం. 3. 246.

3. సంప్రదాయము, ఆచారము, వాడుక 4 వాడుకలోనున్న యర్థము, ప్రకృతి ప్రత్యయముల యపేక్షలేకుండంగ బోధపడెడి యర్థము, యౌగికము కానియర్థము

**రూణించు** స. క్రి మల్లు లొక విధముగా బంధించు (చూ. రూణింపు)

జ రూణింపు.

**రూణింపు.** వి (రూణించు) మల్లబంధ విశేషము.

వ. ... పెట్లాగును రూణి షను సరిబిత్తరంబును .. నాదియగు ముప్పదిరెండు విన్నాణంబుల నాణెంబు పరీక్షించి... కాంస. 1. 206.

వ. ...పెట్లాగును రూణింపును సరబిత్తరంబును... ప్రబంధ. 78.

సీ. రూణింపు బరిపోటు రొండిప్రేటు.

గీ ... మెరపట్టునాంగం జెన్నలరుచుండు, ముప్పదియు రెండు విన్నాణములకుం జెల్లు. అం. భా. 2. 209.

**రూపకతాలము.** సం. వి. అ. పుం. సంగీతతాళభేదము, నియమిత కాలభేదము.

**రూపకము.** సం. విణ. (అ. ఆ. అ.) మూర్తము, ఆకారము కలది.

వి. అ. న 1. ... ము, రూపు. 2. ... నాట్యము ... ము ...) రూపకములు ... ది. ఉపరూపకములు ... నెనిమిది. 3 అర్థాలంకారములలో ... మేయోపమాన ము... అభేదముగా ... చును.) 4. మూండు గుంజెండిగింజల యెత్తు ... (... మానము).

**రూపగంధ** సం. వి. ఆ. స్త్రీ. మూరుకొండ (వృ.వి.).

**రూపగు.** అ. క్రి. (రూపు + అగు.)

1. ఏర్పడు, కలుగు.

మ. . వరుల్ భ్రాంతివహించు రేల పిశితాస్థుల్ గూడి రూపైనమోహిని యేకార్యము కావ రాసి పురుషుం డీక్షింపఁ గాంక్షింపగన్. ప్రబోధ. 4. 12.

చం. విలయక్శానుకీలముల వేఁడిమిఁ గోడిమి మాలి వెల్మిడిం, గలిసిన భూతధాత్రి మటి క్రమ్మఱరూపయి నిల్చి... వ.చ. 2. 10

2. ప్రసిద్ధి కెక్కు.

చం. విపుల ధరాధరాగ్రమున వేలుపుమూఁకల ఁచ్చరావి ది,వ్యపరిమళంబుతోఁ గడవలంతలు పండువిప్జ్లుపింగునా, కిరితిపయోధి ద్రచ్చు నెఁ గేళవృ పై మఁమాలచెర్పఁ జేరి పడయోఁ గేతమాయమన రూపగు వర్షము దానిపేరిటన్. వరాహ 10. 120.

3. సంపన్నుఁడగు.

కం. ఏవిట రూపగుఁబురుషుం, డేమెయి రూపు సెడు నాకు నెటిఁగింపుము తేజోమహిత యనిన... భార శాం. 5. 3.

**రూపడఁగు** (రూపు + అడఁగు.) 1. నశించు, నిర్మూలమగు.

కం. కోపంబున భృగుపతి ప్రతి,రోపంబులు నృపుని శరధి రూపడఁగించెన్. దశా. 6. 106.

2. చచ్చు.

మ... లెక్కింపఁ బెక్కై, నకా,ల్వర మొత్తంబులు రూపడంగె... భార. కర్ణ. 2. 200.

**రూపడఁచు.** స. క్రి. (√రూపడఁగు.) 1. రూపు మాపు, చంపు

చం. ఉడుగని బాష్పపూరముల నుగ్మలి యవ్విభు పాదపద్మముల్, దడుపుచు వర్ధరాత్రి శత ధన్వుఁడు తండ్రి నకారణంబ రూ,పడచుట యున్ శమంతక మహామణిరత్న మతిప్రియ త్నమే,ర్పడఁ గొని చన్న ధార్త్యము సహోరవు దుఃఖము తోడఁ జెప్పినన్ ... వి, పు. 6. 282.

సీ. ... వార్ధిఁ గలంచి పాంచజన్యంబు చేపట్టి రూప, గీ. డించె నా జరాసంధుఁ బాండపుల మనిచె ... — ఉ. హరి 2. 84.

2. వశింపఁజేయు.

చం. ఎరగలి చిచ్చు గాఁడవి యెల్లను జెల్లగ నొక్కపాయగా, దరికొని రూపడంచిన విధంబున ... భార. భీష్మ 2. 5.

సీ. కోపంబు మీఱఁగాఁ జాపంబుఁ జేపట్టి రోపంబుచే దాని రూపడంచె ... దశా. 2. 395.

**రూపధేయము.** సం. వి. అ. పుం. రూపము, ఆకారము

కం. శ్రీయోగ స్త్రీయోగ వ,శాయితరోమాంచ భూషణ నిరీక్షణ యా,మ్నాయమయభావన కృతా, ధ్యాయస్మృత రూపధేయ దత్తాత్రేయా చంద్ర. 5. 1.

**రూపనాశనము** సం. వి. అ. పుం. కౌశికము, గుడ్లగూబ. (విల్యమ్సు).

**రూపము.** సం. వి. అ. న. 1. ఆకారము, రూపు. 2. శుక్లాదివర్ణము 3. సొగసు, అందము. 4. స్వభావము, గుణము. 5. స్థితి, స్వరూపము.

గీ. ... ఉన్నరూప మేర్పడఁగఁ జెప్పుము ... దశకు. 2. 93

కం. తమయ కడుమెచ్చయు తోడ పుత్రమ రూపముగోరువారు దాల్తురు దానిన్ ... భార. ఉద్యో. 2. 40

6. సామ్యము, పోలిక.

(సమాసాంతమున ఉదా. తపోరూపము.)

7 విభక్తి ప్రత్యయముల యొక్కయు క్రియా ప్రత్యయముల యొక్కయు చేరికచే మార్పు చెందిన రూపము. 8. ఒకటి, ఏకసంఖ్య. 9. నాటకాది రూపకము, కంఠపాఠము చేయుట, వల్లె వేయుట, 10. ఒకనాణెము, రూప్యము.

11. శబ్దము, పదము. 12 (గణిత.) వ్యక్త రాశి. 13. మృగము, జంతువు. 14. పద్యము, శ్లోకము. 15. పేరు, ఆఖ్య. 16. అగ్ని గుణము.

**రూపరి.** విశ. (రూపు + అరి) రూపవంతుఁడు, సౌందర్యవతి.

మ. స్ఫురణం బాసిన సజ్జనుండు ధన లుబ్ధుండైన రాజున్ నిర,క్షరుఁడౌ రూపరి రచ్చలో ఖలుఁడు.
మల్లభూ. నీతి 46.

**రూపఱు** అ. క్రి. (రూపు+అఱు). 1. చచ్చు. మృతి నొందు.

కం. వెలవారి నెల్లఁ దరమికి, నలుకుమఁ బాండు క్షితిశనందనులను రూపఱ నేయం జేయూడదు.
భార. ఉద్యో 4. 150.

ఉ. ... కాలు చేతి బ,ల్లొ)క్కల నమ్మను ప్రభృతు లున్ దుదరూపఱకుండ నేర్చరే. ఆము. 2. 78

సీ. ఒక దైత్యుఁడొకరి యా భంగి రూపఱఁజేసి రక్షించె నేకచక్రాపురంబు ...
భార. విరా. 1. 74.

2. నశించు, చెడు.

పీ. సోమపాన క్రియ చొప్పులు రూపఱె హుత ములు కలవయ్యె హుతవహునకు ...
హరి. పూ. 1. 100.

కం. కోపముఁడగు దుర్వాసుని, శాపంబున దివిజ రాజ్య సంపద లెల్లన్, రూపడిన చంద ముజ్జుఁ, డా పురుషోత్తముని తోడ వంతయుఁ జెప్పెన్.
వి పు. 1. 169.

సీ. మనుజేంద్ర సంకల్పమునఁ బుట్టుఁ గామంబు రూపఱు దేహనిరూపణమునఁ ..
భార. శాం. 3. 421.

3. రూపుచెడు, విఱుగు.

చం. జనకుఁడు మెచ్చఁగా హరుని చాపము రూపఱఁజేసెఁ జెంపుతోఁ, దన భుజవీర్య శుల్కము కతంబున సీత నయోనిజాత నే, ర్పున వరియించి హైహయ పురోగమ రాజకులాంబుదప్రభం,జను జమదగ్నిసూను భుజసత్వ మపాస్తముఁ జేసె ధీరతన్
వి పు. 5. 320.

4. విరూపమగు.

గీ. ... వృకోదరు పల్కు దప్పకుండఁ దద్గదా దండప్రచండనిహతి, రెండు దొడలును విఱిగి ధరిత్రిఁ జెలుచఁ, గూలి రూపఱి రారాజు ధూళి గ్రుంగె. కావ్య. 1. 9

**రూపవంతము.** సం. విశ తో ఈ తో 1. ఆకారము గలది, లేక రంగుగలది. 2 శరీర సంబంధ మైనది. 3 మూర్తిమంతమైనది, శరీరము ధరించినది. 4. సుందరమైనది, అందమైనది

**రూపసి.** విశ. (√రూపు) సౌందర్యవంతుఁడు, సౌందర్యవతి.

కం. ... అంచితగుణుఁడు గిరారూపసియునగు, సుతుఁ గోరుదు నెపుడు నేను సురగణవంద్యా.
భార, ద్రో. 2. 190.

శా. ఈ రూపే కలలోపలం కలసె వన్నె రూపు నంజేరు నా, కీరూ పింతటి మేటిరూపసికిఁ దా నిల్లాలుగా నోము న,గ్గారా మేలలితాంగికిం గలుగు ... ఉ. హరి. 5. 155.

గీ. రోగశంకా విహీనుండు రూపసియును ....
హర. 2. 53.

క. రక్కసిమగువలయందును, జక్కలదెలలందు వేల్పుచానలయందుం, బక్కదొరకొలువువనలా, రొక్కమునందైన నిట్టి రూపసి గలదే.
అచ్చరా. రా. అర. 19.

గీ. అతిథుల యందైన మఱి యపత్నికుఁ డనుము, బ్రాహ్మణార్థంబుఁ జెప్పరేపాటివారు, నొకతె రూపసిగాఁ కున్న నోసియన్న, నోయనెడు మాత్రమునకైన ను డపలయు.
శుక. 3. 345.

ద్వి. బాపురే యమునానఁ బవిలేమగాక, రూపింప వాకంబె రూపసి గ దె ...
ద్వి. హరిశ్చ. ఉ. 1036 పం.

రూపాజీవ. సం. వి. అ. స్త్రీ. వేశ్య, లంజె.

రూపాయ. వి. ఒక వెండినాణెము. (తారకా వర్ణ నము.)

సీ. కాలంబు పేరి చీకటిగొంగకు వణంకి పాఱంగఁ జల్లు రూపాయ లనఁగ... సుదంశా. 2. 150.

రూపార్చు(ఉచు). స. క్రి. (√రూపాఱు.) రూపుమాపు.

గీ. గబ్బిబెబ్బులి డాకాల ద్రొబ్బి విరియఁ, బ్రామి రూపార్చుకున్న నీ బంటఁగాను.

రూపాఱు = రూపఱు. అ. క్రి. (√రూపు) నశించు, చెడు. (చూ. రూపార్చు.)

రూపాస్త్రుఁడు సం. వి. అ. పుం. మన్మథుఁడు.

రూపించు స. క్రి. (√రూపు.) నిర్ణయించు.

శా. పెంపేదం దమకిట్టి తక్కునలు రూపింపంగ నేలా ... భార. ఉద్యో. 3. 103.
భార. ఉద్యో. 1. 25.

2. విమర్శించు.

ద్వి. జాపురే యెంతనేర్పరి యొకో నలుఁడు, రూపింపఁ బెద్దయు రూఢికినెక్కి, యరుగు దీర్చిన మాడ్కి వలవడఁ దీర్చె ...
(రం. రా. యు. 316 పు. 14 పం.)

శా. గోపాలత్వ విరూపుఁడైన కతనం గ్రొవ్వ గ్గలంబై మదివ్, రూపింపం జొరకేను నిన్ను నిట సంరోధించి బాధించితిన్ ...
హరి పూ. 7. 199.

రూపిక. సం. వి. అ. స్త్రీ. శ్వేతార్కవృక్షము.

రూపు. వి. (సం. రూపమ్.) 1. ఆకారము.

గీ. వినయమున ద్రోణురూపు మన్నన నమర్చి .. భార. ఆది. 6. 232.

కం. తన యింట నొండెడకు వెం,దును బోవక నెమిలిరూపుతో నొప్పెడు కే,తనము తనరారు, చోటికిఁ జని యాసీనుఁడయి యాప్తజనములు వొగడన్. హరి. ఉ. 7. 21.

2 సౌందర్యము, చక్కఁదనము.

కం. నీ రూపు చూచి వలచితిఁ, గారుణికాగ్రణివి నన్ను గైకొనుము పరీ,హారంబునకుం గారణ, మేరూపునలేదు... హరి. ఉ. 8. 96.

గీ. ధరణిధరకన్య నిందించెఁ దనదు రూపుఁ, బరులు మెచ్చని చెలువు నిష్ఫలమ కాదె .. హర. 4 3

వ. ... సకల సీమంతినీ సీమంతముక్తామణియగు నాముక్తమాల్యద రూపు నెలప్రాయంబు సాభి ప్రాయంబుగాఁ జూచి తనలోన ...
ఆము. 6 104.

3. దేహము, శరీరము.

కం. నరతురగద్విరద రథోత్కరముఁ లలో నతని శరముదాఁకని రూపుం, బరికింపఁ గాన నద, త్వరితత్వంబునకు వేఱువర్ణన యేలా
భా. ద్రో. 4 70.

గీ. మన్ను గేస్తుఁడు నగ్గియు మిన్ను నీరుఁ. బ్రొద్దు నెలగాడ్పు లెవ్వాని రూప లయ్యె ...
నీలా. 1 12.

చం. దొరఁకొని పూర్వజన్మమున దుర్జనశిక్ష యొనర్పఁగాని సుస్థిరమతి రాజ్యభోగములు చేకొనఁగాఁ దటిలేమి నాత్మలో, హరి తలపోసి సౌఖ్యముల నందఁగఁ దత్పురిఁ జెక్కురూపులై, సొరిది జనించె నా నృపతిసూనులు వొల్తురు శ్రీసమేతులై ... విక్ర. 1. 71.

సీ. ధర్మభూమిధరంబు పలురూపు లాయెనో యన మించు నర్మ్యహర్మ్యములు గలుగ ...
ఉ. రా. 1. 233

4. విధము.

కం. నారాయణాస్త్ర మిమ్మెయి, వైరిచమూ సంచయంబు వధియింపకపో, రారాజును ద్రౌణి యుఁ దా, రేరూపున సంచరించి రెటఁగింపు తగన్ ... భార. ద్రో. 5. 391.

కం. ఈ రూపునఁ బోలివోయిన, వీరములో వృష్ణి భోజవిభు లేతేరన్, ద్వారవతి కరిగి నిలిచితి ...
ఉ. హరి. 2 35.

కం. మారుఁడు దుష్వారుఁడు సం.సారమిది యనాది వంశసంరక్షణ మం,ఖోరుహవదవల చేతిది, యే రూపున జాతిశుద్ధి యేర్పఱుప నగున్...

నైష. 7. 67.

వ. తనదు సాకార నిరాకారతలు వారికిఁ జూపు జూపున దీపించు వాని... ఆము. 6. 98.

5. స్థితి.

చం. ... దానిది కలరూపెఱుంగ నవనీపతి యుత్సుకుఁడయ్యె నాత్మలోన్ ...

భార. ఆది. 4. 30.

కం. . . కల రూపెఱుఁగంగఁ జెప్పు క్రమ్మఱ నాకున్... భార. కర్ణ. 1. 12.

వ. ... మాయంగుళీయకంబు నీకెట్లు కలిగె? ఉన్న రూపు చెప్పుము... కాశీ. 4. 100.

6. నిజము, సత్యము.

ఉ. వారుగలరు వీరుగలరు, పోరికివని చెప్పెదీవు పొంగారుచు మీ,వారిని మిమ్ము నమ రేపు గ, దా రూపేర్పడఁగఁ జూచెదం గితనసుతా.

భార. ఉద్యో. 4. 206.

7. కన్నెపిల్ల మెడలోఁ గట్టిన బంగారునాణెము.

ఉ. ... నేఁ, జేరక పూవుదీవియలచెంతనె నిల్చి లతాంగిరూపు క,న్నారఁగఁ జూచి వచ్చితి నవాంబురుహాంబక నీకుఁ దెల్పఁగన్...

వసు. 2. 55.

ఇ. రూపగు, రూపడఁగు, రూపడఁచు, రూపర్చి, రూపఱు, రూపని, రూపార్చు, రూపాఱు, రూపించు, రూపుమాపు, రూపువిలాపించు, రూపుమాయు, రూపుసెడు.

రూపు (లు) మాపు. స. క్రి. (రూపుమాయు) 1. నశింపఁజేయు.

ఉ. బుద్ధులు సెప్పుచెల్ల నటుపోవిడు మెమ్మెయి నైన సౌఖ్యసం,సిద్ధి యొనర్పు నాకు నెడ సేసి నఁ దావము రూపుమాపు ...

భార. విరా. 2. 76.

మ. .. డెందములోన ధర్మపటిమం ద ద్భూమి సేనాంగద,ర్ప సముద్రేకము రూపుమావ,గళిత ప్రారంభులై రంతటన్. రాఘవ. 2. 20.

2. చంపు, మృగికొందించు.

మ. ... దుప్పులఁ నుగ్గునూచఁబులై, పొలియం జేసి వరాహసంఘముల రూపుల్మాపి సింగం పుగుం,పుల నెల్లం దెగటార్చి... శుక. 1. 176.

రూపుమాపించే. స. క్రి. (రూపుమాయు.) నాశము చేయించు, చెడఁగొట్టించు.

వ. ... పౌండ్ర భూపాలుండు...స్వస్తిక సర్వతో భద్రనంద్యావర్తపిచ్ఛందకాదిహర్మ్య ప్రాసాద సౌధంబులు రూపుమాపించియు ...

ఉ. హరి. 3. 36.

రూపుమాయు అ. క్రి. (రూపు+మాయు.) నశించు, చచ్చు.

ఉ. ముగ్గెడు వాహనంబులును మోములు వాడఁగ వాహనంబుల,న్డిగ్గి, తలంగు సైనికులు నేలకుఁ గష్టపుఁ జొప్పుసొప్పఁన్, దగ్గు నిడం బులుం గులముఁ దన్నుఁ దలంచి యెదిర్చి యొంటిమై, మగ్గెడువాఁడునై కురుధరావరు సైన్యము రూపుమాయఁగన్

భార. కర్ణ. 2. 355.

రూపుసెడు. అ. క్రి. (రూపు+సెడు.) నశించు, చెడు.

అ. అంత నిలక యమ్మహాబలు నిగ్రహీతుఁ, జేసి శత్రుబల విజృంభణంబు, రూపుసెడ హరింతు నేపున వావార,లెల్లఁ జూచి సంతసిల్ల నను...

రాఘ. 4. 197.

కం. ఏమిట రక్షగుఁ బురుషుం, డేమిట రూపు సెడు నాకు వెలిఁగింపుము తేజోమహిత యనిన నతఁ డా,భూమిపతికి నిట్లనియె భూపప్రవరా ... భార. శాం. 5. 3.

రూపస్యము. సం. విశే. (అ. ఆ. అ.) 1. అందమైనది. మనోజ్ఞమైనది.

వి అ. న. వెండి. 2 వెండినాణెము. 3. బంగారము.

**రూప్యాధ్యక్షుడు.** సం. వి. అ. పుం. టంకశాలకు యజమానుఁడు, కోశాధిపతి.

**రూషకము.** సం వి. అ పుం. వాసకవృక్షము. విశ మిశ్రితము

**రూషితము.** సం విశ. అ. ఆ. అ. 1. ధూళి మొ. వానిచేఁ (ఖాయఁబడినది,) కప్పఁబడినది. 2. కఱకుగా చేయఁబడినది. 3. రత్నఖచితమైనది.

# రె

**రె** అవ్య. ఆశ్చర్యార్థకమును వాక్యాలంకారమగు, నఁట, బాపు మొదలగువాని కనుప్రయుక్తము.

గీ. మైకాఁకకు నుజల్వమందులఁ బెట్టేరు దీనిచేఁ గాఁకలు దీఱునఁటరె.... కలు. శ. 18.

చం. సర్వములయారెమేలు(శులి బాగురెమూర్ఛవకంపితంబు బాపురె... ఉ. రా 6. 135.

**రెంచే** వి. (జూదమునందు) రెండు (శ. ర.).

**రెంజితుంజి** క్రి. విశ. సంపూర్ణముగా, పూర్తిగా.

ద్వి. దేవహెచ్చరిక దైతేయారి యనుచు, కీవిమైమున్న కట్టికవారు నడువ, వలరు శంఖధ్వను లడరంగ దైత్యకులవధూగర్భార్భకుల రెంజితుంజి, యటిముటి మురువేప నా వాద్య గతులఁ, గుఱుచల నిడఁదలఁగూడి వాయింప, సన్న మెఱింగి యాసన్నకాళియలు, సన్నలోమగఁ గూడి ఆళిమఁబూరింప .... అ. మ. క. 5. 2. 41 పొ. 14 పం.

**రెంట.** వి. (√రెండు.) 1. రెండగుట.

కం. తారెట్లట్లగఁ దమ్ముఁ, జేవ మంత్రింపు నరులఁ పేడియచన్నాల్,లో రెంట బుటి పె ఆము. 5 23.

ఉ. బంటుతనంబు పెంపెసఁగఁ బచ్చరి కారుణ్యక మొక్కు వెట్టి యా, యొ ౹రియైనయట్టి శివయోగరముద్రము నాదు కోలలన్, రెంటలుచేసి శీఘ్రమువ నిక్కముగాఁ జలికొండ కూఁతుపు. ట్టింటికి వెంట గౌరి చన నీశునితోఁ బఱతున్ సురాధిపా.... వీర. 2. 85.

2. (నీతి) ద్వైధీ భావము.

గీ. ... షడ్గుణములగుచుఁ, బేరుకొనఁగాను వగు సంధిపోటుపోక, యునికి రెంట ననండన సుగ్రమూర్తి .. అం. భా. 2. 169.

విశ. రెండర్థములు గలది (వాక్యం.)

గీ. భోగి సహవాస సంబంధములు భజించు, భువన భారి హస్తంబునఁ బోయుమనుచు, రెంట మాటల బలిఁ బ్రతారించినట్టి, దంభవామన మామవస్తావ ముదుపు. నైష. 8. 148

**రెంటఁద్రాగుడుమెకము.** వి. (రెంటఁద్రాగుడు + మెకము) ద్విపము, గజము

గీ. గాలితేజీమెకంబులు క్రోలుపులుల, కొదమ సింగములే రెంటఁద్రాగుడుమెకంబు, అల ధ్వజమునిరాజనిలయమునకు, బలకరంబున జోడుల పగిదిఁ బొలిచె. రామా. 5. 51.

**రెంటత్రాగుడు.** (√రెంట.) వి. ద్విపము, గజము ఏనుఁగు.

సీ. రెంటత్రాగుడు చట్ట రెంటెంపుతాలుపు తల పువ్వు తండ్రిలో నిలుచు జియ్య ... ప్రబంధ. 1538

**రెంటత్రాగుడుతిండి.** వి. (రెంటత్రాగుడు +. తిండి.) సింహము

కం. ఒకమున కంటెను బ్రజ్ఞాబల మెక్కుడు గాదె బుద్ధిబలమునఁ జేరఁ చ్చలమునఁ గైకొను హాలిగాఁ,దలఁద్రుంతుం జెండి రెంటఁ ద్రాగుడు నొండన్. వేం. పంచ. 1. 347

**రెంటపేట** వి. (రెండు + పేటలు.) జేములు (చి. ని).

**రెంటము** వి. 1. రెంటెము, జమిలినూలిబట్ట.

ఉ. కుమ్ములు హాస్యవాహాములు గుత్తవు సుగ్గడి

తంపుఁ దోఁపు రెం,టమ్మెలు దట్టువున్న మృగ
నాభియుఁ జాఁదును నోడె... క్రీడా. 46.

2 పార్శ్వమందలి కట్టు. బట్టమడత, రొండి.

సీ. మృతమర్త్యు రెంటావ నిడ్డఁజాలక నెత్తురంటిల్లు
వెనుపొట్టముంజివాని ... ఆము. 6. 19.

రెంటాడు న. క్రి. (రెంట + ఆడు.) ద్వివిధముగాఁ బలుకు.

మ. భయముం దత్తరపాటు దైన్యమును దోఁపన్
స్వామి శ్రీరామ మీ,దయకుం బాత్రుఁడఁ
గానె యేమిటికి నిర్దాక్షిణ్య చిత్తుండవై,తి
యథార్థస్థితి రాఘవుఁ డనియు భక్తిం గొల్వ
లేదో హిత,క్రియలం దేమఱియుంటినో పలు
కులన్ రెంటాడి కావైతినో.
శ్రీరం మా. 2. 124.

రెంటెము. వి. గెంటెము. జంటనేఁతవస్త్రము.

సీ. పుఱియల చౌకీలు పొలుపైన తలపాలు పన్నగ
వీఁటము బన్నసరము, ఒలుకుల బూది క్రొవ్వ
లవులజవ్వాది వేలిమి మొకము పిసాళికుళము,
చాఱలరెంటెంబు సన్నంపు గెంటెంబు ఛాను
పండులచాలు పసిఁడినూలు. వరాహ. 9. 88.

సీ. పులితోలు రెంటెంబు వెలిపట్టు గెంటెంబుఁ
గటిమండలంబున గరిమఁదనర ....
రుక్మా. 1. 29.

సీ. పులుగురాయని చట్టుపలవన్నె నొరవట్టు
పొంబట్టు జిలుఁగు రెంటెంబుతోడ ...
ఆము, 1. 12. యయా. 4. 3.

రెండర. వి (రెండు + అర) రెండునర. సార్థద్వయము.

ఉ. అర్ధమరేయిఁ బోయిరి శివాయని పల్కుచు
రెండరామడన్ ... కాళ. 4. 55.

సీ. రెండర యేఁట నొక్కఁండధిమాస మిట్లై
కిట్టిన యన్నెలలెల్లఁ గూర్చి కొనఁ బదు
మూఁడు హాయనములు దప్పక నిన్నటి తోడన
నిండె. ...భార. విరా 4. 232.

(ప్రాఁతప్రతి పా. రెండేఁడులరకు నొక్కండధి
మాసము. అని భా. ఆ. వ్యా. పా, రెండవ
యేఁట. ముద్రి. పా.)

రెండాడు. అ. క్రి (రెండు + ఆడు.) 1. రెండుమాటలాడు, అసత్యమాడు.

కం. నేలయు మదకము తేజము, గాలియు వాకసము నెఱుఁగఁ గాఁచితి నా,కై, కోలిడె
రెండాడఁగ నా, నాలుక మీ కులమువారి
నాలుక లటవే? ద్వా. 5. 195.

2. నిందించు (ఎదురుచెప్పు, ప్రతిఘటించు.)

కం. రూఢిగ బిజ్జనదను రెం,డాడిన భూపతుల
శిరము లసిముఖమునఁ జెం,డాడుచుఁ గయ్యము
లిచ్చవడి, యేడెన్నఁగఁ బొడిచె జయమహీ
వల్లభుఁడై.

(చూ. ఆ సా. ప. ప. 8.) కొణిదెన శాసనము.

రెండవసూతకము వి. (√రెండు) మృతాశౌచము, మైల.

సీ. ఎట్టి చుట్టంబైన యింటికేతేర రెండవ
సూతకముఁ దెల్పి యవలఁ బోనువు ...
పాండు. 4. 149.

రెండు. న. బొ. ద్విశబ్దార్థకము.

(దీనికి వృత్తియందు హల్లు పరమగునపుడు ఇరు
ఇను అనువవియు, అచ్చు పరమగునపుడు ఈరు
అనునదియు, వికల్పముగా నాదేశములగును.
చూ. ఇరు, ఈరు. సమాసమున వర్ణవికారము
వైకల్పికముగానగు. బ. రెండ్లు, రెండులు.)

ఉ. కొండని వేడ్కతోఁ బసిఁడికొండ ధనార్థుల
కెల్లఁ బంచి యీఁకుండుట దాన ధారకుఁ
బయోనిధు ... వ్యయింపనేమి యీ, రెండవ
కీర్తులం దలధరించినవాఁడు ...
నైష. 1. 51.

మహాస్రగ్ధర. ... నిలింపావాపదశ్యావళవదతిలమిథ
స్తారంబు ... రెం,డును దీనుల్గాంచు వమ్మా
డుపులనె ... ఆము. 1. 58.

గీ. నాలుగింటను వెండియు నాలుగింట, రెంట
నై దింట మఱియును రెంట వేల్చి, యజ్ఞశీలు
రారాధించు నట్టి విష్ణుఁ, డిష్టదాయి ప్రసన్నుఁ
డయ్యెడును నాకు    భార శాం. 4. 222.

కం... పెల్చనయే నమ్ముల నా రెంటిని ద్రెళ్లఁగ
నేసెఁ గడుఁగరిన హృదయుం డై ...
భార, అను 5. 49.

కం. రెన్నె లలోన నాకుం, జెన్నొంద వధీనగాఁగఁ
జేయుఁడు ..    భా. రా. సుం 204.

కం తినబిఁడమధమున జూచివఁ దలలేకున్న
వాఁడు చెల్లిన రెన్నెల్లను ...
జై భా. 8. 100.

గీ. ఇంక రెన్ట్ల్లను సూచి నీ వంకఁ దెగువ, గలుగ
కుండ ... బ్రిం. లూళ్ళ దలఁచి పోవ ...

వి. భేదము.

చ పతి యడ రెంటు లేక కులభామలు తారతఁ
జెట్టఁ బైన సమ్మతిఁ జరియించు టొప్పు ....
భా. రా. అయో. 297.

రెండాఱుచేతుల జేఁడు = కుమారస్వామి.

మ. ... రెండాఱుచేతుల జేఁ డుండిన జెల్లు
టల్లు గనుమా దోషాచరగ్రామణీ ..
ఉ. రా. 3. 62.

రెంటికిఁ జెడిన రేవఁడు = ఉభయభ్రష్టుఁడు.

గీ. అనుదినము నిట్లు ప్రాతికూల్యము భజింపఁ,
జఁడికతమున ముని బ్రహ్మచర్యనియమము
వదలి గృహమేధి వర్తనమునకుఁ దొలఁగి, రెంటి
కిఁ జెడ్డ రేవని రీతి యయ్యె ...
జై. భా. 4. 87.

జ రెంట, రెంటద్రాగుడు మెకము, రెంట
ద్రాగుడు, రెంటద్రాగుడుతిండి, రెంట పేట,
రెంటాడు, రెండర, రెండాడు రెండవనూత
కంబు, రెండుదలచు.

రెండుదలఁచు. అ. క్రి. (రెండు+తలఁచు.) కపట
ముగాఁ బ్రవర్తించు.

సీ. వేదఘోషణలేని వీట నున్న యతండుఁ దలి
దండ్రులకు రెండుదలఁచు నతఁడు ...
జై. భా. 1. 86.

మ. తలయుం గోకయు వీడఁగాఁ బఱచి సంతా
పంబునం గాశికానిలయం బొక్కఁడ చొచ్చి
వచ్చిన నుతు వీక్షించి శ్రీవిష్ణుభక్తుఁ కున్
రెండుదలంచు ద్రోహులకు యుక్తుల్ గొల్చునే
యంచుఁ దద్దృష్టిపేరోవలపాత భగ్నశిరఁడై
ప్రాణంబులం బాసినన్.    జై. భా 8 112.

రెంబ = రెమ్మ. వి. ఉపశాఖ.    (శ. ర.)

రెక్క. వి. 1. పక్షము

గీ. అతివ చన్నులు ఐక్కవలగుట కేమి, సంధి
యంతింత దండలచోయ నిగుడి, రెక్క క్రై
యుండ సొంపువఁ బిక్కటిల్లి, వలిపపయ్యెద
యను చిన్నివలను దగుల. (యయా. 4 43)

కం. గ్రక్కునఁ జని వ్రాలుదువో, రెక్కలుగట్టు
కొని దివిజరిపు మేడలపై .... ప్రభా. 4 86.

ద్వి. రెండు హస్తము లెత్తి రెక్కలతోడి, కొండ
రివ్వున వచ్చు కొమరు దీపింప ...
రం రా. బాల. 27 పా. దశా. 1. 14.

2. పక్షతి, రెక్కమొదలు.

సీ. .... రెక్కనాఁ బక్షతియగు ...
ఆం. భా. 2 99.

జ రెక్కచోఁపు, రెక్కతలుపు, రెక్కలతేజి
రెక్కపాయ.

రెక్కచోఁపు. వి. (రెక్క+చాఁపు.) అంతరీయోత్త
రీయముల జత.    (చి ని.)

రెక్కతలుపు. వి. (రెక్క+తలుపు.) ద్వారమున
కిరుప్రక్కలనుండు రెండుపలకలతో నేర్పఱచిన
తలుపు.    (చి. ని., శౌ., వా.)

రెక్కలతేజి. వి. (రెక్కలు+తేజి.) గరుత్మంతుఁడు.

ద్వి. శ్రీనతిపతుఁడైన శ్రీరంగశాయి, మెచ్చి
రెక్కలతేజిమీఁద సొంపారు, లచ్చితోఁగూడ
నుల్లము పల్లవింప, నారూఢుఁ డగుచు...
ద్వి. పరమ. 7. 494 పా

రెక్కపాయ. వి. (రెక్క + పాయ) రెవటపాయ. (చి. ని.).

రెక్కొను. అ. క్రి. (రేకు + కొను) 1. వర్ధిల్లు.

... రెక్కొందమని సుమీ ... 1. 72.

మ. ... పల్లవ ... బులుచే రెక్కొని కొమ్మ ... నెక్కి ... చంద్రా. 3. 31.

2. రేఖుకొను. (శ. ర.)

... రెక్కొనలేమ

రెక్కొలుపు. ప్ర. క్రి. (√రెక్కొను.) వర్ధిల్లఁ జేయు.

సీ. ... యాపగవారినైనఁ ... కుసుమసైన రెక్కొలుపఁ జాలి ... చంద్రా. 4. 20.

రెక్కొలు. వి. (√రెక్కొను.) రెక్కొనుట. (శ. ర.)

రెచ్చరించు. స. క్రి. (రెచ్చు.) రెచ్చఁజేయు.

గీ. అడవిఁ దడవిల్లుఁ గైకొని యమ్ముఁ దొడిగి ... నిను రెచ్చరించి మంచి, మెక ముఁ బడవేసి నిచ్చలు మెచ్చఁజేయు, నట్టి నాయకురాలిఁ జాయఁగఁ దగునె ... వాల్మీ. 2. 128.

రెచ్చించు. స. క్రి. (రెచ్చు.) రెచ్చరించు. (చి.ని.)

రెచ్చిల్లు(లు). అ. క్రి. (రెచ్చు.) విజృంభించు, చెలరేఁగు. (చి. ని.)

రెచ్చు. అ. క్రి. విజృంభించు.

గీ. మచ్చికలుచేసి డాయుచో రెచ్చిపాఱుఁ, జెలఁగి యగ్గారడంపుఁ బసిండిజింక ... అచ్చ. రా. అర. 48.

రగడ. మోదు మోదుగపువ్వు రెచ్చెను, ముమ్ము మున్నరకైక ముచ్చిరి... వాల్మీ. 3. 114.

సీ. త్యాగియైనట్టి సంతానంబులకు తెచ్చి గతితేమి పెట్టిన గడుసుందనము ష. చ. 2. 32.

జః రెచ్చరించు, రెచ్చించు, రెచ్చిల్లు.

రెచ్చెల. విజ జేగడాలమారి. (శ. ర.)

రెట్ట[1]. వి. పక్షిమలము.

... దగ దొట్టఁ జని రెట్టఁ వడఁ గొట్టె నుడుపేధి బెళగున్న గొక్కయణుజు ... మను. 4. 58.

గీ. పవనమున నిండి వానల పవనుగ... రెట్టలో ... చెట్లు మొలచె. శశా. 4 38.

రెట్టఁబెట్టు = రెట్టవేయు. (పక్షి) మలవిసర్జనము చేయు.

ఆ. అచట రెట్టఁబెట్టి యరోక్కదయముగాఁగఁ, దడయ కరిగెనంత దాని రెట్ట, శిలలసంధిఁ బొందె మొలచె నందొక ... ఫలములోని బీజమొక్కడి కేయూర. 3. 45.

రెట్ట[2]. వి. 1. భుజము.

ద్వి. మఱుఁగుఁ జొచ్చిన ... కుమారుఁ, గుదికిలఁబడ రెట్ట గుదియించి ... ద్వి. హా. ఉ. 201 పం.

కం అలి బెట్టిదంబు లాముమ, జనపతి చూడంగ సురుచి సవతికొడుకుఁ ... రెట్టఁబట్టి పొమ్మని, వెనుకకుఁ బడఁద్రోసి పీఁవు ద్రేసెం జెలుచున్. వి. పు. 2. 15.

గీ. అలుక చేనుండ బుగ్గలు ... తొడలు వడి రెట్టి కోదండ మడగఁ గట్టి, రెట్ట లెగఁబెట్టఁ బట్టించి తేపుమాపుఁ, గొట్టుబెట్టుగ నజ్జన కోల దెగను. హంస. 3. 141.

2. పక్షిరెక్క. (చూ. రెట్టకట్టు.)

జ. రెట్టకట్టు.

రెట్టకట్టు. వి. (రెట్ట[2]) రెక్కల యాకృతి విశేషము, రెక్కలకూర్పు.

సీ. వెడదనన్నపుటత్తె బ్రేళ్లుబ్బు చెక్కిళ్లు రెట్ట కట్టెదురికి మిట్టబోర. ప్రబంధ. 191.

రెట్టి విశ. ద్విగుణము.

చం. పొరిఁబొరిఁ బ్రీతి రెట్టిగ నపూర్వవిలోకన మాచరించు.. భార. విరా. 1. 209.

ఆ. ఖూడి, యద్భుతంబు రెట్టియై జనింప. హరి. పూ. 8. 192.

సీ. మైనిండు పాలీని మగ్గంపుఁ జకచకల్ బూది పూఁతకు రెట్టపుట్టసేయ.. చంద్రా. 3. 89.

ఉదా రెండురెట్లు, మూఁడురెట్లు.

జ. రెట్టించు, రెట్టింపు. రెట్టిత్రావుడు.

రెట్టించు అ క్రి. (√రెట్టి) ద్విగుణమగు, ఇనుమడించు

క. నిఃథూప రాతపత్రి, ధ్వజకంకటఖండవేష్టితము లైన కరు, వ్రజగాత్రశకలములు వారిజనాథ కనుంగొనంగ రెట్టించె వగల్ భారం. స్త్రీ 2 53.

శా. శ్రీరమ్యాంఘ్రియుగంబు గింజుకొనుచుం జెల్వంబు రెట్టింపఁగన్ ... హరి. పూ. 5. 170.

కం. నిట్టూర్పులు దఱచయ్యెను, గట్టులదొరకలికి కలికికన్నులయందున్, రెట్టించె ధవళ కాంతులు, పట్టుగఁ గనుఁజెప్పలలసభావముఁ జెందెన్ జాహ్నవి. 1. 91.

వ. క్రి. ద్విగుణము చేయు, ఇనుమడించు.

సి. తరువాత నదిమొదల్ దప్పక రెట్టించి ... అప్ప. 4. 143.

వ. .. ఉత్కృతియందుఁ బుట్టిన సమవృత్త సంఖ్య రెట్టించి ... అప్ప 4. 139. టీక.

రెట్టింపు విశ. (√రెట్టించు). ద్విగుణితము.

సీ. రెంటత్రాగుడు చట్ట రెట్టింపుతాలుపు తల పువ్వు తండ్రిలో నిలుచుజియ్య. ప్రబంధ. 153.

రెట్టిత్రావుడు వి. (√రెట్టి.) ద్విపము, ఏనుఁగు.

వ. ... పదయుగనఖాంచలంబులఁ జంచంచ్చూపుటంబుల రెట్టిత్రావుడు బొబ్బమెకము దచ్చికాళ్ల మెకంబుల నిరికించి కఱచుతఁ యుప్పరంబున కుప్పరం బెగసి మల సెలయేళ్ల పులినతలంబుల వజ్జగా వజ్జగాఁజెండు గండభేరుండ కాండంబులును ప్రబంధ. 166.

సీ. ... చెలఁగి అంకెలువైచు వెలిగిబ్బమావులో డావంక నొఁబపొ మిటారితోడ, రెట్టిత్రావుడు గాము చట్ట ఉప్పులువతో ...

గీ యతునకు మ్రోల వారుఁడు ప్రత్యక్షమయ్యె. శ్రీరం. మా. 4, 80.

రెట్టు. వి. ముతుకబట్ట. (శ. ర.)

రెడి వి. రెడ్డి.

కం. చాలు విసాళింపకుమని, యాతరి రెడిసాని మగని వదలించి సుతుం, జాలును నీవును నిచ్చోఁ, దాలిమి వసియింపుమని యతని లాలించెన్. వేం. పంచ. 4, 453.

రెడ్డన. వి (రెడ్డి + అన[1]), రెడ్డన్న, రెడ్డి.

కం. ఈ రీతినుండి యొకనాఁ, డా రెడ్డన పనికిఁ దలుగు లమరించుటకై, నారలు గావలెనని పొరుగూరికినై పోయి మట్టియూడలు దేరన్. శుక. 2. 338.

రెడ్డి=రడ్డి. వి. (ఎత్వమునకు నిర్ధారక ప్రయోగము కన్పడలేదు.) కాఁపులలో నొక తెగవాఁడు, గ్రామాధికారి.

గీ. దొడ్డయేశ్వర వివకోటరెడ్డి విభుల ... కాశీ. 1. 24.

గీ. రెడ్డికొడుకైన యొకయెడ్డెబొడ్డిగేఁడు, పొలము దోఁకరి కాచెనుబోతువంటి, వాఁడయో దాని మగఁడఁట వాణిమగని, కెంత చెడిపోయెనో బుద్ధి యెట్లుగూర్చె. ఉ హరిశ్చ. 4. 12.

మ. . .మేఁ, కెరువుం గుంపటి మంచమెక్కిరి ప్రభుత్వైకాప్తి రెడ్లజ్జడిన్ ... ఆము. 4. 134.

గీ. అనిన నలఁతిగఁ గోల్పోక యతఁడు రెడ్డి, రాజుఁ గనునని... ఆము. 6. 83.

జ. రెడ్డర, రెడ్డిపాలవంకెలు, రెడ్డివంకెలు, రెడ్డివారి నానఁబ్రాలు.

**రెడ్డికము.** వి. కూర్చుండుటలోని భేదము. ముడుచుకొన్న యొకమకాలి తొడమీఁది మోఁకాలు మీఁదుగా ముడుచుకొన్న కుడికాలి పాదము మోపి, ఆ కాలిని వీఁపును వస్త్రముతో బిగించి కట్టుకొని కూర్చుండుట. ("రెడ్డిగము" అని శ. ర.).

వ. ... వలువకు రాణ్భావమైన మనోవత్ నగంబు దనకు మణికిరీటంబుగా మెఱయు నగరాజంబునకు రెడ్డికంబునుం బోలె నొడ్డునం బదివేల యోజనంబులు పొడవున ముప్పదివేల యోజనంబులునై చుట్టి వచ్చి వియచ్చర ... ప్రవాళంబగు చక్రవాళంబున సూర్యాది గ్రహములు సంచరించు ... వరాహ. 10. 114.

**రెడ్డిపాలవంకెలు.** వి. బ. (√రెడ్డి) ధాన్యవిశేషము.

సీ. పచ్చపసుల్ రెడ్డిపాలవంకెలు సుఖభోగులు పచ్చకర్పూరనరులు ... హంస. 4. 123.

**రెడ్డివంకెలు.** వి. బ. (√రెడ్డి.) ధాన్యవిశేషము.

వ. ... వసపుగన్నెర్లు గుత్తింటుపత్తులు రాచి పూరాణిసాలు పొన్నశ్రీరాజసాలు నివ్వరులు పీసకాపులు రెడ్డివంకెలు చౌటవరులు తెగెమల్లెలు సుఖభోగులు ... ప్రబంధ. 112.

**రెడ్డివారినానఁబ్రాలు.** వి. (√రెడ్డి) ఒకానొక యోషధి (వృ. వి.). శ. ర. (బ్రౌ., వా.)

**రెపరెప** వి. 1. నిప్పు మండుచుండగు ధ్వని కనుకరణము. 2. గాలి వీచుటయందగు ధ్వని కనుకరణము. (శ. ర.).

**రెప్ప=ఱెప్ప.** వి. నేత్రపక్ష్మము. (శ. ర.).

ఉ. అప్పుడు భీష్ముఁడేమి హృదయంబున నుమ్మలి కమ్ము గూరఁగా, రెప్పటి చందముల్ విడిచి యెద్దెఱఁ దక్కిన చూడ్కిఁ గొండొరు, బ్రెప్పలమాటునం బొలయ నీ సుతుపాలికి వచ్చు రాజులం,దిప్పు డతండు శాశ్వతవదే యని కర్ణుఁ దలంచి రందఱున్.. భార. ద్రో. 1. 14.

ఉ. కోరిక తెప్పలెత్తుచును గొంకక నంటె రెప్ప వ్రాల్చుచున్ ... కళా. 2. 276.

**రెప్పము.** విణ. పూర్ణము.

శా. ఆలోకించెదు శార్ఙ్గముక్తవిశిఖాజాలౌఘంబుచే నీ మొనల్, నేలం గూలఁగ ఫాలపాలికలతో నిండారు రక్తంబులన్, గ్రోలం గోలెఁ బిశాచ బాలికలు సైకొన్నన్ మణిశ్రేణితోఁ, గ్రాలం బట్టిన వెండికోరల గతిన్ గప్పంబు రెప్పంబుగాన్. ఉ. హరి. 4. 195.

(శ. ర., వీరేశ. పా. వావిళ్ళపాఠము. కప్పంబు లొప్పంబుగాన్.)

**రెపరెపమను.** అ. క్రి. (జఠరాగ్ని.) మండు, ఆఁకలి యగు.

వ్యావ. వానికిఁ గడుపులో రెపరెప మనుచున్నది.

**రెప్పాల.** వి. వన్యవృక్షవిశేషము.

(పాదిరివంటి యాకులు గలది. దీని యాకు కారముగ నుండును. ఈ మూలిపలక దంతమువలె ధవళమై స్నిగ్ధమై యుండును. చి. ని.)

ద్వి. ఏల పంపములు నంకోల తుంజములుఁ, బాలమ్రాఁకులును రెప్పాల మ్రాఁకులును. ద్వి. పరమ. 2. 54 పా.

**రెబ్బ.** వి. రెమ్మ, ఉపశాఖ.

ఉదా. రెండు కరివేఁప రెబ్బలు తెమ్ము.

సీ. రెమ్మ రెబ్బ రివట రివ్వ రెంగ చివ్వ ... అవ నుపశాఖ చెలఁగు... ఆం. భా. 2. 37.

**రెబ్బు.** స. క్రి. సంహరించు, చంపు.

కం. ఉబ్బఁడు లిబ్బులు గలవని, తెబ్బఁడు రిపు రాజుగాని రేఖలవలరా,యబ్బఁడు. పర భామినికై, యబ్బఁడు శ్రీపాతకిని యబ్బఁడు ధాత్రిన్. జకూ. 1. 20

# రే

రే¹ = రేయి. (సం. రాత్రిః) రాత్రి, నిసి.

కం. పలుకులఁ బనిలేదీ రే, తలపెట్టకపోరువా రుదగ్రత నేనుం, జలము మెఱయఁ జాంచా లుడెఁ, బొలియింపక కత్తకంబువుచ్చ నరేంద్రా. భార. ద్రో. 5 37.

కం. నా విని సుబలతనూజుఁడు, దేవా నీయాన యేను దెల్లంబుగ రే, యీ యానెంచె నెమ్మె నమ్మున, భావించితి పనియె .... భార. అర. 5. 262.

చం. ... బంగరుపుమేడల నోరణగండ్ల వెంట రే, ల్పనియెడు రెక్క మొత్తముకు ... నీలా. 1. 29.

ఉ. ... కం త్తికరుం డా,భీలభుజాప్రతాపమును బెంపున మీఱఁగఁ బోరె వారితో, రేలు బగళ్లు నా కనలి రేఁగి మొగిం బదిరెండు మాసముల్. ఉ. రా. 3. 375.

జ. రేకంటు, రేగాము, రేచీకు, రేచీఁకటి. రేజోతి, రేదొం, రేద్రిమ్మరి, రేద్రిమ్మరీఁడు, రేపులుగు, రేమగఁడు, రేయెండ. రేయేలిక. రేరా, రేరాచరేక, రేరాచజూయి, రేరాజు, రేరాయఁడు, రేఱేఁడు, రేవగలు, రేవెలుఁగు, రేవెలుఁగుతీవ, రేవెలుఁగుజూయి.

అవ్య. 1. ప్రశంసార్థకము

(బళిమొదలగు ప్రశంసార్థకశబ్దముల కనుప్రయుక్తమై యుండును. కొన్నిపట్ల నట్లుకాకయు నుండును.)

కం. ... ఒక్కొకటన, రెంటం బొదువంగ నల యురే నెరవారఁ న్... భార. అను. 1. 223.

2. సంతాపార్థకము.

కం. సైరింపరాని శోకము, కారణముగ నాదు తనయ కాంతారములో, మారుతసఖు పాల్పడియెడు, జూ రే... దశకు. 3. 48.

ఉ. కొమ్మను వేలుకొమ్మ కడికుందవమీను సుమమ్ము రెమ్మ రే... ప్రబంధ 700.

రేఁగు¹. అ. క్రి. 1. ఎగయు.

సీ. దూర్లమక్కెక్కి మంగళ్లి అప్పులు రేఁగు వడువున గాలి నాడెడు నెఱలు ...
అము. 6. 17.

చం. గుణమున అస్తకంబువను గోటియుగంబునఁ గేలఁ దార భీషణముగ నుప్పతిల్లి రథసంబున రేఁగినమాడ్కిఁ దీవ్రమా,ర్గణనికరంబులొక్కట నరాతిబలంబులఁ గప్పు ....
భార. విరా 5. 60.

గీ. రాజసంబున హస్త్యశ్వరథపదాతి, పాద ఘట్టన మేరువు మీదఁ బసిఁడి, బూడిదలు రేఁగ నొకనాఁడు దాడివెట్టి ...
వరాహ. 6. 129.

2. విజృంభించు, చెలరేగు

కం. ... గాంధారేయులు వెస నొక్కపెట్టు రేఁగి యతనిపైఁ, గోయఁ కవిసిన ...
భార. భీష్మ. 2. 100.

గీ. రాత్రి వచ్చెను జీఁకట్లు రాణమీఱె, మన్మథుఁడు రేఁగె నోదూతి మఱుఁగులేల, పూని యున్నది నాబుద్ధి వానిమీఁదఁ, దగిన పనిఁ జేయు మీ వేళఁ దాళలేను. గంధ. 178.

కం. ఆ పెనఁగ రేఁగి యట్లు, పాపాత్మకమగు కిరాతబలము సమగ్రా,టోపమునఁ గవిసి వివిధ ధనాపహరణ మాచరింప నారంభించెన్.
భార. మౌ. 184.

ఉ. రేఁగి చకోరదంపతులఁ బ్రేల్చిన కల్మషపంక మిందులోఁ, దోఁగినఁగాని పాయదని తోయజబాంధవుఁ డిట్లు చేసెనో, నాఁగఁ బ్రకాంతినొంది కిరణంబులు వేఁడిమి దక్కి శైత్యముల్, గాఁగ రథాంగముల్ బెదరఁగా నపరాంబుధిఁ జొచ్చెఁ బెంపరన్.
భోజరా 2. 98.

3. ఉబుకు, పై కివచ్చు.

కూఁతలువేయించెఁ గొమ్మ యొకతె ...
చంద్రా. 3 97.

చ. ... ఉపాయపుఁ బ్రేలరి మాటలాడి ధీగుల
మదికైన నూటిక విరోధమొనర్చుచు నుంకు
రాజులఁ, దెలుపని రేఁగి తెచ్చి తలపెట్టు
వినోదవుఁ దీఁటవోవఁగన్ ...
హరి. పూ. 5. 92.

4 కోపింపఁజేయు.

చ వినుమరి జంపనుఁ జెరుప వేచుట లెస్స
ప్రతాపభాషణంబున వెడనుల్లి కుట్టులను
గొంకుఁ వానిఁ గెంగఁజేసి రేఁచివ దవ
పూపుదప్పు భార శాం. 3. 20.

సీ వా ఁ చె సికేమిటి వలనఁ దక్కు, వేల
చెప్పుమాటల నిల్లు వన్ను, రేఁచె దేనిచ్చు
వఁ ము స్త్రీఁగొనుము, పా్తు జగదేక
విజయం బొందితి గనుము. హరి పూ. 9 77

5. అతిశయింపఁజేయు, ఉద్రేకింపఁజేయు.

సీ అఁ యంచఁబట్టి తెమ్మని కోర్కి రేఁచి నిబ్బ
ఁపుటింతల నీడఁదిరుగనేర్చె . .
ఉ. శా. 6. 94.

చం. ఒకపొఁదిండ తొయ్యలికి నొయ్యననవ్వుల
నాస రేఁచి యోపిక వది యిచ్చిరా నెదురు
వెట్టు .. చంద్రా 1. 26.

6. పుట్టించు, కలిగించు.

చం. కుటిలకటాక్షవీక్షణముఁ గోమలనూత్నకపో
లరాగమున్, జటులసమంచితభ్రుకుటిసంపళ
నంబును జూచువేడుకన్, జిటిపొటరేఁచె రాజ
సరసీరుహనేత్రకు... నైష. 8. 42.

రాఁచు = రేఁచు. 1. ప్రేరించు.

కం. కర్ణుండు రేఁచిపెట్టఁగ, దుర్ణయపరులైన
శకుని దుశ్శాసను లీ, నిర్ణయమె మేలనఁగ నీ,
కర్ణములకు నించునెట్లు కార్యవచనముల్.
భార. ఉద్యో. 2. 248.

(ఇట పురికొల్పు అని యర్థము)

2. అతిశయింపఁజేయు.

సీ పదిప్రశ్నములకైనఁ బ్రత్యుత్తరముఁ బొందఁ
జూచు పిసులకింపు రేఁచి పెట్ట ...
కవిక. 3. 223.

రేఁచుకొను స. క్రి. (రేఁచు + కొను, స్వార్థమున) అతిశయింపఁజేయు.

ఉ. కయ్యపువేడ్క రేఁచుకొని క్రమ్మెడు తమ్ము
దిరించి యేమియున్, డయ్యక కొంతసేపు
పెనుదాకను జేతుఁబాటినిల్చుపాఁ డెమ్మె
డఁ బోటివాటుకు సెంతియుఁ గాతుక
తారిగాఁడె ప్రీవయ్యపురేంద్రుఁడౌ యని
కాస యొనర్పుట యుక్తి పెన్నఁగన్
ప్రభా 2. 59.

రేఁకెము = రెంకెము. వి. జంటపొగుజవలువ, జమిలి నేఁతపట్ట.

మ. ... మంచిముత్యాంపేరులు మైఖోగవురేఁ
కెముల్ పసిఁడితేరుల్ పల్లకుల్ గొనుగా,
నులువా చేసె యయాతిం దఁఁపులో
నుప్పొంగుచుం గూర్మితోన్. యయా. 5. 75.

రేఁపు = రేఁచు. స. క్రి. (√రేఁగు[1]). 1. రేఁగఁ జేయు.

గీ. వృపుతలఁపు రేఁపె నపుడు మాఘుపదపాంగ,
పాన మొనదేరిన యనంగశర మనంగ ...
రా. వి. 3. 129.

చం. గురునతిఁ గూడు రట్టువకుఁ గొంకని మోదు
వియోగి నీసముత్కరముల కీడుచూచుటకు
దర్పకు రేఁపెడు కుట్టు చేఁడుతెమ్మెరలకుఁ
దోడు చిత్రగతి మిన్నులఁబాఱెడు మాయ
లాడు పెన్నిరులను పోతుకాలుగొని యేర్చు
వెలుంగుల వీడు వీఁడువో, వరాహ. 4. 24.

2. పుండు మొదలగు వానిని ఆఘాతాదుల వలన నుద్దీపితము గావించు.

వ్యవ. కురుపురేఁపకు.

3. వి. ప్రేరణము.

రేకలా. వి. (హిం. రెఖా. మి గ్రా) ఒక విధమైన చిన్న పిరంగి.

సీ. ఒక రేకలా దెబ్బ యుద్ధతారాతిరాట్పట కుటీరముల కంబములగదలెు ... రంగా. 3 185

రేకు=ఱేకు వి. 1. పుష్పదళము.

సీ అళి కలభములు పైఁ దొలకించుతని రేకు లలకలఁ జిన్ని పువ్వై వెలుంగ ..కు. సం 9. 325.

సీ. చదలు గేదఁగి తూర్పుతువకొమ్మ నరవిరియై కానుపించు పూరేకు లనఁగ ...

పాఠి 2 38.

సీ. నెత్తమ్మిరేకుల మెత్తఁదనము దెచ్చి యమ్మనఁ బెట్టిన ట్లుందమొంది. ... శార విరా. 2 52

సీ. రేకులన్నియు విచ్చి రేయొంద జిగిపిండి కర మొప్పు తెల్లదామరల కంటె ...

భా. రా. అర. 1. 135.

సీ. రేరాచ గేదంగిరేకు క్రొవ్విరతోడ వెట్టకన్ జేగురుబొట్టుతోడ... పాంచా 3. 76.

2. దళము, ఆకు.

గీ. కనకములచోఁ దకమ్ముల గడిగి వార్చి, తులసి రేకులు సేవించి కటుకుఁ బచ్చడాలు తిన్నె వసించి... ఘటికా. 2. 17

3. బంగారు మున్నగువాని తగడు.

కం. కాకున్నఁ గెంపు వెన్నెల, రేకులవలెఁ జలువ గ్రుమ్మరించునె తల్లీ, యీ కారుమంట లిటు లన్ నీకు న్నీమహిమఁ జూప నేఁబని వింటిన్,

రామా. 7. 5.

4 దుప్పటిగాఁ గూర్పని వస్త్రము.

సీ. ... దుప్పటి యాను హాసావళి దువ్వల్వ వీణము దుప్పటమవ ... గీ. వని యె కూర్పనిచో రేకులనఁగ వెలయు ... అం. భా. 2. 156.

ఱ. రెక్కొను, రెక్కలుపు. రెక్కలు, రేకుమడగు, రేకుమణఁగించు, రేకుమణఁచు, రేకెత్తు.

రేకుఁడు. సం. వి. అ. పుం. నిమ్నజాతివాఁడు, నీచ జాతివాఁడు.

రేకుమడ(ణ)ఁగు = (రేకు+మణఁగు.) అ. క్రి. అణఁగు.

సీ. అడిదంబుచే రేకుమడఁగఁ గొట్టిన వికాసము దక్కి కడుస్రుక్కి జరిగెఁ గుముదుఁడు . .

శశా. 4. 101.

రేకుమణఁగించు న. క్రి. (√రేకుమణఁగు) మణఁగఁ జేయు, మణఁగించు.

సీ. గురుకరంబుల భవత్కువలయంబును రేకు మణఁగించు ప్రభువగల్ మాన్పికొనుటో ...

రావి 4 49.

ద్వి. మలయు సంపఁగిరేకు మణఁగించి సొంపు, గిలుకాడి తిలకంబు క్రియఁ బొల్చు నాస ...

అ. మ క. 2. 108 శా. 15 పం.

రేకుమణ(డ)ఁచు. న. క్రి. (√రేకుమణఁగు.)

1. అణఁగద్రొక్కు, మణఁగించు.

సీ. భ్రమరపంక్తుల వేఁటఁ బరిహాసింపకయున్న మ్రానిసంపఁగిరేకు మణఁచఁ దగదె ...

భాను 2. 61.

ఉ. లంచముఁబట్టు నంచలబలంగముచే వడలంగ బంగరుం, గొంచెముగాని మేనితళుకుల్ బెళుకుల్ బచరించుఁ జూపులున్. మించులఁ గుంచు మోము రజనీవిటు గుప్పనఁ దవ్వఁ బెంపుమన్, సంచవు రేకుమడఁచంగను నంగన నక్కుఁ జెక్కులున్. రా. వి. 4. 9.

2. చంపు, సంహరించు

సీ. తమఁ బిల్చినప్పుడ, విని లోనుపడెనంచుమకరంబు కరిరేకు మడచునొక్కొ, విభుఁడ కల్గిన మొఱ వినఁడె తేఁడని దంతిజడిసి ప్రాణముతోడ విడుచు నొక్కొ ... వాల్మీకి. 1 100.

ఉ. యాదవవార్ధి వెల్లివిరియన్ మఱియాఁగెడు పాటి వీరుఁడి, మ్మేదిని నెవ్వఁ డిందులకు మీరలు గావలె నేమె చాలమే, పోదుమె కట్టి తెత్తుమె బుభుప్రభునందనుఁ డెంతవాని తం, ద్రే దురమం దెదిర్చినను రేకు మడంతుము మాట లేఁటికిన్. విజ. వి. 3 165.

రేకెత్తు = జేకెత్తు. అ. క్రి. (రేకు + ఎత్తు) వర్ధిల్లు.

గీ పెంపు నె దెమ చామరతంపరయ్యెఁ, బ్రబలె నెగడెను గొనసాగె బలిసెఁ బెరిగె, వనఁగ రేకెత్తె ననఁగఁ జేర్లయ్యె వృద్ధిఁ, బొందె వను ఓకు. అం. శే 5.

రేఖ నం. వి అ స్త్రీ 1 గీఁటు. గీత. 2. పాణి పాద తలముల యందలి గీఁత. 3. కొద్దిభాగము, గీఁతంత మేం 4 వరుస 5. లంకాపురమునుండి యుజ్జయినిమార్గమున మేరువు వఱకు జ్యోతిశాస్త్రవేత్తలు గీసిన మొదటి లేక ముఖ్యమైన రేఖ. 6 మోసము, వంచన 7. ఆభోగము, వైశాల్యము 8. మార్గము త్రోవ. 9. రీతి, విధము.

(ఈ యర్థమున తెనుఁగునఁనే ప్రయోగము కన్పడుచున్నది.

మ. జననీ తుచ్ఛర గర్భగోళమున నే సర్వజ్ఞుఁడై ప్రజ్ఞచే, ఘనతం బొల్చెను దత్పురాశరుని రేఖన్ భూరవై రాగ్యబో, ధనిరూఢిన్ శుకయోగిచందమున నందంబందెఁ దా వెన్నఁడే, జననంబొందె నతం డదేమొదలుగా సర్వంసహామండలిన్. విప్ర. 1 76.

మ మనుజుం డొక్కెడఁ జాటులంబడుట సామ్రాజ్యంబు గై కొంటనుం, గనుఁ దా నేర్పరిచేతి కందుకము రేఖన్ జెక్కు చందంబులన్. ... నా. పంచ. 2. 156.

సీ. భరతుని లాగువఁ బరశురామునిభాతి రంతి దేవునిభఁగి రాముగరిమ,నంగుని రేఖ యయాతి భావంబునఁ బృథువిధంబున భగీరథుని మాడ్కి ... విక్ర. 2. 69, వసు. 6. 6

రేఖగొను వి అ క్రి. (రేఖ + కొను.) గీఁతల చేత గుఱుతులు పెట్టుకొను

ఉ అ త్తనుమధ్యరూపు కడు నందముగాఁ గుసుమాయుధుండు నా,చిత్తమునందు రేఖగొని చిత్రము వ్రాసెనో ... కు. సం 6. 825.

రేఖాగణితము సం. వి. అ. న. క్షేత్రగణితము.

రేఖాములు, వి. బ. (హిం. రేఖావ = మెట్ట భూమి) ఒకదినుసు మెట్టధాన్యము.

వ. ... కటకసరులు రత్నసరులు శీనిసరులు రాయసరులు పచ్చడినసరుల గుండుసరులును మద్దిగంద్రలు రేఖాములు కాంభోదులు మదనసరులు ... ప్రబంధ 112.

రేగడ = రేవడ వి రేగడి, బంకమన్ను. (శ ర.)

రేగడి = రేవడి. వి. బౌ. బంకమన్ను.

గీ. పంకమునఁగూరిజ దిగఁబడఁ బఱవలేవు, మన్నులివ్వేల రేగటమన్నులందు... మనుచ. 4. 20.

జ. రేగడిదూల.

రేగడిదూల. వి. (√రేగడి) ఒకానొకవృక్షము, కచ్చుర (వృ. వి). (శ. ర.)

రేగాము. వి. (రే[1] + గాము.) రాక్షసుఁడు, పిశాచుఁడు

పీ సనవాగ్నిశిఖలతో దివిఁ బ్రాఁకె రేగాము కఱకు జుంజుఱు వెండ్రుకల తెడంగు... ఉ. రా. 1. 83.

రేచకము. సం. విశే. (అ. అ. అ.) 1. కల్మషము పోఁగొట్టునది. 2. బేదిచేయునది, విరేచన కారియైనది.

వి. అ. పుం. 1. ఊపిరి విడుచుట, ఒక్క ముక్కురంధ్రము ద్వారా యూపిరి విడుచుట. (పూరకము, కుంభకము, రేచకము.) 1. చిమ్మనగొట్టము, పిచికారు 3 సురేకారము, పెట్లుప్పు, 4. జయపాలవృక్షము. 5. తిలకము (వృ వి.).

న. 1. బేదిమందు, విరేచనౌషధము. 2. కంగుష్ఠము.

రేచకి నం వి. ఈ స్త్రీ. కరకచెట్టు.

సీ. నెత్తిఁ దంగేడాకు మెత్తి రేచకి నిమ్మపంటి పుల్పున నూటి పట్టుపెట్టి ... కాశ. 3. 110.

రేచన. నం. వి అ. స్త్రీ. 1. ఊపిరి. విడుచుట. 2. బేదియగుట, విరేచనములగుట. 3. విసర్జించుట, నిస్సారణము.

రేపకడ. వి (రేపు + కడ.) ప్రాతఃకాలము. (వ్యుత్పత్తి) వర్ణవికారము.

గీ. రేపకడయును బగలును మాపు వరుస. వర్ధ ద(ర్మ)కామంబుల నాచరింపవలయు ...
భార. అను. 2. 45.

కం. రేపకడ గోవుపంచిత, మేపురుషుం డెవ్వఁడైన నెప్పుడు నియమం,బోపి తలఁజల్లు కొని పాకముచెడుఁ బుణ్యలోకఫలము ల్గలుగున్.
విజ్ఞా. ప్రా. 58.

• . . ఆరేయి గడిపి. ఉ. రేపకడవలేచి పాపవినాశవ,త్తీర్థమునకు నేగి పార్థివుండు..
ద్వా 7. 131.

రేపము నం విశ (అ. ఆ. అ.) 1. నింద్య మైనది, నీచమైనది 2. కఠినమైనది, క్రూరమైనది, 3 కృపణమైనది.

రేపస్సు. నం విశ. (స్.) 1. నీచమైనది. 2. దుష్టమైనది, చెడ్డది. 3. కృపణమైనది. 4. క్రూరమైనది, ఆరణ్యమైనది.

రేపాడి వి. (రేపు + ఆడి. స్వార్థమున) ప్రభాతము, ప్రాతఃకాలము.

కం. రేపాడి లేచి నియమము, దీపింపఁగ స్నానవిధులు దీర్చి రమేశున్. గోపాలుని జాగరణము. చూపట్టఁగఁ బూజ సేయ సుగతి లభించున్.
శేష. 4. 9.

సీ ... జీమూత (బృ)ందంబ,రంబెచె మధ్యందినంబుల రేపాడి చినికె దుషారంబు దివదివంబు ...
కాళ. 3. 149.

రేపు. వి. జొ. అనొ. 1. ఎల్లి, మఱునటి దినము, నేఁటితరువాతిదినము.

మ. వరుసం దెల్లముగాఁగ నీవడుగుమే వత్తున్ సన్నైనెన్యుండనై,పురసంరోధమొనర్ప రేప కడఁగం బూరింపు ముత్సాహతన్ ...
హరి. ఉ. 1. 13.

మ తలమే బ్రహ్మకునైన నీపగమహత్త్వం బెన్న నేని యొద్దం,గల చోద్యంబులు రేపు గన్గొనియెదవ్ .
మనుచ. 2, 12.

చం. అని కొనియాడి విశ్వభువనైకధురంధర నేఁడు రేపు నీ,వనితయు నీవు నిచ్చట వశ్యము మజ్జన భోజనాది పూ,జనములు గైకొనవల్వలయు ...
పారి 3. 39.

2. అచిరభావికాలము, భావికాలము, ముందు.

మ. ఇదిగో రేపె తపఃప్రభావమున వాణీశాను మెప్పించి మీ,పదముల్ గైకొన మున్న వాఁడు విబుధప్రత్యర్థి సామాన్యుడే ... దశా. 4. 57.

శా. నీపుత్రుం డితఁడంచు దుఃఖపడె దెంతే దేహమో,జీవుఁడో, నీపుత్రుం డిట దేహమాత్రమని యంచేఁగాదు జీవుండనన్, నీపుత్రుండిపు డైనఁ గర్మగతినొం దేఁబూర్వముం బుట్టఁడో, రేపుం బుట్టఁడొ యింక నెవ్వరికిఁ బుత్రీభావ మాద్యంబగున్.
దశా. 4. 10.

3. పగలు, దివాభాగము.

గీ. కలుగు నూఱేండ్లలో వర్ధకాల మపహ,రించు నిద్రయె యానిద్ర రేపు మాపు, మాని యుండిన జాడ్యంబు మేనఁబొడము ...
దశా. 2. 133.

ఉ. ఆపుటభేద వేంద్రదర్పమదావళి కల్పితగోపురాళిపై, నేపున మాపు రేపుఁ జను నిందుదివేంద్రులఁ బర్వఁ దద్ద్యుతుల్, బాపురె పీనికిన్ గ్రహణబాధ యపర్వములందు నేక్రియం, బ్రాపితమయ్యె నంచు మది భ్రాంతివహింతురు శాంత్రికోత్తముల్.
హంస. 1. 163.

ఉ. ఈప్పృథివీధరంబున నిభేంద్రకటోదితదానధారలై, ద్వీపవతీతరంగతట విస్ఫుటశైవల కందళంబులై, తాపసబాలికాశ్రవణద త్తయవాంకురభూషణంబులై, రేపు దమంబు సేయు శబరీ కబరీ నిబిరీస నీలిమల్ .
వా డు ?. 178.

4. ప్రాతఃకాలము.

చ. అమలనివాతసౌధములయందు మనోజ్ఞమరాళతూలత,ల్పముల శయించి రేపులు శుభస్థితి మాగధసూత గీతనా,దముల బ్రమోదముం బొరయు ధర్మసుతుండె కఠోర భూమిభాగమున శయించి, మేల్కాను మృగాలని నాదవికీర్ణకర్ణుఁడై.
భార అర. 5. 329..

ఉ. ... గోకుల మిల్లిలు దప్పకుండ లక్ష్మీపతి గ్రుమ్మరున్ గడియపేపున రేపున నిచ్చనిచ్చలున్ ... ... హరి. పూ. 5. 200

సీ. అరుణోదయమున శౌచాదు లన్నియుఁ దీర్చి వరుస రేపటి సంధ్య వార్చవలయు ... విజ్ఞా. ఆచా. 63.

గీ. ఎల్లి చేయుపనులు నేఁడ యింతి మాపొవర్చు పని రేప చేయుట వా మతంబు... భార. అను. 5. 238.

జ. రేచీకు², రేపకడ, రేపాడి, రేయెండ².

రేపులుఁగు. వి. (రే¹ + పులుఁగు.) చకోరము, వెన్నెల పులుఁగు.

వ. ... తమతమ మదతులఁ గవఁగూడి యెదుర్కొను రేపులుఁగు కొలము లెదురెక్కు సమానవతీకమీన వితానంబులును ... చంద్రికా. 4. 107

రేఫము. సం. విశ. (అ. అ. అ.) నీచమైనది, నింద్యమైనది.

వి. అ. పుం. 'ర' యనెడి అక్షరము.

రేఫస్సు. సం. విశ. = రేపస్సు

రేమగఁడు. వి. (రే1 + మగఁడు.) నిశాపతి, చంద్రుఁడు.

చ. చలువవెలుంగు రేమగఁడు జక్కవ నెచ్చెలి జోడుకోడె ... ... చందమామ కడునింగిఁ జెలంగి వెలింగె నెంతయున్. రామా. 2. 95.

చ. చలువలొసంగి వేడుక పొసంగ మెలుంగు వరంగిపిట వ, న్నెలఁతలు రాచరేమగని నిల్పికురుల్ తడియార్చి గోళులం, గలయఁగ దువ్వుచున్ హొయలు గానిగ వైచి మెలుంగు ముత్యమున్, గులికెడు శాసికఁలు దగఁ గట్టి రుమాలువు గట్టి ... తటన్. కువల. ౬. 91

(రాచరేమగఁడు = రాజశ్రేష్ఠుఁడు. అని భావము.)

రేమిడి వి ఒక జాతివృక్షము.

ద్వి. ... పనస, పండ్లును మొదలై వవఁజ్లును వెలఁగ, కాయలు రేమిడికాయలు గలిపి కాయలు ... పండితా. పర్వ. 348 పొ.

రేయి = రే¹. వి. ౭ా (బ రేలు.) రాత్రి, నిసి

చం. ఎడపక రేయియుం బగలు నెమ్మెలవమ్మలతాల్పుఁ గూడి పూ, వడిదపుజోదు నిబ్బరపుటాలమునం దమి హెచ్చ ... నీలా. 1. 106.

కం. రేయిట మండియుఁ గృష్ణునిఁ, జాయుటకుఁ గలరు గోపభామినులు నిజం, బై యప్పుడు హరివిరహ, వ్యాయతదుఃఖంబు దమ్మె నటు పొదువుటయున్. హరి. పూ. 8. 174.

ఉ. . చల్లని రేయిటి తట్టు ఫన్నళిక్ విందుల దేల్చ ... ఆము. 6. 90.

గీ. రెండు వీళ్ల జనంబులు రేలు వివిధ, వాద్య సంగీతములను ... ప్రొద్దువుత్తురు భరత ముఖ్య ... భార. భీష్మ. 2. 348

జ. రేయింద్రిమ్మరి, రేయినడకరి, రేరేయి.

రేయింద్రిమ్మరి. వి. (రేయి+త్రిమ్మరి.) రాక్షసుఁడు.

కం. తెలువల కడుపులలో నే, త్రైలు బెరిగెడి ప్రోడ రేయిద్రిమ్మరి దొరపైఁ, గొఱకొలు మార్పులు నిగుడుచు, తెఱఁగున గాటంపు టూర్పు తెమ్మెర లడరెన్. అచ్చ. రా. కాల. 82.

రేరా. (వి. రే[1] + రా[2].) చంద్రుఁడు.

కం. రేరాపొడుపుఁగన్నీ, రేఱాయను మాతనే తురెరా మారా ... అ. అ. వి. 4. 72.

రేరాచేరేక. వి. (రే[1] + రాచే + రేక.) చంద్ర రేఖ.

సీ. చినుకు వెల్తురు మబ్బుచే వడ్డపాటింతవో కార్చు రేరాచరేకయనఁగ ...

రా. వి 4. 119.

రేరాచేఱాయి. (రే[1] + రాచే + ఱాయి.)

వి. చంద్రకాంతమణి.

సీ. రేరాచేఱాల గూర్చిన రచ్చపట్టులో రహిఁ బాడు, పాటల రవళి యరసి ...

యయా. 4. 74.

రేరాజు. వి. (రే[1] + రాజు.) చంద్రుఁడు.

గీ. కువలయాధీశ్వరుఁడు బుధగురుత నెసఁగు, రఘుమహారాజు జగతిరేరాజు కరణి ..

ఇందు. 1. 158.

సీ. రేరాజు రాకకు రేచాన మునుమున్న నవ రించు వసితవసన మనంగ ...

ఇందు. 1. 158.

సీ. మదనబాణక టాక్షవదనమంచుంజూచి తమ్మికి రేరాజు దాయయగుట ....

భాను. 3. 7.

రేరాయఁడు. వి. (రే[1] + రాయఁడు.) నిశా పతి, చంద్రుఁడు.

రా. వి. 4. 86.

సీ. రేరాయనికిఁబోకుక్క తారావధూమణి కటి లోజను తా. 5. 19.

మ. అలివేణి వదిలోపలం బదునొకండై యుంచె నోలేదా జక్కుల రేరాయలపట్ట యంత టనె నీకు న్వాఁడు నిక్కంబుగాఁ, తెలు వుండే కద ... ఉ. రా. 4. 215.

(ఇట శ్రేష్ఠార్థము.)

క. ... రే, రాయఁడు తొలిసంద్రమునం దర ముగ్గగ వెడలెన్ ...

అచ్చ. భా. 6. 47. పా.

రేరిహాణుఁడు. సం. వి. అ. పుం. 1. శివుఁడు. 2. దొంగ. 3. పిశాచము లేక రాక్షసుఁడు

రేఱేఁడు. వి. (రే[1] + ఱేఁడు) నిశానాథుఁడు, చంద్రుఁడు.

సీ. కళికాధరముపైఁ గన్నె గేదఁగిపువ్వు ఱేకు తోఁ గూడ రేఱేనిఁ బోదివి ...

వై. మ. 9. 22.

వ. .... వీఁడె మనమేడమీఁద రేఱేఁ డున్నాఁడు. వీనిం బట్టు కొందమని సోపాన వితానమార్గంబునఁ జనఁ దివురు నిక్కపుఁ బోఁడి మాగ్ధ్య సాహసంబుల కరుదంది ...

మృ. వి. 2. 84.

రేల = రేల. వి. ఆరగ్వధము, ఒకానొకచెట్టు.

వ. ... ప్రోగు వారించి రావుల మోవుల జువ్వుల మొవ్వుల రేఁగుల గోఁగుల రేలల జాలల నొద్దుల మద్దుల విరుగుల నిరుగుల నెమ్ముల జమ్ముల ... వి. కుమా. 2. 14.

రగడ. మారేడు వంటికై మగునకడు గోరే.. చేరరాఁగదె యుప్పచెంత వదిగో రేల ...

ఉ. రా. 6. 61., ఆం. భా. 2. 42.

రేరేయి. (రేయి + రేయి.) వి. అర్ధరాత్రము, సగమురాతిరి. (చి. వి.)

రేవ. సం. వి. ఆ. స్త్రీ. 1. నర్మదానది. 2. నీలి చెట్టు. 3. కామపత్ని, రతిదేవి. 4. దుర్గ, పార్వతి.

రేవంతుఁడు. సం. వి. అ. పుం. అశ్వశిక్షకుఁడు.

**రేవఁడు.** వి. అవివేకి (రేవు[1] + అడు చాకలి వాఁడు అని శ. ర.)

ఆ. ఘనవినాశివౌమగర నీవు ఓటి గీకు, నిట్టి ప్రాంతములెల్లఁ బట్టనేల, ... తెడిన రేవఁడవై వృథా, బోకవైతి వెందుఁ గూడ వైతి. ప్రబోధ 2. 24.

ద్వి. కుక్కకూ తుర మెడ గోసి పోఁగలవు, రె డుపోనాడిన రేవనిరతి, ను . ద్వి. హరిశ్చ. ఉ 883.

ఉ. ... ఇహపరంబులకూరక దూరమై వయ, శ్రీ చన రెంటికిం జెడిన రేవఁడ నౌదునె నీర జేక్షణా. మను చ 3 '05.

**రేవగలు.** వి. బౌ (రే[4] + పగలు.) రాత్రియుఁ బగలును (బ. రేవగళ్లు, రేవగలుఁ.)

ఉ. వీఁడును ముస్నే రేవగటివేళకు మానిపి యాట ... ఆము. 6. 21.

చ ... రవీందుల బండికండ్ల చప్పుడు గతి మ్రోపె రేవగలు భూరిభయంకరగర్జ లత్తటన్ ... ఆము. 4. 85.

ఉ. అ బ్బులు వేసవిన్ ఘనగుహాంతరసీమల రేవ గళ్లు మై, బ్రబ్బెడు మబ్బు ... వాల్మీకి. 2. 73.

**రేవగుప్తి.** వి. ఒకానొకరాగము.

గీ దేశముఖారి సాహరి రేవగుప్తి ... ప్రబంధ. 97.

**రేవటము.** సం. వి అ. పుం. 1. అడవిపంది. 2. వెదురుగడ. 3. సుడిగాలి. 4. ఒకజాతిశంఖము. (విల్సన్సు).

**రేవడ = రేగడ.** వి. బంకమన్ను.

చ. ... ఇచట నల్ల రేవడయ దూరము వోయినఁ బాండు మృత్తికాకరములు గావను ... పరమ. 2. 12.

ఆ. కృష్ణభూమి వెలయు రేగట రేవడ, యనఁగ విపులకీర్తి సాంబమూర్తి ఆం ఖా. 2. 3.

**రేవిడి = రేగడి** వి. బంకమన్ను. (శ. ర.)

**రేవతము** సం. వి. అ పుం. 1 దబ్బచెట్టు. 2. ఆరగ్వధము చెట్టు (స్వ. వి.).

**రేవతి** సం. వి. ఈ స్త్రీ. 1. ఇరువదియేడవ నక్షత్రము. 2. బలరాముని భార్య. 3. గోవు. 4 ఒకానొకదేవత, మాతృకాభేదము. 5. దుర్గ పార్వతి. 6 ఒకానొకనది.

**రేవతీరమణుఁడు** సం. వి. అ. పుం. బలరాముఁడు, కామపాలుఁడు.

**రేవలచిన్ని** వి. ఓషధివిశేషము. (శ. ర)

**రేవు1.** వి. 1. వస్త్రాదులు మనుష్యులు దిగుట కనువుగా నేర్పఱచిన దారి, జలావతారము.

మ. తలఁ బఱచ్చటఁ గ్రుక్కి బాతువులు కేదారంపుఁ గుల్యాంతరస్థలి నిద్రింపఁగఁ జూచి యారెకు లుపస్నాతప్రయాతద్విజా, వలి పిండకృతిశాటులవ్వివిఁద దావానంబుఁ జేర్పంగ రే, వుల డిగ్గ న్వెపఁబాఱువానిఁ గని నవ్వున్ శాలిగోప్యోఘముల్ ఆము. 1. 65.

సీ. వేణ్యావిధానవై వెలసిన యిమ్మహాతటిని నీరేవున దాఁటిపోయి, క్రూరకర్ములు మహాచోరు లుండెడు నద్రిగిరి చూచి యొక విభావరి ప్రియమున .. హరి. ఉ. 1. 43.

ద్వి. రేసి చూడఁగరాని రేవు వకఁటికి, డాసిన పొదలలో డాఁగి యేనుండ ... రం. రా. అయో. 123 పొ. 3 పం.

2. సముద్రతీరమందు సముద్రవ్యాపారము చేయుట కుపయోగించు పట్టణము.

శా. రేవు ల్మాళవ మతంగజంబులు మణిశ్రీ ఖండ ము క్తాదియున్, రావాజిశ్మము పెంచి యే అంగళగున్వర్ణంపు వెవ్వన్ దుటన్, పారల్లం బిగు నవ్యభూప్రజల రాజాపూరంజాలెన్ని చిలిన్, త్రోవంగాఁదగుఁ దోఁట దొడ్డిగను లాప్తు ల్బాడఁబంపం దగున్. (ఆము. 4. 245.)

3. సముద్రమునందు సరకులు ఎగుమతి దిగుమతి యగుచోటు.

గీ. వనధిసర్వంకషంబయ్యు వలయుసనికి, రేవు లనకాని గొరరాని రీతి వదిప, విశ్వరూపకుఁ డయ్యు శ్రీవిభుఁడు ముక్త, రూపములరేవ్యంఁ దగు నారురుతువులకు. కవిక. 5 77.

4. చాకివాఁ డుదుకుటకై బట్టలు తీసికొనిపోవు తడవ.

క. వెల యొనిమిదియగుపాలుమ, వెల వాల్గనపాలు నోలి విడువంగవలయున్, తొలురేవున మలు రేవునఁ, జెలువే దగఁ జాకిచీర చెఱచిన చోటన్. విజ్ఞా. ప్రా. కాం. 62.

విశేషార్థము. రేవుపెట్టు = మొదలుపెట్టు. "వారినందఱను జంపఁదలఁచి యొక్కొక్క నినే రేవు పెట్టినాఁడు."

జ : రేవఁడు, రేవులువాఱు, రేవుగుజ్జము, రేవు పడవ, రేవుబోయ.

రేవు² = రేఁగు¹. అ. క్రి. విజృంభించు, చెల రేఁగు.

ఆ. ... త్రిభువనముల, రేవులఁను న్నవాఁడు నూపె నీఁ డురుశౌర్య, భానురుండు తారకా సురుండు. కు. సం. 11. 672.

రేవులువాఱు. (రేవులు + పాఱు.) అ. క్రి. రోమవీథులేర్పడు.

క. నీవఱచిన యలవులు మఱి, నీవే తెలుఁగు దువు తెలువ నీతోడునుమీ, శావాయని తల గడ్డము, రేవులువాఱంగ వడి గొరిగి విడిపించెన్. భోజసుతా. 4. 139.

వ. ... వానిఁజట్టి బంధించి గడ్డంబును మీసం బును లెఁయును రేవులువాఱ గొరిగి విరూపించెను ... భాగ. 10. పూ. 1763.

రేవుగు(జ)జ్జము. వి. (రేవు + గుజ్జము) గాడిద.

సీ. ... రేవుగుజ్జము గాలిగాఁడు. గాడిద యనఁగను ఖరము రాజిలుచుండు ...

వేంక. పంచ. 94.

ఉ. ... నెక్కి ... రేవు ... వని సమ్మ ... యాత్రికులోవువాఁడు ... పటి ... మీపభూమికిన్. (కుక. ... 10.)

రేవుపడవ. వి. (రేవు¹ + పడవ.) నద్యాదుల యిద్దరినుండి యద్దరికి మనుష్యాదుల దాఁటించు పడవ. (వా.)

రేవుబోయ. వి. (రేవు¹ + బోయ.) రేవు పడవ నడుపువాఁడు.

ఉ. అగ్నిహోత్ర రేవుబోయలఁ బ్రియంబు మెయిం బిలిపించి దేవికిన్, జయ్యన నోడపెట్టుమని ... నిర్వ. 9 8.

రేవెలుఁగు. వి. (రే¹ + వెలుఁగు.) చంద్రుఁడు.

గీ. వేవెలుఁగుజవోరజోడు రేవెలుఁగు ..

మనుచ. 1. 18.

ఆ రేవెలుంగుచేత రెమ్మినఁ జదలల్లి, వల్లమున్ను వోలు పెల్లుచీక, కుచి తేపికంటి యొత్తిన యేనిక, తోలుతోడి సాటదోఁచె పెక్కగ.

అచ్చ. భా. 3. 44.

రేవెలుఁగుతీవ. వి. (రేవెలుఁగు + తీవ.) సోమలత.

వ. గాములతెలుగంటిసాముల వెల్లదెసల వెలిం గించు రేవెలుంగుతీవ యగ్గిప్రోవులమాటి ...

అచ్చ. భా. 2. 26 పా.

రేవెలుఁగుఱాయి. వి. (రే + వెలుఁగు + ఱాయి.) చంద్రకాంతమణి.

గీ. మరకతనిబద్ధభూముల మలయు రేవె, లుంగు
టాతిన్నియల చెన్నెసంగు పొగడ, మ్రాని
నీడలందగు పొక్కకోవలోన, పుష్పక విమాన
మటు పొగిపోక నిలిచె.

ఉ. రా. 3. 66.

**రేష.** సం. వి. అ. స్త్రీ. అలుపు, బొబ్బరింత, గుఱ్ఱపుసకిలింత.

**రేషణము.** సం. వి. అ. న. అలుపు, బొబ్బరింత, గుఱ్ఱపుసకిలింత.

**రేసు.** వి ఈర్ష్య, ఈసు. (చులకన – అని, శ. ర.)

ద్వి. సవతి రేసునఁబట్టి జంపింపఁ దలఁచి, సవ
రగా నవ్రతభాషలు దొంతిచేసి ...

వన. 2. 83 పా. 9 పం. ప్రాఁతప్రతి.

క. నీ సఖ్యమునఁ జరించిన, దోసము మోసము
న నేఁడె తోడన కలిగెం, బోసరమొ పోటి
క్రొవ్వో, రేసో యిట్లాడ నెవ్వరికి నీడేరున్.

వేం. పంచ. 1. 713.

విణ. చులకనిది. (శ. ర.)

**రేసుగుడ్డ.** వి. చేతిగుడ్డ. (శ. ర.)

# రై

**రై = రో.** సం. వి. ఐ. పుం. 1. ధనము, సొమ్ము. 2. బంగారము. 3. ధ్వని.

**రైక = రయిక, తైక.** వి. అవిక, కంచుకము.

క. పోకముడి పిడఁ బులకలు, మూఁకలిడం
జెమటగ్రమ్మ మోవి చలింపన్, రైక పెకిల్లని
పెట్లఁగ, రాకేందునిభాస్యఁ గనెఁ బురాం
తకుఁ డంతన్. పార్వ..33. 5

సీ. జంట ముత్తెపుఁగుట్టు జంటరైకలనంటి బిగి
గుబ్బచన్నులు పిక్కటిల్ల ...

ఉ. రా. 6. 131.

**రైతు = రయితు.** వి. (క. రైతు) సేద్యగాఁడు. కర్షకుఁడు, పంటకాఁపు.

(వ్యవ.) ఇప్పుడు రైతుల స్థితి చాల ...

**రైత్వము** సం. విణ. (అ. ఆ. అ.) ఇత్తడితోఁ చేయఁబడినది.

**రైవతకము** సం. వి. అ. పుం. 1. ద్వారకా పట్టణమునకు సమీపమున నున్న యొకానొక కొండ. 2 పారేవతము, ఈడ (వ్ర. వి.).

**రైవతము.** సం. వి. అ. పుం. 1. ఒకానొక పర్వతము, స్వర్ణాలు వృక్షము, ఈడచెట్టు.

# రొ

**రొ = రో.** అవ్య. 1. సంబుద్ధియందు స్త్రీవాచక శబ్దంబుల కనుప్రయుక్తం బగునది.

ఉ. బాలరొ పుష్పమంజరులపై భ్రమరంబులు
వ్రాలె ... దశా. 1. 11. 7.

2. ప్రశంసాశ్చర్యార్థములందు స్త్రీవాచకముల కనుప్రయుక్తమగు.

ఉ. అమ్మరొ ధర్మరాజుఁ గొనియాడఁగఁ జెల్లదె
యెల్ల దేశముల్ ... పాంచా. 5. 76.

(కొందఱాధునికకవులు పుంవాచకములకు నను ప్రయుక్తముఁ గావించిరి.)

ఉ. తప్పక చూచు మగ్గనుచు దాదులు పల్కఁ
గఁ గేరి నవ్వు మా యప్పరొ నిద్రపొమ్మనిన
నల్లన బారలుచాఁచు ... (చంద్రహాస విలా
సము – పూర్వభాగము.)

(ఆంధ్రకవుల చరిత్రము – ద్వితీయభాగము.
333 పు.)

రొంజుడు=రోఁజుడు. వి. ప్రలాపము

సీ. రోజేడు రొంజుడు .. నాఁగఁ జెల్లఁగనౌఁ, బ్రలాపాఖ్య ... అం. భా. 1. 116.

రొండి. వి. 1. నడుముయొక్క పార్శ్వ భాగము, కటిప్రోథము.

సీ అడ్డంబు దిరిగి తలాహాతిఁ బడి రొండి హస్తంబులిడి యంగలార్చు కపుల ...

అము 6. 18.

ద్వి కరతలంబులు రొండ్లఁ గదియించు కొనుచు విగిసి పెందొడలు పొంపిరి లాయకుండ ....

పండితా. పర్వత. 343 పు.

సీ. రొండి యనం గటిప్రోథ సంజ్ఞ ...

అం. భా 1. 136.

2. నడుము యొక్క పార్శ్వభాగమున నుండు బట్టమడత.

సీ. ...గీ. చిక్కుఁ జిలువావ మొక యింటఁ జేర్చి తలుపు, చిలుకు ముద్రించి బీగము చేయి రొండిఁ జెక్కికొను ... శుక. 3. 345.

బ. రొండివేటు.

రొండివేటు. వి. (√రొండి.) మల్లబంధవిశేషము.

వ. రొండివేటును ఫణంబును గన్నాతును భారంబు ... నృసింహంబును నాదియగు ముప్పదిరెండు విన్నాణంబుల నాటెంబు పరీక్షించి .... హంస. 1. 206.

వ. ... కిల్లియు తుట్టును బరిపోటును రొండి వేటును పణంబును కరాత్తును ...

మల్లు. పు. 3. 67. ప్రబంధ. 78.

సీ. ... రూణింపు బరిపోటు రొండివేటు ...

అం. భా. 2. 209.

రొండు. వి. శ్వాసరోగము, రోఁజు.

సీ. రొండు రోఁజు వగర్పు రొప్పన శ్వాసమౌ.

అం. భా. 2. 127.

రొండు డు. వి రోఁజుడు, ప్రలాపము

సీ రోఁజుడు రొంజుడు రొద్దుడు రొండుడు ... నాఁగఁ జెలఁగ నౌఁ బ్ర, లాపాఖ్య ...

అం భా. 1. 116.

రొంప. వి. 1. పీనసరోగము. (శ. ర.) 2. పడి సెము. (చి ని., శ. ర., వా.)

రొంపి. వి. బురద, పంకము.

క. జొంపములు గొనియె వనములు, రొంపు లిగిరె నెమిలిగముల రొదలుడిగె నదుల్, పెంపులకుఁ బాసె నుబులముల, శంపల సంప దలు మానె శారదవేళన్.

భాగ. 10 పూ. 764.

సీ. పదుసాగరములు నిక్కఁ దక్కఁడఁ బెట్టి పలుచని రొంపి మై నలఁది కొనఁగ ...

భార. విరా. 2. 134.

కం. మునుపుఁగొని విరుల వావల, జొంపంబులు గురియ సురలు సుమనోమధువుల్, తుంపర లెగయఁ బరాగపు, రొంపుల భూభాగమతి నిరూపిత మయ్యెన్. భాగ. 8. 510.

మత్తకోకిల. పాయసంబుల రొంపులున్ బహు భంగి బూరెలు వట్టులున్ ...

హరి. పూ. 7. 152.

బ. రొంపిదుక్కి, రొంపిమాను, రొంపులెక్కు.

రొంపిదుక్కి. వి. (రొంపి + దుక్కి.) నీళ్లు గట్టి ఆడుసుగా దున్నుట, దమ్ము. (శ. ర.)

(వ్యతి. — మెట్టదుక్కి.)

రొంపిమాను. వి. (రొంపి + మాను.) రొంపి దున్నిన పిమ్మట మిట్టపల్లములు సరిచేయుటకు మీఁద పాటించెడు మాను, దంతపట్టె. (శ. ర.)

రొంపులెక్కు. అ. క్రి. (రొంపులు + ఎక్కు.) రొంపియగు.

గీ. కుటిల చటుల నఖాంకితస్ఫుటిత వైరి
రుధిర కల్లోలవతి మఱ్ఱి రొంపులెక్క ...
కంద 20

**రొక్కపుటొడయఁడు.** వి. (రొక్కము[1] + ఒడయఁడు.) ధనాధిపతి, కుబేరుఁడు

క. జోన కడఁకతో నుల్లదీనియు జిడ్డు
కడిమియుఁ గడిచి రొక్కపుటొడయని,
కడఁ జని .. అచ్చ. రా. యు. 403.

**రొక్కపుదొర.** వి. (రొక్కము[1] + దొర) ధనాధిపుఁడు, కుబేరుఁడు.

ద్వి. ఐచ్చలు వైశ్రవణు విచ్చ రొక్కపు
దొర దశవాయిమై తొల్పు చిలువ
తాల్పు ... అచ్చ. రా. సుందర. 41

**రొక్కము.**[1] వి. (సం. రుక్థమ్. క. రొక్క.)

1. ధనము.

ఆ తోలుదాల్పు ననుఁగు తొమ్మిది పాఁతజల్,
రొక్కమున్న ననుచు నిక్కుఁగాని ...
నీల. 1. 57

పూర్వ మేమున్నదో మీదు రొక్కసములు
రొక్కములు మీరె యడి మే మెఱుంగ
మనఘ ... ఉ. హరిశ్చ. 1. 72.

2. వెలవెల, అప్పుడిచ్చే మూల్యము.

.. రొక్కమీఁగలుగువాఁడె మనోజుఁడు కూలి
యాలికిన్ ... కు. సం. 8. 143.

(వ్యవ.) ఈ యుంగరము రొక్కమిచ్చి కొం
టివా, లేక, అరువుగా తెచ్చితివా ?

3. సమూహము. (శ. ర.)

క. ... పక్కిదొర కొలువు నవలా, రొక్కము
గంధైన నట్టి రూపని గలదే ....
అచ్చ. రా. అర. 19.

4. వేశ్యాభృతి.

సీ. రో యనఁ బైడన రొక్క మనంగను
వేశ్యాభృతికి సంజ్ఞ వెలయుచుండు ...
అం. ఛా. 2. 303.

జ. రొక్కపుటొడయఁడు, రొక్కపుదొర, రొక్కరూక, రొక్కరొక్కములు.

**రొక్కము.**[2] వి. నిర్బంధము.

చ. ఎక్కడ నెల్ల లోకముల నెవ్వరుఁ గోఁవి
పదు వేఁడు మా, తెక్కలిపాటుకై
యింటదేవ ము వేడఁగ వచ్చినార మే,మెక్కడ
తీవ్ర కర్మగతి యెక్కడ దైవకృతంబు
గాక యీ, రొక్కపుదావ మీ వరుస
రోయక వేఁడుదురే జగంబులన్.
భాగ. 6 స్కం. 349.

జ: రొక్కించు.

**రొక్కరూక.** వి (రొక్కము1 + రూక.) రొక్కముగా నిచ్చు రూప్యకము.

పీ. ఒకని కొక కొన్ని రొక్కరూక లొసంగి
కానుల లెక్కలో వ్రాసి కొనిరయొ ...
బహు. 5. 96.

**రొక్క(క్కా)రొక్కములు.** వి. బ. (√రొక్కము1) పెక్కుధనములు.

ఉ. ఈలువు వంగడంబుగల దీజవరాలని యోలి
రొక్కరొ,క్కా లిడి యొట్టి అంకుతడకన్
వరియించితి దీని నక్కటా ...
వేం. పంచ. 4. 507.

సీ. కన్నులల్లార్చి రొక్కారొక్కములు మూళ్ల
వరుసగా గడియించువారిఁ జూచి ...
విప్ర. 4 16.

మ. తెలిపూగద్దియ గాడుపుం గొదమ మస్తే
నెక్కాలేఁదేఁటి గుంపుల సందిళ్లు రొదాళ
ముల్ వరవ ... చంద్ర 3. 51.

జ : రొదాశించు.

రొదాశించే. అ. క్రి. (√రొదాశము.) ధ్వనించు.
(వేం. పంచ. 1.) (శ. ర.)

రొప్పించే. స. క్రి. (√రొప్పు) రొప్పఁజేయు,
త్రోలించు.

ఉ. ... మీఁదనిశేంద్ర పంక్తి రొప్పింతురు
ఘోరభంగి .... భా 1. 3 స్కం. 939.

ఉ. ... మీఁదనిశేంద్రపంక్తి రొప్పించితి
ధిక్కరించితి శపించితి ...

భాగ. 7. స్కం. 201.

రొప్పు. అ. క్రి. 1. కూయు.

క. అప్పుడు గగనమున మొగుల్, గప్పె మహిం
జలచి విసరె గాడ్పులు రొప్పెం, గప్పలు
వడగండ్లురిసెం, గుప్పలుగొవనోతవాన గురి
యం దొడఁగున్. వేం. పంచ. 1. 656.

ద్వి. అనఘుని రఘురాము వట లక్ష్మణుండు, గని
వెండి యెలుఁగెత్తి గ్రక్కునఁ బిలిచెఁ, గ్రొ
త్తొందుఁ జెలివని కలయఁగ రొప్పి, చేకొని
చిలుతరా చేరువఁబట్టి ...

రం. రా. అర. కాం 195 పు. 16 పం.

క. వనితా! కృష్ణుడు వల్లని, ఘనమనియున్
వేణురవము గర్జనమనియున్, మనమునఁ
దలంచి రొప్పుచు, ననవరతము నెమిలి
తుటుము లాడెడిఁగంటే.

భాగ. 10. పూ. 784.

2. అఱచు.

తే. ఇంట పెవ్వారయిన భిక్షమిడినముష్టి, పెట్టినఁ
గరాళిలేజి యొప్పిదముదోప, నెరిగివడి
యుందులకును మీరెవ్వరనుచుఁ, బెద్దపులి
వోలె రొప్ప నా బిసరువాతి.

శుక. 3. 346.

తే. తెప్పదెరలంగ బండులేతెంచుచున్న, యవి
మహాత్మ తన్నేమిజూతారవములఁ, గడఁక
నెల్లను దఱిమి రొప్పెడునరాలి, యుతి
వులిని యుల్లమునఁ గడు నులుకువుట్ట.

భార. అను 4. 318.

సీ. ధనమెక్కుడుగఁ గూర్చి తినలేక, యేడ్చెడు
పెనులుబ్ధుఁ డర్థుఁ గనిన రొప్పు ...,

వేను. 86.

3. (పంది) ఘుర్ఘురించు.

సీ. పొదలమాటునమండి యదలించుచును రొప్పి,
కదియంగఁజూచిన, బెదరితోలఁగు, ...

విక్ర. 2. 185.

గీ. పొరలుఁ గొరలు నటించునంబరము దెరల,
రొప్పునుప్పర మెగయును గొప్పరించు,
ముట్టె బిగియించు మునమున మూరుకొనుచుఁ
వడరుసంరక్షితక్షోణి యజ్ఞఘోణి.

భాగ. 3 స్కం. 413.

4. (పులి) గాండ్రుమను.

సీ. రోషభీషణరేఖ రొప్పుచు బీరంబు పొలివోని
కడిఁది బెబ్బులు లనంగ ...

హరి. ఉ. 2. 60.

సీ. రొప్పుచు నెత్తిరించు గొప్పపులుఁగుఁపుఁ
తోనీక జముదాళ్లఁ బొడిచివైచి ...

ఇందు 2. 62.

5. (ఎలుఁగు) అఱచు.

గీ. ఉల్లము గలంగ న య్యుగ్రభల్లుకంబు, గుట
గుట యటంచు రొప్పి యుక్కుటిలుఁ గదిసి.

శుక. 1. 500.

6. (పాము) బుసకొట్టు.

క. ... మహాసర్పము గ్రక్కున వొక్క బొక్క
వెలువడి, చనుదెంచెను రొప్పుచున్ విష
జ్వాలలతోన్. దశకు. 6 61.

7. విసరు, వీచు.

గీ. ధూళి మినుగప్పె వడినుడిగాలి రొప్పె, బ్రజల కళయెల్లఁ దప్పె వప్పట్టువందు ...

చెన్న. 527.

వ. క్రి. 1. తర్జించు, భయపెట్టు, అదలించు.

ఉ. చెప్పుడు చెప్పకున్న మిముఁ జిత్రముగా వధియింతు నంచు జేఁ, దప్పుడు తమ్ము రొప్పిన భయంబు వహించక యానువర్ణసాం, పొప్పఁగ భర్త కిల్లను ... హంస. 5. 210.

2. బాధించు.

క. తప్పితివో యిచ్చెదనని, చెప్పితివో కపట సాక్షి చేసినమేలున్, దప్పితివో శరణార్థుల, రొప్పితివో ద్విజులఁ బసుల రోగుల సతులన్.

భాగ. 1. 355.

సీ. మొనసి స్వర్గద్వారమునను౦డి పోపీక నిలఁ బడఁ ద్రోయించె నిదిగో యముఁడు, రొప్పుచు ... ఉ. హరిశ్చ. 4. 171.

మ. ... నా ప్రావీణ్యముఁ గోలుపోయి బలిష్ఠుండగు కాముబారిఁబడి నే నెట్లోర్తునే బంటిక, తెబడిం బాపపుఁదృష్ణ యిప్పు డకటా! శీఘ్రాకృతిన్ రొప్పెడిన్.

భాగ. 9. స్కం. 575.

3. నెట్టు, త్రోయు.

ఉ. ... ఒకమ్మ మారీచుఁ దృణాయమావ ముగఁ ద్రిప్పుచు రొప్పుచు వప్పయోధిలో, వైచె ... అధ్యా. బాల. 15 పుట.

4. త్రోలు, తఱుము.

సీ. ... కంసుండు చెల్లెలు మఱఁదియు మల్ల సిల్ల, హరులపగ్గములఁ జేనంది రొప్పఁ దొడంగె ... భాగ. 10. పూ. 20.

చ. అనిలజుఁడు ... పేదదుష్టనుజులఁ బంపనేల యని మానుగ గోపుఁడు గోగణంబులన్, గొనకొని రొప్పునట్టు లధికుం డెగిచెం బృథుదండహస్తుఁడై.

భార. ఆది. 6. 78.

ద్వి. మును పాఁతఱల ధాన్యములు పొంగుచుండె, గోధనంబులు రొప్పుకొని పోవఁబోవ, ...

పండితా. పురా. 167 పు.

క. కీలెడఁగి వలలు పన్నుఁడు, చాలేర్పడఁ దోలుచట్టు చాగుఁడురఁటన్, గిలించి బోను లొడ్డుడు, కాలాగక రొప్పి జడవిఁ గల మృగపంక్తిన్. చిత్రభా. 3. 155.

క. అప్పుడు సముల్లోండ్లకతల్, చెప్పగ నేమిటికిఁ బాటిరి వేత్రధరుల్, రొప్పఁగఁ బరిమొస్టులుపక, యప్పురిమేక్షి యను నవటికటిదూఁటమున్. [illegible]

ఉ. ... వక్త్రతామరసగంధసమాగతభృంగ సంఘమున్, రొప్పదు నిద్రఁగ్రాకొన డుకోల పరస్పరసక్తహాసముల్, విప్పడు ....

భాగ. 10 స్కం. 1728.

వి. అధైర్యము, శ్వాసము, వగరుపు.

గీ. ... ఊర్పు నా శ్వాసమంద, నొప్పునది దీర్ఘమైన నిట్టూర్పునంగ, నధికమగునది రొఁజు రొప్పనఁదగు ...

హరి. అం. భా. 1. 30.

సీ. రొంజు రొజు వగర్పు రొప్పన శ్వాసమౌ ...

అం. భా. 2. 127.

ణ : రొప్పించు.

రొమ్ము = ఱొమ్ము. వి. (సం. ఉరః.) వక్షము.

సీ. మగలాఁడు వారికి మరిగి .... పరదేశంబు లుడుగక త్రిమ్మరి ప్రేక్షకను రొమ్ముఁబోయి, యాచకులై వేడి ... కు. సం. 7. 667.

ద్వి. సిరొమ్ము కొనియాడనేర్తునే చూడ. నీ రాజ్యగతిఁజూడ నేర్తుఁగాకేమ ...

రంగ. రా. యు. 292 పు. 29 పం.

శ్లో. శుల్కం గృహీత్వా పణ్యస్త్రీ నేచ్ఛన్తీ ద్విగుణం వహేత్ అనిచ్ఛన్ దత్తశుల్కోపి శుల్కహాని మవాప్నుయాత్. (యాజ్ఞ.)

సీ. రో యనఁ బైఁడన రొక్క మనఁగను వేశ్యా భృతికి సంజ్ఞ వెలయుచుండు ...

ఆం. భా 2. 303.

జ : రోయిడు, రోవాటు. రోవెల, రోవెలఁది.

రో వం. వి = రై.

రోఁకటిపాట వి. (రోఁకలి + పాట) రోఁకటితో దంపునపుడు పాడెడిపాట, సువ్వి పాట.

ద్వి. వినికల్లిదేవయ్య విప్రులఁజూచి, యనియె రోఁకటిపాట లట్ల వేదములు ...

బస. పు. 7. 107.

రోఁకటిపోటు వి. (రోఁకలి + పోటు.) రోఁకలితోఁ బొడుచుట.

ఆ సుజనవినుత గోరుచుట్టుపై రోఁకటిపోటు దాఁకినట్లు పోతలంప, మొదలశోకజలధి మునుఁగంగ నందుపై, నీవు పల్కినట్టి నిష్ఠురోక్తి. హరిశ్చ. 5. 89.

రోఁకటిబండ. వి. (రోఁకలి + బండ.) 1. శత పది, ఒకపురుగు.

సీ ఎఱ్ఱ రోఁకటిబండ జెట్టి మన్దిండి మున్నగు సరీసృపములం దంతకంబె ...

ఆము. 3. 80.

2. పొన్నలేని చిన్నరోఁకలి. (శ. ర., వా.)

3. క్రోష్టుపుచ్ఛి, నక్కతోకపొన్న (వృ వి.).

సీ. ... క్రోష్టుపుచ్ఛియు నేలపొన్న. నా నక్కతోఁకపొన్నవఁ బొర్లుగాడివా రోఁకటి బండనా రూఢికెక్కు. ...

ఆం. భా. 2. 55.

రోఁకలి. వి. పా (సం. గోకిలః) 1 ముసలము, దంచెడు సాధనము.

బ. రోఁకకులు, రోఁకళ్లు, రోఁకండులు, రోఁకండ్లు, రోఁకలులు.

చం. పటికపుఁబోల ముప్పిరులుగ్రాలఁ బొగడఁ బోయుచు గారుకొమ్ము రోఁకటఁగాని దంచుచున్ ... కు. సం 6. 704.

ఉ. పిడుగు దాఁకినట్లు రిపుసేవల నెల్లను ముట్టి రోఁకటన్ మోదుచు నాగటం దిగిచి వాంచుచుఁ గార్ముకముక్తబాణముల్, పైఁ బొలయించి కూల్చుచును ...

హరి ౨. 1 101.

చం హలమున వమ్ముతావ్యముల వప్పటికప్పుడు దంచుకోఁగ రోఁకలిఁ గయికొంటివార ...

దశా. 3, 57.

కం. ఏరీతిం బెనఁగిన నెవ్వా రెఱుఁగరు పీదుగట్టు పనితామణి రోళ్లా రోఁకండ్లం జాడిన, కూరము రిపుడింత జాచకొన్న వడఁకునే ప్రభా.5. 25.

2. గానుఁగలో నువ్వులు మొదలగు వానిని వలఁగఁజేయు సాధనము.

చం. ... పెనుగానుఁగ రోఁకట నిశుఖండముల్, చిదుపుతెలుఁగువం జిడియఁ జేయుఁడు ...

పరమ. 1. 89.

జ ; రోఁకటిపాట, రోఁకటిపోటు, రోఁకటిబండ.

రోఁజు. అ. క్రి. నిట్టూర్చు, ఉచ్ఛ్వసించు.

చం. ... అవవుడు బిట్టపోవలి మహాభుజగేంద్రుఁడు రోఁజువట్లు రోఁజె నధిప యవిష్టుఁడు దవచిత్తమునవ్వులుకుల్ గలంచినన్. భార. శల్య. 2. 94.

**రోఁతగించు.** అ. క్రి. (√రోఁత.) రోఁతపడు. (శ. ర.)

**రోఁతపడు.** అ. క్రి. (రోఁత + పడు) అసహ్య పడు, ఏవగింపపడు.

గీ. ఎంగిలికి రోఁతపడక మెసంగువారు, సిరయ ... ...

శేష. 3. 44.

**రోఁతబమారి.** విశే. (√రోఁత.) ఏవగింపు చేయుస్వభావము కలవాఁడు, కలది.

సీ. .... మూసినముఁకి సిరోమ్మిహి ప్వామిద్రోహి దుష్టు రోఁతబమారి దోసకారి ...

హంస. 5 113

**రోక.** వి. మూల, కోణము. (శ. ర.)

**రోకము.** సం. వి. అ. న. 1. రంధ్రము, ... చలనము, ... పుం. 1. ప్రకాశము, కాంతి. 2. సొమ్మిచ్చి కొనుట.

**రోకు.** వి వికాసము.

సీ. ప్రవిమల కుసుమసంపదలకు దూరమై రోకు వాసిన మహీరుహాము రీతి ...

నూ... 1. 168.

(శ. ర. పా. రూపువీక్కిన, ముద్రి. పా.)

**రోగఘ్నము.** సం. వి. అ. న. 1. మందు. 2. వైద్యశాస్త్రము.

**రోగము.** సం. వి. అ. న. ఓషధి, మూలిక.

**రోగభువి.** సం. వి. ఈ. స్త్రీ. రోగస్థానము, శరీరము. (వీఙ్యమ్సు)

**రోగము** సం. వి. అ. పుం. 1. వ్యాధి, జబ్బు. 2. కుష్ఠౌషధము. (వాచ.)

**రోగరాజము.** సం. వి. అ. పుం. క్షయవ్యాధి.

**రోగశిల.** సం. వి. ఆ. స్త్రీ. ఎఱ్ఱపాషాణము.

**రోగశ్రేష్ఠము.** సం. వి. అ. పుం. జ్వరము.

**రోగహారి.** సం. విశే. (న్. శీ. న్.) రోగమును మాన్పువాఁడు, జబ్బు కుదుర్చువాఁడు.

సం. వి. న్. పుం. . వైద్యుఁడు. . ... చెట్టు. 3. బూడిదగుమ్మడి. (వృ. వి.).

**రోగి.** సం. విశే. (న్. శీ. న్.) రోగముగల వాఁడు, జబ్బుతోనున్నవాఁడు.

**రోగితరువు.** సం. వి. ఉ. పుం. అశోకవృక్షము.

**రోచకము.** సం. విశే. (అ. ఆ. అ) 1. ప్రకాశింపఁజేయునది. 2. మనోహరమైనది. ఇంపైనది. 3. ఆఁకలి వృద్ధిచేయునది, ఆఁకలి పుట్టించునది.

అ. న. 1. ఆఁకలి. 2. అరటిచెట్టు. 3. రాజపలాండువు. ఎఱ్ఱఉల్లి (వృ. వి.). 4. అవదంశము, ఊరుగాయ. 5. ఒకానొకచెట్టు, గ్రంధివర్ణము (వృ. వి.).

**రోచకుఁడు.** సం. వి. అ. పుం. గాజుపని, కుందనపుఁ బనిచేయువాఁడు, నగలపైఁ జిత్తరువులు చెక్కువాఁడు. (వీల్యమ్సు.)

**రోచన.** సం. వి. ఆ. స్త్రీ. 1. సౌందర్యవతియగు స్త్రీ, అందకత్తె. 2 ఒకజాతి గోరోచనము. 3. కెందమ్మి, ఎఱ్ఱతామరపువ్వు.

**రోచనకము.** సం. వి. అ. పుం. దబ్బచెట్టు.

**రోచనము.** సం. విశే. (అ. ఆ. ఈ. అ.) 1. ప్రకాశింపఁజేయునది. 2. ఇంపైనది, మనోహరమైనది. 3. ఆఁకలి పుట్టించునది.

వి. అ. పుం. 1. శ్వేతశోభాంజనము (వృ. వి.). 2. పలాండు (వృ.వి.). 3. ఆరగ్వధము (వృ.వి.) 4. దాడిమము (వృ వి.). 5. కరంజము (వృ. వి.). 6. అంకోఠము (వృ. వి.). 7 కూటశాల్మలి (వృ. వి.).

వ. 1. కోరికను చెందుట, కోరికలీరికలెత్తించుట. 2. ఆకాశము, ఖగోళము

రోచనఫల. సం. వి అ. స్త్రీ. చిర్భిట, దోస (వృ వి.).

రోచనఫలము. సం. వి. అ. పుం. బీజపూరము, మాది (వృ. వి ).

రోచని. సం. వి. ఈ. స్త్రీ. 1. ఎఱ్ఱపాషాణము, మణిశిల. 2. గోరోచనము. 3. ఆమలకి (వృ. వి ). 4. శ్వేతత్రివృత్తు (వృ.వి ). 5. గంధద్రవ్యభేదము.

రోచమానము సం విశ. (అ. ఆ. అ ) 1. ప్రకాశించునది. 2. మనోజ్ఞమైనది అందమైనది. వి. అ న గుఱ్ఱపుమెడమీఁద నుండెడి జూలు.

రోచి. సం వి ఈ. స్త్రీ శాకభేదము హిలమోచిక (వృ. వి.).

రోచిష్ణువు సం. విశ. ఉ. 1. ప్రకాశించునది, కాంతిగలది. 2. సొగసుగా నుండునది, అందముగా నుండునది, నవయౌవనము. 3. ఆకలి పుట్టించునది.

రోచిస్సు సం. వి. స్, న. 1. వెలుఁగు, ప్రకాశము, కాంతి.

రోజు. వి (హిం రోజ్ ) అహోరాత్రము, దినము. (శ. ర., వా.)

రోటిక సం. వి. ఆ. స్త్రీ. రొట్టె, గోధుమాది నిర్మితమైన రొట్టె

రోటు వి. ఈఁచే. (చూ. రోటువోవు ) (శ ర.)

జ : రోటువోవు.

రోటువోవు. అ. క్రి. (రోటు + పోవు.) ఈఁచఁబోవు.

ద్వి రోటువోయిన చేయి రొమ్ముకంపరము, వాటుఁ గాలును బోటిపలెనున్నవడుము .. ద్వి. హరిశ్చ. ఉ. 1087.

రోడు. అ. క్రి. తగులు, తాఁకు.

ఉ. లాడికి మూఁగు కాకులఁ బలాయనమొందఁగఁ జేయ వీఁపుపైఁ, ద్రాడువ్రేలు నీఁకె గుడి తాపిన దేహము పేఁడికాళ్ళకున్, రోడి వశించుతోఁక బలురోమము లంటిన జోటు టేఁగలున్, గూడిన బంధముం గలిగి కూర్కుచు నుండొక బక్కగుఱ్ఱమున్. హంస. 5. 30.

రోదనము. సం. వి. అ. న. 1. ఏడ్పు. 2. కన్నీరు.

రోదని. సం. వి. ఈ. స్త్రీ. దురాలభ, తీఁటకసింద (వృ. వి.).

రోదనిక సం. వి. ఆ. స్త్రీ. రోదని (వృ. వి.).

రోదసి సం. వి ఈ. స్త్రీ. 1. భూమ్యాకాశములు, మన్నుమిన్నులు. 2. స్వర్గము. 3. భూమి 4. ఆకాశము .

క. నీచానంబున విస్మితులై దైవతయక్షసిద్ధ లక్ష్మీ వర్ణన మత్యాదరమునఁ జేసెరిదే, రోదసిసమృద్ధముగ నరుగుదెంచి తగన్. భార. ఆశ్వ. 4. 240.

రోదస్సు సం. వి. స్. న 1. స్వర్గము, 2. భూమి.

రోదించు. సం. అ. క్రి. రోదనముచేయు, ఏడ్చు. (శ. ర.)

రోధకము. సం. విశ. (అ. ఆ. అ ) ఆఁపునట్టిది. అణఁచునట్టిది.

రోధనము. సం. వి. అ. పుం. అంగారకగ్రహము. న ఆఁపుట.

విశ. (అ ఆ. అ ) ప్రతిబంధకముచేయునది.

రోధము సం. వి. అ. పుం. 1. ఆఁపుట, ఆటంకపఱుచుట. 2. ముట్టడి, ఆవరణము. 3. గట్టు, తీరము.

రోధస్సు సం. వి. స్. న. 1 గట్టు, తీరము. 2. కుడ్యము, గోడ 3 అంతరిక్షము, ఆకాశము. 4. [illegible]ణము, ముట్టడి. 5 ఆఁపుట, ఆటంకపఱచుట.

**రోధించు.** సం. స. క్రి. అడ్డగించు. (శ. ర.)

**రోధో(ధ)వక్ర.** సం. వి. ఆ. స్త్రీ. (రోధస్ + వక్ర.) 1. నది, ఏఱు. 2. వేగవతియగు నది, వడిగల యేఱు.

**రోధోవక్రము.** సం. వి. అ. పుం. వడిగల నది.

**రోధ్రపుష్పము** సం. వి. అ. పుం. మధూక వృక్షము, ఇప్ప (వృ. వి.).

**రోధ్రపుష్పిణి.** సం. వి. ఈ. స్త్రీ. మాతక వృక్షము, ఏఱుజాజి (వృ. వి.).

**రోధ్రము.** సం. వి. అ. పుం. లొద్దుగ, (వృ. వి.) పుం. న. పాపము, ... అపరాధము.

**రోపకుఁడు.** సం. వి. అ. పుం. రోపణము చేయువాఁడు.

**రోపణము.** సం. వి. అ. న. 1. లేనిదానిని మోపుట, ఆరోపించుట. 2. పైరుచేయుట, మొక్కలు పాతుట. 3. పుట్టించుట. 4. ఒకానొక యంజనము.

**రోపణీవర్తి.** సం. వి. ఈ. స్త్రీ. ఒకానొక యంజనము, నేత్రాంజనవటి.

**రోపము.** సం. వి. అ. పుం. 1. ఆరోపించుట. 2. పైరుచేయుట, మొక్కలు పాతుట. 3. బాణము. న. 1. రంధ్రము, గుహావిలము.

**రోపితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. పాతఁబడినది, నాటఁబడినది. 2. ఆరోపితము, ఆరోపణ చేయఁబడినది.

**రోమంథము.** సం. వి. అ. పుం. 1. నెమరువేయుట.

**రోమకందము.** సం. వి. అ. పుం. పెండలము, చాఱకంద (వృ. వి.).

**రోమకము.** సం. వి. అ. న. 1. పాంశులవణము. 2. ఒకజాతి సూదంటురాయి.

**రోమకూపము.** సం. వి. అ. పుం. న. రోమరంధ్రము, చర్మముమీఁది రోమరంధ్రము.

**రోమకే(శ)సరము.** సం. వి. అ. న. సురటి, వింజామరము.

**రోమగుచ్ఛము.** సం. వి. అ. న. వింజామర, సురటి.

**రోమభూమి.** సం. వి. ఇ. స్త్రీ. రోమస్థానము, చర్మము.

**రోమము.** సం. వి. అ. న. దేహముమీఁద నుండెడి వెండ్రుక, ముఖము శిరము దక్కఁ దక్కిన దేహమందుగల వెండ్రుక. 2. పక్షుల యీఁక. అ. పుం. 1. బిలము, గుహ, 2. జలము, నీరు. (విల్యమ్సు.)

**రోమరంధ్రము.** సం. వి. అ. న. రోమకూపము.

**రోమరాజి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. రోమావలి, నూఁగారు.

**రోమలత.** సం. వి. ఆ. స్త్రీ. రోమావలి, నూఁగారు.

**రోమవికారము.** సం. వి. అ. పుం. పులకరించుట, గగుర్పాటు.

**రోమవిక్రియ.** సం. వి. ఆ. స్త్రీ. పులకరించుట, గగుర్పాటు.

**రోమశము** సం. విశే. (అ. ఆ. అ.) రోమములు గలది, బొచ్చుగలది. వి. అ. పుం. 1. గొఱ్ఱెపోతు. 2. పంది 3. పెండలము, చాఱకంద (వృ. వి.). 4. ముష్కి, నాచు (వృ. వి.).

**రోమశి.** సం. వి. ఈ. స్త్రీ. ములుదోస (వృ. వి.). (శ. ర.)

**రోమహర్షణము.** సం. విశే. (అ. అ. అ.) పులకరింపఁజేయునది, గగుర్పాటు గలిగించునట్టిది, భయము పుట్టించునది. వి. అ. న. గగుర్పాటు, రోమాంచము. పుం. విభీతకవృక్షము, తాండ్ర. (వృ. వి.).

**రోమహర్షణుఁడు.** సం. వి. అ. పుం. శౌనకునకుఁ బెక్కు పురాణములు వినిపించినవాఁడును వ్యాసశిష్యుఁడు నగు సూతుఁడు, లోమహర్షణుఁడు.

**రోమహర్షము** సం. వి. అ. పుం. గగుర్పాటు, గగుర్పొడుచుట.

**రోమాంచము** సం. వి. అ. పుం. (ఆనందము, భయము, ఆశ్చర్యము మొదలగు వానివలన) నొడలు పులకరించుట, గగుర్పాటు, గగుర్పొడుచుట.

**రోమాంచితము** సం. విశే. (అ. అ. అ.) గగుర్పొడుచునది, లోమాంచితము.

**రోమావళి** సం. వి. ఈ. స్త్రీ. 1. నూగారు. [illegible] బొడ్డునకుఁ బైభాగమునందు పుట్టి పైకెడి వెండ్రుకల వరుస, రోమరాజి. 2 తారుణ్యము, యౌవనము.

**రోమవృక్షము** సం. వి. అ. పుం. [illegible] (వృ. వి.).

**రోమశపృష్ఠకము** సం. వి. అ. పుం. కుంభివృక్షము తామ (వృ. వి.).

**రోమాళి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. రోమాలి.

**రోమోద్గమము** సం. వి. అ. పుం. పులకరించుట, గగుర్పొడుచుట, గగుర్పాటు.

**రోయి = రో** వి. (సం రాః) 1. వేశ్యకిచ్చెడి శుల్కము.

కం. రోయిడి యొల్లని భుజగుఁడు, రోయి విడువ వలయు లంజెరోఁగొని మరలన్, రోయి దఁదిలఁచిన నినుమడి, పాయక యిచ్చుటయ తగినపాడి యిరయఁగన్.

విజ్ఞా. ప్రా. 109.

ద్వి. పాయకరోయి మూపణఁతికి నిచ్చి, వేయేసి మూడలు విప్రేంద్ర యనుడు ...

పండితా. మహిమా 281 పు.

ఉ. రోయిడఁ బంచువారు ... ... రోయి పొల్తులఁ గావఁగ రోయువార లన్ .. కు. సం. 8. 138.

2. ఉడువ, తాకట్టు.

సం. రోయిగాఁ వడ్డి కిచ్చివఁ, బాయక నెల నెల వచ్చిభాగము గొనివన్, న్యాయమును మిగులఁగొను ట, న్యాయం బొడఁబడని చోట నభినవదండి. విజ్ఞా. వ్యవ. 64.

3. చేబదులు.

కం రోయిఁగొని పెట్టఁబాలక, ప్రాయిఁదయై యనుగునతఁడుఁ బరదేశము దాఁబోయి నతఁడు మూఁడునెలల్, పోయిన తుదివడ్డి సహింగముగఁ బెట్టదగున్ ...

విజ్ఞా. వ్యవ. కాం. 69.

4 జూదమునం దొడ్డెడు పందెపు ధనము.

కం దగయంటి రోయిఁగా జూ, దము నీతోఁగాడఁ గడఁగెదను ... భార. అర. 2. 41.

జ · రోయివెఁడి.

**రోయించు** స క్రి. (√రోయు.) రోయఁజేయు, వెదకించు.

ఆ. చరులఁ బనిచి వైరిచరుల రోయించుట, నెమ్మనమున నెటఁగి నమ్మకునికి, కార్య యోగమునకుఁగా శత్రువైననుఁ, నమ్మినట్లు యునికి నయవిధంబు. మార్క. ప. 128.

**రోయిడు.** (రో² + ఇడు.) స. క్రి తాకట్టు పెట్టు.

కం. మడివా లోడయని వస్త్రము, విడఁబఱిచిన వమ్మికొనినఁ దా రోయిడినన్, బడిదియ వెట్టినఁ గిట్టిన, వడరఁ బఙత్రయము దండు వరువఁగ వలయున్. విజ్ఞా. ప్రా. 61.

సీ. ఆపి రోయిడి తల్లి నాఁగి బిడ్డల వమ్మి ... దశకు. 6. 95.

ద్వి. వీరభద్రునియాత్ర వెలఁదులు వోవ, వారముల్ రోయిడి యరిగె మాబిడ్డ ...

పండితా. పురా. 122. పా.

రోయివెలఁది = రోవెలఁది. వి. (రోయి + వెలఁది) భోగముది, వేశ్య.

గీ. భార్యపాలిండ్లు రిక్తకుంభములు రోయి, వెలఁది చనుదోయి నిండుకుండలు కులంబు, తరుణిఫాలంబు చవుతిచందరుఁడు వేశ్యా ముదురు వానికిఁ బ్రతిపదిందుఁడు నయ్యె.

పాండు. 3. 11.

రోయు. అ క్రి. 1. అసహ్యపడు, ఏవగించు.

కం. మాసిన చీరయుఁ దనుఁ గని, రోసి ... బాలిక సడలి నెఱిఁగఁడ బి, ట్టేఁచిన ముద ముడిచె ధృతి,వాసిన బెగడొందు సింహ బలుఁ డట్టెడఁడన్. (భార విరా. 2. 62.)

సీ. ... వారు సహింప కెగ్గు,సేయుదు రేను రోసితి వారితోడి పొత్తొల్లఁ గపంబు సేయుచు శరీర,భారంబు విడిచెదన్ ...

భార. ఆది. 2. 125.

చం. అసమితవాహినీతనయు వస్త్రహరణోద్యోగమున దక్షిఁ గర్ణుని రణధర్మహీనతకు రోయక చంపిన భంగులున్ ...

భార. శల్య. 2. 385.

ఉ. ... పూఁత యొవర్చుకొంటి శవభూతిఁగపాలముఁ దాన్ ధరించి తీర్థాంతలు వెక్కులుండ నిట రోయుదువే యిఁక భక్తవత్సలా.

కాశ. 3. 100.

2. వెనుదీయు, సంకోచించు.

కం. అనవుడు గురుఁ డిట్లనుఁ గర్ణునిచందముఁ ముమ్మ గడఁగు రోయుఁడు పొఱన్ ...

భార. ఉద్యో. 4. 285.

ఉ. రోయఁ డోకించు కేనియు మరుత్పతి యన్యకళత్రదూషణా, న్యాయము సేయ మన్మథ మదాంధత నాశ్రమభూమిఁ గొక్కు రో, కోయని కూయఁడే ... నైష. 6. 79.

కం. గోవధము సేయు తుంకల, దైవంబవు నీవు మొదలఁదక్కక పాంథస్త్రీ వధము సేయ రోయుదె, సీ వర్తనమేమి చెప్పు సింజవైరీ.

మను చ. 3. 42.

స. క్రి. అసహ్యించుకొను.

దండకము. ... వారిం దగఁజూచి విశ్లేష్య చందంబులన్ రోసి యుల్లాసి ...

సీలా. 3. 41.

కం. దోసమునకుఁ బనిలేదఁట, నా పొమ్ములు వీరికిం దివం బని గలదే, రోసితి సంసారముఁ దెగఁ,గోసితి మొదలంట బందుగుల తగులెల్లన్. వాల్మీ. 2. 112.

కం. ... వనజాతేక్షణల రోసి వసుధేశుఁ డనున్. విక్ర. 3. 25.

ద్వి. కంతునికోలల రోసి కన్నులు మూసి, చింత లొక్కటి చేసి శివుఁ దలపోసి ...

ద్వి. హరిశ్చ. ఉ. 65. 64.

2. విడుచు.

సీ. .... మీకు, రోయక యహితంబు సేయ నన్ బంచినఁ జనుదెంచి యేను మీ తనయూనందుఁ, బతిబుద్ధిఁ దాల్చి ....

భార. ఆది. 6. 211.

తే. పరల సామిమ్ముటకు ఒహు మథవపడిన, యష్టు అని రోసి పూ ఃతా ప్రైః హాకెవి, ... బట్టుమోపి చరంగఁ శచ్ఛపముమీఁద, గట్టి వెత్తె సురానుఃగణము అపుడు.

దశా. 2 197.

కం. ముల్లోకంబుల జనములు, రోళ్లన్ రోకండ్లఁ జాడ రోయక మఱియున్, వెల్లివిరివిగాఁగ దిరిగిన, గళ్లకు వయగారి మెలఁతుకం గొని పోయెన్. వరాహ. 7. 22.

సీ. ఆయుధంబులునేసి హంకారములు రోసి మ్రొక్కువారును ఋట్ట లెక్కువారు ....

వరాహ. 3. 47.

సీ. .... చిఱుతపొప్పళి రోసి సరిగంచు పసరు పొప్పళికుచ్చెల చెఱంగు వలువగట్టి ....

శుక. 1. 257.

3. నిందించు.

చ. ఘనతర శోకవేగమునఁ గన్నుల నీరుల నించి యాసుయోధను నవిసియు విపవ ధర్మతనూజుఁడు సంధిగోరి వ్రక్కిన తగవుం గడంగి యనికిం దలకొన్న నిజోద్యమంబుఁ దోఁచిన మదిఁ దిట్టుచున్ వినుతి సేయుచు రోయుచు నుండె వయ్యెడన్.

భార. భీష్మ 3. 156.

కం. వాసవసుతుఁ డాలింగముఁ, జాసి చనఁగలేక గాసిఁబడియుం దమఁదా, రోసియుఁ బలు నిట్టూర్పులు, సేసియు నాడెల్ల నుపవసిం చుచుఁ జనియెన్. కాశ. 4. 84.

చం. ధరణిజ నిందునందును బదంపడి రోసి వృథార్తి రోసి ధీ,నురుచిరుఁడైన మారుతి ...

చం. రా. 7. 31

4. వెదకు

కం. ఇది రోయు తీఁగకాళ్లఁ, బెనఁగెం బాససుమఁ బొంగి భీమసేనుకు

భార. ఆది. 7. 220.

ఉ. ... కప్పుఁ పురిప్పుటనంటులనీడరేఁగు రా, కన్నెల రోయు సన్నులకు గన్నులు మూయకు ... వసు. 1. 112.

ఉ. చుక్కలు తోడుతోడఁ దలచూపఁ దొడంగె మనోభవుండు వి,ల్లెక్కిడి చక్రవాక ముల యిక్కలు రోయఁగఁ జొచ్చె ...

భార. వి. 2. 519.

చం. ధరణిజ నిందువందును బదంపడి రోసి వృథార్తి రోసి ధీ,నురుచిరుఁడైన మారుతి ...

చం. రా. 7. 31.

5. చొచ్చు, ప్రవేశించు.

మ. ఉఱ కంభోనిధి రోసి వేదముల కుయ్యాల్ దైన్యముం జూచి వే,గఱు లల్లార్చి ముఖంబు సోఁచి బలువీఁకం దోఁక సారించి ...

భాగ. 8. 730.

కం. శ్రీరమణభిదుహారన, రోరుహాసద్గంధలహరి రోసి చరించున్, సారెకు నై వచ్చుట శిశిర సమీరము అఖిలైకసుఖముమీఱఁగ నెపుడున్. వాల్మీ. 1. 72.

6. తలఁచు, భావించు.

కం. శకుని విను సమరధుఁడు పాం,డుకుమారుల తోడ నెప్పుడుం బగగొని వా,రికిఁ గీడ రోయు ... భార. ఉద్యో. 4. 227.

జ : రోఁత, రోఁతగించు, రోఁతపడు, రోఁతల మారి, రోయించు.

రోయెలనాఁగ. (రో + ఎలనాగ.) వి. వేశ్య, పణ్యస్త్రీ.

కం. తనకిలి తెల్పురోయెల, నాఁగను దగులు
కొని నాఁడునాఁటికిఁ గోర్కుల్, తీఁగలు
సాగఁగ మన్మథ భోగంబుల మనసు తృప్తిఁ
బొందిన పిదపన్. వి. శకుం. 2. 144

**రోదద.** సం. వి. అ. స్త్రీ. అతిశయరోదనము, పెద్దయేడుపు.

**రోలంబము.** సం. వి. అ. పుం. భ్రమరము, తుమ్మెద

**రోలవ** సం. వి. అ. పుం. పానీయామలకము, నీటియుసిరిక. (వ్యా. వి)

**రోవాటు.** వి. (రో2 + పాటు.) వేశ్యావృత్తి, లంజెకిత్తెడి సొమ్ము.

కం. మీవెలఁది కూడఁబెట్టిన, రోవెలఁ జేయింపు
కొంటిరో మీకెవరో, రోవాటున నిడిరో
విటుల్, తాకట్టిదో యనిన వేశ్యతల్లి యలని
తనె.

**రోవి.** వి. వృక్షవిశేషము

దోఁక... మోవులు ... పుల ... ,
రావులు నిప్పులు రాలఁ దలిర్పన్ ...
యయా 2 48.

**రోవెల** వి. (రో2 + వెల.) వేశ్యకిచ్చు ధనము.

చం. నలపులయిక్కలంజియల నమ్మిన రోవెల
వంటజక్కవ, ల్డలపనికేడు .. చకటి పర్వె
మర్వడన్. కవిక. 4. 86.

ఉ రోవెల్లనీఁగి వేఱొకని రోయుదగన్ ...
కు. సం. 8. 58.

చం .. వెలయాండ్రుపిల్చిరే, కులజులైన మున్ను
దమకుం బ్రకృతంబుగ నిచ్చువట్టి రోవెల
కధికంబు నొక్కయుఁ వీసము కానును జేతి
కిచ్చినన్.

(వైజ. 2. 61. శుక. 3. 64.)

**రోవెలఁది.** వి. (రో2 + వెలఁది) వారాంగన.

చం. వలుఁగిడి చల్వఁదాల్చి పయనంపుటలంతలు
నిద్రఁజెందు రో. వెలఁదుల లేపఁగాఁకి ..
కువల 2. 110.

**రోషణము** సం. వి అ. పుం. 1 ఒరగల్లు, గీటురాయి 2. పాదరసము. 3. ఊషరక్షేత్రము, చవిటనేల.

**రోషణుఁడు.** సం. విశే (అ ఈ. అ) కోపశీలముకలవాఁడు, ముక్కోపి, సులభముగా కోపమువచ్చువాఁడు.

**రోషము.** సం వి. అ పుం కోపము, కినుక.

**రోషించు.** సం. అ క్రి రోషపడు, కినియు. (శ. ర.)

**రోసగాఁడు** విశే. (రోసము + కాఁడు) రోషము కలవాఁడు రోషముగలవాఁడు.

ఉ ఆయన యెుంటిగాఁడు వెలయాండ్రలగుల్ల
లవారికు వాఁడిమిం, బోయినచో. మాట
పొఱపొచ్చెము సైఁపని రోసగాఁడుగా,
యీయెడ నేమి పుట్టునో ...
శుక. 3 150.

**రోసము.** వి. (సం. రోషః.) కోపము.

ఉ. ... అంతంతకు రోస మీనుబెరయన్
ధరణీశుఁడు తెచెఁ జెచ్చెరన్ ...
ఉ. రా. 3 146.

గీ. బేంజపు గట్టి ఇంత పాతూరినంత, చలము
సాధించు దిట్ట రోసాలపుట్ట ...
శుక. 3. 18.

సీ. గురుఁడుగాఁడే సైరధరుఁ డధికంబెన్నఁ దవ
కేల నీరోస మనియె వొకఁడు ...
దశా. 3. 152.

ఇ : రోసగాఁడు, రోసించు.

**రోహితుఁడు.** సం. వి. అ. పుం. హరిశ్చంద్రుని కొడుకుపేరు.

**రోహిత్తు.** సం. వి. త. పుం. 1. సూర్యుఁడు. 2. ఒకజాతి చేఁప.

స్త్రీ. 1. లతాభేదము. 2. మృగి, ఆఁడులేడి.

**రోహిషము.** సం. వి. అ. పుం. 1. ఒకజాతి చేఁప. 2. ఒకజాతి లేడి, మృగభేదము. 3. తృణవిశేషము.

## రౌ

**రౌక్ష్యము.** సం. వి. అ. న. 1. రూక్షత్వము, కాఠిన్యము. 2. శుష్కత్వము, ఎండుట.

**రౌచ్యము.** సం. వి. అ. పుం. బిల్వదండము, మారేడుదండము. (పేఁ ర్యమ్ను.)

**రౌచ్యుఁడు.** సం. వి. అ. పుం. ఒకానొక మనువు, పదుమూఁడవ మనువు.

**రౌతు = రవుతు.** వి. (సం. రాహుత్తః) సాది, గుఱ్ఱపుస్వారిచేయువాఁడు.

శా. ... ధారాపంచకభావమం జెలఁగు గంధర్వంబుఁ ద్రొక్కించు జల్ బీరంపున్ నెఱరౌతు .... ఆము. 4. 31.

ఉ. పలుకులు నేయునేల నినుజాల కనుంగొని పంతమూంపియున్, జిలుకపటాణిరౌతు త్వరసేసె ... ఉ. రా. 4 200.

**రౌద్రము.** సం. విణ. (అ. ఆ. ఈ. అ. 1. రౌద్రమైనది, కోపముగలది. 2. భయంకరమైనది. వెఱ్ఱగలిగించునది. 3. (మంత్రము లేక సూక్తము) రుద్రుని సంబోధించునది లేక స్తుతించునది. - వి. అ. పుం. 1. తీవ్రత, కోపము. 2. రౌద్రరసము. (నవరసములలో నొకటి) న. 1. కోపము, క్రోధము. 2 భయంకరత్వము. (క్రూరత్వము.) 3. వేఁడిమి, ఉష్ణత, 4. ఎండ, ఆతపము.

**రౌద్రి** సం. వి. ఈ. స్త్రీ. 1. దుర్గ, పార్వతి. 2. రుద్రజట (వృ. వి.). - ఇ. పుం. అఱువది సంవత్సరములలో నొకటి, సిద్ధార్థి తరువాతిది.

**రౌప్యము.** సం. వి. అ. న. వెండి.

**రౌమకము.** సం. వి. అ. న. లవణవిశేషము. ఒకరకము ఉప్పు.

**రౌమము.** సం. వి. అ. న. లవణభేదము, సాంభరి లవణము.

**రౌరవము.** సం. విణ. (అ. ఈ. అ.) 1. రురుచర్మము. (కృష్ణ మృగచర్మము)తోఁ జేయఁబడినది. 2. కఠినమైనది. 3. చంచలమైనది. 4. మోసముచేయునది, ధూర్తమైనది. వి. అ. పుం. ఒకానొక నరకము, నరకవిశేషము. - న. ఒకానొక సామము.

**రౌలు = రవులు.** అ. క్రి. (నిప్పు) మండు.

ఉ : రౌలుకొను, రౌలుకొలుపు, రౌలుకోలు, రౌలుచు.

**రౌలుకొను.** అ. క్రి. (రౌలు + కొను.) (స్వార్థమున) రగులు. (చూ. రౌలుకొల్పు)

**రౌలుకొలుపు(ల్పు.)** స. క్రి. (√రౌలుకొను.) మండునట్లుచేయు, రగులునట్లుచేయు.

చ :చుఱుకు చుఱుక్కునం దినువు దోఁకెడు వన్నెల రౌలుకొల్పుచున్ ... అవఁగఁ జొచ్చె దెమ్మెగలు ...

చంద్ర. 4. 110. (ప్రా. పా.)

రౌలుకొల్పు, ముద్రి. పా )

**రౌలుకోలు = రవులుకోలు.** వి. (√రౌలుకొను.) రగులుకొనుట.

**రౌలుచు. = రవులుచు.** స. క్రి. (√రౌలు.) రగులుకొనఁజేయు.

రౌహిణము సం వి అ పుం 1. చందన వృక్షము 2. కాలభేదము రోహిణము

రౌహిణేయము సం వి అ. పుం. 1. ఆవు దూడ. 2 మరకతము 3. బుధగ్రహము 4. శనిగ్రహము 5. కాలభేద ము - వి 1. ఒచ్చె ము, రోహిణము.

రౌహిణేయుఁడు. సం. వి అ పుం 1. బల రాముఁడు 2. బుధుఁడు, (గ్రహము) 3 శని.

రౌహిషము సం వి ష. పుం 1 మృగ భేదము, కొండగొఱ్ఱె 2 ఒకజాతి మత్స్యము 3 ఒకజాతి తృణము, కామంచి.

రౌహిషి సం. వి. ఈ స్త్రీ 1. రోహిషజాతి యాడుజింక 2. లత. 3 ఒకదినుసు దూర్వా తృణము, దూర్వ. (వృ. వి.)



ఱ వి ఒకానొక యక్షరము.

(ఇది దక్షిణదేశభాషలందుఁ గనవచ్చుచున్నది)

అంకాట వి (అంకు + ఆట) జారత్వము చేయుట.

సి. తెటుతిట్టుట మేనుముట్టి నోవడుచుట కౌఁగిట అంకాట సాహసంబు, ... జయులు కోఁదప్పి సభఁజెప్పుదురు దీనిఁ దెలియవడిగి ఒభు డుతీర్పుఁడయు. విజ్ఞా వ్యవ. 17.

అంకాడు అ క్రి (అంకు + ఆడు) అంకు నేయు, జారత్వము చేయు.

గి. ఇతఁడు కలఁడ్రాగె అంకాడె నెఱసిదివియొ, నిలిచి మూత్రించెఁ జడాలఁటలనఁగూడెఁ, గూఁతు రమియించెఁ దెరవాటు గొట్టెఁ బ్రజ లఁ, జెచురాజుల నేవించెఁ జెటిచెఁ గుంమ. శివరా. 4. 54.

సీ. వలదనఁగా నొరువనితతో నొక్కండు దాఁ బల్కెనేని శతద్వయంబు, వారించు టెఱిఁగియు వారిద్దఱును మాటలాడిరేనియును అంకాడినట్ల .. విజ్ఞా. ప్రా 116

ద్వి వేయేల వ్రేవాడ వెన్న ముచ్చిలుచుఁ, బోయి అంకాడదే పొలఁతులతోడ ...

బస పు 6. 880 పం.

అంకు వి జారత్వము.

సీ. జనులోక్కులఁ దొల్లి సమయంబు ఓసరి వఁ జేసి క్రూరతయు ముచ్చిమియు అంకు సైఁపక .. భార. శాం 257.

సీ ఆచార్యుఁ డనక భార్యకుఁ దప్పినప్పుడు పొడు గల నీఅంకు పొడువదయ్యె ...

పి, శకుం. 3 184.

జ ౦ అంకాట, అంకాడు, అంకుబోతు, అంకు టాలు, అంకుతడక, అంకుతెగులు, అంకు మగఁడు, అంకురాటన్నము. అంకులఁగొండి, అంకులాఁడి, అంకువెలఁది, అంకెదె

అంకుఁబోతు. వి. జారిణి, జారుఁడు.

సీ. అంకుఁబోతునకు సద్వ్రతనిష్ఠలేటికి వానివి యేమిటికి దుర్వర్తనునకు ... రామలిం. 33.

అంకుటాలు వి. (అంకు + ఆలు) వ్యభిచారిణి, జారిణి. (శ. ర.)

అంకుతడక. వి. (అంకు + తడక) మిక్కిలి జారత్వముగల స్త్రీ.

ఉ. ఈలువు వంగడంబు గల పీఁటవరాలని యోలి రొక్కరొక్కరిడె యెట్టి అంకుతడకన్ వరయించితి దీని వక్కటా ...

వెం. పంచ. 4. 507.

అంకుతెగులు. వి. (అంకు + తెగులు) సుఖ రోగము, మేహ రోగము. (శ. ర.)

**అంకుమగఁడు.** వి. (అంకు + మగఁడు) ఉప పతి జారుఁడు.

గీ. మగనిరాక మొఱఁగి మగువ యొయ్యన ఉంపు మగనిఁ బెట్టి యింటిమఱుఁగున నుండఁ, గల్లు నోలెమువను గడియించి యామీఁద. గంప ... కదలకుండ. (శల్లా. 1.) (శ. ర.)

**అంకురాట్నము.** వి (√ అంకు.) జారిణి, లంజె.

సీ. ... అంకురాట్నాలకును కుంతరండలకను, ..

గీ. ... సమున చేడ్పెడి ద్రాజవాని, గడన వీండ్ల కెకాక సత్కవుల కవునె ...

వేణు. ౪. 88.

**అంకులగొండి.** విశే (అంకుల + గొండి) అంకు తనపుస్వభావముగలది

ద్వి బొంకుల పిడుగులు అంకులగొండ్లు, ఎన్నె క త్తెలు నాంచవనితలు మఱియు ....

పండితా. పురా 116. పా.

**అంకులాఁడి.** (√ అంకు) వి. జారస్త్రీ, లంజె.

ఆ దొంగతనము అంకుదొరయను జగతిని, అంకు లాఁడి కింత శంకపుట్ట, దొంగకెన్న వేవెలం గొప్పుగా నట్టి, ... వేమ. 1. 155.

**అంకువెలఁది** వి (అంకు + వెలఁది) జారిణి.

కం. పంతపురక్కసిమూఁకల, అంకు లఁడిగె నెలమి గనిరి అంకువెలందుల్ ...

అచ్చ. రా సుం. ౭.

**అంకె.** వి. 1. ఎద్దు మొదలగునవి చేయు ధ్వని.

కం. చెలఁగు పటుసింహనాదములు అంకెలు గాఁగ వారు పొలిచిరి వృషభంబుల క్రియ హొండొరులకు మార్కొనలయుచుఁ దాఁకుచు మదొత్తరభవోజ్జ్వలులై.

భార. ద్రో 4. 171.

ఈ అంకెలు గర్జలై ... యుదర ... నెందుఁ బర్వి నిశ్శంకవిలోక వైశ్వ... ... దెసలెల్లఁ గప్పఁగా ... ... యదూద్వహుపై నయఁగుబనన్.

హరి పూ. 8 44.

ద్వి అంతుగా నాఁబోతు అంకెవేసినను, గంతులు దక్కునే కంఠీరవంబు ...

వ మిసమిసమెఱయు సస్యంబు లాస్యంబులం జర్వించి గర్వించి అంకెలువేయు జిం కలును.

చిత్రభా. 3. 135.

2. ధ్వని.

మ. .. మహోత్సాహంబునం దేరు వెక్కి యనేకంబులు తూర్యముల్ దిశల అంకెల్ త్రేయఁజేయన్ ... రామా 8. 242.

3. కేక, అఱపు.

ఉ. ... కవితసారమెఱుంగక సారెసారెకు, స్తంకెలువేయు దుష్కవిజనంబుల నెల్లఁ దృణీకరించెదన్. రుక్మి. 1 17.

జ, అంకెవైచే.

**అంకెత.** వి. (అంకు.) జారిణి, జారత్వము గలది

ద్వి. బంకెతల్ అంకెతల్ పచ్చిరక్కసులు

పండితా పురా. 116. పా.

**అంకెవైచె.** (అంకె + వైచు) అ. క్రి. కేకలు వైచు.

ఆ మీకుఁ జిన్నవాఁడ నేకాంగవీరుండ, అంకె వైచిన నెదళింకమైన, నగినఁ గేరరించినను మీసలంటినఁ, బట్టితివియ నాకుఁ బాడి గాదె. ద్వా. 7. 41

**అంకెలు(ల్లు)** అ. క్రి. (√ అంకు.) పెద్ద ధ్వని చేయు, (కలకలధ్వనిచేయు, అని శ. ర.)

చం. కటకట పూర్వజన్మకృత కర్మ మదెట్టిదొ తప్పాకుతలే దిటులు దురాగ్రహంబు ... కెట్టు యూరక అంపటిల్లుచున్, దిటమఱి యున్న నన్ను నొకఁ దిట్టియుఁ గొట్టియు నక్రచిత్త మిప్పటికిని తాంలిఁ బొంపదు యుపా... నామదిఁ దోచ చేసియున్.
కులశేఖరమహీపాలచరిత్రము. ఆ. 1. (చి.ని.)

అంపము. వి. (సం. కంపటమ్.) కజ్జులు కోయు న ధనిము, క్రకచము.

శా. క్రూరాసిం దెగనేసెనో వతికెనో క్రోవ్వాఁడి అంపంబుచే ... హ. 7. 69.

గీ. రావణుని ధైర్యతతఁ ద్రుంప అంప మితఁడు.
ఉ. రా 5. 75.

జ : అంపకాఁడు.

**అంపిల్లు(లు).** అ. క్రి. (√అంపు.) 1. వ్యాపించు.

కం. అంతటఁ గడలందెల్లఁ గొ,అంత యెుకింత య మతేక అంపిల్లె నిరుల్ ...
అచ్చ. రా. సుం. 3.

2. అతిశయించు.

కం. అంపిలు శ్యాగణికశైత్య,నంపాతికజాలికాది నానామృగయా,లంపట సుభటాలాపవ,తం పర చెనికింపు నింప రాజటఁ జనుచున్.
చంద్రా 2. 60.

3. విజృంభించు

చం. ... లొజ్జుకాని బల్లొనలను దొడ్డసింగిణులు దూశాని వెన్నకురాని బీరమున్, బొనఁగ వేల్పుగొఁగతొలిబొట్టియ యుఁద్రజితుండు అంపిలున్. అచ్చ. రా. యు. 70.

సీ. తెగినసోఁకుడు మూఁక మగుడ నాబలవిద్దె పెంపుచే బ్రదికి అంపిల్లుచుండ ...
యయా. 3. 105.

(పోరు. బ్రౌ. వర్ధిల్లు. శ. ర.)

4. వర్ధిల్లు.

ఆ. జాలు దుష్టపే ప్రథమరజన్నుల, యదమ్యోఁగాన దీని యుపగుణమున, రాజ్యలక్ష్మి దాసి అంపిల్లు సిరులు. కలిమి పెంపుఁజాని పొలియు నశఘు
శుక. 1. 457.

5. జిఱచు. పేలు.

గీ. అజబె ... గు సెనను ...
అం. భా ర. 112.

**అంపు** వి 1. కళకళము.

చం. చెలి యతిఁబాది తేచి తపచేడియపై వారగున్ జలదృగ్గం, చలములు కమ్మపంటి సుమసానలఁదీఁ బదాలువన్నె గంధ్యల మొలనూలు జాఱ జరణంబుల అంపున గిల్లుమట్టియల్, ఘలుఘలుఘల్లనన్ స్ఫటికా మణి యుల్లము ఝల్లుఝల్లనన్.
రా. వి. ఆ. 128.

2. ఉత్కర్షము, గొప్పతనము.

గీ. మంపు సాంబ్రాణిధూపంబు పెంపు పెంపు, వంపు మరువంపు టిందీవరంబు అంపు, గుప్పు మృగమదవాసనల్ గుప్పురవఁగ, పాటి లేకొప్పు నాయిఁతి జాలుకొప్పు.
శశాం. 3. 49.

3. అచ్చు. పోరు ... ... (శ. ర., బ్రౌ.)

జ : అంపటిల్లు, అంపిల్లు, అంపులాడి.

**అంపులాడి** విశే. (అంపులు + ఆఁడి.) కలహశీలురాలు, జగడగొండి.

సీ. చించివైచుటెగాని చీరలిచ్చునఁ గటిరముతఁగైసేయ దా అంపులాడి ...
వేం. పంచ. 3. 183.

ఆ. రోఁతకూటిమనసు రోసానకే పెనఁగు, త్రోవగాని యుక్తి త్రోవవట్టి, బోవనీదు దీని బోడిమ యామాయ, అంపులాఁడిఁ జూడు రామచంద్ర.
రామస్తవరాజము. 1. 212. (బ్రౌ. వి.).

**అంపె(పియ).** వి. 1. మాదిగవాఁడు తోలు కోసెడు సాధనము. (శ. ర., బ్రౌ.)

2. తాటాకులు మట్టగించి కోసెడు సాధనము (శ. ర., వా.)

**అక్కు.** న. క్రి. గీఱు, బరుకు.

వ్యవ. పిల్లగోళ్లతో ఒకళ్లొకళ్లను అక్కు కొన్నారు.

వి. గీఱు, బరుకు.

ఉ. చెక్కులఅక్కులన్ మిసులఁ జెల్వగు మోవినిఁ బంటినొక్కులన్ ...

రాజ. వి. 2. 116.

**అజ్జ.** వి. వ్యర్థభాషణము.

(ఇది శకటరేఫయుక్తమని కావ్యాలం. సాధు రేఫమని యప్పకవి.)

అ అజ్జువాడి యూ౹ఱావడిసభలోన, జేసిపోరి లోన ఆచ్చఁబోరసి, తెన్నమడుగు పుడమి జేండ్ల నేల మతింప, మనకు విశ్వనాథుఁ డొనరియుండ. కావ్యా. 7. 46.

**అట్టడి = రట్టడి.** వి. కలకలము.

సీ. తన్నృపాలుని సేవ యొనరించు అట్టడిరాకుమారులను జీకాకుపఱుచు ... రామ. 2. 35.

**అట్టు = రట్టు.** వి 1. అపకీర్తి, నింద.

సీ. గళిమాలి బిళియాడుకాఁగిలిలేని యాఅడి కూర్మికే నేల అట్టువడితి ...

ఉ. హరి. ఉ. 117.

సీ. తమ్ముఁరాదోషాప్తి గ్రమ్మి మూసిన అట్టు వయనాలులను తొట్టొవర్చుకొఱఁత ...

విప్ర 1. 37.

ఆ. అలిమాటకొఱకు తేఁతయై కోడలిఁ, కొడుకుఁ బోవఁదోచుకొనియె వతని, కేఁటిమగతవం బిసి కడుఁగొదలేని, అట్టువొందె నింక అంతులేల. అచ్చ. రా. అయో. 86.

అం. భా. 1. 116.

2. అఘోషణము, గోల.

జ. అట్టువెట్టు.

**అట్టువెట్టు.** న. క్రి (√అట్టు + పెట్టు) వంచించు, మోసపుచ్చు.

గీ. అన్నియు మఱచెఁగాఁడోలు వెన్నుఁ డాత్మ, గోరి తాఁ జాయనానై నవారివిడుచు, నట్టి కృష్ణుఁడు తము అట్టువెట్టునవక, యేల నమ్మిరి పురసతుల్ జేఁలగుచు.

భాగ. 10. స్కం. ఉ. 172.

**అప్ప.** వి. చిన్నజాయి.

గీ. పూని తమతమ కొనివచ్చుభూరుహముల, కాయగనరెల్ల వెరఁజాడి జాయి అప్ప, దెచ్చువారికి వోరూరఁ దించు వత్తురు ...

భా. రా యుద్ధ. 265.

చం. పఱుఁబయిఁ బండుకొల్చు విరిపైఁడియుగట్టు దినుస్సుజాయి అప్పయు మఱిబంటు కాని నలుఁ బైరముఁ బెయ్యముఁ జేనుకెట్టులో, వయిన సమస్తసంపదలు వన్న నితిర్ణికి వెచ్చ పెట్టఁగా ... కళా. 6. 86.

(ఇట చిన్నరత్నమని భావము)

**అయిక = అవిక = ఐక.** వి. కంచెల, కూర్పాసము.

గీ. కొదమగుబ్బలఁ దావికుంకుమపుఁబూఁత, విభుఁడు చెంగావిఅయికఁ౦చు విడువఁ బోవ ... దశా. 8. 124.

**అవఅవ.** వి. 1. కోపవికారము, స్పర్థ.

కం. తివిరి కరవాలు సేకొని, అవఅవలెసఁగఁగ నత్తెఅవపై జనుచోఁ, దివజేడలరేయుద్రిమ్మరి, పుపుఁబోడి యొకర్తు నెయ్యమున నడ్డంబై.

అచ్చ. రా. సుం. 85

చం కులమునకు రూపమున్నగనికూరిమియుం గల దానవంచు నీ,వలవల రుక్మిణీరమణి వాసిఁ బెనంగఁగ సత్యభామయుం, గులమును రూపము న్నగని కూరిమియుం గలదానవంచు నా,వలఁ బచరింపఁగా అవఅవ ల్వొడమె న్మది వారి కెంతయున్

పారి. 1. 42. వసు 6. 9.

2. మండుటయందగు ధ్వని కమకరణము.

సీ. అవఅవమండు నెఱ్ఱని చంద్రమల్లెఁచోద్యంపు గుండాలు చొచ్చువారు ...

క్రీడా. 1 142.

అవిక = తైక వి (క అవికె, త ఇరవిక్కై) కంచెల, కూర్పాసము

చం అవికయుఁ బట్టుపుట్టము చెఱంగు మఱుం గయి యున్కిఁ జేసి . నైష. 6 131.

చం. కలయఁగఁ జంద్రకావిఅవికంబలెఁ గుంకుమఁ బూసి చూడు మో,పాలఁతుక వాదు నేర్పనిన ... విజ. వి. 2. 92.

సీ. .. కంచెల అవిక తైక యననదరు ...

ఆం. భా. 2. 155.

అవ్వ వి. నింద, దూఱు.

కం. ఇవ్విధమునఁ బ్రతిదినమును. నవ్వెలఁది చరింపఁ గొంద అతిదూషకులై, అవ్వలు సేయుచు వోరుల, క్రొవ్వునఁ బాపంబు సంచికొందురు వరుసన్. భోజరా 3. 95.

సీ ద్విజరాజులఁ గులాయవితతిఁగూర్చు మిటారి దిఠికి రతిప్రేమఁ దెచ్చు అవ్వ ...

రా వి 3. 3.

(ఇట నిందాహేతువని భావము)

ఉ. ... ఇవ్విధమెల్ల నెచ్చెలుల కేర్పడఁజెప్పిన దిట్ట కూళలై, వవ్వులఁబెట్టి యండలు వినం గడు భామునఁ బ్రుక్కలోఁచుఁ దా,రవ్వల అవ్వలంబఅపి యంకిలి సేయక మావనేర్తురే.

రసిక. 4 11.

జ : అవ్వచేయు, అవ్వలాఁడి, అవ్వాఁడు.

అవ్వచేయు. స. క్రి (అవ్వ + చేయు) నిందా పాలుసేయు.

ఉ .. ఇంత యెఱుంగలేక తా,నే నను అవ్వ చేసినఁ ద్వణీకృతమింతె శరీరమొక్క మ్మట్లయిన సమానదుఃఖ మెవయం దనకాపుర మెత్తిపోవదే. శుక 2. 133.

అవ్వలాడి వి (అవ్వలు + ఆఁడి) నిందించు వనిత.

వ ... శిఁకిఁ నవ్వు జీవ్వవంపు అవ్వలాఁడివి ...

ఉ. రా. 4 163.

అవ్వాఁడు స. క్రి. (అవ్వ+అడు) నిందించు.

(శ. ర).

## ఆ

ఆ. వి. వృత్తియందు 'ఆయి' శబ్దమునకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలిన రూపము

కం. అ పారావారము ఆ,రూపై రథమరుగు నంత త్రోవ విడిచినన్ ...

ఉ. హరి. 2. 44.

గీ. అట్లు తడవుగఁ గొల్చి సాష్టాంగ మెరఁగి, గర్భమంటపిఁ గడిగిన కలుషజలము, లోని ఆలొట్టనిండి ... ఆము. 6. 8.

గీ. పచ్చఆ మానికంబుల పళ్లెములు ...

నైష. 6. 122.

**ఱాఁగ** వి. (సం. ఠంక.) 1. జాణ, టక్కు టాలు.

గీ. పూను మీమెయి భోగంబు భూషణంబు, సెక నీవని యా ఱాఁగ యొసఁగరాఁగ ...
సారంగ. 2. 84.

విశే. 1 ధూర్తుఁడు, ధూర్తురాలు, ధూర్తము.

గీ. అనుడు నెంజాఁగ యుష్ణను ననఘ పకుఁ, జలిని యేనెట్టు లిడనేర్తు ఱణముకోవ, నంటఁగాచితు భుజియించి నలసిన నెడకు, వేఁడ నా విని సతిఁబల్కు ఱాఁగవడుగు.
పాండు 4 154.

సీ. ఱాఁగలైె మే మీఱక సపత్నులఁగూడి చెలువుని కన్నుసన్నల మెలంగి ...
పి. శకుం. 3. 190.

చం. కలవసు తేఁగ తేఁగపులితండము నెత్తుటి గౌలకై భూశాఖాశి మెయి రాఁగ ఱాఁగ లయినట్టి వృకకంబులు క్రొంబొదల్ రొదల్, చిలుకుమనీఁగ ...
సారంగ. 3. 117.

2. ఉద్ధతుఁడు, ఉద్ధతురాలు, ఉద్ధతము.

సీ. పోటిసేయఁగవచ్చు భాగీరథి వశంబు ముట్టి పెన్ ఱాఁగయై మురియకున్న ...
వరన. 1. 90.

సీ. పసరంబు ఱా గైనఁ బసుల కాపరి తప్పు ప్రజలు దుష్టులైనఁ బ్రభువు తప్పు ...
రామలిం. 43.

ఇ : ఱాఁగతనము, ఱాఁగతుంగ.

**ఱాఁగతనము.** వి. (√ఱాఁగ + తనము.)
1. ఔద్ధత్యము, పొగరుఁబోతుతనము.

ఉ. అంతుకుమీఱి మిక్కిలి ఱాఁగతనంబున దొమ్మిచేసి దుర్దాంతపరాక్రమోన్నతులు దానవదైత్యులు వేల్పువెజ్జ ధన్వంతరిచేతి దుగ్ధమయవార్ధి సుధారసపూర్ణకుంభమున్, నంతనకట్టి పుచ్చుకొని చయ్యనఁబోయి నిర్విశంకతన్.
భీమ. 3. 26.

2. ధూర్తత్వము.

కం. రేఱాఁగతనమునను వద, రే నాపిల్కలను నైఁతురే రాజసుఖుల్ ...
ల వి 4. 72.

**ఱాఁగతుంగ.** వి. (√ఱాఁగ.) భద్రముస్తకము. (వ్య. వి.).
(శ. ర.)

**ఱాకట్టు.** వి. (√ఱాయి.) నెలకట్టు, శిలారత్నాది నిబద్ధభూమి.

శా. ఆకగ్రంపుటవంటి మూఁక నడిచాయన్ మించు పన్నిటి కేళాకూళిం గిలకించి యాదరిని జెల్వంబైన చెంగల్వ నా ఱాకట్టుం దెలిచల్వ దిన్నెఁ గని యారామోంత సౌఖ్యప్రదం బై కన్పట్టిన దీ స్థలం బనుచు దైత్యస్వామి యందుండఁగన్.
ఉ. రా. 4. 166.

**ఱాగుండియ.** వి. (ఱాయి+గుండియ.) ఱాతి వంటిగుండె, కఠినహృదయము.

ఉ. చండకరాన్వయాంబునిధిచంద్రుఁడు భూరమణుం డతండు ఱా, గుండియవాఁడు వేలుపులకోటుల సంఖ్యలుభూతధాత్రిపై, నుండఁగ నీక కాశిపురి నొక్కఁడు రాజ్యము సేయఁబెట్టి లీ, ...
కాశీ. 5. 300.

**ఱాచు.** స. క్రి. నాపుడుచేయు.

ద్వి పిచిన గురుభక్తి నెల్లలోకముల, ఱాచిన కొడుకు నాఅడిఁ బంపుకొంటి ....
రం. రా. అయో. 126 పొ. 8 పం.
(శ. ర. పా.)

ఇ : ఱాపు, ఱాపుఁదనము.

**ఱాతికొఱుకు.** వి. (ఱాయి + కొఱుకు.) మత్స్యవిశేషము.

సీ. వాలువ ముకుదమ్మ వల్లెగండెర నత్తెగుజ్జు బేడిస ఱాతికొఱుకు మడిస ....
వేం. పంచ. 1. 294.

దెలుపఁదగినది. 5. నిర్వచింపఁదగినది. విశేష లక్షణములతోఁ జెప్పఁబడినది. 6. గుఱియుంచఁ దగినది, లక్ష్యముంచఁదగినది, 7. గౌణవృత్తిచేఁ జెప్పఁబడినది. 8 ఎంచఁదగినది, ఆలోచింపఁ దగినది. వి. అ. పుం అస్త్రములపైనుండెడి లాంఛనము. న. శరవ్యము, ఆనవాలు, గుఱిగాఁ జూడఁబడిన యొకగుర్తు.

లక్ష్యవీథి సం. వి. ఇ. స్త్రీ. దృశ్యమార్గము, బ్రహ్మలోకమార్గము,

లక్ష్యవేధము. సం. వి. అ. పుం. లక్ష్యమును కొట్టుట.

లక్ష్యసుప్తుఁడు. సం విశే. (అ. ఆ. అ.) నిద్రించు చున్నట్లు నటించువాఁడు, దొంగనిద్రపోవువాఁడు,

లక్ష్యహము. సం. విశే న్. పుం బాణము.

లక్ష్యహుఁడు సం. విశే న్. లక్ష్యమునుగొట్టు వాఁడు.

లగడ వి. చిమిడిక, అధికపక్వాన్నము.

గీ. చిమిడిక యనఁగ లగడ నాఁ జెలఁగుచుండు, నధిక పక్వాన్నము ...

ఆం. భా. 2 257.

లగడము. సం విశే. (అ. ఆ. అ) సుందరమైనది. మనోజ్ఞమైనది.

లగనము. వి. (సం. లగ్నం. క లగన) 1 ముహూర్తము, లగ్నము.

కం. తగువారిఁ బిలిచి యిదిగో, లగనము దా కొంటయె నెల్లి లలిఁబుడమికి జే, నిఁగఁ జేయ వలయు దక్కనిమగువం బొరిగొన్నవాఁడి మగనిఁ గడంకన్. అచ్చ. రా. అయో. 8.

కం. తొగనూడు గ్రుంకె దట్టంబుగఁ జీకటు లొదవె రిక్కముత్తము వొడమెన్, లగ వంబు డాసె నియ్యెడ ... నీలా. 3. 80.

2. (మేషాది) రాశి.

సీ ... నాలుగవ లగనంబున నన్ని గాములును మేల్ చూడ్కులఁ దనరార వేడ్కఁ బొదవి. అచ్చ రా బాల. 84.

లగాము. వి (హిం. లగామ్ మిశ్ర. గ్రా.). కళ్లెము, ఖలీనము.

లగితము. సం. విశే. (అ. ఆ. అ) 1. అంటుకొనినది, తగులుకొనినది, విడువకుండఁగఁ బట్టుకొనినది. 2. సంబద్ధమైనది, అనుబంధముగలది. కలసికొనినది. 3. పొందఁబడినది, సంపాదింపఁ బడినది

లగుడ(ల)ము. సం. వి. అ. పుం. దుడ్డుకఱ్ఱ, కొయ్యకఱ్ఱ

లగుడు. వి. శ్యేనభేదము, ఒకజాతిడేగ (బ. లగుళ్లు.)

గీ. మ్రుగయు లంతటఁ దెచ్చిరి లగుడు గిద్దు జాలె జఱటైై కణుజు వేసడము ... కురుజువాజిఱ యను డేగకోలము ...

పి శకుం. 1. 110.

గీ. అపుడు విడి వేఁట యిడు మరి యావతిచ్చు, రాజుముంగలికడకుఁ దెరఁగవచ్చి, లగుడు సాళ్వంబు డేగ లోనుగనుగల్గు, వేఁటపుల్గుల విడిచిన మింటికెగసి ... యయా. 2.328.

ఉ. మాకుఁ ... మజుమన్నన ... లభించె ... యాకలబల్మి ... కెక్క ... దాల్తుమంచు వేమొ ... కుర్కురధ్వములు ముట్టవఁ బాలు ... లగు, ల్గాకడఁ బట్టి యాడెె నటు లాన్పఁగ నేర్పరులొర్పు తేర్పడన్. కకు. 4. 79.

సీ. సాళ్వము జాలె వేసడము డేగ లగుడు బైరి కణనసాలు నోరణంబు, ... గిద్దుచెంచడ మన శ్యేనభేదములు ... ఆం. భా. 2. 90.

లగువు¹. వి. (సం. లంఘః) దాఁటు. (చి. ని.)

లగువు². విశే. (సం. లఘు.) చులకనిది. లఘువు. (శ. ర.) వి. 1. చులకన. (శ. ర.) 2 లాఘవము, అగౌరవము. 3. చులుకుఁదనము,

ఏ. అతిక్రమించు, ఎరవఱచుకొను.

ద్వి. అర్గళికయు లావు నడర వైరులకు, లగ్గ పట్టఁగరాదు లంకభూనాథ.

రం. రా. యు 281 పు 21 పం.

చ. అశితతి పోటుఁగూఁత లెగయం జెను మావులు డిగ్గి చిల్కకొ, తులు నడవన్ మహా బలము దోడ్తవ చుట్టుకొనం దపస్వి ని.శ్చల ధృతి సాలమండలము చయ్యనలగ్గలు పట్టిపట్టి యీ, నెఱతయు...జముద్ధటి నిల్చె, దన్పటుహ్యన్మహీవిభున్ ...

చంద్రికా 2. 67

చ. ... వణయుగాంతరావరణచక్రము లగ్గలుపట్టు ...వం, జెవుడు.

వేం. పంచ 1. 871

లగము ... లగము ...

లగ్గు వి 1. మేలు, క్షేమము.

ఆ. . ఎగ్గు లేదు వారికెల్ల లగ్గు ..

భార. ఆది. 7. 28.

గీ. క్షేమ మగు లగ్గు లెస్స మేల్ సేమ మనఁగ

ఆం. భా. 1. 98.

2. శ్రాద్ధము.

సీ. ... వర్షించుఁ బర్జన్య వరుణమూర్తి, గ్రహ చక్రవాళంబు గాలి యెప్పుడు మోచుఁ గొండ్రు సంతృప్తి లగ్గునఁ బితరులు.

భీమ. 4. 83

శ్లో. పర్జన్యో వర్షతి శ్రాద్ధే తృప్తిం యాతి పితృ వ్రజః.

లగ్నకాలము. సం వి. అ. పుం. శుభసమయము, సుముహూర్తము

లగ్నకుఁడు. సం. వి అ. పుం. జామీనుగా నుండెడివాఁడు, ప్రతిభువు, పూఁట కాపు.

లగ్నగ్రహుఁడు సం. విశే. (అ. ఆ. అ) పట్టిన పట్టు విడువనివాఁడు, గట్టిగఁబట్టుకొనెడివాఁడు.

లగ్నదినము. సం. వి. అ న. శుభదినము, (వివాహాది) శుభకార్యములుచేయ నేర్పఱుపఁబడిన శుభదినము.

లగ్నభుజము సం. వి అ. పుం. (జ్యోతిశ్శాస్త్రము) విషువాంశభేదము

లగ్నమండలము. సం. వి. అ. న రాశిచక్రము.

లగ్నము. సం. విశే. (అ. ఆ. అ) 1 తగులు కొనినది, చిక్కుకొన్నది 2 ఆసక్తము. 3. కలిసికొనినది, కూడుకొనినది 4 లజ్జితము, ...గ్నహడిని వి అ పుం 1 జామీనుదారు, ప్రతిభువు. 2. స్తోత్రపాఠకుఁడు. న (జ్యోతి) మేషాదిరాశుల ఉదయము.

లగ్నముహూర్తము. సం వి. అ. పుం సుము హూర్తము, శుభసమయము.

లగ్నవే(ళ)ల సం. వి. అ స్త్రీ సుముహూర్తము, శుభసమయము.

ల... దినము, శుభదినము (వివాహాదిక) కార్యములు చేయ నేర్పఱుపఁబడిన శుభదినము

లఘాటము. సం. వి. అ పుం. వాయువు గాలి.

లఘిమ. సం. వి. న్. పుం. 1. తేలికయగుట, బరువులేమి 2 చిన్నదయగుట, స్వల్పమగుట, ముఖ్యముకామి, అముఖ్యత 3 నీచత్వము, నీచ గుణములు గలుగుట. 4. ఆలోచనలేమి, తెలివి లేమి. 5 అష్టసిద్ధులలో నొకటి తన ఇష్టమై నపుడు మిగుల చులకనగాఁగల యమానుషశక్తి.

లఘిష్ఠము. సం. విశే. (అ. ఆ. అ) 1. మిక్కిలి తేలికయైనది. 2. మిక్కిలి నీచమైనది.

లఘీయసము. సం. విశే. స్. 1. (ఒకదానికంటె) తేలికయైనది. 2. నీచతరమైనది.

లఘుకము సం. వి. అ పుం. తోఁటకోఁక (వ్యా.వి.). (శ. ర.)

లఘుకర్ణి. సం. వి ఈ స్త్రీ. మోరవేల యనెడి లతావిశేషము.

లఘుకాయము. సం. వి. అ. పుం. మేఁక, అజము.

**లఘుక్రముఁడు** సం. విణ. (అ. అ. అ.) వడిగల కాలుగలవాఁడు, వేగముగా బోవువాఁడు.

**లఘుగోధూమము.** సం. వి. అ. పుం. చిటి గోధుమలు, గోధుమలలోఁ జిన్నజాతివి.

**లఘుచిత్తుఁడు.** సం. విణ. (అ. అ. అ.) 1. తేలికయైన మనసుగలవాఁడు, నీచహృదయముగలవాఁడు 2. అప్రయోజకుఁడు, 3. చంచలుఁడైనవాఁడు, స్థిరబుద్ధి లేనివాఁడు, చంచలచిత్తుఁడు.

**లఘునిర్భిటి.** సం. వి. ఈ. స్త్రీ. కర్కటీభేదము, ఒకవిధమైన దోస (వృ. వి.) (వాచ). పీటపుచ్చ, వెఱ్ఱిపుచ్చ (వృ. వి.).

**లఘుచేతసుఁడు** సం. విణ. స. లఘుచిత్తుఁడు.

**లఘుచేతస్కుఁడు.** సం. విణ. (అ. అ. అ.) లఘుచేతసుఁడు.

**లఘుజాంగలము** సం. వి. అ. పుం. లావకము, ఒకజాతి పూరేడుపిట్ట.

**లఘుత** సం. వి. అ. స్త్రీ. లాఘవము.

**లఘుద్రాక్ష.** సం. వి. ఆ. స్త్రీ. కాకలీద్రాక్ష, గింజలేని చిన్నద్రాక్ష.

**లఘుద్రావి.** సం. విణ. (న. ఈ. న.) సులభముగాఁ గరఁగునది.

**లఘునామకము.** సం. వి. న. న. అగురుచందనము. (లఘువర్ణయుక్తనామము గలది) (అగురు)

**లఘుపత్త్రిక** సం. వి. ఆ. స్త్రీ. రోచనయనెడు లత.

**లఘుపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. మోరవేలయనెడి లతావిశేషము.

**లఘుపాకము.** సం. విణ. (అ. ఆ. అ.) సులభముగా జీర్ణమగునది.

**లఘుపాకి.** సం. విణ. (న. నీ. న.) సులభముగా జీర్ణమగునది

**లఘుపుష్పము.** సం. వి. అ. పుం. భూమికదంబము, నేలకడిమి (వృ. వి.)

**లఘుప్రయత్నము.** సం. విణ. (అ. అ. అ.) సులభమైన యుచ్చారణ గలది (అక్షరము).

**లఘుప్రయత్నుఁడు.** సం. విణ. (అ. అ. అ.) అలసుఁడు, సోమరియైనవాఁడు.

**లఘుబదరము.** సం. వి. అ. పుం. ఒకజాతిరేఁగు, చిన్నరేఁగు (వృ. వి.)

**లఘుబదరి** సం. వి. ఈ. స్త్రీ. ఒకజాతిరేఁగు, చిన్నరేఁగు (వృ. వి.).

**లఘుభవము.** సం. వి. అ. పుం. నీచజన్మము, హీనజన్మము, స్వల్పకారణము అల్పహేతువు.

**లఘుమాంసము.** సం. వి. అ. పుం. 1. ఒకజాతి కౌఁజు [illegible]

**లఘుమూలకము.** సం. వి. అ. న. ముల్లంగి (వృ. వి.)

**లఘుమూలము** సం. వి. ఁ. న. [illegible]మికరణము వఁ దక్కువమూలము.

**లఘురాశి** సం. విణ. (ఇ.) తక్కువరాసులు గలది.

**లఘులయము** సం. వి. అ. న. వీరణమూలము, అవురుగడ్డ, సువాసనగల మూలముగలది, వట్టివేరు (వృ. వి.)

**లఘువాససుఁడు.** సం. విణ. (స.) చులకని బట్ట కట్టుకొనినవాఁడు, పరిశుద్ధమైనబట్ట కట్టుకొనినవాఁడు.

**లఘువిక్రముఁడు.** సం. = లఘుక్రముఁడు.

**లఘువు.** సం. వి. ఉ. స్త్రీ. పిక్క (వృ. వి.). న. నల్లగరు, కృష్ణాగరువు. (క్రి. విణ. శీఘ్రము. విణ. 1. వడిగలది. 2. చులకనిది. 3. చేవలేనిది. 4. ఒప్పిదమైనది.

**లఘువృత్తి.** సం. విణ. (ఇ.) 1. చెడునడతగలవాఁడు, నీచుఁడు. 2. అల్పుఁడు, తేలికబుద్ధిగలవాఁడు, తుచ్ఛుఁడు. 3. పాడుచేయఁబడినది, అనుకూలముగాఁ జేయఁబడనిది.

**లఘువేధి.** సం. విశే. (న్ నీ న్.) నిపుణతతో గుఱిపైఁ గొట్టినవాఁడు.

**లఘుసముత్థానుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) చుఱుకుగాఁ బనిచేయువాఁడు.

**లఘుహస్తుఁడు** సం. విశే. (అ. ఆ. అ) 1. చేఁ టుకైన చేయిగలవాఁడు, పనివానితనము గలవాఁడు, ప్రవీణుఁడైనవాఁడు. 2 చుఱుకు గలవాఁడు, వి అ పుం. నిపుణతగల విలుకాఁడు, నేర్పుగల విలుకాఁడు.

**లఘుహృదయుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) లఘుచిత్తుఁడు

**లఘూకరించు.** సం. స. క్రి. చులకనచేయు: అగౌరవించు.

చం. మతిగల మాల్యవంతుఁడను మంత్రి త్యజింపుము సీత నన్నచో, వతికుపితాత్ముఁడౌ నల దశాస్యుఁడు వాని లఘూకరించి...

చం రా. 8 53.

**లఘూకృతము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. నీచముగా నెంచఁబడినది, తృణీకరింపఁబడినది, నిందింపఁబడినది. 2. సంక్షేపముగాఁ జేయఁబడినది, తగ్గించఁబడినది. 3. పరిమాణములోఁ దగ్గింపఁబడినది.

**లఘూక్తి.** సం. వి. ఇ. స్త్రీ. సంగ్రహముగాఁ జెప్పుట, సంక్షేపముగాఁ జెప్పుట

**లఘూత్థానుఁడు** సం. విశే (అ. ఆ. అ.) లఘుసముత్థానుఁడు

**లఘ్వశము.** సం. విశే. (అ. ఆ. అ) లఘుసేయము.

**లఘ్వాశి.** సం. విశే. (న్ నీ న్) కొంచెము తినెడివాఁడు, మితభోజి.

**లఘ్వాహారుఁడు.** సం. విశే. (అ ఆ. అ) కొంచెము తినెడివాఁడు, మితభోజి.

**లఘ్వీ.** సం. వి. ఈ స్త్రీ. 1. సుకుమారురాలు 2. చిన్నబండి.

**లచ్చన** = లచ్చనము చూ. గుఱుతు.

ద్వి. ... అఖిలంబునకుఁ గర్తయగు పెద్దజియ్య, చనుదెంచి లచ్చనల్ సరిపిమైఁ జూడ ...

ద్వి పరమ. 4. 419 పా. 9 పం.

**లచ్చనము** = లక్షణము. లక్షణ. వి. (సం. లక్షణమ్) 1 వ్యాకరణాదిశాస్త్రము.

కం లచ్చి మెచ్చఁగని కవులను, జిచ్చియని సుకవివరులు చేపట్టరుగా, మెచ్చరు వివేకి నృపతులు, మెచ్చి నయవివేకి నృపులు మిడుకరె రేచా. కవిజనా. అవతారిక 4.

2. చిహ్నము, శుభచిహ్నము.

చం. ... సంచులమించుకొండ్లు వచ్చినఁ జెయిఁ జూపి లచ్చనముఁ జెప్పుమనున్ సతి పుత్రకాంక్షచే. సుదంతా. 1. 64

ఉ. లచ్చికి నాటపట్టయిన లచ్చనముల్ పరికించి చూచుచో, నొచ్చెములేని చెచ్చెరువు నొందఁగఁజేసెఁ బురంబువారికిన్ ...

ధరాత్మజా 4. 9.

**లచ్చి.** వి. (సం. లక్ష్మీః. క. లచ్చి.) 1. లక్ష్మి, విష్ణుపత్ని.

చం. ... ఏముహూర్తావేశను జనియించితో యకట లచ్చికి నన్నుద్భుకైటభారికిన్ .

నైష. 2. 135.

చం. . నాఁదియును దేశకార్యముసకు మ్యోదు వంచు వహించి క్రోధములా, గగ వటువయ్యు లచ్చిమది నెన్నఁడుఁ బాయనిజాలి నింపఁదే

అము 6 46.

3. సంపద

ఉ. వచ్చిరి పాంచాలురయి వారు జనార్దనుఁ జేగుదేరఁగా, లచ్చితనూవిలాసమున లావు ధనుశ్శరధారణ బు చేనచ్చుపడంగఁ గాశ్యప మహాముని యజ్ఞసమీపభూమికిన్

ఉ హరి 4 35

కం. కడులచ్చి గగ్గెనేనియుఁ, గడుతురు కట్టు దురుగాక ... భాగ 10. పూ. 328.

౨. శోభ

ఉ. వచ్చినఁ గాంచి హంసకులవల్లభుఁ డా తలి రాకుఁబోఁడియై, లచ్చికి నిచ్చగించి యను లాపకలాపకళారసజ్ఞతన్, మెచ్చి నృపాలు పాలికిని మేకొనిపోయెదవే మొ బొమ్మ్మ.

హంస. 2. 221.

జ. లచ్చికోడలు, లచ్చిమగఁడు.

లచ్చికోడలు. వి 1. రతీదేవి, మన్మథునిభార్య.

సీ. లచ్చికోడలి కన్నులకు దీటువచ్చు నీలోత్పల శరపంక్తు లొనరఁ దాల్చి ..

ఉ రా 4. 156.

2. సరస్వతీదేవి

కం పలుకుఁజెలి లచ్చికోడలు, కలనితబిసితల్లి తారఁటిగాసప్పుదేజీ గల బోటి యనఁగ భాషా, జలజాతుకిఁ జేసలా నిశాకరభూషా.

అం. భా. 1. 4?.

లచ్చిమగఁడు. వి. (లచ్చి + మగఁడు) లక్ష్మీపతి, విష్ణువు

కం. జడవారిరాయ.. లచ్చిమగనికత యొక్కటి యేర్పడఁ దెల్పుమనుచు ...

నీలా. 1. 25.

ద్వి. ఆ లచ్చిమగని చిత్తామ్మలాంభోది, నోల లాడింపవే యోతండ్రి యనిన ...

అ. మ. క 1. 10 పా. 13 పం.

లచ్చివారము. వి (లచ్చి + వారము) గురు వారము (శ. ర)

లజ్జ. వి. (సం. లజ్జా వ లజ్జె) సిగ్గు, మందాక్షము.

గీ సిగ్గు నా లజ్జ యనఁగను సిబ్బితి యన, నాన యనఁ బుచ్చడీ కవఁగాను లజ్జబోలుచు ...

అం. భా. 1. 132.

జ లజ్జలు, లజ్జించు

లజ సం వి అ స్త్రీ. 1. సిగ్గు, తప్పుచేయుట మొ॥ వానిచేఁ గలిగిన మనస్సంకోచము. (మనో భావవిశేషము) 2 సిగ్గు, బిడియము, శృంగా రాదులయందుఁగలుగు మనోభావము (శృంగార లజ్జ), మనస్సంకోచము. 3 సోకుఁడుముడుఁగు చెట్టు, అత్త్రపత్త్రిచెట్టు.

లజ్జక సం వి అ స్త్రీ. అడవిప్రత్తిచెట్టు

లజ్జరి సం వి ఈ. స్త్రీ. తెల్ల సోకుఁడుముడుఁగు చెట్టు, తెల్ల యత్త్రపత్త్రిచెట్టు.

లజ్జలు అ. (క్రి లజ్జ + అలు) సిగ్గుచెడు.

ఉ. సజ్జనదర్శనంబును బ్రసాదముగల్గెఁ బరిభవ వ్యథన్, లజ్జలి యగ్నిలోఁ బడఁదలంచిన చక్కని రాజపుత్త్రుసిన్, బుజ్జన మేర్పడన్ గరుణఁ బ్రోవఁగఁ జేకుతెవంచుఁ బ్రీతుఁడై, యుజ్జయినీజనాధిపతి యొయ్యనపక్కె నవంతి భూమికన్ ద్వా 3. 124.

లజ్జాకరము సం విశ. (అ. ఆ. అ) సిగ్గును గలిగించునది, సిగ్గు పుట్టించునది, లమర్యాద గలిగించునది, అవమానకరమైనది.

లజ్జాలువు సం. విశ. (ఈ.) సిగ్గరి, సిగ్గుగలవాఁడు. వి ఉ పుం. సోకుడుముడుఁగుచెట్టు.

లజ్జావంతుఁడు సం. విశ. (త్ తీ త్) 1 సిగ్గరి; సిగ్గుగలవాఁడు. 2 కలవరముగలవాఁడు, సంభ్ర మము చెందినవాఁడు.

లజ్జావహము సం. విశ. (అ ఆ. అ) సిగ్గును గలిగించునది, సిగ్గుపుట్టించునది, అమర్యాదాక రము, అవమానకరమైనది.

లజ్జాశీలుఁడు సం విశ (అ ఆ. ఉ) సిగ్గరి; లజ్జగల స్వభావముగలవాఁడు

లజ్జించు. సం అ క్రి. సిగ్గుపడు.

గీ. చన్నుగుబ్బల పోరాటఁ జక్కఁబెట్టఁ, బోయి మధ్యస్థభావంబు పొందలేని, కతన లజ్జించె ననఁగ మొగాలు వల్లఁ, బాలు గురు వింద పూసల పేరు వైచు.

వరాహ. 2. 115.

లజ్జితుఁడు. సం. విశ (అ ఆ. అ.) 1. సిగ్గుపడిన వాఁడు, శృంగారాదులయందు మనస్సంకోచము గలవాఁడు.

**లజ్జలి.** సం. వి. ఈ. స్త్రీ. సోకుడుముడుగు చెట్టు.

**లజ్యా.** సం. వి. ఆ. స్త్రీ. లజ్జ.

**లటకుడు.** సం. వి. అ. పుం. మోసగాడు, పోకిరి, దుర్మార్గుడు.

**లటక్క** వి. మ్రింగుట లోనగువానియందగు ధ్వన్యనుకరణము (శ. ర.).

**లటపటము.** వి. జగడము.

ద్వి ..అల్లమ విని నవ్వె యానౌను మాయ, కల్ల సత్యంబులు కపటనృత్యములు, లటపటం బులును బూటకములును ...

ప్రభు (లిం.) 3 56 బా. 8 పం

**లటపర్ణము.** సం వి. అ. న. పెద్దనాల్చిన, పెద్ద లవంగపట్ట.

**లటభము.** సం. విణ. (అ ఆ అ.) మనోహర మైనది అందమైనది ఇంపైనది.

**లటము.** సం. వి. అ పుం. తప్పు, లోపము.

**లటపటలు.** వి. బ. వంచనములు, బడాయిలు.

కం. నాప్రుడు పరిభాషించెన, వీవుడు నమొటికి కాదె యిది వేటుగనేఁ, గావించితిఁ జేరికిఁ దగ, లావించుక గలిగెనేని లటపటలేలా

ద్వా. 7. 29.

**లటుఁడు.** సం. వి. అ. పుం. 1. మూర్ఖుడు, తెలివి లేనివాఁడు, అవివేకి. 2. దొంగ, దోఁపుడు కాఁడు.

**లట్టకము.** సం. వి. అ. పుం. 1. కప్పెర, కపాలము (శ. ర.). 2. భిక్షాపాత్రము.

**లట్టు** వి 1. పడియ, నీళ్లుపిడుచు చిన్నపల్లము. (శ. ర.) 2. గాడి (శ. ర.). 3. ఫుంటు (చి.ని.).

**లట్టుఁడు.** సం వి. అ. పుం దుర్మార్గుఁడు, దుర్జనుఁడు.

**లట్టువ.** (సం లట్వా.) చిటితాము.

చం కరమున మ్రానిలట్టువయు కబళమునసము వందుఁ జంకిటన్, దిరిపపుగూడయుం గొని తదీయనివాసము నిర్గమించె ...

నైజ 3. 109 (శ ర., బ్రౌ. పా.)

**లట్వ** సం. వి. అ. స్త్రీ. 1 ఒకజాతిపక్షి. 2. నొసటి పై గీఁతలు, లలాటరేఖ. 3 పిచ్చిక. 4. సంగీత సాధన విశేషము 5. క్రీడ, ఆట. 6. కుంకుమ పువ్వు 7. కులట, వ్యభిచారిణి.

**లట్వము.** సం. వి. అ. పుం. 1. గుఱ్ఱము. 2. సంగీత మున నొకానొక రాగము. 3. ఒకజాతి.

**లట్వుఁడు.** సం వి. అ. పుం. నృత్యముచేయు పిల్లవాఁడు.

**లడాయీ.** వి. (హిం లడాఈ) పోరు, యుద్ధము.

శా. లాడూఖానుని నివ్వధిన్ ... కేళి కిన్ ముఖ్యుఁగా, వీడంబోవక నూలు కొల్పుచు లడాయీకిన్ వడిన్ మొగ్గరంబై డాయన్ సమకట్టి ... రంగా. 3. 21.

**లడారి.** వి. ఒకానొక తిట్టు.

సీ. బొజుఁగు లాఁడి లడారి బొల్లి పల్గాకి బూదరి యెబ్బెరాని గాతలకొటారు ..

చెన్న. 2. 24.

**లడి** వి నిడుపుగా చుట్టిన సరిగ లోనగువాని చుట్టు (శ ర., వా.).

**లడ్డిగ.** వి. (సం. లట్టః) నెయ్యి మున్నగువానిని బోసికొనెడి సన్ననిమూతిగల పాత్రవిశేషము.

సీ. పెల్లులోహిండికావళ్ల కొమ్ముల ద్రేలు గిడ్డి మొత్తము నేతిలడ్డిగములు ...

ఆము. 2. 97.

సీ తేనెలడ్డిగ మొత్తమూని యొగ్గులకు నెత్తిన పగడంపు మంకెనలగుములు ...

చంద్రా. 2. 41.

సీ. సరుకులుంచినమాత్ర నంచిలో నటుఁగట్టిన యట్టి నేతిలడ్డిగ దనరు ... శుక. 3 453.

**లడ్డు** = లడ్డువము, లడ్వము. వి. (సం. లడ్డుకః) చక్కెరపాకముతోఁ జేయు భక్ష్యవిశేషము. (శ. ర., చి. ని.)

**లడ్డుఁడు.** సం. వి. అ. పుం. ఆటకుఁడు.

**లడ్డుకము.** సం. వి. అ. పుం. (పంచదార, గోధుమ పిండి లేక వరిపిండి, నెయ్యి కొన్ని పరిమళ ద్రవ్యములను గలిపి చేసెడి భక్ష్యవిశేషము.) ఒకవిధమగు మధురభక్ష్యము.

**లడ్డువము** = లడ్డు, లడ్వము. (సం. లడ్డుకః. హిం లడ్డూ) ఒకరీతి పిండివంట. చక్కెర పాకము సెనగపిండి మున్నగువానితోఁ జేయు భక్ష్యవిశేషము.

సీ. లడ్డువంబులు చక్కిలాలు మోరుండలు
ఖండలంబు చలిమిడి మండపప్పు, గీ. లాగిగా
భక్ష్య చోష్య లేహ్యంబులయిష్ట, బహువిధా
ర్థంబు లిచ్చెంపి ప్రియములయి, నేలపులు
రాజసులును వచ్చిమ్మవతికి ...

హర. 6. 55.

సీ. పరమాన్నములఁ జేసె ఫణిగవప్రకరంబు
లిడ్డెనల్ పుంగంబు లడ్డువములు ..

బ్రహ్మో. 3. 330.

కం. జిడ్డుగడలిదొరయుబులు, దొడ్డుకొనంచోదగెఁ
గేలి యెడ్డు న్ననలా, లిడ్డ తెలిసిగ్గుటడ్డెన,
వడ్డనకుం దొడ్డలడ్డువాల్ వంచుకొనున్.

బహు. 4 31.

కం. చలివాలు నివ్వ లడ్డువములు చక్కిలు గసన
తొలలు మోవుకు ...                    నైష. 6. 1?4.

**లడ్డువు.** సం. వి. ఉ. పుం. = లడ్డుకము.

**లడ్వము** = లడ్డు, లడ్డువము. వి. భక్ష్యవిశేషము.

సీ. మిరియంబుతోఁ గూడ మేళవించ చేసెఁ
దోరంపులడ్వాలు దోఁచితోఁచి ..

నైష. 6. 120.

మ. ఇడిచిమ్మాని కుపాయన గాలు మనోభీష్టం
బుగా బూరియల్, పలుం గక్కెరక్కై
కాయలును లడ్వా లుక్కెరల్ ...

రామా. ?. 115.

ద్వి. మునివరమాపనంబునఁ దెచ్చినార, మను
పమఫలరాజ మనుచు లడ్వములు ...

రం. రా. బాం. 13. పా. 5. పం.

**లత.** సం. వి. అ. స్త్రీ. 1. తీఁగ, ఎక్కుడుఁదీఁగ. (భుజలత, బాహులత, భూలత, విద్యుల్లత, ఖడ్గలత, అలకలత, మొదలగుచోట్ల, అందము, మృదుత్వము, మొదలగు గుణములఁ దెల్పు నుపయుక్తమగు పదము.) 2. శాఖ, కొమ్మ. 3. ప్రియాలులత 4. మాధవీలత, 5. లతాకస్తూరిక, ఒకానొక తీఁగె. 6. కొరడాచేబుకు, లేక కొరడా త్రాడు. 7. ముత్తెపుసరము, ముత్యాలహారపుపేట 8. సన్నాంగి, బకెక్కపలుచని యాఁడుది. 9. ఆఁడుది. 10 దూర్వాతృణము (వృ. వి.).

**లతకూన.** మి. వి. లేఁతతీఁగెనంటి యాఁడుది, లేఁతతీఁగె

కం. లతకూనల కౌనులసం,గతిగై కొని రోమరాజి ఖడ్గలతల్ పాం,థతతి గెలువ మీనాంకుని, కత యప్పురి వప్రయోజకతఁ జూపట్టెన్.

రామా. 1. 129.

కం. ప్రతిశృంగారించి సతిన్, బతికడకుం బిలువఁ బిలువఁ బవనావలనా, పతదేలా లతనాలో లతనాలతకూన యొడ్గిలంబడ నగుచున్

చంద్రా. 3. 134.

సీ. తతవయోవిభవ కీలతకూన కాసన్న పున్నాగ విహతి గొబ్బునవెయబ్బు. వసు. 2. 69.

సీ. కొమ్మ యీలతకూన కిమ్మైన వెల యెంత కొమ్మన్న చో లతకూన యంత ...

ఇందు. 1. 156.

సీ. లతకూనల సిలలోలప్రవాళములంచే వైదేశి కులకు వీవనలు విసర.      చంద్రా. 2. 126

సీ. లతకూన పసి తగు లమ్మతిఁ దలంపఁడుగదా వేఁదితావులఁ బల్లి వేఁచుగాని.

సారంగ. ?. 126

**లతాంగులి** సం. వి. ఇ. స్త్రీ. వ్రేలునలె నుపయోగించు కొమ్మ.

లతాంతము. సం. వి. అ. న. పుష్పము, పువ్వు.

లతాంబుజము. సం. వి. అ. న. ఒకజాతిదోస, పందిదోస.

లతాకరము. సం. వి. అ. పుం. లతాహస్తము, హస్తాభినయవిశేషము.

లతాకస్తూరి. సం. వి. ఈ. స్త్రీ. (కస్తూరివాసనగల యాకులుగల) యొకానొక తీఁగె.

లతాగృహము. సం. వి. అ. పుం. న. పొదరిల్లు.

లతాజిహ్వము. సం. వి. అ. పుం. సర్పము, పాము.

లతాతరువు. సం. వి. ఉ. పుం. 1 సాలవృక్షము. 2 తాలవృక్షము, తాటిచెట్టు. నారంగవృక్షము, నారింజ (వ్య. వి.).

లతా... సం. ... ఒకవిధమైన హస్తసన్నివేశము, హస్తాభినయవిశేషము.

లతాపనసము. సం. వి. అ. పుం. కర్బూజలత. (పనసకాయలవంటి కాయలుగలతీఁగ.)

లతాపర్ణుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు.

లతాప్రతానిని. సం. వి. ఈ. స్త్రీ. ఒకటితో నొకటి పెనఁగొన్న తీఁగ లోనగునది (శ. ర.).

లతాప్రతానము. సం. వి. అ. పుం. లతా సమూహము. కొన్ని తీఁగలకుండు వక్రతంతువులు.

శ్లో. లతాప్రతానోద్గ్రథితైః స్సకేశై రధిజ్యధన్వా విచచార దావమ్. రఘు. 2. 4.

లతాభవనము. సం. వి. అ. న. పొదరిల్లు.

లతామండపము. సం. వి. అ. పుం. పొదరిల్లు.

లతామణి. సం. వి. ఇ. పుం. ప్రవాలము, పగడము.

లతామృగము. సం. వి. అ. పుం. వానరము, కోఁతి.

లతాయష్టి. సం. వి. ఇ. స్త్రీ. మంజిష్ఠ, వంగదేశమందున్న చిలువేరువంటి యొక చాయతీఁగ.

లతాయావకము. సం. వి. అ. న. చివురు, అంకురము.

లతారసనము. సం. వి. అ. పుం. సర్పము, పాము.

లతార్కము. సం. వి. అ. పుం. హరితపలాండువు, పచ్చనీరుల్లి.

లతాలకము. సం. వి. అ. పుం. ఏనుఁగు.

లతావలయము. సం. వి. అ. పుం., న. పొదరిల్లు.

లతావృక్షము. సం. వి. అ. పుం. కొబ్బరిచెట్టు.

లతావేష్టనము. సం. వి. అ. న. ఆలింగన భేదము, ఒకవిధమైన కౌఁగిలింత.

లతావేష్టము. సం. వి. అ. పుం. రతిబంధ విశేషము.

లతావేష్టితకము. సం. వి. అ. న. ఆలింగన భేదము, ఒకవిధమైన కౌఁగిలింత.

లతిక. సం. వి. అ. స్త్రీ. 1. చిన్నతీఁగ. 2 ముత్యముల హారము.

లతోద్గమము. సం. వి. అ. పుం. తీఁగె యొక్క యెగఁబ్రాకుడు, తీఁగె పైకిఁబ్రాకుట.

లత్త. వి. (క. లత్తే.) 1. అపద. 2. దెబ్బ (శ. ర.).

లత్తిక. వి. ఒలుపును చప్పుడునుగల యొకజాతి గచ్చకాయ (శ. ర.)

లత్తిక. సం. వి. అ. స్త్రీ. ఒకజాతి బల్లి లేక ఊసరవెల్లి.

లత్తిచేఁప. వి. మత్స్యవిశేషము (శ. ర., బ్రౌ.).

లత్తుక. వి. (సం. అలక్తః.) లాక్షారసము.

సీ. లత్తుకరసమునఁ జొత్తిల్లఁ బదతలములు వరతులు మోవిఁబూసి. కు. సం. 4. 471.

ద్వి. గండభిన్నాసము లత్తుకచాయ మేను, మందరమేరుసమానగాత్రంబు ...

రా. యు. 381 పా. 23 పం.

కం. తోఁప లత్తుక చాయల, వారువములఁ గట్టి మహిషవాహకేతువు నెల్లా సమకట్టితేరా

సారథి గొనితేర నెక్కి సంరంభమునన్.

ఉ. రా. 2. 344

సీ. ... నుదుట లత్తుకరేవి, బెదరిన కెమ్మోవి జాఱిన చెంగావిచీర నీవి ... దశా. 8 63.

జ : లత్తుక బొమ్మలు = లక్కబొమ్మలు

**లత్తుకబొత్తులు.** వి. బ. (లత్తుక + బొత్తులు) ధాన్యవిశేషము.

సీ. లత్తుక బొత్తులు లక్ష్మీమనోహరాల్ ఛాంటీ నేసలు బాహుపురులు. హంస. 4. 128.

**లద్ది.** (క. లది. త ఇలత్తి) గుఱ్ఱము లోనగువాని మలము (శ. ర.).

జ . లద్దిపిప్పి, లద్దిపురుగు.

**లద్దిపిప్పి.** వి. (లద్ది + పిప్పి) ఒకవిధమగు చీడ పురుగు (శ. ర.)

**లద్దిపురుగు.** వి. (లద్ది + పురుగు) చివికిన కఱ్ఱ లలో నుండెడి తెల్లనిక్రిమి (శ. ర., బ్రౌ.).

**లద్దె.** వి. (నేయువాఁడు వస్త్రముఁజివరను విడిచెడి) కచ్చు. (మొదటిరూపము లద్దియ. (శ. ర.)

**లపక.** వి. ధనము (చి. ని., శ. ర.).

**లపనము.** సం. వి. అ. న. 1. మాటలాడుట. 2. నోరు, వదనము.

**లపితము.** సం. విశ. (అ. ఆ. అ) పలుకఁబడినది, చెప్పఁబడినది, వదరఁబడినది, మొ॥

వి. అ న. మాట, వాక్కు.

**లప్ప** = లప్పము. వి 1. రాశి, ముద్ద

గీ ఉప్పనైనట్టి చక్కెర లప్ప లిడె, ... ఎగ గల యమృతంపుఁ జెలమ యొనయె వనిత గడుఁ జెయ్యనౌ నీదు వాతెఱకును.

సాం. గ 2(6.

సీ పచ్చకప్పురపు గప్పలు ... యం.గడిని చు మర్యాద రాయంచలెల్ల, గుంపుగూడిన గతి గొప్ప గందంపులప్పలు విప్పగా నుంచు పగిది. ఘటి కా 2 1 15.

ఉ. అప్పనపుఁబోండ్లు వెండియుఁ బ్రయత్నము తోఁ బలుమాఱువీనులం, గప్పుర మూఁది పూవిసనకఱ్ఱలుఁ గొజ్జఁగనీట మాటికిన్, దొప్పఁగదోఁచి వీచుచుఁ జనుంగవపై వర కాల్ల(బాణులన్, లప్పలుగాఁగఁ జందనము లందుచుఁ గొందఱుమంచి రందఱున్

... 6 552

2 పాత్రవిశేషము.

ఉ కప్పురభోగివంటకము కమ్మని గోధమ పిండివంటలున్. గుప్పెడు పంచదారయును .. లప్పలతోడఁ గ్రొంబెరుఁగు లక్ష్మణ వర్ధుల యింట రూకకున్. క్రీడా 167

**లప్పము** = లప్ప. (సం లేప్యమ్ క. లెప్పవు) 1 మ్రానికెట్టె లోనగువాని సందుగొందులను మెత్తెడు ఒకదినుసు సున్నపుముద్ద (శ ర ). 2 రాశి, ప్రోవు

చం చక్కెర లప్పముల్ మధురసంబును జున్ను రసాయనంబులున్, జిక్కని మీఁగడల్ ఫలవిశేషములున్ మునుమున్నె మాకుఁ దా, నెక్కడ ప్రేమతోడ భుజియింపగఁ బెట్టక పుక్కిలింపదు ... చను ?. 6.

**లప్సిక** సం. వి. ఆ. స్త్రీ. కృశాన్నము, ఒకవిధమైన సిద్ధాన్నము.

**లబిసీ.** వి. ఒకానొక జాతి.

**లబ్ధ.** సం. వి. ఆ. స్త్రీ. నాయికాభేదము, నాయకునిచే వంచనచేయఁబడిన స్త్రీ. (ఇది విప్రలబ్ధకు మాఱుగా నుపయోగింపఁబడియుండును )

**లబ్ధకాముఁడు** సం. విశ. (అ. ఆ అ ) 1. పొందఁబడిన కోరికగలవాఁడు, కోరిన వస్తువు సంపాదించినవాఁడు.

**లబ్ధకీర్తి** సం. విశ. (ఇ.) పొందఁబడిన కీర్తిగలవాఁడు. కీర్తిగలవాఁడు, ప్రఖ్యాతిగలవాఁడు.

**లబ్ధచేతు(తను)ఁడు.** సం. విశ. న్. పొందఁబడిన చైతన్యముగలవాఁడు, (స్మృతి తప్పినతర్వాత) మాఱుస్మృతి వచ్చినవాఁడు

**లబ్ధజన్ముఁడు.** సం. విణ. (న.) 1. పొందఁబడినజన్మము గలవాఁడు, పుట్టినవాఁడు, ఉద్భవించినవాఁడు

**లబ్ధనాముఁడు.** సం. విణ (న.) పేరు పొందినవాఁడు, కీర్తిగలవాఁడు, ప్రఖ్యాతి పొందినవాఁడు

**లబ్ధనాశనము** సం. వి. అ. పుం. సంపాదించినది పోవుట

**లబ్ధప్రశమనము.** సం. వి. అ. న. 1. సంపాదించినదానిని భద్రపఱుచుట.

**లబ్ధము** సం. విణ (అ. ఆ. అ) 1. పొందఁబడినది, సంపాదింపఁబడినది. 2. పుచ్చుకొనఁబడినది, స్వీకరింపఁబడినది. 3. గ్రహింపఁబడినది, తెలిసికొనఁబడినది. 4. భాగహారముచేయఁగా వచ్చినది (సంఖ్య). వి. అ. న. సంపాదిత పదార్థము, లేక పొందఁబడిన పదార్థము.

**లబ్ధలక్షుఁడు** సం. విణ (అ. ఆ. అ) పొందఁబడిన లక్ష్యము గలవాఁడు. 1. లక్ష్యము (గుఱిని) కొట్టినవాఁడు 2. అస్త్రప్రయోగము నందు నేర్పుగలవాఁడు.

**లబ్ధలక్ష్యుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) లబ్ధలక్షుఁడు.

**లబ్ధవర్ణభాక్కు (జుఁడు).** సం. విణ. (జ్). విద్యావంతులను గౌరవించెడివాఁడు.

**లబ్ధవర్ణుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. విద్యావంతుఁడైనవాఁడు, చదువుకొనినవాఁడు. 2. ప్రఖ్యాతి పొందినవాఁడు, ప్రసిద్ధుఁడు.

**లబ్ధశబ్దుఁడు** సం. విణ. (అ. ఆ. అ) పేరు పొందినవాఁడు, ప్రఖ్యాతి సంపాదించినవాఁడు

**లబ్ధసంజ్ఞుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) పొందఁబడిన చైతన్యము గలవాఁడు, తెలివి వచ్చినవాఁడు.

**లబ్ధసిద్ధి.** సం. విణ. (ఇ) 1. పరిపూర్ణతను సంపాదించినవాఁడు. 2. కామితార్థమును సంపాదించినవాఁడు, కోరిక నెఱవేర్చుకొనినవాఁడు

**లబ్ధాంతరుఁడు** సం. విణ (అ. ఆ. అ.) సమయము దొరికినవాఁడు, తరుణము కనిపెట్టినవాఁడు 2 పొందఁబడిన ప్రవేశముగలవాఁడు, ప్రవేశమును సంపాదించినవాఁడు

**లబ్ధావకాశుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. (పొందఁబడిన యవకాశము గలవాఁడు) సమయము లేక తరుణము కనిపెట్టినవాఁడు 2 తెఱపి (విరామము) గలవాఁడు, పొందబడిన విరామము గలవాఁడు.

**లబ్ధి** సం. వి. ఇ. స్త్రీ. 1. పొందుట, ప్రాప్తి, సంపాదన, లాభము, ఆదాయము. 2 భాగహారలబ్ధము, భాగింపఁగా వచ్చిన సంఖ్య

**లబ్ధిమము.** సం. విణ. (అ. ఆ. అ) 1. పుట్టినది, ఉత్పత్తిచెందినది, బయలుదేరినది. 2. సంపత్తు పొందినది, అభివృద్ధి పొందినది

**లబ్ధోదయము.** సం. విణ (అ. ఆ. అ) 1 పుట్టినది, ఉద్భవించినది, బయలుదేఱినది 2. సంపత్తు పొందినది, అభివృద్ధి పొందినది.

**లబ్బి.** వి (హిం లబ్బీ) మహమ్మదీయులలో నొక తెగవారు (శ, ర., బ్రౌ, వా)

**లభనము.** సం. వి. అ. న 1. పొందుట, సంపాదించుట మొ॥ది 2. తలఁచుట, భావించుట.

**లభసము** సం. వి. అ పుం 1. ధనము ఐశ్వర్యము, సంపద, పుం., వ. అశ్వబంధనము గుఱ్ఱమును గట్టెడి త్రాడు.

**లభసుఁడు** సం. వి. అ. పుం. ప్రార్థించువాఁడు. ప్రార్థయిత.

**లభి(యిం)చు.** సం. అ. క్రి. కలుగు, ప్రాప్తించు.
మ. ... అయ్యస్త్రరాజము నామనన్ లభియించె ... ఉ. రా. 7. 60

ఉ. కామితదాయినైన నినుఁగన్గొనినంత వనంతలోకలో, కామిత చింతితార్థము లయారె లభింపవె యంచు వేడినన్.
ఉ. రా. 12. 26.

**లభ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. సంపాదింపశక్యమైనది, లేక పొందశక్యమైనది, పొందఁ

దగినది, అందుకొనశక్యమైనది, అందుకొనఁదగినది. 2. గ్రహింపఁదగినది, తెలిసికొనఁదగినది. 3 అర్హమైనది, తగినది, యుక్తమైనది 4 స్పష్టమైనది, చక్కగఁ దెలియునది 5 అమర్చఁదగినది, సిద్ధపఱుపఁదగినది.

లమకుఁడు సం వి అ పుం ప్రియుఁడు, విటుఁడు, జారుఁడు.

లయ. వి. మోసము, (చూ. లయకారి.)

(శ. ర., బ్రౌ.)

ఉ. లయకాఁడు, లయకారి.

లయకాఁడు. విశ. (లయ + కాఁడు) మోసకాఁడు. (బ్రౌ.)

లయకారి. విశ. (లయ+కారి) మోసకాఁడు

సీ. రంగఁ డని పేరుసైతమెఱుంగఁ జెప్పె, న
న్వడుగు శిష్యుఁడే లేఁడటంచు నని, గప్పి
పెట్టెడి నీ లయకారి దొంగ, వీరి గుఱి
కల్లతో సిజ మెట్టు లోపు

వైజ 4. 92. (బ్రౌ, శ. ర. పా.)

లయకాలము. సం వి. అ. పుం. (ప్రపంచము యొక్క నాశనకాలము, ప్రళయవేళ.

లయగతము సం విశ. (అ ఆ. అ) కరఁగినది, ద్రవముగా నయినది.

లయనము. సం. వి. అ. న. 1. అంటుకొనుట, తగిలియుండుట. 2 విరామము, తెఱపి, విశ్రాంతి. 3 ఇల్లు, విశ్రాంతిస్థానము

లయపుత్రి. సం వి. ఈ స్త్రీ నటి. వేషకత్తె, (నృత్యముచేయు స్త్రీ) నర్తకి

లయము. సం వి అ పుం 1 తగులుకొనియుండుట కలిసియుండుట లేక కూడియుండుట, అంటుకొనియుండుట 2. నక్కుట, దాగియుండుట. 3. కరఁగుట, ద్రవరూపమునొందుట. 4 ఆలోచనవదలుట, కనుపడకుండుట, నశించుట, స్వరూపములేమి. 5. మనస్సు ఐక్యమొందుట, తదేకధ్యానము. తదేకగ్రతి.

6. సంగీతమున ద్రుతము, మధ్యము, విలంబితము అని మూఁడువిధములుగల కాలము. 7. సంగీతమున విరామము, నిలుపు. 8. విరామము, విశ్రాంతి, తెఱపి. 9. విశ్రాంతి తీసికొనెడి చోటు, నివాసము. 10. బుద్ధిమాంద్యము, మానసికమాంద్యము. 11. ఆలింగనము, కౌఁగిలి. 12. ఆత్మ, బ్రహ్మము. 13. నృత్యగీతవాద్యముల యొక్క యేకతానతా రూపమగు సామ్యము, తౌర్యత్రికసామ్యము (ఈ యర్థమున లయ యనియే రూపము )

సీ. లయదప్పకుండ మెల్లనె సొగపురివిచ్చినమిత్రి
కోదలు పేరణములు ద్రొక్క ....

చంద్రా. 3. 181.

వ. నీటివట్టివేరు (శ. ర.).

వృషభగతిరగడ లతిక లతికమనీయ కరలిన
లయము లయమున నాడె నిత్తఱి.

వసు. 3. 149.

లయార(ల)oభుఁడు. సం వి. అ. పుం. 1. నటుఁడు, వేషకాఁడు, 2. నృత్యము చేయువాఁడు.

లయార్కుఁడు. సం వి. అ. పుం. ప్రళయకాలమందలి సూర్యుఁడు

లయించు సం. అ. క్రి 1. నశించు.

సీ. అఖిలభూతములు నాయందు దుద్భవించు
వర్తించు లయించు వర్తింప నేను, వానివలనఁ
బున .... భార. అను 1. 378.

2 సక్తమగు

వ. జీవుండయిన తన్ను నవ్యయంబయిన బ్రహ్మ
మందును లయింపంజేసి ... భాగ. 1. 385.

సీ. కమలనాభు ... ఆ. నందు మును
లయించి సత్త్వగుణంబులు మూఁటఁ దొలుత
సత్త్వమునకుఁ దోఁచు, కలిమి దాన నుండెఁ
గమలోద్భవుఁడు రజస్తమము లసురులయ్యె,
ధరణినాథ. భార. శాం 6. 479.

ద్వి. . . మనసు తత్త్వంబున మరపి లయించి
చననేర్చు నతఁడె సుజ్ఞాని యుత్తముఁడు ...

ప్రభులిం. 5. 158 పా. 5 పం

లయ్యా. వి. (సం. లంజా) వేశ్య. (ఇది లక్షణ గ్రంథములయందు వ్రాయఁబడియున్నది గాని దీనికిఁ బ్రయోగము మృగ్యము (శ. ర.)

లలంతిక. సం. వి. అ. స్త్రీ. 1. పొడవైన కంఠ హారము. 2. బల్లి, ఊసరవల్లి.

లలజిహ్వము. సం. విణ. (అ. ఆ. అ.) వ్రేలాడు నాలుకగలది వి. అ. పుం. 1 కుక్క. 2 ఉష్ట్రము, ఒంటె.

లలజ్జిహ్వము. సం విణ. (అ. ఆ. అ.) 1 నాలుక వ్రేలాడ్చునది. 2. క్రూరమైనది, భయంకర మైనది. వి. అ. పుం. 1. కుక్క. 2. ఒంటె.

లలతి. సం. క్రి. 1. ఆడుచున్నది, ఆటలాడు చున్నది. 2. కదులుచున్నది, 2. ప్రకాశించు చున్నది. 3. వ్రేలాడుచున్నది.

లలన. సం. వి. ఆ. స్త్రీ. 1. ఆఁడుది, స్త్రీ. 2. స్వైరిణి, వ్యభిచారిణియగు స్త్రీ. 3. నాలుక.

లలనము. సం. వి. అ. న. 1. ఆట, క్రీడ, చెల గాట. 2. నాలుక వ్రేలాడించుట. 3. సాల వృక్షము, కడిమిచెట్టు.

లలనాప్రియము. సం. వి. అ. పుం. కదంబవృక్షము, కడిమిచెట్టు.

లలనిక. సం. వి. ఆ. స్త్రీ. 1. చిన్నదియగు స్త్రీ. 2. దీనురాలు, దుఃఖస్థితిలో నున్న స్త్రీ.

లలముఁడు. సం. వి. అ. పుం. బాలుఁడు, పిల్ల వాఁడు.

లలము. సం. విణ. (అ. ఆ. అ.) 1. క్రీడాశీల మైనది, ఆటలాడుఁనది. 2. (నాలుక) వ్రేలాడ్చు కొనియుండునది. 3. కోరునది, కోరికగలది.

లలాకము. సం. వి. అ. పుం. శిశ్నము, మేఢ్రము.

లలాటంతపము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నుదుటిని మాడ్చునది, లేక నుదురు కందఁజేయునది. 2. మిక్కిలి బాధపెట్టునది, చాల బాధ గలిగించునది.

లలాటంతపుఁడు. సం వి అ పుం. సూర్యుడు.

లలాటతటము. సం. వి. అ న. నొసలు, నిటల తటము, లలాటప్రదేశము.

లలాటపట్టము. సం. వి అ. పుం. 1. ప్రశస్త లలాటము. (వాచ) 2. నొసటి చేదునైన చోటు, చేదునైన లలాటప్రదేశము. 3. ఒకవిధ మైన కిరీటము, తలనెంద్రుకలు ఎత్తికట్టు నాడా.

లలాటపట్టిక సం. వి అ. స్త్రీ లలాటపట్టము.

లలాట(క)ము. సం వి. అ న 1 నుదురు, నొసలు. 2. అందమైన నుదురు, ప్రశస్త లలాటము.

లలాటరేఖ సం. వి ఆ స్త్రీ. 1. నొసటిపై వ్రాయఁబడిన వంక్తి, నొసటిగీటు. 2. ముడు తలుగల నొసలు. 3 ముఖముపైఁబెట్టికొనెడి మతసంబంధమైన రంగుబొట్టు, తిలకము బొట్టు.

లలాటలేఖ సం. వి. ఆ. స్త్రీ. లలాటరేఖ, నొస టిపై గీటు లేక వంక్తి.

లలాటాక్షుఁడు. సం. వి. అ. పుం నిటల నేత్రుఁడు, శివుఁడు.

లలాటిక. సం. వి. ఆ. స్త్రీ. 1. నుదుటిపైఁబెట్టి కొనెడి నగ. 2. నుదుటిపై మంచిగంధముతోఁ గాని యితరమైన పరిమళముగల చూర్ణములతోఁ గాని ధరించెడి చిహ్నము.

లలాటూలుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఎత్తైన లేక అందమైన లలాటము గలవాఁడు.

లలామకము. సం. వి. అ. న. నుదుటిపై నుంచి కొనెడి పూలదండ.

లలామము. వి. అన్. న. 1. నుదుటి యలం కారము. 2. నగ, అలంకారము. 3. (ఉత్తర పదమైనపుడు స్వజాతిలో శ్రేష్ఠవస్తువు. (ఈయర్థ మున నిది చరిత్రాదులలోనిది. ఉదా: సాధ్వీ లలామము, అబలాలలామము.)

ఉ.ఈయబలాలలామకెవ యేయుగమందుమగాన...
శకాం. 2. 92.

4. నొసటిపై నుంచుకొనెడిబొట్టు. 5. గుఱుతు, సంజ్ఞ. 6. టెక్కెము, జండా. 7. శ్రేణి, పంక్తి. 8. తోఁక. 9. (గుఱ్ఱము, సింహము మొ॥ వాని) జూలు. 10. ఘనత, గొప్ప తనము. 11. అందము. 12. కొమ్ము. అ పుం. గుఱ్ఱము (ఆ ని.).

లలి వి 1. ప్రేమ, అనురాగము.

క. ...లమఱుఁ దలయ టితగ, వ్నలుగిడిదోయిళ్ల జలమునన్ బోర్కాడించి లలిం జన్నిచ్చుచు మ,య్యల నూఁపుచుఁ జెనుపఁదొడఁగె నానఁశిశువున్ కళా 6. 193.

మ .. వేల్పుంజకోరేశుఁడల్, లలి భీమేశ్వరు రాజశేఖరునిఁగొల్వన్ వచ్చి రొక్కుమ్మడిన్. భీమ. 5. 108.

2 విలాసము

గీ. మగువ తాటంకయుగ్మంబు మన్మథునకు, చక్రయుగ్మంబు గాఁబోలు లలిఁ దలంపఁ, గడఁగి సవ్యాపసవ్యమార్గణమువేయ, నైష రంధ్రంబు గాదె తదంతరంబు, నైష. 5. 18.

ద్వి ఇనవంశచంద్రుచే నింద్రారిమోము, వని తంబు నిటు వాడు వనివచందమున, దళముల బిగువెల్లఁ దప్పి యందంద, లలిదక్కుచుమ గములంబులు మొగిడె. రం రా. యు. 285 పొ. 6 పం.

3 ఉత్సాహము

ఉ హాళికులెన్నఁడుం దెగని యారుఁచేలును జొకుమళ్లును,గా లలి నేలసాగిరిఁ గల్గు పసింగొని పేద మున్నుగాన్. ఆము. 4. 124.

మ. ... ప్రేవల్లికున్ లలిపై నేఁగిరఁ దన్నివా సులు మహోల్లాసాత్ములై యమ్మహాంబలు నంతంత నెదుర్కొనంగ నతఁడున్ బంధుత్వ ధారేయతన్. హరి. ఉ. 2. 71.

4 క్రమము

సీ లలిఁ జకోరంబుల తలఁపులు గంపింపఁ జక్ర వాకంబులు సంతసింప. విక్ర. 2. 107.

కం. లలి వలరఁ గొమ్మ లమున, త్రిలిసద్ద్విజరాజ సంగతిఁ దగి సువర్ణోజ్జ్వలమై సుమనోభి మతిన్, దలరి పురము కోట తోఁట తనరు ఘనశ్రీన్. కవిజ. 1. 42.

కం. లలిఁ జాలింతతనంబులఁ, దలరెడు నమ్ముద్దు నేలదాలువునవలా, తలమానికముల కటు ల, న్నెల తేప్పఁడఁ దొమ్మిదియును నిండారు టయన్. అచ్చ. రా. బాల. 83.

5 విలాసము.

సీ. పలుహేఁడులకు మూడు బలియించి పొలి యించి లలిఁ గేరు వంటపలంతి సరిహొ

గీ యివ్వేలందుక కని తవయాడుచేడె, లంద ఱును డెందముల నుబ్బియాడుకొనంగ. నీలా 1. 52.

సీ .... విలాస మొప్పచుండు, నవ్యయమై యేతదర్థంబునందును లలి యన హొకశబ్ద మలరుచుండు అం. భా. 139.

6. వాక్యాలంకారము.

సీ. పద్మరాగవిభూషణ ప్రతతి మాఱు, లలి వశోకలతాప్రవాళములు దాల్చి .. హర. 3. 68.

కం. లలిగంగాస్నానంబునఁ, దొలఁగంగలపాత కము చతుర్దశభువనంబులు గూడిచేయఁ జాలవు కొలఁదిఱొ గంగాశిశయము గుణ రత్ననిధీ జాహ్నవి. 3. 72.

సీ. లలిఁ దొక్కుఁబల్కులు పలుకనేర్చినవాఁడె పరికించి సత్యంబు పలుకనేర్చె.

7. అశ్వశిక్షాభేదము.

సీ. లలి గూర్చి లలి దేర్చి లాఁగించి ... వి. శకుం. 112.

లలిత. సం. వి. అ స్త్రీ. 1. అందుది, స్త్రీ. 2. కాముకురాలు, కామాతురత గల స్త్రీ. 3. కస్తూరి. 4. దుర్గావతారభేదము. 5. ఛందో భేదము. 6. (సంగీ.) ఒకానొక రాగము.

లలితపదబంధనము. సం. వి. అ. న. 1. సొగసైన పదముల గూర్పుట. 2. మనోహరమైన పదములు గల కావ్యము.

**లలితపదము.** సం. విశ. (అ. ఆ అ) సొగసైన పదములు గలది. 1. సొగసుగా రచింపఁబడినది. 2 శృంగారరస సంబంధమైన పదములుగలది.

**లలితప్రహారము.** సం. వి. అ పుం. మెల్లదిగా గాలిబీచుట.

**లలితము** సం. విశ. (అ. అ అ) 1. క్రీడాశీలము, ఆటలాడునది, సయ్యాటలాడునది. 2 మనోహరమైనది, అందమైనది, సొగసైనది. 3. ఉల్లాసకరమైనది, సంతోషకరమైనది 4. మంచిది. 5. కోరఁబడినది, ఈప్సితమైనది. 6. మృదువైనది. సుకుమారమైనది. 7. వణఁకెడునది, కంపముగలది. వి. అ. పుం. సంగీతమున స్వరభేదము. న. 1 ఆట, సయ్యాట కేళి. 2. శృంగారవినోదము, గమనము యొక్క సొగసు, సుకుమారతచేత నగు వంగవిన్యాసరూపమైన స్త్రీ యొక్క శృంగారచేష్ట. 3. అందము, సొగసు, మనోహరత. 4. స్వాభావిక కృత్యము. 5. నిష్కాపట్యము, అమాయికత్వము.

**లలితలలితము.** సం. విశ. (అ. ఆ. అ.) మిక్కిలి యందమైనది, అత్యంతసుందరమైనది.

**లలితలులితము.** సం. విశ. (అ. ఆ. అ.) దుర్బలమైనదియైనను మనోహరమైనది.

**లలితాపంచమి.** సం. వి. ఈ. స్త్రీ. ఆశ్వీన శుక్ల పంచమి.

**లలితాభినయము.** సం. విశ. (అ. ఆ అ.) సొగసైన యభినయము గలది.

**లలితార్థము.** సం. విశ. (అ. ఆ. అ ) అందమైన లేక శృంగారసంబంధమైన యర్థము గలది.

**లలితాసప్తమి.** సం. వి. ఈ. స్త్రీ. భాద్రపద శుక్లపంచమి.

**లలితుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) కామాతురత గలవాఁడు; విషయాసక్తుఁడైనవాఁడు. భోగములయందాసక్తి గలవాఁడు.

**లవంగకము.** సం. వి అ న లవంగము.

**లవంగకలిక.** సం. వి. ఆ. స్త్రీ లవంగపుమొగ్గ.

**లవంగము.** సం. వి. అ పుం. లవంగచెట్టు. న. లవంగములు.

**లవణ.** సం. వి ఆ. స్త్రీ లావణ్యము, అందము, సౌందర్యము.

**లవణక్షారము.** సం. వి. అ న ఒకదినుసు ఉప్పు.

**లవణజము** సం. వి. అ న సముద్రపు టుప్పు.

**లవణజలము.** సం. వి అ పుం. సముద్రము

**లవణజలోద్భవము.** సం. వి. అ. పుం పురుగులపై చిప్ప, గుల్ల.

**లవణము.** సం విశ. (అ. ఆ అ.) 1. ఉప్పుగా నున్నది. 2. మనోహరమైనది, అందమైనది. వి. అ. పుం. 1. ఉప్పన, (లవణరసము) 2. ఉప్పునీటి సముద్రము. 3. ఒక నరకము. న. 1. ఉప్పు. సముద్రలవణము. 2. కృత్రిమముగాఁ జేయఁబడిన యుప్పు, చేయఁబడిన క్షారయుప్పు.

**లవణమేహము.** సం. వి. అ. పుం. మూత్రరోగభేదము.

**లవణసముద్రము.** సం. వి. అ. పుం. ఉప్పునీటి సముద్రము, సముద్రము.

**లవణాంతకుఁడు.** సం. వి. అ పుం. శత్రుఘ్నుఁడు.

**లవణాంభస్సు** సం. వి. స్. పుం. (ఉప్పునీరు గలది.) సముద్రము, న. ఉప్పునీరు.

**లవణాకరము.** సం. వి. అ. పుం. 1. ఉప్పుగని. 2. ఉప్పునీటిస్థానము, సముద్రము. 3. సౌందర్యనిధి.

**లవణాలయము.** సం. వి. అ. పుం. సముద్రము.

**లవణి.** వి. 1. పాకము, త్రాఁడు.

వ. ... లోకమాతచేతి లవణి పెట్లచేతం జెల్లాచెదరగు పసిఁడిచిప్పల జోళ్లతోన గులగులలైన శరీరంబులతోడ ...

వరాహ. 11. 105.

2 బిగువు

సీ. బిణెయమైన యొడ్డాణంబు లవణిచే నక్క-
 శించిన పొట్ట మక్కళించి ...

మనుచ 1 59.

లవణిమ నం. వి. న్. పుం. 1. లవణత, లవ
 ణనము 2. సౌందర్యము. అందము, సొగసు.

లవణుఁడు. నం. వి. అ. పుం మధువను రాక్షసుని
 కుమారుఁడగు నొకానొక రాక్షసుఁడు ఇతఁడు
 శత్రుఘ్నునిచేఁ జంపఁబడినవాఁడు.

లవణోత్తమము. నం. వి. అ. పుం 1. జాతి
 యుప్పు, గనియుప్పు. 2. పెట్లుప్పు, సురే
 కారము.

లవణోదము. నం. వి అ పుం. 1 సముద్రము.
 2 ఉప్పునీటి సముద్రము.

లవనము. నం. వి. అ. న. వరి, మొ॥ కొడ
 వటితోఁ గోయుట. 2. కొడవలి, కొడవలి
 వంటి కోఁతకత్తి.

లవము. నం. వి. అ పుం. 1. కోఁత, కొడవలితోఁ
 గోయుట. 2. (వరి) కోయుట.

లవలవ[1]. విశ. ఛేదిల్లినది, బద్దలయినది.

ద్వి. పటువజ్ర నిష్ఠుర పాదఘట్టనల, లవలవ యై
 కులశైలంబు గ్రక్కదల.

ద్వి హరిశ్చ. పూ. 2067.

లవలవ[2]. వి. కదలుటయందలి ధ్వన్యనుకరణము.

చం లవలవఁ జన్నుఁ దోయి గదలన్ దొలుకారు
 మెఱుంగుఁదీఁగెలం, గవగవ నవ్వుఁడాలు
 తెలితమ్ములమించులు చౌకళింపఁగా, నవ
 నవ యౌవనంబు గల నాటి భవత్పురుషాయి
 తోద్ధతుల్, శివశివ యెన్నిభంగుఁను జిత్త
 ములో మఱువంగవచ్చునే

క్రీడా 1. 217.

లవలి నం. వి. ఈ. స్త్రీ. ఒకానొక తీఁగ.

లవలేశము. నం. వి. అ. పుం. అత్యంతాల్పాంశము.

మ అవతంసీకృతశాతమన్యుపజయుండై దుర్జయ
 జ్ఞానైకధూర్భద్రద ర్పోన్నతధూర్తకీర్తిసమా
 ధావళ్యముల్ మట్టుకొన్న విహారంబులు
 చూపఁగా వెలచి లీనాళైన చందంబునన్,
 లవలేశంబును లేకపోయె మహిమ యెల్లన్
 సంచునంచారముల్. వరాహ. 8. 70.

లవాకము. నం. వి. అ. పుం. కొడవలి, కోఁత
 పనిముట్టు. 2 కోఁత, కొడవలితోఁ గోయుట

లవాజమా. గ్రామసేవకుల జీతములై తీసికొనఁ
 బడు కొద్ది పన్ను. (శ ర.)

లవాణకము. నం. వి. అ పుం. కొడవలి, కొడ
 వలివంటి కోఁతపనిముట్టు.

లవి. నం. విశ. (జ) వాఁడిగలది వి. ఇ పుం. లవి
 త్రము, కొడవలి (ఆ. ని.)

లవించు. నం. న. క్రి. కోయు.

లవిటి[1](టీ). వి. 1. పక్షిపుచ్ఛము.

సీ. లావు లవిటి నా వలరుఁ పక్షిపుచ్ఛాఖ్య ...

ఆ. భా. 2. 99.

వ. ... కిలకొట్టుచు ఱెక్కలార్చుచు లవిటీలఁ
 ద్రిప్పుచు బింఛములు సేయుచుఁ దలలాడిం
 పుచుఁ గటుకుకటుక్కువఁ బల్లుపోఁక బిర
 బిరఁ జుట్టుకొని ... ప్రబంధ. 7. 88.

సీ. బూరుగకాయబోల్ బోరలు లవిటీల కొవ
 కత్తెరలకట్లు కొంగిగోళ్లు. ప్రబంధ. 1. 30.

2. గుఱ్ఱపుతోఁక.

సీ. కంఠ మవంగను స్కంధంబు దగుఁ దోఁక
 లవిటి నాఁగను బుచ్ఛము విలసిల్లు.

ఆం భా. 2. 197.

లవిటి[2]. విశ. బధిరుఁడు. చెవిటివాఁడు.

సీ. . లవిటి, గీ. చెవిటి యనఁగను బధిరుఁడు
 చెలఁగు ... ఆం. భా. 2. 120.

లవిత్రము. నం వి. అ న. కోఁతపనిముట్టు,
 కొడవలి.

లవుడి = లవుణి. వి. ఆయుధవిశేషము.

కం. అచక్రము హతమైన ని,లాచక్రముమీఁది కుటిలి లవుఁడు లవుడి జాహాచటులవిభ్రమ భ్రమ,రిచండిమరేఖ సంతరించుచు విసరన్.
జై. శా. 6. 173.

లవుణి = లవుడి వి. ఆయుధవిశేషము.

ద్వి. తోమరంబులువేసి ద్రుంచు మావుతులు, లవుణి సారించి వల్లమును గుజ్జమును, రవు తును జడియ బోరవ మోనువారు ...
ద్వి. భాగ. 4 71.

లశునపటలము. సం. వి. అ. పుం. రత్నదోషము.

ప. పాలుపైఁబూసిన లీలనుండెడుడాలు లశున పటలము తెలియఁ దెలుచు. రత్నపరీక్ష. 15.

లశునము. సం. వి. అ. పుం. స. వెల్లుల్లి. (వ్య. వి.).

లషితము. సం. విశే. (అ. ఆ. అ) ఈప్సితమయి నది, కోరఁబడినది.

లష్వుఁడు. సం. వి. అ. పుం. నటుఁడు, నర్తకుఁడు, నృత్యముచేయువాఁడు.

లస. సం. వి. అ. స్త్రీ. 1. కుంకుమపువ్వు. 2. పసుపు.

లసకము. సం. వి. అ. పుం. 1. నృత్యము. 2. నెమలి. 3. కౌఁగలించుకొనుట. న. మేడమీఁది గది. విశే. 1. లాస్యముచేయునది, ఆటాడునది. 2. ఇటునటు కదలునది.

లసిక. సం. వి. అ. స్త్రీ. ఉమ్మి; నోటిలో నుండెడి యుమ్మినీరు.

లసితము. సం. విశే. (అ. ఆ. అ) 1. ఆటలాడినది, క్రీడాశీలమైనది. 2. కనుపడినది, రూపము దాల్చినది. 3. అవతరించినది, దుమికినది, దిగినది.

లసీక. సం. వి. ఆ. స్త్రీ. 1. చొంగ, ఉమ్మినీరు, లాల. 2. రసి, చీము. 3. చెఱకురసము, చెఱకునీరు. 4. మేదస్సు.

లసుకు. స. క్రి. నశింపఁజేయు.

చం. లసికిరిబోదు లగ్గలిక లగ్గలకెక్కఁగ గుత పంక్తులన్, వసుమతిఁ గూల్చియున్ గదల వైచియుఁ గత్తుల వ్రక్కలించియున్, వసుల వధించియున్ మునలవర్గములంబిడ మోది వాలుకల్, మసలక వేసి వంచియును మందుల తిత్తులు గాల్చివైచియున్. రా. వి. 5. 31.

లస్తకము. సం. వి. అ. పుం. ధనుర్మధ్యము. పిడికట్టు, విల్లుపట్టుకొనెడిచోటు.

లస్తకి. సం. వి. న్. పుం. విల్లు, ధనుస్సు.

లస్తము. సం. విశే. (అ. ఆ. అ) 1. కౌఁగిలింపఁబడినది. 2. ప్రవీణతగలది, నేర్పుగలది.

లస్తరి. వి. వస్త్రవిశేషము.

సీ. .... బందరుచీటి లస్తరిలు. హంస. 5. 350.

లహరి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. అల, తరంగము. పెద్దయల. ఉదా: ఆనందలహరి, కరుణాలహరి. సుధాలహరి మొ.

# లా

లా. సం. వి. ఆ. స్త్రీ. 1. పుచ్చుకొనుట, ఆదానము. 2. ఇచ్చుట, దానము.

లాంగడము. విశే. విశాలము.

వ. ... పంజరమ్మున రంజిల్లు క్రొంజిలుకల జిలిబిలి పలుకులఁ బొలుపగు లాంగడపు జంటు బవంతి ... ఇఁదు. 1. 17.

లాంగలగ్రహుఁడు సం. వి. అ. పుం. కర్షకుఁడు, దున్నెడువాఁడు, సేద్యగాఁడు.

లాంగలదండము. సం. వి. అ. పుం. నాఁగటి కఱ్ఱ, ఏఁడికోల.

లాంగలధ్వజుఁడు. సం. వి. అ. పుం. నాఁగటి చిహ్నము టెక్కెముగఁగలవాఁడు, బలరాముఁడు.

లాంగలపద్ధతి. సం. వి ఇ. స్త్రీ. నాఁగటిచాలు.

లాంగలఫాలము. సం. వి. అ. పుం. నాఁగేటి కఱ్ఱు నాఁగటిదుంపయం దమర్చెడి యినుపపాళము

లాంగలము. సం. వి. అ. న. 1. నాఁగలి 2 నాఁగలివలె నేర్పఱిచిన దూలము. 3. తాటిచెట్టు. 4. లింగము, మగగుఱి. 5 ఒకజాతి పుష్పము. (శ ని.) 6. చంద్రుని యొక్క యొక విధమగు రూపము. 7 ఇంటిదూలము, గృహదారు విశేషము (మే. ని).

లాంగలి నం. వి. న్. పుం. 1. బలరాముఁడు. 2. కొబ్బరిచెట్టు 3. పాము. వి. ఈ. స్త్రీ. 1. కొబ్బరిచెట్టు. 2 తరిగొట్టుచెట్టు. 3.నీరుపిప్పలి.

లాంగలికము. సం. విశ. (అ. ఈ. అ) లాంగల సంబంధి, నాఁగలికి సంబంధించినది.

వి అ పుం. ఒకవిధమగు విషము.

లాంగలికి. సం. వి. ఈ. స్త్రీ. విషలాంగల, ఒక జాతిచెట్టు.

లాంగలీష. సం. వి. అ స్త్రీ. నాఁగేటికఱ్ఱ, ఏఁడికోల.

లాంగులము. సం. వి. అ. న. 1. తోఁక. 2. లింగము, మగగుఱి.

లాంగూలము. సం. వి. అ. న. 1. తోఁక. 2 లింగము, మగగుఱి (మే. ని.). 3. ధాన్యపుఁగొట్టు. పుం. అభినయహస్తవిశేషము. (ఉంగరమువ్రేలిని వంచి చిటికెనవ్రేలిని పైకెత్తి, కడమ మూఁడువ్రేళ్లను ఊర్ధ్వాకారముగా త్రేతాగ్నులవలె పట్టునది) (శ. ర).

లాంగూలి. సం. వి. న్. పుం. క్రోఁతి, వానరము.

లాంగూలిక. సం. వి. అ. స్త్రీ. పృశ్నిపర్ణి, కోలపొన్న (వృ. ని.).

లాంఛనము. సం. వి. అ. న. 1. గుఱుతు, నైసర్గికచిహ్నము. 2. కలంకము, మచ్చ, అప్రతిష్ఠాచిహ్నము. 3. చంద్రునికలంకము. 4 పేరు, సంజ్ఞ. 5. హద్దుఱాయి, పొలిమేర ఱాయి.

లాంఛితము. సం. విశ. (అ. ఆ అ.) గుర్తుపెట్టఁబడినది, చిహ్నముగాఁ జెప్పఁబడినది, గుణవిశేషముతో చెప్పఁబడినది. 2. పేర్కొనఁబడినది, పేరుపెట్టఁబడినది, పిలువఁబడినది. 3. అలంకరింపఁబడినది 4 అమర్పఁబడినది, సిద్ధపఱుపఁబడినది.

లాంఛిని. సం. వి. ఈ. స్త్రీ కులట, వ్యభిచారిణియగు స్త్రీ.

లాంపట్యము. సం. వి. అ న. లంపటత్వము. 1 అత్యాసక్తత. 2. కాముకత్వము.

లాఁక. వి. పక్షియీఁక. (శ. ర.)

జ : లాఁకకట్టు.

లాఁకకట్టు. వి. (లాఁక + కట్టు) విఱిచికట్టిన పెడచేతులకట్టు (శ. ర.).

లాఁగ. వి. 1. గుహ.

సీ. .. నిడుదలైన, లాంగూలముల నొప్పి లాఁగలవెలువడ్డ కంఠీరవంబుల కరణి వెలిఁగి. భా. రా. యు. 350.

2. రంధ్రము, బొఱియ, కన్నము.

క. లాఁగలు పెక్కులు లోపల, బాగై తను ముట్టినపుడ పట్టువడక లో, డాఁగి చని వెలికి వెలువడి, పోఁగను మలుగలుగునట్టి బొక్కయొదిరికిన్. కేయూర. 4. 115.

సీ. లాఁగలఁ బుట్టల లోఁగిన శిఖల భుజంగము కులములఁ మ్రింగికొనుచు, వెగడొంది యఱచుచు నెగయు బల్పులుఁగులఁ బొగ నూర్ధ్వకీలలఁ బొదివికొనుచు... ఆశ్ర. 2. 151.

సీ. కెడసిన గరిసెల క్రింద లాఁగలఁ గ్రుస్సి యదువకాఁపురముండు నాఖుతతుల. ఆము. 6. 13.

జ : లాఁగడాఁగుడు, లాఁగలి.

లాఁగడాఁగుడు. వి. (లాఁగ + డాఁగుడు.) బిలేశయము. పాము.

సీ. లాఁగడాఁగుడు జాఁగ ప్రోఁగు లిడెడు ప్రోడకోలలు దొసంగులు దొలఁచు మేటి ... అచ్చ. రా. బాల. 8.

లాఁగరి వి. (లాఁగ + అరి³) శ్రోత్రము, చెవి. (శ. ర., బ్రౌ.)

లాఁగించు. అ. క్రి. (√లాఁగు) 1. లంఘించు ఉత్పతనమగు.

ద్వి మేదిని చలియింప మెట్టిన ధూళి, మేదురంగతి నెక్కి మిన్నందుకొనఁగ, లాఘవ మెసఁగఁగ లాఁగించుగతుల, మేఘముల్ చెదరంగ మేటి యగ్గలిక, దిగ్గజంబులు మ్రొగ్గ ...

రం. రా. ఉ. 46 పా. 12 పం.

సీ సుడిగాలి తిరిగెడు వడువున వడిఁజుట్టుకొంచు వైకాన లాఁగించి వ్రేయు. ప్రబంధ. 86.

2. అత్యతిక్రమించు.

సీ. లలిగూర్చి లలి దేర్చి లాఁగించి కుండాలముల నోజ వట్టించి ఖలువు దెచ్చి.

పి. శకుం. 1. 112.

స క్రి అతిక్రమించుట.

ఉం ప్రాఁగెంపురాల సంపద, లాఁగించు మిటారి గముల లలితాధరముల్. సమీర. 1. 94.

లాఁగు. వి. (సం. లంఘః.) 1. లంఘనము.

గీ. జెట్టుతండంబులోడఁ జేపట్టి పాొంత, కాలి విఱిచిన యట్టు లగ్గలిక విఱుతు, లాఁగు వేగంబు మెఱఁగి బలంబు నెఱసి, మల్లుతనమున మెప్పింతు మనుజవిభుని.

భాం. విరా. 1. 81.

2. నాట్యవిశేషము.

ఉ. దేశిపథంబు పట్టణము దివ్యకళానియు గోల చార కైవాంకి పేఁజీవిధము లాఁగులు ఉక్కిణి చిందు కొల్వణుల్, బానలుకోపుఁ జూపులును .. శ్రీరంగమా. 4. 162.

". లాఁగు మైసిరయుఁ పల్లటియు కర్తరియు బెళుకు విలసిల్లు ఉక్కిణివిధ మొకర్తు ...

ఉ. రా. 6. 139.

3. మొగ్గ

సీ గొప్పలై మిన్నందు చప్పరాలెక్కి లాఁగులు వైచుచోఁ జంద్రుడన లవఁగ......గీ......అలరు బోండ్లు, విపుల భరతకళాశాస్త్రనిపుణలైన విరుదు పాత్రలు గలరు తత్పురమువందు.

విజ. వి. 1. 15.

4. మల్లబంధవిశేషము.

వ ... కిల్లియు బలిబడుటయు రొండివేటును పణంబును కర్నాటును భారంబును బొంగ ణయు పెట్లాగుడు రూణింపును సరిబిత్త రంబును లాఁగును వింటాలంబును ..

ప్రబంధ 78.

వ. ... కక్కికోక్కన ... సరిబిత్తరంబును లాఁగును ... నృసింహంబును నాదియగు ముప్పదిరెండు విన్నాణంబుల నాణెంబు పరీక్షించి ... హంస. 1. 206

వ. ... సరిబిత్తరంబును లాఁగును వింటాణం బును ... అను విన్నాణంబులు విశదపఱచి, మల్లపు ం 69.

5. చల్లడము, నగముతొడవఱకుఁ దొడిగికొనెడు గుడిగి.

చం. వలిపపుసాలు వింతవలెవాటులు లాగులు రావిరేకులుం, గలిగిన గుజ్జరూపముల ...

సారంగ. 1 116.

జ : లాఁగించు, లాఁగువడు

లాఁచు. అ క్రి. 1. పొంచు.

సీ. లాఁచి పొంథులమీఁద లావణివేసిన గొల్లరు విల్తుని సకుటరిగె యనఁగ. నవలి. . 77.

ఉ. చూచినయంతలోఁ దనకుఁ జొప్పడ దాఁక వధిజ్యధన్వుఁడై, లాఁచిన మన్మథుండు కర లాఘవ మొప్పని శాతసప్త నారాచ ంం పరల్ పఱపి వ్రయ్యలుచేసెఁ కియా శీలమున్, ... వైజ. . 6.

ద్వి. రాజోత్తముఁ గొని సవ్వగాకుండ, లాఁచిన సీమూలధవమెల్లఁ బెట్టి, గోఁచి లాఁదై దావిఁగొనుచు నేతెంచి,లాఁచియున్నాఁడు నీలా గొత్తి చూడ.

ద్వి. హరిశ్చ ఉ. 10పదం.

2 కవియు

సీ. తనబిడ్డఁ జెలిబిడ్డ దమజు మ్రింగగ మర్వి లాఁచెనోయని తోఁచె లంకమీఁద .. ... గీ. నవపతా కాలతా కావనస్పూర్త్వ. రాగముని జాగరాగంబు రథచమూన ము ద్ర శైవాల మును రామభద్ర నికట, ధూపధూమంబు లై వట్టు దుమ్ముగేఁగి. రామా 7. 272.

గీ గబ్బిబెబ్బులి డాకల ద్రొబ్బి విరియఁ. బ్రమి రూపార్పకున్న నీబంటఁగాను,లాఁచి గవిఁజొచ్చి యచ్ఛభల్లములగముల. బడలు వాపకయున్న నీబంటఁగాను

వేం. పంచ. 2. 194.

(పందివేఁట.) గీ లా చితప్పిన జాగిఁము గొట్టు కొట్టునఁ గూడిన చిడఁకూళ్ళఁ గొమ్మశ్రే లా డు కకు 4. 77.

3 పెనఁగులాడ

గీ. కాంత పద మొంది యట యూరు గ్రమిస్త కాంచి, మ నెనసి పయోధరశిఖరిదుర్గ, సంగతికి లాచు నృపదృష్టి చక్రశాస నోన్నతస్థాన మపుడుగా యొదవుఁ దవకు. వను. 2 65.

4. ప్రియపడు

గీ తెలవ లిటు నీరువోయు పదిరియ చేరి యుంలఁ గొలగాకి పిచ్చుగుంపై యనంగుఁ, దనుపగొనఁజొన్నె గల్లగట్టమర వారి, దర్వగలు లాఁచి యిడు విడియముల పేగ అము 2. 58.

జు లాఁచుమేకొను, లాపరా, లాఁపు.

**లాఁచుమేకొను.** అ. క్రి (లాఁచు + కొను.) (స్వార్థమున) పొంచు

వ మఱియు బ్రమత్తులై యధీరులగు వరుల గుఁడు వృంబుచండంబువ నొదిగి లాఁచు కొనియుండ చేష్టించుగాని ధీరులైనవారికిం గలిపెలన భయంబులేదు. భాగ. 1 445.

**లాఁత** వి. (√లాయు) ఉద్రేకము. (చూ. లాఁత సేయు.)

**లాఁతసేయు** అ. క్రి. (లాఁత + చేయు) లాయు, ఉద్రేకించు.

వ. .. కరాళించక లాఁతసేయక ... గంగా తరంగంబుల తెలుఁగు దాల్పు వారువంబు లును ... ఉ హరి 4 213.

**లాఁతి** వ. అన్యము, అన్యుఁడు, తెలు.

కం. అది లాఁతియిల్లె నిసుఁ దమ, హృదయఁబుల నెవ్వరేని యెఱుఁగరె ...

భార. విరా. 2. 99.

విణ అన్యుఁడు.

సీ. జ్ఞాతి బ్రోవనివాఁడు లాఁతి బోషించునే యిలుగొన్న దొర మాన్య మిచ్చువాఁడె.

రామలిం 101.

వి. అన్యుఁడు, ఇతరుఁడు

ఉ బంధుతలపోఁతలు లేఁతలు మమ్ము నిమ్మెయిన్, లాఁతులఁగాఁ దలఁపకు వలం చకు చాల నలంగియుండగన్.

ఉ. హరి 4. 93.

చం. అదితి మెఱంగి కుండలము లావరికుండు హరించె వాని నేఁ, గదనములోనఁ ద్రుంచి యవి గైకొని దాఁచితి నాఁటనుండియుం, బదిలముగాఁగ నన్నడుగఁ బంపని కారణ మేమి లాఁతినే, యిదె చనుదెంచి యిత్తు ననుమీ శతమన్యునితోడ సంయమీ

పారి. 2. 28.

జ : లాఁతివాఁడు

**లాఁతివాఁడు** న (లాఁతి + వాఁడు) అన్యుఁడు.

ఉ స్వైరవిహారధీరలగు సారసలోచన లున్న చోటికిన్, బోరువ లాఁతివారు చొరఁ బోయినచో రసభంగము ... వసు. 2. 55.

**లాఁతు.** విణ మిక్కిలి, అధికము.

చం. కొడుకులు కూఁతులుం గలిగి కూడును కాఁడియుఁ ద్రవ్వి తండమై, విడిముడి లాఁతుగాఁగలిగి వెడఁయుఁ బైఁడియు నిండ్ల లోపలన్, దడఁబడ ... క్రీడా. 256.

**లాఁపరా(యి).** వి. (లాపు + రాయి) జలద్వార ముఖమునఁ దృణాదికము చొరకుండ నమర్చి యుంచెడు గండ్లరాయి.

వ. ... గుడిలాఁపరాతూపరాణికడ నిలిచి ...
ఆము. 6. 10.

సీ. తూపరాణపుటమ్ము తూమొప్పరము జల ధారియం చనఁగను దనరును జల. గీ. నిర్గ మము తమ్ముఖంబున నీటితోడ, నచ్చుతృణ ములఁ జొరనీనిక్షి వలక పేరు, లాఁపరా యంచుజనులు పల్కఁగను వెలయు.
ఆం. భా. 1. 154.

**లాఁపు.** వి. (√లాఁచు) లాఁచుట.

**లాక.** వి. 1. అంకురము.

ద్వి. ఆకంజబాణు మోహనపుష్పశాఖ, లాకయో హేమశలాకయో యనఁగ, ...
అ. మ. క. 4. 183 పొ. 24 పం.

ద్వి. మత్తచకోరాక్షి మరువంపులాక, క్రొత్త ముత్యపుబొమ్మ ...
నవ. 2. 57 పొ. 22 పం.

ద్వి. ఒక్క మైవడిలాక లొత్తి తలిర్చి, పక్కొమ్మ లిడి పారుపడి చెట్టుగట్టి, ...
ద్వి. పరమ. 4. 266 పొ. 3 పం.

2. పడుగుతం దక్కడక్కడ చొప్పించెడు వెదురుబద్ద.

సీ. కారంపుఁబడుగులుఁ గం డెలకప్పెర గోలము లాకలు నీలికడవ, ... హంస. 2. 12.

3. పక్షియీఁక (శ. ర., బ్రౌ.).

4. ప్రక్క, భుజము. (చూ. లాకకట్టు.)

ఇ : లాకకట్టు, లాకలొత్తు.

**లాకకట్టు.** వి. (లాక + కట్టు) వెనుకకు చేతులు విఱిచికట్టుట.

గీ. వెనుక మోచేతులను గట్టిపెట్టు టొప్పు లాక కట్టు లనంగఁ గైలాసవాసి.
ఆం. భా. 3. 38.

**లాకలొత్తు.** అ. క్రి. (లాకలు + ఒత్తు) దట్ట ముగాఁ గలుగు, దట్టముగా నంకురించు.

సీ. ఒత్తెం జరణము లటు దళు, కొత్తం దమి మునికి లాకలొత్తెం బులకల్, చిత్తజుఁడు వింటఁ దూపున్, జత్తాయతపఱిచి చిత్త జల్లుగ నేసెన్.
విప్ర. 3. 86.

**లాకి.** వి. ఎఱుపురంగుగల వస్త్రవిశేషము.

(లాఖ = ఎఱుపురంగు. మి. బ్రౌ)

రగడ సరిసేయరాని హంసావళులు లాకీలు, మాదళంబులు వెన్నమణుగులు మునజ్జీలు.
హంస. 5. 356.

**లాకుటికుఁడు.** సం. విణ. (అ ఈ. అ) దుడ్డుఁ గ్ఱ యాయుధముగాఁ గలవాఁడు.

వి. అ పుం. కావలివాఁడు.

**లాక్ష.** సం. వి. ఆ. స్త్రీ 1. ఒకవిధమైన యెఱుపురంగు వస్తువు, లత్తుక, అలక్తము, 2. ఎఱ్ఱరంగునిచ్చెడు పురుగు, ఆరుద్రపురుగు, ఇంద్రగోపము (ఆ. ని.).

**లాక్షకి.** సం. వి. ఈ. స్త్రీ. సీత (విల్యమ్సు).

**లాక్షణికము.** సం. విణ. (అ. ఆ. ఈ.) 1. నైసర్గిక మైనది, స్వాభావికమైనది. 2. లక్షణార్థముఁ గలది (వాచకవ్యంజకభిన్నమగు పదము). 3. మాటిగా నర్థముదెలుపక అలంకారరూప ముగాఁదెలుపునది. 4. అముఖ్యము, అప్రధానము. 5 పారిభాషికము, పరిభాషగా నేర్పఱుపఁబడి నది. వి. అ. పుం. పారిభాషిక శబ్దము.

**లాక్షణికుఁడు.** సం. విణ. (అ ఆ. అ.) లక్షణ జ్ఞుఁడు; సంజ్ఞలను సాముద్రికచిహ్నములను ఎఱింగినవాఁడు

**లాక్షణ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. శుభా శుభసూచకములైన లక్షణములుకలది. 2. శుభా శుభములను సూచనచేయునది.

**లాక్షణ్యుఁడు.** సం. విణ. (అ ఆ. అ.) లక్షణ ములు (శుభాశుభసూచక లక్షణములు) తెలిసిన వాఁడు.

లాక్షాతరువు సం. వి. అ. పుం. వృక్షవిశేషము. లాక్ష నుత్పత్తి చేయుచెట్టు, రంజనద్రవ్యము నిచ్చెడు చెట్టు. (వృ. వి).

లాక్షాప్రసాదము. సం. వి. అ. పుం. రక్తలోధ్రవృక్షము. ఎఱ్ఱలొద్దుగుచెట్టు (వృ. వి.).

లాక్షాప్రసాధనము సం. వి. అ. పుం. రక్తలోధ్రవృక్షము. ఎఱ్ఱలొద్దుగు చెట్టు.

లాక్షారక్తము. సం. విశే. (అ. ఆ. అ) లత్తుకతో రంగువేయఁబడినది.

లాక్షారసము. సం. వి. అ. పుం. లత్తుక. అలక్తక ద్రవము

లాక్షికము. సం. విశే. (అ. ఈ. అ) 1 లత్తుక సంబంధమైనది 2. లత్తుకతోఁ జేసినది. 3. లత్తుకతో రంగువేయఁబడినది. 4 లక్షసంఖ్యకు సంబంధించినది

లాగనృత్తము. సం. వి. అ. న. ఒక విధమగు నాట్యము (విల్సను).

లాగము. వి. (సం. లాఘవమ్) 1 లాఘవము, తేలిక.

ద్వి. గగనయాంత్రికుఁడు లాగవుబంతి డాఁచు, పగిది భానుఁడు గ్రుంకెఁ బశ్చిమాంబుధిని.

ద్వి. పరమ. 4. 290 పొ.

ఱ : లాగి.

2. నేర్పు, సులువుగఁ బనిసేయు తెలివి

కం. తేగురుఁ గోరాడిన మద, నాగంబులరీతి మార్గణవ్రణజాస్ర, గ్రాగములఁ దొప్పదోఁగియు, లాగమునకుఁ జొచ్చి యచ్చేలంబునఁ బెనఁగన్.

జై. భా. 7. 167.

లాగి. విశే. (లాగము + ఇ[3]) 1. చులుకనిది, లఘువు

సీ. సిగకు నందక వెన్క జీరాడుమరులతో లాగియౌ మట్టికుళ్ళాయి దవర.

దశా. 7 (1) 27.

సీ. పసిఁడికుళ్ళాయి మెడఁ జాఱ నవికించ వాకవించ లాగియౌ లోని కుళ్ళాయి వెట్టి.

వాల్మీకి. 1. 19.

2. మలభము.

చం. సరసవయామభావమునఁ జక్కని చక్కెర బొమ్మలాగిగా, దొరకెనటంచు నమ్మితిని ...

కళాం. 4. 58.

లాగించు స. క్రి (√లాగు[1]) 1 లాగికొని పోవు, కొంపోవు

దండకము ..... పతంగేంద్రుఁ డుత్తుంగరోషంబు వాఁగన్ భుజంగంబు లాగించుభంగిన్...

దశా. 4. 282.

2 అపహరించు, దొంగిలించు.

కం .. తానొకనాఁడుమ చెట్టుకొని మెలఁగని, యనువైన సమంతుపావలిది లాగించెన్

పారంగ 3. 135.

ద్వి ఓరి! సజ్జనమాడ్కి – నువ్వాఁడ విప్పు, డేరిని లాగించి తీ పైఁడికిన్నె, గడుసనీ కేటు వంటి కనుమాయగలవా ...

ద్వి. పరమ. 4. 329 పొ. 11 పం.

3. పెలుకఁజేయు; ఆకర్షింపఁజేయు.

వ ... తరంగిణీ సంగతంబైన రోహణాచల శృంగంబు బాగు లాగించుచు ...

భాగ. 10. పూ 1082.

వ. .. ప్రచండంబగు వాని పిచండంబు లాగించి.

భాగ. 10. పూ. 1344.

లాగు[1]. స. క్రి ఆకర్షించు, హరించు.

గీ. సాహసపు వల్లుఁ దడరి యుత్సాహశీలి సతతమును లాగు ఖురళికాస్తంభ మవఁగ.

చంద్రా. 1. 10.

కం. అవింటితోన యాతని, లావును వెలితవము తేజ లాగుకొని కడున్, తేవదలిర్పఁగ నెక్కుడి, వేవేగ లకోరి బూని ప్రేయఁ దొడఁగినన్.

అచ్చ. రా. బాల. 208.

విశే. 1. సమ్మతము, ఇష్టము. (వి.సమ్మతి.శ.ర.)

సీ. తనకు లాగైన నెత్తంబు గైకొని పన్ని పానిక
దాళించి పాచెటింగి. ఉ. హరి. 3. 120.

గీ. సారెమోపును బోరలును జదరమైన, నెటింగి
లాగైనఁ గైకొని యుంచుకంత, బొసఁగ
కుండిన రుక్మిణి బొంకుబొంక, శౌరిఁ బలు
ములు గెలిచె నానత్యభామ.
ఉ. హరి. 3. 128.

2. బాగైనది.

సీ. పాశినగరిలోని పాత్రలు లాగెత్తు మేలి
వజ్రపులాగు మెడ యనఁగ.
రఘునా. 4 12.

వి 1. సొత్తు, సొమ్ము.

ద్వి. సూర్యుండు ధరియించి సుమతి భజించి,
సూర్యత్వమది తనసొమ్ముగాఁ జెలఁడనె, లక్ష్మి
శిరంబున బలిఁ దాల్చి కొల్చి, లక్ష్మీత్వ
మది తన లాగుగాఁ బడసె.
పండితా. దీక్షా. 19. పొ.

2. భక్ష్యవిశేషము.

వ. ... అప్పములు వెన్నప్పములు నుకియ లమృత
కలశంబులు లాగులు చక్కెర బురు లుక్కె-
ఆలు .... ప్రబంధ. 112.

3. విధము.

సీ. అమృతాంధసుల నొల్ల నను మానవియుఁ
గగ్గె నీలాగు గంటిమే కాలగతుల.
నైష. 4. 74.

ఉ. ఆ గౌరవంకవంకఁ గమలాతన నెయ్యంపుఁ,
జూడ్కి- చూచి యే,లాగున నీకు నీబహుళ్ళా
కుశలత్వము సంభవించె... విక్ర. 7. 49.

శా. ... ము,న్నీ లా గర్భకుఁ జూడనంచు నిటమీ
దెట్లంచుఁ జింతించుచున్.
భాగ. 10. 2 71.

4. మర్యాద

ద్వి. పొఱంతి వెండియు నిది పొలుపుగా దనుచుఁ,
బలికినవానిన పనిచినఁ జూచి, అలన వెండియు
నిది లాగు గాదేల, వలుమాఱుఁ జనుదేర
వలదు పొమ్మనెనుచు.
పండితా. పురా. 113. పొ.

5 ఒప్పు బాగు

ద్వి పట్టి మెల్లననెత్తి పాదంబు లుర్వి మెట్టింప
దైర్యంబు మిగుల రాసుతుఁడు, లాగుగా
నూఁది మెల్లనెనడుపాడ.
నవ. 2 132 పొ 13 పం.

ద్వి. లాగుగాఁదీర్చిన లత్తుకరేఖ, బాగుగా జి
మించే నవదంపుఁదీగె
నవ 2 86. పొ 10 పం.

జ : లాగించు, లాగుకొను, లాగులాడు.

లాగు² = లావు¹. వి. బలము, చేవ.

గీ లాగు వేగంబు సౌష్ఠవోల్లాసవిధముఁ, గడక
యును మబ్బుఁ దిల్యత్వకరణి మెఱయ,
ఘోరమూర్తులై సింహనాదారవంబు, లదరఁ
దార్కొని రవ్వీరు లాహవమున.
హరి. ఉ. 2. 60.

లాగుకొను. స. క్రి. (√లాగు) అపహరించు, కొను.
ఉదా : ఆ సొమ్మంతయు వాఁడు లాగు
కొన్నాడు.

లాగుడికుఁడు. సం. విణ. (అ. ఈ అ)=లాకుటి
కుఁడు.

లాగులాడు. అ. క్రి. (లాగులు + ఆడు) పెనఁగు
లాఁడు.

ఉ పైఁటకు లాగులాడి కటిపై ఘటియించిన చే
విదల్పులం, బాటిలి .. పాంచా. 5. 20.

లాఘవము సం. వి. అ. న. 1. చులకన, తేలిక
తనము. 2. అల్పత, కొద్దితనము. 3. గాంభీ
ర్యములేమి. 4. అగౌరవము. 5 చులుకుతనము.
6. శీఘ్రత. 7. (ఛంద.) హ్రస్వత్వము.
8. (తర్క.) సంగ్రహపఱచుట. వ్యతి—గౌరవము.
9. ఆరోగ్యము.

లాఘవి. సం. వి. న్. పుం. గాఁడివాఁడు, ఐంద్ర
జాలికుఁడు (విల్యమ్సు.)

లాచి(చీ) వి. 1. గుఱ్ఱముమీఁదను గాడిదమీఁదను
వేసెడి గోనె. 2. చిన్నబండిమీఁదఁ దెప్పు
కారము.

**లాజము** సం. వి. అ. పుం., ఆర్ద్రితండులము, నానబియ్యము న. ఉశీరము, వట్టివేరు.

**లాజలు.** సం. వి అ. పుం ఆ. స్త్రీ. బ. భృష్టధాన్యము, పేలాలు (మే. ని.).

గీ. తోయజాక్షోదర లాజలు దోయిలించి, ప్రమదమున వేల్వ నొక కొన్ని చెమట వఱ్ఱ, వ్రేళ్లగనుపట్టెఁ గెంజాయ వీతిహోత్రు, నాలుకలు పాటిరాకున్న నపత్రపనగ మను. 5. ...

**లాటకము.** సం విశ. (అ టీకా అ.) లాటదేశస్థులకు సంబంధించినది,

**లాటము.** సం. వి. అ. పుం. 1. ప్రాంతగుడ్డ, చింపిగుడ్డ, జీర్ణాలంకారము మొ॥ c వస్త్రము. బట్ట. 3 బాలభాష, చిన్నపిల్లలు మాటలాడెడు భాష. 4. ఒకానొక దేశము.

**లాటానుప్రాసము,** సం. వి. అ. పుం. అనుప్రాసాలంకారములలో నొక భేదము. ఒక పదముగాని కొన్ని పదములుగాని తాత్పర్యభేదము గలిగి యేకార్థమునఁ బునరుక్తిని పొందిన లాటానుప్రాస మగును. ఉదా: సీ కమలాక్షు నర్చించు కరములు కరములు శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ.

**లాటి.** సం. వి. ఈ స్త్రీ 1. కవితారచనా విశేషము 2. ప్రాకృతభాష,

**లాటిక.** సం వి. అ. స్త్రీ. = లాటి

**లాటు.** వి. గుంపు, మొత్తము.

సీ, దీనితో గూడ వేల పోనిమ్మని రమ్మని లాటుఁ దోడ్కొనిపోయె కోట నృపతి (ఇట తన యనుచర సంఘమువని భావము) పాంచా. 2. 45.

**లాటుఁడు.** సం. వి. అ. పుం. 1. లాటదేశాధిపతి. 2. విద్వాంసుఁడు, ప్రవీణుఁడు, విదగ్ధపురుషుడు. బ. లాటదేశ నివాసులు.

**లాడము.** వి. గుఱ్ఱపు గొరిజలకు కొట్టెడి యినుప తగటిబిళ్ల (శ. ర).

**లాడా** విశ. నిడుపైనది.

సీ. ఠకపు సామ్రాణి వా ర్లాడా చలాడంబు చిఱుంతమీసపు నేత చిఱుతదట్టి, గీ అలరఁగ అకు నా నెఱుకునాయకుం డొకఁడు. చంద్రా. 2. 88.

ప్రయోగాంతరము కన్పడలేదు.

**లాడి.** వి. 1. బలి

గీ నాకు మొగ మోడి యాఁగా దనగు తపస్వి, లేల యీ మైల పూయక దూల దీని. వత్స యుతముగ నీవనివాటమునకు, లాడిగావింతు వంత రోలంగి దూలు, పాండు. 5. 243.

2 వ్రణము, పెద్ద పుండు.

ఉ లాడికి మూఁగు కాకులఁ బలాయన మొందఁగఁ జేయ వీఁపుపైఁ, బ్రాఁడును వ్రేలు వీఁకెగుదితాపివదేహము పేడి కాళ్లకున్, రోడి నశించు తోఁక బఱురోమము లంటిన జోఁబు టీఁగలున్, గూడిన బంధముం గలిగి కూర్చుచునుం డొక బక్కగుఱ్ఱమున్. హంస. 5. 30.

**లాడి(డీ)కుడు.** సం. వి. అ పుం. సేవకుఁడు. కానినవాఁడు (విల్సమ్సు).

**లాడు.** విశ. పెద్ద ?

సీ. ఒఱపుగఁ దిరుపట్టె కురుచలెత్తఁగ క్రౌంచములు లాడు డింకులుఁ బొంగల మెడల ...

గీ. బలిమి గని పట్టి . . ప్రబంధ. 82.

**లాడె.** వి. లాటదేశము.

సీ. సేవమై సగము దీసిన బూదెపండుతోఁ గూడిన బంగారు లాడెసింగి, గీ. ... విడెము మీఁద, వీడియముగల్గుదొం పాత లాడె జోగిఁ, బిలిచికొనివచ్చిపాడ గనిపించుట యును. కువల. 2. 88.

**లాతము** = లాతాము. వి. సన్యాసులు చేతఁ బట్టెడు దండము.

శా ఈ లాతంబున వ్రాయఁ బట్టణము లౌ నీ పాముకల్ మెట్టఁగా, నేలోకంబునకైన నేఁగ సులభంబు ... విక్ర. 2. 7.

సీ. బూది బొక్కెణ లాతమును గమండలువును
బులికలాసము గరంబున వహించి.
హర. 2. 87.

సీ. ... లాతాలఁ గొని మోఁది లజ్జగొండ్రు.
హర. 5. 10.

గీ కవి విబుధులార యుగ్గిరి గగనధరణి,మండ
లంబులు నీలాల మట్లు గాఁగ, నున్నదిగదా
సదాశివ యోగివరుఁడు, చేతనూదిన పటికంపు
లాత మనఁగ. వరాహ. 6 83.

సీ .. యోగివేత్రాభిద యొప్పు లాత,
మనఁగ ... అం. భా. 2 177

లాతము సం. విణ. (అ ఆ. అ.) పుచ్చుకొనఁబడినది, తీసికొనఁబడినది.

లాతాము = లాతము. వి. సన్న్యాసులు ధరించెడు కఱ్ఱ.

సీ. కకపాల కేదార కటక ముద్రిత పాణిఁ
గుబుచ లాతాముతోఁ గూర్చినట్టి ...
మనుచ. 1. 59.

లాతి. సం. వి. ఇ. స్త్రీ. తీసికొనుట, పుచ్చుకొనుట.

లాపము. సం వి. అ పుం. 1. సంభాషించుట, మాటలాడుట. 2. వదరుట, ప్రేలుట.

లాపిక. సం. వి ఆ స్త్రీ. ప్రశ్నోత్తరములు గూఢముగా లోపలనుండునట్లుగాని, ఉత్తరము వేఱు మాటలం దుండునట్లుగాని, అడుగు గూఢ ప్రశ్న.

లాబ(వ)ము. సం. వి. అ. పుం. ఒకజాతి పూరేడుపిట్ట.

లాబగాఁడు. విణ (లాబము+కాఁడు.) లాభము నొందువాఁడు

(దుర్వాసుఁడు) సీ. ఘనకోపవాణిజ్యమునఁ
దపోవిత్తజాలముఁ గూడఁబెట్టెడు లాబగాఁడు.
వరాహ 2. 160.

లాబము. వి. (సం. లాభః) లాభము
(చూ. లాబగాఁడు.)

జ : లాబగాఁడు.

లాబుకి. సం. వి. ఈ. స్త్రీ. ఒకవిధమైన వీణ.

లాబువు. సం. వి. ఊ. (ఊ). స్త్రీ. అలాబువు-ఊ న. సొఱకాయ అనుగపుకాయ

లాభకరము. సం. విణ. (అ. ఆ అ.) లాభము గలుగఁజేయునది.

లాభకృత్తు. సం. విణ. త్. = లాభకరము. లాభము కలిగించునది.

లాభకము. సం. వి. అ. పుం. 1. లబ్ధి, ప్రాప్తి. పొందుట. 2. ఆదాయము. 3. అనుభవము. 4. జయము, గెలుపు. 5 గ్రహించుట, జ్ఞానము, తెలివి. 6. (జ్యోతి.) లగ్నమునకు పదునొకండవ స్థానము.

లామజ్జకము. సం. వి. అ. న. వీరణమూలము, వట్టివేరు (వ్య. వి ). (నీటివట్టివేరు. అని శ. ర.)

లాయము. వి. (క. లాయ) అశ్వశాల, వాహనములుండు చోటు.

గీ. మునివరేణ్యుని సమ్ముఖంబునకు సవన
హయముఁ దెప్పించె విభుఁడు లాయమున వెదకి.
జై. భా 6. 104.

ఉ. లావున నార్చుచుం గలుఁగు లాయపు తేజీ
వజీరుఁ డంకుశం, బావవజారిపైఁ బఱప
నాతఁడు దావనె యయ్యిభాననున్, జేవడఁ
గుంభమధ్యమునఁ జీరిన మౌక్తిక పాళి
రాలె ... శశాం. 5. 90.

సీ. లాయంబులోఁ బమల్ గావింప రమ్మంచు
హారిణితోఁ గడు వెగ్గలాడి రమచు.
కువల. 1. 41.

సీ. ... లాయ మంచన మందురాఖ్య వెలయు.
అం భా 2. 15.

లాయు అ క్రి ఉద్రేకించు, విజృంభించు.

మ లయకాలోత్థ పతంగ బింబముక్రియన్
లాయన్ యదీయోగ్ర వి,ర్దయనిర్ముద్రసు

దర్శనాఖ్య పటు చక్రం బిద్ధ దైతేయ సంశయ సంక్రీడకు ... హరి. ఉ. 236.

క. లాసియుఁ బొడిచియుఁ దట్టియు, ద్రవేసియు నొడ్డించ కొనియు విసరియు మిగులం, డాసియు వొక్కటఁ గయ్యము, చేసిరి నిజసాధనములు చిద్రుపలు గాఁగన్.

జై. భా. 7. 166.

జ : లాఁత, లాఁత సేయు.

లాల. సం. వి. అ. స్త్రీ. చొంగ, నోట నూరెడి యుమ్మినీరు.

లాలకుఁడు. సం. విణ. (అ. లిశా. అ.) లాలించు వాఁడు, బుజ్జగించువాఁడు.

లాలనము. సం. విణ. (అ. సీ. అ.) బుజ్జగించునది, లాలించునది. వి. అ. పుం. విషముగల యొక జాతి చిట్టెలుక.

న 1. బుజ్జగించేట, లాలించుట. 2 చేన విచ్చుట. చాల ముద్దుచేయుట. (అ. ని.)

లాలము. వి. ఉల్లారు క్రిందిజాలరుల్ (శ. ర.).

జ : లాలసరి.

లాలస. సం. వి అ. స్త్రీ. 1. అధికేచ్ఛ, తీవ్ర వాంఛ, ఆత్రముగల కోరిక, ఔత్సుక్యము, అతిశయేచ్ఛ 2. ప్రార్థన, వేడికొనుట, యాచన. 3. విచారము, దుఃఖము. 4. దోహదము, గర్భిణీవాంఛ. 5. కేళి, క్రీడ, సయ్యాట.

లాలసము. సం. విణ. (అ. అ. అ.) 1. ఆత్రముతోఁ గోరునది, తీవ్రవాంఛగలది, 2. ఆసక్తి గలది, మిక్కిలి యిష్టముగలది, తదేకధ్యానము గలది. వి. అ. పుం. లాలస.

లాలసరి. వి. (లాలము + సరి) గుట్టముపల్లమునకు రెండుప్రక్కలను ద్రేలెడు పట్టుత్రాళ్లు.

గీ. పల్లముల నిరువంకలఁ బరఁగు పట్టు, త్రాళ్లు వెలయుచునుండు లాలసరు లనఁగ.

ఆం. భా. 3. 38.

లాలసీకము. సం. వి. అ. న వ్యంజనము, ఊరుఁగాయ మొ॥ నంజుకొనెడు పదార్థము.

లాలాటి. సం. వి ఈ స్త్రీ. నుదురు, లలాటము ఫాలము.

లాలాటికము. సం. విణ. (అ. టికి. అ) 1. నుదుటి మీఁద నున్నది, నుదుటికి సంబంధించినది. 2. అదృష్టమువలన బయలుదేఱినది, అదృష్టాధీనమైనది. 3 నిష్ప్రయోజనమైనది, నికృష్టమైనది. 4. జాగరూకతగలది, శ్రద్ధ గలది. వి. అ. పుం. ఆలింగన భేదము, ఒక విధమగు కౌఁగిలింత.

లాలాటికుఁడు. సం వి. అ. పుం. 1. యజమానుఁ డెప్పుడేమి యాజ్ఞచేయునో యని యతని ముఖము చూచుచునుండెడి సేవకుఁడు. 2. సోమరిపోతు, శ్రద్ధలేని మనుష్యుఁడు, అప్రయోజకుఁడు

లాలాభక్షము. సం. వి అ. పుం. ఒకానొక నరకము, నరకములలో నొక భేదము (దేవతలకు, పితరులకు, అతిథులకు నొసఁగక భుజించిన వారిందు తమచొంగయే ఆహారముగ బాధల నొందుదురు.)

లాలామేహము. సం. వి. అ. పుం. రోగవిశేషము, మూత్రముతో రసికారుటరోగము.

లాలావిషము. సం. వి. అ. పుం. సాలీఁడు మున్నగు కీటకము.

లాలాస్రవము. సం. వి. అ. పుం. సాలెపురుగు, లూతాకీటము.

లాలాస్రావము సం. వి. అ. పుం. 1. చొంగ కాఱుట. 2. సాలెపురుగు, లూతాకీటము.

లాలి. వి. (క. లాలి). 1. ఉయ్యాల.

గీ. లాలి గట్టిరి గంధోపలాలి శాఖ, లాలి సుమసాంద్రచంద్రోప లాలి సౌధ, లాలితస్థలి హరుని యుల్లాలిఁబాడి, మేలిజవరాలిగములు కాచూలి కడుపు. సారంగ. 1. 46.

సీ. పిచితన్నెగఁగొట్టు వెక్కసంబగు పుడిగాలి రక్కనుమీఁద లాలి యూఁగి.

చమ 1. 32.

సీ. ఉయ్యాల యనఁగను నుయ్యెల యన దొట్ల
యన లాలి యన డోల దనరుచుండు.
అం. భా. 2. 201.

2 ఉయ్యెలలో బిడ్డలను నిద్రపుచ్చునపుడు పాడెడు పదము.

సీ. లాలిలాలియటంచు లీలావతులు పాడ ...
చారుచంద్రోదయము. (భా.

**లాలి.** సం. వి న్. పుం. దుర్బోధచేయువాఁడు, పాడుత్రోవకుఁ ద్రిప్పువాఁడు.

2 విశ. (న్ సీ.న్.) లాలనచేయువాఁడ, బుజ్జగించువాఁడు, బుజ్జగించునది, లాలనచేయునది.

**లాలించు.** సం. స. క్రి. లాలనముచేయు, బుజ్జగించు.

క. అమ్ముదిత రత్న కటకచ,యమ్ముదిత నినాద
ముయ్యె నయ్యెడఁ జలమే,లమ్మని వటితో
దగుమే, లమ్మని సహజానురక్తి లాలించు
క్రియన్. వసు. 6. 80.

(ఈ క్రిందిపద్యమునఁ దద్భవముగాఁ గనఁబడుచున్నది.

రగడ. తలిరాకుఁ దగ మెట్ట దమ్ములఁ గీలించి
పలుమాఱు మూఁగి పైదలిని లాలించి.
యయా. 5. 77.

**లాలిక** సం. వి.అ. స్త్రీ. పరిహాసపు ప్రతివచనము, వేళాకోళపు సమాధానము.

**లాలికము.** సం వి అ. పుం. మహిషము, దున్నపోతు.

**లాలితకము.** సం. వి అ. పుం. ముచ్చటైన వస్తువు, ప్రియమైన వస్తువు.

**లాలితము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. లాలనచేయఁబడినది, బుజ్జగింపఁబడినది, ముద్దుచేయఁబడినది. 2. చెడుత్రోవకుఁ ద్రిప్పఁబడినది, చెఱుపఁబడినది. 3. ప్రేమింపఁబడినది. వి. అ. న. 1. సంతోషము. 2. ప్రేమ

**లాలిత్యము.** సం. వి. అ. న. 1. మనోజ్ఞత, మనోహరత. 2. చెక్కఁదనము, సొగసు, 3. (పదముల) మార్దవము (పదలాలిత్యము.).

4. శృంగారాభినయము.

**లాలిని.** సం. వి. ఈ స్త్రీ. కామాతురత గల స్త్రీ.

**లాలు.** విశ. (హిం. లాల్) ఎఱుపురంగు గలది, రక్తము.

వ. .... కొదమతట్టువగుంపు కాలికొలంది ద్రేలు
లాలు కుంచెలు గీలించిన గవ్వగండల గంటల
నలంకరించి ... ము 4 35.

సీ. మధుభూవ ... నికమండలి లాలుజెండా లనఁ
దలిర కుచ్చులు నిగిడె. కవిజ. 2. 8.

**లాలుక** సం. వి అ స్త్రీ ఒక విధమైన కంఠహారము.

**లాళము** = లాడము. వి. గట్టును మోయువాని గొరజలకు కొట్టెడి యినుప తగటుబిళ్ల.

సీ. అడుగంటఁ ద్రొక్కిన యహితప్రతాపకీలములు
నాఁ బసిఁడి లాళములు మెఱయు
చంద్ర. 2 16.

**లావకము.** సం. విశ. (అ ఈ. అ) 1. ఖండించునది, ముక్కలుచేయునది. 2. విభజించునది. 3 చీల్చునది. వి అ. పుం పూరేడుపిట్ట.

**లావణము** వి. (క.లావణ) కొలువునకు క్రొత్తగా వచ్చిన కొలువుడుకానిని పట్టికయందు వ్రాసికొనుట.

సీ. కొలువని వ్రాయుట .. లావణము . . నా
వఱలు ... అం భా 2. 228.

**లావణము.** సం. విశ. (అ ఈ అ.) 1. ఉప్పునిది. 2. ఉప్పువేసి వండఁబడినది, ఉప్పువేయఁబడినది వి. అ న. ఉప్పుతో భావనచేసిన యౌషధము.

**లావణి**[1]. వి పుల్లరిపనులు మేసెడు బీటునేలకై ముందుగా ఇచ్చెడి పన్ను (శ ర).

**లావణి**[2]. వి దండయాత్ర.

సీ లాచి పాళెగులమీఁద లావణి వేసిన యలరు
దలుని సంగరగె యనఁగ. తపతీ 3. 77.

(లావణివేసిన = దండయాత్ర వేసిన అని భావము)

లావణికము. సం. విశే. (అ ఈ అ.) 1. ఉప్పు వేయఁబడిన, ఉప్పువేసి వండఁబడినది 2. అంద మైనది, చేక్కనిది వి. అ. న. 1 ఉప్పు పాత్ర. ఉప్పుబుట్ట. 2 ఉప్పుతో భావనచేసిన యౌషధము.

లావణికుఁడు సం. వి అ. పుం ఉప్పువ్యాపార మున జీవించు వర్తకుఁడు

లావణ్యము సం వి అ న. 1. ఉప్పన. చే క్కఁదనము సౌందర్యము, ముత్తెముల యందలి నవలక్షణమందు నీడ ప్రతిఫలించు నట్టి ఒక విశేషము

లావణ్యార్జితము. సం. వి అ న పెండ్లికాలమున పెండ్లికూతున కత్తమ న లిచ్చిన ద్రవ్యము విశే. (అ ఆ అ) చేక్కఁదనముచే సంపా దింపఁబడినది.

లావము. సం. విశే. (అ ఈ. అ.) 1 ఖండించునది, ముక్కలు చేయునది 2. చీల్చునది, కోయునది, 3 చేదించునది, పరిహరించునది వి అ పుం. 1 ఖండించుట, కోయుట. 2 పూరేడుపిట్ట.

లావరి. విశే (లావు[1] + అరి[3]) బలముగలది, బలము గలవాఁడు.

కం నీ వేల వచ్చితివటికి, నేవాఁడవు మోపుటలక సేపారెడు నీ, లావరి పలు గెక్కడియది, యీవాఁడవనన యెవ్వరేర్పడఁ జెపుమా. హరి. ఉ. 4 140

కం. నపుడు గల్పాంతఘన, గ్రైవేయక జాగ్ర దగ్రగతిఁ గదిసి దశగ్రీవుఁ డనిఁ గనిమనం గిన, లావరియగు పులుఁగుఱేఁడు లావఱివడి యెన్ రామా. 5. 203.

మ పరుతోఁ బోరఁగఁ బొంచి నావిభునిఁ జంపం జాడయే నీకు లావరి వై వఁబోదమూపి కయ్య మున నిల్వఁజూచి దోశ్శక్తిమైఁ, బరగం జంపఁగరాదె... భా. రా. కిష్కిం. 297.

లావాణకము. సం. వి. అ. పుం మగధదేశ సమీపమందున్న యొకమండలము

లావికము. సం. = లాలికము.

లావిలము. వి. పక్షివిశేషము

సీ. బెళగువ్వ బాతు లావిల మూపకప్పెరగాఁడు నెమలి పాలకాకి చిలుక.

యయా. 2. 24.

లావు[1] = లాగు[2] వి 1. బలము, శక్తి

కం. నీవిఁ యోత్సాహమునకు లావునకు ఒపంబు నకు నలౌల్యమునకు న,ద్భావమునకు మెచ్చి వరం, బీవచ్చితి . భార. ఆది. 2. 105.

కం. లావులు వెఁవులుఁ దాల్ములుఁ, జేవలు నష్టలిత ములుగఁ జెల్లుపనులు నానావిధములఁ జేర్కొనుచుం, జావనివరులఁ గవలఁ బొగడు వటురవ మెసఁగెన్. భార. శాం. 1. 138.

కం. ఒవింటితోన యాతని, లావుమ నెఱంతనము తేజో లాగుకొని కడున్, జేవ దలిర్పఁగ నెక్కడ, వేవేగ లకోరిఁ బూని ప్రేయఁ దొడఁగివన్ అచ్చ. రా. బాల. 208.

2. సామర్థ్యము.

ఆ. ... శివశక్తిభేదంబు, తెలియఁగ నీకు జదున కెంత లావు. కు. సం. 7 884.

ఉ. ... మహర్షుల శాపముచే స్వకీయమౌ, లా వెఱుఁగండు మత్తకరిలాగున మందు నితండు రాఘవా. ఉ రా. 5. 76.

ఆ. మత్ప్రసాదదివ్యన హిమచే నెంతైనఁ, గవిత చెప్ప లావు గలదు నీకు. పిం. 1. 20.

3. ధైర్యము.

సీ. లావుచాలించి చెల్లాచెదరైరి సారణులు గుహ్యకులు తురఁగముఖులు.

వరాహ. 3. 59.

సీ. వెలవెలఁబాఱ మోములు లావులుచలింపఁ గదలె దిక్కులకునై గరుడకులము. (ఇట ఱెక్కలని యర్థాంతరము.

దశా. 2. 60

4 సాహసము.

సీ. .. పరమపురుషుఁ, డాదరంబునఁ జూచి యస్మత్ప్రోత్సాహంబునందు మీచేసినయట్టి లావు. సామాన్యమే రిపుజయము మీచేతికి వచ్చిన యది .. హరి ఉ 6. 196.

5. బరువు, గురుత్వము.

శా. కృష్ణిపక్షంపతఁ జూచు నన్నుఁ గని తద్ద్వక్షి యేతజ్జలో, వృగ్గ్రద్రోణిక యెక్కవేగిరమె తానంబాడి రమ్మన్న నే, లగ్నాశ్చర్యముతోడ నెక్క మునిఁగెన్ లావూఁది వేఁ ద్రొక్క వరాహ. 9 142.

6. ఉపకారము.

కం. సేవకులకు మును చేసిన, జీవితములు చెలువ లావుచేసినవారిన్, జేవచెడనాడ విధి నా, కీవిధిఁ బ్రతికూలుఁ డగుట కెయ్యదిగతమో. భోజరా. 3. 139.

కం. ఈ సకలయూథనాథులు, చేసిన లావునకు సంతసించితి వారుం, బాసి చనుఁడు మము నిటుగాఁ, జేసినదైవంబు గడవఁ జెల్లునె వాకున్. భా రా. యు. 601.

విశే. 1. అధికము, హెచ్చు.

సీ. గర్వంబు లావైనఁ గల్గుఁ బరాజయం బాశ హెచ్చైన సౌఖ్యము నశించు. రామలిం. 50.

ఉ. లావగునట్టి దుర్దశ యలంత సహింపఁగలేక యక్రుధా, రావళి గాఁఉ ... సారంగ. 3. 115.

వ. ... లావుగాఁగావు గప్పి. మనుచ 4 60.

2. ఘనము, పెద్ద.

గీ. ఈకువరముచేత నెవ్వఁడే నిప్పాట, కూరుఁ డైన దువ్వఁ జూచి నక్క, యొడలు గాల్చి కొన్న వడువున మీరింత, లావుమాటలాడ లజ్జగాదె. ఉ. హరి. 4. 165.

3. బలిష్ఠము. బలముగలది

సీ. కైలాస మెత్తిన నీలావుకరములుఁ గరములఁ గల పెంపు గాసిగాఁగ ...

భా. రా. అర. 1. 268.

4. బలకరము.

కం. సంజె వొడతెఁచె నిఁక మీఁదం జీఁకఁ లావు యాతుధానుల కనుచున్

భా. రా యు. 5౨0.

5 శక్యము అలవి

ఉ వారలన్. లావె రణంబులో మన కలంఘ్యబలాఢ్యుల నింక నోర్వఁగాన్

భార సభా. 2. 273.

తరువోజ. ... ఇమ్మెయిఁ జేయుఁ, గానున్న విధి యేల కడవంగనిచ్చుఁ గర్మవిపాకంబు గడవంగ లావె భారం. ఆది 6 247.

సీ. ... విప్రునలుకయు విధికృతంబు

ఆ గ్రసించంప లావె కావున గంగాజలధి తీరమునఁ బ్రశస్తపంచ తీర్థములకు నేఁగి ...

భార ఆది. 8 161.

కం. ... ఆరాజకమయిన ధారుణిప్రజ, కొక నిమిషంబయినఁ బ్రకృతి నుండఁగ లావే.

భార. ఆది. 4. 248.

6 స్థూలము. (శ ర., వా.)

జ : లావరి, లావుకొను, లావు సేయు, లావెక్కించు, లావెక్కు

**లావు**[2]. వి. 1. ఱెక్క, పక్షము, ఱెక్కయీక.

చం. చిడిముడిపాటుతోఁ జెలఁకుసింగిణిఁ బూని మధుప్రియత్వ మేర్పడుగతి లావులున్న హరిపైన జివుక్కున నెక్క యుక్కునన్, వెడలెడుచందుఁ జూచి తమి నేఁ డిదిగో వధ మాచరించుఁ డెం, పడరిలతాంగిపచ్చి తురకాఁగద యమ్మదనుండు చూడఁగన్.

విజ వి. 3 66.

కం. వలసిన మేపులుగొని కాళ్ళ లావులును నిక్కలించి ... , బులుఁగులు చట్టుపలార్చుచుఁ, గొలకొలమని కూఁతలిడుచు గూఁడులు సేరెన్. ప్రబంధ. 61.

పీ. ఉంతేక జిగురులే కొగిఁ బల్లురాయని లావులతోఁ దెచ్చు లావుకోలది.

రా. వి 3. 46.

ఉ. డేగవడిం జేని గిట్టిపట్టి మే, సించినఁ గాలిమూలలగయుఁ జెక్కెముఁ జక్కెర వద్దియిచ్చి యే, తెంచె నొకండు డాఁవిటి దీటుచు లావులు గూడదువ్వుచున్.

చంద్రా. 2. 105.

2 పక్షము, ఱెక్క మొదలు.

కం ఱెక్కలు విదిలిచి లావులు, ముక్కున గొనం దువ్వి మోదమునఁ గంధరముల్, మిక్కిలి దిక్కు గనుంగొన ... శుక 1. 145

3 పక్షిపుచ్ఛము, పింఛము

సీ లావు లవిటి నా వలరుఁ బక్షిపుచ్ఛాఖ్య యెగువ నాఁగను విహంగగతి దవరు

ఆం భా. 2 99.

వ. పిడుగులు పిడుగులు గదిసిన చందంబున ముఖపాళింబాని వారలపై ధాణుధారలుం జూప నప్పట్టున జట్టుపట్టిలావు నెట్టెంపు డాలువు బలగంబు స్వస్తికంబున నొడ్డుకొని ... ప్రబంధ. 786.

లావుక(ము) వి. (సం లావకః) ఒకానొక జాతి పక్షి

సీ. కౌఁజులు పూరేళ్లు కన్నెలేళ్ళు నెమళ్ళు ఁ వుక లోద్దురువా ల్లకుముకులను ...

రసిక. 1. 67.

సీ. లంవుక పసిరిక లకుముకి గిజిగాఁడు పూరేడు జీనువు కారుకోడి ప్రబంధ. 234.

సీ . లంవు పన లావక మొప్పును ...

ఆం. భా. 2. 97.

సీ. కొక్కెరం పూరేడు గొరవంక లావుక పొన్నంగి కోవెల కన్నె లేడి.

యయా. 2. 24.

లావుకొను అ క్రి (లావు[1] + కొను) అతిశయించు

ఉ రాఘవుఁడు జంభవిరోధి సహస్రనేత్రిలజ్జాపకిత్రైయై కనుఁగొనఁగ సానుజుఁడై మునిరాజనన్నుతుల్, లావుకొనంగఁ జొచ్చె మిథిలాపురిఁ గౌశికువెంట నర్మిలిన్.

చంద్రా. 1. 22.

లావుసేయు. అ క్రి (లావు[1]+చేయు) బలము చూపు.

కం. మన మెంత లావుసేసినఁ, బనిదీఅదు పేకు అండు పగతుఁడు లోకంబున దూఱురాదె యితరుల ననిఁ జంపినఁగానపలవ దాహవ మింకన్. హరి. ఉ. 6 176.

లావెక్కించు. స. క్రి. (లావు[1] + ఎక్కించు) పురికొల్పు, ప్రోత్సాహపెట్టు

శా. ... పౌండ్రకవిభుం డాక్షిప్తయులం జూచి చే, వీచెం ద్రోయుఁడు కోట మేడలు పడన్ ద్రేయుండు డాయుండు లెం, డేచూ జెవ్వఁడుగొన్న నిత్తునని లావెక్కించె సంరంభియై.

ఉ. హరి. 3. 32.

లావెక్కు. అ. క్రి. (లావు[1]+ఎక్కు) అధికమగు.

వ. ... అనన్య విషజిహ్వల కలాపంబులు బ్రహ్మాండకర్పరంబు పవ్వళింప నిప్పులు చెదరి చేదలు దరికొల్పు మల్కాపాతంబులంబోలె దిక్కులం జురజుర గ్రుక్కి లావెక్క నప్తపాతాళ భువన చక్రవాళంబు పురపురం బొక్క వెక్కసంబయి కోలాహలం బుద్భవించిన భీమ. 4. 60.

లాఘుకము. నం. విశే. (అ. శా. కీ. అ) లోభగుణము కలది, అత్యాశకలది.

లాసకము నం. విశే. (శ. నికా అ.) 1. ఆడునది, కప్పిగంతులు వేయునది. 2. ఇటునటు గదలునది. వి. అ. పుం. 1. నృత్యము, నాట్యము. 2. నెమిలి. 3. ఆలింగనము కౌఁగిలింత. న. మేడమీఁది గది. పుం. న. ఒక విధమైన ఆయుధము (విల్యమ్సు.).

లాసకి. నం. వి. ఈ. స్త్రీ. నర్తకి, నృత్యము చేయు స్త్రీ

**లానకుఁడు.** సం. వి. అ. పుం. 1. నర్తకుఁడు, నృత్యముచేయు పురుషుఁడు. 2. శివుఁడు

**లాసము.** సం. వి. అ. పుం. 1. దుముకుట, ఆడుట, నృత్యము చేయుట. 2. చెంగాట, సయ్యాట, శృంగారక్రీడ. 3. స్త్రీ లభ్యసించు నృత్యము. 4. పులుసు.

**లాసవతి** సం. వి. ఈ. స్త్రీ. నాట్యముచేయు స్త్రీ, వేశ్య.

చ. అని కొనియాడ లాసవతు లాడఁ బురంధ్రులు పాడ బంధువుల్, మునుకొని డాయ ...
చంద్రా. 6. 130

**లాసిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. నర్తకి, నృత్యముచేయు స్త్రీ, 2. వేశ్య, 3. కామాతురతగల స్త్రీ, లంజె. 4. నాటకప్రదర్శన విశేషము.

**లాసికతనము.** వి. వి. (లాసిక+తనము) ఆట కత్తెతనము

కం. అని కొలిచి యే బృహన్నల, యను నామము తోడఁ గన్యకాంతః పురవర్తన మొనరించుచు లాసిక, తనమున నిపుణుండనై యతని మెచ్చింతున్. భార. విరా. 1. 89.

**లాసోప్యుని.** సం. వి. ఈ. స్త్రీ కట్టెలకు బెజ్జము చేసెడి 'బరమా' యను సాధనము.

**లాస్యకి.** సం. వి. ఆ. స్త్రీ వేశ్య, వెలయాలు.

**లాస్యము** సం. వి. అ. న 1. నృత్యము. 2. నృత్యము చేయుట. 3. గీతవాద్యములతోఁ గూడిన నృత్యము. 4. అభినయముచేతను, ముఖవైఖరిచేతను కామవికారములను తెలిపెడు నృత్యము.

**లాస్యుఁడు.** సం. వి అ. పుం నర్తకుఁడు, నటుఁడు.

**లాహిరి(రి)** వి. 1. మైకము, మత్తు.

కం. తనగంధాఘ్రాణముచేతనె లాహిరిఁగొనఁగ దేవదానవు లబ్ధిం, జనియించె మదిర ...
దశా. 2. 28.

గీ. ఔర యమృత ద్గృహీత లమృతలహరి. చెకి లాహిరిఁగొలుప నా జిహ్వ ప్రహ్వ, మొంద ...
చం. రా. 6 15.

ఉ. బిచ్చము కెత్తి యాపయిన వేగుల వారయి రూఢపాతకుల్, పెచ్చినవాని మంత్రము లతఁ డెట్లన నట్లనె పల్కి యెమ్మెగ, బిక్క చేయకే మనిచి పాకు ... లాహిరిన్. పాం. 2. 100.

గీ. మదనసజ్ఞ యుల్లసిల్లు, మబ్బు లాహిరి యనఁ గను మాతృభూత. ఆం భా. 2 238

చం. ... రాజ్యసౌఖ్యముల్, గడకొను లాహిరి మసఁగఁ గ్రమ్మిన మత్తులుగారె భూపతుల్
రాజ. వి 3, 26

2. మైకము గలుగఁజేయు ద్రవ్యము

చం కనుఁగని తెల్లవాఱునను కనుగొని రెడు వల్లవాళి మేల్లను గొని విడెముం గలువు లాహిరిమేపుల నిద్రవుచ్చి చెందిన చిలు వవ్వుతో నపుడె నిద్దురలాయని వింత ప్రేఁడి పట్టిన వెలముద్దుగుమ్మలు వడిన్ శయనించిరి చప్పరంబులన్. కువల. 2. 112.

సీ. బుగ్గ లాహిరియూటఁ బొడమ వాసనతోడి కంతునోటను జొంగ యంకురింప, గీ. వేగఁ దనయిల్లు వెడలె నావృద్ధవేశ్య. శుక. 3. 80.

లాహిరిపట్టు = మత్తెక్కు.

వ ... విసంబెక్కినలీల భ్రమఁగన్ను వెట్టిన లాగున లాహిరపట్టినభాతి మదం బెక్కిన మాడ్కి మునిగిడిగొన్న భంగి నోరల్లుచు మమ్మలించుచు నవ్వుచు నూర్ధ్వశీనందనుం డూర్ధ్వబాహుడై యుపైనస్వరంబున.
కాశీ. 2. 138.

జ : లాహిరికాఁడు.

**లాహిరికాఁడు.** వి. (లాహిరి + కాఁడు) మత్తుఁడు

చం. తొలఁకెడు తావిగందవొడి తూపువు వాలుఁగఁ బట్టి మల్లెపూ, వలపులు క్రొల్లలాడ

హిమవారిఁ గలంచి మెఱుఁగులోఁడ్ల గ,బ్బిల పయిచంద్ర కావిజిగి గ్యద్యొకొ గ, వెడల్పి యోందుమై, దెలియక తూలుకొచు వలి దెమ్మెగ లాహిరికాఁడు త్రిమ్మగన్
కువల 1 68.

సీ. వలు ప్రయస్త లోవర్చి యూరు డగ్గర జేసి మలయు లాహిరికాని మహిమ యొంత. (ఆట బలరాముఁడని భా.ము) ఉ రా 1 76

## లి

**లి** సం. వి ఇ. పుం. 1. మార్గాయాసము 2. నాశము 3 ధ్వంసము 4 సామ్యము 5. కంకణము, 6 డియము

**లింగఁడు** వి. (సం లింగి) జంగమయ్య
కం బాలునిఁ బాలకుఁ బిలుచుచు, లింగరయుగ ముసాఁచి లేమయొకతె యిట్లాలింగనిఁ గని వేగం, బాలింగవ మొసఁగవచ్చునటు లరుదెంచెన్. రాజ లి. 2 134

**లింగకట్టుమాత్ర.** మి. వి. (లింగము + కట్టు + మాత్ర.) లింగాకారముగాఁ జేసిన రసవస్తువుల గుళిక (శ. ర.).

**లింగకము** సం. వి. అ. పుం కపిత్థము, వెలఁగ చెట్టు.

**లింగకాయ.** మి వి (లింగము + కాయ) లింగధారులు లింగమునుంచి కట్టుకొనెడు వెండి బంగారములతోఁ జేసిన సజ్జకాయ (శ ర., బ్రౌ)

**లింగదేహము.** సం. వి అ. న పంచతన్మాత్రములు, పంచజ్ఞానేంద్రియములు, పంచప్రాణములు, మనోబుద్ధి చిత్తాహంకారములు అను ములు కలిసి లోకాంతరమున సుఖదుఃఖముల ననుభవించు సూక్ష్మశరీరము.

**లింగదొండ.** మి. వి. (లింగము + దొండ) లింగాకారముగ మండు కాయలుగల యొకదినుసు దొండ (వృ. వి.). (శ. ర, బ్రౌ., చి ని.).

**లింగధారి.** సం. విశే. (న్. జి న్) (శివుని) చిహ్నము ధరించినవాఁడు.

**లింగనము.** సం. వి. అ న ఆలింగనము, కౌఁగిలింత

**లింగనాళము** సం. వి అ పుం. నేత్రరోగ విశేషము.

**లింగపరామర్శము.** సం. వి. అ. పుం. (తర్క.) లింగము = (స్వాభావికధర్మము) యొక్కయాలోచనము (వహ్ని వ్యాప్యమైన ధూమము గలది యీపర్వతము, అనునది లింగపరామర్శము, వ్యాప్యము పక్షమందుఁ గలదని తెలిసికొనుట)

**లింగపురాణము** సం. వి అ న పదునెనిమిది పురాణములలో నొకటి.

**లింగపొట్ల** మి వి. (లింగము + పొట్ల) లింగాకారపు విత్తులుగల ఒక జాతి పొట్ల. లింగబీజ (వృ. వి)
(శ. ర, చి. ని.)

**లింగప్రతిష్ఠ** సం వి ఆ స్త్రీ. లింగమును స్థాపించుట.

**లింగబలిజె.** మి. వి లింగధారియగు శూద్రుఁడు.
సీ. ఆలుకోమటిజాతి దక్క జంగము రాలు, బావగారిది లింగబలిజెకులము. వేణు. శ. 69.

**లింగబీజ.** సం. వి. ఆ. స్త్రీ. లింగపొట్ల (వృ. వి.). (శ ర.)

**లింగము** సం. వి అ. న 1. చిహ్నము, గుఱుతు. 2 కపటవేషము 3 ధ్రువపఱుచుటకు సాధనము 4 (తర్క) అనుమానమునకు సాధనమయిన హేతువు. 5. (వ్యాక పదిసాధుతా ప్రయోజకమయి స్త్రీత్వపుంస్త్వాదులను దెలుపు చిహ్నము. (ఉదా: స్త్రీలింగము, పుంలింగము). 6. గుఱి. 7 దేవతాప్రతిమ, విగ్రహము 8 పానవట్టముమీఁది శివమూర్తి. 9 లింగదేహము 10. ప్రాతిపదికము 11. (సాంఖ్య) ప్రధానము 12. వక్తయొక్క తాత్పర్యమును నిర్ణయించుటకు హేతువగు పదాంతరసన్నిధి మొదలగునవి 13. మచ్చ, కలంకము.

లింగరాజు మి వి కూంకటిమూంగపిట్ట, భృ గము, భృంగరాజుపిట్ట.

గీ, ... భృంగాహ్వ వెలయు లింగ, రాజవంగ ...
అం. భా. 2 97

లింగవర్ధనము. సం. విణ. (అ. సీ. అ.) లింగో త్థాపనము గలిగించునది

లింగవర్ధిని. సం. వి. ఈ స్త్రీ. అపామార్గము, ఉత్తరేను (వృ. వి)

లింగవిపర్యయము. సం వి అ. పుం పుంలింగాదుల మార్పు

లింగవృత్తి. సం. విణ. (ఇ.) వంచనచేయువాండు, మోసగాండు, వి. ఇ. పుం. కపటసన్న్యాసి, జీవనార్థమై యతివేషమును ధరించినవాండు.

లింగవృత్తుండు. సం. విణ. (అ ఆ. అ.) ధర్మధ్వజి, పొట్టపోసికొనుటకై లింగజటారుద్రాక్షాదులు దరించువాండు.

లింగవేది సం. వి. ఈ. స్త్రీ లి గాధారస్థానము, పానవట్టము.

లింగశరీరము. సం వి. అ న. లింగదేహము.

లింగసదర్థుండు. సం. విణ (అ. ఆ అ.) శివుని విషయమున మంచి కార్యములు చేయువాండు.

ద్వి గణుతింప నింత లింగసదర్థుం డయ్యెం, బట్టిన నియమంబుం బాయక కన్న, పెట్టు వర్థ మెకాని ముట్టండు సేత
బస. పు. 5 8౬8 పం.

లింగస్థుండు సం. వి. అ. పుం మతగ్రంథము లభ్యసించు విద్యార్థి

లింగానుశాసనము సం. వి. అ. న వ్యాకరణమందు లింగము నిరూపించు సూత్రసముదాయము

లింగి. సం విణ (న్. వి. న్) 1. చిహ్నముగలది, గుఱుతుగలది. 2 కపటవేషమును ధరించినది 3. మంచి లక్షణములు కలది 4. శివలింగమును ధరించినది, లింగధారి. వి. పుం 1. మంచి లక్షణము గలయేనుంగు. 2 మతగ్రంథములను పఠించు విద్యార్థి, సన్న్యాసి 3. (తర్క.) లింగజ్ఞానముచేం దెలియంబడు సాధ్యము 4. (తర్క.) పక్షము, సందిగ్ధసాధ్యము గలది. 5 పరమేశ్వరుండు. 6. మూలకారణము. 7. శైవుండు

లింగిని సం వి. ఈ. స్త్రీ. 1. సన్న్యాసిని. 2 ఒక జాతి తీంగ.

లింపటుండు సం విణ అ ఆ. అ భోగాసక్తుడు, కామాతురండు వి. అ. పుం ముండు.

లింపము సం వి అ. పుం. 1. రాచుట, పూయుట, 2. కప్పుట.

లింపాకము. సం వి. అ పుం 1 దబ్బచెట్టు, నిమ్మచెట్టు 2. గాడిద, గర్దభము 3 దబ్బ, పండు, నిమ్మపండు.

లింపి = లిపి సం వి ఇ. స్త్రీ

లికుచము సం వి అ. పుం. లకుచము గజనిమ్మ (వృ. వి.)

లిక్క సం వి ఆ. స్త్రీ. లిక్ష. ఈరు, పేనుగుడ్డు,

లిక్కి వి. గడ్డిలోనగువానిం గోసెడు చిన్న కొడవలి, అల్పలవిత్రము.

ద్వి. చిక్కముల్ కాసుల చిక్కముల్ చలిది, చిక్కముల్ లిక్కులు జక్కులం దాల్చి, యలమిమీఱినయట్లు యమున చెంగటను ...
అ మ. క. 1. 29 పా 20 పం.

సీ. అల్పలవిత్రాఖ్యయగు రు లిక్కి యనంగ . ...
అం భా 2. 231.

లిక్ష. సం. వి అ. స్త్రీ 1. ఈరు, పేనుగుడ్డు. 2. నాలుగు, లేక, యెనిమిది త్రసరేణువుల పరిమాణము, అతిసూక్ష్మపరిమాణము

శ్లో 'జాలాంతరగతే భానౌ యచ్చాణు ర్దృశ్యతే. రజః తైశ్చతుర్భి ర్భవే ల్లిక్షా

'త్రసరేణవో౽ష్టౌ విజ్ఞేయా, లిక్షైకా పరిమాణతః' మనుస్మృతి.

లిక్షికా సం వి ఆ. స్త్రీ. ఈరు, పేనుగుడ్డు

**లిఖనము** సం. వి. అ. న. 1. వ్రాయుట. 2. చిత్రరువు వ్రాయుట, బొమ్మలు చేయుట. 3. గీయుట, గోకుట. 4. వ్రాసినపత్రము, చేతివ్రాత

**లిఖి(ఖు)ంచే.** సం. స. క్రి. వ్రాయు.

గీ అష్టదళమైన నవనాభమైన షోడ, శారమైన లిఖంచి తదంతరమున, విష్ణుదేవుని శాస్త్రోక్త విధి యజించి వరాహ. 12. 46.

వ మూజ్ఞాక్షరంబుల నేను లిఖయించి యిడిన కనకమయశాసనపట్టిక పుచ్చుకొని చదువు కొమనది. మార్కం 4 273.

**లిఖితము.** సం. విణ. (అ. ఆ. అ) 1. వ్రాయఁబడినది. 2. చిత్తరువు వ్రాయఁబడినది. 3. గీయఁబడినది, గోకఁబడినది వి. అ. న. 1. వ్రాఁత, వ్రాసినపత్రము (కాగితము) 2. కృతి. గ్రంథము.

**లిఖితవ్యము.** సం. విణ. (అ. ఆ. అ) వ్రాయఁదగినది, లేఖ్యము (శ. ర).

**లిఖితుఁడు** సం. వి. అ. పుం. ధర్మశాస్త్ర గ్రంథకర్త

**లిఖ్య = లిక్ష** సం. వి. ఆ. స్త్రీ.

**లిఖ్యము.** సం. వి. అ. పుం. ఈరు, పేనుగ్రుడ్డు.

**లిగువు** సం. వి. ఉ. పుం. 1. మృగభేదము, ఒకజాతి జింక. 2. మూర్ఖుఁడు, అవివేకి.

న. 1. హృదయము, ఎద. 2. మనస్సు.

**లిద్ది** వి. 1. దంచుటచే మిక్కిలి లోఁతుపడిన ప్రాణిలోటికి కొట్టెడు గూటము.

ద్వి. పెద్దగాఁ దనమేను పెంచిన నిండ, లిద్ది గొట్టిన యట్టి లీలమై ...

ద్వి. భాగ. 10. (శ. ర)

2. పడిసెముచే ఊపిరిరాక ముక్కు అడఁచుకొనుట (శ. ర.)

**లిపము.** సం. వి. ఈ. పుం. పూఁతపూయుట.

**లిపి.** సం. వి. ఇ. స్త్రీ. 1. పూఁతపూయుట. 2. వ్రాఁత, అక్షరవిన్యాసము. 3. అక్షరములు, వ్రాఁతయక్కరములు, వర్ణములు. 4. వ్రాయుట యగెడు కళ. 5. ఉత్తరము, పత్రము మొదలగునవి వ్రాయుట. 6. చిత్తరువు వ్రాయుట, బొమ్మలు చేయుట.

**లిపి(ం)కరుఁడు.** సం. వి. అ. పుం. 1. సున్నము పూయువాఁడు, తాపీపనివాఁడు 2. లేఖకుడు, వ్రాయసకాఁడు. 3. చిత్తరువులు వ్రాయువాఁడు

**లిపికారుఁడు** సం. వి. అ. పుం. లేఖకుఁడు, వ్రాఁతగాఁడు, వ్రాయసకాఁడు

**లిపికుఁడు** సం. వి. అ. పుం. వ్రాయసకాఁడు, లేఖరి.

**లిపిజ్ఞానము** సం. వి. అ. న. పలువిధములగు లిపులను దెలియుటయను కళ.

**లిపిజ్ఞుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) లిపి తెలిసిన వాఁడు, వ్రాఁతనేర్చినవాఁడు.

**లిపిన్యాసము.** సం. వి. అ. పుం. ఎత్తి వ్రాయుట. మఱియొక ప్రతి వ్రాయుట.

**లిపిఫలకము.** సం. వి. అ. న. 1. వ్రాఁతబల్ల. 2. వ్రాసెడు కాగితము, తాటియాకు మొ॥

**లిపిశాల.** సం. వి. ఆ. స్త్రీ. వ్రాఁతబడి, అక్షరములు నేర్పు బడి.

**లిపిసజ్జ.** సం. వి. ఆ. స్త్రీ. వ్రాఁతపనిముట్టు, లేఖన సాధనము

**లిపీకరుఁడు.** సం. వి. అ. పుం. = లిపికరుఁడు

**లిప్త** సం. వి. ఆ. స్త్రీ. విగడియలో నఱువదియవ భాగము.

**లిప్తకము.** సం. విణ. (అ. ఆ. అ) విషము పూసినది వి. అ. పుం. విషముపూసిన బాణము.

**లిప్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పూయఁబడినది, కప్పఁబడినది. 2. మలినముగాఁ జేయఁబడినది, కలకితము 3. పాడుచేయఁబడినది. 4. విషముతోఁ బూయఁబడినది (బాణము మొ॥)

5. తినఁబడినది, భుజింపఁబడినది. 6. కలసినది, కూడుకొన్నది

లిప్స. సం. వి. ఆ స్త్రీ. 1 పొందనిచ్ఛ, సంపాదవ లందలి కోరిక. 2 కోరిక, ఇచ్ఛ, మనోరథము

లిప్సువు. సం విశ ఉ. 1 పొందనిచ్ఛగించువాఁడు. 2. లాభమునొందఁ గోరువాఁడు 3. అత్యాశగలవాఁడు

లివి. సం వి. ఇ. ఈ. స్త్రీ. లిపి.

లివి(ం)కరుఁడు. సం వి. అ పుం వ్రాఁతగాఁడు, వ్రాయసకాఁడు, లేఖకుఁడు. ఒకదానికిఁ బ్రతి వ్రాయువాఁడు.

లిబ్బి. వి. 1. నిధి.

గీ దండి- బొమ్మిది లిబ్బులు దాఁచుకొన్న, వాని కైనను ధనకాంక్ష పోనియట్ల.

ఘటికా. 1. 19.

గీ. తినరు లిబ్బి యనంగ నిధానసంజ్ఞ

ఆం. భా. 1. 67.

2 ధనము.

గీ ఉన్నఁడకుఁ దోచుచున్నదిగాని చేతి కబ్బ దర్దంబులోఁ దోచు లిబ్బి వగిది ....

శశాం. 4. 71.

కం. ఉబ్బడు లిబ్బులు గలవని, రెబ్బఁడు రిపురాజుఁగాని రేఖలవలరా, యబ్బఁడు పరభామినికై, యబ్బఁడు శ్రీపాదజేని యబ్బఁడు ధాత్రిన్.

బహు. 1. 20.

సీ. లిబ్బి నిబ్బరి పుబ్బు గబ్బిసుబ్బెటిమిన్న కలఁగి గొబ్బునఁ నాథుఁ గౌఁగిలించె.

దశా. 2 55

3 రాశి, కుప్ప.

సీ. గుబ్బలా యటంచి లిబ్బులా రుచిమించు దిబ్బలా యని పాంథధీను లెన్న.

హంస 3. 21

లిబ్బిగుబ్బెత = లక్ష్మీదేవి.

సీ మెడఁగొంపుఱాతాళి నిడుకొని వనమాలి లిబ్బిగుబ్బెతఁ బ్రబ్బి యుబ్బు లెల్ల.

ఉ. రా. 6 208.

సీ. గబ్బడాల్ దొరగుండుకబ్బంబు ప్రోయాలు లిబ్బిగుబ్బెతయబ్బ బొబ్బమెకము.

లిబ్బిగుబ్బెతయబ్బ = పాలసంద్రము )

అచ్చ రా యు 592.

లిబ్బిదొర = కుబేరుఁడు

సీ. వంకి లిబ్బిదొం లావంకిలి నందించి కొంగ వాలున గట్లగొంగ గెలిచి.

అచ్చ రా యు 474.

ఇట్లే—లిబ్బులదొర, లిబ్బుల ఱేఁడు

కం లిబ్బులదొర చెలికానికి, గుబ్బలి యొకమిని యనుఁగుఁగూఁతుమగనికిన్. సిలా. 1. 18.

గీ. జేముసికంలెను జేజేలసామిగంటె, జంట మోముల వేలుపుకంటె నీళ్ల. జెకెంటెను లిబ్బుల జేనింటె, మేటియే రాగివుఁడు నిన్ను మీటి పోర.

అచ్చ. రా. యు 12.

లిబ్బులచాను = లక్ష్మీదేవి.

గీ. మొదలి వెన్నుఁడు పట్టెముగుడిగొడవ, లుడువు కొఱ కిర్లగొంగసం బడిననందు, రాముఁడై పుట్టె లిబ్బులచాను సీత, హై పొడమె వేలుపులు గోఁతులై కమ్ము.

అచ్చ రా. యు. 19.

లిబ్బులజవరాలు = లక్ష్మి

సీ. లిబ్బులజవరాలియబ్బ నల్లుదిఁ జేసి నవరెడు నడుగుఁ గెంరమ్మివాఁడు. రా. వి. 1. 71.

ఇ : లిబ్బిపడఁతి, లిబ్బిరాయఁడు.

లిబ్బిపడఁతి. వి. (లిబ్బి+పడఁతి) లక్ష్మి (శ.ర.)

లిబ్బిరాయఁడు వి (లిబ్బి + రాయడు) కుబేరుఁడు, ధనాధిపతి (శ. ర.).

లిభి సం వి. ఇ ఈ. స్త్రీ. 'లిపి' యొక్క రూపాంతరము.

లిమ్మ. వి. మాంసాదులమీఁద ముసురుకొను ఈఁగలను దోలెడు రెమ్మ.

చం కనుగొని వేగవచ్చి గణకాండము గన్గొని స్వాములార నేఁ. బని విని కాంచివచ్చి తల వాఁడొక యంగడి పేయమెంచక, ముమ్మను మున నొక్క మీవ మిడి మూగిన యూఁగలఁ జేతి లిమ్ముఁ బో,జనుచుచు దీని గొండు వెల సొమ్మని యమ్ముచుమన్న వాఁ డవన్
చెన్న. 4. 888.

(శ. ర., బ్రౌ. పా. రెమ్మ. ముద్రి పా.)

**లియ్యము** = లీయము. విశే. (సం. లీనః) మిక్కిలి కలసినది, లీనము.

శా చేసెంగావలయున్ విరించి నిఖిల స్త్రీ పుంస సంయోజనా, భ్యాస ప్రౌఢిప్రకాశ మొందఁ గడు లియ్యంబైన సంసర్గ మిట్లు .
నైష. 6. 75.

కం అటుగను నీమె చెప్పిన, యటువలె నియ్య కొని లియ్యమై యుండంగా, వటుమీఁద దైవగతియని, యటనిటు వడయంచుచుండ రా చెలు లంతెన్. సాంగ. 2. 49.

వి ఐక్యము, మిక్కిలి కలియుట

ఉ పువ్వులుకాతోడ సరిపోలెడు చక్కని వాఁడు భూమిలో, నెవ్వడు చెప్పఁడా యనుచు నిష్టవయస్యలఁగూర్చి యాత్మలో, నవ్విభులూరుచుం బలుకు నొప్పులకుప్ప వలఁదు గాక యెం, డెవ్వఁ డనంగ మెచ్చుఁ దరపేదణ వెయ్యము లియ్య మెట్టదో.
నైష. 1. 75.

కం. ఇయ్యకొని యయ్యమాత్యుల, వెయ్యారుడు గరిలోనంగి వెస విభుఁ డనుపన్, వియ్యము గతి మాటవపరి, లియ్యంబున విని వినిర్మలిత హృదయుండై రా. వి. 5 47.

**లివ.** వి 1. లాఘవము.

మ. .... ... యూబపా,కలవాతంద్రు మునీంద్రుఁ వ చుఁ బోగరెక్కన్ ఠెక్కసామ్రాణి దం, టలివన్నాఁటుచుఁ దన్మనోధనముదండన్ దండ నేతేంగన్. చంద్రా. 8. 98.

సీ లివ హత్తి బిగికౌఁగిలింతలపనివాళ్లఁ గనుపట్టు నెమ్మేను గప్పి కప్పి. ఉ. హరిశ్చ. 4. 49.

సీ. బావిదాఁ పెద నచుఁ బరితెంచి లివదప్పి జడిసి పైతరుశాఖ కొడిసె నొకఁ తె.
బహు 2. 29.

2. మల్లబంధ విశేషము

వ .. లివ రాకడ ఏకసరము పైసరము ఝుంప పిక్కు కరలాఘవంబు మొదలగు వితమ్ము లును . . మల్లపు. 3. 69.

వ . లివ రాకడ యేకసర పైసర ఝుంపపిక్కు కరలాఘవంబు మొదలగు వితమ్ము లెఱింగి.
ప్రబంధ. 79.

3 అతిశయము

వ. . తవ్వింరదల సందడియు, గంటుకొట్టి తఱు చును, గసగస లివయు .. భీమ 3. 67.

**లివలివ.** వి. 1 కదలుటయందగు ధ్వనికనుకరణము.

సీ. లేమగుంపుల లివలివలాడు తేఁగొమవంటి చోటికి నెలవరియటంచు. కువల. 1. 20.

ద్వి. ... గుబ్బలఁ బ్రేకంబుతోడ, తేఁగొమ దీవియ లివలివలాడ. ద్వి. పద మ. 5. 110.

వ వెండియు జరాప్రాదుర్భావంబున శిథిలం బులై కుదురు పట్టెడ లివలివం గదలురదవ పంక్తులును కవిక 5. 110.

2. తవిడాడనేర్చెఁ జెవులకుఁ, జవులుగఁ బలు కంగనేర్చెఁ బరిబాభరిణా,రవములు ఘలు ఘలుఘల్లన, లివలివ నడగిడఁగ నేర్చె లీలా గతులన్ సుద. 2. 124.

**లిష్టము.** నం. విశే (అ. ఆ. అ.) తీసించినది. తగ్గినది, వ్యర్థపఱుపఁబడినది.

## లీ

**లీ** ఎం వి. ఈ. స్త్రీ. 1. అంటియుండుట, విడువకుండుట. 2. కౌఁగిలించుకొనుట. 3. కరఁగుట.

**లీష.** సం. వి ఆ. స్త్రీ. ఈరు, పేను (బ్రౌ. ని.).

**లీగు** వి. 1. నడుము.

సీ. ... వెలయు మధ్యభాగము నడు మన లీగు వాఁగను గౌను నా ...

అం. భా. 2. 138.

**లీదలికోరికె.** వి. తృణవిశేషము.

గీ. కనుము లీదలికోరికె శాకివెదురు.

హంస 5. 44.

**లీఢము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆస్వాదింపఁబడినది, రుచిచూడఁబడినది, తినఁబడినది, భుజింపఁబడినది. 2. స్పృశింపఁబడినది, తాఁకఁబడినది.

**లీనము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. అంటుకొనియున్నది, తగిలియున్నది. 2. దాఁగియుండినది, పొంచియున్నది. 3. ఆశ్రయించియున్నది. ఆధారపడినది, అనుకొనునది. 4. కరఁగినది. 5. కలసిపోయినది, ఐక్యమొందినది. 6. తదేకాయత్తమైనది. 7. అంతర్ధానమైనది, కన్పడనిది, అగోచరమైనది. వి. న. 1. అంతర్ధానము. 2. కరఁగుట. 3. అంటుకొనియుండుట.

**లీయము = లియ్యము.** విణ. కలసినది, సక్తము.

ద్వి. ... సౌరభానీకంబుతోడ, లీయమై పద్మమేలిమి చూపువోలెఁ, దీయమై యై రమ్మదీయమో నాఁగఁ, దళుకొత్తు సరసి ...

ద్వి. పరమ. 1. 11 పు.

**లీల.** సం. వి. ఆ. స్త్రీ. 1. క్రీడ, ఆట. 2. వినోదము. 3. వేషభాషాదులయందుఁ బ్రియు ననుకరించునట్టి స్త్రీల శృంగార చేష్టావిశేషము. 4. సౌలభ్యము, అనాయాసము, చులకన. 5. కనఁబడు తీరు, ఆకారము, పోలిక. 6. చక్కఁదనము, సొగసు. 7. నటన, మాఱువేషము. 8. విలాసము. 9. రీతి, విధము.

గీ. అనుచు నాగంధవహుని ధౌర్త్యములు దెలుపు లీల విరసిన విరులు రాలిన రజంబు, లొలికిన రసంబు లురిలినఫలము లధిపు, బ్రోలు నిడి పలికి రుద్యానపాలు రపుడు. వసు 1. 134.

కం. తల్లీ సాధ్వీవంశమ, తల్లీ మది తల్లడిల్లి తరలకు పరఁ యో, పిల్లోలు దీనిఁ ద్రుంతు మ ఎల్లోక విక్షోభిఫణిగరుత్మల్లీలన్. రామా. 5 193.

శా. ఈలీలన్ సురతెల్లరున్ గొలువ వాణీశుండు శీఘ్రముంబుగా, ... దశా. 2 68.

**లీలాంగుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) అందమైన యవయవములు గలవాఁడు, చక్కనివాఁడు.

**లీలాంచితము.** సం. విణ. (అ. ఆ. అ.) లీలచే నొప్పునది.

**లీలాంబుజము.** సం. వి. అ. న. విలాసార్థము పట్టుకొనిన పద్మము.

**లీలాకలహము.** సం. వి. అ. పుం. ప్రణయకలహము, కపటయుద్ధము, విలాసముగాఁ దెచ్చి పెట్టుకొనిన కలహము.

**లీలాగారము.** సం. వి. అ. పుం., న. విలాసగృహము, క్రీడామందిరము.

**లీలాగృహము.** సం. వి. అ. న. క్రీడామందిరము, విలాసభవనము.

**లీలాచతురుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) ఆటలలోఁ బ్రవీణుఁడు.

**లీలాతాండవము.** సం. వి. అ. న. విలాసార్థమైన నృత్యము.

**లీలానటనము.** సం. వి. అ. న. విలాసార్థమైన నాట్యము.

**లీలామనుష్యుఁడు** సం. వి. అ. పుం. కృత్రిమ మానవుఁడు, మనుష్యరూపమున నిల్పిన కొయ్యబొమ్మ మొ.

**లీలామాత్రము.** సం. వి. అ. న. విలాసమాత్రము, పిల్లలాట, కొంచెమైనను పూనికలేమి.

**లీలాయితము.** సం. వి. అ. న. క్రీడ, వినోదము.

**లీలారవిందము.** సం. వి. అ. న. విలాసార్థము పట్టుకొనిన పద్మము.

**లీలారతి.** సం. వి. ఇ. స్త్రీ. వినోదము, ఆట, క్రీడ.

లీలావంతుఁడు. సం. విణ. (క. శీ. క.) 1. ఆట లాడు స్వభావము గలవాఁడు, ఆటకాఁడు. 2. సుందరపురుషుఁడు, అందగాఁడు.

లీలావజ్రము సం. వి. అ. న. వజ్రాయుధమువంటి పసిముట్టు

లీలావతారము. సం. వి. అ. పుం. (విష్ణుదేవుని యొక్క) విలాసార్థమైన యవతారము. వేడుకకై భూమిపై నవతరించుట

లీలావతి. సం. వి. ఈ. స్త్రీ. 1. చెక్కుఁదనము గల స్త్రీ. 2. కామాతురత గల స్త్రీ, కాముకురాలు 3 దుర్గాదేవి. 4 భాస్కరాచార్య విరచితమగు గణితశాస్త్రగ్రంథము 5 నుయాసురుని భార్య. 6 (ఛంద) ఒకానొక వృత్తము. (రెం బ్లున్సు).

లీలావాపి. సం. వి. ఈ. స్త్రీ. విలాసార్థమైన దిగుడుబావి

లీలావేశ్మము సం. వి న్ న విలాసగృహము. ఆనందమందిరము.

లీలాశుకము. సం. వి. అ. పుం విలాసార్థము. పెంచెడు చిలుక, పెంపుడు చిలుక.

లీలోద్యానము. సం. వి. అ. న. 1. ఆనందకరమైన యుపవనము; ధనికులు విహారార్థము చెట్లు నాఁటి పెంచిన యుద్యానవనము. 2. నందనవనము, ఇంద్రుని యుద్యానవనము.

## లు

లు. ప్ర. ప్రథమాబహువచన ప్రత్యయము. ఉదా: గోవులు, వనములు మొ.

గీ. ... శైశవక్రీడ లాడి రపుడు, రామకృష్ణులు గోపదారకులఁ గూడి. వి. పుం. 7. 202.

ఉ. ... పరస్పరాత్మలం, దాకలితంబులైన ... ఆము. 1. 1.

లుంగ. వి. ఎక్కువ (వస్త్రాదుల) భారము.

సీ. జరిగొన్న సమకట్టు జన్నిదంబుల లుంగ యంటువాయంగఁ దా. వలుతపైచి. క్రీడా. 43.

సీ. వస్త్రభారము పేరు వలులు లుంగ యనంగ ... ఆం. భా 2. 152.

లుంగము సం వి అ పుం. ఫల్లమాదీఫలము. (శ. ర.)

లుంగి వి. యోషాంతరీయము, స్త్రీల కట్టుబట్ట.

సీ. ... లుంగి, యన నంగదట్టమం చనఁ జావడ యనఁగ యోషాంతరీయమై యొప్పుచుండు. ఆం. భా. 2 158.

(కల్లాయి కుళ్ళాయిములు చేర్చి కట్టిన పావడ, అని శ. ర. తురకలుకట్టు నెట్టవస్త్రము అని చెవి)

లుంచనము సం. వి అ న 1 తోలు (పై తొక్క) ఒలుచుట. 2. త్రుంచుట, త్రెంచుట.

లుంచము. సం. వి. అ. పుం 1. తోలు(పై తొక్క) ఒలుచుట. 2. త్రుంచుట త్రెంచుట.

లుంచితము. సం విణ. (అ. ఆ అ.) 1 తోలు (పైతొక్క) ఒలువఁబడినది. 2. త్రుంపఁబడినది, త్రెంపఁబడినది.

లుంఠ. సం వి అ. స్త్రీ. 1 దోఁచుకొనుట. 2. దొర్లుట.

లుంఠకము సం. వి. అ. పుం. ఒక విధమగు కూరాకుమొక్క (వృ. వి.).

లుంఠాకము. సం. విణ. (అ. ఈ. అ.) దొంగిలించునది, దోఁచుకొనునది.

వి. అ. పుం. కాకము, కాకి.

లుంఠాకుఁడు. సం. వి. అ. పుం దొంగ, చోరుఁడు.

లుంఠ. సం. వి అ. స్త్రీ. 1. దోఁచుకొనుట; దొంగిలించుట. 2. దొర్లుట, నేలపైఁ బొర్లుట.

లుంఠకుఁడు. సం వి. అ. పుం. దోఁచుకొనెడు వాఁడు; దొంగ, చోరుఁడు.

లుంఠనము. సం. వి. అ. న. దొంగిలించుట, దోఁచుకొనుట.

లుంఠాకము. సం. వి. అ. పుం. వాయసము, కాకి

**లుంఠాకుఁడు.** సం. వి అ పుం. చోరుఁడు, దొంగ.

**లుంఠి.** సం. వి ఇ. ఈ. స్త్రీ. దోఁచుకొనుట, కొల్లపెట్టుట.

**లుంఠితము.** సం. వ. త్రి. సంధించు కూర్పు.

కం. కంఠేకాలుని చేతం, గుంఠితుఁడగు చెట్లు మరుఁడు కుసుమాస్త్రంబుల్. లుంఠించి గుణవివాదము, కంఠమ్మున చాఁనేసె తవరవ ...ముంచెన్. భాగ. 9. 615.

**లుండీ.** సం. వి. ఈ. స్త్రీ. తగిన వడవడి, అర్హప్రవర్తనము.

**లుండిక.** సం. వి. అ. స్త్రీ. 1. మన్ను, పేడ, మొ॥ వాని గుండ్రనిముద్ద. 2. సరియైన వడత, యుక్తప్రవర్తనము.

**లుంబిక** సం. వి. అ. స్త్రీ. ఒకవిధమైన వాద్యము.

**లుకలుక.** వి 1. పరుగెత్తుటయందలి ధ్వని కనుకరణము.

కం. ఒక మొగముగాక దివిజులు, తికమకగొని వైరులెల్ల దిక్కొనఁ దమ్ముం, బికపికలై వకవకలై, లుకలుకఁ బరువెత్తి రోడి లోఁగొనమక్షితిన్. భాగ. 6. 275.

2. పురుగులు దొలుచుటయందగు ధ్వని కనుకరణము.

చం. లుకలుకమస్తకంబుఁ జెవులం గ్రిమిదొల్వఁగ. భల్లా. 2 (శ ర.)

3. తడఁబాటు.

ద్వి. మగకోకిలములు, ముక్కుల ఱెక్కలు మురువుగాఁ దీర్చి, చొక్కంపు తేమావి మదకొమ్మలెక్కి, నెలసి తేఁగొనలెత్తి నెలవులఁ ద్రుంచి. కలిగొన లుకలుకగా నవ్వళించి, ఒసము పిచ్చిలఁ గూర్చి రమణుల కిచ్చి. వన. 1 12 పొ. 4 పం.

జ. లుకలుకలాడు

**లుకలుకలాడు.** అ. క్రి. (√లుకలుక) తడఁబడు. (శ. ర.)

**లుక్కు.** ఏ. అశ్వనీచగతి.

సీ. జంగవడపు నాఁగ జంఘాలగతి యొప్పుఁ బనును లుక్కనఁగ నీచగతిచేరు. అం భా. 2. 198.

ఉ. ఉక్కడమైన మంచి మను వొప్పెడు నా హాయరత్న మెక్కినన్, గక్కసమేమి లేక రవగాలును జోడన యడ్డవెడెముల్, లుక్కుదవాళి జంగనడలుం గమపించుచు బోయి పోయి . . సారంగ 1 82.

**లుగ** వి బాగు. (చూ లుగచెడు)

జ. లుగచెడు

**లుగచెడు.** అ. క్రి (లుగ + చెడు) బాగు తప్పు. (శ. ర.)

**లురనము.** సం. వి అ న (నేలపై) దొర్లుట, (పొర్లుట.)

**లురితము.** సం. విణ (అ. ఆ అ.) దొర్లినది; నేలపైఁ బొర్లినది.

**లుడికీ.** వి. (హిం. లుడ్కా.) కర్ణాభరణము

సీ. యాగపాత్రలు దెచ్చి వకాసుగావడి లుడికీ చిప్పలుగఁ జేసి కేరువారు. సిం నా. 20. (లుడికిచిప్పలు = కర్ణాభరణముగా ఉపయోగించు చిప్పలు.)

**లుడుగు.** వి. ఎద్దు మెడను గట్టు ఒకవిధమగు గంట. (శ. ర.)

**లుప్తపదము.** సం. విణ. (అ. ఆ. అ.) లోపించిన పదములు గలది, కొన్ని పదములు లేనిది

**లుప్తపిండోదకక్రియుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) లోపించిన శ్రాద్ధకర్మగలవాఁడు, ఉత్తర క్రియలు లేనివాఁడు.

**లుప్తప్రతిజ్ఞుఁడు** సం. విణ. (అ ఆ అ) లోపించిన ప్రతిజ్ఞ కలవాఁడు, భ్రష్టప్రతిజ్ఞుఁడు, అడిన మాట తప్పినవాఁడు.

**లుప్తప్రతిభుఁడు.** సం. విణ. (అ. ఆ అ) లోపించిన ప్రతిభగలవాఁడు, నవనవోన్మేషమైన బుద్ధిలేనివాఁడు.

**లుప్తము** సం. విణ. (అ. అ. అ.) 1. ఒగులం గొట్టంబడినది. 2. అతిక్రమింపంబడినది, ఉల్లంఘింపంబడినది 3. నశింపంజేయంబడినది. 4. పోయినది అగోచరమైనది. 5. దోంచుకొనంబడినది, కొల్లపెట్టంబడినది 6. (వ్యాక.) లోపింపంజేయఁబడినది. 7. తీసివేయంబడినది, అప్రద్ధచెయంబడినది. 8. ఉపయోగములోలేనిది, వాడుకలో లేనిది.

వి. అ. న. దోంచుకొనంబడిన సొమ్ము.

**లుప్తోపమ.** సం. వి. అ. స్త్రీ. ఉపమానోపమేయ సమానధర్మవాచకములను వాలుగింటిలోం గొన్ని లోపించిన యుపమాలంకారము.

వ్యతి. పూర్ణోపమ. (చూ. ఉపమ)

**లుప్పెరము.** వి. దెస్తలు కలికెడు పెచ్చరిక పదము

**లుబ్ధకము.** సం. వి. అ. పుం. 1. ఒకానొక నక్షత్రము. 2. వెనుకభాగము.

**లుబ్ధకుఁడు.** సం. వి. అ. పుం. 1. బోయవాఁడు, వేటకాఁడు 2. లోభియైన మనుష్యుఁడు. అత్యాశగలవాఁడు. 3. కాముకుఁడు, విటుఁడు.

**లుబ్ధత్వము** సం. వి. అ. న. లోభిత్వము, పిసినిగొట్టుతనము.

**లుబ్ధుఁడు.** సం. విణ. (అ. అ. అ.) 1. లోభి, అత్యాశగలవాఁడు. 2. కోరికగలవాఁడు, అత్యాసక్తిగలవాఁడు. (ధనలుబ్ధుఁడు మాంసలుబ్ధుడు. గుణలుబ్ధుఁడు. మొ॥)

వి. అ. పుం. 1. వేటకాఁడు. 2. [illegible], చెడువడతగల మనుష్యుఁడు.

**లుభితము.** సం. విణ. (అ. అ. అ.) కలఁపఁబడినది, క్షోభపడినది.

**లులాపము.** సం. వి. అ. పుం. లులాయము, మహిషము, దున్నపోతు.

**లులాయము** సం. వి. అ. పుం. మహిషము, దున్నపోతు.

**లులి.** వి. లోటు, తక్కువ

సీ. తనకు లాగయినవెత్తంబు [illegible] పాసిక దాలించి పాటెటిఁగి, లోపటంబులు మాని లులిఁ గన్నఁ బడకున్నఁ బడదా మడిపోవుఁ బలక యిచ్చి. ఉ. వారి. - 12.

ద్వి. లలియను లులియును లాగును బాగు, వలవును మేవఁ బ్రఖ్యాతి విఖ్యాతి.

పండితా ద్వితీ. 66 పొ.

ఇ. లులివడు, లుల్లిగాఁడు, లుల్లులుకు.

**లులితము.** సం. విణ. (అ. అ. అ.) 1. కదలినది. ఇటు నటు జరిగినది చలించినది.). 2. కంపము నొందినది, తరంగములు గలదిగాఁ జేయఁబడినది. 3. కలఁతపెట్టఁబడినది, నశింపఁజేయఁబడినది. 4. చెదరఁగొట్టఁబడినది, చేపఁబడినది, హాని కలిగింపఁబడినది. 5. కొక్కునది, అందము చుండునది. 7. మార్గాయాసముగలది, బడలినది. 8. సొగసైనది, అందమైనది.

వి. న. కదలిక, చలనము.

**లులివడు** అ. క్రి. (లులి+పడు.) అదమమగు, హీనమగు.

రగడ. పొలంతి నైవపు మాకు నీకయపోటుఁబో లులివడిన కల్లలు. పారి. 4 18.

**లుల్లిగాఁడు.** విణ. (√లులి) కీడ్వడినవాఁడు, అధముఁడు (శ. ర.)

**లుల్లులుకు.** వి (లులి+ఊలుకు). అల్పాంగమునము, చిన్నదముకు.

సం. కఅకరికల్లడంబు కడుఁగట్టిఁడి దెమ్మెర గా. మానగ్రచ్ఛులయొసలారు లుల్లులుకు లాడెడి పీటిచ ఝల్లాఁడు క్రిక్కిఱియుట నాఁ దెనుంగునకు నీయఘయంబు వశిప్రకాశమై, మెఱయంగ విప్రయోగమున మేలమెఱింగి రచింప నేర్చినన్. కావ్యా. 7. 69.

**లుషభము.** సం. వి. అ. పుం. మదపుటేనుఁగు.

## లూ

**లూటి** = లూటీ వి. (హిం. లూటి) 1 దోఁపిడి.

ఉ అడ్డుచుఁ బురస్కరించుకొని యందఱు నాయనతోడఁ గూడ నే, తెంచిరి ఖానువంద నుని తేనియతోఁటకు లూటిచేసి దక్కించు కొనంగ వేళయని కేరుచు దూఱుచుఁ దిట్టి కొట్టి దండించిరి మించి తన్మధువనీపరిపా లకు లడ్డగించినన్. రామా. 7. 9.

శీ. పుట్ట తేనియఁ గ్రోలఁ బోదువు చీమల మెక్కి లూటిగై కొనదు భల్లూకగణము.

చంద్రా 2. 79.

ఉ అవని జేతుఁణల్ జలవిహార మొనర్చుచు దర్ప మొంది యిందీవరపత్రభంగములు దీర్ణతఁ జేయఁగ లూటియే యి దీవరపత్రభంగ ములే నో గొనవేచెనె యంచు దత్సరశ్శ్రీ ... కచించి యంచేఁగొనె వాంల పత్ర ...

చ. రా. 6 56.

2 ఉపద్రవము.

సీ. చెఱయుఁ గొల్లయు లూటి ఓమలో లేకుండ దంచె తేవఁయు శాత్రవులమీఁద నీతి. 90.

3. తప్పుతప్పుడు

పీ. లూటి నా దవుడపుండును దండువయుఁ దోఁచు. (వావిళ్ల ప్రతి పా 'దుడుకును దోఁచు'. ప్రాఁతప్రతి; తాళపత్ర ప్రతిపా. ప్రౌఢతలో రెండు పాఠములు గలవు.)

ఆం భా. 3. 48.

4 దండువు.

వ్యవ. వానికి లూటి వచ్చినది.

5. ఔద్ధత్యము.

సీ. ... దుడుకు లూటి జులుకు దుంప,

గీ. గమ్మవఁగను మద్ధతాఖ్యలౌ ...

పాం. ని. మావ 42.

6. ప్రజరంభ్రమము (శ. ర.)

జ : లూటిసేయు.

**లూటిసేయు.** స. క్రి. (లూటి + చేయు) బాధించు. రగడ. చామవృతవాటిఁ దిరుగఁజాలఁ జాల సొంపుపూని, రాను మమ్ము లూటిసేయ రాకు రాకమూరినమచు. పరాహా 3. 92.

**లూటీ** = లూటి (శ. ర.).

**లూడుపులు** వి బ. చెప్పులు, పాదరక్షలు. (శ. ర.)

**లూత.** సం. వి. ఆ. స్త్రీ 1. సాలెపురుగు. 2. చీమ.

**లూతాతంతువు.** సం వి ఉ పుం సాలెపురుగు పట్టు, సాలెగూడు.

**లూతామర్కటము.** సం వి అ పుం 1. వాలిడి కోఁతి 2 ఒకజాతి మల్లెతీఁగ.

**లూతిక** సం వి ఆ. స్త్రీ సాలెపురుగు.

**లూనకము.** సం. విణ. (అ. ఆ అ) ఖండింపఁ బడినది విడదీయఁబడినది వి. అ న. 1 ఛేద నము, విభాగము. 2. గాయము. 3. రకము, విదము, జాతి ... జంతువు.

**లూనము** సం. విణ. (అ. ఆ. అ) 1. ఖండింపఁ బడినది, తెగ గొట్టఁబడినది, ఛేదింపఁబడినది. 2 కోయఁబడినది (పుష్పాదికి). 3. నశింపఁ జేయఁబడినది. 4. కొఱుకఁబడినది, కొఱికి తినఁ బడినది. 5. గాయపఱుపఁబడినది.

వి. అ. న. తోఁక.

**లూమము.** సం. వి. అ. న. తోఁక.

**లూమవిషము.** సం. వి. అ పుం. (తోఁకను విషముగలది.) వృశ్చికము, తేలు.

**లూలామూలము.** వి. 1. వంచన, మోసము.

కం. ఆలాగునఁ గొనిపోయి న్నృపాలప్రియయపాన్పు క్రిందఁ దాదుక లిడి యా, లూలామూలపు నాలి గయ్యాళి తనుం గానిదానియటువలె నుండెన్. సాం. క. 2. 186.

కం. లూలామూలాలమాటలు, చాలు నవిన వలికి తనవిఱుంబగురూపం, బాలోనఁ దెలుపవలె వని, నీలగ్రీవుండు నిటలనేత్రముఁ జూపెన్. కాశ. 3. 170.

2. చేష్టాభేదము.

ద్వి. అల్లమ విని వవ్వి యానౌను మాయ. కల్ల సత్త్వంబులు కపటకృత్యంబు, అటవటంబులును లాలామాలములును, కుటిల కుత్సితములు ... చిమూరములు, మటుమాయతనములు మందు మ్రాకులును, నటమటంబులును మున్నైన చైదములు.

ప్రభులిం 2. 50 పా. 8 పం.

## లె

లెంక = లేఁక. వి 1. యోధుఁడు.

సీ .. గీ. ... భటుఁడు పరఁగు జోదన లెంకన బంటనంగ ... ఆం. భా. 2. 184.

సీ నీటార నెదిరిన నేలజేజేదంట తెకెల్ల నడఁచిన దిట్ట లెంక. అచ్చ. రా. అయో. 93.

రగడ. ... అలఘు బలసంపన్నులగు లెంక నాయకులు వి. శకుం. 2. 225.

కం. ... అడరెడు లెంకలకు మున్న యతిరయము వనే ... దశకు. 12. 88.

2. (క. లెంక) పరిచారకుఁడు.

గీ వాకు ముయ్యేడుతరములనాటనుండి. లెంక వీవన తొద్దుఁ దహంకరించి ..

ప్రబోధ. 3. 27.

ఉ లెంకఁగ నేలుకోగలదు లే మగనిం దరితీపు నేసి.

విజ. వి. 3. 34.

జ : లెంకకాఁడు.

లెంకకాఁడు వి (లెంక + కాఁడు స్వార్థమున) సేవకుడు, పరిచారకుఁడు

ద్వి. కల్లినాథుని లెంకకాఁ డితఁ డనంగ.

పండితా. దీక్షా. 84 పు.

లెంగి. వి సేవకుఁడు, దాసుఁడు (దీనికి శైవ గ్రంథములందే ప్రయోగము కన్పడుచున్నది)

ద్వి బసవన్న లెంక నే బసవన్న లెంగి.

పండితా. దీక్షా. 4 పొ.

ద్వి. జంగమలింగంబు చనఁజూచి చూచి, వెంగలి కూడునే లెంగిగాఁ దలఁప.

పండితా. పురా. 95 పొ.

విశే. క్షుద్రుఁడు, నీచుఁడు

ద్వి సంగతి లింగప్రసాదైకసుఖులు, లెంగి మనుష్యుల యెగిల్లు దింద్రె.

పండితా. మహిమ. 298 పొ.

ద్వి లింగవంతులుగాని లెంగుల కతని, యంగణాంతరమున కరుగరా దనుచు.

బస పు. 2. 599 పం.

ద్వి. లింగవంతులుగాని లెంగుల కీర్వ, రాంగణమ్మున కెట్టు లరుదేరవచ్చు.

బస. పు. 3. 396 పం.

లెంగిలి విశే. ప్రియమైనవాఁడు, ఇష్టుఁడు.

ద్వి. . సుఖలీలఁ జనివట్టి యశియ, దంగుళి మారయ్య లెంగిలి బంట.

బస. పు. 4. 972. పం.

లెంట. వి. పట్టికము, ఒకదినుసు తెల్లజాయి.

లెంప. వి. 1. చెంప (శ. ర.).

(వ్యవ.) కాఁబులు ప్రేలిన లెంపలు వాయింతురు.

2. ప్రక్క (శ. ర., బ్రౌ.).

జ · లెంపకాయ.

లెంపకాయ. వి. (√లెంప) చెంపదెబ్బ.

(శ. ర., వా.)

లెంబి = లంబి. వి. కుటుంబము. (శ. ర.)

లెక్క. వి. (సం. లేఖా క. లెక్క) 1. సంఖ్య

అ. లెక్క కెక్కుడైన మిక్కిలిసిరి గల్గి, నెన్ని కోట్లపడగ లెత్తరామి, నపరిమిత ధనంబులను ప్రాలి పడగలు, గట్టు వైశ్యజనముపట్టణమున.

విక్ర. 1. 75.

ఆ లెక్క కెక్కుడైన రొక్కంబుఁ దఱుగని కొలుచుగలదు ప్రోలికోమటులకు

నీలా. 1. 37.

గీ. మీలు తామరపూలు క్రొమ్మెఱుఁగుచాలు. తరుణమృగి నేలు తరుణి నేత్రముల డాలు, తొమ్మిదవలెక్క ప్రాలు వీర్డోయి మేలు, పలుకుల హొరంగు కపురంపుఁ బలుకెనంగు.

కృష్ణ. 4 59.

2. అంకె

గీ. పదియు నెనిమిది విద్యలీ పద్మనయన, శ్రవణములఁ బెట వర్ణమర్థము గ్రహించె, నంత రతిశృంగారగంధిచేత యిచ్ఛ లేఖ, యదిగదా వీనులందుఁ దొమ్మిదవలెక్క.

నైష. 3. 184.

చం. జలరుహగంధి వీనుల పసల్ నవసంఖ్య నదేమి లెక్కనున్ ... విజ వి. 1. 73.

3. గణితము.

సీ. ... గణితంబు లెక్క నాఁగన దనర్చు.

ఆం భా 2. 188

(వ్యవ.) ఈతఁడు లెక్కలలో గొప్పవాఁడు లెక్కల పాత్రము.

4 చొప్పు, వంతు.

కం. నిజసుతు లంతకు దేవకి నిఖల దేవతాంశము దనకేర్పడ నేఁట నొకని లెక్కను, గొడుకుల నెనమండ్ర నొక్క కూతుం గనియెన భాగ. 10. పూ. 44.

గీ. ఇఁక మూఁడేండ్లకునుగాని యేఁజనింప, నన్ని దివసములు దిన మొక్కయావు లెక్క, ధరణి దేవోత్తములకును దానమొసఁగు, మట్ల యైన నాకునయము గలుగు.

వి. పు. 6 320.

5. ధనము, సొమ్ము.

ద్వి. కాటిపావనికెల కరుణ నీమీఁద, లేకున్న నాకిచ్చు లెక్కకుఁ జెల్లుఁ,గై కొందు నిమ్మ నీకట్టనమినుడు

ద్వి. సారిశ్చ. ఉ. 2186. పం.

మ. నదలెన్ ఖానుఁడు పక్షినుంబనకు వైశ్యా పూఁటకూటింటికిన్, గుడునంబోదమె లెక్క యిచ్చి కడు నాఁకొన్నారమిప్పట్టునన్

క్రీడా 155.

గీ. ఒకతె గ్రోలియు మైరేయ మొల్ల లెక్క, మరల నిమ్మని దాని వేమరును గవలె.

శుక. 1. 120.

6. పద్దు, ఆయవ్యయపట్టిక.

ఉ. ఇట్టొనఁగూర్చి వైశ్యునకు నిచ్చి చన వడ్డి ఇచ్చి, చోకముల్ వెట్టుచు .. వడ్డి లెక్క లటు పెట్టుచు ... ఆము 6. 70.

సీ. కొలుచువారింట నోరు గొట్టి లెక్కలు వ్రాసి హరువుమీఱఁగ మణియములు చేసి.

శుక. 3 375.

సీ. లెక్కలు లిఖయింప లేఖకాధికుఁడు పాం గావింపఁ బావకుండు. కాశీ 6. 128.

7. లక్ష్యము.

గీ. ఇతరదుర్బలమృగపంక్తు లేమి లెక్క.

మనుచ 4 64.

సీ ... అస్త్రములకుఁ, గీ. ప్రాణములు వెచ్చ వెట్టక బ్రతికిపోవ, లేఁ డకట నాకు నరుఁ డేమి లెక్కయనుచు. రాఘవ. 4. 328.

జ : లెక్కకాఁడు, లెక్కకుమిగులు, లెక్క గొను, లెక్కసేయు, లెక్కించు, లెక్క డు.

లెక్కకాఁడు. వి. (లెక్క + కాఁడు గణకుఁడు లెక్కలు వ్రాయువాఁడు

సీ పైలెక్కకాండ్రను బైకొన్న పోషించు లెంక విశ్వాసంబు బొంకుజేసి.

హ్వా. 11. 98.

లెక్కకుమిగులు. అ. క్రి. (లెక్కకున్ + మిగులు) లెక్కకు మిక్కుటమగు, అసంఖ్యమగు.

చం. ముగురును నాకుఁ జూడఁగఁ ద్రిమూర్తులు తప్పదు లేదు మహిమున్, బిగరున నొక్కఁడె త్తుక నవెు నేఁగుట యెట్లు లెక్క కున్, మిగిలిన నొక్కఁడు మవామించి పచుట యెట్లు ... జై. భా 5 43.

లెక్కగొను. స. క్రి. (లెక్క + కొను) లక్ష్య పెట్టు.

కం. చక్రధరు లెక్కగొనఁడు ప.రాక్రమనిధి యర్జునునకు రాధేయ సుతాగ్రిమను మెదు రుగఁ గొని ... భార. 1. 319.

కం. లెక్కగొన వరుఁ గృష్ణుని, మక్కువఁగ బిగించి మూర్ఛనొందించ ధరన్, గ్రక్కదల వైచి హయము, న్జొక్కవఁ గొనిపోయి జన కునిం గని మ్రొక్కెన్. జై. భా. 7. 190.

గీ తాఁకి బెడిదంపు ములుకులు దఱుచునింప, వక్కడిఁదిజోదువాఁడని లెక్కగొనక, వాని తేరును మావుల నొనడంచి, యడరుటయు వాఁడు చంపునఁ బడమి కుఱికి.
అచ్చ. రా. యు. 866.

**లెక్క(లు)వెట్టు.** స. క్రి. (లెక్క + పెట్టు)
1. ఎంచు, గణించు.

గీ మృడునిచే నిట్లు కోపానఁబడి కలఁగి, గంగ దరినుండి నిజశిష్యగణముతోడ మద్గురు స్వామి సకలధర్మజ్ఞుఁ డపుడు, పృథివిఁగల తీర్థముల లెక్కవెట్టిచూచి భీమ. 2. 3.

(ఇట వరుసగా అని భావము.)

సీ కాలంబుకొలఁది లెక్కలు వెట్టనేరక చిత్రగుప్తాదులు చిక్కువడిరి కాశీ. 1 137.

శా శ్రీశైలంబున సేతుబంధమునఁ గాంచింగుంభకోణంబునన్, గాశిన్ ముందరఁ గాళహస్తి నిఁక లెక్కల్వెట్టఁగానేల నానాశైవస్థలులన్ వసించితిమి కాంతా నిన్నుఁ బోలంగ రా, కాశీతాంశునిభాస్యలం గనము లోకఖ్యాతశీలంబునన్. వరాహ 6. 18.

2 లక్ష్యముచేయు.

శా. నానారండలు గూడ యొక్కమొగమై నానాస్త్రసంతానముల్, నైవన్ వారల లెక్కఁబెట్టక ప్రభావస్ఫూర్తి శోభిల్లఁగా, వేవేగంబున శంక మొత్తిన భయావిద్ధాంతులై పాఱ .. చిత్రభా 5. 99.

**లెక్కసేయు** స క్రి (లెక్క + చేయు.) 1 లెక్కపెట్టు, గణించు.

ఉ. ఎందఱురాజు లీయవని నేలినవారిఁక నేల నున్నవా, రెందఱు లెక్కసేయఁ దరమే పరమేష్ఠికినైన ... కవిరా. 1. 131.

2. లక్ష్యపెట్టు

చం సకలుఁడు కాలకూటసహజన్ము సుధాకరుఁ డంద్రుడు నిక్కమౌ, నోకో యుదియంచు నోసితమయూఖ నిను దెలియంగఁగోరి యూరక యటు చేరినంతఁ దలప్రాణము తోఁకకువచ్చె లెక్కసేయక తిగమ్రింగెనేని యకటా యలరాహువు మన్కి గాంచునే.
సారంగ. 2. 174.

చం. వరుఁడని లెక్కసేయఁడు మనంబున శాత్రవ వమ్మపోతున్మచే, యురణముఁ బెక్కుచోట్లఁ గనియున్ మననాయకుఁ డేమిచెప్ప ...
రాఘవ. 4. 192.

**లెక్కించు.** స. క్రి (√లెక్క) 1. ఎంచు, లెక్కపెట్టు.

సీ. కూడి జలక్రీడ లాడుచోఁగడఁగి యా ధృతరాష్ట్రతనయుల నతులశక్తి, లెక్కించియుఁ బడంత్ర నొక్కొక్క భుజమున ...
భార ఆది 5. 166.

గీ ... క్రింద గెలిచిన వ్రాలు లెక్కింపు మనక, తప్పనాడక తొల్లింటి దారిచెడక
ఉ హరి 3. 124.

2. ఎంచిచూచు, విమర్శించు.

ద్వి కావున రాఘవజ్యాపాలమణికి, తే వసాధ్యంబులు లెక్కింప నెందు.
రం. రా కిష్కిం. 200 పు. 20 పం.

ద్వి లెక్కింప నపకీర్తిలేనిజీవనము, నిక్కంబుగా నొక్క నిముసంబు చాలు.
ద్వి. హరిశ్చ. ఉ 227 పం.

3. లక్ష్యపెట్టు.

కం. ఎక్కడిమగఁ డెక్కడి సఖు, లెక్కడి నీయత్తమామ లెక్కడి చుట్టా, లిక్కాలఁది దొడ్డ కొంచెము, లెక్కింపకు మరునిపోవశిం బడువేళన్. హంస. 1. 101.

4 ఆరోపించు.

గీ. పొత్తుగా నాడి యోటమి పొత్తువారి, మీఁద లెక్కించి వంచన మెఱయువారు.
దశకు. 5. 65.

**లెక్కిడు** స. క్రి. (లెక్క + ఇడు) లెక్కపెట్టు, గణించు.

కం. ... మునుకొని లెక్కిడని జపము ముఖ్యం బగునే. విక్ర. 5. 83.

**లెప్ప** = **లెప్పము**[1]. వి. (క. లెప్ప) లక్ష్యము, (శ. ని., శ. ర.)

సీ. ... లెప్ప యనంగ గుఱి యనఁగ బతవ లక్ష్యాభిధానంబు ... ఆం. భా. 2. 212

**లెప్పము**[1] = లెప్ప. వి. లక్ష్యము, గుఱి

కం. మీ పుష్పగంధి నెయ్యపుఁ, జూపులకును లెప్పమైన సుకుమారవపు, ర్శ్రీ పెంపునఁ దనరిన వసు, ధాపతిసుతుసఖుఁడ నింద్రదత్తాహ్వయుఁడన్. భోజరా. 3. 240.

కం. అప్పుడు నరపతి యిప్పటి, యప్పడఁతుకకెందుఁ బోయె నాశ్చర్యం బీ, చొప్పు కలయొ నిజమొ యనుచు, లెప్పంబయ్యెను మదనుశిలీముఖములకున్.

కేయూర. 4. 24.

ద్వి. అభిముఖుండై హృదయాబ్జకర్ణికను, లెప్ప మౌ దన ప్రాణలింగంబు నెజ్జ, నుప్పరించుదు తత్తియోరులింగంబు.

పండితా దీక్షా 59 పు.

**లెప్పము**[2]. వి. (సం. లేపః) సున్నము మొదలగు వాని పూఁత.

సీ. ఆయతశ్వేతరుఁ డంత నతిరమ్యమైన యా లెప్పంపుఁ బూఁబోఁడి యొప్పు చూచి.

కళా. 8. 169.

**లెమ్మ** = లే[3]. అవ్య. 1. తర్జించుట (ఇది మొదలు లేచు ధాతు ప్రార్థనావ్యర్థక రూపమయ్యెను క్రమముగా అవ్యయముగా మారినది )

మానినీవృత్తము అంతమదింపకువేయని పల్కిన నంతమదింపకువే యనుచున్, గంతు లడంచెద లెమ్మని పల్కి నగంతు లడంచెద లెమ్మనుచున్. కళా. 3. 195.

2. కానిమ్ము, కానీ. (పక్షాంతరాంగీకారమును దెలుపును.)

మ. ఇది భోజాత్మజ కిచ్చినం గినుకతో నేమంచు నూహించునో, మది సాత్రాజితి దానికే నిపుడు ప్రేమం బంపివన్ దీని నెల్లి దమంచేసినజాడ దోచునో కో యా మెచ్చిందు నేమనిక్కఁ జెల్లదువో యేరికిఁ బంపఁగా ననుచు లీలన్ రుక్మిణీకాంతకున్. పారి 1 54

**లెయ్యంబు**. వి. (సం. స్నేహః) నెయ్యము, స్నేహము.

గీ. పాలు నేయును గూడినభంగివోలె, నొనరి లెయ్యంబుతోఁ గూడియున్న భటుడు ... కు. సం. 11. 623.

**లెన్స**. వి. 1. క్షేమము, కుశలము.

మ. చెలువంబె విను వీటి నీటరులకున్ జేజేలకున్ లెన్సయే ... చం. రా. 2. 20.

ద్వి. నీ లెన్స నా లెన్స నీకైవలేమి, నాలేమి గాన నానావిధంబులను.

రం రా. అయో. 69 పు 16 పం.

గీ. ... అమ్మ కుశలంబె సాధ్వి యనామయంబె దేవి భద్రంబె లెన్సలా పూవుఁబోడి ...

కాశీ. 2. 71.

గీ. క్షేమ మగు లగ్గు లెన్స మేల్ నేమ మనఁగ. ఆం. భా 1. 98.

2. మేలు.

గీ. పసిఁడిమృగము నిక్కంబైనఁ బట్టి తెచ్చి, జనకసుతకోర్కి దీర్చెద నమ్మెదమున, లేక మాయామృగంబైన లీలఁ ద్రుంచి, హిత మొనర్చెద మునులకు నెట్లు లెన్స.

భా. రా. అర 2. 44.

గీ. ఎఱిఁగినవి నాల్గు నొడువ నేమయిన లెన్స

అము. 4. 68.

3. మంచిపని, యుక్తకార్యము

కం. ఆలోకదాన మన భూ, పాల పరగు దీప మీగి భావము సద్ధర్మాలోకనశీలం బగు, నా లెన్స యొనర్చినట్టి యతనికి నధిపా

భార అను. 4. 18.

విశ. 1. క్షేమయుక్తము

సీ. వేదసంచోదిత విప్రకర్మంబులు లెన్సలయ్యెడు నవి లేకయున్నఁ జెడియెడు

లెస్సైనఁ జెడినను రాజున కగుఁ బుణ్య
పాపంబు లగ్గలములు.
భార. శాం. 1. 275.

గీ. .. లెస్సయుండునె గృహకర్తలేనిబ్రతుకు.
మనుచ. 3. 129

సీ ఎంతలెస్సగనున్న నంతవేడుకె కాని ప్రజల
కల్మికనూయపడుటలేదు.
విజ. వి. 1. 22.

2 యుక్తము, మంచిది

ఉ. ... తల్లి వినవమ్మ యీ జగములెల్ల సృజింప
భరింపనొంపఁ జా, ద్దేవత లెట్లు వర్తిలిన లెస్స
వుగా శివి చెల్ల వేరికిన్.
సారంగ. 2. 120.

చం. ... విభేదవృత్తి నా,మనమున లేదు పాండవ
సమాజము మీరును నొక్కరూప కా,వున
నిది లెస్సమాట దగవుం దలపోయఁగ ..
భార. ఉద్యో 1. 97.

3 రుచ్యము రుచిగలది.

సీ. లెస్సాయెఁగా కదళీశాకపాకముల్ మఱి
హరించెనె దా మనసు గినసు.
రా. వి. 2. 105.

కం చక్కెర గలుపుక తింటే, ముక్కినతవుకైన
లెస్స మోహముగలచో, వెక్కురుజాణిన
యైవన్, మక్కువతో దివ్యభామ మహిలో
వేమా. వేమ. 2. 55.

4. శ్రేష్ఠము, ఉత్తమము

చం. ప్రియ మెనఁగం దగం బిలిచి పెట్టెడుకూడది
లెస్సకూడు... భార. ఉద్యో. 3. 222.

కం. అనుటయు వైశంపాయనుఁ, డనఘా లెస్స
కథ యడిగి తచ్యుతశుభలాం, ఛనామధామ
మాత్మ్యం, గొనియాడి ...
హరి. ఉ. 5. 103.

ఆ. దేశభాషలందుఁ దెలుఁగు లెస్స.
ఆము. 1. 15.

5. సులభము, సుఖప్రాప్యము.

కం. జ్ఞానమ యింధనముగ వి,జ్ఞానాగ్నిం బ్రబలఁ
జేయ జరయు మరణమున్ నానావిధదుఃఖం,
బులు, లేని యమృత మహరంబు లెస్స
తోఁచున్. భార. శాం 4. 317.

6. అనుకూలము.

గీ, మనువు లెస్సయియుండెఁబో మానవపతికి.
హర 4. 28.

క్రి. వి. చక్కఁగా.

ఉ కావక రాజుచిత్తము వకావకలై తెగఁ
జూమవట్టు లా, వా విపరీతమైన పలుకాడెద
నంటివి ము న్వినాశకా,లే విపరీతబుద్ధి
యని లెస్స బయల్పడఁ జెప్పినారెకా, నీ
విధి యాడుమీ యనఁగ నీవిధి నాడెదు
సుమ్ము భామినీ సారంగ. 2. 142.

ఉ. అంచు వతండు వల్క దరహాసతఁ జెక్కిలి
గొట్టి లెస్స పం,డించితివోయి చానరి ...
ఆము. 6. 40.

కం అనిన న్మఱియుం జదివిం,చినయట్ల నె
చదువ లెస్స శిక్షింపక చె,ప్పినరీతిఁ జదువఁ
డని .. దశా. 4. 148.

అవ్య. ప్రశంసార్థకము.

చం. ... లంచమిచ్చి వే, పిలిచి తలార్లచేత నని
పించిన దిట్టుల నీకు వాళముల్. దెలియక
వెట్టిరాజ యిది లెస్సనిజం బని నమ్మి
నాఁడవే. సారంగ. 3. 207.

(ఇట వ్యతిరేకలక్షణచే నిందార్థకము)

చం. వికవికనవ్వి యక్కపట విప్రకుమారుఁడు
మేలు లెస్స వా,నికి నయి రాగబంధమును
నిల్పె మదిం దరళాయతాక్షి ...
హర. 4. 27.

సీ. ... ఒగి లెస్స యనఁగ సాధూక్తి దనరు.
ఆం. భా. 3. 67.

జ : లెస్సఁదనము, లెస్సవాఁడు.

**లెస్సఁదనము.** వి. (లెస్స + తనము) మంచి
తనము, యోగ్యత.

కం. బాలసఖుండవు నాకును, నీ లెస్సఁదనంబు
వేము నీతివిడిచి దు,శ్శీలురమగుటయు శైశవ,
లీల మొదలుగాఁగ మును దెలియదే నీకున్.
భార. ఉద్యో. 1. 578.

**తెన్నవాఁడు.** విణ. (తెన్న + వాఁడు) యోగ్యుఁడు.
కం. నిను తెన్నవానిగాఁగన్, వినినాఁడంగావ శాణువిభవము సర్వంబును నీకిచ్చితిఁ జిర జీవనసౌఖ్యము నొందు మనుంవర యని నెమ్మిన్. హరి ఉ. 8. 240.

# లే

**లే¹.** అ. క్రి. కలుగుధాతువునకు వ్యతిరేకమున ప్రాయికముగా వచ్చు ఆదేశము.
ఉదా : లేఁడు, లేరు, లేదు, లేక. లేవడి.
(లేనిదియగు, లేనివాఁడగు)

గీ. .... నీవును ముష్టువోలె, నిలువరింపంగఁ దగినాఁడు నిలుపులేవ .. భార ద్రో. 5. 326.

మ. అలనా యేటికి .... వలలేఁడుం గృపలేఁడు కీచకులు దుర్వారంబు లెట్లో కదే ... భాగ. 10 పూ. 1129.

ఉ. ఎవ్వతె వీవు భీకవారిణేక్షణ యొంటిఁ జరించె దోటలే, కివ్వనభూమి భూసురుఁడ నేఁ బ్రవరాఖ్యుఁడఁ ద్రోవ తప్పితిన్, గ్రొవ్వున నివ్వనగాగ్రమునకున్ ఒనుదెంచి పురంబు జేర నిం,కెవ్విదిగాంతుఁ దెల్పఁ గదవే తెరువెద్ది శుభంబు నీకగున్. మనుచే. 2. 39.

(ఉండదు. ఉండఁడు)
కం. కలహాలెల్లను మగిసెం, కలిగియు లేఁడయ్యెఁ గులతకర్ణుఁడు వీరిం, దెలుపుదు నీ .. భారా అర 7. 93.

చం ... సంగరమున లేరు హాంసడిభకప్రతివీరు లనఁగఁ బొంగుచున్. ఉ. హరి. 4 17.

ఉ స్వామిహితంబునన్ సమదశాత్రవభంజన శక్తి బంధురజూమహానీయసంపద వసంత సమాగమ పుల్లమల్లికా, స్తోమ తుషార పాండుర యశోగరిమంబున ధర్మశీలతన్, మామిడిమంత్రిఁ బోల మతి మంత్రులులేరు వసుంధరాస్థలిన్. నైష. 1. 24.

కం. ప్రేమానుబంధ మిరవుఁ, కేమాగ్రమునఁ గొదువ లేదుఁడీ యనివట్లా, భూమిసురు లవ్వరు నకు. వామాక్షికిఁ గొండుముడులు వైచిరి వేడ్కన్. (లేదు + చుఁడీ. ఈ. ఇట చు లోపము.) ఇందు. 6. 58.

సీ. గుణము వికారంబుఁ గోరికయును లేని నీవలన జగంబు నెట్టజనించుఁ, బ్రబ్బులేదగువంచుఁ బలుకుట దప్పుగాదు ... భాగ. 10. పూ 128.

సీ. ... నిందాభినుతులు, హింసయు నాత్మ ప్రశంసయులేవు భూతంబులయందెల్ల దయ ఘటిల్లు. భార శాం 5. 228.

చం .. ఉమ్మలికయు మబ్బు నాదుమది ముందున కైనను లేదు వాసవా. భార శాం. 4. 394.

కం. తమ్ముఁ దవతమ్ముఁలను నావన్నకొడుకులట్ల తలఁతుఁగాని విభేదం, బెన్నఁడు నామది లేమికి. వెన్నుఁడ దైవంబసాక్షి వినుము నలి కెదన్. భార. ఉద్యో. 3. 193.

(మధ్యమపురుషక్రియ యనుప్రయుక్తమియు చాలదు, ఓపదు, చాలఁడు, ఓపఁడు అను నర్థము నిచ్చును.)

కం. పాపంబుఁ బుణ్యమును ద్రష్టాపరులకు దుఃఖ సౌఖ్యసంపాదు లగున్. భూపాల విన్నష్టులు కారేవు లగుట వారు ప్రాపించరేవా ఫలముల్. భార. అను 1. 145.

చం. అయోధ్యలోకములు నాగరణంబు ప్రచారణంబుగాఁ, గలుగ నుపాధిభేదము గాఢ మతి న్నిగమూడతైన విద్యలు పదునాలు గిటికి నశం బొనరించెఁ బశుత్వపూర్వము, దెలియగలేము గుణమును దీనికి నెమ్మెమ్మెయిఁ జరచ్చేసివన్. నైష 1. 45.

గీ. నెలఁతకుచకుంభయుగళము డియు వియోగ, జలధి యీదింపలేదయ్యె సఖులు నంచు, చున్న పన్నిట వెల్లిలోఁ గొన్నకతన, ము పకది లాఘ వమునఁ దేలింపఁగలదె ఆము 5. 151.

వ ౹క్రి. పొందకుండు.

ఆ. కర్మఫలములేదు కర్మఫలాప్తికిఁ, గారణంబు విధియుఁ గాదనంగ, నెంత యొకులకలేనె యార్త్రనై విధిచెద్దు, కలిసిపలికితిం బ్రియంబు దప్పి. భార. అర 1. 281.

ఎంతకులేడు = ఎంతకు సమర్థుఁడుకాఁడు.

ఉ. ఎంతకులేడు నారదమునీంద్రుఁడు శౌరి వినంగ రుక్మిణీ,కాంత వినంగ నేను వినఁగాఁ బలికెన్ బలికెఁగూర్చుచావ నా, యంతటివారు లేరని... పారి 1. 60.

పొట్టకులేక = తిండికిలేక.

ఉ ఎట్టిపురాణముల్ పదియునెన్మిది జెప్పితి వెట్టు పొట్ట కులేక తిట్టెదవు పుణ్యగుణం బల రాశిఁ గాశికన్ కాశీ. 7. 192.

లేనివాఁడు = దరిద్రుఁడు.

ఆ. కంబుకంఠి నీవు కలవాఁడు గలవాఁడు, లేని వాఁడు నీవు లేనివాఁడు. కాశీ. 3. 47.

సా కలవాఁడు గాదె తీయునప్పటికి లేనివాని ప్రాణము పోయినది.

జ : లేనది

లే² విశ. లేఁత శబ్దము యొక్క యుపక్షేప రూపము. ఉదా . లేఁగొమ్మ, లేఁబచ్చిక, లేమావి, మొ॥ (చూ. లేఁత.)

౹క్రి. విశ. అల్పముగా.

ద్వి లీలఁ బయ్యెదకొంగు లే జాఱవై చి.

ద్వి. పరు. 4. 294

లే³ = లెమ్ము 1. నిశ్చయమును దెలుపును.

రగడ లేను జాదివప్పు మొగ్గ లేదులే దురాశ గాని, చాయవృక్షవాటిఁ దిరగఁజాలఁ జాలు సొలపుమాని. వరాహ. 8. 92.

ఉ లెంకఁగ నేలుకోఁగలదులే మగనిం దిరిలీపు చేసి ... విజ. వి. 3. 34.

2. పరిహాసమును దెలుపును.

సీ. చెలి పెండ్లికతఁ జెప్పఁ జెవి యొగ్గి వినవేమి కలదులే యని గేలిసలిపె భద్ర.

విజ. వి. 3. 28.

3 అనాదరమును దెలుపును.

మ. శివలింగార్చన మెందుఁబోయెడుఁ దపస్విత్వమ్ము నెందే నుపద్రవముం బొందదు లే ... హర. 7. 65.

దండకము ... జీవింప,బోరామిఁ గావింపఁగా రాదులే కాదులే వాదులేలా ..

భోగినీదండకము.

ఆ ఈనుబుద్ధిమాట లెంతలేయని పోయె, దీను బుద్ధి నిడుఁజూమీ లతాంగి.

సారంగ. 2 24.

లేండము. సం. వి. అ. న. మూత్రము, పరీషము, మలము.

లేఁక = లెంక. వి. 1. సేవకుఁడు.

గి లేకయుండిన వినివి యా లేఁకలు.

అచ్చ రా. యు. 227 (వ. ఁ. పా )

గి. లేవకుండిన వినివి యా లెంక లప్పుడు.

మద్రి. పా.

లేఁగ వి. (లేఁత + కానుపు) క్రొత్తగాఁగలిగిన దూడ, తర్ణకము, దూడ, వత్సము.

(ఇది కొన్ని పట్ల వృత్తియందు ఔపవిభక్తిక ముగా కన్పడుచున్నది. చూ లేఁగటిపడ్డ)

గి ... తనరు లేఁగ యనంగఁ దర్ణకంబు.

ఆం. భా. 2. 262.

కం. ఒకనాఁడు గో వొకటి లేఁగకుఁ జన్నిచ్చు చును దానిఁ గనుఁగొని ...

భార. అను 3. 85.

ద్వి లేఁగలఁ బుడుకుచు లీలఁ గేతయ్య, మూఁగి యర్చుచు మేఁత ముట్టకుండుటయు ...

బస. పు. 7. 625.

చం. ఇది యొకమంచిలేఁగ వినుఁ డెంతయు నొప్పెడు నంచు దాన తత్పదములు దోఁకయుం బిగియఁబట్టి చెలంగి వెలంగ మ్రానితో, బదియఁగ నొక్క పెట్టుగొని చంపెఁ గుమారుఁడు లేఁగరక్కసుం, గుదలుకొనంగ బాలకులు కోయని యార్వ నఖర్వలీలతో. భాగ. 10. పూ. 435.

లేఁగంపు. వి (లేఁత + కంపు) కొంచెము పరిమళము

ద్వి తుమ్మెదల్ వెమ్మి వాతులు దొల్చితొల్చి
కమ్మనిలేగంపు గవియునో యనుచు
పండితా. పురా. 90 పా

లేఁగటా(టియా)వు. వి. (√లేఁగ) లేఁతదూడ గల యావు, ధేనువు

గీ. పేరుకొని లేఁగటావులఁ బిలిచిపిలిచి, పిచ్చలించుచు, గ్రేపుల విడుచువాని ...
వి. పు. 7 337.

చం పనుపడు లేఁగటాలసిరిఁ జాయని యిండుల దొడ్డి మందలం దనియఁగ జూపెదన్ ....
చెన్న. 3. 73.

లేఁగపెపడ్డ. వి. (లేఁగ+పడ్డ) క్రొత్తగా యీనిన ఆవుపెయ్య.

ద్వి ... ఓడక, గొడ్డును లేఁగటిపడ్డయై యపుడ. గడ్డుగ నిండారఁగాఁ బాలు గురిసె.
పండితా. పురా. 188 పా.

లేఁగవును = లేఁగౌను. వి. (లేఁత + కవును) సన్నని నడుము.

చం. చెదరిన ముంగురుల్ తఱుచు చెమ్మటఁ దోఁగిన తళ్కుఁ జెక్కులున్, వదలినకప్పుఁ గొప్పు పసివాడిన మేనొకయింతజాఱుప, య్యెద యసియాడు లేగవును నిట్టటుఁ దొట్రిలు పద్మయుంబుఁ జెల్లొదవెడి యూర్పులుం గల తలోదరిఁ గన్గొని రాముఁ డిట్లనున్. ఉ రా. 6. 65.

లేఁగసవు. వి. (లేఁత+కసవు) బాలతృణము (వృ. వి.). (శ. ర.)

లేఁగారము. వి. (లేఁత + కారము) కొలఁదికారము, అల్పమైన కారము.

సీ. కమ్మవీడెంపు లేఁగా రంబుగల మోవి కండ చక్కెరపానకంబు లిచ్చి. వాల్మీ. 2. 79

లేఁగౌను = లేఁగవును వి. (లేఁత + కౌను) సన్నని నడుము.

కం. లేఁగౌఁదీఁగె నితంబము, వ్రేఁగునఁ ద్రెవ్వుటయుఁ గని విరించి బిగింపన్.
ఆము. 5. 28.

సీ. కృశదైన్యజాతి వర్ధిలు నిటులనురీతిఁ గలకంఠి లేఁగౌను బలితమయ్యె.
ఉ రా. 2. 137.

లేఁచిగు(వు)రు. (లేత+చిగురు) మృదుపల్లవము.

సీ. కొమ్మ లేఁచిగురాకుఁ గెమ్మోవి చవిగొని యమృతంబు నీరసమని తలంతు
శుక. 3. 48.

లేఁజూపు. వి. (లేఁత + చూపు) మృదువైన చూపు.

గీ దమ్మికేలుండఁ బెర కేల డండయిచ్చు, లేము లుడిపెడు లేఁజూపు లేమతోడ
ఆము. 1. 12.

లేఁజెక్కులు. వి. (లేఁత + చెక్కులు) కోమలములగు కపోలములు.

సీ. తొలిచూలి జవరాలి తళుకులేఁజెక్కు టద్దములతోఁ దులఁదూఁగు దంతరుచులు.
దశా. 2. 229.

లేఁజెమరు. వి. (లేఁత+చెమరు) చిఱుచెమట

చం అలికుల వేణియొక్కతె లతాంతమునం దవయంగవల్లికన్. బులకలుచొక్క లేఁజెమరు పుట్టఁగ నేగి నరేంద్రుఁజూడ నా ఫలకలు చొక్క లేఁజెమ ఱుఁ బోవక యిట్టులనుండె.
మనుచ. 5 66.

లేఁజెఱకు. వి. (లేఁత + చెఱకు) కోమలమగు చెఱకు, పిపుగల చెఱకు.

కం. చిలుకల తేరును గోకిల, బలములు లేఁజెఱకువిల్లుఁ బ్రసవాస్త్రములున్, దొలఁగించిన మరుఁడో యన, విలసితగతి నిప్పు రాజవీథిఁ జరింపన్ శుక. 1. 121.

లేఁత విశే. 1. పసి, తరుణము. (దీనికి తరుణమైన అనియే యర్థమైనను వ్యుత్పత్తియందు కొంచెము, చిన్న, తిన్న. తేలిక, పలుచ, మెత్త, సన్న

మున్నగు వనేకార్థములు వచ్చును వృత్తియందు దీని మొదటివర్ణముమాత్రము శేషించును. అవు డుత్తరపదము పరుషాదియగునేని దీనికి నుగాగమంబడును

ఉదా: లేఁత + కొమ్మ = లేఁగొమ్మ, లేఁత + కవ్వు = లేఁగవ్వు మొ॥

సీ. బలుపాఁపతలచుట్ట లలవరించినవారు లేత చందురులఁ దాలిచినవారు.
పాండు. 1. 165.

(శ్రీకృష్ణుఁడు) గీ. జాంబవతియను దేవికి సాంబుఁ గనియె, నక్కుమారుండు లేఁతప్రాయంబు నందు, వీథి నొకనాఁడు సఖులతో విహృతి సలుప.
కాశీ. 6 3.

చం. ఒదవెడు జవ్వనంబు వెలికొత్తఁగఁ బయ్యెద సిగ్గుఁగూడి బిట్టదుమగ లేఁతలౌట దిగ నాఁకకు మీఱమలేక వక్షమ్ముం, జదుమునఁ బ్రక్కల న్మెఱసి చప్పటలై మఱి లావుగూడఁ బైఁ, బొదలె వనంగఁ బిక్కటిలెఁ బొల్తుక చన్నులు నాఁడునాఁటికిన్
ఆము. 5. 21.

2. సుకుమారము, కోమలము.

సీ. జేవురించిన లేఁత చెక్కుటద్దంబులఁ దాటంక యుగళంబు తన్నియాడ.
హర. 3. 93.

3. మృదువు, మెత్తనిది.

సీ. కనకకుంభ స్తని కక్షద్వయము గబ్బుమాత్రంబు గలిగుండు మనసు లేఁత
కళాశాస్త్రము 1. 20.

సీ. చిన్నిబుగ్గల లేఁత చిఱునవ్వు వెలర్ప సిరి యాళుఁడు మొగిద్పెఁ జేయిదోయి.
హం. 2. 115.

4 అల్పుఁడు, అల్పము.

చం. తనుశతకోటు లెత్తి బహుధర్మవినిర్మితిఁ బేర్మిఁ గాంచినన్, వననుఁ గనలేనిలేఁతలకు నాతియ భోగ్యము భాగ్య మీవ ప్రాగ్జవనమునం దొవర్చితి వొకావొకయర్చన నన్నుఁగూర్చి దావన సమకూరెఁజుమ్మ సుజనవ్రజవందిత చర్య నీదెసన్.
పాండు. 4 191.

ఉ ప్రాఁతల మేము నీకుఁ బలుజాములఁ బొందకయున్న నాఁటి నీ చేఁతలు గాఁటి మందలకుఁ జిత్తముల స్వెలిఁదోఁచు మాఁతలుం, బూఁతలు నీవ యొండు దల పోతలు లేఁతలు మమ్ము నెమ్మెయిన్, లాఁతుగాఁ దలంపకు సలంపకు చాల వలంగియుండగన్.
ఉ. హరి 4. 9-.

వి 1. లాఘవము, చులుకన

చం. ... ముదితచకుక్యవల్లభుని మ్రోలఁ దవర్చుట చూచి నెచ్చెలుల్, మదనుని చేఁతకుం దరుణి మావము లేఁతకు నొచ్చి రిచ్చలన్.
కావ్యా. 5. 48.

ఉ. పూఁతపసిండివంటి వలపుంబచరించు కులంబు నీతికిన్, లేఁతగదమ్మ యిత్తెఱఁగు ...
మను వ 3 33.

2. అందోలికా దండము యొక్క దోషవిశేషము

వ. లేఁత ముదురు సన్నము గమకము నీలధవళ రక్త హారిద్వర్ణంబులు మొదలుగాఁగల దుర్గుణంబులులేక ...
ప్రబంధ. 605.

జ : లేఁగ, లేఁగంపు, లేఁగటావు, లేఁగటిపడ్డ, లేఁగవును, లేఁగసవు, లేఁగారము, లేఁగొమ, లేఁజిగురు, లేఁజూపు, లేజెక్కులు, లేఁజెమరు, లేఁజెఱకు, లేఁతనగవు, లేఁతనవ్వు, లేఁతవెల, లేఁతమాట, లేఁదలిరు, లేఁదీఁగ, లేఁదెమ్మెర, లేఁదొడ, లేఁబగలు, లేఁబచ్చిక, లేఁబట్ట, లేఁబరువు, లేఁబల్కు, లేఁబురులు, లేఁబెయ్య, లేఁబైరు, లేఁబొఱ, లేఁబొల, లేఁబోఁక, లేఁబ్రాయము, లేగాడ్పు, లేజవ్వనము, లేజాఱు, లేనగవు, లేనడ, లేనవ్వు, లేనురువు, లేనెన్నడ, లేనెల, లేపొంఁడుమల్లె, లేమరులు, లేమాపు, లేమావి, లేయెండ, లేవంక.

లేఁతనగవు = లేఁతనవ్వు. (లేఁత + నగవు) మందహాసము, చిఱునవ్వు.

కం. అనితలఁచి లే తనగ హాసనమునఁ దగ శంభుఁ డాసవము డిగ్గక మున్, దన వామపదాంగు ష్ఠంబున వదిమె దశాస్యుహస్తములు క్రిందు వడన్. ఉ. రా. 3. 83.

**లేఁతనవ్వు** = లేఁతనగవు, లేనగవు. వి. (లేఁత + నవ్వు) చిఱునవ్వు, మందహాసము.

ఉ. అల్లన మేలమాడు వచలాత్మజమాటకు లేఁత నవ్వు సంధిల్ల ... మనుచ. 1. 2.

**లేఁతనెల.** వి. (లేఁత + నెల) బాలచంద్రుఁడు.

చం. ... అవ్విరిం, దననెఱిగొప్పునం జెరివి వ వ్వలిగుబ్బలిముద్దుపట్టి లే,తనెల ధరించిన ట్లమరెఁ దద్దయు మోహన కాంతి సంపదన్. పారి. 1 55

**లేఁతమాట.** వి (లేఁత + మాట) నికృష్టవచనము.

ఉ. బొందులు వేఱుగాని తలపోయఁగఁ బ్రాణములేక మంద్రిలం, గొందఱు లేఁత మాట లవి కూరిమిపట్టువవంచుఁ బ్రాణ ముల్, బొందులు నేకమైరవఁగఁ బొల్పగు శంకరుని న్నృపాని వస్పందితభక్తిమైఁ గదిసి బ్రాహ్మణపుంగవుఁ డానతాంగుఁడై. భోజరా. 6. 220.

**లేఁదలిరు.** వి. (లేఁత + తలిరు) లేఁజిగురు.

మ. .... శీతక్రియల్, పానరింపవ్ సమకట్టు లేఁదలిరులన్ బువ్వుంబులన్ బూఁతలన్. దశకు. 3. 123.

**లేఁదీఁగ.** వి. (లేఁత + తీఁగ.) లేఁతలత.

సి. జుంజువెంద్రుకలెత్తి చుట్టున లేఁదీఁగ పన్న గాధీశ్వరుపగిది మెఱయ. విక్ర. 2. 123.

**లేఁదెమ్మెర.** వి. (లేఁత + తెమ్మెర) పిల్లవాయువు.

సీ. ఒలసివ లేఁదెమ్మెరంబ యెమ్మె గను కమ్మ బంగరుపూఁదోఁటపజ్జన్ ... ఉ. రా. 3. 66.

**లేఁదొడ.** వి. (లేఁత + తొడ) సుకుమారమైనతొడ.

ద్వి. పన్ని కాళియల సంపదముట్టుకోలు, గొవ్న నిగ్గులబోవఁ గురియు లేఁదొడలు ... ద్వి. పరమ 1. 15 పొ.

**లేఁబగలు.** వి. (లేఁ + పగలు) సూర్యోదయము మొదలుకొని పదిగడియల ప్రొద్దెక్కువఱకు నుండు కాలము.

గీ. .. సమిధలుగొని మహాప్రాజ్ఞుఁ డతఁడు, వచ్చు లేఁబగటికి నిజావాసమునకు ... పాండు. 2. 17.

**లేఁబచ్చిక.** వి. (లేఁత + పచ్చిక) లేఁతయైన వల్లి గఱిక.

శా. ప్రాతర్వేళల మంచుచిన్కుగమి జొంపంబైన లేఁబచ్చికల్. ఉ. రా. 5. 286.

**లేఁబట్టి.** వి. (లేఁత + పట్టి) పసివాఁడగు కొడుకు; అట్టికూఁతురు.

సీ. ముక్కంటితలపువ్వు మున్నీటిలేఁపట్టి కైట భారాతిడాకన్నుదమ్మి. నైష. 8 201.

శా ... ముఖలక్ష్మికి నుమ్మకురమై ంచల్ల లేఁబట్టి కన్ మాణిక్యయతనం బొవర్చె గిరి యాత్మశ్రీ భావంబువన్. వసు. 1. 34.

**లేఁబరువు.** విశే. (లేఁత + పరువు) నూతనము.

చం అరవిరి వెండిచెంబుల వయంబునఁ దేనియ పానచేఁ లేఁ,బరువగు గుజ్జుమావి చవి పందిరులన్ లతకూన లియ్యఁగా, నరుదుగఁ గ్రోలియన్ నరసిజాస్త్రుగారస్థితిఁ గదుఁ దేఁటి ని,బ్బరుకుగు జాతిమై నధరపల్లవ మంటులుఁ గ టివే చెలీ. కువల 3. 122.

**లేఁబలుకు (లుకు).** వి. (లేఁత + పలుకు) లేఁత మాట, మృదువాక్కు.

సీ. ఘనపురాతనభక్తకథలు విన్వేసుల వెలఁది లేఁబల్కులు వినఁగఁగోరు. చన్న. 2. 242.

**లేఁబురులు.** వి. (లేఁత + పురులు) బాల్యము.

ద్వి. బుద్ధు లెఱుంగ లేఁబురులు ప్రాయమువ, సిద్ధంబు భక్తుల శివునిగాఁ దలఁచు. బసవ. 1. 424 పం.

**లేఁబెయ్య.** వి. (లేఁత + పెయ్య) చిన్నదూడ, లేఁగదూడ.

గీ. దిగ్గజంబులు మ్రొగ్గ ధాత్రీశరేంద్ర, మనఁగఁ ద్రొక్కుడునో లేక యంబరమున, కెగుర వైతురో . దశా. 2 159.

కం. ఈరణిఁదలంచుచు నాకనిఖావన నెదన్ నిలిపి రేగడ కెన్, లేకెటుల నిద్రపమ్మన్, రేఁగు నయ్యెవిన నెనను నిల్చిన వాఁకన్. విజ. వి. 1. 151.

**లేక².** వి. (సం. లేఖః) 1. జాబు.

కం. నీపతి నీకై వందుచు, నా పేను లే యనిపి నా డని యిది నే, నాపులుఁ వలనఁ దెలిసి ము,దాపూర్ణత మబ్బి విడివి నినిసితి దాలిన్. ప్రభా. 4 48. (శ.ర,సా లేఖ ముద్రి. పా.) 2. ఎడములేక మిక్కిలి చేంకయగు వృక్షాదుల వరున (శ. ర.).

జ : లేకరి

**లేకరి.** విశే. (లేక + అరి³) లేఖకుఁడు, వ్రాయరకాఁడు (శ ర.).

**లేకి.** వి రాలిన ధాన్యపుగింజ.

ఉ. లేకివిధి వ్రతంబు లకలేకము కాంచనభూధరంబు ర,త్నాకరరత్నరాసు ఉడుగంట్లు మనున్మణి కామధుక్సురా, నోకహాముల్ ప్రయోజిత వినూతనవస్తువు లిట్టివట్టి వ,న్యాకుల కందరాలి పురవైభవ్యాల సంపద తెల్చి చూపుచోన్. కవిక. 1. 11.

విశే. అప్రయోజకుఁడు (శ. ర.).

జ : లేకిబ్రతుకు, లేకివాఁడు.

**లేకిబ్రతుకు.** వి. (లేకి + బ్రతుకు) ]ఉంఛవృత్తి. లేకిగింజలేరుకొని బ్రతికెడు బ్రతుకు (శ. ర ).

**లేకివాఁడు** విశే. (√లేకి ) 1. లేకిగింజలేరుకొని బ్రతుకువాఁడు.

ద్వి వక్క సేయని లేకివాఁడవు నీవు. ద్వి హరిశ్చ. ఉ. 1418 పం.

2. అప్రయోజకుఁడు (శ. ర ).

**లేఖ.** నం వి. ఆ. స్త్రీ. 1. రేఖ, చాలు. (విమ్యల్లేఖ. ఫేనలేఖ మొ॥) 2. గీఁత, నాఁగేటిచాలు, 3. పంక్తి 4 గీఁతలు గీఁయుట 5 చంద్రకళ. 6. ఆకృతి, రూపము 7. గుర్తు, ఆనవాలు. 8 పోలిక, సాదృశ్యము 9 మడిచికుట్టిన యంచు, అంచు 10. శిఖ, కొప్పు.

**లేఖకదోషము.** సం. వి అ పుం వ్రాయసగాని తప్పు: వ్రాఁత తప్పు.

**లేఖకప్రమాదము.** సం. వి. అ పుం. వ్రాయసగాని పొరపాటు, వ్రాఁతపొరపాటు, వ్రాఁత తప్పు.

**లేఖకము.** సం. వి. ఇ న. 1. వ్రాయుట, ఒకదానికి ప్రతివ్రాయుట 2 జాబు (విలేఖ్యము ).

**లేఖకుఁడు.** సం వి. అ పుం వ్రాఁతగాఁడు, వ్రాయసగాఁడు, ఒకదానికి ప్రతివ్రాయువాఁడు 2. శిల్పి, చిత్తరువు వ్రాయువాఁడు.

**లేఖనము.** సం విశే. (అ ఈ అ ) 1. వ్రాయునది; చిత్తరువు వ్రాయునది, బొమ్మలను వేయునది. 2 గోఁకునది. గీరునది. మొ॥ వి. అ పుం కటమునకై యుపయోగపడెడి యొక జాతి రెల్లు. న. 1. వ్రాఁత, చూచివ్రాయుట, ప్రతివ్రాయుట. 2. గోఁకుట, గీఱుట. 3 తాఁకుట, తగులు. 4. సన్నము గాఁ జేయుట 5. శస్త్రవైద్యమున కోయుట, గంటులు వేయుట. 6 వేదము, శ్రుతి 7 గోఁకుకొనెడి పనిముట్టు 8. వృక్షవిశేషము, భుజపత్రవృక్షము. 9. (వ్రాయుట కుపయోగించెడి) తాళపత్రము, తాటియాకు. బూర్జపత్రపు పట్ట మొ॥

**లేఖనికుఁడు.** సం వి. అ పుం 1 జాబులు తీసికొనిపోవువాఁడు. 2. వ్రాయనేరక వ్రాఁతకు బదులుగా నొక గుర్తు నేర్పఱుచుకొనెడివాఁడు 3. వ్రాయసగాఁడు, లేకరి.

**లేఖము.** సం వి. అ. పుం 1. వ్రాఁతమూలము, ఇచ్చిపుచ్చుకోలు పత్రము. 2 జాబు.

**లేఖర్షభుఁడు.** సం. వి. అ పుం వేల్పుఱేఁడు. ఇంద్రుఁడు

లేఖాక్షరము. సం. వి. అ. న. వ్రాత

లేఖాధికారి సం వి న్ పుం. (రాజనొద్ద) ఉత్త- ప్రత్యుత్తరాదులు వ్రాయు నధికారి.

లేఖార్హము. సం వి అ. పుం శ్రీతాళము. (స్త్రీ) వి ి. ఒకజాతి తాటిచెట్టు

లేఖాహారి సం. వి. న్. పుం జాబులు తీసికొని పోవువాడు.

లేఖాహారుఁడు సం వి. అ. పుం. = లేఖాహారి

లేఖిని. సం ి ఈ. స్త్రీ 1. కలము పేనా. 2 గంటె. దర్వి

లేఖుఁడు సం వి. అ పుం వేల్పు దేవత.

లేఖ్యకృతము. సం విశే. (అ. ఆ. అ.) వ్రాత యందుంచఁబడినది, వ్రాతమూలముగ జేయఁ బడినది.

లేఖ్యగితము సం. విశే. (అ. ఆ. అ.) చిత్తరువుగా వ్రాయఁబడినది, చిత్రీకృతము.

లేఖ్యపూర్ణిక. సం వి అ స్త్రీ 1. బొమ్మలు వేయు కుంచె. 2. లేఖిని, వ్రాతపుడక, కలము, పేనా

లేఖ్యపత్రము. సం వి అ న. 1. జాబు 2. వ్యవహార సంబంధమైన (ఇచ్చిపుచ్చుకోలు) పత్రము 2 తాళపత్రము, తాటియాకు పుం తాటిచెట్టు.

లేఖ్యము. సం విశే (అ ఆ అ) 1. వ్రాయఁ దగినది, గీయఁదగినది, చిత్తరువు వ్రాయఁదగి నది 2. గీఱఁదగినది, గోఁకఁదగినది. 3. వేల్పు లకుఁ బ్రియమైనది వి. అ న. 1. వ్రాతయను నది 2. ప్రతివ్రాయుట ి వ్రాసినది, జాబు, పత్రము, ఇచ్చిపుచ్చుకోలు పత్రము. 4. వ్రాసిన పుస్తకము. 5. శాసనము, శిలాదులపైఁ జెక్కిన వ్రాత. 6 చిత్తరువు వ్రాయుట. 7. చిత్ర ప్రతిమ, చిత్తరువు బొమ్మ.

లేఖ్యస్థానము. సం. వి. అ. న. వ్రాసెడిచోటు. కచ్చేరి.

లేఖ్యారూఢము సం. విశే (అ. ఆ అ) వ్రాత యందుంచఁబడినది.

లేగాడ్పు వి. లేఁత+గాడ్పు) మందమారుతము.

మ ... మలయంపుం గమ్మలేగాడ్పు తేరున నేతెంచు లతాంతబాణునకు ...

ఆము. 5. 101.

లేచు. అ. క్రి 1. ఉత్థితమగు, నిలువఁబడు.

సీ శ్రీకాంక్షఁదలఁ గాంచిన లేచి మ్రొక్కు నంజలికి నింద్రుండు వక్కాలువుఁ గోర.

ఆము. 1. 59.

గీ. ననుఁ గనుంగొనినప్పుడె వినయమునను, లేచి కూర్చుండు మనెడి నిలింపవైరి

దశా. 2. 100.

2 మీఁదికెగయు

మ. ... మహిమీఁది లోహరజముల్ పైఁబర్వి నాలేచె వాత్యలఁ బ్రాగ్గావముషు ల్మోగి ల్మోదల గ్రద్దంతై దివిన్ లేచినన్.

ఆము. 4. 80.

మ లకుముకుల్ క్రిందై పడున్ లేచు ...

ఆము. 1. 57.

సీ. వడి నూర్ధ్వగతిని లేవకయుండఁ దన నాగ బెత్తాన మూర్ధంబు మొత్తిమొత్తి.

కళా 8. 79.

శా బాహాసంభృత కాలదండజనిత స్ఫారస్ఫులింగాళికిన్, సాహాయ్యంబు ఘటించి కోప రసఘూర్ణన్నేత్రదీప్తుల్ పయోవాహాంతర్గత వైద్యుతప్రభల లేవం జోప వాహద్విష, ద్వావహోత్తంసము నెక్కి పోరి కదరెన్ వైవస్వతుం డుద్ధతిన్. పారి. 4. 79.

3. మేలుకొను.

చం. వలుఁగిడి చల్వఁదాల్చి వయివంపుటలంతల నిద్రఁజెదు రో,వెలఁదుల లేవ గొంకివతి వింతగడాఁవు పారివారి గం,టలరొద కుల్కి లేపఁ జిలువవ్వులతోఁ దమవారిఁ గూడ యిం,పులతమి దీటివన్ నిదురవోయిరి నుమ్ముబోజుంగు లత్తటిన్. కువల. 2. 110

సీ. ... ప్రత్యూష పవనాంకురములు పైకొనువేళ
వామనస్తుతి పరత్వము వ లేచి
మనుచ. 1. 54.

4 పూను ఉద్యమించు
క. లేలెమ్ము విరుదవై ..., మ్మా ముసకు ..
భా. 2. 79.

ఉ. ఇంచినవేడ్క నాత్మహృదయేశ్వరిఁ గన్గొని
శౌరి మందహాస, సాంచితనేత్రుఁడై జలక
మాడఁగ లెమ్మని పైఁడిచేం కొంగించుక
జాల .. పారి 2 6.

5 ప్రసరించు
కం. లాగున నాటులగమి, నేరి తెలిసి మున్ను
నాజ్ఞ యడ కతఁడు చెఱం, బోలాఁతి
నిః సయకమెం, లేలేవదె శూలగ్రధుపతి
జ్యా యమునన్. ఆము 4. 298.

లేజవ్వనము వి (లేఁత + జవ్వనము) నవయౌవనము, లేఁత యౌవనము.

మ. దనుజాధీశ కుశధ్వజుం డను తపోధనుఁ డు
మున్నొక్క నాఁయన వేదంబు పఠించువేళ
ముఖయంబై నేను వాపోవఁగా, నను,
బ్రేమంబునఁ జూచి వేదవతియ న్నామంబు
గావించి పెంచిన లేజవ్వన ముప్పతిల్లుటయు
జేజేలున్ మునుల్ రాజులున్
ఉ. రా 3. 109.

లేజాలు. అ (శ్రీ (√లేఁత) ఇంచుక జాలు.

ద్వి పాలిండు లఱఁగాము పడ నొక వింత, లీలఁ
బయ్యెదకొంగు లేజాలువైచి.
ద్వి. పరమ. 4. 294 పా.

లేటు. వి చెట్టుకొమ్మ, శాఖ.

సీ. మాని మ్మౌ మూట మరుని గెల్పులకోట
ప డు వెన్నెల తేట పసిఁడిలేటు.
అచ్చ. రా. బాల. 186. (వ. ర. పా).

లేటమొగము వి విముఖత్వము, పెడమొగము (చూ లేట మొగముపడు.)

వ . వెఱగుపడి బాణుఁడు లేటమొగంబుతోఁ
జేయునదిలేక విన్ననయి యున్న యెడ ...
భాగ. 10. ఉ 423 (చి. ని. పా లేట
మొగంబువడి ముద్రి. పా.)

జ లేటమొగముపడు.

లేటమొగముపడు. అ. (క్రి (లేటమొగము + పడు) పెడమొగము పెట్టు.

సీ. దేవదత్తాఖిలరావంబు వెసఁ గర్ణముల
దీటుకొనవ లేటమొగముపడుచు
భార విరా 4 248.

కం ఏటున వాటున వ్రేటునఁ, బోటున దళ
ముఖుఁడు రౌద్రముగ నలుమొగి యన్,
లేటమొగముపడి యతులు, కోటిసారంబులకి
తనుకోటి మొగవఁగన్ నిర్వ 4. 48.

లేటి = లేడి వి కృష్ణసారాదిమృగము.

గీ. ఇట్టు వెన్నాడ యెఱసి కాదిది మృగంబు,
మాయమో యేమొ యైన నేమాయె
ననుచుఁ, గరలి నకమయోగ్రాకుగింబు
వఱుపఁ, లేటిరాకొమ్ము నడువక్కి నాఁటు
కొనిన. రామా. 5. 164.

ఉ. .. ముకుందవేణుకల నాదపుటీఁకు లేటి
మొత్తమై. ఆము. 5. 68

2. మృగి, ఆఁడులేడి.

సీ. పొలయించి నీచూచు వలఁతికి మెడయెత్తి
కొని చూచు రాలేటికొదమ లివియు.
కు. సం. 6. 687.

3. మగజింక.

కం లేటిం దాచుకొనవొ ము,న్నీటి న్నడయాడ
లేదొ నిను ద్విజరాజం, చేటికిఁ బలకం
గోకా, ఖేటకపాటవకిరాతకేసరివి శశీ
పా చా 3 68.

సీ. ముని పట్టుఁబుట్టముల్ చినుఁగువ చు సివంగి
లేటిమైఁ దవగోట మీఁట వగుకు
చంద్రా. 4. 71

జ : లేటివల.

లేటివల వి (లేటి + వల) మృగములను బట్టుకొనెడు వల.

వ. తెఁచీసకట్టెలు ప్రోఁగుచట్టలు దొడ్డివల లేటి
వల కుందేటివల మొదలుగావలయు వలలును.
కాశ 3. 46.

గీ. లేటివలలును మఱియుఁ గుందేటివలలు, నెలుక వలలును సపంజవలలు దొడ్డి,వేఁలుఁ బందిటి వలలును ... యయా. 1 110.

**లేడి = లేటి.** (బ. లేడులు, లేళ్లు). 1. మృగము.

చం. పులిఁ గనుగొన్న లేడులును బోలె విభూతిఁ గలంగఁ బాఱ .. భార విరా 3. 67.

చం. పులిఁ బొడగన్న లేళ్లగమిఁ బోలె సుయోధను సైన్యసైనికుల్, డలఁకి కలఁగ . .

భారి భీష్మ 2. 157.

చం. ప్రకటబలాఢ్యు లొక్కటఁ దిరంబయి పల్వురుపేర ... భూమిపాలకునకు గడ్డమైనఁ దవులంబడి హుమ్మని నోరి కంఠ నాఁచి కొనిన ప్రకార విమ్బులిపశేషము దోఁచెఁగఁ బార్థుపట్టిసాయకముల నొంచినం దెరలి యందఱు లేకల పిండునాకృతిన్.

భార. ద్రో. 2. 25.

సీ. బెళుకుఁజూపుల లేడి గెలిచికై కొని సునో నాఁ గ్రిందఁ గృష్ణాజినంబు వేయ.

ఉ. రా. 3. 103

2. మృగి

కం మదనజరాగంబునఁ బెనఁగినయట్టిని లేడిఁ జూచి కృతహస్తుఁడు పెల్చన యేనమ్ములు నాలెంటిని ద్రెళ్లఁగనేసెఁ గడుఁ జిరినహృద యుండై. భార. ఆది 5. 59.

ఈ · లేడికంటి.

**లేడికంటి.** వి. (లేడి + కన్ను) లేడికన్నులవంటి కన్నులు గల స్త్రీ, మృగాక్షి (శ. ర.).

**లేతము.** సం. వి. అ. పుం., న కన్నీరు, బాష్పము

**లేదా** అవ్య. (లేదు + ఆ[4]) లెనిచో‌న్, లేని పక్షమున.

(అంజనేయుడు) ఉ. చూచుటలే దశోకవనిఁ జొచ్చి యటం జని చూడఁగాఁగదా, యా చపలాక్షి మజ్జనని యచ్చటనుండినయేని లెస్స లేదా చతురానను-డు మొదలైన సుపర్వు లెఱుంగఁ జిమ్ములో, నై చెడఁగాక యీ మొదలు వానరవీరుల మ్రోల నైతునే. రామా. 6. 120.

శా వీరుండై జనియించినప్పుడ రణోర్వీన్ వైరు లన్ దోర్బలో, దారత్వాఁబునఁ గెల్వఁగా వేఁయు లేదా యొమ్ము నాయమ్ముంచన్, వీర స్వర్గము గాంచఁగావఁయ. దశా. 4 9

**లేదుబంతి.** విశ. లేనిది. (వి. పోంకు అని రం.ర.)

చం. తెలియఁగఁజాలకనట్లనె మదన్ బుధు లాంపి తప్పు సీపయిన్, గఁదని ల్పటచోఁ గుచ యుగం బటు బట్టబయల్గఁ జేసి యా యలికప లేదుబంతి యన వంద అెంద్ర సురయంబు పెం.పాలయఁగఁ గిల్లలో నిజ మొుఃవు డుఁగాఁ దంపోసి మాచినన్

నాఁడుగ 1. 219. (అసత్యము అని భావము.)

సీ ఎంతమాత్రం బికి యీక్షణంబున లేదు బంతి గావించెఁ బ్రజ్ఞ మీఱ నిరం. 4. 71.

(లేదుబంతిగావించు = పోగొట్టుకొను అని భావము.)

ఉ . . అన్నపతిపాలికిఁ బోయెదవేమొ పొమ్ము నీ,యిచ్చకువచ్చినట్లు రమియింపు మొకా నొకమాట పుట్టవన్, నెచ్చెలిలేదు బంతియను నేర్పనదిద్దుకొనంగఁజాలవన్. శుక 2 97.

(లేదుబంతియను = పోగొట్టుకొను)

వ ... ... తురంగంబు నంట దోలి గంటియుడి వెంటంబడుటయు గెంటించి లేదుబంతి యన్నట్లల్లంతనుండి ... మనుచ. 4. 115.

చం. జలరుహగంధివిమలపసల్ నవసంఖ్య నదేమి లెక్కనున్, తెలియ నఖాంకురాళి నెల చేడియసైకముఁ దాను జక్కనున్, బోలఁ తుక గబ్బిచన్నుఁగవ పువ్వులచెండ్లను లేదు బంతినున్, కలికిముఖారవిందమల కల్వల రాయనిఁ దోపిరాజనున్. విజ. వి. 1. 57.

(ఇట ఔపమ్యవాచకము పోలు అని భావము.)

**లేనగవు = లేఁతనవ్వు, లేనవ్వు.** వి. (లేఁత + నగవు) చిఱునవ్వు, మందహాసము.

సీ పలుకంగనేర్తురు పాటలాధరముల మొలక లేనగవులు ముద్దుగురియ. భీమ 1. 94.

ఉ. ... ఆ,యన్నుల కులు్ర లేనగవు లచ్చు పు వెన్నెల లంచు . . సీలా ౧. ౬

లేనడ వి (లేత + నడ) మందగమనము

చం. కనిహృదయంబు ఝల్లుమన ఘల్లుమన గం బదాంగదంబు దిగ్గన వెస లేచి లేవడ యొయారములోఁ దెంచాటుఁ జేరెఁ గామిని చెలికత్తె తత్తరము మెకొ్కన గద్దియఁ దెచ్చి యుంచమిఁ, చివలిమి నందుమీఁద నివసించె ధరావరుఁ డాదరాత్ముఁడై. కువల. ౨ ౯౯.

లేనవ్వు = లేనగవు. వి (లేత + నవ్వు) మంద హాసము.

మ. ... మమ్మాఁ పిమ్మలం బ్రోవ నా యమరుల్ నీ కెదురే జయింపగదవయ్యా యన్న లేనవ్వు డ్రాయ మరుల్ కొల్పుచు వాఁ వీడొ్కనిపి దైత్యచ్ఛేదనోద్యోగియై. ఉ రా ౧ ౯౭

లేని. (కలుగు ధాతువునకు వ్యతిరేకార్థక విశేషణ రూపము.) విశ. 1. ఉండనిది.

చం. బలమును నొవ్వు బుద్ధియును బ్రౌఢతయుం గలవారు లేనివారిఁ లవశ వే యొక్క ఉంగి... భార. శాం. 4. ౩౯౭.

సీ. సకల దైవత బుధజానుస్ఫూర్తి కెవ్వానిపుట్టు కామనిలేని మెట్టపంట. అము 1. 19.

2 చాలనిది, ఒకనిది.

గీ. శాస్త్రతత్త్వ మెఱుంగక సంశయాత్ము, డగుచుఁ బరమార్థ మిట్టిద యనంగ లేని, యట్టి వాఁడు ... భార. శాం. 5. 446.

౩. ప్రాప్తింపనిది, దొరకనిది

గీ. దర్భపోటులఁ దిని లేనితలుపమైత్రి, వంటి పితృశేషము భుజించి ... అము. 6. 69

4. సంభవింపనిది, జరుగనిది

సీ. ఇది లోకమునలేనియది యేమిసేయంగనగు ఎని చింతాకులాత్ముఁడైన

భార. ఆది. 7. 209

లేనివాఁడు = దరిద్రుఁడు

... కలవాఁడు లేనివాఁడు సబలుఁ డబలుఁడు మూఢబుద్ధి ప్రౌఢుం డనఁగా

భార శాం 5 278.

ఆ. కంబుకంఠి నీవు కలవాఁడు కడవాఁడు లేని వాఁడు నీక చేవాఁడు ౧ాలీ ౧ 47.

జ. లేనిది.

లేనిది వి (లేని + అది) అసత్యము (ఇది 'కలుగు' ధాతువునకు వ్యతిరేకవిశేషణమైనను క్రమముగా నీయర్థము కలిగి విశేష్యమైనది)

గీ. అనుడు ధరణీశుఁ డాతపోధనునిఁ జూచి, వింటివా యోయి యీమచ్చెకంటి యాడి, వట్టిమాటలు తెలియ నేమైన నింకఁ, గలది లేనివి గలిగిన దెలుపవలయు విప్ర. ౫ 49.

లేనురువు వి. (లేత + మరువు) అల్పుడుఁడీ ము.

ద్వి. ఒలయు లేనురువు చిట్టుముల బిట్టయ్యె ... ద్వి పదమ. 1. ౫౭ పా..

లేనెత్తు = లేవనెత్తు.

ద్వి. పడియున్న వతిదయాభావామృతంబు, కడ కంటఁ గెడగూడఁ గొడుకు లనెత్తి.

బస. పు. 1 ౯౬౪ పం.

వాడుకలోని ప్రయోగములు పొగ యింటి కొప్పునుండి లేచినది.

తోఁకద్రొక్కిన తాచువలె లేచినాఁడు

జ : లేపు¹

లేనెన్నడ. వి (లేత + నెన్నడ) మందగమనము.

సీ. నెఱనీటు గులుకు లేనెన్నడల్ వరికించి కడు మందగతిఁ గాంచె గంధకరణి.

పరా. 2. ౪02.

లేనెల. వి (లేత + నెల) బాల చంద్రుఁడు.

ఉ. ... ముచ్చుఁగొండరాఁ, చూలినిగూడిపేడకలఁ జొక్కఁడు లేనెలతాల్పుఁ గొల్చెదన్.

సిలా. 1. 1.

గీ ... ఈనెలంత లలాటంబు లేనెలంత ...
విజ. వి. 1. 130.

**లేపకరుఁడు.** సం. వి. అ. పుం. తాపీపనివాఁడు, సున్నపుఁబనివాఁడు. సున్నముపూయువాఁడు.

**లేపకుఁడు.** సం. వి. అ. పుం. 1. తాపీపనివాఁడు, సున్నపుఁబనివాఁడు. 2. పాత్రములు మొదలగువాని యచ్చుపోయువాఁడు

**లేపనము** సం. వి. అ. పుం ధూపద్రవ్యము, సీమసాంబ్రాణి. న 1. రాచుట, పూయుట 2 లేపనపదార్థము, పూయుట కుపయోగించెడి వస్తువు. 3. సున్నపుగచ్చు, వెల్ల. 4 మాంసము.

**లేపభాగి** సం. వి. న్. పుం. ప్రపితామహుని తండ్రి, తాత. ముత్తాత, తండ్రి మొదలుగా నాలుగైదాలుతరములవాఁడు, పిండభాక్కు.

**లేపభుక్కు.** సం. వి. క్. పుం. లేపభాగి.

**లేపము** సం. వి. అ. పుం. 1. పూయుట. రాచుట. 2. గాయము మొ॥ వానికి రాచెడి తైలము. 3 సున్నము మొ॥ పూయుట. 4. పితృపితామహ ప్రపితామహులకంటె పూర్వులగు మూఁడుతరములవారికి నొసఁగఁబడు పిండశేషాన్నము. 5. మచ్చ, కళంకము 6 పాపము. 7. ఆహారము.

**లేపి.** సం. విశే. (న్. సీ. న్.) పూయునది, రాచునది, కప్పునది. వి. పుం. తాపీపనివాఁడు.

**లేపించే.** సం. న. క్రి. లేపనముచేయు, పూయు.

సీ. వక్షోరుకణిక గంధము తేనె వగ నూటి లేపించి కూడిన లేమవలచు. హంస. 5. 121.

**లేపు[1].** న. క్రి. (√లేచే) లేచునట్లుచేయు మేలుకొలుపు.

చం. నలుఁగిడి చల్వదాల్చి పయనంపుటలంతల నిద్రఁజెందు రోవెలఁదుల లేపఁ గొంకి ...
కువల. 2. 110.

**లేపు[2].** వి. 1 పాన్పుపై పఱచు దుప్పటి.

సీ. ... శయ్యాఖ్య చెల్లు సెజ్జ, పఱుపు తలిపము దడిఁబము పాన్పు మెత్త, యనఁ బదాఢ్యాది యొరకు లేపనఁగ శయ్య.
అం. భా. 2. 163.

2 పడకమీఁద పఱచెడు పఱుపు.

చం. సకినల పట్టెమంచమునఁ జాయనరాసు తివాసిపైఁ దుప్పటిగ మొకమాలు లేపున నొగిన్ శయనించి మనోభవవ్యథన్.
హంస 1 69.

చం ... జాఫరా జినుఁగు లేపునఁ జెందుపలంగు పోషుత,క్కుటగల జాళు వా గొలుసు గిల్టొటొన మంచముపై మహాశ్నతిన్.
హం. 1. 240

2 ఏనుఁగుమీఁద పఱచెడి చిత్ర కంబళము; జాలు.

సీ. ... కుథముజాల్ లేపనఁ గొఱలుచుండు ...
అం. భా. 2. 195.

**లేప్యమయి.** సం. వి. ఈ. స్త్రీ. మట్టితోఁజేసి సున్నము పూసిన (బిడ్డలాడుకొను) బొమ్మ.

**లేప్యము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. గచ్చు చేయఁదగినది, పూయఁదగినది 2. పోఁత పోయఁబడనది. వి. అ. న. 1. పూఁత.

**లేబరము.** విశే. 1. వ్యర్థము.

గీ. లేబరము కాదె బిడ్డలులేని బ్రతుకు.
ఉ హరి. 2. 16.

సీ. పరగు శీఘరము లేబర మన వ్యర్థంబు ...
అం భా. 5 24

2. శూన్యము.

సీ. ప్రావితో వర్షంబు సమకూరకుండుటఁ బంటలు లేబరమయ్యెఁ బాఁడితోడ.
కాశీ. 1. 137

సీ. అట్లతిబాధచే హాహాస్వనంబుతో భువన సంక్షోభంబు పుట్టె మిగుల, గీ. బంటలును పాఁడితోడ లేబరములయ్యె. తపతీ 5. 78.

3. దీనము.

గీ. లేదు పెట్టలేమనియెడు లేబరంపు, బలుకు దవ ప్రజలో వినఁబడియెనేని, నితకంటె

చ: ఒడుపుల గల్గి ఝుర్ఝరము బూనిన ప్రాణము లుత్తరించు లేమిడి నొదవించు వేదనలు మీఱఁగ ...
రత్నా. పరీక్ష. 77 ప.

**లేమిపడు.** అ. క్రి. (లేమి + పడు) పేదపడు, పేదఱికము నొందు.

సీ. పల్లవుల్ తుది లేమిపడి యుంటిచాయరా మొగి లంపకల్లులు మూర్ఛినట్లు
కవిరా. 2. 84.

**లేయము.** సం. వి. అ. పుం. సింహరాశి.

**లేయెండ.** వి. (లేత + ఎండ) లేత యెండ, ప్రొద్దుటి యెండ, బాలాతపము.

కం. లేయెండ వేడియయ్యును, దోయజమంద మున కిపు తొలఁగించు క్రియన్, నీ యలుక పరుసదయ్యును, నాయెదకు వేడ్కసేయు నళినదళాక్షీ
నైష. 8. 46.

కం. పరపఁడు దండలు గిఁజలు క్రిక్కిరలఁగ లేయెండచాయఁగడు నుగ్రములై, యెదురం గొందలు గలరని, మదినించుక సరకగొనక మదమున నడచెన్.
నిర్వ. 6. 93.

**లేలిహ.** సం. వి. అ. స్త్రీ. అంగుళీసన్నివేశ విశేషము, అభినయభేదము, అభినయవిశేషము, ఒక విధమగు ముద్ర

**లేలిహము** సం. వి. అ. పుం. సర్పము, పాము.

**లేలిహానము.** సం. వి. అ పుం. సర్పము, పాము. విణ. (అ ఆ. అ.) మరలమరల నాలుకను జాఁచునది, లేక నాకునది.

**లేలిహానుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**లేవ.** వి. గుజ్జుపు తలాటము.

సీ. ఒలితపుఁ బులు దిండిమలదాయ జాచెక్కడపు గోవపని చొక్కటంపు లేవ.
చంద్రా. 2. 69

గీ. జిగిగొలుసు లేవ పాలాసి మొగసరియును, బూని సాహిణి యొక కత్తలానిఁ దెచ్చె.
చంద్ర. 2. 16.

**లేవంకి.** వి. (లేత + వంకి) చిన్నకత్తి.

సీ. నిలుచు లేవంకితో నిగనిగలాగా మి పరిష్కృత స్థితి తేటపడుచు ననియె.
కకు. 4. 41.

**లేవడి.** వి. (లే + వడి) 1. అశక్తము; కార్శ్యము.

సి. నిదురలేవడిఁ గెంపునెఱయు కన్గవ తోడఁ బొడసూపిరెయిన మైపూఁతతోడ.
ఐసిపు 5 60.

గీ. వేలుపుల లేవడులు గడువేగఁ దొలఁగఁ, బరతుల నెన్నడముల లేవడలు దొలఁగె.
అచ్చ. రా. బాల 77.

2. దారిద్ర్యము.

సీ. వెనుక ముందఱ లేదు సెనరైన చట్టాలు లేవడి యొంతేని జీవనంబు.
నైష. 1 17.

కం. వేదలు దానము సేయఁగ, లేదు గదా నేపమ్ము వారు లేవడిచె డింకెదనెవ్వనికిని బున, కేటేయు ద్రోవగాఁ యొ గంపు హరి.
శేషధ. 1. 151.

ఉ. లేపమీఁద బాసలు లేనికతంబున నూర కుండవన్, బోవమి నప్పసప్పులకుఁ బోవుట వేఱుగఁ దోఁచనేమొకో ...
శుక. 2. 175.

3. కష్టము.

గీ. వేలుపుల లేవడులు కడువేగఁ దొలగఁ, బడఁతుకల నెన్నడముల లేవడులు దొలఁగె.
అచ్చ. రా. బాల. 77

విణ. అల్పము, కృశము.

రగడ. పొగడ ప్రాఁకియే పోనే లేవడి, సిగరు బోఁడికా నెంతయు లేవడి.
రాజ. చ. 2. 149.

ద్వి. మెఱుఁగు లేవడియైన మించు సడలినను, వెలిచందనము నకుఁ గొఱఁత దోఁచినను.
బస. పు. 4. 872 పం.

**లేశము.** సం. వి. అ. పుం. 1. లవము, అత్యల్ప భాగము. 2. అల్పత్వము, కొంచెపుఁదనము. 3. అణువు. 4. రెండు కళల పరిమితిగల కాలము.

అత్యల్పకాలము. 5. ఒక విధమగు పాట (విల్సన్ను).6. (అలం.) ఒకానొకయలంకారము.

శ్లో॥ లేశ స్స్యా ద్దోషగుణయో ర్గుణదోషత్వ కల్పనమ్. (చంద్రాలోకము.)

**లేశోక్తము.** సం. విశే. (అ. ఆ. అ.) సూచింపఁబడినది, జాడ చూపఁబడినది.

**లేశ్యా.** సం. వి. ఆ. స్త్రీ. ప్రకాశము. (సూర్య) కాంతి (విల్సన్ను.).

**లేశ్యము.** సం. వి. అ. పుం., న. ప్రకాశము, (సూర్య) కాంతి. (విల్సన్ను.)

**లేష్టుభేదనము.** సం. వి. అ. పుం. మంటిగడ్డలు పగులఁగొట్టెడి పనిముట్టు.

**లేష్టువు** సం. వి ఉ. పుం. మంటిగడ్డ.

**లేసికుఁడు.** సం. వి. అ. పుం. ఏనుఁగుపై స్వారి చేయువాఁడు.

**లేసు** వి. (సం. లేశః) 1. చులుకన. 2. సులభము. (శ. ర.).

**లేహనము.** సం. వి. అ. న. 1. నాలుకతో నాకుట. 2. పెదవులతోఁ బీల్చుట.

**లేహము** సం. వి. అ. పుం. 1. పెదవులతోఁ బీల్చుట, కొంచెము కొంచెముగాఁ ద్రాగుట. 2. రుచిచూచుట. 3. నాలుకతో నాకెడుమందు, లేహ్యము 4. ఆహారము. 5. సూర్యచంద్ర గ్రహణములు సంభవించు పదిమార్గములలో నొకటి (విల్సన్ను.).

**లేహి** సం. వి. ఇ. స్త్రీ. పెదవులకొనయందుఁ బుట్టెడి రోగవిశేషము.

**లేహినము** సం. వి. అ. పుం. వెలిగారము.

**లేహ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) పెదవులతోఁ బీల్పఁదగినది, నాలుకతో నాకఁదగినది.

వి. అ. న. 1. నాకి యనుభవింపఁదగిన యాహార పదార్థము. 2. ఆహారము. 3. అమృతము.

## లై

**లైంగము.** సం. వి. అ. న. పదునెనిమిది మహాపురాణములలో నొకటి.

**లైంగికము.** సం. విశే. (అ. ఆ. అ) 1. లింగము (గురుతు = అనుమాపకచిహ్నము) పై నాధారపడునది. 2. లింగసంబంధమైనది. 3. అనుమితము, ఊహింపఁబడినది.

**లైంగికుఁడు.** సం. వి. అ. పుం విగ్రహములు చెక్కువాఁడు.

**లైంగుఁడు.** సం. వి. అ. పుం. శివలింగమువలన జనించినవాఁడు.

ద్వి॥ లింగమధ్యములోని లైంగులు సరియె.

బస. పు 3. 84 పం.

## లొ

**లొంక = లోఁక.** వి. గుహ; గుహాంతర్భాగము.

ఆ. గరణిపాలుఁ డంపఁ దురగంబు నచ్చోటఁ, గట్టి వాలుఁ గేలఁ బట్టికొనుచు, లొంకఁ జొచ్చె నాక్మ గొంకక వాలుఁడు, గదిసి దివియవట్టి వెదకుమాడ్కి. ద్వా 3 44.

**లొంగ.** వి వస్త్రాది భాగము, మూల.

సీ. ... భయంబు లేక, కాలు గట్టుక చనఁగా బిట్టు నేతెంచు సుకర్ణ నొంలొగ గొనక మాన. ప్రభు. 1. 93.

**లొంగు= లోఁగు** అ. క్రి. లోకువగు, వశపడు.

కం. ... సును,చాపునకున్ లొంగి మానవనంబునఁ దొగడెన్ దశా. 2. 266.

ద్వి. తనులన వడఁకఁ జెంతను లొంగియున్న. కలవాణి సతి జూచి కలకఁ బవ్వి.

మ్మ. వి 2 73.

**లొండు.** వి. జలాశయవిశేషము, ఒకవిధమగు నీటిపట్టు.

కం. తిరుకొలము నూయి లోఁయుఁ, జెఱువు మడువు లొండు కుంట చెలమ సడియ కో, నెఱు బుగ్గ వాఁగు దొనగం, పరి గుండము కాల్వ డిగియబావి దొరవులన్.

హంస. 4. 210.

**లొంప.** వి. అల్పగృహము, కొంప.

సీ. ... అల్పగ్రహము కొ. వ లోంపనఁ దగు ...
ఆం. శా. ౩. 11.

**లోంపి** = రొంపి. వి. బురద, పంకము.

సీ. క్రొవిగుంటలు దక్కి ఉల్లలు చిక్కంగ నివిరినఁ గొంగరాయిడికి మిడికి, కొరదయుఁ గడిసె పాపర మల్లు ముచ్చుఁగి కొంకె ముక్కును లోంపి గ్రుమ్మ కొనియె ....
వేం. పంచ. 1. 394.

**లోంపు** వి. ఒకతెగ (...).

**లొగ్గడి** వి. కలగుండు, క్షోభము (శ. ర.). (సంకీర్ణము, కలిసిపోయినది. వా.)
జ : లొగ్గడిల్లు.

**లొగ్గడిల్లు** అ. క్రి. (√లొగ్గడి) కలగుండువడు, క్షోభపడు (శ. ర.).

**లొగ్గు** = లొంగు, లోఁగు. అ. క్రి. నశమగు.

ఆ. సకలమైన రాజసంఘంబులకు లొగ్గి, యాత్మఁ జో... కలిగి యలిగి, ...మటించునట్టి యైశ్వర్యములకంటె, నాకుఁ జూడ లేమి నయము కృష్ణ. కుచేల. 2. 49.

చం. అదివఱ కెల్లఁ దప్పరి సుయజ్ఞుని యాజ్ఞకు లొగ్గి భీతులై, యొదుగుచుఁ దల్లిలేని ప్రజలో యననుండిరి గాని నాగరల్, మరి నఱలే రాజునకు మాటికి వందనముల్ ఘటింపుచున్, వదనముఁ జూచి చేరి యనివారితులై తగఁ బల్కి రందఱున్.
ఉ. హరిశ్చ. 1. 78.

**లొచ్చె** = లొజ్జ విశ. కొఱఁతయైనది, తక్కువ యైనది

శా. ... కీర్తనీయసుగుణస్తోమంబులం దేమియున్, రామస్ఫూర్తికి లొచ్చుగాక సరియైరాజిల్లె.
హరి. పూ. 1. 30.

గీ. తక్కువ కొఱంత పొచ్చెము తగ్గు కుందు, కొదవ లొచ్చు కొదుక యనఁ బొదలు న్యూనము ... ఆం. భా. 3. 24.

చం. హరమకుటావతంసమగు వర్ధసుధాకరుఁ డష్టమీ నిశాకరుఁ డెదిరించి లొచ్చుగుట గానఁబడంగ నపాంగమాలికా, పరిచితకాళిమ నిల పాళిఁ పైనిడి మోయఁబోలునీ, సరణి నవన్ బొమల్ మెఱయు జవ్వనికిన్ నెలవంక బాగునన్. చంపూరా. 2. 78.

**లొజ్జ** = లొచ్చ. విశ. తక్కువ.

మ ... ఇచ్చెలు లెల్లన్ మనలఘుశాసనకి లొజ్జె సమగ్రముగ్ర్యాప్తికిన్. చమ. 2 9
(ముద్రి పా. లొచ్చె. శ. ర. పా.)

చం. .. లొజ్జగాని ఒల్ దొనలను దొడ్డసింగిణులు దూకొని పెన్కకు రాని బీరమున్, బొసంగ ... అచ్చ. రా. యు. 70.

కం. నానయు వెఱఁగును వేడ్కయు, లోనెర యఁగ వలని మెచ్చి లొజ్జించుకయుం, బూనని నెయ్యం... సాము గన్గొని పలికెన్.
అచ్చ. రా బాల. 178.

**లొట** = లొట్ట. విశ. అణఁగినది.

ద్వి. కొడుకు నేడకొ దాఁగ గఱుతుగా నంపి, కడు నుగ్రభుజగంబు గఱచినదనుచు, వెడ యేడ్పు లేడ్చుచు వెదకుచు నందు, వెడలి పోఁజూచెదో వేసాలువన్ని, లోకంబులో లేని లొట తాఁటకత్తె.
ద్వి హరిశ్చ. ఉ. 1903 పం.

(లొటతాఁటకత్తె = బయటికి మంచిదానివలె అణఁకువ కలిగియుండువది, అని భావము.)

**లొటకజిట్ట**. వి. లొట్టకన్ను జిట్ట, పక్షివిశేషము. (శ. ర.).

**లొటలొట**. వి. 1. శీఘ్రముగాఁ బోవుటయందగు ననుకరణము.

కం. ఇటునటుఁ గనుఁగొని లోనికి, లొటలొటఁ జని మంచమెక్కి లోలత నది తత్తటమునఁ గూర్చుండిన వకుళాటిలాత్మజుడు కౌఁగిలించుకొని యిట్లనియెన్.
చంద్ర. వి. 3. 74.

2. వదరుటయందగు ధ్వని ననుకరణము.

కం. తొటతొట పూర్వులు దొరఁగఁగ, లొట
లొటమనుకొంచు నిండ్లలోనికిఁ జన ...
ఖల్లా 2. (శ. ర.).

జ : లొటలొటకాఁడు.

**లొటలొటకాఁడు.** వి. (√లొటలొట) లొట లొటయను ధ్వనిసేయువాఁడు, వదరుఁబోతు.

కం. కుటిలుఁ డపకారి జూదరి, లొటలొటకాఁ
డాగడీఁడు లోభి ఖలుఁడు దుర్విటుఁడు
... మొటుకిడి జావనగరాను
ముట్టకు మబలా. ప్రబంధ. 644.

**లొటలొటమను.** అ. క్రి. (లొటలొట + అను) లొటలొట యని ధ్వనించు. (శ. ర.).

**లొటారము.** వి. సారాభావము, సారములేమి.

చం. పతి యతిరౌద్రమొంచి యుపభర్తరతాప్తికిఁ
జేరుకున్న, నచ్యుతమగు ధైర్య మిచ్చుమ
దయో మగవాఁడవటంచు నెట్లు పుట్టితి
వీఁక నేమి తిప్పుజపటిష్ఠత లోన లొటార
మింతె నీ, వకటికిఁ గొంకనేలని భయస్థితి
మాంచి రమించుఁ దద్రతిన్.
శుక. 3. 161.

పా: లోన లొటారము, పైన పటారము.

ఉ. ... లోన లొటార మౌట మది లోకు
లెఱుగరె వేయునేఁటికిన్. తపతి. 2. 23.

2 తొర్ర, సుషిరము.

సీ. లొట్ట లొటారము లొత్తయం చనఁగను
తొఱ్ఱిల్లుమాఁడును సుషిరసంజ్ఞ.
ఆం. భా. 1. 146.

విణ రిత్త, వట్టిది.

సీ. రిత్త లొటారంబు రిత్త బీడు, సొళ్లు
నా రిక్తాఖ్య తొఱ్ఱిల్లు ... ఆం. భా. 3. 15.

**లొటిపిట(ట్ట)** వి. ఉష్ట్రము, ఒంటె.

సీ. ఒంటె యనఁగను లొట్టియ యనఁగను
లొట్టె బాగ, లొటిపిట యనఁగను లొటి
పిట్ట యనఁగను లొట్టిపిట్ట యనఁ గన్పట్టు
నుష్ట్రము ... ఆం. భా. 2. 265.

**లొటుక్కు.** వి. కలఁగుటయందగు ననుకరణము.

కం. పిలిచిన గుండె లొటుక్కనఁ, గలఁగుచు
వ్యాపారి వెడలఁగా నెటులనుచున్, దలఁ
చినచో వెఱవకుమని, నిలిచిన దార్ఢ్యమున
మానినీమణి వేడ్కన్. హంస. 2. 60.

**లొట్ట = లొత్త** వి. 1. మగగుఱి. (శ. ర.).
2. రుచ్యములగు పదార్థములను భుజించునపుడు నాలుక నంగిటఁ జేర్చి కలిగించెడి ధ్వని (శ.ర., వా) 3. పల్లము (శ. ర.). 4. రంధ్రము, కన్నము.

గీ. వామనుఁడు దర్భగిండిలో వారిధార, కడ్డ
మై యున్న శుక్రుని యక్షిఁ బొడుక, మిట్ట
పడి కన్నుపోయిన లొట్టపోయె, ననుచు
నగుచును జే సాఁచి యడుగుటయును.
దశా. 5. 108.

(లొట్టపోయెను = కన్ను మేల్లరెప్ప ...ము)

విణ. 1 అణఁగినది

ద్వి. బుఱ్ఱముక్కును లొట్టపోయినకన్ను.
ద్వి. హరి. ఉ. 106. 6 పం.

2. నిస్సారము.

ఉ. లొట్ట యిదేటిమాట ... చాటువు.

జ : లొట్టకంటివాఁడు, లొట్టకన్నుజిట్ట, లొట్ట కాయ, లొట్టవేయు.

**లొట్టకంటివాఁడు.** వి (√లొట్ట) క్షీణాక్షుఁడు.

గీ. .... లొట్టకంటివాఁ డనఁ గ్లిన్నదృగ్వ్యాఖ్య
మభవ. ఆం. భా. 2. 130.

**లొట్టకన్నుజిట్ట = లొటకజిట్ట** వి. (√లొట్ట) పక్షివిశేషము. (శ. ర.).

**లొట్టకాయ.** వి. (లొట్ట + కాయ) మగగుఱి.
శ. ర., (బ్రౌ, వా)

**లొట్టపోవు** అ. క్రి. అణగు.

(వ్యవ.) వానికి కన్ను లొట్టపోయినది.

**లొట్టవేయు** అ. క్రి. √(లొట్ట) రుచ్యములగు పదార్థములను భుజించునపుడు నాలుక నంగిటం జేర్చి ధ్వనిపుట్టించు (శ. ర.)

లొట్టి. వి కల్లుతీసెడు ముంత.

మ మొలచుట్లు వ్వడదోలు దాన నగు ఒల్లో కాసయిం గ..కత్తులు నూఱున్ ముసలంబు వామభుజమందున్ దానికిర్వంకలన్, గలు లొల్లెంచెడఁగట్ల నిచ్చెన పిరుదం గొమ్ము కాళ్ళందమున్, దల గోరాముకిగడ్డమున్ వరదఁ బ్రాతః కాలమం దెప్పుడున్.

చెన్న. 5 252.

సీ కల్లు లొట్టెఁడు త్రాగి కై పెక్కి తెలియక వదరసుతనె శాస్త్రవాదిగాఁడు. నేరు. 8. 7.

జ : లొట్టిముచ్చు.

లొట్టిపిట్ట(ట) వి. (లొట్టియ + పిట్ట) ఒం టె, ఉష్ట్రము.

కం వినుమిఁక మొద్దును గాడిద, నెప పోతును లొట్టిపిట్ట నెక్కిన వన్నంబుజాను వి యము నువ్వులు గలఁ దినఁ గననగుఁ గీడు వసుమతీ వంతి కా. ద్వా 9. 57.

లొట్టిముచ్చు. వి. (√లొట్టి) త్రాగుఁబోతు. (శ. ర., బ్రౌ)

లొట్టియ = లొట్టె వి. ఒంటె.

ఆ బలిమిఁగొనిన ధనము పదివేలు లొట్టియల్, పెటికి రాఁగ వైరిభీకరుండు, వచ్చె నకులుఁ డధిక వాహినీపదహతిఁ, దల్లడిల్లుచుండ ధరణి తలము. భాం. సభా. 1 267.

చం. మఱిమఱి యాముకేనుఁగుల మావుల లొట్టి యలం గడిందిగా, మఱుమొనరించి హెచ్చ రిక నూల్కొనఁ దేరులు పిండిసేయుచున్.

అచ్చ. రా యు. 131.

సీ. ... లొట్టియ నాఁగను లొట్టె నాఁగ ... ... కన్పట్టు నుష్ట్రము ... ఆం. భా 2. 265.

జ : లొట్టిపిట్ట.

లొట్టె = లొట్టియ.

జ : లొట్టెనుఁగు.

లొట్టెనుగు. వి. (లొట్టె+ఏనుఁగు) ఒంటె.

సీ. అర్థించినవని యేమి యడిగిన నా లొట్టెనుఁ గొప్పు నామెడ శత యోజనప్రమాణంబగుట కోర్కి వాణిశ నావుడు ..

భాం. శాం. 2. 82.

కం లొట్టెను గంతపొడవున దట్టముగా వెలుగు వెట్టఁ దగు నూరులకుం, జుట్టును దిరుగఁగఁ జేలకు, నట్టిపొలము మేసెనేని నగు బందె గొనన్. విజ్ఞా. 3. 5.

సీ అలరును లొట్టెమఁ గన మహోష్ట్రాభిధ ...

ఆం. భా. 2. 265.

లొడపెట్టు స. క్రి. ద్రవద్రవ్యమును చేతఁ గల పెట్టు (శ. ర., బ్రౌ.)

లొడలొడ. వి. 1. కాఱుటయందగు ధ్వని కనుకరణము. (శ. ర., బ్రౌ)

(వ్యవ.) కత్తి తాకి నెత్తురు లొడలొడ కాఱు చున్నది.

2. వదరుట మున్నగువానియందగు ధ్వని కను కరణము.

(వ్యవ.) వాఁడు లొడలొడ మాటాడుచున్నాఁడు.
విణ. వదులు, బిగువుకానిది. (శ. ర., బ్రౌ )

లొడిత. వి. లొడితిలి, ప్రాదేశము.

గీ. వాసిదయ్యము నీవె వెయ్యేసియైన, తలలుఁ జేతులుఁ గన్న లజ్జలను గలిగి, యలర లొడితెఁడు మగవాఁడ వగచు నేల, యెల్ల నాఁగుదువని మిన్ను లెన్నఁగదవె.

అచ్చ. రా. యు. 159.

సీ లొడిత యంచనఁగను లొడితిలి యఁచన జుట్టి యంచనఁగను జు యనఁగఁ బ్రాదేశ నామమై పరగు ... ఆం. భా. 2. 140.

లొడితిలి. వి. లొడిత, పరిమాణవిశేషము.

లొడుగు వి. ఆవుమెడకు కట్టెడు ఘంటావిశేషము. (శ. ర.) విణ. దీనము (బ్రౌ.).

లొడ్డ. వి. రొడ్డ (శ. ర.).

లొడ్డు. విజ. ఒడ్డు (శ. ర.).

లొత్త=లొట్ట. వి. సుషిరము, రంధ్రము.

సీ. లొట్ట లొటారముఁ లొత్తయంచనఁగను తొఱ్ఱల్లు చుండును సుషిరసంజ్ఞ.

ఆం. భా. 1 146

(పల్లము శ ర)

లొద్ద వి ప్రోవు, రాశి

ద్వి. అప్పుడతని ముద్ద తియ్యఁబుఱ లొద్ద విర వాలల బలుమంటలు విబుధుల పంట

పద. 2. 115 భా 1 పం.

సీ. గుబురు గుమురు గుంపు గుమి గుమి పిండు మొత్తము తెట్టె పైకము దాఁటు లొద్ద, తుటుము మొల్లము మొల్లమి తుట్టె వర్గ ననగ వర్గము దగు .. ఆం. భా. 2. 100.

లొద్ది. వి. లోయ.

గీ. లోయ యన లొద్ది యనఁగఁ బొల్పొందు చుండు, నచలమధ్యధరాఖ్య.

ఆం భా. 2 31.

లొద్దుగు. వి. (సం. లోధ్రః) గాలవము, ఒక జాతి చెట్టు. (దీనిభేదములు ఎఱ్ఱలొద్దుగు, తెల్ల లొద్దుగు.)

సీ. గోఁగులు రేఁగులు క్రోవులు మోవులు మద్దులు నిమ్మలు లొద్దుగులును.

అచ్చ. రా సుం 25.

సీ కడప కొడిశ పాలకొడి, ఎఱ్ఱలొద్దుగు చిరి చేకు లొద్దుగజీడిపాల. హంస. 4. 11.

లొబ్బెన. వి లలంతికావిశేషము, హారవిశేషము. (శ. ర.)

లొల్ల. వి. దున్నినవేల మిట్టపల్లములు లేకుండఁగ నరుదునట్టి బల్ల. (శ. ర, బ్రౌ.)

జ : లొల్లకాఁడు

లొల్లకాఁ(గా)డు. విజ. (√లొల్ల) దరిద్రుఁడు

గీ. చల్లఁగాఁ జేతికాసెల్ల డుల్లి లొల్ల, కాఁడవై యుఁకనైన నీ కాఁపురంబు, బ్రదుకు వని విచారింప కీపనికిఁ జొరఁ గఁ, బడిన వానికిఁ నె ఁడి భాఁ బుద్ధి. నిరం. 2. 128.

సీ. తండ్రి గడియించినట్టి విత్తంబు వోవ, లొల్లఁగాఁడయ్యె నవ్విప్రవల్లభుఁ డు.

శుక. 4, 111.

లొల్లి విజ. తఱచు, ఘనము.

క. లొల్లియగు వగల త్రొక్కున, నిల్లుగ్గులు గానవచ్చు హృదయములోనన్, మల్లామడి యగు మ ..., మ్గె గూర్చుచెఁ దాల్మి మినుకును కనఁగన్

ఉ హరి. 5 168. (శ. ర. వీరేశ. పా. వెల్లియగు. వావిళ్ల పా.)

## లో

లో¹= లోపల. ద్ర ద్రు. షష్ఠీవిభక్తి ప్రత్యయము.

1. నిర్ధారణార్థకము.

క. ... వారిలో విఖ్రుతకీర్తి నపించె దుర్వ సుఁడు గుణసారై. ఆము. 1. 22.

చం. దినిఁ దాల్చి యిప్పుడతులోఁ గనఁ గొను మపార మహామహిమానుభావముల్.

పారి 1. 61.

2. అధికరణార్థకము.

చం. అడగి యంతలోన నసాన్నములన్ సమ కూర్చు ... పారి. 1 61.

సీ. ధ్రువ వసిష్ఠాగుంధతులఁ గనుచూపుయయుఁ గావనివాఁ దేఁటిలోనఁ గడచ.

జై. భా 6. 98

3 అపాదానార్థ ము.

చం. ... నూతిలో, వెలువడఁ గోమలిం దిగిచె విఖ్రుతకీర్తి యయాతి ..

భార. ఆది 3. 144.

లో². వి లోను, లోపల శబ్దము యొక్క లుప్త శేషము (అంతఃకరణము).

ఉ. .. అవు లెవ్వరని యూరడిస్ సుదంత లో, గుందుట మానె జాంబవతి గోప మడంచెను మిత్రవిందయున్. పారి. 1. 69.

చం. ... ఏఁగె లో, నొగులుచు నొక్కఒక్కన యునుండు వనన్ ... వసు. 4 9.

(అంతర్భాగము.)

మ. దలమై లో వెలిఁ దానె యన్కిఁ దెలిసె న్నారాయణంబు .. ఆము. ౪. 11.

కం. కరువువఁ బూరితమై లో,హాఁసము లోఁ గాఅనట్టు లంగజు ... విమ్మగఁ, గరఁగియుఁ బోడవఱక లోనఁ గాలుచునుండెన్. కు. సం. 5 578.

లోకి = లోనికి.

సీ. దీనిఁ దగిలించుకొనవలెఁ దియ్యవిలుతు, దురము లోనికి నేఁడు ముద్దుగ నటంచుఁ, దలఁచునంతటిలో జాణతనములాడి, లోఁ బఅచి వానిఁ దోడ్తెచ్చె లోలనయన. హంస. 4. 49.

లోఁక. వి. లోపలిప్రదేశము.

కం. ... మ్రాఁకుంకుఁ జేరి యేఱులఁ, లోఁకలకుం జనిరి దివిలోపలఁ గలయన్.

దశకు. 10. 65

లోఁకువ. విజ 1. అధీనము, వశము.

ఆ. చెట్టుబట్టుదనుకఁ జేలోఁకువై యుండు, రంతఁ దాడుగట్ట నగడుగండ్రు.

వేమ. 2. 564.

2. తక్కువ (శ. ర).

లోఁగడ. వి. (లోను + కడ.) 1. అంతరాగము. దేశములయు కాలములయు వడిమిభాగము.

కం చెడవిటిగియడలిఁ బడి యెడ, నెడ గట్టుల తుదలఁగోటి యిడి లోఁగడకున్, దడుకు వొడిపించి యాకుల,గుడిసెల వసియించె మ-త్రి గురుభటయుతుఁడై. ఆము. 3. 17.

2. గతకాలము. (శ. ర., బ్రౌ., వా.)

లోగన్ను. వి. బౌ. (లోను + కన్ను) అంత ర్దృష్టి, జ్ఞాననేత్రము.

వ. ... ముక్కంటి లోఁగంటం గనుంగొనుచు నిశ్చల ధ్యానయోగాను సంధానంబున మాధు ర్యంబు భుజించెవో ... కాశీ. 2. 44.

లోఁగలి = లోఁగిలి. వి. బౌ. (లోను + కలను) 1. గృహము (శ. ర). 2. గృహాంతర్భాగము.

చం. నటవిటకాండ్ర పాలిఁటను జారుల చెంతమ వేశ్య లిండ్ల లోఁ,గటను మిటారి తొత్తుల తెగన్ ననగూఁటుల వీడుపట్టులన్, జటు వగు జూదగాండ్రకడఁ బ్రల్లదకాండ్రెడ ... పోకడవెట్టుకొనెన్ మదంబునన్.

భల్లా. 3. (శ. ర.)

లోఁగించు. స. క్రి. (√లోఁగు) లోఁగఁజేయు, లొంగఁజేయు.

ద్వి. దీకొని హరివానిఁ దిణిగించివైఁచి, పైకొని జఠరంబుఁ బట్టి లోఁగించి.

ఆ. మ. ౬. 3. 151 పొ. 26 పం.

లోఁగియాడు. అ. క్రి. (లోఁగి + ఆడు. స్వార్థ మున ఆడు:) లోఁగు.

చం. మగఁ డపరాధియై కుచము మక్కువనంట గటాక్షమాలికల్, చిగురుకొనంగఁ జూచె వటు చిఱ్ఱునఁ గోపముతోడఁ బ్రోడ యిం,పుగ వగలొందు మేలయిన ముచ్చట పల్కియు వంత వింతగా, మగువయుఁ బ్రీతిఁ బూనె నవమన్మథకేళికి లోఁగి యాడుచున్. గంధ. 1. 160.

లోఁగిలి = లోఁగలి. వి. బౌ. (√లోను.)

1. గృహము, ఇల్లు.

సీ. అంతఁ బోవక యవి యాగోపముఖ్యులోఁగిటి లోని కుటికి యక్కేళలీల.

హరి. పూ. 6 138.

ఉ కౌఁగిటి కానచేసి నొడికారితనంబున నిమ్ముఁ దేల్చి రా, రాఁగొఱగానివాఁడనయి రామలలో నగుఁబాటు దేను నీ,కేఁగలుగంగ సంపదల కేలి విచారము పద్మగంధి నీ, లోఁగిటఁ జేర్చనే యుభయలోకసుఖంబులు నమ్ముఁబొందినన్. ఉ. హరి. 1. 64.

గీ. ... దారువర్మని లోఁగిలి దఱియఁజొచ్చి. దశకు. 3. 77.

2. ఇంటిలోపలి భాగము.

సీ. కేశవస్వామి లోఁగిలి పరామర్శించి కాల భైరవదేవుగవను జూచి. కాశీ. 2. 41.

కం. లోఁగిటికి రాని రూపముఁ, గోఁగిటికిన్ రానిపొందుఁ గారింపంగా, మూఁగిన కుసుమశరంబులఁ, జేఁగఱకఱనందె నళివ చిత్తం బంతన్. ఉ. హరి. 5. 101.

3. వాస్తు: ఇల్లుకట్టు స్థలము.

ఓ. ... లోఁగిలి యన వాస్తుసంజ్ఞయై తనరు చుండు. అc. భా 223.

లోఁగు = లొంగు. అ. క్రి. 1. వశమగు.

ఉ. బాల విరాళి నిట్లుసుమబాణశరాశికిఁ జంద్రచంద్రికా, పాళికి సన్నగాలికిని భావజు కేళివయాళికిన్ రవో, ద్వేలమధాళికిన్ బ్రసవదీప్తవనీఖుతుమాళికిన్ సదా, లోలత గుట్టుపట్టగల లోఁగి వచింపుము నార్తిఁ జెందఁగన్. ఉ. హరిశ్చ. 444.

వ. ... వ్రేఁగి లోఁగువారును గంది కుందువారును వ్రాలి కూలువారును వెఱచి వఱుచువారును నై పలుదొసంగుల నెసంగుచుండి రప్పుడు. అచ్చ. రా. యు. 364.

ఉ. ... ఎవ్వానికి లోఁగ కెంత తొరవచ్చినఁ గాచెద నిన్నుఁ గూరిమిన్. హరిశ్చ 4. 108.

2. అడఁగు; అడఁగారు, నశించు.

కం. లోఁగుఁ దరమైన పొదరుల, నాఁగిన శకు వంబ తలఁచు నడుగడుగునకున్, డాఁగఁ గెల వరయు ... కు. సం. 5. 49.

గీ. తపనుఁ డుదయింపఁ దద్బింబదర్శనమున, లోకపాతకపటలంబు లోఁగి పఱచి, యతఁడు గ్రుఁకినఁ జనుదెంచె ననఁగ బర్వి, యంధకారంబు జగమెల్ల నాక్రమించె. కాశ. 4. 89.

ద్వి. లోపలు వెడలక లోఁగినవాని, లోవక చొచ్చి లోలోనఁ గ్రుమ్మినయను హరిశ్చ. పూ 609.

ఓc. మూఁగిన ఘనములు తాఁరిం. గ్రాఁగినధరణీ తలంబు ... చెల్లన్, లోఁగగఁ గుంభ ద్రోణము,గాఁ గురిసెం జాము వ్రేఁగట్టిన తేవన్. విప్ర. 3. 61.

3. అడఁకువకలవాఁడగు, వినయవంతుఁడగు.

అ. ... శాంతిమై, నూరకున్న జూచి వారి వెఱచి, లోని కెఱుక చేసి లోఁగుచు ... ద, న్ననుప నరిగె నృపగృహంబు సేర. భార. శాం. 6. 263.

కం. ఆ లో నాలోలశిఖ, జ్వాలోపమకోపశీలి వాలి వడిం బా,తాలోపితుఁగ్రై ... ... లోఁగెదు నా ... యన్ దురాలోచనుఁడై. చం. రా. 6. 25.

4. క్రుంగు.

దండకము మనుష్యాశరాకాని బల్ కూటువల్. మోవఁగాలేం పెన్ వ్రేఁగునన్ లోఁగు నమ్మున్నుఁబూఁబోఁడికై ... నీలా. 2. 41.

5. వెనుదీయు, సంకోచించు.

ఉ. లోఁగక సంగరస్థలములోనఁ బరాక్రమ కేళి చూపుచున్, మూఁగిన దైత్యదానవుల మొక్కల ముక్కవఁ జక్కు చేసి తా,నీఁగల తిండిగాఁ జదిపె నేపున నచ్యుతపూర్వజుండువై, నాఁగలిపాఁచి రాఁ దిగిచి నాగ రథాశ్వపదాతి సంహతిన్. ఉ. హరి. 6. 151.

మధ్యా. ... నిన్నుఁ బోరిలో నోర్వఁగా నున్న వీరుండ నొండు దక్క లోఁగక చక్క నిలుము. భార. ఆది. 7. 200.

ఉ. తాఁగడు వేగిరించెఁగద సద్గతి నీవు నెఱుంగ సిగ్గునన్, లోఁగుచు ...నుండి యుఁక లోనుగ నొల్లక పట్టఁబట్టఁగా, నేఁగుచుఁ గోరు నీ బలిమి నీప్సితసిద్ధిగ నీవుగాచె రా, డాఁగుట దీనిపేరు నిబిడం బిది బాలిక కెల్ల నాత్మలోన్. ప్ర. భా. 5 1

ప్రదాతముల భామినిభర్తమనంబు లోఁగొనెన్.

భాగ. 5. 510.

గీ. మోహినీకాంత సౌందర్యమును గణింప, ననుర వరులనె లోఁగొన్న పసవలిరె.

దశా. 2. 298.

సీ. నుమ ధర్మముఁ బూని మాటవు లోఁగొని యఘుఁ పావళి నాడఁచి ... 44.

... యముగా దలఁచు

వ. . . . దాం గాంభీర్యశీలురు సంక్షోభమునొందు వారి నెచటన్ లోఁగొంచు వర్తిం చే.

పారి. 4. 29.

ద్వి. ... గక చేసితి నెల్లతప్పులను, మఱచి లోఁగొని నన్ను మన్నింపు మనుచు

ద్వి హరివ. పూ. 1 08 పం.

ఉ. లోఁకము కల్లడిల్లు నిఁక లోఁగొనవే రఘు ... నాఁగా, నీకడలి స్నానం గొలున నిప్పుడ వచ్చునటంచుఁ ...గన్

రామ. 7. 113.

4. ... సైరించు.

సీ. తానేమి బిడ్డలఁ గానదా సపత్నాలికొడుకు తప్పొకటి లోఁగొన్న నేమి

కాశీ. 4. 266.

ద్వి. లోఁత ... తప్పు లోఁగొని మనను, జాలి ప్రోపిటిచి యూహాప్రామాణ్యతన్మ, నెమ్మదిఁ గైకొని నెఱి మహీప్రజల, నిమ్ముల రక్షింపు మిఁక. హరివం. ఉ. 2728.

చం. దుర్యోధనేశ్వరుం దఁదు ... అమ్మహా, పురుషుని శాస్త్రయింపును విభుండును నీ దగు తప్పు లోఁగొనున్.

భార. అర. 6. 209.

లోఁచు. స. క్రి. (√లోఁగు) లోఁగఁజేయు వశపఱచుకొను.

సీ అదితృప్తపనయాఁచి హాలహాలంబును లోఁచి హరునవహరుగర్వ ముఱ్ఱాఁతలూఁచి.

కళా. 1. 76.

చం. కనుఁగసఁగట్టినట్టి కుడుకల్ దలఁగించి మృగాలినెల్లఁ గ్రన్ననఁ గనిపించి పో

విశిచినన్ వెఱవొప్పఁగఁ దాటి మూఁగి మూఁగి సిగడి లాఁచి పట్టుకొనెఁ ... డెఁగాఁ జెనులేచిగు ఫులన్, వినుతపరాక్రమాఢులగు వేఁటనివంగులు రాజు మెచ్చఁగన్.

చిత్రభా. 3 148.

గీ చైత్య దానవేశ్వనులు మాయ లెన్ని చేసెఁ ... పేర్చు రెట్టివాని, నైన లోఁచు ... నైన వధికంగ ప్తిఁ, జొత్తుం ... గనలఁచు లెచ్చో టనైన

హరి ... 3 24.

లోఁజెయ్యి = లోఁజే వి. (లోను + చెయ్యి) అఱచేయి

కం. లోఁజెయ్యన వఱచెయ్యనఁగాఁ జెల్లును జేల్లు రెండు కరతలముఖ్యన్.

ఆం నం. నామ 21.

లోఁజే(యి) = లోఁజెయ్యి వి (√లోను)

1. మ్యాన ... తక్కుసలము

ఉ. ... లోఁ జే వడ నిండు ... జేయని యం ... నవ్వఁజేయనే ... నను గావుమటంచను ... 

... 3 14.

2. అఱచేయి

సీ. పెదచేతలోఁ జేతఁ బుడమియు నాకాశ మడఁతు మే పొడిపొడియగచు రాల.

సితావి 2 161.

సీ పతిసౌమ్య ... యవ్యయలికి లోఁజే ... కలుషచిత్తుని నన్ని గడుగలేదు

రుక్మా 2 14

లోఁజేయు. స. క్రి (లోను + చేయు.) 1. అంత రంగికునిగాఁ జేయు

గీ తానవంబుగ దోఁజేయు వానిమంత్ర, ము వకు వేగమె లోఁజేయఁ జనదు ..

ఆము. 4. 261.

2 వశపఱచుకొను

గీ. తనకళత్రంబు లోఁజేసికొనుట యెఱిఁగి, యమితనేత్రము లోనఁగ గౌతముఁడుఁగాను. దశా. 2. 41.

సీ. తృణముగా లోఁజేయు నెంతటివాని నీ నీలాలముంగురు నీలవేణి. విజ. వి. 1. 16.

**లోఁడు** న. క్రి. ప్రేలులోఁగువానితో కెల్లగించు. (శ ర.).

**లోఁతిఁడి** విశే. (లోఁతు + ఇఁడి) లోఁతు లేనిది (శ ర).

**లోఁతు** వి. 1 అగాధత్వము, నిమ్నత,

సీ. శరనిధుల్ లోఁతుచూప రసాతలము దోఁపఁ జిలువరాచెలులకంటెలు చలించె ఉ. హా. 2. 44.

సీ. కదలిరాయల లోఁతు గన్న గబ్బి. మనుచ 5 47

సీ. తనలోఁతుపాఁతునైతము గానరాఁ గూర్మిఁ గలసిన మొగమాటకాని వదలి వరాహ 1. 32.

(ఇట గాంభీర్యమని రెండవ యర్థము.)

2. గాంభీర్యము, గుట్టు

చం. ఎదిరి మనంబు లోఁ దెలియఁగ నేమిటి కీవల వంతఁ దల్లడించెదు ... సారంగ. 2. 101.

ద్వి. మఱి యంత బసవన్న మనసులోఁ దరియఁ, బోఁచి గిన్నెరుప్రాణమును దమలోన, డాఁచుడు ... పండితా. దీక్షా 82 పు.

(గంగ) వ. ... మానిని యన లోఁతుమానక గరితయన నడచవ్వుడు సేయక ముగుదయన బయలువడక ... భాగ. 9. 230.

(ఇట నిమ్నత్వమని రెండవ యర్థము)

విశే. 1. పల్లము, నిమ్నము.

సీ. శీర్షంబు పలుఁదనై చెక్కిళ్లు లోఁతులై ...... కాశీ. 6. 41.

చం. ...అతఁడప్పుడు ముందటనుయ్యి వెన్కలోఁ దగు గోయి యున్నలాఁగయినఁ దల్లడమందె ననంతుమేనుతోన్. విక్ర. 2. 81.

2. గంభీరము, గూఢము.

మ. ... విద్వన్మణీ, భజనప్రాపక పాదపంకరుహా మీభావంబు లోఁ దెంచు నీ, రజనాభుం బ్రణుతించి చెప్పెడు గభీరప్రౌఢసూక్తంబులన్. కళా. 5. 185.

జ : లోఁతిఁడి

**లోఁబట్టు** వి. (లోను + పట్టు) లోపలిభాగము, అంతర్భాగము

ఉ. చుట్టి బిగించి పట్టి పురసూదన యీ గరళాగ్నిఁ గంధరా, ఘట్టమునందు నిల్పె మఱి గాక దిగంబడనిచ్చెనేని లోఁబట్టన నున్న లోకముల భస్మము సేయు వెలార్చెనేని వెల్పట్టుననున్న లోకముల భస్మము సేయు నిజంబు చెప్పితిన్ భీమ 4. 64.

**లోఁబడు.** అ. క్రి. (లోన్ + పడు) 1. వశమగు, అధీనమగు.

చం. అడరిన దానవుండు గరుడాకృతిఁ గైకొని మాయతోడ లోఁ, బడ భుజగంబులం బొదివి పట్టి యయంబున మ్రింగి యప్పు చేసృతు వరుపట్టి కఁరముఁ గృపాణమునం దెగవైవ ... భార. భీష్మ. 3. 105.

గీ. కినిసి పాణి నాళీకంబు సోనువుటయును, వంత లోఁబడ కతియు మోహప్రకటన, మాని తన్నునిచిన యతి మానతుంగ, తరుణి నెనసితోన గ్రహణగోచరతఁ దొలఁగె. హ. వ. 2. 47.

కం. మీరింత వంది కంద ర్పయాతులతం బొంది నిర్గతైశ్వర్యులరై, రాకుఁ గారణమేమి త్రిలోకాహిత దనుజతతికి లోఁబడరు వరే. కు. సం. 4. 365.

2. అడఁగు, క్రుంగు.

గీ. ప్రళయజలనిధిక్రింద లోఁబడినయట్టి, యుర్వి దంష్ట్రాంకురంబున నుద్ధరించి. శివరా. 1. 64.

3. హీనస్థితినొందు, దైన్యమొందు.

కం. భూకాంత నీరువట్టుకుఁ, గాక వదన మిలు రింపఁగాన్పించిన పం, ట్లోకానవ వెతి

పుచ్చులు, లోకమ్ముల్ గాచె నిట్లుఁలోఁబడె జనముల్. వరాహ. 10. 30.

లోఁబఱచే న. క్రి. (√ లోఁబడు) వశముఁ జేయు.

వ ... అమ్ముహాశాసవైరుల లోఁబఱచి ముఁమచు ... ఉ. రా. 2. 61.

లోకంపృణము. సం. విణ. (అ. ఆ. అ.) లోకమును నిండించునది, లోకమంతటను వ్యాపించునది.

లోకకంటకుఁడు. సం. వి. అ. పుం. లోకమునకు బాధ కలిగించువాఁడు, దుర్మార్గుఁడు.

లోకకథ సం. వి. ఆ. స్త్రీ. సర్వసాధారణమైన పురాణకథ, నీతికథ, జనులందఱు నెఱిఁగిన పురాణగాథ.

లోకకర్త. సం. వి ఋ. పుం లోకమును సృజించు వాఁడు, భగవంతుఁడు.

లోకకల్పము సం. విణ. (అ. ఆ. అ.) 1. కొంచెము తక్కువగా ప్రపంచమువలెనున్నది. 2. లోకముచే గారవింపఁబడినది. వి. అ. పుం. ప్రపంచము నిలిచి యుండు కాలవిశేషము.

లోకకాంతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) లోకమున కిష్టుఁడైనవాఁడు, సర్వజనసమ్మతుఁడు. వి. అ స్త్రీ. ఓషధివిశేషము (రా. ని.).

లోకగతి సం. వి. ఇ. స్త్రీ. జనుల నడవడి, లోకుల ప్రవర్తనము.

లోకగాథ సం. వి. ఆ. స్త్రీ. జనులందఱు పాడెడపాట.

లోకచక్షువు(స్సు) సం. వి. స్. న. జగముకన్ను, సూర్యుఁడు

లోకచారిత్రము. సం. వి. అ. న ప్రపంచపు నడవడి

లోకజనని సం. వి. ఈ స్త్రీ. లక్ష్మి.

లోకజిత్తు. సం. వి. త్. పుం. 1. బుద్ధుఁడు. 2. లోకమును జయించిన పురుషుఁడు. 3. సన్యాసి.

లోకజ్ఞుఁడు. సం విణ (అ ఆ అ.) లోక స్వభావ మెఱిఁగినవాఁడు, లోకజ్ఞానము గలవాఁడు

లోకడుపు. వి. (లోపల + కడుపు) కడుపు లోపలిభాగము.

క. లోకంబుల సృజియించను, నాకలితము గాఁగఁ ద్రోచి యన్నియు విడుచన్, లోకడుపున నడగింప మహాకర్మఁడుఁ డితఁ డచింతితాత్ముఁ డహామున్.
హరి. ఉ. 5 223.

లోకతంత్రము. సం. వి అ. న. ప్రపంచపద్ధతి.

లోకతత్త్వము. సం. వి. అ. న. ప్రపంచనిజస్థితి, ప్రపంచజ్ఞానము.

లోకతుషారము. సం. వి. అ. పుం. కర్పూరము.

లోకత్రయము. సం. వి. అ. న. ముల్లోకములు' స్వర్గ మర్త్య పాతాళ లోకములు.

లోకత్రయి = లోకత్రయము. సం. వి. ఈ స్త్రీ.

లోకద్వారము సం. వి అ. న. స్వర్గద్వారము, స్వర్గలోకపు వాకిలి

లోకనము. సం. వి. అ. న చూచుట.

లోకనాథుఁడు. సం. వి. అ. పుం. 1. బ్రహ్మ. 2. విష్ణువు 3. శివుఁడు. 4. రాజు, చక్రవర్తి. 5. బుద్ధుఁడు. 6. వేలుపు, దేవత. 7. సూర్యుఁడు

లోకపథము = లోకపద్ధతి. సం. వి. అ. పుం

లోకపద్ధతి. సం. వి ఇ స్త్రీ లోకమార్గము, పదుగురు నాచరించు రీతి.

లోకపాలుఁడు. సం వి. అ. పుం 1 లోకము నందలి యొకదిక్కును పాలించువాఁడు, దిక్పాలకుఁడు. 2. చక్రవర్తి, సార్వభౌముఁడు.

లోకపితామహుఁడు సం. వి అ. పుం బ్రహ్మ.

లోకప్రకాశనుఁడు. సం. వి అ పుం. సూర్యుఁడు'

లోకప్రవాదము. సం. వి. అ. పుం జనశ్రుతి, కింవదంతి, అందఱును చెప్పుకొనెడి మాట.

**లోకప్రసిద్ధము.** సం. విశ. (అ. ఈ అ.) అందఱకును దెలిసినది, లోకమునం బ్రసిద్ధికెక్కినది.

**లోకబాంధువు.** సం. వి. ఉ. పుం. లోకబాంధవుఁడు.

**లోకబాంధవుఁడు.** సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు. 2. శివుఁడు 3. విష్ణువు.

**లోకబాహ్యుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) 1. వెలి వేయఁ బడినవాఁడు, జాతికట్టడి బహిష్కరింపఁ బడినవాఁడు. 2. లోకమునకు వేరైయున్నవాఁడు, లోకవిరుద్ధుఁడు.

**లోకభావనుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) లోక క్షేమమును దలంచువాఁడు, లోకక్షేమమును సృష్టి పొందించువాఁడు.

**లోకమర్యాద.** సం. వి. అ. స్త్రీ. లోకాచారము, వాడుక.

**లోకమాత.** సం. వి. ఋ. స్త్రీ. లక్ష్మి.

**లోకము.** సం. వి. అ. పుం. 1. స్వర్గాదిభువనము. (స్వర్గము, మర్త్యము, పాతాళము). (ఊర్ధ్వలోకములు ఏడు భూలోకము, భువర్లోకము, సువర్లోకము, మహర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము. అధోలోకము లేడు: అతలము, వితలము, సుతలము, రసాతలము, తలాతలము, మహాతలము, పాతాళము) 2. భూలోకము. 3. జనము. 4 ప్రజ, పాలితవర్గము. 5 సమూహము. 6. రాష్ట్రము, భూభాగము (ఉదా: ఆంధ్రలోకము.) 7 లోకవ్యవహారము. (వ్యుత్ప.) వైదికవ్యవహారము 8 సామాన్యమానవజీవితము. 9. సప్తసంఖ్య, ఏడు.

**లోకములకన్ను.** మి. వి. (లోకముల + కన్ను) జగచ్చక్షువు, సూర్యుఁడు

గీ. కవుఁగిలించుకొంగు వాఁడున్న లోకములకన్ను,
పచ్చగుఱ్ఱపువఱేఁడు పగటిఱేఁడు

ఇందు. 4. 71.

**లోకయాత్ర.** సం. వి. అ. స్త్రీ 1. లోకవ్యవహారము, ప్రపంచ జీవనమార్గము. 2. సర్వజన సామాన్యపద్ధతి, ఎదుగురు నడచుకొను రీతి 3. లోకస్థితి, జీవయాత్ర. 4. జీవిక, జీవనాధారము, బ్రతుకుతెరువు.

**లోకరంజనము.** సం. వి. అ. న. ప్రపంచమును సంతోషపఱుచుట, ఎల్లవారిని సంతోషపెట్టుట

**లోకలేఖము.** సం. వి. అ. పుం. సర్వజనవిదితమైన వ్యావహారికపత్రము.

**లోకవాదము = లోకప్రవాదము.** సం. వి. అ. పుం. కింవదంతి.

**లోకవార్త.** సం. వి. ఆ. స్త్రీ. జనప్రవాదము, కింవదంతి.

**లోకవిద్విష్టుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) లోకముచే ద్వేషింపఁబడినవాఁడు జను లసహ్యించుకొనువాఁడు.

**లోకవిశ్రుతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. ప్రపంచకమంతటను వ్యాపించినకీర్తి 2 నిరాధారమగు వార్త, కల్లవార్త, అసత్యప్రవాదము.

**లోకవృత్తము.** సం. వి. అ. న. 1. లోకమునం బదుగురు నడచుకొను రీతి, లోకాచారము. 2. పనిలేని మాటలు, వ్యర్థసంభాషణము.

**లోకవ్యవహారము.** సం. వి. అ. పుం. 1. ప్రపంచపద్ధతి, లోకాచారము. 2. ప్రపంచపు కార్యపద్ధతి. విశ. (అ. ఆ. అ.) వాడుకలో నున్నది. సర్వజనోపయోగమునందున్నది.

**లోకశ్రుతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. జనశ్రుతి, కింవదంతి. 2. ప్రపంచమంతట నిండిన కీర్తి

**లోకసంగ్రహము.** సం. వి. అ. పుం. 1. లోకము మొత్తము. 2. లోకక్షేమము. 3. లోకానుభవము. 4. ప్రజలనందఱను బ్రసన్నులనుగావించుకొనుట.

**లోకసంస్కృతి.** సం. వి ఇ. స్త్రీ. విధి, భవితవ్యత. (అ. ని.)

**లోకసాక్షి.** సం. వి. న్. పుం. 1. బ్రహ్మ. 2 అగ్ని 3 సూర్యుఁడు.

లోకసాక్షికము. సం. విణ. (అ. ఆ. అ.) లోకము సాక్షిగాఁ గలది, ఎల్లవారు ననుమతించినది.

లోకసిద్ధము సం. విణ. (అ ఆ అ) 1. జనుల వాడుకలో మున్నది, మామూలుగా నున్నది. 2. అందఱిచేత నంగీకరింపఁబడినది.

లోకహితము సం. విణ. (అ. ఆ అ) 1. జనోప కారమైనది, అందఱకును మేలు కలిగించునది. వి. అ న. సర్వజనక్షేమము.

లోకాంతరము సం. వి. అ. న. అన్యలోకము, భవిష్యజ్జన్మము

లోకాచారము. సం. వి. అ. పుం. లోకము నందలి వాడుక, పదుగురు చేయుపని, ప్రపంచపద్ధతి

లోకాతిగము. సం. విణ. (అ. ఆ. అ) ప్రపంచమును మించినది, అసాధారణమైనది.

లోకాత్మ సం. వి న్. పుం. సమష్టిజీవుఁడు. కూటస్థుఁడు.

లోకాధికము. సం. విణ. (అ ఆ. అ.) ప్రపంచ మునకంటె నధికమైనది, అసాధారణమైనది.

లోకానురాగము సం. వి అ. పుం. 1. మానవ కోటియందు గల సమానప్రేమ, సర్వజనహితా భిలాషము. 2. సర్వజనుల యొక్క ప్రేమ.

లోకాపవాదము. సం. వి. అ పుం. లోకనింద, పదుగురు నిందించుట.

లోకాతిశాయి. సం. విణ. న్ (నీ న్.) 1 లోక మును మించువాఁడు 2 లోకమంతయు వ్యాపించునది (వెలుఁగు మొ॥)

లోకాభ్యుదయము. సం. వి. అ పుం. ప్రపంచ క్షేమము.

లోకాయతము. సం. వి. అ న. అనాత్మవాదము, నాస్తికమతము, చార్వాకమతము.

లోకాయతికుఁడు సం. వి. అ పుం. చార్వాక మతస్థుఁడు నాస్తికుఁడు, అనాత్మవాది

లోకాయతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నాస్తిక వాదము చేయువాఁడు ఆత్మ లేదనువాఁడు. వి అ పుం. నాస్తికుఁడు.

లోకాలోకము సం వి అ పుం. (ఒక పార్శ్వ మున సూర్యకిరణసంపర్కము గలదియును ఒక పార్శ్వమున సూర్యకిరణస్పర్శము లేనిదియు నగు పర్వతము) చక్రవాళపర్వతము.

లోకేశము. సం. వి. అ పుం పాదరసము.

లోకేశుఁడు సం. వి. అ పుం. 1. బ్రహ్మ. 2. ప్రపంచాధిపతి, రాజు.

లోకోత్తరుఁడు సం. విణ. (అ ఆ. అ.) ప్రపంచ మును మించినవాఁడు, అసాధారణుఁడు. వి అ పుం. రాజు.

లోకైషణ సం. వి ఆ. స్త్రీ. స్వర్గాభిలాష, స్వర్గకామము.

లోకోక్తి. సం. వి. ఇ. స్త్రీ 1. సామెత. 2. సామాన్య వచనము, పదుగురాడుమాట

లోక్యము. సం. విణ. (అ ఆ. అ) 1. లోకమును వ్యాపించినది 2 ఆచారప్రాప్తమైనది, మామూలైనది. 3 సరియైనది, యథార్థము, ఉత్తమ లోకమును సంపాదించుట కనుకూలమైనది. 4 స్వర్గసంబంధమైనది 5. స్వాతంత్ర్యమున కవకాశము నిచ్చునది.

లోగము. సం. వి. అ. పుం. మంటిగడ్డ, మంటిబెడ్డ.

లోగుట్టు వి. (లోను + గుట్టు) గుప్తమంత్రము, రహస్యమైన యాలోచనము.

ఆ. బలము లేఁగ దైవబలమును గలిగి లోగుట్టు చేటులేని యట్టి నృపతి,వలన మత్సరింపఁ వలదు ... భార. అశ్వ. 1 71.

లోగృహము. మి. వి. (లోపల + గృహము) లోపలియిల్లు, అంతర్గృహము.

శా నే పాల్‌మించ భుజించి లోగృహములో నిద్రించు ధర్మ్యుడు ... మల్లి. శృం 97.

**లోగ్రుక్క** (లోను + గ్రుక్క) మణితము, రతికూజితము.

సీ. [illegible] పావురాపలుక
[illegible] గూడుకుపులుక [illegible] వసిదెమొ, లో
గ్రు[illegible] వెతిగ్రుక్క [illegible]
అం భా. 2. 160.

**లోచకము.** సం. వి. అ. పుం. 1. కనుపాప, నల్లగ్రుడు నడుమనుండు రంధ్రము. 2. దీపపు మసి, కాటుక 3. ఒకవిధమైన కర్ణాభరణము. 4 నీలవస్త్రము, నల్లబట్ట 5. వింటినారి, మౌర్వి. 6 స్త్రీల అలంకారాభరణము, నుదుటం బెట్టుకొనెడి [illegible] 7. మాంసపుముద్ద, మాంసపిండము. 8 [illegible] 9 [illegible] మైన చర్మము 10. కదలీవృక్షము, అరటిచెట్టు.

**లోచకుడు.** సం. వి అ పుం. మూర్ఖుడు

**లోచనగోచరము.** సం. వి అ పుం దృష్టిపథము, నేత్రమార్గము

విశ. దృష్టివిషయము, కంటికగపడునది.

**లోచనపథము.** సం వి అ. పుం. లోచనమార్గము.

**లోచనమార్గము.** సం వి. అ. పుం దృష్టిపథము, నేత్రమార్గము

**లోచనము.** సం. విశ. (అ. ఈ. అ.) 1. ప్రకాశింపజేయునది, కనబడునది. 2. దృశ్యమైనది. వి అ న. 1 చూపు, చూచుట. 2 నేత్రము, కన్ను.

**లోచనహిత** సం వి ఆ. స్త్రీ. తుత్థాంజనము, మైలుతుత్తము.

**లోచమస్తకము.** సం. వి. అ. పుం. ఓమము. (శ. ర.).

**లోచము.** సం. వి. అ. న. కన్నీరు, బాష్పము.

**లోచూపు.** వి. (లోపల + చూపు) 1. జ్ఞానదృష్టి.

సీ. పవనుల్ మునుమూని లోచూపుగా మిన్కు
గడలం దోచు వెలుంగు గాంచువారు
యయా. 2 43.

మ. .. ప్రాజ్ఞుల్ నిక లోచూపులన్, గను
నానందము నీవెకావె విను [illegible]
లామీదటన్. ఉ. రా 2 135.

కం రేచక పూరక కుంభక, సూచకముల రాజ
యోగి సుస్థిరమతియై, లోచూపు చూడ
నొల్లక, వాచాబ్రహ్మంబు పలుకవద్దుర వేమా,
వేమ 3 200.

2. క్రేగంటి చూపు.

ద్వి [illegible] ఒకంటి [illegible] చూపులును. తెలవ
లోచూపులు తీతీపులాడ.
ప్రభు (లిం) [illegible] 2 పా. 3 ప.

**లోజతనము.** వి. (లోపల + జతనము) హెచ్చరిక పదము.

వ బెస్తలు సిస్తుగామోచి నిబ్బడుగుముం డ్ఢ
డియం గాలజడుపునై సరంబోరడియడుగు
లోజతనము మోండి బలిమికం బొద్ది
కొట్టడి. ప్రబంధ. 1 605.

**లోటు.** వి. 1. జలాశయ విశేషము.

కం. తిరుకొళము నూయి లోటయు, జెలువు
మడువు లొండు కుంట చెలమ పడియ
కో,నెలు బుగ్గ వాగు దొనతల,వరి గుండము
కాల్వ డిగియబావి దొరువులన్.
హంస. 4. 102.

2 (హిం. లోటా) చిన్న పాత్ర (శ ర.).

**లోటనము.** సం. వి అ. న. దొర్లుట, పొరలుట

**లోటు** విశ. (క. లోట్టు) తక్కువ, న్యూనము. వి 1. న్యూనత. 2. నష్టి (శ. ర. )

జ · లోటుపోవు.

**లోటుపోవు.** అ. క్రి. (లోటు + పోవు) లోటు వచ్చు, తక్కువగు (శ. ర.).

**లోరము.** సం. వి. అ. పుం. నేలపైఁ బొర్లుట, దొర్లుట.

**లోడనము.** సం వి అ న. క్షోభపడుట, సంచలించుట.

**లోడి=లోడీ².** వి. (సం. లగుడః) మల్లవిద్యాసాధనము.

చఁ. కరికలభంబు కొమ్మువుడు గైకొని బిట్టునఁ ద్రిప్పు లోడి వై ఖరి గిరియెత్తు సంగడము కైవసి నవ్వులయాద్రిఁ బట్టు గోఁ, బరహిని మత్తభజ్ఞిని బలెబెగడంబుగఁ గొట్టు ...

రా వి 2 27.

సీ. సంగడాల్ బూన బుజాలపురాయింపు బరి లోడ ద్రిప్పు మేల్ బరుల యుబ్బు

ప్రబంధ 82.

మ. ... సమీరమల్లుఁ డనువొంద వ్యాళిపూ లోడిఁ ద్రిప్పు మెయిన్ గోకిలబాలుఁ డెంచికొను సొంపుల్ గుల్కు నాదంబులన్.

కళా. 2. 117.

సీ. మనును జెట్టి యనంగ మల్లాభిధానంబు ... తత్సాధనంబులై తగు గంబము కొంణత కట్టిక లోడి సంగడము బాల. గీ. సంగడమ్ము నీల గోతా మనంగ ... ఆం. భా. 2 203.

**లోడీ¹** వి వస్త్రవిశేషము.

ఉగడ. వొంబట్టు లోడీలు పొంనలా దుకూలాలు, కబ్బాయిరుబుడాలు గల్గు జరబాబీలు

హంస. ౬. ౫౬౮.

**లోడీ²=లోడి** వి. మల్లవిద్యాసాధనము (శ. ర.)

**లోడు.** వి (క లోడు) ఉపధానము, ఒఱగుదిండు (శ. ర.).

**లోణారము.** సం. వి. అ పుం లవణభేదము, ఒకవిధమైన ఉప్పు ఉప్పునుండి పుట్టెడి యొక విధమగు క్షారము (రా. ని.).

**లోతక్కువ.** విశే. (లోపల + తక్కువ) శేషము, మిగిలినది (శ. ర.)

**లోతమి.** వి. (లోపల+తమి) లోపలితమి, అంతరంగిక కుతూహలము.

(కానేరి ఙ్ఞనము) వ. ... బాహ్యాన్నవి నిహ్నవించి గౌతమి ఉంతమి యడంచి సాంరవంబు గౌరవంబుజేచి యన్యపరిన్ని వహంబు నవహసించి .... శ్రీరం. 1. 132.

**లోతము** సం. వి. అ. పు. 1. కన్నీరు, బాష్పము. 2. గుఱుతు, ఆనవాలు, చిహ్నము.

వ. 1. కొల్లగొట్టిన సొమ్ము, దోచుకొన్న సొమ్ము 2. ఉప్పు.

**లోత్రము.** సం. వి. అ. న 1. కొల్లగొట్టిన సొమ్ము, దోఁచుకొన్నధనము. 2. కన్నీరు.

**లోదొడ.** వి (లోపల + తొడ) తొడకు లోపలి భాగము.

చఁ. ... గిటకొను గాలి వల్వ దొరఁగి పెంగె వేలుపు బంటి లోదొడల్, నెఱికి నివోలెఁ గెంపుగమి యడ్డపుఁ గ్రొమ్ముత్యపునూలి డాల్ గనెక్

**లోధము** సం. = లొద్రము

**లోధ్రము** సం వి. అ పుం ఎఱ్ఱని పువ్వులు గాని తెల్లని పువ్వులు గాని గల యొకజాతి వృక్షము లొద్దుగచెట్టు.

**లోనిచూపు.** వి. (లోను + చూపు.) అంతర్దృష్టి.

కం. వ్యాప్తమ్మగు సూత్రాకృతియగు, చిన్మయశక్తి బురాంపుర శేషావాసు, గన్గొనగిరి లోనిచూపు సన్మాన్యుఁ డతఁడు చూచు సమయమున మున్. పాండు 4 6.

**లోనిచ్చు.** అ. క్రి. (లోను + ఇచ్చు) గుట్టుచెప్పు.

సీ. రిపులకు లోనిచ్చె నపర యయ్యెఁ బీడని యమ నృల నెప్పు లరసి ... గీ. భువన మరిదండ నా కళాపూర్ణు ... డు.

కళా. 6. 200.

**లోను.** వి దే. అవ్య. 1 లోపల, అంతర్భాగము, మధ్యము.

శా. . . కాతర స్వాంతత్రాసకరంబు నై దురభి
వేశంబైన యాలోను నిశ్చింతుండై నతికేలు
వట్టుకొని చొచ్చెన్ భీముం డత్యుగ్రతన్
భార విరా 2 327.

కం. వందన మనంబు లోన నొకించుక యను తేక
యమ్మహీంద్రముమీందన్. బంచానల మధ్యం
బునం, బాంచాలీవల్లభుండు తపం బొనరించెన్
హర. 7 6.

ఆ ఎంతనిష్ఠ గలిగెనేనియు మానంబు లోని
యది యెక్కుడైనదివము, లధిప యుప
వసింపనగు . భార అను 4 151.

సీ అట్టి యాలోను కడుదయం బారంజొచ్చి,
యొయ్యండదయ పి దక్కున నొదిగియుండెం
బగతుండును వెనువెంటన పాలుతెంచి, కనియె
నిద్రాయమాణు నమ్మనునాథు
హరి. ఉ. 2 186.

చ పరగ సువర్ణబంధమృదుభావము గల్గియు
లోన చూడంగాం బొరవగు చిత్రరూపమును
బొలెవ సత్కవికావ్య మిమ్మహిం, బరగు ...
కు సం. 1. 37.

కం కాలం బగునియు నృపులకు, నాము సమ
కూరె దీనిండలకు మది నీవాలోకింపంగ
వలసిన, నే లోనికి దివ్యదృష్టి నిచ్చెదం బుత్రా.
భార భీష్మ. 1. 6

చం. .. లో,సికి మణిపట్టబంధసరణిన్ ధరణీ
సుతుం దేరి కెంగేల్ మనుచ 2. 21.

కం .. పూర్ణేందముఖ చూచి మీలో,నం దెవ్వండు
వాడికి యొడిచె నతనిన వలతున్.
భార. ఆది. 8. 110.

లోనందు = లోపలను, మధ్యను.

కం. సుందరి మా యిద్దర,లోనం దెవ్వరి వలతు
సెప్పుమా యనవుడు భార. ఆది. 8. 110.

ఆ. అగ్నిలోన బయల నప్పుల నప్సరో,గణము
మ్రోలం జేసెం గడిండి తపము
కకు 1. 164.

అగ్నిలోనన్ = పంచాగ్ని మధ్యను

చం వినియె . అత్మంగి లోకన వల విప్రుం
డాద్విజులలోన సుభాషితముం బరిపంగా.
ఆము 3 76.

2. మనస్సు, అంతఃకరణము

కం. అత్తెఱంగంతయు నూర్వశి,చిత్తంబున నెఱింగి
వాండు చేతో జాతా, యత్తుండై తనంబిలువం,
బుత్తెచట తెలిసి లోన బూనిన లజ్జన్
ఉ హరి. 1, 59.

కం అని హరిం దలంచుచుం దన లో,నను జింత
యొనర్చు బ్రహ్మోపాసాంద్రం,బున ...
దశా. 8, 180.

3 లోంకువ

సీ. ఏనిందులకు సామి లో నీకు మనియెంత చాటు
చెప్పితి నను పోటుబంట్లు రా. వి 4 124.

విశ. 1. అది, మొదలు

గీ. స్థావరములు జంగములు ధాత లోను,
గాంగం బ్రళయంబు పొందినకాలమునను,
నిలుచు నెవ్వం డొకండ యానిత్యసత్య, లలితు
శార్ఙ్గి బ్రసన్నుంగాం గొలుతు నియతి
భార శాం. 4. 219.

ఉ కారణ మానుపత్వమున గంసుండు లోనుగ
దుష్టదైత్యులన్, బేరడగింప బొంచె నిటుం
బృథ్వి జనించినవాని వాదిపం,కేరుహ నాథుగా
నెఱింగి ... హరి ఉ. 1. 40.

కం. ఏమును మదీయశిష్యులు, లోనుగ వంచించి
కొలనిలోపల ... దశకు. 11. 59.

2 అధీనము, లొంగినది.

చం. తనమది నొక్కయుమ్మలిక,దక్కిన మంచిది
దానిం బాపంగా, నని తలపోసి చేయు పని
కక్కట యేనును లోనుగానె ...
నిర్వ. 9. 27.

ఉ. భీముండు ధార్తరాష్ట్రకుల భీషణలోముండు
చిత్త మెప్పు డెల్లి మద మెత్తునో యతని
యుగ్రహావృత్తికి లోనుగాక ...
భార. విరా. 1. 177.

(లోనగు = లోంబడు)

కం. మిడిలోనులఁ గాలుచ్చులఁ బడఁదోలియుఁ
లోఁగు లోను పఱచియు లేళ్లన్, వడిగల
జింకలనెల్లన్, బొడిచిరి కడుఁ జెంచు లాఖు
వులఁ జద లడరన్. యయా. 2 19.

సీ. కికురించి రిచ్చిపుచ్చుకొనుచోటుల వారలాఁ
కకలోనుగా కవ్వలీఁక. మనుచ 3. 129.

1. ఆలోనన్ = అసమయమందు.

సీ. అరదంబుపై వ్రాలి యాలోనఁ దెలిసి తన్నేసి
వాతనిఁ బడనేయువారు
భార. విరా. 3. 169.

కం. ... పురుషుఁ డొకం, డాలోక దుస్సహుండై,
యాలో జనియించి భీతివడుఁకుచు నెదురన్.
హరి పూర. 1 106.

కం. ఆలో నొకనాఁడు మహీపాలుని ప్రియ
సుతుఁడు విజయపాలుండను దుశ్శీలుఁడు
మృగయాలోలత, వ్యాలమృగా భీలమైన
వనమున కరిగెన్. విక్ర. 3. 72.

2. అంతలోపల.

గీ. ... మగిడి, వచ్చునాలోన నీరూపు వచ్చె నాకు.
ఆము. 6. 85.

కం. ఆదారి నత్త కినిసెనొ, లేదో యాలోన
నమ్మలించుటను నే నిం, కేదియుఁ జెప్పిన
నిక్కము,గాదేకద యంచు గోపకామిని
యడ్చెన్. శుక. 2 576.

ఱ: లోఁగడ, లోఁగన్ను, లోఁగలి, లోఁగిలి,
లోఁగొను, లోఁజెయ్యి, లోంజే, లోఁజేయు,
లోఁబట్టు, లోఁబడు, లోఁబఱచు, లోగుట్టు,
లోగ్రుక్క, లోనిచూపు, లోనిచ్చు, లోను
చేయు, లోనుగఁజేయు, లోనుపడు, లోను
పఱచు, లోలోనిచవి, లోలోను, లోవంక,
లోహాటము.

**లోనుచేయు** స. క్రి. (లోను+చేయు) లోఁబఱచు

ఉ. ... మీ, మీనిపుణత్వముల్ దెలియు మే కొని
యమ్మునిని లోనుచేసితిన్.
వాల్మీ 3. 69.

**లోనుగఁజేయు.** స. క్రి. (లోను+కన్+చేయు)
లోఁబఱుచు, వశముచేయు.

చ. ఎయికొని నన్ను నిట్లు మరుబారికి లోనుగఁ
జేయఁ బూని యే,నియతినియు పట్టి నంది
యము నీకొనరించఁగఁబోలు
కళా 7 226.

**లోనుపడు.** అ. క్రి (లోను + పడు) వశమగు.

సీ. తను బిల్చినప్పుడ విని లోనుపడెనంచు మక
రంబు కరి రేకు మడఁచునొక్కొ, విభుఁడు
గల్గిన మొర వినఁడె వేడని దంతి జడిసి
ప్రాణములేడ విడచునొక్కొ.
వాల్మీ. 1. 100.

**లోనుపఱ(అ)చు.** స క్రి. (√లోనుపడు)
లోఁబడునట్లుచేయు, వశపఱుచు.

కం. ననుఁ గుచ్చితంపుఁ బనులకుఁ, బనుపక యొంటి
రితి లోనుపఱుపక తగు మన్ననతోడ నరయు
వారల, కనురాగము నెఱపి నడతు రస్మత్ప్రభు
లున్ భార. విరా 1 329.

సీ. వీని చంద్రికలు ద్రావిన చకోరికలకు గ్రమింగుట
భారమే యుంగలంబు, వీని జన్మస్థానమైన
వార్ధికి లోనుపఱచుట భారమే బాడబాగ్ని
వరాహ. 4. 23.

ఆ ఇంద్రియముల నిగ్రహించి కామంబును లోభ
మోహములను లోనుబఱిచి, యుపవసించి
శీత ముష్ణంబు దలపక, తపము సేయ కేల
తక్కుదేను కుచేల. 3 41.

**లోప.** సం. వి అ స్త్రీ. అగస్త్యమహాముని భార్య
లోపాముద్ర.

**లోపగతుఁడు** వి. (లోపల + పగతుఁడు) అంత
శ్శత్రువు

కం. ఏర్పడ లోపగతుంను వెలార్చక లోకంబు
పకుఁ దొలంగక గుటిపై, నేర్పు మనఃపవన
ములం, గూర్చక యోగీశ్వరుండగునె యే
భంగిన్ శివయోగ ఉ, భా 1. 18.

**లోపనము** సం. వి. అ. న. 1 అతిక్రమించుట, ఉల్లంఘించుట. 2. లోపింపఁజేయుట, తొలఁగించుట

**లోపము.** సం. వి. అ. పుం. 1. అపహరణము కొల్లగొట్టుట 2 నాశము 3. ఛేదనము, తెగఁగొట్టుట 4 రద్దుచేయుట, తొలఁగించుట. 5 అతిక్రమించుట, మీఱుట. 6 అభావము 7. పరిత్యాగము, విడిచిపెట్టుట. 8. (వ్యాక.) ప్రసక్తమయిన వర్ణముగాని పదముగాని కనఁబడకుండుట (అదర్శనం లోపః) 9 కొఱవడపాటు

**లోపల.** వి. అ. 1 అంతర్భాగము

గీ వెలుపలను లోపలను నుండుఁ దతిరుఁ...

శాకుం 1. 117.

మ ... వియద్గంగాప్రవాహంబు లో,పలికిం బోయి మరిష్యమాణుఁ డగుచుం బ్రాయోపవేశంబునన్ భాగ. 1. 496.

మ జలిదైత్యేయ భయాంధకారకలితబ్రహ్మాండగేహంబు లో,పలఁ జైమండెడు తత్ప్రతాపమయదీప జ్వాల డిందన్.

ఆము. 4. 24.

2 అంతఃపురము, అవరోధము.

గీ. బయలుతేరిన సుతుఁడు లోపలనుపతియుఁ, గాని యమ్మలు తేరైతి ఖచరపతికి.

శశా. 2. 51.

3. మనస్సు, అంతఃకరణము.

కం. వారిరుపురుఁ దమలోపల, వేఱుగొని ...

ఆము. 3. 15.

ప్ర. అవ. 1. నిర్ధారణషష్ఠియందు బహువచన ప్రత్యయము.

ఆ. పూజనీయులైన పురుషులలోపల, నెవ్వఁడ య్యెఁ గృష్ణుఁడు. భార. సభా. 2. 11.

చం. ... కల్పనం,జనితవిశేషతం గలుగు ఖాయల లోపల నెత్తి యమ్విభుం, గమటకు నర్హ్యమ ...

భార. శాం. 5. 408.

2 అధికరణార్థము, అందు.

కం. చని పట్టి పాలవట్టిఁ, గనుపట్టెడు కనక పత్రికావిలిఖిత నూ,తనవిరుదాక్షరములు వే,ర్కొని యుండు పలసె చదువుకొనె వివరముగన్. జై భా 4. 6.

లోలోపలన్ = మనస్సునందు

అంతలోపలన్ = అనసయము లోనె.

ఉ. హాయని మోహినీమహిళ యదభృతరోష కషాయితాక్షియై, హా యను నంతలోపల సహస్ర సహస్ర సహస్ర దీధితి,చ్ఛాయ సహస్రధారమగు చక్రము వ్రాలె గళాంబుజంబునన్ దశా 2 368.

జ : లోకడుపు, లోచూపు, లోజతనము లోతక్కువ, లోతమి, లోదాడ, లోపగతుఁడు, లోపాద, లోవిత్తరి, లోమొన, లోవాఁడి.

**లోపాకము.** సం. వి అ. పుం సృగాలము, గుంటనక్క

**లోపాపకము** = **లోపాకము.** సం.

**లోపాముద్ర.** సం. వి. అ. స్త్రీ. అగస్త్యముని భార్య, విదర్భరాజు కూఁతురు.

**లోపాయకారి.** విశే. రహస్యముగా నొకరి పక్షమున నున్నది. (శ. ర.).

**లోపాశకము** = **లోపాశము.** సం.

**లోపాశము** సం. వి అ. పుం గుంటనక్క, సృగాలము.

**లోపి.** సం. విశే. (న్. పి. న్.) 1. హానిచేయునది, 2. లోపముగలది.

**లోపించు.** సం. అ. క్రి 1. మఱుఁగుపడు.

శా. లోకక్రీడజనించుచున్ మెలఁగుచున్ లోపించుచు న్నాత్మ సుక్షేత్రాంతుఁ హరిఁ గూర్చి యోగముచేసె న్నాహుషుం డత్యున్నతిన్.

భాగ. 9. 562.

2. తక్కువవడు (శ. ర.).

**లోపు.** విశే. స్వీయము, తనది

కం. మురగరుడోరగ విద్యా, ధరపురవరసతులతోడ దనుకేశ్వరకిం, కరులు ఁ మింతురు దోషా, చరులకు వెలి లోపు గలదె చతురాననుఁడా.
కు. సం. 4. 374.

జ : లోపుసేయు.

**లోపుసేయు** స. క్రి. (లోపు + చేయు) లోఁ బఱచు.

వ. ఇట్లు త్రిణయనున్ దన వయనవాగురలకు లోపు సేయుచు. కు. సం. 5. 514.

**లోపొద.** వి. (లోపల + పొద) పొదలోపలి భాగము.

సీ. దూరోద్గమద్దావధూమమంబుకబుద్ధి నెమ్మి లోపొదనుండి నిక్కి చూచె
పాంతు. 1. 186.

**లోప్త్రము.** సం. వి. అ. పుం. అపహరించినసొత్తు, స్తేయధనము.

**లోబిత్తరి.** వి. (లోపల + బిత్తరి) మల్లయుద్ధగతి భేదము.

వ. ... పదఖండనంబును సురిత్రాడును లోబిత్తరియు వెలిబిత్తరియు సర్పాంకుశంబును మొదలుగాఁగల పదిరెండు గాయమానంబులును. ప్రబంధ. 78.

వ. ... పదఖండనంబును లోబిత్తరి వెలిబిత్తరి సర్పాంకుశంబు మొదలుగాఁగల పదిరెండు గాయమానంబుల భేదంబులు విచారించి....
హంస. 1. 206.

**లోభనము.** సం. విశే. (అ. ఈ. అ.) ఆకర్షించునది, మోహింపఁజేయునది, ఆశ గలిగించునది. వి. అ. న. 1. ఆకర్షణము, మరులుకొలుపుట, మోహింపఁజేయుట. 2. బంగారము

**లోభనీయము.** సం. విశే. (అ. అ. అ.) మరులు కొలుపునది, ఆశ గలిగించునది, ఆకర్షించునది.

**లోభము.** సం. వి. అ. పుం. 1. అత్యాశ = దురాశ, పరద్రవ్యాపహారణేచ్ఛ, పిసినారితనము. 2. ఆసక్తి, (ఒకదానియందలి) కోరిక. 3. లోభగుణము అరిషడ్వర్గములలో నొకటి.

**లోభి** సం. విశే. (న్. నీ. న్.) 1. లోభము గలవాఁడు. దురాశగలవాఁడు 2. కోరికగలవాఁడు, ఆసక్తిగలవాఁడు. 3. మనులుకొలుపువాఁడు, మోహపెట్టువాఁడు.

**లోభించు** సం. అ. క్రి లోభమునొందు, అత్యాశ నొందు, ఆకాంక్షించు, కోరు.

శా. ... మోహాంధులై దీని కేలా లోభింతు రెఱింగియున్ ... మల్ల. వై. 71.

శా. ... ఆరాజన్యుఁడు ... ... పారస్పారచతుర్విధాన్న ఫలమజ్జాపాయసాపూపస, ల్పారాద్యుత్తమభుక్తి మానసమునన్ లోభింప డింతేనియున్. కృ శకుం 8 3.

**లోభ్యము = లోభనీయము** సం. విశే

**లోమకర్ణము.** సం. వి. అ. పుం. శశకము, కుందేలు.

**లోమకీటము.** సం. వి. అ. పుం. పేను.

**లోమకూపము.** సం. వి అ. పుం. రోమకూపము, రోమముల మొదలనుండు బిందురూపమగు యిన గుంత

**లోమఘ్నము.** సం. వి. అ. న. తలవెండ్రుకలను బోఁగొట్టు నొకానొక రోగము.

**లోమపాదుఁడు.** సం. వి. అ. పుం. అంగదేశపు రాజులలో నొకఁడు.

**లోమమణి.** సం. వి. అ. పుం. రోమములతోఁ జేయఁబడిన తాయెత్తు.

**లోమమార్జారము.** సం. వి. అ. పుం. పునుఁగుపిల్లి.

**లోమము** సం. వి. అ. పుం. తోఁక. (వి. న్. న.) దేహమందలి వెండ్రుక, రోమము.

**లోమరాజి.** సం. వి. ఇ. స్త్రీ. నూఁగారు, లోమావలి.

**లోమవాహి** సం విశే. (న్. నీ. న్.) 1. ఈఁకలు గలది. 2. వెండ్రుకను సైతము నఱకునంతటి వాఁడికలది.

**లోమశ.** సం. వి అ స్త్రీ. 1 ఆఁడునక్క. 2 వాలిఁడికోతి 3. అన్నభేది 4. కాకి దొండ (వృ. వి) 5. జటామాంసి (వృ. వి.). 6. వస (వృ వి.). 7. గూలగొండి (వృ. వి.) 8 మహా మేద (వృ. వి) 9 పెరుఁగు తోఁటకూర (వృ. వి). 10. పెద్ద జనుము (వృ వి.) 11. ముత్తవపుఁగము (వృ. వి.).

**లోమశపుష్పకము.** సం. వి అ. పుం శిరీష వృక్షము, దిరిసెన చెట్టు (వృ వి).

**లోమశము.** సం. విశ (అ. ఆ అ.) 1. వెండ్రుకలు గలది, బొచ్చుకలది. 2. రోమములతోఁ జేసినది, రోమమయము. 3. గొఱ్ఱెలు మున్నగు వాని బొచ్చు ఆస్తిగాఁ గలది 4 పచ్చికలిసినది. వి. అ. పుం. పొట్టేలు

**లోమశ్యము.** సం వి. అ. న. 1. బొచ్చు గలిగి యుండుట, వెండ్రుకలుగలిగియుండుట. 2. గఱకుఁదనము, కర్కశత్వము.

**లోమసారకము.** సం. వి. అ. పుం. పచ్చ, మరకతము.

**లోమహర్షణము.** సం. విశ. (అ. ఆ. అ.) గగుర్పాటు గలిగించునది. వి. అ. న. గగుర్పాటు.

**లోమహర్షి** సం. విశ. (న్. ణీ. న్.) గగుర్పాటు గలవాఁడు, గగుర్పాటుగలది.

**లోమహృత్తు.** సం. వి. త్. పుం. తాళకము, హరిదళము, పర్వతములందలి ధాతువిశేషము

**లోమాంచము.** సం. వి అ. పుం 1. రోమాంచము. గగుర్పాటు. 2. సన్నబొచ్చు, మెత్తని వెండ్రుకలు సి తోఁక.

**లోమావలి**=రోమావలి. సం. నూఁగారు

**లోమాశము.** సం. వి. అ. పుం. సృగాలము, గుంటనక్క.

**లోమా(శ)శిక.** సం. వి ఆ స్త్రీ. ఆఁడుగుంటనక్క, సృగాలి

**లోమొన.** వి. (లోపల + మొన) మల్లవిద్యావిశేషము

వ . లోమొన వెలిమొన యసిమొన సరితాఁకంపుమొన యాదిగాఁగల పదిరెడుమొనల నారితేఱి .. హంస. 1 ౨06.

వ .. లోమొన వెలిమొన యసిమొన సరితాఁకంపుమొన లాదిగాఁగల పదిరెడు మొనలు . ప్రబంధ. 78.

**లోయ** వి 1. సొరంగ, రెండుకొండల మధ్యభాగము

సీ. ఎలుఁబడి పెను లోయఁబడిన క్రొన్నెలరాల చఱులలో నిరుగడఁ దఱచు మెఱచు.
వసు. 3. 21

క కులిశధారాహతి సొలవునఁ బైనుండియడుగు మోవఁగ జేసుకొనవతటుఁ, గమట్టు లోయ గంగానిర్ఝరము వాఁఱఁ జలువనొవయ్యోటి కెలకులందు. మనుచ. 19

గీ లోయ యన లొద్ది యనఁగఁ బొల్పొందుచుండు, నచలమధ్యధరాఖ్య ...
ఆం. భా. 3. 31.

2 ప్రదేశము

సీ. ఒకలోయ ఖగనాయకకుదాయ సముదాయ మొకచాయ సురగాయక కృతగేయము ...
ప్రబంధ. 45.

**లోల** సం వి. ఆ. స్త్రీ. 1. లక్ష్మి. 2. మెఱపు. 3. నాలుక.

**లోలజిహ్వుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) చలించెడి నాలుక కలవాఁడు, జిహ్వాచాపల్యము గలవాఁడు, తిండికై యల్లాడువాఁడు.

**లోలము** సం. విశ (అ. ఆ అ.) 1. కదలునది, చంచలము. 2. కలఁతనొందినది, క్షుబ్ధము. 3 అస్థిరము, క్షణభంగురము. 4. మిక్కిలి యాసక్తిగలది, తృష్ణతోఁ గూడినది.

**లోలాయపడు.** అ. క్రి. (లోలాయము + పడు) శ్రమపడు ...

**లోలాయము.** వి. శ్రమము. (చూ. లోలాయపడు.)

జ లోలాయుడు.

**లోలార్కుఁడు** సం. వి. అ. పుం. కాశీపురమందుఁగల సూర్యమూర్తి విశేషము.

**లోలితము.** సం. విణ. (అ. ఆ. అ.) చాలితము, చలింపఁజేయఁబడినది, కదల్పఁబడినది.

**లోలుగు** వి ముచుకుందవృక్షము (వ్య. వి.).

**లోలుప** సం. వి. అ. స్త్రీ మిక్కుటమైన కోరిక, తీవ్రేచ్ఛ.

**లోలుపము.** సం. విణ. (అ. ఆ. అ.) అత్యాసక్తి గలది, ఉత్కటమైన యిచ్ఛ కలది.

**లోలుభము** = లోలుపము. సం

**లోలాంక.** వి. మల్లబంధవిశేషము (శ. ర.).

**లోలోనిచవి** వి. (లోలోను + చవి) తనయ దశి జ్ఞానామృతము యొక్క రుచి.

కం. బాలకుఁడు బ్రహ్మవిద్యా, శీలుండై చిత్సుధాభిషేచనమతితో, లోలోనిచవుల మిక్కిలి, లోలుండై బాహ్యరుచులు లోఁగొనకుండెన్. వి. పు. 2. 42.

**లోలోను.** వి. (లోను + లోను) (లోనుశబ్దము యొక్క ఆమ్రేడితరూపము) 1. అత్యంతరము.

ష. .. హితుఁడుమంబోలె లోలోన బోధించి ... కాశీ. 6 62.

2. మనస్సు.

సీ. లోలార్కునకు నీకు లోలోననేమేసెఁ బోటి పుట్టెడుగదా మాటమాట భీమ. 2. 88.

**లోవ** వి 1. లోయ రెండుకొండల మధ్య భాగము.

ద్వి. లోవలు వెదలక లోఁగినవాని, లోవక చొచ్చి లోలోనఁ గ్రుమ్మియును ద్వి. హరిశ్చ. పూ 619 పం.

శా. ప్రాకారంబులు దాఁటి పెగ్గడులు యోంగిల్ వట్టి యట్టిట్టవో, వాకిళ్లల్లను దూఁటి చప్పళము లోవం జేరి రాజయ్యెఁడన్. బహు. 3. 2౦.

2. చూరు.

సీ. పులదిండిజా ముత్తములలోన లమరించి స్ఫటిక సోపానముల్ సంఘటించి ఉ. రా 2. 292.

శం. జగమగజాలందెంచికలు చక్కని సీంవుఁ బెక్కుచాల్ మెఱుంగగు తెలిమిన్నలోవ యును తచ్చుపఱంగరుపేరఁగువన్, డగఁ గనుపట్టనొక్కవిఁస న్మణిమండప మస్తు దోఁపఁగన్ చంద్రికా. 2. 28.

ఉ. బంగరు మేలికంబములఁ బాటిలు పాటవు మధ్యరంగమున్, తెంగట తీవరత్నముల చెక్కడపుంబవి మించు నెజ్జయిల్, ముంగల వజ్రపుంబలకలోవ పొసంగిన నొప్పు చప్పర, మ్మ్రుంగల భావచిత్రనవమోహనకేళిగృహంబు తఁటంబనన్. విజ 3 189.

3. రత్నపీఠము పిఁడి చట్టపు అంచు.

సీ. పగడాల ... బాల జిగిమించు పుష్యరాగవు లోవ వైదూర్య ఘుంటికలును వసు 1 144.

జ : లోవరి

**లోవంక.** విణ. (లోను+వంక) లోపలికి వంగినది.

వ. ... తెవులసంకులు లోవంక భుజంబులు కొంకిసిగలు గావి తుప్పటులు నొప్ప. ... ఆము. 4. 86.

**లోవరి.** వి. (లోప + అర) తొట్టికట్టు, ... (శ ర.)

**లోవాఁడి.** వి. (లోపల + వాడి) అంతస్తీక్ష్ణత, మనః కాఠిన్యము.

కం. లోవాఁడియు వావాఁడియు, చేవాఁడియుఁ గలిగి విగుల సినగామ గ్రామాగ్రహార జనః త, దేవస్థానవృత్తులను ద్రిమ్మరి కతనన్. ప్రబంధ. 767.

**లోవి.** వి. వంటకుండ, స్థాలి.

సీ. పాఁప మెపరి పచ్చపన్నాతలోవులఁగలజు గుజ్జెనగూళ్లు గుడుచు టుడిగి, అయోధ్యా. 3. 149.

గీ....లోవిలోని, శిష్టశాకాన్నలవము ప్రాశించి....
భాగ. 1. 484.

ద్వి. మూలవన్నారుల యాలోవిలోవఁ, లోలె
లున్నవి వంప పోయి తెచ్చెదను.
బస. పు 8 427 పం.

లోవిడి. విణ పూర్వపుది, మునుపటిది (బ్రౌ. ని.).

లోవ్వ = లోఁగు. అ క్రి. వెనుఁదియు.

ద్వి. లోవలు వెడలక లోఁగినవాని, లోవక చొచ్చి
లోలోనఁ గ్రుమ్మియును.
ద్వి. హరిశ్చ పూ. 920 పం.

లోవై(వయి)నము విణ. కడచినది (శ. ర.).

లోష్టకము. సం వి అ. పుం. మంటిగడ్డ. మట్టిబెడ్డ. పుం న. 1. మచ్చ. మలక. 2. గుర్తుగా నుపయోగపడెడి యొకానొక పదార్థము 3. ఇనుపత్రుప్పు. అయసకిట్టము.

లోష్టఘ్నము సం. వి. అ. పుం. లోష్టభేదనము,

లోష్టభేదనము. సం. వి అ. పుం. న. మంటి గడ్డలు నలఁగఁ గొట్టెడి సాధనవిశేషము, పాపటము.

లోష్టము సం. వి. అ. పుం., న. మంటిగడ్డ. న. ఆయసకిట్టము, ఇనుపత్రుప్పు.

లోష్టువు. సం. వి. ఉ. పుం. లోష్టము, మంటిగడ్డ.

లోసబురు. వి. ఒడ్డునకు దూరముగ సముద్ర యానము చేయుట. (వ్యతి వెలిసబురు)
(చి. ని ,శ. ర.)

లోహండి వి. వంట సేయుపాత్రము, స్థాలి, లోవి.

వ. అయష్ఠిపేటికయు లోహండియుఁ దండు
లంబులుఁ గంబళంబులుం దగిన సంబడం
బున వహించి యొక్కరుండును దెరువు
తోడునం బెక్కుదేశంబులు గడచి ...
కాశీ. 5. 62.

సీ. పెల్లులోహండి కావళ్ల కొమ్ములఁ ద్రేలు గిడ్డి
మొత్తము నేతిలడ్డిగలును. ఆము. 2. 97.

సీ. రాగిలోహండినన్ బ్రాయి లేకుండంగ వండి
ఉంచిన యువుర్వంటకంబు. కాశీ. 3. 121.

లోహకంటకము. సం. వి. అ. పుం. వృక్షవిశేషము, మంగచెట్టు. పుం న. ఇనుపముల్లు, ఇనుముతోఁ జేసిన ముల్లువంటి సన్నని వాఁడిగల వస్తువు.

లోహకాంతము. సం. వి. అ పుం. సూదంటు రాయి.

లోహకారుఁడు. సం. వి. అ. పుం. కమ్మరి = ఇనుప పని చేయువాఁడు.

లోహకిట్టము. సం. వి అ. న. ఇనుపత్రుప్పు.

లోహఘాతకుఁడు. సం. వి. అ. పుం. కమ్మరి.

లోహచూర్ణము. సం. వి. అ. పుం. 1. ఇనుప రాపొడి. 2. లోహకిట్టము, ఇనుపత్రుప్పు. (రా. ని.)

లోహజము. సం. వి. అ న. 1. కంచు. 2. లోహకిట్టము.

లోహజాలము. సం. వి. అ. న. ఇనుపచిక్కము, కవచము.

లోహజిత్తు. సం. వి. త్. పుం. వజ్రము, రత్నభేదము.

లోహటము. వి. (లోను + హటము) మనస్సు నందలి పట్టుదల.

సీ. లోహటంబులు మాని లులిఁగన్నఁ బడకున్నఁ
బరదాశ మని పోవుఁ బలక యిచ్చి.
ఉ. హరి. 3. 120.

లోహద్రావి. సం. వి. న్. పుం. వెలిగారము.

లోహపృష్ఠము. సం. వి. అ. పుం కఁకిము, రాపులుఁగు.

లోహప్రతిమ. సం. వి. ఆ. స్త్రీ. 1. పట్టెడ, కంసాలిదాగలి. 2. ఇనుపవిగ్రహము.

లోహబద్ధము. సం. విణ. (అ. ఆ అ) ఇనుముతో నతుకఁబడినది.

లోహమారకము. సం. విణ (అ. లితా అ) లోహమును భస్మముగాఁ జేయునది.
వి. అ. పుం ఒకజాతి కూరాకుమొక్క.

**లోహము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఎఱ్ఱనిది 2 రాగిది, రాగితోఁ జేయఁబడినది. 3. ఇనుపది, ఇనుముతోఁ జేయఁబడినది. వి. అ. పుం. న. 1. తామ్రము, రాగి. 2 ఇనుము. 3. ఉక్కు. 4. బంగారము. 5. లోహసామాన్యము. 6. నెత్తురు. 7. ఆయుధము. 8. చేఁపలను బట్టు గాలము. పుం ఎఱ్ఱమేఁక. న. 1. ముసాంబరము. 2. అగురు.

**లోహరాజకము.** సం. వి. అ. న. రజతము, వెండి.

**లోహలము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఇనుముతోఁ జేయఁబడినది, అయోమయము. 2. లోహము నాకర్షించునది, లోహగ్రాహకము. 3. అస్పష్టముగ మాటలాడువది.

**లోహలింగము.** సం వి అ న రక్తముతో నిండిన కురుపు, రక్తపూరితమైన వ్రణము.

**లోహవరము.** సం వి. అ. న. బంగారము.

**లోహశ్లేషణము.** సం. వి. అ. పుం. వెలిగారము.

**లోహసంకరము.** సం. వి. అ. న. ఇత్తడి మున్నగు మిశ్రలోహము.

**లోహాభిసారము.** సం. వి. అ. పుం. రాజులు యుద్ధయాత్రకుఁబోవునపుడు చేసెడి శస్త్రనీరాజనము.

**లోహాభిహారము**=లోహాభిసారము. సం

**లోహిక.** సం. వి. అ. స్త్రీ. అయస్పాత్రము, ఇనుపమూఁకుడు.

**లోహితకము.** సం. విణ. (అ. తికా. అ) ఎఱ్ఱనిది. వి. అ. పుం. 1. పద్మరాగము, కెంపు. 2. అంగారకగ్రహము. 3. ఒకజాతి బియ్యము. న. 1. కంచు. 2. ఇత్తడి (రా. ని.), ఇత్తడి భస్మము.

**లోహితకల్మాషము.** సం. విణ. (అ. ఆ. అ.) ఎఱ్ఱని మచ్చలు గలది.

**లోహితగ్రీవుఁడు.** సం. వి. అ. పుం. అగ్ని.

**లోహితచందనము.** సం. వి. అ. న. 1. కుంకుమ పువ్వు. 2. రక్తచందనము.

**లోహితపుష్పకము** సం. వి. అ. పుం దాడిమ వృక్షము, దానిమ్మచెట్టు (వ్ర. వి)

**లోహితము.** సం. విణ (అ. తా హినీ అ.) 1. ఎఱ్ఱనిది, ఎఱ్ఱనిరంగుగలది 2 రాగిది, రాగితోఁజేయఁబడినది. వి. అ. పుం. 1. ఎఱుపు రంగు. 2. అంగారకగ్రహము. 3. సర్పము, పాము. 4. మృగభేదము, ఒకజాతి జింక. 5. బ్రహ్మపుత్ర యనెడి నది. 6. మత్స్యభేదము, ఒకజాతి చేప. 7. ఒకవిధమైన బియ్యము. 8. కనుఱెప్పలలోఁ బుట్టు రోగభేదము. 9. పద్మరాగము. న. 1. రాగి. 2. నెత్తురు. 3. కుంకుమ పువ్వు. 4. యుద్ధము 5. రక్తచందనము. 6. ఎఱ్ఱగంధము 7. హరిచందనము. 8. ఇంద్రధనుస్సు యొక్క యసంపూర్ణాకారము (విల్యమ్సు) 9. అగరుగంధపుఁజెక్క. 10. మర్దనము, నూరుట.

**లోహితమృత్తిక.** సం. వి. అ. స్త్రీ. ధాతు విశేషము గైరికము; జేగురుమన్ను.

**లోహితాంగము.** సం. వి అ పుం. 1. కంపిల్ల వృక్షము, ఒకచెట్టు. 2. అంగారకగ్రహము.

**లోహితాక్షము.** సం. వి. అ. పుం. 1. ఎఱుపు రంగు 2. ఒకజాతి పాము. 3. కోకిల. న. 1. చంక. 2. తుంటి (విల్యమ్సు).

**లోహితాక్షుఁడు.** సం. వి. అ పుం. విష్ణువు.

**లోహితాననము.** సం వి. అ. పుం. ముంగిస, ముంగిస (రా. ని.).

**లోహితాయసము.** . . వి. న్. న. తామ్రము, రాగి.

**లోహితాశ్వుఁడు.** సం. వి. అ. పుం. అగ్నిదేవుఁడు.

**లోహితిక.** సం. వి. న్ పుం. ఎఱుపురంగు, రక్తిమ

లోహితుఁడు. సం. వి. అ. పుం. అంగారకుఁడు. (శ. ర.) ఇట్లే లోహితాంగుఁడు.

లోహితోదము. సం. విణ. (అ. ఆ. అ.) ఎఱ్ఱని నీరు గలది.

లోహిత్యము. సం. వి. అ. పుం. ఒకవిధమగు బియ్యము. ౨ బ్రహ్మపుత్ర యనెడి నది.

లోహిని. సం. వి. ఈ. స్త్రీ. ఎఱ్ఱని చర్మముగల స్త్రీ, ఎఱ్ఱనియాఁడుది.

లోహోత్తమము. సం. వి. అ. న. బంగారము.

## లౌ

లౌకాయతికుఁడు. సం. వి. అ. పుం. లోకాయత మతము ననుసరించువాఁడు, చార్వాక మతాను సారి, నాస్తికుఁడు

లౌకికజ్ఞుఁడు. సం. విణ. (అ ఆ. అ.) లోకా చార మెఱిఁగినవాఁడు, లోకవ్యవహారములు తెలిసినవాఁడు.

లౌకికము. సం. విణ. (అ. ఈ. అ.) 1. లోక సంబంధమైనది, భూలోకసంబంధమైనది. 2. సర్వ సామాన్యమైనది, వాడుకలోనున్నది. 3. ప్రతి దినమున జరుగునది, ఆచారముగా నున్నది. 4. లోకములోనిది, (వాక్యము మొ.) 6 లోక విదితము, పదుగురకుఁ దెలిసినది. 7. లోకహితము, లోకమునకు మేలుచేయునది

న. లోకాచారము, జనుల వాడుక.

లౌకికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) 1. లోకవిది తుఁడు, అందఱకుఁ దెలిసినవాఁడు. 2. లోక హితుఁడు. లోకమునకు మేలుచేయువాఁడు.

లౌకికులు. బ. వ. లోకమండలివారు, సామాన్య జనులు.

లౌక్యము. సం విణ. (అ. ఆ. అ.) 1. ప్రపంచ సంబంధమైనది, మనుష్యసంబంధమైనది. 2. సర్వ సామాన్యమైనది, వాడుకలోనున్నది.

లౌడి=లవుడి. వి. పరిఘము, ఒకానొక ఆయు ధము.

కం. కేడెము కత్తి తుపాకీ, లౌడియు నిండమ్ము లీఁటె లంగోని తోలుతన్, జోడులు దాలిచి సేనలు, జోడులు తమకన్నలేదు నూనవి కినుక ప్రబంధ. 782.

వ. ... లౌడి వంకిణి సబళ యీఁటె సెలకట్టె సిల్లము ద్వాత్రింశదాయుధంబులు ...
ప్రబంధ. 78.

లౌణి=లౌడి. వి. పరిఘము.

ద్వి. వాలముల్ ఝళిపించి వడి లౌణు లెత్తి.
రం. రా యు. 268. పొ. 12. పం.
(శ. ర. పా. లౌడు లెత్తి ముద్రి పా.)

లౌల్యము. సం. వి. అ. న. 1. చంచలత, చప లత, స్థైర్యములేమి. 2. ఉత్కటమైన కోరిక, ఉబ్బత, భోగేచ్ఛ, విషయాసక్తి.

లౌహ. సం. వి. అ. స్త్రీ. కాఁగు, నీరు కాఁచుపాత్ర.

లౌహకారుఁడు. సం. వి. అ. పుం., కమ్మరి.

లౌహజము. సం. వి. అ. న. లోహకిట్టము, మండూరము.

లౌహబంధము. సం. వి. అ. పుం న. ఇనుప గొలుసు, ఇనుపసంకెల.

లౌహభువు. సం. వి. ఊ. పుం. కాఁగు, నీరు కాఁచుపాత్ర.

లౌహము. సం. విణ. (అ. ఆ. అ.) 1. లోహ మయమైనది, ఇనుపది 2. రాగిది, రాగితోఁ జేయఁబడినది. 3. లోహముతోఁ జేయఁబడినది. 4. రాగియొక్క రంగుగలది. ఎఱ్ఱనిది.
వి. అ. న. ఇనుము.

లౌహాత్మము. సం. వి. న్. పుం. కాఁగు, నీరు కాఁచుపాత్ర.

లౌహితకము. సం. విణ. (అ. ఆ. అ ) ఎఱ్ఱనిది.

లౌహితము. సం. వి. అ. పుం. శివుని త్రిశూలము.

లౌహిత్యము. సం. వి. అ. పుం. 1 బ్రహ్మ పుత్ర యనెడి నది. న. ఎఱుపు.